





# మాసపత్రికలు

# శ్రీ రామకృష్ణ ప్రభ

# 2012





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014






## పరమహంస తృతీయ ఛాయాచిత్రం - 1883

**భగవాన్ శ్రీరామకృష్ణుల జీవిత కాలంలో ఆయనకి మూడు ఛాయాచిత్రాలు తీయడం జరిగింది. ఈ మూడు ఛాయాచిత్రాల్లోనూ గురుదేవులు సమాధిమగ్నులై ఉండడం విశేషం. తృతీయ ఛాయాచిత్ర వివరణ...**

1883 అక్టోబర్‌లో ఒక ఆదివారం నాటి ఉదయం 9.30 గంటలకు *(తేదీ నిర్దిష్టంగా తెలియలేదు)* శ్రీరామకృష్ణులు రాధాకాంత (విష్ణు) ఆలయ వరండాలో కూర్చుని ఉన్నప్పుడు ఆయన మూడవ ఛాయాచిత్రం తీయబడింది. గంగానదికి తూర్పు తీరంలో రాణీ రాస్మణి నిర్మించిన శివాలయాలకు పశ్చిమాభిముఖంగా గురుదేవులు కూర్చున్నారు. ఆయన ధరించిన ధోవతి అంచు వారి ఎడమ భుజంపై ఉంది. అది తప్ప, వారి దేహంపై మరే ఆచ్ఛాదనా లేదు. గురుదేవులు తమ రెండు చేతులూ కలిపి ఒడిలో పెట్టుకుని కూర్చున్నారు. చేతి వేళ్ళు ఒకదానితో ఒకటి కలిసి ఉన్నాయి. కుడి కాలు క్రింద ఎడమకాలు, పాదం ఉన్నది కాబట్టి కుడిపాదం కనిపించదు. ఆయన అర్ధనిమీలితులై భావ సమాధిలో ఉన్నారు.

గురుదేవులకు ఫోటో తీయాలనే తీవ్రమైన కోరికతో భవనాథ్ ఒకరోజు కలకత్తాలోని చౌరంఘీలేన్ లోని బౌర్న్ అండ్ స్టెఫ్ కంపెనీకి చెందిన అవినాశ్ చంద్రదాస్ అనే ఫోటోగ్రాఫర్‌ను దక్షిణేశ్వరానికి తీసుకొచ్చాడు. భవనాథ్, నరేంద్రనాథ్ (స్వామి వివేకానంద) లు చేసిన ఏర్పాట్ల వల్లనే ఈ ఫోటో తీయడం జరిగింది. కెమెరా సిద్ధమైన వెంటనే గురుదేవుల ఫోటో తీయమని భవనాథ్, అవినాశ్‌కు సంజ్ఞ చేశాడు. శ్రీరామకృష్ణులు సమాధిమగ్నులై ఉన్నందున ఆయన శరీరం కొద్దిగా ఒకవైపు వంగి ఉంది. అవినాశ్ శ్రీరామకృష్ణుల శరీరాన్ని సరిచేయదానికి ప్రయత్నించినప్పుడు గురుదేవుల శరీరం కాగితంలా తేలికగా కదిలింది. దాంతో అతడు కంగారుపడి ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు. అప్పుడు నరేంద్రుడు త్వరగా ఫోటో తీయమని కోరడంతో అవినాశ్ గురుదేవుల ఫోటో తీశాడు. శ్రీరామకృష్ణుల ఈ ఛాయాచిత్రం జగత్ ప్రసిద్ధి చెందింది.

ఈ చిత్రం జగత్ ప్రసిద్ధమవుతుందంటూ గురుదేవులు కాశీపూర్‌లో ఉండగా, భవిష్యత్తును ముందుగానే సూచించారు. ఒకసారి శ్రీరామకృష్ణులు, నవగోపాల్ భార్య నిస్తారిణీ ఘోష్‌తో "ఈ చిత్రం రైళ్ళలోనూ, ఓడలలోనూ పయనిస్తుంది. ఎంతోమంది తమ వెంట దీన్ని తీసుకువెళతారు. ప్రజలు తమ జేబుల్లోనూ, తమ చేతి గడియారాల పైనా దీన్ని ఉంచుకుంటారు" అని చెప్పారని తెలియజేశారు. ❖


**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# జంటనగరాలలో
# మూర్తిత్రయ భావవ్యాప్తి

**హైదరాబాదు రామకృష్ణ మఠం** భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస 175వ జయంతి వార్షికోత్సవాల సందర్భంగా 175 సత్సంగాలను నిర్వహించి జంటనగరాల్లో శ్రీరామకృష్ణ, శ్రీశారదాదేవి, స్వామి వివేకానందుల భావాలను పరివ్యాప్తం చేయాలని సంకల్పించింది.

మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ వారి నేతృత్వంలో 2011 మార్చిలో ప్రారంభమైన సత్సంగ కార్యక్రమాలు, 2011 నవంబర్ 20వ తేదీన మఠ ప్రాంగణంలో నిర్వహించిన కార్యక్రమంతో 175 సత్సంగాలు పూర్తయ్యాయి. మఠ ప్రాంగణంలో నిర్వహించిన 175వ సత్సంగంలో దాదాపు 2500 మంది భక్తులు పాల్గొన్నారు. ఈ సత్సంగ కార్యక్రమాల ద్వారా జంటనగరాల్లో వివిధ ప్రాంతాల్లోని సుమారు 25,000 మంది భక్తులకు మూర్తిత్రయ సందేశాన్ని అందించడం జరిగింది.

ఈ సత్సంగ కార్యక్రమాల్లో స్వామి జ్ఞానదానందజీ, స్వామి బోధమయానందజీ, స్వామి అనుపమానందజీ, స్వామి గౌరాంగానందజీ, స్వామి శితికంఠానందజీ, స్వామి భీతిహరానందజీ, స్వామి రఘునాయకానందజీ తదితరులు పాల్గొని మూర్తిత్రయ సందేశామృతాన్ని భక్తులకు పంచారు. ❖



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 1 జనవరి 2012

**జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః ।**
**నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥**

ఎదురులేని పరాక్రమము గల ఓ దేవా! నీకు నమస్కారము. విజయం, మంగళం ప్రసాదించే నీకు నమస్కారము. పచ్చని గుఱ్ఱములు గల నీకు నమస్కారము. సహస్ర కిరణాలుగల నీకు నమస్కారము, అదితి పుత్రుడవయిన నీకు నమస్కారము. – ఆదిత్యహృదయం

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. 10,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. 5,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. 1,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి ఎ. సూర్యకాంతం, | శాంతినగర్, ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా | 10,000 |
| పోషకులు | : కీ॥ శే॥ ఎస్. గాంగే నాయక్ జ్ఞాపకార్థం వారి కుమారులు, | పుట్టపర్తి, అనంతపురం జిల్లా | 2,000 |
| పోషకులు | : శ్రీమతి పాశం శైలజ, | రైటర్ బస్తీ, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా (కీ॥శే॥ శ్రీ పాశం సంతోష్ నిశ్చల్ జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీమతి లంక అన్నపూర్ణమ్మ, | ఉప్పల్, హైదరాబాదు | 1,000 |
| పోషకులు | : శ్రీమతి రావులపాటి అర్లమ్మ, | గౌరిపల్లి, మల్లవరం, పశ్చిమ గోదావరి జిల్లా | 1,000 |
| పోషకులు | : శ్రీ ఎస్. బసవయ్య గుప్త, | రావివారి వీధి, తెనాలి, గుంటూరు జిల్లా | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

**ముఖచిత్రం :** స్వామి వివేకానంద పరివ్రాజక సన్న్యాసిగా భారతదేశమంతా పర్యటించి, చివరిగా కన్యాకుమారిలో సముద్రంమధ్యలో ఉన్న దక్షిణాగ్ర శిలపై కూర్చొని ప్రగాఢంగా ధ్యానించారు. భారతదేశ పతనావస్థను తలచుకొని విలపించారు. భారతదేశ పునరుద్ధరణకు ప్రణాళికను రూపొందించారు. చిత్రకారుడు : దాకోజు శివప్రసాద్

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**

Sri Ramakrishna Prabha, Ramakrishna Math,
Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### సంక్రాంతి శుభాకాంక్షలు

పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, దాతలకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు మా హృదయపూర్వక సంక్రాంతి శుభాకాంక్షలు.

– సంపాదకులు

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.– సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా!

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్




SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# మహితాత్ముని వీక్షణలో మహోన్నత భారతం

భారతదేశం ఓ ఆధ్యాత్మిక నిలయం. ఎందరో యోగీశ్వరులు, మునీశ్వరులు, యతీశ్వరులతో అలరారుతున్న పుణ్యభూమి మన దేశం. సంపూర్ణ త్యాగమయ జీవితాన్ని గడిపి, నిరంతరం భగవద్ధ్యానంలోనే లీనమై, ఆత్మసాక్షాత్కారం పొందిన ఎంతోమంది మహాత్ములు ఈ ఆధ్యాత్మిక స్థలిలో జన్మించారు. అదే కోవకు చెందిన యతీశ్వరులు స్వామి వివేకానంద. ఆయనకు భారతీయులు నేటికీ తమ హృదయాలలో విశిష్ట స్థానమిచ్చి ఆరాధిస్తున్నారు. దేశవ్యాప్తంగా స్వామీజీ జన్మదినోత్సవాలను జరుపుకుంటున్నారు. భారతదేశ చరిత్రలో మరే సన్యాసికీ దక్కని విశిష్ట స్థానం, అశేష కీర్తిప్రతిష్ఠలు స్వామి వివేకానందకే ఎందుకు లభించాయి?

ఆత్మానంద సాగరంలో మునిగి, అందులోనే లీనమైపోయిన మహాత్ములు ఎందరో ఉన్నారు. కానీ స్వామీజీ ఆ ఆధ్యాత్మిక ఆనందసాగరంలో మునిగినప్పటికీ అందులో ప్రశాంతంగా ఉండలేకపోయారు. "నేను హిమాలయ గుహల్లో సాధన చేస్తున్నప్పుడు ఈ చీకటి గుహల్లో కూర్చుని ఆత్మజ్యోతిని దర్శించడం కాదు, సర్వజీవుల్లో ఉన్న సర్వాంతర్యామిని దర్శించి, సేవించమని ఎవరో నన్ను బలవంతంగా బయటకు లాగుతున్నట్లు అనిపించేది" అని కాలాంతరంలో స్వామీజీ తన సోదర సన్యాస శిష్యులతో చెప్పారు.

అలా స్వామీజీ ఆవేదనకు గురి కావడానికి కారణం – 'నువ్వు నిర్వికల్పానందంలో విహరించడం కాదు, నిరాశ్రయులైన వారికి సేద తీర్చే వటవృక్షంలా విరాజిల్లాలి' అన్న గురుదేవులు శ్రీరామకృష్ణుల ఆదేశమే! గురుదేవుల ఆదేశాన్ని ఆచరించడంలో స్వామీజీ తన స్వీయ ముక్తిని త్యజించి, భారతజాతి ఉద్ధరణకు అంకితమయ్యారు. కాబట్టి ఆయన భారతీయుల మనస్సుల్లో చిరస్మరణీయులయ్యారు. శ్రీరామకృష్ణుల ఆదేశాన్ని ఆచరణాత్మకం చేయడానికి నాంది – స్వామీజీ పరివ్రాజక జీవితం.

స్వామీజీ సుమారు నాలుగున్నర ఏళ్ళ పాటు ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, తమిళనాడు, కర్ణాటక, కేరళ, హైదరాబాద్ మొదలైన ప్రాంతాలలో పర్యటించారు. ఆ యా ప్రాంతాల ప్రజల ఆలోచనా ధోరణులనూ, సంస్కృతీ సంప్రదాయాలనూ, సామాజిక కట్టుబాట్లనూ, ఆచారాలనూ అర్థం చేసుకొన్నారు. కోట్లకు పడగలెత్తిన కోటీశ్వరులైనా, కూటి కోసం శ్రమపడే నిర్భాగ్యులైనా ప్రతి క్షణం సుఖదుఃఖాల అలల తాకిడితో, ఆశ నిరాశల మధ్య ఊగిసలాటలో ఎలా తమ జీవితాలను గడుపుతున్నారో స్వామీజీ ప్రత్యక్షంగా వీక్షించారు.

**మహారాజులకు మార్గదర్శకత్వం:** పూర్వం మహర్షుల మార్గదర్శకత్వంలో మహారాజులు పరిపాలన సాగించేవారు. స్వామీజీ కూడా తన భారతదేశ పర్యటనలో ఖేత్రీమహారాజు అజిత్‌సింగ్‌నూ, ఆళ్వార్ మహారాజు మంగళ్‌సింగ్‌నూ, మైసూర్ మహారాజు చామరాజేంద్ర వడయార్‌నూ, రామనాథపురం భాస్కర సేతుపతినీ, బరోడా మహారాజు గైక్వాడ్‌నూ కలుసుకొని, వారి విధ్యుక్త ధర్మాలను గుర్తుచేశారు.

విగ్రహారాధనను నిరసించిన ఆళ్వార్ మహారాజుకు 'రాజుగారి చిత్ర పటాన్ని చూసి రాజుగా భావించి ఎలా గౌరవిస్తామో, అలాగే భగవంతుని రూపాన్ని విగ్రహంలో దర్శించి ఆరాధిస్తాం' అని చెప్పి, కనువిప్పు కలిగించారు. భగవంతుని ఉనికిని విశ్వసించని జైపూర్ సేనాధిపతి అయిన హరిసింగ్‌కు తన స్పర్శమాత్రాన

సాక్షాత్తూ శ్రీకృష్ణుణ్ణి దర్శింపజేశారు. ఆంగ్లేయులను మెప్పించి తమ రాజ్యాధికారాన్ని కాపాడుకోవాలనే అధికార దాహంతో ఉన్న మహారాజులను కలుసుకొని, ప్రజలను పరిరక్షించడమే రాజుల కర్తవ్యమని బోధించారు.

**ఆ భారతం ఎక్కడ?:** భారతదేశంలోని పరిస్థితులనూ, పరిణామాలనూ, ప్రజల స్థితిగతులనూ పరివ్రాజక జీవితం ద్వారా అవగాహన చేసుకొన్న స్వామీజీ కన్యాకుమారిలో బంగాళాఖాతం, అరేబియా మహాసముద్రం, హిందూ మహాసముద్రాలు సంగమించే చోట దక్షిణాగ్రశిల మీద కూర్చొని ధ్యానం చేస్తూ, భారతదేశ పూర్వవైభవాన్నీ, భారతజాతి దీనావస్థనూ తలచుకుంటూ ఇలా విలపించారు:

"ప్రపంచదేశాలకు ఆధ్యాత్మిక భిక్ష నందించే మహాత్ములకు ఆలవాలమైన ఆ భారతం ఎక్కడ? అశోకుడు, సముద్రగుప్తుడు లాంటి చక్రవర్తుల పాలనలో స్వర్ణయుగాన్ని తలపించిన ఆ భారతం ఎక్కడ? పాశ్చాత్య విద్యార్థులకు సైతం ఉన్నత విద్యలో శిక్షణనిచ్చే తక్షశిల, నలంద, విక్రమశీల, విజయపురి, కాంచీపుర విశ్వవిద్యాలయాలకు నిలయమైన ఆ భారతం ఎక్కడ? అజంతా, ఎల్లోరా, గనేరీ, మహాబలిపురం లాంటి అమరమైన చిత్తరువులనూ, సజీవ శిల్పాలనూ అందించిన కళాకారులకు కన్నతల్లి అయిన ఆ భారతం ఎక్కడ? ఖగోళశాస్త్రంలో ఆర్యభట్టు; జ్యోతిశ్శాస్త్రంలో వరాహమిహిరుడు; గణితశాస్త్రంలో భాస్కరాచార్యుడు; వైద్యశాస్త్రంలో సుశ్రుతుడు, చరకుడు; రాజనీతిశాస్త్రంలో చాణక్యుడు–ఇలాంటి అగ్రగణ్యుల్ని సృష్టించిన ఆ భారతం ఎక్కడ?..."

సుందర సౌధాల ప్రక్కనే పూరిగుడిసెల్నీ, పవిత్ర దేవాలయాల ప్రక్కనే మురికి గుంటల్నీ, ఆభరణాలను అలంకరించుకొనే వారి ప్రక్కనే చిరిగిన వస్త్రాలతో ఉన్న నిర్భాగ్యుల్నీ, పంచభక్ష్య పరమాన్నాలను భుజించే వారి ప్రక్కనే అన్నార్తులైన నిరుపేదల్నీ – ఇలా స్వామీజీ తన పర్యటనలో దర్శించిన దృశ్యాలను ధ్యానిస్తూ విలపించసాగారు.

**పతనానికి కారణాలు – పునరుద్ధరణకు మార్గాలు:** భారతదేశం తన పూర్వ వైభవం కోల్పోవడానికి గల కారణాలను విశ్లేషించి, ఈ క్రింది పరిష్కారమార్గాలను సూచించారు స్వామీజీ.

1. భారతదేశం బానిసత్వపు సంకెళ్ళతో బందీ అవడానికీ, దారిద్ర్యపు కోరల్లో చిక్కుకోవడానికీ కారణం మతం కాదు. మతం పేరిట ప్రబలిన సంకుచిత భావాలు, మూఢనమ్మకాలు, స్వార్థ రాజకీయాలే కారణం. ప్రజలంతా సామరస్యంతో కలసిమెలసి ప్రశాంతజీవనం సాగించేందుకు తోడ్పడటమే మత ప్రయోజనమని ప్రజల్ని చైతన్యపరచాలి.

2. దేశపతనానికి కారణం సామాన్య ప్రజల అభ్యుదయానికి ప్రయత్నించకుండా ఉదాసీనతను ప్రదర్శించడమే. స్వయంశక్తిపై ఆధారపడి, వారు తమ జీవితాలను కొనసాగించడానికి అవసరమైన మౌలిక సదుపాయాలను సమకూర్చాలి.

3. స్త్రీ జాతి పట్ల నిర్లక్ష్య వైఖరి కూడా భారతజాతి పతనానికి కారణం. స్త్రీ జనోద్ధరణకు పాటుపడనిదే దేశాభ్యుదయం సాధ్యం కాదు. వారికి గృహనిర్వహణ, జీవన నియమాలలో శిక్షణనివ్వాలి. నీతిసూత్రాలు, ఆధ్యాత్మిక, భౌతిక, వైజ్ఞానిక శాస్త్రాలను బోధించాలి.

4. అధికారాన్ని హస్తగతం చేసుకున్న ఒక వర్గం వారు విద్యను తమ వరకే పరిమితం చేసుకొన్నారు. లౌకిక విద్యతో పాటు ఆధ్యాత్మిక విద్యను కూడా సామాన్య ప్రజానీకానికి అందించాలి.

5.మన ఆధ్యాత్మిక సంపదను ఇతర దేశాలకు ఇవ్వకుండా, వారితో సంబంధ బాంధవ్యాలను పెంచుకోకుండా ఉండడం మన ఈ దుఃస్థితికి కారణం. మన ఆధ్యాత్మిక సంపదను పాశ్చాత్య దేశాలకు ఇచ్చి, వారి విజ్ఞానాన్ని మనం ఉపయోగించుకోవాలి.

**పూర్వవైభవం... పునర్దర్శనం:** స్వామి వివేకానంద ఆశించిన విధంగా నేడు భారతదేశం విద్యారంగంలో అభివృద్ధిని సాధిస్తోంది. మహిళలు అన్ని రంగాలలోనూ ముందంజ వేస్తున్నారు. వ్యవసాయ, పారిశ్రామిక, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో పురోగమిస్తోంది. అయినప్పటికీ భారతదేశంలో ఇంకా దారిద్ర్యం తాండవిస్తోంది. సంకుచిత భావాలు, స్వార్థచింతన రూపుమాసిపోలేదు. అవినీతి, అరాచకాలు పెరుగుతూనే ఉన్నాయి. భారతదేశం సర్వోన్నత స్థానాన్ని పొందాలన్నా, మహోన్నత వైభవాన్ని తిరిగి సంతరించుకోవాలన్నా స్వామీజీ సూచించిన ఈ మూడు ధర్మసూత్రాలను ఆచరించిననాడే అది సాధ్యం అవుతుంది.

1. మంచితనానికి ఉన్న శక్తిపై అఖండ విశ్వాసం.
2. అసూయ, అనుమానాలు లేకుండా ఉండడం.
3. పవిత్రంగా ఉండేందుకు ప్రయత్నిస్తూ, పరహితానికై పాటుపడే వారందరికీ సహాయం చేయడం.

ఈ మూడు ధర్మసూత్రాల ఆచరణ సాధ్యం కావాలంటే 'This life is short, but the vanities of the world are transient. They alone live who live for others, the rest are more dead than alive. – ఈ జీవితం అల్పం. ఈ లోకంలోని ఆడంబరాలన్నీ క్షణికం. ఇతరుల కోసం జీవిస్తున్న వారే సజీవులు. మిగిలినవారు జీవన్మృతులు'.

స్వామీజీ ఉపదేశించిన ఈ దివ్యమంత్రాన్ని మనం నిరంతరం స్మరించాలి. అప్పుడే మన దేశ పురోగమనానికి ముఖ్య అవరోధాలైన స్వార్థం, అసూయలను అధిగమించ గలుగుతాం. స్వామీజీ ఆశించిన మహోన్నత భారత వైభవాన్ని పునర్దర్శించగలుగుతాం. ❖



భారతదేశ అభ్యుదయం మన కార్యదీక్షపై ఆధారపడి ఉంది. సహనం, పవిత్రత, ధైర్యం, స్థిరత్వాలతో పనిచేస్తూ ముందుకు సాగండి. ఆచరణలేని సిద్ధాంతాల వల్లే దేశం పతనమైంది. - స్వామి వివేకానంద

# సింహావలోకనం

మనుషుల ప్రవర్తనను గొర్రెలమంద మనస్తత్వంతో పోలుస్తారు. మొదటి గొర్రె ఏం చేస్తే మందలోని మిగతా గొర్రెలన్నీ అదే చేస్తాయి. దేనినైనా గ్రుడ్డిగా అనుసరించడం వలనే అనేక కష్టాలు. స్వామి వివేకానంద చెప్పిన కథలోని సింహం పిల్ల గొర్రెల మధ్య గొర్రెలాగా పెరిగిన వైనం మనకు తెలిసిందే. 'వేదాంత సింహం' స్వామి వివేకానంద గొర్రెల్లాగా జీవిస్తున్న మానవాళిని 'మీరు సింహాలు!' అని సంబోధించి, వారి నిజస్వరూపాన్ని గుర్తుచేసారు.

సింహానికి ఉన్న ప్రత్యేక గుణం ఏమిటి? అడవికి రాజు 'సింహం'. రాజసం ఉట్టిపడే ఈ మృగరాజు ఎప్పుడూ వర్తమానంలో జీవిస్తుంది. అయినప్పటికీ తన సుదీర్ఘ పయనంలో అప్పుడప్పుడు వెనక్కు తిరిగి తను ఉన్న పరిస్థితిని పూర్తిగా ఆకళింపు చేసుకుంటుంది. ఈ ప్రక్రియను 'సింహావలోకనం' అంటారు. కానీ నేటి సమాజంలో అధిక శాతం వర్తమానానికి దూరమై, భూతకాలపు గోతులలో పడి ఆందోళన, మానసిక క్షోభలకు గురవుతున్నారు. చివరకు శరీరంలో చేవలేక, నిరుత్సాహ హృదయాలతో జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్నారు. ఈ కోవకు చెందిన వారు ఎప్పుడూ ఆలోచిస్తూనే ఉంటారు. వారి ఆలోచనలన్నీ నకారాత్మక (negative) దృష్టికోణం నుండే! దీనినే 'brooding over the past' అంటారు.



కానీ 'సింహావలోకనం' దీనికి పూర్తిగా వ్యతిరేకం. ఇది విశ్లేషణాత్మకమైన ఆలోచన (analytical thinking). సకారాత్మకమైన (positive) ఆలోచన. దేనికీ భయపడకుండా ధైర్యంగా, పట్టుదల విశ్వాసాలతో వర్తమానాన్ని ఎదుర్కొంటూ, గతంలో జరిగిన తప్పిదాలు పునరావృతం కాకుండా అప్రమత్తత కలిగి ఉన్న ధీమంతుల కార్యసాఫల్యానికి మకుటాయమానం 'సింహావలోకనం.'

1897వ సంవత్సరంలో విదేశీ పర్యటన ముగించుకొని, మళ్ళీ తన పవిత్రమైన భారతభూమిపై కాలుపెట్టగలుగుతున్నానని స్వామీజీ మనస్సు ఆనందంతో పొంగిపోయి ఇలా అంటారు: "నేనిక్కడికి రాక ముందు నా దేశాన్ని ప్రేమించేవాడిని. ఇప్పుడు నా దేశపు గాలి, నీరు, ధూళి కూడా నాకు పవిత్రమూ, పూజనీయమూ అయ్యాయి. నా మాతృదేశం ఇప్పుడొక మహాతీర్థ స్థానం." ఇది స్వామీజీ 'సింహావలోకనం'.

ఇప్పుడు మనం స్వామి వివేకానందుని 150వ జయంతి వత్సరంలోకి అడుగుపెట్టాం. ఒక భారతీయ పౌరుడిగా ప్రతి ఒక్కరూ 'సింహావలోకనం' చేసుకొని, నేటి సమాజపు వాస్తవిక స్థితిగతులను తెలుసుకోవాలి. ఇది మన దేశ పురోభివృద్ధికి అత్యావశ్యకం. ఇప్పుడు నమూనాగా ఒక 'సింహావలోకనం' చూద్దాం.

భారతదేశం అతి పెద్ద ప్రజాస్వామ్య దేశం. కానీ అధిక శాతం భారతీయులు దీనిని ఒక నామమాత్రపు ప్రజాస్వామ్యంగా పరిగణిస్తున్నారు. ఎందువలన? మన రాజ్యాంగాన్ని సరిగా రూపొందించుకోలేదా?

1949వ సంవత్సరంలో భారత రాజ్యాంగం ఆమోదం పొందడానికి ముందు దాన్ని గురించి వాదనలు, ప్రతివాదనలు, చర్చలు జరుగుతున్న రోజులవి. అప్పుడు డా॥ బి.ఆర్. అంబేద్కర్ రాజ్యాంగాన్ని వివరిస్తూ తన అద్భుతమైన ఉపన్యాసంలో ఇలా అన్నారు: 'రాజ్యాంగం ఎంత గొప్పదైనా దానిని అమలుపరచేవారు సరిగా లేనప్పుడు, ఆ రాజ్యాంగం సరిగా ఉపయోగపడదు. అదే విధంగా రాజ్యాంగం సరిగా లేకపోయినా, దానిని అమలుపరచేవారు సరైనవాళ్ళు అయినప్పుడు ఆ రాజ్యాంగం దేశాభివృద్ధికి తోడ్పడుతుంది.'

ఈ సంగతి మనం మరచిపోయాం. 'ఆడలేక మద్దెల ఓడు' అనే ప్రవర్తనను మనం మార్చుకోవాలి. "మీలోని అనంత శక్తిని తట్టి లేపండి. లేవండి! నడుము బిగించి, హృదయపూర్వకంగా ఆత్మసమర్పణతో, కార్యనిర్వహణకు దిగండి!" అన్న స్వామి వివేకానందుని పిలుపును నేటి భారతం అందుకోవాలి. ❖



# పుణ్యకాలం ప్రారంభం

సంక్రాంతి అంటే మారడం, చేరడం అని అర్థం. 'తత్ర మేషాదిషు ద్వాదశ రాశిషు క్రమేణ సంచరతః సూర్యస్య పూర్వ స్మాద్రాశే ఉత్తరరాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః' – సూర్యుడు మేషాది ద్వాదశ రాశులందు సంచరిస్తూ క్రమంగా పూర్వరాశి నుండి ఉత్తరాభిముఖంగా ప్రవేశించినప్పుడు సంక్రాంతి అవుతుంది.

కర్కాటకం నుండి మకర సంక్రాంతి వరకు సూర్యుడు దక్షిణాభిముఖంగా సంచరించడం వల్ల ఈ కాలాన్ని 'దక్షిణాయనమ'ని అంటారు. మకర సంక్రాంతి నుండి కర్కాటక సంక్రాంతి వరకు సూర్యుడు ఉత్తరాభిముఖుడై సంచరించడం వల్ల ఈ కాలాన్ని 'ఉత్తరాయణమ'ని అంటారు.

దేవతలకు ఉత్తరాయణం ఉత్తమకాలమనీ, దక్షిణాయనం పితృదేవతలకు ముఖ్యకాలమనీ భావిస్తారు. ఉత్తరాయణంలో మరణిస్తే మోక్షప్రాప్తి కలుగుతుందని అంటారు. అందుకే అంపశయ్యపై భీష్మాచార్యుడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు వేచి ఉన్నాడని మహాభారతం చెబుతోంది.

1. సంక్రమణం నాడు ఇంటి ముంగిట అలికి, రంగు రంగుల పిండితో ముగ్గులు పెట్టి, గోమయంతో గొబ్బిళ్ళు చేసి, వాటిలో రంగు రంగుల పూలనూ, నూలు బియ్యాన్నీ, రేగుపండ్లనూ పెట్టి ఇళ్ళను అలంకరించుకుంటారు.

2. సంక్రాంతి పండుగనాడు నానావిధాలైన కూర లన్నింటిని కలిపి వండుతారు. ఆ రోజు బ్రాహ్మణులకు కూర గాయలనూ, ధాన్యాన్నీ, దక్షిణనూ ఇస్తారు.

3. నిత్యకృత్యాలు పూర్తి చేసుకుని, సూర్యుడికి అర్ఘ్య ప్రదానం చేసి, పుష్పాలు సమర్పించి, అంజలి ఘటించి, గాయత్రీ మంత్రం జపిస్తూ, సద్బుద్ధి, జ్ఞానం, ఉత్సాహ భరితమైన, ఆరోగ్యవంతమైన జీవితం ప్రసాదించాల్సిందిగా ప్రార్థించాలి.

4. పితృదేవతలకు తర్పణాలు ఇవ్వాలి. పూర్వజుల మొక్కు బడులూ, ఆశయాలూ, ఆశలూ, ప్రతిజ్ఞలూ తీర్చాలి.

5. నువ్వుపప్పు, బెల్లం కలిపి, 'లడ్డూ'లు తయారు చేసి, బంధుమిత్రులకు పంచిపెట్టాలి. అలా చేయడం వల్ల సంకుచిత మైన భావాలు పోయి, అందరితో సత్సంబంధాలు ఏర్పడతాయి.

6. సంక్రాంతి శీతకాలంలో వస్తుంది. కాబట్టి ఈనాడు ఉష్ణాన్నిచ్చే నువ్వులు, నెయ్యి, కంబళ్ళు పేదలకు దానం చేయడం పుణ్యదాయకం.

## భోగిపండుగతో ఇంద్రుడి బాంధవ్యం

మకర సంక్రాంతికి ముందు రోజున భోగిపండుగను జరుపుకుంటారు. భోగి పండుగకు సంబంధించి ఒక కథ ప్రాచుర్యంలో ఉంది. భోగి పండుగ నాడు పూర్వం ప్రజలు వర్షాల కోసం ఇంద్రుణ్ణి పూజించేవారు. ఇలా పూజలందు కోవడం వల్ల ఇంద్రుడికి గర్వం పెరిగిపోయింది. అతడి గర్వం అణచాలని శ్రీకృష్ణుడు తలచి, ఇంద్రపూజలకు సిద్ధమవుతున్న యాదవులతో 'మన గోవులకు మేతనిచ్చేది గోవర్ధన పర్వతం. కాబట్టి ఈనాటి నుండి ఇంద్రుణ్ణి పూజించడం మాని గోవర్ధన పర్వతాన్ని పూజిద్దాం' అని అన్నాడు.



అప్పుడు ఇంద్రుడు కోపోద్రిక్తుడై, అతి వృష్టి కురిపించాడు. యాదవులందరూ శ్రీకృష్ణునితో తమ బాధలు చెప్పుకున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తి పట్టుకుని, యాదవులకూ, గోవులకూ దాని క్రింద ఆశ్రయాన్ని కల్పించాడు. ఇంద్రుడు తన వద్ద ఉన్న ఏడు రకాల మేఘాలను వర్షింపజేసినప్పటికీ యాదవుల్ని ఏమీ చేయలేకపోయాడు. దానితో ఇంద్రుడి గర్వం అణిగింది. శ్రీకృష్ణుడి మహత్తు తెలుసుకొన్న ఇంద్రుడు పాదాక్రాంతుడయ్యాడు.

శ్రీకృష్ణుడు ఇంద్రుణ్ణి మన్నించి భోగిపండుగ నాడు ఎప్పటిలాగే మళ్ళీ ఇంద్రపూజ జరిగేందుకు ఆనతిచ్చాడు. మకర సంక్రాంతి మరునాడు కనుమ పండుగ జరుపుకుంటారు. వ్యవసాయదారునికి పశువులే సంపద. పంటలు వాటి శ్రమ ఫలితంగా వచ్చినవి కాబట్టి, ఆ రోజు పశువులను పూజించి వాటికి పొంగలి వండి పెడతారు. ❖

మనం ప్రపంచానికి ఇచ్చే కానుక ఆధ్యాత్మిక జ్ఞానమే! మన ఆధ్యాత్మిక భావాలు తెల్లవారుజామున మెల్లమెల్లగా జాలువారే మంచు బిందువుల వలె ప్రపంచమంతా వ్యాపిస్తున్నాయి. - స్వామి వివేకానంద




**అర్థమనర్థం భావయ నిత్యం**
**నాస్తి తతః సుఖలేశః సత్యమ్।**
**పుత్రాదపి ధనభాజాం భీతిః**
**సర్వత్రైషా విహితా రీతిః॥**

హైదరాబాదు నగరంలో దాదాపు నలభై ఏళ్ళ క్రితం ఓ వ్యక్తి సమీప గ్రామం నుంచి రోజూ సైకిల్ మీద పాలు తెచ్చుకొని అమ్ముతూ ఉండేవాడు. అలా, అలా పాలు అమ్ముకుంటూ కొన్నాళ్ళకు నగరం నడిబొడ్డున ఓ ప్రాంతంలో కొంత స్థలం కొనుక్కున్నాడు. అదే విధంగా పాడి వలన పెరిగిన ఆదాయంతో రాజధాని శివార్లలో ఎన్నో ఎకరాల పొలాన్ని కూడా కొనుగోలు చేశాడు. హైదరాబాదులోని ప్రముఖ వ్యాపార ప్రాంతంలో



# అర్థంతో అనర్థం...

**–స్వామి జ్ఞానదానంద**

పూర్వం తను కొనుగోలు చేసిన స్థలంలో పెద్ద హోటలు కూడా కట్టాడు. ఇలా సంపద విస్తరణ రుచి మరిగిన సదరు పాలవ్యాపారి కొన్నాళ్ళకు శ్రీమంతుడిగా మారిపోయాడు.

ఇరవై ఏళ్ళ తరువాత ఒక్కసారిగా భాగ్యనగరంలో భూముల ధరలు ఆకాశాన్ని తాకడంతో ఆయన భూముల విలువ వందల రెట్లు పెరిగిపోయింది. లక్షల్లో ఉన్న ఆ వ్యాపారి సంపద వందల కోట్లకు చేరిపోయింది. అప్పటి నుంచే ఆయనకు అసలు కష్టాలు ప్రారంభమయ్యాయి. అన్ని రోజులుగా సఖ్యతతో ఉన్న కుమారుల, కుమార్తెల మనస్సుల్లో విభేదాలు పొడసూపాయి. ఆత్మీయతల స్థానంలో అంతఃకలహాలు చెలరేగాయి. భూముల విస్తరణపై పెట్టిన దృష్టి, ఆయన బంధాల పటిష్ఠతపై పెట్టక పోవడంతో కన్నబిడ్డలు కసాయిల్లా మారిపోయారు. ఒకరిపై మరొకరు కత్తులు నూరుకునే స్థాయికి చేరుకున్నారు.

చివరకు ఒకానొక రోజు ఆ పెద్దమనిషి కళ్ళ ముందే తీవ్ర ఘర్షణలకు పాల్పడి, తుదకు ఆయననే కత్తితో పొడిచి అంత మొందించారు. పాపలా పెంచిపోషించుకున్న ధనమే తనను పాములా కాటేసింది. ఇలా అర్థము (డబ్బు) ఎంతటి అనర్థాన్ని తెస్తుందో ముందే ఊహించి ఉపదేశించారు – దార్శనికులైన ఆది శంకరాచార్యులు. ఆ పరంపరలో ఆ పరమాచార్యులు తన 'భజగోవిందం'లో ఇలా అంటారు:

**అర్థమనర్థం భావయ నిత్యం నాస్తి తతః సుఖలేశః సత్యమ్।**
**పుత్రాదపి ధనభాజాం భీతిః సర్వత్రైషా విహితా రీతిః॥**

'ధనం ఎల్లప్పుడూ అనర్థాన్నే కలిగిస్తుందని గ్రహించు. ధనం వల్ల సుఖం లేశమైనా లేదు; ఇది సత్యం. ధనవంతులు పుత్రుని వలన కూడా భయపడతారు. ప్రపంచమంతా ఈ రీతిగానే ఉంద' ని హితవు పలుకుతున్నారు.

నేడు సమాజంలో ధనకాంక్ష మనిషిని ఎంత దిగజారుస్తుందో చూస్తుంటే ఆశ్చర్య మేస్తోంది. ఎందుకింత స్వార్థంతో కోట్లకు కోట్లు కూడబెడు తున్నారో, ధనదాహంలో పడికొట్టుకుపోతున్నారో అర్థం కావడం లేదు. కళ్ళ ముందు ఆ పాలవ్యాపారి లాంటి ఉదంతాలు కోకొల్లలుగా జరుగుతున్నా కళ్ళు తెరవడం లేదు.

**బానిసకే బానిసలా...:** మనకు బానిసగా ఉండాల్సిన సంపదలకు మనమే బానిసలమవుతున్నాం. నిత్యజీవన వ్యవహారాలలో ధనం విలువ తెలియనిది కాదు. సంపదలను త్యాగం చేసి బికారిగా జీవించమని ఆ ఆదిగురువులు బోధించడం లేదు. కానీ మన ఇంటి ముందు రక్షణగా పెట్టుకున్న పెంపుడు కుక్కకి మనమే కాపలా కాస్తుంటే, అంతకు మించిన వింత ఇంకోటి లేదు కదా! ప్రస్తుతం ఆధునిక సమాజంలో సంపదల వేటలో పడిన వారి పరిస్థితి అలాగే మారింది. మన అదుపులో పెట్టుకోవలసిన ఆస్తిపాస్తుల హస్తంలోకి, మనమే వెళ్ళిపోతున్నాం. మన జీవితంలోని విలువైన కాలం మొత్తాన్నీ కేవలం ధనార్జనకే వెచ్చిస్తున్నాం.

అందుకే భగవాన్ శ్రీరామకృష్ణులు "ఎవరైతే ధనాన్ని బానిసగా చేసుకొని జీవిస్తాడో, అతడే మనిషి. ధనం యొక్క సద్వినియోగం తెలియని వారు మనుష్యులు కారు. అలాంటి వ్యక్తి చూడడానికి

మాత్రమే మనిషి. కానీ పశు లక్షణాలు కలిగి ఉంటాడు. ధనం మనిషి స్వభావాన్నే మార్చివేసే ఉపాధి. ధనవంతుడు కాగానే అతడి నైజమే మారిపోతుంది. ధనం ఏదో కాస్త కడుపు నింపగలదు, సౌకర్యాలు కల్పించగలదేమో గాని, ధనసంపాదనే నీ పరమావధి అనుకోకు" అంటారు. ఆదాయానికీ, విని యోగానికీ మధ్య ఉండాల్సిన పొంతనను గుర్తించాలి. సమ స్థాయిలో వాటిని నడిపించాలి.

**పైకమే ప్రామాణికమా?**: నిజానికి ఎంతటి సంపదనైనా మనిషి పరిమితంగానే అనుభవించగలడు. ఆ విషయం తెలియకుండా మనం ప్రతి నిమిషాన్నీ పైకంతోనే ముడేస్తున్నాం. ముఖ్యంగా మారుతున్న సమాజంలో వ్యక్తి విలువను బేరీజు వేసేందుకు అతని సిరిసంపదలనే ప్రామాణికంగా తీసుకోవడం అలవాటుగా మారింది. అందుకే ప్రతి ఒక్కరూ ఆస్తిపాస్తుల పెంపకంలో పోటీపడుతున్నారు. ఇది ఒక ప్రమాదకరమైన ధోరణి! ప్రాణం లేని నోట్ల కట్టలు, నిలువెత్తు సజీవమూర్తి అయిన మనిషి విలువను వెలకడుతున్నాయంటే ఎంత ఆశ్చర్యకరమో ఒక్కసారి ఆలోచించుకోండి!

వ్యక్తిత్వం, గౌరవం, హుందాతనం, నడవడిక, సౌశీల్యం తదితర అంశాలన్నీ మనిషి ఔన్నత్యానికి ప్రతీకలు. కానీ మనం ఆ విషయాన్ని మరచిపోయి, కేవలం డబ్బులతో తెచ్చిపెట్టుకున్న పటాటోపంతో విలువను పెంచుకునే ప్రయత్నం చేస్తున్నాం. అదంతా తాత్కాలికమైన గుర్తింపే! డబ్బెంత అశాశ్వతమో, ఆ డాంబికాలూ అంతే అశాశ్వతం.

పైగా నడమంత్రపు సిరి మనను నేలపై నిలబడనివ్వని అహంకారాన్ని తెచ్చిపెడుతుంది. కన్నూమిన్నూ కానకుండా ప్రవర్తించేలా చేస్తుంది. అలాంటి ధన మదాంధులకు భవిష్యత్తులో దారిద్ర్యమే గుణపాఠం నేర్పుతుంది. అందుకే శ్రీమద్భాగవతంలో నారదమహర్షి ఇలా అంటారు...

**సంపన్నుండొరు గానలేడు తనువున్ సంసారమున్ నమ్మిహిం**
**సింప జూచు దరిద్రుడెత్తుపడి శుష్కీభూతుడై చిక్కి హిం**
**సింప దన్యుల నాత్మకున్ సములుగా చింతించు నట్టేట ద**
**త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపగన్**

అవును! ధనవంతుడు ఎవరినీ లెక్కచేయడు. తన శరీరాన్నీ, సంసారాన్నీ, సంపదనూ నమ్ముకొని ఇతరులను హింసించాలనే చూస్తాడు; అవమానపరుస్తాడు. దరిద్రుడు దారిద్ర్యదేవతకు చిక్కి, కష్టాలు అనుభవిస్తూ కూడా ఇతరులను హింసించడు. వారూ తనవంటి వారే కదా అని ఆలోచిస్తాడు. ఇది లోకరీతి. కనుక ధన మదాంధులైన వారికి దారిద్ర్యమే చక్కని అంజనం అవుతుంది.

**మనమెక్కడో!... ధనమెక్కడో!**: బంగారు పళ్ళెంలో అన్నం తినగలమేమో గాని, బంగారాన్ని తినలేం కదా! అని పైకి మాటలైతే చెప్పగలరు కానీ, మనస్సులో మాత్రం కాసులపై మోజు పోదు. వెండి కంచాలు, బంగారు కుర్చీలు, చలువరాతి స్నానపు గదులు, వజ్రాలు పొదిగిన పడక మంచాలు అవసరమా? అని కూడా చాలామంది శ్రీమంతులు ఆలోచించకపోవడం శోచనీయం. మనల్ని మనం సంపన్నులుగా చూపెట్టుకునేందుకు పడుతున్న తాపత్రయం అంతా ఇంతా కాదు. ఆధునికులు చేస్తున్న ఆర్భాటాలను చూస్తే జాలేస్తుంది. అవి సహజమైన మన ఆనంద స్వరూపాన్ని మసకబారుస్తాయని కూడా తెలుసుకోవడం లేదు. బారులు తీరిన కార్లు, బ్యాంకుల నిండా నోట్ల కట్టలు ఒక్కసారి మనం కన్నుమూశాక వెంట వస్తాయా? ఈ తలంపు క్షణమైనా తలెత్తడం లేదు. అందుకే యోగివేమన అంటాడు...

**వెళ్ళి వచ్చువాడు, వెళ్ళి పోయెడు వాడు,**
**తేను లేడు, కొంచు బోనులేడు**
**తానదేడ పోనొ ధనమేడ పోవునో?**
**విశ్వదాభిరామ వినురవేమ.**

నిజమే కదా! మనిషి పుట్టేటప్పుడు ధనం తీసుకొని రాలేదు. పోయేటప్పుడు ధనం మోసుకొని పోలేదు. ఎవరి దారి వారిదే! ధనానికీ, నరునికీ ఉన్న సంబంధమల్లా ఈ నడిమిని మాత్రమే! మరి దాని గురించి అంత విలవిలలాడిపోవడం ఎందుకు?



**పంచితేనే పరమానందం...**: గృహస్థుగా ధనార్జనను విస్మరించమని శంకరాచార్యులు చెప్పడం లేదు. కానీ ఆ వైభోగాల పట్ల అనురక్తిని వదులుకోమంటున్నారు. వార్ధక్యంలోకి అడుగుపెడుతున్న క్షణం నుంచి ఆ సంపదలపై వ్యామోహాన్ని తగ్గించుకోవడం అలవాటు చేసుకోవాలి. వీలున్నప్పుడల్లా మనస్ఫూర్తిగా నలుగురికీ దానధర్మాలు చేయాలి; ఆ వయస్సులో ఆర్థిక వ్యవహారాలకు దూరంగా ఉండాలి. భగవాన్ శ్రీరామకృష్ణులు "ధనవంతుడు దానం చేయాలి. పిసినారుల డబ్బు హరించుకుపోతుంది. దానం చేసేవాడి ధనం సంరక్షింపబడుతుంది. సత్కార్యాలకు విని యోగింపబడుతుంది. దానధర్మాలు చేసేవాడు ఎంతో ఫలాన్ని ప్రాప్తించుకుంటాడు. నాలుగు పురుషార్థాలనూ సాధించు కుంటాడు" అంటారు.

ముఖ్యంగా 'ఈయన ఎప్పుడు పోతాడా పంచేసుకుందామ'ని వారసులు గోతికాడ నక్కల్లా ఎదురుచూసే పరిస్థితిని తెచ్చుకోకూడదు. ఆ ఆస్తిపాస్తులకు మీరు ఒక అధిపతిగా కాకుండా, ధర్మకర్తగానే భావించుకొని ఎవరికి చెందాల్సింది వారికి అప్పగించి, ఆ పరమాత్ముడు తప్ప, మనకు పరమ ఆప్తులు ఎవరూ లేరనీ మననం చేసుకోవాలి. వారసులలా ఆయన ఆస్తి పంపకాలను కోరుకోడు; విశ్వసిస్తే తనే అపరిమితమైన ప్రేమతో అక్కున చేర్చుకోగలడు. ❖

**ఈ జీవితం వస్తుంది, పోతుంది; సంపద, కీర్తి, భోగాలు మూడునాళ్ళ ముచ్చటే! ఓ క్షుద్రకీటకం వలె చనిపోవడం కన్నా, సత్యాన్ని బోధిస్తూ కార్యరంగంలో మరణించడం ఉత్తమం. -స్వామి వివేకానంద**



# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ

ధార్మిక ఆసుపత్రి, స్వామి వివేకానంద మార్గ్, బృందావన్, మథుర జిల్లా,
ఉత్తర్‌ప్రదేశ్–281 121. ఫోన్ : 0565–2442310, ఫ్యాక్స్: 2443310
Email : info@rkmsvrind.org Website: www.rkmsvrind.org

## విన్నపం

శ్రీరామకృష్ణుల భక్తుడైన బలరాంబసుకి ఈ పవిత్ర వ్రజ భూమిలో "కాలాబాబు కుంజ్" అన్న పేరున్న పూర్వీకుల గృహం ఉంది. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక దివ్యజనని శ్రీ శారదాదేవి 1886లో బృందావనం వెళ్ళి ఈ "కాలాబాబు కుంజ్"లో సుమారు ఒక సంవత్సరం పాటు ఉన్నారు. ఆ తరువాత కూడా ఆమె అక్కడికి వెళ్ళినప్పుడు ఈ ఇంట్లోనే ఉండేవారు; ఇక్కడే శారదమ్మ మొట్టమొదట సారిగా స్వామి యోగానందకి



మంత్రదీక్ష ఇచ్చారు. స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, శ్రీరామకృష్ణుల ఇతర శిష్యులు ఈ ఇంట్లో ఉన్నారు. ఈ ఇంట్లోనే 1907లో రామకృష్ణ మిషన్ సేవాశ్రమ కేంద్రం లాంఛన ప్రాయంగా ప్రారంభమైంది.

మాతృమూర్తి శ్రీ శారదాదేవి పావనం చేసిన ఈ గృహాన్ని (కాలాబాబు కుంజ్) ఒక ఆధ్యాత్మిక స్మారక చిహ్నంగా తీర్చిదిద్దాలని బృందావనం రామకృష్ణ మిషన్ సేవాశ్రమ సంకల్పించి ఈ 'కాలాబాబు కుంజ్' భవనంలోని కొంత భాగాన్ని కొనుగోలు చేసింది. ఈ భవన పునరుద్ధరణ పనులు కొనసాగుతున్నాయి. ఈ పథకం పూర్తవడానికి **ఒక కోటి రూపాయలు** ఇంకా అవసరమవుతుంది.

ఈ ఆధ్యాత్మిక స్మృతి కేంద్ర పునరుద్ధరణకు మీరంతా ఉదారంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. మీరు ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) విభాగం క్రింద పన్ను మినహాయింపు లభిస్తుంది.



మాతృమూర్తి శ్రీశారదాదేవి బృందావన్‌ను సందర్శించి 125 సంవత్సరాలు అయిన సందర్భంగా ఈ ఆధ్యాత్మిక స్మారక భవనాన్ని 2012 సెప్టెంబర్‌లో ప్రారంభోత్సవం చేయాలని సంకల్పించాం. భక్తుల వద్ద ఉన్న శ్రీశారదాదేవికి సంబంధించిన చిత్రపటాలు, వస్తువులు మాకు ఇచ్చినట్లయితే ఈ స్మారక భవనంలో ప్రదర్శించబడతాయి.

-------------

1907లో ప్రారంభమైన బృందావన్ రామకృష్ణ మిషన్ సేవాశ్రమ 104 ఏళ్ళుగా 165 పడకల ధర్మాసుపత్రితో రోగులకు ఉచిత వైద్యసేవలు అందిస్తోంది. మౌలిక సదుపాయాలు, మూల నిధి కోసం ఇచ్చిన విరాళాలకు **ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 35 ఏ.సి. క్రింద 100 శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.** విరాళాలను ఆన్‌లైన్ ద్వారా Axis Bankలోని మా A/C **9100 1001 8246 169,** IFSC: UTIB 0000794 కు నేరుగా కూడా పంపించి మాకు ఉత్తరం, ఈమెయిల్, ఫోన్ ద్వారా తెలియపరచగలరు.

మీ విరాళాల్ని "Ramakrishna Mission Sevashrama, Vrindaban" పేరున చెక్కు లేదా డి.డి తీసి క్రాస్ చేసి Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Marg, Vrindaban, Dist: Mathura, Uttar Pradesh-281 121 అనే చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

భగవత్సేవలో
**స్వామి సుప్రకాశానంద**
కార్యదర్శి

ADVT.

# సహజ స్పృహ - హేమంత్ కుమార్

ప్రపంచంలోని సకల జీవజాలం అతి నెమ్మదిగానే అయినా అప్రయత్నంగానే భగవదోన్ముఖమై ప్రయాణిస్తున్నట్లు, భారతీయ జీవన విధానం అన్ని కోణాల నుండీ భగవన్ముఖంగా సాగే విధంగా వేదాలు, ప్రాచీన ఋషులు ప్రణాళికను రచించారు. ఇదొక విస్మయపరచే విశిష్టమైన విధానం.



మానవాళి మీద అత్యంత ఆత్మీయతతో, బాధ్యతతో ఏర్పాటు చేసిన ఈ జీవితకాల అప్రయత్న సాధన, ఆస్తికత్వం ఒక్క శాతం కూడా లేని వ్యక్తిని సైతం అంతో ఇంతో, ఎంతో కొంత ఆ పరాత్పరుని వైపు నడిపిస్తోంది. మనిషి గర్భంలో కూడా పడని దశ నుండి మరణించిన మరో కొన్నేళ్ళవరకూ (బహుశా మరో జన్మ తీసుకునే వరకూ) సంస్కారాల పేరిట, సంప్రదాయాల పేరిట భగవంతునితో అనుసంధానమై ఉండే విధంగా మానవ జీవిత వైఖరిని తీర్చిదిద్ది, మానవాళికి మహోపకారం చేశారు. ఈ ఉత్తమమైన ప్రణాళిక ఆంతర్యాన్ని మనం ఎప్పుడైనా గమనించామా? మనకు హాని చేసే విషయాల మీదకు క్షణాల మీద వాలిపోయే మనస్సు ఉపకారానికీ, ఉన్నతికీ నిర్దేశించిన అంశాల వైపు పొరపాటున కూడా చూడదేం!?

పునాదులతో సహా భవనం నిర్మించుకోవడం కన్నా పునాదుల మీద కట్టుకునే అవకాశం వస్తే అది సులభమవుతుంది. శ్రమా, సమయమూ కలిసివస్తాయి. ఆధ్యాత్మికత భారతీయ ఆత్మ. ఈ దేశవాసులకు రక్తగతంగా, వారసత్వంగా అందిన అపురూప కానుక. పరమపదం వైపు నడిపించే ఆత్మవిద్య, అవకాశం సగం ఆపాదించుకునే జన్మించిన మనం ఆ అవగాహనతో మిగిలిన సగాన్ని సాధన చేసి పూరించుకోలేమా?

ప్రతి వ్యక్తి కూడా భారతీయ మానవ జీవిత మనుగడతో అనుసంధానం చేసిన అద్భుత విధానాన్ని అధ్యయనం చేయాలి. ఏ దేశంలోనూ కనిపించని ఈ విశిష్ట ప్రణాళిక ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగిస్తుంది. తగినంత వ్యక్తిగత స్వేచ్ఛకూ, ఆనందానికీ భంగం కలిగించకుండానే సామూహిక, సర్వజన శ్రేయో కామన అడుగడుగునా ఆపాదించింది. విశృంఖలత్వానికి కళ్ళేలు వేస్తూనే వాటిని ఆమోదించే ప్రయోజనాన్ని వెల్లడి చేసింది. పదిమంది కోసం ఒకరు, ఒకరి కోసం పదిమంది నిలబడే సంస్కృతి భారతదేశంలోనే ఊపిరి పోసుకుంది. విభిన్న కులాల, మతాల, భాషల, సంస్కృతుల మేళా అయిన భారతదేశం, సౌందర్యం చెదరకుండా, సౌరభాలు సడలకుండా అన్నింటినీ ఒకే సూత్రానికి గుదిగుచ్చబడిన కదంబమాల. భిన్నత్వంలో ఏకత్వాన్నీ, ఏకాత్మతా భావాన్నీ, ఆధ్యాత్మిక తత్త్వాన్నీ మూల సూత్రంగా, బీజ మంత్రంగా ఉగ్గుపాలతో పోసే జాతి మనది. పాపభీతిని పాలుగా తాగే నీతి మనది. మనం కాకపోతే పరమపద మార్గంలో ఎవరు ముందుంటారు? నిజానికి పరమపద సోపాన పటంలో నిచ్చెనలు తప్ప పాములు లేని జీవన శైలి మనది. అమృత కలశం లాంటి దేశం మనది. వితరణలో అందరికీ సమాన భాగం ఉంది. పంచుకుని, స్థాయి పెంచుకునే యోగ్యత మనకు లేదా? వేదాలు ఘోషిస్తున్నాయి, శాస్త్రాలు భాసిస్తున్నాయి... భగవంతుడున్నాడు. ఆయనను అందుకునే అవకాశం ఉంది. మార్గాలు ఉన్నాయి అని! ముఖ్యంగా భారతీయులకు సహజంగానే జీవన శైలి ద్వారానే ఆ పథగామిత్వం ఉంది. ఆ తత్త్వమూ ఉంది. అదృష్టవశాత్తూ ఇప్పటికీ అవసరమైన వాఙ్మయమే గాక గురుత్వం వహించి మార్గనిర్దేశం చేసే మహాత్ములు, గురువులు ఉన్నారు. అంది పుచ్చుకోవడం ఒక్కటే మిగిలి ఉంది. జన్మోద్దేశ సాధనకు ఒకే బాటగా జీవితాన్ని మలచిన దేశం భారతదేశం ఒక్కటే. ❖

**మానవుడు స్వస్వరూప రీత్యా సర్వజ్ఞుడు, సర్వ శక్తిశాలి. ఆత్మ స్వరూపాన్ని గ్రహిస్తున్న కొద్దీ మనిషి ఈ శక్తిని అధికంగా ప్రకటితం చేయగల్గుతాడు. బంధాలను వీడి ముక్తుడవుతాడు. - స్వామి వివేకానంద**

ధీరవాణి

- స్వామి వివేకానంద

# పరోపకారంతోనే పరమానందం

ఈ లోకంలో పొగడ్తకూ, తెగడ్తకూ విలువ లేదు. అవి ఉయ్యాలలో ఊగించినట్లు అటూ ఇటూ ఊపుతాయి. నాకు కావలసినంత పొగడ్త దొరికింది. కావలసినంత నింద కూడా నాపై కురిసింది. కానీ వాటిని గురించి ఆలోచించినందు వల్ల ప్రయోజన మేమిటి? అవసానకాలం వచ్చినప్పుడు ఈ పొగడ్తలు, తెగడ్తలు అనేవి మీకు, నాకు, ఇతరులకు సమానమే. కార్యనిర్వహణకే మనం ఇక్కడికి వచ్చాం. పిలుపు రాగానే అందరం వెళ్ళి పోవలసినవారమే!

కోటానుకోట్ల సూర్యమండలాలతో కూడిన ఈ అనంత విశ్వాన్ని గురించి ఆలోచించండి. ఎటువంటి అనంతమైన, అనూహ్యమైన శక్తితో నడుపబడుతున్నదో – ఆ కేవలుని, అప్రమేయుని పాదాలు స్పృశించడానికి ఎలా పరుగెత్తుతున్నదో! దానితో పోలిస్తే మనమెంత అల్పులమో! అటువంటప్పుడు తుచ్ఛ భావాలతోనూ, నీచబుద్ధితోనూ ప్రవర్తించడానికి అవకాశమేమైనా ఉందా? ఒకరినొకరు ద్వేషించుకుంటూ, కక్షలు సాధిస్తూ ఈ లోకంలో ఏం సాధించగలం?

పరులసేవకై మీ యావచ్ఛక్తిని వినియోగించండి. నా మాట నమ్మండి. ధనంతోనూ, అమూల్యమైన ఇతర వస్తువులతోనూ నిండిన నిధి కంటే అధికమైన ఆనందం మీకు పరోపకారం వల్లనే లభిస్తుంది. ఇతరులను సేవిస్తే జ్ఞానమార్గంలో కూడా పురోగమిస్తారు.

భారతదేశంలో ఇన్ని సంవత్సరాలు పర్యటన చేసి ప్రేమ, ఆదరాలతో పొంగిపోతున్న హృదయాలు గల ఎందరో మహా పురుషులను కలిశాను. వారి పాదసన్నిధిలో కూర్చు న్నప్పుడు ఒక మహత్తరశక్తి ప్రవాహం నా హృదయంలో ప్రవహిస్తున్నట్లు అనుభూత మయ్యేది. ఆ మహనీయుల సాంగత్య భాగ్యం వల్ల కలిగిన ఆ ప్రవాహశక్తి మూలంగానే నేను ఈ కొద్ది మాటలు మీతో మాట్లాడాను. నాలో స్వతస్సిద్ధంగా ఏదో గొప్పతనం ఉన్నదనుకోకండి! ❖




**- స్వామి సుకృతానంద**

- సాయి రామానందస్వామి, పొదల కొండపల్లె.

**? : శ్రీమద్రామాయణంలో ఖర దూషణులు 14 మంది అని, మరొక గ్రంథంలో 14,000 మంది అని ఉంది. సంశయ నివారణ చెయ్యండి.**

✍: ఖర దూషణులు శూర్పణఖ సోదరులు. శ్రీరామచంద్రమూర్తి దివ్య మంగళ విగ్రహాన్ని దర్శించి, వివశయై తనను వివాహం చేసుకోమని శూర్పణఖ ఆయనను వేడుకొంది. సీతమ్మను తొలగిస్తే రామయ్య తనను వరిస్తాడని అమ్మవారిని చంపడానికి వెళ్ళినప్పుడు, లక్ష్మణస్వామి ముక్కు, చెవులు కోయగా పరాభవ భారంతో ఖరదూషణుల వద్దకు వెళ్ళి మొరపెట్టుకొంది. వారు పదునాల్గు వేల సైన్యంతో యుద్ధానికి వెళ్ళి, శ్రీరామ లక్ష్మణుల చేతుల్లో వధింప బడతారు.



- ఎస్. రాజేశ్వరరావు, హనుమకొండ

**? : తల్లితండ్రులను దైవాలుగా పూజించాలని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. సంతానాన్ని పట్టించుకోని, కావాలని పిల్లల్ని ఋణబాధితుల్ని చేసి, మంచి చేసినా చెడ్డగా తలంచే అమ్మానాన్నల పట్ల పిల్లల ప్రవర్తన ఎలా ఉండాలి?**

✍: చెడు వ్యసనాలకు లోనై తల్లితండ్రులను వేధించే 'కు' పుత్రులూ ఉంటారు. బాధ్యతారాహిత్యంగా వ్యవహరించే అరుదైన అమ్మానాన్నలూ ఉండవచ్చు. 'మాతృదేవోభవ, పితృదేవోభవ' అనే వేద వచనాల్ని శిరసావహిస్తూ మాతాపితరులను దైవ సమానంగానే భావించి గౌరవించాలి. అలా చెయ్యక వారిలో లోపాలనే చూస్తూ నిర్లక్ష్యం చేసేవారు భవిష్యత్తులో అష్టకష్టాలు పడవలసి వస్తుంది. విసిగించిన కుమారుడైన నచికేతుణ్ణి యముని వద్దకు వెళ్ళమంటాడు వాజశ్రవసుడు. భూలోకానికి తిరిగి వెళ్ళినప్పుడు సాదరంగా ఆదరించాలనీ, తండ్రి యోగక్షేమాల్ని కాంక్షించాడు నచికేతుడు. అష్టకష్టాలు పెట్టిన హిరణ్యకశిపుని క్షమించాల్సిందిగా ప్రహ్లాదుడు, శ్రీనారసింహుని ప్రార్థిస్తాడు. వారే మనకు ఆదర్శం. భగవాన్ శ్రీరామకృష్ణులూ, శ్రీశారదాదేవీ, వివేకానంద స్వామీజీ తల్లితండ్రుల పట్ల అపారమైన భక్తి శ్రద్ధలు చూపారు. వారి జీవన విధానం మనకు ఆచరణీయం.

- కె.వి. రామదుర్గయ్య, నెల్లూరు

**? : చేసిన కర్మలను బట్టి జీవునికి త్రిగుణాలు ఏర్పడతాయా? లేక త్రిగుణాల ప్రభావం చేత జీవుడు వివిధాలైన కర్మలు చేస్తాడా?**

✍: త్రిగుణాల ప్రభావంతో సృష్టి సర్వం వచ్చింది. వాటి ప్రభావంతో జీవులన్నీ బందీలవుతున్నాయి. 'ఎవరైతే భగవన్నామాన్ని అనన్య భక్తితో జపిస్తారో, పూజ, ధ్యానం, భాగవతుల సేవ చేస్తారో వారు త్రిగుణాలు అధిగమించి సర్వేశ్వరుణ్ణి దర్శిస్తారు. మోక్షం పొందుతారు' అని శ్రీకృష్ణుడు బోధించాడు.

- భాస్కర్, బెంగుళూరు

**? : రాశి ఫలాలను విశ్వసించవచ్చా? గ్రహస్థితుల ప్రభావం మనిషి జీవితాన్ని ఎలా ప్రభావితం చేస్తుంది?**

✍: జ్యోతిష శాస్త్రం వేదాంగాలలో ఒకటి. అన్ని మతాలూ అల్పంగానో, అధికంగానో జ్యోతిష శాస్త్రాన్ని ఒప్పుకుంటాయి. మనిషి పుట్టిన సమయం, నక్షత్రం తెలిస్తే అతని భవిష్యత్తును అంచనా వేస్తారు జ్యోతిష శాస్త్ర నిపుణులు. అవతార పురుషులైన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు, శ్రీరామకృష్ణుల జన్మనక్షత్రం ప్రకారం వారు లోక కల్యాణం కోసం జన్మించారని గురువులు తెల్పారు. అయితే నా విధి, తలరాత ఇంతేనని అనుకోకుండా, కష్టాలు వచ్చినప్పుడు స్వప్రయత్నం, ఆత్మ విశ్వాసంతో వాటిని అధిగమించాలి. స్వామి వివేకానందుణ్ణి ఆదర్శంగా తీసుకొని జీవితంలో విజయం వైపునకు పయనించాలి. నిస్వార్థసేవ చేయాలి. అప్పుడు విధాత మన తల రాతలను మారుస్తాడు కూడా!

- కె. కౌసల్య, కర్నూలు

**? : జపం, సద్గ్రంథ పఠనం చేసేటప్పుడు నిద్ర వస్తోంది. ఏం చేయాలో తెలుప మనవి?**

✍: రాత్రి సరిగ్గా నిద్రపట్టకపోవడం వల్ల, లేదా పగలు తీరిక లేకుండా కష్టపడినప్పుడు, జపం చేయడానికి కూర్చొన్నప్పుడు నిద్ర వచ్చే అవకాశం ఉంది. దీన్నే యోగ సూత్రాల్లో 'లయ' అంటారు. అనారోగ్యంగా ఉన్నప్పుడు ఇలా జరుగవచ్చు. పద్మాసనంలో కూర్చొని, జపం చేసేటప్పుడు నిద్ర వస్తే కొంతసేపు నిలబడి జపం చేయాలి. వజ్రాసనంలో కూడా కూర్చొని జపం చేయవచ్చు. అదే విధంగా సద్గ్రంథ పఠనం చేసినప్పుడు కూడా. ❖

అన్నమయ్య పదామృతం

# అన్ని వేళలా హరినామమే దిక్కు

- శ్రీమతి బి.కృష్ణకుమారి

**ఆకటి వేళల అలపైన వేళలను**
**తేకువ హరినామమే దిక్కుమరి లేదు॥**
**కొరమాలి ఉన్న వేళ, కులము చెడిన వేళ**
**చెరవడి ఒరులచే చిక్కిన వేళ**
**ఒరపైన హరినామమొక్కటే గతిగాక**
**మరచి తప్పిననైన మరిలేదు తెరగు**
**ఆపద వచ్చిన వేళ ఆరడిబడిన వేళ**
**పాపపువేళల భయపడినవేళ**
**ఓపినంత హరినామ మొక్కటే గతిగాక**
**మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు**
**సంకెళబెట్టిన వేళ చంపబిలిచిన వేళ**
**అంకిలిగా నప్పుల వారాగినవేళ**
**వేంకటేశు నామమే విడిపించ గతిగాక**
**మంకుబుద్ధి బొరలిన మరిలేదు తెరగు**

విశ్వాత్ముడు, విశ్వేశుడు, విశ్వమయుండైన ఆ విధాత తప్ప అన్యులెవరూ మనల్ని కష్టాల నుంచి, కన్నీళ్ళ నుంచి తప్పించ లేరు. ఆర్తితో ఒక్కమారు ఆ ఆపద్బాంధవుణ్ణి వేడుకుంటే చాలు, ఎన్ని బాధల బంధాల నుంచైనా విడుదల చేయించగలడు. అలా విశ్వసించి ఆ రమావల్లభుడినే తమ రక్షకుడిగా నిలుపుకున్న భక్తపుంగవులు, భాగవతోత్తములు ఎందరో... ఎందరెందరో! ఆ పరంపరలో పదకవితా పితామహుడు అన్నమాచార్యులు పలు మార్లు ఆ పుండరీకాక్షుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నాడు. ఆ శ్రీమన్నారాయణుడి నామాన్నే నావగా చేసుకొని, ఈ భవసాగరం సునాయాసంగా దాటగలిగాడు. ఆ గోవిందుడి పాదసన్నిధికి చేరుకున్నాడు. అలా ఆ శ్రీహరి నామ ప్రాభవాన్ని కొనియాడుతూ, **'ఆకటి వేళల... అలపైన వేళల...'** అన్న కీర్తనాసుమాన్ని ఆ కొండలరాయడికి కైంకర్యంగా సమర్పించుకున్నాడు. అన్ని వేళలా ఆ శ్రీమహావిష్ణువు నామమే మనకు దిక్కని నొక్కి వక్కాణించాడు.

పెనుగొండ రాజధానిగా రాజ్యమేలుతున్న సాళువ నరసింగ రాయలు, అన్నమయ్యను పిలిపించి, సంకీర్తనలు పాడించి, విని సంతసించి ఘనంగా సత్కరించాడు. ఆయన కోరికపై ఈ పదకవితా ధురంధరుడు కొంతకాలమతని ఆస్థానంలో ఉండి కీర్తనలు వినిపిస్తూ ఉండేవాడు. అన్నమయ్య అమ్మవారిపై, ఆ వేంకటేశ్వరుడిపై రాసిన ప్రణయగీతాలకు ముచ్చటపడి నాపై కూడా అలాంటి కీర్తన ఒకటి రాయమని నరసింగరాయలు ఆదేశించాడు. కానీ 'ముకుందు గొనియాడు నా జిహ్వ నిను గొనియాడ నేరదు' అని ఆ సంకీర్తనాచార్యుడు తిరస్కరించాడు. అందుకు ఆగ్రహించిన ఆ రాజు అన్నమయ్యకు సంకెళ్ళు వేయించి చెరలో పెట్టించాడు. అప్పుడు ఆ భక్తశిఖామణి ఈ **'ఆకటివేళల'** అనే కీర్తనను ఆర్తితో ఆలపించాడు. గజేంద్రుడు ఆర్తితో అర్థిస్తేనే కరిగిపోయిన ఆ కరుణాసాగరుడు ఈ భక్తపారిజాతం ప్రార్థిస్తే కావకుండా ఉంటాడా! చెరసాలలో రాజపరివారం ముందే అన్నమయ్యకు బిగించిన సంకెళ్ళు విడివడేలా చేసి తన మాహాత్మ్యాన్ని వెల్లడి చేశాడు.

### ఆకటి వేళల... అలపైన వేళల

ఆకలిగా ఉన్న వేళ, అలసిపోయిన వేళ... ఇలా ఎప్పుడైనా ఆ శ్రీహరి నామమే మనకు శరణ్యమని తన పదామృతాన్ని చిలకరిస్తున్నాడు ఆ శ్రీనివాసుడి భక్తచింతామణి. ఆ ధర్మ సంస్థాపకుడి దివ్యనామమే 'తేకువ' అంటే ధైర్యమని గుర్తుచేస్తూ...

**ఆకటి వేళల అలపైన వేళలను**

**తేకువ హరినామమే దిక్కు మరి లేదు** అంటున్నాడు. నరసింగరాయల అనుభవంతో అన్నమయ్యకు జీవనసత్యం బోధపడింది. రాజాధిరాజైన ఆ బ్రహ్మాండనాయకుణ్ణి తప్ప ఇతర రాజులను ఆశ్రయించరాదనీ; వారు ఎప్పుడు అనుగ్రహిస్తారో, ఎప్పుడు ఆగ్రహిస్తారో తెలుసుకోలేమనీ గుర్తించాడు. అందుకే ఆ దేవదేవుడే మనకు ధైర్యమనీ, దిక్కనీ ప్రస్ఫుటం చేస్తున్నాడు. శ్రీమద్భాగవతాన్ని ఆంధ్రీకరించిన పోతనామాత్యులు కూడా రాజులెంతగా బతిమాలినా, తన రసరమ్య కావ్యాన్ని ఎవరికీ అంకితం చేయకుండా, శ్రీహరినే శరణుజొచ్చి...

**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకముల నంబుజనాభా**

(మిగతా 32వ పేజీలో...)

భగవంతుణ్ణి సమీపించడానికి భక్తి, విశ్వాసాలే ముఖ్యం. దైవసాక్షాత్కారానికి పాండితీ ప్రకర్షలతో పనిలేదు. ఇతరుల విశ్వాసానికి విఘాతం కలిగించకపోవడమే మన విధి. - స్వామి వివేకానంద



# శ్రీరామకృష్ణ మఠం


మైలాపూర్, చెన్నై - 600 004

ఫోన్ నెం : 044 - 24621110

Email: mail@chennaimath.org  www.chennaimath.org


## భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలు

(2012 ఫిబ్రవరి 22-26)

చెన్నై శ్రీరామకృష్ణమఠం దివ్యజనని శ్రీశారదామాత సందర్శనతో పునీతమైన పరమపవిత్ర ఆధ్యాత్మిక కేంద్రం. ఆధ్యాత్మిక తేజోమూర్తి, శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన స్వామి రామకృష్ణానంద ఈ మఠాన్ని స్థాపించడం విశేషం. మరెందరో గురుదేవుల శిష్యులు ఈ మఠాన్ని సందర్శించి పావనం గావించారు.

చెన్నై శ్రీరామకృష్ణ మఠం, శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలను పురస్కరించుకొని 2011 నుంచి 2012 వరకు వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తోంది. ఇందులో భాగంగా 'ప్రతి ఇంటా సత్సంగం' అనే పేరుతో భక్తుల గృహాల్లో వార, పక్ష, మాస సత్సంగాలను నిర్వహించి వారిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని జాగృతపరచాలని సంకల్పించింది. ఇప్పటి వరకు 200లకు పైగా సత్సంగాలను నిర్వహించింది.

ఈ నేపథ్యంలో 2012 ఫిబ్రవరి 22 నుంచి 26 వరకు మఠంలో వివిధ ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలను వైభవంగా నిర్వహించాలని ఓ పథకాన్ని రూపొందించింది. 2012 సంవత్సరంలో భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలతో పాటు, చెన్నై రామకృష్ణ మఠం విశ్వజనీన ఆలయ సంప్రోక్షణం జరిగి పన్నెండేళ్ళు పూర్తవడం కూడా యాదృచ్ఛికం.

శ్రీరామకృష్ణుల విశ్వజనీన మందిరం, పరిసర భవనాల మరమ్మతులు చేయాల్సిన అవసరం ఏర్పడింది. శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాల సందర్భంగా ఆలయ మరమ్మతులు పూర్తి చేసి, శోభాయమానంగా తీర్చిదిద్ది 2012 ఫిబ్రవరిలో మరోమారు శ్రీరామకృష్ణులకు దేవాలయాన్ని పునరంకితం చేయాలని తలంచాము.

ఈ పునరుద్ధరణ పనులకు దాదాపు రూ.82 లక్షలు వ్యయమవుతుందని అంచనా.

| | | |
|---|---|---|
| 1. విశ్వజనీన ప్రధాన మందిర మరమ్మతులకు | - రూ. | 7 లక్షలు |
| 2. ఆలయానికి రంగులు వేయడానికి | - రూ. | 6 లక్షలు |
| 3. పురాతన (వందేళ్ళ) ఆలయ పునరుద్ధరణకు | - రూ. | 17 లక్షలు |
| 4. పురాతన ఆలయానికి రంగులు వేయడానికి | - రూ. | 3 లక్షలు |
| 5. మఠం ప్రహరీగోడ మరమ్మతులకు | - రూ. | 8 లక్షలు |
| 6. మఠం ప్రాంగణంలోని కాలిబాటలకు | - రూ. | 22 లక్షలు |
| 7. ఇతర పనులు నిమిత్తం | - రూ. | 4 లక్షలు |
| 8. శ్రీరామకృష్ణుల జయంతి ఉత్సవాలకు | - రూ. | 15 లక్షలు |
| **మొత్తం** | **రూ.** | **82 లక్షలు** |

ఈ నవీకరణ, పునర్నిర్మాణాల నిమిత్తం భక్తులు, శ్రేయోభిలాషులు ఉదారంగా విరాళాలనిచ్చి శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలను ఘనంగా నిర్వహించేందుకు సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

మీ విరాళాన్ని Sri Ramakrishna Math, Chennai, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Math, Mylapore, Chennai - 600 004 చిరునామాకు పంపాల్సిందిగా మనవి. మీ విరాళాలకు సెక్షన్80(జి) కింద ఆదాయపుపన్ను మినహాయింపు వర్తిస్తుంది.

మీ విరాళాలను ఆన్‌లైన్‌లో కూడా పంపే సౌకర్యం ఉంది. 'Sri Ramakrishna 175' విభాగం కింద బ్యాంకుకు నేరుగా పంపవచ్చు. దీనికి సంబంధించి IFSC/Swift కోడ్ వివరాల కోసం ఈమెయిల్ ద్వారా సంప్రతించండి. అంతర్జాతీయ విరాళాలు కూడా కృతజ్ఞతతో స్వీకరించబడును.

భగవత్సేవలో

**స్వామి గౌతమానంద**

అధ్యక్షులు

- డాక్టర్ రెంటాల జయదేవ



# ఆలోచనపై ఆహార ప్రభావం

మనం తినే ఆహారం మన ఆలోచనను ఎలా ప్రభావితం చేస్తుందో తెలిపేలా 'మహాభారతం'లోనిదంటూ ఓ కథ విస్తృత ప్రచారంలో ఉంది. మహాభారత యుద్ధంలో భీష్మ పితామహుడు శరతల్పగతుడైన తరువాత ఆయనను దర్శించడానికి పాండవులు, ద్రౌపదితో కలసి వెళ్ళారు. అప్పుడు భీష్ముడు, పాండవులకు ఎన్నో ఉపదేశాలు చేశాడు. ఆ సమయంలో ద్రౌపది అకస్మాత్తుగా నవ్వింది. పైగా, ఆ నవ్వును ఆపుకోలేక పోయింది. దాంతో భీష్మ పితామహుడు ఆశ్చర్యపోయాడు. ఆపుకోలేనంత ఆ నవ్వుకు కారణం ఏమిటని ఆమెను అడిగాడు.

దానికి ద్రౌపది ఎంతో వినయంగా, "పితామహా! మీరు ఇప్పుడు చేస్తున్న ఉపదేశాల్లో మన ధర్మసారం నిబిడీకృతమైంది. మీ మాటలు మాకెంతో మార్గదర్శకంగా ఉన్నాయి. అయితే, మీ ఉపదేశాలను వింటూ ఉండగా, నాకు ఒక చిన్న సందేహం కలిగింది" అన్నది.

"ఏమిటది?" అని భీష్ముడు అడిగాడు.

"పితామహా! ఆ రోజు నిండు సభలో కౌరవులు నన్ను పరాభవిస్తూ, వస్త్రాపహరణం చేయబోయినప్పుడు న్యాయం, ధర్మం కోసం నేను అభ్యర్థించాను. కానీ, సభలోనే ఉన్న మీరు కూడా మౌనముద్ర దాల్చారు. కారణం ఏమిటి? ఆ అన్యాయాన్ని మీరు ఎందుకు అడ్డుకోలేదు? దుర్యోధన, దుశ్శాసనాదులను ఎందుకు ఆపలేదు? ఇవాళ మీ మాటలు వింటూ ఉంటే, ఆ సంగతి గుర్తొచ్చి, నాకు నవ్వు ఆగలేదు" అని ద్రౌపది వినమ్రంగానే ఉన్న మాట చెప్పింది.

దానికి భీష్మ పితామహుడు గంభీరంగా, తన తప్పుకు కారణాన్ని సహేతుకంగా వివరించాడు. "అమ్మా! ద్రౌపదీ! ఆ సమయంలో నేను దుర్యోధనుడు పెట్టిన తిండి తింటున్నాను. నా శరీరంలోని రక్తంలో ఆ ఆహారం, దాని తాలూకు లక్షణాలే ప్రవహిస్తూ వచ్చాయి. అతను పెట్టిన తిండి వల్ల నా ఆలోచన, ప్రవర్తన, బుద్ధి - అన్నిటి మీదా దుష్ప్రభావం పడింది. అయితే, ఆ పాపపు కూడు వల్ల తయారైన రక్తమంతా, ఈ యుద్ధంలో అర్జునుడి బాణాల దెబ్బకు శరీరంలో నుంచి బయటకు స్రవించింది. దాంతో, ఇప్పుడు నేను మళ్ళీ నా పవిత్ర భావాలనూ, పూర్వపుణ్య స్మృతినీ పొందగలిగాను. అందుకే, ప్రస్తుతం నా నోటి వెంట నైతికంగా ధర్మం, న్యాయమైన మాటలే వెలువడుతున్నాయి" అని భీష్ముడు వివరించాడు.

ఈ మహాభారత కథను బట్టి, శారీరకంగానే కాక, మానసికంగానూ పుష్టినిచ్చే సరైన ఆహారం తీసుకోవడం ముఖ్యమని అర్థమవుతోంది. పాపపు కూటిని తినడం వల్ల సరైన సమయంలో, సరైన ఆలోచన చేయలేకపోతామని రూఢి అవుతోంది. కాబట్టి, ధర్మబద్ధంగా, న్యాయబద్ధంగా చరించే వారి ఇంటనే భుజించాలి. ఏది తిన్నా, దాన్ని భగవంతునికి అర్పించి, ఆయన ప్రసాదంగా భావించి తీసుకోవడం మరీ ముఖ్యం.

### అందరికీ ఉండే అయిదు ఋణాలు, అయిదు ప్రాణశక్తులు

రోజూ మనం భోజనం చేసే ముందు పవిత్రీకరణలో భాగంగా వడ్డించిన ఆహార పదార్థాల మీద నీళ్ళు చల్లుతాం. అయిదు మెతుకులు తీసి, భోజనపళ్ళానికి ఒక వైపున ఉంచుతాం. అది మనం తీర్చుకోవాల్సిన అయిదు ఋణాలకు సంకేతం. 1.'దేవ ఋణం' - మన మీద కటాక్షం చూపుతూ, కాపాడుతున్న దైవీ శక్తులకు మనం ఋణపడి ఉన్నాం. 2.'పితృ ఋణం' - మనకు వంశావళినీ, కుటుంబ సంస్కృతినీ ప్రసాదించిన పితృదేవతలకు మనం ఋణగ్రస్థులం. 3.'ఋషి ఋణం' - ధర్మాన్నీ, సంస్కృతినీ కాపాడి, మనకు అందించి నందుకు గాను వారికి ఋణపడ్డాం. 4.'మనుష్య ఋణం' - మనం, మన తోటివాళ్ళు కలిస్తేనే సమాజం. తోటి వ్యక్తుల సహాయ సహకారాలు లేకుండా మనం జీవించలేం. కాబట్టి, 'మనుష్య ఋణం' తీర్చుకోవాలి. 5. 'భూత ఋణం' - నిస్వార్థంగా సేవ చేసినందుకు గాను ఇతరుల ఋణం తీర్చుకోవాలి.

అటుపైన మనలోనే అయిదు ప్రాణశక్తులుగా నిలిచే భగవంతునికి ఆహారాన్ని నివేదించాలి. 'ప్రాణాయ స్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయ స్వాహా, ఉదానాయ స్వాహా, సమానాయ స్వాహా, బ్రహ్మణే స్వాహా' అంటూ శరీరంలోని అయిదు శారీరక విధులకూ ప్రాణశక్తిగా నిలుస్తున్న దేవుణ్ణి కొలవాలి. శ్వాస (ప్రాణ), విసర్జక (అపాన), ప్రసారక (వ్యాన), జీర్ణ (సమాన), ఉదాన వ్యవస్థలు అయిదింటికీ ఆధార భూతుడైన భగవంతుణ్ణి ప్రార్థించాలి. (తరువాయి పేజీలో...)

పౌష్టికాహారంతో శరీరాన్ని దృఢతరం చేసుకున్నప్పుడే మనస్సు బలవత్తరమవుతుంది. జీర్ణంకాని ఆహారాన్ని తీసుకుంటే మనోనిగ్రహం కష్టం. అందుకే సాత్వికాహారం తీసుకోవాలి. - స్వామి వివేకానంద

ఈ సిద్ధాంతాన్ని గుర్తుంచుకోవడం కోసం చాలా మంది 'భగవద్గీత'లోని ఈ శ్లోకాలను భోజనం చేసే ముందు పఠిస్తారు.

*బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।*
*బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మ కర్మ సమాధినా ॥* (4-24)

'ఆహుతి సాధనాలైన స్రుక్కువాదులన్నీ బ్రహ్మ స్వరూపమే! హవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోత బ్రహ్మము. హవన క్రియ బ్రహ్మము. (బ్రహ్మమైన హవిస్సు, బ్రహ్మ రూపమైన అగ్నిలో, బ్రహ్మ రూపమైన హోత చేత హోమం చేయబడింది). కర్మలో బ్రహ్మ భావం గల ఆ పురుషుడు పొందదగిన ఫలం కూడా బ్రహ్మమే!' అని దాని భావం.

*అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।*
*ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥*
(శ్రీమద్భగవద్గీత, 15-14)

'నేను జఠరాగ్ని రూపంలో ప్రాణుల దేహాన్ని సమాశ్రయించి, ప్రాణ, అపాన వాయువులతో కూడి, వారు భుజించే భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములనే నాలుగు విధాలైన ఆహారాలనూ పచనం చేస్తున్నాను' అని సాక్షాత్తూ భగవానుడు పేర్కొన్నాడు.

అలాగే, దేవుడికి నివేదించి, ఆహారం భుజించే సమయంలో పాటించాల్సిన కొన్ని అంశాలను కూడా మన పెద్దలు తెలిపారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. కాబట్టి, తినేటప్పుడు అన్నాన్ని అసహ్యించుకోకూడదు. నిందించకూడదు. అన్నం తిని ఎంగిలి కడుగుకొనని వాణ్ణి ఉచ్ఛిష్టుడు అంటారు. అంటే అపవిత్రుడు అని అర్థం. అలాంటి స్థితిలో అగ్ని, గోవు మొదలైన వాటిని ముట్టుకోకూడదు. సూర్య చంద్రులనూ, నక్షత్రాలనూ చూడకూడదని మన ప్రాచీన శాస్త్రాలు చెబుతున్నాయి. మొత్తం మీద, మనం ఏది తిన్నా, మనకు జీవితంలో ఏది ఎదురైనా దాన్ని భగవత్ ప్రసాదంగా భావిస్తే, ఏ ఇబ్బందీ ఉండదు. అంతా మంచే జరుగుతుంది.

('నైవేద్యం' సమాప్తం) ❖



## ప్రశాంతతవైపు పయనం

**- స్వామి యతీశ్వరానంద**

స్వయం విశ్లేషణ చేయగల మనస్సు, మన లోపల జరిగే ప్రతి పరిణామాన్నీ మనకు తెలుపుతుంది. మనలో తలెత్తే ప్రతి ఆలోచననూ, ప్రతి కోరికనూ మనం జాగరూకులమై గమనిస్తూ ఉండాలి. మన మనస్సులో జరిగే ప్రతి చిన్నమార్పు మనకు తెలియాలి. అప్పుడే మనం దాన్ని స్వాధీనం చేసుకోగలం. అలా స్వాధీనం చేసుకోకపోతే పారమార్థిక పురోగతిని సాధించలేం.

మన మనస్సులోని ఒక భావం ఇంద్రియ సుఖాలను కోరుకుంటూ ఉంటే, రెండవ భాగం పారమార్థిక ఆనందాన్ని కోరుకుంటుంది. ఇంద్రియ సుఖాల వైపు మనల్ని మళ్ళించే ప్రతి ఆలోచన పట్ల విముఖతను చూపాలి. ఒకవేళ మనం ఏదైనా ప్రలోభానికి లోనవుతున్నట్లు అనిపిస్తే ఆ ప్రలోభంలో చిక్కుకోవడం వల్ల జరిగే అనర్థాలను గురించి ఒక్క సారి తలచుకోవాలి, లేదా పవిత్రతకు ప్రతిరూపమైన ఒక మహాత్ముని రూపాన్ని మనస్సులో గాఢంగా చిత్రించుకోవాలి. ఇంద్రియ సుఖాలకు లొంగిపోవడం మన మనోబలహీనతకు చిహ్నం.

ఇన్ని చేసినా ఫలితం లేకపోతే మన తోటి సాధకులతో పారమార్థిక విషయాలపై చర్చించాలి. అలా చేస్తే మన మనస్సు ప్రలోభాలకు లొంగదు. ఒంటరిగా కూర్చొని పదే పదే లౌకిక సంబంధమైన విషయాలను గురించి తలచుకోవడం వలన మనస్సు మరింత దిగజారడం ఖాయం. మరొక ఉపాయం ఏమిటంటే మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా కొంతసేపైనా సద్గ్రంథ పఠనం చేయడం ఎంతైనా అవసరం. ఈ సాధనల సహాయంతో మనస్సును పతనావస్థ నుండి కాపాడి, ప్రశాంతత వైపుకు మరల్చవచ్చు. ❖

## పండుగలు - పర్వదినాలు

### జనవరి - 2012

| | | | |
|---|---|---|---|
| 01 | ఆదివారం | : | కల్పతరు దినోత్సవం |
| 05 | గురువారం | : | వైకుంఠ ఏకాదశి |
| 08 | ఆదివారం | : | స్వామి తురీయానంద జయంతి |
| 12 | గురువారం | : | జాతీయ యువజన దినోత్సవం |
| 15 | ఆదివారం | : | సంక్రాంతి |
| 15 | ఆదివారం | : | స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) |
| 19 | గురువారం | : | ఏకాదశి |
| 25 | బుధవారం | : | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 27 | శుక్రవారం | : | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |

### ఫిబ్రవరి - 2012

| | | | |
|---|---|---|---|
| 03 | శుక్రవారం | : | భీష్మ ఏకాదశి |
| 07 | మంగళవారం | : | స్వామి అద్భుతానంద జయంతి |
| 18 | శనివారం | : | ఏకాదశి |
| 20 | సోమవారం | : | మహాశివరాత్రి |
| 23 | గురువారం | : | భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతి (తిథి ప్రకారం) |



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

(...గత సంచిక తరువాయి)

## సర్వం సర్వేశ్వరేచ్ఛ!

ఈ ప్రజా జీవితం చీకాకులమయమైనది. నేను దాదాపు వెర్రివాణ్ణయ్యాను. ఎక్కడికి ఎగిరిపోవాలి? భారతదేశంలో జనం గుంపులు గుంపులుగా నా వెంటబడి నా ప్రాణం తీసేవారు. అక్కడ నా ప్రజాజీవితం అంత దారుణంగా పరిణమించింది .... రూపాయి శాంతి పవిత్రతలు పణంగా పెట్టి, పైసా కీర్తిని కొనుగోలు చేయవలసి ఉంటుంది. ఈ విషయం ఇంతకు మునుపు నాకు స్ఫురించలేదు. ఈ ఖ్యాతి విన్యాసంతో పూర్తిగా విసుగెత్తిపోయాను. నా పట్ల నాకే విసుగు పుడుతోంది.

భగవత్సంకల్పం వలన కీర్తిప్రతిష్ఠల పట్ల ఆకాంక్ష నా హృదయంలో ఇంకా చొరబడలేదు, అలా ఎప్పటికీ జరగదని ఘంటాపథంగా చెబుతాను. నేను పరికరాన్ని, ఆయన దానికి క్రియారూపం కల్పించేవాడు. ఈ పరికరం ద్వారా, ఈ సుదూర దేశంలో ఆయన వేలాదిమంది హృదయాల్లో ఆధ్యాత్మిక భావాలను పురిగొల్పుతున్నాడు. వేలాదిమంది స్త్రీ, పురుషులు ఇక్కడ నన్ను అభిమానిస్తూ గౌరవిస్తున్నారు.... ఆయన అనుగ్రహాన్ని చూసి నేను ఆశ్చర్యచకితుణ్ణవుతున్నాను. ఏ పట్టణానికి వెళ్ళినా అక్కడ కోలాహలమే. 'హైందవ ఝంఝా మారుత' మని వారు నాకు పేరు పెట్టారు. గుర్తుంచుకో, ఇది ఆయన సంకల్పం.

థామస్ ఎ కెంపిస్‌ని నేను ఎంతో అభిమానిస్తాను. అతి కొద్దిమందికి మాత్రమే ప్రాప్తించిన అద్భుతమైన మాయాతీత (behind the veil) స్థితిని ఆయన పొందగలిగాడు. అదే ఆధ్యాత్మికత. ఎటువంటి కాపట్యమూ లేదు. ఎటువంటి అనిశ్చితి, డంబాలు, ఊహ లేదని నేను అనుకుంటున్నాను, విశ్వసిస్తున్నాను. ఈ అందమైన ప్రపంచంగా వారు పేర్కొనే ఈ కాపట్య చిత్తరువుకు అతీతంగా థామస్ ఎ కెంపిస్‌తో నేనెలా వెళ్ళగలననే యోచిస్తున్నాను. దానిని అనుభూతం చేసుకోగలమేగాని, ఎన్నటికీ వ్యక్తం చేయలేం.



భగవంతుడున్నాడు. ఆ విషయంలో యోగులు, ప్రవక్తలు, అవతార పురుషులు అందరూ ఏకీభవిస్తారు. బైబిల్, వేదాల, మత సంప్రదాయాల, సిద్ధాంత రాద్ధాంతాలకు అతీతమైన సమస్త ప్రకాశం, సమస్త ప్రేమ నెలకొన్న ఆ స్థలానికి నన్నెవరు తోడ్కొనిపోతారు? .... నూరు రకాల దాస్య బంధనాలలో నా ఆత్మ మూలుగుతోంది. ఎవరి భారతం? ఎవరు లక్షిస్తారు? సమస్తం ఆయనదే. మనం ఏమిటి? ఆయన అంతరించాడా? ఆయన నిద్రిస్తున్నాడా? ఎవరి ఆదేశం లేకుండా ఒక ఆకు సైతం కదలదో, హృదయం స్పందించదో ఆయన నా ఆత్మ కన్నా నాకు అత్యంత సమీపంలో ఉన్నాడు. మంచి చేయడం గాని, చెడు చేయడం గాని, లేదా హరించి వేయడంగాని ఇదంతా అర్థరాహిత్యం, మూర్ఖత్వం. మనం ఏమీ చెయ్యలేం. మనకు ఆ సామర్థ్యం లేదు, ప్రపంచానికీ లేదు. ఆయనే... ఆయనే చెయ్యగలరు. ఆయన ఒక్కరే చెయ్యగలరు! మరెవ్వరి వల్లా కాదు.

ఓం, అద్వితీయం. ఆయన నాలో ఉన్నారు, నేను ఆయనలో ఉన్నాను. కాంతి అనే సముద్రంలో నేనొక గాజు ముక్కను. నేను కాదు, నేను కాదు... ఆయనే... ఆయనే...ఆయనే! ❖ (సశేషం)

నా జీవితమంతా నేను నమ్మిన సత్యం ఇది - సహాయానికై భగవంతుణ్ణే ఆశ్రయించాలి గానీ, వేరె వ్వరినీ కాదు. అమృతం లభించకపోతే విషాన్ని గ్రహించాలనుకోవడం అవివేకం. - స్వామి వివేకానంద



# ప్రత్యక్ష శిష్యుల దృష్టిలో గురుదేవులు

–స్వామి బ్రహ్మస్థానంద

పువ్వు వికసిస్తే తుమ్మెదలు వాటంతట అవే వస్తాయి, వాటిని పిలవాల్సిన అవసరం లేదన్నారు శ్రీరామకృష్ణులు. ఆ విధంగానే ఆధ్యాత్మిక పుష్పం లాంటి శ్రీరామకృష్ణులచే ఆకర్షితులై, ఎందరో ముముక్షు సాధకులు ఆయన వద్దకు వచ్చారు. అలాంటి సాధకుల్లో ముఖ్యులైన ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు గురుదేవుల గురించి తమ తమ అనుభవాలను ఇలా వెల్లడించారు:

## స్వామి వివేకానంద



"శ్రీరామకృష్ణులు సనాతన ధర్మం యొక్క సర్వసారం, పవిత్రతకు మారుపేరు. జీవులన్నిటి పట్ల ఆయనకు గల ప్రగాఢ ప్రేమ, విశ్వజనీన ప్రేమ ఆయన పరమానుభూతికి అభివ్యక్తీకరణం. ఇదే పరాభక్తి.

'ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో, అతడే ఇప్పుడు రామకృష్ణ రూపంలో వచ్చాడు' అన్న గురుదేవుల మాటలు విని నేను చకితుడనయ్యాను. దుర్దమ్యమైన నా మనస్సును ఆయన తన ఇచ్ఛానుసారం మలచారు. ఒక్క చూపుతో, ఒక్క స్పర్శతో ఆయన వ్యక్తుల జీవితాలలో పరివర్తనం తెచ్చారు."

## స్వామి బ్రహ్మానంద



"గురుదేవులకు అతి మానవీయ శక్తి ఉంది. ఆయనకు ఏదో విశేష శక్తి ఉన్నది అని తలచామే తప్ప దాని స్వరూపం ఆనాడు ఎరుగం. ఇప్పుడు ఆలోచిస్తే, అది ఎంతటి ఆశ్చర్యజనకమైన శక్తి! ఒకనాడు నేను, కామవిముక్తుడను కాలేకపోతున్నానని చెప్పగా ఆయన ఏదో అస్పష్టంగా పలుకుతూ నా ఛాతీని స్పృశించారు. అంతే, నాలోని కామవాసన సంపూర్ణంగా తొలగిపోయింది.

గురుదేవులు యుగావతారం. నిజంగా, నిష్ఠగా సాధన చేసే ప్రతి ఒక్కరికీ సహాయం చేసేవారు. మానవ జీవితం ఆదర్శం, వైరాగ్యం అని తెలియజెప్పడానికే ఆయన అవతరించారు. శ్రద్ధ గల నిజమైన భక్తులు గురుదేవుల కృప పరిధిలోకి రావలసినదే! అప్పుడు వారికి నిజమైన శాంతి ప్రాప్తిస్తుంది."

## స్వామి శివానంద



"కపటత్వం, ఆత్మవంచనలను తప్ప, గురుదేవులు అన్ని దోషాలనూ క్షమించేవారు. కపట నాటకాలు ఆడేవారికి ఈ మఠంలో స్థానం లేదు. ఆయన సర్వ దేవ దేవీ స్వరూపులు. భవిష్యత్తులో ఆవిర్భవించబోయే దైవీ శక్తులు సైతం ఆయనలో ఉన్నాయి. కనుక నీవు ఆయనను ధ్యానిస్తే, అందరు దేవుళ్ళను, దేవతలను ధ్యానించినట్లే! ఆయన పాపులనూ, పతితులనూ ఉద్ధరించడానికి అవతరించారు. ఆయన నామజపం చేస్తే, నీ మనస్సు అనిర్వచనీయ ఆనందంతో నిండుతుంది."

## స్వామి ప్రేమానంద



"చిరశాంతికి మార్గం చూపడానికే గురుదేవులు ఒక నిరక్షర వ్యక్తిగా అవతరించారు. విద్వాంసుల, పండితుల మిథ్యాభిమానాన్ని నాశనం చేశారు. ఆయన నూతన మత ధర్మాన్ని కానీ, సంప్రదాయాన్ని కానీ స్థాపించడానికి రాలేదు. సర్వమతాలనూ జాగృతం చేయడానికే వచ్చారు."



### స్వామి తురీయానంద

"ఆహా! గురుదేవులతో దక్షిణేశ్వరంలో గడిపిన దినాలు అలౌకికానందంతో నిండి ఉండేవి. ఉదయం నుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు ప్రతి ఒక్కరం పూలు సేకరించడం, పూజ కొరకు సరంజామా సిద్ధం చేయడం మొదలైనవి చేసేవారం. మధ్యలో గురుదేవులు ఆధ్యాత్మిక విషయాలు చర్చించేవారు. భక్తులు ఏకాగ్రతతో వినేవారు. ఆయన చతురోక్తులు, వేళాకోళాలు సైతం దైవ సంబంధితమై ఉండేవి. అన్యవిషయాలు మాట్లాడేవారు కాదు.

గురుదేవుల సమక్షంలో జరిగే సంకీర్తనాదులు మమ్ము ఆనంద విహ్వలురను చేసేవి. ఆ ఆనందం వారం దినాలు నిలిచేది. కానీ మా మాటలు నమ్మేదెవరు? ఇది మరొకరికి తెలియజెప్పడం కష్టంతో కూడుకొన్నది."



### స్వామి రామకృష్ణానంద

"శ్రీరామకృష్ణుల ఛాయాచిత్రం నీ దగ్గర ఉన్నది కదా! ఆయన అవతారమని గట్టిగా విశ్వసించి, త్రికరణ శుద్ధిగా ప్రార్థించు. నీ కోరికలు తప్పకుండా నెరవేరుతాయి. ఆయనను మించిన దయాళువులు లేరు. ఆయన నీతో లేరని ఎన్నడూ తలవకు సుమా! ఆయన మనతో ఎల్లప్పుడూ ఉంటారు."

అన్యదైవాలను ఉపాసించేవారికి, రామకృష్ణుల పట్ల భక్తి, ఆకర్షణ కలిగితే, వారితో స్వామి రామకృష్ణానంద ఇలా అనేవారు: "నీవు దేవీ ఉపాసకుడవు. శ్రీరామకృష్ణుల పట్ల భక్తి కలిగి ఉంటే, నీవు ఇక జగన్మాత భక్తుడవు కావేమోనని తలవకు. ఆయన మూర్తీభవించిన శక్తి. బ్రహ్మ శక్తి అనంతం కనుక అర్థం చేసుకోవడం కష్టం."

"మహాసమాధి తర్వాత ఆయన తన శిష్యులకూ, ఆంతరంగికులకూ దర్శనమిచ్చారు. ఆయన దర్శనం కొరకు నీకు వ్యాకులత కలిగితే, నీకు కూడా దర్శనమిచ్చి, శాంతిని ప్రసాదిస్తారు. భగవంతుని రూపం మనఃకల్పన కాదు, అది సత్యం."

"ఉపనిషత్తులలో పరా, అపరా విద్యలను ప్రస్తావించారు. బ్రహ్మానుభూతి పరా విద్య. శాస్త్రాధ్యయనం అపరా విద్య. గురుదేవుల పవిత్ర సాన్నిధ్యంలోకి రాక పూర్వం మాకు ఇది బోధపడలేదు. బ్రహ్మజ్ఞానం మూలంగా ఆయన ఇటు నిరక్షరుల, అటు పండితుల అజ్ఞానాంధకారాల్ని పోగొట్ట గలిగేవారు. దీన్నిబట్టి ఆయన అవతారం అని తెలుస్తుంది."



### స్వామి శారదానంద

"విద్యార్థులపై శ్రీరామకృష్ణులు విశేష కృప చూపేవారు. వారి మనస్సులు భార్యాపిల్లలు, పేరు ప్రతిష్ఠలు మున్నగు వాటికి అమ్ముడుపోలేదు. సాధన చేస్తే చాలు, మనస్సును సునాయాసంగా భగవంతునికి అర్పించగలరు అనేవారు."

"మీ మనస్సు గురుదేవుల పాదపద్మాలపై స్థిరంగా నిలవకపోతే, ఆవేదనతో ఇలా ప్రార్థించండి : 'ప్రభూ! నా మనస్సును అలజడి పాలు కాకుండా నిశ్చలంగా ఉంచు!' ఆయన మీ ప్రార్థన తప్పక వింటారు. నీ ఆలోచనలు అన్నీ ఆయనకు తెలుసు. 'ప్రభూ! నీవే నా సర్వస్వం, నీవే నా జీవనాధారం!' అని శరణువేడండి."



### స్వామి అఖండానంద

"మన గురుదేవులు సర్వజీవులలో నారాయణ రూపంలో ఉండి, లీలలు చేస్తున్నారు. సేవాధర్మ బీజం వారితోనే అంకురించింది. కనుకనే శాఖోపశాఖలుగా విస్తరించిన సేవా వృక్షాన్ని చూడగలుగుతున్నారు. నేను హిమాలయాలలో తపస్సు చేస్తుండగా గురుదేవులు దర్శనమిచ్చి, ఆ నీరవ వాతావరణంలో తపస్సాధన కంటే దరిద్రనారాయణుల సేవయే గొప్ప తపస్సు, సాధన అని తెలియజేశారు. తొలిగా దేవఘర్‌లో మధుర్‌బాబుని అక్కడి పేదలకు అన్నవస్త్రాదులిచ్చి సహాయం చేయమని, ఆయనతో సేవాకార్యక్రమం చేపట్టించారు."



### స్వామి విజ్ఞానానంద

"గురుదేవుల ఫోటోలో షట్చక్రాలకు అతీతమైన ఒక భావం దర్శనమిస్తుంది. నాకు అందులో ఎన్నో గూఢ రహస్యాలు గోచరిస్తాయి. కనుకనే చెప్పగలుగుతున్నాను. ఆయన జనోద్ధరణకై అవతరించారు. ఆయన నామజపం కావించు. నీకు శాంతి ప్రాప్తిస్తుంది. ఆయన ఫోటోను కొద్ది సేపు చూచినా చాలు, నీ పాపాలు ప్రక్షాళన అవుతాయి. కానీ జాగ్రత్త! స్వార్థపరమైన పాపపు కోరికలతో ఆయన వద్దకు వెళ్ళకు సుమా! గురుదేవులు, శారదామాత వేర్వేరు కాదనీ, ఒక్కటేననీ తెలుసుకో! ఒకరి అనుగ్రహం మూలంగా మరొకరి దగ్గరకు వెళ్ళగలవు."❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

**పూర్వం అవతారపురుషులందరూ ఆచరించినవన్నీ రామకృష్ణులు ఒక్క జీవితంలోనే అనుష్ఠించారు. ఆయన్ని అధ్యయనం చేయకుండా వేదాంతసారాన్ని అర్థం చేసుకోలేరు.** - స్వామి వివేకానంద

మాయాబజార్

# సత్యయుగానికి నాంది పలుకుదాం

– స్వామి శితికంఠానంద

వేల్పులు సభతీరి ఉన్నారు. అమరులందరూ ఆర్యావర్తంలోని పరిస్థితులను ఎప్పటికప్పుడు దేవలుడి ద్వారా తెలుసుకుంటూ భాగవతం, హరివంశం ఇత్యాది పురాణాల్లో పేర్కొన్నట్లుగా కలియుగంలో ధర్మం ఎలా క్షీణిస్తుందో చూస్తున్నారు. పరిస్థితులు ఎలా వ్యక్తుల చేతుల్లో లేకుండా పోతున్నాయో గ్రహించారు. మహామాయ అనంతమోహ శక్తికి మనుషులు ఎలా దాసోహం అంటున్నారో అవగతం చేసుకున్నారు. ధర్మం ఒక్క పాదం మీదనే నడుస్తుందన్న విషయం ఎలా సత్యమవుతున్నదో, తామంతా దురవగాహం, దుస్తరమైన మాయా ప్రభావానికి లోనై ఉన్నామని మనుజులు ఎలా గ్రహించలేకున్నారో నిర్జరులకు అర్థమైంది.

దేవేంద్రుడు దేవలుడి వైపు దృష్టి సారించాడు. దేవలా! నీవు ఇప్పటివరకూ చెప్పిన భూలోక విషయాలతో అక్కడి పరిస్థితుల గురించి మాకొక అవగాహన ఏర్పడింది. ఒకప్పుడు ఆర్యావర్తంలో మర్త్య జన్మకై మనం ఉవ్విళ్ళూరుతుండే వారము. కానీ నేటి పరిస్థితిని చూస్తే మనం ప్రస్తుతం ఇలావర్తంలో మర్త్య జన్మను కోరుకోక పోవడమే ఉత్తమమని అనిపిస్తున్నది. నీవేమంటావు?

**దేవలుడు:** నేనలా అనుకోవటం లేదు దేవరా! ఆధునిక ఋషులు వివేకానందుడు, రామకృష్ణులు చేసిన ధర్మబోధ అందరకూ చేరితే సత్యయుగం ప్రారంభమైనట్లే. ఇలావర్తంలో ఆధ్యాత్మికత పూర్తిగా క్షీణించిన కాలం అంటూ ఎప్పుడూ లేదు. గంగానదిని ఎలా వెనక్కు ప్రవహింపజేయలేమో అదేవిధంగా భారతీయులు పూర్తి ప్రాపంచికులుగా ఎప్పుడూ తయారవ్వరు. వారి నరనరాలలో సత్యాన్వేషణ తత్పరత జీర్ణించుకు పోయింది. వారి జీవన విధాన గతిని భగవానుడే నిర్దేశిస్తున్నాడు. ఐతే మనం ఇంతకు ముందు తెలుసుకున్నట్లు వారు నేర్చుకునే విద్యలో మనో నియంత్రణకు సంబంధించిన జ్ఞానం భాగం కాకపోయేసరికి మనసు కళ్ళెంలేని గుర్రంలా తయారైంది. ఇంద్రియాల వెంట పరుగెడు తున్నది. దుఃఖాన్ని ప్రోది చేసిపెడుతున్నది. దీనితో మళ్లీ తమ మూలాలను వెతుకుతూ వివేకానందుడి లాంటి ఆధునిక ప్రవక్తల సహాయంతో పూర్వవైభవాన్ని, వారు అందించిన జ్ఞానాన్ని స్వీకరించటానికి ముందుకు వస్తున్నారు.

**పృథ:** నా కెందుకో సందేహంగా ఉన్నది. నీవు చెబుతున్న విషయం సత్యదూరంగా ఉన్నదనిపిస్తున్నది దేవలా. ఐతే అనంత మైన జ్ఞానాన్ని ప్రసాదించి భగవానుడు వారిని ప్రపంచంలో అందరి కన్నా సంపన్నులను చేశాడన్నది మాత్రం ముమ్మాటికీ నిజం.

**తార:** భారతదేశం ఒక పేద దేశంగా ప్రపంచంలో పరి గణింపబడుతుంటే నువ్వేమో సంపన్న దేశమంటున్నావు!

**పృథ:** సంపదలంటే నీఉద్దేశ్యంలో ఖనిజాలు, బంగారం, విదేశీ మారక ద్రవ్యం, ఎగుమతులు మొదలైనవైతే భారతదేశం పేద దేశం కావచ్చు. కానీ నా ఉద్దేశ్యంలో సంపద అంటే జ్ఞానం. ఆ సంపదలో భారతదేశం అగ్రగామి. ఐతే భారతీయులకు తమకు అంత సంపద ఉన్నదని కూడా తెలియదు. అదిగో వివేకానంద స్వామి ఆ మహాసంపదను ప్రపంచంలో మిగతా జాతులకిచ్చి భారతీయులకు తమ జ్ఞానసంపద వైభవం గురించి తెలియజెప్పాడు.

**తార:** అ..అవన్నీ ఎవ్వరూ సంపదగా పరిగణించడం లేదు. భారతీయులకు కూడా సంపదలంటే ప్రథమంగా గుర్తుకువచ్చేది బంగారం, డబ్బులు, భూములు, భవనాలే. అందువలనే కదా వారు ప్రలోభానికి లొంగిపోతున్నారు. జీవిత లక్ష్యం నిజంగా అర్థమైనవారైతే అంత బలహీనులుగా మారరు కదా. నీవు చెప్పినట్లు అలా భగవంతుడినుంచి వరప్రసాదంగా సంక్రమించిన మహా గ్రంథాలలోని జ్ఞానాన్ని వారు స్వీకరించినట్లైతే పుణ్యభూమి ఐన భారతావని ఇప్పటిలా అవినీతితో నిండిపోయుండేదా? శిబి, దధీచి, మహాబలి, జీమూతవాహనుడు జన్మించిన దేశంలో త్యాగ భావం కొరవడి ఇంత భౌతికత ప్రబలేదా? సత్యహరిశ్చంద్రుడు జన్మించిన దేశంలో వ్యాపారం పేరుతో అబద్ధాలు చెప్పటం జీవనవిధానమై ఉండేదా?

**సురుచి:** అదంతా కాలమహిమ తారా! నీవన్నట్లు ఈ సంపదను గుర్తించి అందరూ స్వీకరించలేక పోవటం వలన పరిస్థితి కొంత దిగజారిన మాట నిజమే. కానీ మళ్ళీ పరిస్థితులు మారుతున్నాయి. పూర్తిగా ఆధ్యాత్మిక భావాలు మృగ్యమైన విద్యనుంచి విలువలతో కూడుకున్న విద్యకోసం అందరూ తపిస్తున్నారు. జగన్మాత ఇప్పుడు భారతదేశం భోగభూమి కాదని, యోగభూమి అని, ఒకవేళ అది గుర్తించక ఎవరన్నా ధనసంపాదనలో పడి తోటి మానవుడిని విస్మరిస్తే వారు సంపాదించుకున్న ఆస్తులే వారి అశాంతికి కారణ మవుతాయని రకరకాల అలజడుల ద్వారా తెలియజేస్తున్నది.

**తార:** నేను మటుకు అలా భావించడం లేదు. ఎందుకంటే పూర్తిగా బాహ్యప్రవృత్తిని పెంచుకొని కొద్దిసేపు కూడా ప్రశాంతంగా తమతో తాము సమయం గడపకుండా ఉరుకులు పరుగులు పెడుతున్నారు. అదే అభివృద్ధికి కారణం అనుకుంటున్నారు. మనస్సు ప్రశాంతంగా ఉండాలంటే, అంతః సమతుల్యం సాధించా లంటే జీవన వేగాన్ని తగ్గించుకుని చవకబారు వినోదాలకు స్వస్తి పలకాలని అర్థం చేసుకోలేక పోతున్నారు. మానసిక, శారీరక శక్తులను దుర్వినియోగం చేసుకోకుండా హృదయంలో ఆసీనుడైన భగవానుని సదా స్మరించటమే చదువుల సారమని ఎంతమందికి అవగతమవుతున్నది?

**సురుచి:** ఇప్పుడిప్పుడే అర్థంచేసుకుంటున్నారు. లౌకిక జీవితంలో విజయాన్ని సాధించాలంటే ప్రశాంతమనస్సే ప్రధానమని అందులకు నీవు చెప్పినవన్నీ ఉపకరిస్తాయని గ్రహిస్తున్నారు. మనస్సును నిగ్రహించటానికి, మనస్సును గురించి చెప్పే సనాతన ధర్మ గ్రంథాలన్నింటినీ ఆపోశన పడుతున్నారు. మాయా పరి వ్యాపకాలైన ప్రసార మాధ్యమాలచే ప్రభావితమవడం మనో దౌర్బల్యానికి సూచన అని గుర్తెరుగుతున్నారు. మోసపూరిత, మోహపూరిత వ్యాపార ప్రకటనలను చూస్తూ వాస్తవిక ప్రపంచాన్ని

విస్మరించి కాల్పనిక జగత్తులో విహరించటం ధీరమానవుడి లక్షణమవదని ఆకళింపు చేసుకుంటున్నారు.

**తార:** ఇరవైఐదు సంవత్సరాలు జీవితంలో స్థిరపడాలన్న తాపత్రయంతో, లౌకికమైన చదువులతోనే గడిచిపోతున్నది. తరువాత వివాహం, పిల్లలు, వారి చదువులకు.. సంబంధించిన తాపత్రయం. ఇక నీవు చెబుతున్నట్లు ధర్మగ్రంథాలను చదివేది ఎపుడో? జుట్టు పూర్తిగా నెరసి, పళ్ళూడిపోతూ, పంచేంద్రియాలు పటుత్వాన్ని కోల్పోయిన తరువాతా? అప్పుడు ఈ ధర్మగ్రంథాలు అర్థమవుతాయా? అవేమన్నా టీవీ సీరియళ్ళ కథాంశాలా? అలా చూడగానే, చదవగానే అర్థమైపోవటానికి. ఒకవేళ కాస్తో కూస్తో అర్థమైనా ఇక ఆచరించటానికి జీవితమేది?

**సురుచి:** ఈ గ్రంథాల్లో ఉన్న విషయం తెలియకపోవటం వలన ఇప్పటివరకూ ఇవన్నీ లౌకిక జీవితానికి ఉపయోగపడేవి కావని భావించారు. అందుకని వాటిని నిర్లక్ష్యం చేస్తున్న మాట వాస్తవమే. ప్రాపంచిక జీవితం, పారలౌకిక జీవితం వేర్వేరని, సనాతన ధర్మగ్రంథాలన్నీ పారలౌకిక విషయాలకు సంబంధించినవనీ, అవి అభ్యుదయానికి ఉపయోగపడేవి కావనే అపోహ ఇప్పటివరకూ బలంగా ఉంది. ఇప్పుడిప్పుడే ఆ అపోహ తొలగిపోతోంది.




సమర్థవంతమైన విధి నిర్వహణకు, నాయకత్వపు లక్షణాలను పెంపొందించుకోవడానికి, లౌకిక జీవితంలో ఎదురయ్యే అన్ని సవాళ్ళను ఎదుర్కోవడానికి భగవద్గీత, మహాభారతం, రామాయణం ఇత్యాది గ్రంథాలు గొప్పగా ఉపయుక్తమవుతాయని అర్థం చేసుకుంటున్నారు.

**పృథ:** మహా మాయా ప్రపంచం. తమని తాము జయించకుండా ప్రపంచాన్ని జయించాలనుకుంటున్నారు మానవులు. ఎంత అజ్ఞానం!

**సురుచి:** తమని తాము జయించడమంటే గుర్తుకు వచ్చింది. మహా భాగవతంలో ప్రహ్లాదుడు హిరణ్యకశిపుడితో అన్న మాటలు.

**పృథ:** ఏమన్నాడు? ఆ బాలభక్తుడు చెప్పినదానికి మన సంభాషణకు సంబంధం ఏమిటో?

**సురుచి:** ఉంది. తండ్రి హిరణ్యకశిపుడు ముల్లోకాలను జయించాను, అంతకన్నా ఇంకా సాధించవలసినది ఏమీ లేదంటాడు. ఏదీ ఈ రోజుల్లో మానవులు భావిస్తున్నట్లు. అలనాటి హిరణ్యకశిపుడిలాగా ధనం, అధికారం, తోటి మానవులపై ఆధిపత్యం సంపాదించటమే జీవిత ఏకైక లక్ష్యంగా పరుగులు పెడుతున్నారు కదా మరి.

**పృథ:** అంటే భూలోకంలో అధిక శాతం మనుజులు హిరణ్యకశిపుడి అంశలంటావా?

**సురుచి:** హిరణ్యకశిపుడి అంశలలాగానే కనిపిస్తున్నారు. మనోజయమే నిజమైన జయం అనీ, మిగతావన్నీ అల్పములనీ, గర్వించదగ్గవనీ తెలుసుకోలేకుండా ఉన్నారు. అందరూ అలా హిరణ్యకశిపుడిలాగా బాహ్య ప్రపంచంపై దృష్టిపెట్టి అంతః ప్రవృత్తిని, మనస్సును మరచినవారే.

**పృథ:** మరి ప్రహ్లాదుడు ఏమన్నాడు తండ్రితో?

**సురుచి:** మనస్సును జయించడం ముల్లోకాలను జయించటం (ధనకనక వస్తువాహనాలు సమకూర్చుకోవటం) కన్నా మిన్న అంటాడు.

**పృథ:** అవును. నాకు కూడా గుర్తుకు వస్తున్నది. అసలు ఆ దిశగా ఉపయోగపడని చదువు చదువే కాదంటాడు కదా.

**సురుచి:** **దేవదేవుని చింతించు దినము దినము, చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు, కుంభినీధవున్ జెప్పెడి గురుడు గురుడు, తండ్రి హరి జేరుమనియెడి తండ్రి తండ్రి...** అంటూ ఏ రోజు నిజంగా సద్వినియోగమైన రోజో, ఏ చదువు నిజమైన చదువో, ఎవరు గురువో, తండ్రి అని ఎవరిని పేర్కొనవచ్చో.. ఒక్క పద్యంలో తెలియజేశాడు. భగవంతుడిని స్మరించటంతోనే మనస్సు నిగ్రహింపబడుతుందని వేరే మార్గంలేదని ఉపదేశిస్తాడు. అలా మనస్సుకు ఆవల ఉన్న మహాచైతన్యాన్ని చేరుకోవటానికి ఉపకరించేదే విద్య అని కూడా తెలియజేస్తాడు.

**పృథ:** **భారతీయుల ఆధ్యాత్మిక గ్రంథాలన్నీ వ్యక్తికి ఆ దిశగా తోడ్పడేవే అయినప్పటికీ ఆ లక్ష్యాన్ని వదిలి పాశ్చాత్య నాగరికత మోజులో పడి అసుర ప్రవృత్తిని పెంపొందించే వారి జీవన విధానాన్ని అనుకరిస్తూ ధర్మానుష్ఠానం అసాధ్యమయ్యే సమాజాన్ని నిర్మించుకుంటున్నారు.** మనిషిలో దైవీ ప్రవృత్తికి బదులు ఆసురీ (రాక్షస) ప్రవృత్తిని పెంపొందించే విద్యనే ఎక్కువగా అభ్యసిస్తున్నారు.

**సురుచి:** కొద్దికాలంపాటు అలా సాగిన తరువాత ఆత్మాన్వేషణ మొదలవుతుందేమో?

**పృథ:** ఆలోపు ఎంతమంది మానసిక రోగులను తయారు చేస్తుందో ఈ విద్యా విధానం, ఈ సమాజం చెప్పగలవా?

**దేవేంద్రుడు:** పృథా! అన్నట్లు అంతా యుగమహిమ. మహాకాలం యొక్క లీల. ఎవరిని బాధ్యులను చేయగలం? అందరూ నిమిత్తమాత్రులు. తమ ఘన వారసత్వ ఆధ్యాత్మిక సంపదను అనుభవించటానికి భారతీయులు ముందుకు వచ్చినప్పుడు దేశం ఆధునిక ఋషులు, మునులతో భాసిస్తుంది. మహావైభవాన్ని సంతరించుకొని ప్రపంచానికి గురుస్థానంలో నిలుస్తుంది. నేటి చర్చను ఇంతటితో ముగిద్దాం. స్వస్తి. ❖

**మానవులు అంధకారం నుండి వెలుగులోకి రావాలంటే ఆధ్యాత్మికోన్నతిని సాధిస్తూ, విద్యావంతులవ్వాలి. అప్పుడే దుఃఖం పూర్తిగా నిష్క్రమిస్తుంది. అందుకు మరో మార్గం లేదు.** -స్వామి వివేకానంద




# న్యాయ సేవలందిస్తా!

'యువసంఘర్ష్' పోటీల నేపథ్యంగా హైదరాబాదు రామకృష్ణ మఠంలోకి అడుగుపెట్టిన తరువాత స్వామి వివేకానంద భావజాలంతో నాకు (సి.సౌమ్య) పరిచయం కలిగింది. పోటీలో భాగంగా స్వామీజీ సాహిత్యాన్ని చదవడం ప్రారంభించాక, పూర్తిగా నా ఆలోచనా దృక్పథమే మారిపోయింది. భవిష్యత్తులో వ్యక్తిగతంగా నా జీవితానికి, సమాజానికి నా వంతు సేవ చేయడానికి ఒక ప్రణాళికను రూపొందించుకునే



అవకాశం కలిగింది. ముఖ్యంగా స్వామీజీ నిజమైన నాయకత్వానికి ఇచ్చిన నిర్వచనం మాలాంటి యువతరానికి స్పష్టమైన అవగాహన కలిగిస్తుంది. 'Be the servant while leading' అన్న స్వామి వివేకానంద ధీరవచనం నాకు ఎనలేని స్ఫూర్తి నిచ్చింది. స్వామీజీ కేవలం బోధించడమే కాకుండా జీవితంలో వ్యక్తిగతంగా ఆచరించి చూపారు. విశ్వనాయకుడిగా నిలిచారు. నాయకులుగా ఉంటూ కూడా తాము సేవకులమే అని భావిస్తూ ముందుకు సాగిపోయేవారే సంపూర్ణంగా తమ ప్రణాళికను అమలు పరచగలరు. మరింత మందికి ఆదర్శంగా నిలవగలరు. భవిష్యత్తులో ఎన్నో బాధ్యతలను నిర్వహించవలసిన మాలాంటి యువతీయువకులు స్వామీజీ చెప్పిన ఈ నాయకత్వం మౌలిక సూత్రాన్ని నిరంతరం మననం చేసుకుంటూ ఉండాలి. పోటీలు జరిగిన రెండు నెలల నిడివిలో ఇలాంటి ఎన్నో మరచిపోలేని అమృతవాక్యాలను చదివే, వినే అవకాశం కలిగింది.

స్వామి వివేకానంద ప్రతివ్యక్తిలో అంతర్గతంగా దాగి ఉన్న జ్వాలను రగిలింప చేయగలరు. ముఖ్యంగా చదువు విషయంలో, భవిష్యత్తుకు సంబంధించిన వృత్తి సంబంధ విషయాల్లో నాకున్న అస్పష్టమైన ఆలోచనలన్నీ స్వామీజీ బోధనల పరిచయంతో పటాపంచలయ్యాయి. స్పష్టంగా ముందడుగు వేసేలా దారిచూపాయి. ప్రతివ్యక్తిలోనూ దివ్యత్వాన్ని చూస్తూ, మనతో పనిచేసే వారి నుంచి ఒక నాయకుడిగా ఉత్తమఫలితాలను రాబట్టవచ్చని అర్థమైంది. అదే విధంగా నాయకుడికి ఉండవలసిన వినయం, సౌశీల్యం, తదితర అద్భుత లక్షణాలపై అవగాహన పెంచుకోగలిగాను. ఈ నా అనుభవం నా భవిష్యత్తుకు ఒక Blue print (సవివర పథకం) గా ఉపయోగపడిందనే చెప్పవచ్చు. గత సంవత్సరం వరకు నేను విదేశాల్లో న్యాయశాస్త్రం చదివి, అక్కడే న్యాయవాదిగా స్థిరపడదామనుకున్నాను. కానీ చదువులో పై తరగతులకు వెళ్ళాక, విదేశాలకు వెళ్ళాలనే నా ఆలోచనలు మారిపోయాయి. 'యువసంఘర్ష్' పోటీల అనుభవంతో స్వామీజీ జీవితాన్ని ఆకళింపు చేసుకున్న తరువాత నా జీవిత లక్ష్యమైన న్యాయవాద వృత్తిని కొత్తకోణం నుంచి ఆలోచించడం అలవాటు చేసుకున్నాను. ముందు వ్యక్తిగా నన్ను నేను నిరూపించుకున్నాక, సమాజం వైపు దృష్టి సారించదలచుకున్నాను. అలా నా మనస్సులో రెండు వాక్యాలు స్ఫురించాయి. అవి...

If not for yourself, who are you?

If only for yourself, what are you?

'నిన్ను నీవు ఉద్ధరించుకోకపోతే ఎలా? అలాగని నీ కోసమే నీవు బతికితే నీ జీవితమే వృథా' అన్న నినాదాన్ని జీవన సూత్రంగా చేసుకున్నాను. నా న్యాయవాద విద్య పూర్తయ్యే ఈ అయిదు సంవత్సరాలలో ఈ రెండు అంశాల్ని దృష్టిలో పెట్టుకొని ముందుకు నడవాలనుకుంటున్నాను. ముఖ్యంగా యూనివర్సిటీలో ప్రవేశించాక నేను స్వామీజీ నుంచి నేర్చుకున్న నాయకత్వ లక్షణాలు, ఇతర స్ఫూర్తిదాయక అంశాలను నా మిత్రులతో పంచుకోవాలనుకుంటున్నాను. నా ఆలోచనలతో సరిపోలిన విద్యార్థులతో కలసి కొన్ని సేవా కార్యక్రమాలను చేయాలనుకుంటున్నాను. ఎంపిక చేసుకున్న గ్రామాల్లో నిరక్షరాస్యత, ఆరోగ్యం, బాలికలకు చదువు తదితర విషయాల్లో అవగాహన కలిగించాలనుకుంటున్నాను. న్యాయవాద వృత్తి చేపట్టాక నెలకు కనీసం అర్హులైన అయిదుగురు ఆశ్రితుల(క్లైన్ట్స్) తరపున ఉచితంగా వాదిస్తాను. నేను 'యువసంఘర్ష్'లో భాగస్వామినై స్వామి వివేకానంద నుంచి పొందిన ఉత్తేజాన్ని భవిష్యత్తులో మరెందరికో ప్రసరింపచేసేలా కృషి చేస్తాను. ❖

**సి. సౌమ్య, 12వ తరగతి**

('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' ఉమ్మడివిజేత)

భారతీయ విద్యాభవన్, జూబ్లీహిల్స్, హైదరాబాదు

# కప్పు కాదు కాఫీ ముఖ్యం

– స్వామి బోధమయానంద



విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసం చేసి పెద్ద పెద్ద ఉద్యోగాల్లో స్థిరపడ్డ కొందరు యువకులు, తమకు పాఠాలు చెప్పి స్ఫూర్తినిచ్చిన ఓ ప్రొఫెసర్‌ను కలసి తమ కృతజ్ఞతలు చెప్పాలనుకున్నారు. అందరూ ఓ సెలవు రోజు మిత్రబృందంతో కలసి ఆ ప్రొఫెసర్ ఇంటికి వెళ్ళారు. పాత జ్ఞాపకాలన్నీ నెమరువేసుకుంటూ, విశ్వవిద్యాలయం తమ జీవితాన్ని ఎలా మలుపు తిప్పిందో వివరిస్తూ, ఆయనతో తమ అనుభూతులను పంచుకున్నారు. అలా, అలా మాటలు ప్రస్తుతం వారు చేస్తున్న ఉద్యోగబాధ్యతల వైపుకు మరలాయి. పోటీతత్త్వం, ఒత్తిళ్ళు, అసహనం తమను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయనీ, ఎక్కడ చూసినా విపరీతమైన ఉద్యోగ అభద్రత కనిపిస్తోందనీ ఆ యువకులందరూ తమ ప్రియతమ ప్రొఫెసర్ ముందు ఏకరువు పెట్టుకున్నారు; ఎవ్వరమూ సంతృప్తికరంగా లేమని ఆవేదన వ్యక్తం చేశారు. ఇంతలో ఆ గురువు గారు,ఏదో స్ఫురించినట్లు 'ఒక్క నిమిషం, ఇప్పుడే వస్తాను' అంటూ వంటగదిలోకి వెళ్ళారు. కొంత సమయం గడిచాక, పెద్దపాత్రలో కాఫీ, రకరకాల కప్పులు తీసుకొని ప్రొఫెసర్ ముందుగదిలోకి వచ్చారు. కాఫీ తీసుకోండంటూ కాఫీని, కప్పుల్ని యువకుల ముందుంచారు. ఆ కప్పులు రకరకాల పదార్థాలతో చేసినవి; కొన్ని ప్లాస్టిక్‌వి, మరికొన్ని పింగాణివి, ఇంకొన్ని చాలా ఖరీదైనవి! వారందరూ చాలా ఖరీదైనవీ, అందంగా కనిపించే కప్పుల్లోనే కాఫీని పోసుకొని తాగటం ప్రారంభించారు. అప్పుడు ఆ గురువుగారు, ప్రశాంతంగా తనూ కాఫీ తాగుతూ 'చూశారా! మీరందరూ ఖరీదైన కప్పుల్లోనే కాఫీ పోసుకున్నారు. మామూలు కప్పుల్ని ఎవరూ ముట్టుకోలేదు. మీ జీవితంలో కూడా ఇలా చాలా ఖరీదైనవి, మన్నికైనవి కావాలనే తాపత్రయం వల్లే, మీకు ఒత్తిళ్ళు పెరుగుతున్నాయి. పైగా మీరు ఎంచుకున్న కప్పులను వేరే వాళ్ళ కప్పులతో పోల్చుకుంటూ మరీ కాఫీ తాగుతున్నారు. అలాగే మీ ఉద్యోగాలను, ఆదాయాన్ని, జీవనశైలిని ఇతరులతో బేరీజు వేసుకుంటూ అనుభూతి చెందుతున్నారు. నిజానికి తాగే కాఫీ ముఖ్యం కానీ, కప్పులు కాదు. ఆనందమయమైన జీవితమే 'కాఫీ'. ఉద్యోగాలు, హోదాలు, ఆస్తులు, భద్రత, ఆడంబరాలు ఇవన్నీ కూడా 'కాఫీ' త్రాగడానికి ఉపయోగించే 'కప్పులు'; ఇవి కేవలం జీవితాన్ని అనుభవించడానికి చిన్న ఆధారాలు, ఉపాధులు మాత్రమే! కానీ అవే జీవితం కాదు. కేవలం ఇవే మిమ్మల్ని ఆనందంగా ఉంచుతాయనుకుంటే అంతకు మించిన అమాయకత్వం మరోటి లేదు. నిజంగా అన్నీ తాము అనుకున్నవి అనుకున్నట్లు అమరి, సౌకర్యంగా ఉన్న వాళ్ళే ఆనందంగా ఉంటారనుకోవడం పొరపాటు; తమకు ఏది లభించినా, దానినే సౌకర్యంగా, సానుకూలంగా మలచుకోవడం వల్లే వాళ్ళంత ఆనందంగా ఉండగలుగుతున్నారు. నిరంతరం కళ్ళ ముందున్న దానిని నిందిస్తూ, పొందినదాన్ని అనుభూతి చెందకుండా దూరపు కొండలు నునుపని ఎదురుచూసే వాళ్ళు ఎప్పటికీ సంతృప్తిగా ఉండలేరు.

అమెరికా విశ్వమత సభల ప్రయాణానికి ముందు స్వామి వివేకానందను రాజస్థాన్‌కు చెందిన ఖేత్రీ మహారాజు 'అసలు జీవితమంటే ఏమిట'ని ప్రశ్నించాడు. అప్పుడు "కుంగదీయటానికి ప్రయత్నిస్తున్న ప్రతికూల పరిస్థితులకు ఎదురొడ్డి నిలబడి ఆత్మవికాసాన్ని, పరిపూర్ణతను సాధించడమే జీవితం" అంటూ స్పష్టమైన నిర్వచనమిచ్చారు స్వామీజీ! పరిస్థితులు ఎప్పుడూ ప్రతికూలంగానే ఉంటాయి; ప్రగతికి, ప్రశాంతతకు ఎప్పుడూ అవరోధాన్ని కలిగిస్తూనే ఉంటాయి. కానీ ఎప్పటి కప్పుడు ఎవరికి వారే వాటిని అధిగమించడానికి ప్రయత్నిస్తూ ఉండాలి. మన వ్యక్తిత్వంతో ఆయా అననుకూల పరిస్థితులకు అనుగుణంగా ప్రయోగాలు చేసుకుంటూ ముందుకు సాగిపోవాలి. మంచికి, చెడుకి; జీవితానికి , మరణానికి; సంతోషానికి, దుఃఖానికి; స్వేచ్ఛకు, బంధనాలకు; గెలుపుకు, ఓటమికి; బలానికి, బలహీనతకు మధ్య ఎప్పుడూ సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఒకదాన్ని మరొకటి అధిగమించేందుకు పోరాటం చేస్తూనే ఉంటాయి. కానీ వాటిలో వేటిని గెలిపిస్తున్నామన్న దానిపైనే మన విచక్షణ, వివేకం ఆధారపడి ఉన్నాయి. ఈ సవాళ్ళన్నింటినీ ఎదుర్కొని మన సహజస్థితి అయిన ఆనందస్వరూపాన్ని ఆవిష్కరించుకోవడమే జీవన కర్తవ్యం. ఈ సాధనలో ఎవరికి వారే తగిన ప్రణాళికను రూపొందించుకోవాలి. జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలి. ❖

**ప్రాపంచిక సుఖాలకు బానిసలారా! ఇంద్రియాలకు దాసులారా! సుఖలాలసత్వాన్ని మించిన ఉన్నతమైన స్థితి మరొకటి ఉంది. అందుకు మనల్ని మనమే ప్రేరేపించుకోవాలి. - స్వామి వివేకానంద**

దార్శనికుడు, దివ్యపురుషుడు స్వామి వివేకానంద ఈ తరాన్ని సంబోధిస్తూ తన అంతరంగాన్ని ఆవిష్కరిస్తే ఎలా ఉంటుందో ఊహించి అందించిన ప్రయోగాత్మక వ్యాసమే ఈ 'జయహో... జయహో'.

**ప్రియమైన నా యువతీ యువకులారా... !**

వైభవోపేతమైన వారసత్వానికి వారధులుగా వెలిగే మీ తరానికి ఇవే నా నూతన సంవత్సర శుభాకాంక్షలు. భౌతికంగా ఈ లోకం నుంచి నేను నిష్క్రమించి ఉండవచ్చు. కానీ అజేయమై, అనుపమానమై, అఖండమైన తేజోమూర్తులుగా సమాజాన్ని మేల్కొలిపి, ముందుకు నడిపే ప్రతి గుండెలోనూ గుడిగంటలా నా గళం వినిపిస్తూనే ఉంటుంది; దారీతెన్నూ తెలియని జీవితాలకు దోవ చూపేందుకు దిక్కులు పిక్కటిల్లేలా ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. నా అచంచలమైన ఆశలన్నీ మీపైనే!

పరుగుపందానికి భీతిల్లే భీరువుల్లా ఎందుకలా జీవిస్తారు? ఏ కదలికా లేని కొయ్యముక్కల్లా ఎన్నాళ్ళని బ్రతుకుల్ని నెట్టుకొస్తారు? ఏదో ఈ ప్రపంచంలోకి వచ్చామా; వెళ్ళిపోయామా! అన్నట్లు కాలాన్ని గడిపేస్తే, అంతకన్నా బాధాకరమైన విషయం మరొకటి లేదు. బెదురు బెదురుగా, వెదురుపొదల్లో చాటు మాటుగా; సవాళ్ళనే తోడేళ్ళ గుంపుకు భయపడే కుందేళ్ళలా ఎన్నాళ్ళని బ్రతుకుతారు?




Live like a Lion... Live like a Legend... కాలం కత్తుల వంతెనల్ని పరచినా; పోరాట యోధుడిలా మీ గుండె ధైర్యాన్నే ఫిరంగిలా పేల్చి ముందుకు సాగిపోండి. ధీరులూ, సమర్థులూ అయిన కార్యసాధకులకే కాలంతో సహా అన్నీ అనుకూలిస్తాయి. దిగ్దిగంతాలను తాకే వీరోచితమైన ధైర్యోత్సాహాలతో ప్రయత్నిస్తూ, కడ దాకా వేచి ఉండేవారే అద్భుతాలను సుసాధ్యం చేయగలరని గుర్తుంచుకోండి.

**అమృతపుత్రులారా...!:** ఈ లోకంలో ఎంత కాలం జీవించామన్నది ప్రధానం కాదు! ఎంత సార్థకంగా మన ముద్రల్ని మిగిల్చి వెళ్ళిపోయామన్నదే ముఖ్యం. శంకరాచార్యులు ఎన్నాళ్ళు జీవించారు? ముప్ఫై రెండేళ్ళ అల్ప ఆయువులోనే తన ప్రగాఢమైన జ్ఞానముద్రల్ని పదిలపరచి తన ప్రస్థానానికి ముగింపు పలికారు. అదే ఆదర్శంగా నా ముప్ఫై తొమ్మిదేళ్ళ ప్రాయంలోనే నా గురుదేవుల ఆశీస్సులతో పదిహేను వందల ఏళ్ళకు సరిపడా సందేశం ఇవ్వగలిగాను. మనల్ని మనం నిరూపించుకునేందుకు యౌవనమే సరైన కాలమనీ, ఆ కొద్ది సమయం చాలు మనమేంటో ఈ లోకానికి చాటేందుకనీ సుస్పష్టం చేయడానికే నేను ఆ వయస్సులో నా దేహాన్ని త్యజించాను.

ఈ శరీరం ఘనకార్యాలను సాధించేందుకే కానీ, మీలో ఎందరో భ్రమపడుతున్నట్లు భోగాలు అనుభవించడానికి కాదు. కురుక్షేత్రంలో కుదేలై కూర్చుండిపోయిన కిరీటిలా ఎందుకలా మీరు బలహీనమైపోతున్నారు? వ్యసనాలకు బానిసలైపోతున్నారు? **'న కాంక్షే విజయం కృష్ణ, న చ రాజ్యం సుఖాని చ'** అని అర్జునుడు వీరుడిగా నిలబడలేక, చివరకు విజయాన్ని కూడా వద్దని వెనుతిరగబోయాడు. ఇప్పుడు మీ మానసికస్థితి కూడా దీనినే తలపిస్తోంది. అందుకే ఆనాడు శ్రీకృష్ణభగవానుడు కుంతీపుత్రుడికి హితవు పలికినట్లు **'క్షుద్రం హృదయ దౌర్బల్యం...'** అన్న మాటల్ని మరోమారు మీకు గుర్తు చేస్తున్నాను. హృదయ దౌర్బల్యాన్ని మించిన పరాజయం మరొకటి లేదు.

**యువ కిశోరులారా...! :** మీరు అమృతం దొరకడం లేదని, మురికినీటిలో మునిగితేలుతున్నారనిపిస్తోంది. అసలు అమృతం ఒకటుంటుందని కూడా తెలియదేమోనన్న సందేహం కూడా నాకు కలుగుతోంది. నా మాటల్లోని ఇనుప కండరాలు, ఉక్కు నరాలు అన్న వాక్యాల్ని మాత్రమే గుర్తుంచుకొని వాటిని పెంచి పోషించుకుంటూ, అసలు చివరన చెప్పిన వజ్రసంకల్పాన్ని మాత్రం విస్మరించారు. అందుకే మీరు వేలు వెచ్చించి వ్యాయామ శాలలకు వెళ్ళి నరాల్ని, కండరాల్ని బలిష్ఠం చేసుకుంటున్నారు కానీ; సంకల్పాలు మాత్రం సంకుచితమై పోతున్నాయి. వేగంగా వాహనాలు నడపడానికో, వీధిలో కొట్లాడుకోవడానికో, విశృంఖలంగా కోరికలు తీర్చుకోవడానికో తప్ప ఆ శరీరాలు సమాజానికి ఏ మాత్రం ఉపయోగపడడం లేదు.

జనవరి 12న జాతీయ యువజన దినోత్సవం.

# జయహో

– బి. సైదులు

మిత్రమా! మనల్ని ప్రతీకారం తీర్చుకోమనీ, చర్యకు ప్రతిచర్యే సమాధానమనీ ప్రకృతి ప్రేరేపిస్తుంది. కానీ ప్రతీకార వాంఛను అదుపు చేసి, నిగ్రహాన్ని కనబరచడమే దివ్యత్వమనీ, గొప్పశక్తి అనీ తెలుసుకోండి. అసహనంతో ఒరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పు వహించండి; గెలుపు మిమ్మల్ని తప్పక వరిస్తుంది. చరిత్రలో ఘనవిజయాలను సాధించినవారంతా అపారమైన సహన శీలురేనని గుర్తుంచుకోండి.

**నవసమాజ నిర్మాతలారా..! :** దురదృష్టవశాత్తూ నేటి సమాజంలో మీరు ఒకరి వెంట నడవలేకపోతున్నారు; ఒకరిని మీ వెంట నడుపుకొన లేకపోతున్నారు. మీలో సైనికుడి లక్షణాలూ కనిపించడం లేదు. అలాగని సేనాధిపతి గుణాలూ అగుపించడం లేదు! ఒకరిని అనుసరించాలంటే వినయం, విశ్వాసం ఉండాలి. ఒకరిని మన వెనక నడుపుకోవాలంటే త్యాగం, సహనం, సామర్థ్యం పుష్కలంగా పుణికిపుచ్చుకోవాలి. కానీ ప్రస్తుతం అలాంటి సేనాని అరుదే; సైనికులూ అరుదే! ఇలాంటి స్థితిలో సమాజం ఎన్నటికీ పురోగమించదు. సంకుచితత్వం, స్వార్థం, అసూయ ఉన్నన్నాళ్ళు ఎన్నటికీ నాయకులు కాలేరు! నవ సమాజాన్ని నిర్మించలేరు. Have a broad mind! కుటుంబంలో కావచ్చు; కార్యాలయంలో కావచ్చు, మీ విశాల దృక్పథమే మీ వ్యక్తిత్వానికి శోభనిస్తుంది. సమాజాన్నీ, సాటి మనిషినీ విశ్వసించండి. ఎక్కడైనా మనకై మనం నెగ్గడంలో కన్నా, ఇతరులు నెగ్గడానికి సాయం చేయడంలోనే మనకు ఎక్కువ ఆనందం లభిస్తుందని తెలుసుకోండి. మనస్సులో ధైర్యం, హృదయంలో ప్రేమ ఉన్నవారు ఎప్పటికీ అపజయాన్ని చవిచూడరని నా మాటగా మీకు అభయమిస్తున్నాను.

**పవిత్రమూర్తులారా...! :** గతంలో మీకు ఎన్నో పరాజయాలు ఎదురై ఉండవచ్చు. కానీ, వాటిని వేటినీ పట్టించుకోకండి. పొరపాట్లు, పరాజయాలు సర్వసాధారణమే. అవి మీ జీవితానికి మెరుగులు దిద్దేవే! ఓటములే లేని జీవితం ఎంత నిస్సారంగా ఉంటుందో ఊహించుకోండి! నేడు మీ ముఖాల్లో ఆ నైరాశ్యం, నిస్సహాయత చూస్తుంటే, నా మనస్సు కలవరపడుతోంది. మీరు పవిత్రమూర్తులు! Pull yourself out of difficulties by yourself. There is none to help you... కష్టాలనూ, కడగండ్లనూ స్వశక్తితోనే అధిగమించండి.

ముఖ్యంగా ప్రతి చిన్నదానికీ ఇతరులను నిందించే మనస్తత్వాన్ని విడనాడండి. మీ పరాభవానికీ, పరాజయానికీ అదే ప్రధాన కారణమని తెలుసుకోండి. అది దృష్టిని ఉన్నతస్థానం నుంచి నీచస్థాయికి దిగజారుస్తుంది. మీలో ఆ దుర్గుణం నానాటికీ కొలనులో నాచులా పెరిగిపోతోంది. మీ వైఫల్యాలనూ, తప్పిదాలనూ వ్యక్తులపైనో, సమాజంపైనో వేసి పరిస్థితుల నుంచి తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నారు. పలాయనవాదులుగా, పరాన్నభుక్కులుగా మిగిలిపోతున్నారు. పరీక్షల దగ్గర నుంచి వివాహవ్యవహారాల వరకు మీరు నిరంతరం అయోమయంలో కొట్టుమిట్టాడుతున్నారు. ఈ దుఃస్థితి నుంచి బయటపడండి.

**భావి భాగ్యోదయ దాతలారా...!:** రాజ్యాలు, వైభవాలు, యుద్ధాలు, విజయాలు ఇవేవీ నిజానికి చరిత్ర కాదు! అద్భుతాలను సాధించిన కొందరు మహాపురుషుల జీవనప్రవాహమే – చరిత్ర. ఆత్మవిశ్వాసం ఆ మహానుభావుల హృదయాలలో ప్రకాశించింది. నాగరకత అభివృద్ధిలో వారిని ముందుకు తీసుకువచ్చిన క్రియాశక్తి ఈ ఆత్మవిశ్వాసమే! మనకు ఏదైనా భ్రష్టత్వం, దోషం సంభవించాయంటే – అవన్నీ కూడా మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన నాటి నుంచే ప్రారంభమయ్యాయి. నేటికీ మీరు ఎక్కడో అలాంటి తప్పటడుగులే వేస్తున్నారనిపిస్తోంది. ఆత్మవిశ్వాసాన్నీ, ఆత్మాభిమానాన్నీ కోల్పోయి అభివృద్ధి పేరుతో, ఆధునికత పేరుతో మీరు సానుకూలం కాని సరంజామాను మీ జీవితంలోకి ఆహ్వానిస్తున్నారు. ఈ రోజుల్లో మీకు అన్నీ తెలిసినా, కర్ణుడి శస్త్రజ్ఞానంలా అవసరానికి ఉపయోగపడడం లేదు.

మీలో సామర్థ్యానికి కొదవలేదు. సౌశీల్యమే కొరవడింది. సామర్థ్యం మనల్ని ఉన్నతస్థాయికి తీసుకువెళుతుంది. కానీ, సౌశీల్యం మనల్ని ఆ ఉన్నతస్థానంలో శాశ్వతంగా ఉంచుతుంది. నేడు సమాజంలో మీరు ఎన్నో ఉన్నతస్థానాలను అధిరోహించ గలుగుతున్నా, అక్కడి నుంచి కొన్నాళ్ళకే పతనమైపోవడానికి కారణం – ప్రతిభకు తగ్గ ప్రవర్తన లేకపోవడమే! ఇకనైనా మేలుకోండి; ప్రగతి రథానికి సారథుల్లా సాగిపోండి. శతకోటి తంత్రులున్న మీ మేధ అనే వీణపై అపస్వరాలు పలికించడం శ్రేయస్కరం కాదు. దిగంతాలకు వినిపించే సుస్వరాల్ని పలికించండి. నిరంతర చైతన్యధారను మీ నరనరాన ప్రవహింప జేయండి. వ్యక్తిగా ఎదిగి, వ్యవస్థ కోసం సమిధలా మారండి... మీకివే నా శుభాశీస్సులు! జయహో.... జయహో! ❖

సదా మీకు స్ఫూర్తినిస్తూ...

Swami Vivekananda

ఆదర్శాన్ని విడువకండి. చిన్న చిన్న పొరపాట్లను పట్టించుకోకండి. కార్యరంగంలో దోషాలనే దుమ్ము రేగవలసిందే. ఎన్ని అవరోధాలున్నా, నిస్పృహ చెందకుండా ముందుకు సాగండి. - స్వామి వివేకానంద

# ఆత్మశక్తితోనే అనంతశక్తి!

– స్వామి రఘునాయకానంద



"సకల నీతిశాస్త్రాలు సత్ప్రవర్తనను కలిగి ఉండు..నీ వలె నీ తోటివారిని ప్రేమించు...ఇతరులకు సహాయ పడు.. ఇతరుల కష్టాలను నీ కష్టాలుగా భావించు" అని ప్రబోధిస్తున్నాయి. అయితే మనిషి వీటిని నేనెందుకు ఆచరించాలి? అసలు వీటిని అనుసరించాల్సిన అవసరం ఏమిటి? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానంగా స్వామి వివేకానంద ఇలా అంటారు: సకల నీతి శాస్త్రాలూ అద్వైత భావనపైనే ఆధారపడి ఉన్నాయి. ఉదాహరణకు అత్యంత ప్రాచీనకాలం నుండి వస్తున్న 'నీ వలె నీ తోటివారిని ప్రేమించు' అన్న నైతిక ఆచరణను ఈ అద్వైత భావన మనలో ఉన్నప్పుడే ఆచరించగలుగుతాం. నాలో ఉన్న సర్వ చైతన్యమే అన్ని చోట్లా అభివ్యక్తమయ్యిందన్న భావనతోనే ఇతరులను ప్రేమించి, సహాయం చేయాలి. ఆ చైతన్యం లేదా శక్తిపుంజమే సమస్త మానవాళిలో, యావత్తు జగత్తులో అభివ్యక్తం కావడం వల్లనే సకల నీతిశాస్త్రాలకు ఆధారంగా మారింది. ఇదే అన్ని సమస్యలకు పరిష్కార మార్గంగా గోచరిస్తుంది.

అయితే ఈ అద్వైత భావన నిత్య జీవితంలో అనుష్ఠానంగా ఎలా మారాలో, అలాకాక పోవడంలో గల లోటు పాట్లు ఏమిటో భారతీయ తత్త్వశాస్త్రంలో మానసిక విశ్లేషణ గురించి ఇచ్చిన వివరణలో కనబడతాయి. మనిషికి అనారోగ్యం కలిగేది మొదట మనస్సునుంచే. మనస్సు నుంచే శరీరానికి సంక్రమిస్తుంది. అందుచేత శరీరానికి సంబంధించిన వ్యాధిని నయం చేయడంతో సరిపోదు, మూలానికి వెళ్ళి అక్కడ వ్యాధిని నయం చేయాలి. అంటే ముందుగా మానసిక అనారోగ్యానికి మందు వేయాలి. మానసిక అనారోగ్యానికి ముఖ్యంగా మూడు సమస్యలు కారణాలుగా ఉన్నాయి.

### మూడు సమస్యలు – పరిష్కార మార్గం

మొదటిది ఈ భౌతిక దేహమే నేను అనుకోవడం; రెండవది ధనమే నాకు రక్షణ కల్పిస్తుంది అని భావించడం; మూడవది భౌతిక సుఖాలు, సంపదలు మాత్రమే నాకు ఆనందాన్ని ఇవ్వగలవని భావించడం. ఈ మూడు సమస్యలు 'నేను దేహాన్ని' అన్న భావనతోనే ముడిపడి ఉన్నాయి. మనం ఆత్మస్వరూపులమే తప్ప భౌతికశరీరాలం ఎంత మాత్రం కాదు. సుఖదుఃఖాలు కలిగేవి మనస్సు ద్వారానే గానీ, భౌతిక సంపదల ద్వారా కాదు. మనం వీటన్నిటికీ అతీతమైన ఆత్మస్వరూపుల మన్న జ్ఞానమే ఈ సమస్యలకు పరిష్కార మార్గాన్ని చూపుతుంది. ఈ ఆత్మే సమస్త జగత్తులో అభివ్యక్తమయ్యిందన్న (ఏకాత్మభావం) జ్ఞానం మనల్ని సేద తీరుస్తుంది. ఉదాహరణకు శరీరంలో కళ్ళు, ముక్కు, చెవులు మొదలైన చాలా అవయ వాలున్నాయి. కానీ ఈ అవయవాలన్నీ కలిసే శరీరం అవుతుంది. ఎవరైనా మీ వీపును స్పృశిస్తే ఎందుకు నా వీపును స్పృశించారని ప్రశ్నించరు. నన్నెందుకు స్పృశించారనే ప్రశ్నిస్తారు కదా! అదే విధంగా సమాజంలో వ్యక్తులందరినీ మన వారిగా భావించినప్పుడు, అంటే ఏకాత్మభావన కలిగినప్పుడు ఇతరులను ప్రేమిస్తాము, సేవిస్తాము. ఇతరుల కష్టాలను మన కష్టాలుగా భావిస్తాము. ప్రశాంతంగా, ఆనందంగా జీవించగలుగుతాం.

### దివ్యత్వ వ్యక్తీకరణ – సమస్త కార్యాచరణ

ఆ దివ్యత్వం(శక్తిపుంజం) నుండి మనం వేరని భావించు కోవడం వల్లనే మనకు దుఃఖం కలుగుతుంది. నేను ఈ భౌతికశరీరాన్ని కాదు; మనశ్శరీరాలకు అతీతమూ, స్వయం ప్రకాశమూ అయిన ఆత్మనే నేను అన్న నిర్ధారణకు నిష్కర్షగా రావాలి మనం. మనలో ఈ భావన లోతుగా పాతుకుపోవాలి.

తద్వారా జీవితం పట్ల మన దృక్పథం మారిపోతుంది. అందుచేతనే జనులందరూ ఈ ఆదర్శాన్ని కలిగి ఉండాలని మన సనాతన ఋషులు ఆశించారు. భగవంతుడన్న భావన ఏ విధంగా అయితే మనలో ఒక పవిత్రతా భావాన్ని కలిగిస్తుందో, అదే విధంగా మనలో దాగి ఉన్న ఆత్మ స్వరూపాన్ని గురించిన ఎరుక ఉన్నప్పుడు దానికి తగ్గట్లుగా జీవించగలుగుతాం. నీతిశాస్త్రాలు చెప్పిన విషయాలను మనఃస్ఫూర్తిగా ఆచరించగలుగుతాం. ఒక ప్రముఖ వ్యక్తి కుమారుడు తన తండ్రికి ఉన్న పరపతితో ఏ విధంగా హుందాగా వ్యవహరిస్తాడో, అదే విధంగా తనలో ఉన్న ఆత్మ స్వరూపాన్ని గుర్తించి, ఆ రకమైన హుందాతో దైనందిన జీవితంలో సమస్త కార్యకలాపాలను నిర్వర్తించాలి. స్వామి వివేకానంద ఇదే తన ఆదర్శమని తెలియజేస్తూ, 'నా ఆదర్శాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతి మనిషికి వారిలో ఉన్న దివ్యత్వాన్ని గుర్తుచేసి, ఆ దివ్యత్వాన్ని దైనందిన జీవితంలో ఏ విధంగా అభివ్యక్తం చేయాలో తెలియజెప్పడమే' అంటారు.

వేదాలు, ఉపనిషత్తులు ఆత్మ సర్వశక్తిమంతం, సర్వజ్ఞత్వం, సర్వవ్యాపితం లాంటి మహోన్నత లక్షణాలను కలిగి ఉందని తెలియజేసాయి. ఆత్మ మహిమను అర్థం చేసుకొని, దానికున్న అనంతత్వాన్ని ప్రతి ఒక్కరూ అనుభూతం చేసుకోవాలి.

### నీ ఆలోచనల ప్రతిరూపమే నీవు

"నీవు ఏది కాగోరుతావో అది కాగలవు. నీవు బలహీనుడవు అనుకుంటే బలహీనుడవే అవుతావు; నీవు బలాఢ్యుడవనుకుంటే బలాఢ్యుడివే కాగలవు." "Whatever you think that you will be; if you think yourself weak, weak you will be, if you think yourself strong, strong you will be" అంటారు స్వామి వివేకానంద.

నీ నిజస్వభావం (ఆత్మ స్వరూపం) గురించి అనుభూతి చెందినప్పుడు అద్భుతమైన శక్తియుక్తులు, తరగని సహజ వనరులు నీలో దాగి ఉన్నాయని తెలుసుకొంటావు. అందుచేత నీవు బలహీనుడవు కాదు, కానీ నీవు అలా భావిస్తున్నావు కాబట్టి బలహీనుడవు అనుకొంటున్నావు.

మీ నిజస్వభావాన్ని గురించి మీకు మీరే బోధించుకోండి. మనం బలహీనులమని భావిస్తూ కృత్రిమ నిద్రలో ఉన్నాం. ఆ నిద్ర మత్తును వదిలించుకొని మేల్కోండి! ఎవరూ కూడా నిజంగా బలహీనులు కారు. మనలో ఉండే ఆత్మ అనంతమైనది, సర్వశక్తిమంతమైనది. లేచి నిలబడండి! మీలోని శక్తిని ప్రకటించండి! మీలోని దివ్యత్వాన్ని ఎలుగెత్తి చాటండి.

### ఆత్మశక్తిలోనే అనంత శక్తి

శరీరం, మనసు ఆవల ఉన్న ఆత్మకున్న సౌందర్యంతో మన జీవితాలను మలచుకొందాం. ఈ దేహమే నేను అనుకొని జనులు వ్యక్తిత్వాన్ని కోల్పోయారు. అందుచేత జనులు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి ఇవ్వాలని స్వామి వివేకానంద పదే పదే నొక్కి వక్కాణించారు. అప్పుడే నిర్భయత్వాన్నీ, బలాన్నీ పెంపొందించుకొని, పవిత్రతనూ, శాంతినీ సాధించగలుగుతాం.

శ్రీరామకృష్ణ పరమహంస శిష్యురాలైన గౌరీమా శ్రీ శారదాదేవితో 'బాలికల పాఠశాలను ప్రారంభిస్తున్నాను, ఆ పాఠశాలలో చేరే బాలికలకు ఏమి బోధించాలి' అని అడిగినప్పుడు ఆమె ఇలా చెబుతారు: 'గౌరీ! వాళ్ళు పుట్టింది కేవలం గృహస్థ విధులను నిర్వర్తించడానికి మాత్రమే కాదు. వారు గొప్ప కార్యాలు సాధించడానికి, అసాధ్యాలను సుసాధ్యం చేయడానికి జన్మించారని తెలియజెయ్యి.'

**మీరు ఆత్మస్వరూపులు అని భావిస్తూ, మీలో సర్వశక్తులు ఉన్నాయని హుందాగా జీవించండి.**

**ఆ హుందాను ఘనమైన మంచికార్యాలు సాధించడంలో వ్యక్తపరచండి.**

**మీరు పవిత్ర స్వరూపులమని భావిస్తూ, మీ మనస్సులోకి అపవిత్ర భావాలను చేరనీయకండి.**

**ఏకాత్మభావన అలవరచుకొని అందరినీ ఆ భావనతోనే గౌరవించండి.**

మన నిత్యజీవితంలో ఆత్మశక్తి ఎప్పుడైతే ఆచరణ ద్వారా ప్రకటిత మవుతుందో అప్పుడు శక్తి, ఖ్యాతి వస్తాయి; మంచి, మాన్యత వస్తాయి; పవిత్రతతో పాటు ప్రతిభాపూర్ణమైనవన్నీ వస్తాయంటారు స్వామి వివేకానంద. అప్పుడే ప్రతి ఒక్కరూ తాము ఘనకార్యాలు సాధించడానికి జన్మించామని; అసాధ్యాలను సుసాధ్యం చేయగలమని విశ్వసిస్తారు.

### చివరిగా...

ఆత్మశక్తిని లేదా దివ్యత్వాన్ని ప్రతి ఒక్కరూ ఎలుగెత్తి చాటి బలహీనతలను పారద్రోలాలి. విద్యార్థి నేను ఆత్మస్వరూపుడను, సర్వశక్తిమంతుడనని భావించిన రోజు అతడు ఉత్తమ విద్యార్థిగా రూపొందుతాడు. ఒక వ్యాపారి తనలోనూ దివ్యత్వం ఉందని గుర్తించిననాడు అతనొక గొప్ప వ్యాపారిగా మారగలడు. ఒక ఉపాధ్యాయుడు తాను ఘనకార్యాలు సాధించడానికి జన్మించానని నమ్మి, తనలో ఉన్న ఆత్మశక్తి ఆచరణలోకి పెట్టిననాడు ఆయన ఒక ఉత్తమ ఉపాధ్యాయుడు కాగలడు. ❖



**నేను ప్రబోధించిన వాటిలో ఇది అతి ప్రధానమైన సందేశమని చెబుతాను - 'ఆధ్యాత్మిక, మానసిక, శారీరక దౌర్బల్యం కలిగించే దేనిని కూడా నీ కాలి బొటన వ్రేలితోనైనా తాకవద్దు.' - స్వామి వివేకానంద**

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీమతి టి.వి. జానకి, చిక్కడపల్లి, హైదరాబాదు | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, బొట్టుగూడ, నల్లగొండ జిల్లా |
| శ్రీ దేవలంక బూరయ్య, నాగార్జునసాగర్, నల్లగొండ జిల్లా (కీ॥శే॥ డి. ఏడుకొండలు జ్ఞాపకార్థం) | లైబ్రేరియన్, రంపయెర్రంపాలెం, గోకవరం, తూర్పుగోదావరి జిల్లా |
| శ్రీ ఎ. దుర్గాప్రసాదరావు, కేదారేశ్వర్‌పేట, విజయవాడ | కాకతీయ టెక్నో ఉన్నత పాఠశాల, అడ్డగుంట, గోదావరిఖని, కరీంనగర్ జిల్లా |
| శ్రీ దాట్ల సూర్యనారాయణరాజు, చెరుకుమిల్లి, పశ్చిమగోదావరి జిల్లా | ఎమ్.డి. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చెరుకుమిల్లి, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీమతి సి. లక్ష్మీదేవి, మున్సిపల్ కాలనీ, మలక్‌పేట, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బోగోల్, అర్థవీడు, ప్రకాశం జిల్లా |
| శ్రీ కాకర్ల బాలెందు, తాడేపల్లి, గుంటూరు జిల్లా | శ్రీ ప్రతిభా కాన్సెప్ట్ స్కూల్, తాడేపల్లి, గుంటూరు జిల్లా |
| శ్రీ బాడాన అప్పారావు, దంత, కోటబొమ్మాలి, శ్రీకాకుళం జిల్లా | శ్రీకాకుళం జిల్లాలోని 19 ప్రభుత్వ పాఠశాలలకు పత్రికను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ ఎ. రాఘవేందర్ ప్రభు, ప్రొద్దుటూరు, కడప జిల్లా | లైబ్రేరియన్, ఎస్.డి. కాలేజ్ ఆఫ్ ఐ.టి., తణుకు, పశ్చిమగోదావరి జిల్లా |
| కుమారి. వి. సౌమ్య, యూసఫ్‌గూడ, హైదరాబాదు | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, పాలకొల్లు, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ ఎమ్. పాపిరెడ్డి, భాగ్యనగర్ కాలనీ, కడప | యోగివేమన యూనివర్సిటి, వేమనపురం, కడప |
| కుమారి. ఎల్. సాయిలక్ష్మి, వనంపల్లి, మార్టేరు, పశ్చిమగోదావరి జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వేల్వాడం, మైలవరం, కృష్ణాజిల్లా |
| శ్రీ పెండేకంటి బాలాజీ, బి.కె.ఎమ్. వీధి, కడప | శ్రీ దత్త సాయి మందిరం, మద్రాస్ రోడ్, కడప |
| శ్రీ జి.వి. సతీష్, వెలంపేట, విశాఖపట్నం (కీ॥శే॥ జి. బాబూరావు జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కె.కొత్తపాడు, విశాఖపట్నం జిల్లా |
| శ్రీమతి పి. నర్మద, శ్రీనగర్ కాలనీ, హైదరాబాదు | శ్రీ విద్యారణ్య ఆవాస విద్యాలయం, జమ్మికుంట, కరీంనగర్ జిల్లా |
| డాక్టర్ శ్రీ బి. మెట్ రాములు, హబ్సిగూడ, హైదరాబాదు | ఆచార్య ట్రైనింగ్ సెక్షన్, శారదా ధామం, బండ్లగూడ జాగీర్, హైదరాబాదు |
| శ్రీ సిద్ధినేని లీలాకృష్ణ, కోడూరు, కృష్ణాజిల్లా | ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 20 పాఠశాలలకు పత్రికను స్పాన్సర్ చేశారు. |
| శ్రీమతి విద్యాలక్ష్మి, ఎల్లమ్మగుట్ట, నిజామాబాద్ | శ్రీ నూతన వైశ్య పాఠశాల, శివాజీ నగర్, నిజామాబాద్ |
| " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కోటగల్లి, నిజామాబాద్ |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

నారాయణ్‌గంజ్
29-9-1940,
12-11-1940

ప్రియమైన కుబేర్!*

నేను 26వ తేదీన ఇక్కడకు వచ్చాను. ప్రయాణ బడలిక నుండి ఈ రోజే కాస్త తేరుకున్నాను.

నీవు డైరీ వ్రాయడం అలవాటు చేసుకోవాలి. ప్రతిరోజూ నీ నిత్యకృత్యాల్లో జరిగిన పొరపాట్లను అందులో వ్రాసి పెట్టుకొని, వాటిని ఆ తరువాత సరిచేసుకోవాలి. డబ్బుకు సంబంధించిన జమా ఖర్చుల లెక్కలు నిర్వహించడం కన్నా ఇది చాలా ముఖ్యమైనది. "జితం సర్వం జితేరసే – రుచిని జయించినట్లయితే అన్నిటినీ జయించినట్లే." రుచి అంటే 'జిహ్వ' అని అర్థం. జిహ్వేంద్రియాన్ని జయిస్తే, సమస్తమూ జయించినట్లే! తినడంలోనూ, మాట్లాడడంలోనూ అదుపు అవసరం.

ప్రతి రాత్రీ నిద్రకు ఉపక్రమించే ముందు ఆ రోజు చేసిన పనిని గురించి ఆలోచించాలి. అందులోని దోషాలను ఏరి, నీ దినచర్య పుస్తకంలో వ్రాసుకోవాలి. నిద్రించే ముందు విషయాలన్నింటినీ శ్రీగురుమహరాజ్ పాదాల వద్ద సమర్పించు. ఈ గీతా శ్లోకాన్ని గుర్తుచేసుకో! "యత్ కరోసి..... – నీవు ఏమి చేసినా.... అది నాకు సమర్పిస్తున్నానని భావించు' (భగవద్గీత 9–27). నీ డైరీని రహస్యంగా దాచుకో. ఇతరుల కంటపడనీయకు.

నాలుగు సంవత్సరాలుగా నీవు, స్వామి అఖండానందజీ మహరాజ్ సన్నిధిలో ఉన్నావు. ఈ నాలుగు సంవత్సరాలలో నీవు ఏం లాభం పొందావనే లెక్క వేసుకున్నావా? ధన సంబంధమైన జమా ఖర్చులు నిర్వహించడం గురించి నేను తూష్ణీభావంతో ఉంటాను. దాని బదులు ఒక మనిషి జీవితపు జమా ఖర్చు లెక్కలు నిర్వహించడం గురించి ప్రత్యేక శ్రద్ధ చూపుతాను. నా లెక్కలు, మీ లెక్కలు కూడా ప్రతి పైసా వ్రాసి ఉంచాను. వారి లెక్కల గురించి అర్థం చేసుకోలేని వారికి నా వల్ల ప్రయోజనం శూన్యం.

మన విధులను నిర్వర్తిస్తున్నప్పుడు కూడా భగవంతుణ్ణి స్మరిస్తూ, ప్రతి వారిని భగవత్ స్వరూపులుగా భావించాలి.

'తృణాదపి సునీచేన' – వినయతలో ఒక గడ్డిపోచ లాగ ఉండాలి.
'తరోరివ సహిష్ణునా' – ఓర్పులో వృక్షం లాగ ఉండాలి.
'అమానినా మానదేన' – గౌరవాన్ని ఆశించకుండా ఇతరులను గౌరవించాలి.
'కీర్తనీయః సదా హరిః' – ఎల్లవేళలా ఆ హరిని కీర్తించాలి.

– పై నాలుగు సాధనలూ చెయ్యకుండా కేవలం భగవంతుని నామాన్ని జపించినంత మాత్రాన వ్యక్తి సరియైన ఫలితాన్ని పొందలేడు.

శ్రీరామకృష్ణ, స్వామి వివేకానందులను ఆదర్శంగా తీసుకొని, స్వామి అఖండానంద మహరాజ్ సన్నిధిలో ఉండి కూడా ఇంకా నువ్వు బలహీనుడవని భావిస్తున్నావంటే, నీకు వారిపై సంపూర్ణ విశ్వాసం లేదని నాకు అర్థమవుతుంది. "గురువు అనుగ్రహం ఉన్నా, భగవంతుని అనుగ్రహం ఉన్నా, భక్తుల అనుగ్రహం ఉన్నా – 'ఆ ఒక్కదాని' (మనస్సు) అనుగ్రహం లేకుంటే జీవుడు నాశనం చెందవలసిందే!"

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(*కుబేర్, స్వామి అఖండానంద మహరాజ్ శిష్యులు. కాలాంతరంలో రామకృష్ణ మిషన్‌లో స్వామి కృష్ణమయానందగా పరిచితులు)

పరమపూజ్యుడు, నిస్సంగుడు అయిన ఒక మహాత్ముణ్ణి, ఒక పుణ్యపురుషుణ్ణి ధ్యానించు. ఆ రాగరహితమైన మహాత్ముణ్ణి ధ్యానించడం వల్ల మనస్సు శాంతిని పొందుతుంది. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

**హరి నీ నామ మాహాత్మ్యము**

**హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా!** అన్నాడు.

అవును! 'హరి' అనే రెండక్షరాలే సర్వపాపాలనూ హరించి వేస్తాయి; ఆ రెండక్షరాల మధుర మంజులత్వాన్ని ప్రస్తుతించడానికి ఎవరికి మాత్రం సాధ్యమవుతుంది.

### కులము చెడిన వేళ... చెరపడి చిక్కిన వేళ

కలియుగం కేవలం ఆ భగవంతుడి నామాధారం! పూర్వ యుగాల్లా యాగాలు, తపస్సులు చేయాల్సిన అవసరం లేదు. భగవంతుడి నామాన్ని భక్తిగా జపిస్తే చాలు; సకల పుణ్యాలూ ప్రాప్తిస్తాయి.

అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస " 'నేను భగవన్నామాన్ని స్మరించాను. ఇక నాకేంటి పాపం!' అనేంత విశ్వాసం ఉండాలి. భగవన్నామ మాహాత్మ్యంపై నమ్మకం ఉంటే చాలు. అన్ని సమస్యలూ తొలగిపోతాయి" అంటారు. అన్నమాచార్యులు కూడా ఎట్టి అననుకూల పరిస్థితుల్లోనైనా హరినామమే గతి అన్న భావంతో...

**కొరమాలి ఉన్న వేళ, కులము చెడిన వేళ**
**చెరవడి ఒరులచే చిక్కిన వేళ**
**ఒరపైన హరినామమొక్కటే గతిగాక**
**మరచి తప్పిననైన మరిలేదు తెరగు...** అని ఆలపిస్తున్నాడు.

ఎందుకూ కొరగాని దుఃస్థితి దాపురించినప్పుడు, కులము చెడినప్పుడు, ఇతరుల చెరలో చిక్కి కష్టాలు అనుభవిస్తున్నప్పుడు, ఒరపైన అంటే ప్రకాశవంతమైన శ్రీహరి నామమే శరణనీ, అంతకు మించిన మార్గమే లేదనీ అంటున్నాడు. నిజమైన భక్తుల జీవితాల్లో ఇలా గట్టెక్కిన ఘట్టాలు లెక్కలేనన్ని కనిపిస్తాయి. గజేంద్రమోక్షంలో ఆ కరిరాజు కూడా మొసలి బారిన పడి చిక్కిశల్యమై, మృత్యుముఖాన ఉండి

**నీవె తప్ప నితఃపరం బెఱుంగ; మన్నింపం దగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద; సంరక్షింపు భద్రాత్మకా!** అనగానే

శ్రీమహాలక్ష్మికి కూడా చెప్పకుండా, శంఖుచక్రాలను కూడా ధరించకుండా తనకో గరుడవాహనం ఉందన్న విషయాన్ని కూడా విస్మరించి, హుటాహుటిన వచ్చి తన భక్తుడిని కాపాడుకున్నాడు. అదీ ఆయనకు తనను నమ్ముకున్నవారిపై ఉన్న ప్రేమ!

### ఆపద వచ్చిన వేళ... ఆరడి బడిన వేళ

కన్నకొడుకని కూడా చూడకుండా ప్రహ్లాదుడిని తండ్రి హిరణ్యకశిపుడు ఆపదలకు గురిచేసినప్పుడు, కురువంశపు పట్టమహిషి అన్న ఇంగితం కూడా లేకుండా కౌరవులు ద్రౌపదిని నిండుసభలో నిందించి అవమానించినప్పుడు ఆత్మబంధువై ఆదుకున్నాడు ఆ శ్రీమన్నారాయణుడు. ఇలా ఆపదలలో, ఆరళ్ళలో, పాపాలు పేట్రేగిన సమయాల్లో, భయాందోళనలు పొడచూపిన ఘడియల్లో హరినామమొక్కటే రక్ష అని రూఢిపరుస్తూ...

**ఆపద వచ్చిన వేళ ఆరడి బడిన వేళ**
**పాపపువేళల భయపడినవేళ**
**ఓపినంత హరినామ మొక్కటే గతిగాక**
**మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు...** తన పదాలను పల్లవింపచేస్తున్నాడు ఆ వేంకటేశుడి ఆంతరంగిక భక్తుడు. ఆ దేవాధిదేవుడు శరణాగతికి అత్యంత ప్రాధాన్యాన్నిస్తాడు. అహంకారాన్ని విడిచి బాధ్యతనంతా ఆ భగవానుడిపైనే వేస్తే తనే మన చేయి పట్టుకొని నడిపిస్తాడు. అడుగులు తడబడకుండా కన్నతండ్రిగా కాపాడుకుంటాడు. భక్త అంబరీష చరిత్రలో దుర్వాస మహర్షితో శ్రీమహావిష్ణువు ఇదే విషయాన్ని ప్రస్తావిస్తూ...



వేంకటేశు నామమే విడిపించ గతిగాక

**తనువు, మనువు విడిచి, తనయుల**
**చుట్టాల నాలి విడిచి, సంపదాళి విడిచి**
**నన్నెగాని యన్యమెన్నడు నెఱుగని, వారి**
**విడువనెట్టివారినైన...** అంటాడు. తన దేహాన్నీ, జీవితాన్నీ, ఆలుబిడ్డలనూ, చుట్టాలనూ, సంపదలనూ వదలి నన్నే నమ్ముకున్న వారు ఎలాంటి వారైనా నేను వారిని వదిలిపెట్టనని అభయమిస్తాడు.

### సంకెలబెట్టిన వేళ... చంప బిలిచిన వేళ

తాళ్ళపాక అన్నమయ్య నుంచి తాసిల్దారు రామదాసు వరకు పాపం పరమ భక్తులకందరికీ ఈ సంకెళ్ళ బాధలు తప్పలేదు. అయినా వారు తాము పట్టుకున్న ఆ పరంధాముడి పాదాలను మాత్రం విడువలేదు. సంకెళ్ళు వేసినా, చంపడానికి శత్రువులు దరిదాపులోకి వచ్చినా, పాపపుణ్యాలనే అప్పులు తీర్చమని కాలపురుషుడే అడ్డంగా నిలబడినా ఆ దీనబాంధవుడినే నమ్ముకున్నారు. మనల్ని కూడా నమ్ముకోమంటున్నారు. అలా

**సంకెళ బెట్టిన వేళ చంప బిలిచిన వేళ**
**అంకిలిగా నప్పుల వారాగిన వేళ**
**వేంకటేశు నామమే విడిపించ గతిగాక**
**మంకుబుద్ధి బొరలిన మరిలేదు తెరగు..** అంటూ ఆ వేంకటేశుడి నామమే గతి అనీ, దానిని వదలి మంకుబుద్ధితో అంటే మూర్ఖత్వంతో ఎంత ప్రయత్నించినా మరో దారి లేదనీ ముగింపు పలుకుతున్నాడు. ❖

**నవతరం సందేహాలకు సమాధానాలు**




- స్వామి పరిజ్ఞేయానంద

**జి. మధుసూదనరావు, చందర్లపాడు, కృష్ణాజిల్లా.**

**ప్రశ్న: నేను స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకొని జీవిస్తున్నాను. మా తరగతిలో ఇతర విద్యార్థులలాగ అల్లరి చేయకుండా నా మార్గాన నేను మెలగుతున్నాను. అయినప్పటికీ నా స్నేహితులంతా నన్ను హేళన చేస్తున్నారు. వారంతా దురభ్యాసాలతో పాడైపోతున్నారు. స్వామి వివేకానంద బోధనలను వివరించి వారిని సన్మార్గంలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నాను. కానీ వారు నా సదుద్దేశాన్ని గ్రహించడం లేదు. పైగా నన్ను చులకనగా చూస్తున్నారు. నేను వారిలో మార్పు తీసుకురావాలంటే ఏం చేయాలి?**

**జవాబు:** సహాధ్యాయులతోగానీ, సహోద్యోగులతోగానీ, సన్నిహితులతోగానీ సదా సత్సంబంధాలతో కలసిమెలసి జీవించాలంటే శ్రీ శారదాదేవి చెప్పిన ఈ సూత్రాన్ని అవలంబించాలి : "జఖన్ జేమోన్ తఖన్ తేమోన్; జెఖానే జేమోన్ సెఖానే తేమోన్ - ఎప్పుడు (ఏ సమయంలో) ఎలా ఉండాలో అప్పుడు (ఆ సమయంలో) అలా ఉండాలి. ఎక్కడ (ఏ పరిస్థితుల్లో) ఎలా ఉండాలో అక్కడ (ఆ పరిస్థితుల్లో) అలా ఉండాలి".

## అందరిలో ఒకరిగా...

కళాశాలలోనైనా, కార్యాలయంలోనైనా నలుగురితో ఉన్నప్పుడు కలసిమెలసి ఉండాలి. పాలలో నీరు కలిసినంతమాత్రాన పాలు తన సహజత్వాన్ని ఎలా కోల్పోదో, అలా మనం ఇతరులతో కలిసినంత మాత్రాన మన వ్యక్తిత్వాన్ని కోల్పోకూడదు.

మీ స్నేహితులతో కలవకుండా మీరు ఒంటరిగా; వారికి వేరుగా, దూరంగా మెలగుతుండడం వల్ల 'holier than thy attitude - నేను వారికంటే ఉత్తముణ్ణి' అనే భావంతో మీరు ప్రవర్తిస్తున్నారని మీ స్నేహితులు మిమ్మల్ని హేళన చేస్తున్నారు. కాబట్టి వారిలో అలాంటి భావన రానీయకుండా నడుచుకోవాలి. అలా నడుచుకోవాలంటే మనం అందరితో కలిసి ఉన్నప్పుడు ఒక ప్రత్యేక వ్యక్తిగా భావించుకొని, అందరి దృష్టి మన మీద పడేలా సన్నివేశాన్ని సృష్టించకూడదు. కాబట్టి శ్రీ శారదామాత సూచించినట్లు సందర్భోచితంగా ప్రవర్తిస్తూ, పరిస్థితులకు అనుగుణంగా మెలగిననాడు తోటివారితో మన సత్సంబంధాలు పటిష్టంగా ఉంటాయి.

మీ స్నేహితులను సన్మార్గంలోకి మళ్ళించడానికి మీరు చేస్తున్న ప్రయత్నం హర్షదాయకం. కానీ అందరూ మన మాటల్ని వినాలనీ, మన ఆలోచనల్ని గౌరవించాలనీ, మన భావాల్ని ఆమోదించాలనీ ఆశించడం అత్యాశే అవుతుంది.

ఎవరైనా మన సూచనల్ని స్వీకరించాలంటే మొదట మనం వారిలో ఒకరిగా మెలగాలి, మనం నిజంగా వారి శ్రేయోభిలాషుల మనే విశ్వాసాన్ని చూరగొనాలి. అందుకు సహనం, సాహసం, సమయస్ఫూర్తి, సహాయగుణం చాలా అవసరం.

A true friend unbosoms freely, advises justly, assists readily, adventures boldly, takes all patiently, defends courageously, and continues a friend unchangeably. - *William Penn*

నిజమైన స్నేహితునికి ఉండాల్సిన ఈపై లక్షణాలను మనం అలవరచుకొన్నప్పుడు మిత్రుల్లోనే కాదు ఎవరిలోనైనా మార్పును తీసుకురావచ్చు.



ఉన్నత భావాలను చెప్పడం కన్నా వాటిని మన జీవితంలో ప్రతిబింబించేలా ప్రవర్తించిననాడు ఇతరుల్ని సులభంగా ప్రభావితుల్ని చేయవచ్చు. అందుకే 'One ounce of practice is worth twenty thousand tons of big talk - ఇరవైవేల టన్నుల మాటల కన్నా ఇసుమంత ఆచరణ ఎంతో విలువైనది' అని అంటారు స్వామి వివేకానంద.

ఇతరులతో మన సంబంధబాంధవ్యాలు సాఫీగా సాగిపోవడానికి శ్రీశారదామాత సలహానూ, మన భావాలను వ్యక్తపరచడం కన్నా ఆచరించడం వల్లనే ఇతరులను ప్రభావితుల్ని చేయగలమన్న స్వామి వివేకానంద సూచనను అభ్యసించినప్పుడు పరిస్థితులన్నీ మనకు అనుకూలంగా మారుతాయి. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029**

**నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రాణత్యాగానికైనా సిద్ధపడటమే నాయకత్వ లక్షణం. కానీ మనం త్యాగం చేయకుండానే నాయకులమవ్వాలని అనుకుంటాం. దాని వల్ల ఫలితం శూన్యం.** - *స్వామి వివేకానంద*

– స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# ఒత్తిళ్ళను తొలగించే నిష్కపటత్వం!

(...గత సంచిక తరువాయి)

'ఆర్జవము' అనే మాట 'ర్జు' అనే ధాతువు నుండి వచ్చింది. ఆర్జవము అంటే సూటితనము, లేదా కపటము లేకుండుట. మన ఆలోచనలు, మాటలు, చేతలు ఒకటే అయినప్పుడు ఆ గుణాన్ని 'ఆర్జవం', లేక 'నిష్కాపట్యం' అని అంటారు.

మానసికంగా బాగా ఉన్నప్పుడు, ఉన్నత విలువలు వాటంతట అవే వ్యక్తి జీవితంలోకి ప్రవేశిస్తాయి. జీవితంలో ఉన్నత విలువలుగల వ్యక్తి ప్రశాంతంగా ఉండగలుగుతాడు. అది అన్ని రకాలుగా సర్దుబాటు చేయబడిన 'కెమెరా' లాంటిది. కెమెరాకు ఉన్న రంధ్రం, లెన్సు, ఇతర భాగాలు సరిగ్గా ఉన్నప్పుడు మంచి ఛాయాచిత్రం తీయగలుగుతారు. అదే విధంగా మనస్సు చంచలత్వం లేకుండా, ప్రశాంతంగా, సర్దుబాటు అయి ఉన్నప్పుడు 'అంతరవలోకన' కలుగుతుంది. బాహ్య ప్రవృత్తి నుండి మనస్సు నిరోధానికి గురి అవుతుంది.

బాహ్య విషయాలపై మనస్సు ప్రసరించడానికి ముఖ్య కారణం వాటి గురించి తప్పుడు అభిప్రాయం కలిగి ఉండడం! ఈ తప్పుడు విలువలను సరిచేస్తే, మానసిక ప్రశాంతత (ఆత్మశాంతి) లభిస్తుంది. ఈ విధంగా జీవిత ప్రణాళికలో 'ఆర్జవం' ఒక స్థానాన్ని కలిగి ఉంటుంది.

ఒత్తిడి, ఆందోళనలను తట్టుకోవడానికి మనస్సు విభిన్న రక్షణ పద్ధతులను అవలంబిస్తుంది. అలాగే మానసిక ఒత్తిడి అంటే కృంగిపోవడం, అణచుకోవడం, భావావేశంతో అలజడి పొందడం లాంటి రకరకాల రూపాలు దాలుస్తుంది. ఒత్తిడి నుంచి బయటపడడానికి వీటిని ఎదుర్కోవాలి.

మనిషి ఒక రకంగా మాట్లాడి, మరో రకంగా ఎందుకు ప్రవర్తిస్తాడు? సమస్య స్పష్టంగా కనిపిస్తున్నా, దాని నెందుకు ఒప్పుకోడు? ఒక్క మాటలో చెప్పాలంటే, జీవిత సమస్యల నుండి ఎందుకు పారిపోతాడు? దీనికి కారణమేమంటే మనం 'వాస్తవాన్ని' ఎదుర్కోలేం. జీవితంలో వాస్తవ దృక్పథాన్ని ఏర్పరచుకొని, వాస్తవాలను ఎదుర్కోవడం వల్లనే 'మానసిక స్థిరత్వాన్ని' పొందగలమని గుర్తుంచుకోవాలి.



వాస్తవిక పరిస్థితులను ఎదుర్కోవడం మానివేస్తే ఎల్లప్పుడూ బలహీనులుగానే ఉండిపోతాం. జీవిత వాస్తవాల నుంచి పారిపోవడానికి మన మనస్సు అవలంబించే 'రక్షణ పద్ధతుల'కు గల కారణాలను తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. జీవితాన్ని ఎదుర్కొనేటప్పుడు మనకు 'ఆర్జవం', లేక 'నిష్కాపట్యం' అలవడుతుంది.

'నిష్కాపట్యం' అంటే మన ఆలోచనలకూ, మాటలకూ, చేతలకూ మధ్యనున్న 'ఖాళీ'ని తగ్గించడమే! అంటే మన మనస్సు, వాక్కు, శరీరం–ఒకదానితో ఒకటి సమన్వయంగా, శ్రుతి కలిగి ఉండాలి. మన వ్యక్తిత్వంలోని ఈ మూడు అంశాలనూ క్రమబద్ధంగా ఐక్యం చేయాలి. దీని కోసం మనలో సమగ్రత్వం లేకపోవడానికి గల అంతర్గత కారణాలను వెదికే ప్రయత్నం చేయాలి. చాలాసార్లు మన లోపల గల అంతర్గత ఒత్తిళ్ళ కారణం వల్ల మనలో నిష్కాపట్యం కొరవడుతుంది. ఉదాహరణకు – భావావేశం, లేక సాంఘిక అభద్రతల వల్ల కలిగే ఒత్తిడినే తీసుకోండి. అభద్రతా భావం కలిగితే నీతి బాహ్యమైన విధంగా ప్రవర్తించడం జరుగుతుంది.

అలాంటి పరిస్థితులలో మనకు ఆందోళన, ఒత్తిడి కలిగించే కారణాల నుండి తప్పించుకోవడానికి మనస్సు రకరకాల పద్ధతులను కనిపెడుతుంది. ఆ విధంగా ఒత్తిడికి గురయిన మనస్సు సమస్యను పరిష్కరించడానికి దగ్గర మార్గాన్ని కనిపెట్టే ప్రయత్నం చేస్తుంది. లేదా ఆ సమస్యను అసలు గుర్తించనే గుర్తించదు. సమస్య పట్ల తరచూ మూగదిగానో, గుడ్డిగానో ఉండడాన్నే కోరుకుంటుంది.

# వ్యక్తులు కాదు... పౌరులు ప్రధానం!

– స్వామి సేవ్యానంద

స్వామి వివేకానంద నిద్రాణమై ఉన్న భారత జాతిని 'లేవండి, మేల్కొనండి, గమ్యం చేరేవరకు ఆగవద్దు!' అని మేల్కొలిపారు. సుమారు వెయ్యి సంవత్సరాలుగా బానిసత్వాన్ని అనుభవిస్తూ, కొన ఊపిరితో ఉన్న భారతజాతిని 'సమస్త శక్తి మీలోనే ఉంది. మీరేమైనా సాధించగలరు!' అని జాగృతం చేసారు.

**భారత భవిష్యత్తు:** స్వామి వివేకానంద దేశ భవిష్యత్తు గురించి చెబుతూ 'భారతదేశం ప్రపంచంలో ఉన్న అన్ని దేశాలకంటే అగ్రస్థానానికి చేరుకుంటుంద'ని అన్నారు. స్వామీజీ 1897 జనవరి 25న రామనాథపురంలో తన ఉపన్యాసాన్ని ఇలా ప్రారంభించారు.... "ఇక తెల్లవారదనుకున్న రాత్రి మెల్లమెల్లగా గడిచిపోతున్నట్లుంది. భరించరాని తీవ్ర వేదన ఉపశమిస్తున్నట్లని పిస్తుంది.... భారతమాత దీర్ఘనిద్ర నుండి మేల్కొంటోంది.... ఇంక ఆమెనెవరూ ఆపజాలరు! ఇక ఆమె నిద్రపోదు". స్వామీజీ చెప్పిన భవిష్యవాణి నిజం కావాలంటే మనం ఏం చెయ్యాలి?

**వ్యక్తులు పౌరులుగా మారాలి:** నేటి యువత విదేశాల భోగభాగ్యాలకు ఆకర్షితులవుతున్నారు. ఇటు భారతీయ సంస్కృతిని వదులుకోలేక, అటు విదేశీ సంస్కృతిని కాదనలేక సందిగ్ధంలో పడుతోంది. బాహ్య సౌందర్యం కంటే అంతరంగ సౌందర్యం చాలా గొప్పదన్న విషయం మనమంతా తెలుసుకోవాలి. విదేశాలలో వేదాంతభేరిని మ్రోగించి, భారతదేశానికి తిరిగి వస్తున్నప్పుడు ఒక ఆంగ్లేయ మిత్రుడు స్వామీజీని "ఇక్కడి భోగభాగ్యాలను చూసిన తరువాత భారతదేశంపై మీ అభిప్రాయం ఏమిటి?'' అని అడిగాడు. సమాధానంగా స్వామీజీ, "భారతదేశం నుండి వచ్చేముందు నా దేశాన్ని ప్రేమించాను. ఇప్పుడు నా దేశపు దుమ్ము, ధూళి, గాలి సర్వస్వం నాకు పవిత్రమైనవిగా భాసిస్తున్నాయి" అన్నారు. నేడు మన దేశస్థులు తమ దేశానికి సేవ చేయడం మాట అటుంచి భారతమాతను విమర్శించడంలోనే ఎక్కువ ఉత్సాహం చూపిస్తున్నారు. ప్రతి భారతీయుడు తమ దేశ గొప్పతనాన్ని తెలుసుకొని భారత పౌరునిగా మారడానికి ప్రయత్నించాలి.

ఒకసారి ప్రముఖ భారత న్యాయవాది నానీ ఫల్కీవాలా జపాన్ వెళ్ళినప్పుడు ఆ దేశమంత్రిని ఇలా ప్రశ్నించారు – "భారత దేశంలో కావలసిన సంపదలున్నాయి. భారతీయులు తెలివైన వారు. అయినప్పటికీ భారతదేశం జపాన్‌లాగా ఎందుకు అభివృద్ధి చెందలేకపోతోంది?" సమాధానంగా జపాన్ మంత్రి "జపాన్‌లో ఒక మిలియన్ 'పౌరులు' న్నారు. భారతదేశంలో ఆరువందల మిలియన్ల 'వ్యక్తులు'న్నారు" అని తన అభిప్రాయాన్ని చెప్పారు. 'దేశం మనకు ఏమి చేసింది' అని తలచేవారు వ్యక్తులు. 'దేశానికి మనం ఏం చేసాం' అని ప్రశ్నించుకునేవారు పౌరులు. తమ స్వార్థం కోసం ఆలోచించేవారు, తమ ప్రయోజనాల కోసం జీవించేవారు వ్యక్తులు. ఇతరుల కోసం ఆలోచించేవారు, ఇతరులకు సేవ చేసేవారు పౌరులు. ప్రతి ఒక్క భారతీయుడు వ్యక్తి నుంచి పౌరునిగా మారాలి.

**యువశక్తి జాగృతం కావాలి:** నేడు భారతీయులు అందరికంటే తెలివైనవారని ప్రపంచమంతా ఒప్పుకుంటుంది. అయితే మనం అక్కడితో ఆగిపోకుండా ప్రతిభావంతులంగా మారాలి. దీనికోసం స్వామీజీ సూచించినట్లు నేటి యువత విద్యతో పాటు విలువలను అలవరచుకోవాలి, మనోబలాన్ని పెంపొందించుకోవాలి, జ్ఞానంతో పాటు హృదయాన్ని విశాలం చేసుకోవాలి. స్వామీజీకి యువశక్తిపై అత్యంత విశ్వాసం ఉంది. యువత తమ అంతరంగంలో ఉన్న అనంత శక్తిని జాగృతం చేసి భారతమాతను ముందుకు తీసుకుపోవాలి.

ప్రతి ఒక్క భారతీయుడు భారత పౌరునిగా మారి, తమ శక్తిని జాగృతం చేస్తే, కొద్ది రోజులలోనే భారతదేశం అగ్రస్థానానికి చేరుకుంటుంది. వివేకానందుని భవిష్యవాణి సత్యమవుతుంది. ❖

కళ్ళు మూసుకొని పాలు త్రాగే పిల్లి లాగానే అది తన నెవరూ చూడడం లేదనుకుంటుంది.

ఐతే వాస్తవికతను అంగీకరించడమనేది చాలా మందికి సహజంగా అలవడదు. తగినంత శక్తి, సరియైన ఆలోచన లేకపోవడం వల్ల సమస్య పరిష్కారానికి దగ్గరి మార్గమో, లేక పూర్తిగా సమస్యను విస్మరించడమో వారు చేస్తారు. సమస్యను ఎదుర్కోకపోవడం వల్లనే దాన్ని పరిష్కరించగలిగామని కూడా వారనుకుంటారు. సమస్యను సమస్యగా అంగీకరించకపోవడం దానికి పరిష్కారం కాదని వారు మరచిపోతారు. సమస్య పరిష్కృతం కావాలంటే, ఏదో అద్భుతం జరగాలని వారు ఎదురు చూస్తారు. సమస్యను పరిష్కరించడమా? దానిలో ఏం విజ్ఞత ఉంది? అనుకుంటారు వారు.

ఆ విధంగా మనస్సు బాహ్య పరిస్థితులను ఎదుర్కోవడానికి కొన్ని రక్షణ పద్ధతులను పెంపొందించుకుంటుంది. అది సమస్యలను ఎదుర్కోవడం పూర్తిగా మానేస్తుంది. లేదా వాటిని అధిగమించడానికి నీతి బాహ్యమైన విధంగా ప్రవర్తిస్తుంది. ❖

(వచ్చే సంచికలో – 'నైతిక పతనానికి కారణాలు')

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

**మనస్సును జయించిన వ్యక్తి మాత్రమే ఆనందాన్ని పొందగలడు. విశ్వాన్నంతా వశపరచుకున్నా, ఆత్మవిజయాన్ని సాధించనంత వరకూ ఆనందాన్ని పొందడం సాధ్యం కాదు.** - స్వామి వివేకానంద

# నిరుపేద నిస్వార్థసేవ

మూలకథ: స్వామి విమూర్తానంద   చిత్రాలు: దాకోజు శివప్రసాద్   అనుసృజన: స్వామి జ్ఞానదానంద

అది 1891వ సంవత్సరం. స్వామి వివేకానంద బాలభానునిలా, జ్ఞానభాస్కరునిలా భారత పర్యటన చేస్తున్న కాలఘట్టం. స్వామీజీ ఖేత్రీ పట్టణంలో బసచేసి ఉన్నప్పుడు, ప్రజలు ఆయన దర్శనార్థం తీర్థంలా నిత్యం వస్తూనే ఉండేవారు.

1 స్వామీజీ దర్శనానికై పండితులు వచ్చేవారు. అనేక తాత్త్విక అంశాలను ఆయనతో చర్చించేవారు.

మతం అంటే ఏమిటి స్వామీజీ?

మనిషిలో పశుత్వాన్ని తొలగించేదే మతం. మనిషిని దైవంగా పరిణమింపజేసేదే నిజమైన మతం.

2 రాజకీయ ప్రముఖులు, సమాజంలో పేరుప్రతిష్ఠలున్న వారు కూడా వస్తుండేవారు.

స్వామీజీ! ప్రస్తుతం మన దేశ ధ్యేయం ఏమిటి?

దేశం పురోగతి సాధించాలన్నా, ప్రతి ఒక్కరూ సంతోషంగా జీవించాలన్నా స్వార్థాన్ని త్యజించాలి. త్యాగమూ, సేవ– ఇవే మన భారతజాతి ఆదర్శాలు.

3 భక్తులూ, భక్తురాండ్రూ ఎడతెగకుండా వచ్చి తమ సంశయాలను తీర్చుకోసాగారు.

భక్తిని పెంపొందించుకోవడం ఎలా స్వామీజీ?

భక్తి మీలో సహజసిద్ధంగానే ఉంది. విషయ వాంఛలు దాన్ని మరుగు పరుస్తున్నాయి. వాటిని తొలగించుకొంటే భక్తి అభివ్యక్తమవుతుంది.


4
స్వామీజీ చుట్టూ సదా జనమే! ఇలా కొన్ని గంటలు కాదు, మూడు రోజులు అహర్నిశలూ అన్ని వర్గాల జనులూ వచ్చి ఆయన అనుగ్రహం పొంది వెళ్ళేవారు. ఇదంతా గమనిస్తున్న ఒక చెప్పులు కుట్టేవాడు...
నిజంగానే ఈ స్వామి గొప్ప యోగే! లేకుంటే మూడు రోజులు అవిశ్రాంతంగా ఇలా మాట్లాడుతూనే ఉండగలడా?


5
మూడో రోజు సాయంత్రం కొద్దిమంది మాత్రమే స్వామీజీ చుట్టూ ఉన్నారు. ఆ చెప్పులు కుట్టేవాడు స్వామీజీని సమీపించి వినమ్రంగా చేతులు జోడించి...
స్వామీ! మీరు మూడు రోజులుగా ఏమీ తినలేదు, నిద్రించలేదు. గుక్కెడు మంచినీళ్ళు కూడా ముట్టినట్లు లేదు.
ఆ పేదవాని అభిమానం చూసి స్వామీజీ చకితులయ్యారు.


6
ఇలాంటి వ్యక్తుల వల్లనే మన దేశం ఆధ్యాత్మిక భూమిగా ఇంకా విరాజిల్లుతోంది. నా నుండి ఏదో పొందాలనే స్వార్థంతోనే అందరూ వచ్చారు. కానీ ఇతడు నాపై ప్రేమతో ఎంత అక్కర చూపు తున్నాడు.!


7
నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. తినడానికి నాకు ఏదన్నా ఇవ్వగలవా? సన్న్యాసినైన నేను ఎవరి చేతి వంటనైనా తింటాను.
స్వామీ! నిమ్న కులస్థుడనైన నేను మీకు ఆహారం సమర్పించినట్లు మా రాజుగారికి తెలిస్తే, నన్ను శిక్షిస్తారు.


8
భయపడకు నాయనా! అలా ఏమీ జరుగదు. ప్రేమతో నువ్వు ఇచ్చే ఆహారమే ఉత్తమోత్తమమైనది.


9
ఆ చెప్పులు కుట్టే వ్యక్తి సందిగ్ధావస్థలోనే ఇంటికి వెళ్ళాడు.


10
మూడు రోజులుగా స్వామీజీ పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టలేదు. మనం వండినదే తింటానని చెబుతున్నారు. రాజుగారి కోపానికి గురి అవుతామేమోనని భయంగా ఉంది.
మనం ఎందుకు భయపడాలి! ఉత్తముడైన ఒక స్వామికి వండి పెట్టినందు వల్ల మనం చెరసాల పాలైనా ఫరవాలేదు!


11
ఆ భార్యాభర్తలు తాము వండిన సాదాసీదా ఆహారాన్ని తీసుకువచ్చి స్వామీజీకి వడ్డించారు.
మీరు ప్రేమతో వడ్డించిన ఈ ఆహారం అమృతం కన్నా రుచికరంగా ఉంది.
రాజుగారే స్వయంగా వచ్చి 'నువ్వు చేసింది తప్పు' అని కఠోరంగా శిక్షించినా భయం లేదు. మాకు కావలసింది మీ అనుగ్రహమే స్వామీ!


12
స్వామీజీ వారిని మనసారా దీవించారు. ఒకటి రెండు రోజుల్లో స్వామీజీ మహత్వం ఖేత్రీ రాజు అజిత్‌సింగ్ తెలుసుకుని ఆయనకు గౌరవంగా రాజభవనంలో బస ఏర్పాటు చేశాడు.


13
రాజభవనానికి వెళ్ళాక ఒక రోజు స్వామీజీ, రాజుతో ఆ చెప్పులు కుట్టే వ్యక్తి చూపిన ఔదార్యాన్ని ప్రస్తావించారు.
అలాగా! ఇటువంటి ఉదారులు కూడా నా దేశంలో ఉన్నారా! స్వామీజీ! ఆ చెప్పులుకుట్టే వ్యక్తిని నేను చూడాలనుకుంటున్నాను.


14
నాటి రాత్రి రాజభటులు ఆ చెప్పులు కుట్టే వ్యక్తి ఇంటికి వెళ్ళి...
నువ్వేనా స్వామీజీకి చపాతీలు ఇచ్చింది? రాజుగారు నిన్ను పిలుచుకురమ్మన్నారు.
రాజుగారు నన్ను పిలుచుకురమ్మన్నారా? నేను ఏ తప్పూ చెయ్యలేదే!


15
ఆ చెప్పులు కుట్టే పేదవాడు, రాజుగారిని తలచుకుని భయంతోనూ, స్వామీజీని తలచుకుని ధైర్యంతోనూ రాజభవనానికి వెళ్ళాడు. ఆశ్చర్యం! రాజాస్థానంలోకి అతడు వెళ్ళగానే మహారాజు...
రండి ధన్యాత్మా! నా గురువు ఆకలి తీర్చిన మీరు ఇకపై ఏ కొరతా లేకుండా జీవించాలి. ఇదుగో! ఈ కానుకలు స్వీకరించండి.
ఆ చెప్పులు కుట్టే పేదవాడు దిగ్భ్రాంతికి గురయ్యాడు. ఆనందంతో తబ్బిబ్బయ్యాడు. స్వామీజీ అతణ్ణి అభినందిస్తూ, ప్రశాంతంగా నిలబడ్డారు.

# గ్రంథ పరిచయం



## నిత్య జీవితము - గీతాచరణము

రచయిత : బుడ్డిగ అరుణకుమారి
వెల : రూ.75/-, పుటలు : 108
ప్రతులకు : బుడ్డిగ అరుణకుమారి
ఇం.నెం : 8-3-231/డబ్ల్యూ/59
హయగ్రీవ సదన్, ప్లాట్.నెం. 401,
యూసఫ్‌గూడ, హైదరాబాదు-45

'భగవద్గీత' నిత్యపారాయణ గ్రంథం మాత్రమే కాదు. మన నిత్యజీవితాన్ని ప్రశాంతంగా, ఆనందంగా గడపడానికి, మానవుడు తన జీవన విధానాన్ని సఫలం చేసుకోవడానికి, ముఖ్యంగా తన్నుతాను సంస్కరించుకోవడానికి ఉపయోగ పడుతుంది. భగవద్గీతకు ఎందరో పండితులు అద్భుతమైన వ్యాఖ్యానాలు అందించారు. బుడ్డిగ అరుణకుమారి గారు తమ సాధనలో భగవద్గీత నిత్య జీవనానికి ఏ విధంగా ఉపయోగ పడుతుందో చాలా సరళమయిన భాషలో వివరించారు. ❖

– బొప్పన అరుణాదేవి.



## బ్రహ్మవిద్యాసర్వస్వము

రచయిత: డా॥ పి.నాగేశ్వరరావు
వెల: రూ. 500/-, పుటలు: 258
ప్రతులకు: డాక్టర్ పెదపాటి నాగేశ్వరరావు, 402, అవంతి మాన్షన్స్, బి - 64, డి.డి. కాలనీ హైదరాబాదు - 500 007

ప్రస్థానత్రయ వ్యాఖ్యానాలన్నీ పండితైకవేద్యంగానే మిగిలిపోయాయి. అందువల్ల సామాన్యులకు దూరంగా ఉండిపోయాయి. ఆ లోపాన్ని సవరించటానికి శ్రీ నాగేశ్వరరావుగారు సరళమైన సామాన్య జన వ్యావహారిక భాషలో వ్యాఖ్యానాన్ని సమకూర్చారు. ప్రస్థానత్రయ సారాన్ని ప్రజలదగ్గరకు చేర్చిన రచయిత అభినందనీయులు. కానీ ముద్రణలోని అక్షరాలు చిన్నవిగా ఉండటం ఈ గ్రంథానికి పెద్ద లోపంగా కనిపిస్తుంది. కనుక ప్రచురణ కర్తలు ఈ చిన్న లోపాన్ని సవరిస్తే ఈ గ్రంథం ఆధ్యాత్మిక విద్యా సరస్వతికి సమర్పించిన పారిజాతసుమమాల కాగలదని ఆకాంక్ష. ❖

– ఎం.వి. నాగప్రసాద్



## త్రి స్థలీ సేతువు

సంస్కృతమూలం: శ్రీనారాయణభట్టరు
స్వేచ్ఛానువాదం:సి.మురళీమోహనశాస్త్రి
వెల: రూ.50/-, పుటలు: 134
ప్రతులకు : సి.ఎమ్. శాస్త్రి,
1-2-212/6/ఎఫ్, దోమల్‌గూడ,
హైదరాబాదు-500 029



## అక్షర వృక్షాలు

పర్యావరణ కవితలు

ప్రచురణ : కౌన్సిల్ ఫర్ గ్రీన్ రెవల్యూషన్, హైదరాబాదు
వెల: రూ. 100/-, పుటలు: 119
ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్,హైదరాబాదు-1

# వార్తావాహిని





### వ్యక్తిత్వవికాస సదస్సులు

**కైకలూరు, శ్రీరామకృష్ణ సేవాసమితి** స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలను పురస్కరించుకొని 2011 నవంబర్ 2,3 తేదీల్లో వివిధ పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ వ్యక్తిత్వవికాస సదస్సులను నిర్వహించింది. ఈ సదస్సుల్లో హైదరాబాదు రామకృష్ణ మఠం స్వామి రఘునాయకానందజీ పాల్గొని విద్యార్థులకూ, ఉపాధ్యాయులకూ స్ఫూర్తిదాయక సందేశాన్నిచ్చారు.

నివేదిక : చెరుకువాడ శివరామరాజు

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-1, Sri Ramakrishna Prabha (Telugu Monthly) January 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? అంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. - స్వామి రంగనాథానంద



కోల్‌కతాలోని స్వామి వివేకానంద పూర్వీకుల గృహం

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఫిబ్రవరి 2012 ₹10

సర్వధర్మస్థాపకస్త్వం సర్వధర్మస్వరూపకః ।
ఆచార్యాణాం మహాచార్యో రామకృష్ణాయ తే నమః ॥



నిజమైన గురువు, శిష్యుడిలో నిద్రాణంగా ఉన్న పవిత్రకాంక్షను క్షణంలో ప్రకాశింపజేయగలడు. తనలో అలాంటి దివ్యప్రేమనూ, శక్తినీ ఆరనిజ్యోతిలా ప్రజ్వలింప జేసుకున్న గురువరేణ్యులు శ్రీరామకృష్ణ పరమహంస. సురేశ్‌చంద్ర సంప్రదాయపరంగా సన్న్యాసాన్ని స్వీకరించక పోయినా, ఆధ్యాత్మిక పరాకాష్ఠతో పవిత్రత, నిజాయతీ, నిస్స్వార్థం, నిస్సంగత్వం, వివేకవైరాగ్యాలు అలవరచుకున్న సుగుణసంపన్నుడు. అతనికి పనే దైవం; పూజనీయం. పునరావాస కార్యక్రమాల్లో స్వామి అఖండానందజీ మహరాజ్‌కు సహకరించేందుకు సురేశ్‌చంద్ర కొన్నాళ్ళు బెరహమ్‌పూర్‌లో ఉన్నాడు. శ్రీరామకృష్ణుల పట్ల సురేశ్ కనబరచే భక్తిప్రపత్తులకు స్వామి అఖండానంద అబ్బుర పడేవారు. సురేశ్ జీవితంలో చోటు చేసుకున్న ఒక అపురూప ఘట్టం ఆయనకు 'గురుమహరాజ్'పై ఉన్న శ్రద్ధకు అద్దం పడుతుంది.

# సద్గురు స్పర్శ

స్వామి వివేకానంద 1897 మే నెలలో శరత్‌చంద్ర చక్రవర్తికి మంత్రదీక్ష ప్రసాదించారు. ఆ సందర్భంలో శరత్‌చంద్ర, శ్రీరామకృష్ణులకు శాస్త్రోక్తంగా ప్రత్యేక పూజలు ఆచరించదలిచాడు. శరత్‌చంద్ర అంత ప్రాతః కాలాన్నే పూజాద్రవ్యాలను సమీకరించి, పూజకు ఏర్పాట్లు చేయగలడా? అన్న సందేహం కలిగి, స్వామీజీ అంత ఆసక్తి కనబరచలేదు. విషయం తెలుసుకున్న సురేశ్ ఆలమ్‌బజార్‌లోని మఠానికి కలకత్తా నుంచి పూజాసామగ్రి తీసుకువచ్చే బాధ్యతను తను స్వీకరించాడు.

మరుసటి రోజు ఉదయం నాలుగుగంటలకే సురేశ్, శరత్‌చంద్రను తీసుకొని కలకత్తా అంగడికి వెళ్ళాడు. కావలసిన సామగ్రిని కొని శరత్‌ను ఒక్కడినే సామాగ్రితో పంపించి, తను మాత్రం ఒంటరిగా కాలినడకన బయలు దేరాడు. శరత్ ఆశ్చర్యంగా, 'ఎందుకు నా వెంట నీవు రావడం లేదు?' అని అడిగాడు. అప్పుడు సురేశ్




'నేను అలా బండి మీద రాలేను. నేను గురుమహరాజ్‌కి ఇష్టమైన తియ్యని పెరుగును కుండలో తీసుకువస్తూ, ఇలా బండిలో వస్తే, ఆ బండి కుదుపులకు పెరుగు ఒలికిపోతుంది. కాబట్టి నేను జాగ్రత్తగా నడుచుకుంటూ వస్తాను. ఈ పెరుగును పూజా సమయానికి ఎలాగైనా తీసుకువచ్చి, గురుమహరాజ్‌కు సమర్పించుకుంటాను' అన్నాడు.



శరత్‌చంద్ర ఇతర పూజాసామగ్రితో అనుకున్న సమయానికి పూజామందిరానికి చేరుకున్నాడు. అలా ఆయన అనుకున్న సమయానికే ప్రత్యక్షమయ్యేసరికి స్వామి వివేకానంద ఆశ్చర్యపోయారు. ఇదంతా శరత్ వల్ల కాదని తెలిసి స్వామీజీ అసలు విషయమేంటని అడిగారు. సురేశ్ వల్లే ఇదంతా సాధ్యపడిందని తెలుసు కొని, 'మరి సురేశ్ ఎక్కడ?' అని అడిగారు. శరత్ జరిగిన విషయమంతా చెప్పాడు. సురేశ్ కాలినడకన పెరుగు కుండతో వస్తున్నాడని తెలుసుకున్న స్వామీజీ కళ్ళ వెంట ఆనందబాష్పాలు రాల్చుతూ "ఆ గురువరేణ్యులు ఎవరినైతే స్పృశిస్తారో వారు స్వర్ణతుల్యులవుతారు. ఆ దివ్యస్పర్శకు ఉన్న మాహాత్మ్యం అలాంటిది" అన్నారు. ❖




**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద    సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద







# ఓరుగల్లు ఒడిలో పులకించిన భక్తజనులు...

వరంగల్‌లో 2011 డిసెంబర్ 9,10,11 తేదీల్లో రామకృష్ణ– వివేకానంద భావప్రచార పరిషత్ 20వ వార్షిక భక్త సమ్మేళనాన్ని **వరంగల్ శ్రీరామకృష్ణ సేవాసమితి** అత్యంత వైభవంగా నిర్వ హించింది. ఈ సమ్మేళనానికి రామకృష్ణ మఠం స్వామీజీలు, శారదా మఠం మాతాజీలు విచ్చేశారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి సుమారు 3,500 మంది భక్తులు ఈ సమ్మేళనంలో పాల్గొన్నారు.

ఈ సమ్మేళనాన్ని డిసెంబర్ 9వ తేదీ సాయంత్రం ఐదు గంటలకు చెన్నై శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి గౌతమానందజీ మహరాజ్ జ్యోతిప్రజ్వలన చేసి ప్రారంభించారు.



జ్యోతిప్రజ్వలన చేసి భక్తసమ్మేళనాన్ని ప్రారంభిస్తున్న పూజ్య స్వామి గౌతమానందజీ

ఈ సందర్భంగా స్మరణ సంచికను, హైదరాబాద్ రామకృష్ణ మఠ నూతన ప్రచురణలు – శ్రీరామకృష్ణ చరితామృతం, ఆదర్శమాతృమూర్తి, నాకేదీ ఇక భయము (భజనల సి.డి.)లను ఆవిష్కరించారు.

రోజూ ఉదయం 6 గంటలకు శ్రీరామకృష్ణ సుప్రభాతం, అష్టోత్తర శతనామ పూజ, రామకృష్ణ కథామృత పఠనం, కీర్తనలు, ధ్యానంతో కార్యక్రమం ప్రారంభమయ్యేది.

స్వామీజీల, మాతాజీల, ఇతర వక్తల ప్రసంగాలు; వివిధ సమితుల నుండి వచ్చిన భక్త బృందాల భజనలు; సాంస్కృతిక కార్యక్రమాలు భక్తుల్ని ఆద్యంతం అలరించాయి. భక్తులు ఈ మూడు రోజులూ మూర్తిత్రయ స్మరణలో తన్మయులై అలౌకిక ఆనందాన్ని అనుభవించారు. ❖












భక్తసమ్మేళనంలో అందరినీ అలరించిన విద్యార్థుల వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 2 ఫిబ్రవరి 2012

నమామీశమీశాన నిర్వాణరూపం
విభుం వ్యాపకం బ్రహ్మ వేదస్వరూపమ్ ।
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం
చిదాకాశమాకాశవాసం భజేహమ్ ॥

సర్వప్రపంచాన్నీ శాసించే ఆనందస్వరూపుడైన ఈశ్వరుణ్ణి, అధీశ్వరుడై వ్యాపించే పరబ్రహ్మస్వరూపుణ్ణి, వేదస్వరూపుణ్ణి; సత్యమై, నిర్గుణమై, నిర్వికల్పమై, నిరీహమై, చిదాకాశతత్త్వమై, ఆకాశవాసమై ఉన్న మహేశ్వరుణ్ణి ఆశ్రయిస్తున్నాను.

*- శ్రీ తులసీదాస విరచితమ్.*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : జియాలజీ ఓల్డ్ స్టూడెంట్స్ అసోసియేషన్ ఆఫ్ నానక్‌రాం భగవాన్‌దాస్ సైన్స్ కళాశాల (గోసాన్), హైదరాబాదు - 500 002 | 42,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ నరసింహారావు(తల్లితండ్రుల జ్ఞాపకార్థం), శ్రీమతి అన్నపూర్ణాదేవి, న్యూబాకారం, హైదరాబాదు. | 10,000 |
| రాజపోషకులు | : శ్రీమతి పి.డి. ధనలక్ష్మి, చెన్నై - 600 112 | 5,000 |
| పోషకులు | : శ్రీ టి. శశికాంత్, ఆంధ్రాలయోలా కళాశాల, విజయవాడ - 520 008 | 1,116 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1,500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





**ముఖచిత్రం :** భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస హిందూమతంలోని వివిధ సాధనలను, క్రైస్తవ, ఇస్లాం మత సాధనలను అనుష్ఠించారు. ఆ యా దేవీ దేవతలు ప్రత్యక్షమై, ఆయనలో ఐక్యమయ్యారు. భక్తులు తమతమ ఇష్టదైవాలను ఆయనలో దర్శించారు. (తిథి ప్రకారం - 2012 ఫిబ్రవరి 23 గురువారం, భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతి)

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com






# సజీవ భాష్యం పరమహంస జీవితం

ఒకసారి బేలూరు మఠంలో భక్తులతో మాట్లాడుతూ ఒక స్వామీజీ, "రేపటి నుండి మీకు ఉపనిషత్తులపై బోధన తరగతులు నిర్వహిస్తాను" అని అన్నారు. ఆ మాటలు విన్న స్వామి ప్రేమానందజీ, ఆ స్వామీజీతో "సకల ఉపనిషత్తులకు సజీవ భాష్యమై విరాజిల్లుతున్న భగవాన్ శ్రీరామకృష్ణులు ఉండగా, మరి ఏ ఉపనిషత్తుల గురించి బోధిస్తావు? సకల శాస్త్రాల సారమే మన గురుదేవుల జీవితం" అని అన్నారు.

ఆదిశంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలైన ఎంతో మంది ఆచార్యులు శాస్త్రాలకు భాష్యం వ్రాశారు. కానీ పూర్తిగా చదవడం, వ్రాయడం కూడా తెలియని శ్రీరామకృష్ణులు ఏ శాస్త్రాలకు భాష్యం వ్రాశారు? శ్రీరామకృష్ణులను శ్లాఘిస్తూ స్వామి వివేకానంద చెప్పిన ఈ మాటలే అందుకు సమాధానం:

"వేద వేదాంతాలలో బోధించిన సత్యాలను శ్రీరామకృష్ణులు తమ జీవితంలో అనుష్ఠించి, సకల శాస్త్రాలకు సజీవ భాష్యమై నిలిచారు. శ్రీరామకృష్ణులను అధ్యయనం చేయకుండా వేదాలు, ఉపనిషత్తులు, భాగవతాది పురాణాలను అర్థం చేసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు."

సనాతన ధర్మానికి మూలాధారాలైన వేదాలు, ఉపనిషత్తులు ప్రబోధించిన సత్యాలకు సజీవ భాష్యమే శ్రీరామకృష్ణుల జీవితం అని నిర్ధరించే కొన్ని సంఘటనలను తెలుసుకుందాం:

**విశాలత్వం... ఉదారత్వం:** ఏ ధర్మమైతే అందరి ఆదరణ, అంగీకారం పొందుతుందో; అందరికీ ఆదర్శంగా నిలుస్తుందో అలాంటి ధర్మమే ఎన్ని యుగాలైనా, ఎన్ని తరాలైనా నిత్యమై, శాశ్వతమై విరాజిల్లుతుంది. ఏ ధర్మానికైతే అందరినీ తనలో ఇముడ్చుకోగల విశాలత్వం, అందరికీ కావలసినది అందించగల ఉదారత్వం ఉంటాయో – ఆ ధర్మమే దేశ, కాల, జాతి, మతాలకు అతీతంగా శోభిల్లుతుంది. అదే 'సనాతన ధర్మం'.

శ్రీరామకృష్ణులను ఆశ్రయించినవారు ఏ మతానికి, ఏ జాతికి, ఏ దేశానికి చెందినవారైనప్పటికీ అందరినీ సమాదరించి తనలో ఇముడ్చుకోగల విశాలత్వం ఆయనలో దర్శించవచ్చు. అలాగే, ఎవరి ఇష్టదైవాన్ని వారు దర్శించేలా అనుగ్రహించి, ఆశీర్వదించే ఉదారత్వం శ్రీరామకృష్ణులలో ఉన్న మహోన్నత లక్షణం. శ్రీరామకృష్ణునిలో భైరవీ బ్రాహ్మణి తన ఇష్టదైవమైన రఘువీరుణ్ణీ; అఘోరమణీదేవి తన ఇష్టదైవమైన గోపాలుణ్ణీ; ప్రభుదయాళ్, మిస్సిర్ అనే క్రైస్తవ భక్తులు తమ ఇష్టదైవమైన ఏసుప్రభువునూ; అబ్దుల్ వాజీజ్ అనే ముస్లిం భక్తుడు మహమ్మద్‌నూ; సిక్కు సంప్రదాయ భక్తులు గురు నానక్‌నూ దర్శించి, తరించారు.

శ్రీరామకృష్ణుల బోధనలకు ప్రభావితులైన విదేశీయులు ఎందరో ఉన్నారు. ప్రస్తుతం అమెరికా దేశంలో సుప్రసిద్ధ సంగీత దర్శకుడు ఫిలిప్‌గ్లాస్ భారతీయ సనాతన ధర్మాన్ని గురించి తెలుసుకోవాలనే కోరికతో వేదాలు, ఉపనిషత్తులు, భాగవత గ్రంథాల ఆంగ్లానువాదాలను చదువు తుండేవాడు. 1957వ సంవత్సరంలో భారతదేశం నుండి వెళ్ళిన ఒక యోగాచార్యుడు న్యూయార్కులో నిర్వహిస్తున్న ధ్యాన తరగతులకు హాజరయ్యాడు ఫిలిప్. సనాతన ధర్మం గురించి ఇంకా వివరంగా తెలుసుకోవాలన్న తన కోరికను ఆ యోగా చార్యునికి తెలియజేశాడు. అప్పుడు అతడు 'శ్రీరామకృష్ణ కథామృతం' గ్రంథాన్ని ఫిలిప్‌కు ఇచ్చి, చదవమని చెప్పాడు. ఫిలిప్ కథామృతాన్ని ఎంతో ఆసక్తితో చదవడం ప్రారంభించాడు. "నేను 1957 నుండి ఇప్పటి వరకు కథామృతాన్ని చదవని రోజంటూ లేదు. కథామృతం చదువుతుంటే వేదాలు, ఉపనిషత్తులు చదువుతున్నట్లు ఉంది. శ్రీరామకృష్ణుల బోధనలు వేద వచనాలే" అని ఫిలిప్ తన అనుభూతిని, సన్నిహితులతో తెలియజేశాడు.


ఫిలిప్ గ్లాస్

అతడు శ్రీరామకృష్ణుల సార్వజనీన బోధనలకు ఆకర్షితుడై 'The Passion of Ramakrishna' అనే సంగీత రూపకం రూపొందించి, ఐరోపా, అమెరికాలలో ప్రదర్శనలిస్తున్నాడు. విదేశాలలో ఈ సంగీత రూపకం విశేష ఆదరణ చూర గొంటోందని తెలుపుతూ, శ్రీరామకృష్ణుల బోధనలతో తరించి, ఇతరులను తరింపజేసే భాగ్యం కలిగినందుకు తాను నిజంగా ధన్యుడనంటూ ఆనందాన్ని వ్యక్తపరిచాడు ఫిలిప్.

హిందూ మతస్థుడైనా, క్రైస్తవ మతస్థుడైనా, ఇస్లాం మతస్థుడైనా – అందరూ శ్రీరామకృష్ణ సన్నిధిలో ప్రశాంతతను పొందినవారే! ఆధ్యాత్మిక అనుభూతులతో ధన్యులైనవారే! దేశ, కాల, జాతి, మతాలకు అతీతంగా అందరినీ సమానంగా ఆదరించే విశాలత్వం, ఎవరి ఇష్టదైవాన్ని వారు దర్శించేలా అనుగ్రహించే ఉదారత్వాలకు సజీవ భాష్యమే శ్రీరామకృష్ణులు.

**మానవజీవిత ఉద్దేశం:** మనలో నిగూఢంగా ఉన్న దివ్యత్వాన్ని సాక్షాత్కరింపజేసుకోవడమే మానవ జీవిత ఉద్దేశమని వేదాలు బోధిస్తున్నాయి. శ్రీరామకృష్ణులు కూడా మానవ జీవిత ఉద్దేశం భగవత్సాక్షాత్కారమని బోధించారు. ఆత్మసాక్షాత్కారానికి సాకారోపాసన, నిరాకారోపాసనలు రెండింటినీ నిర్దేశించాయి మన శాస్త్రాలు. శ్రీరామకృష్ణులు సాకారోపాసన ద్వారా జగన్మా తను దర్శించారు. సకలం ఆ సర్వేశ్వరి ఇచ్ఛానుసారమే జరుగు తుందని సంపూర్ణ శరణాగతి భావంతో జీవించారు. విగ్రహంలో దర్శించిన ఆ జగన్మాతనే సర్వత్రా దర్శించారు శ్రీరామకృష్ణులు.




నిరాకారోపాసనను నిరాకరించిన భైరవీ బ్రాహ్మణికీ, సాకారోపాసనను తిరస్కరించిన తోతాపురికీ భగవంతుడు అటు సాకారుడూ, ఇటు నిరాకారుడూ అనీ, సర్వత్రా ఆ పరమాత్మ చైతన్యమే వ్యాపించి ఉన్నదనీ నిరూపించారు శ్రీరామకృష్ణులు.

**మనస్సు, మాట ఒక్కటిగా..!:** 'వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠితమ్...' – నా మాట మనస్సుతో ఏకమవు గాక! నా మనస్సు మాటతో ఏకమవు గాక!' అని ఋషులు ప్రార్థించేవారు. కామ కాంచనాలను మనసా వాచా త్యజించిన శ్రీరామకృష్ణులు స్త్రీలందరిలోనూ ఆ జగన్మాతనే దర్శించారు. అలాగే మట్టి, రూపాయి నాణెం – రెండూ ఒకటేనని తలచి గంగలో విసిరేసిన తరువాత, తనకు తెలియకుండా తన దేహానికి రూపాయి నాణెం తగిలినా ఆయన కొంకర్లు తిరిగిపోయేవారు. దీన్నిబట్టి మనస్సు, మాట ఏకమవ్వాలంటూ మన శాస్త్రాలలో ప్రబోధించిన సత్యానికి సజీవ భాష్యం శ్రీరామకృష్ణుల జీవితం అనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు. మన సాధనలు సఫలీకృతం కావాలంటే 'మన్ ముఖ్ ఏక్ కరో– మనస్సు, మాట ఒకటిగా చేయి' అన్న శ్రీరామకృష్ణుల బోధ వేద వచనమే!



**మార్గాలు వేరైనా, గమ్యం ఒక్కటే! :** 'ఏకమ్ సత్ విప్రా బహుధా వదంతి – సత్యం ఒక్కటే, జ్ఞానులు అనేక పేర్లతో సంబోధిస్తారు' అన్నది ఋగ్వేద వచనం. శ్రీరామకృష్ణులు హిందూమతంలోని వైష్ణవ తాంత్రిక సాధనలు అనుష్ఠించడంతో పాటు క్రైస్తవ, ఇస్లాం మతసాధనలు కూడా అనుష్ఠించి, 'భగవంతుడు ఒక్కడే! ఆయనను చేరే మార్గాలు అనేకం' అని సర్వమత సమన్వయాన్ని చాటారు. శ్రీరామకృష్ణులను అవగాహన చేసుకుంటే ప్రపంచంలోని సర్వ మతాలనూ సులభంగా అర్థం చేసుకోవచ్చు. అందుకే శ్రీరామకృష్ణులను ఉద్దేశించి, 'Sri Ramakrishna is the masterkey that opens all the religions of the world' అని ఒక అమెరికన్ తత్త్వవేత్త అన్న మాటలు అక్షర సత్యాలు.

**అనూహ్యమైన అనుభవాలు:** ఇప్పటి వరకూ వేదాలు ప్రబోధించిన సత్యాలను శ్రీరామకృష్ణులు తమ జీవితంలో ఎలా అనుష్ఠించి చూపారో తెలుసుకున్నాం. కానీ శ్రీరామకృష్ణులు వేద వేదాంతాల్లో వివరించని సత్యాలను సైతం తమ జీవితంలో అనుభూతం చేసుకొన్నారు. ఆ అనూహ్యమైన అద్భుత సంఘటనలను కొన్నింటిని తెలుసుకుందాం:

1. మన శాస్త్రాలు వివరించిన ప్రకారం నిర్వికల్ప సమాధిస్థితిలో ఉన్న వ్యక్తి దేహం 21 రోజుల కన్నా ఎక్కువ కాలం నిలవదు. కానీ శ్రీరామకృష్ణులు నిర్వికల్ప సమాధి స్థితిలో సుమారు ఆరు నెలలు ఉండి, తిరిగి బాహ్యస్మృతిని పొందగలిగారు. ఈ అనూహ్యమైన సంఘటనకు జగన్మాత ఇచ్ఛే కారణం. అంతే తప్ప, ఇది వేరే తర్కానికి అందనిది.

2. మన శాస్త్రాల్లో భావముఖం గురించి ఎక్కడా వివరణ లేదని ఎంతోమంది పండితుల అభిప్రాయం. ఈ భావముఖ స్థితి గురించి శ్రీరామకృష్ణుల జీవితంలోనే ప్రప్రథమంగా మనం వినడం జరుగుతుంది. సమాధి అనుభూతులలో ఉన్న శ్రీరామకృష్ణులను 'భావముఖం'లో ఉండమని జగన్మాత ఆదేశించింది. 'భావముఖం' అంటే ఇంటి గడప మీద ఉంచిన దీపకాంతితో ఇంటి లోపలా, బయట కూడా ఎలా చూడగలుగుతామో, అలాగే భావముఖ స్థితిలో ఉన్న వ్యక్తి దివ్యభావంలో ఉంటూ, బాహ్య చైతన్యాన్ని కూడా కలిగి ఉంటాడు. శ్రీరామకృష్ణుల ఈ భావముఖ స్థితి జగన్మాత ఆయనకు ప్రసాదించిన అద్భుతవరం.

3. ఆత్మసాక్షాత్కారానికి అవరోధమైన మాయను అధిగమించడమే సాధకుల లక్ష్యం. ఆ మాయను జయించడం కోసం ఋషులు, యోగులూ ఏళ్ళ తరబడి తపస్సాధనలు చేస్తుంటారు. కానీ శ్రీరామకృష్ణులు అందుకు భిన్నమని ఈ సంఘటన తెలియజేస్తోంది.

ఒకరోజు శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరంలో భక్తులతో మాట్లాడుతూ, హఠాత్తుగా లేచి గంగానది వైపు తిరిగి, 'ఓ మాయా! దయచేసి ఇలా రా! ఓ మాయా! దయచేసి ఇలా రా..' అని పిలుస్తున్నారు. అప్పుడు అక్కడున్న గౌరీ మా అనే భక్తురాలు శ్రీరామకృష్ణులను, 'స్వామీ! అందరూ మాయ బారి నుండి తప్పించుకోవాలని జన్మల తరబడి ప్రయత్నిస్తుంటే, మీరు మాత్రం మాయను రమ్మని పిలుస్తున్నారేమిటి?' అని ప్రశ్నించింది. అందుకు శ్రీరామకృష్ణులు, 'నా మనస్సు సమాధిలో లయమైపోతుంది. మీ అందరితో భగవద్విషయాలను చర్చించడానికి, నా మనస్సును క్రిందికి దించమని మాయ సహాయాన్ని కోరుతున్నాను' అని బదులిచ్చారు.

సనాతన ధర్మానికి సజీవ భాష్యమై విరాజిల్లుతున్న భగవాన్ శ్రీరామకృష్ణులను అవగాహన చేసుకొని, ఆయన చూపిన మార్గంలో పయనించడానికి మనకు తగిన శక్తిని ప్రసాదించాల్సిందిగా ఆ అవతారవరిష్ఠుణ్ణి ప్రార్థిద్దాం. ❖

**శ్రీరామకృష్ణులను అధ్యయనం చేయకుండా వేదోపనిషత్తులు, భాగవతాది పురాణాలను అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. సకల శాస్త్రాల సజీవ భాష్యమే ఆయన జీవితం.** - స్వామి వివేకానంద

# హే భగవాన్! రామకృష్ణ భగవాన్!

చిన్నప్పుడు నరేంద్రుడి (స్వామి వివేకానంద)కి, 'భగవంతుణ్ణి చూసిన వారెవరైనా ఉన్నారా?' అన్న సందేహం కలిగింది. ఎంతోమంది మహానుభావుల దగ్గరకు వెళ్ళి 'మీరు భగవంతుణ్ణి చూశారా?' అని ప్రశ్నించాడు. కానీ ఎవరూ సరైన సమాధానం ఇవ్వలేదు. చివరకు శ్రీరామకృష్ణులు తన సమాధానంతో నరేంద్రుణ్ణి ఆకర్షించిన విషయం లోకవిదితమే!

ఇప్పటి మన సమస్య 'భగవంతుణ్ణి చూసిన వారెవరైనా ఉన్నారా?' అని కాదు; 'భగవంతుణ్ణి ఎలా చూడగలం?' అని కూడా కాదు; ఈ రోజుల్లో 'భగవాన్'లు కోకొల్లలు. ప్రస్తుతం వారి ఆట 'మ్యూజికల్ ఛైర్స్'ను గుర్తుకుతెస్తోంది.



భగవాన్‌ల మధ్య పోటీలు వచ్చి అంతా అయోమయంగా ఉంది. ఆటలో చివరికి మిగిలేది ఒక్కడే! అతడు ఎవరు? ఎలా గుర్తించాలి?

ఈ క్రింది లక్షణాలు ఉన్నవాడు భగవంతుడని విష్ణుపురాణం వర్ణిస్తోంది.

**ఐశ్వర్యం:** ఎవరి వద్ద ఎక్కువ డబ్బులు ఉంటే వారు ఐశ్వర్యవంతులని చాలామంది అనుకుంటారు. ఒకసారి ధనవంతుడొకడు, ఒక సాధువుకు బంగారు నాణాలు కానుకగా ఇచ్చాడు. ఆ సాధువు, 'నాయనా! ఎంతో విలువ గల నాణాలు నాకిచ్చావు. ఇలాంటి నాణాలు ఇంకా సంపాదించాలని అనుకుంటున్నావా?' అని అడిగాడు. దానికి ధనవంతుడు, 'అవును స్వామీ! నాకు ఇంకా ఎక్కువ ధనం సంపాదించాలని ఉంది' అన్నాడు. అప్పుడు ఆ సాధువు చిరునవ్వుతో, 'నువ్వు ఇంతగా ఆశ పడుతున్న ఈ నాణాలను నువ్వే ఉంచుకో' అని తిరిగి ఇచ్చేశాడు.

సుమారు 130 సంవత్సరాల క్రితం ఒక మార్వాడీ భక్తుడు, శ్రీరామకృష్ణులకు పదివేల రూపాయలు ఇవ్వబోగా శ్రీరామకృష్ణులు దాన్ని నిరాకరించారు. ఐశ్వర్యమంటే అది.

**ధర్మం:** ఒక వ్యక్తి యొక్క, జాతి యొక్క నడవడిని నియంత్రించే అంశమే ధర్మం. 'లోకంలో ధర్మం క్షీణించినప్పుడు, తన మాయ ద్వారా మానవ రూపంలో అవతరించి, అధర్మాన్ని అరికట్టి, తిరిగి మనిషికి శాంతి మార్గం చూపెడతా'నని భగవద్గీతలో భగవానుడు వాగ్దానం చేశాడు. శ్రీరామకృష్ణులను 'సర్వధర్మ స్వరూపులు', 'అవతార వరిష్ఠులు'గా అభివర్ణిస్తూ, వారి అవతార విశేషాన్ని మానవాళికి తెలియజేశారు - స్వామి వివేకానంద.

**యశస్సు:** యశస్సు అంటే ఖ్యాతి. నేటి సమాజంలో దీనిని ప్రకటనలు, ప్రచారాల ద్వారా పొందవచ్చు అనుకోవడం పరిపాటి. కానీ ఎంత ప్రకటించుకొన్నప్పటికీ ఏదో ఒక రోజున 'నకిలీ' గారు అపఖ్యాతి పాలవడం ఖాయం. వజ్రాల వ్యాపారికి మాత్రమే నిజమైన వజ్రాలు, వాటి యొక్క విలువ తెలుస్తాయి. మొదట అనేకులు శ్రీరామకృష్ణులను ఒక పిచ్చివాడిగా జమ కట్టారు. వైష్ణవచరణ్, గౌరీ పండితుడు, భైరవీ బ్రాహ్మణి, తోతాపురి మొదలైనవారు మాత్రం శ్రీరామకృష్ణుల యశస్సును గ్రహించి అవతారపురుషునిగా కొనియాడారు.

**శ్రీ:** ఇది ముఖంలో కనపడే కళ. వర్చస్సు. పేరు ముందర గౌరవప్రదంగా 'శ్రీ' వాడటం ఆనవాయితీ. కానీ దీన్ని నిజంగా పొందడం అన్నది మనిషి ఆంతరిక సౌందర్యంపై ఆధారపడి ఉంటుంది. ఈ కాలంలో 'భగవాన్'గా చలామణి అయ్యేవారు తమ భౌతిక 'తేజస్సు' కాపాడుకోవడానికి సిల్కు బట్టలు, 'టై'లు, క్రీములు, ఎయిర్ కండిషనర్లు వాడడం కద్దు. కానీ శ్రీరామకృష్ణులు, కాళీమాతతో - "అమ్మా! నాలోని కళను తగ్గించు. దీని వల్ల నానారకాల వాళ్ళు నా దగ్గరకు వస్తున్నారు. నిజంగా భగవంతుడి కోసం తపించేవారినే నా దగ్గరకు తీసుకు రా!" అని ప్రార్థించారు.

శ్రీరామకృష్ణులు ఆచరించి చూపిన ఆదర్శాలను మనమూ ఆచరించడానికి ప్రయత్నిద్దాం. అందుకు 'హే భగవాన్! రామకృష్ణ భగవాన్! నీ అడుగుజాడల్ని అనుసరించే శక్తిని మాకు ప్రసాదించు తండ్రీ!' అని గురుమహరాజ్‌ను ప్రార్థిద్దాం. ❖



# శివరాత్రి పూజావిధి

మహాశివరాత్రి మాఘమాసంలో కృష్ణ పక్షాన అర్ధరాత్రి వ్యాపకమైన చతుర్దశి తిథిలో వస్తుంది. చతుర్దశి తిథి శివునికి ప్రీతికరమైనది. శివుడు ఆ నాటి అర్ధరాత్రి కాలాన కోటి సూర్యసమప్రభతో లింగాకారంలో ఆవిర్భవించడం చేత దీనికి శివరాత్రి అనే పేరు వచ్చింది. దేవపూజ పగటిపూట కాక రాత్రిపూట సాగడం ఈ పండుగ ప్రత్యేకతలలో ఒకటి.

మహాశివరాత్రి వ్రతాచరణ విధానాన్ని లింగపురాణంలో వివరించారు. శివరాత్రినాడు జాగరణ చేస్తూ నాలుగు జాముల్లోనూ నాలుగుసార్లు శివపూజ సాగిస్తారు.

మొదటి జాములో శివుణ్ణి పాలతో అభిషేకించాలి. పద్మాలతో పూజ చేయాలి. పెసరపప్పు, బియ్యం కలిపి పులగం వండి, శివుడికి నైవేద్యం అర్పించాలి. ఋగ్వేద మంత్రాలు చదవాలి.

రెండవ జాములో పెరుగుతో అభిషేకం చేయాలి. తులసీ దళాలతో శివుణ్ణి అర్చించాలి. పాయసం నైవేద్యం పెట్టాలి. యజుర్వేద మంత్రాలు పఠించాలి.

మూడవ జాములో నేతితో అభిషేకించాలి. మారేడు దళాలతో శివుణ్ణి పూజించాలి. నువ్వుల పొడి కలిపిన తినుబండారం నైవేద్యంగా సమర్పించాలి. సామవేద మంత్రాలు చదవాలి.

నాలుగవ జాములో తేనెతో అభిషేకం చేయాలి. నీలోత్పలాలతో పూజించాలి. కేవలం అన్నం నైవేద్యం పెట్టాలి. అథర్వణ వేద మంత్రాలు చదవాలి. అభిషేకం జరుగుతుండగా శివదర్శనం చేయడం మహాపుణ్యప్రదమని చెబుతారు. శివుడు అభిషేక ప్రియుడు. కనుక పువ్వులు, పళ్ళు సమర్పించడం కన్నా అభిషేకాలతో శివుడు త్వరగా సంతుష్టుడవుతాడు. ❖

# శివాలయ రహస్యాలు

శివమందిరంలో ప్రప్రథమంగా నందికి ప్రణమిల్లాలి. నిజానికి ఎద్దుకు బుద్ధి తక్కువని మన అభిప్రాయం. కానీ నంది జ్ఞానస్వరూపుడైన శివుణ్ణి మోయడంవల్ల అందరి పూజలందుకొనే అర్హత పొందింది. అలాగే మనం కూడా భగవత్ జ్ఞానాన్ని మన మస్తిష్కంలో నిలుపుకోగలిగితే సర్వత్రా సన్మానింపబడతామన్నది దీని అంతరార్థం.

శివ నిర్మాల్యాన్ని దాటిన మానవుడు శక్తిహీనుడవుతాడు. పుష్పదంతుడనే గంధర్వుడు పుష్పాలను దొంగిలించే వేళలో అజ్ఞానవశుడై, శివనిర్మాల్యాన్ని దాటాడు. ఫలితంగా అదృశ్యమయ్యే వాని శక్తి నాశనమవుతుంది. శక్తి హీనుడు కాగానే అతడు భగవన్మహిమను గానం చేశాడు. అదే 'శివమహిమ్నః స్తోత్రమ్'. దానితో పుష్పదంతునికి తిరిగి శక్తి లభిస్తుంది.

మనం కూడా నిర్మాల్యాన్ని దాటకూడదు. అందుకే శివాలయానికి సంపూర్ణ ప్రదక్షిణ చేయరు. ఈ రహస్యాన్ని గ్రహించాలి. భగవదంకితమైన కార్యం, లేదా జీవనం – ఈ శివ నిర్మాల్యంలోకి పరిగణనకు వస్తుంది. అలాంటి జీవన యాత్రలో చరించే మహాత్ముల, కార్యాల విషయంలో ఇష్టాను సారం భాషించడమంటే శివనిర్మాల్యాన్ని లంఘించడంతో సమానమే అవుతుంది. అలాంటి పాపకార్యాలను ఆచరించే వాడు ఎంతటివాడైనా అల్పకాలంలోనే శక్తిహీనుడైపోతాడు. కనుక భగవదంకితమైన విత్త విషయంలో, భగవంతునికి సమర్పించిన కార్య విషయంలో, దేవాంకితమైన జీవనం విషయంలో మనం సావధానులమై సమ్మాన భావంతో వ్యవహరించాలి. అలాంటి కార్యాలనూ, వాటిని ఆచరించే వారినీ అవహేళన చేసే సమాజంలో అకాలమృత్యువు, కరువు కాటకాలు, భయాందోళనలు సామ్రాజ్యం చేస్తాయి. ఇది శాస్త్రవచనం.

శివుడు బాలచంద్రుణ్ణి శిరస్సుపై ధరించాడు. బాల చంద్రుడు కర్మ యోగానికి ప్రతీక. యథార్థమైన కర్మయోగిని మాత్రమే మహాదేవ భగవానుడు శిరస్సుపై ధరిస్తాడు. ❖

(ఫిబ్రవరి 20వ తేదీ, సోమవారం 'మహాశివరాత్రి')

విగ్రహాలు దివ్యరూపాలనే దృఢవిశ్వాసంతో ఆరాధించేవాడు భగవత్సాక్షాత్కారం పొందుతాడు. కానీ వాటిని మట్టి, రాయి అని భావించేవాడికి ఎలాంటి ప్రయోజనం కలుగదు. - శ్రీరామకృష్ణులు







# ఎన్నాళ్ళీ వ్యామోహాలు?

– స్వామి జ్ఞానదానంద

ఒకమారు నారదమహర్షి, శ్రీమహావిష్ణువు కలిసి సరదాగా నడుచుకుంటూ వెళుతున్నారు. ఈ లోకం పోకడలు, మనుష్యుల మనస్తత్త్వాలు, సంసార లంపటాలు తదితర విషయాలపై చర్చించుకుంటూ ఉన్నారు. ఇంతలో నారదుడు ఎంతో ఆసక్తితో 'ప్రభూ! మానవులకు ఎందుకింత సంసారాసక్తి? ఏముంది దాంట్లో? ఆ మాయ నుంచి బయటపడలేరా?' అంటూ సంశయం వెలిబుచ్చాడు. ఆంతరంగిక భక్తాగ్రేసరుడి అంతరంగాన్ని గుర్తించిన శ్రీమహావిష్ణువు చిద్విలాసంతో, 'ఆ విషయాన్ని తరువాత మాట్లాడుకుందాం! నాకు దాహమవుతోంది. ముందు కాసిని మంచినీళ్ళు తీసుకు వస్తావా?' అంటూ నారదుణ్ణి అర్థించాడు. 'ఓ! దానికేం ఇప్పుడే తెస్తాను, ఉండండి' అంటూ దూరాన ఉన్న ఓ ఇంటికి వెళ్ళాడు నారదుడు.

ఇంట్లోంచి ఓ పద్దెనిమిదేళ్ళ అందమైన యువతి మంచినీళ్ళు తీసుకొని వచ్చింది. ఒక్కసారిగా ఆ లోకసంచారి, ఆ లలనామణి అందానికి ముగ్ధుడైపోయాడు. తొలిచూపులోనే మోహంలో పడిపోయాడు. తన మనస్సులో మాట, ఆమె ముందుంచాడు. ఆమె సరేననడం, ఇంట్లో వాళ్ళూ వివాహానికి అంగీకరించడం క్షణాల్లో జరిగిపోయాయి. అలా నారదుడు గృహస్థుడై, సమీపంలోని ఏటి ఒడ్డునే ఓ చిన్న ఇల్లు కట్టుకున్నాడు. భార్య, పిల్లలు, సంపాదన... ఇలా క్షణం తీరిక లేకుండా, సంసారంలో కూరుకుపోయాడు. కుటుంబ సభ్యుల ఆలనా పాలనలో మమేకమై పోయాడు.



వృద్ధాప్యంలో కూడా ఇంకా కష్టపడుతూనే ఉన్నాడు. ఇంతలో హఠాత్తుగా ఒకరోజు ఉరుములు, మెరుపులతో ప్రారంభమైన వర్షాలు వరదగా మారి, ఏటి ఒడ్డున నారదుడు కట్టుకున్న కుటీరాన్ని ముంచెత్తాయి. భార్యాపిల్లలు నీళ్ళలో కొట్టుకు పోతుండడంతో నారదుడు దిక్కుతోచక అరుస్తూ ఉన్నాడు.

ఇంతలో శ్రీమన్నారాయణుడు, 'నారదా! నేనడిగిన మంచి నీళ్ళేవి?' అంటూ వెనక నుంచి వీపు తట్టాడు. 'మంచి నీళ్ళేంటి!' అంటూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు నారదుడు. 'ఇదే సంసారం నాయనా!' అంటూ నారదుడి భుజంపై చేయివేసి నడిపించుకుంటూ వెళ్ళాడు శ్రీమహావిష్ణువు.

ఈ కథలో లాగానే పసితనం నుంచి పండుటాకులా రాలిపోయేవరకూ మనుష్యులు ఇల్లు, పిల్లలు, సంసారం... వీటి మధ్యే బొంగరాలలా తిరుగుతున్నారు. అందుకే ఆది శంకరాచార్యులు ఆవేదనతో...

**బాలస్తావ త్క్రీడాసక్తః
తరుణస్తావ త్తరుణీసక్తః ।
వృద్ధస్తావత్ చిన్తాసక్తః
పరే బ్రహ్మణి కోఽపి న సక్తః ॥**

అన్నారు. అవును! బాల్యమంతా ఆటల్లో ఆసక్తి చేత, యౌవనమంతా స్త్రీ వ్యామోహం చేత, వార్ధక్యం సంసార చింతనల చేత – జీవితాన్నంతా ఇలా గడుపుతారే కానీ, పరబ్రహ్మపై ఆసక్తి గలవారెవ్వరూ లేరు. ఈ లౌకికమైన జీవితం రసహీనమని తెలిసినా, ఆ పరమాత్మపై ఆసక్తినీ, ప్రీతినీ పెంచుకోలేక పోతున్నారు. వివేకహీనులై ఇంకా భౌతిక సుఖాల వైపునకే వెర్రిగా పరుగులు తీస్తున్నారు.

### ఆయువు అత్యంత చపలం:

జీవితం గురించి ఎక్కువగా ఊహించేసుకొని, యుగయుగాలు ఇలాగే ఉండిపోతామన్న భ్రమల్లో మునిగితేలుతున్నాం. అందుకే శ్రీరామచంద్రుడు తీవ్ర వైరాగ్యంతో...

**ఆయు రత్యంత చపలం,
మృత్యు రేకాంత నిష్ఠురః ।
తారుణ్యం చాతి తరళం,
బాల్యం జడతయాహృతమ్ ॥**

అంటాడు వసిష్ఠ మహర్షితో! నిజమే! ఈ ఆయువు చూద్దామా – అత్యంత చపలమైంది. ఇక మృత్యువా – అల్లంత దూరంలో, అత్యంత క్రూరంగా ఎదురుచూస్తోంది. ఈ జీవుడేమో 'యౌవనం' అనే అందమైన, తెలివైన మోసగత్తెను చూసి, మద, మాన, గర్వాదులు పొందుతూ, క్షణంలో విచక్షణ కోల్పోతున్నాడు. కానీ యౌవనం శాశ్వతమా? కాదు. ఇది వాస్తవానికి క్షణికం. ఇక బాల్యం చూద్దామా – అది దట్టమైన అజ్ఞానంతో కప్పివేయబడి

ఉంటుంది. దీర్ఘంగా ఆలోచిస్తే, బాల్యమంతా కల్పిత క్రీడా మయమే కదా! యౌవనమేమో స్త్రీ సాంగత్యం, స్వోత్కర్షల వంటి అనేక దురహంకార చర్యలతో నిండినదై, కృశించి పోతుంది. ఇక ముసలితనం ప్రవేశించిందా - అన్నీ కష్టాలే. ఈ విధంగా జనులు వ్యర్థజీవనులు అవుతున్నారు. ఈ లోగా మృత్యువు వచ్చి, వడలిన శరీరాన్ని నోట కరుచుకుపోతుంది. 'ఏంటి ఈ జీవితం' అని ఎన్నో సార్లు అనిపించినా, లౌకికులు అలాగే నెట్టుకుంటూ వస్తున్నారే కానీ భగవంతుడి వైపు ఆకర్షితులు కావడం లేదు. చాలా సందర్భాల్లో ఆ విధాత మనకు గుణపాఠాలు నేర్పిస్తూ, పరోక్షంగా తన వైపు మనస్సు మళ్ళేలా ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. అయినా కూడా ఇంకా ఈ లౌకికమైన విషయాల్ని పట్టుకునే వేళ్ళాడుతూ ఉంటాం.

**సంసారమే సర్వస్వమా? :** 'లోకులు భార్యాబిడ్డలకై కడివెడు కన్నీరు కారుస్తారు. కానీ భగవంతుడి కోసం ఎవరు విలపి స్తున్నారు? జనం దృష్టి లౌకిక వస్తువులపైనే స్థిరపడినట్లుగా నాకు కనిపిస్తుంది. పొట్టపోసుకునే ప్రయత్నంలోనే వారంతా ఉరుకులు పరుగులు పెడుతున్నారు. ఏ ఒక్కరి లోనూ భగవత్ చింతన మృగ్యం. నిజానికి భగవంతుడి వైపుగా ఎంతగా పురోగమిస్తూ ఉంటావో అంతమేరకు కర్మకలాపాలు తగ్గిపోతూ ఉంటాయి. భోగాసక్తిని త్యాగం చేస్తే, మరణసమయంలో భగవంతుడే స్మరణకు వస్తాడు. లేకుంటే భార్యాబిడ్డలు, ఇల్లు, సంపద, పేరుప్రతిష్ఠలు తదితర సంసార విషయాలే జ్ఞప్తికొస్తాయి. అందుకే భగవన్నామ గుణకీర్తనలు, ధ్యానం, చింతనలు సర్వదా అభ్యసిస్తూ ఉండాలి' అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమ హంస. ఇలా భగవంతుడే కేంద్రబిందువుగా బ్రతకకపోవడం వల్లనే మనకు ఇన్ని కష్టాలు దాపురిస్తున్నాయి. ఎప్పుడో చివరి రోజుల్లో చూసుకోవచ్చులే - అన్న అజ్ఞానంతో కూడిన ధీమాతో తొలినాళ్ళంతా కుసంస్కారాలతో గడిపేస్తున్నాం. అలా దొంతరల్లా పేరుకుపోయిన గాఢమైన సాంసారిక సంస్కారాల వల్ల జీవన మలిసంధ్యలో అసలు భగవంతుడే గుర్తుకురాడు!



అందుకే మనకు మనమే ఓ విరామాన్ని కల్పించుకొని, ఏకాంతంగా ఆ దేవదేవుడి గుణగానానికీ, నామస్మరణకూ సమయం కేటాయించుకోవాలి.

**దుఃఖం నుంచి దుఃఖానికే..! :** ఈ లోకంలో భగవంతుడు తప్ప, ఆనందాన్నిచ్చే వస్తువు ఇంకోటి లేదు. ఈ సుఖాల సరంజామా అంతా మనల్ని ఒక దుఃఖం నుంచి మరో దుఃఖం వైపునకు తీసుకెళతాయే కానీ, సుఖం వైపు కాదు. అవి సంపాదించుకునే వరకు 'కావాలి, కావాలి' అనే ఆశ. తీరా వచ్చాక, పోతాయేమోననే భయం! ఇలా మనం వాటిని అనుభవించడం లేదు; అవే మనల్ని అనుభవిస్తున్నాయి. బాల్యం, యౌవనం, వృద్ధాప్యం - ఇలా మనల్ని కష్టనష్టాల మరలో ఇరికించి, పీల్చి పిప్పి చేసి కాటికి చేర్చేస్తున్నాయి. అందుకే శ్రీకాళహస్తీశ్వర శతకంలో ధూర్జటి ఇలా అంటారు....

**అంతా సంశయమే శరీర ఘటనంబంతా విచారంబె లో**
**నంతా దుఃఖపరంపరాన్వితమె, మేనంతా భయభ్రాంతమే**
**యంతానంత శరీర శోషణమె దుర్వ్యాపారమే దేహికిన్**
**చింతన్నిన్నుదలంచి పొందరు నరుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

ఓ శ్రీకాళహస్తీశ్వరా! పరీక్షించి చూడగా, ఈ జగత్తు అంతా సందేహంతో కూడినదే. ఈ శరీరం పుట్టుక పరిశీలించి చూడ వలసిన విషయమే. లోపలనున్న జీవుణ్ణి చూస్తే, ఒక దుఃఖం నుంచి మరో దుఃఖం మాదిరిగా ఒక జన్మ నుంచి మరో జన్మకు ప్రయాణించడమే! శరీరమంతా భయభ్రాంతులతో కూడుకున్నదే! పరిశీలిస్తే, శరీరాన్నంతా శుష్కింపజేసే విషయాలే! ఈ ప్రాణికి చివరకు మిగిలేదంతా చెడు నడతే! కాబట్టి మనుష్యులు నిన్ను తలంచినచో ఇలాంటి చింతలేవీ పొందరు కదా! అని ధూర్జటి స్పష్టం చేస్తున్నాడు.

**పరమాత్మలోనే పరమానందం :** ఒక్కసారిగా భగవంతుడి వైపు ఆకర్షితులమైతే, ఈ లౌకికమైన విషయాలన్నీ తుచ్ఛమైనవిగా తోస్తాయి. పరమాత్మ అందించే పరమానందం ముందు ఈ సంసార సుఖాలు అల్పమైనవిగా కనిపిస్తాయి. కానీ దురదృష్టవశాత్తూ, మనం ఆయనను విశ్వసించడం లేదు; సేవించడం లేదు. అందుకే మనల్ని ఆ విధాత అలుపెరగకుండా పరుగులు తీయిస్తున్నాడు. మనకు మనమే శరణాగతులమై, ఆ భగవంతుడికి విన్నవించు కుంటే మనల్ని బంధనాల నుంచి తొలగిస్తాడు. కానీ మనుష్యుల మనస్సుల్లో ఎక్కడో ఇంకా ఇల్లూ, పిల్లలు, సంసారంపై అనురక్తి మిగిలే ఉంటుంది. అందుకే అందులోనే పడి కొట్టుకుపోతున్నా, ఆయన ఒడ్డుకు చేర్చలేకపోతున్నాడు. శ్రీమద్భాగవతం ఇలా అంటోంది....

**మిము సద్భక్తి భజింపనొల్ల కిల దుర్మేధం ప్రవర్తించు నీ**
**చ మతివ్రాతము నేర్పునం పసుల పాశశ్రేణి బంధించు చం**
**దమునంపెక్కగు నామరూపములచేతన్ వారి బంధించు దు**
**ర్గమ సంసార పయోధి త్రోతువు దళత్కంజాత పత్రేక్షణా!**

'మహాత్మా! నిను భక్తితో సేవించకుండా దుర్మదాంధులై ప్రవర్తించే వారిని పశువులను బంధించినట్లు నామరూపాలతో బంధించి, సంసారసాగరంలో పడదోస్తావ'ని జ్ఞాపకం చేస్తోంది.

ఇకనైనా ఈ భౌతికమైన వ్యామోహాలు తగ్గించుకొని, మనస్సులో పరమాత్ముణ్ణి స్మరించుకుంటే ఆయనే మన బాధల్ని తొలగించి, బాధ్యతను తన చేతిలోకి తీసుకుంటాడని ఆది శంకరులు హితవు పలుకుతున్నారు. ❖



**చమురులో తడిసిన కాగితం మీద వ్రాయలేము. అలాగే దుర్గుణాలు, విషయభోగాలు అనే నూనెలో నాని పాడైన మనస్సుపై పారమార్థిక భావాలు నిలువవు.** - శ్రీరామకృష్ణ పరమహంస




# రామకృష్ణ మిషన్, రాజమండ్రి

రామకృష్ణ–వివేకానంద నగర్, వివేకానంద రోడ్, రాజమండ్రి – 533 105

Email: rkmcharitydispensary@gmail.com

## గిరిజన సంచార వైద్యశాల - 'హాస్పటల్ ఆన్ వీల్స్'

రాజమండ్రిలోని రామకృష్ణ మిషన్ 1984వ సంవత్సరం (27 సంవత్సరములు) నుండి గిరిజనులకు సంపూర్ణ వైద్యసేవలు అందిస్తోంది. తూర్పుగోదావరి జిల్లా ఏజెన్సీలోని రంపచోడవరం (రాజమండ్రి నుండి 52 కి.మీ.), పోతవరం (రాజమండ్రి నుండి



45 కి.మీ.), వెలగపల్లి (రాజమండ్రి నుండి 69 కి.మీ.), జడేరు (రాజమండ్రి నుండి 80 కి.మీ.) – వంటి మారుమూల గిరిజన ప్రాంతాలలో రాజమండ్రి రామకృష్ణ మిషన్ వారానికి 4 రోజులపాటు క్రమం తప్పకుండా (మందులు, రక్త పరీక్షలు, ఎక్స్–రే మొదలైన) వైద్యసేవలు అందిస్తోంది.

వైద్య సదుపాయం అందని గిరిజన గ్రామాల్లో వైద్యశిబిరాల్ని నిర్వహించి అనేక గిరిజన పేదరోగులకు సాధారణ వ్యాధులకు వైద్యసదుపాయంతో పాటు టి.బి., మలేరియా, మధుమేహం, కామెర్లు, హెచ్.ఐ.వి. లాంటి వ్యాధులకు కూడా వైద్యసేవలను అందిస్తోంది.



కనీస రవాణా సౌకర్యము, ఆర్థిక స్తోమత కూడా లేని గిరిజనులకు 'గుమ్మం ముంగిట వైద్యం' అనే బృహత్తర పథకం ద్వారా అధునాతన పరికరములతో సంచార ఆసుపత్రి (హాస్పటల్ ఆన్ వీల్స్)– లేబొరేటరీ, 20ఎమ్.ఎ. ఎక్స్–రే, ఇ.సి.జి., స్కానింగ్ మరియు ఇతర సదుపాయాలతో వైద్యసేవలు అందిస్తోంది.

సంచార ఆసుపత్రి సౌకర్యము ఇంకా మారుమూల గిరిజన ప్రాంతాల్లో ఏర్పాటు చేయుటకు, మందులు, లేబొరేటరీ కెమికల్స్, ఎక్స్–రే ఫిల్మ్స్, స్కానింగ్ పిక్చర్ రోల్స్, వాహనములకు ఇంధనము మరియు ఇతర ఖర్చుల కొరకు ఉదారహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషుల నుండి ఆర్థిక సహాయాన్ని కోరుచున్నాము.

రాజమండ్రి నుండి సుమారు 100 కి.మీ.ల దూరంలో 500 మంది గిరిజన రోగులకు సంచార వైద్యశాల ఏర్పాటుకు వైద్యులు, తదితర బృందం రవాణా, మందులు, పైన తెల్పబడిన వైద్య సౌకర్యముల నిమిత్తం రోజుకు రూ. 25,000/– నుండి రూ. 35,000/– వరకు వ్యయమవుతుంది.

పేద, బాధిత గిరిజనుల ఆరోగ్యపరిస్థితిని మెరుగుపరిచే బృహత్తర కార్యక్రమములో భాగంగా మీ పేరుతో లేక మీ సంస్థ పేరుతో వైద్యశిబిరం నిర్వహించడానికి ఆర్థిక వనరులను



సమకూర్చవలెనని కోరుచున్నాము.

రోగినారాయణ సేవా కార్యక్రమం నిరాటంకంగా సాగేందుకు మిమ్మల్ని భాగస్వాములుగా ఆహ్వానిస్తున్నాము.

విరాళాలను Ramakrishna Mission, Rajahmundry పేరున చెక్కు/డి.డి తీసి Ramakrishna Mission, Rajahmundry, Ramakrishna Vivekananda Nagar, Vivekananda Road, Rajahmundry -533 105 చిరునామాకి పంపించగలరు. విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

భగవత్సేవలో

**స్వామి అక్షరాత్మానంద**

కార్యదర్శి

ADVT.

# అహం బ్రహ్మాస్మి

- హేమంత్ కుమార్

'అహం బ్రహ్మాస్మి'. నేను బ్రహ్మను. నిజమే! అనడం తేలికే కానీ అవడమే కష్టం. ఇక్కడొక విశేషముంది. వైరుధ్యముంది. రుద్రుడు కాని వాడు రుద్రార్చనకు అర్హుడు కాదు అంటుంది యజుర్వేదం. నిజమే! కానీ రుద్రుడుగా మారాలంటే, ఆ స్థాయికి ఎదగాలంటే మళ్ళీ రుద్రార్చనే చేయాలి. ఈ సంక్లిష్ట అంశాన్ని మనం ఎలా అన్వయించుకోవాలి? ఎలా అర్థం చేసుకోవాలి? ఎలా ఆచరణ సాధ్యం చేసుకోవాలి?

మనం సూక్ష్మంగా ఆలోచిస్తే పరిష్కారం దొరుకుతుంది. దేన్ని పొందాలన్నా మనకు ముందుగా అర్హత ఉండాలి. ఆ అర్హతను పొందేందుకు సాధన అవసరం. రుద్రార్చన చేయాలంటే రుద్రుడు కావాలి. కానీ ఎలా? ఆ గుణాలను సాధనతో సాధించాలి. ప్రేమతో ప్రోది చేసుకోవాలి. నిష్ఠతో నిబద్ధీకరించుకోవాలి. గంగానదిలో స్నానం చేయాలంటే ముందుగా స్నానమాచరించి పవిత్రంగా రమ్మని చెప్పినంత మాత్రాన గంగానదిలోనే మునిగి పోవాలనేం లేదు. బయట స్నానం చేసి శుచియై రావచ్చు. ఆ తర్వాత గంగలో మునగవచ్చు. రుద్రార్చనకు రుద్రుడుగా మారడం కూడా ఇలాంటిదే.

భగవంతుడు అత్యంత పవిత్రుడు. నిర్మలుడు. అగణిత గుణశోభితుడు. అలాంటి తత్త్వాన్ని, కనీసం ఆ ఛాయల్ని మనం సాధించే ప్రయత్నం చేయాలి. అందుకు ప్రాథమిక యత్నంగా మనలోని మాలిన్యాలనూ, అవగుణాలనూ తొలగించుకునే సాధన ప్రారంభించాలి. ఆసురీ గుణాలను మట్టుబెట్టి, దైవ గుణాలను అవలంబించాలి. భగవత్ భావనలతో అంతరంగాన్ని శోభాయమానం చేసుకోవాలంటే ముందుగా మనో దర్పణాన్ని మసకబారేలా చేసిన ధూళిని తొలగించుకోవాలి. ఆంతరంగిక అలంకరణ తర్వాతే బాహ్య సాధనలు.

మనం చూస్తూ ఉంటాం. శివారాధకులు నుదుటి మీద విభూతి రేఖలు, మెడలో రుద్రాక్ష మాలలు ధరిస్తారు. రుద్రాక్ష మాలతోనే జపం చేస్తారు. విష్ణు భక్తులు తిరునామాలు, గంధపు బొట్లు, మాలలు ధరిస్తారు. తులసిమాలతో జపం చేస్తారు. ఆంతర్యంలోనే కాదు. బాహ్యంలోనూ, అలవాట్లు, ఆచరణల్లోనూ వారి ఇష్టదైవాన్ని ప్రతిబింబిస్తారు. వసంతం వచ్చిందంటే చెట్లు చిగురిస్తే చాలదు. మల్లెలు పూయాలి. మామిళ్ళు కాయాలి. కోయిలలు కూయాలి. సర్వవిధాలా ప్రకృతి శోభాయమానమై పోవాలి. భక్తుడూ అంతే! ఆ 'వరదుణ్ణి' వసంతంలా మన జీవన ప్రకృతిలోకి ఆహ్వానించాలంటే, మన జీవన స్థితి,గతి, మతి - అన్నీ ఆయనగా మారాలి. జీవిత సర్వస్వం భక్తి సారస్వతమైపోవాలి. ప్రేమ పూరితమైపోవాలి.

శ్రీరామకృష్ణులు సాధనా కాలంలో అన్ని మతాల సాధనలూ అనుష్ఠించి సత్యం ఒక్కటే అని నిర్ధరించారు. ఆ యా ప్రత్యేక సాధనా దశల్లో ఆయన బాహ్యాభ్యంతరాల్లో ఆ యా దేవతలుగా మారిపోయేవారు. ఆ భావంలోనే ఉండిపోయేవారు. దేవ పూజా క్రమంలో ఆయన స్త్రీలా చీర ధరించేవారు. నగలు అలంకరించుకునేవారు. ఆహార్యమే కాదు, హావభావాలు, కంఠస్వరం కూడా స్త్రీలా మారిపోయేవి. అణువణువునా కోమలత్వం తొణికిసలాడేది. ఒక సందర్భంలో మథుర్‌బాబు ఆయనను చూసి ఆ క్రొత్త మహిళ ఎవరని ఆరా తీసే స్థాయికి రామకృష్ణుల స్త్రీత్వం సహజసిద్ధమై పోయింది. హనుమదారాధన చేసే కాలంలో అచ్చు మర్కటంలా ప్రవర్తించేవారు. చెట్లెక్కడం, పళ్ళు తినడం, కొమ్మ నుంచి కొమ్మ మీదికి గెంతడం, ఆ హావభావాలు...! చివరకాయనకు పృష్ఠ భాగంలో రెండంగుళాల మేర తోకలా పెరిగిపోయింది.

అంటే దీని అర్థం కేవలం వేషభాషలే కాదు. మనోగతి రీత్యా కూడా మమేకమైపోవడమన్నమాట. ఆ దేవతను ఆవాహన చేసుకోవడమన్నమాట. ఆవాహన చేసుకోవడమంటే ఆవాహయామి లాంటి ఒక మంత్రంతో జరిగే పని కాదు. వేషధారణతో అయ్యే పని అంత కన్నా కాదు. మనో వాక్కాయ కర్మలతో ఆ దేవతను తనదిగా చేసుకోవడం! ఆ దేవతగా తాను మారిపోవడం. ఇదే రుద్రుడుగా మారడం. దేవిగా అయిపోవడం. నారాయణుడిగా రూపాంతరం చెందడం.

మన జీవన విధానాన్ని మార్చుకుంటే, 'నేను' అనే ఈ ప్రాపంచిక శిలను పారమార్థిక శిల్పంగా మలచుకుంటే, మనం 'ఆవాహయామి' అని కూడా ఆహ్వానించనక్కర్లేదు. అంతర్యామిగా మనలో స్వయంభువుగా వెలసివున్న ఆయన క్రమేణా వ్యక్తం అవుతాడు. చివరకు విశ్వరూపి అయి అభివ్యక్తం అవుతాడు. అప్పుడు రుద్రార్చనకే కాదు, 'అహం బ్రహ్మాస్మి' అనేందుకు కూడా అర్హత లభిస్తుంది. అధికారం సిద్ధిస్తుంది. ❖

**సమస్తం ఈశ్వరేచ్ఛతోనే జరుగుతుందనే దృఢవిశ్వాసంగల వ్యక్తి తాను ఈశ్వరుడి చేతిలో కేవలం పరికరాన్నని భావిస్తాడు. అలాంటి వ్యక్తి ఈ జన్మలోనే ముక్తుడవుతాడు.** - *శ్రీరామకృష్ణ పరమహంస*




# RAMAKRISHNA MISSION

P.O. BELUR MATH, DIST. HOWRAH, WEST BENGAL - 711 202

ఫోన్ : 033- 2654 1144/1180, Email : rkmhqoffice@gmail.com, Website: www. belurmath.org


# రామకృష్ణ మిషన్ పాలక వర్గ సంగ్రహ నివేదిక 2010 - 2011

రామకృష్ణమిషన్ 102వ వార్షిక సర్వ సభ్య సమావేశం 2011 డిసెంబర్ 11 ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు బేలూరు మఠంలో జరిగింది. బేలూరుమఠంలోనూ, ఇతరమఠ కేంద్రాల్లోనూ భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలు వైభవంగా జరిగాయి. ఈ సందర్భంగా జమ్మూ రామకృష్ణ మిషన్ కేంద్రం ఉర్దూ భాషలో 'శ్రీరామకృష్ణ కథామృతం' (సంక్షిప్తం) ను 'శ్రీరామకృష్ణ కె ఇక్వాల్-ఎ-జరీన్' పేరున ప్రచురించింది.

స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాల సందర్భంగా 4 సంవత్సరాల (2010-2014) సేవా కార్యక్రమాల పథకాన్ని ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ ప్రారంభించారు. స్వామి వివేకానంద జీవితం-సందేశాలను వర్ణించే చిత్రాలతో కూడిన 'వివేక్ ఎక్స్‌ప్రెస్'ను కేంద్ర రైల్వేమంత్రి హౌరా స్టేషన్‌లో ప్రారంభించారు. ఈ వివేక్ ఎక్స్‌ప్రెస్ 2014 జనవరి నాటికి సుమారు లక్ష కిలోమీటర్లు పర్యటిస్తూ దేశంలోని ప్రధాన నగరాలను సందర్శించ నుంది. 08-10-2010 నుండి 10-06-2011 వరకు కేంద్ర ప్రభుత్వ సహాయ నిధితో నిర్వహించిన సేవాకార్యక్రమాలపై 8.20 కోట్ల రూపాయలను వ్యయం చేసింది.

**విద్యారంగంలో** కొత్తగా ప్రవేశపెట్టిన కొన్ని ముఖ్య పథకాలు: కోయంబత్తూర్ కేంద్రం తమిళనాడు రాష్ట్రప్రభుత్వ సహాయంతో 'మాడ్యులర్ ఎంప్లాయిబుల్ స్కిల్స్ ప్రోగ్రామ్'ను, కేంద్రప్రభుత్వ సహాయంతో 'ట్రయినర్స్ ట్రయినింగ్ ప్రోగ్రామ్ ఫర్ ది స్టాఫ్ ఆఫ్ ఇండో జింబాబ్వే టూల్ రూమ్, హరారె ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, జింబాబ్వే'ను ప్రారంభించింది. వివేకానంద యూనివర్సిటీ 'ఎన్విరాన్‌మెంట్ & డిజాస్టర్ మేనేజ్‌మెంట్', 'థియరిటికల్ ఫిజిక్స్'లో పి.హెచ్.డి. కోర్సులను; నరేంద్రపూర్ కేంద్రంలో 'అగ్రికల్చరల్ బయోటెక్నాలజీ'లో రెండేళ్ళ ఎమ్.ఎస్‌సి. కోర్సులను ప్రారంభించింది. నరేంద్రపూర్ లోక్‌శిక్షా కేంద్రం దక్షిణ 24 పరగణాలో ఆర్థిక సహాయం, మధ్యాహ్న భోజన సదుపా యాలతో 'చైల్డ్ లేబర్ స్కూల్'ను ప్రారంభించింది.

**వైద్యరంగంలో** కొన్ని ముఖ్యమైన కొత్త పథకాలు: ఢిల్లీ కేంద్రం టి.బి. క్లినిక్‌లో 'ఎలక్ట్రానిక్ మేనేజ్‌మెంట్ ఆఫ్ ట్యూబర్క్యులోసిస్ కేసెస్' విభాగాన్నీ; కాన్పూర్ కేంద్రం ఫిజియో థెరపీ విభాగాన్నీ; రాంచీ టి.బి. సానిటోరియం కేంద్రం 20 పడకల వైద్య విభాగాన్నీ; గార్బెటా కేంద్రం కంటి శస్త్రచికిత్సా విభాగాన్నీ; నారాయణ్‌పూర్ కేంద్రం దంత, ఫిజియోథెరపీ విభాగాల్నీ ప్రారంభించాయి.

**గ్రామీణాభివృద్ధిరంగంలో** కొన్ని ముఖ్య పథకాలు : గుజరాత్‌లోని లింబ్డి కేంద్రం వివిధ గ్రామాలలో 11 చెరువులనూ, రాంచీ (మోరాబాది) కేంద్రం 23 చెరువులనూ త్రవ్వించాయి. నరేంద్రపూర్ లోక్‌శిక్షాపరిషత్ గోవుల సంరక్షణ పథకం; గ్రామీణ యువతకు, మిల్క్ ఫెడరేషన్ సభ్యులకు డైరీఫార్మింగ్ శిక్షణా కేంద్రం; పూర్వ, పశ్చిమ మెదినీపూర్ రైతుల కొరకు 10 సాయిల్ టెస్టింగ్ ప్రయోగ శాలలను ప్రారంభించింది.

**నూతన కేంద్రాలు:** ఈ సంవత్సరంలో రామకృష్ణ మఠం పశ్చిమబెంగాల్‌లో నౌరాలో నూతన కేంద్రాన్ని, కోల్‌కతాలో బలరాం మందిర్ కేంద్రం 'శ్యామ్‌పుకూర్‌బాటి' ఉపశాఖను ప్రారంభించింది.

**నూతన అభివృద్ధి పథకాల్లో** కొన్ని ముఖ్యమైనవి : తిరువనంతపురం కేంద్రం 'క్రిటికల్‌కేర్ యూనిట్'ను, కార్డియాలజీ క్లినిక్'ను; చెన్నై కేంద్రం సెల్ కౌంటర్, ఎక్స్‌రే యూనిట్, కంటి విభాగాలను; రాజ్‌కోట్ కేంద్రం నేత్రవిభాగం; ఘట్‌శిల కేంద్రం సంచారవైద్య కేంద్రంను ప్రారంభించాయి. రాజ్‌కోట్ కేంద్రం బడుగు వర్గాల కోసం 60 గృహాలను, మరుగుదొడ్లను నిర్మించింది.

**విదేశాలలో అభివృద్ధి కార్యక్రమాలు :** సింగపూర్ కేంద్రం నిర్వహిస్తున్న శారదా కిండర్‌గార్టెన్ మూడు పురస్కారాలను గెలుచు కుంది. వీటిని ఎమ్.ఓ.ఇ.; ఏ.ఇ.సి.ఇ.ఎస్. ప్రదానం చేసింది. దక్షిణాఫ్రికాలోని డర్బన్ కేంద్రం అగ్రికల్చరల్ ప్రాజెక్ట్‌ను, దంత విభాగాలను ప్రారంభించింది. బ్రెజిల్ కేంద్రం ప్రచురణ విభాగంను ప్రారంభించింది. బడుగు వర్గాల వారికి పోషకాహారాన్ని అందించింది. జపాన్ కేంద్రం శ్రీరామకృష్ణ కథామృతం, కొన్ని ఉపనిషత్తులు, స్వామీజీ సాహిత్యాన్ని జపాన్ భాషలోకి అనువాదం చేయించింది. అర్జెంటీనా కేంద్రం మానసిక వికలాంగుల కోసం స్పానిష్ భాషలో 'మా అర్జెంటీనా వై సస్ అర్జెంటినస్' పుస్తకాన్ని ప్రచురించింది. బంగ్లాదేశ్‌లో హబిగంజ్ కేంద్రం కిండర్‌గార్టెన్‌ను ప్రారంభించింది.

**పునరావాస కార్యక్రమాలు :** ఈ సంవత్సరంలో 3.43 కోట్ల రూపాయల వ్యయంతో రామకృష్ణ మఠం, మిషన్ల ఆధ్వర్యంలో దేశంలోని అనేక ప్రాంతాలలో చేపట్టిన విస్తృత సహాయ పునరావాస కార్యక్రమాల వలన 1729 గ్రామాలలోని 68 వేల కుటుంబాలకు చెందిన 1.68 లక్షల మంది లబ్ధిపొందారు.

**సంక్షేమ పథకాలు :** పేద విద్యార్థులకి ఉపకార వేతనాలు మంజూరు చేయడం; వృద్ధులకీ, వ్యాధిగ్రస్థులకీ, నిరాధారులకీ ఆర్థిక సహాయం చేయడం వంటి సంక్షేమ కార్యక్రమాలకు అయిన ఖర్చు మొత్తం 11.65 కోట్ల రూపాయలు.

**వైద్యసేవలు :** వైద్యరంగంలో 102.91 కోట్ల రూపాయల వ్యయంతో 15 ఆస్పత్రులు, 129 వైద్యశాలలు, 61 సంచార వైద్యశాలల ద్వారా 45.44 లక్షల మందికి పైగా ప్రజలకు వైద్య సేవలందించడం జరిగింది.

**విద్యారంగం :** విద్యాసంస్థలలో కిండర్‌గార్టెన్ నుండి విశ్వ విద్యాలయ స్థాయి వరకూ సుమారు 3.22 లక్షల మంది విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. వీరి విద్యాభ్యాసానికి 197.50 కోట్ల రూపాయల వ్యయం అయింది.

**గ్రామీణ గిరిజన అభివృద్ధి పథకాలు :** గ్రామీణ గిరిజన అభివృద్ధికై చేపట్టిన వివిధ పథకాల నిమిత్తం 33.37 కోట్ల రూపాయలు వినియోగించడం జరిగింది.

నిరంతరం అంకిత భావంతో మాకు సహాయ సహకారాలు అందించిన దాతలకూ, సభ్యులకూ, మిత్రులకూ, శ్రేయోభి లాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ధన్యవాదములతో...

**స్వామి ప్రభానంద**
ప్రధాన కార్యదర్శి

# శక్తి సముద్ర తరంగం

కాలమహిమతో మానవుల్లో త్యాగశక్తి లోపించింది. లక్ష్యాల పట్ల, నిర్దుష్ట సౌశీల్యాల పట్ల దృష్టి లోపించింది. బుద్ధికుశలత లోపించింది. వట్టి ఆచారాన్ని పట్టుకుని వ్రేళ్ళాడడం ఎక్కువైంది. పురాణాల్లో వివృతాలైన వేదాంత సత్యాలను వదలి, వట్టి కథాంశాలను పట్టుకొని పరమేశ్వరుని గుణాలకు వ్యాఖ్యాప్రాయాలైన మూర్తి విశేషాలతో ఒకరి కంటే మరొకరెక్కువని వాదనలోకి దిగారు.

ఫలితంగా వేదమతమైన సనాతనధర్మం విభిన్న శాఖలుగా చీలిపోయింది. వ్యక్తులు పరస్పర ద్వేష హృదయులై కలహిస్తూ, ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకోవడం ప్రారంభించారు.

ఇలాంటి పరిస్థితిలో భగవాన్ శ్రీరామకృష్ణులు భారతదేశంలో అవతరించి, స్వచ్ఛమైన సనాతన ధర్మాన్ని ఆచరణలో పెట్టి చూపించారు. బహు శాఖలుగా చెదిరి పోయిన సనాతనధర్మ ఏకతా స్వభావాన్ని ప్రదర్శించారు. ఈ శాఖలు పైకి భిన్నంగా కనిపించినా, పరస్పరం కలహ సంకులాలై ఉన్నట్లుగా తోచినా, విభిన్నంగా అగపడుతున్నా, ప్రజల నందరినీ తప్పుదోవలకు ఈడుస్తున్నట్లు కనిపిస్తున్నా విదేశీయుల చేత అపహాస్యం పాలవుతున్నా, వీటిలో అంతర్లీనమైంది సనాతన ధర్మమొక్కటే! జీవితాన్ని ఈ సనాతన ధర్మానికి ప్రతిబింబ రూపంగా ఉదాహరణగా ప్రదర్శించి చూపారు.

శ్రీరామకృష్ణుల పవిత్ర ముఖారవిందం నుండి వెలువడిన బోధనలు శ్రుతిగోచరాలైనవి. కాబట్టి అవి ఆధ్యాత్మిక శక్తిభరితాలు. అందుచేత అవి ప్రపంచమంతటా దివ్యకాంతులను వెదజల్లుతూనే ఉంటాయి.

దాస్యంలో మగ్గుతూన్న జాతికి సహజ గుణాలైన నిష్కారణ వైరం, ఈర్ష్యాద్వేషాలు మొదలైన దుర్గుణాలు కొందరు శ్రీరామకృష్ణుల కీర్తిప్రతిష్ఠల విషయంలో చూపిస్తున్నారు. వారికి మేం చెప్పేదిది:

"ప్రియమిత్రులారా! మీ ప్రయత్నం కేవలం వ్యర్థం. ఎందుకంటే ప్రస్తుతం ఈ విశ్వమంతా ఆవరించిన అనంత మైన ఈ రామకృష్ణ మహాతరంగం ఏదో వ్యక్తిగతమైన పేరు, కీర్తి, ధనం మొదలైన వాటి కోసం మేం చేసిన ప్రయత్న ఫలితమైతే మీరెవరూ ప్రయత్నించకుండానే ఇదంతా నశించిపోతుంది. అది ప్రకృతి సిద్ధమైన ధర్మం. స్వలాభానికై చేసిన ధర్మం వల్ల చిరస్థాయి అయిన ఫలితం కలుగదు. ఇది ఈ రామకృష్ణ మహాతరంగం. ఈ తరంగం మీద దివ్యకాంతితో భాసిస్తూ, దివ్యమూర్తిగా శ్రీరామకృష్ణులు నిలబడి ఉన్నారు. ఈ మహాప్రవాహం ఒక మహాపురుషుని హృద్గతమైన నిస్స్వార్థ ప్రేమప్రవాహమే అయితే ఆ విశ్వజనని, ఆ మహేశ్వరి ఇచ్ఛాశక్తిని అడ్డగించడం ఎవరికీ సాధ్యం కాదు."

ఈ యుగావతరణం సమస్త ప్రపంచానికి, ముఖ్యంగా భారత దేశానికి జరగబోయే కల్యాణానికి మూలం. దీనికి కారకుడు భగవత్ స్వరూపుడైన శ్రీరామకృష్ణుడు. ప్రాచీన సనాతన ధర్మ సంస్థాప కులంతా ఏకాకృతి పొంది పునరుద్భవించిన మూర్తి. ఓ మానవుడా! విశ్వసించు. నీ హృదయంలో ప్రతిష్ఠించుకో. ❖






- స్వామి మేధానంద పురి

- సోమసీతారాములు, భువనగిరి

**? : వేదంలో చెప్పిన రీతిగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలను గురించి సంక్షిప్తంగా తెలియజేయ ప్రార్థన.**

✍: **అన్నమయ కోశం:** తైత్తిరీయ ఉపనిషత్తులో బ్రహ్మవల్లీ ప్రథమ అనువాకంలో అన్నమయ కోశం గురించి చెప్పారు. ఆత్మ నుండి పంచభూతాలు ఉత్పత్తి అయ్యాయి. వాటిలో భూమి నుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నం, ఆ అన్న పరిణామం ఈ పురుషుడు. ఈ పురుషునికి మనకు కనపడే శిరస్సు - శిరం. ఇక కుడిచెయ్యి దక్షిణం వైపు ఉన్న రెక్క, ఎడమ చెయ్యి ఉత్తరం వైపు ఉన్న రెక్క, కాళ్ళు, చేతులు, తల ఉన్న మధ్యమ భాగం - ఆత్మ. నాభి నుండి క్రింద భాగం తోక. ఈ విధంగా మనిషి శరీరాన్ని పక్షితో పోల్చారు. శాఖాచంద్రన్యాయం ద్వారా లోలోపలికి ప్రవేశించుట చెప్పారు. ఈ స్థూల శరీరాన్నే 'అన్నమయ కోశం' అంటారు. అన్నం ద్వారా భూతాల ఉత్పత్తి, అంటే ప్రజల ఉత్పత్తి జరుగుతుంది.

**ప్రాణమయ కోశం:** అన్నమయ కోశం కన్నా వేరైన ప్రాణమయ కోశం దీని లోపల ఉంది. ఈ ప్రాణమయ కోశం, అన్నమయ కోశం లోపల పూర్తిగా వ్యాపకమై ఉంది. ఆ ప్రాణమయ కోశం కూడా పురుషుని ఆకారాన్నే కలిగియుంది. అచ్చులో వేసిన ప్రతిమ లాగా అన్నమయ కోశం లోపల ఈ ప్రాణమయ కోశం ఉంది. నోటి ద్వారా, ముక్కు ద్వారా వెలువడే ప్రాణవాయువే - దీనికి శిరస్సు. వ్యాన వాయువు దక్షిణపు రెక్క. అపాన వాయువు ఉత్తరపు రెక్క. ఆకాశం మధ్యశరీరం. పృథివీ పుచ్ఛం, అనగా తోక. ఇచ్చట ఆకాశం అంటే - సమానవాయువు. పృథివి అంటే ప్రాణము ధరించు పృథివీ దేవత - ఉదాన వాయువు. అన్ని ప్రాణులూ ఈ ప్రాణం ద్వారా జీవిస్తున్నాయి. ఈ ప్రాణమయ శరీరాన్ని బ్రహ్మరూపంగా ఉపాసన చేసేవారు సంపూర్ణ ఆయువుకు అధికారులు అవుతారు. పూర్వ అన్నమయ స్థితికి ఈ ప్రాణమయ కోశమే (స్థితి) కారణము. అన్నమయ కోశాన్ని బ్రహ్మరూపంగా ఉపాసన చేసేవారికి సంపూర్ణంగా అన్నం లభ్యమవుతుంది.

**మనోమయ కోశం:** ప్రాణమయ శరీరం లోపల మనోమయ శరీరం ఉంది. ఇది కూడా పురుషాకారం కలది. దీనికి యజుర్వేదము- శిరము. ఋగ్వేదము- దక్షిణ పక్షము (రెక్క). సామవేదము- ఉత్తర పక్షము (రెక్క). వేదాలలో కర్మకాండమైన బ్రాహ్మణ భాగం - మధ్య శరీరం. అథర్వణ వేదం- ఆధారం (తోక).

**విజ్ఞానమయ కోశం:** మనోమయ కోశం కన్నా భిన్నమైన విజ్ఞానమయ కోశం లోపల ఉంది. అది సంపూర్ణంగా మనోమయ కోశంలో వ్యాప్తమై ఉంది. దానికి శ్రద్ధయే- శిరము. ఋతము అంటే నిశ్చిత బుద్ధి- దక్షిణ పక్షం. సత్యము - ఉత్తరపక్షం. యోగం అంటే సమాధానం - మధ్యశరీరం. మహః అనగా మొదట సృష్టిలో ఉత్పన్నమైనదీ, సృష్టికి కారణం- ఆధారం (తోక). విజ్ఞానమయ కోశాన్ని బ్రహ్మదృష్టితో ఉపాసన చేసేవారు దాని యందే అన్ని భోగాలూ అనుభవిస్తారు.

**ఆనందమయ కోశం :** మనోమయ శరీరానికి విజ్ఞానమయం ఆత్మ. కానీ ఈ విజ్ఞానమయ కోశం కన్నా భిన్నమైన ఆనందమయ కోశం దాని లోపల ఉంది. ఈ విజ్ఞానమయ కోశం, ఆనందమయ కోశంతో నిండి ఉంది. ఆనందమయం కూడా పురుషాకారంలో ఉంది. దానికి ఇష్టమైన పుత్రాదుల దర్శనం ద్వారా లభించే ప్రియస్వరూపం శిరము. ఆ ప్రియమైన సుఖము 'ప్రమోదము' ఉత్తరపక్షం. ప్రియుల దర్శనం వల్ల లభించు సుఖం - 'మోదం'. అది దక్షిణపక్షం. ఆనందం మధ్యశరీరం. బ్రహ్మపుచ్ఛం అనగా తోక. పక్షికి ఆధారం తోక. ఈ కోశాలకు ఆధారం ఆత్మరూపమైన బ్రహ్మమే అది. విషయ సుఖాలు క్షణికాలు, అనిత్యాలు. బ్రహ్మచర్యం, శ్రద్ధ, తపస్సుల ద్వారా జ్ఞానాన్ని పెంపొందించుకొని మనస్సును శుద్ధి చేసుకొన్న కొద్దీ మనలోని అజ్ఞానం నశించి, లోపలనున్న ఆ బ్రహ్మానందం అనుభవం లోనికి వస్తుంది. అందుకే ఈ పంచకోశాల వర్ణన. ❖

విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా॥
తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంతనింత నదివో వారె
చల్లని తమ్మిరేకుల సారసపు కన్నులు
మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా ॥
గరుడ కిన్నెర యక్షకామినులు గములై
విరహపు గీతముల వింతాలాపాల
పరిపరివిధముల పాడేరు రాగాల నిన్నదివో
సిరిమొగపు దెరచి చిత్తగించవేలయ్యా ॥
పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజభవాదులు నీ పాదాలు చేరి
అంకెలనున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుడా రెప్పలు విచ్చి చూచిలేవయ్యా ॥

# విన్నపాలు వినవలె...

–శ్రీమతి బి.కృష్ణకుమారి

ముల్లోకాలను తన మాయల మంత్రజలంతో మైమరపించే మధుసూదన హరికే మేలుకొలుపు పాడుతూ మురిసిపోతున్నాడు పదకవితా పితామహుడు అన్నమయ్య. వింత వింతల తన విన్నపాలను వినమని ఆ వేంకటరమణుడిని వేడుకుంటూ, సకల దేవతలు శ్రేణులుగా నిలచి, ఆ శ్రీవల్లభుడి కరుణాకటాక్షాల కోసం వేచి ఉన్నారని విన్నవించుకుంటున్నాడు. తన ఎద పానుపుపై పాపవినాశకుడైన ఆ పరాత్పరుడిని పవళింపజేసి, పన్నగాన్నే దోమతెరగా కట్టాడు ఈ పరమ భక్తాగ్రేసరుడు. అలా ఆదమరచి నిదురించిన ఆ ఆపద్బాంధవుణ్ణి ఆత్మీయంగా తట్టిలేపు తున్నాడు; ఆ దేవదేవుడి శయనవిలాసాన్ని తన అంతరంగంలో ఆవాహన చేసుకుంటున్నాడు. నిజానికి శ్రీవేంకటేశ్వరునికి మేలుకొలుపు! సర్వజగత్తుకే మేలుకొలుపు! అందుకే 'ఓ స్వామీ! తెల్లవారుజామైంది! దేవతలు, మునులు విచ్చేశారయ్యా! పన్నగపు దోమతెర తొలగించుకొని తామరరేకుల వంటి కన్నులను మెల్లమెల్లగా విచ్చి మేలుకోవయ్యా! గరుడ, కిన్నెర, యక్షగా మినులు గుంపులు గుంపులుగా చేరి నీకై విరహగీతాలు ఆలపిస్తు న్నారు. తుంబురుడు, నారదుడు, శేషాదులు, బ్రహ్మాది దేవతలు నీ పాదాల వద్దకు చేరి దాసులై ఉన్నారు. ఓ స్వామీ! నీ దేవేరి అలమేల్మంగ నీ వద్దనే ఉన్నది! ఓ వేంకటేశ్వరా! మెల్లగా నిద్దురలేచి లోకాలనేలవయ్యా! భక్తుల విన్నపాలు వినవయ్యా!' అంటూ ప్రియభక్తుడై ప్రార్థిస్తున్నాడు.

### పన్నగపు దోమతెర...

శ్రీమహావిష్ణువుకు ఆదిశేషుడు ఆప్తుడు; ఆయన శయనానికి ఆధారభూతుడు. అలా ఆ బ్రహ్మాండరూపుడికి పలు భోగోప కరణాలుగా శేషుడు సేవచేస్తాడట! అట్లే ఆ పన్నగం ఇక్కడ దోమతెరగా కూడా రూపెత్తి సేవిస్తున్నట్లు, అన్నమయ్య విలక్షణ మైన భావచిత్రణతో అలరింపచేస్తూ...

**విన్నపాలు వినవలె వింత వింతలు**
**పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా ॥** అంటూ కీర్తిస్తున్నాడు. పానుపుపై పన్నగాన్నే దోమతెరగా కట్టుకొని, కునుకు తీస్తున్న శ్రీనివాసా! మా విన్నపాలు వినడానికి, కాస్త ఆ దోమతెరను పైకెత్తి మేలుకోవయ్యా! అంటూ అర్థిస్తున్నాడు. సాక్షాత్తూ ఆ భగవంతుడిని నిద్దుర లేపే చొరవ భక్తుడు కాకుండా మరెవరు తీసుకుంటారు! అందుకే ఆ అనాథ రక్షకుడి ఆత్మకు ప్రతిరూపమైన అన్నమాచార్య అత్యంత సామీప్యభావనతో ఆ అవకాశాన్ని అందిపుచ్చుకున్నాడు. త్రేతాయుగంలో యజ్ఞసంరక్షణార్థం విశ్వామిత్రునితో వెళ్ళిన రామలక్ష్మణులు గంగా, సరయూ సంగమ ప్రదేశంలో ఉన్న పవిత్రాశ్రమంలో గడుపుతారు. రాత్రి గడచిన పిమ్మట ప్రభాతవేళ విశ్వామిత్ర మహర్షి కూడా తృణశయ్యపై పవళించి ఉన్న రామ లక్ష్మణులను మేల్కొలిపే భాగ్యాన్ని పొందుతూ...

**కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,**
**ఉత్తిష్ఠ నర శార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్....** అంటాడు. 'కౌసల్యా నందనుడవైన ఓ శ్రీరామచంద్రా! ఉదయం అవుతోంది! నర శ్రేష్ఠుడా! నిద్రలేచి స్నాన సంధ్యాదులు నిర్వర్తించుమ'ని తొందరపెడతాడు.

### కన్నులు విచ్చి మేలుకోవయ్యా...

మొద్దునిద్దరతో దుప్పటి తన్ని పడుకున్న బిడ్డను లాలనతో కబుర్లు చెప్పి తట్టిలేపే కన్నతల్లిలా ఇక్కడ ఆ కొండలరాయుడి నిద్రమత్తు వదిలిస్తున్నాడు తాళ్ళపాక

(మిగతా 32వ పేజీలో...)

**చీమ ప్రాణాన్నైనా విడుస్తుంది కానీ పానకాన్ని విడువదు. అలాగే భగవంతుణ్ణి ఆశ్రయించిన భక్తుడు అన్నింటినీ విడిచిపెడతాడు కానీ భగవంతుని సాన్నిధ్యాన్ని వదలడు.** - శ్రీరామకృష్ణులు



# శ్రీరామకృష్ణ మఠం


మైలాపూర్, చెన్నై - 600 004

ఫోన్ నెం : 044 - 24621110

Email: mail@chennaimath.org www.chennaimath.org


## భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలు

(2012 ఫిబ్రవరి 22-26)

చెన్నై శ్రీరామకృష్ణమఠం దివ్యజనని శ్రీశారదామాత సందర్శనతో పునీతమైన పరమపవిత్ర ఆధ్యాత్మిక కేంద్రం. ఆధ్యాత్మిక తేజోమూర్తి, శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన స్వామి రామకృష్ణానంద ఈ మఠాన్ని స్థాపించడం విశేషం. మరెందరో గురుదేవుల శిష్యులు ఈ మఠాన్ని సందర్శించి పావనం గావించారు.

చెన్నై శ్రీరామకృష్ణ మఠం, శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలను పురస్కరించుకొని 2011 నుంచి 2012 వరకు వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తోంది. ఇందులో భాగంగా 'ప్రతి ఇంటా సత్సంగం' అనే పేరుతో భక్తుల గృహాల్లో వార, పక్ష, మాస సత్సంగాలను నిర్వహించి వారిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని జాగృతపరచాలని సంకల్పించింది. ఇప్పటి వరకు 200లకు పైగా సత్సంగాలను నిర్వహించింది.

ఈ నేపథ్యంలో 2012 ఫిబ్రవరి 22 నుంచి 26 వరకు మఠంలో వివిధ ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలను వైభవంగా నిర్వహించాలని ఓ పథకాన్ని రూపొందించింది. 2012 సంవత్సరంలో భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలతో పాటు, చెన్నై రామకృష్ణ మఠం విశ్వజనీన ఆలయ సంప్రోక్షణం జరిగి పన్నెండేళ్ళు పూర్తవడం కూడా యాదృచ్ఛికం.

శ్రీరామకృష్ణుల విశ్వజనీన మందిరం, పరిసర భవనాల మరమ్మతులు చేయాల్సిన అవసరం ఏర్పడింది. శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాల సందర్భంగా ఆలయ మరమ్మతులు పూర్తి చేసి, శోభాయమానంగా తీర్చిదిద్ది 2012 ఫిబ్రవరిలో మరోమారు శ్రీరామకృష్ణులకు దేవాలయాన్ని పునరంకితం చేయాలని తలంచాము.

ఈ పునరుద్ధరణ పనులకు దాదాపు రూ.82 లక్షలు వ్యయమవుతుందని అంచనా.

| | | |
|---|---|---|
| 1. విశ్వజనీన ప్రధాన మందిర మరమ్మతులకు | - రూ. | 7 లక్షలు |
| 2. ఆలయానికి రంగులు వేయడానికి | - రూ. | 6 లక్షలు |
| 3. పురాతన (వందేళ్ళ) ఆలయ పునరుద్ధరణకు | - రూ. | 17 లక్షలు |
| 4. పురాతన ఆలయానికి రంగులు వేయడానికి | - రూ. | 3 లక్షలు |
| 5. మఠం ప్రహరీగోడ మరమ్మతులకు | - రూ. | 8 లక్షలు |
| 6. మఠం ప్రాంగణంలోని కాలిబాటలకు | - రూ. | 22 లక్షలు |
| 7. ఇతర పనులు నిమిత్తం | - రూ. | 4 లక్షలు |
| 8. శ్రీరామకృష్ణుల జయంతి ఉత్సవాలకు | - రూ. | 15 లక్షలు |
| **మొత్తం** | **రూ.** | **82 లక్షలు** |

ఈ నవీకరణ, పునర్నిర్మాణాల నిమిత్తం భక్తులు, శ్రేయోభిలాషులు ఉదారంగా విరాళాలనిచ్చి శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలను ఘనంగా నిర్వహించేందుకు సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

మీ విరాళాన్ని Sri Ramakrishna Math, Chennai, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Math, Mylapore, Chennai - 600 004 చిరునామాకు పంపాల్సిందిగా మనవి. మీ విరాళాలకు సెక్షన్80(జి) కింద ఆదాయపుపన్ను మినహాయింపు వర్తిస్తుంది.

మీ విరాళాలను ఆన్‌లైన్‌లో కూడా పంపే సౌకర్యం ఉంది. 'Sri Ramakrishna 175' విభాగం కింద బ్యాంకుకు నేరుగా పంపవచ్చు. దీనికి సంబంధించి IFSC/Swift కోడ్ వివరాల కోసం ఈమెయిల్ ద్వారా సంప్రతించండి. అంతర్జాతీయ విరాళాలు కూడా కృతజ్ఞతతో స్వీకరించబడును.

భగవత్సేవలో

**స్వామి గౌతమానంద**

అధ్యక్షులు



# సర్వం సరస్వతీ స్వరూపం

మన కుటుంబాల్లో ఓ అలవాటు ఉంది. కాగితాలను కానీ, పుస్తకాలను కానీ, అవతల వాళ్ళను కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ కాళ్ళతో తాకం! ఒకవేళ పొరపాటున కాలు తగిలితే, వెంటనే చేతులతో కళ్ళకు అద్దుకుంటాం. పుస్తకాలు, సంగీత వాద్యాలు, విద్యా సామగ్రిని ఎంతో పవిత్రమైనవిగా భావించాలంటూ చిన్నప్పటి నుంచి బోధించడం భారతీయ సంప్రదాయం. అందుకే, ఏ మాత్రం పొరపాటున కాలు తగిలి, అపచారం జరిగినా క్షమాపణగా చేతులతో కళ్ళకు అద్దుకొని, మన గౌరవం ప్రదర్శిస్తాం.

దీనికి కారణం లేకపోలేదు. భారతీయుల దృష్టిలో జ్ఞానం ఎంతో పవిత్రమైనది. దైవంతో సమానమైనది. కాబట్టి, సర్వకాల సర్వావస్థల్లో దాన్ని గౌరవించాలి. ప్రాచీన భారతీయ సంప్రదాయంలో మామూలు విద్య నుంచి, ఆధ్యాత్మిక విద్య దాకా ప్రతిదీ దైవ సమానమే. అన్నింటినీ గురువు గారి సమక్షంలో గురుకులంలో నేర్చుకోవాల్సిందే! విద్యా సామగ్రికి దేనికీ పొరపాటున కూడా కాళ్ళు తగలకూడదు. దాన్ని బట్టి భారతీయ సంస్కృతిలో జ్ఞానానికి అత్యధిక ప్రాధాన్యం ఇస్తూ వచ్చారని గ్రహించవచ్చు. ఇలా చిన్నప్పటి నుంచి పిల్లలకు బోధించడం వల్ల పుస్తకాల పట్ల, చదువు పట్ల వారి అంతరాంతరాళాల్లో అపారమైన గౌరవం చోటు చేసుకుంటుంది.

అందుకే, అప్పటికీ, ఇప్పటికీ ఏటా శరన్నవరాత్రుల్లో చేసుకొనే దసరా పండుగలో భాగంగా పూజ నిర్వహిస్తుంటాం. దీన్నే 'సరస్వతీ పూజ', లేదా 'ఆయుధ పూజ' అంటాం. పుస్తకాలనూ, వాహనాలనూ, యంత్ర సామగ్రినీ అన్నిటినీ అర్చిస్తాం.

అంతెందుకు! ఇప్పటికీ, ప్రతిరోజూ చదువు మొదలుపెట్టే ముందు సరస్వతీ ప్రార్థన చేస్తాం.

***సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ ।***
***విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥***

'తల్లీ! సరస్వతీదేవీ! సమస్త కోరికలనూ తీర్చే మాతా! నేను నీకు నమస్కరిస్తున్నాను. చదువు మొదలుపెడుతున్నాను. నా ప్రయత్నం సదా సఫలమయ్యేలా అనుగ్రహించు' అని కోరుకుంటాం.

ఇక వ్యక్తుల విషయంలో అయితే, పెద్దలకు పిల్లల కాళ్ళు తగిలినా, పిన్నలకు పెద్దల కాళ్ళు తగిలినా క్షమాపణగా కళ్ళకు అద్దుకోవడంలో మరో అంతరార్థం కూడా ఉంది. సర్వం భగవత్ స్వరూపమే కాబట్టి, అవతలి వ్యక్తి, లేదంటే వస్తువు ఎవరైనప్పటికీ, ఏదైనప్పటికీ, అక్కడా ఉన్నది దేవదేవుడే! మనిషిని సాక్షాత్తూ ఆ భగవంతుడు నివసిస్తున్న అందమైన, సజీవ ఆలయంగా భావిస్తాం. కాబట్టి, అనుకోకుండా మన కాలు తగలడం ద్వారా ఆ వ్యక్తిలోని దైవత్వానికి తెలియక అగౌరవం చేసినట్లవుతుంది. అనుద్దేశపూర్వకంగా చేసిన ఆ అపరాధానికి తక్షణమే మన్నింపు కోరడమే ముఖ్యం. ఈ రకంగా మన భారతీయ సంస్కృతిలో, అలవాట్లలో ఎన్నో చిన్న చిన్న అంశాల్లో ఎంతో నిగూఢమైన తాత్త్విక అర్థాలు దాగున్నాయి. మన సంస్కృతీ సంప్రదాయాలు శతాబ్దాలుగా పరిఢవిల్లుతుండడానికి అదే కారణం. ❖

## పండుగలు - పర్వదినాలు

### ఫిబ్రవరి- 2012

| | | | |
|---|---|---|---|
| 03 | శుక్రవారం | : | భీష్మ ఏకాదశి |
| 07 | మంగళవారం | : | స్వామి అద్భుతానంద జయంతి |
| 18 | శనివారం | : | ఏకాదశి |
| 20 | సోమవారం | : | మహాశివరాత్రి |
| 23 | గురువారం | : | భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతి (తిథి ప్రకారం) |

### మార్చి- 2012

| | | | |
|---|---|---|---|
| 04 | ఆదివారం | : | ఏకాదశి |
| 08 | గురువారం | : | శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |
| 11 | ఆదివారం | : | స్వామి యోగానంద జయంతి |
| 18 | ఆదివారం | : | ఏకాదశి |
| 23 | శుక్రవారం | : | ఉగాది |

నీ మనోభావాలపట్ల ద్రోహివి కాబోకు. నిష్కపట హృదయంతో, నిర్మల మనస్సుతో భగవంతుణ్ణి ప్రార్థించు. అప్పుడు ఆయన నీ ప్రార్థనలను తప్పక ఆలకిస్తాడు. - శ్రీరామకృష్ణులు



# మనశ్శాంతి కావాలంటే...

– స్వామి చంద్రశేఖరేంద్ర సరస్వతి

చిత్తశుద్ధి, మనశ్శాంతి కలగడానికి కొన్ని మార్గాలున్నాయి. మన పెద్దలు ఈ విషయాలను అతి శ్రద్ధతో అనుసరిస్తూ వచ్చినందువల్లనే జీవితంలో వారికి తృప్తి, సంతోషాలకు కొదవ లేదు. మనమూ వారు వెళ్ళిన మార్గాల్లో అనుగమిస్తే, మన జీవితాలు శాంతిప్రదాలవుతాయి. మన పూర్వీకులు ఆ రోజుల్లో స్నేహబాంధవ్యాలను చక్కగా పాటించేవారు. ఒక ఇంట్లో పెండ్లి జరిగినా, లేదా ఏదైనా అశుభం జరిగినా అందరూ కలసి, పరస్పర సాహాయ్యకంగా ఉండేవారు. ఆ సహాయం ఈ రోజుల్లోలా బాహిర ప్రకటనగా, ప్రచార ఉద్దేశ్యంతో ఉండేది కాదు. బీదలకు సహాయం పేరు కోసమో, గొప్పల కోసమో కాకుండా నిజంగా వారి అభివృద్ధిని మనసారా కాంక్షించే చేసేవారు.

పూర్వం బంధువర్గంలో ధనికులకూ, బీదలకూ జీవన విధానంలో పెద్ద వ్యత్యాసం ఉండేది కాదు. ధనికులైనవారు బీద బంధువులకు విశేషంగా ధనసహాయం చేసేవారు. దీనిని వారు ధర్మకార్యంగా భావించేవారు. బాధితునికి చేసే సహాయం, సహాయం పొందినవాని కన్నా సహాయం చేసినవారి చిత్తశుద్ధికి ఎక్కువ తోడ్పడుతుంది. ముఖ్యంగా పరోపకారాన్ని ఈశ్వరారాధనగా భావించి చేసినప్పుడు, ప్రత్యక్షంగా అవి ఇతరుల కోసం చేసినట్లు కనిపించినా వాస్తవంగా అవి మన చిత్తశుద్ధికీ, ఆత్మతృప్తికీ కారకాలవుతాయి. మనం చేసే ఉపకారం ఇతరులకు లాభిస్తుందో లేదో, వారికి ఆ ఉపకారం అవసరమో లేదో, ఆ కార్యాల వల్ల మనకు కలిగే తృప్తి, సంతుష్టి చేత అది పరోపకారమే కాక, స్వోపకారంగా పరిణమిస్తుందని కొంచెం ఆలోచిస్తే తెలుసుకోగలం. అలాంటి పరోపకార కార్యక్రమాలు చేసేటప్పుడు శ్రమదాయకంగా ఉన్నా, తరువాత కలిగే అవ్యక్తానందం వర్ణనాతీతం.

కానీ ఇదంతా ఇప్పుడు మారిపోయింది. ఈ కాలపు ప్రజలు పూర్వకాలపు బాంధవ్యం మరచిపోయారు. చాలా వరకు సంపన్నులకు సహాయబుద్ధి కొరవడింది. పూర్వం విరివిగా అన్నదానం చేసేవారు. కానీ ఈ కాలంలో ధనికులు ఉన్నవారికే విందు వినోదాల రూపంలో అన్నదానం చేస్తున్నారు. బీదలను పట్టించుకోవడం లేదు. ద్రవ్యమేమో విచ్చలవిడిగా ఖర్చవుతున్నా, ఆ ఖర్చు ధర్మానికో, సత్కార్యానికో మాత్రం వినియోగించడం లేదు. ఈ విందు వినోదాలు ఓ వేడుకలా, తమ వైభవాన్ని చాటుకునేందుకే చేస్తున్నారు. ఇందులో పరోపకారం అన్న ప్రసక్తే లేదు. అంతా స్వార్థపూరితమే!

పూర్వకాలంలో అన్నదానమో, ద్రవ్యదానమో చేసేటప్పుడు, దాతకూ, గ్రహీతకూ ప్రియమూ, సంతోషమూ ఉండేవి. ఈ రోజుల్లో ఇవి రెండూ మృగ్యమే! ఈ సంపన్నమైన వేడుకలు, వైభవాలు ఈర్ష్యలకూ, అసూయలకూ కారణమవుతున్నాయి. లేనిపోని పోటీలను పెంచిపోషిస్తున్నాయి. ద్రవ్యరూపంగా సహాయం చేయలేనివారు, శారీరకంగానైనా ఇతరులకు తోడ్పడాలి. శ్రీమంతుడు, బీదవాడు అన్న భేదం లేకుండా సామూహికంగా సేవలలో పాల్గొనాలి. దారిలో పడి ఉన్న ఒక ముండ్ల కంపను తీసివేసినా అది సహాయమే! అందరూ కలసి ఒక చెరువో, బావో తవ్వడమూ పరోపకారమే! ఇలాంటి పనులన్నీ మనలో చిత్తశుద్ధిని పెంపొందిస్తాయి.

మనలో మనశ్శాంతి కొరవడడానికి మరోకారణం మనలోని దోషదర్శన గుణం. ఎదుటివారిలో ఏ లవలేశమైనా మంచి గుణముంటే దానిని గుర్తించి, శ్లాఘించాలి. అంతేతప్ప, నిరంతరం దోషదర్శనం మంచిది కాదు. చంద్రునికి కూడా కళంకముంది. అయినా పరమశివుడు చంద్రుణ్ణి తన శిరస్సు మీద ఉంచుకొని, తన ఉత్తమాంగంలో ఉన్నతస్థానాన్ని కల్పించాడు. ఆ ఈశ్వరుడే కరాళమైన గరళాన్ని తన కంఠంలో ఉంచుకొని గరళకంఠుడైనాడు. కానీ ఈ కాలంలో ఎక్కడ చూసినా గుణదోష విమర్శ విరివిగా సాగుతోంది. చదువుకున్న వారిలో ఈ దోషదర్శనం మరింత పెరిగింది. ప్రతి విషయంలోనూ తప్పులు వెతుకుతున్నారు. ఎన్ని ఎక్కువ దోషాలు పట్టుకుంటే అంత పెద్ద విద్వాంసుడనే తప్పుడు అభిప్రాయం కూడా మనలో ఉంది. దోషజ్ఞుడు అంటే దోషాన్ని తెలుసుకున్నవాడని అర్థమే కానీ, దాన్ని ప్రచారం చేసేవాడని కాదు. తప్పు చేసిన వారికి హితవు చెప్పాలే తప్ప, వారిని చిన్నచూపు చూడరాదు. దోషప్రచారం ఎన్నడూ చేయరాదు. ❖



# శ్రీరామకృష్ణ ఉద్యమంలో ఆదర్శ భక్తులు

**శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.**

## నేటి తరం నాగమహాశయ్... శ్రీహరి

– స్వామి శశికాంతానంద

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస సన్నిధిలోకానీ, సంఘంలో కానీ ఏ స్థాయిలో సేవచేసినా ఆధ్యాత్మికోన్నతిని సాధిస్తారనటంలో సందేహం లేదు. సర్వసంగ పరిత్యాగులుగా సాధుజీవనాన్ని ఎంచుకొని తరిస్తున్న వారు కొందరైతే, సామాన్య పౌరులుగా ఉంటూ కూడా గురుదేవుల సేవలో పునీతులవుతున్న వారు మరికొందరు. ఆ పరంపరలో శ్రీరామకృష్ణుల దివ్యసాన్నిధ్యానికి నాగమహాశయ్ గృహస్థుగా అడుగిడి, ఆయన భక్తావళిలోనే ప్రముఖ స్థానాన్ని పొందారు.

ఒకసారి నాగమహాశయ్ చిత్రపటాన్ని చూస్తూ దివ్యజనని శారదామాత 'ఎంతటి భక్తులైనా నాగమహాశయ్‌కి సాటిరారు' అన్నారు. అలాంటి ఆదర్శమూర్తిని ప్రత్యక్షంగా మనం దర్శించుకోలేకపోయినా, నేటితరంలో ఆ స్ఫూర్తిని స్ఫురింపచేయటానికి మన మధ్య మెలిగిన శ్రీరామకృష్ణుల అరుదైన భక్తుడు శ్రీహరి. ఆనాటి నాగమహాశయ్‌కి వీరిని ప్రతిరూపంగా చెప్పుకోవటం అతిశయోక్తి కాదు.

శ్రీహరి నిరాడంబరత, వస్త్రధారణ, వినయం, ప్రవర్తన, గురుదేవులపై, సంఘ సన్యాస బృందంపై వీరికున్న భక్తి, విశ్వాసాలు పూర్తిగా ఆనాటి నాగమహాశయ్‌ని తలపిస్తాయి. ఎలాంటి గుర్తింపు, ప్రాధాన్యం ఆశించకుండా శ్రీరామకృష్ణ సంఘ సేవాకార్యకలాపాల్లో వారు పాల్గొని తరించిన తీరు, నేటి స్వచ్ఛంద కార్యకర్తలకు కరదీపికగా నిలుస్తుంది.

**యువప్రాయంలోనే సంఘసేవలో... :** 1934లో పశ్చిమ గోదావరిజిల్లాలోని యండగండిలో జన్మించిన శ్రీహరి తను పదవతరగతి చదువుతున్న సమయంలో పాఠశాలలో శ్రీరామకృష్ణ సంఘ సాధువు ఇచ్చిన ప్రసంగానికి ప్రభావితులయ్యారు. శ్రీరామకృష్ణ పరమహంస బోధనలవైపునకు ఆకర్షితులయ్యారు. అప్పటి నుంచి గురుదేవుల అమృత వాక్కులను అనుసరించసాగారు. 1951లో రాజమండ్రిలో మఠం ప్రారంభమైన అనంతరం, సంఘంతో అనుబంధం పెంచుకొని శ్రీహరి పూర్తిగా అక్కడి సేవాకార్యక్రమాల్లో పాల్గొనసాగారు. అలా ఆరంభమైన వారి సేవాజీవనం 2004లో తను భౌతికంగా ఈ లోకాన్ని విడిచిపోయే వరకు నిరంతరాయంగా, ఆదర్శవంతంగా కొనసాగింది. శ్రీ వినోభాభావే భూదానోద్యమం నుంచి స్ఫూర్తి పొంది, తనకున్న కొద్దిపాటి పొలాన్ని కూడా దానం చేశారు; శ్రీహరి వ్యక్తిత్వం తెలిసి, తమ ఉద్యమంలో కార్యకర్తగా పాల్గొనమని వినోభాభావే స్వయంగా ఆహ్వానించినా సున్నితంగా తిరస్కరిస్తూ, శ్రీరామకృష్ణ సంఘంలో అంతకన్నా విస్తారంగా సేవాకార్యక్రమాల్లో పాల్గొనే అవకాశం ఉంటుందని స్పష్టం చేశారు.

**జీతమూ నిరుపేదలకే... :** శ్రీహరి తన జీతంలో తొంభైశాతం గ్రామీణుల కోసమే ఖర్చుపెట్టేవారు. తను బోధించే హిందీ సబ్జెక్టు పరీక్షలో ఒక్కరు కూడా తప్ప కూడదని దీక్షపూనారు; అక్షరాలా ఆచరణలో చూపారు.

సత్యం, అహింస, అపరిగ్రహం, త్యాగం, సేవలను జీవన విలువలుగా చేసుకొని శ్రీహరి జీవితాంతం వాటికే కట్టుబడి ఉన్నారు. ఆజన్మ బ్రహ్మచారి అయిన శ్రీహరి వృత్తిరీత్యా సీనియర్ గ్రేడ్ హిందీపండిట్ అయినప్పటికీ, ప్రవృత్తిరీత్యా శ్రీరామకృష్ణ భక్తునిగా సమాజానికి సేవలందించారు. అటు వృత్తికి న్యాయం చేస్తూనే రాజమండ్రి, విజయవాడ తదితర మఠాల ఆధ్వర్యంలో జరిగిన అనేక పునరావాస, సేవాకార్యక్రమాల్లో వారు చురుగ్గా పాల్గొనేవారు. ఉదయమంతా పునరావాస సేవల్లో పాల్గొన్నా, ఎలాంటి అలుపు లేకుండా రాత్రి ఉచితంగా వయోజన విద్యాకార్యక్రమాన్ని నిర్వహించేవారు. కానీ ఏనాడూ తన వ్యక్తిగత జీవితం, సౌకర్యాల గురించి పట్టించుకోలేదు.

మఠ సేవాకార్యక్రమాల ఒత్తిడి వలన తన ఆధ్యాత్మిక సాధనకు ఉపకరించే 'మంత్రదీక్ష' స్వీకరణపై కూడా మనస్సు పెట్టలేదు. చివరకు స్వామీజీల, శ్రేయోభిలాషుల ప్రోద్బలంతో స్వామి భూతేశానందజీ మహరాజ్ నుండి మంత్రదీక్ష తీసుకున్నారు శ్రీహరి. కాళ్ళకు చెప్పులైనా లేకుండా గ్రామ గ్రామాల్లో పర్యటిస్తూ వయోజన విద్య, ఉచిత నేత్రచికిత్స

(మిగతా 29 వ పేజీలో...)

**భగవంతుడి యందు భక్తివిశ్వాసాలు కలిగిన భక్తులు ఎన్ని కష్టనిష్ఠురాలు ఎదురైనా సహనంతో వ్యవహరిస్తారు. అంతేకాక వారు అనేక మందిని ధర్మ మార్గంలో నడిచేలా చేస్తారు.** - శ్రీరామకృష్ణులు



# శ్రీచరణారవిందాలకు విన్నపం

- స్వామి అర్చనానంద

ఆత్మస్వరూపా! పరమాత్మ స్వరూపా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! సహస్రకోటి యుగధారకా! ప్రేమ ఘన మూర్తీ! ప్రభూ! శ్రీరామకృష్ణా! మీ పావన చరణార విందాలకు ఇవే మా శతకోటి సాష్టాంగ ప్రణామాలు. మా ప్రార్థనలు స్వీకరింపుము తండ్రీ! ప్రభూ! మీరు అవతార పురుషునిగా జన్మనెత్తి 175 సంవత్సరాలు నిండినాయట కదా! జననము, మరణమూ లాంటి సకల ద్వంద్వాలకూ అతీతులైన మీకూ 'జన్మ' ఉంటుందా స్వామీ?

మానవజన్మ యొక్క మహత్వమూ, పరమార్థమూ 'మరచి' పోయి మాయాజాలంలో చిక్కుకుపోయిన మానవాళికి – "భగవత్ సాక్షాత్కారమే మానవ జీవిత ఉద్దేశము. దుర్లభమైన మానవ జన్మనెత్తీ, ఈ జన్మలోనే భగవత్ దర్శనాన్ని పొందని వ్యక్తి జీవితమూ, చివరకు అందుకై ప్రయత్నమైనా చేయని వ్యక్తి జీవితమూ నిరర్థకం!" అని బోధించి మా కళ్ళు తెరిపించడానికే – సర్వవ్యాపకుడవూ, సర్వాంతర్యామివీ, నిర్గుణ – నిరాకారుడవూ, అవాఙ్మానస గోచరుడవూ అయినప్పటికీ మా మానవ జాతిపై అపార కృపా కరుణార్ద్ర హృదయుడవై, సగుణ సాకారుడవై, ప్రేమసాగరుడవై, త్యాగీశ్వరుడవై, శుద్ధ సత్త్వ, ప్రబుద్ధ సత్య స్వరూపుడవై, శ్రీరామకృష్ణునిగా అవతరించావా స్వామీ!

భగవత్ సాక్షాత్కారమే నిజమైన మతమనీ, భగవత్ అనుభూతియే సకల సాధనల లక్ష్యమనీ, వ్యాకులత, తపన లేని సాధనలు వ్యర్థమనీ నీవు ఆచరించి బోధించావు. అయినప్పటికీ మా మానవులకు ఇంకా ఈ కామినీ కాంచనాల 'మాయ' తొలగదేల ప్రభూ? మతమూ, ధర్మమూ అంటే కేవలం గుళ్ళూ, గోపురాల చుట్టూ తిరగడమూ; గంటలూ, కొబ్బరికాయలూ కొట్టడమూ; నదీ తీర్థాలలో మునకలు వేసి, కుంభమేళాల్లో గంగాస్నానాలు చేయడం ద్వారా 'సర్వపాప ప్రక్షాళనం' చేసేసుకున్నాం అనుకుంటున్నారు. కానీ ఇంటికి తిరిగొచ్చి మరలా 'నూతన పాప ప్రారంభోత్సవం' చేసు కుంటున్నారే మా భక్తాగ్రేసరులు!

'కామినీ కాంచనములే' సంసార బంధానికి మూల కారణమనీ, వాటిని త్యజిస్తేనే పరమ శాంతి, ఆనందం పొంది ముక్తులవుతారనీ నీవు బోధించావు! మరి మా వారు కామినీ కాంచనాల కోసం, పేరు ప్రతిష్ఠలు, అధికారం కోసం చేయని పాపమే లేదు కదా! చాలా మంది వీటన్నింటి కోసమే దేవుణ్ణి పూజిస్తున్నారు, ప్రార్థిస్తున్నారు కానీ భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవాలనీ, దివ్యప్రేమను అనుభూతి చెందాలనీ కాదు స్వామీ! దయతో మా హృదయాలను ప్రాపంచిక వాసనా శూన్యం చేసి నీ వైపు మళ్ళించవా భగవాన్!

'స్త్రీలందరూ జగన్మాత అంశలు, జగజ్జనని వివిధ రూపాలు... వారందరినీ జగదంబ ప్రతిరూపాలుగా భావించి తమ తల్లులుగా గౌరవించాలి' అని అమృతవాణి అందించావు. ఇది సాధకులకు, భక్తులకు అద్భుత శక్తిని ఇచ్చే మహామంత్రం! 'మాతృభావాస్త్రం'తో 'మారుని' మారుమాట్లాడకుండా, మన్ మథుణ్ణే (మనో మథుణ్ణే) మాత ఒడిలో శిశువుగా మార్చే నీ ఈ సాధనా సిద్ధి రహస్య సూత్రం – న భూతో! న భవిష్యతి స్వామీ!...

ఒక్క సందేహం!.. మరి స్త్రీలు నిజంగా తమను తాము జగన్మాత అంశలు, విశ్వమాత యొక్క వివిధ రూపాలుగా భావిస్తున్నారా? విశ్వసిస్తున్నారా? తమను తాము పాపులమనీ, అబలలమనీ, నిస్సహాయులమనీ, 'మేము అమ్మవారి రూపాలమా? అంత 'అదృష్టం' మాకెక్కడ స్వామీ!' అని చాలా మంది స్త్రీలు అనుకొంటున్నారు, అంటున్నారు కూడా! తమ 'నిజస్వరూపాన్నీ, పరమ పవిత్ర, అనంతమైన విశ్వమాతృ రూపాన్నీ మరచి తాము శ్రీలక్ష్మీ, శ్రీసరస్వతీ, శ్రీపార్వతీ దేవీ దివ్యమంగళ, శుభదాయక మాతృమూర్తులమని భావించక,




ఆ భావనలో జీవించక, పాశ్చాత్య నాగరకత, ఆధునిక భోగవాద సంస్కృతికీ, అనుకరణకూ 'బానిసలై', మనం పతివ్రతా శిరోమణులైన సీత, సావిత్రి, అనసూయల సంతాన మనీ, వారసులమనే 'నిజాన్ని' విస్మరించి, పరమ పవిత్ర మైన హిందూ సంప్రదాయం, సభ్యతా, సంస్కృతులకు తిలోదకాలిచ్చి, 'లజ్జయే స్త్రీలకు నిజమైన ఆభరణం' అని చెప్పిన అమ్మ శ్రీశారదామాత ఉపదేశాన్ని 'వినీ విననట్లు' నటిస్తూ, పెడ చెవిన పెట్టి – నిర్లజ్జగా అసభ్య వేషధారణ, అసహ్య వస్త్రధారణల్లో ఒకరితో ఒకరు పోటీ పడుతున్నారు! ఆధునిక యువతులు 'పాతివ్రత్యం, పవిత్రత, సౌశీల్యం, సాత్త్వికత' అనే పదాలకు తమ జీవితాలతో ఏ మాత్రం సంబంధమే లేదన్నట్లుగా ప్రవర్తిస్తున్నారు. ఈ మహిళా మణులకు తాము నిజంగా అమ్మవారి అమృత స్వరూపాల మనీ, జగదంబ ప్రతిరూపాలమనీ, అలా జీవించాలనీ వారికి సద్బుద్ధినీ, విచక్షణా జ్ఞానాన్నీ ప్రసాదించు ప్రభూ!

కలకత్తా నగరంలో నీవు గుఱ్ఱపుబండిలో వెళుతుండగా బజారులో రోడ్డు ప్రక్కన కొందరు వేశ్యలు విచిత్రంగా అలంకరించుకుని, పురుషుల వైపు అసభ్య హావభావాలను ప్రదర్శిస్తూ ఉంటే – నీవు వారికి ప్రణమిల్లుతూ, "అమ్మా! జగజ్జననీ! ఈ రోజు 'నీవు' ఈ విధంగా అలంకరించు కొన్నావా? ఈ 'వేషాలు' వేశావా? బాగుందమ్మా! చాలా బాగుంది! ఈ రోజు ఈ రూపంలోనే నా ప్రణామాలు స్వీకరించు తల్లీ!" అని ప్రార్థించావు. అమ్మను తప్ప అన్య మెరుగని పరమ పవిత్ర హృదయం నీది! కామ కళంక వాసనా రహిత సౌశీల్యం నీది! నీ బిడ్డలమూ, ఆధ్యాత్మిక వారసులమూ అయిన మాకూ నీ వంటి పవిత్ర దృష్టీ, పావన సౌశీల్యమూ ప్రసాదించు ఓ పావన చరితా!

"ధనం అవసరమే! కానీ అదే సర్వస్వం కాదు, కారాదు. మితిమీరిన ధనం మనిషి మంచితనాన్నే మార్చివేస్తుంది. అన్న వస్త్రాలకూ, సాధువులు, భక్తులు, నిరుపేదల సేవకూ సద్విని యోగపరచే ధనమే సుధనము. ధనం విలువ ఎవనికి నిజంగా తెలుసో, ధనమే ఎవ్వనికి దాస్యం చేస్తుందో – అట్టి వాడే నిజంగా మానవుడు. ధనం విలువ తెలియనివాడూ, ధనాన్ని సద్వినియోగం చేయనివాడూ మానవుడే అనదగడు"– అన్నది నీ అమరవాణి. కానీ ప్రభూ! ఈనాడు ధనం కోసం, స్వార్థ సంపాదన కోసం మనిషి చేయని పాపం లేదు, తొక్కని అడ్డదారులు లేవు. అవినీతి, అక్రమం, అనైతిక సంపాదనలో ప్రజాప్రతినిధులూ, అగ్రశ్రేణి అధికారులూ, ఆఖరికి న్యాయమూర్తులూ... మునిగి తేలి, శ్రీకృష్ణ జన్మస్థానం చేరుతున్నారు! దయతో నీవు వారి హృదయాలలో ప్రవేశించి వారిని ధర్మమార్గంలో నడిపించు ప్రభూ!

సత్యమే భగవంతుడనీ, 'సత్య వచనమే ఈ కలియుగంలో మహా తపస్సు. అసత్యం పలికేవాడు భగవంతు నికి చాలా దూరమ'నీ ఆచరించి బోధించిన నీ వేదవాక్కును మానవులు ఆచరించడం లేదు. నిత్య జీవితంలో అసత్య వచనం, అక్రమ సంపాదన, మోసం, అసూయా ద్వేషాలు త్యజించడం లేదు! అబద్ధం చెప్పి అందలమెక్కడమే అందరికీ ఆనందం! "అబద్ధాలు పలికేవాడు, అక్రమ సంపాదన చేసేవాడు నరకయాతనలు అనుభవించవలసి వస్తుంది. ఈ దుష్టకర్మల ఫలంగా మనిషికి భయానక రోగాలూ, కష్టాలూ, దుఃఖాలూ, నానా మనోయాతనలూ, హృదయ వేదనలూ, దారిద్ర్యమూ తప్పవుగాక తప్పవు" అన్నది నీ అమృతవాణి. అయినా మనుషులు ఇంత సులభ, సరళమైన జీవితసత్యాన్ని గ్రహించలేకున్నారు! మమ్ములను అందరినీ సత్యనిష్ఠులుగా, నిజమైన భక్తులుగా, ధర్మమార్గంలో దయతో నడిపించు హే భగవాన్! సత్యస్వరూపా! శ్రీరామకృష్ణా!

"శ్రద్ధ (విశ్వాసం) ఉన్నవాడు సర్వమూ ఉన్న వాడు. శ్రద్ధ లేనివాడు ఏమీ లేనివాడు. భగవంతుడు నిజంగా ఉన్నాడు. భగవంతుణ్ణి దర్శించ వచ్చు, ఆయనతో మాట్లాడవచ్చు. ఇంద్రియ గ్రాహ్యమైన ఆనందం కంటే కోటి కోటి రెట్లు అధికంగా భగవత్ సాన్నిధ్య, సామీప్య, సాయుజ్య ఆనందాన్ని అనుభూతి చెందవచ్చు" అని మా కోసం అనితర సాధ్యమైన సాధనలు చేసి నిరూపించావు. కానీ ఎన్ని పురాణాలూ, భగవద్గీత, భాగవత, బ్రహ్మ సూత్రాలూ, వేదాంత శాస్త్రాలు, ఆగమ నిగమాలూ ఆపోశన పట్టినా; ఉపవాస, మౌనాది వ్రతాలు చేసినా, జపమాలలు తిప్పీ, తిప్పీ శిరస్సులోని శిరోజాలు శ్వేతవర్ణం ధరిస్తున్నా కూడా – ఈ 'భగవంతునిపై పరిపూర్ణ శ్రద్ధ, విశ్వాసం, నమ్మకం' మాకు కలగడం లేదు, ఎందుకు స్వామీ? అలాంటి అచంచలమైన భక్తి, శ్రద్ధ, విశ్వాసాలనూ, మాయామోహ జాలం ముందు వమ్ము కాని నమ్మకాన్నీ, శాశ్వత అనుభూతినీ ప్రసాదించు పరమేశ్వరా! శ్రీరామకృష్ణా!

(మిగతా 29 వ పేజీలో...)

ఓ దీనబంధూ! నేను జ్ఞానహీనుణ్ణి, భక్తిహీనుణ్ణి. నాకు కీర్తిప్రతిష్ఠలు వద్దు, ఇంద్రియభోగాలు వద్దు. ప్రభూ! నీ కృపాకటాక్షంతో నాకు నీ దర్శనాన్ని ప్రసాదించు. - శ్రీరామకృష్ణ పరమహంస

మాయాబజార్

# అనారోగ్యం బారిన అమరభారతం

- స్వామి శితికంఠానంద

సుధర్మ ప్రారంభమైంది. నిలింపులు తమతమ స్థానాల్లో ఆసీనులైనారు. దేవవైద్యులైన అశ్వినీ దేవతలు దేవలుడిని ప్రశ్నించ దానికి తమకు అవకాశం ఇవ్వవలసిందని దేవేంద్రుడికి విన్నవించు కున్నారు. సురేంద్రుడు అడగవలసినదని సంజ్ఞ చేశాడు.

**అశ్వినీ దేవతలు :** దేవలా? కలియుగంలో మనుషులు రక రకాల జబ్బులతో బాధపడుతుంటారని, వారి శారీరక, మానసిక ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉంటుందని మేము భాగవతాది గ్రంథాలలో చదివినట్లు గుర్తు. దయచేసి మర్త్యుల ఆరోగ్య విషయమై ధన్వంతరి, చరకుడు, సుశ్రుతుడు లాంటి మహావైద్యులు, పతంజలి లాంటి మనోనియంత్రణ మార్గదర్శులు జన్మించిన పుణ్యభూమిలో ప్రస్తుత పరిస్థితి గురించి మాకు వివరించి మమ్మానందింపజేయ ప్రార్థన.

**దేవలుడు:** వ్యాధి అనేది రెండురకాలు. శారీరకమైనది మరియు మానసిక మైనది. ఎప్పుడూ రెండూ కలిసే వస్తాయి. శరీరం రోగగ్రస్తమైతే మనస్సు బలహీనపడుతుంది. అలాగే మనస్సు బలహీనమైతే శరీరం డీలాపడుతుంది.

**వరుణుడు:** ఒకటి బలహీనమైతే రెండవది బలహీనమవు తుందనడం బాగానే ఉంది. ఐతే రెండు పరస్పరం కలిసి ఎలా వస్తాయి? కొంచెం ఆశ్చర్యంగా ఉంది. ఐనా దేవలా పంచమ వేదంగా పేర్కొనబడే మహాగ్రంథం మహాభారతంలో ఏమిచెప్పారు?

**దేవలుడు:** **ద్వివిధో జాయతే వ్యాధిః శారీరో మానసః తథా, పరస్పరం తయోర్జన్మ నిర్ద్వంద్వం నోపలభ్యతే.** పైన నేను చెప్పినది ఈ శ్లోకం యొక్క తాత్పర్యమే. శరీరంలో వ్యాధి ప్రబలితే మనస్సు తప్పక చలిస్తుంది. 'తాను' అంటే దేహం కాదని 'తాను' ఆత్మ స్వరూపుడనని శరీర బాధలు తనకు అంటవని అంతఃచైతన్యాన్ని ధ్యానించే కొద్దిమంది ఆధ్యాత్మిక వేత్తలు, యోగులు, మునులు తప్ప మిగతావారి విషయంలో శరీరంలో రోగం మొదలవగానే తానంటే శరీరమే అనుకొనే జీవులందరిలో మనస్సు కూడా విచలిత మవుతుంది. బాధకు గురవుతుంది. నిజానికి వ్యక్తికి రోగమొచ్చి నప్పుడు ఈ దేహాభిమానం వలన మనస్సు నుంచి, అహంభావం నుంచి బాధ మొదలవుతుంది గానీ శరీరం తనకు తానుగా బాధను అనుభవించలేదుగా.

**అశ్వినీ దేవతలు :** ఓహో! 'తాను' అంటే మనోదేహాలకు ఆధారంగా, అతీతంగా ఉన్న చైతన్యం అని ఎరుక ఉండదు కాబట్టి వ్యక్తి వ్యాధి వలన కాకుండా శరీరాభిమానం (భావన) వలన ఎక్కువ వేదన చెందుతున్నాడంటావు. అంతేనా.

**దేవలుడు:** అవును. భావనే మనిషి. వ్యాధి సామాన్యుల విషయంలో మనస్సును ఇంకా దేహంపైకి లాగేస్తుంది. ఆధ్యాత్మిక సాధకులు, వివేకం ఉన్న వ్యక్తులు మనస్సును భగవంతుడిపై నిలిపి దేహంతో తాదాత్మ్యం చెందడానికి ఇష్టపడరు కనుక రోగం వాళ్ళను బాధించలేదు.

**వరుణుడు:** అంటే మనస్సును, భావనలను తీర్చిదిద్దుకోవటం ద్వారా దుఃఖాన్ని తగ్గించుకోవచ్చును అంటావు. అంతేనా దేవలా.

**దేవలుడు:** అవును. అందుకని మనస్సు మీద ఎక్కువ దృష్టి పెట్టాలి. శారీరకరోగాలుగా అభివ్యక్తమవుతున్నప్పటికీ మనస్సు నీరసించటంతోటే అవి పుడుతున్నాయి.

**అశ్వినీ దేవతలు :** మనస్సు నీరసించడమంటే ఏమిటి?మానసిక దౌర్బల్యం శారీరక రోగాలుగా ప్రస్ఫుటమవడం ఏంటి? అంతగా బోధపడుటలేదు. కాస్త వివరించి చెప్పుము దేవలా!

**సురుచి:** నేను చెపుతాను. మనస్సు, శరీరం రెండూ నిజానికి వేరు వేరు కావు. మనస్సును సూక్ష్మశరీరంగా కూడా పేర్కొనడం కద్దు. అలాగే శరీరాన్ని మనస్సు యొక్క స్థూలవ్యక్తీకరణ లేదా స్థూలమనస్సుగా పేర్కొనవచ్చు. రెండూ ఒకటే. ప్రస్తుత కాలంలో భూలోకంలో మనుషులకు 'నేను' అంటే ముందు గుర్తుకు వచ్చేది శరీరమే. కాబట్టి శరీరావసరాలైన ఆహారం, బట్టలు, ఇల్లు ఇతర గృహోపకరణాలు వీటిని సముపార్జించుకోవటం, వాటితో గడప టమే జీవితం అనుకొని మనస్సును తీర్చిదిద్దుకోవటంలేదు. భావ శుద్ధికి కనీస ప్రయత్నం కూడా చేయటం లేదు. దానితో మనస్సు కొంతకాలానికి అననుకూల ఆలోచనల సమాహారమై బలహీన పడిపోతుంది. అన్ని ఆలోచనలు మనస్సుకు శక్తినివ్వవని, కొన్ని సకారాత్మకమైనవి, కొన్ని నకారాత్మకమైనవి ఉంటాయని తెలుసుకో కుండా అదేపనిగా అన్ని దిశలనుంచి మనస్సును నిర్వీర్యంచేసే ఆలోచనలను తమకు తెలియకుండానే స్వీకరిస్తున్నారు. దానితో మనస్సు డీలాపడి శారీరక వ్యాధిగా అభివ్యక్తమవుతుంది.

**అశ్వినీ దేవతలు :** అన్ని రోగాలు అలా మనస్సు వ్యతిరిక్త భావాల సంహృతి అవటం వలనే మొదలవుతున్నాయంటే నమ్మటం కష్టంగా ఉంది. కొన్ని రోగాలు అలా వస్తున్నాయేమో కానీ అన్నీ అలానే జనిస్తున్నాయంటే సందేహంగా ఉంది.

**సురుచి:** అధికశాతం మనస్సునుంచి జనిస్తున్నవే అని నేను తప్పక చెప్పగలను. మనస్సుకు పోషణ లేకపోవడం వలన బలహీన మవుతున్నది.

**వరుణుడు:** శరీరానికి ఆహారం ఇచ్చి పోషించాలి అంటారు. మనస్సుకు పోషణ ఏమిటి సురుచీ?

**సురుచి:** ఆ విషయానికే వస్తున్నాను. మనస్సుకు కూడా ఆహారం అవసరమవుతుంది. మంచి భావాలు అనే ఆహారాన్ని నిరంతరం ఇవ్వకపోతే క్షుద్రమైన ఆలోచనలను తీసుకొని వ్యక్తిని దుర్బలుడిగా చేస్తుంది. శరీరం ఆహారం ఇవ్వకపోతే తనంతట తానుగా వేరే ఆహారాన్ని స్వీకరించదు. మనస్సు మాత్రం మంచి ఆలోచనలనే ఆహారం రోజూ ఇవ్వకపోతే చెడు ఆలోచనలను గ్రహించి అననుకూల భావనల సంగడిగా మారి వ్యక్తిని నిర్వీర్యుడిని చేస్తుంది. ఆలోచనలే మనస్సు కాబట్టి మనస్సు ఏవో ఆలోచనలతో నిండి ఉండాలి. శక్తిమంతమైన ఆలోచనలు అందించకపోతే బలహీన భావాల సమామ్నాయంగా మారిపోతుంది. అందుకే మనస్సుకు పోషణ అవసరమవుతుందని చెప్పటం.

**వరుణుడు:** శక్తిప్రసాదకాలైన భావాలను ఎక్కడనుంచి గ్రహించాలి?

**సురుచి:** ఎందుకు? భూలోక వాసులందరికీ తమ మనో శక్తిని ఇనుమడింపచేసుకోవటానికి అవసరమైన మహోన్నత భావనిధి భారతీయులదగ్గర ఉంది. వాళ్ళకు ఉన్న ఆధ్యాత్మిక జ్ఞాన సంపదంతా మనస్సుకు ఓజస్సును, శరీరానికి తేజస్సును ప్రసాదించేదే కదా!

**అశ్వినీ దేవతలు :** అదిసరే. కానీ మనస్సుకు ఓజస్సు, శరీరానికి తేజస్సును కలిగించడానికీ, శారీరకరోగాలకీ సంబంధం ఏమిటో?

**సురుచి:** దేవలుడు చెప్పాడు కదా. మనశ్శరీరాలు రెండూ ఒకటే అని. మనస్సుకు శక్తి సమకూరిందంటే శరీరానికి కూడా శక్తి ప్రాప్తించినట్లే. 'నేను' అంటే శరీరమన్న అనార్యుల, భౌతిక వాదుల భావనను తీసుకొని అల్పమైన శరీరంకోసమే బ్రతుకుతూ, రెండింటిలో అధిక శక్తివంతమైనదైన మనస్సును నిర్లక్ష్యం చేయటం వలననే అమరభారతం అనారోగ్య భారతం అవుతున్నది.

**దేవలుడు:** అవును. సురుచి చెప్పినది నిజం. అసలు మనం ఇప్పటివరకు సభలో చర్చించుకుంటున్నట్లు భారతీయులు ఆత్మశక్తి




జాగృతానికి పరమసోపానంగా ఉపకరించే ధార్మిక జీవనానికి పెద్ద పీటవేయగలిగితే అంతకు మించిన ఆదర్శం ఇంకొకటి ఉండదు. వారి సౌభాగ్యాన్ని చూసి ముందు చెప్పుకున్నట్లు మనం ఈర్ష్య పడాల్సివచ్చి ఉండేది. మనలో కూడా అసూయను పొడసూప చేయగల ఆధ్యాత్మిక సిరిని నారాయణుడు వారికి ప్రసాదించాడు.

**అశ్వినీ దేవతలు :** ధర్మానుష్ఠానానికీ, మనం చర్చించుకుంటున్న రోగమయ జీవితానికీ సంబంధం ఏమిటో అవగతమవటంలేదు.

**సురుచి:** ధర్మబద్ధమైన జీవితం గడపటం వలన ఆత్మశక్తి జాగృతమై మనస్సు దృఢంగా ఉంటుంది. **మనస్సు దృఢంగా నిర్భయంగా ఉన్నప్పుడు రోగనిరోధక శక్తి అత్యధికంగా ఉంటుంది. ఏ సూక్ష్మజీవులు కూడా ఆ శరీరాన్ని బాధించలేవు. సంఘర్షణ, భయం, ప్రతికూల భావోద్వేగాలైన ఈర్ష్య, అసూయ, ద్వేషం, పగ, ప్రతీకారేచ్ఛ లేకుండా, ప్రేమ, త్యాగం, కరుణ, జాలి, సంయమనం, పవిత్రత ఉన్న శరీరాలలో రక్తం పరిశుద్ధంగా ఉంటుంది.** పవిత్రతను పొందడానికి కలియుగంలో భగవన్నామ జపానికి మించింది లేదు. అలాగే పనులను భగవదర్పితంగా చేస్తూ పోతే మనోదేహాలు బలాన్ని సంతరించుకుంటాయి. జీర్ణ వ్యవస్థ, శ్వాసవ్యవస్థతో పాటు సర్వావయవాలు శక్తిని సంతరించు కొని వ్యక్తిని రోగాలకు దూరంగా ఉంచుతాయి. మానవులు 'నిస్వార్థమే మహాఫలకారి' అన్న స్వామి వివేకానంద వాక్కులు సదా జ్ఞప్తిలో ఉంచుకోవాలి. పరోపకారం కొద్దిగా తలపెట్టినా హృదయంలో సింహసదృశ బలం పెల్లుబుకుతుందని తెలియజేసి, ఆరోగ్య దృష్ట్యాకూడ ఇది మహాప్రయోజనాన్ని కలిగిస్తుందని ప్రవచించాడు ఆ భవవైద్యుడు.

**దేవలుడు:** ఐతే మీరడిగిన ప్రశ్నవిషయానికొస్తే ప్రస్తుతం భూలోకంలో భౌతిక కాలుష్యం, భావకాలుష్యం రెండూ పెరిగి జీవన ప్రమాణాలు దిగజారిపోతున్నాయి. శరీరమే ప్రధానమన్న భావనతో కూడుకున్న జీవన విధానం వలన అనేక పరిశ్రమలు అవసరమై వనరులు అతిగా వినియోగించుకోవలసి రావటంతో గాలి, నీరు, నేల.. ఒకటేంటి బాహ్యప్రకృతి మొత్తం కలుషితమై రకరకాల రోగాలను కలిగిస్తున్నాయి.

**సురుచి:** ఆ రోగాలనుంచి విముక్తికి తమ శరీరనిర్మాణానికి సరిపడని, అధిక వ్యయంతో కూడుకున్న దిగుమతి చేసుకున్న వైద్యవిధానాలను అవలంబిస్తూ, మందులు వాడుతూ దుఃఖాన్ని పొందుతున్నారు.

**వరుణుడు:** అవును మరి. రోగానికి ఏదో మందును స్వీకరించాలి కదా. అలా చూస్తూ ఊరుకోలేరు కదా.

**సురుచి:** భూలోకం అంతా ఏవిధంగా వెళ్ళినా భారతీయులు తమకు తమ ఋషులనుంచి సంక్రమించిన, ఉపవేదమైన ఆయుర్వేదం లాంటి వైద్యాన్ని విస్మరించి అసమగ్ర విధానాలను పూర్తిగా స్వీకరించటం అనుకరణ జబ్బు యొక్క తీవ్రతను నిరూపి స్తుంది. ఇలావర్తనులు రోగమూలాలకు వెళ్ళి, వ్యక్తిని పూర్తిగా అధ్యయనం చేసి వ్యాధిసంక్రమణలో మనస్సు పాత్రను చక్కగా నిర్దేశించి, వివిధ శరీర తత్త్వాలను సమగ్రంగా తెలుసుకొని చివరకు దేహరోగం కాదు, దేహమేరోగం అని నిర్ధారించిన వేదాంత జ్ఞానాన్ని నిర్లక్ష్యంచేసి జీవితాలను అస్తవ్యస్తం చేసుకోవటం దురదృష్టకరం. కనీస ఆరోగ్య నియమాలను పాటిస్తూ మన శ్శరీరాలను భగవదుపాసనకు పరికరాలుగా గ్రహిస్తూ ఇంద్రియ నిగ్రహంతో, ఆత్మసంయమనంతో, పవిత్ర జీవనంతో చాలావరకూ రోగాలకు దూరంగా ఉండవచ్చు. ఐతే మహామాయ వ్యక్తి ధర్మాన్ని విస్మరించినా, ధనంతో ఆరోగ్యాన్ని పొందవచ్చుననే అపోహను భారతీయులలో కూడా కలిగించింది. ద్రవ్యంపై దృష్టిపెట్టి వ్యక్తి దైవాన్ని మరచిపోయేటట్లు చేస్తున్నది.

**దేవేంద్రుడు:** భౌతికకాలుష్యం నుంచి, భావకాలుష్యం నుంచి బయటపడటానికీ, రెండింటి, పరిపూర్ణ ఆరోగ్యానికి ధార్మికజీవనమే ప్రధానమని భూలోకవాసులందరూ గ్రహించినా, గ్రహించకున్నా భరతసంతతి గ్రహించెదరు గాక! అందులకు నారాయణుడు వారికి శక్తిని ప్రసాదించును గాక! లోకాస్సమస్తాః సుఖినో భవన్తు! ❖

**వ్యాధి రెండు రకాలు. శారీరకమైనది, మానసికమైనది. శరీరం రోగగ్రస్తమైతే మనస్సు బలహీనపడుతుంది. అలాగే మనస్సు బలహీనమైతే శరీరం డీలాపడుతుంది.** - మహాభారతం



# స్వార్థాన్ని వీడితేనే సేవకు సార్థకత

– స్వామి బోధమయానంద

ఒక ఊరిలో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. ఇద్దరికీ ఒకరంటే మరొకరికి ఎంతో ప్రేమ, అభిమానం. ఆ ఇద్దరు అన్నదమ్ముల్లో పెద్దాయనకు వివాహమైంది; పిల్లలు కూడా! కానీ చిన్నతను పెళ్ళి చేసుకోలేదు; బ్రహ్మచారిగానే జీవిస్తూ ఉన్నాడు. వారిద్దరికీ ఉమ్మడిగా కొంత పొలం ఉంది; అది సారవంతమైంది కావటంతో ఏటా ఇబ్బడిముబ్బడిగా దిగుబడి వచ్చేది. ఎలాంటి భేదాభిప్రాయాలు లేకుండా లాభాన్ని ఇద్దరూ చెరిసగం పంచుకునేవారు. ఇలా కొన్నేళ్ళు గడిచాక, ఒకరోజు అర్ధరాత్రి, ఆ అన్నయ్య నిద్దరలోంచి మేల్కొని ఆలోచించడం మొదలుపెట్టాడు. 'అరే! నా తమ్ముడి విషయంలో ఎందుకో అన్యాయం జరుగుతోందని అనిపిస్తోంది. నాకు పెళ్ళయింది; పిల్లలున్నారు. భవిష్యత్తులో నా బాగోగులు చూసుకోవడానికి నాకు వాళ్ళున్నారు. కానీ, తమ్ముడిని ఎవరు చూసుకుంటారు! వాడికి ఏదో ఒకటి చేయాలి; వచ్చిన లాభాల్లో వాడికి ఎక్కువ ముట్టజెబితే భవిష్యత్తులో భద్రతగా ఉంటుంది' అనుకొని ఒక నిర్ణయానికొచ్చాడు. వెంటనే మంచం దిగి, పొలానికి వెళ్ళి, కొంత ధాన్యాన్ని తీసుకొని తమ్ముడి ధాన్యంలో కలిపాడు. మరోవైపు తమ్ముడు కూడా అన్న విషయమై ఆలోచించసాగాడు. 'నేను ఒక్కడిని, లాభాల్లో సగం వాటా తీసుకొని ఏం చేసుకుంటాను; అన్నయ్యకు భార్య, పిల్లలు ఉన్నారు. ఆయనకు నాకన్నా ఎక్కువ అవసరాలుంటాయి. ఎలాగైనా, అన్నయ్యకు ఎక్కువ వాటా అందాలి' అనుకొని హుటాహుటిన వెళ్ళి, తన ధాన్యంలో కొంత ధాన్యాన్ని అన్నయ్య ధాన్యంలో కలిపాడు. ఇలా వీలున్నంత వరకు ఒకరికి తెలీకుండా, మరొకరు; ప్రతి సంవత్సరం ఒకరికొకరు లాభపడేలా చూసుకునేవారు. ఇలా ఒక రోజు అర్ధరాత్రి ఆ అన్నదమ్ములు ఒకరి ధాన్యంలో మరొకరు ధాన్యాన్ని కలిపివస్తూ ఒక దగ్గర కలుసుకోవడం ఆ ఊరిపెద్ద గమనించాడు. వారి ప్రేమాభిమానాలకు చలించిపోయాడు. వారి త్యాగగుణాన్ని ఊరంతా ప్రచారం చేశాడు. కొన్నేళ్ళకు ఆదర్శవంతమైన ఆ అన్నదమ్ములు గతించిపోయారు. ఒకానొక సందర్భంలో ఆ ఊరిలో గ్రామస్థులు ఆలయాన్ని నిర్మించతలపెట్టారు. దేవాలయ నిర్మాణానికి ఏది సరైన స్థలమనే చర్చ రాగా, గతంలో ఆ రాత్రి అన్నదమ్ములు కలుసుకున్న చోటే అనువైనదని తేల్చిచెప్పారు; నిస్వార్థం, త్యాగం నిండిన ఆ ఇద్దరి ఆదర్శం ఆలయరూపంలో తరతరాలకు ప్రసరింపచేయాలని నిర్ణయించారు. కానీ ఈ రోజుల్లో 'సేవ', 'త్యాగం' అన్న పదాలకు అర్థాలే మారిపోతున్నాయి. సమాజంలో ఏదో ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్., వంటి ఉన్నతోన్నత ఉద్యోగాల ద్వారానే సేవ చేయవచ్చనుకుంటున్నారు.. ఆ పదానికున్న ప్రాధాన్యమే మారిపోయింది. ముఖ్యంగా నేటితరం నిత్యజీవితంలో త్యాగం, ఉదారత వంటి అంశాలకు ప్రాధాన్యం ఇవ్వకుండా, ఏదో ప్రత్యేక సందర్భంలో పళ్ళో, మిఠాయిలో పంచితే సరిపోతుందనుకుంటోంది. కానీ స్వామి వివేకానంద 'సేవ'కు మహోన్నతమైన స్థానాన్నిచ్చారు. ఆయన స్ఫూర్తితో వందలాది మంది సేవను తమ జీవనరేఖగా మలచుకొని త్రికరణశుద్ధిగా పరిశ్రమిస్తున్నారు. వేలాదిమంది జీవితంలో వెలుగులు నింపుతున్నారు. ఇతరుల మంచిని కాంక్షిస్తూ సేవచేస్తే పరోక్షంగా అది మన ఉద్ధరణకే ఉపయోగపడుతుందని తెలుసుకోవాలి. దీని వలన వ్యక్తిగా మన మూర్తిమత్వం (personality) వేయింతలవుతుంది, ప్రకాశితమవుతుంది. స్వామి వివేకానంద మాటల్లో చెప్పాలంటే 'సేవలు పొందే వ్యక్తి కన్నా, సేవించే వ్యక్తే ధన్యుడు. సేవించుకునే అవకాశం కలిగించినందుకు ఎదుటివారికే మనం ఋణపడి ఉంటాం. ఆ భగవంతుడు తనను పూజించుకునే భాగ్యాన్ని, పరోపకారం రూపంలో ఇచ్చాడని తెలుసుకోండి. ఆరాధనగా భావించి 'సేవ' చేయటం అలవాటుగా చేసుకోండి'.

ఉపనిషత్తులు, భగవద్గీత, ఎందరో మహర్షుల జీవితాలు 'సేవ'కు అద్భుతమైన ఆధ్యాత్మిక పునాదిని వేశాయి. ఉదాహరణకు శ్రీమద్భగవద్గీత పదమూడవ అధ్యాయంలో శ్రీకృష్ణభగవానుడు...

**సర్వతఃపాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥** అంటాడు.

ఈ లోకమంతా వ్యాపించి ఉన్న ఆ పరబ్రహ్మానికి అన్నివైపులా కాళ్ళు, చేతులు, కళ్ళు, ముఖాలు, శిరములు, చెవులు ఉన్నాయంటూ, అంతటా ఆ భగవంతుడినే దర్శించుకొని సేవించుకోమంటాడు. జైనమతం కూడా 'సేవ' ఆత్మసాక్షాత్కారానికి ప్రధానమార్గమని భావిస్తుంది. అదే విధంగా బౌద్ధాన్ని ప్రచారం చేసిన గౌతమబుద్ధుడు మూర్తీభవించిన సేవకు, ప్రేమకు, త్యాగానికి ప్రతీక. అదే మార్గంలో క్రైస్తవం, ఇస్లాం కూడా పరులసేవకే ప్రాధాన్యాన్నిచ్చాయి. ఆధ్యాత్మికంగా మనిషి ఉన్నతికి ఈ కాలంలో నిస్వార్థసేవను మించిన మార్గం లేదు. ❖




# వికాసాన్నిచ్చే విద్యకే నా ప్రాధాన్యం

స్వతంత్ర ఆలోచనలు, స్ఫూర్తిదాయక భావనలు, స్పష్టమైన ప్రణాళికలు కొరవడిన మా తరానికి స్వామి వివేకానంద ఆశా జ్యోతిగా దారిచూపుతారన్నది నా స్వానుభవం! హైదరాబాదు రామకృష్ణమఠంలోని 'వివేకానంద మానవ వికాస కేంద్రం' (వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్) ఆధ్వర్య వంలో జరిగిన పోటీల్లో పాల్గొనక ముందు నేను (విక్రమ్ కృష్ణ) ఒక సాధారణ విద్యార్థిని మాత్రమే!



కానీ ఈ పోటీల సందర్భంగా మఠంలోకి అడుగుపెట్టాక, నెలల పాటు స్వామి వివేకానంద సాహిత్యంతో పరిచయమయ్యాక, నా భవిష్యత్తుకు ఒక స్పష్టమైన ప్రణాళిక రచించుకునే అవకాశం కలిగింది. ముఖ్యంగా స్వామీజీ క్లుప్తంగా చెప్పినట్లు కనిపించే, ఎన్నో నినాదాల వెనుక వందల తరాలకు స్ఫూర్తినిచ్చే శక్తి దాగి ఉందని తెలిసింది. ఉదాహరణకు 'నిన్ను నీవు విశ్వసించుకో; సత్యం, పవిత్రత, సహనం ఉంటే సమస్తమూ నీ పాదాక్రాంత మవుతుంది' వంటి మాటలు పైకి సరళంగా కనిపిస్తాయి. కానీ లోతుగా విశ్లేషిస్తే, జీవితానికి సరిపడా ఉత్తేజాన్ని నింపుతాయి. ఇలాంటి ఎన్నో స్వామి వివేకానంద అమృతవాక్కులను చదివిన తరువాత, సరదాగా ఆటపాటలతో మఠంలోకి అడుగుపెట్టిన నా పాతస్వరూపమే మారిపోయింది. స్వామీజీ ప్రతి ఒక్కరూ నాయకునిగా ఎదగాలని తపనపడ్డారు; 'సేవకుడిగా ఉండటానికి నిన్ను నీవు సంసిద్ధం చేసుకుంటేనే నాయకుడివయ్యే భాగ్యాన్ని పొందుతావ'ని స్వామీజీ స్పష్టం చేశారు. మా ఈతరానికి ఈ వాక్యమే శిరోధార్యం. A true leader is not he who stands in front of the crowd, but he who is the crowd, who is one with it. సమూహానికి ముందు నిలబడటం కన్నా, అందరిలో తానొకడిగా మమేకమై ముందుకు నడిపేవాడే నిజమైన నాయకుడని నాకర్థమైంది.

**చదువే చుక్కాని... :** స్వామీజీ విద్యకు ఎంత ప్రాధాన్యమిచ్చారో తెలుసుకున్న తరువాత సమాజంలో ఆ దిశలో నావంతు కృషి చేయాలనుకుంటున్నాను. నేను గత రెండేళ్ళ నుంచి వారాంతంలో నాలుగు గంటల పాటు ఉచితంగా కొంత మంది పేద విద్యార్థులకు వారి చదువులో సాయపడుతున్నాను. గణితం, ఆంగ్లం, కంప్యూటర్ స్కిల్స్ తదితర విషయాల్లో మా పరిసర ప్రాంతాల్లోని విద్యార్థులకు వచ్చే సందేహాలను నాకు తెలిసినంత వరకు తీర్చే ప్రయత్నం చేస్తున్నాను. ఇప్పటి వరకు ఒక అభిరుచిగా సాగిన ఈ ప్రక్రియను భవిష్యత్తులో మరింత విస్తృతం చేయాలనుకుంటున్నాను. ఒకరు పైకి రావడానికి మనం ఇచ్చే చేయూత, మనను కూడా మరింత శక్తిమంతులను చేస్తుందని స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదివిన తరువాత తెలిసింది. చాలా మంది విద్యార్థులకు విద్యతో పాటు వికాసానికీ, జీవనసాఫల్యానికీ ఉపయోగపడే విషయాలేవీ సరైన రీతిలో అందటం లేదని, రెండేళ్ళుగా వాళ్ళకు పాఠాలు చెబుతున్నప్పుడు తెలిసింది. అందుకే భవిష్యత్తులో నాకు లభించే ఏ చిన్న అవకాశాన్నైనా విడిచిపెట్టకుండా విద్యాభివృద్ధికి తోడ్పడాలని నిశ్చయించుకున్నాను.

**విద్యతో పాటు విలువల వికాసం.... :** మనకు ఈ రోజు చాలా పాఠశాలల్లో సామాజిక దృక్పథానికి సంబంధించిన విషయాలపై అవగాహన కల్పించటం లేదు. అందుకే నేను ఆ దిశలో కొంత సేవ చేయాలనుకుంటున్నాను. పర్యావరణ పరిరక్షణ వంటి కనీస మౌలిక బాధ్యతలను మాలాంటి యువతరం చేబడితే సమాజం కూడా ప్రభావితమవుతుంది. అలాంటి సామాజిక, నైతిక కార్యక్రమాల్లో నాకు వీలయినంతవరకు పాల్గొంటూ కొందరినైనా నాతో జతకలుపుకొని శ్రమించాలనుకుంటున్నాను. పేదరికం, నిరుద్యోగం, కాలుష్యం, నిరక్షరాస్యత, నేరప్రవృత్తి సమాజాన్ని ఎంతగా నిర్వీర్యం చేస్తున్నాయో మనం గమనిస్తూనే ఉన్నాం. పాఠశాల స్థాయి నుంచే ఇలాంటి అంశాల్లో అవగాహన కలిగితే, భవిష్యత్తు తరం కూడా వాటి నిర్మూలనానికి తమవంతు సాయం చేయగలదని తెలిసింది. అందుకే ఆ కోణంలో కొందరినైనా చైతన్యపరచాలని నిర్ణయించుకున్నాను. ముఖ్యంగా స్వామి వివేకానంద అడుగుజాడల్లో నడుస్తూ, ముందు నన్ను నేను వ్యక్తిగా నిరూపించుకొని, పౌరుడిగా నా బాధ్యతలను నిర్వర్తిస్తాను. ❖

విక్రమ్ కృష్ణ శ్రీకుమార్
('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' ఉమ్మడివిజేత)
భారతీయ విద్యాభవన్, జూబ్లీహిల్స్, హైదరాబాదు

జీవన పోరాటాన్ని ఎదుర్కొనే సామర్థ్యాన్ని ఇవ్వగలిగేదీ, సౌశీల్యాన్ని పెంచేదీ, లోకోపకారం చేసే బుద్ధిని ప్రసాదించేదీ, సింహసదృశ్యమైన ధైర్యాన్నిచ్చేదీ నిజమైన విద్య. - స్వామి వివేకానంద

# చేసుకున్నవారికి చేసుకున్నంత!

- బి. సైదులు

ఉత్తరప్రదేశ్‌లో ఓ రాజకీయ నాయకుడు, మరో ప్రత్యర్థి పార్టీ నాయకుడితో శత్రుత్వాన్ని పెంచుకున్నాడు. రాజకీయ వైరాన్ని పగగా మలచుకొని ఆ ప్రత్యర్థి పదేళ్ళ కుమారుడిని గూండాతో చంపించాడు. అనంతరం ఆ శవాన్ని రహస్యంగా జాతీయ రహదారి పక్కన పాతిపెట్టించాడు. బాలుడిని ఖననం చేసిన ఆ ప్రాంతంలో కొన్నాళ్ళకు ఓ చిన్న మొక్క మొలిచి, కొద్ది సంవత్సరాలకి పెద్ద చెట్టయింది. ఆ ఘాతుకానికి పాల్పడ్డ రాజకీయ నాయకుడు కాలప్రవాహంలో స్థానికంగా పెద్ద పదవినే సంపాదించుకోగలిగాడు. పార్టీ పని మీద ఓసారి వేరే ప్రాంతానికి వెళ్ళి వస్తుండగా, అతను ప్రయాణిస్తున్న కారు అదుపుతప్పి జాతీయ రహదారికి పక్కనే ఉన్న ఓ చెట్టుకు గుద్దుకుంది. యాదృచ్ఛికంగా ఆ రోజు కారులో ఆ నాయకుడితో పాటు బాలుడిని చంపిన గూండా కూడా ఉన్నాడు. ఆ దుర్ఘటనలో ఇద్దరూ అక్కడికక్కడే మరణించారు. మిగిలిన వాళ్ళు గాయాలతో బయటపడ్డారు. గతంలో ఆ రాజకీయ నాయకుడు, గూండా కలసి బాలుడిని హతమార్చి, ఖననం చేసిన స్థలంలో ఎదిగిన చెట్టునే వారి కారు ఢీకొనడం విధి లీల! అలా 'చేసుకున్నవారికి చేసుకున్నంత' అని నిరూపించడమే కాలహేల! దారుణానికి కారణమైన వారిని కాలం కడతేర్చింది; గతంలో ఆ హత్యను చూసి పోలీసులకు చెప్పకుండా మౌనంగా ఉన్న ఆ నాయకుడి అనుచరులను తీవ్రగాయాల పాలు చేసింది. ఎవరికైనా ఇదే సూత్రం వర్తిస్తుంది. మంచి చేసినా, చెడు చేసినా గుర్తించి, గణించి ఫలితాన్ని ప్రసాదించడంలో కాలం ఎప్పుడూ పొరపాటు చేయదు. పవిత్రమైన బైబిల్‌లో ఏసుక్రీస్తు ఇలా అంటారు – 'whatsoever a man soweth, that he shall also reap.' మనిషి ఏది నాటుతాడో, అదే పండుతుంది!



**లెక్కకు లెక్క... :** నేటి వ్యవస్థలో అవినీతికూపంలో పడిపోయి, కన్నూ మిన్నూ కానకుండా అక్రమాలకు పాల్పడుతున్న వారిని కాలం ఎలా ఆడిస్తుందో చూస్తూనే ఉన్నాం. ధనదాహంతో, మదమాత్సర్యాలతో సాగిస్తున్న విశృంఖల కార్యకలాపాల ఫలితాన్ని తమ కళ్ళ ముందు ఇంతమంది అనుభవిస్తున్నా కూడా మనలో ఇంకా పాపభీతి పొడసూపడం లేదు. అప్రమత్తంగా మసలుకోవడం లేదు. 'ఎవరు చూడొచ్చారులే!' అన్న అజ్ఞానంతో అన్యాయాలు, అక్రమాల వైపు మొగ్గుచూపుతున్నాం. కానీ నేడు కాకపోయినా, రేపయినా; మనం కాకపోయినా మన ముందు తరాలైనా వాటి ఫలాన్ని అనుభవించి తీరాల్సిందే. అందుకే మహాభారతంలో వేదవ్యాసుడు...

**యథా ధేను సహస్రేషు వత్సో విందతి మాతరమ్ ।**
**తథా పూర్వకృతం కర్మ కర్తారమనుగచ్ఛతి ॥** అంటాడు.

నిజమే! వేలకొద్ది గోవులలో కూడా దూడ ఎలాగైతే తన తల్లినే గుర్తుపట్టి చేరుకుంటుందో; చేసిన కర్మకు సంబంధించిన ఫలం కూడా అదే విధంగా ఆ కర్తనే వెంబడిస్తుంది. మనలో చాలామందికి ఈ స్పృహ లేకపోవడం వల్లే జీవితానికి కట్టుబాట్లనూ, నీతి నియమాలనూ నిర్దేశించుకోవడం లేదు. తాత్కాలిక ప్రలోభాలకు లొంగిపోతూ పాపపురాశిని పెంచుకుంటూ పోతున్నారు. చేసిన ఋణం ఎలా తీర్చుకోక తప్పదో, పాల్పడిన దారుణాలకు ప్రతిఫలం అనుభవించకా తప్పదు.

**ధర్మం దారి తప్పితే..? :** మారుతున్న సమాజంలో నానాటికీ మనిషి అడుగులు ధర్మం, నీతి, న్యాయం నుంచి దూరమవుతున్నాయి. నాలుగు పాదాలపై నడవాల్సిన ధర్మం, ఇప్పుడు ఒంటి కాలి మీద, అదీ ఎప్పుడు చతికిలపడుతుందో తెలియనంత బలహీనంగా అడుగు వేస్తోందనిపిస్తోంది. అక్షరం ముక్క రాని అజ్ఞానులు, పామరులు దారి తప్పారంటే కొంత అర్థముంది. కానీ, పెద్ద పెద్ద చదువులు చదువుకొని, ఉన్నత హోదాల్లో ఉన్నవారు కూడా నీతి నియమాల విషయంలో నిబద్ధత కోల్పోతే అంతకు మించిన దీనత్వం మరొకటి లేదు. ప్రస్తుత సమాజంలో ధర్మబద్ధంగా జీవించడం అసమర్థత అంటూ కొత్త నినాదాలను వల్లె వేస్తున్నాం. తప్పటడుగులను కూడా తీరైన నాట్యమని భ్రమింపజేస్తున్నాం. త్రేతాయుగంలోనూ బహుభార్యత్వముంది. కానీ, శ్రీరాముడు ఏకపత్నీ వ్రతుడిగా, ధర్మమూర్తిగా వెలగలేదా? వందమంది కౌరవులు శకునితో కూడి వేల పన్నాగాలు పన్నినా, ధర్మరాజు నీతిపైనే నిలబడలేదా?

ఇప్పటికీ సమాజంలో నిజాయతీ నిండిన వ్యక్తులకు జనం నీరాజనాలర్పిస్తూనే ఉన్నారు. శ్రీమద్రామయణంలో మండోదరి...

**శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్ పాపమశ్నుతే ।**

**విభీషణః సుఖం ప్రాప్తః త్వం ప్రాప్తః పాప మీదృశమ్ ॥**

అంటూ 'మంచి పనులు చేసిన వారికి ఉత్తమఫలం, పాపకర్మ చేసిన వారికి దుఃఖం సంభవిస్తుంది. విభీషణుడికి తన శుభకర్మల వల్ల సుఖం లభిస్తే, నువ్వు చేసిన పాపకర్మల వల్ల ఇలాంటి దుఃఖాన్ని అనుభవించాల్సి వచ్చింద'ని రావణుడితో నిర్మొహమాటంగా చెప్పింది.

**ప్రలోభంతో పక్కదారులు :** భవిష్యత్ తరాలకు మార్గ నిర్దేశకులుగా నిలవాల్సిన ఉన్నతోన్నత స్థాయి వ్యక్తులు కూడా బాహ్యప్రపంచపు ప్రలోభాల్లో పడి, ఎంతటి నీచస్థాయికి దిగజారి పోతున్నారో మనం రోజూ చూస్తూనే ఉన్నాం. ఎన్నెన్నో ఆకర్షణలు మనస్సును మళ్ళించేందుకు ప్రయత్నిస్తాయి. పక్కదారి పట్టమని ప్రలోభపెడతాయి. అక్కడే మనం జాగ్రత్తగా ఉండాలి. ఒక్కసారి ఆ ప్రలోభాలకు లొంగి, అవినీతి మార్గాన పడ్డామా! అంత సులువుగా దాని నుంచి పక్కకు మరలలేం. ముందు ప్రియంగా అనిపించినంత మాత్రాన దానివైపు మనస్సు మొగ్గితే, కాలక్రమంలో అది దుష్పరిణామాలకు దారి తీయవచ్చు. అందుకే స్వామి వివేకానంద 'Accept the Beneficial and discard the Pleasant – కష్టంగా ఉన్నా కాలక్రమంలో మేలు చేసే మార్గాన్నే (శ్రేయస్సు) స్వీకరించండి. ప్రియంగా ఉంటూ చివరికి కష్టాలను కొనితెచ్చే మార్గాన్ని (ప్రేయస్సు) వదలివేయమ'ని హితవు పలుకుతారు. ముఖ్యంగా మన శ్రేయస్సును కూడా కాదనుకొని ప్రియమైన వాటి వెంటపడితే చివరకది పతనావస్థకు చేర్చుతుంది. మనశ్శాంతిని లాగేస్తుంది. అంతా మన అధీనంలోనే ఉంటుందన్న అహంకారానికి పోయి, సాగిస్తున్న అవినీతి కార్యకలాపాలకు కాలం ఎప్పుడో ఒకప్పుడు కఠినమైన శిక్ష వేయకుండా ఉండదు. అందుకే అంతులేని అవినీతితో అత్యంత వైభవ రాజభవనాలు కట్టుకున్నా, చివరకు అనాథల్లా, అతి దుర్భరంగా కన్నుమూసిన వారిని ఎంతో మందిని చూస్తున్నాం!



ఏది నాటితే అదే అంకురిస్తుంది. మనం చేసే పనులకు నేడు కాకపోయినా, రేపయినా; మనం కాకపోయినా మన ముందు తరాలవారైనా వాటి ఫలాన్ని అనుభవించి తీరాల్సిందే!

**సాక్షులకూ శిక్షే! :** ఆధునిక సమాజంలో మన కళ్ళ ముందు ఎన్నో అవినీతి, అక్రమాలు జరుగుతున్నా, ఎందరో ధర్మ విరుద్ధంగా ప్రవర్తిస్తున్నా పౌరుడిగా ప్రశ్నించే సాహసం చేయడం లేదు. 'మనకెందుకులే' అన్న ఉదాసీనత నానాటికీ పెరిగి పోతోంది. భయంతో కొన్నిసార్లు, బాధ్యత లేక మరికొన్నిసార్లు మనం ఎంతటి ఘోర పరిస్థితుల్లో కూడా 'ఇదేమిటని?' నోరు విప్పడం లేదు. చివరకు పాపఫలాన్ని మనం కూడా అనుభవించాల్సి వస్తుందని తెలుసుకోవడం లేదు. మహాభారతంలో కౌరవులు ద్రౌపదిని నిండుసభలో వివస్త్రను చేయబూనినప్పుడు, ఆమె న్యాయం చేయమని సభాసదులందరినీ వేడుకొంది. కానీ భీష్ముడితో సహా ఎవరూ అడ్డుపడే ధైర్యం చేయలేదు. చివరకు వారు చేసిన ఆ చారిత్రక తప్పిదానికి కురుక్షేత్రంలో తగిన శిక్ష అనుభవించారు. అందుకే మహాభారత సభాపర్వంలో విదురుడు ఇలా అంటాడు – 'ధర్మం అధర్మం చేత బాధకు గురై, సభకు వస్తే దాన్ని తీర్చని సభ్యులు అధర్మం చేత బాధింపబడతారు. అంతేకాదు, సభ్యులు కామక్రోధాలు విడచి అధర్మాన్ని ఆపని నాడు, ఆ అధర్మంలో పావుభాగం సభ్యులకు, మరొక పావుభాగం రాజుకు, మిగిలింది కర్తకు సంక్రమిస్తుంది. అందుచేత ధర్మం వైపు రక్షణగా నిలబడాలి'. కానీ నాగరకులమని పొంగిపోతున్న మనం చాలా సందర్భాల్లో నీతికి నిలబడలేకపోతున్నాం. ధర్మానికి దగ్గర కాలేకపోతున్నాం. మన పొరుగింట్లో ఓ అభాగిని తగలబడిపోతున్నా, సాటి వ్యక్తికి నడిరోడ్డుపై అన్యాయం జరుగుతున్నా కళ్ళున్న కబోదులలా ప్రవర్తిస్తున్నాం. ఆ పాపంలో పాలుపంచుకున్నవాళ్ళం అవుతున్నాం.

**ధర్మానిదే తుది విజయం! :** 'నువ్వు చేసే ప్రతి మంచి పనికీ పదింతలుగా లాభం లభిస్తుంది. అదే విధంగా చెడ్డ పనులకు అదేతీరులో ఫలితం వస్తుంది. ఎవరికీ అన్యాయం చేయవద్దు' అంటాడు ఖురాన్‌లో మహమ్మద్ ప్రవక్త. ఏ మతమైనా మనిషిని ధర్మబద్ధంగా జీవించమనే చెబుతోంది. లోభంలో పడి కొట్టుకుపోవద్దంటోంది. కానీ ప్రస్తుత వ్యవస్థలో అందరూ ఆ దైవవాక్కుల్ని ధిక్కరిస్తున్నట్లుగానే కనిపిస్తోంది. ఇది ప్రమాదకరమైన పరిణామం. అక్రమంగా, వేలమంది కడుపుకొట్టి, ఒక్కడు ఆరగిస్తే అది రక్తం తాగడంతో సమానమవుతుంది; తుదకు విషమై సమూలంగా నాశనం చేస్తుంది. కాలం వేసే పాపపుణ్యాల తూకంలో ఎప్పుడూ తేడా రాదు. సకల అస్త్రశస్త్రాలతో యోధానుయోధులు కౌరవుల వైపున్నారు. అయినా విజయం సాధించలేదు. కారణం అక్కడి 'అధర్మం' ఆ వీరుల శక్తియుక్తులన్నింటినీ నిర్వీర్యం చేసింది. పాండవులు పరిమితమే కానీ ధర్మాన్నే నమ్ముకున్నారు. కాబట్టి సాక్షాత్తూ భగవంతుడే వారి సారథి అయ్యాడు. అందుకే అటు సూర్యుడు ఇటు పొడిచినా, సప్తసముద్రాలు ఏకమైనా 'ధర్మో రక్షతి రక్షితః'. ❖

**పాపం చేస్తే దాని ఫలితాన్ని అనుభవించే తీరాలి. దీనిని ఎవ్వరూ తప్పించుకోలేరు. ఇది భగవంతుడి నియమం. మిరపకాయ నమిలితే నాలుక మంట పుట్టదా!** *-శ్రీరామకృష్ణ పరమహంస*

# ప్రతిభకు పునాది సంకల్పశక్తి

– ప్రయాగ రామకృష్ణ

ఆధ్యాత్మికోన్నతి కావచ్చు, లౌకిక విజయాలు కావచ్చు, ఏది సాధించాలన్నా ముందు దృఢసంకల్పం కావాలి.

పాలసముద్రాన్ని చిలికినప్పుడు విలువైన రత్నాలు అనేకం బయటపడ్డాయి. వాటిని చూసి దేవతలు మురిసిపోలేదు. హాలాహలమనే భయంకరమైన విషం పుట్టింది. దాన్ని చూసి వాళ్ళు భయపడలేదు. అమృతం లభించే వరకు పాల సముద్రాన్ని మథిస్తూనే వెళ్ళారు. ధీరులైన వారు తాము చేయనిశ్చయించుకున్న కార్యం సఫలమయ్యేవరకు విడిచిపెట్టరు.

అకుంఠిత దీక్ష, ధైర్యం, సూక్ష్మదృష్టి, నిశితమైన బుద్ధి, గొప్ప సామర్థ్యం అనే నాలుగు సుగుణాలు ఎవరికి ఉంటాయో వాళ్ళు ఘనకార్యాలు సాధిస్తారని రామాయణంలోని సుందరకాండ చెబుతోంది. ఈ నాలుగు లక్షణాలు హనుమంతుడికున్నాయి. అందువల్లనే హనుమంతుడు సురసను, సింహికను నిర్జించాడు. లంకిణిని మర్దించాడు. దుర్భేధ్యమైన లంకానగరంలోకి ప్రవేశించాడు. సీతాన్వేషణ చేశాడు. అశోకవనంలో సీతమ్మను చూశాడు. స్వామి ఆనవాలు అందించాడు. అసాధ్యాన్ని సుసాధ్యం చేశాడు.

ఎవరైనా ఒక లక్ష్యాన్ని సాధించడానికి ముందడుగు వేస్తున్నప్పుడు భయపెట్టేవారుంటారు. వెనక్కిలాగేవారుంటారు. అప్రమత్తంగా ఉండాలని హెచ్చరించేవారుంటారు. దురుద్దేశంతోనో, ఈర్ష్యతోనో విఘ్నాలు కలిగించే వారూ ఉంటారు. వేటికీ చలించకూడదు. వేటికీ వెరదరకూడదు. ఆటంకాలు, అవాంతరాలు, అభ్యంతరాలు ఎన్ని ఎదురైనా చేపట్టిన పనిని, సంకల్పించిన పనిని విడవకుండా, లక్ష్యం సిద్ధించే వరకు వెనుదిరగకుండా ఆత్మ విశ్వాసంతో ముందుకు కదిలి వెళ్ళేవారే మహనీయులవుతారు.

"మనం ఈ ప్రపంచంలో చిత్తశుద్ధితో ఒక పని చెయ్యడం మొదలుపెట్టినప్పుడు, ప్రకృతి రకరకాల సమస్యలను, కష్టాలను మన మార్గంలో అడ్డంగా ఉంచుతుంది. వాటిని అధిగమించే శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు మనకు ఉన్నాయో లేవో పరీక్షిస్తుంది. మన శక్తేమిటో మనకు తెలిసేలా చేస్తుంది. సమర్థుడు కాకపోతే ఎవరూ ఏ పనినీ ఎక్కువకాలం సక్రమంగా నిర్వహించలేరు. సమర్థంగా నిర్వహించ గలిగినవారికి మరిన్ని పదవులు, బాధ్యతలు వెతుక్కుంటూ వస్తాయి" అని స్వామి వివేకానంద అన్నారు.

ఒకసారి గాంధీజీ శాంతినికేతన్ సందర్శించేందుకు వెళ్ళారు. అక్కడ రవీంద్రనాథ్ టాగూర్ అభిమానులూ, ఆశ్రమవాసులూ గాంధీజీని కలిసి టాగూర్ ఆరోగ్యం గురించి ఆందోళన వ్యక్తం చేశారు. గాంధీజీ మౌనంగా అంతా విన్నారు. తరువాత టాగూర్ నివాసానికి వెళ్ళారు. టాగూర్ రచనావ్యాసంగంలో తలమునకలుగా ఉన్నారు. తరువాతెప్పుడో తలెత్తి చూసేసరికి ఎదురుగా గాంధీజీ నిలబడి ఉన్నారు.

'అదేమిటి? ఇప్పుడేగా మీ భోజనమైంది. మావాళ్ళు ఇచ్చిన బస సౌకర్యంగా లేదా ఏమిటి? విశ్రాంతి తీసుకోకుండా వచ్చేశారు?' అని అడిగారు టాగూర్. గాంధీజీ ఆయన సరసనే కూర్చుంటూ 'మీకే విశ్రాంతి లేదనిపిస్తోంది. అలసట మీ కళ్ళలో కనిపిస్తోంది. మధ్యాహ్న భోజనం తరువాత కాసేపు పనికి విరామం ఇవ్వకూడదూ' అని ఆప్యాయంగా అడిగారు.

'నిజమే! కానీ ఏ కారణం చేత కూడా పగటిపూట విశ్రాంతి తీసుకోకూడదని చిన్నప్పుడే ఒట్టు పెట్టుకున్నాను. ఇన్నాళ్ళ తరువాత ఇప్పుడా వ్రతభంగమెందుకా అని ? నా మాటను వెనక్కి తీసుకుందామనుకున్నా ఇంకెన్నాళ్ళు బతుకుతాను గనుక' అని మళ్ళీ పుస్తకంలో తలదూర్చారు టాగూర్.

ఆ మాటలకు గాంధీజీ చలించిపోయారు. "మీ విజ రహస్యం నాకు తెలిసి పోయింది. మీరు గీతాంజలి వంటి మహాకావ్యాన్ని ఎలా రాయగలిగారో, సాహిత్య రంగంలో అత్యున్నత నోబెల్ పురస్కారం మిమ్మల్ని ఎందుకు వరించిందో నాకు అర్థమైపోయింది. మనం ఏదైనా ఒక పని చేస్తామని మాట ఇచ్చినప్పుడు ఖచ్చితంగా దానిని చెయ్యాలి. అలా చెయ్యకపోతే ఎదుటి వారికి మనమీద నమ్మకం పోతుంది. ఇచ్చిన మాట నిలబెట్టుకునేవారే ప్రతిభామూర్తులు. సమాజానికి మీలాంటి వారి అవసరమే ఉంది" అని చేతులు జోడించారు. ❖

(...21వ పేజీ తరువాయి)

# శ్రీచరణారవిందాలకు విన్నపం

"ఎన్ని మతాలో అన్ని పథాలు (జతోమత్ తతోపథ్). దేవుడు ఒక్కడే. ఆయనను చేరుకోవడానికి మార్గాలు, సాధనలు అనేకం కావచ్చు. ఒకే వస్తువును – నీరు, జలం, పానీ, వాటర్, ఆక్వా అని వివిధ నామాలతో పిలిచినట్లుగా ఒకే సర్వాంతర్యామి, సచ్చిదానంద నిర్గుణ, నిరాకార పర బ్రహ్మాన్ని – రాముడు, కృష్ణుడు, దుర్గ, లక్ష్మి, అల్లా, జీసస్ – ఇలా అనేకానేక నామాలు, రూపాలతో భక్తులు తమ తమ అభిరుచి మేరకు పూజిస్తున్నారు" అని అన్ని మతాల, అన్ని భావాల అత్యంత కఠోర సాధనలు అనుష్ఠించి, నిరూపించి (అనుభూతి పొంది), సర్వధర్మ సమన్వయ మూర్తిగా, సర్వధర్మస్వరూపునిగా విశ్వ నీరాజనాలందుకొంటున్న ఓ విశ్వమూర్తీ! నీ జన్మభూమి భారతావనిలోనే కుల, మత, జాతి విద్వేషాలతో మతోన్మాదులైన నరరూప రాక్షసులకు – సకల ప్రాణులూ ఒకే భగవంతుని బిడ్డలనీ, మానవులంతా ఒకే విశ్వ కుటుంబమనీ గ్రహించేలా సద్బుద్ధిని ప్రసాదించి సన్మార్గంలో నడిపించు ప్రభూ!



" 'భగవంతుడు అక్కడ, అక్కడ ఉన్నాడు' అనుకోవడం అజ్ఞానం. 'భగవంతుడు ఇక్కడ, ఇక్కడే (నా హృదయంలోనే) ఉన్నాడు' అనుకోవడమే జ్ఞానం. భగవంతుడు మన సొంత మనిషి. జగన్మాత మనందరికీ జన్మనిచ్చిన నిజమైన సొంత తల్లి; ఆమె పరాయి తల్లి కాదు, సవతి తల్లి కాదు. మన తల్లి, తండ్రి, గురువు, దైవం – అన్నీ భగవంతుడే! జగజ్జననియే మన నిజ జనని. ఆ జగన్మాతపై (మన సొంత తల్లి కాబట్టి) మనకు 'హక్కు' ఉంది. 'అమ్మా! దర్శనం ఇచ్చి తీరాలి, ఇవ్వవా తల్లీ!' అని అమ్మను పట్టుబట్టి ప్రార్థించాలి!" – అన్న అమృత వాణిని వినిపించావు. కాబట్టి హే ప్రభూ! హే రామకృష్ణా! నీవే నిజంగా మాకు తల్లివీ, తండ్రివీ, గురువూ, బంధువూ, దైవమూ, మా సర్వస్వమూ నీవే కదా స్వామీ! నీవు మాకు క్రొత్త వ్యక్తివి కాదు, పరాయివాడివి కాదు. మీ అపార కృపాకటాక్షాలను నీ సంతానమైన మా అందరిపై ప్రసరింపజేసి, మా హృదయాలలో ప్రవేశించి, భవబంధాలను ఖండించి, నీ దివ్యదర్శనం ప్రసాదించి, నీ 'నిజమైన' భక్తులుగా, బిడ్డలుగా తీర్చిదిద్దమని నీ శ్రీచరణారవిందాలకు ఇదే మా విన్నపం. ❖

# నేటితరం నాగమహాశయ్... శ్రీహరి

(...19వ పేజీ తరువాయి)

శిబిరాలు, మొక్కలు నాటటం వంటి గ్రామసంక్షేమ కార్య క్రమాల్లో ఉత్సాహంగా పాల్గొనేవారు. అందుకే రామకృష్ణ సంఘంలో వారిని 'తెల్లదుస్తులు ధరించే సాధువు' అని పిలిచేవారు.

**విలువలున్న వ్యక్తిత్వం...:** అహంకారరాహిత్యంతో, అతిసాధారణ జీవనాన్ని కొనసాగిస్తూ, శ్రీరామకృష్ణ పరమహంస బోధనల్నే తన మార్గంగా మలచుకున్న ఆయన ఒక గురువుగా కూడా విద్యార్థులకు ఆదర్శమూర్తి. ఓ మారు శ్రీహరి బస్సులో ప్రయాణిస్తున్నారు. యువకండక్టర్ ఎంతో ఓపిగ్గా టికెట్లు ఇవ్వటంతో పాటు, ఏ ఒక్కరికి కూడా పైసా చిల్లర తేడా రాకుండా డబ్బులు చెల్లిస్తూ ఉన్నాడు. ఈ రోజుల్లో కూడా ఇంత సహనంతో ఏ ఒక్కరికి చిల్లర ఎగ్గొట్టకుండా ఇస్తున్న ఆ యువకుడిని శ్రీహరి ఆశ్చర్యంగా 'ఏంటి నాయనా! ఈ రోజుల్లో కూడా ఇంత నిజాయతీగా ఉన్నావు? నిన్ను చూస్తుంటే నాకు ముచ్చటేస్తుంది!' అన్నారు. దీనిలో నా గొప్పేమీ లేదు మాష్టారు! ఇదంతా మీరు మాకు నేర్పిన పాఠాల పుణ్యమే! నేను మీ పూర్వ విద్యార్థిని మాష్టారు!' అంటూ కాళ్ళకు దణ్ణం పెట్టాడు. అది చాలు శ్రీహరి జీవితా నికి! పాఠాలు బోధించడం కాదు; తన జీవితాన్నే ఓ నీతి పాఠంగా మిగుల్చుకొని, తను పోయినా తన సమాధిని ఈ నేలపై కాకుండా ఎదుటి వారి గుండెల్లో కట్టించుకున్న శ్రీహరి ధన్యాత్ములు. ❖



విజయం పొందాలంటే సంకల్పశక్తి కలిగివుండాలి. సంకల్పశక్తితోనే మహత్కార్యాలు సాధించ బడతాయి. దృఢ సంకల్పంతో కష్టపడి పనిచేయి. గమ్యాన్ని తప్పక చేరుతావు. -స్వామి వివేకానంద


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,
30–4–56

**ప్రియమైన తల్లీ సుశ్రీ!** *

నీ ఉత్తరానికి సమాధానం వ్రాద్దామనుకుంటుండగానే మూడు వారాలు గడచిపోయాయి. ఈ యంత్రం పనిచెయ్యడానికి మొరాయిస్తోంది. అది తల్లీ! నా పరిస్థితి.

"మీ సమాధానం కోసం ఎదురు చూస్తుంటాను" అని వ్రాశావు. ఈ ఆలస్యం చూసి ఆశ వదులుకున్నావా? "ఆశాహి పరమమ్ దుఃఖమ్, నైరాశ్యం పరమమ్ సుఖమ్" (భాగవతం, 11–8–14). "ఆశ అనేది నిజానికి ఎంతో దైన్యమైన విషయం. ఆశారాహిత్యం ఆనందదాయకం". నీవు ఆశాపథాన్ని అనుసరిస్తున్నావా? ఆశకు ఆవలిపథాన్నా? రెండూ మంచి మార్గాలే. ఆశే లేకపోతే పనిచెయ్యడానికి మనల్ని ఒత్తిడి చేసే అంశం ఏముంటుంది? అసలు పనే చెయ్యనివారు ఆశలు అడుగంటినవారన్నమాట!

నీకు తెలుసా! నువ్వు నీ ఆశల చిట్టచివరి హద్దుకు చేరుకున్నావు. నా శారదా రామకృష్ణులను తప్ప ఆశించడానికి ఇంకేమీ లేదు. ఇంకేమైనా ఆశిస్తున్నావా? తల్లీ సుశ్రీ! పూర్తిగా అతి సూక్ష్మంగా నీ హృదయ కుహరంలో వెతుకు. నిన్ను నువ్వే ఇలా అడుగు. "నేను ఇంకేమి కోరుకుంటున్నాను? నాకు లేనిది ఏమిటి?" అని. శ్రీశారదారామకృష్ణుల కన్నా ఉన్నతోన్నతమైనది మరేదైనా ఉన్నదేమో జాగ్రత్తగా ఆలోచించు.

మనం ఒక్క అడుగు వారి వైపునకు వేస్తే మనవైపునకు పదడుగులు వేస్తామని వారు ఇచ్చిన హామీ అసత్యమేనా? నీ మనస్సు నడుగు. నా చిట్టి తల్లీ! ఇంకేమీ సమస్యలు సృష్టించుకోకు.

తల్లీ! దక్షిణేశ్వరానికి ఒక్క పర్యాయం వెళ్ళి ఆకాశానికి నీ చెవి యొగ్గి శ్రీరామకృష్ణుల మధురగానాన్ని ఆలకించు. నీ యావదాత్మ ఆయనకు సమర్పణ చెయ్యి. ఈ మాత్రం కూడా చెయ్యలేకపోతే నీ గది తలుపులు మూసుకొని నిద్రాహారాలు మాని, ఒక రోజంతా శారదా రామకృష్ణుల ప్రేమాంకంపై సేద తీరు. రోజంతా కాకపోతే రోజులో కొంతభాగం, కనీసం రెండు గంటలు! ఇలా గడిపితే ఎంత ఆనందం కలుగుతుందో చూడు. వారిద్దరూ తప్పక పరుగున వచ్చి నీకు మనశ్శాంతిని ఇస్తారు.

విహాయ కామాన్యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।
నిర్మమో నిరహంకారః స శాన్తిమధిగచ్ఛతి ॥ *(భగవద్గీత 2- 71)*

కోరికలన్నింటినీ త్యజించి 'నేను', 'నాది' అనే అహంకారం లేక ఎవడు చరిస్తాడో వాడు శాంతిని పొందుతాడు. వింటున్నావా? ఏం తల్లీ! వింటున్నావా? ఇది చెయ్యగలవా? ఏమిటి ఆలోచిస్తున్నావు? "నేను చెయ్యగలను" అని నీవు అనుకుంటే తప్పక చేయగలవు.

నీవు ఏది అనుకుంటే అది చెయ్యగలవు. నీ కోరిక ఏమిటో నిర్భయంగా నాతో చెప్పు. స్వామి వివేకానంద ఏమన్నారో తెలుసా? 'మనస్సే మాయ'. నీవు నీ మనస్సు చెప్పే మాటలు వినకూడదు. అది నీ అధీనంలో ఉండాలి. రాత్రింబవళ్ళు ఇలా గానం చెయ్యి.

"యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః... లోకమును క్షోభిల్లజేయక, లోకముచే తాను క్షోభిల్లకుండా ఉండేవాడు నాకు అత్యంత ప్రియుడు" అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అంటాడు. తప్పకుండా ఈ శ్లోకం అన్ని సమస్యలకూ పరిష్కారం. దీన్ని కనీసం ఒక వారం రోజులు పఠిస్తే ఫలితం నీకే అర్థమవుతుంది.

అప్పుడప్పుడు ఉపవాసం చేస్తూ కొంత సమయాన్ని నిశ్శబ్దంగా దేవాలయంలో గడుపు. అవకాశం దొరికినప్పుడల్లా గీత, కథామృతాలను పఠిస్తూ ఉండు. శ్రీరామకృష్ణులను ధ్యానిస్తూ, సేవిస్తూ, పూజిస్తూ ఆయన కార్యక్రమంలో నిమగ్నమై ఉండు.

ఓ తల్లీ! శ్రీరామకృష్ణులను అనుసరిస్తున్న వేలాది మంది నీ తోటి ప్రయాణికులని మరచిపోకు. ముందుకు సాగిపో!.. ముందుకు సాగిపో!

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**

(*సుశ్రీ కాలాంతరంలో శారదా మఠంలో ప్రవ్రాజిక నిర్భయప్రాణా మాతాజీగా పరిచితులు)

**మానససరోవరం కామక్రోధాదులనే పెనుగాడ్పులచే కల్లోలమై ఉన్నంతవరకు అందులో పరంజ్యోతి ప్రతిబింబం కనిపించదు. ప్రశాంత మానసంలోనే దైవదర్శనం లభిస్తుంది. -శ్రీరామకృష్ణులు**

(...15వ పేజీ తరువాయి)

వంశభూషణుడు. తెల్లవారి, పొద్దెక్కిపోయింది; అదిగో! అప్పుడే దేవతలు, మునులు దగ్గరగా కొందరు, దూరంగా మరికొందరు గుంపులు, గుంపులుగా నిలబడి నీ కోసం నిరీక్షిస్తున్నారయ్యా! తామరరేకుల లాంటి చల్లని నీ కన్నులు తెరచి త్వరగా లేవయ్యా! అన్న భావనతో...

**తెల్లవారె జామెక్కె దేవతలు మునులు**
**అల్లనల్ల నంతనింత నదివో వారే**
**చల్లని తమ్మిరేకుల సారసపు కన్నులు**
**మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా...** అని పాడుతున్నాడు ఈ భక్తపారిజాతం. అంతనింతన్ అంటే దూరముగా, దగ్గరగా, పెద్ద, చిన్న గుంపులుగా అని; సారసపు అంటే సరసమైన, ప్రీతికరమైన అని అర్థం. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస కూడా తన జీవితకాలంలో కాళీమాతకు ఆత్మీయ భక్తుడిగా కనిపిస్తూ, వరిష్ఠ అవతారంగా భాసించారు. భగవంతుడు ఏకకాలంలో అటు భగవంతుడి పాత్ర, ఇటు భక్తుడి పాత్ర పోషించడం ఆ మహానుభావుడి



విషయంలోనే సాకారమైంది. అలా ఓ మారు ఓ భక్తగాయకుడు, 'మేలుకో మాయమ్మ ఓ జనని, మేలుకోవే తల్లి మేలుకో; మూలాధార చక్రమందెంత కాలము, ముకుళించి నిదురింతు వీవు' అనే అర్థంతో బెంగాలీలో ఆలపించిన...

**జాగో జాగో జనని మూలాధారే నిద్రగత**
**కొతోదిన్ గతహోలో కులకుండలిని స్వకార్జో**
**సాధనే ఛలోమా!...** అనే జగజ్జనని మేల్కొలుపు గీతానికి శ్రీరామకృష్ణ పరమహంస సమాధి నిమగ్నులయ్యారు.

**శ్రీముఖము తెరచి చిత్తగించవయ్యా...**

శ్రీనివాసుణ్ణి దర్శించుకునేందుకు దేవలోకం నుంచి గరుడ, కిన్నెరాదులు వచ్చి వేచిచూస్తున్నారని గుర్తుచేస్తున్నాడు. ఊరకే వచ్చి నిలబడలేదయ్యా! వారు కూడా నీ విరహాన్ని తట్టుకోలేక నవ్యరాగాలతో నిన్ను కీర్తిస్తున్నారయ్యా! ఇకనైనా నీ శ్రీమంతమైన ముఖాన్ని తిప్పి వారి మాటల్ని కాస్త వినవయ్యా! అన్న ఆర్తితో

**గరుడ కిన్నెర యక్షకామినులు గములై**
**విరహపు గీతముల వింతాలాపాల**
**పరిపరి విధముల పాడేరు రాగాల నిన్నదివో**
**సిరిమొగపు దెరచి చిత్తగించవేలయ్యా** అంటున్నాడు అన్నమయ్య. వింతాలాపాలంటే నూతనమైన రాగాలతో గానం చేయడం. 'గములు' అంటే గుంపులు. ఆయనకు చేరువవ్వాలని, ఆయనను చేరుకోవాలని ఎందరు తపిస్తున్నారో, వివరిస్తున్నాడు వేంకటేశ్వరుడి సేవాగ్రగణ్యుడు. అలా వ్యాకులతతో భగవంతుడిని కాంక్షించినప్పుడే ఆయన కరుణిస్తాడు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణ పరమాత్ముడు తమకు దూరమైతే గోప కులమంతా విరహంతో విలపించింది. ఎడబాటును తట్టుకోలేక ఏ ఒక్కరు కనిపించినా ఆ ముకుందుడి గురించే ముచ్చటించుకునేవారు. అలా...

**వచ్చునే హరి మేమున్న వనము చూడ?**
**తలచునే భర్త మాతోడి తగులు తెలిగు,**
**తెచ్చునే విధి మన్నాథు తిట్టుపడక...** అంటూ 'హరి ఏనాటికైనా మేమున్న వనానికి వస్తాడా? మా మనోవల్లభుడైన శ్రీకృష్ణుడు తనకు మాతో గల సంబంధాన్ని స్మరించుకుంటాడా? మాతో తిట్లు పడకముందే ఆ బ్రహ్మ మా నాథుని మా కడకు కొని తెస్తాడా?' అని ఉద్ధవుడి ముందు కన్నీళ్ళ పర్యంతమయ్యారు.

**రెప్పలు విచ్చి చూచిలేవయ్యా...**

గరుడ కిన్నెరాదులే కాదు; తుంబురులు, నారదులు కూడా ఆ ఏడుకొండలవాడి కోసం ఎదురుచూస్తున్నారట! చివరకు బ్రహ్మదేవుడు కూడా వచ్చాడు. పక్కన అమ్మవారు అలమేలుమంగ కూడా కూర్చొని ఎప్పుడు పడక మీద నుంచి లేస్తాడా అని వేచి ఉందట! అలా స్వర్గలోకం నుంచి సకల దేవతల్ని రప్పించి...

**పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు**
**పంకజభవాదులు నీ పాదాలు చేరి**
**అంకెలనున్నారు లేచి అలమేలుమంగను**
**వేంకటేశుడా రెప్పలు విచ్చి చూచిలేవయ్యా...**

అంటూ తన పదామృతాన్ని ఆ పురాణపురుషుడిపై చిలకరిస్తున్నాడు ఈ భాగవతోత్తముడు. 'పొంకపు' అంటే పొందికగా, 'అంకెల' అంటే సమీపాన అని భావం. అందరూ పొందికగా పక్కనే ఆసీనులై ఆయననే నమ్ముకొని కూర్చున్నారట! అవును! ఆ లోకేశుడు తప్ప అన్యులెవ్వరూ ఆశ్రయించదగ్గ వారు లేరు. అందుకే ఓ మారు నారదుడితో బ్రహ్మదేవుడంటాడు...

**కారణకార్యహేతువగు కంజదళాక్షుని కంటె నన్యు లె**
**వ్వారును లేరు, తండ్రి! భగవంతు ననంతుని విశ్వభావనో**
**దారుని సద్గుణావళు లుదాత్తమతిం గొనియాడకుండినం**
**జేరవు చిత్తముల్ ప్రకృతి చెందని నిర్గుణమైన బ్రహ్మమున్**

నిజమే! అటు కారణాలకూ, ఇటు కార్యాలకూ అన్నింటికీ కారణభూతుడైనవాడు ఆ కమలాక్షుడే! ఆయన కంటే ఇతరులెవరూ ఆశ్రయింపదగిన వారు లేరు. షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, తుది లేనివాడూ, ప్రపంచసృష్టి గావించే ఉదారుడూ అయిన ఆ పరమాత్ముని సద్గుణపుంజాలను గొప్ప మనస్సుతో కొనియాడాలి. లేకుంటే మనస్సులు ప్రకృతికి అతీతమైన నిర్గుణ బ్రహ్మాను పొందలేవు. ❖




– స్వామి పరిజ్ఞేయానంద

ఓ విద్యార్థి, ఇంటర్మీడియట్, వికారాబాద్.

**ప్రశ్న: నేను పాఠ్యాంశాలను ఎప్పటికప్పుడు చదువుతున్నాను. చదివినవన్నీ బాగానే గుర్తుంటాయి. కానీ పరీక్షలంటే ఆందోళన (tension)కలుగుతుంది. అందువల్ల పరీక్షల సమయంలో సమాధానాల్ని సరిగా వ్రాయలేకపోతున్నాను. నేను ఈ సమస్యను అధిగమించడానికి తగిన సూచనలు ఇవ్వగలరు.**

**జవాబు:** ఈ జీవిత పాఠశాలలో ప్రతి ఒక్కరమూ విద్యార్థులమే! విద్యార్థి అయినా, ఉద్యోగి అయినా, వ్యాపారి అయినా, అధికారి అయినా–తమ కర్తవ్యాలను నిర్వర్తించి, సత్ఫలితాలను పొందాలంటే ఆందోళన చెందకుండా కష్టపడి పనిచేయాలి.

Learn to do what you have to do without strain; work hard, but never under tension. *- Alous Huxley*

1. ఆందోళనకు గురికాకుండా ఉండాలంటే జరిగిపోయిన దాని గురించిగానీ, జరగబోయేదాని గురించిగానీ ఆలోచించకుండా వర్తమానంలో ఉంటూ పనిచేయడం అలవాటు చేసుకోవాలి.

2. వర్తమానంలో ఉంటూ పనిచేయాలంటే ఏంచేయాలో ఆనాడు కురుక్షేత్ర సంగ్రామంలో మానసిక బలహీనతకుగురై, భయాందోళనల బారినపడిన అర్జునుడికి, శ్రీకృష్ణుడు ఇచ్చిన ఈ సలహా ఏ తరానికైనా ఓ జీవనసూత్రమే!

“కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన...– పని చేయడం నీ చేతిలో ఉంది. కానీ ఫలితం నీ చేతిలో లేదు.”

Our main business is not to see what lies dimly at a distance, but to do what lies clearly at hand.- *William Osler*

మనస్సు ఫలితం గురించి ఆలోచించడం వలన, చేసే పనిలో సామర్థ్యం తగ్గుతుంది, నైపుణ్యం సన్నగిల్లుతుంది. దానికారణంగా సమస్యలను పరిష్కరించే శక్తిని కోల్పోతాం. అందుచేత కనిపించని ఫలితం మీద మనస్సు పెట్టి ఆందోళన చెందడం కన్నా, చేస్తున్న పని మీదే మనస్సు పెట్టడం అభ్యసించాలి.

3. మన కర్తవ్య నిర్వహణలో పోటీతత్త్వం లేకుండా సహజంగా పనిచేయగలిగితే ఆందోళన కలుగదు. దానివల్ల పనిని సక్రమంగా పూర్తిచేయగలుగుతాం. అందుకు పరుగుపందెంలో ప్రపంచ రికార్డు సృష్టించిన ఒక సామాన్య వ్యక్తి జీవితంలో జరిగిన ఓ స్ఫూర్తిదాయక సంఘటనను ఇక్కడ తెలుసుకుందాం:

1983లో ఆస్ట్రేలియాలో సిడ్నీ నుండి మెల్‌బోర్న్ వరకు – 875 కిలోమీటర్ల పరుగుపందెంలో అపార అనుభవం గల ఐదు మంది క్రీడాకారులతో పాటు, ఏ అనుభవమూలేని ఒక వ్యక్తి కూడా ఆ పోటీలో పాల్గొనడం అందరినీ ఆశ్చర్యపరిచింది. కానీ ఆ వ్యక్తి 5 రోజుల 9 గంటల్లో గమ్యాన్ని చేరుకుని సరికొత్త రికార్డును సృష్టించి అందరి అంచనాల్ని తారుమారు చేశాడు.

పూర్వం ఎలాంటి అనుభవం, శిక్షణ లేకుండా ఈ సరికొత్త రికార్డును నెలకొల్పడం ఎలా సాధ్యమయిందని పాత్రికేయులు ప్రశ్నించినప్పుడు తన విజయ రహస్యాన్ని అతడు ఇలా చెప్పాడు:

“మాది ఒక సామాన్య రైతు కుటుంబం. మాకు రెండువేల గొర్రెలు ఉన్నాయి. వాటిని ప్రతి రోజు మేత కోసం విశాలమైన పచ్చికబయళ్ళకు తోలుకెళ్ళేవాణ్ణి. అలా అనేక సంవత్సరాలుగా గొర్రెలను మేతకు తోలుకెళ్ళినప్పుడు వాటివెంట పరిగెత్తడం అలవాటైంది. ఈ పరుగుపందెంలో పాల్గొన్నప్పుడు ఏదో పెద్ద పోటీల్లో పాల్గొంటున్నాననే భావన నాలో కలుగలేదు. రోజూ గొర్రెల వెంట ఎలా పరిగెత్తానో, అలాగే ఈ పోటీల్లో కూడా పరిగెత్తాను” అని అమాయకంగా తన విజయ రహస్యాన్ని చెప్పిన ఆ రైతు పేరు – ‘క్లిఫ్ యాంగ్’. పరుగుపందెంలో పాల్గొన్నప్పుడు అతడి వయస్సు 61 సంవత్సరాలు.




విద్యార్థులు కూడా మనస్సులో ఏ పోటీభావన లేకుండా రోజూ ఎలా చదవగలుగుతున్నారో, అదేభావనతో పరీక్షా సమయంలో కూడా ఉండగలిగితే ఆందోళన దూరమవుతుంది.

జరిగినదాని గురించి, జరగబోయేదాని గురించి ఆలోచించకుండా వర్తమానంలో ఉండగలగడం; మనస్సును ఫలితం మీద కాకుండా పని మీద ఉండేలా చేయడం; పోటీభావన లేకుండా పనిని సహజంగా చేయగలగడం – ఈ సూచనల్ని ఆచరించడానికి ప్రయత్నిస్తే ఆందోళనను అధిగమించగలం, సత్ఫలితాలను సాధించగలం. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029**

**పనిచేస్తున్నప్పుడు దానిని తప్ప వేరే దాని గురించి ఆలోచించవద్దు. భవిష్యత్తులో ఎలాంటి ఫలితం కలుగుతుందోనని ఎప్పుడూ ఆలోచించేవాడు దేన్నీ సాధించలేడు.** - స్వామి వివేకానంద





- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# సమస్యలను విస్మరించడమే ఓ సమస్య!

(...గత సంచిక తరువాయి)

సమస్య ఎదురవగానే మనస్సు దానిని అసలు గుర్తించదు. అది ఒక గదిలో జంబుఖానా క్రింద దుమ్మును దులపడం లాంటిది. నేలపై బాహ్యంగా ఏమీ కనిపించకపోయినా, జంబుఖానా క్రింద చాలా దుమ్ము ఉంటుంది. కానీ దుమ్మును ఆ విధంగా కప్పి ఉంచడం వల్ల గది అంతా ఎంతో పరిశుభ్రంగా ఉన్నట్లు అనిపిస్తుంది. అదే విధంగా, సమస్య ఉత్పన్నమైనప్పుడు, శిక్షణ లేని మనస్సు ఆ సమస్యను తనకు తెలియకుండానే చైతన్యయుతమైన మనస్సు నుండి బయటకు త్రోయాలనుకుంటుంది. అప్పుడా సమస్య జంబుఖానా క్రింది దుమ్ము లాగా అచేతనమైన మనస్సు పొరలలోకి వెళ్ళి, అక్కడ స్థిరపడుతుంది. ఆ సమస్య తీరిపోదు కానీ, జరిగేదేమంటే అది మన కళ్ళ ముందు ఉండదు, కనిపించదు. ఏ సమస్య అయినా సరే పై స్థాయిలో కనిపిస్తూ ఉంటే దాన్ని పట్టించు కోగలుగుతాం.

మనస్సు సమస్యలను ఎదుర్కోలేదు. (వాటినెదుర్కోవడం బాధాకరం) కాబట్టి అది సమస్యల నుండి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తుంది. వాస్తవిక పరిస్థితులను ఆ విధంగా అణచి వేయడం వల్ల సమస్యల పట్ల మనకున్న భయాలు, అపోహలు మనస్సులోని అచేతనమైన పొరకు త్రోసివేయబడతాయి. అప్పుడు ఈ అచేతనపు పొరలలో ఉన్న అచేతన ప్రేరణలు, శక్తులు మనస్సును నియంత్రించడం ప్రారంభిస్తాయి. అప్పుడది సమస్య పరిష్కారాలను అన్ని రకాల పద్ధతుల ద్వారా వాయిదా వేయడానికి ప్రయత్నిస్తుంది. కానీ ఆ రోజు ఎన్నడూ రాదు.

సుదీర్ఘకాలం పరిష్కరించకపోతే, చిన్న సమస్యలు కూడా క్లిష్ట సమస్యలుగా మారతాయని మనస్సు మరచిపోతుంది. సమస్యలను పరిష్కరించడం ద్వారానే వాటిని అధిగమించ గలం. ఒక సామెతలో చెప్పినట్లు, "సరియైన సమయంలో ఒక కుట్టు వేస్తే, తొమ్మిది కుట్లు వేయాల్సిన అవసరం రాకుండా నివారించవచ్చు." ఒక చిన్న నిప్పురవ్వను ఆర్పకపోతే పెద్ద మంట అవుతుంది. నిప్పురవ్వగా ఉన్నప్పుడు దాన్ని ఆర్పడం తేలిక. కానీ సరైన సమయంలో ఆ పని చేయకపోతే, అది ప్రజ్వరిల్లుతుంది. దీని ఫలితంగా జరిగే నష్టం చాలా ఎక్కువగా ఉంటుంది. కాబట్టి సమస్య నుండి పారిపోవడం, అసలు చూడకుండా ఉండడం, లేదంటే వాయిదా వేయడం అనే స్వభావాన్ని మానేయాలి.

ఏదో ఒక భయంతో బయటకు చెప్పలేనిదాన్ని మనం తరచూ పూర్తిగా అణచివేసే ప్రయత్నం చేస్తుంటాం. ఉదాహరణకు నలుగురితో చెడుగా ప్రవర్తించడం మర్యాద కాదు కాబట్టి మన కోపాన్ని వ్యక్తపరచం. కానీ అది ఎంతకాలం కొనసాగుతుంది? ఏదో ఒక రోజున అంతా బట్టబయలవుతుంది. ఇతరులపై కోపం చూపలేకపోతే అది

మన ఆరోగ్యాన్నే దెబ్బ తీస్తుంది. అది కడుపులో పుండునో, అధిక రక్తపోటునో, లేదంటే గుండె ఆగిపోవడాన్నో, గుండె పోటునో కలగజేస్తుంది. అందుచేత మన లోపల ఉన్న ఈ ఒత్తిళ్ళను అధిగమించడం నేర్చుకోవాలి.

**సమస్యే లేదనుకోవడం!**

మనస్సు ఏర్పరచుకునే మరొక రక్షణ పద్ధతి – అసలేటు వంటి సమస్యా మనకు లేదని అనుకోవడం! ఉదాహరణకు సమస్యతో సతమతమవుతున్న ఒక వ్యక్తిని చూడండి. అతడు చాలా అశాంతిగా, బాధతో ఉంటాడు. అతని కళ్ళల్లో అలజడి కనిపిస్తుంది. కూర్చున్నప్పుడు కూడా స్థిరంగా కూర్చోలేడు. చేతివేళ్ళను మాటిమాటికీ లాగుకుంటాడు. కాళ్ళను ఊపుతుంటాడు. అప్పుడప్పుడు నిట్టూర్పులు విడుస్తుంటాడు. ఇవన్నీ చేస్తున్నా తన కేమీ సమస్య లేదని అంటాడు. సమస్యను తిరస్కరించడమంటే ఇదే! తనను తానే మోసగించు కుంటున్నానన్న విషయం అతనికర్థం కాదు.

అభద్రతా భావాలతోనూ, సందేహాలతోనూ కొట్టుమిట్టాడు తున్నప్పుడే ఇలాంటి పద్ధతి (సమస్యలు లేవనుకోవడం) అవలంబిస్తాం. 'సమస్యలు లేవు' అని అనుకుంటే వాటి నెన్నడూ పరిష్కరించలేమన్న విషయం మరచిపోతాం. మొట్టమొదట సమస్య ఉన్నదన్న విషయాన్ని అంగీకరించాలి. మనం పిరికివాళ్ళం, బలహీనులం అయినందు వల్ల సమస్యలను తిరస్కరించడానికి 'వంద' మార్గాల్లో ప్రయత్నిస్తాం. లోలోపల అభద్రతాభావం ఉన్నా, పైకి అదేమీ లేనట్లుగా ఉంటాం. దాన్ని అంగీకరించం. దానికి బదులుగా అది లేదని బుకాయిస్తాం. అంతేకాదు, మనం చాలా శక్తిమంతులమైనట్లూ, పూర్తి భద్రతతో ఉన్నట్లూ నటిస్తాం.

సమస్య లేదని అనుకోవడం ఒక 'నిప్పుకోడి' ప్రవర్తించే విధంగా ఉంటుంది. తనను తినడానికి ఏదైనా జంతువు వస్తున్నదని చూడగానే, 'నిప్పుకోడి' తన తలను ఇసుకలో దూరుస్తుంది. అదేవిధంగా మనకు ఎవరిపైనైనా కోపం వస్తే, వారి నుంచి దూరంగా ఉందామని అనుకుంటాం. కానీ లోలోపల వారంటే అసలు ఇష్టమే ఉండదు. ఉడుక్కు పోతుంటాం.

మనకు ఎవరిపై కోపం వచ్చిందో, ఆ వ్యక్తిని అసలు లెక్కచేయబోమని పైకి అన్నా, వ్యక్తపరచని కోపం మనల్ని నియంత్రిస్తుంది. లోపల మండిపోతూ, పైకి మాత్రం ప్రశాంతంగా, మంచివాడిగా ఉండడమన్నది 'కాపట్యా'నికి గొప్ప నిదర్శనం. ఈ విధంగా హృదయంలో వంచన ప్రారంభమై, మన నైతిక జీవనాన్ని నాశనం చేస్తుంది.

మానసిక తత్త్వశాస్త్రంలో దీనికొక ఉదాహరణ తరచూ చెబుతారు. ఒక త్రాగుబోతు వాని కొడుకు, తన తండ్రి త్రాగుబోతు అని అంగీకరించకపోవచ్చు. తండ్రి మద్యం త్రాగి క్రింద పడిపోతే, అనారోగ్యం వల్ల ఆయన ఆ విధంగా పడిపోయాడని ఇతరులు నమ్మాలని అతని కొడుకు అను కుంటాడు. అంతే కాదు. తన తండ్రి అనారోగ్యానికి మందులు వేసుకున్నాడని కూడా అనవచ్చు. వాస్తవాన్ని అంగీకరించలేక దానిని పెడదోవ పట్టిస్తాడు. ఇదే విధంగా మన మనస్సు కూడా జీవిత సమస్యల నుండి తప్పించుకోవడానికి రకరకాల పద్ధతులను, మార్గాలను అవలంబిస్తుంది.

పైన చెప్పిన దానికి వ్యతిరేకమైనది నిష్కాపట్యం. మనస్సులో ఉన్నదే చెప్పగలగడం, చెప్పిందే చేయగలగడం మనస్సు యొక్క మంచి లక్షణం. దృఢమైన మనస్సే ఇలా చేయగలదు. ఆ విధంగా సమన్వయమైన మనస్సు ఎలాంటి సందిగ్ధాలకూ లోనుగాక ప్రశాంతంగా ఉంటుంది. ❖

(వచ్చే సంచికలో – 'ఆచార్యోపాసనం')

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

## 'జాగృతి' క్విజ్ తుది పోటీలు

**విజయవాడ రామకృష్ణ మిషన్** రాష్ట్ర వ్యాప్తంగా నిర్వహించిన 'జాగృతి'క్విజ్ పోటీల్లో అర్హత సాధించిన విద్యార్థులకు 2012 ఫిబ్రవరి 5వ తేదీన నిర్వహించాల్సిన తుది పోటీలను (క్విజ్, వక్తృత్వం, వ్యాసరచన) అనివార్యకారణాల వలన **2012 ఫిబ్రవరి 12వ తేదీకి మార్చడమైనది.** ఈ మార్పును గమనించగలరు. ఈ తుది పోటీలకు ప్రవేశార్హత పొందిన విద్యార్థులకు సంబంధిత పాఠశాలల ద్వారా 2012 జనవరి 31 నుండి ఫోన్ మరియు ఉత్తరం ద్వారా తెలియజేయబడును.

*పూర్తి వివరాల కోసం సంప్రతించాల్సిన ఫోన్ నెంబర్లు :*

**0866-2570799, 9985539422** (ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు)

**స్వామి శశికాంతానంద,** కార్యదర్శి, రామకృష్ణ మిషన్,

గాంధీనగర్, విజయవాడ-520 003



సుఖదుఃఖాలు ఒకే నాణానికున్న బొమ్మా,బొరుసుల్లాంటివి. సుఖాన్ని స్వీకరిస్తే, దుఃఖాన్ని కూడా స్వీకరించాలి. దుఃఖం లేని సుఖాన్ని పొందాలనుకోవడం అవివేకం. - స్వామి వివేకానంద

# రసిక్‌పై రామకృష్ణుల అనుగ్రహం

కథ: స్వామి విమూర్తానంద  చిత్రాలు: పద్మవాసన్  అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1



దక్షిణేశ్వర కాళికాలయం. భగవాన్ శ్రీరామకృష్ణులు వసించే గదికి నిత్యం చాలామంది భక్తులు వచ్చి ఆయనను దర్శించుకోవడం రివాజు.

2

కాళికాలయ ప్రాంగణాన్ని ఊడ్చే రసిక్ అనే పనివాడు రోజూ శ్రీరామకృష్ణుల గది వెలుపల నిలబడి అక్కడ జరుగుతున్నదంతా గమనిస్తూ ఉండేవాడు.




3

శ్రీరామకృష్ణుల అనుగ్రహం కోసం రసిక్ చాలా రోజులు పరితపించాడు. అతడు ఆలయ పరిసరాలను ఎంతో భక్తి శ్రద్ధలతో పరిశుభ్రం చేసేవాడు. గురుదేవుల గది సమీప ప్రాంతాన్ని కూడా మరింత భక్తిప్రపత్తులతో పరిశుభ్రం చేయసాగాడు.

4

కొన్ని రోజుల తరువాత... శ్రీరామకృష్ణులు పంచవటి మీదుగా సరుగుడు తోటలోకి వెళుతున్నారు. గురుదేవుల కోసం ఆయన అన్నగారి కుమారుడు రామ్‌లాల్ ఒక మూల వేచి ఉండడాన్ని చూసిన రసిక్...



5

గురుదేవులు పంచవటి నుండి బయటకు రాగానే...
రసిక్ భక్తి పారవశ్యంతో శ్రీరామకృష్ణులను సమీపించి ఆయన పాదాల మ్రోల వ్రాలి విలపించాడు.




6

నాటి నుండి రసిక్ శ్రీరామకృష్ణుల పట్ల పరిపూర్ణ శరణాగతి భావంతో ఉండేవాడు. గురుదేవులను దూరం నుండే నిత్యం దర్శించుకోసాగాడు. గంగానది వైపుగానో, పంచవటి వైపుగానో వెళుతున్నప్పుడు గురుదేవులు, రసిక్‌ను దగ్గరకు పిలిచి అతడితో ఆప్యాయంగా మాట్లాడేవారు.




8

ఆధ్యాత్మిక పురోగతికి అడ్డంకులుగా నిలిచే వాటిలో ఒకటి – కులాహంకారం. శ్రీరామకృష్ణులు తమ ఆధ్యాత్మిక సాధనా కాలంలో ఆ అడ్డంకిని తొలగించుకోవడానికి తీవ్ర ధ్యానమగ్నులయ్యేవారు. ఒకరోజు రాత్రి రసిక్ గుడిసెకు వెళ్ళి, అతడి మరుగుదొడ్డిని తన సుదీర్ఘ కేశాలతో తుడిచి శుభ్రం చేశారు!



10

రసిక్ పంచవటి ప్రాంతంలో తులసి వనాన్ని పెంచసాగాడు.




11

రసిక్ ప్రగాఢ జపధ్యానాలలో లయించిపోసాగాడు.
ఒక భక్తునిగా తనను తాను అవగతం చేసుకుని అందుకు తగ్గట్లు ఉదాత్తంగా జీవించసాగాడు.

12

అలా కొంతకాలం గడిచింది. శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందారు. నిమ్నకులంలో జన్మించిన తన పట్ల అవ్యాజమైన కరుణను చూపిన గురుదేవుల నిష్క్రమణను రసిక్ తట్టుకోలేకపోయాడు. కొద్ది సంవత్సరాల్లోనే రసిక్ వ్యాధి గ్రస్థుడయ్యాడు. ఎంతకీ ఉపశమించని తీవ్ర జ్వరం పాలయ్యాడు.




13

కుటుంబ సభ్యులు ఇలా చర్చించుకున్నారు...



14

దక్షిణేశ్వర కాళికాలయంలో... రసిక్ కుమారుడు రామ్‌లాల్‌ను కలుసుకుని సంగతి వివరించాడు.




తీర్థం పుచ్చుకోగానే రసిక్ జ్వరం మటుమాయమైంది.
ఆ తరువాత అతడు జపం చేస్తూ, భక్తి గీతాలు పాడుకుంటూ కాలం గడపసాగాడు.

15

అలా రోజులు గడుస్తుండగా... ఒకరోజు రసిక్ హఠాత్తుగా తన కుటుంబ సభ్యులతో, "నన్ను తులసి వనానికి తోడ్కొని వెళ్ళండి" అని చెప్పాడు. అక్కడ అతడు తన జపమాలను పుచ్చుకుని జపం చెయ్యసాగాడు. అరగంట సేపటికి మెల్లమెల్లగా అతడి కళ్ళు మూతలుపడసాగాయి. అతడు బిగ్గరగా...






రసిక్ చివరి మాటలు అవే. గురుదేవులు తాను చెప్పినట్లు అనుగ్రహించి, అతణ్ణి తమ లోకానికి తోడ్కొని పోయారు.

నిమ్నకులస్థుడైన నందనార్ ఆలయం వెలుపల నుండే పరమేశ్వరుణ్ణి దర్శించుకోగలిగాడు. ఆ తరువాత తన అచంచల భక్తితో శివసాయుజ్యం పొందాడు. అలాగే రసిక్ కూడా శ్రీరామకృష్ణులను దూరం నుండే దర్శించి, చివరకు ఆయనలో ఐక్యం అయ్యాడు. అటువంటి రసిక్‌ను, శ్రీరామకృష్ణుల నందనార్ అనడంలో ఎలాంటి సంశయం లేదు కదా!

Vol.69-2, Sri Ramakrishna Prabha (Telugu Monthly) February 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? ఆంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. - స్వామి రంగనాథానంద





భగవాన్ శ్రీరామకృష్ణుల జన్మస్థానమైన కామార్పుకూర్‌లోని 'శ్రీరామకృష్ణ దేవాలయం'

## వార్తావాహిని

# యువజన సమ్మేళనాలు



వరంగల్ శ్రీరామకృష్ణ సేవాసమితి స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలను పురస్కరించుకొని 2011 డిసెంబర్ 8వ తేదీ ఉదయం విద్యార్థుల సమ్మేళనం, మధ్యాహ్నం యువ జనసమ్మేళనం నిర్వహించింది. ఈ సదస్సులో స్వామి బోధమయానందజీ, స్వామి అనుపమానందజీ, స్వామి గుణేశానందజీ, స్వామి శితికంఠానందజీ, శ్రీ విజయ్‌మీనన్ పాల్గొని 'ఆత్మవిశ్వాసం, ఏకాగ్రత, సౌశీల్యం' అనే అంశాలపై స్ఫూర్తిదాయక సందేశాన్ని అందించారు. విద్యార్థి సమ్మేళనంలో సుమారు 6,000 మంది విద్యార్థులు, యువజన సమ్మేళనంలో సుమారు 3,500 మంది యువజనులు పాల్గొని స్వామి వివేకానంద సందేశానికి ప్రభావితులై ఎనభైవేల రూపాయల విలువగల వివేకానంద సాహిత్యాన్ని కొనుగోలుచేశారు. ❖

నివేదిక : ప్రభుచైతన్య





విశాఖపట్నం, రామకృష్ణ మిషన్ ఆశ్రమ స్వామి వివేకానంద 150వ జన్మదినోత్సవాలను పురస్కరించుకొని 2011 డిసెంబర్ 20వ తేదీన రాజీవ్ గాంధీ ఇన్‌డోర్ స్టేడియమ్‌లో యువజన సమ్మేళనం, పౌరుల సదస్సులను నిర్వహించింది. ఈ సమ్మేళనంలో విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ కార్యదర్శి స్వామి అమృతానందజీ, హైదరాబాద్ వివేకానంద హ్యూమన్ ఎక్సలెన్స్ సంచాలకులు స్వామి బోధమయానందజీ; కోల్‌కతా నరేంద్రపూర్ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి సుపర్ణానందజీ; ఇస్రో ప్రాజెక్ట్ డైరెక్టర్ డాక్టర్ ఎమ్. అన్నాదొరై; ఇస్రో పూర్వ సంచాలకులు డాక్టర్ టి.జి.కె. మూర్తి; విశాఖ రేంజ్ డి.ఐ.జి. డాక్టర్ సౌమ్యామిశ్రా; ఎ.యు. పూర్వ సంచాలకులు డాక్టర్ ఎ. ప్రసన్నకుమార్; డాక్టర్ బి. ఉమాబాల పాల్గొని స్వామి వివేకానంద సందేశాన్ని అందించారు. ఈ సమ్మేళనంలో సుమారు 4,000 మంది విద్యార్థులు పాల్గొన్నారు. కోల్‌కతా నరేంద్రపూర్ రామకృష్ణ మిషన్ ఆశ్రమ అంధవిద్యార్థుల సంగీత కార్యక్రమం అందరినీ అలరించింది. ❖ నివేదిక : స్వామి నిత్యయోగానంద




# గ్రంథ పరిచయం



## విదురామృతం

**రచయిత: శ్రీ మాతాజీ త్యాగీశానంద పురి**
**వెల : రూ.20/-, పుటలు : 112**

శ్రీ వ్యాసప్రోక్త మహాభారతంలోని 18 పర్వాలలో, ఉద్యోగపర్వంలోని ప్రజాగరపర్వంలో ధర్మాత్ము డయిన విదురుడు, ఈర్ష్యాసూయాది అవలక్షణ ములతో కూడిన ధృతరాష్ట్రునికి, 8 అధ్యాయాలలో చేసిన ధర్మప్రబోధమే ఈ విదురామృతం. మహాప్రజ్ఞావంతుడు, ఆచరణ శీలుడయిన విదురుడి నుండి నీతి, ధర్మశాస్త్రాలన్నింటినీ విన్న ధృతరాష్ట్రుడు తాను, తనవారు చేస్తున్నది అధర్మము అని తెలిసి కూడా, దాని నుండి బయటపడలేని అశక్తుడవుతాడు. లోకంలో నూటికి తొంభై మంది ధృతరాష్ట్రుని వంటివారే సుమా! వారికి ధర్మాధర్మముల గురించి విని ఆనందించడమే తప్ప ఆచరించాలి అనే జ్ఞానము కలగదు.

శ్రీత్యాగీశానంద పురి మాతాజీ వారు రచించిన ఈ గ్రంథంలో అమూల్యమైన సందేశాలతో కూడిన వారి దివ్యవాణి ప్రకటితమయింది అని చెప్పక తప్పదు. గ్రంథం చదివిన వారికి మాతాజీవారి వాగామృతం అనుభవంలోనికి వస్తుందనటంలో అతిశయోక్తి లేదు. ❖



## శ్రీమాత

**రచయిత: శ్రీ మాతాజీ త్యాగీశానంద పురి**
**వెల : రూ.20/-, పుటలు : 123**

ఆధ్యాత్మికవిద్య అయిన పరావిద్య వలన జన్మరాహిత్యం కలుగుతుంది. జగన్మాత తనను ఆరాధించే వారిని ప్రేమతో కాపాడుతుంది. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ చేస్తుంది. శక్తిజ్ఞానం వినా నిర్వాణ స్థితి లభ్యంకాదని మహా నిర్వాణ తంత్రం విశదీక రిస్తోంది. పూజ్య మాతాజీవారు ఈ గ్రంథంలో శ్రీమాతను తంత్రరూపమున, మంత్రరూపమున, యంత్రరూపమున ఆరాధించే విధానాలను సోదాహరణంగా చెప్పారు. శాక్తసాధన విషయంలో ఆధునికులలో శ్రీరామకృష్ణులు సుప్రసిద్ధులని అంటూ నవవిధ భక్తులను వివరించారు.

శ్రీ శారదామాతయే శ్రీ లలితాపరాభట్టారిక అని ప్రతిపాదించి, ఆమె అనుగ్రహం అందరికీ కలగాలని ఆకాంక్షించారు. అమ్మ భక్తులందరూ చదవ వలసిన గ్రంథమిది. ❖ – బొప్పన అరుణాదేవి

ప్రతులకు: శ్రీ అనుభవానంద గ్రంథమాల
11-1-13, యం.జి.రోడ్
బాపట్ల- 522 101, గుంటూరు జిల్లా

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మార్చి 2012 ₹10

హరే రామ హరే రామ రామ రామ హరే హరే।
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥



# శ్రీరామకృష్ణ పరమహంస - శ్రీచైతన్య మహాప్రభు

శ్రీరామకృష్ణ పరమహంస నవద్వీపం తీర్థయాత్రకు వెళ్ళిన సమయంలో, ఆయనకు చైతన్యుల దర్శనం కలిగింది. స్వామి శారదానంద ఆ సంఘటనను ఇలా వర్ణిస్తున్నారు:

చైతన్యులను భగవదవతారంగా పరిగణించడానికి అప్పుడు మాలో అనేకులకు సంశయం ఉండేది. పైగా కొందరు 'వైష్ణవు'డనే మాటను నిమ్నజాతి వారికి పర్యాయ పదంగా భావించేవారు. మా సంశయ నివృత్తి కోసం గురుదేవులను ప్రశ్నించాం. అందుకు జవాబుగా గురుదేవులు ఇలా చెప్పారు:

"నాకు కూడా అదే అభిప్రాయం ఉండేది. భాగవతాది పురాణాదులలో ఎక్కడా ప్రస్తావించబడని చైతన్యులు ఎలా అవతారపురుషుడు అవుతాడు? వైష్ణవులు ఆయనను అవతారపురుషునిగా నెలకొల్పారు – అనే అభిప్రాయంతో చైతన్యులను అవతారంగా విశ్వసించేవాణ్ణి కాదు. తరువాత మథుర్‌తో పాటు నవద్వీపం వెళ్ళాను. చైతన్యులు నిజంగా అవతారపురుషుడే అయిన పక్షంలో ఆయన దివ్య అభివ్యక్తీకరణ శక్తి ఏదో కొంత మేరకు అక్కడ గోచరించాలనీ, ఆ స్థలాన్ని సందర్శించినప్పుడు ఈ విషయం తెలియ వస్తుందనీ అనుకొన్నాను. ఆయన దివ్యత్వ అభివ్యక్తీకరణ ఎక్కడన్నా కానవస్తుందేమోనని పెద్ద గోస్వామి, చిన్న గోస్వామి ఇళ్ళకూ, తదితర చోట్లకూ కాలినడకన వెళ్ళాను. కానీ ఎక్కడా ఏ ప్రత్యేకతా నాకు కనిపించలేదు.

ప్రతి చోటా చేతులు ఎత్తి నిలబడి ఉన్న కొయ్య ప్రతిమలే కనపడ్డాయి. నేను నిరుత్సాహపడ్డాను. అక్కడకు వెళ్ళినందుకు విచారించాను. ఆ తరువాత తిరిగి వెళ్ళడానికి పడవలో అడుగుపెట్టగానే నా కొక అద్భుత దర్శనం కలిగింది. సుకుమారులైన ఇద్దరు బాలురు కనిపించారు. అంత అందమైన బాలురను నేను ఎన్నడూ చూడలేదు. పోతపోసిన బంగారం లాంటి మేని ఛాయతో, జ్యోతిర్మయకాంతులతో వారు విరాజిల్లుతున్నారు. చేతులు పైకెత్తి నా వంకే చూస్తూ ఆకాశమార్గంలో నా వైపుగా పరుగెత్తుకొని రాసాగారు. 'అదుగో వారొస్తున్నారు, వారొస్తున్నారు' అంటూ కేకలు పెట్టాను. ఇలా కేకలు పెడుతూ ఉండగానే వారు దీనిలో (తమ శరీరాన్ని చూపుతూ) ప్రవేశించారు. అప్పుడు నేను బాహ్య చైతన్యం కోల్పోయాను. హృదయ్ ప్రక్కనే ఉండి పట్టుకోకపోతే నీళ్ళలో పడిపోయి ఉండేవాణ్ణి. ఇలాంటి దర్శనాలు ఎన్నో కలగడం వల్ల చైతన్యులు నిజంగానే దివ్యశక్తి అభివ్యక్తీకరణ చెందిన అవతారమని నాకు నమ్మకం ఏర్పడింది."



"కామార్పుకూర్‌లోని చినుశాఖారి గురుదేవులకు ఆప్తమిత్రుడు. అతడు గురుదేవులను అనురాగంతో ఆలింగనం చేసుకొని, 'గదాయ్! నిన్ను చూసినప్పుడల్లా నాకు నువ్వే గౌరాంగుడవని అనిపిస్తూ ఉంటుంది' అనేవాడు."❖

**(మార్చి 8, గురువారం - శ్రీ చైతన్య మహాప్రభువు జయంతి)**




**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# జాతీయ యువజన దినోత్సవాలు

## 2012 జనవరి 10, 11, 12




స్వామి అనుపమానంద


జయప్రకాష్ నారాయణ్


అరవిందరావు


చిత్రా రామచంద్రన్


ఎ.కె.ఖాన్


సంతోష్ మెహరా


విజయ్ మీనన్

స్వామి వివేకానంద 150వ జయంతి వార్షికోత్సవాల్లో (2010–2014) భాగంగా హైదరాబాదు రామకృష్ణ మఠం 'వివేకానంద మానవవికాస సంస్థ' (వివేకానంద ఇన్స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్) ఆధ్వర్యవంలో యువజనోత్సవాలు నిర్వహించడం జరిగింది.

2012 జనవరి 10 నుంచి 12వ తేదీ వరకు 'శ్రద్ధ' అన్న పేరిట జరిగిన ఈ మూడు రోజుల ఉత్సవాల్లో వైవిధ్యభరితమైన కార్యక్రమాలు విద్యార్థులను అలరించాయి. మొదటి రోజు 'మేనేజ్మెంట్ విద్యార్థులు–సామాజిక బాధ్యత', రెండవ రోజు 'విద్యార్థి లోకానికి స్వామి వివేకానంద సందేశం', మూడవ రోజు 'యువతరం–స్వామి వివేకానంద' అంశాల నేపథ్యంగా జరిగిన సదస్సుల్లో ప్రముఖ వక్తలు తమ అమూల్య సందేశాన్ని అందించారు.

హైదరాబాదు రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ జ్యోతి ప్రజ్వలన, అభిభాషణతో ప్రారంభమైన ఈ మూడు రోజుల ఉత్సవాల్లో స్వామి అనుపమానందజీ, లోక్సత్తా అధ్యక్షులు డాక్టర్ జయప్రకాష్ నారాయణ్, విశ్రాంత డి.జి.పి. డాక్టర్ అరవింద రావు, రాష్ట్ర దేవాదాయ శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీమతి చిత్రా రామచంద్రన్, హైదరాబాదు నగర పోలీస్ కమిషనర్ ఎ.కె.ఖాన్, అడిషనల్ డైరెక్టర్ జనరల్ (క్రైమ్స్) సంతోష్ మెహరా, ప్రముఖ వ్యక్తిత్వ వికాసనిపుణులు విజయ్ మీనన్, తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వాహణాధికారి ఎల్.వి.సుబ్రహ్మణ్యం, విద్యావేత్త ప్రమోద్ కుమార్, ప్రొఫెసర్ జి.నర్సయ్య, ఆత్మకూరి రామన్ ప్రసంగించారు.

చెన్నై కళాకారులు వేదాంత భరద్వాజ్, ఎమ్.టి.ఆదిత్య బృందం సంగీత కార్యక్రమాలు, కరీంనగర్ జిల్లా చామనపల్లి కళాకారుల జానపదగేయాలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు ఆకట్టుకున్నాయి. వివేకానంద మానవవికాస సంస్థ సంచాలకులు స్వామి బోధమయానందజీ సమన్వయ కర్తగా వ్యవహరించిన ఈ మూడు రోజుల ఉత్సవాల్లో నగరం నలుమూలల నుంచి దాదాపు పద్నాలుగు వేల మంది విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ❖













NATIONAL YOUTH DAY CELEBRATIONS



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 3 మార్చి 2012

నయనం గల దశ్రు ధారయా
వదనం గద్గద రుద్ధయా గిరా।
పులకై ర్నిచితం వపుః కదా
తవ నామ గ్రహణే భవిష్యతి ॥

హే కృష్ణా! నీ నామస్మరణ చేయుచున్నప్పుడు నా నేత్రములు అశ్రుధారతో నిండుటయు, కంఠము గద్గద స్వరముతో పలుకుటయు, శరీరము పులకిత మగుటయు ఎన్నటికి కలుగునో కదా!

– శ్రీ చైతన్య మహాప్రభువు 'శిక్షాష్టకము'



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి తిపిరినేని నిర్మల, జూబ్లీహిల్స్, హైదరాబాదు - 500 033 | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎమ్.ఎస్. అప్పారావు, పెద్దాపురం, తూర్పుగోదావరి జిల్లా - 533 437 | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ కె. సుబ్రహ్మణ్యం & శ్రీమతి కె.ఎస్.ఆర్. పార్వతి, అత్తాపూర్, హైదరాబాదు-48 | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీమతి ఎమ్.పి.ఎస్. మాధవి, మదీనాగూడ, హైదరాబాదు - 500 050 | 10,000 |
| పోషకులు | : శ్రీమతి వి. రమాదేవి, జహీరాబాద్, మెదక్ జిల్లా (కీ॥శే॥ వర్ధంశెట్టి వారధి గుర్రప్ప జ్ఞాపకార్థం) | 2,500 |
| పోషకులు | : శ్రీ యేనుగుల రాకేశ్ రెడ్డి, వంగపహాడ్, వరంగల్ జిల్లా | 2,016 |
| పోషకులు | : శ్రీమతి లక్ష్మీకాంతం, అశోక్‌నగర్, హైదరాబాదు (కీ॥శే॥ ఎమ్.వి. రమణమ్మ జ్ఞాపకార్థం) | 2,000 |
| పోషకులు | : శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,500 |
| పోషకులు | : శ్రీమతి వి. అరుణాదేవి, దోమల్‌గూడ, హైదరాబాదు (కీ॥శే॥ ఎమ్. భాగ్యమ్మ జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీ చంద్రభూషన్, శ్రీకాకుళం | 1,116 |
| పోషకులు | : శ్రీ ఐ.ఎస్.వి. ప్రసాద్, నందిగామ, కృష్ణా జిల్లా- 521 185 | 1,016 |
| పోషకులు | : శ్రీ సాయి ద్వారకానాథ్, తెనాలి, గుంటూరు జిల్లా-522 201 | 1,011 |
| పోషకులు | : శ్రీ పాలకుర్తి వేంకటేశ్వర్లు, గిర్మాజీపేట, వరంగల్ (కీ॥శే॥ వీరలక్ష్మి,కొమరయ్యల జ్ఞాపకార్థం) | 1,000 |
| పోషకులు | : శ్రీ కైతెపల్లి కోటేశ్వరరావు, బ్యాంక్ కాలనీ, రేపల్లె, గుంటూరు జిల్లా | 1,000 |
| పోషకులు | : శ్రీ కె. పుష్కర్, సైనిక్‌పురి, సికింద్రాబాదు - 500 094 | 1,000 |
| పోషకులు | : శ్రీమతి కె. శారద, గుడిమల్కాపూర్, మెహదీపట్నం, హైదరాబాదు - 500 028 | 1,000 |

**ముఖచిత్రం :** శ్రీచైతన్య మహాప్రభువు భట్టాచార్యుడనే పండితుడికి 'షడ్భుజమూర్తి'గా దర్శనమిచ్చాడు. శ్రీచైతన్యుడి నాటకంలో ఈ సన్నివేశాన్ని తిలకిస్తున్న శ్రీరామకృష్ణులు కూడా భావపారవశ్య స్థితిలో శ్రీచైతన్య మహాప్రభువును 'షడ్భుజమూర్తి'గా దర్శించారు. (మార్చి 8, గురువారం - శ్రీచైతన్య మహాప్రభువు జయంతి)

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

### ఉగాది శుభాకాంక్షలు

పాఠకులకూ, రచయితలకూ, రచయిత్రులకూ,
దాతలకూ, ఏజెంట్లకూ, ప్రకటనకర్తలకూ హృదయపూర్వక
ఉగాది శుభాకాంక్షలు. – సంపాదకులు

# జీవిత పరమార్థం ఉగాది ప్రబోధం

భారతీయుల ఆచార సంప్రదాయాలు పటిష్ఠంగా, పరిపూర్ణంగా ఉండడంలో పండుగలు, పర్వదినాల పాత్ర అత్యంత విశిష్టమైనది. మనం జరుపుకొంటున్న ప్రతీ పండుగ మానవ జీవిత పరమార్థాన్ని తెలియజేసేదే!

మనకు మేలు చేసేవారిని మరచిపోకుండా, వారి పట్ల సదా కృతజ్ఞతాభావాన్ని కలిగివుండాలని గుర్తు చేసే పండుగ 'సంక్రాంతి'. అందుకే ఆ పర్వదినాన పితృదేవతల్నీ, పుడమి తల్లినీ, చివరకు పశువులను సైతం ఆరాధిస్తాం; అక్రమాలు, అన్యాయాల లాంటివి తాత్కాలికంగా రాజ్యమేలినప్పటికీ చెడుపై మంచి ఆధిపత్యం వహిస్తుందనీ, అధర్మంపై ధర్మమే విజయకేతనం ఎగురవేస్తుందనీ 'విజయదశమి' గుర్తు చేస్తుంది; అజ్ఞానాంధకారంలో మునిగి అకృత్యాలకు పాల్పడిన మనుష్యులకు జ్ఞాన జ్యోతిని ప్రసరింపజేసి సన్మార్గంలో పయనించేలా అప్రమత్తుల్ని చేసే పండుగ 'దీపావళి' – ఇలా ప్రతీ పండుగ సద్వర్తనులై మెలగాలని మానవులకు సూచించేదే! మానవజన్మ సార్థకతకు తోడ్పడేదే!

**సంవత్సరాది ఇచ్చే సందేశం:** సంవత్సరాది అయిన ఉగాది పర్వదినానికి ఒక ప్రత్యేకత ఉంది. ఈ రోజున – మధుర, తిక్త; లవణ, ఆమ్ల; కటు, కషాయం వంటి షడ్రుచులతో చేసిన పచ్చడిని స్వీకరించడం ఓ ఆచారం. జీవితమంటే సుఖదుఃఖాల మిశ్రమమని గ్రహించి, ఈ రెండింటినీ సమభావంతో స్వీకరించాలని తెలియజేయడమే ఉగాది పచ్చడి స్వీకరించడం లోని అంతరార్థం.

చీకటి లేకపోతే వెలుగు విలువ తెలియదు, చేదు లేకపోతే తీపి విలువ తెలియదు. అలాగే జీవితంలో దుఃఖం అన్నది లేకపోతే సుఖం విలువ తెలియదు. ఈ ద్వంద్వాలతో కూడుకొన్నదే జీవితం. ఈ సత్యాన్ని తెలుసుకొన్నప్పుడే ఆనందమయ జీవితాన్ని గడపడం సాధ్యం.

**పరిపూర్ణతకు ప్రథమ నియమం:** జీవితంలో నిరంతరం సుఖాన్ని అనుభవించాలనీ, దుఃఖాలు దరిచేరకూడదనీ భావించేవారు ఎన్నటికీ ఉన్నతిని సాధించలేరు. నిజానికి మనిషిని ఓ పరిపూర్ణమైన వ్యక్తిగా మలచడానికి సుఖదుఃఖాలు రెండూ సమానమైన పాత్రను పోషిస్తాయి. కష్టం లేని సుఖాన్ని పొందాలనుకునేవారు జీవితంలో నిరాశ పాలవుతారు. అందుకు ఉదాహరణ ఈ రైతు కథ:

వరుణదేవుడు, వాయుదేవుడు, సూర్యుడు మొదలైన దేవతలంతా తన ఆదేశానుసారం నడుచుకోవాలని తలచి, ఒక రైతు అందుకోసం ఇంద్రుని నుండి వరం పొందాలని తపస్సు చేశాడు. రైతు చేసిన తీవ్రమైన తపస్సుకు మెచ్చి ఇంద్రుడు ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నాడు. అప్పుడు ఆ రైతు 'వరుణదేవుడు, వాయుదేవుడు, సూర్యుడు మొదలైన దేవతలంతా నా ఆదేశానుసారం పని చేసేలా వరం ప్రసాదించమ'ని కోరాడు. రైతు కోరిన వరాన్ని ఇంద్రుడు ప్రసాదించాడు.

ఒకరోజు ఉదయాన్నే ఆ రైతు పొలానికి వెళ్ళి, భూమిని దున్ని, మొక్కజొన్న విత్తనాలు జల్లాడు. తరువాత వరుణదేవుణ్ణి వర్షించమని ఆదేశించాడు. వెంటనే వర్షం కురిసింది. పొలమంతా నీటితో బాగా తడిసిన తరువాత సూర్యరశ్మి కోసం సూర్యుణ్ణి ఆజ్ఞాపించాడు. రైతు కోరిన ప్రకారమే సూర్యుడు ప్రకాశించాడు. కొన్ని రోజులకు మొక్కజొన్న తోట బాగా పెరిగింది. రైతు ఎంతో ఆనందంతో తోటను చూడడానికి వెళ్ళి ఒక మొక్కజొన్న పొత్తును విప్పి చూశాడు. మొక్కజొన్న కంకి బాగా ఎదిగింది కానీ అందులో గింజలు లేవు. ఆశ్చర్యానికి గురైన రైతు ఇలా జరగడానికి గల కారణమేమిటని తెలుసుకోవడానికి ఇంద్రుణ్ణి ప్రార్థించాడు. ఇంద్రుడు రైతు ముంగిట ప్రత్యక్షమయ్యాడు. రైతు జరిగిన విషయాన్ని ఇంద్రునికి వివరించాడు. అప్పుడు ఇంద్రుడు, "నువ్వు వరుణుణ్ణి వర్షించమనీ, సూర్యుణ్ణి ప్రకాశించమనీ కోరావు. కానీ గాలి వీయమని వాయువును కోరలేదు. సాధారణంగా వర్షంతో పాటు గాలి వీచినట్లయితే, తాము పడిపోతామన్న భయంతో మొక్కలు భూమి లోపలికి వేళ్ళూనుకుపోతాయి. అప్పుడు భూమి లోపల ఉన్న సారం వేళ్ళ ద్వారా మొక్కకు చేరుతుంది. అప్పుడే ఆ మొక్క ఫలవంతమవుతుంది" అని రైతుతో అన్నాడు. ప్రకృతి నియమాన్ని ఉల్లంఘించిన రైతు తన తప్పును తెలుసుకున్నాడు.

జీవితాకాశంలో విహరించే మనిషికి కష్టసుఖాలు రెండు రెక్కల్లాంటివి. ఇది ప్రకృతి నియమం. ఈ ప్రకృతి నియమానికి విరుద్ధంగా వ్యవహరించేవారు జీవితంలో ఉన్నతిని సాధించలేరు. కష్టాల కడలిలో ఎదురీదగలిగేవారే మహోన్నత వ్యక్తులుగా పరిణతి చెందుతారు.

"In studying the great characters the world has produced, I dare say, in the vast majority of cases, it would be found that it was misery that taught more than happiness, it was poverty that taught more than wealth, it was blows that brought out their inner fire more than praise." - *Swami Vivekananda*

కాబట్టి మనిషికి సుఖం కన్నా దుఃఖమే గుణపాఠాల్ని నేర్పుతుంది. సంపద కన్నా దారిద్ర్యమే సౌశీల్యునిగా మారుస్తుంది. ప్రశంసల కన్నా విమర్శలే ఆత్మశక్తిని జాగృతపరుస్తాయి అన్న విషయం మహోన్నత వ్యక్తుల జీవితాలను పరిశీలించినట్లయితే మనకు అవగతమవుతుంది.



సుఖాల పందిట్లో సేద తీరాలనీ, ప్రశంసల జల్లుల్లో పరవశించాలనీ ఆశించేవారు ఎన్నడూ నిజమైన ఆనందాన్ని పొందలేరు. సుఖాన్ని కోరుకునే వ్యక్తి దుఃఖాన్ని కూడా భరించగలిగే శక్తిని కలిగివుండాలి. ఎందుకంటే దుఃఖం, సుఖాన్ని అనుసరిస్తూంటుంది. అందుకే 'సుఖం, దుఃఖమనే ముళ్ళ కిరీటం ధరించి వస్తుంది' అని అంటారు స్వామి వివేకానంద. అందువల్ల జీవితంలో కష్ట సుఖాలు సహజమని భావించి, రెండింటినీ సమభావంతో ఆహ్వానించగలిగే మనఃస్థితిని అలవరచుకోవాలి.

**పరమోన్నత స్థితి:** జీవితంలో కష్టసుఖాలను సమానంగా స్వీకరించగలగడం ఓ ఉన్నత స్థితి. కానీ సుఖం ఉన్నచోట దుఃఖం ఉంటుంది; రాగం ఉన్నచోట ద్వేషం ఉంటుంది; భయం ఉన్నచోట క్రోధం ఉంటుంది. ఈ ద్వంద్వాలకు అతీతమైన స్థితిని సాధించడమే జీవిత పరమార్థం. ఆ స్థితిని పొందినవాడే పరమోన్నతుడనీ, స్థితప్రజ్ఞుడనీ శ్రీకృష్ణ పరమాత్మ బోధించాడు.

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥** *(గీత - 2.56)*

'దుఃఖాలకు దిగులు చెందనివాడూ, సుఖాలకు సంతోషించని వాడూ, రాగం (దేనితోనూ బంధం) గానీ, భయంగానీ, క్రోధం గానీ లేనివాడూ అయిన మునిని స్థితప్రజ్ఞుడంటారు'.

సముద్రంలో ఎన్ని నదులు కలిసినప్పటికీ అది ఎలా మార్పు చెందదో, అలాగే పరమపద స్థితిని పొందిన వ్యక్తి ఎన్ని కష్టసుఖాలు ఎదురైనా నిశ్చలంగా ఉంటాడు. అలాంటి పరమోన్నత స్థితిని పొందిన ఒక సాధారణ ఉపాధ్యాయుడైన మాస్టర్ మహాశయ్ *(మహేంద్రనాథ్ గుప్త- శ్రీరామకృష్ణ కథామృత రచయిత)* జీవితంలో జరిగిన ఒక సంఘటనను తెలుసుకుందాం:

జీవితంలో ఎదురైన ఒడుదొడుకులకు భయపడి ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకొన్న మాస్టర్ మహాశయ్, శ్రీరామకృష్ణుల దర్శన భాగ్యంతో, వారి బోధనల స్ఫూర్తితో ఒక మహోన్నత మునిగా పరిణతి చెందారు. ఆ మహాత్ముణ్ణి దర్శించుకోవడానికి రామకృష్ణ మఠ స్వామీజీలు తరచూ ఆయన ఇంటికి వెళుతూండేవారు.

ఒకరోజు స్వామి వివేకానంద శిష్యులైన స్వామి ఆత్మానంద, మాస్టర్ మహాశయ్‌ని దర్శించుకోవడానికి వెళ్ళారు. స్వామీజీని చూసిన వెంటనే ఆయన ఎంతో ఆనందంతో మేడపై ఉన్న తన గదికి తీసుకువెళ్ళారు. స్వామీజీని కూర్చోబెట్టి మిఠాయిలు తినమని ఆయన ముందుపెట్టారు. స్వామీజీ మిఠాయిని తింటూవుంటే మాస్టర్ మహాశయ్ తన జీవితానుభవాలను చెప్పసాగారు. ఇలా ఇద్దరూ సంతోషంగా సంభాషించు కొంటున్నప్పుడు కొంత మంది వ్యక్తులు ఇంట్లోకి వస్తూ పోతూండడాన్ని గమనించారు స్వామీజీ. అసలు విషయ మేమిటని మాస్టర్ మహాశయ్‌ని అడిగి నప్పుడు, 'మీరు మిఠాయిలు తినడం పూర్తయిన తరువాత చెబుతాను' అని అన్నారు ఆయన. కొద్దిసేపటికి ఇంటి క్రింది గది నుండి మధ్య మధ్యలో ఏడుపులు వినిపించాయి. ఏదో విషాద సంఘటన జరిగిందని గ్రహించిన స్వామీజీ అసలు విషయం ఏమిటో చెప్పమని మాస్టర్ మహాశయ్‌ను ఒత్తిడి చేశారు. అప్పుడు మాస్టర్ మహాశయ్, స్వామీజీతో 'ఈ రోజు ఉదయం నా కుమార్తె మరణించింది. ఇప్పుడు ఆమెకు అంత్యక్రియలు జరపాల్సి ఉంది' అని ప్రశాంతంగా చెప్పారు.

విషాదంలో కూడా ప్రశాంతతను ప్రదర్శించిన మాస్టర్ మహాశయ్‌లో స్థితప్రజ్ఞత్వాన్ని దర్శించిన స్వామి ఆత్మానందజీ ఆయనకు ప్రణమిల్లారు. పరిస్థితులకు అతీతంగా ఉండగలిగే ఆ పరమోన్నత స్థితిని పొందగలగడమే 'జీవిత పరమార్థం'.

నూతన సంవత్సర 'ఉగాది' పర్వదినాన సుఖదుఃఖాలకూ, రాగద్వేషాలకూ, భయక్రోధాలకూ అతీతమైన పరమోన్నత స్థితిని మనకు కూడా ప్రసాదించాల్సిందిగా భగవాన్ శ్రీరామకృష్ణులను ప్రార్థిద్దాం. ❖

**గంధ సువాసననీ, కళేబర దుర్గంధాన్నీ వాయువు స్వీకరించినప్పటికీ వాటితో మిళితం కాదు. అలాగే ముక్తజీవి సంసారంలో ఉన్నప్పటికీ అందులో కలసిపోడు.** -*శ్రీరామకృష్ణ పరమహంస*

# రివర్స్ గేర్

మనల్ని దిగ్భ్రమకు గురిచేసే ఈ గణాంకాలను (statistics) కొంచెం గమనించండి – మన దేశంలో గంటకు 15 మంది చొప్పున, రోజుకు 230 మంది పురుషులు, 130 మంది స్త్రీలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వీరిలో పెళ్ళయినవారి సంఖ్యే ఎక్కువ. ఆత్మహత్య చేసుకున్న ప్రతి ఐదుగురిలో ఒకరు ఇంటికి ఇలవేల్పు అయిన ఇల్లాలు ఉండడం శోచనీయం. పురుషులు చేసుకుంటున్న ఆత్మహత్యలకు సామాజిక, ఆర్థిక సమస్యలు ముఖ్య కారణమైతే, మహిళలు తీవ్ర మానసిక భావోద్రేకాలతో, వ్యక్తిగత సమస్యలతో ఆత్మహత్య చేసుకుంటున్నారు. కుటుంబవ్యవస్థకు,



అనుబంధాలకు, మానవ సంబంధాలకు ఎంతో ప్రాధాన్య మిస్తామని చెప్పుకునే మన భారతదేశంలో ఈ పరిస్థితి ఎందుకు తలెత్తింది?

'నేడు సమాజంలో మానవతా విలువలు పూర్తిగా దిగజారిపోతున్నాయి' అన్న మాటలు తరచుగా వింటున్నాం. అసలు 'మానవతా విలువలు' అంటే ఏమిటి? మనలోని పశుత్వాన్ని నశింపచేసి మనుషులుగా మార్చి, ఆ పై దైవత్వాన్ని సంతరించుకొనేలా చేసే విలువలే 'మానవతా విలువలు'. దీన్ని కొలమానంగా పెట్టుకొని ప్రతి మనిషీ ప్రగతిపథంలో పయనించాలి. కానీ అలా జరగడం లేదు.

కొత్తగా కారు కొన్న ఒక వ్యక్తి దానిలో తిరగాలని అనుకొని, 'సాయంత్రానికి వచ్చేస్తానోయ్' అంటూ భార్యకు చెప్పి పక్క ఊరికి ప్రయాణమయ్యాడు. వెళ్ళినవాడు వెళ్ళినట్టే ఉన్నాడు. మూడు రోజులు అయినా ఇంటికి తిరిగి రాలేదు. నాలుగోరోజు చింపిరి జుట్టు, మాసిన బట్టలతో ఉసూరు మంటూ ఇంటికి వచ్చాడు. భర్తను ఆ స్థితిలో చూసిన భార్య, "సాయంత్రమే తిరిగి వస్తానని వెళ్ళారు కదా! ఇన్ని రోజులైందేమిటండి? అసలు ఈ అవతారం ఏంటి?" అని ఆదుర్దాగా అడిగింది. అందుకు భర్త, "ఏం చెయ్యమంటావు! కార్ల కంపెనీ వాళ్ళకు అసలు బుద్ధే లేదు. ముందుకు వెళ్ళడానికి 4 గేర్లు, వెనకకు రావడానికి ఒక్కటే గేర్ ఇచ్చారు. రివర్స్ గేర్‌లో రావడం అంత తేలికనుకొన్నావా? నిదానంగా వచ్చాను. అందుకే ఆలస్యమైంది" అన్నాడు.

అదండీ అసలు విషయం! మన బండి రివర్స్ గేర్‌లో నడుస్తుంది. ఒకపక్క భౌతిక (సాంకేతిక) పురోగతి ఆకాశాన్ని అంటుతుంటే, మరోపక్క మానవతా విలువలు అధోగతి పాలవుతున్నాయి. రెండు చెవులకు రెండు సెల్‌ఫోన్‌లు అతికించుకున్నప్పటికీ మనుషుల మధ్య communication gap అధికమవుతోంది. మనిషి తన సహజత్వాన్ని కోల్పోవడం వల్ల అతనిలో ప్రేమానురాగాలకు బదులు అసూయా ద్వేషాలు చోటు చేసుకొంటున్నాయి. పెద్దలైనా, పిన్నలైనా ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకోవడంతోనే సరిపోతోంది.

భగవంతుడు ఈ ప్రపంచంలో మనుషులను (జీవరాశులను), వస్తువులను సృష్టించాడు. మనుషులను ప్రేమించమన్నాడు. వస్తువులను ఉపయోగించుకోమన్నాడు. కానీ మనం వస్తువులకు ఇస్తున్న ప్రాముఖ్యాన్ని తోటి మనుషులకు ఇవ్వలేకపోతున్నాం. మన ఇంట్లో ఉన్న ప్లాస్మా టీవీని తళతళలాడేలా ఉంచుతూ దాన్ని ప్రేమిస్తాం. దాని వైపు గర్వంగా చూస్తాం. వీలైతే దాని గురించి గొప్పగా స్నేహితులకు చెబుతాం. ఇదే విధంగా మన ఇల్లు, కారు, మనం వేసుకొనే బట్టలు, వాషింగ్ మెషీన్ – ఒకటేమిటి?... అన్ని వస్తువులూ ప్రాముఖ్యం సంతరించుకొంటున్నాయి. అవి లేకుండా బ్రతకలేకపోతున్నాం. కాసేపు కరెంట్ పోతే టి.వి. సీరియల్ పోతుందనీ, ఏ.సి. లేకపోతే ఉక్కపోసి చచ్చిపోతున్నామనీ తల్లడిల్లుతున్నాం.

కానీ ఇంట్లో ఉన్న ముసలవ్వ, తాతల బాగోగులు పట్టించుకోం. పిల్లలతో కాసేపు కూర్చొని మాట్లాడడానికి సమయం ఉండదు. భగవంతుడు చెప్పిన దానికి విరుద్ధంగా నడుచుకొంటున్నాం. వస్తువులను ప్రేమిస్తున్నాం. మనుషులను ఉపయోగించుకొంటున్నాం. ఈ అసహజత్వం నుండి బయటపడాలి. అప్పుడే బండి ముందుకు కదులుతుంది. ❖

# వేపపూతతో వత్సరాది

- ఆంధ్ర శేషగిరిరావు

ఉగాది తెలుగువారికీ, కన్నడిగులకూ చాలా ముఖ్యమైన పండుగ. దీనినే సంవత్సరాది పండుగ అని కూడా అంటారు. ప్రతి సంవత్సరం చైత్ర శుక్ల పాడ్యమి రోజున ఈ పండుగను జరుపుకుంటారు. అన్ని పండుగలలో ఇదే మొదటి పండుగ.

'నూతన సంవత్సర కీర్తనాద్యారంభం ప్రతి గృహ ధ్వజారోహణం నింబపత్రాశనం వత్సరాది శ్రవణం నవరాత్రారంభః' అంటే ఈ రోజున ప్రతి ఇంటికి తోరణాలు కట్టి, వేపపూతతో చేసిన పచ్చడిని భుజించి, సంవత్సర ఫలశ్రవణం చేస్తారు. ఉగాది నుండి శ్రీరామనవమి వరకు శ్రీరామ నవరాత్రోత్సవాలను జరుపుతారు.

ఉగాది ఋతు సంబంధమైన పండుగ. ప్రకృత్యారాధనకు పేరు మోసిన మన పెద్దలు ఋతుసంబంధమైన ఆ యా పండుగల కార్యకలాపాల్లో ఆ యా ఋతువుల్లో లభ్యమయ్యే ప్రకృతి పదార్థాలకు ప్రవేశం కలిగించి, ప్రయోజనం కల్పించారు. ఉగాది పర్వదినం నాడు నింబ కుసుమ (వేప పూత) భక్షణవిధి అందుకు నిదర్శనం. ఉగాది నాటికి వేపచెట్లు ముమ్మరంగా పూతపూసి ఉంటాయి. వేప పువ్వు గుణవంత మైన ఔషధి. రక్తాన్ని శుద్ధి చేసి వృద్ధిపరిచే గుణం దానికి ఉంది. పైగా అది వసంత ఋతు సంబంధమైన పువ్వు. వైద్యానికి ఉపయోగించే పంచాంగాల్లో వేప ఒకటి.

వేప సర్వాంగాలనూ మనవారు వైద్యంలో వాడతారు. మానవునికి ఆరోగ్యం కూర్చే వృక్షరాజాల్లో వేప ఒకటి. స్వర్గలోకంలోని ఆంబ్రోశియా వృక్షం అంశతో భూలోకంలో వేప చెట్టు పుట్టిందని మహారాష్ట్ర సంప్రదాయక విజ్ఞానం ద్వారా వెల్లడి అవుతోంది. పారశీక భాషలో వేప చెట్టుకు Azar Durachta అని పేరు. దాని అర్థం ఉత్తమ వృక్షం అని. ఈ పేరు వేపచెట్టు శ్రేష్ఠత్వాన్ని తెలియజేస్తుంది.

పూవైనా, ఆకైనా వేప చెట్టును సేవించడం ఉగాది విధాయక కృత్యాలలో ఒకటని మత గ్రంథాలు చెబుతున్నాయి. కాగా ఉగాది దినాలు వేరైనప్పటికీ ఆనాడు వేప సంబంధమైన పూవో, ఆకో తినడం హిందూదేశంలోని వివిధ ప్రాంతాల్లో ఆచారం. వేపాకు, పూవు- ఈ రెండింటిలో దేని వాడకం మంచిది అనే ప్రశ్న ఈ సందర్భంలో పొడసూపడం సహజం.

ఆయుర్వేద వైద్యులు వాడే వేప పంచాంగాలలో ఆకు కూడా ఒకటి. చర్మవ్యాధుల్లో పచ్చి వేపాకు నలుగు పెట్టుకుంటారు. అమ్మవారి జబ్బుల్లో రోగులకు వీచోపు నిమిత్తం ఆకులు దట్టంగా ఉండే వేపరొట్ట వాడుతారు. మశూచికాది రోగులు ఉండే ఇంటి ముంగిళ్ళలో వేపాకు తోరణాలు కడతారు. ఇలా వేపాకు ఉపయోగాలు ఎన్ని అయినా చెప్పవచ్చు.

అయితే ఉగాది నాడు వేపాకు కన్నా వేపపూత వాడడమే సమయోచితం. వేపచెట్టు అంగాల్లో వసంత ఋతువులో మాత్రమే దొరికేది పూవే. వసంత ఋతుసంబంధపర్వమైన ఉగాది నాడు ఆ ఋతువులో మాత్రమే దొరికే వేపపూతను వాడడమే ప్రాప్తకాలజ్ఞత. అదే మన పెద్దల ఉద్దేశ్యమై ఉంటుంది. ఆ యా కాలాల్లో లభ్యమయ్యే ఫలపుష్పాదులను ఆ యా కాలాల్లోని పర్వదినాల్లో భగవంతునికి నివేదన చేసి స్వీకరించడం మన సంప్రదాయం! ❖

(మార్చి 23, శుక్రవారం - తెలుగు సంవత్సరాది)

జీవితాన్ని ఎలా గడపాలి? కుంపట్లోని నిప్పు ఆరిపోకుండా అప్పుడప్పుడు కదల్చి ప్రజ్వలింపచేసేట్లు సాధుసాంగత్యంతో మనస్సును అప్పుడప్పుడు ఉజ్జీవింప చేస్తూ ఉండాలి.- శ్రీరామకృష్ణ పరమహంస

> **కా తే కాన్తా కస్తే పుత్రః**
> **సంసారోఽ_యమతీవ విచిత్రః।**
> **కస్య త్వం కః కుత ఆయాతః**
> **తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః ॥**

# సంసారం ఓ సంకెల!

- స్వామి జ్ఞానదానంద

ఓ సాధుపుంగవుడు తన శిష్యుడికి భాగవత ప్రవచనం చేస్తూ, 'నాయనా! సంసారం అనేది మిథ్య; ఇందులో నీవను కున్నట్లు శాశ్వత సుఖమేదీ లేదు! నాతో పాటు వచ్చేయ్' అన్నాడు. వెంటనే ఆ శిష్యుడు 'లేదు గురువుగారూ! నన్నెంతగానో ప్రేమించే భార్య, ముగ్గురు పిల్లలు, తల్లితండ్రులు ఉన్నారు. వారికి నేనంటే ప్రాణం. వాళ్ళను వదలి నేనెలా రాగలను?' అని బదులిచ్చాడు. అందుకు ఆ గురువు, 'నువ్వు నా వాళ్ళు, నా వాళ్ళు అంటున్నావు. పైగా వారు నిన్ను ప్రేమిస్తున్నారంటున్నావు. కానీ ఇదంతా నీ భ్రమే. నేనొక నాటకం ఆడతాను. దాని ద్వారా వారు నిజంగానే నిన్ను ప్రేమిస్తున్నారా? లేదా? అనే విషయం నీకర్థమవుతుంది'



అంటూ ఓ గుళిక ఇచ్చాడు. 'ఇంటికి వెళ్ళాక దీన్ని మింగు, దీని ప్రభావంతో నువ్వు అచేతనంగా, శవంలా పడిపోతావు. అయితే నీకు స్పృహ తప్పదు. చుట్టూ జరిగేదంతా వినగలవు. నేను వచ్చాక మళ్ళీ నా మంత్రజపంతో నిన్ను సాధారణస్థితికి తెస్తాను' అన్నాడు.

ఇంటికి వెళ్ళి, గురువుగారు చెప్పినట్లే ఆ శిష్యుడు చేశాడు. శవంలా పడిపోయాడు. ఇంట్లో ఒక్కసారిగా శోకాలు మిన్నంటాయి. భార్య, బిడ్డలు విపరీతంగా విలపిస్తున్నారు. ఆ శిష్యుడు మనస్సులో తనపై వారికున్న ప్రేమను తలచుకొని ఎంతో పొంగిపోతున్నాడు; గురువుగారి మాటలు తప్పవుతాయను కున్నాడు. ఇంతలో గురువుగారు వచ్చి, శిష్యుడి నాడి పరీక్షించి 'అరే! ఇదేంటి? ఇతడు చనిపోలేదు! నేనొక ఔషధం ఇస్తాను. అది పుచ్చుకోగానే మామూలు మనిషైపోతాడు' అన్నాడు. ఇంట్లోని వారందరి ఆనందానికి హద్దు లేకుండా పోయింది. 'కానీ, ఈ ఔషధాన్ని ఆయనకు ప్రయోగించే ముందు, మరో వ్యక్తి దీనిని సేవించాలి. అయితే ముందుగా మందు సేవించిన వ్యక్తి మరణి స్తాడు' అని చెప్పాడు. 'మీరంతా ఇతనికి కావలసినవారే కదా! మీలో ఎవరో ఒకరు ఈ ఔషధాన్ని సేవించండి' అన్నాడు.

ఆ మాట వినగానే వారందరూ ఏడుపు మాని, ఒకరి ముఖాలు మరొకరు చూసుకోసాగారు. 'నేను పోతే ఇంత పెద్ద సంసారాన్ని ఎవరు చూసుకుంటారు? పోయినవాడు ఎలాగూ పోయాడు. మిగిలిన పిల్లల్ని, కోడల్ని, మనవల్ని చూసుకొని బతుకుతాను' అన్నాడు తండ్రి. 'అందరూ ఎప్పుడో ఒకప్పుడు పోయేవాళ్ళే కదా! ఆయన తలరాత అలా ఉంది. పిల్లలకు తండ్రి లేకపోయినా ఫరవాలేదు. తల్లి లేకపోతే ఎలా?' అని పక్కకు వెళ్ళింది భార్య. 'అమ్మలో నాన్నను చూసుకుంటాం. మేము జీవితాన్నేమీ అనుభవించ లేదు. మేమెందుకు త్యాగం చేస్తాం' అంటూ పిల్లలు లోనికి వెళ్ళిపోయారు.

అప్పుడు శిష్యుడికి జ్ఞానోదయమైంది. తనకూ, వారికీ మధ్య ఉన్న అనుబంధం ఎంత గాఢమైందో అర్థమైంది. ఈ కఠిన సత్యాన్ని విశ్లేషిస్తూ ఆదిశంకరాచార్యులు 'భజగోవింద స్తోత్రం'లో ఇలా అంటారు:

**కా తే కాన్తా కస్తే పుత్ర స్సంసారోఽ_యమతీవ విచిత్రః**
**కస్య త్వం కః కుత ఆయాతః తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః**

'ఓ సోదరా! ఎవరు నీ భార్య? ఎవరు నీ పుత్రుడు; వారికీ, నీకూ ఉన్న సంబంధం ఏమిటి? నీవెవరు? ఎక్కడ నుంచి వచ్చావు? ఈ సంసారమే అతి విచిత్రమైంది. ఈ తత్త్వాన్ని తెలుసుకొమ్మ'ని హెచ్చరిస్తారు. సంసారంలో నుంచి కాకుండా, సంసారమనే మాయలో నుంచి బయటపడమంటారు. జీవన యానంలో భార్యాబిడ్డలు, బంధుమిత్రులు సహప్రయాణికులే కానీ, శాశ్వత సంబంధీకులు కాదని గుర్తుచేస్తారు. కానీ లౌకిక ప్రపంచంలో మనం అమాయకత్వంతో, అజ్ఞానంతో అనుబంధాల విషయంలో అమితమైన అనురాగాన్ని పెంచేసుకుంటాం. చివరకు అనంత దుఃఖాల పాలవుతాం.

**విచిత్ర 'వల'యం :** ఆలోచిస్తే అన్నీ తెలిసినా మనుష్యులు ఈ సంసారవలయం నుంచి బయటపడే ప్రయత్నం చేయడం లేదు. లేనిపోని జంజాటంతో బతికినన్నాళ్ళూ ఆ కూపంలోనే కూరుకుపోతున్నారు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు – "బయటపడడానికి మార్గం ఉన్నా వలలో చిక్కుకున్న చేప తప్పించుకోవడానికి ప్రయత్నించదు. తాను కట్టుకున్న గూట్లో తానే చిక్కుకొని చచ్చిపోతుంది పట్టుపురుగు. ఈ విధంగా సంసారం మిథ్య, అనిత్యమే!"



అలాగని ఇల్లూ, వాకిలి, భార్యాబిడ్డల్ని వదిలివేయమని శంకరాచార్యుల, శ్రీరామకృష్ణుల ఉద్దేశ్యం కాదు. వాటికీ, వారికీ, నీకూ మధ్య ఉన్న బంధాన్ని బలమైనదిగా భావించుకోవద్దని హితవు పలుకుతున్నారు. ఎంత అప్రమత్తంగా ఉన్నా అనుబంధాలు, ఆత్మీయతలనే విచిత్ర 'వల'యాలు మనల్ని మోహంలోనే ముంచెత్తుతాయి. శాశ్వతమని భ్రమింపజేస్తాయి. అందుకే వివేక, వైరాగ్యాలను పెంచుకునే ప్రయత్నం చేయాలి. మన జీవితంలోనే కాకుండా ఇతరుల జీవితాల్లోని సంఘటనలను ఉదాహరణలుగా తీసుకుంటూ, సంసారబంధాలు ఎంత బలహీనమైనవో విశ్లేషించుకోవాలి. నిరంతరం ఆత్మీయుల మధ్యే ఆనందాన్ని వెతుక్కోవడం మానేసి, ఎవరికి వారు తమదంటూ, తమకంటూ ఓ కాలాన్ని కేటాయించుకొని, ఆ భగవంతుడితో మనస్సును అనుసంధానం చేసుకొని, గోవిందుణ్ణి భజించుకోమంటున్నారు జగద్గురువులు శంకరాచార్యులు.

**అవివేకంతోనే అష్టకష్టాలు :** సంసార వ్యవహారాలు, లౌకికమైన లంపటాలు మనిషి మనస్సును నిరంతరం బాహ్య ప్రపంచంలోకి పరుగెత్తేలా చేస్తాయి. చాలా సందర్భాల్లో వివేకాన్ని కోల్పోయేలా చేస్తాయి. ఈ రోజు సమాజంలో చాలామంది అపసవ్య మార్గంలో పడి కొట్టుకుపోవడానికి ఈ అవివేకమే కారణం. ఈ సంసారాన్ని మరింత సుసంపన్నం చేసుకోవాలని పడుతున్న తాపత్రయంలో వ్యక్తిగతమైన ధర్మాధర్మ విచక్షణ కూడా కొరవడుతోంది. అందుకే ఓ మారు విదురుడు, మైత్రేయునితో

**...అవివేకానుగత స్వకార్య జలవేలాకీర్ణమై మిత్ర బంధు వధూ పుత్ర జలగ్రహోగ్రయుతమై, దుర్దాంతమైనట్టి దుర్భవ పాథోధి....** అంటూ సంసార రూపాన్ని వర్ణిస్తాడు.

అవును! భయంకరమైన ఈ సంసార సాగరానికి అవివేకమే జలం. స్వార్థపరత్వమే చెలియలి కట్ట. మిత్రులు, బంధువులు, భార్యాపుత్రులే జలచరాలు; ఇవి దురంతమైనవి. ఈ మాయామోహాలు మనిషిని ఎంత నీచమైన స్థాయికి దిగజారుస్తున్నాయో నేడు సమాజంలో చూస్తూనే ఉన్నాం. తీరా జ్ఞానోదయమయ్యే సమయానికి పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది; ఆయువు తీరిపోతుంది. అందుకే ముందే మేల్కొని, ఎవరి కోసం తపించి తపించి తప్పులు చేస్తున్నామో, 'నాయింబవళ్ళు వాళ్ళ తోటిదే లోకమని జీవిస్తున్నామో, వారికీ, మనకూ అంత శాశ్వత ఋణానుబంధమేదీ లేదని తెలుసుకోవాలి. అలా కాకుంటే బతికినన్నాళ్ళూ అవివేకంతో అష్టకష్టాలు పడాల్సి వస్తుంది.

**సంసారానిది ప్రవృత్తి పయనం :** సంసారం మనల్ని నివృత్తి మార్గం నుంచి ప్రవృత్తి మార్గంలోకి తీసుకు వెళుతుంది. ప్రవృత్తి అంటే బయటకు పోవడం; మన ఉత్పత్తి స్థానమైన పరమాత్మ నుంచి బాహ్య ప్రపంచంలోకి, సంసారంలోకి వెళ్ళడమే ప్రవృత్తి మార్గం. నివృత్తి అంటే వెనక్కి మరలడం! అంటే సంసారం నుంచి మరలి భగవంతుని వైపు, అమృతత్వం వైపు పయనమవడం. కానీ బాధాకరంగా ఈ రోజు సాంసారిక జీవితంలో మనిషి క్షణం కూడా తీరిక లేకుండా ప్రవృత్తి మార్గాన్నే జీవనపథంగా ఎంచుకుంటున్నాడు. అసుర లక్షణాలైన దుర్గుణాలను పెంచి పోషించుకుంటున్నాడు. అందుకే శ్రీకృష్ణ భగవానుడు –

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥** అంటాడు.

'ఆసురీ సంపదలోని వారు ప్రవృత్తి మార్గం, నివృత్తి మార్గం అనే రెండు మార్గాలున్నట్లే ఎరుగరు. వారి యందు పవిత్రత కానీ, మంచి నడవడి గానీ, సత్యం గానీ ఉండవ'ని స్పష్టం చేస్తాడు. ఈ విచక్షణ లేమి వల్లనే మనలో నానాటికీ ఆసురీ లక్షణాలు పెచ్చుమీరుతున్నాయి. మనవారు అనుకున్నవారి కోసం శక్తిని మించి ప్రయాసపడుతున్నాం; అజ్ఞానంతో అలసిపోతున్నాం. ఎవరికి వారు రోజులో ఏకాంతంగా ఒక్క క్షణం ఆలోచిస్తే, ఇంత పరుగు అవసరమా అని ప్రశ్నించుకుంటే అంతరంగమే సరైన సమాధానం చెబుతుంది. ఇలా చైతన్యంతో కూడిన జ్ఞానాన్ని పెంపొందించుకుంటే, ఈ సంసారచక్రం నుంచి బయటపడగలం. ఆధ్యాత్మికచింతన, భగవదాలంబన మనకు చిరశాంతిని ప్రసాదిస్తాయి. అప్పుడు, యోగవాశిష్ఠంలో చెప్పినట్లు...

**న సుఖాని న దుఃఖాని న మిత్రాని న బాంధవాః ।**
**న జీవితం న మరణం బంధా యజ్ఞస్య చేతసః ॥**

ఆ భగవంతుడి అనుగ్రహం వల్ల జ్ఞానదృష్టి కలిగాక ఈ సుఖదుఃఖాలు కానీ, ఈ బంధుమిత్రులు కానీ, ఈ జీవన్మరణాలు కానీ ఏ మాత్రం బంధకారణాలుకావు. అలా ఇకనైనా శంకరాచార్యులు బోధించినట్లు 'భజగోవిందం... భజగోవిందం' అంటూ సాగిపోదాం. సంసార సాగరం నుంచి గట్టెక్కుదాం. ❖

**మనస్సు భగవంతుని మీద నిలిపి సంసార విధులనన్నింటినీ నిర్వర్తించేవాడే నిజమైన ధీరుడు. భగవంతుని సేవకుడననే భావన ఉంటే బాధ్యతలన్నీ ఆయనే వహిస్తాడు.** -శ్రీరామకృష్ణ పరమహంస

'ప్రతి మనిషిలోనూ దివ్యత్వం నిగూఢంగా ఉంది. ఆ దివ్యత్వాన్ని వ్యక్తపరచడమే జీవిత గమ్యం' అన్నారు స్వామి వివేకానంద. నిజమే! ప్రతి మనిషిలో దివ్యత్వం సిద్ధాన్నం. ఎవరో అందించాల్సిన అవసరం లేదు. ఎవరూ వడ్డించ వలసిన అవసరం లేదు. మనిషితో పాటు ఉద్భవించిన అంతర్గత అమృత భాండం దివ్యత్వం. దాన్ని గుర్తించి, వెలికి తీయాల్సిన పని మాత్రమే మనిషిది. మనిషే కృత్రిమం. దివ్యత్వమే

# నీ తత్త్వం దివ్యత్వం

**- హేమంత్ కుమార్**

సహజం. ఈ మనిషిగా గుర్తింపు పొందే శరీరం దివ్యత్వానికి ఆపాదింప బడిన ఒక ఉపాధి. మరి ఈ శరీరం అనుకునే 'నేను' అసలు దివ్యత్వంగా మారేదెన్నడు? ఎలా? తనను తాను వ్యక్తపరచుకునే దెలా? ఎన్నడు? 'దివ్యత్వమే నేను' అనే సత్య గ్రాహ్యతలో మనిషి నిలబడే దెన్నడు?

లోపల దివ్యత్వమనే అమరజ్యోతిని ఉంచుకుని పైన మసిబారిన బొమ్మల్లా బ్రతికేస్తున్నాం. అన్ని శక్తుల్నీ అంతర్గతంగా ఉంచుకుని ఎవరెవరినో దేబిరిస్తున్నాం. మన బలం మనకు తెలియక, మన శక్తి మనకు అర్థం కాక బేలగా బతికేస్తున్న అపర ఆంజనేయులం మనం.

ఒక గంధపు వృక్షం ఎందరికి సుగంధాన్నిస్తుంది! ఒక గోవు ఎందరికి ప్రాణాధార అమృత క్షీరాన్నిస్తుంది! ఒక తులసి మొక్క ఎందరికి ఆరోగ్య, ఆధ్యాత్మిక ప్రయోజనాన్ని పంచుతుంది! ఈ అన్నింటినీ మించిన దివ్యతమ తేజో భాస్కరం మనలోని దివ్యత్వం. దానికి సాటి లేదు. ఏదీ దీటు రాదు. దాన్ని గుర్తిస్తే, 'శరీర స్పృహ' అనే కవచం కుబుసంలా జారిపోతే, దివ్యత్వం ప్రకటితమైతే మనిషి కూడా ఒక దివ్యాత్మగా, గోవులా, గంధంలా, తులసీ మాతలా, అంతకు కోటింతల్లా లోకానికి ప్రయోజనకరం, పూజనీయం అవుతాడు. మనం ముందు ఎవరమో తెలుసు కోవాలి. ఎక్కడ నుంచి, ఎలా, ఎందుకు వచ్చామో గ్రహించాలి. తిని, నిద్రించి, కేవలం ఇంద్రియ సుఖాలను అనుభవించేందుకు రాలేదు. దానికి ఉన్నత కారణం ఉంది. ఉత్కృష్ట ఉద్దేశం ఉంది. ఒక చెట్టు ఊరికే పుట్టి, యథేచ్ఛగా పెరిగి, గిట్టదు. చావు పుట్టుక లనే కాల పరిమితి లోపల దాని కర్తవ్యాన్ని అది నెరవేరుస్తుంది. మరణాన్ని కూడా మంచితనానికి పెట్టుబడిగా పెట్టి పోతుంది. మనిషి చెట్టును ఆదర్శంగా తీసుకోవాలి.

మనిషి పుట్టను కూడా ఆదర్శం చేసుకోవాలి. ఒక జీవికి ఆశ్రయమిచ్చేందుకు తాను నిర్మితమైంది. తన పరిష్వంగంలోకి ఏది వచ్చినా అది ఆశ్రయమిస్తుంది. రక్షణనిస్తుంది. అంతే! దాని కర్తవ్యాన్ని అది నెరవేర్చే నేపథ్యంలో చీమ నుండైనా, పాము నుండైనా పుట్టకు ఎలాంటి హానీ జరగదు. ప్రకృతి సహజంగా జీవించే వారికి ప్రకృతి నుండి ఎప్పుడూ, ఎలాంటి హానీ జరగదు. పైగా అనూహ్యమైన రక్షణ లభిస్తుంది. మిగతా జీవులన్నీ అవగాహన లేకుండానే ఇంత క్రమశిక్షణతో, ఇంత ఔదార్యంతో జీవిస్తున్నప్పుడు అపురూపమైన మనో బుద్ధులున్న మనిషి సంగతేమిటి? నిజానికి మనిషి మనిషా? కాదు. అమృత పుత్రుడు. అపర బ్రహ్మ. శరీరాన్ని ఆధారంగా చేసుకొని జగన్నాటకంలో పాత్రధారియై పరంధాముని లీలావిలాసంలో పాలు పంచు కుంటున్న దివ్యత్వం. ఆ నాటకాన్ని రక్తి కట్టించాలంటే, తన వంతు పాత్రను ప్రావీణ్యంతో పోషించాలంటే తాను దేహం కాదనీ, దాన్ని ముసుగు లేసుకున్న దివ్యతత్త్వమనీ గ్రహించి, ఆ స్థాయిని ఆవాహన చేసుకుని లోకకల్యాణం కోసం కంకణ ధారి కావాలి. మరి ఆ దివ్యత్వం ఎలా మన అవగాహనలోకి వస్తుంది? దివ్యజీవనమే. యోగమే. జీవన యోగమే. గురువు అనుగ్రహంతో మన తత్త్వానికి తగిన సాధనా పథాన్ని ఎన్నుకుని, ఆధ్యాత్మిక తరంగాల మీద పయనిస్తూ ముక్తిధామం చేరుకోవడమే. ఈ యాత్రాంతర్భాగమే లోకకల్యాణం, నిష్కామ సేవ, త్యాగం...

సామాన్యులుగా జన్మించి, అలాగే జీవిస్తూ కూడా తమలోని దివ్యత్వాన్ని వెలికితీసి అసామాన్యతను ఆపాదించుకున్న మహా పురుషులు పురాణాల్లోనే కాదు. చరిత్రలోనూ మన కెదురవుతారు. వాల్మీకి మహర్షి (పుట్టుకతో బోయ), వీరబ్రహ్మేంద్రస్వామి(అచ్చమ్మ దగ్గర పశువుల కాపరి), ఒకప్పటి అమెరికా అధ్యక్షుడు అబ్రహామ్ లింకన్ (సామాన్య వడ్రంగి కుమారుడు), గాంధీజీ (మామూలు మధ్యతరగతి బాలుడు), అంబేద్కర్ (పేద దళితుడు)... ఎందరు... ఎందరని! వీరందరూ సామాన్యులుగా జన్మించి మాన్యులుగా ఎదగడం వెనుక వారి వారిలోని దివ్యత్వాన్ని వెలికితీసిన కృషి, ఆదర్శం కనిపిస్తాయి. ఎవరూ పై నుండి ఎదిగి ఊడిపడరు. తనలో నుంచే తానెదగాలి. అందుకవకాశం ఉంది. ❖

**నీరు, నీటి బుడగా ఒక్కటే. బుడగ నీటిలోనే పుట్టి, నీటిమీద తేలుతూ, చివరకు నీటిలోనే కలసిపోతుంది. అలాగే జీవాత్మ, పరమాత్మా ఒక్కటే. భేదం లేదు.** - *శ్రీరామకృష్ణ పరమహంస*

ధీరవాణి
- స్వామి వివేకానంద

# బంధంలేని బాంధవ్యమే మోక్షం!

ప్రపంచంలో అందరూ కర్మను చేస్తూనే ఉన్నారు. ఎందుకు? స్వతంత్రం కోసం, మోక్షం కోసం; మనస్స్వతంత్రం కోసం, శరీర స్వతంత్రం కోసం, ఆత్మ స్వతంత్రం కోసం! ఒకే లక్ష్యానికై అణువు మొదలు మహోన్నత జీవి వరకు కర్మను చేస్తున్నారు. సమస్త వస్తువులూ స్వాతంత్ర్యం కోసమే సదా ప్రయత్నిస్తున్నాయి.

కర్మయోగం ఏం బోధిస్తుంది? 'అసక్త స్సతతం కార్యం కర్మ సమాచార' (ఫలాపేక్ష రహితుడవై విహితమైన కర్మను ఎప్పుడూ చేస్తూండు). దేనితోనూ తాదాత్మ్యం పొందవద్దు. నీ మనస్సును స్వతంత్రంగా ఉంచుకో. లోకంలో నీకు కనబడే ఈ దుఃఖాలన్నీ, ఈ బాధలన్నీ సంసారంలో అనివార్యాలైన పరిస్థితులు; దారిద్ర్యం, సంపదలు, సౌఖ్యం - అన్నీ క్షణికాలు; ఇవి మన యథార్థ స్వరూపంలోవి కావు. యథార్థస్వరూపం సుఖ దుఃఖాతీతం, ఇంద్రియాతీతం, భావనాతీతం. అయినా మనమెప్పుడూ కర్మను నిర్వర్తిస్తూనే ఉండాలి.

'కర్మ చేత గాదు, సంగం చేత దుఃఖం కలుగుతోంది.' మనం చేసే కర్మతో తాదాత్మ్యం పొందగానే దుఃఖం అనుభవిస్తాం. తాదాత్మ్యం పొందకపోతే దుఃఖం అనుభవించం. ఎవరైనా తనది కాక మరొకరి చిత్రపటాన్ని తగలబెడితే సాధారణంగా బాధ పడరు; కానీ తన చిత్రపటాన్నే తగలబెడితే ఎంతో బాధపడతాడు. ఎందువల్ల? ఎందుకంటే ఒక పటం పట్ల అతడు తాదాత్మ్యం పొందుతున్నాడు; రెండవదాని విషయంలో పొందడం లేదు.

ఈ 'నేను, నాది' అనే అహంకార మమకారాలే సర్వ దుఃఖాలకూ కారణాలు. మనది అనుకోవడంతోనే మమకారం పుడుతుంది. మమకారం వల్ల దుఃఖం కలుగుతుంది. మనస్సులో పుట్టే 'నేను, నాది' అనే ప్రతి వృత్తీ వెంటనే మన చుట్టూ ఒక గొలుసును తగిలిస్తుంది. మనల్ని బానిసల్ని చేస్తుంది. నేను, నాది అని చెప్పుకొనేకొద్దీ బానిసతనం పెరుగుతుంది. బానిసతనంతో దుఃఖమూ పెరుగుతుంది.

కాబట్టి 'లోకంలో ఉన్న అన్ని పటాల సౌందర్యాన్నీ అనుభవించు, కానీ వాటిలో వేటితోనూ తాదాత్మ్యం మాత్రం పొందవద్దు' అని కర్మయోగం మనకు బోధిస్తుంది. ఏదీ 'నాది' అనుకోవద్దు. 'నాది' అని అనుకోగానే దుఃఖం మనల్ని ఆవరిస్తుంది. 'నా దేహం' అనుకోకు. ఉన్న చిక్కంతా ఇందులోనే ఉంది. ఈ శరీరం నీది కాదు, నాది కాదు, మరెవ్వరిదీ కాదు. ప్రకృతి నియమాల వల్ల ఈ శరీరాలు వస్తూ పోతున్నాయి. కానీ మనకు బంధం లేదు, మనం సాక్షులం.

పటానికి ఎంత స్వాతంత్ర్యం ఉందో, గోడ కెంత స్వాతంత్ర్యం ఉందో ఈ శరీరానికీ అంతే స్వాతంత్ర్యం ఉంది. అలాంటప్పుడు ఈ శరీరం పట్ల మన కెందుకింత వ్యామోహం? చిత్రకారుడు చిత్రాన్నొకదాన్ని గీచి, వెళ్ళిపోతున్నాడు. 'ఇది నా అధీనంలో ఉండాలి' అనే మమకారాన్ని పొందవద్దు. పొందితే, నీకు దుఃఖం మొదలైనట్లే! ❖



# పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

– సాయి రామానందస్వామి, పొదలకొండపల్లె

**? : ధ్యానం చేసుకోవడానికి అనువైన సమయం, స్థలం ఏది? ధ్యానం గురించిన నియమ నిబంధనల్ని వివరించండి?**

✍: ధ్యానం గురించి స్వామి వివేకానంద రాజయోగంలో ఇలా చెప్పారు: వెలుపల లేదా లోపల ఒక లక్ష్యం మీద మనస్సును నిలిపితే చిత్తం ఆ లక్ష్యంలో అవిచ్ఛిన్నంగా ఉండి పోతుంది. దీన్నే ధ్యానం అంటారు. ప్రతీతి లేదా ఇంద్రియానుభవంలోని బాహ్యాంశాన్ని తొలగించి, అంతరాంశమైన అర్థాన్ని మాత్రమే ధ్యానిస్తే మనస్సుకు తీవ్రశక్తి ఏర్పడుతుంది. అది సమాధి అవుతుంది. మనిషి బుద్ధిలో రమిస్తాడు. దివ్యపురుషుడు ఆత్మలో రమిస్తాడు. ధ్యానంలో ఉండగలిగే వ్యక్తికే నిజంగా ప్రపంచమంతా రమణీయంగా కనిపిస్తుంది.

యమ (సత్యం, అహింస, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం) నియమ (శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం) వీటిని అభ్యాసం చేస్తే చిత్త స్థైర్యం కలుగుతుంది. మనోనిగ్రహం ఏర్పడుతుంది. దాని వల్ల సూక్ష్మగ్రహణశక్తి అలవడుతుంది. ఇలాంటి చిత్తాన్ని ధ్యానంలో లగ్నం చేయాలి. స్థూల లక్ష్యంతో ధ్యానాన్ని ముందుగా ప్రారంభించాలి. క్రమంగా సూక్ష్మలక్ష్యాల వైపు వెళ్ళాలి. చివరికి ఏ లక్ష్యం లేకుండా ధ్యానంలో ఉండిపోవాలి. ధ్యానం చేసేటప్పుడు వక్షం, భుజాలు, తల – వీటిని నిటారుగా, స్థిరంగా నిలపాలి.

ధ్యేయంలో పన్నెండు క్షణాలు మనస్సును నిలిపితే అది ధారణ. పన్నెండు ధారణలు ఒక ధ్యానం. పన్నెండు ధ్యానాలు సమాధి. (12 x 12 x 12 = 1728 క్షణాలు = 4 గంటల 48 నిమిషాలు)

అగ్ని భయమున్నచోట, చీమల పుట్టలుండే ప్రదేశంలో, ప్రమాదకరమైన స్థలాల్లో, నాలుగు బాటలు కలిసే చోట, పెద్ద పెద్ద ధ్వనులు వినిపించే చోట ధ్యానం, యోగాభ్యాసం చేయరాదు. దేహం నీరసంగా, అనారోగ్యంగా ఉన్నప్పుడు, మనస్సులో దుఃఖం, దైన్యం ఉన్నప్పుడు యోగసాధన చేయవద్దు. అపరిశుద్ధ స్థలాన్ని ఎన్నుకోవద్దు. ఇతరుల వల్ల బాధ కలుగని రహస్య ప్రదేశానికి వెళ్ళాలి. రమణీయ స్థలాన్ని ఎన్నుకోవాలి. లేదా ఇంట్లోనే చక్కని గదిని సాధనకు ఉపయోగించాలి.

మొదట యోగులకు నమస్కరించాలి. గురువుకూ, దైవానికీ మొక్కాలి. ఆ తర్వాత సాధన మొదలుపెట్టాలి. తలపైన కొన్ని అంగుళాల ఎత్తున ఒక పద్మాన్ని ఊహించుకోండి. జ్ఞానం దాని తంతువనీ, ధర్మం దాని కర్ణిక (చివరిభాగం) అనీ తలంచండి. అష్టదళాలు అష్టసిద్ధులనీ, పరాగం త్యాగమనీ భావించండి. సిద్ధులను త్యాగం చేసి పరిపూర్ణ త్యాగాన్ని ఆశ్రయిస్తే మోక్షం లభిస్తుంది. ఓంకార స్వరూపుడు, అవాఙ్మానస గోచరుడు, సర్వేశ్వరుడైన భగవంతుణ్ణి ఆ పద్మం మధ్యలో ధ్యానించండి. లేదంటే హృదయాకాశం మధ్యలో ఒక జ్యోతి ప్రకాశిస్తూ ఉన్నట్లు భావించండి. ఆ జ్యోతిని ఆత్మగా భావించండి. ఆ జ్యోతిలో మధ్యలో దివ్యతేజస్సుతో వెలిగే కాంతిని ఊహించుకోండి. అది పరమాత్మ అనుకోండి. ఆ పరంజ్యోతిని ధ్యానించండి.

– ఆకెళ్ళ లక్ష్మీనరసమ్మ, అమెరికా

**? : రుద్రాక్షమాల 24 గంటలూ ధరించవచ్చా? పుణ్యవతి స్త్రీలు ధరించవచ్చునా?**

✍: రుద్రాక్షమాల 24 గంటలూ అందరూ ధరించవచ్చు. కానీ అది మెడ చుట్టూ మెడకు దగ్గరగా ఉండాలి. అంటే మళ్ళీ తల మీదుగా బయటకు రాకూడదు. తల దూరని విధంగా ధరించాలి. అలా కాని పక్షంలో తల దూరే పొడవు కలిగిన మాలను రాత్రి వేళ, లఘుశంక, దీర్ఘశంక వేళల్లో తీసి విడిగా పెట్టాలి. ఆ కాలకృత్యాలు అయిన తరువాత కాళ్ళు, చేతులు కడుగుకొని, పుక్కిలింతల ద్వారా నోరు శుద్ధి చేసుకొని మళ్ళీ ధరించవచ్చు. ❖



అన్నమయ్య పదామృతం

భక్తి కొలదివాడే పరమాత్ముడు
భుక్తి ముక్తి తానె యిచ్చు భువి పరమాత్ముడు ॥

పట్టినవారి చేబిడ్డ పరమాత్ముడు
బట్టబయటి ధనము పరమాత్ముడు
పట్టపగటి వెలుగు పరమాత్ముడు
ఎట్టనెదుటనే ఉన్నాడిదే పరమాత్ముడు ॥

పచ్చిపాలలోని వెన్న పరమాత్ముడు
బచ్చెనవాసిన రూపు పరమాత్ముడు
బచ్చుచేతి వొరగల్లు పరమాత్ముడు
ఇచ్చకొలదివాడుపో యీ పరమాత్ముడు ॥

పలుకులలోని తేట పరమాత్ముడు
ఫలియించు నిందరికి పరమాత్ముడు
బలిమి శ్రీవేంకటాద్రి పరమాత్ముడు
యెలమి జీవుల ప్రాణ మీ పరమాత్ముడు ॥

# భక్తి కొలది భగవంతుడు

– శ్రీమతి బి. కృష్ణకుమారి

భగవంతుడు భక్తసులభుడు... భక్తికి దాసానుదాసుడు. ఆయన లేని చోటు లేదు... ఆయన ఉదారతలో లోటు లేదు. వ్యాకులత ఉండాలే కానీ వచ్చి వాలిపోయే పరమప్రేమ మూర్తి పరమాత్ముడు. భక్తి తీవ్రతను బట్టి భగవంతుడి కరుణా కటాక్ష వీక్షణాలు ఆధారపడి ఉంటాయి. ఆ సుమధుర సత్యాన్ని శ్రీనివాసుడి సేవాగ్రగణ్యుడు అన్నమాచార్య తన **'భక్తి కొలదివాడే పరమాత్ముడు'** అన్న కీర్తనలో కమనీయంగా వర్ణిస్తున్నాడు. అందరివాడైన ఆ పరమాత్ముడు అందరాని వాడనీ, అందుబాటులో లేనివాడనీ బాధపడనక్కరలేదు. మనలోనే, మన ముందే ప్రకృతిలో, పరిసరాల్లో అణువు నుంచి అఖిలాండ బ్రహ్మాండం వరకు ఆయనే వ్యాపించి ఉన్నాడు. అలాంటి ఆ దేవదేవుడిని పరమభక్తితో ప్రత్యక్షం చేసుకున్న ఈ పదకవితా పితామహుడు, భగవంతుణ్ణి పట్టపగటి వెలుగుతో, పచ్చిపాలలోని వెన్నతో పోలుస్తున్నాడు. కొత్త, పాత అన్న తేడా లేకుండా పిలిచిన వారి దగ్గరి కల్లా పరుగు పరుగున వెళ్ళే పసిపిల్లల్లాంటివాడట ఆ పరంధాముడు! మనల్ని ఏ మాత్రమూ కష్టపెట్టకుండా కేవలం భక్తిని కనబరిస్తే చాలు కనికరించే కరుణామయుడట ఆయన!

### భుక్తి, ముక్తి తానే ఇచ్చు...

ఇహలోకంలో కాని, పరలోకంలో కాని మనకు ఏది కావలసినా పరిపూర్ణంగా ఇవ్వగలిగిన కామిత ఫలదాత ఆయన ఒక్కడే! కానీ మనం చాలా సందర్భాల్లో ఈ సత్యాన్ని మరచి ప్రతి చిన్నదానికీ సాటి మనుష్యులపైనే ఆధారపడతాం. అందుకే అన్నమయ్య ఇక్కడ **'భక్తి కొలదివాడే పరమాత్ముడు... భుక్తి, ముక్తి తానె యిచ్చు పరమాత్ముడు'** అంటూ తన పదాలను పల్లవింపజేస్తున్నాడు. ఎలాంటి వారికైనా భువిలోని భుక్తికే కాదు; దివిలోని ముక్తికి కూడా ఆ దినకరతేజుడే ఆధారమని అభయమిస్తున్నాడు. ద్వాపరయుగంలో తన చిన్ననాటి స్నేహితుడైన శ్రీకృష్ణ పరమాత్ముడి వద్దకు సహాయం కోసం వెళ్ళేందుకు కుచేలుడు సంశయించినప్పుడు ఆయన ధర్మపత్ని ఇలా అంటుంది:

**కలలోనం తను మున్నెరుంగని మహాకష్టాత్ముడైనట్టి దు
ర్బలు డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
తలపన్నంతన మెచ్చి యార్తి హరుడై తన్నైన నిచ్చున్; ముని
శ్చల భక్తిన్ భజియించు వారి కిడడే సంప ద్విశేషోన్నతుల్?**

నిజమే! కలలో కూడా తననెన్నడూ స్మరించని వాడైనా సరే విపత్కర పరిస్థితిలో ఒక్కసారి ఆ భక్తజన మందారుని పాదారవిందాలను మనసారా స్మరిస్తే చాలు, అట్టి వానిని కూడా ఆ భగవంతుడు కనికరిస్తాడు. అవసరమైతే తనను తానే అర్పించుకుంటాడు. అంతటి మహనీయుడు నిరంతరం భక్తితో తనను సేవించే వారికి సమస్త సంపదలూ ఇవ్వకుండా ఉంటాడా?

### ఎట్టనెదుటనే ఉన్నాడు...

ఆ పురాణపురుషుడు ఎంత సులభసాధ్యుడో ఇక్కడ విపులంగా వివరిస్తూ ఆ వేంకటేశుడి భక్తచింతామణి...

**పట్టినవారి చేబిడ్డ పరమాత్ముడు
బట్టబయటి ధనము పరమాత్ముడు
పట్టపగటి వెలుగు పరమాత్ముడు
ఎట్టనెదుటనే ఉన్నాడిదే పరమాత్ముడు** అంటున్నాడు.

(మిగతా 32వ పేజీలో...)

**నిజమైన భక్తుడు భగవంతునితో సన్నిహితసంబంధాన్ని ఏర్పరచుకొని 'భగవంతుడు నావాడు' అని గర్విస్తాడు. నాకు నువ్వు సాక్షాత్కరింపక తప్పదు'అని నిర్బంధిస్తాడు.** - శ్రీరామకృష్ణ పరమహంస

# వెలుగులకు వెలుగునిచ్చేది !

ఒకసారి యాజ్ఞవల్క్య మహర్షి జనక మహారాజు ఆస్థానానికి వచ్చాడు. జనకుడు మహర్షిని సముచితరీతిని సత్కరించిన తరువాత వారి మధ్య సంభాషణ ఇలా సాగింది:

జనకుడు : మహర్షీ! మనుష్యులు ఏ వెలుగువల్ల నిత్యవ్యవహారాలను కొనసాగిస్తున్నారు?

మహర్షి: రాజా! సూర్యుడి వెలుతురువల్ల మనుష్యులు నిత్య వ్యవహారాలను నిర్వహించుకొంటున్నారు. సూర్యుని వెలుగులో వెళ్ళాల్సిన ప్రదేశానికి వెళుతున్నారు. చెయ్యాలనుకున్నది చేస్తున్నారు.

జనకుడు: మహర్షీ! మరి సూర్యుడస్తమించినప్పుడో?

మహర్షి: జనకా! సూర్యాస్తమయం తర్వాత చంద్రుని వెన్నెల సహాయంతో మనుష్యులు తమ పనులన్నీ చేసుకుంటున్నారు.

జనకుడు: మహాత్మా! సూర్యచంద్రులిద్దరూ అస్తమించినప్పటి మాటేమిటి?

మహర్షి: మహారాజా! అప్పుడు అగ్నివల్ల, దీపం వల్ల సర్వకార్యాలు నిర్వర్తింపబడతాయి.

జనకుడు: మహర్షీ! సూర్యుడస్తమిస్తాడు, చంద్రుడూ అదృశ్యమైపోతాడు. అగ్ని చల్లారుతుంది. దీపం ఆరిపోతుంది. అటువంటప్పుడు ఏ వెలుగు సర్వ వ్యవహారాలకి సాయ పడుతుంది?

మహర్షి: మహారాజా! అప్పుడు వెలుగు స్థానంలో 'వాక్కు' వ్యవహారానికి దోహదం చేస్తుంది. తన చేతినే తను చూసుకోలేనంత చీకటిలో కూడా ఏదో ధ్వని వినిపిస్తే ఆ వైపుగా మనుష్యుడు సాగిపోతాడు కదా!

జనకుడు: మహర్షీ! ఆ వాక్కు కూడా లేనప్పుడు పరిస్థితి ఏమిటి?

మహర్షి: రాజా! ఈ వెలుగులన్నింటికీ వెలుగునిచ్చేదీ, సర్వకాల సర్వావస్థల్లోనూ నిత్యమూ ప్రకాశించేది 'ఆత్మజ్యోతి'. ❖

(బృహదారణ్యకోపనిషత్తు నుండి)

# కైలాసం, వైకుంఠం ఎంతెంత దూరం?



గురువు తన చుట్టూ కూర్చున్న శిష్యులను చూస్తూ 'ఇక్కడ నుండి కైలాసం ఎంత దూరం? వైకుంఠం ఎంత దూరం?' అని ప్రశ్నించాడు.

శిష్యులందరూ వెంటనే తమ బుద్ధికుశలతను ఉపయోగించి శాస్త్రప్రమాణములను సంగ్రహించి లెక్కలువేయడం మొదలుపెట్టారు.

అప్పుడు ఆ గురువు తన శిష్యుల అతిఉత్సాహాన్ని చూసి చిరునవ్వుతో 'కైలాసం చేతికందే దూరంలోనూ, వైకుంఠము పిలుపుకందే దూరములోనూ ఉన్నాయి' అని చెప్పాడు. శిష్యులు తమ గురువు మాటలు విని నివ్వెరపోయారు.



"యమధర్మరాజు మార్కండేయుని ప్రాణాలను హరించడానికి వచ్చినప్పుడు అతడు శివలింగాన్ని గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు. అప్పుడు కైలాసం నుండి శివుడు వచ్చి యమధర్మ రాజును శిక్షించి, మార్కండేయుణ్ణి రక్షించాడు. అంటే కైలాసం చేతికి అందినంత దూరంలో ఉన్నట్లే కదా!

తటాకములో మొసలి నోటికి పట్టుబడిన గజేంద్రుడు ఎలుగెత్తి 'నారాయణా' అని పిలిచాడు. వైకుంఠంలో ఉన్న ఆ శ్రీహరి వెంటనే పరుగెత్తుకుంటూ వచ్చి గజేంద్రుణ్ణి రక్షించాడు. ఆర్తితో పిలిచిన భక్తుని పిలుపు వైకుంఠానికి వినబడిందంటే, మరి వైకుంఠం పిలుపు వినిపించే అంత దూరంలో ఉన్నట్లే కదా!" అని వివరించాడు గురువు. ❖

## పండుగలు - పర్వదినాలు

### మార్చి - 2012

| | | | |
|---|---|---|---|
| 04 | ఆదివారం | : | ఏకాదశి |
| 08 | గురువారం | : | శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |
| 11 | ఆదివారం | : | స్వామి యోగానంద జయంతి |
| 18 | ఆదివారం | : | ఏకాదశి |
| 23 | శుక్రవారం | : | ఉగాది |

### ఏప్రిల్ - 2012

| | | | |
|---|---|---|---|
| 01 | ఆదివారం | : | శ్రీరామనవమి |
| 03 | మంగళవారం | : | ఏకాదశి |
| 17 | మంగళవారం | : | ఏకాదశి |
| 24 | మంగళవారం | : | అక్షయతృతీయ<br>సింహాచల స్వామి చందనోత్సవం |
| 26 | గురువారం | : | ఆదిశంకరాచార్య జయంతి |

# పరమహంస పంచసూత్ర ప్రబోధం

– స్వామి హర్షానంద

**1. ఈశ్వర దర్శనం సాక్షాత్కారశ్చ జీవనస్య లక్ష్యం ॥**

'భగవంతుని దర్శనం, సాక్షాత్కారాలే జీవిత లక్ష్యం'

హైందవ శాస్త్రాలు మోక్షమే, పునర్జన్మ రాహిత్యమే జీవిత లక్ష్యాలని పేర్కొన్నాయి. మోక్షమన్నా, సాక్షాత్కారమన్నా ఒక్కటే. భగవల్లాభానంతరమే ధనార్జనకు ప్రయత్నించాలని శ్రీరామకృష్ణులు స్పష్టంగా చెప్పారు. సాక్షాత్కారం వల్ల లాభమేమిటని ఐహిక భోగలాలసులు ప్రశ్నిస్తారు. దానికి సమాధానం రెండవ సూత్రంలో ఉంది.

**2. తద్దర్శనేన సాక్షాత్కారేణ చ సర్వం కృతం సర్వం ప్రాప్తం ॥**

'భగవంతుణ్ణి దర్శించడం వల్ల, సాక్షాత్కరించుకోవడం వల్ల సర్వం సిద్ధిస్తుంది! సర్వం ప్రాప్తిస్తుంది!'

భగవత్సాక్షాత్కారం పొందిన తరువాత అన్నీ ప్రాప్తిస్తాయి. శ్రీరామకృష్ణులు ఒక దృష్టాంతం చెప్పారు: ఇద్దరు మిత్రులు ఒక మామిడి తోటలో ప్రవేశించారు. ఒకడు మామిడి చెట్లను లెక్క పెడుతుండగా, రెండవవాడు తోట యజమానిని కలసి, ఆయనతో చెలిమి చేశాడు. యజమాని ముందుగా మధురమైన మామిడి పళ్ళు ఇచ్చి, ఆపైన తోట వివరాలు చెప్పాడు. కనుక 'యజమానిని' దర్శించడం మేలు కదా! భగవంతుణ్ణి దర్శించడానికి సాధనా మార్గాలను ఈ క్రింది సూత్రాలు వివరిస్తున్నాయి.

**3. కామకాంచనత్యాగః ప్రధానం సాధనమ్ ॥** 'కామ కాంచన త్యాగమే ప్రధాన సాధనం'

మన బంధాలన్నింటికీ కారణం దేహాత్మ బుద్ధియే అంటుంది వేదాంతం. సాధకులు ప్రతి ఒక్కరూ అరిషడ్వర్గాలైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను విడనాడాలి. కామక్రోధాలు మిగతా నాలుగింటికి కారణభూతాలు కనుక, శ్రీరామకృష్ణులు తమ బోధనలలో కామ కాంచన త్యాగాన్ని నొక్కి వక్కాణించారు. కలిని కనకంలో నివసించమని పరీక్షిత్తు మహారాజు వరం ఇచ్చినప్పుడే, శ్రీరామకృష్ణుల బోధనకు బాట వేసినట్లయింది.

**4. సత్యం చ ॥** 'సత్యము కూడా'

శాస్త్రాలన్నీ సత్యం గురించి వక్కాణిస్తాయి. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అన్నది తైత్తిరీయ ఉపనిషత్తు. సత్యం రెండు విధాలు: 1.సత్యవచనం – సత్యం పలుకుట 2. వచన సత్యం – ఇచ్చిన మాట నిలబెట్టుకోవడం.

సాధనల చరమాంకంలో శ్రీరామకృష్ణులు ధర్మం, అధర్మం మొదలైన అన్ని ద్వంద్వాలనూ జగన్మాత చరణారవిందాలకు సమర్పించారు. కానీ సత్యాసత్యాలను అర్పించలేదు. 'సత్యాన్ని అర్పిస్తే ఇక దేనిని అవలంబించి జీవించడం. కలియుగంలో సత్యమే తపస్సు' అన్నారు శ్రీరామకృష్ణులు. ఇటువంటి సాధనలు సాధారణ మనుష్యులకు కొంచెం కష్టతరం. మరి సులువైన మార్గం ఏదీ లేదా? ఉంది అన్నారు శ్రీరామకృష్ణులు.

**5. వ్యాకులతా ఏవ అపి ఈశ్వరసాక్షాత్కారః సాధ్యః ॥** 'వ్యాకులత మూలంగా కూడా భగవత్సాక్షాత్కారం సాధ్యం'

శ్రీరామకృష్ణులు చెప్పిన దృష్టాంతం: పాప బొమ్మలతో ఆడుతుంటే తల్లి గృహకృత్యాలు చక్కబెడుతుంది. బొమ్మలతో విసుగెత్తి ఏడ్చినప్పుడు తల్లి పరుగు పరుగున వస్తుంది. ఆ విధంగానే అల్ప ప్రాపంచిక విషయాలలో మునిగిన మనం జగన్మాతను మరచిపోతాం. ఆమె మాత్రం మనల్ని ఒక కంట కనిపెడుతూ ఉంటుంది.

మనకు వైరాగ్యం కలిగి, భగవంతుని కోసం విలపించినప్పుడు ఆయన దర్శనం కలుగుతుంది. ఈ విధంగా శ్రీరామకృష్ణులు సాధనల సారాన్ని చాలా సంక్షిప్తంగా చెప్పారు. ఇవి ప్రతి ఒక్కరికీ అర్థమవుతాయి. అందరికీ ఆచరణ సాధ్యం కూడా!

అనువాదం : డాక్టర్ కమల జయరావు

నిజమైన విషం ఈ జన్మలోని దేహాన్ని మాత్రమే అంతం చేస్తుంది. కానీ ఇంద్రియభోగాలనే విషం మనస్సును పాడుచేసి, మనిషిని జన్మపరంపరలో చిక్కుకునేలా చేస్తుంది. - శ్రీరామచంద్రుడు



## అర్థరహిత విషయాలు
# అనర్థదాయకం

దక్షిణేశ్వర దేవాలయ స్నాన ఘట్టం వద్ద గంగానదిలో స్నానం చెయ్యడానికి ఒక పతిత స్త్రీ వస్తూ ఉండేది. స్నానం అయిన తర్వాత శ్రీరామకృష్ణులకు దూరం నుండే తలవంచి నమస్కరించి వెళుతుండేది. అప్పుడప్పుడూ ఆమె గురుదేవులతో కొద్దిగా మాట్లాడేది కూడా! దక్షిణేశ్వర గ్రామస్థులు కొందరు ఈ విషయం గమనించి, విమర్శించడం మొదలుపెట్టారు.

ఆ విమర్శలు విన్న యోగీంద్రుడు "గురుదేవుల శీలం పరిశుద్ధమైనది. మీకు ఏమైనా అనుమానం ఉంటే, ఈ విషయం పరిశీలించి నిజం ఎందుకు తెలుసుకోరు?" అని అతడు వారిని నిలదీశాడు. అప్పుడు ఒక గ్రామస్థుడు, ఆమె వద్దకు వెళ్ళి తాము వింటున్న వదంతి నిజమా, కాదా అని విచారించాడు. అతడి మాటలు విన్న ఆ స్త్రీ విభ్రాంతికి గురి అయింది. వచ్చిన వ్యక్తితో ఆమె ఇలా చెప్పింది: "నేనెంతో సిగ్గుమాలిన జీవితాన్ని గడుపుతూ ఉండవచ్చు గాక! కానీ ఒక దివ్యపురుషుని శీలానికి మచ్చ తెచ్చేటంతటి నీచురాలిని మాత్రం కాదు. నాకు అత్యంత ప్రేమమూర్తి అయిన గురుదేవుల విషయంలో ఈ రకమైన వదంతులను ప్రచారం చెయ్యడం మహాపాపం".

ఆ వ్యక్తి తాను ఆ స్త్రీ నుంచి విన్నదంతా సాటిగ్రామస్థులకు వివరించాడు. యోగీంద్రుడు జరిగిన సంఘటనను శ్రీరామకృష్ణులకు తెలియజేశాడు. అప్పుడు గురుదేవులు అతడికి ఇలా హితవు చెప్పారు :

"తెలివితక్కువవాళ్ళు కొందరు అర్థరహితంగా మాట్లాడుతూ ఉంటారు. నువ్వు అవన్నీ ఎందుకు పట్టించుకుంటావు? లౌకికులు ఉబుసుపోక మాట్లాడే మాటలను ఎంతమాత్రం పట్టించుకోకూడదు. వాటిని పూర్తిగా ఉపేక్షించాలి. అలా ఉపేక్షించక పోతే ఆ విషయాలు సాధకుని మనస్సును భగవంతుడి నుండి ప్రాపంచిక స్థాయికి దిగజార్చే ప్రమాదం ఉంది". ❖

**(తిథి ప్రకారం మార్చి 11న శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి యోగానంద జయంతి)**



# నిత్య సత్యం

**- స్వామి రంగనాథానంద**

మనిషి శారీరక, మానసిక ఉల్లాసాలకై ధనం కాంక్షిస్తాడు. నైతిక, ఆధ్యాత్మిక విలువలు పాటించనిచో భోగవాంఛకు అంతు ఉండదు. ఒక కోరిక తీరితే, పది కోరికలు జనిస్తాయి. తీరిన కోరిక, మరొక కోరికకు జన్మనిస్తుంది. ఫలితంగా మానవుని వ్యక్తిత్వం ఛిన్నాభిన్నమవుతుంది. నీతిబాహ్యమైన వాంఛలకు తల ఒగ్గుతుంది.

యయాతి చక్రవర్తి పలుకుల్లో ఈ భావం మన మనస్సులో నాటుకొనేలా ద్యోతకమవుతుంది. ముసలితనం ముంచుకు వస్తున్నా, మనస్సు మాత్రం యౌవనవాంఛలనే కోరుతున్నది. తన వార్ధక్యాన్ని తీసుకొని, వారి యౌవనాన్ని ప్రసాదించమని తన కొడుకులందరినీ వేడుకొంటాడు. అందుకు ఎవరూ ఒప్పుకోలేదు. కానీ పితృభక్తి పరాయణుడైన కనిష్ఠుడు మాత్రం ఒప్పుకొన్నాడు. ఆ విధంగా తిరిగి యౌవనాన్ని పొందిన యయాతి భోగమయ జీవితాన్ని గడిపాడు.

ఈ విధంగా కొన్నేళ్ళు గడచిన తరువాత, మళ్ళీ ముడుతలు పడిన చర్మం, నెరసిన వెంట్రుకలు దర్శనమిచ్చాయి. మళ్ళీ ముసలితనం వచ్చింది. దాని వెంటనే మృత్యువు వస్తుందని తెలుసు. అయినా భోగలాలసత్వం తగ్గలేదని దిగులు చెందాడు. శరీరం వాడిపోయింది. సత్తువ సడలింది. కానీ మనస్సు యౌవనపు కోరికలనే కోరుతున్నది. కళ్ళకు కొట్టవచ్చే వైపరీత్యం అతణ్ణి చింతామగ్నుణ్ణి చేసింది. అప్పుడు 'కోరికలు తీర్చుకోవడం వల్ల వాంఛ ఉపశమించదు. అగ్నిలో ఆజ్యం పోసినట్లు మరింత వృద్ధి పొందుతుంది' అని అవగతం చేసుకున్నాడు యయాతి.

నేటి ఆధునిక నాగరకతలో భోగాలకు ప్రాముఖ్యం ఎక్కువ. కనుక నానాటికీ విలాస వస్తువుల ఉత్పత్తి పెరుగుతుంది. యయాతికి కలిగిన పరిస్థితి నేడు ప్రపంచమంతటా విస్తరించింది. రెండో ప్రపంచ సంగ్రామం తర్వాత అమెరికాలో జరిగిన ఆర్థిక పరివర్తనల్ని సమీక్షించిన హూవర్ కమిటీ నివేదికలో యయాతి భావాలే ప్రతిబింబిస్తున్నాయి.

'కోరికలకు అంతం లేదని ఇన్నాళ్ళు సైద్ధాంతికంగా అంగీకరించిన విషయం వాస్తవమేనని మా పరిశీలన వెల్లడి చేస్తోంది. మా పరిశీలనలో తేలినది ఏమిటంటే, ఒక కోరిక తీరగానే ఇంకొకటి పుడుతుంది. మన ఎదుట విశాలమైన ఆర్థిక రంగం ఉంది. కోరికలు ఎంత త్వరగా తీరుతాయో, అంతే త్వరగా కొత్త కోరికలు పుడుతూనే ఉంటాయి.'

నచికేతుడు 'మానవుడికి ఎంత విత్తమున్నా తృప్తి పొందడ'ని యమునితో అన్నాడు. అదుపు, హద్దు లేని ధనవ్యామోహం, భోగతృష్ణ మానవుని నిజప్రాభవాన్ని ప్రకటించవన్నది దీని అర్థం. ఆ ప్రాభవం ప్రకటితమవడానికి ఇంద్రియాలను అదుపులో పెట్టాలి. దీనిని త్యాగం అంటారు. ఇదే మతధర్మం చాటే నిత్యసత్యం. తుచ్ఛము, నశ్వరములైన వాటిని పరిత్యజించి, శాశ్వత శాంతిని పొందాలని ధర్మం బోధిస్తుంది. నిజమైన స్వేచ్ఛ, ఆనందం త్యాగం వల్లనే లభిస్తాయి. ❖

సేకరణ : ఆర్. కృష్ణ



# శ్రీరామకృష్ణ ఉద్యమంలో ఆదర్శ భక్తులు

**శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.**

## భక్తిఉద్యానంలో వికసిత కుసుమం బి.ఎస్.ఆర్.

**– డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి**

వికసించే మనస్సులో భక్తి ప్రబోధాలు అనే బీజాలు నాటితే అవి మహావృక్షాలుగా ఎదిగి నలుగురికి నీడనందిస్తాయి. శ్రీరామకృష్ణుల భక్త కుటుంబంలో బి.ఎస్.ఆర్‌గా ప్రసిద్ధి పొందిన బొద్దుపల్లి సీతారామాంజనేయులు చిన్ననాటి నుండే ఆటపాటలతో పాటు భగవన్నామ సంకీర్తనలు చేయడం వల్ల ఆయనలో భక్తిభావాలు అంకురించాయి. గుంటూరు జిల్లా బాపట్ల తాలుకా లోని వెదుళ్ళపల్లిలో 1913లో జన్మించిన బి.ఎస్.ఆర్ గారికి బాల్యం నుండే దైవభక్తి మెండు. ఆటలాడుకునే వయస్సులోనే ఆ చిన్ని మనస్సు తోటి స్నేహితులతో కలిసి 'శ్రీరామ బాలభక్త' సమాజాన్ని స్థాపించింది. సేవ ఆయన శ్వాసగా మారి నేడు పలువురికి వెలుగుబాట చూపిస్తోంది.

చిన్నతనంలోనే తండ్రి చనిపోయినా, ఆ లోటు తెలియకుండా పెంచిన తల్లిని ఆయన ఆరాధ్యదైవంగా భావించేవారు. తల్లితండ్రుల ఆలనాపాలనా పట్టించుకోని బిడ్డలకు బి.ఎస్.ఆర్ ఓ కనువిప్పు. ఎందుకంటే అంతిమదశలో ఉన్న తల్లికి ఆయన స్వయంగా అందించిన సేవలు 'మాతృదేవోభవ' అన్న పదానికి సజీవతార్కాణం. బంగారానికి తావి అద్దినట్లు బి.ఎస్.ఆర్. రామకృష్ణ భక్త కుటుంబంలో చేరడం ఆయన గుణ సంపదను ద్విగుణీకృతం చేసింది. వృత్తిరీత్యా ప్రభుత్వ వ్యవసాయ శాఖలో ఉన్నత పదవిలో ఉన్నా, ప్రవృత్తిరీత్యా తమ సమయాన్ని శ్రీరామకృష్ణ మఠ యతీంద్రుల సేవకూ, శ్రీరామకృష్ణ– వివేకానందుల భావ ప్రచారానికే వినియోగించారు. మద్రాసులో ఉద్యోగం చేసే సమయంలో ఆయనకు అక్కడి రామకృష్ణ మఠంతో ఏర్పడ్డ సంబంధ బాంధవ్యాలు ఆయనను మఠం కార్యక్రమాల్లో మమేకం చేశాయి.



హైదరాబాద్‌కు బదిలీ అయి వచ్చిన తరువాత సోదర భక్తులతో కలిసి హైదరాబాద్‌లోని మలక్‌పేటలో స్వామి వివేకానంద సెంటినరీ స్కూలు ఏర్పాటుచేసి ఎంతో మంది విద్యార్థులను తీర్చిదిద్దారు. ఈనాటికీ విద్యార్థుల విద్యా సముపార్జనకు ఈ పాఠశాల దోహదపడుతూనే ఉంది. ఉద్యోగ విరమణానంతరం రామకృష్ణ మిషన్ చేపట్టే సేవాకార్యక్రమాల్లో స్వామీజీలతో కలిసి ఓ సేవకునిగా పనిచేశారు. ప్రకాశం జిల్లా చీరాలలో, బాపట్లలోని బెస్తవారిపేటలో ప్రకృతి వైపరీత్యానికి ఛిన్నాభిన్నమైన పేదలకు రామకృష్ణ మిషన్ నిర్మించిన ఇళ్ళ నిర్మాణపు పనుల్లో నిరంతరం శ్రమించారు. 1968లో బాపట్లలో శ్రీరామకృష్ణ సేవాసమితిని స్థాపించి, దాన్ని మఠ సంప్రదాయానికి అనుగుణంగా తీర్చిదిద్దారు. బి.ఎస్.ఆర్. ఆ కాలంలో నిర్వహించిన 'బాలవిహార్' అంటే ఆయనకు ప్రాణప్రదం. అందులో చేరిన చిన్నారులకు నీతికథలు చెప్పడం, వారి చేత పాటలు, భజనలు పాడించడం ఎంతో ఉత్సాహంగా చేసేవారు. ఈనాడు శ్రీరామకృష్ణ ఉద్యమంలో సేవలందిస్తున్న స్వామి వినిశ్చలానందజీ, డా॥ పన్నాల శ్యామసుందర మూర్తి, శ్రీ డి.వి. బ్రహ్మాజీ, అమిరపు నటరాజన్, సురేశ్, నరేశ్ లాంటి ఎంతో మంది యువకులలో స్ఫూర్తి నింపినది శ్రీ బి.ఎస్.ఆర్. గారే.

బి.ఎస్.ఆర్. రచయిత కూడా. ఆయన రాసిన పుస్తకాలలో 'శ్రీశారదేశ్వరి, పుష్పాంజలి, మందార మంజరి, భారత జాతికి నా హితవు, సంఘం, ఒక కథ చెబుతా విను' పేర్కొనదగినవి. 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికలో అనేక వ్యాసాలు రాశారు. శ్రీరామకృష్ణ కథామృతంలోని గీతాలన్నింటినీ తెలుగులోకి అనువదించిన ఘనత ఆయనదే. జీవితాంతం శ్రీరామకృష్ణ ఉద్యమ వ్యాప్తికి కృషి చేసిన బి.ఎస్.ఆర్. 1996లో (83వ ఏట) తన గురువు శ్రీయతీశ్వరానంద స్వామివారి పాదముద్రికలను ధ్యానిస్తూ, శ్రీరామకృష్ణ ఆరాత్రిక గానం వింటూ శ్రీరామకృష్ణ లోకానికేగారు. ❖ **అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత**

**నా విభూతులను వినడం, చదవడం, నా గుణగణాలను కీర్తించడం, భక్తితో నన్ను పూజించడం – వీటిని ఆచరించేవారికి శుద్ధభక్తి లభిస్తుంది. అలాంటి భక్తితో మోక్షం తప్పక సిద్ధిస్తుంది.** – శ్రీరాముడు



# మానవాళికి మాతృమూర్తి

- స్వామి భాస్కరానంద

"వచ్చిన వారందరికీ, రానివారందరికీ, ఇకపై రాబోతున్న వారందరికీ, నా బిడ్డలందరికీ నా ప్రేమాభిమానాలు తెలియజెయ్యి. నా ఆశీర్వాదాలు వారికెప్పుడూ ఉంటాయి."

జగజ్జనని శారదాదేవి మాతృప్రేమతో మానవాళికి ఇచ్చిన ఆశీర్వచనాలు ఇవి. ప్రేమ ఉట్టిపడే ముఖార విందం, ఆప్యాయత తొణికిసలాడే చూపులు, పావనమైన తెల్లటి దుస్తులు, రెండు చేతులకు ధరించిన బంగారు కడియాలు - ఈ ఛాయాచిత్రం మన కళ్ళ ముందు కనపడగానే కొండంత శక్తి మన చెంతనే ఉందనిపిస్తోంది. ఈ సృష్టిలో తల్లి ప్రేమను మించినది మరొకటి లేదు. బిడ్డ సంస్కారవంతుడిగా ఎదగడానికి ఆమె తన సర్వస్వాన్నీ త్యాగం చేస్తోంది. బిడ్డ ఆనందంగా ఎదగడమే ఆమెకు నిజమైన ఆనందం. ఇది ప్రతి కన్నతల్లిలో మనం చూస్తూ ఉంటాం. ఇలాంటి అవ్యాజప్రేమను మానవాళికి చవిచూపారు శారదామాత. ఆమె దృష్టిలో పతితుడైనా, పావనుడైనా సమానమే.

తానెవరో? ఈ భువిపైకి ఎందుకు వచ్చానో అని సంశయించే వారి నేత్రాలకు అమ్మ చూపించిన దివ్య దర్శనాలు అనేకం. కటిక చీకటిలో కాంతి పుంజంలా ఈ మహిమా న్వితురాలు తన దివ్యత్వాన్ని చూపి, వారి సంశయాల కారు చీకట్లను పారద్రోలిన కొన్ని సంఘటనలు ఇవి:

స్వామి అపూర్వానంద, శారదామాత వద్ద మంత్రదీక్ష పుచ్చుకున్న సన్న్యాసి. శారదాదేవిని 'అమ్మా! అని వేడు కున్నంతనే దైవదర్శనం ప్రసాదించగల శక్తిమంతురాల'ని స్వామి అపూర్వానంద అభివర్ణించారు. మధురాను భూతిని కలిగించిన సంఘటనలను ఆయన చెప్పారు. సన్న్యాసదీక్ష తీసుకోక ముందు స్వామి అపూర్వానంద పూర్వాశ్రమ నామం క్షితీంద్ర.

యువకుడైన క్షితీంద్ర, శారదామాత వద్ద మంత్రదీక్ష తీసుకునేందుకు అమ్మ గదిలోకి వచ్చారు. మాతృదేవికి సమీపంలో కూర్చున్నారు. మంత్రదీక్ష తీసుకున్న కాసేపటికి శారదామాత గోడ వైపు చేతులు చాపి చూపిస్తూ, "చూడు! నాయనా! ఇదే నీ ఇష్టదైవం" అంటూ పలికారు. మంత్రం జపిస్తున్న క్షితీంద్ర కనులు తెరిచి చూసేసరికి ఆ తెల్ల గోడపై కళ్ళు మిరుమిట్లు గొలిపే తేజస్సు కనిపించింది. సజీవమైన దివ్య కాంతులతో కూడిన దేవీమూర్తి, క్షితీంద్ర వైపు తల్లి ప్రేమను అందిస్తున్నట్లు ప్రేమపూరిత నేత్రాలతో చూస్తోంది. ఆ సమయంలో మాతృదేవి స్వరూపం కూడా మారి పోయింది. నోట మాట రాక ఆశ్చర్యం, ఆనందంతో నిశ్చేష్టుడైన క్షితీంద్రకు ఈ దివ్యదర్శనం కొన్ని క్షణాలు మాత్రమే అగుపించింది.

కొంతసేపయ్యాక శారదామాత, "నాయనా! భయపడి పోయావా?" అని అడిగారు. తరువాత గురుదేవుల చిత్రపటాన్ని చూపించి "గురుదేవులకు ప్రణామం చెయ్యి. ఆయనే నీకు ఇష్టదైవం. ఆయనే గురువు. ఇక ఆయన పాదసన్నిధే నీకు సర్వస్వం" అని చెప్పారు. వెనువెంటనే క్షితీంద్ర, అమ్మను ఇలా అడిగారు- "అమ్మా! మరి మిమ్మల్ని ఏ విధంగా చూడాలి?"

శారదామాత అప్పుడు గురుదేవుల చిత్రపటాన్ని చూపిస్తూ, "ఆయనే నేను! నేనే ఆయన! ఇద్దరమూ ఒక్కటే!" అని చెప్పారు. ఈ సంఘటన శారదామాత దివ్యత్వానికి తార్కాణం అని అంటారు స్వామి అపూర్వానందగా మారిన క్షితీంద్ర. "ఒక్కటి మాత్రం చెప్పగలను. ఈ ప్రపంచానికి మాతృప్రేమ గొప్ప తనాన్ని తెలియజెప్పడానికి భువిపైకి వచ్చిన దివ్యమూర్తి శారదామాత" అంటారు స్వామి అపూర్వానంద.

ఈ జగత్తులోని ప్రతి ఒక్కరూ ఆ మాతృమూర్తికి బిడ్డతో సమానమే. చివరకు పతి అయిన శ్రీరామకృష్ణులు కూడా ఆమెకు బిడ్డతో సమానమే. ఎల్లలు లేని శారదామాత మాతృప్రేమకు నిదర్శనం ఈ క్రింది సంఘటన.

తూర్పు బెంగాల్ నుంచి జ్ఞాన్ అనే యువకుడు కలకత్తాను సందర్శించడానికి వచ్చాడు. అతనికి గురుదేవుల గురించి గానీ, శారదామాత గురించి గానీ అసలు ఏమీ తెలియదు. ఆ యువకుడు బేలూరు మఠంలోని స్వామి అరూపానందను

దర్శించుకున్నాడు. స్వామి అరూపానంద ఆ యువకుణ్ణి ‘ఉద్బోధన్’లో బస చేసి ఉన్న శారదామాత వద్దకు తీసుకువెళ్ళి పరిచయం చేశారు.

ఓ రోజు శారదామాత జయరామ్‌బాటీ వెళ్ళడానికి సంసిద్ధులవుతున్నారు. అప్పుడు జ్ఞాన్, ఆమె వద్దకు వెళ్ళి, తనకు మంత్రదీక్షను ప్రసాదించాల్సిందిగా కోరాడు. అందుకు అమ్మ అంగీకరించి, మంత్రదీక్షను ఒసగారు. మంత్రదీక్ష ఇచ్చిన తరువాత శారదామాత జ్ఞాన్‌కు శ్రీరామకృష్ణుల చిత్రపటం చూపిస్తూ, నమస్కారం చేయమన్నారు. జ్ఞాన్ అలా చేయడానికి ఇష్టపడలేదు. “నేనెందుకు నమస్కారం చేయాలి? ఆయనెవరో కూడా నాకు తెలియదు” అని సమాధానమిచ్చాడు. అప్పుడు శారదామాత ప్రశాంత వదనంతో, “ఆయన ప్రతిచోటా ఉంటారు. ప్రతి ఒక్కరికే కాదు, ఈ విశ్వానికే గురువు” అని చెప్పారు. జ్ఞాన్ అంగీకరించక, “ఆయన నాకు గురువు ఎలా అవుతారు? మంత్రదీక్ష ఇచ్చింది మీరు కాబట్టి, మీరే నాకు గురువు” అని వాదించాడు. “నేను గురువును కాను, నేను ప్రతి ఒక్కరికీ తల్లిని” అని శారదామాత చెప్పినా, జ్ఞాన్ ఆ మాటను కూడా అంగీకరించలేదు. “మీరు నాకు తల్లి ఎలా అవుతారు? నా తల్లి మా ఊరిలో ఉంద”ని సమాధానమిచ్చాడు.

వెంటనే శారదామాత “ఆ అమ్మను నేనే! కావాలంటే నన్ను పరిశీలనగా చూడు” అని చెప్పగానే జ్ఞాన్ ఒక్కసారిగా దిగ్భ్రాంతికి గురయ్యాడు. నిజంగానే శారదామాత తనకు జన్మనిచ్చిన తల్లిలా దర్శనమిచ్చారు. జ్ఞాన్ వెనువెంటనే శారదామాత పాదాలపై వాలిపోయాడు. “తల్లీ! నువ్వు గురువు మాత్రమే కాదు, నిజమైన తల్లివి, ప్రతి ఒక్కరికీ తల్లివి. ఈ విశ్వానికి మాతవు” అని కన్నీటి పర్యంతమయ్యాడు.

కాలాంతరంలో జ్ఞాన్ సన్న్యాస దీక్ష తీసుకుని, స్వామి జ్ఞానానంద అయ్యారు. ఈ సంఘటన ద్వారా శారదామాత మానవాళికి మాతృప్రేమను అందించడానికి వచ్చిన అవతార మూర్తిగా గోచరిస్తారు. “నేను సజ్జనులకు అమ్మను! దుర్జనులకూ అమ్మనే! పశు పక్ష్యాదులకూ, జంతువులకూ, అంతెందుకు – సమస్త జీవకోటికీ తల్లినే” అని ఆ మాతృమూర్తి అన్నారు.

దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు గురుదేవుల వద్దకు వచ్చే ఒక యువకుడు శారదామాత వద్దకు కూడా వెళుతుండేవాడు. ఆ యువకుడు కొంత అనైతిక ప్రవర్తన కలవాడు. ఇది గమనించిన గురుదేవులు ఆ యువకుణ్ణి దూరంగా ఉంచాల్సిందిగా కోరారు. అప్పుడు శారదామాత, “నావద్దకు వచ్చే బిడ్డకు మురికి పట్టి అపరిశుభ్రంగా ఉంటే, శుభ్రం చేయాల్సిన బాధ్యత తల్లిగా నాపై ఉంది” అని వినయంగా గురుదేవులకు నచ్చజెప్పారు.

మిత్ర శత్రు భేదం లేని ప్రేమశిఖరం లాంటి ఆమె సర్వులనూ ఆదుకునే మాతృమూర్తిగా విరాజిల్లారు. ఆంగ్లేయులు మన దేశాన్ని పాలిస్తున్న రోజులు. స్వాతంత్ర్యోద్యమాలను అణగ ద్రొక్కుతున్న సమయం. ఆ సందర్భంలోనూ ఆమె ఆంగ్లేయుల పట్ల మాతృప్రేమను కనబరిచేవారు. ఇలా చెప్పుకుంటూ



పోతే శారదామాత మాతృప్రేమకు తార్కాణాలు కోకొల్లలు. వాటిలో ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే.

పవిత్రమైన దేవాలయంలో దేవుని ముందు వెలిగించే ధూపపు పుల్ల కాలి బూడిద కావచ్చు. కానీ ఆ పుల్ల వెదజల్లే పరిమళం ఆ ఆలయాన్నే పరిమళభరితం చేస్తుంది. ఆ ప్రేమమయి అందించిన ‘మాతృప్రేమ’ మనందరిలోనూ, ఈ ప్రపంచంలో అడుగుపెట్టబోయే ప్రతి బిడ్డ హృదయంలోనూ పదిలంగా పాతుకుపోతుంది. అందుకేనేమో శారదామాత పలుకులు ఆ సందేశాన్ని ఇచ్చి ఉంటాయి. ❖

తెలుగుసేత: శ్రీమతి టి. ఆశాలత

మాయాబజార్

# మహాపరీక్ష

– స్వామి శితికంఠానంద

దేవేంద్రుడు కొలువుతీరి ఉన్నాడు. భూలోక వాసుల వ్యవహారాలు గీర్వాణులకు మహాసక్తిని కలిగిస్తున్నాయి. ఇలావర్తనంలో అందరూ కష్టాల కడలిని ఈదుతున్నారని వారికి బోధపడింది. నడిమిలోకంలో జీవితం రకరకాల కారణాలవలన బహుసంక్లిష్టమైనదని, ఒక బరువుగా మారిందని, ఆ బరువును మోయలేక ఆయాసపడుతున్న జనులే అధికంగా ఉన్నారని అవగతమైంది. మాయావిజృంభణని, విస్తరణను చూసి ఆశ్చర్యచకితులైనారు అమర్త్యలోక వాసులు.

**దేవేంద్రుడు:** సభాసారులను పరికిస్తూ... ఆ! విదుషుడు, దేవలుడు మనకు తెలుపుతున్న భూలోక వాసుల వార్తలు ఆసక్తికరంగా ఉన్న విషయం వాస్తవమైనప్పటికీ మనుజులు పడుతున్న బాధలు, అనుభవిస్తున్న దుఃఖాన్ని మనస్సులో ఊహించుకుంటే వళ్ళు గగుర్పొడుస్తున్నది. మార్చి నెల వచ్చింది. పిల్లలకు పరీక్షల సమయం... తలిదండ్రుల మనస్సులు భయాందోళనల మయం!

**దేవలుడు:** నిజానికి పరీక్షలు అంటూ ఏమీ లేవు దేవరా. ఉన్నదొకే పరీక్ష. మహాపరీక్ష. భగవానుడు పెడుతున్నది. అందరూ ఉత్తీర్ణులవ్వాలని సర్వేశ్వరుడి సంకల్పం. ప్రయత్నించి అందరూ దుఃఖాబ్ధిని తరించవచ్చును. పరమానందాన్ని పొందవచ్చును. విద్యార్థులు ఎదుర్కొంటున్న పరీక్షలలాగా ఇక్కడ పోటీలేదు. కాబట్టి ఒత్తిడి లేదు. ఇంతమందే ఉత్తీర్ణులవ్వాలనీ ఏమీలేదు. ఉత్తీర్ణులైతే పొందేది మహాఫలం. మాటలలో వర్ణించలేని మహానుభవం. ఇక్కడ జీవితమే బడి. సుఖదుఃఖానుభవాల ద్వారా గడించిన జ్ఞానమే నేర్చుకోవాల్సిన పాఠాలు. మనస్సును అతిక్రమించాలని తెలుసుకోవడమే ఆ జ్ఞానసారం. కొంచెం కష్టమైనా ఏదో ఒకరోజు అందరూ ఈ 'మనోనాశ పరీక్ష'లో పాల్గొని బయటపడాల్సిందే. అప్పటివరకూ నిజమైన ఆనందం మనుజులకు సుదూరం.

**తార:** దేవలా? మాట్లాడితే ఫిలాసఫిలోకి వెళ్ళిపోతున్నావు. ఒకే పరీక్ష అంటే ఏమిటో మాకు బోధపడటం లేదు.

**సురుచి:** అయ్యో తారా! ఇప్పటివరకూ మనం చర్చించుకుంటున్న విషయాల ద్వారా నీకు అర్థమవ్వాల్సింది. మనస్సునుంచి విముక్తి పొందడమే పరీక్షలో పాసవడమంటే. పరీక్ష నిర్వాహకుడు నారాయణుడు. ఈ పరీక్షలో ఉత్తీర్ణులై తమను తాము నిరూపించుకోమని మనుజులకు తెలియజేస్తున్నాడు.

**తార:** లాభం లేదు. ఇంకాస్త వివరంగా చెప్పాల్సిందే.

**దేవలుడు:** అసలు లౌకిక ప్రపంచంలో జనులు వ్రాసే పరీక్షల ప్రయోజనం ఏమిటి? ఏదో మంచి ఉపాధిని పొంది ఐశ్వర్యాన్ని సముపార్జించుకొని ఆనందంగా ఉండాలనే కదా. పరిశీలించి చూస్తే ఒక్క మానవులే కాదు, సర్వజీవుల లక్ష్యం ఆనందాన్ని పొందడమే. ఆనందాన్వేషణ లేదా సుఖాభిలాష మనుషులను వారు నిర్వహిస్తున్న అన్ని పనులకు ప్రేరేపిస్తున్నది. విశ్లేషించి చూస్తే అన్ని సంబంధాలు, ప్రయత్నాలు, సంకల్పాలు, చర్యలు, కార్యాలు... అవి ధార్మికమైనవైనా, అధార్మికమైనవైనా ఆనందం కోసమే. ఐతే మనస్సు లేదా ప్రపంచం అంటేనే సుఖదుఃఖాల మిశ్రమం; ఏ స్థానం నుంచి సుఖానుభూతి కలుగుతుందో అదే స్థానం నుంచి దుఃఖానుభూతి కూడా కలుగుతున్నది; మర్త్యలోకంలో, మాయాలోకంలో రెండూ ఒకే నాణానికి బొమ్మా బొరుసులా అవినాభావ సంబంధం కలిగి ఉన్నాయి; ఈ ప్రపంచంలో సుఖాన్ని కోరుకునేవారు దుఃఖాన్ని కూడా అదేమొత్తంలో అనుభవించాల్సి ఉంటుంది; ఇది విశ్వాన్ని సృజించిన ఈశ్వరుడు ఏర్పరిచిన నియమం. ఈ చిన్న విషయాన్ని గ్రహించటానికి మానవులకు కొన్ని జన్మలు పడుతున్నది. మనం గత సంవత్సర చర్చలో కూడా ఈ అంశాన్ని ప్రస్తావించుకున్నాం.

**సురుచి:** ఆదిదేవుడు సృష్టి రచనను అలా చేసి, సుఖదుఃఖాలకు ఆలవాలమైన మనస్సుకు ఆవలగా తనను తాను మరుగుపరచుకొని, మనస్సును దాటి వచ్చి తనను (వ్యక్తి నిజస్వరూపాన్ని) తెలుసుకొని శాశ్వతానందాన్ని పొందమని, అదే నేను మీకు పెడుతున్న పరీక్ష అని మనిషికి ప్రతి అనుభవం ద్వారా తెలియజేస్తున్నాడు. సుఖానుభవం ద్వారానూ మరియూ దుఃఖానుభవం ద్వారా కూడా ఇంకాస్త స్పష్టంగా తన బోధను వినిపిస్తున్నాడు.

**తార:** ఆగు..ఆగు.. దుఃఖానుభవంద్వారా తెలియజేస్తున్నాడన్నావు బాగుంది. బాధ మనిషిని ఆలోచింపజేస్తుంది. సత్యాన్వేషణ పరుడిగా తీర్చిదిద్దుతుంది. సుఖానుభవం ద్వారా ఇది పరీక్ష అని, మాయను దాటాలని, మనోనిర్మూలనానికి పాటుపడాలని తెలుసుకోవడం ఎలా?

**సురుచి:** అవును సుఖానుభవాలుకూడా కొద్దిసేపే కదా. వాటిలో కూడా శాశ్వతత్వం ఏమీ లేదు కదా. అవికూడా క్షణికమైనవేనని, వాటికోసం ప్రయత్నించడం కూడా విలువైన ఆయుష్షును నిరర్థకంగా క్షీణింపజేసుకోవడమేనని గ్రహించమంటున్నాడు.

**దేవలుడు:** సర్వ ప్రయత్నాలు, శక్తులు మనోనిగ్రహాన్ని పొందటానికి నియోగించాలి. ఆ ప్రయత్నం సమర్థవంతంగా చేయటానికి తోడ్పడేదే నిజమైన విద్య. మిగతాదంతా వృథా ప్రయత్నం. వ్యర్థ ప్రయాస. వృథయే చివరికి లభించే ఫలమని ఇదివరకటి సంభాషణలలో తెలుసుకున్నాం.

**సురుచి:** వస్తుప్రపంచాన్ని 'ఏర్పరిచి' మనస్సుకు ఒక బలమైన ఆకర్షణను కల్పించాడు భగవానుడు. ఆ ఆకర్షణద్వారానే అది మనుగడ కొనసాగించుకో గలిగేటట్లు చేశాడు. తాను పెట్టిన ఈ ప్రలోభానికి లొంగకుండా, మనస్సును బాహ్యప్రపంచంనుండి మరలించి తనపైనిలిపి అమరత్వాన్ని పొందమని తెలియజేస్తున్నాడు. మనిషికి ఒక **మహా పరీక్ష** పెడుతున్నాడు. ఈ పరీక్షలో ఉత్తీర్ణులైన వారు అమృతత్వాన్ని అనుభవించవచ్చును. నిజానికి అది కేవలం ఒక అనుభవం కాదు; ఒక మహాస్థితి. మాటలలో వ్యక్తంచేయలేని పరమోత్కృష్ట ఉనికి. సదా చలిస్తూ ఉండే మనస్సుతో, అనునిత్యం మారుతున్న శరీరంతో జుగుప్స కలిగించే మనుజుడి ప్రస్తుత స్థితి నేల ఐతే అది నింగి. ఇది మిణుగురు పురుగైతే అది సూర్యుడు. ఇది నీటి బిందువైతే ఆ స్థితి మహాంబుధి.

**తార:** అంటే ప్రపంచాసక్తిని విడనాడితే అనంతానందం వస్తుందా? అది రావడానికి ఎంతకాలం పడుతుంది? అది అసలు వస్తుందని ఏముంది? ఎప్పుడో ఏదో ఆనందం వస్తుందని ప్రస్తుతం ముందున్న సంతోషాన్ని పోగొట్టుకునేవారెవరన్నా ఉంటారా? మూర్ఖుడు తప్ప. అందుకని అందరూ స్థూల ప్రపంచంతో తన్మయం చెంది తమ శక్తికొలది ఉపకరణాలద్వారా, రకరకాల వస్తువుల ద్వారా సుఖాలను పొందాలని ప్రయత్నిస్తున్నారు.

అందులో తప్పేముంది? వీటికి ఐశ్వర్యం అవసరమవుతుంది. చదువులు, మార్కులు..మిగతా లౌకిక జీవిత తతంగమంతా ఆ ప్రయోజనంకోసమే!

**దేవలుడు:** నిజానికి దేహంతో మనుష్యులు పొందజూస్తున్న సుఖాలన్నీ అశాశ్వతాలు. పోనీ జీవించివున్నంత కాలం వాటిని ఆస్వాదిద్దామన్నా ప్రాపంచిక జీవితంలో ప్రతి సుఖానుభవం దుఃఖంతో కూడుకుని ఉంది. అందుకనే మనిషి మనస్సును జయించటంలో వెంటనే కృతకృత్యుడైనా, కాకపోయినా శక్తినంతా దానికే ధారపోయమనడం.

**తార:** ఈ విషయం మనుజులకు ఎందుకు అర్థం కావడం లేదు?

**సురుచి:** వివేక విచక్షణలు లేకపోవడం వలననే!

**దేవలుడు:** మనో నిగ్రహానికి పాటుపడాలి. భగవానుడు పెడుతున్న పరీక్షలో నెగ్గుకురావటానికి ప్రయత్నించటంతోనే జీవితానికి సార్థకత లభిస్తుంది.

**తార:** ఇది మరీ బాగుంది. అదేదో అంత తేలిక పరీక్ష అయితే అందరూ పరీక్షకు కూర్చునే వారే.

**సురుచి:** అందరూ వారు గ్రహించినా, గ్రహించకున్నా ఆ పరీక్షకే సిద్ధపడుతున్నారు. ప్రాపంచిక జీవితంలో విజయశిఖరాలను అధిరోహించాలంటే మనస్సును నిగ్రహించటం ద్వారానే సాధ్యం. అందుకే అందరినీ ఆ ప్రయత్నంలో నిమగ్నమవమనేది.




**దేవలుడు:** ప్రతి నాగరకతకు ఒక ఆదర్శం ఉంటుంది. భారతీయ నాగరకతకు ఈ మహోన్నత ఆదర్శాన్ని ఏర్పరచి ఋషులు, మునులు దృశ్యజగత్తు 'మాయ' అని ఒక్కపోటుతో ప్రక్కకు తోసి, మనస్సును దాటి మహాచైతన్యాన్ని చేరుకొన్నారు. మానవుడి ఔన్నత్యానికి, నిజస్వరూపానికి ఆశ్చర్యపడి అందరినీ అదే ప్రయత్నంలో నియుక్తులను చేయాలని తపించారు. ఆ తపనే మహోన్నత ధార్మిక గ్రంథ సంపదగా భారతీయులకు సంప్రాప్తించింది. కానీ ఈ రోజు భారతీయులు ఎప్పుడూ ఇంద్రియ సుఖాలను అనుభవించనట్లు ఇతర దేశాలనుంచి తమ విపణిలోకి వచ్చే ప్రతి ఆటవస్తువునూ, అనవసర వస్తువునూ, అల్ప వస్తువునూ చూసి మురిసిపోతూ కనపడిన ప్రతీ దానినీ పొందాలని పరితపిస్తున్నారు. రోజురోజుకు మనస్సుకు బానిసగా మారిపోతున్నారు. 'క్రొత్తొక వింత పాతొక రోత' అన్న సామెత చందాన ఎంత గొప్ప వస్తువైనా మూడురోజుల తర్వాత మనస్సు 'ఇందులో ఏమీ లేదు' అని ఇంకొక దానివైపుకు ప్రేరేపిస్తుంది.

**దేవలుడు:** నిజానికి మనిషిని దృశ్యజగత్తుకు బానిసచేసి నిర్వీర్యంచేయటానికి ఉపకరిస్తున్నదే వారు సృష్టించుకున్న సాంకేతిక పరిజ్ఞానం సర్వస్వం. వేద కాలం నాటి మునులు, వారు సాధించిన ఏకాగ్రతతో నేటితరం మానవుడు సృష్టించిన దానికి మించి వందరెట్లు గృహోపకరణాలను, విలాస వస్తువులను రూపొందించుకోగలవారే. కానీ వారు అలా సంకల్పించ లేదు. కారణం అవన్నీ మనిషిలో దాస్యాన్ని పెంచుతాయని, మనస్సుకు బందీని చేస్తాయని గుర్తెరిగిన వారు కనుక. అందుకనే వారు తర్వాతి తరాలవారికి మనోనిర్మూలనానికి అనేక మార్గాలను ఉపదేశించారు. జీవితమనే బడిలో పాఠాలు త్వరగా నేర్చుకొని లీలా స్వరూపుడైన భగవానుడు పెడుతున్న పరీక్షను గట్టెక్కి మనుష్యజన్మను ధన్యం చేసుకోమని ఉద్బోధించారు. అందరినీ నిత్య విద్యార్థులుగా ఉండమన్నారు. నిజమైన విద్యను గ్రహించమన్నారు. మనస్సును అధిగమించటానికి ప్రయత్నిస్తున్నవారు మాత్రమే నిజంగా జీవిస్తున్నట్లు. మిగతావారు జీవన్మృతులు అని కూడా తెలియజేశారు.

**తార:** అదే సరియైన పదం. రాత్రింబవళ్ళు మనస్సును స్థూలమైన విషయవస్తువులతో (మనిషి తాను సృష్టించుకున్న సర్వవస్తు సంపదలతో) సంలీనం చెందించటంతో మనస్సు మొద్దుబారిపోయి ఇంకా సూక్ష్మమైన పరమాత్మ 'వస్తువు'ను కనీసం లీలమాత్రంగా కూడా గుర్తించలేక పోతుంది. ధ్యానం, ప్రార్థన, సంకీర్తన, నిష్కామ కర్మలతో బుద్ధిని సూక్ష్మతరం చేసుకొని పరమార్థ వస్తువును గ్రహించిన ఆ ఋషిలెక్కడ? సదా మారుతూ ఉన్న అసత్యమైన రూపనామ జగత్తును తలపోస్తూ అదే జీవితంగా బ్రతుకుతూ, నిరంతరం తాపత్రయ ఊబిలో కూరుకుపోతున్న ఈ తరం వాసులెక్కడ? ప్రస్తుతం భూలోకంలో మనుషులను జీవిస్తున్నారనలేము. వారిది జీవితం కాదు. మరణమూ కాదు. రెండిటికీ మధ్య ఉన్నస్థితి. అందరూ ఒక యాంత్రిక చట్రంలో ఇరుక్కుపోయి ఉన్నారు. ఎక్కడ నుంచి ఎక్కడికి భారతీయ నాగరకత ప్రయాణిస్తున్నది? విద్య పేరుతో భోగవాదుల భౌతిక ప్రపంచ ఆలోచనలన్నింటినీ మునుల సంతానమైన వీరు జీర్ణించుకోవటానికి ఎన్ని అవస్థలు పడుతున్నారు? అమృతాన్ని వదిలి విషాన్ని స్వీకరిస్తున్నారుగదా!

**దేవేంద్రుడు:** పూర్తిగా ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన జాతిలా అన్ని విషయాలలో పాశ్చాత్యులను అనుకరించడం, వారి జీవన విధానాన్ని అనుసరించడం, తమ నాగరకతకు సరిపడని భావజాలాన్ని, అభివృద్ధి నమూనాను స్వీకరించి భారతీయులు తమ సమాజాన్ని దుఃఖాలయంగా మార్చుకుంటున్నారు. ప్రతి సమాజంలో కొంత మంచి ఉంటుంది. కొంత చెడు ఉంటుంది. విచక్షణతో పశ్చిమదేశాలలోని మంచిని గ్రహించి, తమ వరిష్ఠ సంస్కృతితో మేళవింపజేసి ఒక ఉత్తమ సమాజాన్ని నిర్మించి, ప్రపంచానికి భారతీయ నాగరకతను ఆదర్శంగా నిలపాలని కలలుగన్నాడు వివేకానంద స్వామి. ఆయన భావాలను గ్రహించి ముందుకు సాగితే ప్రపంచం భారతదేశం ముందు మోకరిల్లుతుందనడంలో సందేహం లేదు. ఆ ఆధునిక ఋషి అడుగు జాడలలో నడిచి పుణ్యభూమి తన పూర్వవైభవాన్ని పొందును గాక! స్వస్తి. ❖

సమాచారాన్ని ప్రోగుచేసేది నిజమైన విద్యకాదు. ప్రజ్ఞను పెంపొందించేదే విద్య. సంకల్ప శక్తిని సరైన రీతిలో, నైపుణ్యంగా ఉపయోగించేలా తీర్చిదిద్దేదే నిజమైన విద్య. - స్వామి వివేకానంద

# సం'కల్పన'... విజయ సాధన

–స్వామి బోధమయానంద

1980 ఒలింపిక్స్ సమయంలో రష్యా క్రీడాకారులకు శిక్షణనిస్తూ ఆ దేశప్రతి నిధులు ఒక ప్రయోగాన్ని చేశారు. పోటీలకు సిద్ధమవుతున్న క్రీడాకారులను నాలుగు విభాగాలుగా విభజించారు. మొదటి విభాగం వారిని పూర్తిగా, నూటికి నూరుశాతం సంప్రదాయబద్ధంగా శారీరక వ్యాయామం, తర్ఫీదుతో పోటీలకు సిద్ధం చేశారు; రెండవ వర్గం వారిని డెబ్భై అయిదు శాతం శారీరక శిక్షణతో, ఇరవై అయిదు శాతం మానసిక శిక్షణతో బరిలోకి దించారు; మూడవ విభాగం జట్టును యాభై శాతం శారీరక శిక్షణతో, యాభైశాతం మానసిక శిక్షణతో సంసిద్ధులను చేశారు; ఇక నాల్గవ విభాగం క్రీడాకారులను డెబ్భై అయిదు శాతం మనోబలానికి శిక్షణనిచ్చి, కేవలం ఇరవై అయిదుశాతమే శారీరకంగా వ్యాయామతర్ఫీదునిచ్చారు. నాలుగు జట్లు ఒలింపిక్స్‌లో పాల్గొన్నాయి. కానీ ఫలితాల్లో ఎక్కువ పతకాలను చివరి విభాగం క్రీడాకారులే గెలుచుకొని వచ్చారు. కారణం ఆ జట్టు సభ్యులు పూర్తిగా మానసికంగా తమ పోటీ ప్రణాళికలను, ఎదుటి జట్ల శక్తియుక్తులను, భవిష్యత్ విజయాన్ని స్పష్టంగా, మానసికంగా ఊహించుకోగలిగారు. వారిలోని ఆ భావనాశక్తి (Imaginative power) వారి సంపూర్ణ విజయానికి తోడ్పడింది. మిగతా పై మూడు విభాగాల్లోని క్రీడాకారుల్లో అది ప్రతిఫలించకపోవటం వలన పోటీల్లో వెనుకబడిపోయారు. మన అంతరాంతరాళాల్లో సాధించాల్సిన లక్ష్యానికి సంబంధించి భావనాశక్తితో ఒక స్పష్టమైన చిత్రపటాన్ని గీసుకోవాలి. తరువాత మానసికంగా, శారీరకంగా ఆ లక్ష్యసాధనకు కృషిచేయాలి. లేనట్లయితే మన శ్రమ గుడ్డెద్దు చేలో పడ్డట్లు నిరుపయోగమవుతుంది. స్వామి వివేకానంద 'శ్రద్ధ, నిరంతర సాధన, తదేక దీక్షతో పాటు మానసిక దారుఢ్యం, కల్పనాశక్తి, శీలబలం ఉన్నప్పుడు అనతికాలంలోనే లక్ష్యాన్ని సాధించుకోగలం' అని అంటారు

ముఖ్యంగా జీవితానికి నిర్దుష్టమైన ప్రణాళికను రచించుకునే యుక్తవయస్సులో ఎవరికి వారు తమ భవిష్యత్తుకు సంబంధించి మానసికంగా ఒక దృశ్యాన్ని ప్రత్యక్షీకరించు కోవటం(Visualization) అవసరం. ఇది కేవలం తాత్కాలిక ఉద్రేకంతో, వేరెవరో ప్రేరేపిస్తే కాకుండా పూర్తిగా స్వతంత్రంగా, స్వధర్మంగా ఉండాలి. అప్పుడే ఆ దృఢమైన భావనాపటిమ మనలోని శక్తిని ప్రజ్వలింపచేస్తుంది. అందుకే స్వామి వివేకానంద ఓ సందర్భంలో "నీలో నిద్రిస్తున్న ఆత్మను మేల్కొలుపు; అదెంత జాగృతమవుతుందో నీకే తెలుస్తుంది; అప్పుడు నీలో శక్తి, తేజస్సు, సౌశీల్యం, పవిత్రత పెల్లుబుకు తాయి" అని అంటారు. ఆ మహనీయుడి ఈ ఒక్క నినాదాన్ని మనం జీవితానికి అన్వయించుకుంటే చాలు, మనస్సు సాగుకు అనువైన మాగాణిభూమిలా కార్యదీక్షకు సిద్ధమవుతుంది. సదాలోచనలతో, సంస్కారాలతో, సానుకూల భావనలతో నిండిపోతుంది. దీనినే చర్వితచరణంగా మననం చేసుకుంటూ ఉంటుంటే; మనస్సు పొరల్లో అది ఇమిడిపోతుంది. మనస్సులో కలిగే ప్రతి ఆలోచనకు, సంకల్పానికి ఓ ప్రత్యేక ప్రకంపనం (Frequency), ప్రేరణాశక్తి ఉంటాయని తెలుసుకోవాలి. ఆ ప్రకంపనాలు, ప్రేరణాశక్తి మననే కాకుండా మన పరిసరాలను, పక్కవారిని కూడా ప్రభావితం చేస్తాయని గుర్తించాలి. అలా ఈ విశ్వంలో మనస్సు ఒక శక్తిమంతమైన ప్రసారకం(Transmitter)గా పనిచేస్తుందని మరచిపోవద్దు. దుష్ప్రభావాన్ని కలిగించే తలంపులు దానిగుండా ప్రసరిస్తే, జీవితం దారితప్పుతుంది. సానుకూల భావనలు ప్రసరింపచేస్తే సత్ఫలితాలనిస్తుంది. ఇలా మనస్సులో జనించి ప్రసరించే అనుకూల భావాలు కానీ, ప్రతికూల భావాలు కానీ వ్యక్తిని దాటుకొని, మన నిజస్థానాలను దాటుకొని లోకమంతా ప్రసరించి, సమాజాన్ని ప్రభావితం చేస్తాయి. అందుకే సంకల్పనల తీవ్రతను, పవిత్రతను బట్టే మన విజయసాధన ఆధారపడి ఉంటుంది. బాల్యం నుంచే పిల్లల్లో ఆరోగ్యకరమైన, అనుకూలమైన, ఆశాజనకమైన తలపులు మనస్సులో తొంగిచూసేట్లు తల్లితండ్రులు కూడా కృషి చేయాలి. నిరాశ పూర్వకమైన వాతావరణం నుంచి వారిని దూరంగా ఉంచాలి. ❖




# సమాజసేవతోనే ముందుకెళతా!

పాఠశాల విద్యార్థిగా 'యువసంఘర్ష్' పోటీల కోసం రామకృష్ణ మఠంలో అడుగుపెట్టిన నేను(సుశ్మిత) గతంలో కన్నా మానసికంగా శక్తివంతంగా మారానని స్పష్టంగా చెప్పగలను. నలుగురిలో నా అభిప్రాయాల్ని ధైర్యంగా చెప్పగలిగే ఆత్మవిశ్వాసం కలిగింది. అంచెలంచెలుగా జరిగిన ఈ పోటీల ఫలితంగా స్వామి వివేకానందలాంటి మహోన్నతమైన వ్యక్తి గురించి తెలుసుకునే అదృష్టం కలిగింది. వ్యక్తిగతంగా జీవితానికి సమగ్రమైన లక్ష్యాన్ని ఎంచుకునే మార్గం కనిపించింది. 'సమస్యలకు భయపడి ఎప్పటికీ వెనకడుగు వేయవద్దన్న' స్వామి వివేకానంద అనుభవంతో చెప్పిన మాటలు ఇప్పుడిప్పుడే జీవన సంఘర్షణలను చవిచూస్తున్న మాకు ఆశాదీపాల్లా దారిచూపుతాయి. దాదాపు వందేళ్ళ క్రితంనాటి ఆ మహాపురుషుడి బోధనలు ఈతరానికే కాదు, రాబోయే తరాలను కూడా ఉత్తేజితులను చేస్తా యనటంలో సందేహం లేదు. ముఖ్యంగా సాటి మనిషి కోసం స్వామీజీ తపించిన తీరును తెలుసుకున్న తరువాత భవిష్యత్తులో సమాజసేవకై ఎక్కువ కృషి చేయాలని నిర్ణయించుకున్నాను.

**గ్రామీణ అనుభవం మరచిపోలేనిది...:** ఈ పోటీల్లో పాల్గొనక ముందు రామకృష్ణ మఠంలోని 'వివేకానంద మానవ వికాస కేంద్రం' ఆధ్వర్యంలో గత సంవత్సరం మా మెరిడియన్ పాఠశాల దత్తత తీసుకున్న గ్రామంలో అక్కడి విద్యార్థులతో గడపటం నా జీవితంలోనే మరచిపోలేని అనుభూతి! వాలంటీర్‌గా ఆ కార్యక్రమాల్లో పాల్గొనడం నాకు ఎంతో సంతృప్తినిచ్చింది. ఇన్నాళ్లు ఈ నగరాల్లో మాలాంటి విద్యార్థులం ఏం కోల్పోయామో తెలిసొచ్చింది. నేనే కాదు, మా కుటుంబమంతా ఆ గ్రామీణులకు ఆత్మీయులమైపోయాం. స్వామీజీ గురించి తెలుసుకున్న తరువాత, ఆయన బోధనల్ని విన్న తరువాత ఇలాంటి కార్యక్రమాలపై నాకు మరింత ఆసక్తి పెరిగింది.

అదే విధంగా పాశ్చాత్య శాస్త్రీయతను, భారతీయ ఆధ్యాత్మిక విలువలకు జోడించి మానవాభివృద్ధికి తోడ్పడాలన్న స్వామీజీ సూచన ఇపుడిప్పుడే ఉన్నతవిద్యాభ్యాసంలోకి అడుగుపెడుతున్న మేము కొత్త దృక్పథంతో ఆలోచించేలా చేసింది. గ్రామీణ ప్రాంతాల్లో పరిస్థితుల్ని గమనించాక, అక్కడి విద్యార్థులతో కలిశాక నగరాల స్థాయిలో, గ్రామీణ విద్యార్థులకు శాస్త్రజ్ఞానం అందటం లేదనిపిస్తోంది. మరోవైపు ఇక్కడి నగరాలన్నీ చాలా వరకు పాశ్చాత్య పోకడల్లోకి వెళుతున్నాయి. దీంతో నగరాలకు, గ్రామాలకు మధ్య తేడా విపరీతంగా పెరిగిపోతోంది. ఈ ప్రభావం విద్యార్థులపై పడుతోంది.

**వేడుకల సొమ్మంతా వారికే.. :** ఈ సంవత్సరం స్వామి వివేకానంద స్ఫూర్తితో ఒక నిర్ణయం తీసుకున్నాను. ఇక నుంచి కొత్తసంవత్సరం వేడుకలకు, నా పుట్టినరోజు ఆర్భాటాలకు వెచ్చించే డబ్బంతా అనాథ బాలల కేంద్రాలకు, వృద్ధాశ్రమాలకు



విరాళంగా ఇవ్వాలని నిర్ణయించుకున్నాను. విద్యార్థినిగా నా స్థాయిలో ఇప్పటికి ఇదే సాధ్యమైనప్పటికీ, భవిష్యత్తులో ఏదైనా ఉద్యోగంలో స్థిరపడ్డాక తప్పకుండా నా సంపాదనలో కొంత ఇలాంటి సేవాకార్యక్రమాలకు కేటాయిస్తాను. ప్రధానంగా ఎలాంటి సౌకర్యాలు లేని గ్రామాల్లోని విద్యార్థులను గమనించాక, వారికి ఏదైనా చేయాలన్న తలంపు నాలో మెదిలింది. అందుకే రాబోయే రోజుల్లో అలాంటి కొద్దిమంది పిల్లలనైనా ఎలాగైనా చదివించాలని భావిస్తున్నాను. వ్యక్తిగతంగా నేను ఏ ఉద్యోగాన్ని ఎంపిక చేసుకున్నా, అది తప్పకుండా పరోక్షంగా దేశానికి సేవ చేసేదై ఉండాలని దృఢంగా నిశ్చయించుకున్నాను. ఏరోనాటికల్ ఇంజనీర్‌గా నా తొలి మజిలీ ప్రారంభమై, ఐ.ఎ.ఎస్. లక్ష్యానికి చేరుకోవాలని అనుకోవడమే కాకుండా, అందుకు నా శాయశక్తులా శ్రమిస్తున్నాను. స్వామీజీ ఆశీస్సులతో ఆ కల నెరవేరితే, నేను అనుకున్నట్లు సమాజానికి విస్తృతస్థాయిలో సేవ చేసే అవకాశం కలుగుతుందని నా నమ్మకం. ❖

**టి.కె. సుశ్మిత సుశ్రీ, 12వ తరగతి**
('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుదిపోటీ (ఫైనల్స్)కి అర్హత సాధించిన మెరిడియన్ పాఠశాల విద్యార్థిని.

**మనం సంతోషంగా ఉండటానికి సులభమైన మార్గం - ఇతరులు సంతోషంగా జీవించేందుకు తోడ్పడటమే! నిజమైన విజయానికి, సంతోషానికి ఇది ఓ గొప్ప రహస్యం.** - స్వామి వివేకానంద

సమగ్రజీవన సాఫల్యానికీ, సమున్నత సమాజనిర్మాణానికీ దోహదం చేయటంలో నేటి చదువులు ఘోరంగా విఫలమవు తున్నాయి. భారతీయ మౌలిక తత్త్వానికి దూరంగా, కేవలం నాలుగురాళ్ళు వెనకేసుకోవడానికే తప్ప, నిజమైన పౌరుడిగా ఎదిగేందుకు నేటి విద్యావ్యవస్థ ఏ మాత్రం వినియోగపడటం లేదు. ఫలితంగానే ఈనాటి యువతీయువకులు పేరుకు పట్ట భద్రులవుతున్నారు; కానీ వ్యక్తిత్వవికాసంపై పట్టుకోల్పోతున్నారు. ముఖ్యంగా రోజూవారి జీవితంలో ఏదో కొన్నిగంటల పాటు నిర్వర్తించే ఉద్యోగానికి ఉపయోగపడే కొద్ది ప్రావీణ్యం కోసం, సంపూర్ణ వ్యక్తిత్వ నిర్మాణాన్నే పణంగా పెడుతున్నారు. ఇటీవల ఓ విద్యాసదస్సులో 'భారతరత్న' డా॥ అబ్దుల్ కలామ్ ప్రసంగిస్తూ 'మనం విద్యాలయాల్లో అందిస్తున్న విద్యకీ, బయట సమాజం, ఆర్థిక వ్యవస్థ కోరుకుంటున్న నైపుణ్యాలకీ మధ్య పొంతనలేక పోవటం శోచనీయం. ఈ పరిస్థితి ఇలానే కొనసాగితే మన సామాజిక వ్యవస్థ పునాదులు కదలిపోవటం తథ్యం' అంటూ ఆందోళన వ్యక్తం చేశారు. అవును! వారన్నట్లు విద్య జ్ఞానోదయ మార్గంలో ఓ అనంత ప్రయాణం. సంకుచితత్వం, స్వార్థపరత్వం, ఈర్ష్య, ద్వేషం, శత్రుత్వాలకు తావులేని మానవతా తీరాలవైపు ఆ ప్రయాణం మనుష్యుల్ని తీసుకువెళుతుంది. అటువంటి విద్య ప్రతి ఒక్క మానవుడి జీవితాన్ని పరిపూర్ణ అఖండత్వంగా, ఉదాత్తవ్యక్తిత్వంగా, అమూల్య సంపదగా మార్చివేస్తుంది. కానీ నిజంగా మనకు అవసరమైన జీవనసౌందర్య చిత్రమేదీ నేటి మన చదువుల్లో కనిపించటం లేదు; వ్యక్తికి శోభనిచ్చే సంస్కారాలు మచ్చుకైనా అలవరచటం లేదు. ఉన్నతమైన ఆదర్శాలను, నిజమైన విజయాల మెలకువలను ఈ కాలపు చదువులు అందించలేకపోతున్నాయి. ఇలా 'విద్య' అనే వాన మన జీవన క్షేత్రానికి ఎన్నో గజాల దూరంలో కురుస్తోంది. ఇప్పటికైనా మనం మేల్కొనకపోతే, పంటచేతికొచ్చినా రాబడి రావటంలేదని గగ్గోలు పెడుతున్న పత్తిరైతుల్లా, మన పునాదిరాళ్ళైన యువతీయువకులు కూడా భవిష్యత్తులో రోడ్డెక్కి హాహాకారాలు చేయాల్సి వస్తుంది. పంట కళ్ళ ముందున్నా పెట్టుబడి రాకపోతే ఎంత నష్టమో, పట్టాలు ఉండి కూడా వ్యక్తిగత, సామాజిక సమస్యలకు వాటిలో పరిష్కారం లభించకపోతే అంతే నష్టం!



# చదువులు... సంస్కారాలు

– బి. సైదులు

**విద్య... వ్యక్తిత్వం:** నేటి వ్యవస్థలో యువతీయువకులకు డిగ్రీల్లో కొదవేమీ లేదు. కానీ అవి వారి వికాసాన్నీ, విజ్ఞానాన్నీ, విలువల్నీ ఏమాత్రం ఇనుమడింపచేయటం లేదు. అందుకే స్వామి వివేకానంద అంటారు "Education is not the amount of information that is put into your brain and runs riot there, undigested, all your life. We must have life-building, man-making, character making Education." నిజమే! విద్య అనేది జీవితకాలమంతా ఏ మాత్రం అర్థం కాకుండా, జీర్ణం కాకుండా మనస్సును కల్లోలపరచే సమాచార రాశి, కలగూర గంప కాకూడదు. మనకు కావలసినవి ఉజ్జీవనకర, ధైర్యజనక, శీలనిర్మాణ, సమర్థమైన భావనలను అందించే చదువులు. కానీ దురదృష్టవశాత్తూ ప్రాథమిక దశ నుంచి నేటి విద్యార్థులకు ఇలాంటి విజ్ఞానం అందటం లేదు. అటు వ్యవస్థలో కానీ, ఇటు కుటుంబంలో కానీ అలాంటి భావజాలాన్ని ఈతరంలో నింపే ప్రయత్నం ఎవరూ చేయటం లేదు. అందుకే వాస్తవానికి, చదివే చదువులకు ఏ మాత్రం పొందిక కుదరటం లేదు; ఆ జ్ఞానంలో మాధుర్యం రుచించటం లేదు. బాహ్యప్రపంచానికి, విద్యాలయాల్లోని సమాచార సేకరణకు సంబంధమే లేదు. దాదాపు ఇరవై ఏళ్ళ పాటు పాఠశాలలకు, కళాశాలలకు వెళ్ళి; వాటి ఫలంగా ఎం.బి.ఎ.లు, ఎం.సి.ఎ.లు, బి.టెక్.లు పూర్తిచేసి కూడా మళ్ళీ వ్యక్తిత్వ నిర్మాణం కోసం ప్రత్యేకంగా వేలరూపాయలు వెచ్చించి ప్రత్యేక శిక్షణ తరగతుల కోసం పరుగెడుతున్నారంటే, ఇన్నేళ్ళచదువులో ఎక్కడో లోపం ఉందన్నమాటే కదా!

**విద్య...విశాలత్వం:** కాలానుగుణంగా అన్ని రంగాల్లో మాదిరి విద్యారంగంలో కూడా పాశ్చాత్యప్రభావం పడి విశాలమైన మన భారతీయ జ్ఞానబోధనా మార్గం సంకుచితమైపోయింది. చాలా

వరకు మన విద్యార్థులను మూసలుగా మార్చేసి తమకంటూ ఓ స్పష్టమైన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోకుండా అడ్డుపడుతోంది. స్వతంత్రంగా ఆలోచించుకొని తమకంటూ ఓ అభిరుచిని పెంచుకొని, విశాలమైన ఈ ప్రపంచంలో తాము ఇమడగలిగే మార్గాన్ని ఎంచుకొని నిరూపించుకొనే అవకాశం లేని విద్యావ్యవస్థలో నేటితరం కొట్టుకుపోతోంది. స్వామి రంగనాథానందజీ ఇలాంటి పరిస్థితిని ముందే ఊహించి ఉపాధ్యాయులు, తల్లితండ్రులు విద్యార్థుల విషయంలో పాటించాల్సిన కొన్ని సూత్రాలను నిర్దేశించారు.

1. సుసంపన్నమైన మన వారసత్వాన్నీ, ఘన సంస్కృతినీ ఈ తరానికి గుర్తుచేయాలి; వాటికి వారు ప్రభావితులై, ఆదర్శంగా ఎదిగి, రాబోయే తరాలకు అలాంటి వారసత్వాన్ని తాము కూడా అందించాలని తపించేలా తీర్చిదిద్దాలి.

2. విద్యార్థుల్లో నిద్రాణంగా దాగి ఉన్న ప్రతిభాపాటవాలను వెలికితీసి, వ్యక్తిగా, బాధ్యతాయుతమైన పౌరుడిగా ఎదుగుతూ సమాజ ఋణం తీర్చుకునేలా సంసిద్ధులను చేయాలి.

3. నిర్భయత్వం, ముందుచూపు, సచ్ఛీలత వంటి గుణాలను పెంపొందిస్తూ, ప్రజాస్వామ్య వ్యవస్థలో భాగమై ఆ విలువల్ని ముందుకు తీసుకుపోయేలా శిక్షణనివ్వాలి.

4. ధర్మాధర్మ, ఉచితానుచిత విచక్షణలను వివరిస్తూ పరోక్షంగా వారు మానసిక ఉద్వేగాల్లో నిశ్చలంగా ఉండేలా (Emotional stability), సంతోషాన్ని, శాంతిని, సామరస్యాన్ని నలుగురితో పంచుకునేలా చూడాలి.

**విద్య... విలువలు:** రామకృష్ణమఠంలో ఆఫీసుబాయ్‌గా పనిచేసే ఓ అబ్బాయి సోదరికి బజారులో ఓ మారు ఖరీదైన సెల్‌ఫోన్ దొరికింది. పదివేల విలువైన సెల్‌ఫోన్! సాధారణంగా ఎవరికైనా వెంటనే దగ్గరే ఉంచేసుకుందామనిపిస్తుంది. కానీ ఆ యువతి ఆ ఫోన్ పోగొట్టుకున్న వ్యక్తికి ఫోన్ చేసి, ఆయన వచ్చే వరకు ఉండి, మరీ ఇచ్చేసింది. ఆమె ఏ మాత్రం చదువుకోలేదు; ఆర్థికంగా అతి సాధారణ జీవితం. అయినా క్షణం కూడా మనస్సు చలించలేదు. తనదికాని వస్తువు తనకు వద్దనుకుంది! అదీ నిజాయతీ అంటే! కానీ నేడు సమాజంలో విద్యావంతులమైన మనం ఎన్ని సార్లు ఇలా విలువల వెంట నడుస్తున్నాం. పైగా అతితెలివితేటల్ని, చౌకబారు చతురతల్ని నేర్చేసుకుంటున్నాం. గతంలో చదువురానివాళ్ళు, ఎలాంటి ఉపాధి దొరకని వాళ్ళు దొంగతనాలకు, దోపిడీలకు పాల్పడేవారు. కానీ ఈ రోజు పెద్దపెద్ద కుటుంబాలకు చెంది, ఉన్నతచదువులు చదువుకుంటున్న యువకుల్లో కూడా కొందరు అసాంఘిక కార్యకలాపాల వైపు మొగ్గుచూపుతున్నారంటే వారు విద్యాలయాలకి వెళ్ళి విలువలకు బదులు వ్యసనాలను అలవరచుకుంటున్నారని అర్థమవుతోంది. అందుకే మార్టిన్ లూథర్ కింగ్ 'Intelligence plus character - that is the goal of true education' అని అంటారు. కానీ వీధిబడి నుంచి విశ్వవిద్యాలయం దాకా ఎక్కడా విద్యార్థిలో విలువలకున్న ప్రాధాన్యాన్ని, వాటి వల్లే మనిషికి ఔన్నత్యం ప్రాప్తిస్తుందని బోధించే ప్రక్రియే కనిపించటం లేదు.

**విద్య... వివేకం:** సమాజపరంగా కాకపోయినా వ్యక్తిగతంగా, కుటుంబపరంగా కూడా నేటితరం విద్యావంతులు వివేకంగా మనలేకపోతున్నారు; ప్రశాంతంగా గడపలేకపోతున్నారు. పాతికేళ్ళ పాటు విద్యాలయాల్లో గడిపిన యువతీయువకుల్లో చాలామంది మానవసంబంధాల విషయంలో పామరుల కన్నా హీనంగా ప్రవర్తిస్తున్నారు. పైగా ఈ డిగ్రీలు, హోదాలు అణకువకు బదులు అహంకారాన్ని తెచ్చిపెడుతున్నాయి. అందుకే చాలామంది విద్యావంతులు దంపతులుగా, కుటుంబంలో సభ్యులుగా ఇమడలేకపోతున్నారు. నలుగురితో ఎలా మసలుకోవాలో, ఎదుటివారికి ఇబ్బంది కలగకుండా ఎలా నడుచుకోవాలో తెలియకపోతే మన చదువులు మనకు ఏమి నేర్పినట్లు? అందుకే రవీంద్రనాథ్ టాగూర్ 'మానసికంగా బలహీనులమై సాగిస్తున్న చదువుల వల్ల, స్పష్టతలేకపోవటం వల్ల ఎన్ని డిగ్రీలు పొందినా, పుస్తకాల గుట్టలు నమిలిమింగినా మన బుద్ధిమాత్రం వికసించటం లేదు; పరిపక్వం చెందటం లేదు! పైగా ఏ విషయాన్నైనా సమగ్రంగా అర్థం చేసుకొని, హుందాగా ముందుకు సాగే యోగ్యత లేకుండాపోతోంది. మన నమ్మకాలు, మన అభిప్రాయాలు, మన మాట, నడత, కట్టు-బొట్టు, ఆలోచనలు, ప్రవర్తన సమాజం ఆమోదించి, అభినందించే పద్ధతిలో ఉండకపోతే మన చదువులు వృథా'అని అంటారు. ❖

## ఎందుకీ పాఠాలు?



చదువుల తొలినాళ్ళ నుంచి చాలా వరకు మనం వల్లెవేస్తున్న పాఠాలు, బోధనాపద్ధతులు అసహజంగా; మన జీవనశైలికి సుదూరంగా సాగిపోతున్నాయి. ఒకప్పుడు స్వేచ్ఛగా, సరళంగా 'వానా వానా వల్లప్పా...' అంటూ మన చిన్నారులు ఎంచక్కా మన ప్రకృతిని, పరిసరాల్ని పాఠాల్లో చూసుకుంటూ ఎదిగేవారు.

నేటి బాలబాలికలకు అలాంటి అవకాశం, అదృష్టం లేకపోగా; ఇరుకిరుకు గదుల్లో కూర్చొని మూడువందల అరవై రోజులు ముసుర్లు కురిసే పరదేశీయులు రాసుకున్న 'రెయిన్, రెయిన్ గో అవే...' లాంటి రైమ్స్ పాడుకుంటున్నారు. లక్షలాది మంది పిల్లలు ఇలా 'రెయిన్, రెయిన్ గో అవే...' అంటూంటే బాలవాక్కు బ్రహ్మవాక్కులా వర్షాలెందుకు పడతాయి? ఇలా ఎన్నో మనకు అన్వయంకాని పాఠాలను చదువుకుంటూ ఉన్నాం; మనమేంటో మనకే తెలియకుండా పోతున్నాం. ❖

పాశ్చాత్య విద్య ప్రభావంవల్ల సౌశీల్యం కనుమరుగైపోయింది. పిల్లల్లో వినయ విధేయతలు లుప్తమైపోయాయి. మనం విధేయతను అలవరచుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. -స్వామి వివేకానంద



# మహిళల్ని గౌరవించడంలో మన స్థానమెక్కడ?



– శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

కొన్నాళ్ళ క్రితం మహిళా సమస్యలపై జరిగిన ఒక సదస్సుకు అతిథిగా హాజరయ్యాను. అంతర్జాతీయంగా మహిళల స్థితిగతులు, వారి ప్రాధాన్యం తదితర అంశాలపై ఆ సదస్సులో ఎంతో మంది దేశవిదేశాల ప్రతినిధులు తమ అమూల్య అభిప్రాయాల్ని అక్కడ వెల్లడించారు. చర్చలో పాల్గొన్న ఒక వక్త చాలా ఆసక్తికరమైన సమాచారంతో ఒక నివేదికను చదివి వినిపించారు. అంతర్జాతీయంగా మహిళలు ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా పొందుతున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంబంధించిన కీలకమైన పరిశోధన అంశాల్ని చర్చించారు.

భద్రత, సంక్షేమం తదితర విభాగాల్లో స్త్రీలకు ప్రాధాన్యాన్ని ఇస్తున్న దేశాల జాబితాతో కూడిన సమాచారాన్ని ప్రతినిధి సభ ముందు ఉంచారు. మహిళలను గౌరవిస్తూ, వారి సముద్ధరణకు సహకరిస్తున్న దేశాల పేర్లు జాబితాలో అగ్రభాగాన ఉండగా, మహిళలకు సాధికారత కల్పించడంలో వెనుకబడిన దేశాల పేర్లు అడుగున ఉన్నాయి. నేను మన దేశం పేరు పట్టికలో ముందు వరుసలోనో, కనీసం మధ్యలో ఎక్కడో ఉంటుందని ఊహించాను. కానీ బాధాకరంగా భారతదేశం పేరు జాబితాలో అట్టడుగు నుంచి రెండోస్థానంలో ఉంది. మన కంటే వెనుకబడిన దేశం ఒకే ఒక్కటుంది. ఊహించని చేదునిజం తెలుసుకొని ఆశ్చర్యపోయాను.

స్త్రీ సంక్షేమానికి పాటుపడుతున్న మొదటి మూడు దేశాలేవో తెలుసుకోవాలనిపించింది. ఏ అమెరికానో, ఇంగ్లండో అగ్ర స్థానంలో ఉంటాయనుకున్నాను. మళ్ళీ నా అంచనాలు తారుమారయ్యాయి. అనూహ్యంగా ఆ మూడు అగ్రదేశాలు స్కాండినేవియన్ దేశాలే! అంటే – స్వీడన్, నార్వే, డెన్మార్క్. సదస్సుకు హాజరైన ప్రతినిధులమంతా విస్తుపోయాం. యూరప్‌లో ఎక్కడో ఓ మూలన ఉన్న అంత చిన్న దేశాలు మహిళలకు అత్యంత గౌరవం ఇచ్చే దేశాలని తెలిస్తే ఆశ్చర్యం కలగదా మరి!

స్వీడన్ రాజకుటుంబంలో చట్టప్రకారం స్త్రీయా, పురుషుడా అన్న దానితో నిమిత్తం లేకుండా, వారి ప్రథమ సంతానానికే వారసత్వ అధికారం సంక్రమిస్తుంది. నేటికీ ఆ దేశంలో అదే చట్టం వర్తిస్తుంది. ఇక నార్వే, డెన్మార్క్‌లలో కూడా అదే స్థాయిలో మహిళలకు గౌరవం లభిస్తుంది. ఆ యా దేశాల్లో మహిళల పట్ల వివక్ష ప్రదర్శించడం చట్టప్రకారం నేరం.

నేనొకసారి వ్యక్తిగతమైన పని మీద స్వీడన్ వెళ్ళాల్సి వచ్చింది. అందులో భాగంగా ఆ దేశరాజధాని స్టాక్‌హోమ్‌లో బస చేశాను. ఒకరోజు అక్కడ రాత్రిపూట హోటల్‌కు చేరుకోవడం ఆలస్యమైపోయింది. చీకటి పడేసరికి హోటల్‌కు చాలా దూరంలో ఉండడం వల్ల, టాక్సీలో ప్రయాణించాల్సి వచ్చింది. హోటల్‌కు టాక్సీ ఛార్జీ 40 క్రోనాలు అవుతుంది. అయితే చాలా రాత్రి అయింది కనుక టాక్సీ డ్రైవర్ రెట్టింపు ఛార్జి వసూలు చేస్తాడనుకొని 100 క్రోనాల నోటు ఇచ్చి, చిల్లర కోసం ఆగాను. అతను 80 క్రోనాలు తిరిగిఇచ్చాడు.

పొరపాటుగా ఇచ్చాడనుకొని, కారణమడిగాను. 'మీరు రాత్రి ఆలస్యంగా ప్రయాణిస్తున్న మహిళ కదా! అందువల్ల అసలు ఛార్జీలో సగమే తీసుకుంటాం. ఇది మా దేశ నియమం' అని చెప్పాడు. ఆ దేశ సంప్రదాయాన్నీ, స్త్రీలకు ఇచ్చే గౌరవాన్నీ తలచుకొని కదిలిపోయాను. మనదేశంలో అయితే చీకటిపడ్డాక ప్రయాణం చేయడానికే సాహసించేదాన్ని కాదు. ఒకవేళ ప్రయాణిస్తే టాక్సీడ్రైవర్ అసలు ఛార్జీకి కొన్ని రెట్లు ఎక్కువ సొమ్ము వసూలు చేస్తాడనడంలో సందేహం లేదు.

మనం వేదికల మీద మహిళలకు సంబంధించి పెద్ద పెద్ద ఉపన్యాసాలిస్తూ ఉంటాం. దేవతలను పూజిస్తూ ఉంటాం. మన రాజ్యాంగంలో పురుషులతో పాటు మహిళలకు సమాన హక్కులు న్నాయని గర్వంగా చెబుతూ ఉంటాం. అయితే వాస్తవంగా మన దేశంలో మహిళలకు తమ భద్రతపై భరోసా ఉందా? 'యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః' లాంటి పవిత్రమైన శ్లోకాలు వల్లిస్తూ, స్త్రీలు పూజలందుకునే చోటు దేవతలకు నిలయమవుతుందని చదువుకుంటాం. కానీ ఆచరణలో తద్విరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉంటాం. మనం కేవలం అలాంటి మంచి మాటల్ని వల్లిస్తూ ఉంటాం; స్కాండినేవియన్ వంటి దేశాలు ఆచరిస్తాయి! అదే తేడా! ❖ సేకరణ : జి. సతీష్

(మార్చి 8, గురువారం – అంతర్జాతీయ మహిళా దినోత్సవం)



## శ్రీరామకృష్ణుల నీతికథామార్గంలో
# వ్యక్తిత్వ వికాసం

-డాక్టర్ సుమితారాయ్

## మనోయంత్రానికి నియంత్రణ

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస బోధనలన్నీ అటు ఆధ్యాత్మికోన్నతికే కాక, నిత్యజీవన వికాసానికి కూడా దీపాలై వెలుగుచూపిస్తాయనడంలో సందేహం లేదు. ఆ గురుదేవులు ఎంతటి సంక్లిష్ట భావజాలాన్నైనా, సరళంగా నీతికథల రూపంలో వివరించి, విశ్లేషించేవారు. అలా మనస్సు చేసే మాయాజాలంతో మనిషి ఎలా తన పతనాన్ని తనే కొనితెచ్చుకుంటాడో ఒక మారు సోదాహరణంగా వివరించారు ఆ అవతార పురుషులు. మనస్సు కోరే గొంతెమ్మ కోరికలకు మనిషి లొంగిపోతే, విపరీత పరిణామాలకు దారితీస్తుంది. మిత్రుడిగా, శ్రేయోభిలాషిగా ఉండాల్సిన మనస్సుకు సరైన శిక్షణనివ్వకపోతే అదే మనకు పరమశత్రువై నాశనం చేస్తుంది. నిజానికి మన జీవితానికి సంబంధించిన విజయ వైఫల్యాలన్నీ మనస్సుకు ఏ విధంగా శిక్షణనిచ్చామన్న విషయంపైనే ఆధారపడి ఉంటాయి. ఈ పరమ సత్యాన్ని పరమహంస కథగా చెప్పి, మనల్ని సున్నితంగా హెచ్చరించారు.

గంటల తరబడి ప్రయాణించి, ప్రయాణించి అలసిపోయిన ఓ బాటసారి నిలువనీడ లేక విలవిల్లాడిపోతున్నాడు. నడినెత్తిన సూరీడు. దాహంతో నోరు ఎండిపోతోంది. ఎడారి లాంటి మైదానంలో చివరకు ఓ చెట్టు కనిపించి, బ్రతుకు జీవుడా అనుకుంటూ దాని నీడన చతికిలపడ్డాడు. 'అబ్బా! ఎంత అలసిపోయాను. ఇప్పుడు మంచి భోజనం లభిస్తే, ఎంత బాగుంటుంది' అనుకున్నాడు. అనుకున్నట్లే పంచభక్ష్య పరమాన్నాలతో కూడిన భోజనం అతని ముందు ప్రత్యక్షమైంది.

'ఇప్పుడు ఒక చక్కని పరుపు, మంచం ఉంటే ఎంత బాగుండు! ఎంచక్కా నిద్ర పోయేవాణ్ణి' అనుకున్నాడు. ఆశ్చర్యంగా వెంటనే చక్కని మంచం ప్రత్యక్షమైంది. ఆ బాటసారి ఆనందానికి అవధులు లేకుండా పోయింది. ఇక మనస్సు పరిపరివిధాల పరుగెత్తడం ప్రారంభించింది. ఎంచక్కా మంచంపై పడుకున్న బాటసారి మనస్సు ఆశలు తొడగడం ప్రారంభించింది. 'భలే! భలే! ఇదే వేళ అందమైన యువతి వచ్చి నాకు సపర్యలు చేస్తే ఎంత బావుంటుంది' అనుకున్నాడు. అద్భుతం! వెంటనే పదహారేళ్ళ అందమైన అమ్మాయి, ఆ బాటసారి పాదాల దగ్గర ప్రత్యక్షమై కాళ్ళు పట్టి సపర్యలు చేయడం ఆరంభించింది. ఆ బాటసారి ఆనందానికి అంతే లేదిక! ఇంకేముంది, తాను ఏమనుకుంటే అవి తీరిపోతున్నాయని ఉబ్బితబ్బిబ్బైపోయాడు ఆ అమాయక జీవి.

అనూహ్యంగా సంభవిస్తున్న ఈ వింతలను చూసి, ఆ బాటసారి మనస్సులో మరో సందేహం కలిగింది. 'అవును! ఇంత వరకు బాగానే ఉంది కానీ, ఈ నిర్జన ప్రదేశంలో అకస్మాత్తుగా ఓ పులి వస్తే నా పరిస్థితి ఏం కాను?'అని అనుకున్నాడు. అంతే! ఎక్కడి నుంచి వచ్చిందో, ఓ పులి రానే వచ్చింది. ఆ అభాగ్యుడిపై పంజా విసరడం, రక్తం తాగడం క్షణాల్లో జరిగిపోయింది.



ఇలా మనస్సును యథేచ్ఛగా స్వైరవిహారం చేయిస్తే పరిస్థితులు ఎక్కడికి దారి తీస్తాయో ఈ బాటసారి కథలో శ్రీరామకృష్ణ పరమహంస సుందరంగా ఉదాహరించారు.

మనస్సును సరైన దిశలో పయనింపజేస్తే అసాధ్యాలను సుసాధ్యం చేస్తుంది. కానీ దానికి దిశానిర్దేశం చేయడంలో మన వివేకం, విజ్ఞతను ఉపయోగించకపోతే, కళ్ళాలు లేక అదుపుతప్పిన అశ్వంలా పరుగెడుతుంది. ఆధునిక మానసిక విశ్లేషకులు, వ్యక్తిత్వ వికాస నిపుణులు తరచూ ఉటంకించే Mind management, Mind maping అంశాలపై ఆనాడే శ్రీరామకృష్ణులు, దివ్యజనని శారదామాత అద్భుతమైన సూచనలిచ్చారు. మనస్సుపైనే సమస్తమూ ఆధారపడి ఉన్నాయని స్పష్టం చేశారు. ప్రాథమికంగా మనస్సుకు సకారాత్మకమైన, ఆరోగ్యకరమైన రీతిలో శిక్షణనిస్తే అది నిరంతరం మన అదుపులోనే ఉంటూ, మన పురోగమనానికి సహకరిస్తుంది. ❖

వశం చేసుకోవడానికి కష్టమైనదీ, ఇష్టానుసారం పరుగులు తీసేదీ, సూక్ష్మమైనదీ, అత్యంత వేగంగా పయనించేదీ అయిన చిత్తాన్ని నిగ్రహించుట శ్రేయస్కరం. అలాంటి చిత్తం సౌఖ్యహేతువు. - బుద్ధుడు



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

17-04-1933

**ప్రియమైన నరేశ్!***

నీవు పదేపదే గుర్తొస్తున్నావు. నీ జీవితం నాకు ఒక చక్కని పాఠం. ఈ శరీరం ఒక పీడకల లాంటిదనే జ్ఞానం మనకు పుష్కలంగా ఉన్నా, ఆ కలను చెదరగొట్టడానికి తగిన ప్రయత్నం చెయ్యలేకపోతున్నాం. ఈ భావాన్ని ఛాందోగ్య ఉపనిషత్తులో...

**'అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః** – శరీరభావం లేనివాణ్ణి సుఖదుఃఖాలు తాకజాలవు' అని స్పష్టంగా వివరించారు.

శరీరం యొక్క అస్తిత్వం వల్లనే మనకు ఈ ప్రపంచం అనుభవానికి వచ్చి బాధపడుతున్నాం. శరీరమే లేనప్పుడు ప్రపంచమే ఉండదు. బాధా ఉండదు. నిజానికి శరీరం ఉన్నా నిస్సంశయంగా నేను ఆత్మను, దేహాన్ని కాను అని భావించాలి.

ఈ శరీర భావం నుండి అతీతంగా ఉండేందుకు కొన్ని మార్గాలున్నాయి.

1) ఒక వ్యక్తి పట్ల గాఢమైన ప్రేమను నిరంతరంగా ఉంచుకోగలిగితే, శరీర స్పృహ తొలగిపోతుంది. అయితే ఇక్కడ 'వ్యక్తి' అన్నదాన్ని 'గురువు', 'ఇష్టదైవం' అని అర్థం చేసుకోవాలి.

2) శరీరం, మనస్సు, బుద్ధి, సంతోషం, దుఃఖం – ఇవన్నీ మనస్సు చేసే మాయలు మాత్రమే. నిజానికి ఉన్నది నేను మాత్రమే. 'నేను ఆత్మను'. ఈ విధమైన జ్ఞానం, విచక్షణల వల్ల శరీరభావం తొలగిపోతుంది.

3) యోగసాధన చేసినప్పుడు కూడా దేహభావన తొలగిపోతుంది. మనస్సంతా పూర్తిగా ఒక జ్యోతిపై గానీ, వేరేదైనా భగవంతుని రూపంపైన గానీ కేంద్రీకృతం చేస్తే, దేహం ఉన్నదన్న భావన తొలగిపోతుంది.

4) అన్నిటికన్నా చాలా సహజమైన పద్ధతి, అందరూ సాధన చేయగలిగినది కర్మయోగం. మనస్సులో ఏ విధమైన ప్రతిఫలాపేక్ష లేకుండా పని చేయడమూ, భగవంతుని చేతిలోని పరికరంగా మనల్ని మనం భావించుకుని పని చేయడమే కర్మయోగం. అన్ని పనులనూ బంధరహితంగా, కోరికలు లేని స్థితినే గమ్యంగా భావించి పనిచేయడమే కర్మయోగపు అత్యున్నత ఆదర్శం.

ఈ ధోరణిని నీవు ఏ కొంచెమైనా అలవాటు చేసుకుంటే, ఇక నాకు నీ గురించి ఆందోళన ఉండదు. నీవు మహాపురుష్ మహరాజ్ (స్వామి శివానంద) వారి శిష్యుడవు. ఆయన సాక్షాత్తూ ఈశ్వరుడే. ఆయన సంభాషణ, కదలికలు, ప్రవర్తన, శీలం, కంటి చూపులు – అన్నీ నిజంగా పరమశివుణ్ణి పోలివుంటాయి. నీవు అలాంటి వ్యక్తి పాదాల వద్ద శరణు పొంది కూడా ఎందుకు అనవసరమైన ఆందోళన చెందుతావు?

నీవు కొంత ప్రారబ్ధ కర్మను అనుభవించడానికి పుట్టావు. దాన్ని అనుభవించి తీరాల్సిందే గనుక యోధునిలా ధైర్యంగా నిలబడి దాన్ని అనుభవించు. మరుజన్మలోని నీ మంగళరూపం నా కళ్ళ ముందు కదలాడుతోంది. ప్రశాంతంగా దైవలీలను గమనించు. 'ఓర్పు'ను నేర్పడమే భగవంతుని సంకల్పం. విశ్వకవి రవీంద్రుడు ఒక గీతంలో ఇలా అంటాడు – "ఓ ప్రభూ! ప్రతి సందర్భంలోనూ నన్నొక యాచకుణ్ణి చేసి నా అహాన్ని అణగద్రొక్కావు". గతంలో నీవు మఠానికి వచ్చినప్పుడు ఎంతో దయనీయ స్థితిలో ఉండి కూడా మనసారా నవ్వావు. అది నాకెంతో ఆనందాన్నిచ్చింది. కష్టాలు, కడగండ్లు ఎల్లకాలం ఉండవు.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(*నరేశ్ చంద్రపాల్ తన విద్యాభ్యాసపు రోజుల నుండీ స్వామి ప్రేమేశానందకు పరిచితుడు. డెహ్రాడూన్ పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేశారు.)

**ఈ దేహం వ్యాధిగ్రస్థమయ్యేదాకా కాలునొప్పి, కడుపునొప్పి అంటూ సమయాన్ని వృథా చేయకుండా, లక్ష్యాన్ని చేరుకోవడానికి చేసే కృషిలో తలమునకలవడమే ఉత్తముని లక్షణం. - బెర్నార్డ్ షా**

(...15వ పేజీ తరువాయి)

ఎత్తుకున్న వారి చేతిబిడ్డ వంటివాడట ఆ త్రివిక్రముడు. తెలిసిన వారా, తెలియని వారా అన్న తేడా లేకుండా పిలిచిన వారి దగ్గర కల్లా వెళ్ళే పసిపాపలా ఆయన అందరినీ తనవారి లాగానే భావిస్తాడని ఈ భాగవతోత్తముడు అభివర్ణిస్తున్నాడు. అలాగే, పరమాత్ముడు పుచ్చినిధిలా బహు కష్టంగా లభించే ఫలం కాదనీ, బలి, పూజ వంటి సాధనాలేవీ అవసరం లేకుండా, సులభంగా కళ్ళ ముందే కనిపిస్తూ, అందుబాటులో ఉండే సంపద లాంటివాడనీ వివరిస్తున్నాడు. రాత్రి వెలుగులా మసక మసకగా కాకుండా, పట్టపగటి వెలుగులా ఆయన చాలా స్పష్టంగా కనిపిస్తాడని అన్నమాచార్యులు అనుభూతితోనే కాదు, అనుభవంతో చెబుతూ ఆయన ఎట్టనెదుటనే


పట్టినవారి చేబిడ్డ పరమాత్ముడు

ఉన్నాడని ఎరుకపరుస్తున్నాడు. ఇదే భావాన్ని 'ఈశావాస్యోపనిషత్తు' కూడా చెబుతోంది. భగవంతుణ్ణి, ఆత్మస్వరూపానికి అన్వయిస్తూ...

**తదేజతి తన్నైజతి, తద్దూరే తద్వంతికే ।**
**తదంతరస్య సర్వస్య, తదు సర్వస్యాస్య బాహ్యతః ॥**

అంటోంది. చలనంలోనూ ఉన్నాడు; అచలనంలోనూ ఉన్నాడు. దూరాన ఉన్నదీ ఆయనే! సమీపాన ఉన్నదీ ఆయనే! చివరకు అంతరాంతరాళాల్లోనూ ఆయనే! వెలుపలా ఆయనే!

### ఇచ్చ కొలది వాడు....

శరణాగతితో ఆయనపై విశ్వాసం పెంచుకోవాలే కానీ, భగవంతుడు భక్తుడి కోసం ఏం చేయడానికైనా సిద్ధపడతాడు. అంతటి దయాళువు ఆయన! పాలు కాచి, తోడు పెట్టి, మరెంతో శ్రమకోర్చితే కాని మనం వెన్నను పొందలేం. కానీ ఆ విధాత మనల్ని ఆ మాత్రం శ్రమ కూడా పెట్టకుండా పచ్చి పాలలో దేవినంతనే చేతికబ్బే నవనీతం లాంటివాడని నీరాజనాలర్పిస్తూ అన్నమయ్య...

**పచ్చిపాలలోని వెన్న పరమాత్ముడు**
**బచ్చెనవాసిన రూపు పరమాత్ముడు**
**బచ్చుచేతి వొరగల్లు పరమాత్ముడు**
**ఇచ్చకొలదివాడుపో యీ పరమాత్ముడు...** అంటున్నాడు.

ఇతరులు వన్నె వేస్తే వచ్చిన సుందరరూపం కాదట ఆయనది! స్వతహాగానే అబ్బిన సౌందర్యమంటూ బచ్చెనవాసిన రూపు అంటున్నాడు. అంటే స్వతస్సుందరమైన వర్చస్సు భగవంతుడిది. బచ్చెన అంటే పూత! అలాంటి పైపై పూతలు, మెరుగులు అక్కర లేని సహజ సౌందర్యం పరమాత్ముడిది. అలాగే 'బచ్చు చేతి వొరగల్లు' ఆ పరంధాముడు. బచ్చు అంటే స్వర్ణకారుడు. బంగారం, వెండి నాణాల నాణ్యాన్ని, విలువను తెలిపే ఒరిపిడిరాయి – ఒరగల్లు. ఆ భగవానుడు కూడా అలా భక్తుడికి ఈ లోకం విలువేంటో స్పష్టంగా చెప్పే ఒరగల్లు లాంటివాడని పోలుస్తున్నాడు పదామృతదాత అన్నమయ్య. భక్తుడి ఇష్టాన్ని బట్టి ప్రసన్నమయ్యే ఇచ్చ కొలది వాడు ఆ పరమాత్ముడని గుర్తుచేస్తున్నాడు.

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఓ మారు ఆ భక్తరక్షకుడి వైభవాన్ని వివరిస్తూ, "భక్తుడి ముందు భగవంతుడు చిన్నవాడై పోతాడు. అది తొలిసంజ సూర్యుడి మాదిరి. ఆ సూర్యుణ్ణి సులభంగా చూడగలం. కళ్ళకు మిరుమిట్లు గొల్పదు, అంతేకాక కంటికి తృప్తిగానూ ఉంటుంది. భక్తుడి కోసం భగవంతుడు కోమలస్వభావుడవుతాడు. తన మహిమలను ఆవలకు నెట్టి భక్తుడి ముందు ప్రత్యక్షమవుతాడు" అన్నారు.

### జీవుల ప్రాణమీతడు...

మాటల్లోని మాధుర్యమంతా ఆ మాధవుడేనని ఈ భక్తాగ్రేసరుడు భావిస్తున్నాడు. వారికీ, వీరికీ అన్న తేడా లేకుండా ఎవరికి ఏ ఫలం కావాలన్నా ఇచ్చే విశాల హృదయుడని విదితపరుస్తున్నాడు. అంతటి ఆ విరాట్ స్వరూపుడు వేంకటాద్రిపై కొలువుతీరి సకలజీవుల ప్రాణమై మెలగుతున్నాడని పొంగిపోతూ...

**పలుకులలోని తేట పరమాత్ముడు**
**ఫలియించు నిందరికి పరమాత్ముడు**
**బలిమి శ్రీవేంకటాద్రి పరమాత్ముడు**
**యెలమి జీవులప్రాణ మీ పరమాత్ముడు...** అంటున్నాడు.

పలుకులలోని తేటతీయదనమంతా ఆ పురాణ పురుషుడేననీ, పదాలు ఎన్ని అర్థాలు చెప్పినా, అన్నింటి సారమూ ఆయనేననీ స్పష్టం చేస్తున్నాడు. అలా సకల శక్తిమంతుడై, సర్వజీవులపై ప్రేమతో కలియుగాన తిరుమల కొండపై వేంకటేశుడిగా వెలసి వరాలు కురిపిస్తున్నాడు. 'బలిమి' అంటే శక్తి; 'ఎలమి' అంటే ప్రేమ! శ్రీమద్భగవద్గీతలో (10.41) శ్రీకృష్ణభగవానుడు కూడా

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్ ॥**

అంటూ 'సృష్టిలోని అన్నింటిలో తన తేజో అంశం వల్లనే అసాధారణమైన తేజస్సు, శక్తి, ఐశ్వర్యం ప్రకటితమవుతున్నాయ'ని వెల్లడించాడు. ❖

# యువవాణి

నవతరం సందేహాలకు సమాధానాలు

– స్వామి పరిజ్ఞేయానంద

ప్రియాంక, గుంటూరు.

ప్రశ్న: **నేను ఇంటర్మీడియట్ చదువుతున్నాను. నాకు 80% కన్నా తక్కువ మార్కులు ఎప్పుడూ రాలేదు. కానీ ఈ సంవత్సరం తక్కువ మార్కులు వచ్చాయి. కాబట్టి మా అమ్మానాన్న కోప్పడుతున్నారు. నాతో మాట్లాడడం లేదు. అందువల్ల మనస్సు చాలా బాధగా ఉంది. చనిపోవాలనిపిస్తుంది. ఈ నిరాశ నుండి బయటపడాలంటే నేనేం చేయాలో సూచించండి.**

**జవాబు:** "మన సుఖసంతోషాల కోసం మనకు అవసరమైనవన్నీ సమకూర్చి మనపై ఎనలేని కరుణను కురిపించేవారు తల్లితండ్రులు; జీవితంలో బాగా చదువుకొని, ఉన్నతంగా ఎదగాలన్న ఆశతో వారు మనల్ని కోపగించుకోవడంలో తప్పేముంది? లాలించే చేతులకు దండించే అధికారం ఉండదా?"అని ఒకసారి సానుకూలంగా, ప్రశాంతంగా ఆలోచించాలి. అప్పుడు మనస్సు నుండి బాధ తొలగిపోతుంది. జీవితాన్ని అంతం చేసుకోవాలనుకొనే ఆవేశం చల్లారి, లక్ష్యాన్ని సాధించే ఆలోచన చిగురిస్తుంది.

## నిరాశల మధ్య చిగురించిన ఆశ



జీవితంలో మనం ఆశించినదాన్ని సాధించి అందరినీ ఆనంద పరచడానికి ప్రయత్నించడం 'ధీరత్వం'. అంతేగాని నిరాశకుగురై ఆత్మహత్యలకు పాల్పడి మన ఆప్తులను దుఃఖసముద్రంలో ముంచడం 'దీనత్వం'.

"Be not afraid. Think not how many times you fail. Never mind. Go forward; assert yourself again and again, and light must come. *- Swami Vivekananda*

అపజయాలకు భయపడకుండా, ఆశించిన ఫలితాన్ని పొందలేదని నిరాశ చెందకుండా పట్టుదలతో ప్రయత్నిస్తే నిరాశనే చీకటి కమ్ముకున్న మీ మనస్సులోకి ఆశాకిరణాలు ప్రసరిస్తాయి. "నిజాయతీతో కూడిన కృషి, ఓర్పుతో కూడిన పట్టుదల ఉండడం విజయానికి సంకేతాలు" అని అంటారు స్వామి వివేకానంద.

శరీరం నీరసపడితే ఆహారం స్వీకరిస్తాం. అలాగే మనస్సు నిరాశ చెందితే మహోన్నత వ్యక్తుల జీవితాలను చదివి స్ఫూర్తిని పొందాలి. కళాశాల పరీక్షల్లో తక్కువ మార్కులు వచ్చినందుకే మీరు నిరాశ చెందుతున్నారు. కానీ, జీవిత పరీక్షలో అపజయాల పాలైన ఒక యువతి శ్రద్ధ, పట్టుదలతో కృషిచేసి ఏవిధంగా ఉన్నత స్థాయికి చేరుకుందో తెలుసుకుందాం:

"ఆశ్రయం ఇచ్చి ఆదరించాల్సిన భర్త బహిష్కరించడంతో ఆమె ఇద్దరు చంటి పిల్లల్ని తీసుకొని కన్నీళ్ళమయమైన జీవితాన్ని కడతేర్చుకుందామని కడలివైపు నడక సాగించింది. అలా సముద్ర తీరంలో నడుస్తూ ఉండగా అక్కడ వేరుశెనగలు, బఠాణీలు అమ్ముతున్న వారిని చూసింది. 'చదువు సంధ్యల్లేని ఈ అమాయకులు కాయకష్టం చేసుకొని జీవించగలుగుతున్నప్పుడు, నేను మాత్రం వారిలా ఎందుకు జీవితాన్ని సాగించలేను!' అన్న ఒక్క ఆలోచన ఆమెలో ఆశాదీపం వెలిగించింది. అప్పటి నుండీ సముద్రతీరంలో బఠాణీలు అమ్మడం ప్రారంభించింది. మొదటిరోజు సంపాదన కేవలం 50 పైసలు మాత్రమే. ఈ 50 పైసలతో తన ఇద్దరు పిల్లల్ని పోషించడం ఎలా అని నిట్టూర్చింది. కానీ ఓర్పుతో, పట్టుదలతో ప్రయత్నిస్తే ఫలితం లభించక పోదని విశ్వసించి బఠాణీల వ్యాపారాన్ని వదల్లేదు. ఒకవారం ఆదాయం రూ.5, మరికొన్ని వారాల తరువాత ఆదాయం రూ.50, కొన్ని నెలల తరువాత ఆదాయం రూ.100లకు చేరింది.

కొన్నాళ్ళకి టీ దుకాణం ప్రారంభించే స్థితికి చేరుకుంది. అలా మరికొన్నాళ్ళకు చిన్న హోటల్ ప్రారంభించింది. నాణ్యతకు ప్రాధాన్యమిచ్చి వ్యాపారాన్ని సాగించడం వల్ల అతికొద్ది కాలంలోనే వ్యాపారం పుంజుకొని పట్టణంలో అనేక ప్రాంతాల్లో రెస్టారెంట్లను నెలకొల్పగలిగింది. ఇప్పుడు 'సందీపా చైన్ ఆఫ్ రెస్టారెంట్స్' అనే సంస్థకు అధిపతిగా ఆమె సంపాదన నెలకు రూ.50 లక్షలు".

1982లో రోజుకి కేవలం 50 పైసల సంపాదనతో ప్రారంభించిన వ్యాపారాన్ని నేడు నెలకు రూ.50 లక్షలకు చేర్చిన ఆ వనిత విషాదగాథకు ప్రత్యక్ష సాక్షి 'మద్రాస్ మెరీనాబీచ్'. 2010 సంవత్సరంలో అత్యుత్తమ వ్యాపారవేత్త పురస్కారం ఆమెను వరించింది. ఆ ధీరవనిత పేరు 'పెట్రిశియ నారాయణ్'.

తినడానికి తిండిలేని నిర్భాగ్యస్థితి నుండి నేడు భాగ్యవంతురాలైన ఈ ధీరవనిత జీవనగాథ, చిన్నచిన్న వైఫల్యాలకు కూడా నీరసించిపోయే స్వభావంగల వారందరికీ ఓ స్ఫూర్తి కేంద్రం అనడంలో ఎలాంటి సందేహం లేదు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029**

**మనిషి ఎన్నిసార్లు తన ఉనికిని కోల్పోయేటంతగా క్రింద పడిపోయాడనికాదు ఆలోచించాల్సింది. ఆ పతనావస్థ నుండి లేచి తన ప్రతిష్ఠను ఎలా పెంచుకోగలిగాడు అనేది ముఖ్యం.** *- మహాత్మా గాంధీ*



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

## ఊహాజనిత సమస్యల నుండి ఉపశమనం

గురువును సేవించడమంటే ఆయన పట్ల గౌరవభావం కలిగివుండి ఆయనను మనస్ఫూర్తిగా సేవించడమే! ఇది ఆధ్యాత్మిక సాధకులందరూ కలిగివుండవలసిన పారమార్థిక విలువ.

'ఆచార్యుడు' అంటే ఒక సత్యం, లేక విలువ పట్ల పూర్తి అవగాహనతో దాన్ని స్వయంగా తన జీవితంలో ఆచరించి (స్వయం ఆచరతి), ఇతరులకు కూడా దాన్ని బోధించి, వారు కూడా దాన్ని తమ జీవితాలలో ఆచరించేలా (అన్యన్ ఆచరతి) చేసేవాడు. గురువు శాస్త్రాలలో ప్రబోధించే విలువలకు ఒక ప్రతీకగా నిలుస్తాడు. మాటల ద్వారానే గాక, సొంత ఆచరణ ద్వారా ఆయన ప్రబోధిస్తాడు. సత్యాన్ని దర్శించి, సత్యపథాన జీవించే వారి మాటలు శిష్యునిపై ప్రత్యక్ష ప్రభావం కలగజేస్తాయి. అలాంటి గురువు పట్ల శిష్యుడు భక్తి, శ్రద్ధలు కలిగివుండవలసిన అవసరం ఉంది. సేవ, వినయం, విధేయతల ఆధారంగానే మనస్సు సూక్ష్మాతి సూక్ష్మ విషయాలను గ్రహించగలుగుతుంది. శిష్యుడు తన అహంకారాన్ని నియంత్రణలో ఉంచుకోవలసిన అవసరం ఉంది. అది సరిగ్గా జరగాలంటే గురువును సేవించాలి.

గురువు జ్ఞానంతో పాటూ మంచి ఉత్తేజం కలిగించేవాడై ఉండాలి. ఆయన బోధించే ప్రతి ఉపదేశం ఆయన ప్రవర్తనలో ప్రతిబింబించాలి. మనపై ఏ సమస్యా ప్రభావం చూపదు అని ఆయన అంటే, అది ఆయన జీవితంలో కూడా వ్యక్తీకృతం కావాలి. తన ఉపదేశాలకు తానే ఒక తార్కాణంగా నిలవాలి.

'ఆచార్య' అనే పదానికి జ్ఞానము నిచ్చువాడు అని కూడా అర్థముంది. అలాంటి గురువును సేవించడం ఒక సద్గుణం. ఇతరుల పట్ల మనకున్న ప్రేమనూ, గౌరవాన్నీ వ్యక్తీకరించే విధానమే 'సేవ'. మన దృక్పథాన్ని ఎలా వ్యక్తపరుస్తాం? 'మన చేతల ద్వారా'! మన మనస్సులో భక్తి ఉంటే, అది తప్పక 'సేవ' రూపంలో వ్యక్తీకృతమవుతుంది. ఆ దృక్పథమే సేవాకార్యం అవుతుంది. మన మనస్సులోని భావనకు అది బాహ్యరూపం. ఉదాహరణకు 'కృతజ్ఞతాభావం' ఒక దృక్పథం. ఎవరైనా మనకు నిజంగా సహాయం చేశారని గుర్తించినప్పుడు ఆ కృతజ్ఞతాభావం కలుగుతుంది. సహాయం చేసిన వ్యక్తికి ఋణపడి ఉన్నట్లుగా భావిస్తాం. ఇతరుల నుంచి అవసరమైనప్పుడు సమయానికి సహాయాన్ని పొందిన భావన, దాన్ని హర్షించగల మనస్సు ఉన్నప్పుడే తాను పొందిన సహాయానికి బదులుగా ఏదైనా ఇవ్వాలని అనిపిస్తుంది. దీనినే 'కృతజ్ఞత' (ఉపకారం) అంటారు. మనకొకరు సహాయం చేశారన్న అవగాహన, గుర్తింపు కారణంగానే 'కృతజ్ఞత' అనేది మనలో పెల్లుబుకుతుంది. వారి సహాయానికి సముచితంగా కృతజ్ఞత తెలియబరచవలసిన అవసరం ఉంది.

మనం మన సమస్యకు పరిష్కారాన్ని బాహ్య ప్రపంచంలో వెతుకుతాం. బాహ్యం నుండి ఏదైనా లభిస్తే, మన సమస్య పరిష్కారమవుతుందని భావిస్తాం. కానీ బాహ్యం నుంచి వచ్చే ఆ పరిష్కారం తాత్కాలికమైనదే. ఉదాహరణకు ఆకలిగొన్నవారికి ఆహారం లభిస్తే ఆ సమయానికి ఆ ఆకలి తీరుతుంది. కానీ మళ్ళీ ఆకలి వేస్తుంది. మళ్ళీ ఆహారం అవసరమవుతుంది. ఇదే సత్యం జీవితంలోని ఇతర అన్ని సమస్యలకూ వర్తిస్తుంది. అందువల్ల మనం జీవితంలో ఎదుర్కొనే సమస్యలకు శాశ్వత పరిష్కారం బాహ్య ప్రపంచంలో లభించదు. గురువు సమస్యలకు పరిష్కారం అన్వేషిస్తున్న శిష్యునికి ఒక నూతన దిశానిర్దేశం చేసి, కొత్త దిశగా నడిపించే జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

అంతేగాక, మన మనస్సును 'లో'నికి మరలించి, జీవిత సమస్యలకు 'ఆంతరిక పరిష్కారం' కనుగొనడానికి దోహదం చేస్తాడు. మనం ఇంతకు ముందే పరిపూర్ణులమనీ, దివ్యత్వం కలవారమనే నిజమైన భావన ఆయన మనలో కలుగజేస్తాడు. మనం అనంత జ్ఞాన, చైతన్య, ఆనంద స్వరూపులం (సచ్చిదానంద స్వరూపులం). మన నిజతత్వాన్ని గురించి సరియైన అవగాహన లేకపోవడం వల్లనే అన్ని సమస్యలూ

ఆవిర్భవిస్తున్నాయి. ఆ అపోహ (తప్పుడు అవగాహన)యే మనల్ని అసలు లేని సమస్యను ఉన్నట్లుగా భావించేలా చేస్తుంది. మనకు అసలు ఏ సమస్యా లేదని గానీ, మన సమస్య ఊహ మాత్రమేననీ తెలుసుకొన్నప్పుడు ఇన్ని ఆందోళనలు, దుఃఖాలు పొందవలసిన అవసరమే ఉండదు. ఈ జ్ఞానం ఎంతో విలువైనది, ఈ ప్రపంచంలో ఏ సంపదకూ సాటిలేనిది. అంతేకాదు, ఆ జ్ఞానం మనల్ని నిరంతర జనన, మరణ పరిభ్రమణ నుండి తప్పించి ముక్తులను చేస్తుంది. మరల ఈ ప్రపంచానికి (సంసారానికి) రాకుండా చేస్తుంది. ఈ అద్భుత జ్ఞానాన్ని ఎవరి నుండైనా పొందితే, వారికి వెంటనే అతి సహజంగా వినయంతో శిరస్సు వంచి వందనం చేస్తాం. అప్పుడు మనస్సు గౌరవంతో, కృతజ్ఞతతో నిండిపోతుంది.

మన శ్రేయస్సుకూ, అనంత శాంతికీ సంబంధించిన తీవ్రమైన సమస్యలన్నింటినీ పరిష్కరించ గలిగినవాడే గురువు.

నిజంగా ఏ విధమైన ఉనికీ లేని మన సమస్యలను సరియైన దృక్పథంతో చూసే విధంగా గురువు చేస్తాడు. మన సమస్యలకొక పరిష్కారం ఉందని ఆయన తెలియజేస్తాడు. అంటే సమస్య ఉన్నా దాని గురించి ఆందోళన చెందకుండా ఉండాలని కాదు. మన ఊహాజనిత సమస్యలను ఆయన నిరాకరించేలా చేస్తాడు. ఊహాజనిత సమస్య కూడా మనల్ని ఇంతగా బాధించడం ఎంత ఆశ్చర్యకరమో గదా! అది నిజమైన సమస్య అనుకుంటే ఎంత దుఃఖం కలుగుతుందో, అంత దుఃఖాన్నీ అనుభవిస్తాం. ఉదాహరణకు ఒక త్రాడును మసక చీకటిలో చూస్తే పాము అనుకొని భయపడి వెనక్కి తగ్గుతాం. పాము నిజమైనది కావచ్చు, ఊహే కావచ్చు – ఏదైనా అది మనల్ని భయపెడు తుంది. ఊహాజనిత సర్పం, నిజమైన సర్పం లాగానే భయం కలుగజేస్తుంది. అదే విధంగా, ఈ ప్రపంచంలో ఎదురయ్యే సమస్యలన్నీ, ప్రపంచంతో సహా అన్నీ ఊహాజనితాలే. కానీ అవి మనల్ని భయపెట్టి, ఆందోళనకు గురి చేస్తాయి.

కాబట్టి, ఈ భయాన్ని వదిలించుకోవాలి. ఇది యోగ్యుడైన గురువు ఉపదేశం ద్వారానే సాధ్యమవుతుంది. జీవితపు అంతిమ సత్యాన్ని దర్శింపజేయగల వ్యక్తి ఒకరు



న్నారనీ, ఆయన జీవన్మరణ తీవ్ర సమస్యలకు కూడా పరిష్కారం చూపగలరనీ తెలుసుకున్నప్పుడు, అలాంటి వ్యక్తికి ఆకర్షితులవుతాం. ఆ విధంగానే మనలో అంతర్గత మార్పు వస్తుంది. అలాంటి గురువును సేవించడమే గొప్ప సద్గుణం. అదే మన ఆధ్యాత్మిక పురోభివృద్ధికి దారి తీస్తుంది. ❖

(వచ్చే సంచికలో – 'శౌచం'– శుచిత్వం)

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి


Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | Hyderabad - 500 029 |
| 2. | Periodicity of Publication | : | Monthly |
| 3. | Printer's Name | : | Swami Jnanadananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 4. | Publisher's Name | : | Swami Jnanadananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda, Hyderabad-500 029 |
| 5. | Editor's Name | : | Swami Parijneyananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda,Hyderabad -29 |
| 6. | Name & Address of the individuals who own the news or shareholder holding more than1% of the capital | : | Ramakrishna Math Domalguda Hyderabad-500029 |

I , Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd.

**Swami Jnanadananda**

Date: 01.03.2012 Signature of the Publisher


ఘనత వహించాలంటే వినయం కలిగి ఉండాలి. పళ్ళతో భారవంతమైన చెట్టు ఎప్పుడూ వంగి ఉంటుంది. నువ్వు ఉన్నతుడవు కాదలస్తే ఈ చెట్టు మాదిరి అణకువ కలిగివుండు. -శ్రీరామకృష్ణులు

# 'నేను' పోతే పోగలను!

కథ: టి.ఎమ్.ఎస్. బొమ్మలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

శ్రీకృష్ణదేవరాయల ప్రతినిధిగా 'పాత' అనే గ్రామంలో నివసిస్తున్న పెద్ద గౌడకు శ్రీవేంకటేశ్వరుని అనుగ్రహంతో తిమ్మప్ప జన్మించాడు. అతడు భక్తిలోనూ, కళలలోనూ విరాజిల్లుతూ వచ్చాడు.

1 తిమ్మప్ప, అతడి మిత్రులు ఒక చెట్టు క్రింద భగవన్నామ సంకీర్తన చేస్తున్నారు. హఠాత్తుగా ఒక పాము అక్కడికి వచ్చింది. దాన్ని చూసి మిత్రులు భయంతో పారిపోయారు. తిమ్మప్ప మాత్రం సంకీర్తనలో నిమగ్నమైపోయాడు. తరువాత వాళ్ళు తిరిగి వచ్చి...




2 ఒకరోజు తిమ్మప్ప పొలంలో పనిచేస్తున్నాడు. అప్పుడు అతడికి బంగారం నిండిన లంకె బిందె దొరికింది.




3 కనకప్ప దానధర్మాలు పెరుగుతూ వచ్చాయి. దానికి తోడు అతడు చక్కని కవిగా కూడా రాణించాడు. అతడి కీర్తి రాజు గారి చెవిలో పడింది. అంతే! రాచమర్యాదలతో కనకప్పను రాజాస్థానానికి రావించారు.



**4** కొంతకాలం ప్రజాసేవలో కనకనాయకుడు మునిగిపోయాడు. ఇలా ఉండగా ఒకరోజు మహావిష్ణువు అతడికి కలలో కనిపించి తిరుమలకు రావలసిందిగా చెప్పాడు. కనకదాసు ఆయన వైపుగా పరుగెత్తుతున్నప్పుడు కల చెదరిపోయింది. ఈ విధంగా చాలాసార్లు జరిగింది. కనకనాయకునికి ఏం చెయ్యాలో పాలుపోలేదు.



**5** గ్రామాన్ని కాపాడడానికి కనకప్ప ఒక యుద్ధంలో పాల్గొనవలసి వచ్చింది. ప్రత్యర్థులు అతణ్ణి తీవ్రంగా ఎదుర్కొన్నారు. ఇంతలో కనకనాయకుని పట్ల ఈర్ష్య చెందిన ఒక వ్యక్తి అతణ్ణి కత్తితో పొడిచివేశాడు.




**6** కనకనాయకుని కలలో మళ్ళీ మహావిష్ణువు...




మహావిష్ణువు తన దివ్యమంగళ స్వరూప దర్శనం అనుగ్రహించాడు. వెంటనే కనకనాయకుడు పరిపూర్ణంగా కోలుకున్నాడు. మహావిష్ణు దర్శన ఆనందంలో నాట్యం చేశాడు.

**7** దైవ దర్శనంతో కనకనాయకునికి సన్న్యాసం సహజ సిద్ధంగా సంప్రాప్తించింది. తన ఆస్తిపాస్తులన్నీ త్యజించి అతి నిరాడంబరంగా జీవించ నారంభించాడు. తుంబుర మీటుతూ, తాళం వేస్తూ భగవన్నామ సంకీర్తన చేస్తూ సంచరించసాగాడు.



8 తిరుమలలో ఒంటికాలి మీద నిలబడి తపస్సు చేస్తూ, తనను సేవకునిగా స్వీకరించమని వ్యాకులతతో భగవంతుని ప్రార్థించసాగాడు. అప్పుడు మహావిష్ణువు ప్రత్యక్షమై అతణ్ణి ఆశీర్వదిస్తూ...




కనకదాసు మహావిష్ణువును స్తుతిస్తూ పాత గ్రామానికి వెళ్ళాడు. అప్పుడు తన తల్లి మరణించిన వార్త అతడికి తెలిసింది. తనకున్న ఒకే ఒక లౌకిక బంధం తొలగిపోవడంతో కనకదాసు, శ్రీమహావిష్ణువుకు పూర్తిగా శరణాగతుడయ్యాడు.

10



కనకదాసు రాకను దివ్యదృష్టితో గ్రహించిన వ్యాసతీర్థులు బయటకు వచ్చి, అతణ్ణి లోపలకు తోడ్కొని వెళ్ళాడు. వ్యాసతీర్థులు దీక్షనిచ్చి అతణ్ణి శిష్యునిగా చేసుకొన్నాడు.

9 కనకదాసు, వ్యాసతీర్థులవారిని తన గురువుగా స్వీకరించాలని ఆయన ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ కొంతమంది శిష్యులు...




11 దాంతో పరిపక్వత లేని ఇతర శిష్యులలో కలకలం చోటుచేసుకుంది.






కనకదాసు మహత్యాన్ని తక్కిన శిష్యులకు గ్రహింపజేయాలని వ్యాసతీర్థులు అభిలషించాడు. ఒకరోజు ఈశోపనిషత్తు గూర్చి వ్యాఖ్యానించి, ఒక్కొక్కరికీ ఒక పండు ఇచ్చాడు. దాన్ని ఎవరికీ తెలియకుండా ఏకాంతంలో తిని రండని చెప్పాడు. కానీ కనకదాసు మాత్రం...







ఒకరోజు వ్యాసతీర్థులు పూజ ముగించి వచ్చి...




గురువు మూసివున్న చేతిని తెరిచాడు. సాలగ్రామం ఉంది! ఇందుమూలంగా కనకదాసు మహత్యాన్ని చాటి చెప్పాడు.

15

మరొక రోజు, శిష్యులతో గురువు, "ఎవరు వైకుంఠానికి వెళ్ళగలరు?" అని ప్రశ్నించాడు. శిష్యులు బదులు చెప్పలేకపోయారు.






**పచ్చకామెర్లు సోకిన వ్యక్తికి అంతా పసుపుపచ్చగా కనిపిస్తుంది. ఆ విధంగానే శిష్యుడు తన భక్తి తీవ్రతలో గురువును మనుష్యమాత్రునిగా చూడకుండా సాక్షాత్తూ భగవంతునిగా పరిగణించి చూస్తాడు. భక్తిమయంలో సమస్తాన్నీ భగవన్మయంగా భావిస్తాడు.** – భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

వార్తావాహిని

# సౌమ్యశీలికి 'స్మృత్యంజలి'

శ్రీరామకృష్ణుల భావధారలో మమేకమై, సేవించి తరించిన ధన్యజీవి శ్రీమతి శేషగారు. ఆ గురుదేవుల 'భక్తురాలు' అన్న పదానికి నిజమైన భాష్యంగా నిలిచారు. 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను మాధ్యమంగా ఎంచుకొని ఆమె ఆ అవతార వరిష్ఠుని ఆరాధనకు అంకితమయ్యారు. దాదాపు దశాబ్ద కాలం పాటు 'శ్రీరామకృష్ణ ప్రభ'కు విశేష సేవలందించి, 2012 జనవరి 27, శుక్రవారం నాడు శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరుకున్నారు. ఆ రోజే శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి త్రిగుణాతీతానందజీ ('ఉద్బోధన్' బెంగాలీ మాసపత్రిక ప్రథమ సంపాదకులు) జయంతి కావటం యాదృచ్ఛికం!



శ్రీమతి ఎన్. శేష

'శ్రీరామకృష్ణ ప్రభ' పూర్వసంపాదకులు స్వామి సుకృతానందజీ మహరాజ్ అభ్యర్థన మేరకు దాదాపు పన్నెండేళ్ళ క్రితం చెన్నైలో శేషగారు రామకృష్ణ మఠానికి పరిచయమయ్యారు. ప్రతిష్ఠాత్మకమైన ఈ సంఘ మాసపత్రికకు 'నేను సేవచేయగలనా!' అని తొలిరోజుల్లో కొంత సంశయించినా, అనతికాలంలోనే ఆ మాననీయురాలు 'శ్రీరామకృష్ణప్రభ'కు పరమ ఆప్తులయ్యారు. 'ప్రభ'ను తన జీవితంలో ఒక భాగంగా చేసుకొని, ఎలాంటి అక్షరదోషాలు దొర్లకుండా ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవారు.

2006లో చెన్నై నుంచి 'శ్రీరామకృష్ణప్రభ' హైదరాబాదుకు తరలివెళుతుందని తెలిసినప్పుడు, ఇక తనకు సేవ చేసుకునే భాగ్యం దూరమవుతుందని కలతచెందారు. కానీ శేషగారి సంకల్పబలం, పత్రికపై ఉన్న అభిమానం ఆమెను అక్కడ ఉండనివ్వలేదు. పాతికేళ్ళపాటు తనకు పరిచయమున్న చెన్నై నగరాన్ని, బంధువులను కాదనుకొని ఆమె కేవలం 'శ్రీరామకృష్ణ ప్రభ' కోసం కుటుంబంతో సహా హైదరాబాదుకు తరలివచ్చారు. ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చి, తిరిగి పత్రికసేవలో భాగస్వాములయ్యారు. ప్రభకు ఆంగ్లం, హిందీ భాషల నుండి తెలుగు అనువాదాలను అందించడం, ప్రతులను (ప్రూఫ్) దిద్దడంతో పాటు ప్రభలో ధారావాహికలుగా ప్రచురితమైన శ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారి 'శివమహిమ్నః స్తోత్రం', 'దేవీవైభవం' ప్రవచనాలను విలేఖించి పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్నారు. మఠం నిర్వహించే ఉత్సవాలన్నింటిలోనూ పాల్గొనడానికి అత్యంత ఆసక్తిని కనబరిచేవారు.

2010 మార్చిలో విధి అనూహ్యంగా శేషుగారిని 53 ఏళ్ళ వయస్సులోనే క్యాన్సర్ రూపంలో కబళించింది. ఎలాంటి అనారోగ్య ఛాయలు కూడా లేని ఆమె, హఠాత్తుగా బయటపడిన ప్రాణాంతకమైన వ్యాధిని కూడా నిబ్బరంగా ఎదుర్కొన్నారు. దాదాపు రెండేళ్ళపాటు శారీరకంగా కుంగిపోయినా, ఆమె మానసికంగా మాత్రం పూర్తిగా శ్రీరామకృష్ణులే లోకంగా జీవించారు. 'శ్రీరామకృష్ణ కథామృత', 'శ్రీశారదా చరితామృత' పానంతో; ఆ మూర్తిత్రయ గానామృత శ్రవణంతో చివరి రోజుల్ని గడిపారు.

ఆడంబరాలకు దూరంగా, భక్తురాలినన్న పటాటోపం కించిత్తయినా లేకుండా, సరళంగా, సౌమ్యంగా, సవినయంగా సాగిన శ్రీమతి శేషగారి జీవితం శ్రీరామకృష్ణుల భక్తులకు కడు అనుసరణీయమంటే అతిశయోక్తి కాదు. అలాంటి సౌమ్యశీలి ఆత్మకు శ్రీరామకృష్ణులు పరమశాంతిని ప్రసాదించాలని 'శ్రీరామకృష్ణ ప్రభ' సిబ్బంది, శ్రేయోభిలాషులు, పాఠకుల తరఫున మనసారా ప్రార్థిస్తూ, నివాళులర్పిస్తున్నాం. ❖ **– సంపాదకులు**

# షికాగోలో 'స్వామి వివేకానంద పీఠం'

స్వామి వివేకానందపై విస్తృతంగా అధ్యయనం చేసేందుకు వీలుగా భారతప్రభుత్వం షికాగో విశ్వవిద్యాలయంలో 'స్వామి వివేకానంద పీఠం' ఏర్పాటు చేయడానికి 2012 జనవరి 28న షికాగోలో ఆర్థికమంత్రి శ్రీ ప్రణబ్ ముఖర్జీ నేతృత్వంలో షికాగో విశ్వవిద్యాలయంతో ఒప్పందం కుదుర్చుకున్నారు. దీని నిమిత్తం ప్రభుత్వం 7.4 కోట్ల రూపాయలు మంజూరు చేసింది. స్వామి వివేకానంద ప్రసంగించిన చారిత్రాత్మక 'ఫుల్లెర్టాన్‌హాల్' (షికాగో)లో శ్రీ ప్రణబ్ ముఖర్జీ మాట్లాడుతూ 'భారతదేశ వైభవాన్ని విదేశాల్లో చాటిన ప్రథమ సాంస్కృతిక రాయబారి స్వామి వివేకానంద' అని కీర్తించారు. అదేవిధంగా 'స్వామి వివేకానంద మెమోరియల్ మ్యూజియం' కోసం భారత ప్రభుత్వం 2.1 కోట్ల రూపాయలు కేటాయిస్తున్నట్లు ప్రకటించారు. ❖

**'జెమిని' ఛానల్‌లో రామకృష్ణ మఠ కార్యక్రమం :** ప్రతీ బుధవారం ఉదయం 6.00 గంటల నుండి 6.30 వరకు ప్రసారమయ్యే 'స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ వారి భక్తిసంగీత కార్యక్రమం' ఇకనుండి **ఉదయం 6.30 నుండి 7.00 గంటల వరకు** ప్రసారమవుతుంది. భక్తులు ఈ మార్పును గమనించగలరు. ❖

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-3, Sri Ramakrishna Prabha (Telugu Monthly) March 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? ఆంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. - *స్వామి రంగనాథానంద*



భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అవతార పరిసమాప్తి స్థానం -
కోల్‌కతాలోని 'కాశీపూర్ ఉద్యానగృహం'.







# భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి ముగింపు వార్షికోత్సవాలు




**హైదరాబాదు రామకృష్ణ మఠం** భగవాన్ శ్రీరామకృష్ణుల 175వ జయంతి వార్షికోత్సవాలను పురస్కరించుకొని 2012 ఫిబ్రవరి 23 నుండి 26వ తేదీ వరకు మఠ ప్రాంగణంలో ముగింపు ఉత్సవాలను వైభవంగా నిర్వహించింది.

ఈ ఉత్సవాల్లో భాగంగా 'శ్రీరామకృష్ణ కథామృత గానలహరి', 'శ్రీరామకృష్ణ లీలాగానం'- సంగీతోపన్యాసాలు; జపసాధన; శ్రీరామకృష్ణ సహస్రనామ అక్షితార్చన; విద్యార్థులచే వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. నాలుగు రోజుల పాటు జరిగిన ఈ ఉత్సవాల్లో దాదాపు 7,000 మంది భక్తులు పాల్గొన్నారు. ❖












**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద    సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద




## 'జాగృతి' రాష్ట్ర స్థాయి సాంస్కృతిక పోటీలు

**విజయవాడ రామకృష్ణ మిషన్** విద్యార్థులకు స్వామి వివేకానంద భావనలను అందించి వారి వ్యక్తిత్వ నిర్మాణానికి దోహదం చేసే ఉద్దేశ్యంతో, స్వామి వివేకానంద 150వ జయంతి వేడుకల సందర్భంగా 'జాగృతి' పేరిట రాష్ట్ర స్థాయి సాంస్కృతిక పోటీలను నిర్వహించింది. ఈ పోటీల్లో 70,000 మంది విద్యార్థులు పాల్గొనగా 322 మంది తుదిదశ పోటీలకు అర్హత పొందారు. వారిలో 202 మంది పోటీలకు హాజరయ్యారు.

2012 ఫిబ్రవరి 12న ఉదయం నుంచి వ్యాసరచన, క్విజ్, వక్తృత్వ తుది పోటీలు రామకృష్ణ మిషన్, సీతానగరంలో నిర్వహించ బడ్డాయి. ఆ రోజు మధ్యాహ్నం జరిగిన బహిరంగ సభలో ముఖ్య అతిథులుగా రాజమండ్రి శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ; శ్రీరామకృష్ణ ప్రభ సంపాదకులు స్వామి పరిజ్ఞేయానందజీ; శ్రీరామకృష్ణ ప్రభ సర్క్యులేషన్ మేనేజర్ స్వామి రఘునాయకానందజీ; గుంటూరు అర్బన్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ శ్రీ ఎస్.శ్యామసుందర్, ఐ.పి.ఎస్., పాల్గొన్నారు. శ్రీ ఎస్.శ్యామసుందర్ తమ సందేశాన్ని ఇస్తూ 'గ్రామీణ పేదలకు నాణ్యమైన విద్య అందించినప్పుడే దేశం పురోభివృద్ధి చెందుతుంద'ని చెప్పారు. తదనంతరం తుది పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం జరిగింది.

**వ్యాసరచన పోటీల్లో** కె.నాగ స్వాతి, జ్ఞానభారతి హైస్కూల్, మహబూబ్‌నగర్; టి.రినీష, రామకృష్ణ మిషన్ హైస్కూల్, సీతానగరం; ఎమ్.ధాత్రి, రామకృష్ణ మిషన్ హైస్కూల్, సీతానగరం – ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాల్లో నిలిచారు.

**వక్తృత్వ పోటీల్లో** కె.నాగ స్వాతి, జ్ఞానభారతి హైస్కూల్, మహబూబ్‌నగర్; ఎ.ధనుష్మంత్, రెజినా కార్మెలి కాన్వెంట్ హైస్కూల్, కొత్త పాల్వంచ; ఇ.చరిష్మా, విక్రమ్ సక్సెస్ హైస్కూల్, శ్రీకాళహస్తి – ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులను గెలుచుకున్నారు.



**క్విజ్ పోటీల్లో** ప్రథమ బహుమతి పొందిన జట్టు : కె.నాగ స్వాతి, జ్ఞానభారతి హైస్కూల్, మహబూబ్‌నగర్; సి.హెచ్.ఉమా మహేశ్వరి, సెయింట్ గర్ల్స్ హైస్కూల్, మాచర్ల; పి.జె.ఎమ్.సునయన, శ్రీ బాలాజీ విద్యాలయం, మచిలీపట్నం; ద్వితీయ బహుమతి పొందిన జట్టు:ఎమ్.ధాత్రి, రామకృష్ణ మిషన్ హైస్కూల్, సీతానగరం; ఎస్. మాలతి, నాగార్జున పబ్లిక్ స్కూల్, రామనగరం, చల్లపల్లి; ఇ.చరిష్మా, విక్రమ్ సక్సెస్ హైస్కూల్, శ్రీకాళహస్తి; తృతీయ బహుమతి పొందిన జట్టు:టి.రినీష, రామకృష్ణ మిషన్ హైస్కూల్, సీతానగరం; కె.వి. బి.ఆర్.పార్థసారథి, జడ్.పి. హైస్కూల్, అగిరిపల్లి; చండికా మనోజ్, శ్రీ బాలాజీ విద్యాలయం,మచిలీపట్నం. ❖నివేదిక: స్వామి సేవ్యానంద

---

**శ్రీ రామకృష్ణ ప్రభ** ## పాఠకులకు గమనిక **శ్రీ రామకృష్ణ ప్రభ**

దాదాపు అరవై తొమ్మిదేళ్ళుగా అశేషపాఠకులను ఆధ్యాత్మిక అమృతవాహినిలో ఓలలాడిస్తున్న 'శ్రీరామకృష్ణ ప్రభ' గత అయిదేళ్ళ నుంచి హైదరాబాదు కేంద్రంగా వెలువడుతోంది. ఈ మాసపత్రిక పంపిణీకి ప్రణాళికా బద్ధమైన విధానాన్ని అమలు చేస్తూ ఉన్నాం. కానీ పాఠకులు కొంత మంది తమకు పత్రిక సక్రమంగా, నిరాటంకంగా చేరడం లేదని తమ అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

**దయచేసి పాఠకులు సహృదయంతో ఈ క్రింది అంశాలను పరిశీలించి, పంపిణీ విధానాన్ని అవగాహన చేసుకోవాల్సిందిగా మనవి:**

1. మీరు చందా కట్టిన వెంటనే మీ చందా నెంబరుతో సహా చిరునామా కంప్యూటర్‌లో నమోదు చేయబడుతుంది.
2. ఒక్కసారి మీ చిరునామా కంప్యూటర్‌లో నమోదు అయిందంటే, ప్రతీ నెల నిరాటంకంగా పత్రిక మీకు పంపబడుతుంది.
3. మీ చిరునామా పత్రిక కవరుపైన కంప్యూటరైజ్డ్ ప్రింటర్ ద్వారా ప్రింట్ అవుతుంది. పత్రికలను జిల్లాల వారీగా సంచులలో కట్టి, పోస్ట్ చేయడం జరుగుతుంది. కాబట్టి ఇందులో మా సిబ్బంది అజాగ్రత్తకు ఆస్కారమే ఉండదు.

**దయచేసి పాఠకులు ఈ క్రింది సూచనలను గమనించి, మాతో సహకరించవలసిందిగా మనవి :**

1. మీరు చందా కట్టిన తరువాత మీ చిరునామాకు పత్రిక చేరకపోతే, మా కార్యాలయానికి చందా కట్టిన వివరాలను ఫోన్ ద్వారా 040-27667799కు (ఉదయం 10 గం॥ నుండి 5 గం॥ మధ్య) తెలియజేయండి, చిరునామాను సరిచూసుకోండి.
2. పత్రిక మీకు సక్రమంగా చేరకపోతే ముందుగా మీ పోస్ట్‌మ్యాన్‌ను సంప్రతించండి.
3. ఒక నెలకు మించి పత్రిక మీకు చేరనట్లయితే మీ పోస్టాఫీస్‌లో వ్రాతపూర్వకంగా ఫిర్యాదుచేసి,ఆ ప్రతిని మాకు పంపండి. పాఠకులు పత్రిక 3వ పేజీలోని 'చందాదారులకు విన్నపం' చదవండి. ❖ – సర్క్యులేషన్ మేనేజర్, శ్రీరామకృష్ణ ప్రభ



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 4 ఏప్రిల్ 2012

**శ్రీమద్భక్త చకోరక సోమ! వివేకాభిరామ! సురవినుత గుణ స్తోమ! నిరలంకృ తాసురరామా సీమంతసీమ! రాఘవరామా!**

భక్తులనబడే చకోరపక్షులకు చంద్రుడవూ, వివేకంతో విలసిల్లువాడవూ, దేవతల పొగడ్త గాంచిన సద్గుణ సముదాయము గలవాడవూ, రాక్షసస్త్రీల పాపటబొట్టులు తొలగించిన వాడవూ అయిన ఓ రఘువంశలలామా! రామా! అవధరించు. –పోతనామాత్యులు, శ్రీమద్భాగవతము

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు...........** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి ఎన్. నరసమ్మ, ప్రశాంతి నిలయం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా - 515 134 | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీమతి బొడ్డుపల్లి హనుమాయమ్మ, సంజయనగర్, బెంగుళూరు (కీ॥శే॥ బి. పురుషోత్తమ్ జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు | : శ్రీ ఎమ్. శరవణ, సోమప్పకాలనీ, కర్నూలు (కీ॥శే॥ ఎమ్. రత్నం జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీమతి వి. లక్ష్మీకళ, అక్కయ్యపాలెం, విశాఖపట్నం - 530 016 | 1,000 |
| పోషకులు | : శ్రీమతి జె. లక్ష్మీకాంతమ్మ, రాయదుర్గం, అనంతపురం జిల్లా - 515 865 | 1,000 |
| పోషకులు | : శ్రీ మారం కృష్ణమూర్తి, మల్కాజ్‌గిరి, హైదరాబాదు - 500 047 | 1,000 |
| పోషకులు | : శ్రీ అనిల్ కుమార్, డాబా గార్డెన్స్, విశాఖపట్నం- 530 020 | 1,000 |
| పోషకులు | : శ్రీ సి.హెచ్. నరసింహారావు, సికింద్రాబాదు ( సి.ఆర్.కె. ఫౌండేషన్ - 2011 చేబ్రోలు) | 1,000 |
| పోషకులు | : శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |



**ముఖచిత్రం : శ్రీరామచంద్రుని వైభవ విశేషాలు:**

శ్రీరామ జననం, తాటక సంహారం, అహల్యా శాపవిమోచనం, శివధనుర్భంగం, శ్రీసీతారాముల కళ్యాణం, శ్రీసీతారామలక్ష్మణులను నదిని దాటిస్తున్న గుహుడు, జటాయువు కైవల్యం, శబరికి శ్రీరాముని దర్శనం, రావణ సంహారం, అయోధ్యకు పునరాగమనం.

(ఏప్రిల్ 1, ఆదివారం - శ్రీరామనవమి)

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా :

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి మీ చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి. ల
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# అనురాగాల ఆలయం 'శ్రీరామ నిలయం'

'ఈ భూతలంపై గిరులున్నంత వరకూ, నదులు ప్రవహిస్తున్నంత వరకూ రామాయణగాథ వినిపిస్తూనే ఉంటుంది' అన్నది బ్రహ్మవాక్కు. అందుకే ఎన్ని యుగాలు కాలచక్రంలో కలిసిపోయినా, ఎన్ని తరాలు తరలిపోయినా మరుగునపడనిదీ, మరువలేనిదీ శ్రీరామగాథ. ఈ మహీ తలంపై మానవులు మనుగడ కొనసాగిస్తున్నంత వరకు వాడవాడలా శ్రీరామగాథ వినిపిస్తూనే ఉంటుంది. ఎందుకంటే శ్రీరామాయణ గాథ మానవ జీవన గాథ కాబట్టి.

ఒక వ్యక్తిగానీ, కుటుంబంగానీ, సమాజంగానీ శాంత్యా నందాలతో శోభిల్లాలంటే రామాయణంలో ప్రదర్శించిన ఆత్మీయతానురాగాలను మనం అలవరచుకోవాలి. కైకేయికి ఇచ్చిన మాటకు కట్టుబడి కన్నకొడుకును పద్నాలుగేళ్ళు కానలకు పంపాడు దశరథ మహారాజు. పతి వెంటే సతి అని తలచి కష్టమైనప్పటికీ శ్రీరాముణ్ణి అనుసరించింది సుకుమారి అయిన సీతమ్మ. అన్న లేని అయోధ్య అరణ్యంతో సమానమని సీతారాముల్ని అనుసరించాడు లక్ష్మణుడు. అన్నకు దక్కని రాజ్యం తనకు శ్మశానంతో సమానమని అయోధ్యలో ఉన్నప్పటికీ అరణ్యంలో ఉన్నట్లు గడిపాడు భరతుడు - ఇలా కన్నీళ్ళమయమైన రామాయణం మానవ జీవితంలో శాంత్యానందాలకు ఎలా దోహదపడుతుంది? అశాంతిమయమైన రామాయణం శాంతి సౌధాలకు ఎలా పునాదిగా నిలుస్తుంది?



**రామాయణగాథ... అనురాగాలసుధ:** అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నప్పుడూ, మన సుఖసంతోషాలకు అన్నీ అమరినప్పుడూ, పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నప్పుడూ ఒకరి పట్ల మరొకరు ఆత్మీయతానురాగాలు చూపించడం, ప్రేమాభిమానాలు కలిగివుండడంలో విశేషమేముంది! ఒకరి పట్ల ఒకరికి నిజమైన ఆత్మీయతానురాగాలు ఉన్నాయా? లేదా? అని తెలిసేది కష్టసమయాల్లోనే! క్లిష్టపరిస్థితుల్లోనే!

దశరథ మహారాజు కైకేయి మాట ప్రకారం శ్రీరాముణ్ణి అరణ్యాలకు పంపించిన తరువాత రాజ్యాధికారాలను అనుభవించవచ్చు. కానీ దశరథుడు శ్రీరాముని ఎడబాటును భరించలేక మనోవేదనతో మరణించాడు. శ్రీరాముడు తండ్రిని ఎదిరించి అడవులకు వెళ్ళకుండా అయోధ్యను పరిపాలిస్తూ కీర్తిప్రతిష్ఠలతో జీవించవచ్చు. కానీ తండ్రికి 'అసత్యవాది' అన్న మాట రాకూడదని అరణ్యవాసానికి అంగీకరించాడు. సీతమ్మ తన భర్త అరణ్యవాసం ముగించుకొని వచ్చేంత వరకు అంతఃపుర సుఖాలను అనుభవిస్తూ ఆనందంగా ఉండవచ్చు. కానీ ఎన్ని సంపదలున్నా, ఎంతమంది బంధు బలగమున్నా సతికి పతియే ఆలంబనమని సీతమ్మ శ్రీరాముణ్ణి అనుసరించింది. అన్నా వదినలు అరణ్యవాసానికి వెళితే లక్ష్మణుడు తల్లితండ్రులను సేవిస్తూ అయోధ్యలోనే ఉండిపోవచ్చు. కానీ కష్టాల్లో ఉన్న అన్నావదినల వెన్నంటి ఉండడమే ధర్మమని తలచి సీతారాముల వెంట పయనమయ్యాడు. భరతుడు పట్టాభిషిక్తుడై రాజభోగాలతో జీవితాన్ని గడపవచ్చు. కానీ తపోమయ జీవితాన్ని గడుపుతూ అన్నయ్య రాక కోసం పద్నాలుగేళ్ళు నిరీక్షించి రాజ్యాధికారాలను శ్రీరామునికి అప్పగించాడు.

దశరథుడు, రాముడు, సీత, లక్ష్మణుడు, భరతుడు - ఇలా కుటుంబ సభ్యులంతా సుఖంగా జీవించడానికి అవకాశాలు, సదుపాయాలున్నా, వాటిని అనుభవించకుండా ఒకరి సుఖం కోసం మరొకరు పరితపించారు. కారణం పరస్పర ఆత్మీయతానురాగాలే!

"ఆత్మీయతానురాగాలు, ప్రేమాప్యాయతలు కరవైనప్పుడు అంతఃపురవాసమైనా అరణ్యవాసమే అవుతుంది. ఆత్మీయత మనస్సులో నిండుగా ఉన్నప్పుడు అరణ్యవాసమైనా అంతఃపురవాసమవుతుంది" అని నిరూపించి, మానవ సత్సంబంధాలకు మార్గదర్శకంగా నిలిచింది రామాయణగాథ.

నేడు చాలామంది తమ ఇళ్ళకు 'శాంతి నివాసం' అనీ, 'శ్రీరామ నిలయం' అనీ పేర్లు పెట్టుకుంటున్నారు. కానీ శాంతినివాసంలోకి ప్రవేశించగానే అంతటా అశాంతే! అలాగే శ్రీరామ నిలయంలో రావణ కుంభకర్ణులు తారసపడడం

మనకు తరచూ ఎదురయ్యే అనుభవం. నిజమైన శ్రీరామ నిలయాలు, శాంతి నివాసాలు విలసిల్లాలంటే సుఖ సంతోషాల్లో చూపించే ఆత్మీయతాభిమానాలను కష్ట సమయాల్లోనూ చూపించగలిగినప్పుడే సాధ్యం.



**తండ్రీ తనయుల అనుబంధం:** కైకేయి, శ్రీరాముణ్ణి పద్నాలుగేళ్ళు వనవాసం చేయాలన్నప్పుడు దశరథ మహారాజు "నేను రాజ్యాన్నైనా త్యజిస్తాను, అవసరమైతే ప్రాణాలను సైతం పరిత్యజిస్తాను. కానీ నా సుగుణాభిరాముణ్ణి విడిచి క్షణమైనా ఉండలేను" అని కైకేయిని ప్రాథేయపడతాడు. కఠినాత్మురాలైన కైకేయిని ఒప్పించడానికి చివరకు మహారాజైన దశరథుడు...

***తదలం త్యజ్యతామేష నిశ్చయః పాపనిశ్చయే ।***
***అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే ॥***

(అయోధ్యా కాండం)

'ఓ పాపాత్మురాలా! ఇకనైనా శ్రీరాముణ్ణి అరణ్యాలకు పంపే ఆలోచనను వదలు. నీ పాదాలకు ప్రణమిల్లుతాను. ఈ దీనుణ్ణి కరుణించు' అని కైకేయి కాళ్ళను పట్టుకోవడానికి కూడా వెనుకాడలేదు.

అలాగే అరణ్యాలకు పంపుతున్న తండ్రిపై శ్రీరామునికి ఎలాంటి ద్వేష భావమూ లేదు. పైగా తండ్రిని ఓదారుస్తూ, 'తండ్రీ! నీవు నిర్దోషివి. కానీ తండ్రి ఇచ్చిన మాటను నిలబెట్టడమే పుత్రుని ధర్మం' అని అంటాడు. వృద్ధుడైన తండ్రి మనోవేదనతో మరణిస్తాడేమోనని లక్ష్మణుణ్ణి అయోధ్యలోనే ఉంటూ తండ్రిని సేవించవలసిందిగా కోరతాడు శ్రీరాముడు.

తన వల్ల కొడుకు కష్టాల పాలవుతున్నాడని దశరథుడు, తన కోసం తండ్రి దుఃఖిస్తున్నాడని శ్రీరాముడు - ఇలా ఒకరి కోసం ఒకరు పరితపించారు. ఈ తండ్రీ తనయుల మధ్య ఉన్న అనురాగం కొంతైనా నేటి తరం కలిగివుంటే ఆస్తిపాస్తుల కోసం ఒకరి ప్రాణాలను మరొకరు తీసుకునే స్థాయికి దిగజారకుండా ఉండవచ్చు.



**అన్నదమ్ముల అనుబంధం:** అరణ్యవాసం చేస్తున్నప్పుడు శ్రీరాముడు అయోధ్యకు తిరిగివెళ్ళి తల్లితండ్రులకు సేవ చేయాల్సిందిగా లక్ష్మణుణ్ణి బ్రతిమాలతాడు. అప్పుడు లక్ష్మణుడు 'అన్నా! నీ మాట ప్రకారం నేను తిరిగి వెళ్ళినా, నువ్వు నాకు కనపడుతున్నంత వరకు మాత్రమే ప్రాణాలతో ఉంటాను. నీవు ఎప్పుడైతే కనుమరుగవుతావో మరుక్షణమే నా ప్రాణాలు పోతాయి' అని రామునితో అంటాడు. ఆ మాటలను బట్టి అన్నయ్యపై తమ్ముడికున్న అనురాగం అర్థం చేసుకోవచ్చు.

అలాగే శ్రీరామునికి కూడా లక్ష్మణుడిపై అపారమైన ప్రేమ ఉండేది. అందుకు సీతమ్మ స్వయంగా పలికిన ఈ మాటలే నిదర్శనం: 'మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః - రామునికి నాకన్నా సోదరుడు లక్ష్మణుడే ప్రియతముడు'. శ్రీరామ లక్ష్మణులకు ఒకరిపై మరొకరికి ఉన్న ఆ ప్రేమానుబంధం నేటి తరం అన్నదమ్ముల్లో కొంతైనా ఉంటే ఒకరి అభివృద్ధిని చూసి మరొకరు అసూయపడే స్థితిని అధిగమించవచ్చు.



**భార్యాభర్తల అనుబంధం:** శ్రీరాముడు అరణ్యవాసానికి వెళ్ళే ముందు తల్లితండ్రుల ఆశీర్వాదాలను కోరాడు. అప్పుడు ఆయన ముఖంలో ఎలాంటి విషాద ఛాయలూ కనపడలేదు. కానీ సీతమ్మ దగ్గరకు వచ్చినప్పుడు మాత్రం శ్రీరాముడు దుఃఖాన్ని ఆపుకోలేక విలపించాడు. మహాసాధ్వి అయిన సీతమ్మను వదలి పద్నాలుగేళ్ళు గడపాలన్న ఆలోచన శ్రీరాముని మదిని కలచివేసింది. అలాగని తన సంతోషం కోసం ఆ సౌమ్యురాలిని తనతో పాటు అరణ్యాలకు తీసుకువెళ్ళి కష్టాలపాలు చేయాలనే తలంపు ఆయనలో లేదు.

అలాగే సీతమ్మను తన వెంట రావొద్దని ఓదార్చిన శ్రీరామునితో 'నాథా! నీ ఎడబాటును క్షణమైనా భరించలేను. నీవున్న పర్ణశాలే నాకు స్వర్గధామం. నీవు నన్ను వదలి వెళితే, నది నుండి తీసి ఒడ్డున పడేసిన చేప ఎలాగైతే గిలగిలా కొట్టుకుంటూ మరణిస్తుందో, అలాగే నేను కూడా నీ సన్నిధికి దూరమైన మరుక్షణమే ప్రాణాలు విడుస్తాను' అని సీతమ్మ తన అసహాయతను తెలిపింది.

భార్యాభర్తల అనుబంధం కేవలం భౌతిక సంపదల పైనా, పరపతి పైనా ఆధారపడి ఉందనే అపోహలో ఉన్నంతవరకు అది ఆశామోహాల బంధమే గానీ అనురాగబంధం ఎన్నటికీ కాదు. భార్యాభర్తలు కష్టసుఖాల్లో ఒకరికొకరు తోడూ నీడై కలసి సహజీవనం చేయగలిగితేనే అది శాశ్వత అనురాగ బంధమై నిలుస్తుంది.

రామాయణంలో తండ్రీ తనయులు, అన్నదమ్ములు, భార్యాభర్తలు - ఇలా ప్రతి ఒక్కరూ మరొకరి ఆనందం కోసం పరితపించారు. అలాంటి ఆత్మీయతానురాగ బంధాలతో జీవించగలిగినప్పుడు ప్రతి ఇల్లూ ఓ 'శ్రీరామ నిలయం'గా మారుతుందనడంలో సందేహం లేదు. ❖

**ఆ ప్రాచీన ధీరయుగానికి కన్నుల వెలుగైన శ్రీరాముడు మూర్తీభవించిన సత్యధర్మాలు. ఆదర్శ తనయుడు, ఆదర్శ పతి, ఆదర్శ సోదరుడు అన్నిటికీ మించి ఆదర్శ నృపతి.** *- స్వామి వివేకానంద*

## గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# ఏప్రిల్ ఫూల్

ఒక రోజున ఓ వ్యక్తి రామకృష్ణ మఠ స్వామీజీని కలిసి మీతో 'పర్సనల్'గా మాట్లాడాలని అనుమతి తీసుకొని తన కథను ఇలా చెప్పుకున్నాడు : "స్వామీజీ! నేను చాలా కష్టాల్లో ఉన్న సమయమది. ఏమి చేయాలో, ఏమి చేయకూడదో తెలియని స్థితిలో ఒక పెద్ద మనిషిని సలహా అడిగాను. ఆయన నన్ను ఆంజనేయస్వామి గుళ్ళో నలభై రోజుల పాటు, ప్రతిరోజూ 108 ప్రదక్షిణలు చేయమన్నారు. దాని వలన నాలో పట్టుదల, ఆత్మవిశ్వాసం కలుగుతాయన్నారు. నేను ప్రతిరోజూ ప్రదక్షిణలు చేయడం మొదలు పెట్టాను. కొన్ని రోజుల తరువాత ఒకరోజు ఆ గుడి పూజారి నాతో ఇలా అన్నారు: 'చూడు బాబు! వట్టి ప్రదక్షిణాలతో హనుమంతుణ్ణి తృప్తి పరచలేవు. ఆయనకు 'వడమాల' వేసి ఘనంగా పూజచేయాలి. దానితో నీ గ్రహ దశ మారుతుంది. ఆరోగ్యం చేకూరుతుంది. నువ్వు పట్టిందంతా బంగారమవుతుంది. ఇలా చేయకపోతే పవన పుత్రుడు ఉగ్రరూపం దాలుస్తాడు. లంకలో జరిగిన కథ నీకు తెలిసిందే కదా! పూజకు రెండు వేల రూపాయలు ఖర్చు అవుతుంది. బాగా ఆలోచించుకో. నువ్వు 'ఊ' అంటే, అన్నీ నేనే స్వయంగా జరిపిస్తాను.'




పూజారి మాటలు విన్న నేను ఆలోచనలో పడ్డాను. రెండు వేల రూపాయలు నాశక్తికి మించిన ఖర్చు. అయినా ఏదో అప్పోసప్పో చేసి, హనుమంతుణ్ణి పూజిస్తే నా దశ తిరిగి ధనవంతుణ్ణి అవుతానేమో! కానీ ఆరోగ్యం సంగతే అంతు పట్టడం లేదు. నా రక్తంలో 'కొలెస్ట్రాల్' శాతం బాగా ఎక్కువగా ఉన్నదని, నూనె పదార్థాలు తింటే నా ఆరోగ్యానికి ముప్పు రావచ్చని మా డాక్టరుగారు చెప్పారు. పూజానంతరం ఆంజనేయుడి మెడలో వేసిన 'వడమాల' లోని 'ప్రసాదం వడలు' నేను తినవలసి ఉంటుంది. అవి తిన్నట్లయితే నా ఆరోగ్యం దెబ్బతింటుంది. ప్రసాదాన్ని తినకపోతే ఆంజనేయుడికి నా మీద కోపం రావచ్చు. ఆ కోపంలో ఆయన ఏమి చేసినా చేయవచ్చు. దేవుళ్ళకు కోపం వస్తే వారు ఎంతకైనా తెగిస్తారని సినిమాల్లో చూశాను. నేను అప్పుల పాలై దుర్దశకు గురికావచ్చు. మనసంతా అయోమయంగా ఉంది. దీనికంతా కారణం!? ఇప్పుడు అర్థమయింది. ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చాను. ప్రదక్షిణాలు చేయడం మానేశాను.

కానీ నా కష్టాలు తీరలేదు. ఇంకా ఎక్కువయ్యాయి. ఎప్పుడూ ఒకటే 'టెన్షన్', బద్ధకం, అలసట. ఓపిక సన్నగిల్లింది. చీటికీ మాటికీ చిరాకు. చేసే పని మీద ధ్యాస ఉండడం లేదు. సమస్యలు ఒకదాని తరువాత ఒకటి పోటీపడి పుట్టుకొస్తున్నాయి. 'ముద్దు ముద్దు గుమ్మడి పండు వీరి పేరేమి?' అన్నట్లు నా ఈ స్థితికి 'బ్లడ్ ప్రెషర్' మరియు 'డయాబెటిస్' అని నామకరణం చేశారు మా డాక్టరుగారు."

భోరున ఏడుస్తూ తన కథ చెప్పడం ముగించిన ఆ వ్యక్తితో, స్వామి ఇలా అన్నారు : "నాయనా! నేను చెప్పేది సావధానంగా విను. ఒక్కసారి శ్రీరామపట్టాభిషేకం గుర్తుకు తెచ్చుకో. సీతారాములు సభలో సింహాసనం మీద ఆసీనులయ్యారు. ఎక్కడ చూసినా ఆనంద కోలాహలం. సీతమ్మవారు హనుమంతుణ్ణి పిలిచి ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా, తనకు ప్రియమైన, తన మెడలో ఉన్న ముత్యాలహారాన్ని కానుకగా ఇస్తారు. కొద్దిసేపు అయిన తరువాత అమ్మవారి దృష్టి ఆంజనేయుడిపై పడుతుంది. ఆయన రాయితో హారంలోని ముత్యాలను ఒకటొకటిగా పగులకొట్టడం చూసి సహించలేక పోతారు అమ్మవారు. "ఆ(ప్టాల్! ఒక కోతి, కోతే!" అనుకుంటున్న అమ్మవారి మనస్సును కనిపెట్టిన మర్యాద రామన్న చిరు నవ్వుతో, "సీతా! ఆంజనేయుడి ప్రవర్తనకి ఏదో కారణం ఉండి ఉంటుంది. అడిగి తెలుసుకో" అంటారు. అమ్మ అడగగానే ఆంజనేయుడు "సీతమ్మ తల్లీ! ఆ రాముడే నాకు సర్వస్వం. మీరిచ్చిన హారంలోని ఏ ఒక్క ముత్యంలోను నా రాముడు కనబడలేదు. కాబట్టి ఆ హారంతో నాకు పని లేదు, అది తుచ్ఛం" అని అంటాడు.

ఇప్పుడు కొంచెం ఆలోచిద్దాం! సంవత్సరానికి ఒక్కసారి అయినప్పటికీ మనల్ని ఎవరైనా 'ఏప్రిల్ ఫూల్' చేస్తే దానిని మనం సహించలేం! కానీ నిత్యకల్యాణం - పచ్చతోరణంగా విలసిల్లుతున్న మన మూర్ఖత్వాన్ని గ్రహించలేకపోతున్నాం! ఏ 'ఫూల్' ఏమి చెప్పినా 'ఫుల్ ప్రూఫ్'గా నమ్ముతున్నాం! భగవంతుడికి 'నైవేద్యం', మన ఆత్మనివేదనమే అని మరచిపోతున్నాం! ❖

# సింహాద్రి నారసింహుని దివ్యగాథ

– భండారు పర్వతాలరావు

దశావతారాలలో నరసింహావతారం, వరాహావతారం ఉన్నాయి. కానీ వరాహ– నరసింహావతారం లేదు. అయినా విశాఖపట్నానికి 16 కిలోమీటర్ల దూరంలో ఉన్న సింహాచలంపై శ్రీవరాహ నరసింహస్వామి ఆలయం ఉంది.

**స్థలపురాణం:** స్థలపురాణాల ప్రకారం హిరణ్యకశిపుడు, విష్ణుభక్తి మానని కొడుకు ప్రహ్లాదునిపై కోపించి, అతణ్ణి సముద్రంలోకి తోయించి, పైకి తేలకుండా ఒక పర్వతాన్ని పడవేయించాడట. అప్పుడు శ్రీహరి ఆ పర్వతాన్ని ఎత్తి ఒడ్డున వేసి, ప్రహ్లాదుణ్ణి పైకి తీసి రక్షించాడు. ఆ సముద్రం విశాఖపట్నం వద్ద ఉన్న బంగాళాఖాతం కాగా, ఆ పర్వతం సింహాచలం అని చెబుతారు.

హిరణ్యాక్షుణ్ణి వధించిన వరాహ రూపం, హిరణ్యకశిపుణ్ణి వధించనున్న నరసింహరూపం కలిసిన వరాహ –నారసింహ రూపంతో స్వామి సింహాచలంపై వెలసి ప్రహ్లాదుడు, బ్రహ్మ మొదలైన వారి అర్చనలందుకున్నాడు. మధ్యలో కొంతకాలం ప్రహ్లాద నిర్మిత ఆలయం శిథిలమై, స్వామి ఒక పుట్టలో కప్పబడి ఉండిపోయాడనీ, స్వామి ఆదేశంపై పురూరవ చక్రవర్తి ఆ పుట్టను తొలగించి ఆలయాన్ని పునరుద్ధరించాడనీ స్థలపురాణమైన 'శ్రీ సింహాచల క్షేత్ర మాహాత్మ్యం' తెలుపుతోంది. ఈ గ్రంథానికి ఆధారం స్కంద పురాణం అని ఆ పుస్తకంలో ఉంది. స్వామి ఆదేశం పైననే మూల విరాట్టును చందనంతో కప్పివుంచే ఆచారం పురూరవుని నాటి నుండే ఏర్పడింది. పుట్టను తొలగించగా స్వామి నిజరూపమంతా బయల్పడినా, పాదాలు మాత్రం స్వామి సంకల్పం వల్ల భూమిలోనే ఉండిపోయాయి. అందుకే ఇక్కడ పాద దర్శనం లేదు.

**నిజరూపం:** శ్రీ సింహాచల నారసింహుడు ఉగ్రమూర్తి అనీ, ఆయనను శాంతింపజేయడానికే చందనపుపూత వేస్తారనీ అంటారు. కానీ 'శ్రీ సింహాచల క్షేత్ర మాహాత్మ్యం' ప్రకారం 'భూమి మీద నీ (నరసింహుని) సౌమ్యరూపం ఏదైనా ఉందా?' అని బ్రహ్మ, నరసింహుణ్ణి అడుగుతాడు. దానికి స్వామి 'హిరణ్యకశిపుణ్ణి సంహరించాక లక్ష్మితో కూడి నేను ప్రహ్లాదుని పూజలందుకుంటూ సింహాచలం మీద శాంతరూపంలో ఉన్నాను' అని జవాబిస్తాడు.

పురూరవుడు స్వామి ఆదేశంపై ప్రారంభించిన ఆచారం ప్రకారం ఏడాదిలో ఒక్క అక్షయతదియ (వైశాఖ శుద్ధ తృతీయ) నాడు మాత్రమే కొద్ది గంటలసేపు స్వామిపై గల చందనపు పూతను ఒలుస్తారు. అలా నిజ రూప దర్శనం చేసుకొనే అవకాశం భక్తులకు లభిస్తుంది. నిజరూప దర్శనం కాగానే తిరిగి వెంటనే చందనపు పూత వేస్తారు. దీనినే 'చందనోత్సవం' అంటారు. చందనం తొలగించగా కనిపించే మూర్తి – నిజరూపం. చందనపు పూతతో కనిపించే మూర్తి – నిత్య రూపం. స్వామిపై పూతగా ఉన్న చందనాన్ని ఒలిచి భక్తులకు చందన ప్రసాదంగా ఇస్తారు. దీనిని కొంత ధరించి, కొంత నీటిలో కలిపి తీర్థంగా సేవిస్తే ఆధి వ్యాధులు తీరుతాయని భక్తుల విశ్వాసం.

సింహాద్రినాథునిలో ముఖం వరాహానిది. శరీరం నరునిది. వాలం (తోక) సింహానిది. సింహాచలంలో తప్ప నరహరి ఎక్కడా తోకతో కనిపించినట్లు లేదు. స్వామి వరాహ నరసింహుడైనా, లక్ష్మీ వరాహ నరసింహుడిగానే వ్యవహారం. లక్ష్మి ఆయన వక్షస్థల వాసి గదా! మూలవరుల క్రింద ఇరుప్రక్కలా శ్రీదేవి, భూదేవులుంటారు. ❖

(ఏప్రిల్ 24, మంగళవారం
అక్షయ తృతీయ, సింహాచల చందనోత్సవం)




సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వమ్।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

# సత్సంగం...సన్మార్గం

- స్వామి జ్ఞానదానంద

హిరణ్యకశిపుడి పాలనలో ఆ రాక్షసాధినేత అండ చూసుకొని అసురులు స్వైరవిహారం చేసేవారు. వారితో పాటు వారి కుమారులు కూడా పెడదోవపడ్డారు. చేసే పనుల నుంచి చదివే చదువుల వరకు సమస్తమూ వినాశకరంగానే సాగిపోయేవి. వారికి లభించిన గురువులు కూడా రాక్షసనీతినే రాజనీతిగా బోధిస్తూ ఉండేవారు. ఫలితంగా గురుకులమంతా దుర్జనమయమై పోయింది. ఆ దుస్థితిలో భక్త ప్రహ్లాదుడు ఆ ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు. సచ్ఛీలుడైన ఆ ఒక్క బాలుడి సాంగత్యంతో దుష్టపరిసరాలన్నీ మారిపోయాయి. సంసారపు ఊబిలో కూరుకుపోయి, తమ స్వరూపాన్ని కూడా తాము మరచిపోయి, వందల కొద్దీ జన్మలెత్తినా కర్మబంధాల చిక్కుల్లో నుంచి మనవారు బయటపడడం లేదని ప్రహ్లాదుడు వారికి హితవు పలికాడు. భగవంతుడే భద్రతనిచ్చేవాడని భక్తి మాధుర్యాన్ని చవి చూపించాడు. అనుకూలమైన సమయాలలో అనేక విధాలుగా మోక్షపథాన్ని ప్రబోధించాడు. కఠిన పాషాణులైన రాక్షస కుమారులను కూడా తరింపచేశాడు. సత్సంగమహిమతో దైత్యుల హృదయాలలో కూడా హృషీకేశుడు కొలువుతీరాడు. సజ్జనుల మైత్రి సాఫల్యమది. ఈ పరమసత్యాన్ని జగద్గురువులు ఆదిశంకరాచార్యులు తన 'భజగోవిందం'లో విస్పష్టం చేస్తూ...

**సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వమ్।**
**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥** అంటున్నారు.

జ్ఞానులైన సజ్జనుల సాంగత్యం వల్ల సంసారబంధాలన్నీ విడిపోతాయి. బంధాలు విడిపోతే, అజ్ఞానమూలకమైన మోహం తొలగిపోతుంది. మోహం నశిస్తే నిశ్చలమైన పరిశుద్ధ తత్త్వం గోచరిస్తుంది. అది తెలిసినప్పుడు జీవన్ముక్తి కలుగుతుందంటూ హితవు పలుకుతున్నారు.

ఈ లోకంలోకి అడుగుపెట్టామంటేనే, మనం అప్రమేయంగా అనేక బంధాలకు బందీ అయినట్లేనని అర్థం చేసుకోవాలి. ఎంత కాదనుకున్నా, అవి మనల్ని తమ కబంధహస్తాలతో ఆలింగనం చేసుకుంటూనే ఉంటాయి. అలా విషయ ప్రపంచంలో కొట్టుకుపోతున్న విషమపరిస్థితుల్లో మనల్ని సక్రమ మార్గం వైపునకు నడిపే శక్తి సజ్జన సమూహానికే ఉంటుంది. సాంగత్యాన్ని బట్టే మనకు సంస్కారాలు అలవడతాయి. ప్రపంచంపై పెంచుకుంటున్న అనురక్తే (attachment) సమస్త దుఃఖాలకు కారణం. ఈ అనుబంధాలు మనిషిని మోహంలో పడవేస్తాయి. చివరకు ఈ మోహం జీవిని విముక్తుణ్ణి కాకుండా నిరంతరం చక్రంలా తిప్పుతూనే ఉంటుంది. ఈ ప్రాపంచిక చట్రంలో దీనికి ఒకే ఒక పరిష్కారం సాధుసాంగత్యం, సత్పురుషుల సాహచర్యం!

**సత్సంగత్వంతో నిస్సంగత్వం :** సజ్జనుల సాహచర్యంలోకి వచ్చేంత వరకు తెలీదు, మనం అప్పటి దాకా నిరర్థకమైన సమూహాల మధ్యే కాలం గడిపామని! దురదృష్టవశాత్తూ మన పరిసర ప్రపంచంలో నానాటికీ ఇలా మార్గదర్శకులుగా నిలిచే వ్యక్తులే కరువవుతున్నారు. సాధుజీవులు కాగడాలు వేసినా కనిపించడం లేదు. పైగా మనం సన్నిహితులమని భావించే వాళ్ళంతా మనకు ప్రియమైందే చెబుతారు; కానీ హితమైంది



చెప్పరు. మనం పొరపాట్లు చేస్తున్నా, 'మనకెందుకులే' అని అనుకొని మంచి మాటలతో సరిదిద్దరు. కానీ సజ్జనులు మనల్ని దారి తప్పినప్పుడు హెచ్చరిస్తూ ఉంటారు. సకల సంశయాలను నివృత్తి చేస్తూ ఉంటారు. అందుకే మనల్ని మనం అంచనా వేసుకోవాలంటే సత్సాంగత్యాన్ని ఎంచుకోవాలి. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు –"సదా సాధు సాంగత్యం ఉండాలి. ఫలితంగా శాంతి చేకూరుతుంది. మొసలి నీటిలో చాలాసేపు ఉండిపోతుంది. కానీ ఊపిరి పీల్చుకోవడానికి అప్పుడప్పుడు ఉపరితలానికి వస్తుంది. అప్పుడు భారంగా ఊపిరి పీల్చుకొని ఉపశమనం పొందుతుంది. సర్వదా సత్సంగం ఎంతో అవసరం. గంగానదికి ఎంత సమీపంగా వస్తే అంత చల్లగాలిని అనుభవించవచ్చు. వ్యాకులత ఉంటే సజ్జనుల సాహచర్యం లభిస్తుంది. సాధు సాంగత్యం ద్వారా మన సంశయాలు కూడా

తీరిపోతాయి". ఇలాంటి అవగాహన, ఆచరణ లేకపోవడం వల్లనే మనలో చాలామంది జీవిత చరమాంకం వరకు సంశయాత్ములు గానే మిగిలిపోతున్నారు. బంధాల నుంచి విడివడే ప్రయత్నమైనా చేయడం లేదు. నిస్సంగత్వం (detachment)తో కర్మల్ని నిర్వర్తిస్తే మనలో ఎలాంటి మమకార, వికారాలు పొడసూపవు. మోహపు తెరలు ఆవరించవు.

**నిస్సంగత్వంతో నిర్మోహత్వం :** వివేకశూన్యంగానే మన రోజువారీ జీవితాలు గడచిపోతున్నాయి. ఎటు వెళుతున్నామో తెలియకుండానే పరుగులు తీస్తున్నాం. విషయప్రపంచం చుట్టూ వెఱ్ఱిగా తిరుగాడుతున్నాం. జీవితాన్ని త్యాగం చేసి, పరుల సేవలో తరించిపోతున్న సాధుపుంగవులు, సత్పురుషులు మన మధ్యే పరమ పవిత్రంగా జీవిస్తూ దారిదీపాల్లా కనిపిస్తూనే ఉంటారు. కానీ మనం మాత్రం కళ్ళు మూసుకొని మనం సృష్టించుకున్న సంకుచిత ప్రపంచమే పరమావధిగా భావించుకుంటూ, వెఱ్ఱిబాగులవాళ్ళలా మిగిలిపోతున్నాం. మానవుల ఈ దుఃస్థితికి ఓ మారు శ్రీరామచంద్రుడు...

**ఇతస్తతో దూరతరం విహృత్య, ప్రవిశ్య గేహం దివసావసానే**
**వివేకి లోకాశ్రయ సాధుకర్మ రికేఽ ప్యి రాత్రౌ! క ఉపైతి నిద్రామ్ ...** అని ఆందోళన వ్యక్తం చేస్తాడు. 'నాకు ఒక విషయం చూస్తుంటే చాలా విచిత్రంగా అనిపిస్తోంది. ఈ జనులంతా ఏవేవో కార్యక్రమాలను రచించుకొని, అందులో నిమగ్నులై పగలంతా అటూ, ఇటూ తిరుగుతున్నారు. వివేకులను ఆశ్రయించకుండానే, సత్కర్మలను నిర్వర్తించకుండానే సాయం కాలానికి ఇల్లు చేరుకుంటున్నారు. రోజంతా ఎలాంటి వివేకం పొందకుండానే గడచిపోతోంది కదా! ఇక వారికి రాత్రిపూట నిద్ర ఎలా పడుతోంది? ఇలా ఒక రోజు వృథా అయినందుకు చింతించరేం?' అని తన గురువరేణ్యులను ప్రశ్నిస్తాడు.

**నిర్మోహత్వంతో నిశ్చలతత్త్వం** : ఎన్ని సౌకర్యాలు, సౌలభ్యాలు అమరినా ఆధునిక ప్రపంచంలో మనిషి నిశ్చలంగా ఉండలేక పోతున్నాడు. ఆశల పాకుడురాళ్ళపై పరుగులు పెడుతూ, వ్యామోహాల వరదలో కొట్టుకుపోతున్నాడు. నిరంతరం మన ధ్యానం, ధ్యాస అంతా బాహ్య ప్రపంచంపైనే కేంద్రీకరిస్తూ ఉంటే, ఆ విషయవాసనలు మనల్ని క్షణం కూడా కుదురుగా ఉండ నివ్వక పోగా, మనస్సు నిశ్చలస్థితికి ఆటంకం కలిగిస్తాయి. ఈ రోజుల్లో మారుమూల పల్లెలకు వెళ్ళిచూసినా, పదేళ్ళ బాలుడి నుంచి పండు ముదుసలి వరకు ప్రతి ఒక్కరూ విపరీతమైన అలజడికి గురవుతున్నారు. మనస్సును అంతర్ముఖం నుంచి బహిర్ముఖం వైపు మరలిస్తూ ఉండడమే దీనికి కారణం. ముఖ్యంగా టీవీలు, చలనచిత్రాల వంటి చౌకబారు వ్యసనాలు, వ్యాపకాలు మనుషుల్ని కోరికల పుట్టల్లా మార్చేస్తున్నాయి. మనస్సు కోరుకున్నట్లు ఒకటి తీర్చితే, మరొకటి పుడుతుంది; తీర్చకపోతే అసహనం, అసంతృప్తి! చివరకు కోపం! ఇలా మోహాలు మోపుల్లా పేరుకుపోతుంటే నిశ్చలత్వం ఎలా సాధ్యమవుతుంది? కాని నిశ్చలంగా ఉన్నప్పుడే మనిషి దేన్నైనా సాధించగలడు. శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో అంటాడు...

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।**
**సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥**

'విషయచింతనల వల్ల వాటి యందు ఆసక్తి జనిస్తుంది. ఈ ఆసక్తి బలపడి కామంగా పరిణమిస్తుంది. ఆ కామం నుంచి కోపం కలుగుతుంది. ఇక క్రోధం నుంచి అవివేకం; అవివేకం నుంచి ఉచితానుచిత విచక్షణ కోల్పోయి సదసద్విచారము లోపిస్తుంది. ఈ వివేకం నశించాక మానవుడికి బుద్ధి నశించి



నాశనమవుతాడు'. అందుకే సత్పురుషుల సుబోధతో మోహత్వాన్ని మొగ్గలోనే తుంచేస్తే, మనస్సు నిశ్చలమవుతుంది.

**నిశ్చలతత్త్వంతో జీవన్ముక్తి :** మనస్సు నిశ్చలమైనప్పుడే, అది గోవిందుణ్ణి భజించగలదు. తనను తాను భగవంతుడికి అర్పించుకోగలదు. నిలకడ లేని తెరపై చిత్రాలు ఎంత అస్పష్టంగా ఉంటాయో, నిశ్చలంగా లేని మనస్సులో కూడా జీవన అనుభవా లకు సంబంధించిన ఉచితానుచిత జ్ఞానం కూడా అంతే అస్పష్టంగా ఉంటుంది. వాటిని సాక్షిలా పరిశీలించే విచక్షణను కోల్పోతుంది. అప్పుడు మనస్సులో భౌతికప్రపంచానికి ఆవల నున్న భగవంతుణ్ణి స్మరించుకొని తరించాలన్న పిపాస కూడా కొరవడుతుంది. ఈ జీవితంలోనే ముక్తిని పొందాలన్న కాంక్ష కూడా మనస్సులో పొడసూపదు. అలా పరీక్షిత్తు మహారాజు తపించాడు; కనుకనే సాక్షాత్తూ బ్రహ్మజ్ఞాని అయిన శుకమహర్షి వచ్చి ఏడురోజుల్లోనే ముక్తిని పొందే మార్గంగా శ్రీమద్భాగవతాన్ని ప్రవచించాడు. పుణ్యపురుషుల సాంగత్యంతో కలిగే ఫలితం అంత మహోన్నతంగా ఉంటుంది. మన సనాతన ధర్మం అంటోంది...

**గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరు స్తథా ।**
**పాపం తాపం చ దైన్యం చ హంతి సంతో మహాశయః ॥**

గంగానది పాపాన్ని పోగొడుతుంది; చంద్రుడు తాపాన్ని పోగొడతాడు; కల్పవృక్షం దారిద్ర్యాన్ని పోగొడుతుంది. గొప్ప ఆశయాలు కలిగిన సజ్జనులు పాపాన్నీ, తాపాన్నీ, దారిద్ర్యాన్నీ - మూడింటినీ పోగొడతారు. ❖

**వకీలు కనిపించగానే న్యాయస్థానాలు తలపుకు వస్తాయి. అలాగే సద్భక్తులు కనిపించినప్పుడు భగవంతుడు తలపుకు వస్తాడు. సత్సంగం ఆత్మవికాసానికి దోహదకారి.** - శ్రీరామకృష్ణ పరమహంస

# అనుకూల వేదాంతం...

ఒకసారి నలుగురు పండితులు తీర్థయాత్రకు బయలు దేరారు. తమకు కావలసిన ఆహారము సమకూర్చుకుని తమతోపాటు తీసుకువెళ్ళారు.

మిట్ట మధ్యాహ్నం అయ్యే సరికి ఒక విశాలమైన చెట్టు నీడను సమీపించిన వారు తమ భోజనాలు ముగించుకుని మళ్ళీ ప్రయాణం మొదలుపెట్టవచ్చునని భావించారు. వారిలో ఒకడు 'ఆహారం స్వీకరించడానికి ముందు స్నానం చేయాల'ని అన్నాడు. వెంటనే వారు తమ భోజన మూటలను చూసుకోమని ఒకడిని అక్కడ కాపలావుంచి మిగతా ముగ్గురూ స్నానం చేయడానికి వెళ్ళారు.

స్నానానికి వెళ్ళినవారు ఎంతసేపటికీ తిరిగిరావడంలేదు. కాపలా ఉన్నతనికి ఆకలి విపరీతమవుతోంది! అందువల్ల ఇక లాభం లేదనుకుని తాను తీసుకువచ్చిన మూటను విప్పి ఆతృతగా తినేశాడు. కానీ అప్పటికీ అతని ఆకలి చల్లారినట్లులేదు. ఇంకొకతని భోజనం కూడా తిన్నాడు. ఇలా ఆ ముగ్గురి భోజనాలు ఇతడే స్వాహాచేసి, అలసటతో మంచి నిద్రలోకి జారుకున్నాడు.

స్నానానికి వెళ్ళిన ముగ్గురూ ఆకలితో వచ్చి చూసేసరికి వారి ఆహారపు మూటలన్నీ ఖాళీ అయ్యాయి. నిద్రపోతున్న వానిని లేపి ప్రశ్నిస్తే, 'అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః... - నేను వైశ్వానరుడు (జఠరాగ్ని)గా ఉంటూ నాలుగు విధములైన ఆహారాలను జీర్ణిస్తున్నాన'ని గీతలో భగవానుడు చెప్పిన శ్లోకాన్ని వల్లించాడు.

అప్పటికే ఆకలితో బాధపడుతున్న ఆ ముగ్గురికీ ఆ మాటలు చాలా కోపాన్ని కలిగించాయి. కర్రలు తీసుకుని గొడ్డును బాదినట్లు అతణ్ణి బాదుతూ, 'నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః... ఈ ఆత్మను ఆయుధాలు ఖండించలేవు, అగ్ని దహించలేదు, నీరు తడపలేదు' అనే గీతా శ్లోకాన్ని ఉల్లేఖించారు.

కేవలం శాస్త్ర పాండిత్యం మాత్రమే కలిగివున్న పండితుడు తనను వైశ్వానరునిగా పేర్కొన్నాడు. అందువల్ల మొదటివాడు వల్లించిన శాస్త్రముల నుండియే వారు కూడ శ్లోకములు ఉల్లేఖించి మంచి గుణపాఠం నేర్పారు.

మన అవసరాలకు తగ్గట్టుగా విపరీత అర్థాలను తీసుకొనే వేదాంతం భగవంతుణ్ణి దర్శించుకోవడానికి పనికిరాదు. అనుభవ జ్ఞానం మాత్రమే మనము భగవంతుణ్ణి చేరుకోవడానికి తోడ్పడుతుంది. ❖

# ఉన్నతమైన వ్యవసాయం

నానక్ ఎప్పుడూ ధ్యానంలో నిమగ్నమై పర ధ్యానంగా ఉండేవాడు. అందువలన అతని తల్లితండ్రులు చాలా బాధపడుతుండేవారు. ఒకరోజు అతని తండ్రి నానక్‌కు వ్యవసాయం చేయమని ఎంతో నచ్చజెప్పాడు. అందుకు నానక్ "తండ్రీ! నాకు ఎంతో శ్రేష్ఠమైన క్షేత్రమొకటి దొరికింది. అందులో నుండి క్రొత్త మొలకలు క్రమక్రమంగా మొలకెత్తుతున్నవి. అవి పెరుగుటకు నేను శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తున్నాను. అందువల్ల నేను ఇప్పుడు మరొక పొలంపై నాదృష్టి పెట్టలేను" అని బదులు చెప్పాడు.

అప్పుడు తండ్రి "నాయనా! నీ వ్యవహారం నాకు వింతగా తోస్తున్నది. నీకు ఏమి పొలం దొరికింది? ఎక్కడ దొరికింది? మనకు ఎంతో పొలం ఉంది. అందులో వ్యవసాయం చేస్తే పంట సమృద్ధిగా పండుతుంది" అని చెప్పాడు.

అప్పుడు కుమారుడు "నా మనస్సే పొలం. సత్ కర్మే నాగలి. దానితోనే నేను సదా ఆ పొలాన్ని దున్నుతున్నాను. సంతోషమను సాధనం పొలంను ఎత్తు పల్లములు లేకుండా చేస్తున్నది. పొలంలోకి అనురాగమనే నీరు పారుతుంది. హరినామమను విత్తనములు అందులో నాటబడుతున్నాయి. తరువాత భక్తవత్సలుడైన భగవంతుని కృపతో మోక్షమనే ఫలసాయం తప్పక లభిస్తుంది" అని తండ్రికి జవాబిచ్చాడు.

ప్రతివ్యక్తీ తన మనస్సును ఓ ఆధ్యాత్మిక క్షేత్రంగా మలచి సాధన చేస్తే భగవంతుని కృప అనే ఫలసాయం లభించి తీరుతుంది. ఇదే మానవజన్మ సార్థకతకు ఉపయోగపడే ఉన్నతమైన వ్యవసాయం. ❖

## పండుగలు - పర్వదినాలు

**ఏప్రిల్ - 2012**

| | | | |
|---|---|---|---|
| 01 | ఆదివారం | : | శ్రీరామనవమి |
| 03 | మంగళవారం | : | ఏకాదశి |
| 17 | మంగళవారం | : | ఏకాదశి |
| 24 | మంగళవారం | : | అక్షయతృతీయ<br>సింహాచల స్వామి చందనోత్సవం |
| 26 | గురువారం | : | ఆదిశంకరాచార్య జయంతి |

**మే - 2012**

| | | | |
|---|---|---|---|
| 02, 16 | బుధవారం | : | ఏకాదశి |
| 04 | శుక్రవారం | : | నృసింహ జయంతి |
| 06 | ఆదివారం | : | బుద్ధపూర్ణిమ |
| 15 | మంగళవారం | : | హనుమజ్జయంతి |
| 20 | ఆదివారం | : | ఫలహారిణీ కాళీ పూజ |
| 31 | గురువారం | : | ఏకాదశి |

బూడిద క్రమ్మిన వజ్రం ఎలా మలినమవుతుందో అట్లే పండితులు, వీరులు, వినయశీలురు, కృతజ్ఞులు సంపదను ఆర్జించగానే తమ తమ స్వభావాలను కోల్పోయి భ్రష్టులవుతారు. - శ్రీరాముడు



స్వామి వివేకానంద అకాడమీ ఆఫ్ ఎడ్యుకేషన్, హైదరాబాదు

రిజిష్టర్ నెం. 79/ 1970 యాజమాన్యం నిర్వహించు

# స్వామి వివేకానంద సెంటినరీ హైస్కూల్

(ప్రభుత్వ ఎయిడెడ్) స్థాపితం : 1964

**మలక్‌పేట, హైదరాబాదు - 500 036. ఫోన్ : 040-24549666, 9010282702**

Email : swami_school@hotmail.com website: swamivivekanandaschool.org

## విజ్ఞప్తి

సమాజములోని అట్టడుగు వర్గాలలోని విద్యార్థులకు విద్యను అందించాలన్న సదుద్దేశంతో 1964వ సంవత్సరంలో రామకృష్ణ మఠ స్వామీజీల సలహా మేరకు, ప్రభుత్వం కేటాయించిన రెండెకరాల స్థలంలో స్వామి వివేకానంద సెంటినరీ హైస్కూల్ స్థాపించబడింది.

ఈ పాఠశాల స్వర్ణోత్సవాలను (2013-2014) పురస్కరించుకొని పాఠశాలలోని తాత్కాలిక గదులను తొలగించి వాటి స్థానంలో మూడు అంతస్తుల పక్కా భవనము నిర్మించాలని యాజమాన్యం తీర్మానించింది. ఈ భవన నిర్మాణానికి సుమారుగా కోటి రూపాయలు వ్యయమవుతుందని నిపుణులు అంచనా వేశారు.

విద్యార్థుల సౌకర్యార్థం నిర్మింపతలపెట్టిన ఈ పాఠశాల నూతన భవన నిర్మాణానికి సహృదయులైన పూర్వ విద్యార్థులు, శ్రేయోభిలాషులు, స్వామి వివేకానంద అనుయాయులు విరాళాలు ఇచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

విరాళాల్ని Swami Vivekananda Academy of Education, Golden Jubilee Block పేరున చెక్కు/ డి.డి తీసి The Head Master, Swami Vivekananda Centenary High School, Malakpet, Hyderabad - 500 036 చిరునామాకు పంపాల్సిందిగా మనవి. విరాళాలను ఆన్‌లైన్ ద్వారా S.B.H. Dilsukhnagar Branch - A/c No. 62220306130-0269 లో నేరుగా జమచేయవచ్చు.

ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

యాజమాన్యం

**స్వామి వివేకానంద సెంటినరీ హైస్కూల్**

**మలక్‌పేట, హైదరాబాదు-500 036**

## ఆహ్వానము

స్వామి వివేకానంద సెంటినరీ హైస్కూల్ స్వర్ణోత్సవాల సందర్భంగా నిర్మింప తలపెట్టిన నూతన భవనానికి హైదరాబాదు రామకృష్ణ మఠం అధ్యక్షులు శ్రీమత్ స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ వారిచే 16-4-2012 తేదీ ఉదయం 10 గంటలకు శంకుస్థాపన జరుగనున్నది. ఈ కార్యక్రమానికి మిత్రులను, శ్రేయోభిలాషులను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాం.

అదే రోజు సాయంత్రం 6.30 గంటలకు దోమలగూడ, రామకృష్ణ మఠంలోని వివేకానంద సభాగృహంలో శ్రీఅయ్యగారి శ్యామసుందర్‌గారు (సంగీతనాటక అకాడమీ అవార్డు గ్రహీత), వారి శ్రీమతి జయలక్ష్మీ శ్యామసుందర్ గార్ల వీణావాదన కార్యక్రమం జరుగును.

**అందరూ ఆహ్వానితులే....**

యాజమాన్యం

**స్వామి వివేకానంద సెంటినరీ హైస్కూల్**

**మలక్‌పేట, హైదరాబాదు-500 036**

Advt.,




- స్వామి వివేకానంద

# అందరికీ అందే ఆదర్శం



వేదాంతం ఒక ఆదర్శాన్ని ఉద్బోధిస్తోంది. ఆదర్శం ఎప్పుడూ ప్రస్తుత స్థితికి ఎంతో అతీతమై వెలుగుతూ ఉంటుందని మనకు తెలుసు. అంటే మనం సాధించగలిగిన దానికిది మించి ఉంటుంది. మనిషి స్వభావంలో రెండు పోకడలున్నాయి. ఒకటి ఆదర్శాన్ని క్రిందకి లాగి, జీవితంలో సామరస్యాన్ని కలిగించే ప్రయత్నం చేస్తుంది. రెండోది జీవితాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దుతుంది. దీన్ని గ్రహించడం చాలా గొప్ప సంగతి. ఎందుకంటే ఈ మొదటిదే సామాన్యంగా మన జీవితాలను లోబరచుకోవాలని చూస్తూంటుంది. అందులో చాలా భాగం చెడ్డది కావచ్చు; కోపం, లోభం, మోహం మొదలైన చిత్తవృత్తులే ప్రేరేపించేవై ఉండొచ్చు. అప్పుడు ఎవరైనా నాకొక ఆదర్శాన్ని బోధించాలనుకొని, ముందుగా "స్వార్థం, భోగం విడిచిపెట్టమని" చెబితే, నాకది సాధ్యం కాదనిపిస్తుంది. కానీ అతడు నా స్వార్థానికి భంగం లేని ఆదర్శాన్ని చూపగలిగితే, సంతోషించి తక్షణం ముందుకు దూకుతాను. అది నాకు అనుకూలమైన ఆదర్శం!

"శిష్టత్వం" అనే పదంలానే "సాధనీయం" అనే పదం కూడా పలురీతుల అర్థాల్లో కనిపిస్తుంది. "నా ఆచారమే శిష్టం; నీ ఆచారం దుష్టం". "సాధనీయం" అనేది కూడా ఇలాగే ఉంది. సాధనీయం అని నేను అనుకొన్నదొక్కటే ప్రపంచంలో ఆచరణ యోగ్యమైనట్లు నా కనిపిస్తుంది. నేను అంగడి పెట్టుకొన్నవాడినైతే, అంగళ్ళు పెట్టుకోవడమే ప్రపంచంలో ఆచరణ యోగ్యమైన వృత్తి అని భావిస్తాను. నేను దొంగనైతే దొంగతనం చేయడమే ఆచరణయోగ్యమని భావిస్తాను. మిగిలినవి ఆచరణయోగ్యాలుగా కనిపించవు. "అనుష్ఠానయోగ్యం" అనే మాటను, తన కిష్టమైనట్టి, తాను చేయగలిగినట్టి విషయాలకు అనుబంధం చేసి మనలో ప్రతి ఒక్కడూ ఎలా వాడతాడో తెలిసికొన్నారు కదా! కాబట్టి "వేదాంతం అత్యంత అనుష్ఠాన యోగ్య" మన్నప్పుడు ఆదర్శార్థంలో మాత్రమే అని గ్రహించండి! అది బోధించే ఆదర్శం అత్యున్నత మైంది. ఆ ఆదర్శం "తత్త్వమసి" – బ్రహ్మం నీవే– అన్నది. ఇదే వేదాంత తత్త్వసారం.

ఆత్మకు ఎన్నడూ జననం లేదు. ఎన్నడూ మరణం లేదు. మనం మరణిస్తాం అని అనుకోవడం, మరణానికి భయపడడం కేవలం మౌఢ్యం. మనం దీన్ని చేయగలం, దాన్ని చేయజాలం అనే భావాలు వెట్టివే. మనం అన్నీ చేయగలం. వేదాంతం నరునికి ప్రప్రథమంగా ఆత్మవిశ్వాసాన్ని బోధిస్తోంది. 'తనకు అతీతుడైన సగుణబ్రహ్మ ఒకడున్నాడని విశ్వసించనివాడు నాస్తికుడనీ, తనమీద తనకు విశ్వాసం లేనివాడు నాస్తికుడనీ, మన ఆత్మ మహిమను మనం విశ్వసించక పోవడమే నాస్తికత' అని వేదాంతం బోధిస్తోంది. ఈ ఆదర్శం అందరికీ అందేది కాదని చాలా మంది అనుకొంటారు. కానీ "ప్రతి ఒక్కరూ దాన్ని పొందగలరు" అని వేదాంతం నొక్కి వక్కాణిస్తోంది. ❖




- యం. కృష్ణమూర్తి, సూర్యాపేట.

**? : జానకీమాత బంగారు జింకను ఎందుకు కోరినట్లు? భవిష్యత్తులో తనకు ఆపద కలుగుతుందని తెలియదా?**

✍: అవతారపురుషుల లక్ష్యం - ధర్మస్థాపన, సత్ పురుషుల రక్షణ. దుష్టుల శిక్షణకూ, దుష్టుడైన రావణుని చంపుటకూ జరిగిన లీలానాటకంలో ఇది ఒక ఘటన. లీలలను అర్థం చేసుకోవాలి కానీ, శంకించరాదు. సతీదేవి అనేక వేల రూపాలలో దర్శన మిచ్చిన రాముల వారికి అది మాయలేడి అని తెలియును గదా! మాయసీత కొడుకు లాగా చూసుకొన్న లక్ష్మణుణ్ణి తిట్టి పంపివేసినట్లూ, అప్పుడే రావణుడు ఆ మాయ సీతను అపహరించినట్లూ కొన్ని రామాయణాల్లో ఉంది. అందుకే వారి లీలల్ని అర్థం చేసుకోవాలి.



- ఎమ్. యాదగిరి, చర్లపల్లి.

**? : జ్ఞానం, జ్ఞానయజ్ఞం గురించి వివరించ ప్రార్థన!**

✍: సమ్యక్ దర్శనం జ్ఞానమని చెప్పి దాని స్తుతి చేస్తున్నారు. అన్ని చోట్లా, అందరిలో, అన్ని వేళలా పరబ్రహ్మను చూడడాన్ని 'సమ్యగ్దర్శనం' అంటారు. అన్ని చోట్లా ఉన్న బ్రహ్మ మనలో గల ఆత్మ చైతన్యం కన్నా వేరు కాదు. అందరిలో తననూ, తనలో అందరినీ చూసే సమ్యగ్దర్శనమే జ్ఞానం.

ఆ జ్ఞానాన్ని ఉపదేశించడాన్ని జ్ఞానయజ్ఞమంటారు. ఆత్మజ్ఞానం ఉపదేశించేవారికి మళ్ళీ జన్మ లేదు. అందువల్ల అది శ్రేష్ఠం. జ్ఞానయజ్ఞం చేసిన రామకృష్ణ పరమహంస వారిని అందరూ పూజిస్తున్నారు కదా!

- కె.వి. రామదుర్గయ్య, నెల్లూరు.

**? : 'వంచక వ్యాపారాలలో నేను జూదమై ఉన్నాను' అనే భగవద్గీతా వాక్యాన్ని వివరించగోరుతున్నాను.**

✍: 'నేను సమస్త జగత్తునకూ ఉత్పత్తి స్థానాన్ని! నా వల్లనే సమస్తమూ నడుస్తోంది' అని పరమాత్మ అన్నారు. వాటిని అస్తి, భాతి, ప్రియ (సత్, చిత్, ఆనంద) రూపంతో చూడాలి. అది అంతటా వ్యాపకమే. నామ రూపాలు కల్పితాలు. సదాచారులందు, దురాచారులందు బ్రహ్మబుద్ధి కలవాడు శ్రేష్ఠుడు, జ్ఞాని. ఈ విధంగా అంతటా బ్రహ్మబుద్ధి చెయ్యలేని పక్షంలో చెప్పిన విభూతులలో బ్రహ్మబుద్ధిని అభ్యసించి, తరువాత సర్వత్రా బ్రహ్మబుద్ధిని అలవరచుకోవాలి. 'ఏ యే వస్తువులలో నేను నిన్ను ధ్యానింతును?' అన్నది ప్రశ్న. ధ్యానించవలసినవి విభూతులు కాదు, వానిలోవున్న బ్రహ్మతత్త్వాన్ని అని తెలుసుకోవాలి.

- ఆరుద్ర శ్రీకాంత్, ముల్లలపల్లి.

**? : మోక్షానికి అద్వైతమే పరమావధి అని ఆచార్య శంకరులు చెప్పారు. భక్తిమార్గం ద్వారా మోక్షం పొందవచ్చునా?**

✍: ఆది శంకరాచార్యులు చెప్పిన మాట అక్షరాలా నిజం. "స్వస్వ రూపాను సంధానం భక్తి రిత్యభి దీయతే" ఆత్మ చింతనే భక్తి అన్నారు. ఆ ఆత్మ పరబ్రహ్మం కన్నా వేరు కాదు. శ్రీమద్భగవద్గీతలో కృష్ణ పరమాత్మ కూడా ఇదే విధంగా చెప్పారు. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ (7-18) - జ్ఞాని నా ఆత్మ స్వరూపుడు'. కానీ నిర్గుణోపాసకులు దేహాభిమానాన్ని త్యజించాలి. అది కష్టతరమైన మార్గం. అందువల్ల కలియుగంలో భక్తిమార్గమే సులభతరం. శ్రీకృష్ణుడు 'భక్తాస్తేఽతీవమే ప్రియ - భక్తులు నాకు అత్యంత ప్రియులు' అని భక్తియోగంలో అనేకసార్లు చెప్పారు. 'దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే (10-10) - భక్తులకు తత్త్వ విషయకమగు సమ్యక్ జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను' అని శ్రీకృష్ణుడు బోధించాడు.

శ్రీరామకృష్ణ పరమహంస వారు భక్తితో కాళీమాతను ఆరాధించి సాక్షాత్కరించుకొన్నారు. తరువాత గురువులైన తోతాపురి వద్ద అద్వైత సాధన చేశారు. కనుక భక్తి ద్వారా మోక్షం తేలికగా పొందవచ్చు అని అర్థమవుతుంది. ❖



# జయజయ రామా... సమరవిజయ రామా

- శ్రీమతి బి.కృష్ణకుమారి



**జయజయ రామా సమరవిజయరామా**
**భయహర నిజభక్త పారీణ రామా**
**జలధి బంధించిన సౌమిత్రి రామా**
**సెలవిల్లు విరచిన సీతారామా**
**అల సుగ్రీవు నేలిన అయోధ్యరామా**
**కలిగి యజ్ఞము గాచే కౌసల్యరామా**
**అరి రావణాంతక ఆదిత్యకుల రామా**
**గురుమౌనులను గాచే కోదండ రామా**
**ధరనహల్య పాలిటి దశరథరామా**
**హరురాణి నుతల లోకాభిరామా**
**అతిప్రతాపముల మాయామృగాంతక రామా**
**సుతకుశలవప్రియ సుగుణరామా**
**వితత మహిమల శ్రీవేంకటాద్రిరామా**
**మతిలోన బాయని మనువంశరామా**

మణిమయ భూషణుడు, మంజుల భాషణుడు, రణజయ భీషణుడు, రఘుకుల పోషణుడు...శ్రీరామచంద్రుడు! ఆ అవతారమూర్తి అగణిత గుణవిశేషాలను అనుపమాన రీతిలో అభివర్ణిస్తున్నాడు అన్నమాచార్యులు. ఆ సీతారాముడు సమర విజయుడే కాదు, భక్తపారీణుడు కూడా! జలధిని బంధించగల సమర్థుడే కాదు, జనుల హృదయాలలో బందీ కాగల సౌజన్యమూర్తి కూడా! యాగాల్ని రక్షించే కౌసల్యతనయుడే కాదు, మనోమాయల మృగాల్ని సంహరించే కైవల్యదాయకుడు కూడా!...అంటూ ఆ వైదేహి నాథుడిని వేంకటాద్రి రాముడిగా నవ్యనామంతో పిలుచుకుంటూ పులకించిపోయాడు ఈ పదకవితా పితామహుడు. అన్నమయ్య పదాలు అర్థభావ ప్రధానాలు. త్యాగరాజ స్వామి కీర్తనలు నాదరచనా ప్రధానాలు. ఒకరిది సాహిత్యభాష అయితే; మరొకరిది సంగీతభాష. భావం తెలిసి పాడితే అన్నమాచార్యుని పదాలు మరింత మాధుర్యాన్ని ఒలికిస్తాయి. అందుకే 'తెలిసి చేయరే రామచింతన' అంటారు త్యాగరాజస్వామి కూడా! అలా ఈ **'జయజయ రామా... సమరవిజయ రామా...'** అన్న పదాల పరిమళాలను భావం తెలుసుకొని ఆఘ్రాణిద్దాం.

### భయహరుడు..భక్తపారీణుడు

ఆ రఘురాముడి వైభవాన్ని ఎంత కొనియాడినా తనివి తీరదు. సకలచరాచర జగత్తులో ప్రకాశించే ఆ పురాణ పురుషుడు భక్తుల భయాన్ని హరించివేస్తాడు. పోరాటంలో ఎంత పౌరుషంగా విరాట్ రూపాన్ని చూపిస్తాడో, ప్రియభక్తులను అంత ప్రేమగా తరింపచేస్తాడు. అందుకే **'జయజయ రామా, సమర విజయ రామా; భయహర నిజభక్త పారీణ రామా'** అంటూ తన పదాలకు శ్రీకారం చుడుతున్నాడు పంకజనాభుడి భక్తాగ్రేసరుడు.

రమ్యమైన రామాయణాన్ని అన్నమయ్య 'ద్విపద' రూపంలో రాశాడని చరిత్ర చెబుతోంది. కానీ ఆ రచనామృతాన్ని గ్రోలే అదృష్టం మనకు లేకుండాపోయింది. ఆ కావ్యం కాలగర్భంలో శబ్దపంజరంలా కలిసిపోయింది. చివరకు ఈ కొన్ని సంకీర్తనలు మాత్రం మనకు మిగిల్చాడు ఆ ఏడుకొండలవాడు. జీవితకాలంలో భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస కూడా ఆ కోదండరాముడి ఘనతను స్మరించుకుంటూ 'ఆ శ్రీరాముడే అందరిలోనూ విరాజిల్లుతున్నాడు. జగత్తులో సర్వత్రా ఆయనే నెలకొని ఉన్నాడు. ఈ సమస్త మానవులు, జంతువులు ఆ రాముడే అయి ఉన్నాడు' అన్నారు.

### సౌమిత్రి రాముడు...సీతారాముడు

సుమిత్ర తనయుడైన తన తమ్ముడు లక్ష్మణుడితో కలసి సేతుబంధనాన్ని నిర్మించి ఆయన సౌమిత్రి రాముడయ్యాడు; శివధనుర్భంగాన్ని గావించి సీతారాముడయ్యాడు. ఆ పరంపరలో వాలిని శిక్షించి, సుగ్రీవుడిని కాపాడిన ఆ అయోధ్యరాముడు, పదహారేళ్ళయినా నిండని నూనూగు మీసాల ప్రాయంలోనే విశ్వామిత్రుడి యాగానికి అండగా నిలిచాడని గుర్తుచేస్తూ... *(మిగతా 32వ పేజీలో...)*

**ఈ ప్రపంచంలో ప్రతీది మార్పుకు లోనుకావలసి ఉన్నది. జీవుల విషయంలో బాల్యం, యౌవనం, వార్ధక్యాలు-ఇలా ప్రతీది అలల మాదిరిగా ఒక స్థితి నుండి మరొక స్థితికి సాగిపోతున్నది.** - *శ్రీరాముడు*



# ఆధ్యాత్మికతకు ప్రథమ నియమం

- స్వామి యతీశ్వరానంద

ఆధ్యాత్మికతతో నిండిన మహామనీషిగా మారబోయే ముందు మానవతా విలువలున్న మంచి మనిషిగా మారాలి. ఒక భక్తునిగా మారబోయే ముందు లేదా ఆధ్యాత్మిక సాధన ప్రారంభించబోయే ముందు మానవత్వం ఉన్న మనిషిగా ఎదగాలి. ఆధ్యాత్మిక సాధనకు కావలసిన ప్రాథమిక ఆవశ్యకతలలో కొన్నింటినైనా పాటించనిదే మంచి మనుష్యులుగా నిలదొక్కుకోలేరు. ఒక్కొక్కసారి కొంతమంది చాలా సంస్కార హీనంగా, అసభ్యంగా ప్రవర్తించడం చూస్తుంటాం. అలాగే ఒక్కోసారి పెద్దలే పిల్లచేష్టలను చేయడం చూస్తుంటాం. ఇలా ఎన్నడూ చేయకూడదు. అటువంటి ప్రవర్తనకు స్వస్తి చెప్పాలి.

నిజానికి ఆధ్యాత్మికత వలన మన జీవితాలలో ఉత్పన్నమయ్యే సమస్యలు చాలా తక్కువ అని నేను ఘంటాపథంగా చెప్పగలను. మన స్వభావంలోనూ, దృక్పథంలో ఉన్న లోపాల వలనే చాలా సమస్యలు కొరకరాని కొయ్యలుగా మారుతున్నాయని మనం తెలుసుకోవాలి.



బయటివారికి మనం చాలా మంచివారిగా కనిపించవచ్చు. కానీ ఆ అభిప్రాయం మనతో పాటు ఉంటున్నవారికి కూడా కలగాలి. కొత్తవారికి నవ్వుముఖాన్ని చూపించడం చాలా సులువు! మనల్ని అప్పుడప్పుడు కలిసేవారు, మన పట్ల వెలిబుచ్చే అభిప్రాయాల కంటే, మన తోటివారు చెప్పే మాటలకు మనం ఎక్కువ విలువ ఇవ్వాలి. మనకు ఎంత స్వయం నియంత్రణ ఉంది, ఎంత ఉన్నతిని సాధించాము అన్న విషయాలు మనతో ఉన్నవారికి బాగా తెలుస్తాయి.

అసహనం, దురభిమానం ఉన్న వ్యక్తికి ఆధ్యాత్మికానుభూతులు కలగలేదనీ, కనీసం అతడికి సరైన విశ్వాసం కూడా లేదనీ నిశ్చయంగా చెప్పవచ్చు. నిజమైన విశ్వాసం కలవారు అందరి పట్లా మంచిగా ఉండగలుగుతారు. ఎవరిపట్లా ఈర్ష్య, అసూయ మొదలైనవాటిని కలిగివుండరు. ఆధ్యాత్మికంగా దంబాచార పరాయణులైన వారు కపటవర్తనులని ఖచ్చితంగా చెప్పవచ్చును.

నిజమైన సాధకుడు అన్నివేళలా ఓర్పు, క్షమ మొదలైన గుణాలతో ప్రవర్తించడం నేర్చుకోవాలి. మనం అనుకున్నట్లుగా అన్నీ జరగవు కదా! ఇబ్బందికరమైన పరిస్థితులు, అప్రియమైన సంఘటనలు ఎదురైనప్పుడు ఓరిమితో భరించాలి. ఈ రోజులలో, ధ్యానానికి అనువైన పరిస్థితులు మృగ్యం అని చెప్పక తప్పదు. మీరు ఉన్న పరిస్థితులను, వాతావరణాన్ని వీలైనంత చక్కగా ఉపయోగించుకోండి. వాటితో సామరస్యాన్ని సాధించండి.

ఆ సామరస్యం లోపిస్తే మనలో కోపం చోటుచేసుకుంటుంది. ఏ మనిషైనా తన మీద తను కోపం తెచ్చుకున్నాకే, ఇతరులపై కోపం తెచ్చుకుంటాడు. కోపం, ద్వేషం ఒకే కోవకు చెందినవి కాబట్టి, మనల్ని మనం ద్వేషించుకోవడం, ఇతరులను ద్వేషించడం - ఈ రెండూ తప్పే. మానసిక నిపుణులు కూడా కోపం వలన చాలా దుష్పరిణామాలు కలుగుతాయని నిర్ధారించారు.

ఎన్నో ఏళ్ళు ఆధ్యాత్మిక సాధన చేసినా ఏమీ సాధించలేదని చాలామంది ఫిర్యాదు చేస్తుంటారు. వారి దృక్పథాన్ని పరిశీలిస్తే ఒక విషయం తేటతెల్లం అవుతుంది. “నేను ప్రార్థన, జపం, ధ్యానం చేస్తూనే ఉన్నాను. కానీ ఫలితం రావట్లేదు” - ఈ విధంగా ఆలోచిస్తూ సమయాన్నీ, శక్తినీ వృథా చేయకుండా, వాటిని భగవంతుని పైన వెచ్చిస్తే, వారికి ఎంతో మేలు జరిగేది. ఎల్లప్పుడూ ‘నాకు ఫలితం రావట్లేదు’, ‘నాకు ఫలితం రావట్లేదు’ అన్న యోచన వల్ల వారు అహంకారంతో నిండిపోయారని చెప్పవచ్చు. సర్వసాధారణంగా మనం ఒక్కళ్ళమే భక్తులం అని అనుకుంటూ ఉంటాము! ఈ విషయంలో జాగ్రత్త వహిస్తూ, అటువంటి అహంకారాన్ని మొగ్గలోనే తుంచివేయాలి. లేకపోతే తర్వాత తర్వాత కష్టమవుతుంది. పవిత్రజనని శ్రీశారదాదేవి, “మన పురోగతిని అంచనా వేయాలని చూడడం మనలోని అహంకారానికి నిదర్శనం” అని చెప్పేవారు. మన సాధనా ఫలాలను భగవంతునికే వదలివేయాలి. మనం చేసే ప్రతి కార్యాన్నీ భగవదర్పితం చేయాలి.

మీరు చేసే ప్రతి పనిని ఏదోవాక మార్గంలో భగవంతునితో అనుసంధానించాలి. ఆయన కోసమే పని చేయండి. మీ బాధ్యతలను చక్కగా నెరవేర్చండి. కానీ ఈ విషయాలన్నింటికీ భగవంతుడే కేంద్రబిందువు కావాలి. ఈ విధంగా మీరు సాధన చేస్తూవున్నట్లయితే, అమోఘమైన ఫలితాలను పొందుతారు. ❖

తెలుగుసేత : ఎమ్. శివరామకృష్ణ

# అపర వసిష్ఠుని అపార భక్తి



ఇది ఈనాడు జరిగినది కాదు, అలనాటి కథ. అయోధ్యలో రామాయత సంప్రదాయానికి చెందిన సాధువుల సమ్మేళనం జరుగుతున్నది. చిత్రకూటం నుండి ఒక మహాత్ముడు కూడా విచ్చేశాడు. గంభీర వదనం, శ్వేతవస్త్రధారి, మెడలో స్ఫటికమాల, కాళ్ళకు పావుకోళ్ళు. ఆయన శిరోజాలు తెల్లబడిపోయాయి. సరయూ నదీతీరాన నిశ్శబ్దంగా వసించేవాడు. రామాలయానికి కానీ, కనకప్రాసాదంలో ఉన్న సీతారాములను కానీ దర్శింప వెళ్ళడు. అడపా, దడపా 'ధుని'ని ప్రజ్వలింపజేసి, వేదమంత్రాలు పఠిస్తూ ఆహుతి సమర్పిస్తాడు. రాత్రిపూట హఠాత్తుగా 'లాలా', 'లాలా' అంటూ పిలుస్తాడు. కానీ ఎవరైనా చూడబోతే అక్కడ ఆయనొక్కడే ధ్యానమగ్నుడై ఉంటాడు! భిక్షకు వెళ్ళిన దాఖలాలూ కనపడవు కానీ, ఎవరో గోధుమపిండి, పప్పు, కూరగాయలు అక్కడ పెట్టి వెళతారు. ఆయన చితికల మంటపై రొట్టెలు కాల్చి, పప్పు, కూర వండుకుంటాడు. భోజనానంతరం నదీతీరాన్నే శయనం. ఋషితుల్యుడైన ఆయన సాన్నిధ్యానికి వెళ్ళడానికి జనం సంశయించేవారు. తెలతెలవారక మునుపే నీటిలో మునిగి లేస్తున్న 'బుడుంగు' శబ్దాలు, దానితోపాటు గంభీర స్వరం– ఎవరికో పాఠాలు చెబుతున్నట్లు. ఎంత విచిత్రమైన సాధువో! రామ సంకీర్తన చేయడు, రామాయణ పఠనం లేదు. పోతే తన వద్ద యోగవాసిష్ఠ రామాయణ గ్రంథం మాత్రం ఉంది. అది చదవడం, లేదంటే ధ్యానం చేయడం – ఇంతే! ఆయన ఎవరికో బోధిస్తాడు. కానీ ఎవరికి, ఏమని బోధిస్తున్నదీ స్పష్టంగా వినపడదు. చూడబోతే మరొక వ్యక్తి కనపడదు.

మిగతా సాధువులకు సైతం ఏమీ అంతు పట్టడం లేదు. ఎటువంటి సాధువండీ! రామ దర్శనానికి వెళ్ళడే! కానీ ఆయన వ్యక్తిత్వం, వదనం ముగ్ధమోహనాలు. ఆయనలో ఒక అలౌకిక ప్రశాంతత దర్శనమిస్తుంది. అజగర వృత్తిని అవలంబిస్తాడు. ఆహారం దానంతట అదే లభిస్తుంది. ఒకసారి అక్కడి వారు 'ఎవ్వరమూ భిక్ష పంపకుండా ఉందాం. ఏం జరుగుతుందో చూద్దామ'ని నిర్ణయించుకున్నారు. ఆశ్చర్యం! సరిగ్గా సమయానికి దినుసులు అక్కడ ఉన్నాయి! వాటిని తీసుకొచ్చిన వ్యక్తిని ఎవ్వరూ చూడలేదు.

ఈ విధంగా రోజులు గడుస్తున్నాయి. రామాయత సాధువుల్లో ఒక సాధువు 'ఈ సాధువు కూడా మన సంప్రదాయానికి చెందినవాడే కానీ ఆయన సాధన మనకు అర్థం కావడం లేదు. ఆయన వద్దకు వెళ్ళి తెలుసుకొందాం రండి' అన్నాడు. అందుకు అందరూ సమ్మతించారు. సాధువులు కొంతమంది ఆయన వద్దకు వెళ్ళి 'మీరు అయోధ్యకు వచ్చి రామాలయం సందర్శించరు. ఈ నదీ తీరంలోనే కూర్చొని, శ్రీరామచంద్రుణ్ణి ఏ విధంగా భజిస్తున్నారో తెలుపండి' అని అడిగారు.

'నేను బాల్యం నుండి మా తండ్రిగారి వద్ద యోగవాసిష్ఠం వినేవాడిని. నాకు వసిష్ఠ మహర్షి పట్ల ఆకర్షణ రానురాను పెరిగి, చివరకు ఆయనతో మమేకం చెందాను. నా ఆరాధ్యదైవమైన రామచంద్రుణ్ణి నా శిష్యుడిగా భావింపసాగాను! ఆయనకు బోధనలు చేయసాగాను, రామునితో కూడి గ్రంథపఠనం చేస్తాను. ఆయనతో శాస్త్రసమాలోచనలు చేస్తాను. దేవాలయానికి వెళ్ళి సీతారాములను దర్శించాలనే ఆలోచనే నాకు రాలేదు'.

ఇటువంటి సాధన గురించి తామెప్పుడూ వినలేదు అని మిగతా సాధువులు నిరుత్తరులైనారు. వారంతా ఆ సాధువును 'రాముని వివాహానంతరం కైకేయి సీతమ్మకు కనకప్రాసాదం బహూకరించింది. అక్కడ సీతారాముల విగ్రహాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. ఒక రామాలయం కూడా ఉంది, దాన్ని రామదర్బారు అంటారు. ఒక్కరోజు మాతో వచ్చి దర్శనం చేసుకోండి' అని అభ్యర్థించారు. ఆ సాధుమహాత్ముడు కొంచెం తటపటాయిస్తూ 'చూడండి! నేనక్కడకు వెళితే సీతాదేవి నన్నుచూసి సిగ్గుపడుతుంది. రాముడు కూడా దిగ్గున లేచి నిలబడతాడు. నేను వెళ్ళడం సముచితం కాదు' అని అన్నాడు.

మిగతా సాధువులు ససేమిరా అన్నారు. ఆయనను బలవంతంగా కనకప్రాసాదానికి తీసుకొని వెళ్ళారు. ఎంత ఆశ్చర్యం! మహాత్ముడు అడుగు పెట్టీపెట్టగానే, కనకప్రాసాదంలో హఠాత్పరిణామం జరిగింది. సీతాదేవి శిరస్సు వంగిపోయింది. చీరకొంగు ముఖంపైకి మేలిముసుగులా జారింది! ఆసీనమై ఉన్న శ్రీరాముని విగ్రహం లేచి, నిలబడింది.

మహాత్ముడు వెంటనే వెలుపలకు వెళ్ళిపోయాడు. రామాయత సాధువులు ఆయనను క్షమాపణ వేడుకోవాలని వెళ్ళారు. కానీ ఆ సాధువు కనిపించలేదు. బహుశా ఆ అపర వసిష్ఠుడు ఏదైనా కొండగుహను వెతుకుతూ చిత్రకూటం వైపు తరలివెళ్ళాడు కాబోలు, అక్కడ ఏకాంతంలో తన రామునికి శాస్త్రాలు బోధిస్తాడు కాబోలు! ❖ **తెలుగుసేత: డాక్టర్ కమల జయరావు**

(శారదా మఠం ప్రచురిస్తున్న 'నిబోధత' బెంగాలీ మాసపత్రిక నుంచి)

**నిశ్చలంగా ఉన్నా, కదులుతూ ఉన్నా నీ రోజులు మాత్రం తరిగిపోతూ ఉంటాయి. కాబట్టి నీ కోసమే దుఃఖించు. కానీ మరోదాని కోసం శోకించడం వృథా అని గ్రహించు.** - *శ్రీరామచంద్రుడు*

# క్షితిలేని చంద్రుడు



- హేమంత్ కుమార్

శ్రీరాముడు మహావీరుడు. సద్గుణాభిరాముడు. సద్గుణాలు వీరునిలో మరింత రాణిస్తాయి. సద్గుణాలతో వీరత్వమూ మరింత శోభిస్తుంది. ఆయన సద్గుణాభిరాముడు. ధర్మ ధాముడు. ఆ కారణంగానే శ్రీరాముడు కీర్తికాయుడైనాడు. శ్రీరాముని అవతార కారణం రాక్షస సంహారమే అయినా ఒక మానవుడు- అతడు దేవుడే అయినా - సంపూర్ణ సర్వోన్నత మానవుడిగా జీవించడ మెలాగో ప్రదర్శించే ప్రయత్నంలో దేవుడే అయ్యాడు. ఆయన జీవితాన్ని జీవించలేదు. మూర్తీభవించిన ధర్మావతారుడిగా అసిధారావ్రతమే చేశాడు.

శ్రీరాముడు ఏనాడూ మానవాతీత ప్రదర్శనలు చేయలేదు. శ్రీకృష్ణునిలా లీలలు చూపలేదు. ఒక మనిషి మనిషిగానే ఉంటూ ఏం చేయగలడో, ఎంత చేయగలడో, ఎంతైనా చేయగలడని తన ప్రవర్తన ద్వారా, చేతల ద్వారా చూపించాడు. రాముడు రాజే అయినా ఒక నిర్ణీత జీవిత విధానానికి కుదించుకొని జీవించలేదు. ఒక నిబద్ధతతో ధర్మానికి అనుగుణంగా ఎప్పటి కప్పుడు తనను తాను మలుచుకుంటూ, సంస్కరించుకుంటూ జీవించాడు. జీవితంలోని ఆ యా కీలక దశల్లో శ్రీరాముని ప్రవర్తన, నిర్ణయాలు ఎంతో ధర్మసూక్ష్మతతో మేధావులకు సైతం అర్థం కానంత క్లిష్ట సంవిధానంతో ఉండేవి. ఆ యా సమయాల్లో ఆయన సంయమనం అనితర సాధ్యం. నిందలకూ, మమతానురాగాలకూ, వ్యక్తిగత అభిలాషలకూ అతీతంగా మేరునగ ధీరుడిలా నిలబడిన తీరు అత్యంత ప్రశంసనీయం, ఆదర్శ నీయం. స్త్రీ అయిన తాటకి సంహార సమయంలోనూ, వాలిని నిర్జించే సందర్భంలోనూ, సీతామాతను అరణ్యాలకు పంపి నప్పుడూ, ఆమెను అగ్నిపరీక్షకు ఆదేశించినప్పుడూ, పట్టాభిషేక సమయంలో అరణ్యాలకు వెళ్ళమని ఆదేశించిన తండ్రే అరణ్య వాసాన్ని విరమించుకొమ్మని చెప్పినా విరమించని సమయంలోనూ శ్రీరాముని నిర్ణయాలు, ఆంతర్యం అంత సులభంగా అర్థం కావు. ధర్మ విగ్రహమైన రాముడి జీవితంలో ధర్మానికి గ్లాని కలిగించిన సందర్భం ఒక్కటీ కనిపించదు. అమృతం తనను తాను విష పూరితం చేసుకోలేదు కదా! షోడశ కళలతో, షోడశ సద్గుణాలతో క్షితి లేని చంద్రుడై, రామచంద్రుడై రామాయణమనే అత్యంత పవిత్ర శాశ్వత ఉద్గ్రంథానికి ఆయన నాయకుడైనాడు.

శ్రీరాముని వ్యక్తిత్వం మహోన్నతం. యుద్ధ క్షేత్రంలో రావణ మరణ సమయంలో ఆయన దగ్గర రాజనీతినీ, ధర్మసూక్ష్మాలనూ నేర్చుకొని రమ్మని లక్ష్మణుణ్ణి పంపిన సందర్భమూ, శబరి ఎంగిలి పళ్ళు తిన్న సమయమూ, ఏక పత్నీ వ్రతుడై ప్రాణాధికంగా ప్రేమించిన ధర్మపత్ని జానకిని అగ్ని పరీక్షకు ఆదేశించడమూ, ఆటవికుడైన గుహుడు, వానర రూపుడైన సుగ్రీవుడు, రాక్షసుడైన విభీషణుడు... వీళ్ళకు స్నేహాన్నీ, అభయాన్నీ ఇవ్వడమూ, జటాయువులాంటి పక్షిని సైతం పితృ సమానంగా గౌరవించి అంతిమ సంస్కారాలు నిర్వహించడమూ... ఈ సంఘటనలు రామునిలోని వైవిధ్యభరిత ఉత్కృష్ట గుణావిష్కరణలు. వ్యక్తిత్వ రసాభివ్యక్తులు. ధర్మాగ్రహంతో సముద్రుని మీద బాణం ఎక్కు పెట్టిన రాముడు, ఉడుత లాంటి అల్ప ప్రాణి చేసిన స్వల్ప సేవకు కూడా స్పందించి ప్రేమనూ, కృతజ్ఞతనూ పంచాడు. ఆ యా సందర్భాలకు తగు విధంగా స్పందించి, చరించే రాముడు ఉత్తమ వ్యక్తిత్వమున్న మానవోత్తముడయ్యాడు.

గీతాబోధ సందర్భంగా శ్రీకృష్ణుడు అర్జునునికి విశ్వరూప సందర్శనం ఇచ్చాడేమో గానీ, లోకానికి మానవ రూప 'ధర్మవిశ్వ రూప' సందర్శనం చేయించినవాడు రాముడు. కృష్ణుని విశ్వ రూపంలో ఆ మహా తేజోజ్జ్వల ప్రదర్శనను చూడలేక అర్జునుడు కళ్ళు మూసుకున్నాడు. కానీ రాముడు రామ'చంద్రుడు'. ఆహ్లాదానికి ఆకరుడు. రాముని 'జీవితకాల' విశ్వరూపాన్ని లోకాలు నయనానందకరంగా దర్శించాయి, తరించాయి.

సకల సుగుణ శోభిత మానవుడిగా రాముని శ్రమ, త్యాగం, ధర్మం... ఈ అన్నింటి ప్రయోజనాన్ని మనం పొందుతున్నాం. ఉత్తమోత్తమ జీవన విధానంతో భగవంతుడిగా రూపుదాల్చిన రాముని నామాన్ని స్వీకరించి మనం ముక్తి పొందుతున్నాం. శక్తి పొందుతున్నాం. నిష్కామంగా, నిరుపమానంగా రూపుదిద్దు కున్న అమృతఫలం ఆయన. రసాస్వాదకులం మనం.

ఒక మానవుడు సర్వోత్తమ మానవుడిగా, కేవల ధర్మ స్వరూపంగా జీవించడమనేది 'ఆచరణ సాధ్యమే' అన్న విషయాన్ని నిరూపించాడు శ్రీరాముడు. రాముని జీవితం మనకు అడుగడు గునా ఆదర్శప్రాయం. ఆయనను అనుసరిస్తే, ఆరాధిస్తే మనలోని రావణుడు సంహరింపబడి, రాముడు సహస్ర శీర్షాలతో ఉద్భవిస్తాడు. లోకంలో 'రాజ్యపాలన' అనే పదానికి రాముని పాలనే నిర్వచనంగా, 'రామరాజ్యం' అనేమాట ఉత్తమోత్తమ రాజ్యపాలనకు శాశ్వత సంకేతంగా నిలిచింది. ❖




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

## గ్రామీణుల మాస్టర్ మహాశయ్ – రామమూర్తి మాస్టారు

– డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

ఆధ్యాత్మిక జ్ఞానమే ఆయనకున్న ఆస్తి. సౌమ్యం, సాత్వికాల సమాహారం ఆయన ఆహార్యం. బాల్యం నుండి సాధుసాంగత్యం, శ్రీరామకృష్ణ, శారదా, వివేకానందుల సాహిత్య ప్రభావం వల్లనేమో పై లక్షణాలు శ్రీ భద్రాచలం రామమూర్తికి అలవడ్డాయి. శ్రీకాకుళం జిల్లాలోని 'బుడితి' అనే కుగ్రామంలో 1922 జనవరి 20న జన్మించిన ఆయనకు పాఠ్యపుస్తకాలతో పాటు శ్రీరామకృష్ణులు, వివేకానందుల సందేశం శిరోధార్యమైంది. మద్రిపాడు అనే గ్రామంలో ఉపాధ్యాయ వృత్తి చేపట్టి, పిల్లలకు పాఠాలతో పాటు శ్రీరామకృష్ణ, వివేకానందుల బోధనలు వినిపించేవారు. ఆయన శిక్షణలో నేడు ఎంతో మంది సౌశీల్యం, సేవాదృక్పథం గల శ్రీరామకృష్ణ సైన్యంగా తయారయ్యారు. ఆయన కృషి వల్ల ప్రస్తుతం ఆ జిల్లాలో 'శ్రీరామకృష్ణసేవాసమితులు' ఏర్పడ్డాయి. ఏ మాత్రం అక్షర జ్ఞానం లేని వారికి సైతం సరళమైన భాషలో మూర్తిత్రయ దివ్యబోధ నలను వినిపించేవారు. విశాఖపట్నంలోని రామకృష్ణ మిషన్ వారి సహకారంతో గ్రామాలలో నేత్ర, వైద్య శిబిరాలు నిర్వహించారు. ఆయన ఎక్కడ పనిచేస్తే అక్కడి పరిసర ప్రాంతాలలో శ్రీరామకృష్ణుల వారి ఆధ్యాత్మిక పరిమళాలను వ్యాపింపజేసేవారు. 1962లో తాను పనిచేస్తున్న చట్లతాంద్ర అనే గ్రామంలో పచ్చటి పైరుల మధ్య ఒకటిన్నర ఎకరాల స్థలంలో 'శ్రీరామకృష్ణ సేవాశ్రమాన్ని' 18 గ్రామాల్లోని రామకృష్ణ భక్తుల సహకారంతో ఏర్పాటు చేశారు. అక్కడ నెలకొన్న 'శ్రీరామకృష్ణుల' పాలరాతి విగ్రహం స్వామి చిరంతనానందజీ మహారాజ్ వారిచే ప్రతిష్ఠితమై, నిత్య పూజలు అందుకుంటోంది.



రామమూర్తిగారు 1985లో పరమపూజ్య స్వామి గంభీరానందజీ మహారాజ్ వద్ద మంత్రదీక్ష స్వీకరించారు. జిల్లాలో అనేక మంది భక్తుల హృదయాలలో శ్రీరామకృష్ణ భావస్ఫూర్తిని నింపి దాదాపు 1200 మంది (కార్మికులు, కర్షకులు, ఉపాధ్యాయులు, కూలీలు) చేత మంత్ర దీక్ష స్వీకరింపజేసి, మూర్తిత్రయ అనుగ్రహానికి పాత్రులను చేశారు.

శ్రీరామమూర్తి ఆధ్వర్యంలో జరుపబడే మరొక కార్యక్రమం – ప్రతి సంవత్సరం దక్షిణాది ప్రాంతాల రామకృష్ణ మఠాల నుండి బేలూరు మఠానికి సర్వసభ్య సమావేశాలకు వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు స్వామీజీలందరికీ పలాస రైల్వే స్టేషన్‌లో ఆతిథ్యం, దక్షిణలిచ్చి వారి ఆశీస్సులు పొందడం. స్వామీజీల రాకతో ఆ రోజు పలాస రైల్వే స్టేషన్ శోభాయ మానంగా ఉండేది. ఇప్పటికీ ఈ కార్యక్రమం కొనసాగుతూనే ఉండడం విశేషం. 1997లో స్వామి వివేకానంద రథయాత్రను 20 గ్రామాలలో దిగ్విజయంగా నిర్వహించారు. 2000వ సంవత్సరం జనవరి 22, 23 తేదీలలో 9వ రాష్ట్ర స్థాయి రామకృష్ణ- వివేకానంద భావప్రచార పరిషత్ భక్త సమ్మేళనం దిగ్విజయంగా నిర్వహించారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఆయన ఆధ్వర్య వంలో ఎన్నో కార్యక్రమాలు జరిగాయి. ఈ రోజు శ్రీకాకుళం జిల్లాలో ఒక పెద్ద రామకృష్ణ కుటుంబాన్ని తయారుచేసిన ధన్యజీవి ఆయన. ఆధ్యాత్మిక జ్ఞానమే అసలైన సంపద అని భావించిన శ్రీరామమూర్తి భోగ భాగ్యాలను ఆశించకుండా అంతిమకాలం వరకూ పూరి గుడిసెలోనే జీవించిన సేవాతత్పరుడు.

భగవాన్ శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యులైన మాస్టర్ మహాశయ్ శ్రీరామకృష్ణ కథామృతాన్ని మనందరికీ అందిస్తే, శ్రీకాకుళం జిల్లాలోని గ్రామీణులకు కథామృతాన్ని పంచిన మహాత్ముడు శ్రీరామమూర్తి మాస్టారు.

మూర్తిత్రయ భావతరంగాలలో మునిగి తేలుతూ, అందరికీ ఆప్తునిగా, ఆత్మబంధువుగా మసలుతూ శ్రీరామమూర్తి తమ 78వ ఏట స్వల్ప అనారోగ్యంతో భౌతిక శరీరం వదలి శ్రీరామకృష్ణ లోకం చేరారు. సరళమైన జీవితాన్ని ఆచరణలో చూపెట్టిన శ్రీరామమూర్తి మాస్టారు జీవితం అందరికీ ఆదర్శప్రాయం. ❖ అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

పువ్వుల సుగంధం గాలి ఎటు వీస్తే అటు వ్యాపిస్తూ ఉంటుంది. కానీ మనిషిలోని సుగుణాల సుగంధం దశ దిశల్లోనూ వ్యాపిస్తుంది. సుగుణవంతుడు సర్వులను సంతోషింపజేస్తాడు. - ధమ్మపథం



# అవతారవరిష్ఠుని ఆగమన లక్ష్యం

- ఎం.వి.నాగప్రసాద్

అవతారాలు అనగానే మనకు ముందుగా గుర్తుకొచ్చేవి దశావతారాలే. ఆ దశావతారాల్లో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనావతారాలు దుష్టశిక్షణ అనే ప్రయోజనానికై అవతరించాయి. మానవ జీవితానికి పరిపూర్ణతనిచ్చే జ్ఞాన జిజ్ఞాస "నేనెవరిని" అనే శ్రీరామచంద్రుని ప్రశ్నతోనే ప్రారంభం కాగా, శ్రీకృష్ణునిలో పరిపూర్ణజ్ఞానం ప్రకటితమైంది. వాల్మీకిమహర్షి శ్రీరాముణ్ణి సామాన్య మానవునిగా వర్ణించాడు. శ్రీకృష్ణుని అవతారం శ్రీమద్భాగవతంలోనూ, హరివంశంలోనూ, మహాభారతంలోనూ, బ్రహ్మవైవర్త పురాణంలోనూ బాల్యం నుండే దివ్యత్వ, జ్ఞాన సంపుటీకరణగా ఆవిష్కరింపబడింది.

శ్రీరాముని నరోత్తమ లక్షణం, శ్రీకృష్ణుని దివ్యత్వం కలియుగంలో శ్రీరామకృష్ణునిలో మనకు కనిపిస్తాయి. పుట్టగానే తల్లి పక్కన ఉండవలసిన బిడ్డ, దూరంగా పొయ్యిలో ఉండడం, ఐదు నెలల ప్రాయంలో పూర్ణపురుషునిగా మంచం మీద తల్లి చంద్రమణీ దేవికి కనిపించడం-ఇవన్నీ శ్రీరామకృష్ణుల దివ్యత్వాన్ని తెలియజేశాయి. శివరాత్రినాడు నాటకంలో శివుని పాత్ర ధరించి శివభావనలో లీనం కావడం, ఆకాశంలో ఎగురుతున్న కొంగలను చూసి ఆత్మానుభూతి పొందడం లాంటి సంఘటనలన్నీ బాల్యంలో శ్రీరామకృష్ణుల జ్ఞానసంపన్నతను తెలియజేస్తాయి.

శ్రీరామకృష్ణులు ఆత్మవిద్యను అనుష్ఠించి, ప్రజలతో అనుష్ఠింపజేయడానికి అవతరించిన అవతార వరిష్ఠులు. త్రేతా యుగంలో శ్రీరామునిలో ప్రారంభమైన బ్రహ్మజిజ్ఞాస ద్వాపర యుగంలో గీతగా ఆవిష్కృతమైతే, ఈ కలియుగంలో శ్రీరామ కృష్ణావతారంలో అనుష్ఠాన వేదాంతంగా రూపుదిద్దుకుంది. భగవంతుని దర్శనానికీ, ఆత్మజ్ఞానానికీ శాస్త్రాలు ఏయే నియమాలు విధించాయో, ఏయే ఉపాధుల్ని సూచించాయో, వాటన్నింటినీ, అన్ని మత సంప్రదాయాలలోనూ ఆచరించి, అన్ని మతాలూ గొప్పవే అని నిరూపించిన వారు శ్రీరామకృష్ణులు మాత్రమే.

సనాతన ధర్మాన్ని అనుసరించి, భగవంతుని ప్రతి అవతారమూ నిర్దిష్ట లక్ష్యసాధనకై అవతరించినదే. భౌతిక, భావ దాస్యంలో భారత ప్రజలు తమ స్వస్వరూపాన్నీ, ఉనికినీ మరచి, జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్నకాలంలో భవిష్యత్ ఆశాకిరణం శ్రీరామకృష్ణులై అవతరించింది. 19వ శతాబ్దం రెండో భాగంలో భారతదేశం ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, సామాజిక రంగాల్లోని వైఫల్యాల నేపథ్యంలో, శ్రీరామకృష్ణుల అవతరణ చారిత్రక అవసరమైంది. విదేశీ దండయాత్రల మూలంగా ప్రజల నిర్లక్ష్యానికి గురవుతున్న సనాతన వైదిక ధర్మ పునరుద్ధరణ జరిపి జాతిని తిరిగి చైతన్యపరచడమే లక్ష్యంగా శ్రీరామకృష్ణులు అవతరించారని మనం గుర్తించాలి.

శ్రీరామకృష్ణుల జీవిత చరిత్రనూ, కథామృతాన్నీ పరిశీలిస్తే, స్థూలంగా శ్రీరామకృష్ణుల అవతార లక్ష్యాలను ఈ విధంగా చెప్పవచ్చు.

1. వేల సంవత్సరాల నుండి ఆధ్యాత్మిక గ్రంథాల్లో నిక్షిప్తమై ఉండి, ఆచరణ శూన్యంగా మిగిలి ఉన్న వేదాంత సిద్ధాంతాలను అనుష్ఠానయోగంగా తీర్చిదిద్దడం, అన్ని సిద్ధాంతాలూ ఆచరణ సాధ్యాలేనని నిరూపించడం.

2. క్లిష్టమూ, ఈ యుగంలో అసాధ్యమూ అంటున్న భగవత్ ప్రాప్తిని ప్రత్యక్ష ప్రమాణంతో నిరూపించి, సులభతరం చేయడం.

3. సంక్లిష్టమైన సూత్రీకరణలతో మూఢాచారాలకూ, విశ్వాసాలకూ కొలువై ఉన్న మతాన్ని సంస్కరించడం, మతం పట్ల స్పష్టమైన అవగాహనను కలిగించడం.

4. మెకాలే ప్రవేశపెట్టిన బానిస విద్యావిధానం కారణంగా భారతీయతకూ, సనాతన హిందూ ధర్మానికీ దూరమవుతున్న యువతరాన్ని తిరిగి భారతీయులుగా, ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులుగా తీర్చిదిద్దడం.

ఈ అంశాలను శ్రీరామకృష్ణులు ఆచరణ-బోధన-శిక్షణల ద్వారా, చిన్న చిన్న సంఘటనల మూలంగా, కథల రూపంలో వివరిస్తూ, తమ అవతార ప్రణాళికను ప్రకటితం చేశారు.

ఉదాహరణకు, ఈ చిన్న సంఘటనను శ్రీరామకృష్ణులు తమ అవతార లక్ష్య ప్రకటనకు అనుకూలంగా ఏ విధంగా మలచుకున్నారో తెలుసుకుందాం:

సామాన్యులు సైతం సులభంగా అర్థం చేసుకునే గ్రామీణ పదజాలాన్ని శ్రీరామకృష్ణులు తన బోధనల్లోనూ, సంభాషణ

ల్లోనూ ఎక్కువగా ఉపయోగించారు. అయినా ఆయన ఉపయోగించిన ప్రతి మాట, అల్పాక్షరాలలో అనల్పార్థ రచనలా భాసించి, పరిమళించింది. ఆయన ప్రతిమాటా, ధ్వని గర్భితమై, శ్రోతల మానసిక స్థాయిని అనుసరించి అర్థం గోచరించేది.

దక్షిణేశ్వరంలో రాణీ రాస్మణీదేవి కట్టించిన రాధాకాంతుని ఆలయం. ఆ రోజు శ్రీకృష్ణాష్టమి పర్వదినం. ఆలయ ప్రాంగణం భక్తులతో కిటకిటలాడిపోతోంది. అదే సమయంలో జరుగరాని మహాపరాధం జరిగింది. పూజారి అజాగ్రత్త వల్ల రాధాకాంతుని విగ్రహపాదం విరిగిపోయింది. అపచారమన్నారు, అరిష్టమన్నారు. విరిగిన విగ్రహం పూజార్హం కాదు కనుక కొత్త విగ్రహం ప్రతిష్ఠించాలన్నారు. మరి కొంతమంది పూజారి తప్పు చేశాడు కనుక అతణ్ణి పనిలో నుండి తీసివేసి కఠినంగా శిక్షించాలని అన్నారు. తర్క వితర్కాలు, సిద్ధాంత రాద్ధాంతాలు, చర్చలు ఎన్నెన్నో జరిగాయి. ఎవరెన్ని చెప్పినా వారి సమాధానాలు రాణీ రాస్మణీదేవిని సంతృప్తిపరచలేక పోయాయి. వరండాలో పచార్లు చేస్తున్న గురుదేవుల్ని ఒకసారి కాళిగా, మరొకసారి శివునిగా దర్శించిన మథుర్‌బాబుకి శ్రీరామకృష్ణుల పట్ల అపారమైన విశ్వాసం ఏర్పడింది. ఆ కారణంగా తన అత్త గారైన రాస్మణీదేవితో "ఈ విషయంలో చిన్న పూజారిని (శ్రీరామకృష్ణ) సంప్రతించలేదే! ఆయన ఏం చెబుతారో తెలుసుకోవాలి" అన్నాడు.

భావసమాధిమగ్నులై ఉన్న శ్రీరామకృష్ణులు వారి సందేహాన్ని విని, "రాణిగారి అల్లుళ్ళలో ఎవరైనా కిందపడి కాలు విరగ్గొట్టుకుంటే అతడిని వదిలేసి, ఆ స్థానాన్ని మరొక వ్యక్తితో భర్తీ చేస్తారా? లేక సముచిత చికిత్సకు ఏర్పాటు చేస్తారా? అదే పద్ధతి ఇక్కడ కూడా అనుసరించాలి కదా! విగ్రహం కాలు జాగ్రత్తగా అతికించి యథాప్రకారం పూజ కొనసాగించాలి. విగ్రహాన్ని పరిత్యజించవలసిన అగత్యం ఏముంది?" అన్నారు. ఈ మాటలు ఎంతో అర్థవంతమైనవి.

ఒకసారి స్వామి వివేకానంద తన మిత్రుడైన హరమోహన్ మిత్రాతో "శ్రీరామకృష్ణులు పలికిన ప్రతి ఒక్క వాక్యం మీద కొన్ని అల్మరాలను నింపేందుకు సరిపడినన్ని పుస్తకాలు వ్రాయవచ్చు" అని చెప్పారు. అలాగే శ్రీరామకృష్ణుల సమాధానాన్ని సునిశితంగా విశ్లేషించుకుంటే అంతర్లీనంగా మనస్సుకు మరో అద్భుతమైన అర్థం గోచరిస్తుంది. ఈ చిన్న సమాధానంలోనే శ్రీరామకృష్ణులు తమ భావికర్తవ్య ప్రణాళికనూ, మత సంస్కరణల దృక్పథాన్నీ ప్రకటించినట్లనిపిస్తుంది. ప్రతీకాత్మకమైన సమాధానాన్ని విపులీకరించుకుంటే, విరిగిన రాధాకాంతుని విగ్రహం కాలు సనాతన వైదిక మతం. ఆంగ్ల విద్యాప్రభావం వల్ల కొంత మంది యువకులు మద్యపానం లాంటి చెడు అలవాట్లకు బానిసలైతే, మరికొందరు నిరీశ్వర వాదులుగా మారారు. ఇంకొందరు స్వధర్మాలను తిరస్కరించి అన్యమతాలను అనుసరించడం మొదలుపెట్టారు. కొంతమంది మేధావులు బలహీనులను అణచివేసి, సభ్యసమాజానికి దూరం చేశారు. ఎక్కడ చూసినా అన్నార్తుల, విద్యావిహీనుల, బాల్యంలోనే భర్తలను కోల్పోయిన స్త్రీల ఆర్తనాదాలు. మరోవైపు భగవంతుని పేర పెరుగుతున్న మూఢత్వం, మనిషిలోని దైవత్వాన్ని వ్యక్తం కానీయని అంధ విశ్వాసాలు, ఆచార సంప్రదాయాలు. మానవునిలో అంతర్లీనంగా, నిగూఢంగా దాగి ఉన్న పవిత్రతను వెలికి తీయవలసిన మతం మనిషి మనుగడకూ, ప్రగతికీ అవరోధంగా మారి, మతం పట్ల గౌరవం సడలుతూ ఉన్న కాలం. మానవ సమాజం చీకటి, వెలుగుల సంధ్యాసమయంలో ఏది మంచో, ఏది చెడో తెలియక అయోమయావస్థలో కొట్టుమిట్టాడుతున్న కాలం. మతం తన ఉనికిని కోల్పోతున్న కాలం. ఈ చారిత్రక సత్యాన్ని శ్రీరామకృష్ణులు విరిగిన కాలుతో పోల్చారు.

అయితే, శ్రీరామకృష్ణులు హృదయానికి హత్తుకునే విధంగా చక్కని సమాధానం మన ముందు ఉంచారు. "సముచిత చికిత్స చేసి తిరిగి విగ్రహాన్ని పూజించడం" అంటే అస్తవ్యస్త విధానాలతో కునారిల్లుతున్న మతాన్ని, మత ధర్మాలను సంస్కరించడం, తిరిగి చైతన్యవంతం చేసి మానవుని భౌతిక, ఆధ్యాత్మిక రంగాల అభివృద్ధిలో ప్రధాన పాత్రను పోషించేలా తీర్చిదిద్దడం. మతం పట్ల ఉన్న అపోహలను తొలగించి, ఆచరణాత్మకంగా పునరుద్ధరించడం.

శ్రీరామకృష్ణులు ఈ సమాధానంలో నిక్షిప్తం చేసిన అర్థాన్ని మాటలలో కాక, ఆచరణలో చూపి భగవంతుని ప్రేమమయ హృదయనాదాన్ని వినిపించి, మనమెందుకూ పనికిరామనే నిస్పృహలో ఉన్న జాతికి జవజీవాలనందించి చైతన్యవంతం చేశారు. పలికిన ప్రతిమాటలోనూ ఎన్నెన్నో విశేషమైన అర్థాలు గోచరించే శ్రీరామకృష్ణుల దివ్యవాణిని కళ్ళతో కాక, హృదయంతో చదివి కొత్త కొత్త అర్థాలను ఆస్వాదించి, ఆనందిద్దాం. ప్రతి హృదయానికి శ్రీరామకృష్ణుల సందేశామృతాన్ని చేర్చడానికి కృషిచేద్దాం. ❖



పసిబిడ్డ అమాయకత్వం ఎంత మనోహరం! సిరిసంపదలు ఎన్నివున్నా అతడికి ఒక్క ఆటబొమ్మే లోకం. అలాగే నిష్కపటి అయిన భక్తుడు ఒక్క భగవంతుణ్ణే తన లోకంగా భావిస్తాడు. - శ్రీరామకృష్ణులు




# నరకమా...నాకమా?

- స్వామి శితికంఠానంద

దివిజ యక్ష గంధర్వ కిన్నర కింపురుషులు, నాగ విహంగ సిద్ధ చారణుల మధ్య సురేంద్రుడు సుధర్మ మధ్యలో సుధాకరసదృశ కాంతితో సంశోభిల్లుతున్నాడు. సురలు అమరత్వ సిద్ధికి అవకాశమున్న అద్భుతదేశం ఆర్యావర్తంలో అవినీతి, అనైతికత, అధర్మం అవిచ్ఛిన్నంగా పెచ్చరిల్లుతున్న రీతిని చూసి అక్కజపడ్డారు. భాగవతాది గ్రంథాలలో చెప్పిన కలియుగపు లక్షణాలు అన్నీ స్పష్టంగా కనబడటం చూసి 'ఔరా! కలిప్రభావం ఇంత తీవ్రంగా ఉంటుందని మనం ఊహించనైనా ఊహించలేక పోతిమి' అనుకున్నారు. సభికులు ఇలా తమలో తాము చర్చించు కుంటున్న సమయంలోనే నరకం నుంచి ఇంద్రదర్శనానికై వార్తా హరుడు వస్తాడు. అక్కడున్న భటులు అతడిని సురాధీశుడి సమక్షానికి తోడ్కొని వస్తారు.

**వార్తాహరుడు:** (ఇంద్రుడికి నమస్కరిస్తూ) దేవా! మీకు తెలియనిది కాదు. కలియుగంలో పాపం దినదినం పెచ్చరిల్లు తున్నది. పూర్వ యుగాల మల్లే కాకుండా అందరూ తెలియకుండానే పాపపంకిలంలో కూరుకుపోతున్నారు. అందరూ సరాసరి నరకానికి రావటంతో నరకంలో స్థలాభావం ఏర్పడింది. మేము ఓవర్‌టైమ్ పనిచేయవలసి వస్తుంది. మాకు నిమిషం తీరికలేకుండా పోతుంది. దానితో మేముకూడా ఒత్తిడికి గురవుతున్నాం. మాలో కొందరు ఈ ఒత్తిడి ప్రభావం వలన పని సరిగాచేయలేకపోవటం, అప్పుడప్పుడు ధర్మస్వరూపుడు, మృదుభాషి ఐన మా నాయకుడు యమధర్మరాజుపై కోపించడం, అసహనాన్ని ప్రదర్శించడం చూసి చిత్రగుప్తులవారు నన్ను ఒక అభ్యర్థనతో మీదగ్గరకు పంపించారు. తమరు ఆజ్ఞ ఇస్తే సెలవిస్తాను.

**ఇంద్రుడు:** నువ్వు చిత్రగుప్తుల సందేశం సభాసారులకు వినిపించవలసినది.

**వార్తాహరుడు:** ఇంతకు ముందు మనుజులు కొన్ని పాపకర్మలు, కొన్ని పుణ్యకర్మలు ఆచరించేవారు. పుణ్యకర్మల ఫలంగా వారికి దేవలోకవాసం కలిగేది. దేవలోకంలో అలా పుణ్యఫలాన్ని అను భవించిన తరువాత పాపకర్మల ఫలాన్ని అనుభవించడానికి నరకానికి వచ్చేవారు. అందుకని మాపై అంత ఒత్తిడి ఉండేది కాదు. కాస్త జీవితం ప్రశాంతంగా ఉండేది. ఇప్పుడు మంచిచెడుల విచక్షణ లేకపోవడం వలన అందరూ సరాసరి నరకానికి వస్తూండటంతో నరకం కిటకిటలాడిపోతుంది. ఇంతకు ముందు భారతదేశం నుంచి చాలా తక్కువమంది యమపురికి వస్తూండే వారు. ఆధ్యాత్మికభూమి కాబట్టి మోక్షగాములు అధిక సంఖ్యలో ఉండేవారు. వారి సమక్షంలో, సన్నిధిలో ఉండగలగటంతో చాలా మంది పుణ్యకర్మలు ఆచరించేవారు. నరకానికి భరతఖండం నుంచి వచ్చేవారి సంఖ్య చాలా తక్కువగా ఉండేది. ఇప్పుడు భూలోకంలో ఉన్న మనుజులలో పదిహేడు శాతం ఉన్న ఆ దేశం నుంచి నరకానికి వచ్చేవారి సంఖ్య అనూహ్యంగా పెరిగింది. దానితో నరకంలో స్థలాభావం నెలకొన్నది. అందుకని దయతలచి మీరు కొద్దిపాటి పుణ్యకర్మలుచేసిన వారినందరినీ స్వర్లోకంలో ఎక్కువ కాలం ఉంచుకున్నట్లైన మాకు ఉపకారం చేసినవారవుతారు.

**ఇంద్రుడు:** అదెలా సాధ్యం? పుణ్యకర్మలకు పుణ్యఫలం. పాప కర్మలకు పాపఫలం. ఆ విషయంలో రాయితీ ఇవ్వడానికి నాకు కానీ, యమధర్మరాజుకు కానీ అధికారం ఉన్నదని నేననుకోను. అందుకని సృష్టికర్త బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి ప్రేతపురాన్ని విస్తరించ డానికి అనుమతినొసగమని వేడుకోవలసినదని నా సలహాగా శమనుడికి తెలియజేయి. ఇప్పుడు భూలోకంలో ఎవ్వరినడిగినా అదే మాట్లాడుతున్నారు. విస్తరణ. వ్యాపార సామ్రాజ్య విస్తరణ; స్థిరచరాస్తుల విస్తరణ; మంత్రివర్గ విస్తరణ; పార్టీ విస్తరణ. హృదయ విస్తరణే లేదు. హృదయ వికాసం వితరణతోనే సాధ్యమని తెలియ లేకున్నారు. జనులలో నిత్యానిత్యవస్తు వివేకం కొరవడింది. విచారణ మృగ్యమైంది. మరొక విశేషమేమిటంటే ఈ విస్తరణలో పడి హృదయం కుంచించుకుపోతుందన్న విషయాన్ని గ్రహించటం లేదు. అందుకేనేమో హృద్రోగాలు చాలా పెరిగిపోతున్నాయి!

**వార్తాహరుడు:** ఆ విషయమై మా నాయకులు విరించికి విన్నవించి ఉన్నారు. పద్మసంభవుడు ప్రతియుగంలోనూ మంచి చెడులు రెండింటినీ కలిపితే సమానంగా ఉంటాయని, అధిక సంఖ్యాకులు ధర్మవిమూఢులు ఐన కలియుగంలోనూ మహా పుణ్యాత్ములు ఉంటారనీ వారివలననే సృష్టి నిలబడుతున్నదనీ, వివరించి, నరకాన్ని విస్తరించడానికి అనుమతిని నిరాకరించారు. కావాలంటే దేవేంద్రుడి దగ్గరకు వెళ్ళి కలియుగంలో ధర్మమార్గాన్ని ఎరిగినవారు కొద్దిమంది మాత్రమే ఉంటారు కనుక కొద్దిపాటి మంచి కర్మలు చేసిన వారందరికీ ఎక్కువకాలం నాక(దేవ)లోకంలో ఉండే అవకాశం కల్పించవలసినదని ఆయనకు విన్నవించు కోవలసినదని తెలియజేయటంతో మీ సమక్షానికి రావడం జరి గింది. కావునా తమరు దయతలచి మా మనవిని మన్నించ వలసినదని చిత్రగుప్తుల వారి విన్నపం.

**ఇంద్రుడు:** ఈ విషయం మా దేవలోకవాసులతో చర్చించి మా నిర్ణయాన్ని నీకు ఇప్పుడే తెలియజేసెదము.

**వార్తాహరుడు:** ఆజ్ఞ దేవరా.

**ఇంద్రుడు:** సభికుల పై దృష్టి సారిస్తూ... వార్తాహరుడి అభ్యర్థనను విన్నారు కదా. మీ సలహాలు, సూచనలు తెలియజేయవలసినది.

**ప్రత్యూషుడు (అష్టవసువులలో ఒకరు):** మీరు రాయితీ కల్పించి నరకంలో స్థానం లేదని పాపకర్మలు చేసినవారికి దేవలోకంలో ఉండటానికి అనుమతినిస్తే మేము వాళ్ళతో కలిసి జీవించలేము. పుణ్యవర్తనులైన ఆత్మలతోనే మేము జీవించగలము. కావాలంటే భూలోకంలో ధర్మాన్ని, సత్ప్రవర్తనను పెంచడానికి మనం మనవంతు ప్రయత్నం చేద్దాం. పుణ్యంచేసి దేవలోకంలో ఉండ టానికి అర్హత సంపాదించుకున్నవారు మాత్రమే ఇక్కడకు రావాలి.

**సభికులు కొందరు (ఏకకంఠంతో):** మేమూ ఈ విషయంలో ప్రత్యూషుడితో ఏకీభవిస్తున్నాం. ఏ విధంగా ప్రజలను ధర్మాభిరక్తులను చేయాలన్న విషయాన్ని మనం ఆలోచించి, భూలోకంలో సత్కర్మాచరణను పెంచుదాం. అధర్మవర్తనులకు మాత్రం స్వర్గంలో స్థానం కల్పించటానికి వీల్లేదు. వారి సాంగత్యంలో మేం ఉండలేం. స్వర్గం కూడా కలుషితం అవుతుంది.

**బృహస్పతి:** ప్రస్తుతం మాయాబజార్‌లో దైవమూలమిదం జగత్ అంటే ఎవరూ నమ్మరు. చార్వాకుల, భౌతికవాదుల భావమైన ధనమూలమిదం జగత్ అంటే మాత్రమే విశ్వసిస్తారు. నిజానికి ఒకప్పుడు మానవులందరికీ పూర్వజన్మ స్మృతి ఉండేది. అందరూ బాధలు అనుభవించేటప్పుడు ఏ పాడుకర్మవలన తమకు ఆ దుఃస్థితి కలిగిందో వెంటనే తెలుసుకోగలిగేవారు. దానితో సర్వులూ సత్కార్యాలకు పూనుకునేవారు. జనబాహుళ్యం యావత్తు మంచి కర్మలు మాత్రమే చేయడంతో స్వర్గంలో సమ్మర్దం పెరిగిపోయింది. అందరూ స్వర్గానికి రావటంతో మనం బ్రహ్మదేవుడికి మన సమస్యను విన్నవించి ఆయనను స్వర్గంలో రద్దీని తగ్గించమని వేడుకున్నాం. ఆయన వెంటనే ఆ పూర్వజన్మ విజ్ఞానశక్తిని నిర్మూలించాడు.




కామక్రోధాదుల ప్రాబల్యాన్ని రేకెత్తించాడు. దానితో నరకలోకంలో సమ్మర్దం పెరిగిపోయింది. పరమేష్ఠి అంతటితో మధ్యేమార్గమమే ఉత్తమమని నిశ్చయించి ఎవరైతే ధార్మిక గ్రంథాలను చదువుతారో వారికి పరలోక పాటవం కలిగేటట్లు చేసి స్వర్గనరకాలలో రద్దీని తగ్గించాడు. మళ్ళీ ఇన్నాళ్ళకు భారతీయులలో అధిక సంఖ్యాకులైన హైందవులకు వారి శాస్త్రాలపై శ్రద్ధ తగ్గిపోవటంతో పాపకర్మలనేకం తెలియకుండానే ఒనరించి నరకానికి సోపానం వేసుకుంటున్నారు. అదిగో దానితో మళ్ళీ నరకంలో సమ్మర్దం పెరిగి ఈ విధమైన విన్నపం మనకు వచ్చింది.

**చిత్రరథుడు(గంధర్వుడు):** మనం ఒక పని చేద్దాం. మళ్ళీ దేవలుడిని, భూలోకానికి పంపి మహోన్నత ఆధ్యాత్మిక భావధార అనదగ్గ రామకృష్ణ-వివేకానంద సాహిత్యాన్ని అందరి ఇళ్ళలో ప్రవహింపజేయిద్దాం. ప్రతియింట్లో ఎవరో ఒకరు తప్పక రామాయణ-భారత-భాగవతాది గ్రంథాలను రోజూ కనీసం ఒక పదినిమిషాలైన చదివేటట్లు చేయగల్గితే వారి మనస్సులు పవిత్రమవుతాయి. కుటుంబ సభ్యులు అందరూ స్వర్గవాసానికి అర్హత పొందుతారు. మహాభాగవతంలో అజామిళోపాఖ్యానంలో యమధర్మరాజు తన భృత్యులకు తెలిపిన మహాశ్లోకాన్ని అందరికీ తెలియజేద్దాం.

**బృహస్పతి:** ఏమిటి ఆ శ్లోకార్థం?

**చిత్రరథుడు:** మీకు తెలియనిదేముంది గురువర్యా. పాపాలు చేసిన అజామిళుడిని తీసుకువెళ్ళటానికి యమరాజు దూతలు వచ్చినప్పుడు విష్ణుదూతలు వారిని అడ్డుకొని తుదిశ్వాస విడిచేటప్పుడు 'నారాయణ' (నిజానికి నారాయణ అనే పేరుగల తన కొడుకుని పిలుస్తాడు) అన్నాడు కాబట్టి ఈ అజామిళుడికి వైకుంఠ వాసం సమకూరింది అంటారు. అప్పుడు ఆశ్చర్యాన్ని ప్రకటించిన తన భృత్యులతో యమపురాధీశుడు **"సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలన మేవవా వైకుంఠ నామగ్రహణమశేషాఘహరం విదుః...** భగవన్నామాన్ని కేవలం పేరుగా, పరిహాసానికి, పద్యాలలో అక్షరసొంపుకై పెట్టుకొని లేదా హేళనగా ఉచ్చరించినప్పటికీ అది సర్వ పాప పరిహారిణి అవుతుంది. అలాంటి వారందరూ నరకాన్నే కాదు, స్వర్గాన్ని కూడా అతిక్రమించి సరాసరి వైకుంఠ వాసానికే అర్హత సంపాదించుకుంటారు".

**దేవలుడు:** దేవరా! ఏదో వార్తలు సేకరించమంటే విహార యాత్రలాగా ఉంటుందని భూలోకం వెళ్ళాను కానీ, ఇప్పటి పరిస్థితులలో మానవులను ఆధ్యాత్మిక మార్గావలంబులుగా చేయడమంటే నావల్ల అయ్యే పని కాదు. ఏలికలు క్షమించాలి.

**సురుచి:** నాదొక సలహా ప్రభూ. ఎలాగూ మనకు నరకం నుంచి వార్తాహరుడు వచ్చాడు కదా. మనం చిత్రగుప్తుడి కోరికను పూర్తిగా మన్నించకపోయినా నరకంలో పాపాలకు శిక్షలు అనుభవించటానికి వచ్చినవారు, భూలోకంలో వివిధ వృత్తులను నిర్వహించినవారిని ఒక్కొక్కరిని ఇక్కడకు రప్పించి వారిద్వారానే వారు ఏయేకర్మలు చేయటం వలన ఇలా దుర్గతిని పొంది దుఃఖాన్ని అనుభవిస్తున్నారో తెలుసుకొందాం. ఏవిధంగా వారు ధర్మాన్ని అనుష్ఠించి ఉంటే సరాసరి స్వర్గానికి రాగలిగేవారో తెలియజేసి శాటిలైట్ ఛానల్ ద్వారా వాటిని మనం ఇలావర్తనులకు అందిద్దాం. అప్పుడు ఆ యా వృత్తులలో ఉన్నవారు అప్రమత్తులై మంచిపనులు చేసి సురలోకవాసాన్ని పొందేటట్లు చేద్దాం.

**ఇంద్రుడు:** ఈ ఆలోచనేదో బాగానే ఉంది. కానీ స్వర్గలోకం అంతా ఛానల్ లో చూపిస్తే ఇంకేమన్న ఉందా. అందరూ ధర్మనిధులైతే మళ్ళీ మనకు నరకలోక పరిస్థితి దాపురిస్తుంది.

**సురుచి:** మీకు ఆ కంగారు ఏమీ అవసరం లేదు దేవరా. భూలోక వాసులకు ఇప్పుడు ఎన్నో వందల ఛానళ్ళు ఉన్నాయి. ఇలాంటి కార్యక్రమాలు ఏదో పూర్వజన్మ సుకృతం కొద్దోగొప్పో ఉన్నవాళ్ళు తప్ప అందరూ చూడలేరు. మనల్ని చూసినా ఇదేదో సాఫ్ట్‌వేర్ ఉపయోగించి మనుషులనే ఇలా చూపిస్తున్నారు అనుకుంటారు. స్వర్గం అని భావించరు. అసలు పునర్జన్మనే నమ్మని వాళ్ళు స్వర్గనరకాలను ఎలా నమ్ముతారు? అలాంటివారి శాతం అతి కొద్దిగానే ఉంటుంది. ప్రభువులు ఈ విషయమై ఆందోళన చెందవలసిన అవసరం లేదు. మన ఆలోచనను ఆచరణలోపెడదాం.

**ఇంద్రుడు:** సరే, అలానే కానిద్దాం. ఈ నాటికి సభను చాలిద్దాం. ❖

ధర్మాచరణమే ఈ జన్మలోనూ, రాబోయే జన్మలలోనూ మనల్ని రక్షిస్తుంది. ధర్మమార్గంలో నడిచే వారికి జంతువులు కూడా సహాయపడతాయి. అధర్మపరుల్ని సొంతవారు కూడా క్షమించరు. - నీతిశాస్త్రం



# సహనం... సాఫల్యం

– స్వామి బోధమయానంద

జనంతో కిక్కిరిసిన రైలు, స్టేషన్ నుంచి అప్పుడే బయలుదేరింది. పిల్లలు, పెద్దలు, విద్యార్థులు, దంపతులు... ఇలా అన్ని వయస్సుల వారూ అందులో ప్రయాణిస్తున్నారు. ఓ బోగీలో కిటికీ వద్ద ఓ డెబ్బైఏళ్ళ పెద్దాయన తన ఇరవయ్యేళ్ళ మనవడితో కూర్చుని ప్రయాణిస్తూ ఉన్నాడు. రైలు వేగంగా పరుగెడుతోంది. ఒక్కసారిగా ఆ మనవడు 'తాతయ్యా! చూడు, చూడు చెట్లు ఎలా వేగంగా కదిలి వెళ్ళిపోతున్నాయో! అబ్బా! ప్రకృతి ఎంత అందంగా ఉందో చూడు!' అంటూ ఆనందంతో పరవశించిపోతున్నాడు. చుట్టుపక్కల ప్రయాణికులందరూ ఆశ్చర్యపోతున్నారు. 'ఏంటీ పిల్లాడు? పిచ్చిగా ప్రవర్తిస్తున్నాడు' అనుకుంటూ గుసగుసలాడుకోసాగారు. ఆ తాతామనవడి పక్కన కూర్చున్న ఓ కొత్తదంపతులైతే మరింత అసహనానికి గురవుతున్నారు. ఇంతలో సన్నగా చినుకులు పడటం మొదలైంది. చిరుజల్లులు రైలు కిటికీ గుండా ప్రయాణికుల్ని తడిపేస్తూ ఉన్నాయి. ఆ కుర్రాడు మరింత పులకరించిపోతున్నాడు. 'తాతయ్యా! వర్షాన్ని చూడు, ఎంత ముచ్చటేస్తుందో!' అంటూ చేతులు బయటపెట్టి మరీ ఆనందపడిపోతున్నాడు. కాని వర్షపు చినుకులు లోనపడి, కొద్దిగా తడి చేస్తూ ఉంటుంటే, ఆ నూతన దంపతులు భరించలేకపోతున్నారు. వెంటనే ఆ యువతి విసుగ్గా 'ఏంటండీ ఇది! ఆ అబ్బాయికి ఏమన్నా పిచ్చా? వర్షాన్ని, ప్రకృతిని, పచ్చదనాన్ని ఎప్పుడూ చూడనట్టు, ఏంటా అల్లరి?' అంటూ ఆ పెద్దాయనపై విరుచుకుపడింది. అప్పుడు ఆయన సౌమ్యంగా 'అలాంటిదేమీ లేదమ్మా! ఇప్పుడే మేము కంటి ఆసుపత్రి నుంచి వస్తున్నాం. ఇరవయ్యేళ్ళుగా వాడికి కంటిచూపు లేదు. పుట్టు అంధుడు. వారం క్రితమే ఆపరేషన్ చేస్తే కంటిచూపు వచ్చింది. ఉదయమే ఆసుపత్రి నుంచి డిశ్చార్జ్ చేశారు. పచ్చనిచెట్లను, కురుస్తున్న చిరుజల్లుల్ని చూడటం ఇదే మొదటిసారి వాడికి! అందుకే అంత సంబరపడిపోయాడు. అసౌకర్యానికి క్షమించండమ్మా!' అంటూ మనవడిని కుదురుగా కూర్చోబెట్టుకున్నాడు. తోటి ప్రయాణికులకందరికీ ఒక్కసారిగా మనస్సు చివుక్కుమంది. ఇలా మనం ఎన్నో సందర్భాల్లో, ప్రతిదాన్నీ మన దృష్టికోణం నుంచే చూసి పొరపాటు పడుతూ ఉంటాం. ఒక్క క్షణం కూడా ఎదుటివారి వైపు నుంచి ఆలోచించకుండా, వెంటనే అసహనానికి గురవుతూ ఉంటాం. అందుకే ప్రతి చిన్న దానికీ వెంటనే ప్రతిస్పందించటం మానుకోవాలి. ఈ రోజుల్లో మనలో చాలామంది చిన్నచిన్న మాటపట్టింపులతోనే మానవ సంబంధాలను క్షణాల్లోనే తెగతెంపులు చేసుకుంటున్నాం.

వయసుకు తగ్గట్లు మనలో మానసికపరిణతి, ఆత్మ పరిశీలన కొరవడటమే దీనికి కారణం! ఇతరుల మనస్సు గాయపడకుండా మన మనస్సులో మాటను చెప్పగలిగేంత సహనం, ఓర్పు మనలో నానాటికీ తగ్గిపోతున్నాయి. ఇలా ఇంట్లో కావచ్చు, మనం పనిచేసే చోట కావచ్చు, అహంకారాన్ని కాస్త దూరం పెట్టి, సౌమ్యంగా ప్రవర్తించగలిగే పరిణతి కోసం ప్రయత్నించాలి. రోజూవారీ పయనంలో మనం కుటుంబసభ్యులుగా, బంధువులుగా, సహప్రయాణికులుగా, ఉద్యోగులుగా ఎన్నో పాత్రలు పోషిస్తూ ఉంటాం. అన్నింటిలో కూడా మన ఏకైక శత్రువు 'అహం'! దీనిని ఒక్కదానిని మనం నియంత్రించి సహనంతో మైత్రి కుదుర్చుకుంటే ఎక్కడా మన పాత్రకు భంగం వాటిల్లదు.

ప్రతి ఒక్కరు తాము సమాజంలో ఒక భాగంగానే భావించుకోవాలి. వ్యక్తికి అనుకూలంగా వ్యవస్థ ఉండదు; వ్యవస్థకు అనుకూలంగానే వ్యక్తి మసలుకుంటూ, రాణించే ప్రయత్నం చేయాలి. ప్రతి సందర్భం నుంచి పాఠాలు నేర్చుకుంటూ వ్యక్తిని 'విజ్ఞాని'గా ఎదగమంటోంది మన సనాతన ధర్మం. సహనంతో ఒక సంఘటనను పరిశీలించ గలిగినప్పుడే, దాని నుంచి మంచిని నేర్చుకోగలం. ఏకాంతంగా మనతో మనం గడుపుతున్నప్పుడు బాగానే ఉంటుంది. కానీ నలుగురితో కలిసి నడవాల్సి వచ్చినప్పుడే, అది సహనానికి పరీక్ష! ఆ సమయంలోనే మనను మనం నియంత్రణలో పెట్టుకోవాలి. నలుగురితో సానుకూలంగా మసలుకోగలగాలి. నిరంతరం పరిస్థితులు, పరిసరాలు మనకు అనుకూలంగా ఉండవు. చాలా సందర్భాల్లో మన ఇష్టాయిష్టాలకు అతీతంగా పరిస్థితులు చుట్టుముడతాయి. కానీ అప్పుడే మనం సహనంగా, సంయమనంతో నడచుకోవాలి. అప్పుడే జీవనపోరాటంలో సఫలీకృతులం కాగలం. ❖






# స్వామీజీ భావప్రచారమే ధ్యేయం

పన్నెండవ తరగతి విద్యార్థిగా 'యువసంఘర్ష్' పేరిట జరిగిన పోటీల కోసం రామకృష్ణమఠంలోకి అడుగుపెట్టిన తరువాత ఇన్నాళ్ళూ మేము చాలా సంకుచిత సమాజంలో ఉన్నామనిపించింది. స్వామి వివేకానంద చదువంటే ఏమిటో చెప్పిన వాక్యాలను తెలుసుకున్న తరువాత నా(కార్తీక్) భ్రమలన్నీ తొలగిపోయాయి. ఇప్పటి వరకు ఏదో గణితం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం చదివేసి, మంచి మార్కులు తెచ్చేసుకుంటే చాలు, నేను చాలా విద్యావంతుడినైపోతాననుకున్నాను. కానీ స్వామీజీ 'Education is the manifestation of the perfection already in man' అన్న మాటలు నాలో చాలా మార్పు తీసుకువచ్చాయి. మనలో ఉన్న పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరింపచేయటానికి ఉపయోగపడేదే నిజమైన విద్య అని తెలిసింది. ఎలాంటి భేషజాలు లేకుండా చెప్పుకోవాలంటే, నాకు అన్ని సబ్జెక్టుల్లో ఎక్కువ మార్కులు వస్తాయని, బాగా చదువుతానని ఇన్నాళ్ళూ చాలా గర్వంగా ఉండేవాడిని. తక్కువ మార్కులు వచ్చేవాళ్ళని చులకనగా చూసేవాడిని. కానీ స్వామి వివేకానంద పుస్తకాలు చదివాక, మెల్లమెల్లగా నాలో ఆ అహంకారం తగ్గింది. మా కుటుంబసభ్యులు, బంధువులు, మిత్రులు నాలో వచ్చిన ఈ మార్పును చూసి ఆశ్చర్యపోతున్నారు. ఏదైనా మార్పు ఇంట్లోంచే రావాలని నమ్ముతున్నాను. అందుకే మా చెల్లికి స్వామీజీ పుస్తకాలను ఇచ్చి చదివిస్తూ ఉన్నాను. నా ఇంట్లో ఒక వ్యక్తి నుంచి నా ప్రచారాన్ని ప్రారంభిద్దామనుకుంటున్నాను.

**ఇంటి నుంచే సేవ :** సేవా కార్యక్రమాలను కూడా ముందు మా ఇంట్లో నుంచే మొదలుపెట్టాలని తలంచాను. నాలాగే పన్నెండవ తరగతి చదువుతున్న పదహారేళ్ళ అబ్బాయి, రోజూ మా కాలనీలో పేపర్ వేస్తూ ఉంటాడు. ఆర్థికంగా వెనుకబడిన ఆ కుర్రాడికి మా నాన్న వారం, వారం కొంత డబ్బు సహాయం చేస్తూ ఉంటాడు. అలా కాకుండా, నెల నెలా ఆ అబ్బాయి ఫీజు నీవే చెల్లించమని నాన్నకు చెప్పాను. మా నాన్నతో పాటు మా కాలనీలో కొద్ది మంది దగ్గర డబ్బులు వసూలు చేసి ఆ అబ్బాయి మొదటివిడత ఫీజును కట్టాను. ఇదేవిధంగా పేపర్ బాయ్‌తో పాటు మా ఇంట్లో పనిచేసే పిల్లల ఫీజులు కట్టేందుకు ప్రయత్నిస్తూన్నాను. ఇప్పటికి నలుగురు పిల్లలు చదువుకునేందుకు మా మిత్రులతో కలసి ఆర్థికంగా సహాయపడుతున్నాను. భవిష్యత్తులో ఈ సంఖ్యను మరింత పెంచాలని భావిస్తూ ఉన్నాను. ఇలా స్వామి వివేకానంద ఇచ్చే స్ఫూర్తి నాకొక్కడికే పరిమితం కాకుండా, మరింత మందికి చేరాలని ఆలోచించాను. అందుకే కేవలం ఆర్థికంగా సాయం చేయటమే కాకుండా, స్వామీజీ సాహిత్యం ఎక్కువమంది చదివేలా చూడాలనీ, వాళ్ళ కాళ్ళపై వాళ్ళు నిలబడటానికి అది ఉపయోగపడాలనీ భావిస్తూ ఉచితంగా పుస్తకాలను పంచుతున్నాను. గత దసరా పండగ సమయంలో నేను, మా ఇద్దరు మిత్రులు కలసి స్థానిక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలకు వెళ్ళి రామకృష్ణ మఠం పుస్తకాలను విద్యార్థులకు పంపిణీ చేశాము. మేము దాచుకున్న డబ్బులతో, పేద విద్యార్థులకు చదువుకోవటానికి ఉపయోగపడే సామగ్రిని కొని ఇచ్చాం. ఇకపై ప్రతి పండగకు ఇలాంటి కార్యక్రమాలు చేపట్టాలని నేను, మా స్నేహితులు అనుకుంటున్నాం. ఇలా ప్రతి పండగకూ ఏ కొద్ది మంది ముఖాల్లో చిరునవ్వులు పూయించినా చాలు, మా జన్మ ధన్యమైనట్లే!

**స్వామీజీ ఆశయాల ప్రచారం...:** నాతో సహకరించే కొద్ది మంది మిత్రులను కూడగట్టుకొని స్వామి వివేకానంద భావాలను ప్రచారం చేయటమే లక్ష్యంగా పెట్టుకున్నాను. అందుకే నెలలో ఒకసారి కొత్తకొత్త మిత్రులతో హైదరాబాదు రామకృష్ణ మఠానికి వచ్చి కార్యక్రమాల్లో పాల్గొనటంతో పాటు ఇతర స్వామీజీలతో మాట్లాడుతూ వారి సహాయసహకారాలను తీసుకోవాలని నిర్ణయించుకున్నాను. సినిమాలకు, ఇతర విలాసాలకు ఖర్చు చేసే డబ్బును సమాజసేవా కార్యక్రమాలకు వినియోగించదలచుకొని ఇప్పటికే ఆదా చేయటం ప్రారంభించాను. వారాంతంలో మిత్రులతో కలసి అనాథాశ్రమానికి కానీ, వృద్ధాశ్రమానికి కానీ వెళ్ళి అక్కడివారితో గడపి వస్తూన్నాం; దుప్పట్లు తదితర సామగ్రిని పంపిణీ చేస్తూ ఉన్నాం. పన్నెండుమందితో ఆరంభమైన మా మిత్రబృందం కేవలం నలభై అయిదు రోజుల్లో 32 మందికి చేరింది. దీనిని భవిష్యత్తులో మరింత పెంచాలని ఆకాంక్షిస్తూ ఉన్నాను. ఇప్పటికే మా పాఠశాలలో మా మిత్రులతో పాటు జూనియర్స్ కూడా మఠానికి రావటం అలవాటు చేసుకున్నారు. ముఖ్యంగా సామాజిక సేవాసంస్థలవైపు ఆసక్తిచూపుతున్నారు. స్వామి వివేకానంద భావాలకు ఆకర్షితులయ్యేలా Parallel perspective పేరుతో ఫేస్‌బుక్‌లో ఓ గ్రూప్‌ని కూడా ప్రారంభించాను. రాబోయే కాలంలో స్వామి వివేకానంద ఆశీస్సులతో వారి ఆశయాలను మరింత పరివ్యాప్తం చేయాలని ఆశిస్తూ ఉన్నాను. ❖

**కార్తీక్ ముత్య, 12వ తరగతి**

('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుదిపోటీ (ఫైనల్స్)కి అర్హత సాధించిన బి.ఎస్.ఆర్. కేంద్రీయ విద్యాలయం, హైదరాబాదు, విద్యార్థి.)

**సుగంధం లేని పూవు ఎంత అందంగా కనిపించినప్పటికీ అది వ్యర్థం. అలాగే తాను చెప్పేవి చేతలలో చూపని వ్యక్తి మాటలు ఎంత మధురంగా ఉన్నప్పటికీ అవి ప్రయోజన శూన్యమే.** - బుద్ధ భగవానుడు

# అసూయ... ఒక బలహీనత

-బి. సైదులు



మహాభారతంలో ధృతరాష్ట్రుని అర్థాంగి గాంధారి, పాండు రాజు సతీమణి కుంతీదేవి కన్నా ముందే గర్భం దాల్చుతుంది. కానీ కుంతీదేవే ముందు ధర్మరాజుకు జన్మనిస్తుంది. కురువంశ పరంపరలో పాండురాజుకు ప్రథమ సంతానంగా ధర్మస్వరూపుడైన కుమారుడు జనించటంతో ఒక్కసారిగా ఆ శుభవార్త హస్తినాపురమంతా వ్యాపిస్తుంది. ఆ శుభవార్త గాంధారి అంతఃపురానికి కూడా చేరుతుంది. దీంతో ఒక్కసారిగా ఆమె మనస్సు అసూయతో రగిలిపోతుంది. కురువంశంలో తొలికాన్పు కుంతీదేవికే దక్కిందని; భవిష్యత్తులో అతనికే సామ్రాజ్యపగ్గాలు అప్పజెబుతారని ఈర్ష్యపడిపోయింది. తట్టుకోలేక నిండుగర్భాన్ని విచ్ఛిన్నం చేసుకుంది; అనంతరం హుటాహుటిన అంతఃపురానికి చేరుకున్న వ్యాసమహర్షి ఆ మాంసపు ముద్దను నూటొక్క ముక్కలుగా చేసి, వేర్వేరు నేతి కుండలలో పెట్టించాడు. తదనంతరం వాటి నుంచే నూరుగురు కొడుకులు, ఒక కూతురు సంప్రాప్తించారు. అంధుడైన భర్త కోసం అపురూపమైన ఈ దృశ్య ప్రపంచాన్ని దర్శించుకునే భాగ్యాన్నే త్యాగం చేసి, జీవితాంతమూ కళ్ళకు గంతలు కట్టుకున్న పతివ్రత, సాక్షాత్తూ శ్రీకృష్ణ భగవానుడినే శపించగలిగిన సాధ్వీమణి ఆమె! కానీ సహజమైన తన పుత్రప్రేమ పేరిట 'కడుపు' మంటతో కుమిలిపోయింది. ఆ మనః ప్రవృత్తి ఫలంగా కులనాశకులైన కుమారులను కన్నది. ఇలా కురుక్షేత్ర రణరంగానికి కౌరవులో, కృష్ణపరమాత్ముడో కాదు... కేవలం గాంధారికి తాను నిండుచూలాలుగా ఉన్నప్పుడు కలిగిన అసూయ అనే మనోవికారమే కారణం. దానితో దుర్యోధనాదులు పుట్టుకతోనే పాండవులపై అసూయ పెంచుకున్నారు. మహాభారత యుద్ధంలో పతనమైపోయారు.

**ఆత్మన్యూనత వల్లే అసూయ...:** ఒకరిని చూసి మనం ఓర్వలేకపోతున్నామంటే, మనల్ని మనం హీనపరచుకుంటున్నామని అర్థం; అది పూర్తిగా మన ఆత్మన్యూనతా భావానికి (Inferiority complex) చిహ్నం. ఈ అసూయ పొడ చూపిన క్షణం నుంచి మనలో మానసిక అలజడి మొదలవుతుంది; అది క్రమంగా మన ప్రశాంతతను హరించి వేసి మన శక్తులన్నింటినీ నిర్వీర్యం చేస్తుంది. కొన్ని సందర్భాల్లో మన విచక్షణను కూడా కోల్పోయేలా చేస్తుంది. ఎదుటి వ్యక్తి మనకు శత్రువన్న భ్రమను కల్పించి, ప్రతీకార జ్వాలల్ని రగిలిస్తుంది. నలుగురితో కలసి ఆహ్లాదంగా ఉండలేని పరిస్థితిని సృష్టిస్తుంది. అందుకే స్వామి వివేకానంద అంటారు 'Jealousy is the bane of our national character, natural to slaves. Three men can not act in concert together in India for five minutes!' నిజమే, అసూయ బానిసల స్వభావం. అది జాతి స్వభావాన్నే విషపూరితం చేసి, నిర్వీర్యపరుస్తూ ఉంది. భారత దేశంలో ముగ్గురు వ్యక్తులు కలసికట్టుగా అయిదు నిమిషాలైనా పనిచేయలేరు!. ఒక కళాకారుడు, మరో కళాకారుడిని మన స్ఫూర్తిగా అభినందించలేడు; ఒక రచయిత మరో రచయిత పుస్తకాన్ని ఆసక్తిగా చదవలేడు; ఒక సంగీత విద్వాంసుడు మరో సంగీతజ్ఞుడి గానాన్ని సంపూర్ణంగా ఆస్వాదించలేడు! ఇలా, ఇక ఎంత విద్వత్తు ఉంటే ఏం లాభం?. చాలా సభాకార్యక్రమాలకు చాలా మంది కళాకారులు ఒకరిని పిలిస్తే, మరొకరు మేము రామని నిరాకరిస్తున్న సందర్భాలు కోకొల్లలు.

**కుళ్ళుకుంటే కుమిలిపోతాం... :** ఇటీవల విజయనగరంలో ఒక పండగ వేడుకల్లో ఇరవయ్యేళ్ళ కుర్రాడు చక్కని నాట్యాన్ని ప్రదర్శించాడు. అతడి ప్రతిభకు ముగ్ధులై ప్రేక్షకులు, అతన్ని అభినందనల్లో ముంచెత్తారు. అదే వేదికపై, తరువాత మరో ముప్పైఏళ్ళ యువకుడూ నర్తించాడు. కానీ మొదటి కుర్రాడంత ఆకట్టుకోలేకపోయాడు. దాంతో ప్రేక్షకులు సాధారణంగా స్పందించారు. ఇక అతడి మనస్సు తట్టుకోలేక అల్లకల్లోలమైపోయింది; ఇంటికి వెళ్ళినా ఆ యువకుడికి నిద్దరపట్టలేదు. దాంతో ఆ రాత్రి తప్పతాగాడు. మొదట నాట్యాన్ని ప్రదర్శించిన కుర్రాడి ఇంటికి వెళ్ళి తుపాకితో కాల్చిచంపేశాడు. ఇలా అసూయ

యుక్తాయుక్త విచక్షణను కోల్పోయేలా చేస్తుంది. నిజానికి ఎవరి ప్రతిభ వారిదే! ఎవరి ప్రాధాన్యం వారిదే! మనం కుళ్ళుకొని కుమిలిపోయినంత మాత్రాన ఒకరిది మన సొంతం కాదు. పైగా మానసిక అనారోగ్యానికి గురిచేస్తుంది. ఎదుటివారిని చూసి ఉడుక్కునే కన్నా, వారు ఆ స్థాయికి చేరుకోవటానికి పడిన శ్రమను గుర్తించి, అనుసరించాలి. తన వైభవాన్ని చూసి ఓర్వలేక, తరచూ అవమానపరిచే మామ దక్షుడి మానసిక స్థితిని విశ్లేషిస్తూ, తన సతీదేవి పార్వతితో శ్రీమద్భాగవత సప్తమస్కంధంలో పరమశివుడు అంటాడు 'అహంకారమూ, దోషములు లేనివారు కావడం చేత సజ్జనులకు ఘనకీర్తి లభిస్తుంది. అలాంటి కీర్తి, తమకూ దక్కాలని కొందరు కోరుకుంటారు. కానీ వారు అసమర్థులు కావడం వల్ల వారికి కీర్తి రాదు. అందుచేత మనస్సులో కుతకుత ఉడికిపోతారు'.

**స్పర్థలతో మనఃస్పర్థలు...:** ఎదుటివారిలా మనమూ ఎదగాలనీ, ప్రత్యేకతను చాటుకోవాలనీ కొంత పోటీభావంతో శ్రమించటంలో తప్పులేదు. కానీ ఆ స్పర్థ, మనఃస్పర్థలకు, వైషమ్యాలకు దారి తీసి, శత్రుత్వాన్ని పాదు కొల్పకూడదు. భగవంతుడు ప్రతి ఒక్కరికీ, తప్పకుండా ఏదో ఒక ప్రత్యేకశక్తిని ప్రసాదిస్తాడు. అది గుర్తించిన వారు, వెంటనే ఆ రంగంలో కృషిచేస్తారు. అను కున్నది సాధించుకుంటారు; కానీ అది తెలియక అయోమయంలో కొట్టుకు పోయేవారు, సాధించుక్ను వారిని చూసి ఉడికిపోతారు; అనవసరంగా వారిపై పడి ఏడుస్తారు. ఈ ప్రపంచం తలుపులు తెరిచిన విశాల క్రీడా ప్రాంగణం లాంటిది; వ్యాయామం చేసుకుంటామా? వీలు పడటం లేదని ప్రేక్షకుడిలా ఓ పక్కన పడి ఉంటామా? అన్నది మనపై ఆధారపడి ఉంటుంది. అంతేకానీ, క్రీడాసామగ్రిని వినియోగించుకొని, కండలు పెంచుకున్న వారిని చూసి, కుళ్ళుకుంటూ కూర్చుంటే భగవంతుడు కూడా మనల్ని ఏమీ చేయలేడు! అందుకే ముందు పక్కవారి గురించి ఆలోచించటం మానుకోవాలి. వేరెవరితోనో పోల్చుకొని మనల్ని మనం అంచనా వేసుకోవలసిన అవసరం లేదు. నిన్నటికీ, నేటికీ నాకు నేను ఎదిగానా? అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. నీతో నీవు పోటీపడాలి. గత ఏడాదికి, ఈ ఏడాదికి కించిత్తయినా మనలో పరిణతి లేకపోతే మనం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు బ్రతుకులీడుస్తున్నామన్న మాటే! పైగా ఈ క్షణ భంగురమైన జీవితంలో, మరోవ్యక్తి గురించి ఆలోచించి, మాత్సర్యంతో మరిగిపోతున్నామంటే అంతకు మించిన దౌర్భాగ్యం మరోటి లేదు.

**అల్సర్ అనే అనారోగ్యం కడుపులోనే మంటను రగిలిస్తుంది. కాని 'కడుపుమంట' అనే అసూయ మన జీవితాన్నే దహించి వేస్తుంది. అన్ని వ్యాధులకన్నా అతి ప్రమాదకరమైన వ్యాధి అసూయ.**



**సంకుచితంతో సర్వనాశనం...:** శ్రీరామచంద్రుడి గుణ గణాల్ని వర్ణిస్తూ '**అనసూయో జితక్రోధో న దృప్తో న చ మత్సరీ...**' అంటోంది శ్రీమద్రామాయణం. అసూయ, మాత్సర్యం అన్నమాటే ఎరుగని వాడు రఘురాముడు. ప్రతి ఒక్కరి ప్రావీణ్యాన్ని పసిగట్టి మరీ అభినందించేవాడు. చివరకు రావణాసురుడిలోని మంచిని కూడా నిర్మొహమాటంగా మెచ్చుకున్నాడు. కనుకనే ఆయన లోకాభిరాముడయ్యాడు. కానీ నేటిసమాజంలో పెద్ద, పెద్ద ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తూ, ఉన్నత స్థానాల్లో ఉన్న చాలా మంది వ్యక్తులు సాటి ఉద్యోగుల ప్రతిభను మనసారా అభినందించలేక పోతున్నారు. పెద్దమనస్సుతో వారిని ప్రోత్సహించలేకపోతున్నారు. వారి సంకుచిత మనోభావాల ఫలితంగా ఉత్తమనాయకులు కాలేక పోతున్నారు. ఉన్నతస్థానంలో ఉండి కూడా, తమ కనుకుట్టు తనంతో అధమ పౌరులుగా మిగిలిపోతున్నారు. స్వామి రంగనాథా నందజీ మహరాజ్ మాటల్లో చెప్పాలంటే నేడు చాలా మందిలో 'Expansion of I' కొరవడుతోంది. అంటే మనం మనస్సును విస్తరించుకోవటం లేదు. 'నేను' నుంచి 'మనం' అనే స్థాయికి చేరుకోవటం లేదు. సాటి మనిషిని హృదయపూర్వకంగా అభినందించ లేనంత అట్టడుగు స్థాయిలో ఉంటే, మన నాగరకత, మన చదువు, సంస్కారాలు ఏమైనట్లు?

**అభినందనే అసూయకు మందు :** Jealousy is a mental cancer... అంటారు ఆంగ్ల రచయిత బి.సి.ఫోర్బ్స్. అవును! మన మనస్సును క్యాన్సర్ వ్యాధిలా తొలిచే పురుగులాంటిది అసూయ. అది ఎదుటివారి కన్నా మనకే ఎక్కువ హాని కలిగిస్తుంది. అసూయకు అభినందనే అసలైన మందు! ఎదుటివారిలో ఏ కొంచెం ప్రతిభ కనిపించినా, ప్రశంసించటానికి ప్రయత్నిస్తే, అది మన హృదయాన్ని వికసింపచేస్తుంది. పక్కవారు ఎదిగితే, మనసారా సంతోషించండి; వీలయితే మీ ఆనందాన్ని వారి ముందు వ్యక్తం చేయండి. మీ సహ ఉద్యోగికి ప్రమోషన్ వస్తేనో, కొత్త కారు కొంటేనో ముందు మన మనస్సు అలవాటు కొద్దీ, అసూయతో కొంత గిల్లుకుంటుంది. అయినా దాని బుద్ధిని మళ్ళించండి; మిత్రుడి వద్దకు వెళ్ళి నిండుమనస్సుతో గుండెకు హత్తుకోండి. మనస్సుకు ఆ అభినందన మందార మకరందాల మాధుర్యం ఏంటో తెలుస్తుంది. మన చుట్టూ ఓ ఆహ్లాదకరమైన పర్యావరణం పరచుకుంటుంది. అలా ఓ హిందీ కవి అన్నట్లు 'జ్యోత్‌సే, జ్యోత్ జగాకే చలో... ప్రేమ్‌కీ గంగా బహాతే చలో'...! ఈసునసూయల కారుచీకట్ల మధ్య జ్యోతి...జ్యోతి వెలిగించు కుంటూ... ప్రేమ అనే గంగను ప్రవహింప చేసుకుంటూ సాగిపోదాం! ❖

**తనలో ఏ సుగుణమూ లేని వ్యక్తి, గుణవంతుణ్ణి చూసి అసూయపడతాడు. ఎందుకంటే, తనలోని మంచినీ, ఎదుటి వ్యక్తిలోని చెడునీ చూసి ఆనందించడం మానవ నైజం కనుక.** - ఫ్రాన్సిస్ బేకన్



శ్రీరామకృష్ణుల నీతికథామార్గంలో

# వ్యక్తిత్వ వికాసం

- ఎమ్. శివరామకృష్ణ

## వినయాన్ని పెంచేదే విజ్ఞానం

భగవాన్ శ్రీరామకృష్ణులు జీవితానికి అన్వయించుకోని పాండితీ ప్రకర్షను, శాస్త్రజ్ఞానాన్ని నిరసించేవారు. మనలో అహంకారాన్ని తొలగించి, అణకువను పెంచేదే జ్ఞానమని బోధించేవారు. సరళంగా ప్రవర్తిస్తూ, అహంకారానికి దూరంగా ఉండేవాడే నిజమైన విజ్ఞాని అని అభిప్రాయపడేవారు. శ్రీరామకృష్ణ పరమహంస భావధారను 'కథామృతం'గా ప్రసాదించిన మహేంద్రనాథ్ గుప్త వారిని తొలిసారి దర్శించుకున్న క్షణంలోనే గొప్ప నీతిపాఠాన్ని నేర్పారు. మహేంద్రనాథ్ వివరాలు తెలుసుకుంటూ, 'నీకు పెళ్ళయిందా? నీ భార్య ఎలాంటిది?' అని శ్రీరామకృష్ణులు ప్రశ్నిస్తారు. వెంటనే ఆయన 'అయిందండీ! కానీ ఆమె అజ్ఞాని' అంటారు. ఒక్కసారిగా గురుదేవులకు అసహనం కలుగుతుంది; అందుకు విసుగుతో 'నువ్వు గొప్ప జ్ఞానివా?' అంటూ నవ్వుతారు. ఏది జ్ఞానమో, ఏది అజ్ఞానమో తెలియని నేటి సమాజంలో కూడా మనం ఇలా ఎన్నో సార్లు అహంకారంగా ఎదుటివారిని చులకనగా చూస్తూ ఉంటాం. తమకు తెలిసిందే జ్ఞానమని, నాలుగు పుస్తకాలు చదివి ఏదో పెద్ద విద్యాభ్యాసం చేసేశామని భ్రమపడిన ఎంతోమంది అహంకారం అలా ఆ అవతారమూర్తి సమక్షంలో పటాపంచలైపోయింది. 'నేను జీవించి ఉన్నంత కాలం, నేర్చుకుంటూనే ఉంటాను' అని స్వయంగా ఆయనే స్పష్టం చేశారు. ఈతరంలో కూడా చాలా మంది యువతీయువకులు ఏవో నాలుగు డిగ్రీలు సంపాదించుకొని విద్యావంతులమని విర్రవీగుతూ ఉంటారు. సరదాగా చెప్పుకోవాలంటే ఈ రోజు యువతరం Learningలో కొన్నాళ్ళకు 'L' మరచిపోయి కేవలం 'earning' లో పడిపోతున్నారనిపిస్తోంది. నిరంతరం ఏదో ఒకటి నేర్చుకుంటూ, జీవితానికి అన్వయించుకొని వికాసం పొందలేని విద్యకు విలువ లేదు. భగవాన్ శ్రీరామకృష్ణులు శిష్యులతో అనేవారు 'పాలు తెల్లగా ఉంటాయని, అవి తాగితే బలం వస్తుందని తెలుసుకోవటం జ్ఞానం; పాలు తాగి స్వయంగా బలిష్ఠంగా తయారు కావటం విజ్ఞానం,' అలా కేవలం పుస్తకపాండిత్యం కలిగి హృదయంలో ఆ జ్ఞానాన్ని నింపుకొని, ప్రగతిని సాధించలేని వ్యక్తులను ఆయన పురుగుపట్టిన పండ్లతో పోల్చేవారు. అవి పైకి గట్టిగా, స్వచ్ఛంగా కనిపించినా, తినడానికి ఏమాత్రం ఉపయోగపడవు. అలాగే కేవలం శాస్త్రాలను వంట బట్టించుకున్న మేధావుల వల్ల సమాజానికి మేలు జరగదు. ఈ రోజు మనలో చాలామందికి జ్ఞానంలో కొదవలేదు. కానీ విజ్ఞానం విషయానికొచ్చే సరికే వెనకబడిపోతున్నారు.



### అప్రమత్తత అవసరం...

ఒకమారు పంచవటిలో సంకీర్తనల కార్యక్రమం ఏర్పాటయింది. అది వర్షాకాలం కావటంతో శ్రీరామకృష్ణుల శిష్యులు గోపాల్ (స్వామి అద్వైతానంద) గురుదేవుల గొడుగు తీసుకొని, కార్యక్రమానికి వెళ్ళారు. సంకీర్తనల గానం పూర్తయ్యాక భక్తులందరూ వడివడిగా రామకృష్ణుల గదిలోకి వచ్చేశారు. వెంటనే వారు గోపాల్‌ను 'గొడుగు తీసుకువచ్చావా?' అని అడిగారు. 'అయ్యో! సంగీతం వింటూ గొడుగు సంగతే మరచిపోయాను' అన్నారు గోపాల్. అప్పుడు శ్రీరామకృష్ణులు 'నేను సాధారణంగా ఇలాంటి లౌకిక విషయాలను పట్టించుకోను. అలాగని అజాగ్రత్తను కూడా సహించను. సంగీతం విను, కానీ వచ్చేటప్పుడు వెంట ఏమి తెచ్చుకున్నావో, గుర్తుపెట్టుకొని మరీ తీసుకురావాలి. ఇలాంటివి మీ మానసిక స్థితికి అద్దం పడతాయి. మీలో ఒకరిద్దరు కూడా ఇలాగే చాలా విషయాల్లో నిరాసక్తంగా, అజాగ్రత్తగా ప్రవర్తిస్తూ ఉంటారు' అని తీవ్రంగా ప్రతిస్పందించారు. మరోవైపు ఆ శిష్యునిలోని కార్యనిర్వహణ దక్షతను, సున్నిత మనస్తత్వాన్ని శ్రీరామకృష్ణులు కొనియాడుతూనే, ఇలాంటి సందర్భాల్లో చక్కదిద్దేవారు. ఈ సంఘటనను వివరిస్తూ స్వామి చేతనానంద 'శ్రీరామకృష్ణులు అజాగ్రత్తగా ఉండటాన్ని సహించేవారు కాదు. చిన్న చిన్న విషయాల్లోనే మైమరపుతో ఉంటూంటే, ఇక జీవితంలో పెద్దపెద్ద విషయాల్లో ఎలా జాగ్రత్తగా ఉండగలరు? అని హెచ్చరించేవారు' అంటారు. ఈ రోజుల్లో మనం కూడా ఉద్యోగబాధ్యతల్లో, కుటుంబ వ్యవహారాల్లో చాలా సందర్భాల్లో అప్రమత్తంగా ఉండటం; చిన్నచిన్న పనులను కూడా తేలిగ్గా తీసుకుంటూ ఉంటాం. అంతటి ఆధ్యాత్మిక పురుషుడైనా ఆ గురుదేవులు లౌకిక విషయాలలో జాగరూకతతో మసలుకోవాలని చెప్పేవారు. ❖



# విలువలతోనే వృత్తికి వెలుగు

- స్వామి రంగనాథానంద

మనం ఏ పని చేస్తున్నప్పటికీ, దానిలో మానవీయ విలువలు పొదిగినప్పుడే ఆ వృత్తికి సరైన న్యాయం చేసిన వాళ్ళమవుతాం. పాశ్చాత్యదేశాల్లో ఎన్ని లోపాలున్నా, వారు వృత్తిధర్మంలో మాత్రం ఎంతో మానవీయంగా, బాధ్యతా యుతంగా, ఎదుటివారి హక్కులను గౌరవించే విధంగా మసలు కుంటారు. ప్రభుత్వ కార్యాలయాల్లో, ఇతర వ్యవహారాల్లో నాన్చుడు ధోరణిని అవలంబించరు. చిన్న చిన్న పనుల కోసం కూడా స్థానిక పౌరులు కార్యాలయాల చుట్టూ పదిసార్లు ప్రదక్షిణలు చేయాల్సిన అవసరం ఉండదు. దీనికి సంబంధించి నేను కోల్‌కతా రామకృష్ణ మిషన్ కార్యదర్శిగా ఉన్న సమయంలో జరిగిన ఒక సంఘటన నన్నెంతగానో ఆలోచింపజేసింది.

మిషన్‌కు అనుబంధంగా పనిచేస్తున్న అంతర్జాతీయ సంస్థలో ఒక డచ్ దేశ వనిత మేనేజర్‌గా ఉండేవారు. ఒకరోజు ఆమె ఎంతో ఆనందంగా, 'స్వామీజీ! మీకో గొప్ప విషయం చెప్పాలి' అంటూ పరుగుపరుగున వచ్చారు. 'ఏంటమ్మా! ఏంటి సంగతి?' అని అడిగాను. అప్పుడు ఆమె, 'స్వామీజీ! లండన్ నుంచి నాకో సమాచారం వచ్చింది. దానిలో వారు 'మేడమ్! మీరు వృద్ధాప్య పింఛనుకు అర్హత సాధించారు. ఇక నుంచి ప్రతి నెలా మీకు కొంత సొమ్ము పింఛనుగా మంజూరు చేస్తాం. అందులో భాగంగా మొదటి నెల మొత్తాన్ని మీకు పంపుతున్నాం అంటూ నగదును పంపారు' అని సంతోషంగా ఆ డబ్బును చూపింది. తమ దేశంలో ఆమెకు అలాంటి హక్కు ఉందని కూడా తెలియదు; పైగా దేశం వదలి వచ్చినా తనకు అది వస్తుందన్న విషయం అసలు తెలియదు. అయినా అక్కడి అధికారి, ఇతర సిబ్బంది తమ వంతు బాధ్యతగా ఆ దేశ పౌరురాలి హక్కులను గుర్తించి, గౌరవించి స్పందించారు.

భారతదేశంలో మనం ఎంతో మంది వయోవృద్ధులను చూస్తున్నాం! ప్రతీ నెలా వారు పింఛను కోసం పడుతున్న అవస్థలు, కార్యాలయాల చుట్టూ కాళ్ళు అరిగేలా తిరగడం గమనిస్తున్నాం. వారి పట్ల గుమస్తాలు, ఇతర సిబ్బంది ఎంతో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుంటారు. కనీస వృత్తిధర్మాన్ని కూడా పాటించకుండా, ఏదో ఒక సాకు చెప్పి కార్యాలయాల చుట్టూ తిప్పించుకుంటారు. పేరుకు మాత్రం ఈ గుమస్తాలు, అధికారులు దేవాలయాలకు వెళుతుంటారు; ఎన్నో మొక్కులు చెల్లిస్తూ ఉంటారు. శ్రద్ధగా పూజలు చేస్తూ ఉంటారు. కానీ ఏం లాభం? మానవత్వం లేకుండా, చేసే వృత్తిపట్ల బాధ్యతగా వ్యవహరించ కుండా ఎన్ని పూజలు చేస్తే ఏం ఫలితముంటుంది?

మీరు ఏ స్థానంలో ఉన్నారని కాదు; ఎంత శ్రద్ధతో, నిజాయతీతో ప్రవర్తిస్తున్నారన్నదే ముఖ్యం. అప్పుడే వృత్తికి న్యాయం చేసినవారవుతారు. కోల్‌కతా రామకృష్ణ మిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్‌కి కార్యదర్శిగా ఉన్నప్పుడు జరిగిన మరో సంఘటన నన్ను అమితాశ్చర్యానికి గురిచేసింది. అక్కడి అంతర్జాతీయ సంస్థలో జరిగిన ఒక కార్యక్రమానికి విదేశం నుంచి ఓ వ్యక్తి హాజరయ్యారు. ఆయన వెళుతూ, వెళుతూ పదివేల రూపాయలున్న పర్సు మరచిపోయారు. ఎక్కడ మరచి పోయారో తెలీదు! ఇది 1960 నాటి మాట! విమానా శ్రయానికి వెళ్ళాక గుర్తొచ్చి, జేబులో చూసుకుంటే పర్సు లేదు. ఆందోళనగా నాకు ఫోన్ చేశారు. ఇంతలో ఆశ్రమంలోని గదులు శుభ్రం చేసే వ్యక్తి, తనకు ఓ గదిలో పర్సు దొరికిందని నాకు తెచ్చి ఇచ్చాడు. ఆశ్చర్యపోయాను! అందులో ఏముందో కూడా చూడకుండా, ఆ వ్యక్తి నా చేతిలో పెట్టాడు. అప్పట్లో అతడి జీతం ఏడు వందల రూపాయలు. కానీ మనస్సు కొద్దిగా కూడా ప్రలోభపడలేదు. వృత్తిరీత్యా అతను సాధారణమైన వ్యక్తే అయినా, మానసిక పరిణతిలో ఎంతో ఉన్నతంగా వ్యవహరించగలిగాడు.

ఇతరుల సమస్యను తన సమస్యగానే భావించుకొని సానుభూతితో స్పందించడమే ఆధ్యాత్మిక సామర్థ్యం(spiritual capacity). ఈ సామర్థ్యం అందరిలో పెంపొందాలి. కానీ దురదృష్టవశాత్తూ సమాజంలోని ఉన్నతవర్గాల్లో ఇలాంటి పరిణతి కొరవడుతోంది. ఇప్పుడు వ్యవస్థలో రెండు రకాల పేదలు కనిపిస్తున్నారు. నిజంగా దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న పేదవారు ఒకరైతే, సంపద ఉండి కూడా పేదరికపు బుద్ధులతో ప్రవర్తించే వారు రెండో రకానికి చెందినవారు. వీరికి అన్నీ ఉన్నా, మనస్సు మాత్రం అడ్డదారులు తొక్కయినా, మరింత పోగు చేసుకోవాలని తపిస్తూ ఉంటుంది. ఇలాంటివారు 'బుద్ధి'ని వికసింపచేసు కోకుండా అవివేకంగా ప్రవర్తిస్తూ ఉంటారు. ఆధ్యాత్మికోన్నతికి నిదర్శనాలైన విలువల పరిరక్షణ, బుద్ధి, వివేకాలకు సామాజిక హోదాలతో(social status) సంబంధం లేదు. సమాజంలో ఏ వర్గానికైనా, వృత్తికైనా వెలుగునిచ్చేవి విలువలే! ❖

**పరులకు సహాయం చేయడం, హితం చేయడం లోకానికి తోడ్పడుతున్నట్లు బయటకు కనిపిస్తుంది. కానీ నిజానికి అది మనకు మనం చేసుకునే సహాయమే సుమా!** - స్వామి వివేకానంద


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచీ,
4-9-1958

ప్రియమైన సి.ఆర్. దాస్!*

ఆధునిక విద్యా విధానంలో గల లోపమేమంటే ఆత్మోన్నతి వైపుగా వారి దృష్టిని, శ్రద్ధను మళ్ళించే పద్ధతే లేకపోవడం. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం' (ధర్మాన్ని ఆచరించడానికి ప్రాథమిక సాధనం శరీరం). విద్యావంతులు కూడా ఈ చిన్న సత్యాన్ని గ్రహించలేకపోతున్నారు. అందుచేతనే విద్యాలయాల్లో దేహారోగ్యాన్నీ, దృఢత్వాన్నీ పెంపొందించే దిశగా ఏ విధమైన కార్యక్రమాలూ ఉండడం లేదు.

పని చెయ్యడంలోని మన అసమర్థత వినాశనానికి దారి తీసే గొప్ప తప్పే కాకుండా అది మన అభివృద్ధికి గొడ్డలిపెట్టు కూడా! ఈ దోషం ఎక్కడ జరుగుతుందంటే 'వినే ధోరణి లోపించడం' వల్ల! మనం ఎవరి సలహాలనూ వినడానికి గానీ, ఎవరితోనైనా విషయాన్ని చర్చించడానికి గానీ ఇష్టపడం. ఎవరైనా, ఏదైనా చిన్న సూచన చెయ్యగానే తక్షణం మనం దాన్ని వ్యతిరేకించడమే కాదు, కచ్చితంగా ఆ సూచనకు వ్యతిరేక దిశలో నడుచుకుంటాం. దీన్ని బట్టి ఏమర్థమవుతోంది? మనం ప్రకృతి సిద్ధమైన శరీరం, మనస్సు, తెలివితేటల తాలూకు ఆవేశంలో కొట్టుకుపోతున్నాం తప్ప, విచక్షణను ఆశ్రయించడం లేదన్నమాట. దీని వల్ల ఒక వ్యక్తి బాహ్యంగా ఎంత విద్యను ఆర్జించినా లోపలి వ్యక్తి మాత్రం 'ప్రాకృతిక' జీవిగా ఉండిపోతున్నాడు.

శ్రీరామకృష్ణ పుంథీ రచించిన అక్షయ కుమార్ సేన్‌తో శ్రీశారదామాత ఇలా అనేవారు: "భయ భక్తులతో పనిచేసే వ్యక్తి విజయాన్ని సాధిస్తాడు". ఒక పనిలో నిరంతరం నిమగ్నమైపోవడం ఎంతో మంచిది. నిరంతరం పనిలో తలమునకలయ్యే వ్యక్తికి రోజులు ఆనందంగా దొర్లిపోవడమే కాకుండా అతడి కోరికలు కూడా నెరవేరతాయి. నువ్వు చాలా చూశావు గదా! ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కడూ వ్యక్తి యొక్క బాహ్యమైన అభివృద్ధిని చూసేవాడే. కానీ ఎంతమంది ఆంతరిక అభివృద్ధిని సాధిస్తున్నారో చెప్పు? మనం అనేక శాస్త్రగ్రంథాలను చదువుతాం. అది మానసిక చర్యే అయినా పైపైనే! మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారాలతో కూడిన సూక్ష్మ శరీరాన్ని అది ఏ మేరకు తాకుతుందంటావ్?

వేదాంతాన్ని గురించి చర్చిస్తాం. కానీ అదొక మానసిక పరిశ్రమ మాత్రమే. మనం మనస్సును స్థిరం చేసి బుద్ధి యందు నిలుపగల్గితే దివ్యానందాన్ని అనుభవించగలం. నువ్వు భౌతికంగా పని చేస్తున్నావా, లేదా అన్నదాన్ని వెతకవద్దు. నీ మనస్సు ఏమి చేస్తోందో పరిశీలించి అప్పుడు అది 'సంపన్నుని ఇంట్లో పని మనిషి పని చేస్తున్నప్పటికీ ఆమె మనస్సు తన ఇంటి మీద ఉన్నట్లు'గా మారిందా, లేదా అన్నదాన్ని నిర్ణయించు.

నేను ఎంతో కాలంగా ఈ ప్రపంచం వెంట పరుగెడుతున్నాను. నాకు విశ్రాంతి కావాలి. ప్రపంచానికి ఆవల ఉన్న రామకృష్ణ లోకంలో వసించాలని ఉంది. "ఈ యంత్రం" పరిస్థితి అది. అప్పుడప్పుడు వచ్చి చూసిపోతూ ఉండు.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(* చిత్తరంజన్‌దాస్ కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో స్వామి ముముక్షానందగా పరిచితులు)



అంతులేని దుఃఖాలను అందించిన విషమ పరిస్థితులే మహాత్ములకు వికాసవాదం నేర్పించిన విద్యాలయాలు. పవిత్రత ఉన్నచోట నిర్భయత్వం వికసిస్తుంది. - మహాత్మా గాంధీ

(...15వ పేజీ తరువాయి)

**జలధి బంధించిన సౌమిత్రిరామా,**
**సెలవిల్లు విరచిన సీతారామా**
**అల సుగ్రీవు నేలిన అయోధ్యరామా**
**కలిగి యజ్ఞము గాచే కౌసల్యరామా..** అంటున్నాడు అన్నమయ్య. 'సెలవిల్లు' అంటే సెలసు అనే ఒక రకమైన చెట్టుబద్దలతో చేసిన విల్లు అని అర్థం. మిథిలానగరంలో జనకమహారాజు కొలువులో ఆ శివుడి విల్లును విరిచిన సమయంలో సీతాదేవిని వర్ణిస్తూ...

**సిగ్గుపడుట గల్గి సింగారములు గల్గి**
**భక్తి గల్గి చాల భయము గల్గి**
**నయము ప్రియము గల్గి**
**నరనాథు చిత్తంబు సీత, తనకు వశము**
**చేసికొనియె** అంటారు పోతనామాత్యులు శ్రీమద్భాగవతంలో! అలా ఆ జానకికి వశమై రఘురాముడు సీతారాముడయ్యాడు. ఇలా వాల్మీకి కరుణార్ద్ర హృదయం నుంచి కరిగి కావ్యలహరిగా ప్రవహించిన ఈ రామాయణం అనాదిగా అశేష మానవ జాతిని పుణ్యప్రవాహంలో తేలియాడిస్తోంది. రామకథా శ్రవణ, మననాలతో తరింప చేస్తోంది.



### కోదండరాముడు...లోకాభిరాముడు

లోకకంటకుడైన రావణాసురుడిని అంతం చేసిన, మునులకు రక్షణగా నిలిచిన, అహల్య పాపానికి విమోచనం కలిగించిన ఆ సూర్యవంశ మహారాజును సాక్షాత్తూ హరురాణి – అంటే పార్వతీదేవే నుతించిందన్న తన్మయంతో...

**అరి రావణాంతక ఆదిత్యకుల రామా**
**గురు మౌనులను గాచే కోదండ రామా**
**ధర నహల్య పాలిటి దశరథరామా**
**హరురాణి నుతల లోకాభిరామా...** అంటున్నాడు ఆ ఆపద్బాంధవుడి ఆత్మీయభక్తుడు. రఘురాముడు ప్రశాంత చిత్తుడు, మృదుభాషి, కోపమన్న మాటే ఎరుగని వాడు; ఆగ్రహానికీ, అసూయకూ కడుదూరంగా ఉండేవాడు. మాత్సర్యానికి మచ్చుకైనా మనస్సులో స్థానమివ్వని త్రిగుణాతీతుడు. కేవలం ఆరాధ్యదైవంగా పూజించడమే కాకుండా, ఆ లోకాభిరాముడి ఆదర్శ నడవడికను ప్రతి ఒక్కరూ జీవితంలో అనుసరించాలి. పితృవాక్య పరిపాలకుడిగా, తమ్ముడి కోసం రాజ్యాన్నే వదులుకున్న త్యాగమూర్తిగా, అన్యకాంతకు అర క్షణం కూడా మనస్సులో తావివ్వని ఏకపత్నీవ్రతుడిగా ఆయనకు ఆయనే సాటి. ధర్మం మూర్తీభవించిన అవతారమాయనది. కనుకనే ఉమాదేవి శ్రీరాముణ్ణి...

**కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్ ।**
**పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో॥**
అంటూ 'విష్ణు సహస్రనామం'లో కొనియాడింది. చివరకు ఈశ్వరుడు కూడా...

**శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।**
**సహస్రనామ తత్ తుల్యం రామ నామ వరాననే ॥** అంటూ రామనామ వైభవాన్ని వివరించాడు.

### సుగుణాభి రాముడు...వేంకటాద్రి రాముడు

మాయావి అయిన మారీచుని హతమార్చిన మాయ మృగాంతకుడు, తన గుణాల రాశిని కవలలైన కుశలవులకు వారసత్వంగా అందించిన ఆ మనువంశ సుధాంబుధి సోముడైన సుగుణాభిరాముడు, మనస్సులో స్థిరంగా కొలువుతీరి ఉన్నాడని అన్నమయ్య మురిసిపోతున్నాడు. వితత మహిమలతో వేంకటాద్రి రాముడై తిరుమలలో తన వైభవాన్ని ప్రకటిస్తున్నాడని ప్రస్ఫుటం చేస్తూ...

**అతి ప్రతాపముల మాయా మృగాంతక రామా**
**సుతకుశలవప్రియ సుగుణరామా**
**వితత మహిమల శ్రీవేంకటాద్రిరామా**
**మతిలోన బాయని మనువంశరామా...** అంటూ తన మధురగానానికి ముక్తాయింపు పలుకుతున్నాడు. మాయ లేడిగా వచ్చిన మారీచుడినే కాదు; మన మనస్సనే అరణ్యంలో ఆశల బంగారు లేడిగా పరుగులెత్తే మాయను కూడా మాయం చేయగల మృగాంతకుడు ఆ దశరథ తనయుడు. కేవలం మనోమందిరంలోకి రాముడిని ఆహ్వానిస్తే చాలు, కాముడు మెల్లగా జారుకుంటాడు. అందుకే అన్నమయ్య అన్నట్లు మతిలో ఆ మనువంశరాముడి ముద్ర చెరిగిపోకుండా చూసుకోవాలి. అలా ఆ పతితపావనుడు కొలువున్న మనస్సుకు మంత్రతంత్రాల అవసరమే లేదు. అందుకే ఓ మారు....

**దశరథ రామా!**
**మనసు స్వాధీనమైన ఘనునికి మరి మంత్రతంత్రములేల**
**తనువు తాను కాదని ఎంచువానికి తపస్సు చేయనేల**
**అన్నీ నీవనుచు ఎంచిన వానికి ఆశ్రమ భేదములేల**
**కన్నుగట్టు మాయలని ఎంచువానికి కాంతల భ్రమలేల...**
అంటారు త్యాగరాజస్వామి కూడా! ❖

నవతరం సందేహాలకు సమాధానాలు

# యువవాణి

- స్వామి పరిజ్ఞేయానంద

శ్రీమతి జె.లలిత, రాజమండ్రి.

**ప్రశ్న: మా అబ్బాయి 9వ తరగతి వరకు బాగా చదివేవాడు. కానీ ఈ మధ్య చదువులో వెనుకబడ్డాడు. వాడికి అవసరమైన అన్ని సదుపాయాలూ, సౌకర్యాలూ సమకూరుస్తున్నప్పటికీ మంచి మార్కులు సాధించలేకపోతున్నాడు. వాడి చదువు ఇలాగే కొనసాగితే రాబోయే 10వ తరగతిలో మంచి మార్కులు సాధించలేదేమోనని ఆందోళనగా ఉంది. మా అబ్బాయి బాగా చదవాలంటే ఏం చేయాలో సూచించండి.**



**జవాబు:** "చిన్నపిల్లల ప్రపంచం చాలా చిన్నది. వాళ్ళ చిన్న ప్రపంచం వారికి ఎంతో ఆనందమైనది, అద్భుతమైంది. తల్లితండ్రులు పిల్లల ప్రపంచంలో అడుగు పెట్టి వారి అనుభూతులను పంచుకొని వారిలో ఒకరిలా కలిసిపోవాలి. అలా పిల్లలను మెల్లమెల్లగా వారి చిన్న ప్రపంచం నుండి మన ప్రపంచంలోకి తీసుకురావడానికి ప్రయత్నించాలి" అంటారు విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్.

ప్రతీ తల్లితండ్రి తమ పిల్లలు బాగా చదువుకొని ప్రయోజకులు కావాలని ఆశించడం సహజం. కానీ పిల్లల శక్తి సామర్థ్యాలను అంచనా వేయకుండా ఆశల ఒరవడిలో కొట్టుకుపోయి వారిని ఒత్తిడికి గురిచేయడం సమంజసం కాదు.

సాధారణంగా తల్లితండ్రుల్లో మూడు రకాల మనస్తత్త్వాలవారు ఉంటారు. మొదటి కోవకు చెందినవారు - మనం ఎలాగూ కష్టపడ్డాం కదా! పిల్లలైనా సుఖంగా ఉండాలని వారు అడిగినవన్నీ సమకూర్చే తల్లితండ్రులు.

రెండవ కోవకు చెందినవారు- తాము ఎంతో క్రమశిక్షణతో పెరిగామని భావించి, పిల్లల పట్ల క్రమశిక్షణ పేరుతో కఠినమైన ఆంక్షల్ని విధించే తల్లితండ్రులు. ఇలా ఒకరు 'అతివృష్టి'కి మరొకరు 'అనావృష్టికి' తార్కాణాలుగా నిలిచే రెండు రకాల మనస్తత్త్వాలు గల తల్లితండ్రులు.

ఇక మూడవ కోవకు చెందిన తల్లితండ్రులు - తమ పిల్లలు వారిలాగే మూస పోసినట్లుగా ఉండాలని ఆశించే తల్లితండ్రులు. ఈ కోవకు చెందినవారు చాలా ప్రమాదకరమైనవారు, అత్యాశాపరులు అని చెప్పవచ్చు. అందుకు నిదర్శనమే ఈ సంఘటన :

తొమ్మిదవ తరగతి చదువుతున్న ఓ తెలివైన విద్యార్థి గణితంలో ఎప్పుడూ 90 మార్కులకు పైనే సాధించేవాడు. కానీ హఠాత్తుగా ఆ విద్యార్థికి గణితంలో 0 మార్కులు వచ్చాయి. అందుకు కారణం విచారించగా ఆ విద్యార్థి తల్లి 'నీకు గణితంలో నూటికి నూరు మార్కులు రాకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను' అని బెదిరించిందని తెలిసింది. దానితో ఒత్తిడికి గురైన ఆ విద్యార్థి పరీక్షలు రాయలేకపోయాడు. ఆ విద్యార్థి తల్లి గణిత శాస్త్రంలో స్వర్ణపతకం సాధించిన మేధావి. తనలాగే తన కుమారుడు కూడా గణితంలో స్వర్ణపతకం సాధించాలనే ఆమె అత్యాశ ఆ విద్యార్థి మతిస్థిమితం కోల్పోయే స్థితికి దిగజార్చింది.

తల్లితండ్రులు అతివృష్టి, అనావృష్టి, అత్యాశ - ఈ 'అ'త్రయం బారిన పడకుండా పరిపక్వతతో వ్యవహరించాలి. అందుకు ఈ సూచనలను పాటించండి.

1. పిల్లలను ఇతరులతో పోల్చకుండా ఉండడం.
2. పిల్లల తెలివితేటలను అంచనావేయడం.
3. పిల్లల అభిరుచులను అవగాహన చేసుకోవడం.
4. ఇంట్లో చదువుకు ప్రశాంత వాతావరణాన్ని కల్పించడం.
5. పిల్లలతో సన్నిహితంగా స్నేహితునిలా మెలగడం.
6. పిల్లల్లో ఒత్తిడి పారద్రోలే ఓదార్పును ఇవ్వడం.
7. అసహనాన్ని చూపకుండా వారు చెప్పిన విషయాన్ని వినడం.
8. పిల్లలను అవమానించకుండా వారిని అభినందించడం.
9. పిల్లల్లో అభద్రతాభావం కలగకుండా శ్రద్ధ వహించడం.
10. వారిలో ఆత్మవిశ్వాసాన్ని నింపే సంఘటనలను వివరించడం.

**ఈ మూడు స్థాయిల్లో ఉన్న విద్యార్థులకు మనం అందించాల్సినవి:**

1. తెలివైన విద్యార్థి : మార్గదర్శకత్వం
2. సాధారణ విద్యార్థి : మార్గదర్శకత్వం + ఆప్యాయత
3. అతిసాధారణ విద్యార్థి: మార్గదర్శకత్వం+ ఆప్యాయత+ఆత్మవిశ్వాసం

ఈ సూచనల్ని పాటించిననాడు 'I have found the happiness of parenthood greater than any other that I have experienced. - పిల్లల పెంపకంలో ఉన్న మాధుర్యం కన్నా మించినది మరొకటి లేదు' అన్న బెర్ట్రాండ్ రస్సెల్ అనుభవం నిజమవుతుంది. ఆ ఆనందానుభూతితో పిల్లల్ని ఆదరించి, వారి శక్తిసామర్థ్యాలను అర్థం చేసుకున్ననాడు వారిని ఉన్నతంగా తీర్చిదిద్దవచ్చు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా:
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029

**రేపటి పౌరులుగా రూపుదిద్దుకొనే చిన్నారుల పాలిట, ప్రతి ఇల్లూ ఓ విశ్వవిద్యాలయం కావాలి. అక్కడ, తల్లితండ్రులే మహోపాధ్యాయులై పిల్లల్ని మహోన్నతులుగా తీర్చిదిద్దాలి.** - మహాత్మా గాంధీ



## భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# మానసిక పవిత్రత

మామూలుగా చూసినట్లయితే, శరీరం పరిశుభ్రంగా ఉన్నప్పుడే మనస్సు కూడా స్వచ్ఛంగా ఉంటుంది. స్థూలస్థాయిలో ఉన్న శరీరం నుండే పరిశుభ్రత ప్రారంభం కావాలి. చాలామంది జీవన విధానం చూసినట్లయితే క్రమశిక్షణ రాహిత్యం, నిర్లక్ష్యం, అసత్యం తాండవిస్తుంటాయి. వారు అక్కరలేని వస్తువులు, చెత్తా చెదారం ఇష్టమొచ్చినచోట పారేస్తుంటారు. అంతేకాదు అక్కడక్కడా ఉమ్మి వేస్తుంటారు. ఆ విధంగా ఉండడం క్రమశిక్షణలేని మనస్సును సూచిస్తుంది.



ఒక వ్యక్తిలోని నిజమైన పరిశుభ్రతను చూడాలంటే అతని స్నానాల గదిని పరిశీలిస్తే సరిపోతుంది. అదేవిధంగా టేబుల్ పైన అంతా శుభ్రంగా ఉండవచ్చు. కానీ టేబుల్ క్రింద ఉన్న సొరుగు లాగి చూస్తే అతను క్రమపద్ధతిలో ఉన్నాడో లేదో తెలుస్తుంది. ఆ సొరుగు వస్తువులతో అస్తవ్యస్తంగా నిండి ఉంటే, అతని జీవిత దృక్పథం కూడా అలాగే ఉంటుందని అర్థం చేసుకోవచ్చు.

ఆధ్యాత్మిక సాధకుడు మాత్రం అలా ఉండడు. అతని జీవితం, కార్యక్రమాలు ఒక క్రమపద్ధతిలో ఉంటాయి. క్రమపద్ధతిగా ఉండడం అనేది అతని సహజ స్వభావం అవ్వాలి. మొట్టమొదట బాహ్యశౌచం కావాలి. ఆ తరువాత అంతఃశౌచం. అంతశ్శౌచం అంటే మనస్సును స్వచ్ఛంగా ఉంచుకోవడం. మన ప్రవర్తనే మన మానసిక స్థితిని సూచిస్తుందని గుర్తుంచుకోవాలి. మనం మాట్లాడే విధానం, స్పందించే విధానం, పనులు చేసే విధానం, విన్నవించే విధానం - ఇవన్నీ మన మానసిక స్థితిని తెలియజేస్తాయి. కొన్నిసార్లు ఇతరుల నుండి మనమున్న నిజమైన మానసిక స్థితిని దాచవచ్చు కానీ మన నుండి మాత్రం మనం దాన్ని దాచలేము. గుడిసెలో ఉన్నామా, పెద్ద భవంతిలో ఉన్నామా అన్నది పెద్ద విషయం కాదు కానీ, మనమందరం మన మనస్సులోనే జీవిస్తున్నామన్నది చాలా ముఖ్యం. మన మనస్సే మన మొదటి నివాసం. ఆధ్యాత్మికదృష్టితో చూస్తే మనం మొదట మనస్సుకే పట్టుబడ్డాం, ఆ తరువాతే శరీరానికి కట్టుబడ్డాం. మనస్సు మొదట జన్మిస్తుందని అంటారు. కాబట్టి అంతర్గత పరిశుభ్రత కావాలంటే, మనస్సును వశం చేసుకోవడం అత్యంత ఆవశ్యకం.

**అంతశ్శౌచం అంటే ఏమిటి?** అంతశ్శౌచాన్ని అర్థం చేసుకోవడానికి మన సాధారణ మానసిక స్థితిని పరిశీలిద్దాం. ఎక్కువ సమయం మన మనస్సు చంచలంగా ఉంటుంది. విచారంతో, కోపంతో, ఈర్ష్యతో మన లోపల ఒక మండుతున్న పొయ్యి ఉన్నట్లు పొగలు క్రక్కుతూ, మంటలు మండుతూ ఉంటుంది. మానసిక శాంతి కోసం పర్వత ప్రాంతానికో, నదీతీరానికో, ప్రకృతి సౌందర్యమున్న ప్రదేశాలకో వెళతాం. కానీ వ్యతిరేక భావాలైన కోపం, దురాశ, అసూయ మన లోపల పొగలు క్రక్కుతున్నంతసేపూ, వాటిని తొలగించుకోనంత వరకూ ప్రకృతి దృశ్యాలేవీ మానసిక శాంతికి ఎక్కువ దోహదపడవు. అసూయ గానీ, ద్వేషం గానీ మనస్సులో ప్రవేశించిన వ్యక్తి, అశాంతితో నలిగిపోతాడు.

ఈ మానసిక పరిస్థితిని సరిచేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ సరి చేసుకునే పద్ధతినే 'ఆధ్యాత్మిక సాధన' అంటారు. నిజమైన మానసిక శాంతి, మానసిక స్వచ్ఛతను పొందే స్థితిని పతంజలి యోగసూత్రం (1:33) ఈ విధంగా తెలియజేస్తోంది:

**మైత్రీ కరుణాముదితోపేక్షాణాం సుఖ దుఃఖ**
**పుణ్యాపుణ్య విషయాణాం భావనాతచిత్త ప్రసాదనమ్ ।**

సుఖంగా ఉన్నవారి ఎడల మైత్రీ భావం, దుఃఖితుల ఎడల కరుణ, సజ్జనుల ఎడల ఉల్లాసం, దుర్జనుల ఎడల ఉపేక్ష భావాలు కలవారు అంతర్గత శాంతినీ, స్వచ్ఛతనూ పొందగలరు.

మన మనస్సు బాహ్య పరిస్థితుల వల్ల కలత చెందుతుంది. ఐతే మనమెందుకు మన మనస్సును కలత చెందడానికి అనుమతించాలి? మనస్సు స్వాధీనంలో లేకపోవడమే మనం ఈ విధంగా తల్లక్రిందులవడానికి ముఖ్యకారణం. అందువల్లే మనం ఇతరులతో మెలిగేటప్పుడు మన స్పందనలన్నీ క్రమశిక్షణ రహితంగానూ, తప్పుడు పద్ధతిలోనూ ఉంటాయి. ఈ సమాజంలో జీవిస్తున్నంత కాలం ఇతరులతో కలిసి మెలసి ఉండాలన్న విషయం మనం గుర్తుంచుకోవాలి. ఐతే, వారితో ఎలా మెలగాలన్నదే మనం నేర్చుకోవాలి. మన మనస్సు కలత చెందకుండా మన దృక్పథాన్ని అనువైన విధంగా సరిచేసుకోగలిగితే, ఇతరులతో చక్కగా ప్రవర్తించగలం. కాబట్టి మన ప్రవర్తనలో సరైన సర్దుబాట్లు చేసుకోవడం చాలా అవసరం.

పైన చెప్పిన పతంజలి యోగసూత్రం మనుషులను నాలుగు విధాలుగా విభజిస్తుంది.

1. సుఖంగా ఉండేవారు. 2. దుఃఖంతో ఉండేవారు. 3. పుణ్యాత్ములు. 4. పాపాత్ములు.

అంతేగాక ఈ నాలుగు రకాల వారి నాలుగు దృక్పథాలను (భావనలను) కూడా తెలియజేస్తుంది. 1. మైత్రి 2. కరుణ 3. సంతోషం 4. ఉపేక్ష.

పరిశుద్ధమైన మనస్సును పొందడానికి కావలసిన మొదటి గుణం సుఖంగా ఉన్నవారి ఎడల మైత్రీ భావం. సుఖంగా ఉన్నవారిని చూడగానే మనకు కూడా సంతోషం కలగాలి. మన మనస్సులో అలాంటివారి పట్ల అసూయ, అసహనం కలగకుండా జాగ్రత్త వహించాలి. ఇతరుల పట్ల కఠిన వైఖరిని అవలంబించకుండా, వారెలా ఉన్నా సరే ఆ పరిస్థితులలోనే వారిని (విమర్శనాత్మక దృష్టితో చూడకుండా) అంగీకరించగలగాలి. ఆ విధంగా చేయలేకపోతే, మన మనస్సు అసూయ గ్రస్తమైనదని అర్థం చేసుకోవాలి.

ఇతరుల సంతోషం చూసి మన మనస్సు లోపల కూడా సంతోషం కలిగితే ఆ భావననే మైత్రీ భావం అంటారు. మైత్రీ భావం కలిగి ఉండటమంటే మనస్సుకున్న వ్యాధిని తొలగిస్తున్నామని అర్థం. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

**(వచ్చే సంచికలో - 'మైత్రీ భావం' అలవరచుకునే విధానం)**

## పేద విద్యార్థులకు ఉచిత వసతి గృహం



**విజయవాడ రామకృష్ణ మిషన్** సీతానగరంలో రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలను (6వ తరగతి నుంచి 10వ తరగతి వరకు - తెలుగు మాధ్యమం) నిర్వహిస్తోంది. బీద విద్యార్థుల కోసం ఉచిత బాలుర వసతి గృహం కూడా నిర్వహిస్తోంది.

ఈ వసతి గృహంలో 5వ తరగతి ఉత్తీర్ణులై 6వ తరగతిలో చేరే బాలురకు మాత్రమే ప్రవేశం లభిస్తుంది. 2012-2013 విద్యాసంవత్సరానికి 6వ తరగతిలో ప్రవేశం పొందగోరే వారు 9"×6" సైజు సొంత చిరునామా వ్రాసిన ఖాళీ కవరును (తగినన్ని పోస్టల్ స్టాంపులు అంటించి) **2012 ఏప్రిల్ 16వ తేదీ** లోగా ఈ క్రింది చిరునామాకు పంపి దరఖాస్తులను పొందవచ్చును.

దరఖాస్తులను పరిశీలించి, ఎంపిక చేసిన విద్యార్థులకు మే నెల రెండవ వారంలో వ్రాతపరీక్ష నిర్వహించబడుతుంది. ప్రవేశ పరీక్ష 5వ తరగతి పాఠ్యాంశాలపై ఉంటుంది.

ఎంపికైన విద్యార్థులకు పరీక్ష నిర్వహించే తేదీని పోస్ట్ ద్వారా తెలియజేయబడును.

ప్రవేశ, మౌఖిక పరీక్షల్లో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ఇంటర్వ్యూ నిర్వహించి సీతానగరం రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలలోనూ, ఉచిత వసతి గృహంలోనూ ప్రవేశం కల్పించబడుతుంది. వసతి గృహంలో ప్రవేశంపై తుది నిర్ణయం రామకృష్ణ మిషన్, సీతానగరం యాజమాన్యం వారిదే. ❖

**స్వామి శశికాంతానంద**
**కార్యదర్శి**

వివరాలకు :
కార్యదర్శి, రామకృష్ణ మిషన్
సీతానగరం, తాడేపల్లి (పోస్ట్ & మండలం)
గుంటూరు జిల్లా-522 501

**మనస్సుని పవిత్రంగా చేయడానికి సహకరించేది నిజమైన మతం. అదే సకల మత సారం. మనస్సుకి పవిత్రతని చేకూర్చని బాహ్య ఆడంబరాలు, ఆచారాలు కేవలం నిష్ప్రయోజనాలు.** - తిరువళ్ళువారు

# కనకదాసును కరుణించిన కృష్ణుడు

**కథ:** టి.ఎమ్.ఎస్. **చిత్రాలు:** శంకర్ **అనుసృజన:** స్వామి జ్ఞానదానంద

1 ఒకరోజు వ్యాసతీర్థులు విగ్రహమూర్తి పూజ ముగించి, మానసిక పూజలో లీనమయ్యాడు. మనస్సులో విష్ణుమూర్తిని ప్రతిష్ఠించుకొని, శిరస్సున వజ్ర కిరీటం అమర్చాడు. తరువాత కంఠాన్ని పూల మాలతో అలంకరించాలని ప్రయత్నించాడు. కానీ కిరీటం మరీ పెద్దదవడంతో పూల మాల వెయ్యలేకపోయాడు.

2 మానసిక పూజలో గురువు శ్రమపడటం కనకదాసు గ్రహించాడు.




ఈ సంఘటన తరువాత కూడా కొందరి శిష్యులకు కనకదాసు పట్ల ప్రేమాభిమానాలు గానీ, గౌరవం గానీ ఏర్పడలేదు.

4 కొంత కాలం గడచింది. గురువు, కనకదాసు ఔన్నత్యాన్ని ఇతరులకు కూడా తెలియజేయాలనుకున్నాడు.




3 ఒకరోజు కొందరు శిష్యులు రాతి కుండలో చేపలు పెట్టి కనకదాసు తోలుసంచీలో అతడికి తెలియకుండా ఉంచారు. తరువాత...




గురువు గారు, కనకదాసు తోలుసంచీ చూశారు. అందులో తేనె, తామరపువ్వులు ఉన్నాయి! గురువు చిరుదరహాసం చేశాడు. శిష్యులు అదెలా జరిగిందో అర్థం కాక ఆలోచనలో పడ్డారు.

5 మరునాడు వ్యాసతీర్థులు, కనకదాసు, తక్కినవారు సమావేశమై ఉన్నప్పుడు ఒక కుక్క వేగంగా పరుగెత్తుతూ వచ్చింది.




అంతలో అక్కడున్న వారంతా కుక్కను కొట్టి తరిమివేశారు.







8
కనకదాసు కలలో వేంకటేశ్వరస్వామి కనిపించి, తన కల్యాణోత్సవానికి రమ్మని ఆహ్వానించాడు. తిరుపతి దేవస్థాన అధికారి అయిన చిన్నప్ప కలలో కూడా కనిపించి కనకదాసును తగిన మర్యాదలతో తోడ్కొని రమ్మని ఆదేశించాడు.




9
చిన్నప్ప, కనకదాసు కోసం చాలా చోట్ల వెతికాడు. కనకదాసు వద్దకే వెళ్ళి వాకబు చేశాడు. కానీ కనకదాసు తాను ఒక బిచ్చగాడినని చెప్పుకున్నాడు.

10 మరోమార్గం లేక చిన్నప్ప ఆలయానికి తిరిగి వెళ్ళిపోయాడు. కనకదాసు అక్కడ తిరుపతి ఆలయంలో ఆకలిదప్పికలతో అలమటిస్తూ ఒక మూల పడుకొని ఉన్నాడు.




అప్పుడు ఒక అపరిచిత వ్యక్తి వచ్చి ఆహారమూ, దుస్తులూ ఇచ్చి వెళ్ళిపోయాడు.

11 కనకదాసు వేంకటేశ్వర కల్యాణోత్సవాన్ని తనివితీరా తిలకించి పరమానందం చెందాడు. శ్రావ్యంగా భక్తి పాటలు పాడి ఉత్సవంలో పాల్గొన్న భక్తులకు ఆనందపారవశ్యాన్ని చవిచూపాడు. ఆ సమయంలో చిన్నప్ప, కనకదాసును గుర్తించాడు.




12 కొన్ని రోజులు అక్కడ బస చేసిన తరువాత కనకదాసు...




13 భక్తులు భయపడినట్లే అడవిలో కనకదాసు మీద మత్తగజం విజృంభించింది.




ఏనుగు వెంటనే అతడికి వినమ్రంగా వందనం చేసింది. తొండంతో అతణ్ణి పైకెత్తి తన మీద కూర్చోబెట్టుకుని నంజుండేశ్వర ఆలయం వద్దకు తీసుకుని వెళ్ళింది. ఆ దృశ్యం చూసి జనులు ఆనందించారు. ఆ తరువాత ఆ ఏనుగు, నంజుండేశ్వరునికి సేవలందిస్తూ వచ్చింది.

14

కనకదాసు ఉడిపికి వెళ్ళినప్పుడు, అతడు నిమ్నకులస్థుడు అవడం వల్ల అర్చకులు ఆలయ ప్రవేశం నిరాకరించారు. అందువల్ల ఆలయం వెనుక వైపుకు వెళ్ళి కనకదాసు కృష్ణుడికి మొరపెట్టుకున్నాడు. అప్పుడు అశరీరవాణి....




వెంటనే అప్పటిదాకా తూర్పు అభిముఖంగా ఉన్న శ్రీకృష్ణుడు, కనకదాసు నిలబడి ఉన్న పడమటి వైపునకు తిరిగాడు.

15

తక్షణమే గోడ కాస్త పగిలి రంధ్రం ఏర్పడి, కనకదాసుకు శ్రీకృష్ణదర్శనం లభించింది.




16




కనకదాసు పశ్చిమాన నిలబడిన చోటు కనక మండపమనీ, దర్శనమిచ్చిన గోడ రంధ్రం 'కనక కిండి' అనీ నేటికీ పిలువబడుతున్నాయి. ఇవాళ్టికీ ఉడిపిలో శ్రీకృష్ణుణ్ణి ఆ రంధ్రం గుండానే మనం దర్శించుకుంటున్నాం.

భగవంతుణ్ణి సమీపించేకొద్దీ విచారణలు, ప్రశ్నలు తగ్గిపోతాయి. ఆయనను సమీపించగానే, ఆయన సత్య స్వరూపాన్ని ప్రత్యక్షంగా చూడగానే అన్ని సందేహాలూ, సమస్త వాదాలూ పూర్తిగా సమసిపోతాయి.

- భగవాన్ శ్రీరామకృష్ణులు



# గ్రంథ పరిచయం



## శ్రీ ఏకనాథభాగవతము

అనువాదకులు: శ్రీ బోధానందేంద్ర సరస్వతి
వెల: రూ. 650/- పుటలు: 753
ప్రతులకు: విరివెంటి శ్యామసుందరశర్మ
ఇ.నెం: 35-79/2/2, బృందావన్ కాలనీ,
బాలాజీ నగర్, సైనిక్‌పురి,
సికింద్రాబాదు-94, సెల్: 94403 38712

సంస్కృత భాగవతంలోని ఏకాదశ స్కంధానికి శ్రీఏకనాథుడు మరాఠీ భాషలో రచించిన వేదాంత తత్త్వమైన శ్రీ ఏకనాథ భాగవతాన్ని అవధూత శ్రీ బోధానందేంద్ర సరస్వతి వారు రసరమ్యంగా తెలుగులోకి అనువదించడం తెలుగువారి పూర్వజన్మ సుకృతం. శ్రీ ఏకనాథుడు, శ్రీబోధానందేంద్ర సరస్వతి ఇద్దరూ భగవత్తత్త్వాన్ని తనివితీరా ఆస్వాదించి, పరులకు పంచాలని తపించినవారే.

మాయా మోహితులై భవసాగరంలో కొట్టుమిట్టాడుతూ విషయ వాంఛలను క్షణం కూడా విడిచిపెట్టలేని లౌకికులు కూడా ఈ గ్రంథాన్ని చదవడం ప్రారంభిస్తే చివరి వరకు చదవకుండా విడిచిపెట్టలేరు. ఆస్వాదించే కొద్దీ మాధుర్యాన్ని మరింత పెంచి పంచే మధురాతి మధురమైన అమృతధార ఇది. అదోషమైన భాషలో అందరినీ ఆకట్టుకునే ఈ గ్రంథం జ్ఞాన, విజ్ఞానుల పంట.

పరిపూర్ణ శాస్త్రజ్ఞాన, అనుభవ జ్ఞానములతో ప్రసాదించబడిన ఈ తెలుగుసేత గ్రంథము సమస్త భాగవత భక్తులకు ఉపయోగకరమై, శ్రేయోదాయకమై విలసిల్లగలదు. ఎన్ని ఇబ్బందులు ఎదురైనప్పటికీ ఎంతో శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని ప్రచురించిన శ్రీ శ్యామసుందరశర్మగారు ధన్యజీవులు. ❖ – ఎమ్. రాంబాబు



## బ్రహ్మసూత్రములు

అనుసృజన: శ్రీ శ్యామశాస్త్రి
వెల: రూ. 120/- పుటలు: 526
ప్రతులకు : రామకృష్ణ మఠం
దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029
ఫోన్ : 040-2763 1149

సనాతన ధర్మమనే మహాసౌధం మూడు స్తంభాలపై నిలిచి ఉంది. అవి బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు మరియు భగవద్గీత. వీటినే ప్రస్థానత్రయం అని అంటారు. మూడింటిలో పేర్కొన్న విషయం పరబ్రహ్మమే అయినప్పటికీ సూత్రరూపంలో ఉండటం వలన బ్రహ్మసూత్రాలు గుహ్యం. భాష్యం లేకుండా సూత్రాలను అర్థం చేసుకోవడం అసాధ్యం. అందుకనే తమ సిద్ధాంతాలను లోకానికి తెలియజేయాలనుకున్న ఆచార్యులందరూ వీటి మీద భాష్యం వ్రాసియున్నారు; వీటి అవగాహనను సాధారణ జిజ్ఞాసువులకు సులభతరం చేశారు. ఈ భాష్యాలన్నింటిలోకి తలమానికమైనది శంకరుల భాష్యం. ఆ భాష్యాన్ని ప్రధానంగా గైకొని, ఇతర భాష్యాల సహాయం తీసుకొని లోపలి విషయాన్ని అతి సరళంగా వివరించారు శ్రీ శ్యామశాస్త్రి గారు. వారిది అభినందనీయ కృషి. రామకృష్ణ మఠం వారి వైదిక ధర్మ ప్రచార మహాయజ్ఞం ఇలా నిరాటంకంగా కొనసాగుగాక! ❖ – ఆనంద



## అద్వైతం



## నమో నమః

అనువక్త: దేవరకొండ శేషగిరిరావు
వెల: రూ. 100/- (ఒక్కొక్కటి)
ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్,
కాచిగూడ, హైదరాబాదు.

కంచి మహాస్వామి శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారిని ఎరుగని వారు ఉండరంటే అతిశయోక్తి కాదు. నడయాడే దేవుడిగా భక్తులచే కీర్తింపబడిన యతిశ్రేష్ఠులు వారు. వారు వివిధ సభలలో, సమావేశాలలో, సత్సంగాలలో చేసిన అనేకానేక ప్రసంగాలను తమిళంలో 'దైవత్తిన్ కురల్' పేరిట శ్రీ ఆర్. గణపతి సంకలనం చేశారు. అద్వైతం, నమో నమః అను ఈ రెండు గ్రంథాలు శ్రీకంచి మహాస్వామి పీఠారోహణ శతాబ్ది మహోత్సవ ట్రస్టు, ముంబైవారు ఏడు సంపుటాలలో ప్రచురించిన జగద్గురు బోధనలకు అనువాదం. ఇంకా రెండు గ్రంథాలు షట్పదీస్తోత్రము, సనాతన ధర్మంలో సంఘసేవ పేరుతో రాబోతున్నాయి. మొత్తం నాలుగు సంపుటాలలో ఆంగ్లంలోని ఏడు గ్రంథాలలో గల స్వామి వారి బోధనలను సమగ్రంగా తెలుగు వారికి అందించాలని శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు సంకల్పించి, అనువాదాన్ని కూర్చి శ్రీవావిలాల ఉమాపతి గారి సహాయంతో మహా విద్యాపీఠం ద్వారా ముద్రించారు. శ్రీదేవరకొండ శేషగిరిరావు గారి సాహితీ సేవ, వారికి తోడ్పాటు నందించిన శ్రీ ఉమాపతి గారి ఔదార్యం అభినందనీయం. సనాతన ధర్మాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవాలనుకునే ప్రతి హైందవుడు తప్పక చదువవలసిన పుస్తకాలు ఇవి. ❖ – ఆనంద



## భజనామృతం

(దేవీదేవతల స్తోత్రాలు, సంకీర్తనలు)

వెల: రూ. 100/- పుటలు: 384
ప్రతులకు: శ్రీ శంకర్ రెడ్డి,
ఇ.నెం: 12-2-422/41, గుడిమల్కాపూర్
హైదరాబాదు-28, సెల్: 9000019415

## మహాశక్తి పీఠాలు

అనువాదం: డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
వెల: రూ. 30/- పుటలు: 50
ప్రతులకు: డా॥ కనుపర్తి రాధాకృష్ణ
4-1-714,రాధాకృష్ణ నగర్,శివాలయం రోడ్,
బద్వేలు- 516 227, కడప జిల్లా.



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-4, Sri Ramakrishna Prabha (Telugu Monthly) April 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? అంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. - స్వామి రంగనాథానంద



శ్రీసీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రమూర్తి. క్షేత్రం - 'భద్రాచలం'



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మే 2012 ₹10

బుద్ధం శరణం గచ్ఛామి।
ధర్మం శరణం గచ్ఛామి।
సంఘం శరణం గచ్ఛామి।



# సుబోధ

**భక్తుడు :** ప్రపంచాన్ని గురించి కొద్దిగానైనా తెలుసుకోకుండా భగవంతుణ్ణి ఎలా తెలుసుకోగలం? ముందు పుస్తకాలు చదివి కొంత తెలుసుకోవాలి కదా?

**శ్రీరామకృష్ణులు :** ముందుగా భగవంతుడు, అటు తరువాతే సృష్టి. భగవంతుణ్ణి తెలుసుకున్నప్పుడు సర్వమూ తెలిసిపోతుంది. అయితే అప్పుడు సామాన్య విషయాలు తెలుసుకోగోరవు. వేదాలలో ఇదే విషయం చెప్పబడింది. ఒక వ్యక్తిని జనం చూడనంతవరకు అతడి గుణగణాల గురించి మాట్లాడుతూ ఉంటారు. అయితే అతడు వచ్చి ఎదుట నిలబడగానే మాటలన్నీ ఆగిపోతాయి. అతడి సాన్నిధ్యంలో ఉండటంలోనే ఆనందపడిపోతారు. అతడితో మాట్లాడటంలోనే పరవశించిపోతారు.

"ముందుగా భగవత్సాక్షాత్కారం; అన్య విషయాలన్నీ అటు తరువాతనే. వాల్మీకికి రామమంత్రం ఒసగబడింది, కానీ అతడికి 'మరా', 'మరా' అని జపం చేయమని చెప్పారు. 'మ' అంటే భగవంతుడు, 'రా' అంటే జగత్తు అని అర్థం. ముందుగా భగవంతుడు, అటు తరువాత జగత్తు. ఒకదాన్ని తెలుసుకుంటే అన్నీ తెలుసుకోవచ్చు. ఒకటి (1) తరువాత యాభై సున్నాలు పెట్టినట్లయితే అది చాలా పెద్ద సంఖ్య అవుతుంది. ఆ ఒకటిని తుడిచి వేసినట్లయితే ఏమీ మిగలదు. ముందుగా ఒకటి, అటు తరువాత అనేకం. ముందుగా భగవంతుడు, అటు తరువాత జీవజగత్తులు".

"నీకు కావలసింది మామిడి పళ్ళు తినడమే. తోటలో ఎన్ని వందల మామిడి చెట్లు ఉన్నాయి, ఎన్ని వేల కొమ్మలు ఉన్నాయి, ఎన్ని లక్షల ఆకులు ఉన్నాయి – వీటన్నిటి గురించిన సమాచారం నీ కెందుకు? నువ్వు మామిడి పళ్ళు తినడానికి వచ్చావు, మామిడి పళ్ళు తిని వెళ్ళు. అలాగే ఈ ప్రపంచంలోకి మనిషి వచ్చింది భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవడానికి. ఈ సంగతిని మరచిపోయి మనస్సును నానా విషయాలలో లగ్నం చేయడం మంచిది కాదు". ❖

(శ్రీరామకృష్ణ కథామృతం నుండి)



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్–500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

## 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు గమనిక

దాదాపు అరవై తొమ్మిదేళ్ళుగా అశేషపాఠకులను ఆధ్యాత్మిక అమృతవాహినిలో ఓలలాడిస్తున్న 'శ్రీరామకృష్ణ ప్రభ' గత అయిదేళ్ళ నుంచి హైదరాబాదు కేంద్రంగా వెలువడుతోంది. ఈ మాసపత్రిక పంపిణీకి ప్రణాళికా బద్ధమైన విధానాన్ని అమలు చేస్తూ ఉన్నాం. కానీ పాఠకులు కొంత మంది తమకు పత్రిక సక్రమంగా, నిరాటంకంగా చేరడం లేదని తమ అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

**దయచేసి పాఠకులు సహృదయంతో ఈ క్రింది అంశాలను పరిశీలించి, పంపిణీ విధానాన్ని అవగాహన చేసుకోవాల్సిందిగా మనవి:**

1. మీరు చందా కట్టిన వెంటనే మీ చందా నెంబరుతో సహా చిరునామా కంప్యూటర్‌లో నమోదు చేయబడుతుంది.
2. ఒక్కసారి మీ చిరునామా కంప్యూటర్‌లో నమోదు అయిందంటే, ప్రతీ నెల నిరాటంకంగా పత్రిక మీకు పంపబడుతుంది.
3. మీ చిరునామా పత్రిక కవరుపైన కంప్యూటరైజ్డ్ ప్రింటర్ ద్వారా ప్రింట్ అవుతుంది. పత్రికలను జిల్లాల వారీగా సంచులలో కట్టి, పోస్ట్ చేయడం జరుగుతుంది. కాబట్టి ఇందులో మా సిబ్బంది అజాగ్రత్తకు ఆస్కారమే ఉండదు.

**దయచేసి పాఠకులు ఈ క్రింది సూచనలను గమనించి, మాతో సహకరించవలసిందిగా మనవి :**

1. మీరు చందా కట్టిన తరువాత మీ చిరునామాకు పత్రిక చేరకపోతే, మా కార్యాలయానికి చందా కట్టిన వివరాలను ఫోన్ ద్వారా 040-27667799కు (ఉదయం10 గం॥-సాయంత్రం 5 గం॥మధ్య) తెలియజేయండి, చిరునామాను సరిచూసుకోండి.
2. పత్రిక మీకు సక్రమంగా చేరకపోతే ముందుగా మీ పోస్ట్‌మ్యాన్‌ను సంప్రతించండి.
3. ఒక నెలకు మించి పత్రిక మీకు చేరనట్లయితే మీ పోస్టాఫీస్‌లో వ్రాతపూర్వకంగా ఫిర్యాదుచేసి,ఆ ప్రతిని మాకు పంపండి. ఈ పత్రిక 3వ పేజీలోని 'చందాదారులకు విన్నపం' చదవండి. ❖

*– సర్క్యులేషన్ మేనేజర్, శ్రీరామకృష్ణ ప్రభ*

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 5 మే 2012

**గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।**
**రామాయణ మహామాలారత్నం వందే ఽనిలాత్మజమ్ ॥**

సముద్రాన్ని గోష్పద జలము వలె దాటినవాడు,
దానవులను దోమల్లాగా వధించినవాడు,
రామాయణ మహామాలారత్నమని వాసికెక్కినవాడు
అయిన వాయునందనునికి వందనములు.

– సుందరకాండము

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి వరలక్ష్మి సాహు, | కూకట్‌పల్లి, హైదరాబాదు (కీ॥శే॥ త్రినాథ్ సాహు జ్ఞాపకార్థం) | 10,116 |
| మహారాజ పోషకులు | : శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ, | మియాపూర్, హైదరాబాదు - 500 049 | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ బి.వి.వి. ప్రకాశ్ & శ్రీమతి బి. మంజువాణి, | ముక్తేశ్వరం, తూ.గోదావరి జిల్లా-533 211 | 10,000 |
| రాజ పోషకులు | : ఆచార్య నరెందుల వైకుంఠం, | కాచిగూడ, హైదరాబాదు (కీ॥శే॥ నరెందుల రాజ్యలక్ష్మి జ్ఞాపకార్థం) | 5,001 |
| పోషకులు | : శ్రీ ఎస్. గోవర్ధన్, | అడిక్‌మెట్, హైదరాబాదు - 500 044 | 1,008 |
| పోషకులు | : శ్రీ సిహెచ్. నరసింహారావు, | సికింద్రాబాదు - 500 056 | 1,000 |
| పోషకులు | : శ్రీ సిహెచ్. చక్రపాణి, | చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020 | 1,000 |
| పోషకులు | : శ్రీ జి. పరశురాములు, | పలమనేరు, చిత్తూరు జిల్లా - 517 408 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
DOMALGUDA, HYDERABAD - 500 029. Andhra Pradesh
Phone No: 040- 27667799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# తథాగతుని పథంలో నైతిక జీవనం

మనం ప్రతిరోజూ ఎన్నో పనులు చేస్తూ ఉంటాం, ఎన్నో విషయాలు వింటూ ఉంటాం, మరెన్నో దృశ్యాలు చూస్తూ ఉంటాం. ఇలా మన జీవనయానంలో నిత్యం సాగిపోతున్న వాటన్నిటినీ సర్వసాధారణమైన అంశాలుగా భావిస్తాం. అంతే తప్ప, రోజూ మనకు ఎదురయ్యే ఈ అనుభవాలను సత్యశోధనకు సహకరించే సాధనాలుగా మలచుకొనే భావన మనలో పొడసూపదు. మహాత్ములు మాత్రం ఈ నిత్యవ్యవహారాల నుండే సత్యశోధన పథాన్ని కనుగొని, సాధనతో ముక్త పురుషులవుతారు. ఎంతో మందికి ముక్తి పథాన్ని చేర్చే మార్గదర్శులుగా మారతారు. ఆ కోవకు చెందినవారే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస, భగవాన్ రమణమహర్షి, భగవాన్ బుద్ధుడు మొదలైనవారు.

మనం నిత్యం భగవంతుడి పటాలను పూజిస్తాం. కానీ ఆ ఛాయాచిత్రంలో భగవంతుడు చైతన్యరూపుడై ఉన్నాడా? భగవంతుడు ఉంటే మనం అతణ్ణి ఎందుకు దర్శించలేక పోతున్నాం? అన్న ఆలోచన మాత్రం కలగదు. కాళీమాత విగ్రహాన్ని పూజిస్తున్న గదాధరునిలో 'ఈ విగ్రహంలో కాళీమాత చిన్మయమూర్తిగా ఉందా? కాళీమాత ఉంటే ఆమెను ఎందుకు దర్శించలేకపోతున్నాను?' అన్న ఆవేదన కలిగింది. గదాధరుని ఆ ఆవేదనే జగన్మాతను విగ్రహంలోనే కాదు, సర్వత్రా దర్శించేలా చేసింది. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసగా మార్చింది.

జనన మరణాలు అనివార్యమని అందరికీ తెలిసిన విషయమే. జన్మించేదీ, మరణించేదీ ఈ దేహమే కానీ, నేను కాదు. అయితే ఈ 'నేను ఎవరు?' అని తెలుసుకోవాలన్న జిజ్ఞాస వల్ల వేంకటరామన్, భగవాన్ రమణ మహర్షిగా మారాడు.

మనం వయోవృద్ధులనూ, రోగగ్రస్థులనూ, మృతులనూ ఎన్నోసార్లు చూస్తుంటాం. కానీ ఈ జరా వ్యాధులకూ, మృత్యువుకూ అతీతమైన స్థితిని చేరుకోవాలన్న ఆలోచన మనలో ఎన్నడైనా కలిగిందా? జీవితంలో ఒకే ఒక్కసారి ఈ ముగ్గురినీ చూసిన సిద్ధార్థుడు మాత్రం దుఃఖాతీత స్థితిని అన్వేషించాలని సంకల్పించాడు. ఆ సంకల్ప బలంతో నిర్వాణ స్థితిని పొంది, భగవాన్ బుద్ధునిగా మారాడు.

మనలాగే మహాత్ములందరూ ఈ లోకంలో సంచరిస్తున్నప్పటికీ, వారి ఆలోచనా దృక్పథం, మనోభావాలు మన కన్నా భిన్నంగా ఉంటాయి. మహాపురుషులు ఒక్కసారి ఏ విషయం విన్నా అందులోని ధర్మసూక్ష్మాన్ని వెంటనే గ్రహిస్తారు. అందుకు కారణం – వారికి పరిశుద్ధమైన మనస్సు ఉండటమే! అద్దం ఎంత పరిశుభ్రంగా ఉంటే అందులోని ప్రతిబింబం అంత స్పష్టంగా గోచరమవుతుంది. అలాగే మనస్సు ఎంత నిర్మలంగా, నిశ్చలంగా ఉంటే, అంత సులభంగా నిగూఢ సత్యాలు విశదమవుతాయి. కాబట్టి మనస్సు ఎంత పరిశుద్ధమైతే, అంతగా సత్యాన్వేషణ పథంలో ఉన్నతిని సాధించగలుగుతాం. జీవితంలో ఏది సాధించాలన్నా పరిశుద్ధమైన మనస్సు అత్యంత ముఖ్యం. అందుకు తగిన రీతిలో నైతిక జీవనం గడపడం ఎంతో అవసరం.

అందుకే పతంజలి మహర్షి ప్రతిపాదించిన అష్టాంగ యోగం ద్వారా 'సమాధి స్థితి'ని చేరుకోవాలన్నా, బుద్ధ భగవానుడు ప్రబోధించిన అష్టాంగ మార్గం ద్వారా 'నిర్వాణ స్థితి'ని అందుకోవాలన్నా అన్నింటికీ ముఖ్యం 'శీలం' (సత్యవచనం, సత్కర్మలు, సదాచారం) ఆధారమని తెలిపారు. శీలం అరణ్యంలో దారి తప్పిన బాటసారికి దారి చూపే మిత్రుని లాంటిది. అందువల్ల శీలమే మోక్షసాధనకు ఆశ్రయం అంటూ బుద్ధచరితం ఇలా శ్లాఘించింది:

**చరాచరస్య విశ్వస్య యథా ఉ_ధారో వసుంధరా ।**
**నిఖిలానాం గుణానాం చ తథా శీలం శుభాశ్రయః ॥**

'చరాచర జీవరాశికి భూమి ఆధారమైనట్లు, సకల సద్గుణాలకూ శీలమే ఆధారం.'

బుద్ధుని 'అష్టాంగ మార్గం'లో, పతంజలి మహర్షి 'అష్టాంగ యోగం'లో పరిశుద్ధమైన మనస్సుకు ప్రథమ నియమం 'నైతిక జీవనం'అని పేర్కొన్నారు.

| అష్టాంగ మార్గం | అష్టాంగ యోగం |
|---|---|
| సమ్యగ్ వచనం (సత్యవచనం) – | సత్యం |
| సమ్యగ్ కర్మ (సత్కర్మ) – | అహింస, అస్తేయం |
| సమ్యగ్ జీవనం (సద్వర్తనం) – | బ్రహ్మచర్యం, అపరిగ్రహం |

**సమ్యగ్ వచనం (సత్యం) :** సమ్యగ్ వచనం అంటే మనం చూసిన విషయాన్నీ, విన్న విషయాన్నీ, చేసిన పనినీ ఉన్నది ఉన్నట్లుగా, జరిగినది జరిగినట్లుగా చెప్పడం. మనం చెప్పే విషయం ఇతరులకు ప్రియంగానూ, హితంగానూ, ఉద్వేగాన్ని కలిగించనిదిగానూ ఉండాలి. అలా కపటం, మోసం, దాపరికం

లేకుండా సత్యమార్గాన్ని అనుసరించినవారు ఏది సంకల్పిస్తే అది జరిగి తీరుతుంది.

బుద్ధుడు పూర్వజన్మలో శిబి చక్రవర్తిగా రాజ్యాన్ని పరిపాలించేవాడు. ఆయన అత్యంత దానశీలుడిగా ప్రసిద్ధి పొందాడు. ఒకసారి ఇంద్రుడు, శిబి చక్రవర్తి దానగుణాన్ని పరీక్షించదలచి ఒక అంధుడైన వృద్ధుని రూపంలో వచ్చాడు. ఆ వృద్ధుడు, చక్రవర్తిని సమీపించి – 'చక్రవర్తీ! నాకు మీ నేత్రాలను దానం చేసి చూపును ప్రసాదించండి' అని అర్థించాడు. వెంటనే చక్రవర్తి తన నేత్రాలను ఆ అంధునికి ఇవ్వడానికి సిద్ధమయ్యాడు. కానీ అక్కడి మంత్రులంతా, 'రాజా! మీరు అంధులైతే రాజ్యపాలన కుంటుపడుతుంది. కాబట్టి నేత్రదానం మాని ఆ వృద్ధునికి ధనదానం చేయండి' అని సలహా ఇచ్చారు.

అందుకు చక్రవర్తి, 'నేను నేత్రదానం చేస్తానని మాట ఇచ్చాను. మాట తప్పితే అసత్యవాదిని అవుతాను. అసత్యవాదిని అవడం కన్నా అంధునిగా జీవించడమే ఉత్తమం' అని బదులిచ్చాడు. ఇచ్చిన మాట ప్రకారం ఆ వృద్ధునికి తన రెండు నేత్రాలనూ సమర్పించాడు. వృద్ధుడి రూపంలో ఉన్న ఇంద్రుడు, ఆయన సత్యనిష్ఠకు ఆశ్చర్యపోయాడు.

చక్రవర్తికి తిరిగి దృష్టిని ప్రసాదించాలని ఇంద్రుడు సంకల్పించాడు. ఒకరోజు ఇంద్రుడు, 'చక్రవర్తీ! నేత్ర దానం చేస్తున్నప్పుడు మీ ఈ అంధత్వానికి ఆ యాచకుడే కారణమనే భావం మీలో కలిగిందా?' అని ప్రశ్నించాడు.

అప్పుడు శిబి చక్రవర్తి, 'నేను గనక మనఃస్ఫూర్తిగా నేత్రదానం చేసినట్లయితే, నా సత్యనిష్ఠలో ఎలాంటి లోపం లేనట్లయితే నా నేత్రాలు నాకు తిరిగి వచ్చుగాక!' అని పలికాడు. వెంటనే ఆయనకు రెండు నేత్రాలూ తిరిగి వచ్చాయి.

సత్యపాలనలో ప్రతిష్ఠితమైన వ్యక్తి ఏమి సంకల్పిస్తే అది జరిగి తీరుతుంది. అందుకే 'సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్' అని సత్యనిష్ఠను పతంజలి మహర్షి కీర్తించారు.

**సమ్యగ్ కర్మ** (అహింస, అస్తేయం) : మనో వాక్ కర్మల ద్వారా ఎవరికీ ఎన్నడూ కష్టం కలిగించకూడదు. కేవలం శారీరకంగా హింసించడమే కాకుండా మాటతో సైతం ఇతరులకు కష్టం కలిగించినా అది కూడా హింస అవుతుంది. అలాగే ఇతరులను మోసగించడం, అధర్మ మార్గం ద్వారా ధనం సంపాదించడం దొంగతనం అవుతుంది. మనది కాని దాన్ని అపేక్షించకుండా ఉండటమే అస్తేయం. కాబట్టి ఇతరులకు ఆనందాన్నీ, ప్రయోజనాన్నీ కలిగించే పనులు చేయడమే సత్కర్మ అవుతుంది.

కూటదంతుడనే బ్రాహ్మణుడు యాగం నిర్వహిస్తూ జంతుబలి ఇస్తున్నాడని తెలిసిన బుద్ధుడు, 'జంతువధ చేసి దైవానికి నివేదించాలనుకుంటే ముందు నన్ను బలి ఇవ్వు' అని జంతు బలిని నిరోధించాడు. జంతువులను బలి ఇవ్వడం కన్నా మనలోని అహంకారాన్ని బలి ఇవ్వడం వల్ల పవిత్రులమవుతామని



బోధించాడు బుద్ధుడు. ఒక మూగజీవి కోసం ప్రాణాలను సైతం అర్పించడానికి సిద్ధమైన బుద్ధుని కరుణార్ద్ర హృదయానికి కూటదంతుడు కరిగిపోయాడు. బుద్ధుని ధర్మోపదేశానికి ప్రభావితుడై, అహింసావాదిగా మారిపోయాడు.

'అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః' – అహింసను ఆచరించినవారి సన్నిధిలో ఎలాంటి వారికైనా వైరభావం కలగదు. వారిలో ఉన్న హింసాప్రవృత్తి తొలగిపోతుంది. అలాగే బందిపోటు దొంగ అయిన అంగుళీమాల, బుద్ధుని దర్శనంతో పాపకర్మలను విడిచి, సన్మార్గంలో జీవించాడు.

**సమ్యగ్ జీవనం** (బ్రహ్మచర్యం, అపరిగ్రహం) : మనసా వాచా కర్మణా కామప్రకోపం లేకుండా నియమబద్ధమైన జీవితం గడిపినవారు తమ నైతికవర్తనంతో పతితులను కూడా పావనులుగా మారుస్తారు. ఒకసారి ఆమ్రపాలి అనే వేశ్య ఇంటికి బుద్ధుడు వెళ్ళాడు. ఆ పవిత్రమూర్తి దివ్యదర్శనంతో ఆమె వేశ్య వృత్తిని విడిచి నీతిగా జీవనం గడపసాగింది.

లోభంతో ధనాన్ని సంచయం చేయకుండా, అవసరానికి మించి ఎవరి దగ్గరి నుండి ఏమీ స్వీకరించకుండా, ఎలాంటి ఆడంబరాలూ లేకుండా జీవించడం ద్వారా అపరిగ్రహాన్ని ఆచరించినవారవుతారు. ఒకసారి ఓ మహారాజు, బుద్ధుణ్ణి శిష్య సమేతంగా భిక్షకు ఆహ్వానించాడు. బుద్ధుడు రాజభవనంలోకి ప్రవేశిస్తున్నప్పుడు అక్కడ అలంకారాలను చూసి, అవన్నీ తొలగిస్తే కానీ లోపలికి అడుగు పెట్టనని అన్నాడు. అపరిగ్రహం ఆచరించినవారు భోగాలను తుచ్ఛమైనవిగా తలుస్తారు. ఆడంబరాలకూ, ఆకర్షణలకూ అతీతంగా జీవిస్తారు.

ఏ మహాత్ముడు ప్రబోధించినా, ఏ యోగమార్గాన్ని అనుసరించినా మోక్షసాధనానికి నైతిక జీవనమే ఆధారం. అందుకు బుద్ధుని జీవితంలో జరిగిన సంఘటనలే నిదర్శనం. కాబట్టి, ఆ తథాగతుడు చూపిన నైతిక జీవన పథంలో పయనిస్తే సద్గతి ప్రాప్తిస్తుంది. అందుకు 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ ఆ కరుణావతారుణ్ణి శరణు వేడుదాం. ❖

**కర్మయోగమును లెస్సగా ఆచరించిన ఆదర్శ కర్మయోగి బుద్ధుడు. మూర్తీభవించిన కరుణామూర్తి ఆయన. ప్రపంచ చరిత్రలో ఆయనకు సాటియైన కర్మయోగి వేరెవరూలేరు.** - స్వామి వివేకానంద

# గోరుముద్ద - స్వామి సుప్రియానంద




## మూడొకట్ల ఒకటి!

మే ఒకటవ తేదీన జరుపుకునే 'కార్మిక దినోత్సవం' గురించి మనందరికీ తెలుసు.

ఇదే తేదీన 115 సంవత్సరాలకు పూర్వం, ఒక 'అద్భుతం' జరిగింది. అదేమిటో తెలుసుకునే ముందర ఆనాటి పరిస్థితుల అవగాహన చాలా అవసరం. బ్రిటీషు వారు 'విభజించి, పాలించు' (Divide and Rule) అన్న సిద్ధాంతాన్ని ఉపయోగించి భారత దేశంలో చిన్న చిన్న రాజ్యాలను మట్టుబెట్టి, దేశ సంపదను కొల్లగొట్ట డమే కాకుండా భారతీయుల వ్యక్తిత్వాన్ని నాశనం చేయడానికి పూనుకున్నారు. సాధారణ జనుల శక్తియుక్తులను 'తెల్లదొరలు' వారి స్వప్రయోజనాలకు ఉపయోగించుకున్నారు. కార్మిక, కర్షక మరియు బడుగు వర్గాల పిల్లలు కనీసం 'ప్రాథమిక విద్య'కు కూడా నోచుకోలేదు. సోమరితనం, పనికిమాలిన వృథా కబుర్లతో వారు మనుష్యులమన్న విషయాన్నే మరచిపోయారు. దీనికి తోడు జాతి, కుల, మత భేదాలు బాగా పెరిగాయి. "విద్య లేని వాడు వింత పశువు" అన్నది అక్షరాలా నిజమయింది.

ఇది ఇలా ఉండగా, ఒక యువ సన్యాసి తన గురువుగారి మహాసమాధి అనంతరం కాలినడకన నాలుగున్నర సంవత్సరాలు భారతదేశమంతా పర్యటించారు. చివరకు డిసెంబర్ 1892లో భారతదేశపు దక్షిణాగ్రంలోని కన్యాకుమారి చేరుకున్నారు. అది మూడు సముద్రాల సంగమం. అక్కడ ఆయన సముద్రంలో ఉన్న ఒక మహాశిల మీద కూర్చుని ఒక వినూత్న ధ్యానం చేశారు. ఆ ధ్యానంలో ఆయన సాక్షాత్కారం పొందింది 'భారతదేశం'లో క్షణక్షణానికి అథఃపాతాళానికి జారిపోతున్న లక్షలాది మంది బిడ్డల ఆర్తనాదాలు విని విలపిస్తున్న ఆ భరతమాత విచార వదనం.



మళ్ళీ భారతదేశం ప్రపంచ వేదికపై తలెత్తి నిలబడాలంటే ఏం చేయాలి? ఆ మహాచింతనతో నిండివున్న ఆ యువ సన్న్యాసి మనస్సులో ఒక మహాప్రణాళిక ఉదయించింది. 1897 మే 1వ తేదీన ఆయన స్వయంగా తన గురువుగారి పేరుతో ఒక సేవా సంఘాన్ని ప్రారంభించి తన ప్రణాళికకు ప్రాణప్రతిష్ఠ చేశారు. ఆ యువ సన్న్యాసి పేరు– స్వామి వివేకానంద. ఆయన స్థాపించిన సంఘం – రామకృష్ణ మిషన్. ఈ రోజుల్లో ఎంతో మంది రామకృష్ణ మిషన్ సేవా కార్యక్రమాలలో పాలుపంచుకోవడానికి ముందుకొస్తున్నారు. ఇది చాలా సంతోషకరం.

ఇప్పుడు అసలు విషయం ఏమిటంటే...! స్వామి వివేకానంద చేసిన హెచ్చరిక మరియు విన్నపం: "భారతదేశంలో ముగ్గురు మనుషులు కలిసి ఐదు నిమిషాలు పనిచెయ్యలేరు. ప్రతి ఒక్కరు అధికారం కోసం పోరాడేవారే! ఇతరుల గురించి చెడుగా మాట్లాడటం, వారి గొప్పతనాన్ని చూసి ఓర్వలేక హృదయంలో దహించుకుపోవడం, గొప్పతనమంటే నాదేననీ – ఇతరులెవ్వరూ అది పొందకూడదని అనుకోవడం, నికృష్టమైన అసూయ మన జాతి యొక్క చెడు లక్షణాలు. నా స్నేహితులు కాదలచినవారు ఎవరైనా సరే, ఈ లక్షణాలను విడిచిపెట్టాలి."

కాబట్టి ముగ్గురు కలిసి పనిచేసేటప్పుడు మనసా–వాచా–కర్మణా 'మూడొకట్ల ఒకటి' అవుదాం. మన ప్రియతమ స్వామీజీ ప్రేమకు పాత్రులమవుదాం! ఆధ్యాత్మిక ఉన్నతిని పొందుదాం! ❖ (మే 1న 'రామకృష్ణ మిషన్' 116వ ఆవిర్భావ దినోత్సవం)



# మహాత్ముని మహిత సందేశం

– బొప్పన అరుణాదేవి

కరుణామూర్తి, ప్రేమస్వరూపుడు గౌతమబుద్ధుడు. ప్రపంచంలోని దుఃఖాన్ని చూసి చలించిపోయి, దుఃఖనివారణ కనుగొనడానికి రాజ్యభోగాలతో సహా సర్వసుఖాలనూ తృణప్రాయంగా భావించి, అన్నింటినీ వదిలివేసి కఠోరమైన తపస్సుతో బుద్ధత్వం సాధించి, మానవాళికి ముక్తి సందేశాన్ని అందించాడు. మనస్సులోని భ్రమలను తొలగించి, మరణభీతి నుంచి కాపాడి లోకానికి శాంతిని ప్రసాదించాడు బుద్ధుడు.

ప్రపంచమంతా దుఃఖమయం. దుఃఖానికి మూల కారణం అజ్ఞానమనీ, అది తొలగితే విముక్తి లభిస్తుందనీ చెప్పాడు. నిర్వాణానికి మార్గం చూపే నాలుగు ఆర్య సత్యాలు వివరించాడు. దుఃఖం, దుఃఖకారణం, దుఃఖనివారణ, అష్టాంగమార్గం అనుసరించడం ద్వారా ముక్తి పొందడం.

జ్ఞానోదయమైన తర్వాత బుద్ధుడు ఏడు రోజుల పాటు ఏకాంతంగా మోక్షానందాన్ని అనుభవించాడు. ముక్తి సందేశాన్ని నలుదిక్కులా వెదజల్లడానికి బయలుదేరాడు.

బుద్ధుడు తన శిష్యులకు ఐదు విధాలైన ధ్యానాలు వివరించాడు. మొదటిది – ప్రేమ ధ్యానం. ధ్యానంలో సర్వజీవుల యోగక్షేమాలను మనసారా కోరుకోవాలి. శత్రువులు కూడా సుఖంగా ఉండాలని కాంక్షించాలి. రెండవది – కరుణ ధ్యానం. దుఃఖంలో, కష్టంలో ఉన్న జీవులందరి బాధలూ, ఆందోళనలూ నీవు ఊహించుకుని, వారి పట్ల దయతో నీ మనస్సు కరిగిపోయేలా అనుభూతి చెందాలి. మూడవది– సంతోష ధ్యానం. ఇతరుల సౌభాగ్యం గురించి ఆలోచించి, వారి సంతోషమే నీ సంతోషంగా భావించాలి. నాలుగవది – మాలిన్య ధ్యానం. అవినీతి, దుర్మార్గం, దౌర్జన్యం, అన్యాయం మొదలైన మాలిన్యాల వలన కలిగే దుష్ఫలితాలను యోచించి, వాటిని రూపుమాపడం. ఐదవది – శాంతి ధ్యానం. రాగద్వేషాలు, అరిషడ్వర్గాలకు అతీతంగా భవితను తీర్చిదిద్దుకోవాలని యోచించాలి. ఈ ఐదు రకాల ధ్యానాల వలన పవిత్రులవుతారు.

బుద్ధుడు మహిమలు ప్రదర్శించరాదని తన శిష్యులను హెచ్చరించేవాడు. దీక్ష పట్టిన శిష్యుడు మానవాతీత శక్తులైన దివ్యదృష్టి గాని, మహిమలు గాని, మంత్ర తంత్రాలను గాని ఉపయోగించకూడదనీ, అవన్నీ నిషిద్ధమనీ, నిరుపయోగమైనవనీ శిష్యులను కట్టడి చేశాడు.

ధనవంతుడి కోడలు కృశగౌతమి. బిడ్డ చనిపోయాడు. చనిపోయిన తన బిడ్డను బుద్ధుని పాదాల వద్ద ఉంచి ఏదయినా మందిచ్చి నా బిడ్డను బ్రతికించమని కోరింది. 'ఎవరి ఇంటిలో బిడ్డగాని, భర్తగాని, తల్లితండ్రులుగాని చనిపోలేదో – అలా అసలు మరణమే సంభవించని ఇంటి నుంచి గుప్పెడు ఆవాలు తీసుకురా! నీ బిడ్డను బ్రతికిస్తా'నని చెప్పాడు బుద్ధుడు. ఇంటింటికి తిరిగి మరణం లేని గృహమే లేదని తెలుసుకుని ఆ తల్లి బాధతో, నిరాశతో తిరిగి బుద్ధుని వద్దకు వచ్చి శరణువేడింది. బుద్ధుడు, కృశగౌతమితో "తల్లీ! మానవుల జీవితం కష్టాలకు నిలయం. వారి ఆయుస్సు అల్పం. పుట్టినవారు చావు నుంచి తప్పించుకొనే మార్గం లేదు. ముసలితనం, జబ్బులు, మరణం ఎవరికయినా తప్పవు. పండిన పండ్లు చెట్టు నుంచి రాలినట్లుగా మానవుడిని మరణం ఏ క్షణంలో అయినా కాటేస్తుంది. కుమ్మరి చేసిన కుండలు పగిలి మట్టిలో కలిసిపోయినట్లుగా మానవుని దేహం మరణం తర్వాత మట్టిలో కలుస్తుంది. అందువలన బుద్ధిమంతులు లోకరీతిని గ్రహించి దుఃఖించరు. విచారించడం వలన మనశ్శాంతి దొరకదు. శాంతిని కోరేవారు దుఃఖాన్ని అధిగమించాలి" అని బోధించాడు.

జ్ఞానాన్ని ఎలా సక్రమంగా వినియోగించుకోవాలో భగవానుడు బోధించాడు. ఉన్నదానిని ఉన్నట్లుగా దర్శించడం మానవజాతికి ఆయన నేర్పించాడు. సత్యధర్మాలను ఎలుగెత్తి చాటిచెప్పాడు. మానవాళికి నైతికమార్గం చూపించాడు. బుద్ధుని అంతరంగాన్ని అర్థం చేసుకుని, ఆచరించేవారు శాంతిని పొందుతారు. నిర్వాణ సుఖాన్ని అనుభవిస్తారు. ముక్తిని చేజిక్కించుకుంటారు. అది సత్యం. ❖ **(మే 6వ తేదీ, ఆదివారం - బుద్ధపూర్ణిమ)**

**మనస్సును ఉన్నత లక్ష్యంపై నిలిపి స్థిరమైన ప్రయోజనముతో సత్యాన్ని అన్వేషించు. నీ ఆనందం బాహ్య వస్తువులపై కాకుండా నీ మనస్సుపైనే ఆధారపడి ఉందని తెలుసుకో.** *- భగవాన్ బుద్ధుడు*




**వయసి గతే కః కామవికారః**
**శుష్కే నీరే కః కాసారః ।**
**క్షీణే విత్తే కః పరివారః**
**జ్ఞాతే తత్త్వే కః సంసారః ॥**

# రాలిపోయే పూలకు రాగాలెందుకు?

– స్వామి జ్ఞానదానంద

మాకు తెలిసిన ఓ వృద్ధురాలికి దాదాపు ఎనభై ఏళ్ళుంటాయి. నలభై ఏళ్ళ వయస్సులో కట్టుకున్న భర్త కన్ను మూశాడు. ఆ తరువాత తన కళ్ళ ముందే తన అయిదుగురు కొడుకుల్లో ఇద్దరు కొడుకులు, కోడలు, ముగ్గురు మనుమళ్ళు, ఓ మనుమరాలు – ఇలా తన కన్నా చిన్నవాళ్ళయిన దగ్గరి బంధువులు ఎంతోమంది ఆమె చూస్తుండగానే దుర్మరణం పాలయ్యారు. అయినా ఆమె జీవనశైలిలో కించిత్తయినా వైరాగ్యపు ఛాయలు కనిపించడం లేదు. ఇప్పటికీ ఈ వయస్సులోనూ ఆమె ఆలోచనలన్నీ ఆస్తులపైనా, బంగారు నగలపైనా, మిగిలిన కొడుకులకు సంబంధించిన ఆస్తి పంపకాల పైనే! క్షణం కూడా ఆమె భగవంతుడి గురించి ఆలోచించే ప్రయత్నమైనా చేయదు. ఒక ఆలయాన్నైనా సందర్శిద్దామనుకోదు. ఆకలితో వచ్చే బిచ్చగాళ్ళకు పిడికెడు ముద్దయినా పెట్టదు. కష్టాలు, కన్నీళ్ళు... విషాదాలు, విలాపాలు – ఇలా అలల్లా అల్లకల్లోలపరచినా వివేకంతో కూడిన వైరాగ్యం మనలో పొడసూపకపోతే అంతకు మించిన దీనత్వం మరొకటి లేదు. అందుకే జగద్గురువులు ఆదిశంకరాచార్యులు నీరు ఇంకి పోయాక చెరువు ఉనికే ఉండదనీ, బ్రతుకు మలిసంధ్యకు చేరాక కోరికల వికారాలకు తావివ్వ కూడదనీ ఇలా హితవు పలుకుతున్నారు :

**వయసి గతే కః కామవికార శ్శుష్కే నీరే కః కాసారః ।**
**క్షీణే విత్తే కః పరివారో జ్ఞాతే తత్త్వే కః సంసారః ॥**

అవును! వయస్సు మళ్ళినవారికి కామవికార మెక్కడిది? నీరు ఎండిపోయాక చెరువనిపించుకుంటుందా? అలాగే ధనం లేనప్పుడు పరివారమెలా ఉంటుంది? తత్త్వం అనుభవమైన తరువాత సంసారబంధం ఏముంటుంది? కానీ మనలో చాలామంది ఈ పరమసత్యాన్ని విస్మరిస్తున్నారు. రాలిపోయే వేళ కూడా పూలు, కొమ్మలతోనే మమేకం కావాలని పిచ్చి ఆశతో రాగాలు పలికితే ఎంత అసహజంగా ఉంటుందో; వాలిపోయే క్షణాల్లోనూ మనిషి మమకారాల మాయలో పడి విలవిల్లాడితే అంతే అమాయకంగా ఉంటుంది.

**మలిసంధ్యలోనూ మమకారాలా?...** మనలో చాలామంది జీవితంలోని దశలను యథార్థంగా అర్థం చేసుకోలేక అవస్థల పాలవుతున్నారు. ఏ దశలో ఎలా ప్రవర్తించాలో తెలియక అయోమయంలో పడిపోతున్నారు. ఫలితంగానే కర్మ సన్న్యాసులుగా విరామంలో విడిది చేయాల్సిన వార్ధక్యంలోనూ లేనిపోని వ్యాపకాలతో పొద్దు గడుపుతున్నారు. వయస్సుకు తగ్గట్లు హుందాగా మసలుకోకుండా, పూర్వపు వాసనల ఛాయలన్నింటినీ జీవన మలిసంధ్యలోకీ వ్యాపింపజేస్తున్నారు.

అందుకే శంకర భగవత్పాదులు **'వయసి గతే కః కామ వికారః?'** అని ప్రశ్నిస్తున్నారు. ఇక్కడ 'కామం' అంటే కోరికలు, వాసనలు, వ్యాపకాలు అని అర్థం. దురదృష్టవశాత్తూ కారణాలు ఏవైనా నేటి సమాజంలో శారీరకంగా, మానసికంగా చాలామంది తమను తాము వార్ధక్యానికి సంసిద్ధులను చేసుకోవడం లేదు. చక్రి చింతనలో తరించడం లేదు. తీరని కోరికలతో, తపనలతో కొట్టుమిట్టాడుతున్నారు. అందుకే వసిష్ఠుడితో శ్రీరామచంద్రుడు ఓ మారు...

**అపి మేరు సమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరమ్ ।**
**తృణీకరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్ ॥**

'మేరువుతో సమానమైన ధీరుడైనా, మహా ప్రాజ్ఞుడైనా, నరోత్తముడైనా ఆశ, తృష్ణ వల్ల క్షణంలో ఓటమి పాలవుతాడ'ని ఆందోళనపడతాడు. శరీరం శిథిలమవుతున్నా, ఏదో అనుభవించాలనే తాపత్రయం, దాహం, కోరికలు వర్ధిల్లుతూ

ఉంటాయి. మరణం దరిదాపుల్లో ఉన్నా, కోరికలు కాకుల్లా పీడిస్తూ ఉంటాయి.

**నీరుంటేనే చెరువు!** శరీరం శుష్కించినట్లు మనిషికి మనస్సు శుష్కించదు. అక్కడే వస్తుంది ప్రమాదం! మనస్సనే సరస్సుకు ఆశలే పెద్ద జల వనరు. ఆ జలం ఎండిపోనంత వరకు సరస్సు కళకళలాడుతూనే ఉంటుంది. ముందు ఆ ఆశల జలాన్ని ఆవిరి చేసుకోమంటున్నారు ఆ ఆదిగురువులు. అయితే పిడికిలి మించని ఈ గుండెలో, కడలిని మించిన ఆశల్ని దాచుకునే ప్రయత్నం చేస్తున్నాం; చెరువును మించి నీరును ప్రవహింపజేస్తున్నాం. ఇక ఆ శంకరుల **శుష్కే నీరే కః కాసారః** ... ప్రశ్నకు జవాబు ఎక్కడ దొరుకుతుంది? తనువు సహకరించకపోయినా, కోరికలతో దాన్ని తట్టి లేపుతుంటే మనిషికి విశ్రాంతి ఎప్పుడు లభిస్తుంది? భగవంతుడి వైపునకు మనస్సు ఎన్నడు మరలుతుంది? ఒక వయస్సు నుంచి మనస్సుకు శిక్షణ నివ్వకపోతే అది అంత సులువుగా నియంత్రణలోకి రాదు. ఫలితంగానే నేడు చాలామంది మురికిపట్టిన ఆశల జలంతో నిండిన కుళ్ళు కాసారాల్లా కనిపిస్తున్నారు. వైరాగ్యపు సూర్యకిరణాలు సోకినప్పుడే ఆ ఆశల జలం ఆవిరవుతుంది. శ్రీమద్భగవద్గీతలో కృష్ణభగవానుడు, అర్జునుడితో 'కోరికలు, అహంకార మమకారాలు, లేనిపోని ప్రయత్నాలు, చింతలు విరక్తునిలో పొడసూపవు. భోగాసక్తి ఉన్న వానికి చిత్తవికారం సహజం. దుర్గుణాల వల్ల కలిగే దోషాలకు చిత్తవికారమే హేతువగుచున్న'దంటాడు.

**సంపదతోనే సకుటుంబ సపరివారం...** వ్యక్తిగతంగా మనల్ని మనం పణంగా పెట్టి, తన ప్రతినిధిగా మనను లోకానికి పరిచయం చేసిన ఆ విధాతను కూడా విస్మరించి అలుపెరుగని కార్యకలాపాలతో సంపదలు సృష్టిస్తాం. కానీ అవి దూరమైన క్షణకాలంలో ఎవరైతే మనం ఆత్మీయులని భ్రమిస్తామో, వారందరూ దూరమవుతారు. ఇది అందరికీ అనుభవైకవేద్యమే. అయినా ఏ ఒక్కరిలో కూడా కళత్ర, పుత్ర, మిత్ర, బాంధవ అనురాగాలు మాత్రం అడుగంటడం లేదు. వారిని వేరు చేసి, మనల్ని మనం చూసుకోవాలన్న ప్రయత్నం ఏ ఒక్కరూ చేయడం లేదు. అందుకే శంకరాచార్యులు, **క్షీణే విత్తే కః పరివారః?** అంటూ సంపదలు లేనప్పుడు పరివార మెలా ఉంటుందని ప్రశ్నిస్తున్నారు. నిజానికి మనం తాపత్రయంతో పోగేసుకున్నవన్నీ గృహంలోనే ఉండిపోతాయి; అయినవారు, ఆప్తులు అనుకున్నవారంతా శ్మశానం వరకే వచ్చి తిరిగిపోతారు; చివరకు మనవెంట వచ్చేవి మన పాప పుణ్యాలే! ఈ సత్యాన్ని నిరంతరం స్మరించుకుంటూ నడచు కోవాలి. ఈ దేహంలో దారుఢ్యం ఉన్నప్పుడే మంచి పనులు చేస్తూ, ఆ మాధవుణ్ణి స్మరించుకుంటూ గడపాలి. అందుకే బలిచక్రవర్తి, వామనుడితో శ్రీమద్భాగవతంలో ఇలా అంటాడు:

**చెలియే మృత్యువు? చుట్టమే యముడు? సంసేవార్థులే కింకరుల్**
**శిలలం చేసెనె బ్రహ్మతన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే!**
**చలితం బౌట ఎరుంగకీ కపట సంసారంబు నిక్కంబుగా**
**తలచున్ మూఢుడు సత్యదాన కరుణా ధర్మాది నిర్ముక్తుడై!**

'అయ్యో! మృత్యువు ఆప్తమిత్రుడు కాదు. యముడు దగ్గర చుట్టం కాదు. సేవకులు భక్తితో సేవించాలనే బుద్ధి మంతులు కారు. ప్రాణం శాశ్వతం కాదు. బ్రహ్మ ఈ శరీరాన్ని రాళ్ళతో మలచలేదు. అయినా, మూర్ఖుడు సత్యం, దానం, దయ, ధర్మం వదలివేస్తున్నాడు. ఈ మాయా సంసారాన్ని సత్యమని భావిస్తున్నాడ'ని ఆవేదన చెందుతాడు.



**తత్త్వం తెలిస్తే ఇక తాపత్రయమెక్కడ?...** సంసార బంధాలు శాశ్వతం కాదని తెలిసిన తరువాతే మనస్సు నిలకడగా భగవంతుడి వైపు మొగ్గుచూపగలదు. అయితే మనం జీవితంలో ఆయనకు చివరి ప్రాధాన్యా న్నిస్తున్నాం. ఎప్పుడో ఈ లౌకికమైన బాధ్యత లన్నీ తీరిపోయాక, అప్పుడు తీర్థయాత్ర లకూ, పుణ్యకార్యాలకూ కేటాయిద్దాములే అన్న భ్రమల్లో ఉంటున్నాం. ఎంత అవివేకం! *'స జానే కిస్ గలీమే జిందగీకీ షామ్ హోజాయే'* అంటారు ఓ ఉర్దూ కవి. నిజమే ఏ మూలమలుపులో మన జీవనసంధ్యా సమయం ముగిసిపోతుందో! త్వరగా మేలుకొని యౌవనం నుంచే వివేకంగా ఆలోచించడం, విలువైన మార్గాన్ని అనుసరించడం అలవరచుకోవాలి. ధార్మిక జీవనాన్ని ఎంచుకోవాలి. ఏ వైపు నుంచి మృత్యువు కాపు కాసి, కాటేస్తుందో? "వయస్సు మళ్ళే వరకూ కర్మలు చేస్తూ ఉండనవసరం లేదు; భగవంతుడి పట్ల శుద్ధభక్తి, అనురాగం పెంపొందించే కొద్దీ కర్మలు తగ్గుతూ వస్తాయి. భగవల్లబ్ధి పొందిన పిదప కర్మలు పూర్తిగా తొలగిపోతాయి" అనేవారు శ్రీరామకృష్ణ పరమహంస. జీవితాన్ని ఆ పరమాత్ముడి పాదకమలాలకు సమర్పించుకోవాలనే సత్సంకల్పంతో సాగిపోతే, ఆయనే తనంతట తానుగా మనల్ని తనవాడిగా చేసుకుంటాడు. చిత్తాన్ని కామం నుంచి, కాంక్షల కాసారం నుంచి కడు దూరంగా తీసుకువెళ్ళి, పరివార అసలు స్వరూపాన్ని తేటపరచి, సంసార బంధాల నుంచి మనల్ని విముక్తుల్ని చేస్తాడు. ❖

**మహాసముద్రంలో కొయ్యదుంగలు ఎక్కడెక్కడి నుంచో వచ్చి విడిపోయినట్లు, ఈ భవసాగరంలో జీవులందరూ ఎక్కడెక్కడి నుంచో వచ్చి, కలుసుకొని మరలా విడిపోతూ ఉంటారు.** - వేదవ్యాసుడు

# జీవితమే జయకేతనం

**- హేమంత్ కుమార్**

మనిషి వజ్ర సదృశ శరీరుడు కావాలి. శిరీష కోమల హృదయుడు కావాలి. వజ్రం, శిరీష పుష్పం!! ఎంత విభిన్న కోణం! వ్యతిరేక గుణ విశేషం! అవి ఒకే మూసలో ఇమడ గలవా? మిళితం కాగలవా? అయినా అంత అవసరమా? కానీ... విలక్షణ గుణ సమ్మేళనం ప్రకృతి సహజం. ప్రకృతికి వసంతమూ ఉంది, గ్రీష్మమూ ఉంది. చంద్రునికి పౌర్ణమీ ఉంది, అమావాస్యా ఉంది. మహోన్నతగిరి పంక్తుల పక్కనే అగాధమైన లోయలూ ఉంటాయి. సృష్టి క్రమంలో భగవంతుని ఈ పూర్ణ వ్యతిరిక్త, విభిన్న సృజన ఒక అద్భుత సౌందర్యావిష్కరణకే అనే సత్యాన్ని గ్రహించ గలిగితే మనిషి ఆ విలక్షణతను మనసారా ఆస్వాదించగలడు. నిజానికి ఈశ్వరుడే హరిపాదాల పుట్టి హిమనగాల జారి వచ్చిన గంగమ్మనూ, చల్లదనానికీ, ఆహ్లాదానికీ ఆకరమైన చందమామనూ అలంకరించుకున్న అదే శిరోభాగంలో అగ్ని నేత్రాన్నీ ధరించాడు. ఇంకాస్త కిందే కంఠ సీమలో కరాళ గరళానికీ ఆదరంతో ఆశ్రయమిచ్చాడు. ఆ సంప్రదాయాన్ని మనిషీ అనుసరించాలని అభిలషించాడు. మనిషి పూర్ణుడు కావాలంటే మంచి ముక్కలన్నీ మన్నికగా అతికి వర్తులాన్ని తయారుచేసుకోవాలి మరి. ఉగాది పచ్చడికి షడ్రుచుల సమ్మేళనమే సరియైన ఫార్ములా మరి. సందర్భానికి తగినట్లు స్పందించే ఉత్తమ గుణరాశి వ్యక్తి వ్యక్తిత్వాన్ని ఔన్నత్య శిఖరాలకు చేరుస్తుంది. అది భిన్న కోణాలున్నదైనా! విభిన్న తత్త్వాల సమాహారమైనా!



స్వామి వివేకానందలో దేహదారుఢ్యమే కాదు, మనో దారుఢ్యమూ ఉంది. భావ దారుఢ్యమూ ఉంది. అదే సమయంలో నవనీత కోమల హృదయమూ ఉంది. ఇటీవలి చరిత్రలో భారతదేశంలోని పేదల దీనత్వం పట్ల అంతగా ఆర్ద్రమైన రసహృదయుడు మరొకరు కానరారు. కండలు తిరిగిన ఆ బలశాలి పేదల కడగండ్ల పట్ల కన్నీరు సైతం కార్చారు. ప్రజల్లో నుంచి కండలు తిరిగిన, ఉక్కు నరాలు బిగిసిన వీరులు, యువ కిశోరాలు కావాలని ఆశించారాయన. భారతదేశం బాగుపడా లంటే బలశాలురు మాత్రమే ఉంటే చాలా? లేదు లేదు. చాలదు. చాలదు. బలంతో పాటు బలహీనతా ఉండాలి. దౌష్ట్యం పట్ల నిప్పులు కక్కే ఆ కళ్ళు కన్నీటి కాసారాలయ్యే ఆర్ద్రత ఉండాలి. దృఢదీక్షతో ఉక్కు పిడికిలిగా బిగుసుకునే ఆ చెయ్యి ఆర్తులకు అందించే ఆపన్న హస్తం కాగలిగి ఉండాలి. జీవిత కాల సాధనతో అందబోతున్న ముక్తి కాంతను ఇతరుల ముక్తి సాధనకు తోడ్పడేందుకు మరోజన్మ వరకూ వాయిదా వేసుకోగలిగిన అప్రతిహత ఔదార్యం కావాలి. అపురూపమైన సౌందర్యాన్ని ఒక్క క్షురకర్మతో త్యాగం చేసుకోగలిగిన వైరాగ్యం ఉండాలి. కలిమి తేజాన్ని కాషాయం జయించగలిగి ఉండాలి. అవును... అందమైన బలహీనతలు, అపురూపమైన ఆర్ద్రతలు, అద్భుతమైన స్పందనలు కావాలి. అప్పుడే ఆ బలానికి ఈ బలహీనత ఆభరణం అవుతుంది. ఈ బలహీనతకు ఆ బలం ఆయుధమవుతుంది. జయం సొంతమవుతుంది. జీవితమే విజయ కేతనం అవుతుంది.

వజ్రం సౌందర్యానికీ, వెలకూ దానికదే సాటి. అయినా అంతటి అపురూపమైన వజ్ర లేశాన్ని సైతం కోసేశక్తి మరి దేనికీ లేదు. అంత కఠినాతి కఠినం. అలాగే అబ్బురపరచే స్నిగ్ధమైన గులాబీ పుష్పం క్రింద గాటు వేసే ముళ్ళుంటాయి. దేని అవసరం దానిది. దేని ప్రయోజనం దానిది. అయితే బలం బలహీనుల్ని అణిచేందుకు కాదు. వారికి ఆసరా అయ్యేందుకు. గుండెలోని ఆర్ద్రత దుర్మార్గం ముందు లొంగిపోయేందుకు కాదు. ఓడిపోయేందుకు కాదు. దాని రసంతో, దాని ఆసరాతో ఆర్తుల ఎండిన గుండెలను తడిపేందుకు, ఊరట కలిగించేందుకు!

స్వామీజీలో అందమైన కాఠిన్యం ఉండేది. కఠినమైన ఆర్ద్రత ఉండేది. ఆదర్శం ఉండేది. విశ్వసించనంత వరకూ గురుదేవుల్ని కూడా చెలగిపడేశారు. దేవతల్నీ నిరసించారు. అదే స్వామీజీలో కోట్లాది భారతీయుల పట్ల అనితర సాధ్యమైన బాధ్యత ఉండేది. ఒక కుటుంబ యజమానిలా తానొక్కడే బాధ్యత వహించవలసి ఉన్నదన్నంత ప్రేమతో, కర్తవ్యంతో కూడిన తీవ్ర సంకల్పమూ, స్పందనా ఉండేవి. బాధ, వేదన ఉండేవి. ప్రతి వ్యక్తీ అంతటి బాధ, బాధ్యత వహిస్తే ఈ దేశం స్వర్గమైపోతుందనే ఆశ ఉండేది. దాన్ని ఆయన వ్యక్తీకరించడమే కాదు, విశద పరిచారు కూడా. భారతదేశం ఆయన కర్మ క్షేత్రం. మోక్షధామం.

ప్రతి మనిషీ మరో స్వామీజీయే కానక్కర్లేదు. లోకంలో స్వామీజీ ఒక్కరే. ఆయనే కాదు. మరెవరైనా సరే. వారు లోకంలో వారొక్కరే కాగలరు. అయితే ఆ గుణాలు, ఆ ఆశలు, ఆ ఆశయాలు, ఆ ఆచరణలు మనలోకి ఆవాహన చేసుకుంటే ఎవరికి వారు వారి పేరిట మహోన్నత వ్యక్తి కావచ్చు. మహత్తు సృష్టించవచ్చు. జీవితం కేవలం పుట్టి, బ్రతుకునీడ్చి గిట్టేందుకు మాత్రమే కాదు. ఈ సృష్టి భ్రమణ మహాయజ్ఞంలో పవిత్ర సమిధగా సమర్పితమయ్యేందుకు! ఆ రీత్యా ధూపరూప ప్రకాశంగా మింటికెగసి ధ్రువతారగా నిలిచిపోయేందుకు! ❖

**స్వీయసౌఖ్యం కోసం ఇతరులను బాధించకూడదు. ద్వేషరహితమైన దయార్ద్రహృదయమును, అమేయమైన కరుణను అలవరచుకోవడానికి మానవుడు ప్రయత్నించాలి.** - *భగవాన్ బుద్ధుడు*

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ సౌమ్యా సుబ్రమణియన్, దోమల్‌గూడ, హైదరాబాదు | వివిధ జిల్లాల్లోని 10 పాఠశాలలకు ఒక సంవత్సరానికి పత్రికను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ జి. గణపతిరావు, మియాపూర్, హైదరాబాదు | గ్రంథాలయం, బాగుసల, గజపతి జిల్లా, ఒరిస్సా |
| శ్రీమతి పొన్నంగి భుజంగేశ్వరి, మియాపూర్, హైదరాబాదు | కార్యదర్శి, కన్యకా పరమేశ్వరి వర్తక సంఘం, గణపవరం, ప.గో.జిల్లా |
| శ్రీ పలివెల బంగార్రాజు, గౌరీనగర్, విశాఖపట్నం | శ్రీవి.పి. ఉన్నత పాఠశాల, అంకుపాలెం, చోడవరం, విశాఖపట్నం జిల్లా |
| శ్రీ అన్నపురెడ్డి సంజీవరెడ్డి, గుంటూరు జిల్లా (కీ।।శే।। ఎ. వెంకిరెడ్డి, కనకమ్మల జ్ఞాపకార్థం) | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, ముత్యాలమ్మకొండ, గుంటూరు జిల్లా |
| శ్రీ బి. వేంకటేశం, ఓల్డ్ బోయిగూడ, సికింద్రాబాదు | గవర్నమెంట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఇన్ ఎడ్యుకేషన్, హైదరాబాదు |
| కుమారి ఎం. శ్రీకిరణ్, లింగోజిగూడ, హైదరాబాదు | గుంటూరు జిల్లాలోని 20 ఉన్నత పాఠశాలలకు పత్రికను స్పాన్సర్ చేశారు. |
| శ్రీ జి. వేమన్న, కమ్మపల్లె, చిత్తూరు జిల్లా | ఆంధ్రప్రదేశ్ పెన్షనర్ కమిటీ, పుంగనూరు, చిత్తూరు జిల్లా |
| శ్రీ ఎ.ఎల్.ఎన్. శర్మ, కవాడిగూడ, హైదరాబాదు | శ్రీ సాయి శ్రీనివాస విద్యానికేతన్, పెద అవుటపల్లి, కృష్ణా జిల్లా |
| శ్రీమతి బి. కళావతి, ఓల్డ్ అల్వాల్, సికింద్రాబాదు | వేదవ్యాస ఉన్నత పాఠశాల, ప్రొద్దుటూరు, కడప జిల్లా |
| శ్రీ సిహెచ్. నరసింహారావు, ఆర్.కె.పురం, సికింద్రాబాదు | ప్రభుత్వ డిగ్రీ కళాశాల, చేబ్రోలు, గుంటూరు జిల్లా |
| శ్రీ పద్మనాభయోగి, కందుకూరు, నెల్లూరు జిల్లా | 50 పాఠశాలలకు ఒక సంవత్సరానికి పత్రికను స్పాన్సర్ చేశారు. |
| శ్రీమతి వసంత, ఇందిరానగర్, బెంగుళూరు | వేదశ్రీ ఉన్నత పాఠశాల, లక్సెట్టిపేట, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీమతి ఎన్. శేషురాజు, ఇందిరానగర్, బెంగుళూరు | వేంకటేశ్వర ఉన్నత పాఠశాల, పి.సి.పల్లి, ప్రకాశం జిల్లా |
| శ్రీమతి జి. సుబ్బలక్ష్మి, ఇందిరా నగర్, బెంగుళూరు | విద్యాభారతి ఉన్నత పాఠశాల, తాండూరు, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ అల్లె రఘుపతి ఆర్, ఎస్.ఎస్. అమృత్వర్ మార్గ్, వర్లి, ముంబయి | రాజరాజేశ్వరానంద స్వామి ఆశ్రమ సేవాసంఘం, జగిత్యాల, కరీంనగర్ జిల్లా |
| శ్రీ ఎం. ప్రభాకరరావు, న్యూ మారుతీ నగర్, జిల్లెలగూడ, హైదరాబాదు | డి.ఆర్.కె. రెడ్డి ఉన్నత పాఠశాల, కొరిశపాడు, ప్రకాశం జిల్లా |
| శ్రీ ఘంటసాల రాధాకృష్ణ, కాకతీయనగర్, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వేముల, కడప జిల్లా |
| శ్రీ వి.రామారావు & జయరావు (కీ।।శే।। వి. సత్యనారాయణ, సరస్వతుల జ్ఞాపకార్థం) | మండల పరిషత్ ఉన్నత పాఠశాల, మునిరాం, విజయనగరం జిల్లా |
| శ్రీ పి.ఎస్.ఆర్. కృష్ణప్రసాద్, రాయపేట, చెన్నై | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పెనమలూరు, కృష్ణా జిల్లా |
| శ్రీ కె. రాధాకృష్ణ, కార్ఖానా, సికింద్రాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బెజ్జూరు, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ ఆదినారాయణ రెడ్డి, పెద్ద హరివనం, కర్నూలు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పెద్దహరివనం, ఆదోని, కర్నూలు జిల్లా |
| శ్రీమతి లావేటి గురేంద్ర, హైదరాబాదు (కీ।।శే।। ఎల్.జి.హనుమంతరావు జ్ఞాపకార్థం) | 50 విద్యాసంస్థలకు పత్రికను ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు. |
| శ్రీ సి.ఎస్. రామాంజనేయరెడ్డి, వేంపల్లి, కడప జిల్లా | 3 ప్రభుత్వ ఉన్నత పాఠశాలలకు 10 సంవత్సరాలకు స్పాన్సర్ చేశారు. |
| శ్రీ కె.ఆర్. మధుసూదన గుప్తా, ఉరవకొండ, అనంతపురం జిల్లా | సోక్రటీస్ ఉన్నత పాఠశాల, బైరాగి పట్టెడ, తిరుపతి, చిత్తూరు జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, హొన్నూరు, అనంతపురం జిల్లా |
| శ్రీ వై.వి.బి. సుబ్బారావు, వీరంకి లాకు, కృష్ణాజిల్లా | కృష్ణా జిల్లాలోని 13 పాఠశాలలకు ఒక సం।। పత్రికను స్పాన్సర్ చేశారు. |
| ప్రొ।। ఎం. సులోచన (పూర్వ విద్యార్థిని,1969 బ్యాచ్, ఉస్మానియా విశ్వవిద్యాలయం) | మాడపాటి హనుమంతరావు బాలికల ఉన్నత పాఠశాల, హైదరాబాదు |
| శ్రీమతి బి.ఎస్. లక్ష్మి, మంగపేట, వరంగల్ జిల్లా (కీ।।శే।। ఎన్.బి.ఎస్. రామం జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మంగపేట, వరంగల్ జిల్లా |
| శ్రీ వినోద్, ఖైరతాబాద్, హైదరాబాదు | జిల్లా పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, ముచ్చుకూర్, నిజామాబాద్ జిల్లా |
| శ్రీమతి ఆర్. సరోజిని, దోమల్‌గూడ, హైదరాబాదు | జిల్లా పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, చంద్రవెల్లి, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ డి.వి. సుబ్బారావు, సరూర్‌నగర్, హైదరాబాదు | జిల్లా పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, పెద్ద ముప్పారం, వరంగల్ జిల్లా |
| శ్రీ పి. సర్వేశ్వరరావు, గోదావరిఖని, కరీంనగర్ జిల్లా | ప్రభుత్వ డిగ్రీ & పి.జి. కళాశాల, గోదావరిఖని, కరీంనగర్ జిల్లా |
| శ్రీమతి బి. సరోజాదేవి, కీల్పాక్, చెన్నై | కె.టి.సి.టి. బాలికల హయ్యర్ సెకండరీ పాఠశాల, నారాయణమొదలి వీథి, చెన్నై |
| శ్రీ బి.ఎన్. గుప్తా, కీల్పాక్, చెన్నై | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, పలమనేరు, చిత్తూరు జిల్లా |
| " " " | శ్రీకనకదుర్గ హయ్యర్ సెకండరీ పాఠశాల (తెలుగు మాధ్యమం),విల్లివాకం, చెన్నై |
| శ్రీ ఎస్.వి. సుబ్రహ్మణ్యం, నాగరబావి, బెంగుళూరు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గొట్లగట్టు, ప్రకాశం జిల్లా |
| శ్రీ విజయ వేంకటేశ్వర్లు, రామ్‌నగర్ చౌరస్తా, హైదరాబాదు | ఎ.పి.టి.డబ్ల్యు.ఆర్. బాలుర జూ. కళాశాల, ఏటూరు నాగారం, వరంగల్ జిల్లా |
| " " " | ఎ.పి.టి.డబ్ల్యు.ఆర్. బాలికల జూనియర్ కళాశాల, కురవి, వరంగల్ జిల్లా |
| డా।। కోడూరి సుబ్బారావు, భువనగిరి, నల్లగొండ జిల్లా | వేదిక్ విద్యాలయ ఉన్నత పాఠశాల, సీతాఫల్ మండి, సికింద్రాబాదు |
| **శివానంద ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్ ఐ.డి.ఏ దగ్గర, నార్కట్‌పల్లి, నల్లగొండ జిల్లా** | **నల్లగొండ జిల్లాలోని 25 పాఠశాలలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రిక జీవిత చందాను స్పాన్సర్ చేశారు.** |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# అద్భుత సత్యాల ఆవిష్కర్త

భారతదేశంలో పురోహితులకూ, ప్రవక్తలకూ సాగుతూ ఉండిన సంఘర్షణలో కలిగిన విజయమే బుద్ధుడిలో మూర్తీభ వించింది. భారతదేశంలోని పురోహితుల విషయమై ఒక్క మాట చెప్పొచ్చు - వారికి ఏనాడూ మత విషయమై అసహనం లేదు; అన్యమతస్థుల నెన్నడూ వారు హింసించలేదు. మతాభిప్రాయాల వల్ల ఎవరినీ వారెన్నడూ బాధించలేదు. అయితే వారూ పురోహితులందరికీ ఉన్న విచిత్ర లోపాల వల్ల బాధపడ్డారు; వారూ అధికారాన్ని కాంక్షించారు; వారూ నియమ నిబంధనలు కల్పించి మతాన్ని అనవసరంగా సంక్లిష్టం చేశారు; తత్ఫలితంగా తమ మతావలంబులను నిర్వీర్యులను చేశారు.

ఈ కలుపుమొక్కలన్నిటినీ బుద్ధుడు తొలగించివేశాడు. అత్యద్భుత సత్యాలను అతడు బోధించాడు. యావత్ ప్రపంచానికీ అతడు తన మతాన్ని బోధించాడు. 'మానవులంతా సమానులే. ఎవరికీ ప్రత్యేకాధిక్యాన్ని చూపనవసరం లేదు' అని సమత్వాన్ని బోధించిన మహాత్ముడు బుద్ధుడు. పురోహిత వర్గానికీ, తదితర కులాలకూ మధ్యనున్న భేదాలను బుద్ధుడు నిర్మూలించాడు. ఎంతటి నికృష్ట స్థితిలో ఉన్నవారైనా పరమోత్కృష్ట ప్రయోజ నాలకు అర్హులేనని, నిర్వాణ ప్రాప్తికి ద్వారాన్ని అతడందరికీ తెరిచి ఉంచాడు. అతడు కేవలం మాటలు చెప్పి ఊరుకోలేదు; లోకం నిమిత్తం తన జీవితాన్ని త్యజించడానికి సంసిద్ధుడయ్యాడు. "జంతువును బలి ఇవ్వడం మంచిపనైతే, మనిషిని బలి ఇవ్వడం అంత కంటే మంచి పని కదా" అన్నాడతడు. బలి అయ్యేందుకు సిద్ధమయ్యాడు. జంతుబలి మరొక మూఢవిశ్వాసం.

హైందవులు దేన్నైనా విసర్జించగలరు, కానీ దేవుణ్ణి మాత్రం కాదు. దేవుడు లేడనడం భక్తికి ఆధారంగా ఉన్న పునాదిని తీసివెయ్యడమే. దేవుణ్ణీ, భక్తినీ హైందవులు అంటిపెట్టుకొని ఉండక తప్పదు. ఏ పరిస్థితుల్లోగాని వీటిని హైందవులు విడనాడరు. బుద్ధుడి సందేశంలో దేవుడు లేడు, ఆత్మ లేదు - కేవలం కృషి. కృషి ఎందుకోసం? స్వార్థం కోసం కాదు. 'అహం' భ్రాంతే. ఈ భ్రాంతి తొలగిపోగానే మన యథార్థ తత్త్వమేదో అదే మనమవుతాం. ఈ స్థాయిని అందుకొని కేవలం లక్ష్యం కోసమే కృషి చేసేవారు, ఉదార లక్ష్యసిద్ధికై నడుం కట్టేవారు ప్రపంచంలో ఏ కొద్ది మంది మాత్రమే ఉంటారు.

అయినా, బుద్ధుని మతం శీఘ్రగతిలో వ్యాప్తి గాంచింది. మానవ చరిత్రలోనే మొదటిసారిగా విశాల హృదయం నుండి దివ్యప్రేమ పొంగి పొరలింది. అది సమస్త మానవకోటి సేవకే కాక, సమస్త జీవకోటి సముద్ధరణకూ అర్పితమైంది. సకల జీవులకూ బాధల నుండి విముక్తి కలిగించడానికి మార్గం కనిపెట్టే ఆలోచన తప్ప ఆ ప్రేమకు వేరొక తలంపు లేదు. ఈ కారణం చేతనే బౌద్ధమతం అంత వేగంగా వ్యాపించింది. ❖




- స్వామి మేధానంద పురి

- ఎం. కృష్ణమూర్తి, సూర్యాపేట.

**? : వేదాలు, సూర్యచంద్రులు, ఆకాశం, ముఖ్యంగా అంతరాత్మ మన తప్పులు చూస్తూ ఉండి ఉంటే, తప్పులు చేయకుండా ఆదిలోనే ఎందుకు నిరోధించలేవు? తెలుపండి.**

✍: ప్రతీ ఒక్కడు తన పూర్వజన్మలో ఆర్జించిన వాసనలకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు, ఈశ్వరుడు మీరు చేసిన కర్మలకు ఫలమునిస్తాడు. ఇతరులు సాక్షులు. మీకు వివేకం ఉంది. దాని నుంచి మంచి కర్మలు మాత్రమే చేయడానికి ప్రయత్నించండి.

పూర్వం చేసిన కర్మల ఫలితం మంచో చెడో అనుభవించి తీరాలి. అందుకే స్వామి వివేకానంద 'మీ భవితకు మీరే విధాతలు' అని అంటారు. "నా భుక్తం క్షీయతే కర్మ జన్మ కోటి శతై రపి" అని శాస్త్రవచనం. మీరు భోజనం చేస్తే మీ స్నేహితుడి కడుపు నిండదు కదా! అందుకే శాస్త్రాలు ధర్మప్రవృత్తి గురించి ఘోషిస్తున్నాయి. పూర్వ వాసనల ద్వారా వ్యక్తి తప్పులు చేస్తాడు. శాస్త్ర జ్ఞానం ద్వారా, వివేకం ద్వారా, జప, ధ్యాన, స్మరణాల ద్వారా వాటి బారి నుంచి తప్పించుకొనే అవకాశం ఉంది.

- అలర్క రమణ మహర్షి, తణుకు.

**? : భగవంతునిపై విశ్వాసం ఉంటే చాలు అంటున్నారు. మరి, పురుష ప్రయత్నం అక్కర లేదా?**

✍: అనేక జన్మల తపఃఫలితంగా భగవంతునిపై శ్రద్ధ, విశ్వాసాలు ఏర్పడతాయి. "సంపూర్ణ విశ్వాసం, శ్రద్ధ (ఆత్మ జ్ఞానం) భగవత్ సాక్షాత్కారం వల్ల కలుగుతుంది" అని స్వామి బ్రహ్మానందజీ చెప్పారు. భగవత్ సహాయం, కృప అగ్ని లాంటివి. అగ్ని దగ్గరకు వెళితే వేడి తగులుతుంది. దూరంగా ఉంటే వేడి తగలదు. అదే విధంగా అగ్ని దగ్గరకు వెళ్ళడం అనేది పురుష ప్రయత్నం. పురుష ప్రయత్నాన్నే శాస్త్రాలన్నీ ఉపదేశిస్తున్నాయి. గజేంద్రునికీ, ద్రౌపదికీ దేహాభిమానం పూర్తిగా తొలగిన తరువాతే భగవంతుని సహాయం లభించింది. దేహాభిమానం, అహంకారం తొలగడానికి పురుష ప్రయత్నం ఎంతో అవసరం. దేహాభిమానం లేదని చూపడానికి శ్రీరామకృష్ణులు రాత్రివేళల్లో ఇతరుల మరుగుదొడ్లు శుభ్రం చేసేవారు.

- ఎల్.వి. సూర్యనారాయణమూర్తి, మార్టేరు.

**? : పూజామందిరంలోనే నామ జపం చెయ్యాలా? ఏ పని చేస్తున్నా నామ జప ఫలితం ఉంటుందా?**

✍: "తత్ జపః తదర్థ భావనం"- జపం చేస్తున్నప్పుడు నామంతో పాటు, భగవంతుని రూపం, గుణాలు, లీలలు చింతన చేయాలి. అన్నిటి కన్నా ఎక్కువగా 'సన్నిధి' భావం ముఖ్యం. అంటే దేవుడు నాలో ఉన్నాడు. నన్ను చూస్తున్నాడు. వాని కొరకే ఇది చేస్తున్నాననే భావన ముఖ్యం. ఆ భావనతో ఎల్లవేళలా, ఎల్ల కార్యాలలో జపం చేస్తే, తప్పక ఫలితం కలిగితీరుతుంది.

- బి. శ్రీశైలం, కాకినాడ.

**? : ఆత్మతత్త్వం, పరమార్థ తత్త్వం అంటే ఏమిటి? ఎలా బోధిస్తే తెలుస్తుంది?**

✍: "తత్" అనగా నిరాకార, నిర్గుణ, నిర్విషయక సర్వవ్యాపక వస్తువు. అది చైతన్య స్వరూపం. జ్యోతిస్వరూపం. వాక్ మనస్సులకు అతీతం. "నేహ నా నాస్తి కించన" (కఠోపనిషత్)-అవిద్య నశించిన ఈ బ్రహ్మతత్త్వంలో లేశమాత్రమైనా భిన్నత్వం లేదు. 'ఏకం సత్' - చైతన్యం ఒక్కటే. దానినే ఆత్మతత్త్వం అనవచ్చు. పరమార్థతత్త్వం అని కూడా అనవచ్చు. "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యం ద్వారా ఏకత్వాన్ని బోధించారు. కలలో చూసే జ్యోతిస్వరూపం అదే. నిద్రలో శరీరం, మనస్సు, ఇంద్రియాలు పనిచేయక పోయినప్పటికీ, ఆ తత్త్వం ద్వారా అనుభవం కలుగుతోంది. నీటితో నిండిన పాత్రలో వేసిన కూరముక్కలు నీళ్ళు మరగగానే నాట్యం చేస్తుంటాయి. అలాగే లోపల ఉన్న చైతన్యం ద్వారా ఈ జడమైన మనస్సు, ఇంద్రియాలు, శరీరం ఆడుతున్నాయి. ఈ విధంగా ఆ తత్త్వాన్ని బోధించవచ్చు. ❖

## పండుగలు - పర్వదినాలు

**మే - 2012**

| | | |
|---|---|---|
| 02, 16 | బుధవారం | ఏకాదశి |
| 04 | శుక్రవారం | నృసింహ జయంతి |
| 06 | ఆదివారం | బుద్ధపూర్ణిమ |
| 15 | మంగళవారం | హనుమజ్జయంతి |
| 20 | ఆదివారం | ఫలహారిణీ కాళీ పూజ |
| 31 | గురువారం | ఏకాదశి |

**జూన్ - 2012**

| | | |
|---|---|---|
| 15 | శుక్రవారం | ఏకాదశి |
| 21 | గురువారం | పూరీ జగన్నాథ రథోత్సవం |
| 30 | శనివారం | ఏకాదశి |





**ఇదె శిరసు మాణిక్యమిచ్చి పంపె నీకు నాకె**
**అదనెఱిగి తెచ్చితి నవధరించవయ్యా ॥**

**రామ నినుబాసి నీరామ నే చూడగ నా**
**రామమున నిను పాడె రామరామ యనుచు**
**ఆ మెలుత సీతయని యపుడు నే తెలిసి**
**నీ ముద్ర వుంగరము నేనిచ్చితిని ॥**

**కమలాప్తకులుడ నీ కమలాక్షి నీ పాద**
**కమలములు తలపోసి కమలారి దూరె**
**నెమకి యాలేమనునే నీదేవి యని తెలిసి**
**అమరంగ నీసేమమటు విన్నవించితిని ॥**

**దశరథాత్మజ నీవు దశశిరుని చంపి, యా**
**దశనున్న చెలిగావు దశదిశలు పొగడ**
**రసికుడ శ్రీ వేంకట రఘువీరుడ నీవు**
**శశిముఖి చేకొంటివి చక్కనాయ పనులు ॥**

# సీతమ్మ శిరసు మాణిక్యమిచ్చె

– శ్రీమతి బి. కృష్ణకుమారి

తనువులు వేరైనా తలపులు ఒక్కటే అయినటువంటి అపురూపమైన దంపతులు సీతారాములు; వారిది ఆత్మబంధం. ఆ బంధానికున్న బలమేంటో నిరూపించిన సుమధురమైన రచన సుందరకాండ. రామాయణంలో రసరమ్యమైన ఆ కథనంలో కథానాయకుడు కపీంద్రుడైన హనుమంతుడు. ఆయన జానకి, రాముల ప్రేమతీరాలకు వారధి కట్టిన వానరశ్రేష్ఠుడు; వీరాధివీరుడు! అంతటి ఆ ఆంజనేయుణ్ణి తనలో ఆవహింప జేసుకొని అన్నమాచార్యులు సుందరకాండను తన పదకవితల్లో పరిచయం చేస్తున్నాడు. వేంకటేశుడి భక్తచింతామణి, ఇక్కడ రఘురాముడి సేవాగ్రగణ్యుడై తపించిపోతున్నాడు; తానే మారుతిగా మారి సీతమ్మవారి శిరోమణిని శ్రీరామచంద్రుడికి చూపి తరించిపోతున్నాడు. అసురుడి అశోకవనంలో ఆ వైదేహి ఎలా విలవిల్లాడిపోతుందో; భర్త అయిన రామభద్రుడి ఆగమనం కోసం కన్నుల నీరిడి ఎలా నిరీక్షిస్తుందో కళ్ళకు కట్టినట్లు వివరిస్తున్నాడు. రామాయణమంతటిలో పరమ పవిత్రమైన సన్నివేశాల సమాహారం – సుందరకాండ. అందుకే

**సుందరే సుందరో రామః సుందరే సుందరం కపిః ।**
**సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్ ॥**

'సుందరకాండలో శ్రీరామచంద్ర ప్రభువు సుందరుడు, సీతామహాసాధ్వీమణి అపురూప సుందరి, కాండకు ప్రధానుడైన ఆంజనేయస్వామి సుందరుడు, జానకీమాతకు ఆశ్రయమిచ్చిన అశోకవనం అత్యంత సుందరమైనది' అని అంటారు.

## మాత మాణిక్యమిచ్చి పంపె...

ఈ పదకవితా పితామహుడు పరమభక్తితో పద విన్యాసంతో ఆలపించిన కీర్తన ఇది. తన్మయంతో కలియుగం నుంచి త్రేతా యుగానికి తరలిపోయి, తారకరాముడి ముందు వాలిపోయాడు ఈ వేంకటేశుడి వీరాభిమాని. అలా అన్నమయ్య అపర అంజనీ సుతుడిగా మారి, ఆ దశరథ నందనుణ్ణి దర్శించుకుంటున్నాడు. ఆ పరమపావని తన జ్ఞాపకంగా ఇచ్చిన శిరోమణిని అప్పజెబుతూ...

**ఇదె శిరసు మాణిక్యమిచ్చి పంపె నీకు నాకె ।**
**అదనెఱిగి తెచ్చితి నవధరించవయ్యా ॥**

'ఓ రామయ్యా! ఇదిగో! అమ్మ సీతమ్మ నీకిచ్చిన శిరోమణి. చూడవయ్యా'! అంటూ ఆనందపడిపోతున్నాడు. ఎంతో శ్రమ కోర్చి సీతాన్వేషణకు వెళ్ళిన హనుమంతుడు, శత్రు దుర్భేద్యమైన లంకానగరంలోకి ప్రవేశించి ఆ సాధ్వీమణి జాడను కనుగొంటాడు. ప్రమిదలో గాలికి రెపరెపలాడుతున్న దీపంలా, ఆమె ఆ వనంలో కనిపించింది. ఈ మారుతి రామదూత అని తెలుసుకొని, గుర్తుగా ఆ కౌసల్య తనయుడి ఉంగరాన్ని చూసి పులకించి పోయింది. మారుగా తన శిరోమణిని ఇస్తూ...

**మణిం దృష్ట్వా తు రామో వై త్రయాణాం సంస్మరిష్యతి ।**
**వీరో జనన్యా మమ చ రాజ్ఞో దశరథస్య చ ॥** అంటుంది ఆ కపివరుడితో! వీరుడైన శ్రీరాముడు ఈ మణిని చూసిన వెంటనే నా తల్లిని, నా తండ్రియైన జనకుని, దశరథ మహారాజును సంస్మరించుకుంటాడు. అట్లే నన్ను కూడా గుర్తుకు తెచ్చుకో గలడని విన్నవించుకుంటుంది. అలా ఆ శిరసుమాణిక్యంతో తిరిగి వస్తాడు ఆ అనిలుడు. *(మిగతా 32వ పేజీలో...)*

**ఒక్కసారి నన్ను సాకారునిగానైనా, నిరాకారునిగానైనా భావించి సేవించినవాడు సూర్య కిరణాలతో ముల్లోకాలూ పావనమైనట్లు, నా పాదధూళి సోకి పునీతుడవుతాడు.** - శ్రీరామచంద్రుడు

- డాక్టర్ రెంటాల జయదేవ



# ఓంకార విశిష్టత

భారతదేశంలో మనం తరచూ పలికే అత్యంత పవిత్రమైన మరో శబ్దం - 'ఓమ్'. పరబ్రహ్మ స్వరూపమే ఓంకారం. ఓంకారం సర్వమంత్రాలకూ అధిపతి అని పవిత్ర గ్రంథాలు స్పష్టం చేస్తున్నాయి. ఓంకారమే బ్రహ్మజ్ఞానం. అదే పరమాత్మ. ఓంకార ఉచ్చారణ శరీరం మీద, మనస్సు మీద, పరిసరాల మీద ప్రగాఢమైన ప్రభావం చూపుతుంది. అనేక మంత్రాలు, వేద ప్రార్థనలు, అన్ని శుభకార్యాలూ ఈ ప్రణవ ఉచ్చారణతోనే ఆరంభమవుతాయి.

ఓంకారమే బ్రహ్మ స్వరూపం కాబట్టి, ఓంకారాన్ని పూజించడమంటే, సాక్షాత్తూ పరబ్రహ్మను పూజించడం కిందే లెక్క. అందుకే, 'ఓం'కారాన్ని మంత్రంగా జపించడం, ధ్యానించడం కూడా కద్దు. 'అ'కార, 'ఉ'కార, 'మ'కారాల సమ్మేళనం - 'ఓం'కారం. తొలి వేదమైన ఋగ్వేదంలోని మొదటి మంత్రపు మొదటి అక్షరాన్ని (అ), రెండో వేదమైన యజుర్వేదంలోని మధ్య మంత్రంలోని మధ్యాక్షరం (ఉ)తో కలిపితే, 'అ + ఉ = ఓ' అవుతుంది. దానికి (ఓ), చివరి వేదమైన సామవేదంలోని చివరి అక్షరాన్ని (మ్) జత చేరిస్తే, మొత్తం కలిపి మూడు వేదాల సారమే - 'ఓమ్'.

నిజానికి, వేదాలు మూడే. అందుకే, వాటికి 'త్రయి' అని పేరు. అథర్వ వేదమనే నాలుగో వేదం ఆ మూడింటిలో నుంచి వేరు చేసినదే! కాబట్టి, అన్ని వేదాల సారం ఆ 'ఓమ్' శబ్దంలోనే ఉంది. 'ఓమ్' అని ఉచ్చరిస్తే, మూడు వేదాలనూ ఉచ్చరించినట్లే! అందుకే, ఏ నామానికైనా ముందు 'ఓంకారం' చేరిస్తే, అది వేదమంత్ర సమానం అవుతుంది.

'ఓమ్' అనేది అన్ని మతాలకూ, ధర్మశాస్త్రాలకూ మూలం లాంటిది. అందులోని 'అ'కారం అశ్వం లాగా మానవాళిని మోసుకు వెళుతుంది. ఇక, 'ఉ'కారం స్థలాన్నీ, పరిస్థితినీ సూచిస్తుంది. 'మ'కారం జీవితంలోని లయకూ, శ్రావ్యతకూ సూచిక. అలా పవిత్రమైన 'అ,ఉ,మ' కారాల సమ్మేళనంగా 'ఓమ్' అవతరించింది.

'అ'కారాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు గొంతు లోపలి భాగం నుంచి స్వరం వస్తుంది. ఇక, 'ఉ'కారం ఉచ్చరిస్తున్నప్పుడు పెదవులు రెండూ దగ్గరకు వస్తాయి. పెదవులు మూసుకున్నప్పుడు 'మ్' అనే ఉచ్చారణ వస్తుంది.

నిజానికి, ఓంకారంలోని ఈ మూడు అక్షరాలూ 'జాగ్రత్, స్వప్న, సుషుప్తి' అనే మూడు అవస్థలకూ ప్రతీకలు. అలాగే, త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, శివులకూ; మూడు వేదాలైన ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలకూ అవి సంకేతాలు. ప్రపంచానికి ఆధారభూతులు సృష్టికర్త (అ = బ్రహ్మ), స్థితికారకుడు (ఉ = విష్ణువు), లయకర్త (మ్ = శివుడు) మాత్రమే అని ఓంకారం చెబుతుంది.

అంతేకాక, ముల్లోకాలైన భూలోక, భువర్లోక, సువర్లోకాలకు 'భూః', 'భువః', 'సువః' ప్రతీకలని చెబుతారు. ఇవన్నీ భగవంతుడే! వీటికి అతీతమైనదీ భగవంతుడే!! రెండు ఓంకార ఉచ్చారణల మధ్యనున్న నిశ్శబ్దం - రూపరహితుడూ, గుణ రహితుడూ అయిన బ్రహ్మ స్వరూపమే! భగవంతుణ్ణి స్తుతించే శబ్దం కావడంతో, ఓంకారాన్ని 'ప్రణవం' అని పేర్కొంటారు.

**శాస్త్రాలు ఏమంటున్నాయి? :** ఓంకారమనేది జీవితంలోని శ్రావ్యతకు ప్రతీక. అది బ్రహ్మకు శబ్దస్వరూపం. ఒక్కమాటలో చెప్పాలంటే, అది అపూర్వమైన శక్తికి నిదర్శనం. అందుకే, జీవితంలోని ప్రతి శుభకార్యానికీ ముందుగా 'ఓం'కార ఉచ్చారణ అత్యవసరం. ఓంకారాన్ని అటు ఆధ్యాత్మికమైనది గానూ, ఇటు శక్తిమంతమైనది గానూ భావించడం వల్ల అందరూ దానికి ఎంతో ప్రాధాన్యమిస్తారు.

మన ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలన్నిటిలో 'ఓం'కారానికి అమితమైన ప్రాధాన్యం ఇచ్చారు. 'కఠోపనిషత్తు' (2/15)లో నచికేతుడితో, యమధర్మరాజు ఇలా చెప్పాడు:

***సర్వే వేదా యత్ పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్ వదన్తి ।***
***యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదమ్ సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్॥***

'నచికేతా! వేదాలలో ఎన్నో ప్రశంసలు పొంది, భక్తులు ఎంతో ప్రేమగా పదే పదే ఉచ్చరించే ఓ శబ్దం యొక్క శక్తిని నేను నీకు చెబుతాను. ఆ శబ్దం సమస్త వేదాల సారాంశం. భక్తజనుల వాక్కు. తపస్సుల అనుభూతి. అది ఏమిటంటే - 'ఓమ్'. ఒక్క 'ఓం'కారం.'

అదే 'కఠోపనిషత్తు' 'ఓం'కారం ఈ సృష్టికర్త అయిన బ్రహ్మకు ప్రాతినిధ్యం వహిస్తుందని పేర్కొంది. బ్రహ్మ కన్నా ముందే ఓంకారం ఉద్భవించింది. 'ఓం'కారం యొక్క అంతరార్థాన్ని గ్రహించిన వ్యక్తి తాను కోరుకున్నదల్లా సాధిస్తాడు. అది అన్నిటికీ పునాది, అందరికీ ఆఖరి లక్ష్యం. ఈ 'ఓం'కార తత్త్వాన్నీ, విశిష్టతనూ తెలుసుకున్న భక్తులు బ్రహ్మలోకం పొందుతారు.

ఇక, 'మాండూక్య ఉపనిషత్తు'లోని ఆగమ ప్రకరణంలో 25వ శ్లోకం ఇలా సలహా ఇస్తోంది:

***యుంజీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।***
***ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥***

'మనస్సును 'ఓం'కారం మీద ఏకాగ్రపరచాలి. ప్రణవమనేది భయరహితమైన విముక్త స్థితి. అలాంటి ఓంకారాన్ని ఏకాగ్రచిత్తులై ధ్యానించేవారికి ఎక్కడా, దేని గురించీ భయం ఉండదు.'❖

(వచ్చే సంచికలో 'ఓంకార మాహాత్మ్యం')

# త్యాగచరిత ఊర్మిళాదేవి

- బ్రహ్మానంద దాసు



అవతారపురుషుడైన శ్రీరామచంద్రుడి గుణవిశేషణాలకు ప్రభావితులై ఆయన సోదరుల నుంచి సకల పరివార జనం ఆదర్శమూర్తులుగా అలరారి తరించారు. అలా త్యాగనిరతిలో సీతమ్మవారికి సాటిగా లక్ష్మణుడి అర్ధాంగి ఊర్మిళాదేవి ఉదాత్త వ్యక్తిత్వాన్ని చాటుకుంది. సీతాదేవి ప్రాభవం మాటున మరుగున పడినట్లు కనిపించినా, ఆమె ఔన్నత్యం ఎన్నటికీ మరువరానిది! అందుకే గోస్వామి తులసీ దాస్ తన 'రామచరిత మానస్'లో 'ఓ ఊర్మిళాదేవీ! నాకు నీ ఔదార్యాన్ని వర్ణించే శక్తి లేదు. నీకు వందనం మాత్రమే చేయగలను' అంటాడు.

సీతారాముల పట్టాభిషేకం అన్న శుభవార్తకు ముందుగా స్పందించి, సంతోషపడిన వ్యక్తి ఊర్మిళాదేవి. అదే ఆనందంతో ఆ వైభవాన్ని ఊహించుకుంటూ అంతఃపురంలో ఒక కల్పనా చిత్రాన్ని గీస్తూ ఉంటుంది. ఆ సమయంలో భర్త లక్ష్మణుడు హడావిడిగా, ఆందోళనగా ఆమె మందిరంలోకి అడుగు పెడతాడు. ఒక్కసారిగా ఉలిక్కిపడుతుంది ఊర్మిళ. ఆ తొట్రుపాటుకు రంగులన్నీ తొణికి, చిత్తరువు చెడిపోతుంది. 'కైకమ్మ వలన అన్న పట్టాభిషేకమే భంగమైంది. ఇక ఈ చిత్రానిదేముంది!' అంటూ కుమిలిపోతాడు లక్ష్మణుడు.

'పధ్నాలుగు సంవత్సరాలు అన్నావదినల సేవకై నేనూ అడవులకు వెళుతున్నాను' అంటాడు ఆ సౌమిత్రి. కళ్ళనీళ్ళతో అలా ఉండిపోయింది ఆ అర్ధాంగి! భర్త రమ్మన లేదు; తనూ సీతమ్మవారిలా వెంటవస్తానని పట్టుబట్టలేదు. పైగా 'మీ అన్నావదినల సేవలో తరించండి; కానీ నా ప్రార్థన ఒక్కటే! మీరు వనవాస కాలంలో నా గురించి ఒక్క క్షణం ఆలోచించినా మనస్సు చలించిపోతుంది. మీ సేవకు ఆటంకం కలుగు తుంది. నా చింత వీడండి' అంటుంది.

అందుకే సీతారామ లక్ష్మణులకు వీడ్కోలు పలికేందుకు కూడా ఆమె అంతఃపురం విడచి బయటకు రాలేదు. భర్తతో అరణ్యవాసమైనా అయోధ్యలా భావించి చరించిన చరిత జానకీమాతదైతే, భర్త చేసిన త్యాగానికి ప్రతిఫలంగా అయోధ్యలో కూడా అరణ్యవాసంగా తన జీవనాన్ని సాగించిన ధన్యవనిత ఊర్మిళాదేవి.

మరో సందర్భంలో కూడా ఆ మహాసాధ్వి పాతివ్రత్య ధర్మం గుండెల్ని కదలించివేస్తుంది. రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లిన వేళ మారుతి సంజీవని కోసం ఏకంగా పర్వతాన్నే చేపట్టి అయోధ్య మీదుగా వెళుతూ ఉంటాడు. తన దివ్యశక్తితో విషయమేంటో తెలుసుకోవాలని భరతుడు హనుమంతుడితో సహా పర్వతాన్ని కిందకు దించుతాడు. కౌసల్య సహా అందరూ లక్ష్మణుడి దుఃస్థితికి విషాదంలో మునిగిపోతారు. కానీ సతి ఊర్మిళ మాత్రం తన స్వామికి ఏమీ కాదన్న విశ్వాసంతో నిశ్చలంగా ఉంటుంది. అప్పుడు ఆంజనేయుడు ఆశ్చర్యంగా, 'అమ్మా ఊర్మిళాదేవీ! నీవు అంత నిబ్బరంగా ఎలా ఉండగలుగుతున్నావు? నేను సూర్యోదయానికల్లా వెళ్ళకపోతే లక్ష్మణస్వామి మనకు దక్కడు' అంటాడు. అప్పుడు ఆ నారీశిరోమణి, 'అయ్యో! మీరంతా వట్టి అమాయకులు! నా భర్త అణువణువునా ఆ రామచంద్రుడి నామమే మమేకమైంది. అంతటి ఆ సోదరుణ్ణి ఆయన రక్షించుకోకుండా ఉంటాడా? ఆ శ్రీరామచంద్రుడు మూర్ఛ పేరుతో నా పతిదేవుడికి కాస్త విశ్రాంతిని ప్రసాదించాడు. అంతే! అయినా, నా మంగళసూత్రంపై ఆన! నీవు లంకకు చేరి నీ పని పూర్తి అయ్యేంత వరకు సూర్యోదయం కాదు' అంటూ తన మంగళసూత్రంపై చేతులు ఆనిస్తుంది. ఆమె ధైర్య, స్థైర్యాలకు అనిలుడు అచ్చెరువొందుతాడు.

ఊర్మిళాదేవి తపోమయ త్యాగమయ జీవనాన్నీ, వినయ విశ్వాసాలనూ వర్ణించాలంటే కవుల కలాలు ఆమె పావన జీవనజలధిలో కరిగి జారిపోతాయేమో అనిపిస్తుంది. వనవాసం అనంతరం, పధ్నాలుగేళ్ళ తరువాత సీతారామ సమేతుడై తన భర్త అయోధ్యలో అడుగుపెట్టిన క్షణంలో కూడా ఎలాంటి ఉద్వేగానికీ లోనుకాని స్థితప్రజ్ఞురాలు ఆమె! భర్త కనిపించగానే పాదాలకు ప్రణమిల్లింది. అంతే! ఏళ్ళ తరబడి శిలలా పడి ఉన్న అహల్య కన్నా, జీవమున్నా శిలలా కాలం గడిపిన ఊర్మిళ ధన్యురాలు. అందుకే 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు ఇలా అంటారు:

**పైట చెరంగుతో పుడమిపై బడకుండగ నద్దుకొమ్ము నీ**
**కాటుక కన్నుతామర్లు కాలువలై ప్రవహించు వేడి క**
**న్నీటి కణాలు క్రిందపడనీయకు! ముత్తమ సాధ్వివైన నీ**
**బోటి వధూటి భాష్పములు భూమి భరింపగలేదు సోదరీ!**

ఊర్మిళాదేవి నిశ్చలమైన మనస్సుకూ, అకుంఠిత పాతివ్రత్య ధర్మానికీ యావత్ లోకం కలకాలం నివాళులర్పిస్తూనే ఉంటుంది. స్త్రీ జాతికి ఆమె ప్రాతఃస్మరణీయురాలు. ❖

**ఓ ఊర్మిళాదేవీ! నీ త్యాగమయ జీవితం అనన్య సామాన్యం, నీ ఔదార్యం మహోన్నతం. నీ సద్గుణా లను వర్ణించే శక్తి నాకు లేదు. నీకు వందనం చేయడంకన్నా నేనేమీ చేయలేను.** - *సంత్ తులసీదాస్*

# పరుషవచనాల ఫలితం

– స్వామి వాసుదేవానంద

**1914**వ సంవత్సరం ఆషాఢమాసంలో, బేలూరు మఠానికి ఒక రామాయత సాధువు వచ్చారు. ఇప్పుడు స్వామి బ్రహ్మానందజీ మందిరం ఉన్న చోట, అప్పట్లో ధుని వెలిగించడానికి ఒక చిన్న గది ఉండేది. ఆ గదిలోనే సాధువు ఉండేవారు. ఆ సాధువు అప్పుడప్పుడు చిమటతో తాళం వేస్తూ 'సీతారామ్... సీతారామ్' అని పాడేవారు.

ఒక రోజు ఆ సాధువు గంగ ఒడ్డున బల్ల మీద కూర్చొని 'హంసగీత' చదువుతున్నారు. కొంతమంది భక్తులు నావలో దక్షిణేశ్వరం వెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు. బాబూరామ్ (స్వామి ప్రేమానంద)మహరాజ్, ఆ సాధువును కూడా వెంటతీసుకొని వెళదామన్నారు. నావలో అందరం కూర్చొన్నాం. "బాబాజీ! ఆ



పుస్తకంలో ఏమి వ్రాసి ఉందో మాకు చెప్పండి" అని బాబూరామ్ మహరాజ్ అడిగారు. అప్పుడు ఆ సాధువు "బ్రహ్మ హంసరూపంలో వచ్చి, సాధుగణాలకు ఇలా ఉపదేశం ఇచ్చారు – ఎవ్వరినీ కటువుగా తూలనాడకండి. నీచుల దానం స్వీకరించడం మంచిది కాదు. సన్న్యాసులు ఎన్నడూ ఉద్వేగకరంగా మాట్లాడకూడదు. వాగ్బాణాలు మనుష్యులను అహోరాత్రులు దహించివేస్తాయి. కనుక అన్యుల మనస్సును సన్న్యాసులు నొప్పించకూడదు" అని చెప్పారు.

ఆ సాధువు చెప్పిన మాటలు విన్న తరువాత బాబూరామ్ మహరాజ్ "ఎవ్వరితోనూ పరుషంగా మాట్లాడవద్దు. ఒక పురుగును సైతం నిందించకండి. చెడ్డవారు చేసిన దానం స్వీకరిస్తే వారి చెడును కూడా స్వీకరించినట్లే" అని శ్రీరామకృష్ణులు అనేవారు.

ఇతరులతో పరుషంగా మాట్లాడడం వల్ల కలిగే అనర్థాన్ని వివరిస్తూ బాబూరామ్ మహరాజ్ ఒక కథ చెప్పారు:

శ్రీరామచంద్రుని పట్టాభిషేక సమయం అది. హనుమంతుడు సామాను కొట్టును నిర్వహిస్తున్నాడు. ఎవరైనా సరకుల కోసం వస్తే కోపగించి తిట్టేవాడు. ఒక సమయంలో లక్ష్మణస్వామి వచ్చి, 'ఫలానా దీవిలో ఒక తపస్వి ఉన్నాడు. వెళ్ళి ఆయనను ఆహ్వానించు' అన్నాడు. హనుమంతుడు వెళ్ళి చూడగా పంది ముఖంతో, బంగారు కాంతులీనే శరీరంతో ఒకరు ధ్యానం చేస్తూ కనిపించారు. ఆయన దగ్గరకు వెళ్ళి 'మిమ్మల్ని నా భుజాలపై కూర్చోబెట్టుకుని తీసుకువెళ్ళి మీకు రామదర్శనం కలిగిస్తాను' అన్నాడు. మారుతి మాటలు విన్న అతడు ఆనంద పులకితుడై కొన్ని తామరపూలను తెచ్చి ఇచ్చి, 'నా పాదాలు మీ శరీరాన్ని తాకడం తగదు. కాబట్టి ఈ పువ్వులు రాములవారికి సమర్పించండి. నేను ఆ తరువాత వస్తాను' అన్నాడు. 'నేను సహకరించకపోతే ఇతడికి శ్రీరామ దర్శనం ఎలా కలుగుతుంద'ని తలపోశాడు మారుతి.

'ఈ జ్యోతిర్మయ శరీరానికి పంది ముఖం ఏమిటి?' అని అడిగాడు మారుతి. 'నేను పూర్వజన్మలో అనేక దానాలు చేయడం వల్ల శరీరం జ్యోతిర్మయం అయింది. కానీ దాన సమయంలో ఎందరినో తూలనాడాను. అందువల్ల నాకు ఈ సూకర ముఖం వచ్చింది' అన్నాడు. అప్పుడు 'ఓహో! నాకు గుణపాఠం చెప్పడానికే లక్ష్మణ స్వామి నన్ను ఇతని దగ్గరికి పంపార'ని గ్రహించాడు హనుమంతుడు.

మారుతి వాయువేగంతో వెళ్ళి, శ్రీరామచంద్రునికి అతడిచ్చిన పద్మాలు సమర్పించి, 'ప్రభూ! నా సహాయం లేనిదే ఎవరూ మిమ్మల్ని దర్శించుకోలేరని చెప్పారు. మరి ఈ మహాత్మునికి మీ దర్శన భాగ్యం ఎలా లభిస్తుంది?' అని సందేహాన్ని వ్యక్తపరిచాడు మారుతి.

అప్పుడు శ్రీరామచంద్రుడు, 'మారుతీ! ఆయన ఈ తామరపూవులో సూక్ష్మరూపధారి అయి వచ్చాడు. నీవే ఆతణ్ణి తీసుకొచ్చావు' అన్నాడు. అలా అనగానే తన ఎదుట యోగి ప్రత్యక్షమయ్యాడు. ఆతణ్ణి చూచి విస్మితుడయ్యాడు మారుతి.

ఈ కథ వింటున్న సాధువు, అశ్రుపూర్ణ నయనాలతో చిమట వాయిస్తూ 'సీతారామ్, సీతారామ్' అని పాడనారంభించాడు. అలా సీతారామ స్మరణతో సాగిన మా నావ ప్రయాణం ఎంతసేపు సాగిందో, దక్షిణేశ్వరం ఎప్పుడు చేరుకున్నామో మాకు తెలియలేదు. ❖

అనువాదం : డాక్టర్ కమల జయరావు




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

# రామకృష్ణదాసు - రామదాసు

– డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

మీరు 'రామదాసులా'? 'రామకృష్ణ దాసులా? అని స్వామి చిన్మయానందజీ (చిన్మయమిషన్ వ్యవస్థాపకులు) చమత్కారంగా అన్న మాటలు డాక్టర్ రామదాసు జీవితంలో అక్షరసత్యాలుగా నిలిచాయి. విద్యార్థి దశలో హృదయంలో ప్రవేశించిన రామకృష్ణ, వివేకానందుల భావతరంగాలలో జీవిత చరమాంకం వరకూ ఆయన తేలియాడారు.

చిత్తూరు జిల్లాలో 1913 డిసెంబర్ 24న జన్మించిన డాక్టర్ రామదాసు వృత్తిరీత్యా వైద్యునిగా గుంటూరులో స్థిరపడినా, ప్రవృత్తిగా ఆధ్యాత్మిక సేవను స్వీకరించారు. స్వాతంత్ర్యం సిద్ధించి అభివృద్ధికి బాటలు వేస్తున్న రోజులవి. పేదవారికి పెన్నిధిగా రామకృష్ణ భక్తులు నిలిచిన కాలం. డాక్టర్ రామదాసు కూడా గుంటూరు నగర పేదలకు విద్య, వైద్య సేవలందించేందుకు నడుం బిగించారు. ప్రతిరోజూ రెండు గంటల పాటు పేదలకు వైద్యసేవలను అందించేవారు.


డాక్టర్ సి. రామదాసు

ఆయన తన కార్యాచరణలో భాగంగా తోటి మిత్రులు శ్రీఅంకయ్యనాయుడు లాంటి వారిని కూడదీసి 1965లో గుంటూరులో శ్రీరామకృష్ణ సేవాసమితిని స్థాపించారు. ఈ సమితికి అనుబంధంగా రామకృష్ణ విద్యాలయం పేరుతో పాఠశాలను ఏర్పాటుచేశారు. పేదపిల్లలకు విద్యాసేవను అందిస్తూ, ఆధ్యాత్మిక సేవకు ఆలంబనగా 1971లో నగరపాలెంలో శ్రీరామకృష్ణ మందిరాన్ని నిర్మించారు.

వైద్యునిగా ఎంత తీరిక లేని పనిలో ఉన్నా శ్రీరామకృష్ణుల వారి పూజను డాక్టర్ రామదాసు ఎంతో నిష్ఠతో చేసేవారు. పరిశుభ్రతతో పాటు, పూజా ద్రవ్యాల నాణ్యత విషయం లోనూ రాజీపడే వారు కాదు. దాదాపు 35 ఏళ్ళ పాటు నిత్యపూజ, ఆరాత్రికం, విశేష ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాలు నిర్విరామంగా నిర్వహించిన డాక్టర్ రామదాసు స్ఫూర్తితోనే బాపట్ల, రెంటచింతల, చిలకలూరిపేట, మాచర్ల, కర్లపాలెం, పెద్దవడ్లపూడి తదితర చోట్ల శ్రీరామకృష్ణ సేవా సమితులు ఏర్పడ్డాయంటే అతిశయోక్తి కాదు.

"అతిథి దేవోభవ" అనే సూక్తిని ఆచరణలో పెట్టిన ధన్యజీవులు డాక్టర్ రామదాసు దంపతులు. ప్రముఖ రామకృష్ణ మఠ స్వామీజీలనూ, శారదామఠ మాతాజీలనూ ఆహ్వానించి, వారిని సేవించి, ఆధ్యాత్మిక ప్రసంగాలు ఏర్పాటు చేసేవారు. గుంటూరులోని శ్రీరామకృష్ణ సేవాసమితిని ఏనాటికైనా కోల్‌కతాలోని ప్రధాన కేంద్రమైన రామకృష్ణ మిషన్‌కు గానీ, శారదామఠానికి గానీ అనుబంధ సంస్థగా చేయాలని ఆయన నిర్విరామంగా కృషి చేశారు. ఆయన కృషి ఫలించి గుంటూరు, శ్రీరామకృష్ణ సేవాసమితి 2000 ఏప్రిల్‌లో శ్రీశారదా మఠం అనుబంధ సంస్థగా 'శారదామఠం – మిషన్'లో విలీనమైంది. రామకృష్ణ మందిరానికి వెనుక వైపున ఉన్న తమ విశాల భవనాన్ని శారదా మఠానికి సమర్పించి, ఆ మాతృదేవి గురించి నిత్యం చింతన చేసే భాగ్యాన్ని గుంటూరు పట్టణ వాసులకు కల్పించారు. ఈ విధంగా ఆంధ్రరాష్ట్రంలో ఏకైక, ప్రప్రథమ శారదామఠం ఆవిర్భవించడానికి మూలకారకులయ్యారు. అలా భగవత్ కరుణ వల్ల తన చిరకాల ఆధ్యాత్మిక ఆశయం నెరవేరిన రెండు నెలలకే, తన 77వ ఏట 2000 జూన్ 8న డాక్టర్ రామదాసు శ్రీరామకృష్ణునిలో ఐక్యమయ్యారు.

ఇప్పటికీ శ్రీశారదామఠ ప్రాంగణంలో శిలాఫలకంపై లిఖించబడిన "ఓ ప్రభూ! నీవిచ్చిన దానిని తిరిగి నీకే సమర్పిస్తున్నాను" అన్న వ్యాఖ్యలు డాక్టర్ రామదాసు ఆధ్యాత్మిక వికాసానికీ, సేవానిరతికీ తార్కాణాలు. ❖

అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

నదుల నుండి తీసుకున్న నీటిని మేఘాలు వర్షించి నదులను మరలా నింపినట్లు, సజ్జనులు జీవితంలో తాము సంపాదించిన వాటిని ఇతరుల శ్రేయస్సుకై వినియోగిస్తారు. - కాళిదాసు



# అందరికీ అవసరమైన అధ్యాత్మ విద్య

– బి. సుదర్శన్

'అధ్యాత్మ విద్య, బ్రహ్మవిద్య, వేదాంతం' అనగానే ఇదేదో ముసలితనంలో మూలన కూర్చొని "రామా! కృష్ణా!" అని స్మరించుకుంటూ, మోక్షం కోసం తపించే విషయమని చాలామంది భావిస్తారు. ఈ విధంగా జీవించడమే 'దివ్య జీవనమ'ని భావిస్తారు కూడా! కానీ భగవంతుడు మనకు ప్రసాదించిన ఈ 'జీవనమే దివ్యమ'ని ఎంతమంది గ్రహిస్తున్నారు?

నేడు మానవుడు తన జీవన పరమావధి ధనార్జనే అని భావిస్తున్నాడు. పక్కవాడితో కలిమి లేములు, హోదాలు, అధికారం, దర్పాలతో పోలిక! నేటి మానవుని సామాజిక ప్రగతికి ఇవే కొలమానాలు. ఇలాంటి వారు తమ జీవితాంతం వరకు వీటి కోసమే ప్రాకులాడుతూ, జీవిత చరమాంకంలో దైవ స్మరణతో, యజ్ఞయాగాదులతో తమ పాపప్రక్షాళన చేసుకోవాలని అనుకుంటారు. 'చర్యకు ప్రతిచర్య ప్రకృతి ధర్మమ'ని ఎరుగరు. నేడు మన సమాజంలో నైతిక విలువలు లోపించడానికి ముఖ్యకారణం 'ఆధ్యాత్మిక జ్ఞాన' రాహిత్యమే!

మన పూర్వీకులు పసితనం నుండే పిల్లలకు 'జోలపాటల' నుండి 'గీతాగానం' వరకు రకరకాల రీతుల్లో ఆధ్యాత్మిక జ్ఞానాన్ని బోధించేవారు. ఐదారు సంవత్సరాల ప్రాయంలోనే వారికి 'ఉపనయన' సంస్కారం చేసేవారు. 'ఉపనయనం' అంటే భౌతికమైన రెండు కళ్ళకు తోడు మరొక 'జ్ఞాననేత్రం' జోడించడం అని కదా అర్థం! ఇలా ఉపనయన సంస్కారం పొందిన పిల్లలు (వటువులు) గురుకుల వాసంలో గురువుగారి సాన్నిధ్యంలో అభ్యసించవలసిన విద్యలన్నీ అభ్యసించిన తరువాతనే తమ తల్లితండ్రులను చేరి, వారు నేర్చిన విద్యలతో తల్లితండ్రులను మెప్పించి, వారి అనుమతితోనే నిజ జీవితంలో అడుగిడేవారు. జీవిత సత్యాలనూ, అందులోని కష్టసుఖాలనూ, జీవితంలో ఎదురయ్యే ద్వంద్వాల రహస్యాలనూ ఎరిగి, వాటిని అనుభవించి అధిగమించడానికి కావలసిన శక్తి సామర్థ్యాలనూ, మానసికమైన నిబ్బరాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ పెంపొందించుకొని, సర్వకాల సర్వావస్థలలో సమత్వబుద్ధితో తమ జీవనయానాన్ని సునాయాసంగా గడిపేవారు. ఈ 'విశ్వవిభూతి'లో తాము కూడా అంశలమే అని గ్రహించి, కుటుంబం, సమాజం, దేశం, విశ్వం పట్ల ఏకాత్మభావం కలిగియుండేవారు. లౌకిక సంబంధాలలో కూడా ఆత్మీయతను పెంచి, సర్వజన హితకారులై జీవించేవారు.

ఈ విధంగా 'అధ్యాత్మవిద్య' అనే బలమైన పునాదిపై 'లౌకికవిద్య'లనే ఎన్ని భవంతులు నిర్మించుకొన్నా వాటిని సమాజ హితానికే మానవుడు వినియోగిస్తాడు. అలా చేస్తే, కరిగిపోతూ లోకానికి వెలుగునిచ్చే క్రొవ్వొత్తి లాగా, కాలి బూడిదవుతున్నా తన పరిసరాలను సుగంధమయం చేసే అగరుబత్తి లాగా త్యాగధనుడవుతాడు మానవుడు.

"త్యాగధనులైన కొద్దిమంది ఉన్నా చాలు. ప్రపంచపు రూపురేఖలనే మార్చివేస్తాను, తోటివారికి హితం కలిగించ గలిగితే మరుజన్మలో శునకంగానైనా జన్మించడానికి సిద్ధం" అని ఘంటాపథంగా నొక్కి వక్కాణించిన స్వామి వివేకానందుల వాక్కులు ఎంతటి మహోన్నత ప్రబోధాలు!

ఆధ్యాత్మిక జీవితమనగానే 'అన్నింటికీ దూరంగా ఉండి, ఏదీ పట్టించుకోక, దైవధ్యానంలో జీవితం గడపడమనీ, అదే మోక్షానికి మార్గమ'నీ పొరబడతారు. ఈ రకంగా జీవించే వారికీ, బండ రాయికీ తేడా ఏముంది? బండరాయి కూడా ప్రకృతిలోని ఆటుపోట్లన్నింటికీ తట్టుకొని నిశ్చలంగా ఉండి, ఎవరికీ మేలు కానీ, కీడు కానీ చేయదు కదా! అందుకే స్వామి వివేకానంద ఇలా అన్నారు: "నీ చేతులు సమాజ సేవలో ఉంచు, నీ మనస్సు కొండగుహల్లో ప్రశాంతంగా ధ్యానిస్తున్నట్లు నిశ్చలంగా ఉంచు."

ప్రకృతిలోని సాత్త్విక, రాజసిక, తామసిక లక్షణాలు – త్రిగుణాలు. వాటిని మానవుడు అర్థం చేసుకొని, తన జీవనానికి సహకరించే పరికరాలుగా సక్రమంగా విని

యోగించుకొంటే అవి మానవుణ్ణి మహోన్నతునిగా చేయగలవు. అలా కాకుండా, త్రిగుణాలకు బానిసగా బ్రతికే మానవుడిని నీచ నికృష్ట స్థాయికి దిగజార్చగలవు. ఒక నిప్పు రవ్వతో మంటలు రేపి – వేలమందికి ఆహారాన్ని వండి, వారి ఆకలి తీర్చవచ్చు. వేల మంది కొంపలు బుగ్గిపాలూ చేయవచ్చు. ఇక్కడ మంచి అయినా చెడు అయినా నిప్పురవ్వను ఉపయోగించే వాడిదే కానీ నిప్పురవ్వది కాదు కదా!

ఒక యంత్రపు చక్రం నిశ్చల స్థితిలో ఉన్నా, అత్యంత వేగంగా తిరుగుతున్నా, మనకు ఒకే విధంగా కనిపిస్తుంది. చక్రాన్ని తాకితే గాని అది తిరుగుతుందా, లేక నిశ్చలంగా ఉందా అన్నది గుర్తించలేం! అదే విధంగా నేడు సమాజంలో అనేకులు 'ఆధ్యాత్మికత' పేరుతో తమోగుణాన్ని సత్త్వగుణంగా పొరబడుతూ తమ కర్తవ్యం పట్ల, సమాజం పట్ల, తోటి మానవుల పట్ల ఉదాసీనత వహిస్తున్నారు. ఇలాంటివారు చీమలకు ఆహారంగా చక్కెర వేసి ఎంతో పుణ్యకార్యం చేస్తున్నామనుకొంటారు. కానీ ఆకలితో అలమటిస్తున్న తోటి మానవుడికి ఓ ముద్ద అన్నం పెట్టబోరు! మనిషిని మనీషిగా మార్చి, దివ్యపురుషునిగా మలిచే అధ్యాత్మ విద్యను మనం అర్థం చేసుకున్నదింతేనా? అందుకే స్వామి వివేకానంద "తమోగుణాన్ని వదిలి, రజోగుణాన్ని అవలంబించి కర్తవ్యోన్ముఖులు కండి! మీరు చేసే సత్కర్మలు క్రమేపీ మిమ్మల్ని సత్త్వగుణం వైపు తీసుకువెళతాయి. తద్వారా మీరు చేసే ఫలాపేక్ష రహిత కర్మలు, కర్మయోగంగా మారి మిమ్మల్ని దైవోన్ముఖుల్ని చేస్తాయి – ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరా న్నిబోధత!" అని మన వెన్నుతట్టి లేపారు.

ఈనాటి సమాజానికి స్వామి వివేకానందుల బోధనలు నిజమైన ఆధ్యాత్మికత అర్థాన్నీ, ఆవశ్యకతనూ తెలియజేస్తాయి. కర్తవ్యం నిర్వర్తించడానికి మనల్ని ప్రేరేపిస్తాయి. మహాత్ములెందరికో జన్మనిచ్చిన భారత భూమి పుణ్యభూమి. కాబట్టే మన దేశంపై దండెత్తి, మన సంస్కృతిని నశింపజేయడానికి ఎందరో మ్లేచ్ఛులు ప్రయత్నించినా, సజీవంగా – నిబ్బరంగా నిలువగలగడానికి కారణం మన ఆధ్యాత్మికత! అదే మన ధర్మానికి మూలం! 'ధర్మో రక్షతి రక్షితః' అనే శాస్త్రవాక్యాల్లోని సత్యమే మన దేశ సంస్కృతికి మూలం.

ఈనాడు కేవలం ధనార్జనకే ఉపకరించే విద్యావిధానం వల్ల మన నైతిక, ధార్మిక, మానవీయ విలువలు నిర్లక్ష్యం చేయబడుతున్నాయి. అవహేళనకు గురి అవుతున్నాయి. కారణం? మనవాళ్ళు మోజు పడుతున్న విదేశీ సంస్కృతి! విదేశీ సంస్కృతిలోని మంచిని మాత్రమే గ్రహించి, మన సంస్కృతిలోని గొప్ప మూలాలతో మేళవించుకొంటే అది మనకు శ్రేయోదాయకం. నీరు క్రింద పడటానికి ఏ శక్తీ అవసరం లేదు కానీ, పైకి పంపాలంటే ఎంతో శక్తి అవసరం! మానవుడు సంస్కృతీచ్యుతుడు కావడం సులభం, సుసంస్కృతుడు కావడం కష్టం! కష్టమనిపించినా అసాధ్యం కాదు. శ్రద్ధ, సహనం ఉంటే అసాధ్యమంటూ ఏదీ లేదు.

చరాచర సృష్టిలోని ప్రతి జీవీ 'ఒకే దివ్య చైతన్యశక్తి యొక్క అంశ' అని గ్రహిస్తే, మనమంతా ఒకే దేహపు వివిధ అంగాలమని తెలుసుకొంటాం! ఒకే శరీరపు అంగాలు పరస్పరం హాని కలిగించుకోవు కదా! ఈ పరమ సత్యాన్ని మనం అనుభూతమొనర్చుకొంటే స్వార్థపరత్వం, పరపీడన



పరాయణత్వం – అనే వాటికి చోటెక్కడ! కేవలం వ్యక్తిగత స్వార్థం, సంకుచితత్వం, అహంకారమనే అడ్డుగోడలే మనలను విడదీస్తున్నాయి. ఆధ్యాత్మిక జ్ఞాన వికాసంతో మనం ఈ అడ్డుగోడలను నిర్మూలిస్తే ఆత్మీయత, అనురాగాలు పెంపొంది, సమాజం స్వర్గసీమ అవుతుంది. కాబట్టి మన దైనందిన వ్యవహారాలలో, సామాజిక, రాజకీయ, ప్రభుత్వ పాలన, విద్యారంగాలలో అధ్యాత్మవిద్య, ఆధ్యాత్మిక జ్ఞానం ఆచరణయోగ్యం అయినప్పుడే మానవాళి సంక్షేమానికీ, సమైక్యతకూ మార్గాలు ఏర్పడతాయి! విశ్వశాంతికి మూలం అధ్యాత్మవిద్యే!! ❖

**విద్య వినయాన్నిస్తుంది, వినయం యోగ్యతనిస్తుంది, యోగ్యత ధనాన్నిస్తుంది, ధర్మమార్గాన్ని అనుసరించి సంపాదించిన ధనం మాత్రమే జీవితంలో శాంతిసౌఖ్యాలను ఇస్తుంది.** - హితోపదేశం

మాయాబజార్

# అందరికీ అన్నీ తెలుసు!

– స్వామి శితికంఠానంద

దేవసభ యథావిధిగా ప్రారంభమైంది. అందరి దృష్టీ నరకంలో శిక్షలు వివిధ స్థాయిలలో అనుభవించి, తాము ఏ కర్మలు చేయడం వల్ల అలాంటి శిక్షలు అనుభవించవలసి వచ్చిందో సురసభలో తెలియజేయడానికి ప్రేతపురం నుంచి తీసుకురాబడ్డ మనుజులపైన ఉంది. మొత్తం ఐదుగురు కొత్త వ్యక్తులను దేవతలందరూ అత్యంత ఆసక్తితో చూస్తున్నారు. వారిని తోడ్కొని వచ్చిన యమభృత్యుడు మాత్రం కొంచెం బెరుకు బెరుకుగా సురపతిని అవలోకిస్తూ నిలుచుని ఉన్నాడు.

**ఇంద్రుడు:** అదేమిటి? నేను దివిజులసభకు నరకం నుంచి ఒక్క మనుజుడినే తీసుకొని రమ్మంటే ఒకేసారి ఐదుగురిని తీసుకు వచ్చావు? మనం మాట్లాడుకున్నదేమిటి? మీ చిత్రగుప్తుడు చేసినదేమిటి?

**యమకింకరుడు:** ప్రభువులు క్షమించాలి! ఇక్కడ మన మధ్య జరిగిన సంభాషణను యథాతథంగా చిత్రగుప్తులవారికి తెలియజేశాం. రవాణా చార్జీలు బాగా పెరిగిన ఈ కాలంలో ప్రతి నెలా ఒకరిని ఇక్కడకు తీసుకురావడం, మళ్ళీ నరకానికి కొనిపోవడం ప్రయాసతో కూడుకున్న వ్యవహారమని భూలోకంలో ఐదు ముఖ్యమైన వృత్తులను నిర్వహించినవారిలో ఐదుగురిని మీ సన్నిధికి ఆయన పంపించారు దేవా! మీ సభలో వారితో ఇష్టాగోష్ఠి అయిన వెంటనే తెలియజేసినట్లయిన, నేను వారిని మళ్ళీ సమవర్తి సమక్షానికి కొనిపోయెదను.

**ఇంద్రుడు:** ఔరా! చిత్రగుప్తుడితో వ్యవహారమంటే మాకు ముందు నుంచే కొంచెం సందేహంగానే ఉంది. ఇక నుంచి యమ రాట్టుతో ప్రత్యక్షంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం మంచిది.

**యమకింకరుడు:** తూరుపుదొరలు నరకంలో నెలకొన్న విపత్కర పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని కొంచెం కరుణ చూపించాల్సిందిగా విన్నపం.

**ఇంద్రుడు:** విన్నపం నీదా? లేక ఆ చిత్రగుప్తుడిదా? మాకు కూడా ఆగ్రహం వస్తున్నది. నరకంలో ఉన్న మనుష్యులు స్వర్గంలోకి వచ్చేసరికి ఇక్కడ వాతావరణంలో కూడా కలి ప్రభావం కనిపిస్తున్నట్లుంది.

**యమకింకరుడు:** భృత్యుడు తనకు తానుగా మీకు విన్నవించుకునే సాహసం చేయలేడు కదా సురాధీశా! ఇది నా ద్వారా చిత్రగుప్తుల వారి విజ్ఞప్తి. కలిప్రభావం మీరూ కొంచెం భరించక తప్పదు స్వామీ! నరకంలో మేము రోజుకు పదహారు గంటలు పనిచేయాల్సి వస్తుందనీ, పాపభీతి లేకపోవడంతో భూలోకం నుండి వచ్చేవారితో యమపురి క్రిక్కిరిసి పోయిందనీ ఇదివరకే తెలియజేసుకున్నాం. తమ సాహాయ్యాన్ని అభ్యర్థిస్తూ మా ఏలికలు చేసిన మనవిని జ్ఞప్తిలో ఉంచుకోవాలని విన్నపం.

**ఇంద్రుడు:** సరి సరి! సభలో వీరందరూ భూలోకంలో వారి వారి జీవన విధానాలను వివరించిన తర్వాత, దేవలోక వాసుల సందేహాలను నివృత్తి చేసిన తర్వాత వెంటనే నరకానికి తోడ్కొని పోవాల్సి ఉంటుంది.

**యమకింకరుడు:** చిత్తం ప్రభూ!

**దేవలుడు:** *(ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ..కూర్చున్న ఐదుగురిని చూస్తూ..)* ఒకరు ఆధ్యాత్మిక గురువులు, ఇంకొకరు ధన్వంతరి వారసులు, అన్యులు ప్రజాప్రతినిధులు, తరవాతివారు నారద మహర్షి తరం, చివరివారు న్యాయదేవత ప్రతినిధులు... బాగుంది. *(ఇంద్రుడి వైపు తిరిగి...)* ప్రభూ! ఆధ్యాత్మిక గురువులు నరకానికి రావడం.. మాకు కించిత్ కూడా బోధపడకున్నది.

**ఇంద్రుడు:** అవును. సరాసరి వైకుంఠానికి వెళ్ళాల్సినవారికి నరకవాసం ఎలా సంప్రాప్తించిందో! చెప్పవయ్యా స్వామీ! పెట్టుకున్న లక్ష్యం... చేరుకున్న గమ్యం...

**గురువు:** అవును దేవా! సత్యాన్ని తెలుసుకోవాలన్న అభిలాష కన్నా గురువు అవ్వాలన్న ప్రగాఢ వాంఛ; మిగతా గురువుల కన్నా నాకు భక్తులు, అనుయాయులు ఎక్కువగా ఉండాలన్న కాంక్ష నన్ను ఈ మార్గంలో ప్రవేశింపజేశాయి. నా సంప్రదాయమే అన్నిటి కన్నా మిన్న అన్న ఛాందస భావం, భక్తుల నుంచి స్వీకరించిన కానుకలు, సమకూడిన ధనం, ఆ ధనాన్ని వెచ్చించడానికి మళ్ళీ ప్రణాళికలు, ఆ ప్రణాళికలు సరిగ్గా అమలవుతున్నాయో లేదో అన్న బెంగ, దానికి సంబంధించిన పర్యవేక్షణ; బంధువులు, సన్నిహితులు, వాళ్ళ దురాశ; అనుయాయుల మధ్య రాజకీయాలు – ఇన్నింటి గోలలో పడి భగవంతుణ్ణి విస్మరించాను. ఆయన నామం జపించడానికి కానీ, సర్వసమర్పణ భావంతో కార్యాలు నిర్వహించడం కానీ చేయలేకపోయాను. ఇంతలో జీవితం గడిచిపోయింది. కాలం గమనించలేని మహావేగంతో ముందుకు వెళ్ళిపోయింది. తెలియకుండానే మంచి కన్నా చెడుకర్మ ఎక్కువగా పేరుకుపోయింది. అంతా కలిమాయ అనుకుంటాను. నరకంలో వాలాను.

**ఇంద్రుడు:** ఆధ్యాత్మిక గురువు అవడమంటే ఆషామాషీ అనుకున్నావా? అది కత్తి మీద సాము లాంటిదన్న ఉపనిషద్వాక్యం గుర్తుకు రాలేదా? నిరంతరం జాగరూకతతో ఉండాలన్న శ్రీరామకృష్ణుల బోధ ఎప్పుడూ చెవిని పడలేదా? ఏది మాయో, మాయ ఎన్ని రకాలుగా పనిచేయటానికి అవకాశం ఉందో శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశాల నుంచి గ్రహించలేదా?

**గురువు:** ఆ అమృతబోధను గ్రహించి ఆచరించగలిగితే వైకుంఠవాసమే సమకూడేది కదా స్వామీ! ఇలా మీ సమక్షంలోకి రావడం...

**ఇంద్రుడు:** ఆ! బుద్ధికుశలత బాగానే ఉంది. దాన్ని సరియైన మార్గంలో ఉపయోగించకపోవడమే లోపం. అందరికీ అన్నీ తెలుసు! ఆచరణే ఉండదు!!

**ప్రత్యూషుడు:** *(ఆధ్యాత్మిక గురువు పక్కన ఉన్న న్యాయవాది వృత్తి నుంచి వచ్చిన వ్యక్తి వైపుతిరిగి...)* ఏ అనుచిత కార్యాలు చేయడం వల్ల మీకు నరకవాసం కలిగిందో గ్రహించగలిగారా?

**న్యాయవాది:** *(ఇంద్రుడి వైపు దృష్టిసారించి...)* శచీపతికి శతకోటి వందనాలు. భూలోకంలో మేము కోర్టుల్లో వాదిస్తున్నప్పుడు న్యాయమూర్తులు కూడా మీ లాగా కూర్చొనేవారు. ఈ దేవసభను చూస్తుంటే మళ్ళీ ఆ కోర్టు సీనులు గుర్తుకు వస్తున్నాయి. కాకపోతే ఈ ప్రశాంతత, వైభవం అక్కడ ఉండవు.

అందరూ బాధలతో ఉంటారు కాబట్టి అదొక ప్రత్యక్ష నరకంలా ఉంటుంది. అందుకని ఇప్పుడు నరకంలో యమ భటులు పెడుతున్న నరకయాతన పెద్దగా ఇబ్బంది అనిపించడం లేదు. వాళ్ళు ఎద్దేవా చేసినప్పుడల్లా 'పో పోవయ్యా! ఇంతకన్నా పెద్ద నరకాన్ని భూలోకంలోనే చూశాం' అని చెబుతున్నాం. వాళ్ళు అవాక్కయిపోతున్నారు. దేవా! ప్రస్తుతం ఎ్మేము నేర్చుకునే విద్య ఏమిటంటే - సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా




చూపించగలగడం. అందులో ఎవరు ఎంత ఎక్కువ నైపుణ్యం ప్రదర్శిస్తే, వారు అంత గొప్ప న్యాయవాది అవుతారు. వైదిక వాఙ్మయంలో పేర్కొన్న ధర్మాధర్మాలు వేరు. మేము నిర్వచించుకున్న న్యాయం వేరు.

**బృహస్పతి:** అదెలా? మీరు మర్త్యలోకంలో ధర్మదేవత ప్రత్యక్ష స్వరూపాలన్న సంగతి మీకు గుర్తుకు రాలేదా? అన్యాయాన్ని ఎదిరించి, సర్వశక్తులూ ఒడ్డి న్యాయదేవతను సదా మహా వైభవంతో నిలబెట్టడమే మీ ప్రథమ కర్తవ్యమని స్ఫురించలేదా?

**న్యాయవాది:** అంతటి ఆదర్శాన్ని స్వీకరించాలంటే మేము సర్వసంగ పరిత్యాగులుగా మారాలి!

**ఇంద్రుడు:** అది మీ అపోహ. సత్యాన్ని నమ్ముకున్న వ్యక్తి ఇహంలోనూ, పరంలోనూ పరమోత్కృష్ట స్థితిని పొందుతాడని నమ్మకం లేకపోవడం వల్ల ఇలాంటి భావాలు కలుగుతాయి. మనం చేసే కార్యాలు పరోపకారానికి ఉపయోగపడుతున్నాయా, లేక వాటి ద్వారా పరపీడన జరుగుతున్నదా అని ఆలోచించాలి కదా! ఆ మాత్రం విచక్షణ లేకుండా ఎవరైనా సుఖశాంతులు పొందగలరా?

**దేవలుడు:** మనం ఇదివరకే ఈ పేరోలగంలో చర్చించుకున్నట్లు జంబూద్వీప వాసులు వారి ఆధ్యాత్మిక వారసత్వానికి తిలోద కాలిచ్చేశారు దేవా! ఇంతకు ముందు పురుషులు మాత్రమే ఉద్యోగాలు చేసేవారు. స్త్రీలు ఇంటి పట్టునే ఉండి ధార్మిక గ్రంథాలు చదువుతూ, పిల్లలకు కూడా వాటిని బోధిస్తూ, ఉత్తమమైన వ్యక్తులుగా తీర్చిదిద్దేవారు. ప్రథమ గురువుగా తల్లి తన బాధ్యతను నెరవేర్చడానికి అవకాశం ఉండేది. ఋషిప్రోక్తమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చదవడం వల్ల వారికి అద్భుతమైన జ్ఞానం కలిగేది. భర్తల కన్నా వారికే జ్ఞానం, వివేకం, సహనం, ఓర్పు ఉండేవి. అందరూ అపర సరస్వతీ దేవీలవలే విలసిల్లేవారు. ప్రస్తుత యుగంలో పట్టణీకరణ వలన జీవనవ్యయం పెరగడం, అందరూ లౌకిక విద్యలే విద్య అనుకొని ధనసంపాదనే జీవిత ధ్యేయంగా ఎంచుకోవడం వలన ఆ ప్రథమ కర్తవ్య నిర్వహణ దుర్భరమైంది. వ్యక్తులకు మంచి చెడుల విచక్షణ లేకుండా పోయింది. జీవితం బహు సంక్లిష్టంగా పరిణమించింది.

**బృహస్పతి:** పూర్వం వసిష్ఠులవారితో సంభాషిస్తూ శ్రీరామచంద్రుడు మనిషి ఈ పరిస్థితిని వివరిస్తూ, **'తప్యతే కేవలం సాధో మతిరాకులితాంతర, రాగరోగో విలసతి విరాగో నోప గచ్ఛతి'** అంటాడు. 'బుద్ధి వ్యాకులమవడం వల్ల కేవలం దుఃఖం మాత్రమే లభిస్తోంది. ఐనా ప్రపంచాసక్తి తొలగదు. వైరాగ్య దీపం వెలగదు.'

**న్యాయవాది:** ఇప్పుడు ప్రతి మనిషీ ప్రత్యక్షంగా, కాకపోతే పరోక్షంగా ఇతరులను పీడించడం, మళ్ళీ వారిచే పీడనకు గురి కావడం! ఇదే భూలోకంలోని తంతు అంతా! యావత్ ప్రాణికోటి ఒకే భగవానుడి సంతతి అని గ్రహించి ఏ జీవికి అపకారం చేసినా, ఏ జీవిని కష్టపెట్టినా అంతే మోతాదులో తాను ఆ దుఃఖాన్ని అనుభవించాల్సి ఉంటుందని మనిషి గుర్తెరగకున్నాడు. పరోపకారం తోనే తనకు పరమ కల్యాణం అని మనిషి తెలుసుకుంటే భూలోకమే అపర వైకుంఠం అవగలదు.

**బృహస్పతి:** సత్యాన్ని పలికితివి! భేష్! 'యోగవాసిష్ఠం'లో వసిష్ఠ మహర్షి సెలవిచ్చినట్లు **'రజోగుణ హతా దృష్టిః తమః సంపరివర్ధతే, నచాధిగమ్యతే సత్త్వం తత్త్వమత్యంత దూరతః'** - రజోగుణ ప్రాబల్యం వలన మనిషి సిరిసంపదలపైనే పూర్తిగా దృష్టి పెడుతున్నాడు. ఆ తాపత్రయంలో అలసిపోతున్నాడు. తత్ఫలితంగా తమోగుణం ప్రబలుతోంది. కానీ జ్ఞానవర్ధకమైన సత్త్వగుణాన్ని పొందలేకపోతున్నాడు. అందుకని తత్త్వం అర్థం కావడం లేదు.

**ఇంద్రుడు:** మనిషి ఎంత తక్కువతో జీవించగలిగితే అంత గొప్ప అని భారతదేశం అనాదిగా నిరూపించడానికి ప్రయత్నిస్తూ వస్తోంది. ఆర్యుడు ఈ ఆదర్శాన్ని విస్మరించడం వల్ల సత్యానికి దూరమవుతున్నాడు. అందరూ త్యాగంతోనే అమృతత్వ ప్రాప్తి, భగవల్లబ్ధి చేకూరుతాయని గ్రహించెదరు గాక! ఈ నాటికి స్వస్తి! ❖

**హితకరమైన ఆహారం శరీరానికి పుష్టిని కలిగించినట్లు, మహాత్ముల ఉపదేశాలను ఆచరించడం వల్ల మనస్సు దృఢతరమవుతుంది. హృదయమాలిన్యం తొలగి పవిత్రమవుతుంది.** - *భాగవతం*

# మార్పు మనుగడ

**– స్వామి బోధమయానంద**

గరుడపక్షి జీవనగమనం విచిత్రమైన సంఘర్షణలతో, సవాళ్ళతో కూడుకొని ఉంటుంది. పక్షిజాతిలో ఈ గద్దల జీవనకాలం చాలా ఎక్కువ; దాదాపు డెబ్బై ఏళ్ళపాటు ఇవి జీవించగలవు. అయితే అన్నేళ్ళు బతకటానికి, ఆ పక్షి కొన్ని సాహసవంతమైన కార్యాలకు కూడా సిద్ధపడాల్సి ఉంటుంది. గద్దకు నలభై ఏళ్ళు వచ్చేసరికి దాని ముక్కు, గోళ్ళు, రెక్కలు, ఇతర శరీర అవయవాలన్నీ అననుకూలంగా పరిణమిస్తాయి. పదునైన కొక్కెంలా ఉండే ముక్కు మొండిగా మారిపోతుంది; గోళ్ళు పక్షులను వేటాడి, వేటాడి వంగిపోతాయి; అదే విధంగా పొడవుగా ఎదిగిన రెక్కలు భారమై, ఎగరటానికి వీలుకాకుండా మారతాయి. ఈ దశలో ఆ గరుడపక్షి ముందు రెండే రెండు



మార్గాలు ఉంటాయి; ఒకటి చనిపోవటం, రెండవది తిరిగి ఆ యా శరీరాంగాల్ని పునరుజ్జీవింప చేసుకోవటం! ఈ దశలో ఆ పక్షి దూరంగా పర్వతాలపై తాను నిర్మించుకున్న గూటిలోకి చేరిపోతుంది. దాదాపు అయిదునెలల పాటు శారీరకంగా ఎన్నో బాధలకు ఓర్చి, తనను తాను జీవన పోరాటానికి సంసిద్ధపరచుకుంటుంది. ముందు మొద్దుబారిన ముక్కు పదునుగా మారే వరకు రాళ్ళపై రాపిడి చేసుకుంటూనే ఉంటుంది; తరువాత రాపిడితో మొనదేలిన ముక్కుతో, వంగిపోయిన తన గోళ్ళను బలవంతంగా పీకేసుకుంటుంది; కొత్త గోళ్ళు వచ్చే వరకు వేచి చూస్తుంది. ఈ దశ దాటిన తరువాత కొత్తగోళ్ళతో, మొనదేలిన ముక్కుతో పాత రెక్కలను పీకేసుకుంటుంది. కొంత కాలానికి ఏర్పడిన కొత్త శరీర భాగాలతో ఉత్సాహంగా కొత్త జీవితాన్ని ప్రారంభిస్తూ ఎగిరిపోతుంది; మరో ముప్ఫై ఏళ్ళు జీవిస్తుంది.

ఆశ్చర్యకరమైన ఆ పక్షి జీవనసంఘర్షణను మనిషి కూడా ఆదర్శంగా తీసుకోవాలి. ప్రతి ఒక్కరూ తమ మనుగడలో ఇలా అనివార్యమైన కొన్ని మార్పులకు సంసిద్ధులు కావాలి. గతించిన వైఫల్యాలను, పరాజయాలను పక్కన పెట్టి కొత్త, కొత్త సవాళ్ళను ఎదుర్కోవటానికి ప్రతిక్షణం అప్రమత్తంగా ఉండాలి. విద్యార్థి దశలో కానీ, ఉద్యోగ నిర్వహణలో కానీ మనందరికీ కూడా కొన్ని సంఘర్షణలు, సాహసాలు తప్పవు. చావో, రేవో అన్న పరిస్థితిలో చావు నుంచి తప్పించుకొని రేవుకు చేరుకోవాలంటే మేధస్సుకు పదును పెట్టక తప్పదు; సాహసోపేతమైన నిర్ణయాలను తీసుకోకా తప్పదు. స్వామి వివేకానంద తన గురువరేణ్యులు భగవాన్ శ్రీరామకృష్ణుల భౌతిక నిష్క్రమణానంతరం సంస్థను స్థాపించటానికి ఎన్నో సంఘర్షణలను ఎదుర్కొన్నారు. ఆనాటి సమాజంలోని ఛాందసవాదుల ప్రతికూలతలకు ధైర్యంగా ఎదురునిలిచారు. ఈ నేపథ్యంలో ప్రాచీన భారతీయ సంప్రదాయానికీ, ఆధునిక శాస్త్రవిజ్ఞానానికీ అనుసంధానంగా అనుష్ఠానయోగ్యమైన 'శ్రీరామకృష్ణ సంఘానికి' సాహసంగా 1897 మే 1వ తేదీన శ్రీకారం చుట్టారు. ఆధ్యాత్మిక మహావృక్షానికి బీజం వేసి నిశ్చయంగా, నిబ్బరంగా తన మార్గాన్ని సుస్థిరం చేసుకున్నారు. వేదాంతాన్ని ఇంటింటికీ పరివ్యాప్తం చేశారు. ఇలా విజేతలుగా నిలవాలనుకునే ప్రతి ఒక్కరూ తమ, తమ పరిధిలో కొత్త, కొత్త పరిణామాలకు, సృజనాత్మక విధానాలకు అవకాశాలను కల్పించుకోవాలి.

మనలో చాలామంది కాలంచెల్లిన (out-dated) విధానాలను, పద్ధతులను, అలవాట్లను పట్టుకొని వేళ్ళాడుతూ ఉంటారు. జీవితమన్నది ఓ ప్రవాహంలా సాగిపోవాలంటే ఎప్పటికప్పుడు మన అంతరంగాన్ని నూతనోత్సాహంతో, భావజాలంతో నింపుకోవాలి. మన ఉనికి (identity)కి భంగం కలిగే పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొంటూ ఎప్పటికప్పుడు, కొత్త సమస్యలకు ఎదురునిలవాలి. మనకు తగ్గట్టుగా పరిస్థితులు ఉండాలని ఆకాంక్షించకూడదు; మనమే పరిస్థితులకు తగ్గట్టు మారుతూ హుందాగా ఎదగాలి. ఏ రిస్క్ తీసుకుంటే ఏం ప్రమాదమొస్తుందో అనుకునే వారు ఎప్పటికీ విజయపథాన పయనించలేరు. ఎదిగీఎదగని గొంగళిపురుగు సీతాకోకచిలుకగా ఎదిగి ఎగరాలంటే సంబంధిత పరిణామదశలోని బాధలను ఓర్చుకోవలసిందే! అలాగే మనిషి కూడా కొన్ని మానసిక ఒత్తిళ్ళకు, సవాళ్ళకు ఎదురొడ్డకుండా ప్రగతిని సాధించలేడు. సమాజంలో అట్టడుగు స్థాయి నుంచి అత్యున్నత స్థితికి చేరిన ఎవరి జీవనప్రస్థానాన్నైనా పరిశీలించి చూస్తే, వారంతా కూడా కఠినమైన దశలను అధిగమించి వచ్చినవారే! అనేక మార్పులకు అనుగుణంగా తమ మనుగడను నిర్దేశించుకున్నవారే! ❖




# ఉత్తమ వ్యాపారవేత్తనవుతా!

రామకృష్ణ మఠంలో జరిగిన ఈ 'యువసంఘర్ష్ 2011'లో రెండు అంశాలు నన్ను (ఆయుషీ అగర్వాల్) అమితంగా ఆకర్షించాయి. ఒకటి – 'స్వామి వివేకానంద', రెండు – 'నాయకత్వం'. ఈ పోటీల కోసం గ్రంథాలయానికి వెళ్ళి నేను స్వామి వివేకానంద సాహిత్యం చదవడం ప్రారంభించాను. అలా చదువుతున్న కొద్దీ శక్తిసాగరం లాంటి స్వామీజీ భావాల నుంచి బయటకు రాలేకపోయేదాన్ని. ఈ 'యువసంఘర్ష్' పోటీలను నిజానికి ఒక సవాలుగా తీసుకొని మేమందరం పాలుపంచుకున్నాం. విద్యార్థి జీవితంలో అత్యంత ఆవశ్యకమైన, మరచిపోలేని కోణాన్ని స్పృశించాం. మేమందరమూ భవిష్యత్తుకు దిశానిర్దేశాన్ని ఏర్పరచుకోగలిగాం. ఈ అనుభవం ముఖ్యంగా నన్ను 'self-centered' వ్యక్తి నుంచి 'self-confident' వ్యక్తిగా మార్చింది. ఇన్నాళ్ళూ ఏదో మొక్కుబడిగా చదువుకుంటూ వెళ్ళిపోయేవాళ్ళం. కానీ స్వామి వివేకానంద పుస్తకాలు చదివిన తరువాత, జీవితానికి అర్థమేంటో తెలిసింది. స్పష్టమైన లక్ష్యాన్ని నిర్దేశించుకునే అవకాశం కలిగింది. భారతదేశపు జ్ఞానసంపదను పోతపోసుకున్న ప్రతినిధిగా స్వామీజీ ప్రబోధించిన ప్రతి మాటా మనలో ఆత్మవిశ్వాసం రగిలిస్తుందనడంలో సందేహం లేదు. ముఖ్యంగా...

1. Stand up, be bold, and be strong. Take the whole responsibility on your shoulders.
2. You are the creator of your own destiny.
3. Strength is life, weakness is death.
4. Take up one idea. Make that idea your life, think of it, dream of it, and live on that idea. Let the brain, muscles, nerves, every part of your body be full of that idea...

అన్న స్వామీజీ పలుకులు నన్ను ఎంతో ప్రభావితం చేశాయి. ధైర్యంగా నిలబడుతూ, మన బాధ్యతను పూర్తిగా మనమే స్వీకరించాలనీ, మన భవిష్యత్తుకు మనమే సృష్టి కర్తలమనీ, బలహీనతలే మన పతనానికి కారణమనీ, ఎంచుకున్న లక్ష్యం కోసం మన శారీరక, మానసిక శక్తుల నన్నింటినీ పణంగా పెట్టాలనీ ఆ మహనీయుడి మాటల ద్వారా తెలుసుకున్నాను. నిజమైన నాయకుడు ఎలా మసలుకోవాలో, ఆయన జీవితం చదివి అర్థం చేసుకున్నాను.

### మాటల కన్నా చేతలు ముఖ్యం...

స్వామీజీని ఆదర్శంగా తీసుకొని ఓ ప్రణాళికను రచించు కోవాలనుకోగానే నాకు మాటల కన్నా చేతలే శక్తిమంతంగా సమాజాన్ని ప్రభావితం చేస్తాయనిపించింది. అందుకే వ్యాపారవేత్తనై ఎంతో మందికి ఉపాధి కల్పించాలన్న ఆ ఆశయాన్ని, స్వామి వివేకానంద స్ఫూర్తితో మరింత బలవత్తరం చేసుకున్నాను. అయితే ప్రణాళికాబద్ధంగా, విలువలతో కూడిన వ్యాపారవేత్తగా ఎదగాలన్నదే నా ధ్యేయం! మన దగ్గర సంపద ఉన్నప్పుడే, నలుగురికీ నిరాటంకంగా, ఉదారంగా సేవచేయగలమన్నదే నా భావన! అందుకే ముందు మంచి విశ్వవిద్యాలయం నుంచి ఎం.బి.ఎ. పూర్తి చేసుకొని, అయిదారేళ్ళపాటు ఏదైనా సంస్థలో ఉద్యోగం చేయాలనుకుంటున్నాను. ఆ అనుభవంతో ఓ సొంత వ్యాపారం ప్రారంభించి ఉత్తమ మహిళా వ్యాపారవేత్తగా ఎదగాలని ఆకాంక్షిస్తూ ఉన్నాను. స్వామీజీ మహిళలకు కల్పించిన ఉన్నతమైన గౌరవాన్ని నిలబెట్టే ప్రయత్నం చేస్తాను. మరోవైపు నా సామర్థ్యానికి మించకుండా సేవా కార్యక్రమాల్లో పాల్గొనా లనుకుంటున్నాను. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో విద్యాభి వృద్ధికీ, వైద్యసదుపాయాలకూ, రైతులకు సాంకేతిక పరికరాల సరఫరా, అక్కడి విద్యార్థులకు ఇంగ్లీషు, కమ్యూనికేషన్ తదితర అంశాల్లో సలహాలు ఇవ్వడం లాంటి విషయాల్లో నా వంతు సేవలు అందించాలనుకుంటున్నాను. ఈ అయిదు, పదేళ్ళలో పరిపూర్ణమైన వ్యక్తిగా నేను స్థిరపడేందుకు కృషిచేస్తూ, ప్రాథమికంగా రామకృష్ణ మిషన్ సేవాకార్యక్రమాల్లో కార్యకర్తగా చురుగ్గా భాగస్వామిని కాదలచుకున్నాను. నాతో పాటు నా కుటుంబసభ్యులు, మిత్రులు, బంధువుల్లో కూడా ఇలాంటి దృక్పథం పెరిగేలా కృషి చేయాలని భావిస్తున్నాను. స్వామి వివేకానంద భావధారను నలుగురికీ పంచుతూ, ఆయన ఆశీస్సులతో చివరకు 'సంఘర్ష్' పేరిట ఒక స్వచ్ఛంద సంస్థను ప్రారంభించాలని ఆశిస్తూ ఉన్నాను. ❖

**ఆయుషీ అగర్వాల్, 12వ తరగతి**
('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుది పోటీ (ఫైనల్స్)కి అర్హత సాధించిన చిన్మయ విద్యాలయం (హైదరాబాదు) విద్యార్థిని.

**మనిషి ఆశావాది అయితే, తన జీవితకాలంలో ఎన్నో కలలను పండించుకుని, మరెన్నో ఆలోచనలకి, ఆశయాలకి ప్రాణం పోసి అద్భుత విజయాలను సాధించగలుగుతాడు.** - యజుర్వేదం

# మాటమీద నిలబడదాం!

– బి. సైదులు



అసురసంధ్య వేళ... అడవిలో ఆహారం లేక ఆకలితో నకనకలాడుతున్న ఓ పులి ఒంటరిగా పచార్లు చేస్తూ ఉంది. ఇంతలో ఆ వ్యాఘ్రానికి దూరంగా ఓ ఆవు వస్తున్న అలికిడి వినిపించింది. తనను చూసి, ఎక్కడ తప్పించుకుంటుందోనని చెట్ల చాటున మాటువేసి, దగ్గరకు రాగానే ఒక్కసారిగా దాని ముందుకు దూకిందా పులి. అనూహ్యంగా మృత్యువు రూపంలో ముందు నిలిచిన ఆ శార్దూలాన్ని చూసి, పాపం! ఆవు నవనాడులూ కుంగిపోయాయి. ఇంతలో పులి పంజాను విసరటానికి సిద్ధపడుతుండగా, మరణం ఎలాగూ తప్పదని తెలిసినా దీనంగా ఆ సాధుజీవి కన్నీళ్ళతో నోరు విప్పింది. 'పులిరాజా! ఒక్కక్షణం నా మాట విను! నీకు నన్ను తినే హక్కుంది. కానీ నా కోసం ఇంట్లో వేచి చూస్తున్న బిడ్డ ఉంది. అది పుట్టి కొన్ని రోజులే అయింది; తనంత తాను బయటకు వెళ్ళి గడ్డికూడా తినలేదు. నేను వెళ్ళి పాలు ఇచ్చేవరకు ఆకలితో అల్లాడిపోతుంది. నేను కాసిన్ని పాలిచ్చి, తగిన జాగ్రత్తలు చెప్పి వచ్చి, నీకు ఆహారమవుతాను' అంటుంది. ఆవు దీనావస్థ ఓ వైపు; ఆకలి మరోవైపు! అయినా ఎందుకో, ఆ పులికి ఆవుపై జాలి కలిగి, సరే వెళ్ళి రమ్మంది. పరుగుపరుగున వెళ్ళి ఆ ధేనువు, పసికూన అయిన తన దూడను దగ్గరకు తీసుకొని కన్నీళ్ళు పెట్టుకుంది. పొదువుతో కడుపారా పాలుతాగించి, 'అమ్మా! ఇక నుంచి నీకు నేనుండను. నీ ఆహారాన్ని నీవే సమకూర్చుకోవాలి. క్రూర జంతువుల నుంచి జాగ్రత్తగా ఉండాలి. చివరిసారిగా కడుపారా పాలుతాగు. త్వరగా వెళ్ళాలి. అక్కడ ఆ వ్యాఘ్రం నా కోసం ఆకలితో ఎదురుచూస్తుంది' అంటూ బాధతో బిడ్డ నుంచి వీడ్కోలు తీసుకొని, తిరిగి అడవికి వేగంగా వచ్చేసింది. ఆశలు వదులుకొని, అలా కూర్చున్న పులికి, ఆత్రంగా పరుగెత్తుకుంటూ వస్తున్న ఆవు కనిపిస్తుంది. హడావిడిగా వచ్చిన ఆ ధేనువు 'పులిరాజా! క్షమించు. ఒంటరైన నా బిడ్డను ఒప్పించి, ఓదార్చి వచ్చే సరికి ఆలస్యమైంది' అంటుంది. క్రూరజంతువైన ఆ పులికి మనస్సు కరిగిపోయింది; కన్నీళ్ళు ధారలై కురిపిస్తూ 'మాట కోసం ప్రాణాలైనా ఇవ్వటానికి సిద్ధమైన నిన్ను సంహరిస్తే, అంతకు మించిన పాపం లేదు! వెళ్ళు, ఆకలైనా భరిస్తాను, కానీ నిన్ను తిని ఆ పాపాన్ని భరించలేను' అంటూ సాదరంగా సాగనంపుతుంది. ఇచ్చిన మాటను నిలబెట్టుకోవాలన్న నైతిక సూత్రానికి సంబంధించి ఎప్పుడో చిన్నప్పుడు చదువుకున్న ఈ కథకు మించిన ఉదంతం మరోటి లేదనిపిస్తుంది. మూగప్రాణులే మాటకోసం అంత ఉదాత్తంగా వ్యవహరిస్తూ ఉంటే మనుషులమైన మనం ఎన్నిసార్లు మాటతప్పుతున్నామో ఆలోచిస్తే తలదించుకోవాలనిపిస్తోంది. పైగా చట్టాలపై, దస్త్రాలపై ఉన్న నమ్మకం,మనిషిమాటపై లేకపోవటం శోచనీయమనిపిస్తోంది.

**సత్యసంధతే శోభ... :** ఈనాడు ప్రతీ వ్యవహారంలో సత్యసంధత(truthfulness) విలువను మనం గుర్తించటం లేదు. అందుకే ప్రేమ, స్నేహం, ఉద్యోగం, వ్యాపారం, రాజకీయం... ఇలా ఎక్కడ చూసినా మాటలు మార్చేసే ధోరణే కనిపిస్తోంది. ఫలితంగా మానవసంబంధాల్లో విశ్వసనీయత కనుమరుగవు తోంది. ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండాలన్న కనీసధర్మాన్ని మనం చాలా సందర్భాల్లో మరచిపోతూ ఉన్నాం. క్షణక్షణానికీ మాటల్ని మార్చేస్తున్నాం. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస 'కలియుగంలో సత్యవచనానికి మించిన తపస్సు లేదు' అనేవారు. చెప్పిన సమయానికి శిష్యులు రాకపోయినా, ఇచ్చిన మాటను నిలబెట్టుకోకపోయినా వారు నిర్మొహమాటంగా ఎత్తిచూపెట్టే వారు. దేన్నైనా క్షమిస్తాను, కానీ మాటను నిలబెట్టుకోకపోవటాన్ని ఉపేక్షించననేవారు. మన వ్యక్తిత్వానికి శోభనిచ్చేది ఈ సత్య సంధతే! కానీ ఏ ఒక్క సందర్భంలో కూడా సత్యవచనానికి ఉన్న ప్రాధాన్యాన్ని గుర్తించటం లేదు. అందుకే మంచినీళ్ళు తాగినంత సులువుగా, ఇచ్చిన మాటను ఉల్లంఘిస్తూ ఉన్నారు. జీవితాన్ని విజయపథంలో పయనింపచేసుకున్నవారంతా, తాము ఇచ్చిన మాటకు నూటికినూరు పాళ్ళు కట్టుబడి ఉండిన వారే!

**మాట మార్చితే మరక...:** శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలకుడిగా అడవులకు వెళతానని అంగీకరించిన సందర్భంలో రాజ్యంలోని పండితులు, మేధావులే కాదు చివరకు తమ్ముళ్ళు కూడా వద్దని వారించారు; మాట తప్పించుకోవటానికి ధార్మిక మార్గాలను కూడా చూపించారు. కానీ 'వేసిన నా

బాణమెలాగైతే వెనక్కిరాదో, నా మాట కూడా తిరోగమించదు' అంటాడు సత్యవాది సీతారాముడు. అందుకే రఘురాముడు ఎన్నడూ రెండు రకాలుగా మాట్లాడడని 'రామో ద్విర్నాభిభాషతే' అంటాడు వాల్మీకి. కానీ నేడు సమాజంలో రెండు నాల్కల ధోరణి సమర్థమైన జీవనదక్షతగా భావించుకునేవారు ఎక్కువయ్యారు. తమకు అనుకూలంగా మాటల్ని మార్చుకునే చౌకబారు తెలివితేటలకు అలవాటు పడిపోయారు. కానీ అప్పటికి ఏదో పబ్బం గడిచినట్లు అనిపించినా, దీర్ఘకాలంలో ఈ ప్రవర్తన మన వ్యక్తిత్వానికి మరకగా మిగిలిపోతుంది. మన మాటకు ఎవరు సాక్ష్యం ఉన్నా, లేకపోయినా మన అంతరాత్మ ప్రత్యక్షసాక్షిగా ఉంటుందన్న విషయాన్ని మరచిపోకూడదు. ఎవరిని ఏమార్చి, మోసం చేసినా అంతరాత్మను మాత్రం మోసగించలేమని తెలుసుకోవాలి. మన పెద్దలు మనలా పెద్దపెద్ద చదువులు చదువుకోకపోయినా, ఆడంబరంగా జీవించకపోయినా ఎంతో నిజాయతీగా వ్యవహరించేవారు. ఇప్పటిలా ప్రతి చిన్న విషయానికి స్టాంపు పేపర్లపై ఒప్పందాలు కుదుర్చుకునే పద్ధతులు ఆ రోజుల్లో లేవు! కోట్ల రూపాయల లావాదేవీలు కూడా నోటిమాట మీదే నడిచిపోయేవి! మరి నేడు నాగరికులమని చెప్పుకుంటున్న మనం, మన ఇల్లు మనం అద్దెకిచ్చుకుంటూ కూడా స్టాంపుపేపర్లపై ఒప్పందాలు చేసుకుంటున్నాం; కాపురాలు కలహాలు లేకుండా ఉండటానికి పెళ్ళిమంత్రాల కన్నా, పెళ్ళి అయినట్టు రాసుకుంటున్న పత్రాలపై నమ్మకాన్ని పెంచుకుంటున్నాం? ఇలా ఈ రోజుల్లో ఆరడుగుల మనిషి మాట కన్నా, అర్ధరూపాయి స్టాంపుపేపరుకు విలువ ఉందంటే, ఎంత సిగ్గుచేటు! ఎంత దౌర్భాగ్యం!

**విశ్వసనీయతే విజయం...:** ప్రస్తుతం మనలో ఒకరిపై ఒకరికి విశ్వాసం లేకపోవటానికి కారణం ఎవరికి వారు స్ఫటికంలా పారదర్శకంగా (transparency) ఉండకపోవటమే. వ్యక్తి మాటకు శక్తిని ప్రసాదించేది అతని మానసిక స్వభావమే! మనిషి ఎంత స్వచ్ఛంగా, నిశ్చలంగా ఉంటే అతని మాట కూడా అంతే శక్తిమంతంగా ఉంటుంది. కానీ మనం నానాటికీ ఎదుటివారి యందు విశ్వసనీయత (faithfulness)ను కోల్పోతూ ఉన్నాం. అందుకే వ్యవహారాల విషయంలోనే కాదు, అనుబంధాల మధ్య, ఆత్మీయతల మధ్య కూడా అపనమ్మకాలు పెరిగిపోతున్నాయి. మహాభారతంలో యోధానుయోధుడైన భీష్మాచార్యులు కుటుంబ అనుబంధాల వ్యవహారంలో ఒకే ఒక్క మాట కోసం, యావజ్జీవితం అవివాహితుడిగా ఉండిపోయాడు; ఆ ప్రతిజ్ఞ వల్లనే ఆయన సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్ముడికి సమంగా ఆరాధనలందుకున్నాడు. సత్యసంధత ప్రాముఖ్యాన్ని ధర్మరాజాదులకు గుర్తుచేస్తూ ఆ త్యాగమూర్తి శాంతిపర్వంలో 'ధర్మాలన్నింటిలోకీ సత్యమే మూలకందం; యోగక్షేమాలన్నీ ఈ సత్యవ్రతం వల్లనే మిక్కిలి సులభసాధ్యమవుతాయి. అసత్యం, మాట తప్పటం కన్నా మహాపాపం మరోటి లేదు. వేయి అశ్వమేధయాగాలైనా ఒక్క సత్యవచనంతో తులతూగజాలవు' అంటాడు. అలా నడచుకోవటం మొదట్లో కొంత కష్టతరంగానే అనిపిస్తుంది; కాని అలవాటుగా చేసుకుంటే పరిస్థితులు కూడా మన తత్త్వానికి అనుకూలంగా మారిపోతాయి.



ఎదుటివారిపై ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకొని మానవసంబంధాలను కొనసాగించే విషయాల్లో కూడా మనం తరచూ విఫలమవుతూ ఉన్నాం. అభినందనలతో ముంచెత్తేదీ మనమే, ఆనక తేడాలొస్తే ముందుమాటలన్నీ మరచిపోయి ఆరోపించేదీ మనమే! ఇలా మన అవసరాన్నో, అనుభవాన్నో ఆధారం చేసుకొని ఎదుటివారి వ్యక్తిత్వాన్ని విశ్లేషించకూడదు. మనకు నచ్చితే ఒకలా మాట్లాడి, నచ్చకపోతే మరోలా మాట్లాడితే చివరకు అభాసుపాలయ్యేది మనమే!

ఓ వైపు అక్షరాలు రాసుకుంటూ పోతూ, మరోవైపు రబ్బరుతో చెరిపేసుకుంటూ పోతే ఎంత అమాయకంగా ఉంటుందో; క్షణక్షణానికి మన అభిప్రాయాలు, మాటలు మార్చేసుకుంటూపోతే కూడా అంతే అవివేకంగా ఉంటుంది. పెన్సిల్‌కి సమంగా రబ్బరుకూడా అరిగిపోతూ ఉందంటే, మన రాతలో ఎక్కడో తేడా ఉందన్నమాటే కదా! ❖

**సత్యంతో సంకల్పశక్తి...:** సత్యమార్గాన్ని విడువకుండా, మాటకు కట్టుబడి ఉండే మనస్తత్వం మనలో సంకల్పశక్తిని పెంచుతుంది; మన శక్తి సామర్థ్యాలను ఇనుమడింపచేస్తుంది. అలా కాకుండా నిరంతరం మాట తప్పటం, అబద్ధాలతోనే పబ్బం గడుపుకోవటం మనల్ని సమాజంలో దిగజార్చేస్తాయి. ఒక్క అబద్ధం కప్పిపుచ్చుకునేందుకు వంద అబద్ధాలు ఆడాల్సి రావటం మనకు నిత్యం అనుభవమే! ఇలా చివరకు మన బ్రతుకంతా అబద్ధాలపుట్టలా మారిపోతుంది. ఇలాంటి దయనీయస్థితికి దూరంగా ఉండాలంటే, మొదటి అబద్ధం చెప్పే దగ్గరే మాటను కట్టడిచేయాలి; 'నిజం'వైపే నిలబడేలా చేయాలి. అసత్యం చెప్పిన మనస్సు తీవ్ర అలజడికి, ఆందోళనకు గురవుతుంది. ముఖంలో ప్రసన్నతను, మనస్సులో సంకల్పశక్తిని హరించివేస్తుంది. 'సెవెన్ హాబిట్స్ ఆఫ్ హైలీ ఎఫెక్టివ్ పీపుల్' రచయిత స్టీఫెన్ కోవె అంటారు 'ఇచ్చిన మాటకు గాని, చేసిన వాగ్దానానికి గాని కట్టుబడి ఉండటం మన జీవితానికి విలువైన పెట్టుబడి లాంటిది; దానిని భగ్నం చేసుకుంటే గౌరవమనే వడ్డీతో పాటు నమ్మకమనే పెట్టుబడిని కూడా నష్టపోవలసి ఉంటుంది'. ❖

**సత్యంపై నిండు విశ్వాసం కలిగి, ధర్మాన్నే ఆశ్రయించుకొని నడుచుకునే వ్యక్తి ఎక్కడికి వెళ్ళినా కీర్తి సంపదలనే కాకుండా, గౌరవాభినందనలను కూడా అందుకుంటాడు.** - గౌతమ బుద్ధుడు



# సాగరతీరం నేర్పిన జీవనపాఠం...

– శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

ఓ ఆదివారం నా బాల్యమిత్రుడు తన ఇరవయ్యేళ్ళ కొడుకును వెంటబెట్టుకొని మా ఇంటికి వచ్చాడు. నా మిత్రుణ్ణి చూసి దాదాపు ముప్ఫై ఏళ్ళయి ఉంటుంది. కలిసి చదువుకున్న రోజులు... వాన నీటిలో ఆటలు... కాగితపు పడవలు – ఇలా ఎన్నో జ్ఞాపకాలు నా మనస్సులో మెదిలాయి. కానీ అతనెందుకో అంత ఉత్సాహంగా కనిపించలేదు. ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్‌లో పట్టభద్రుడైన తన కొడుకును పరిచయం చేశాడు. ఆ అబ్బాయి కూడా చాలా అనాసక్తిగా వచ్చినట్లనిపించింది.

నేనే చొరవ తీసుకొని యథాలాపంగా ఆ అబ్బాయిని 'చదువైపోయింది కదా! ఏం చేస్తున్నావ'ని అడిగాను. అప్పుడు అతడు 'ఏదైనా ఓ పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీలో చేరి, తరువాత విదేశాలకు వెళ్దామనుకుంటున్నాను. అక్కడ కొన్నాళ్ళుండి, తిరిగొచ్చి మీలా సొంతంగా ఓ సంస్థ ప్రారంభించాలనుకుంటున్నాను' అన్నాడు.

నేను కాస్త ఆలోచించి, 'బాగుంది! కానీ, సంస్థను ప్రారంభించాలంటే చాలా తంటాలు పడాలి. కష్టనష్టాలు ఎదుర్కోవాలి. ఇంతా చేస్తే లక్ష్యాన్ని సాధిస్తామన్న నమ్మకం లేదు. అప్పుడు క్రుంగిపోకుండా నిలబడగలగాలి' అన్నాను. 'అది సరే! మరి ఇప్పుడు ఎక్కడ పనిచేస్తున్నావు' అని అడిగాను.

'ఎక్కడా పనిచేయడం లేదు. ఏదైనా మంచి సాఫ్ట్‌వేర్ కంపెనీలో చేరాలని చూస్తున్నా' అన్నాడు. 'మరి! ప్రోగ్రామింగ్‌లో శిక్షణకానీ, అనుభవం కానీ ఉన్నాయా?' అని ప్రశ్నించాను. 'లేదు! కానీ త్వరలో నేర్చుకుంటాను. తక్కువ జీతాలు వచ్చే చిన్న చిన్న ఉద్యోగాలు చేయదలచుకోలేదు. సాఫ్ట్‌వేర్ ఉద్యోగమైతేనే చేద్దామనుకుంటున్నాను' అన్నాడు. నా మిత్రుడు ఎందుకు దిగాలుగా ఉన్నాడో అప్పుడు నాకు అర్థమైంది. ఏ ఉద్యోగమూ చేయకుండా పెద్ద పెద్ద కలలు కంటున్న పుత్రరత్నమే అతనికి పెద్ద సమస్యగా మారాడని అర్థం చేసుకున్నాను. అందుకే ఆ యువకుడికి నా మనస్సులో మాట చెప్పాను. ముందు ఏదైనా ఉద్యోగంలో స్థిరపడి, ఆపైన కృషి చేయమన్నాను. కానీ ఆ అబ్బాయి ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయాడు.

ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళకు నేను మా సంస్థ కార్యక్రమాల్లో భాగంగా ఒరిస్సాలోని చండీపూర్‌కు వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ సముద్రం ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం అయిదు కిలోమీటర్ల దూరం వెనక్కి వెళ్ళిపోతుంది. కొన్ని గంటల తరువాత మళ్ళీ ఎగసిపడుతూ ముందుకు వస్తుంది. ఇది చాలా అద్భుతమైన దృశ్యం. అక్కడి మత్స్యకారులకు మాత్రం ఇది ఓ మంచి జీవనోపాధికి ఆసరా! సముద్రం వెనక్కి తగ్గడం ప్రారంభించగానే, ఇసుకలో నుంచి ఎర్రటి పీతలు బయటకు వస్తాయి. చేపలు పట్టేవారు వాటిని బుట్టల్లో వేసుకొని అమ్ముకుంటూ ఉంటారు.

ఓ రోజు ఉదయమే అలా నడుచుకుంటూ వెళుతున్న నాకు, పన్నెండేళ్ళ జావేద్ అనే కుర్రాడు తన తల్లికి వల విసరడంలో సాయపడుతూ, పీతలు పడుతూ కనిపించాడు. అతడు నడిచే తీరు చూస్తే చాలు – ఉత్సాహం పొంగి పొరలుతున్నట్లు తెలిసిపోతోంది. నన్ను చూసి పరుగెత్తుకొని వచ్చి, తాజా పీతలు అమ్మజూపాడు. 'నేను పీతలు తినను. కానీ నీతో మాట్లాడతాన'ని చెప్పి, దూరంగా తీరంలో కూర్చున్నాం.

బక్కపలచగా ఉన్నా, ఆ కుర్రాడి కళ్ళు మాత్రం వజ్రాల్లా మెరిసిపోతున్నాయి. తండ్రి రిక్షా లాగి రోజుకు రూ.50 సంపాయిస్తాడనీ, తల్లి చేపలు పట్టి కుటుంబానికి అదనపు ఆదాయం ఆర్జించి పెడుతుందనీ ఆ అబ్బాయి చెప్పాడు. స్కూల్లో చదువుకుంటూ, తాను ఎప్పుడూ తరగతిలో ప్రథముడిగా వస్తానని ఆనందంగా చెప్పాడు. 'మరి ఇక్కడేం చేస్తున్నావు?' అని అడిగాను. 'ఉదయం సముద్రం వెనక్కి తగ్గినప్పుడు అమ్మతో కలిసి పీతలు పడతాను. తరువాత ఇంటికి వెళ్ళి స్నానం చేసి తరువాత బడికి వెళతాను. సాయంకాలం తిరిగి వచ్చాక త్వరగా హోమ్‌వర్క్ పూర్తి చేసుకొని, సాయంత్రం సముద్ర తీరానికి వచ్చి మళ్ళీ పీతలు పడతాను' అన్నాడు. 'ఇంతచేస్తే నీకేమొస్తుంది జావేద్?' అని అడిగాను. 'ఐదు రూపాయలు వస్తాయి మేడమ్!' అన్నాడు ఆనందంగా. 'అంతేనా జావేద్! దాంతో ఏమొస్తుంది? ఈ పాటి సంపాదన కోసం ఉదయం అయిదింటికే లేస్తావు. మళ్ళీ రాత్రి పదకొండుకు గానీ నిద్రపోవు' అన్నాను.

వెంటనే జావేద్ చిరునవ్వుతో 'ఏమీ లేని దానికన్నా ఐదు రూపాయలు ఎక్కువే కదా మేడమ్! ఐదు రూపాయలతో ఉప్పు కొనుక్కోవచ్చు. మిరపకాయలు కొనుక్కోవచ్చు. పనీపాటా లేకుండా కూర్చుంటే అవి కూడా కొనలేం కదా! వందలు, వేలల్లో డబ్బులు రావు కదా! రూపాయి, రూపాయి కలిస్తేనే, అంత డబ్బయ్యేది. బొట్టు బొట్టు నీరు చేరితేనే సముద్రమవుతుంది కదా మేడమ్!' అన్నాడు.

జావేద్ జవాబుతో అబ్బురపడ్డాను. చేపలు పట్టే ఈ పేద బాలుడు వంటబట్టించుకున్న జీవన పాఠాన్ని, నగరంలోని సాఫ్ట్‌వేర్ యువకుడు ఎందుకు నేర్చుకోలేకపోయాడోనని ఆశ్చర్యపడ్డాను. ❖ సేకరణ: జి.సతీష్



# పౌరులుగా మన బాధ్యత

– స్వామి రంగనాథానంద

ఈ రోజు సమాజంలో చాలా మంది గృహస్థులుగా తమ, తమ బాధ్యతలను సక్రమంగానే నిర్వహించ గలుగుతున్నారు. కానీ, పౌరులుగా మాత్రం సామాజిక స్పృహతో ప్రవర్తించడం లేదు. అందుకే నేడు సంఘంలో ఎక్కడ చూసినా Good householders, but bad citizens నానాటికీ పెరిగిపోతున్నారు. వ్యక్తిగా మనల్ని మనం ఒక గృహానికో, కుటుంబానికో పరిమితం చేసుకుంటే మన దృష్టి కూడా అక్కడికే పరిమితమైపోతుంది. కానీ నిజమైన పౌరుడి దార్శనికత (vision) విశాలంగా ఉంటుంది. ఎంత త్వరగా గృహస్థుడు పౌరుడిగా ఎదిగితే, సమాజం అంత త్వరగా సంక్షేమ దిశలో పయనిస్తుంది. కానీ దురదృష్టవశాత్తూ నేడు ఉన్నతచదువులు చదువుకున్న వ్యక్తులు కూడా సామాజిక అంశాల్లో చాలా బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నారు. ఉదాహరణకు మన ఇంట్లో పంపులో నుంచి నీరు వృథాగా పోతుంటే వెంటనే స్పందించి కట్టేస్తాం. కానీ, వీధిలో మంచినీటి పంపు విరిగి నీళ్ళు గంటల తరబడి నిరుపయోగమవుతున్నా పట్టించుకోం. మనకెందుకులే అని ముఖం తిప్పేసుకుంటాం. 'వీధిలో ఏమైతే మనకేంటి; మన ఇల్లు బాగుండాలి; మనం బాగుండాలి' అనుకుంటూ ఉంటారు. ఇది మంచి పౌరుడి లక్షణం కాదు. విదేశాల్లో ఇలాంటి విషయాల్లో అక్కడి పౌరులు ఎంతో అప్రమత్తంగా మసలుకుంటారు. అందుకే ఆ యా దేశాలు చిన్నవైనా, అనతి కాలంలోనే ఎంతో పురోగతిని సాధిస్తూ ఉంటాయి. అనవసరమైన అంశాల్లో మనం అక్కడివారిని అనుసరిస్తూ ఉంటాం. కానీ, ఇలాంటి మంచి పనుల నుంచి ఏమీ నేర్చుకోం!

**స్వేచ్ఛే కాదు బాధ్యత ముఖ్యం...**

మన సమాజంలో చాలామంది స్వేచ్ఛకు ఇచ్చిన ప్రాధాన్యాన్ని బాధ్యతలకివ్వరు. బాధ్యత లేని స్వేచ్ఛ చాలా ప్రమాదకరం. అందుకే నేడు విద్యార్థులు, యువతీ యువకులు ఉద్యమాల పేరుతో జాతీయ సంపదను కూడా ధ్వంసం చేస్తున్నారు. ఇది మన సమాజం, మన సంపద. దీన్ని పరిరక్షించుకునే బాధ్యత మన అందరిదీ అన్న భావన లేకపోవడం వల్లనే ఈ విధంగా ప్రవర్తిస్తున్నారు. వందల సంవత్సరాలు పరాయిపాలనలో మగ్గిన మనకు స్వాతంత్ర్యం సంపాదించుకున్న ఇన్నాళ్ళకు కూడా, నిజమైన స్వేచ్ఛకు అర్థం తెలియకపోవడం బాధాకరం. India is such a big country with small minds... భారతదేశం విశాలమైందే; కానీ, సంకుచితమైన మనస్సులతో నిండిపోయిందనిపిస్తోంది. బాధ్యతతో కూడిన మానవసంబంధాలలో మనం చాలా సందర్భాలలో ఘోరంగా విఫలమవుతూ ఉన్నాం. మన స్వార్థపరత్వంతో నిరంతరం 'నేను', 'నా కుటుంబం', 'నా వాళ్ళు' అన్న చట్రంలోనే ఇరుక్కుపోతున్నాం. ఎదుటివ్యక్తిలో భగవంతుణ్ణి చూడాలన్న మహోన్నత ఆదర్శాన్ని వారసత్వంగా స్వీకరించిన మనం, వారి విషయంలో పరమ కర్కశంగా వ్యవహరిస్తూ ఉంటాం. నేను చాలా మందిని ప్రశ్నిస్తూ ఉంటాను – 'మీరు ఆలయానికి వెళ్ళినప్పుడు, ఆ దేవుణ్ణి ఏమి అర్థిస్తారని?' అందరూ 'ఓ భగవంతుడా! నాకు అది ఇవ్వు, ఇది ఇవ్వు!' అని వేడుకుంటామంటారు. 'ఎప్పుడైనా, మీరు ఇతరుల గురించి ఆ దేవుణ్ణి ప్రార్థించారా? పక్కవారు బాగుండాలని కోరుకున్నారా?' అని నేను ప్రశ్నిస్తాను. నిరంతరం మన గురించి మనం ఆలోచించుకోవడమే కానీ, సమాజంలో ఒక భాగస్వామిగా, ఇతరుల మంచి కోసం పాటుపడుతున్నామా? అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. సాటి మనిషిలో ఆ భగవంతుడి విరాట్ రూపాన్ని చూసుకొని ఆరాధించగలగాలి. పౌరుగు వ్యక్తిని ఆరాధించడమంటే, పూలతోనో, ధూపంతోనో, హారతితోనో అర్చించమని కాదు అర్థం. వారిని రెండు విధాలుగా ఆరాధించమని మన సనాతన ధర్మం ప్రబోధిస్తూ ఉంది. అవి 'దానమానాభ్యం'! దాన, మాన రూపాల్లో తోటివారిని ప్రేమించగలగాలి. అంటే వారు వ్యాధులతో, ఆకలితో బాధపడుతూ ఉన్నప్పుడు – వారికి చేతనైనంత సేవ చేయాలి; సాయపడాలి. అలాగని వారిని దీనంగా, హీనంగా చూడకుండా, వారి మానాభిమానాలను గౌరవించాలి. ఇది నిజమైన పౌరుడిగా మన బాధ్యత. ❖ **సేకరణ : ఆర్.కృష్ణ**



**మనిషి పెద్దపెద్ద ప్రణాళికలు వేయడం కన్నా, చిన్నచిన్న పనులు చేయడం ఉత్తమం. చిన్నచిన్న అవకాశాలు తాను అధిరోహించబోయే అభ్యున్నత శిఖరాలకు పరమపద సోపానాలు.** - డెమాస్థనీస్


(1884 – 1967)

# ముందుకు సాగిపో !

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

బరంపురం,
14-07-1940

ప్రియమైన విపత్ భంజన్!*

కొద్దిపాటి సౌకర్యాలనే పొందుతూ, నీవు నీ వసతి గృహంలోనే ఉండి ఏ విధమైన విచారానికీ గురి కాకుండా చదువు కొనసాగించు. అన్ని పరిస్థితులలోనూ సర్దుకుపోవడం మనిషికి చాలా మంచిది. శ్రీరామకృష్ణులు "సమయం, స్థలం, సంగం – వీటిని అనుసరించి ప్రవర్తించు" అనేవారు. బలమైన ఇష్టాలు, అనిష్టాలు నీకు ఉంటే ఈ ప్రపంచంలో సంచరించడం కష్టం. మనందరినీ ఆ భగవంతుడే రూపొందించాడని తెలుసుకొని ప్రతి ఒక్కరితోనూ కలివిడిగా ఉండాలి. అయితే అదే సమయంలో మనం మన ప్రత్యేకతను కాపాడుకుంటూ సాగిపోవాలి.

స్వామి అభేదానంద రచించిన అద్భుతమైన పుస్తకం – "ఇరవయ్యో శతాబ్దపు మతం" (The Religion of the Twentieth century) చదివితే బాగుంటుంది.

"ముందుకు సాగిపో" అన్నది గురు మహరాజ్, స్వామీజీల ముఖ్యబోధ. నీవు ఏ స్థాయిలో ఉన్నా ఫరవాలేదు. ముందుకు సాగిపోతే అది ముదావహమే! ఇది హిందూ మతానికి మౌలిక వాక్యం. "నీవు చేస్తున్నదంతా సరియైనదే. అయితే ఇంకా మంచి విషయాలు నీ ముందున్నాయి" అని అంటారు స్వామీజీ. మనిషి అసత్యం నుండి సత్యానికి ప్రయాణించడం లేదు. అతడు ఒక సాధారణ సత్యం నుండి పరమ సత్యానికి ప్రయాణిస్తున్నాడు. క్రొత్తది నిర్మించాలంటే పాత దాన్ని నాశనం చేయడం కాదు. నిర్మించేదాన్ని పరిపూర్ణం చేయడం. నీవు చేయదల్చుకొన్నదాన్ని మంచిగా చెయ్యి. నిన్ను నీవు మంచిగా మలుచుకొంటూ పోతే చివరకు పరిపూర్ణత్వాన్ని సాధిస్తావు. మనం చేస్తున్న అనేక సాధనలు, ప్రయత్నాలు – అన్నీ కూడా మన హృదయాన్ని పరిశుద్ధం చేసుకోవడానికి చేసే క్రియలే! హృదయనైర్మల్యం సాధించడమే జీవిత ప్రథమ కర్తవ్యం. హృదయం నిర్మలమైనప్పుడు జ్ఞానం దానంతట అదే ఆవిష్కృతమవుతుంది.

అసత్యంలో జీవిస్తున్న వ్యక్తి సత్యాన్ని ఎలా చేరుకోగలడు? అతడు నేల విడిచి సాము చేయడమే గదా! హృదయమే లేని ఒక 'మహాపాపి' మంచివాడిగా మారడం అనే ఆలోచనను ఎలా అర్థం చేసుకోగలడు? మనకు ఇంతకు పూర్వమే కొంతవరకు తెలిసిన అంశాలనే మరికొంత తెలుసు కోవాలని కోరుకుంటాం. ఈ సత్యాన్ని అంగీకరించనివారు, అర్థం చేసుకోనివారు భగవంతుడు వారి కన్నా భిన్నమైనవాడని ఊహిస్తూ, వారి వద్ద లేనివాటిని ఆయన ఇస్తాడని భ్రమ పడుతుంటారు.

నాగమహాశయుడు భగవంతుడే అన్ని జీవులుగా మారి సంచరిస్తుండడాన్ని స్వయంగా దర్శించారు. ఆఖరుకు మోసకారిగా ప్రపంచాన్ని మోసగిస్తున్నది కూడా ఆయనే అనే అనుభూతిని కూడా పొందారు. అలాంటప్పుడు మనం ఈ ప్రపంచమంతా పాపులమయం, అవినీతిపరులమయం అని ఏ ధైర్యంతో చెప్పగలం! దొంగగా, బందిపోటుగా పాత్ర వహించి ఆటలాడడం ఆయన లీల. ఈ అవగాహనతో జీవిస్తే ఇతరులతో ఏ విధమైన గొడవలకూ తావుండదు. అంతా ప్రశాంతంగా సాగిపోతుంది. కురుక్షేత్రంలో శ్రీకృష్ణుడు ఆయుధం ధరించకుండా రథంపై చిద్విలాసంగా కూర్చున్నంత ప్రశాంతంగా సాగిపోతుంది.

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**

(*విపత్ భంజన్ కాలాంతరంలో స్వామి స్వాహానందగా సుప్రసిద్ధులయ్యారు)

**మనల్ని ప్రేమించే మిత్రుల నుండి సద్గుణాలను స్వీకరించి, వాటిని ఆచరించాలి. మనల్ని ద్వేషించే శత్రువుల నుండి మన లోపాలను గ్రహించి, వాటిని అధిగమించడానికి ప్రయత్నించాలి. - రిచర్డ్**

(...15వ పేజీ తరువాయి.)



ఆరామమున రామరామ అనె...

సాక్షాత్తూ భగవంతుడికి బంటుగా వ్యవహరించే అదృష్టం ఆంజనేయుడికి దక్కింది. ఆయనకు శ్రీరాముడే లోకం! అందుకే "హనుమంతుడు మనోబలం చేతనే సముద్రాన్ని లంఘించగలిగాడు. 'నేను రాముడి బంటును; నేను రామనామాన్ని జపిస్తాను. అటువంటప్పుడు నాకు సాధ్యం కానిది ఏమిటి?' – ఇదే హనుమంతుడి ప్రగాఢ విశ్వాసం" అన్నారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. రామకార్యార్థం వెళ్ళిన ఆ ఏకాంగవీరుడు, దాశరథి ధర్మపత్ని పడుతున్న కష్టాలకు కదలిపోయాడు. ఆక్రోశంతో లంకనే దహించే ప్రయత్నం చేశాడు. తుదకు ఎలాగైనా రామదండుతో అయోధ్యాపురికి తీసుకు వెళతామని ఆ అయోనిజకు బాస చేసి, రాముని చెంతకు చేరి చింతిస్తూ...



**రామ నినుబాసి నీరామ నే చూడగ నా**
**రామమున నిను పాడె రామరామ యనుచు**
**ఆ మెలుత సీతయని యపుడు నే తెలిసి**
**నీ ముద్ర వుంగరము నేనిచ్చితిని...** అంటాడు. 'రామా! నీకు దూరమై నీరామ (నీ రమణి) ఆ వనంలో 'రామా, రామా!' అని పాడుకుంటూ ఉన్నదయ్యా! అలా పలవరిస్తున్న స్త్రీమూర్తి సీతాదేవి అని అప్పుడే తెలిసింది. అప్పుడు నీవు నీ గుర్తుగా ఇచ్చిన ఉంగరాన్ని అమ్మకు ఇచ్చానయ్యా' అని లంకలో జరిగిన సన్నివేశాన్ని సవినయంగా వర్ణిస్తున్నాడు. 'నీ రామ' అంటే నీ భార్య, ఆరామం అంటే వనము, మెలుత అంటే స్త్రీ అని అర్థాలు. ఇక్కడ అన్నమయ్య 'రామ' అన్న పదాన్ని పలు అర్థాల్లో బహు సుందరంగా ప్రయోగించాడు. హనుమంతుడు తెచ్చిన తన అర్ధాంగి శిరోమణిని చూసి ఆ జగదానంద కారకుడు ఒక్కసారిగా పరవశించిపోయి...

**అయం హి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః।**
**అస్యాద్య దర్శనే నాహం ప్రాప్తాం తామివ చింతయే ॥**

అంటాడు శ్రీమద్రామాయణంలో! 'ఈ మణే నా ప్రియమైన జానకి శిరస్సునందు ఇన్నాళ్ళూ అలంకృతమై శోభిల్లుతోంది. నేడు దీన్ని చూసి ఆమెను పొందినట్లే తలచుచున్నాను' అనుకుంటూ లోలోన మురిసిపోతాడు. జీవన సహచరిపై అంతటి అనురాగం ఆ రామచంద్రుడిది!

నీ సేమమటు విన్నవించితిని...

'కమల' అన్న పదాన్ని పలు విధాలుగా ప్రస్తావిస్తూ సుందరకాండ ఘటనలకు అన్నమయ్య మరింత సౌందర్యాన్ని అద్దుతున్నాడు. కమలాలకు ఆప్తుడు సూర్యుడు; ఆ సూర్యవంశ భూషణుడు శ్రీరాముడు; అందుకే ఇక్కడ ఆయనను కమలాప్తకుడిగా సంబోధిస్తూ ఉన్నాడు. 'ఓ సూర్యవంశ శ్రేష్ఠా! కమలాక్షియైన సీతమ్మ నీ పాదకమలాలను మనస్సులో తలపోసి వేదనతో చంద్రుని సైతం నింది స్తున్నదయ్యా! లంకంతా వెదకి, వేదనతో ఉన్న ఆ మాతృమూర్తిని నీ భార్య అని తెలుసుకొని, నీ క్షేమ సమాచారాన్ని ఆమెకు విన్నవించానయ్యా' అన్న భావంతో...

**కమలాప్తకులుడ నీ కమలాక్షి నీ పాద**
**కమలములు తలపోసి కమలారి దూరె**
**నెమకి యాలేమనునే నీదేవి యని తెలిసి**
**అమరంగ నీసేమ మటు విన్నవించితిని ।**

అంటున్నాడు. 'కమలములకు అరి' అంటే కమలములకు శత్రువు – చంద్రుడు అని అర్థం. 'దూరె' అంటే దూషించే అని! 'నెమకి' అంటే వెదకి, 'లేమ' అంటే స్త్రీ! సేమము అంటే క్షేమము. భాగస్వామికి దూరమై సీతమ్మవారు కనిపిస్తున్న చంద్రబింబాన్ని కూడా బాధతో దూషిస్తూ ఉందట. అంతటి దుఃఖం ఆమెది! క్రుంగి కృశించిపోయిన ఆ మైథిలిని మననం చేసుకుంటూ...

**అథశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే...** అంటాడు మారుతి సుందరకాండలో! ఆమె నేలపై శయనించి, మంచు దెబ్బకు గురి అయిన పద్మం లాగా వన్నె తరిగి ఉన్నదట!

శ్రీవేంకట రఘువీరుడవు నీవు...

నాయకత్వ లక్షణాలను పరిపూర్ణంగా పుణికిపుచ్చుకున్న పురుషోత్తముడు రామచంద్రుడు. అందుకే ఎవరు ఏ ఉద్దేశంతో తన దగ్గరకు వస్తున్నారో ముందే పసిగట్టగలిగాడు. వానర సేనల్లో సుగ్రీవుడు ఎందుకు తనను ఆశ్రయించాడో, హనుమంతుడు ఎందుకు అండగా నిలిచాడో ఆ జగదేక నాయకుడికి తెలుసు. అందుకే ఒకరిని వానర రాజ్యానికి రాజును చేశాడు. మరొకరిని తన బంటుగా భగవంతుడి స్థాయికి చేర్చాడు. చిరంజీవిని చేశాడు.

**దశరథాత్మజ నీవు దశశిరుని చంపి, యా**
**దశనున్న చెలిగావు దశదిశలు పొగడ**

'ఓ దశరథ కుమారా! దశకంఠుడైన రావణుణ్ణి సంహరించి సీతమ్మను కాపాడవయ్యా!' అంటూ కపి కుల సార్వభౌముడి రూపంలో ఆ కోదండరాముణ్ణి కోరుకుంటూ, ముగింపులో...

**రసికుడ శ్రీ వేంకట రఘువీరుడ నీవు**
**శశిముఖి చేకొంటివి చక్కనాయ పనులు**

'వేంకటాద్రి పైన కొలువైన రఘువీరుడా! నీవు పై కార్యాలన్నిటినీ చక్కబెట్టి శశిముఖి అయిన సీతమ్మను చేపట్టావ'ని మంగళం పాడుతున్నాడు అన్నమయ్య. ❖

# ఉత్తముల సాన్నిధ్యం ఉన్నతికే!

– ప్రయాగ రామకృష్ణ

ఇతరుల మంచి సలహాను పాటించడంలో అలసత్వాన్ని చూపినవాడు, ఏ విషయంలోనూ ఒకరి సహాయం నాకు అక్కర్లేదన్న అహంకారం ఉన్నవాడు ఏ కార్యాన్నీ సమర్థంగా నిర్వహించలేడు. విజయాన్ని సాధించలేడు.

సముద్రానికి ఏం తక్కువ? ఎప్పుడూ నీటితో నిండుగా ఉంటుంది. నదులన్నీ వెళ్ళి సముద్రంలోనే సంగమిస్తాయి. దానికితోడు దాని కడుపునిండా రత్నాలే. అయినా, అది ప్రతిక్షణం చంద్రుని సాన్నిధ్యాన్ని కోరుకుంటుంది. అలాగే మనకెంత ఐశ్వర్యం ఉన్నా తెలివైనవారు, బుద్ధిమంతులు, సమర్థుల సాంగత్యం కోరుకుంటే మన ఔన్నత్యం మరింత ఇనుమడిస్తుంది.

'ఒకరి సహాయం నాకు అవసరంలేదు అనుకునేవాడు, అలసత్వాన్ని వదలనివాడు, కార్యాచరణలో తొందర పడేవాడు ఎప్పుడూ అపజయాల పాలవుతాడు, ఎన్నటికీ సుఖపడలేడు' అని భీష్ముడు ధర్మరాజుకు హితవుచెబుతూ దృష్టాంతంగా ఈ కథలు చెప్పాడు :

**అలసత్వం అనర్థదాయకం:**

"పూర్వం ఒక ఒంటె బ్రహ్మదేవుణ్ణి గురించి చాలా కాలం తపస్సు చేసింది. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు.

'దేవా! నా మెడ నూరు యోజనాలు పెరిగేటట్లు అనుగ్రహించు' అని వరం కోరుకుంది. వరం అనుగ్రహించి వెళ్ళిపోయాడాయన. ఆ వరగర్వంతో ఒంటె మిడిసిపడుతూ ఎవరి సహాయం కోరక, ఎవరితోనూ కలియక ఒంటరిగా, బద్ధకంగా ఉంటూ ఉండేది. ఒకనాడు ఓచోట పడుకుని తన పొడుగాటి మెడ చాచి అడవిలో మేస్తోంది. అప్పుడు పెద్ద వాన వచ్చింది. ఆ ఒంటె వెంటనే తన మెడను ఒక గుహలో దూర్చి హాయిగా నిద్రపోయింది. ఇంతలో ఒక నక్క అక్కడకు వచ్చింది. దానికి బాగా ఆకలి వేయడంతో గుహలో ఉన్న ఒంటె మెడను కొరుక్కుతినడం ప్రారంభించింది. ఒంటె తన మెడను వెనక్కు తీసుకోలేక పోవడం వల్ల నక్కకు ఆహారమైంది.

ఎన్ని వనరులు ఉన్నా, ఎన్ని వరాలు పొందినా అలసత్వం ఉంటే అవన్నీ నిష్ప్రయోజనమవుతాయి. 'అలసేన లబ్ధమపి రక్షితుం న శక్యతే!' సోమరి దొరికినదాన్ని కూడా రక్షించు కోలేడు. కనుక అప్రమత్తంగా ఉండటం కార్యశూరుల లక్షణం. జాగరూకులై ఉన్నవారికి వెళ్ళినదారి పూలబాట అవుతుంది".

**ఆచరించే ముందు ఆలోచించు...:** "మేధాతిథి అనే మునికి చిరకారి అనే కొడుకు ఉండేవాడు. అతను ప్రతి పనీ బాగా ఆలోచించి చేసేవాడు. అందుకే అతనికి ఆపేరు వచ్చింది. ఒకనాడు మేధాతిథికి భార్యమీద కోపం వచ్చి ఆమెను చంపెయ్యమని చిరకారికి ఆజ్ఞాపించి విసవిస వెళ్ళిపోయాడు.

'నవమాసాలూ మోసిన కన్నతల్లికంటే ఎక్కువ ఏదీ లేదు. తల్లి దైవమంటారు. 'గురుణాం మాతా గరీయసి...' పూజ్యులలో తల్లి గొప్పదంటారు. అన్ని అవస్థలలోనూ తల్లిని పోషించాలని శాస్త్రం చెబుతోంది. ఇప్పుడు మరి తల్లిని చంపడమా? తండ్రి ఆజ్ఞ మీరడమా?? ఏం చెయ్యను నేను?' అని అనుకుంటూ చిరకారి ఆలోచిస్తుండగానే చాలాసేపు గడిచిపోయింది. తాను ఏదో కోపంలో అన్నమాట పట్టుకుని కొడుకు తల్లిని చంపేశాడేమోనని విచారపడుతూ, తన కొడుకు అలా చెయ్యడని మధ్యమధ్యలో ధైర్యం తెచ్చుకుంటూ వడివడిగా ఆశ్రమానికి వచ్చాడు మేధాతిథి. చేతిలో ఉన్న కత్తి కిందపడేసి చిరకారి తండ్రి కాళ్ళమీద పడ్డాడు. మేధాతిథి భార్య కూడా వచ్చి భర్తకు నమస్కరించింది. ఆయన కన్నీళ్ళతో వాళ్ళిద్దర్నీ గుండెకు హత్తుకున్నాడు. కొడుకును మెచ్చుకుని దీవించాడు.

జీవితంలో ఏ కార్యం సాధించాలన్నా, సంతోషంగా జీవించాలన్నా మనకు తెలియని విషయాల గురించి ఇతరులను అడిగి తెలుసుకోవాలి. అలసత్వం ప్రదర్శించకూడదు. ఏపనైనా చేపట్టే ముందు బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. అలాంటి బుద్ధికుశలత కలిగినవారు ఎలాంటి కష్టమైన కార్యాన్నైనా సులువుగా సాధించగలరు. ❖



## భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# ఇతరులలో తప్పులెన్నడమే పెద్ద తప్పు!

(...గత సంచిక తరువాయి)

**మైత్రీభావం అలవరచుకోవడం :** ఇతరులకు స్వేచ్ఛనిచ్చి నీ మీద ఆధారపడకుండా వారి కాళ్ళపై వారు నిలబడి, పురోభివృద్ధి సాధించే విధంగా చేయడం ద్వారా మైత్రీభావాన్ని సాధించవచ్చు. అప్పుడు అలాంటి వ్యక్తి పురోభివృద్ధి సాధించి, జీవితంలో ఉన్నత శిఖరాలను అధిరోహించడం చూసి, నీకు సంతోషం కలుగుతుంది. నీవు భావోద్రేకానికి లోనై, ఇతరులు నిన్ను ప్రశంసించాలనో, లేక నీ సహాయం మీదనే ఆధారపడాలనో అనుకున్నట్లయితే నిజమైన మైత్రీ భావాన్ని పొందలేవు. అవతలివారికి నీ అవసరం లేనప్పుడు కూడా నువ్వు సంతోషంగా ఉండగలిగితేనే మైత్రీ భావం నీలో ఉన్నట్లవుతుంది. నీ అవసరం వారికి లేనప్పుడు కూడా "నా పాత్రను నేను విజయవంతంగా పోషించి, వారి కాళ్ళ మీద వాళ్ళు నిలబడేలా చేయగలిగా"ననే భావంతో సంతోషించాలి. ప్రతి ఒక్కరి సంతోషాన్నీ, స్వేచ్ఛనూ కోరుకోవడమే మైత్రీ భావం.

గొప్ప సంస్కృత పండితుడైన కాళిదాసు ఒక ప్రార్థనలో ఈ విధంగా తెలియజేస్తాడు.

**సర్వః తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః కామానవాప్నోతు సర్వః సర్వత్ర నన్దతు ॥**

'అందరూ కష్టాలను అధిగమింతురు గాక! అందరూ శుభాన్నే దర్శింతురు గాక! అందరూ వారు కోరినవి పొందుదురుగాక! (ఇతరులకు ఏ విధమైన హానీ చేయకుండా, వారికి సంతోషం, సుఖం కలిగించే కోరికలను పొందుదురు గాక). అందరూ అన్ని ప్రదేశాలలోనూ సుఖంగా ఉందురు గాక!' ఆధ్యాత్మిక సాధకుడు అలవరచుకోవలసిన నిజమైన స్నేహశీల (మైత్రీ) దృక్పథమిదే!

అభాగ్యుల ఎడల, తన కన్నా తక్కువవారి ఎడల కారుణ్యం కలిగి ఉండడం రెండో దృక్పథం. చాలామందికి సాధారణ జీవనానికి అవసరమైన కనీస సదుపాయాలు కూడా ఉండవు. కరుణ కలిగి ఉండటమంటే ఇతరుల బాధల్ని తొలగించాలన్న నిజమైన అభిలాష ఉండటమే. మనకు వ్యతిరేకంగా ఉన్నవారు, లేక మన భావాలతో అంగీకరించని వారి బాధలను చూసి కూడా మనకు సంతోషం కలగకూడదు. క్షమాగుణంతో అందరినీ మన్నించగలగాలి. ఎవరూ కష్టాలలో గాని, దుఃఖంలో గాని ఉండకూడదని మనం ఆశించాలి. కరుణ అంటే పవిత్ర హృదయంతో అందరి శ్రేయస్సునూ కోరడమే!

దయార్ద్ర హృదయం అనేది అన్ని రకాల మురికినీ తొలగించిన స్వచ్ఛమైన బంగారం. అగ్నిలో కాలాక, మలినమంతా తొలగిపోతుంది. కాబట్టే స్వచ్ఛమైన బంగారం తళతళ మెరుస్తుంది. అదే విధంగా పవిత్రమైన మనస్సు తగు విధంగా శుద్ధి అవుతుంది. కాబట్టి చక్కగా ప్రకాశిస్తుంది. బాధిత జనుల మీద కారుణ్యం, దాతృత్వం చూపగలిగినప్పుడు మన మనస్సు పవిత్రమవుతుంది. అంతేకాదు! నిజమైన మానవత్వం మనలో భాసిల్లుతుంది. అప్పుడే స్వార్థపూరిత భావాల నుండి, వాటి వల్ల కలిగే వేదనల నుండి బయటపడగలుగుతాం.

మూడో దృక్పథం- 'ముదిత' భావం (ఆనందంగా ఉండడం). ప్రతి ఒక్కరిలోనూ, ప్రతి విషయంలోనూ తప్పులు వెదకడమే కొంతమంది సహజ నైజం. ఇతరుల లోటుపాట్లను వెతికే తమ తీరు, జీవితంలో వారెక్కడ తప్పులు చేస్తున్నారోనని అన్వేషించే తమ పద్ధతే సరైనదని వారు భావిస్తారు. వారెంతగా ఈ నైజానికి కట్టుబడి ఉంటారంటే అవతార పురుషులైన శ్రీరాముడు, శ్రీకృష్ణునిలో కూడా వారు లోపాలు చూస్తారు. ఇక సాధారణ మానవుల సంగతి చెప్పేదేముంది!

ఈ ప్రపంచమంతా సరిగ్గా పని చెయ్యడానికి వారి అనుమతి తీసుకోవాలేమోనని అనిపిస్తుంది. ఇతరుల లోపాలు ప్రస్ఫుటంగా ఎత్తి చూపాలనీ, లేనట్లయితే తమ విధి తాము సక్రమంగా నిర్వర్తించినవారం కాలేమనీ వారు భావిస్తారు. అది జీవితం పట్ల చాలా స్వార్థపూరిత, అహంభావపూర్వక దృక్పథం. అలాంటి వ్యక్తులతో వచ్చే సమస్య ఏమంటే - వారు ఇతరులలోని ప్రతిభనూ, గొప్పతనాన్నీ గౌరవించరు. ఇతరుల సామర్థ్యాన్నీ, ప్రతిభనూ గుర్తించి, గౌరవించడం ఒక రకమైన పూజ. 'ప్రతిభా పూజ'! దానినెవరూ నిర్లక్ష్యం చేయకూడదు. ఇతరులలో జ్ఞానం, ప్రజ్ఞ ఉంటే వాటికి దోహదం చేసి, ప్రోత్సహించాలి కానీ, నిరుత్సాహపరచి ధ్వంసం చేయకూడదు. నిజమైన సరస్వతీపూజ అంటే ఇదే!

అదే విధంగా సద్గుణాలున్న సాత్త్వికుడైన వ్యక్తిని చూసినప్పుడు సంతోషించాలి. అలాంటి వ్యక్తి తన జీవితం ద్వారా, చర్యల ద్వారా ఇతరులకు చక్కని ఆదర్శంగా నిలుస్తాడు. అంతేకాక

మంచితనానికీ, ఋజువర్తనకూ మార్గదర్శి అవుతాడు. ప్రతిభ, సామర్థ్యం ఉన్నవారి పట్ల గౌరవం, వారిని చూసి (ఆనందించడం) ముదిత భావం కలిగి ఉండటం మనస్సును పరిశుద్ధం, పవిత్రం చేస్తుంది.

నాలుగోదీ, చివరిదీ అయిన భావం – దుష్టుల పట్ల 'ఉపేక్ష' భావం. ఇంతకు ముందు తెలిపిన మైత్రి, కరుణ, ముదిత భావాలను ఆచరించడం సులభమే కానీ, 'ఉపేక్ష'ను అలవరచుకోవడం నిజంగా చాలా కష్టం. మనకు అసలు సరిపడని వ్యతిరేక భావాలున్న వ్యక్తులతో మసలేటప్పుడు, వారు మనకు పిచ్చెక్కిస్తారు. అందువల్ల మనం మానసిక శాంతిని కోల్పోతాం. వ్యతిరేక భావాలతో నిండిన మనస్సు గలవారు అన్ని యుగాలలో, కాలాలలో ఉన్నట్లే ఈ కాలంలోనూ ఉంటారని గుర్తుంచుకోవాలి.

అలాంటి వ్యక్తులలో దురాశ, భ్రమ, క్రోధం ప్రస్ఫుటంగా ప్రకటితమవుతాయి. మనం వారికి ఏ విధంగానూ అంతరాయం కలిగించక పోయినా వారు మాత్రం మనల్ని కలత చెందేలా చేస్తారు. అలాంటి వారితో ప్రవర్తించేటప్పుడు 'ఉపేక్ష భావం'తో ఉండటం (ఉదాసీన భావం) అత్యంత శ్రేష్ఠమైన మార్గం. వారిని సరిచేయవలసిన అవసరం లేదా? ఉంది. వారిని సరి చేయడం చాలా మంచిదే, స్వాగతించవలసిన విషయమే! కానీ, అది అంత సులభమేమీ కాదు. వారిని సరిచేసే క్రమంలో వారి దుర్గుణాలు మనలో చేరవచ్చు. వారి పద్ధతులను మార్చే బదులు చివరకు మనమే ఆ చెడు మార్గంలోకి వెళతాం. అందుకని అలాంటి వారి నుంచి దూరంగా ఉండటమే మంచిది. మన జాగ్రత్తలో మనం ఉండాలి గానీ, వారినేదో సరిచేద్దామని అనుకోకూడదు. ఆ పని చేయడానికొక ఉన్నత శక్తి (అతీతశక్తి) ఉంది.



కాబట్టి ఆధ్యాత్మిక సాధకుడు అలాంటి వారికి దూరంగా ఉండటానికి ప్రయత్నించాలి. అంటే వారిని ద్వేషించాలని కాదు! వారితో ప్రవర్తించేటప్పుడు ఉదాసీనవైఖరిని అవలంబించాలి. గత కర్మల నుండి జనించి వారిలో లోతుగా పాతుకుపోయిన సంస్కారాలను మార్చడం అంత సులభం కాదు. వారి గురించి మాట్లాడడం, ఆలోచించడం మాని, వారి నుండి దూరంగా ఉండడం తెలివైన పని. వారి గురించి మాటలు, ఆలోచనలు వారి దుష్టస్వభావాన్ని మనకు తెలియకుండానే మనలోకి చేరేలా చేస్తాయి. కాబట్టి వారి పట్ల ఉపేక్ష భావాన్ని అవలంబించాలి.

ఇతరులను సరిచేసే స్వభావాన్ని మనం మార్చుకోవాలి. ఇతరులను సరిచేయడం, నియంత్రించడంలో విఫలమైతే చాలా కలత చెందుతాం. జీవితంలో కొన్ని విషయాలను జారవిడవాలి. అంటే మన కర్తవ్యాన్ని మనం నిర్లక్ష్యం చేస్తున్నట్లు కాదు. దీని భావమేమంటే మన కార్యక్రమాల పరిధిలోకి రాని విషయాలలో మనం జోక్యం చేసుకోకూడదు. మన స్వధర్మానికి మనం కట్టుబడి ఉండాలి. కానీ ఇతరుల స్వధర్మంలోకి ప్రవేశించే ప్రయత్నం చేయకూడదు. ఇతరులను సరిచేయడం, శిక్షించడం ఒక నాయకునికీ, సంస్కరణకర్తకూ స్వధర్మం అవుతుంది, అంతేగాని ప్రతి ఒక్కరూ చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోకూడదు. ఈ విషయాన్ని సరియైన దృక్పథంతో అర్థం చేసుకోవాలి. ఇది బాధ్యతల నుండి పారిపోవడమని అనిపించవచ్చు కానీ కచ్చితంగా అది కానే కాదు. మనం జీవితంలో తీసుకున్న పాత్రను బట్టే మన బాధ్యతలు కూడా ఉంటాయి. సమాజంలోని వ్యక్తులందరినీ సరిచేయడం ఆధ్యాత్మిక సాధకుని బాధ్యత కాదు. నైతిక, పారమార్థిక విలువలకు ఆలవాలంగా ఉండి, ఇతరులకు ఆదర్శంగా ఉండటమే అతని బాధ్యత. ఆ విధంగా ఉండటం వల్లే అతను సమాజంలో మార్పు తీసుకురాగలడు. జీవన విధానం ద్వారా ఇతరులలో మౌనపరిణామం (మార్పు) తీసుకువస్తాడు.

మనస్సును పరిశుద్ధం చేసుకోవాలంటే ఇంతకు ముందు పేర్కొన్న దృక్పథాలను అలవరచుకొని సర్దుబాటుతనంతో ముందుకు సాగాలి. వస్తువులు గాని, వ్యక్తులు గాని, ఆఖరుకు పరిస్థితులు గాని మనల్ని కలతపరచలేవు. వాటి పట్ల మన దృక్పథం, మన స్పందనలే నిజంగా మన ప్రశాంతతను భంగం చేస్తాయి. మన మనోభావమే అత్యంత ముఖ్యమైనది. ప్రపంచంలోని ఇతర భాగాలలో, ప్రదేశాలలో ఏం జరుగుతోందన్నదాని గురించి మనమేమీ పట్టించుకోం. మనకేం జరుగుతోందన్న దాని గురించి, మన జీవితంలో జరిగే వివిధ సంఘటనలకు మన ప్రతిస్పందన గురించే మనం ఆలోచించాలి. కాబట్టి మనకు కావలసింది – పరిస్థితులు, వ్యక్తుల పట్ల సర్దుబాటు దృక్పథం. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో–'పరిశుద్ధ మనస్సును పొందే మార్గం')

అందరితో మర్యాదగా వ్యవహరించు, ఎక్కువ మందితో కలుపుగోలుగా ఉండు. తక్కువ మందిని పరిచయం చేసుకో. ఒక్క ప్రాణ స్నేహితుడినైనా సంపాదించు. ఎవ్వరికీ విరోధివి కావద్దు. - బి.ఫ్రాంక్లిన్

# కనువిప్పు కలిగించిన అద్వైతం

మూలం: శ్రీరామకృష్ణ కథామృతం    చిత్రాలు: సదాశివం    అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 ఒక రాజుకు తన గురువు పట్ల అచంచల భక్తిప్రపత్తులుండేవి. తరచూ తన సందేహాలను గురువును అడుగుతూ ఉండేవాడు. పురాణాల నుండి, ఇతిహాసాల నుండి గురువు ఉదాహరణలు చూపుతూ ఆ సంశయాలను తీరుస్తూ, అవసరమైనంత మేరకు ఉపదేశించేవాడు. ఒక రోజు...




2



3 అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం అనే వాటి గురించి గురువు కాస్త విపులీకరించి చెప్పాడు.
సకల ప్రాణులలోనూ ఒకే బ్రహ్మం కొలువై ఉంది అనే విషయం నాటి పాఠం.






4 రాజు, గురువు ఉపదేశాన్ని గూర్చి గాఢంగా యోచిస్తూనే అంతఃపురంలోకి వెళ్ళాడు. అక్కడ రాణిగారికి ఒక దాసి వింజామర విసురుతూ ఉండడం రాజు చూశాడు.






5 హఠాత్తుగా రాజు పిచ్చిపట్టిన వ్యక్తిలా......




6
రాణి నిర్ఘాంతపోయింది. ఆ దాసి అవాక్కయి నిలబడిపోయింది. కాసేపటికి వారిద్దరూ ఆ అవస్థ నుండి తేరుకొన్న తరువాత...
వనితా! మన రాజుగారు ఇలా విపరీత ధోరణిలో ఎందుకు మాట్లాడుతున్నారు? నేడు రాజసభలో ఏదైనా విపరీతం జరిగిందా? ఎవరినైనా కలుసుకున్నారా?
అమ్మా! నేడు రాజసభ సమావేశమే కాలేదు. రాజుగారు, గురువుగారు మాత్రమే ఉన్నారు. రాజుగారి విపరీత ధోరణి గురించి మీరే స్వయంగా గురువు గారికి సెలవివ్వండి.


7
మనోవ్యధతో రాణి, ఆశ్రమంలో ఉన్న గురువుగారి వద్దకు వెళ్ళింది. గురువు గారిని కలుసుకొని, రాజుగారిలో వచ్చిన విపరీత ప్రవర్తన గురించి గురువుగారికి వివరించి వాపోయింది రాణి.
గురుదేవా! మీరే నా మనః క్లేశం తీరే మార్గం సెలవివ్వండి.
కలత చెందకండి మహారాణీ! నేను చెప్పినట్లు మాత్రం చెయ్యండి.
గురువు, రాణితో రహస్యంగా ఏదో చెప్పాడు. రాణి ముఖంలో కాస్తంత నమ్మకం ఏర్పడినట్లు కనిపించింది.


8
మర్నాడు ఉదయం ఉపాహారం తీసుకునే వేళ అయింది. రాజు అటూ ఇటూ తిరుగాడుతున్నాడు.
మహారాజా! మీరు, గురుదేవులు ఉపాహారం స్వీకరించడానికి రండి.
రండి గురుదేవా! మీరు బోధించిన అద్వైతాన్ని, మీరే ఆశ్చర్యపోయేలా నేడు రాజసభలో ఆచరణలో చూపబోతున్నాను.
అలాగా రాజా! చాలా సంతోషం.


9
ఆ! ఆకులో కాయగూరలు, వ్యర్థపదార్థాలు ఎవరు పెట్టారు? మధుర భక్ష్యాలు, పిండివంటల మధ్య వ్యర్థపదార్థాలా? ఇలా పెట్టి ఎవరు నన్ను అవమానపరిచారు?

















రాజా! మహోన్నతమైన అద్వైత జ్ఞానాన్ని ఆకళింపు చేసుకోవడం వల్ల ప్రాణులకు సేవ చేయడం సాక్షాత్తూ ఆ శివుణ్ణే సేవించడమనే భావన కలుగుతుంది. 'మానవ సేవే మాధవ సేవ' అని అర్థం చేసుకోండి. ఇకనైనా బాగా యోచించి, తదనుగుణంగా వ్యవహరించడానికి ప్రయత్నించండి.



బ్రహ్మసాక్షాత్కారం కానంత వరకు మానవునిలో ద్వైతభావమూ, పుణ్యపాప విచక్షణా ఉంటుంది. పుణ్యపాపాలూ, కీడుమేళ్ళూ సర్వం నీకు సమానమే అనీ, భగవంతుడు ఏం చేయిస్తే అది చేస్తున్నాననీ నువ్వు చెప్పవచ్చు. కానీ ఇవన్నీ వట్టి చిలుకపలుకులే! భగవంతుడే కర్త అనీ, తాను నిమిత్త మాత్రుడననీ నిజంగా నమ్మేవాడు ఎలాంటి పాపకార్యాన్ని చెయ్యలేదు. – *భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస*

# గ్రంథ పరిచయం



## శంకరాద్వైత విజ్ఞాన చంద్రికలు

రచయిత: శ్రీ అమ్ము అన్నాజీరావు
వెల: రూ. 45/- పుటలు : 195
ప్రతులకు: అమ్ము అన్నాజీరావు
ఇం. నెం. 5-4-1302/3, శారదానగర్
3వ ఫేజ్, వనస్థలిపురం, హైదరాబాదు-70
సెల్: 97033 13715

ఆదిశంకరులు అనగానే గుర్తుకు వచ్చేది జగన్మాతను హృద్యంగా వర్ణించి గానం చేసిన "సౌందర్యలహరి", శివతత్త్వాన్ని రమణీయంగా గానం చేసిన "శివానందలహరి" వంటి అద్భుతమైన కవితాస్రోతస్సులను పోలిన స్తోత్రాలే. తన్మయత్వంతో సాకారాన్ని స్తుతించిన శంకరులు, నిరాకార ప్రతిపాదకమైన అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించడం చారిత్రక అవసరం. అద్వైతామృతవర్షిణి అయిన భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని ఉత్తుంగహిమాలయ శిఖరాలకు చేర్చటమే కాకుండా, ఎక్కడో ఆకాశమార్గాన విహరిస్తూ, సామాన్యులకు అర్థం కాకుండా ఉన్న సిద్ధాంతాలను సామాన్యులకు అందుబాటులోకి తెచ్చింది కూడా శంకరులే. అటువంటి క్లిష్టమైన అద్వైత సిద్ధాంతాలను అన్నాజీరావుగారు మరింత సరళతరంచేసి ఈ గ్రంథం ద్వారా మనకు అందించారు. వారి కృషి అభినందనీయం. జిజ్ఞాసువులైన సాధకులందరూ చదవదగిన పుస్తకమిది. ❖ - ఎం.వి.నాగప్రసాద్



## శ్రీవాసుదేవ కథాసుధ

రచయిత : శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మ
వెల : రూ. 612/- పుటలు : 708
ప్రతులకు : ఆచార్య శ్రీ హరితీర్థస్వామి
శ్రీసత్యానందాశ్రమము
ఇనమడుగు - 524 137, నెల్లూరు జిల్లా
సెల్: 94402 79712

భూభారహరణానికి, ధర్మసంస్థాపనకు అవతరించిన శ్రీకృష్ణభగవానుడి వైభవవిశేషాలను విపులంగా వివరించే ప్రయత్నం చేసిన గ్రంథరాజమే ఈ 'శ్రీవాసుదేవ కథాసుధ'. మహాభారత, హరివంశ, శ్రీమద్భాగవత, విష్ణుపురాణాలను ఆధారంగా తీసుకొని బ్రహ్మశ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మగారు ఎంతో శ్రమకోర్చి ఈ పుస్తకాన్ని రచించారు. శ్రీకృష్ణపరమాత్ముని గురించి మన పురాణేతిహాసాలలో నిక్షిప్తమై ఉన్న కథాభాండాగారాన్ని రచయిత ఈ 'శ్రీవాసుదేవ కథాసుధ' రూపంలో ఆవిష్కరించారు. పండితులు, సునిశిత విమర్శకులు, చరిత్రపరిశోధకులు అయిన శర్మగారు, వాసుదేవుడికి సంబంధించిన అర్వాచీన కల్పనలకు దూరంగా, పరమప్రామాణికమైన కథలను ఈ గ్రంథంలో పొందుపరచి, పన్రెండు కాండములుగా తీర్చిదిద్ది ఈ గ్రంథాన్ని వెలువరించారు. ధార్మిక సారస్వతంపై అభిరుచి కలిగిన జిజ్ఞాసువులు అవశ్యంగా పఠించవలసిన పుస్తకమిది. ❖ - బి. సైదులు



## శ్రీగురుగీత

పద్యరచన : శ్రీ సందెపూడి రామచంద్రరావు
వెల : రూ. 50/- పుటలు : 200
ప్రతులకు : సందెపూడి జయలక్ష్మి
1-14-243, విమాన్ నగర్, సికింద్రాబాదు-3

భారతీయ ఆధ్యాత్మిక సాహిత్య వినీలాకాశంలో జాజ్జ్వల్యమానంగా భాసిస్తున్న తారలెన్నో. వాటిలో శ్రీరామకృష్ణులవారి బోధల సారమైన 'శ్రీరామకృష్ణ బోధామృతం' ధ్రువతారగా ప్రకాశిస్తున్నది. శ్రీచిరంతనానంద స్వామి రచించిన ఈ గ్రంథం ఎన్నో ముద్రణలకు నోచుకొని ఎంతోమంది జిజ్ఞాసువుల హృదయవీణా తంత్రులను సుతిమెత్తగా స్పృశించినది, ఇంకనూ స్పృశిస్తున్నది. నిగూఢం, గహనం, గంభీరం, దురవగాహమైన ఆధ్యాత్మిక సత్యాలను రోజూవారి దృష్టాంతాలతో వివరించి భారతావనిలో పామర జనులు కూడా అత్యున్నత వేదాంత సత్యాలను అవగాహన చేసుకోవాలన్న పరమాత్ముడి కృపాకటాక్షం, అహేతుక దయ రూపుదాల్చి శ్రీరామకృష్ణులుగా మనముందు ప్రత్యక్షమైంది. వారి బోధల సారమైన పై గ్రంథానికి సులలిత, మధుర పద్యరూపాన్ని అందిస్తున్నారు శ్రీ సందెపూడి రామచంద్రరావు. వీరి కృషి ప్రశంసనీయం. ఈ మందార మకరందాన్ని ఆస్వాదించడానికి మన మనోభ్రమరం సమాయత్తమవుగాక! ❖ - ఆనంద



## శ్రీమద్భగవద్గీత

పద్యరచన : శ్రీ సందెపూడి రామచంద్రరావు
వెల : రూ. 50/- పుటలు : 144
ప్రతులకు : సందెపూడి జయలక్ష్మి
1-14-243, విమాన్ నగర్, సికింద్రాబాదు-3
సెల్ : 94982 63755

వేదాంత సత్యాలను వ్యక్తం చేయడానికి గద్యంకన్నా పద్యమే సులభ మార్గం. వైదిక వాఙ్మయం యావత్తు సంస్కృత భాషలో శ్లోకరూపంలో ఉంది. పద్యరూపంలో లేదా శ్లోకరూపంలో ఉంటే సంగీతాన్ని కూర్చుకొని నిత్యపారాయణం చేసుకోవడం సులువు. ఆ విధంగా మహోన్నత ఆధ్యాత్మిక సత్యాలను సదా మన మనోఫలకంపై నిలుపుకోవచ్చును. శ్రీమద్భగవద్గీత గ్రంథానికి తేనెలొలికే తీయ తెనుగులో తేటగీతి పద్యాలను కూర్చి మనముందు ఉంచుతున్నారు శ్రీ సందెపూడి రామచంద్రరావు. ఆ పద్యాలకు చక్కటి తాత్పర్యాన్ని కూడా కూర్చి ఇంకా సులభంగా పద్యాన్ని అవగాహన చేసుకోవడానికి అవకాశం కల్పించారు. పద్యాలు మూలంలోని శ్లోకాల అర్థగాంభీర్యానికి, భావసౌందర్యానికి అద్దంపడుతున్నాయి. పుస్తకం రసజ్ఞులైన పఠితులను ఆనంద డోలికల్లో ముంచుతుందనడంలో సందేహం లేదు. ❖ - ఆనంద

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-5, Sri Ramakrishna Prabha (Telugu Monthly) May 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

ధనార్జనకు కావలసిన బలం కన్నా, ఆ ధనాన్ని త్యాగం చేయడానికి ఎక్కువ బలం కావాలి. అలాగే ధనత్యాగానికి అవసరమైన బలం కన్నా, సచ్ఛీలాన్ని పెంచుకోవడానికి మరింత ఎక్కువ బలం కావాలి. వీటన్నిటి కన్నా 'నేను' అనే అహాన్ని భగవంతుడి దివ్యచరణాల వద్ద సమర్పించడానికి సర్వోన్నతమైన శక్తి అవసరం. అదే అత్యున్నతమైన బలం. - స్వామి రంగనాథానంద





# సుబోధ

'భగవంతుడు ఉన్నాడు, పైన ఆకాశంలో సుదూరంలో ఆయన ఉన్నాడు' అంటాడు సాధారణ భక్తుడు. మధ్యమ భక్తుడు 'సర్వభూతాలలోనూ, చైతన్యరూపంలోనూ, ప్రాణస్వరూపంలోనూ ఉన్నాడు' అంటాడు. ఉత్తమ భక్తుడు 'భగవంతుడే సర్వమూ అయి ఉన్నాడు, కనిపించేవన్నీ ఆయన వేర్వేరు రూపాలే. ఆయనే మాయ, ఆయనే జీవజగత్తులు, ఆయనే సర్వమూ అయి ఉన్నాడు. ఆయన తప్ప వేరేదీ లేదు' అంటాడు.

భగవద్దర్శనం కాకుంటే ఇలాంటి మానసిక స్థితి కలుగదు. భగవద్దర్శనం పొందాడో లేదో అనడానికి కొన్ని లక్షణాలు ఉన్నాయి. అతడు కొన్ని సందర్భాలలో కల్లాకపటంలేని బాలుని స్థితిలో ఉంటాడు. అతడిలో అహంకారం ఉండదు, అనాసక్తుడిగా ఉంటాడు. ఏ గుణాలకూ వశవర్తి కాడు. సదా ఆనందమయుడై ఉంటాడు. మడి, మైల అనే భేదబుద్ధి అతడిలో ఉండదు. విధి విహితాలన్నీ అతడికి ఒకటే అయిపోతాయి. కొన్ని సమయాల్లో ఏదో చూస్తున్నట్లు, జడునిలా అయిపోతాడు. అప్పుడు ఏ పనీ చేయలేడు. ఏ ప్రయత్నంలోనూ పాల్గొనలేడు. ❖

**భక్తుడు:** ఉత్తమ భక్తుడెవరు? భగవద్దర్శనం పొందిన భక్తుడు ఎలా ఉంటాడు?

**శ్రీరామకృష్ణులు:** అందరూ భగవంతుణ్ణి గ్రాహ్యం చేసుకోగలరా? భగవంతుడు మంచి వారిని సృష్టించాడు, దుష్టులను సృష్టించాడు; భక్తులను సృజించాడు, భక్తిహీనులను సృజించాడు; విశ్వాసం ఉన్నవారిని సృష్టించాడు, విశ్వాసరహితులను సృష్టించాడు. ఆయన లీలలలో అన్ని వైచిత్ర్యాలూ ఉన్నాయి. ఆయన శక్తి కొన్నిచోట్ల అధికంగా అభివ్యక్తీకృతమవుతోంది. కొన్నిచోట్ల తక్కువగా అభివ్యక్తమవుతోంది. సూర్యరశ్మి మట్టిపైన కన్నా నీళ్ళలో ఎక్కువగా ప్రకాశిస్తుంది. నీటి కన్నా అద్దంలో మరింతగా ప్రకాశిస్తుంది. ఉత్తమ భక్తుడు, మధ్యమ భక్తుడు, సాధారణ భక్తుడు అంటూ భక్తులలోనూ చాలా రకాలున్నారు.

(శ్రీరామకృష్ణ కథామృతం నుండి)




**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద  సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద




# స్వామి వివేకానంద రథయాత్ర

**11 సెప్టెంబర్ 2012 నుంచి**
**12 జనవరి 2014 వరకు**

భారతావని ఆధ్యాత్మిక వైభవాన్ని విశ్వవ్యాప్తం గావించిన యుగపురుషుడు స్వామి వివేకానంద. 1893 సెప్టెంబర్ 11వ తేదీన చికాగోలో చారిత్రాత్మక ప్రసంగంతో ప్రారంభమైన స్వామీజీ జైత్రయాత్ర ఖండఖండాంతరాల్లో జగజ్జేయమానంగా విజయఢంకా మోగించింది. మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని నేల నాలుగుచెరగులా చాటిన ఆ కారణజన్ముడి 150వ (2013- 2014) జన్మదిన వార్షికోత్సవాలను దేశవ్యాప్తంగా రామకృష్ణ సంఘం వైభవోపేతంగా నిర్వహించదలచింది.

ఈ మహోత్సవాలను పురస్కరించుకొని హైదరాబాదు రామకృష్ణ మఠం స్వామి వివేకానంద సందేశాన్ని తెలుగునాట నలుదిశలా పరివ్యాప్తం చేయాలన్న సత్సంకల్పంతో 'స్వామి వివేకానంద రథయాత్ర'ను నిర్వహించనుంది. ఈ రథయాత్ర - సర్వాలంకార భూషితమైన స్వామి వివేకానంద రథం, స్వామీజీ జీవిత విశేషాలతో కూడిన సంచార ప్రదర్శనశాల, స్వామి వివేకానంద సాహిత్య సంచార విక్రయశాలలతో కొనసాగుతుంది. ఆంధ్రరాష్ట్రమంతటా (2012 సెప్టెంబర్ 11 నుంచి 2014 జనవరి 12 వరకు) సాగే ఈ రథయాత్ర - విజయవాడ, రామకృష్ణ మిషన్; రాజమండ్రి, రామకృష్ణ మఠం; కడప, రామకృష్ణ మిషన్ కేంద్రాల సహకారంతో అత్యంత వైభవంగా నిర్వహించేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి.

స్వామి వివేకానంద రథాన్ని తమ ప్రాంతాలకు ఆహ్వానించదలచుకునే శ్రీరామకృష్ణ సేవాసమితులు, విద్యాసంస్థలు, ఇతర స్వచ్ఛంద సంస్థలవారు పూర్తి వివరాల కోసం ఈ మఠ కేంద్రాలను సంప్రతించండి:

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, విజయవాడ.**

**రథం పర్యటన తేదీలు : 11-09-2012 నుండి 20-10-2012 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** కృష్ణా, గుంటూరు జిల్లాలు; ఖమ్మం, నల్గొండ, ప్రకాశం జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలు.

*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్ :* రామకృష్ణమిషన్, గాంధీనగరం, విజయవాడ - 520 003.

*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, సీతానగరం, తాడేపల్లి (పోస్ట్),గుంటూరు జిల్లా - 522 501. ఫోన్: 0866-2570799, 9985539422.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, రాజమండ్రి.**

**రథం పర్యటన తేదీలు : 24-10-2012 నుండి 30-04-2013 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు.

*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, రామకృష్ణ-వివేకానంద నగర్, రాజమండ్రి - 533 105. సెల్ : 9396673111.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, కడప.**

**రథం పర్యటన తేదీలు : 01-06-2013 నుండి 30-09-2013 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** కడప, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు జిల్లాలు; ప్రకాశం జిల్లాలోని కొన్ని ప్రాంతాలు.

*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్* - రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప - 516 005.

*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి వద్ద, కడప - 516 002. సెల్ : 9248545012.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, హైదరాబాదు.**

**రథం పర్యటన తేదీలు : 01-10-2013 నుండి 12-01-2014 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** హైదరాబాదు, కరీంనగర్, నిజామాబాద్, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్, వరంగల్, మెదక్ జిల్లాలు; ఖమ్మం, నల్గొండ జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలు.

*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, దోమల్‌గూడ, హైదరాబాదు- 500 029. సెల్ : 8498011535.

ఈ రథోత్సవంలో రాష్ట్రప్రజలు, యువతీయువకులు, విద్యార్థినీ విద్యార్థులు, రామకృష్ణ-వివేకానంద భావప్రచార పరిషత్ సభ్యులు, కార్యకర్తలు, భక్తులు, శ్రేయోభిలాషులు సమధికోత్సాహంతో పాల్గొని, సేవలందించాలని కోరుతున్నాం. ఈ బృహత్ కార్యక్రమాన్ని దిగ్విజయం చేయడానికి మనమందరం కృషి చేద్దాం. స్వామి వివేకానంద సందేశామృతంతో తెలుగు ప్రజల హృదయాలను నింపుదాం.

భగవత్సేవలో...

స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు
రామకృష్ణ మఠం, హైదరాబాదు.

**రామకృష్ణ మఠం**, దోమల్‌గూడ, హైదరాబాదు-29
సెల్ : 8498011535
email : sv150aprathayatra@rkmath.org



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 6 జూన్ 2012

మహాంభోధే స్తీరే కనకరుచిరే నీలశిఖరే
వసన్ ప్రాసాదాంతః సహజబలభద్రేణ బలినా।
సుభద్రామధ్యస్థః సకలసురసేవావసరదో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥

మహాసముద్రతీరంలో నీలాద్రి శిఖరంపై మనోహర సువర్ణ ప్రాసాదంలో మహాబలశాలియైన శ్రీబలరాముడు, మధ్యన సుభద్రాదేవితో, సకలదేవతల సేవలను స్వీకరిస్తూ వరదుడవైన ఓ జగన్నాథస్వామీ! నన్ను కరుణించి, నాకు ఆధ్యాత్మిక మార్గాన్ని చూపించు. – శ్రీచైతన్య మహాప్రభు

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : | శ్రీమతి కోడూరు శైలజ, డి.డి. కాలనీ, హైదరాబాదు - 500 013 | 11,111 |
| మహారాజ పోషకులు | : | శ్రీ జె. సంజయ్ రెడ్డి & శ్రీ జె. అప్పారావు, నౌపడ (ఆర్.ఎస్.), శ్రీకాకుళం జిల్లా (కీ॥శే॥ జీరు లక్ష్మి జ్ఞాపకార్థం) | 10,116 |
| మహారాజ పోషకులు | : | శ్రీమతి ఎమ్. స్వర్ణ కుమారి రావు, ఉల్లాసనగర్, పూణె - 411 040 | 10,116 |
| రాజ పోషకులు | : | వేదుల జ్యోతి , జి.ఎ.ఎన్. కాలనీ, శ్రీకాకుళం - 532 001 | 5,000 |
| పోషకులు | : | శ్రీమతి చింతా లక్ష్మి & శ్రీ జి.ఎస్. రామకృష్ణ, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు- 500 060 | 2,000 |
| పోషకులు | : | శ్రీ మాకిన వేంకటరమణ, సత్యనారాయణపురం, విజయవాడ -520 011 | 1,116 |
| పోషకులు | : | శ్రీ ఎమ్. కాళీప్రసాదరావు, బలగ, శ్రీకాకుళం -532 001 | 1,000 |
| పోషకులు | : | శ్రీ బూశెట్టి రమణమూర్తి, అనంతపురం - 515 005 | 1,000 |
| పోషకులు | : | శ్రీ సి.హెచ్. నరసింహారావు, ఆర్.కె. పురం, సికింద్రాబాదు (సి.ఆర్.కె. ఫౌండేషన్-2011 చేబ్రోలు) | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math,
Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్

సంపాదకీయం

# ఆధ్యాత్మిక యాత్రకు రథయాత్ర సందేశం



భారతదేశం ఎన్నో పుణ్యక్షేత్రాలకు నిలయం. ఆధ్యాత్మిక భావతరంగాలతో నిండిన పుణ్యక్షేత్రాలను సందర్శించడం వల్ల మనస్సు పరిశుద్ధమవుతుంది. అప్రయత్నంగానే జపధ్యానాలలో లగ్నమవుతుంది. ఆధ్యాత్మికశక్తి జాగృతమై భగవంతుని దర్శనం సులభంగా లభిస్తుంది. అందుకే మన ఋషులు, యోగులు, భక్తులు తీర్థయాత్రలు చేయడం కూడా ఆధ్యాత్మిక సాధనలో అంతర్భాగంగానే పరిగణించారు.

తీర్థయాత్రల ప్రయోజనం గురించి శ్రీరామకృష్ణులు ఇలా వివరించారు: "ఆవుపాలు దాని శరీరమంతటా వ్యాపించి ఉన్నా పాలను పొందడానికి ఆవు పొదుగును పిండాలి. అంతేకానీ దాని చెవులను, కొమ్ములను పిండడం వల్ల పాలు లభించవు కదా! అలాగే భగవంతుడు సర్వాంతర్యామి అయినప్పటికీ అసంఖ్యాకులైన భక్తులు పుణ్యక్షేత్రాలలో జపతప సాధనలను అనుష్ఠించడం వల్ల అక్కడ భగవంతుడు నిశ్చయంగా కొలువై ఉంటాడు." ఆధ్యాత్మిక శక్తిని జాగృతపరిచే ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రాలలో పూరీ క్షేత్రం ఒకటి.

**జగన్నాథుడే శ్రీరామకృష్ణుడు:** కలకత్తా దక్షిణేశ్వరాన్ని ప్రఖ్యాత పుణ్యక్షేత్రంగా తీర్చిదిద్దిన భగవాన్ శ్రీరామకృష్ణులు సైతం కాశీ, బృందావనం లాంటి పుణ్యక్షేత్రాలను సందర్శించారు. ఆ యా క్షేత్రాల్లో కొలువైవున్న అన్నపూర్ణా విశ్వేశ్వరులు, రాధాకృష్ణుల దర్శనం పొందారు. కాశీ, బృందావన యాత్రలు జరిపిన శ్రీరామకృష్ణులు పూరీక్షేత్రాన్ని ఎన్నడూ సందర్శించలేదు. అందుకు శ్రీరామకృష్ణులు "పూరీలో వెలసిన ఆ జగన్నాథుణ్ణి నేనే. నేను అక్కడికి వెళితే తిరిగి రాలేను (జగన్నాథునిలో ఐక్యమైపోతాను)" అని భక్తులతో అనేకమార్లు అన్నారు.

పూరీ క్షేత్రాన్ని సందర్శించిన స్వామి తురీయానంద, స్వామి ప్రేమానంద, మహేంద్రనాథ్ గుప్తా, మనోమోహన్‌మిత్రా, శ్రీరామకృష్ణుల చిన్న అన్న కుమార్తె లక్ష్మి మొదలైనవారు జగన్నాథస్వామి స్థానంలో శ్రీరామకృష్ణులను దర్శించారు. ఆ జగన్నాథుడే శ్రీరామకృష్ణులు అనడానికి భక్తుల అనుభవాలే నిదర్శనం.

**రథయాత్రలో శ్రీరామకృష్ణులు:** శ్రీరామకృష్ణులు తమ జీవిత కాలంలో పూరీ జగన్నాథుణ్ణి దర్శించలేకపోయినప్పటికీ ప్రతి సంవత్సరం బలరాంబోస్ ఇంట్లో జరిగే జగన్నాథ రథయాత్రలో పాల్గొనేవారు. బలరాంబోస్ ఇంటి వసారాలో జగన్నాథ, సుభద్ర, బలభద్రుల విగ్రహాలతో శోభాయమానంగా అలంకరించిన చిన్న రథాన్ని శ్రీరామకృష్ణులు స్వయంగా లాగేవారు. భక్తులంతా ఉత్సాహంగా నృత్యగానం చేస్తూ రథోత్సవంలో పాల్గొనేవారు. ఆ విధంగా శ్రీరామకృష్ణులు పూరీజగన్నాథ రథయాత్రలో పాల్గొంటున్న అనుభూతిని పొంది భావపరవశులయ్యేవారు.

**ఆధ్యాత్మిక యాత్రకు అర్హతనిచ్చే ప్రసాదం:** "గంగాజలం, బృందావనం మట్టి, జగన్నాథ అన్నప్రసాదాలు పరమాత్మ స్వరూపాలు. ముఖ్యంగా జగన్నాథ ప్రసాదం స్వీకరిస్తే శ్రద్ధ, భక్తి, జ్ఞానాలు వృద్ధి చెందుతాయి" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. శ్రీరామకృష్ణులు జగన్నాథ ప్రసాదాన్ని (ఎండబెట్టిన అన్నం) ఒక చిన్న సంచీలో ఉంచుకొని, ప్రతి రోజూ ఒక గింజను స్వీకరించేవారు.

ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నతిని సాధించడానికి సాధకుడికి ముఖ్యంగా కావలసిన అర్హతలు మూడు. గురూపదేశాల పట్ల 'శ్రద్ధ', భగవంతుని పట్ల 'భక్తి', సాధన మార్గంలో ఎదురయ్యే అవాంతరాలను అధిగమించేందుకు 'జ్ఞానం'. ఈ మూడు లక్షణాలూ జగన్నాథ ప్రసాదాన్ని స్వీకరించడం వల్ల సంప్రాప్తిస్తాయని శ్రీరామకృష్ణులు తెలిపారు. అలాగే రథయాత్రకు సంబంధించిన సంప్రదాయాలను కూడా మన ఆధ్యాత్మిక యాత్రతో అన్వయించుకొని, భగవత్కృపకు ఎలా పాత్రులం కాగలమో తెలుసుకుందాం.

**స్థలపురాణం నేర్పే పాఠం:** ఇంద్రద్యుమ్న మహారాజుకు విష్ణుమూర్తి కలలో కనిపించి నదీతీరానికి ఒక కొయ్యదుంగ కొట్టుకు వస్తుందని; దానితో జగన్నాథ, సుభద్ర, బలభద్రుల విగ్రహాలను తయారు చేయమని ఆజ్ఞాపించాడు. విష్ణుమూర్తి సూచించినట్లుగానే నదీతీరాన కొయ్యదుంగ లభించింది. కానీ ఆ దారువును విగ్రహాలుగా మలచడానికి ఏ శిల్పి కూడా ముందుకు రాలేదు. విష్ణుమూర్తి ఆజ్ఞ నెరవేరనందుకు మహారాజు విచారవదనుడై ఉండగా, దేవశిల్పి విశ్వకర్మ మారువేషంలో రాజు

దగ్గరకు వచ్చి "దారు విగ్రహాలను నేను మలుస్తాను. కానీ విగ్రహాల పని పూర్తయ్యేంత వరకు ఎవ్వరూ నన్ను ఆటంకపరచకూడదు. నా గదిలోకి ఎవ్వరూ రాకూడదు" అని షరతు పెట్టాడు. ఆ శిల్పి పెట్టిన షరతుకు మహారాజు అంగీకరించి, విగ్రహాలను మలచడానికి ప్రత్యేకమయిన గదిని ఏర్పాటు చేశాడు. శిల్పి గది తలుపులను మూసుకొని విగ్రహాలను చెక్కడం ప్రారంభించాడు. అలా పదిహేను రోజులు గడిచిపోయినా అతడు తలుపులు తెరవలేదు. అందువల్ల మహారాజుకు సందేహం వచ్చి, గది తలుపులు తెరచిచూశాడు. శిల్పి పెట్టిన షరతును మహారాజు ఉల్లంఘించడం వల్ల మారువేషంలో ఉన్న దేవశిల్పి విశ్వకర్మ అదృశ్యమయ్యాడు. విగ్రహాలను మలచడం పూర్తికాలేదు. అలా సగం పూర్తయిన విగ్రహాలనే ఆలయంలో ప్రతిష్ఠించడం జరిగింది. అప్పటి నుండీ అదే రూపాలలో జగన్నాథుడు, సుభద్ర, బలభద్రుడు భక్తులకు దర్శనమివ్వడం సంప్రదాయంగా వస్తోందని స్థలపురాణం చెబుతోంది.



దేవశిల్పి విశ్వకర్మ చెప్పిన మాటలను విస్మరించడం వల్ల భగవంతుని సంపూర్ణ విగ్రహాలను దర్శించుకునే అదృష్టాన్ని ఇంద్రద్యుమ్న మహారాజు కోల్పోయాడు. ఎన్నో ఏళ్ళుగా జప ధ్యానాలను అనుష్ఠిస్తున్న సాధకులకు భగవద్దర్శనం లభించకపోతే వారిలో నిరుత్సాహం కలగడం సహజం. కానీ గురూపదేశాల యందు విశ్వాసం ఉంచి, సాధనా జీవితాన్ని కొనసాగించాలి. సాధకుడు అన్ని విధాలా అర్హత సాధించినప్పుడు గురుకృప చేత భగవత్సాక్షాత్కారం తప్పక లభిస్తుంది. అందుకే సాధకులు నిరుత్సాహపడకుండా సహనంతో సాధన చేయాలని శ్రీశారదాదేవి "గురూపదేశానుసారం జపధ్యాన సాధనలను క్రమం తప్పకుండా అనుష్ఠిస్తూ ఉండాలి. మన ఆధ్యాత్మిక పురోగతిని మనమే బేరీజు వేసుకోవడం అహంకారాన్ని తెలియజేస్తుంది. కాబట్టి గురువాక్యాల యందు సంపూర్ణ విశ్వాసం ఉంచి సాధన చేస్తే గురువు కృపతో భగవంతుని సాక్షాత్కారం లభిస్తుంది" అని సూచించారు. కాబట్టి గురువాజ్ఞను ఉల్లంఘించ కుండా శ్రద్ధ, విశ్వాసాలతో సాధనను అనుష్ఠించినప్పుడే భగవదనుగ్రహం పరిపూర్ణంగా లభిస్తుందన్నది ఈ సంఘటన ద్వారా మనం గ్రహించాల్సిన విషయం.

**భక్తి సాయంతో మనశ్శుద్ధి:** మన దేశంలో ఇతర ఆలయాల్లో జరిగే రథయాత్రతో పోల్చి చూస్తే పూరీలో జరిగే రథయాత్రకు ఒక ప్రత్యేకత ఉంది. సాధారణంగా రథయాత్రలో ఉత్సవ విగ్రహాలను ఊరేగిస్తారు. కానీ, పూరీ రథయాత్రలో మూల విరాట్‌లను ఊరేగించడం విశేషం. సుభద్ర, బలభద్ర, జగన్నాథులు రథారూఢులై యాత్రకు సిద్ధంగా ఉన్నప్పుడు, పూరీ సంస్థానాధీశుడు జగన్నాథుని ముంగిట బంగారు చీపురుతో శుభ్రం చేయడం సంప్రదాయం.

రథయాత్ర ప్రారంభానికి ముందు తానే స్వయంగా రథాన్ని శుభ్రం చేయడం మహారాజు భక్తి వినయాలకు తార్కాణం. అలాగే, ఆధ్యాత్మిక యాత్రకు సన్నద్ధమైన సాధకుడు అధికార, అహంకార మమకారాలను త్యజించి భక్తి అనే చీపురుతో మనస్సనే పీఠాన్ని పరిశుభ్రం చేయాలి. అప్పుడు హృదయ వేదికపై ఆ పరమాత్ముడు నిత్యం కొలువుతీరి ఉంటాడు. ఆ పురుషోత్తముడే నిత్యం మనతో ఉన్నప్పుడు ఇక మన ఆధ్యాత్మిక యాత్రకు ఎలాంటి ఆటంకమూ ఉండదు.

**గమ్యం వైపే గమనం:** పూరీ రథయాత్రకూ, మన ఆధ్యాత్మిక యాత్రకూ అన్యోన్య సంబంధం ఉంది. జగన్నాథ రథయాత్ర మందగమనంతో ముందుకు వెళుతుంది. కానీ ఒక్కసారి రథం కదిలిందంటే మార్గమధ్యంలో ఎన్ని అవాంతరాలు వచ్చినా గమ్యం చేరేవరకు ఆగదు. ఎలాంటి క్లిష్టపరిస్థితులు ఎదురైనప్పటికీ రథం వెనుకకు మరలే ప్రసక్తే ఉండదు.

ఆధ్యాత్మిక యాత్ర ప్రారంభించిన సాధకుడు భగవత్సాక్షాత్కారం పొందే వరకు సాధనా మార్గంలో ఎన్ని ప్రలోభాలు, ఆకర్షణలు ఎదురైనప్పటికీ వెనుదిరగకుండా మనో నిగ్రహంతో గమ్యం వైపు పయనించాలి. గమనం ఎంత నెమ్మది అయినప్పటికీ, సురక్షితంగా పయనిస్తూ, పురోగతిని సాధించడమే సాధకుని ధ్యేయం కావాలి. శ్రీకృష్ణ భగవానుడు ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సాధకుడు ఎలా ఉండాలో చెబుతూ కూర్మాన్ని ఆదర్శంగా చూపించాడు.

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** *(భగవద్గీత-2.58)*

'తాబేలు అవయవాలన్నింటినీ తనలోకి ఇముడ్చుకొన్నట్లు సాధకుడు తన ఇంద్రియాలను ఇంద్రియ విషయాల నుండి ఉపసంహరించుకోవాలి. అలాంటి వాడు స్థిరమైన బుద్ధి కలిగివుంటాడు'.

ఆధ్యాత్మిక యాత్రలో ఎలాంటి ఆకర్షణలకూ ప్రలోభ పడకుండా, ఆటంకాలకు నిరుత్సాహపడకుండా, నిత్యానిత్య వస్తు వివేకంతో వ్యవహరిస్తూ గమనాన్ని గమ్యం వైపే సాగించాలి. జగన్నాథరథం ఎప్పుడూ ముందుకే పయనించడంలోని అంతరార్థం ఇదే!

జగన్నాథ రథయాత్ర లాగే మన ఆధ్యాత్మిక యాత్ర కూడా నిరాటంకంగా సాగిపోయేందుకు శ్రద్ధ, భక్తి, జ్ఞానాలను ప్రసాదించాల్సిందిగా గమ్యం, గమనం అన్నీ తానై ఉన్న ఆ జగన్నాథుణ్ణి మనసారా వేడుకుందాం. ❖

**పరమపావనమైన పూరీక్షేత్రంలో మహావిష్ణువు, జగన్నాథునిగా భాసిస్తున్నాడు. కేవలం దర్శన మాత్రంచేత ముక్తినీ, సర్వతీర్థ సందర్శన ఫలాన్నీ ప్రసాదించే మహా పుణ్యక్షేత్రం ఇది.** - స్కాందపురాణం

# అరుంధతీ న్యాయం

వసిష్ఠ మహర్షి సప్తఋషులలో ఒకరు. ఆయన భార్య అరుంధతి. ఆమె మహాపతివ్రత. సప్తఋషి మండల నక్షత్ర సమూహంలో వసిష్ఠుని ప్రక్కన అరుంధతి తారగా ప్రకాశిస్తూ ఉంటుంది. ముని పత్నులెవ్వరికీ దక్కని విశిష్ట స్థానం ఆమెకు లభించింది. ఈనాటికీ వివాహ సమయాల్లో వధూవరులకు అరుంధతీ నక్షత్రాన్ని చూపించడం మన సంప్రదాయం.

ఈ అరుంధతీ నక్షత్రం ఆకాశంలో మిణుకు మిణుకు మంటూ ప్రకాశిస్తూ ఉంటుంది. వరుడు మొదటి పర్యాయం వధువును ఇంటికి తీసుకొనివచ్చినప్పుడు, అతడు ఆమెకు అరుంధతీ నక్షత్రంను చూపుతాడు. ఆమె ఆ చిన్న నక్షత్రాన్ని సులభంగా గుర్తించ డానికి వీలుగా ముందు చెట్టుకొమ్మను గానీ, దగ్గరలో ఉన్న మరేదైనా ఎత్తైన ప్రదేశాన్నిగానీ చూపిస్తూ ఆ మార్గంలోనే ఆకాశంలోకి చూపుసారించమని చెబుతాడు. ఈ విధంగా అతడు అనేక గుర్తుల ఆధారంగా ఆమె అరుంధతీ నక్షత్రాన్ని దర్శించేలా చేస్తాడు. ఈ పద్ధతిని 'అరుంధతీ న్యాయం' అంటారు.



ఒక మహిళా కళాశాలలో ఒక ఉపాధ్యాయిని విద్యార్థినులకు భారత నారీమణుల పాతివ్రత్యం గురించి, భారతీయ సంస్కృతీ వైభవం గురించి బోధిస్తోంది. అలా ఆ ఉపాధ్యాయిని అరుంధతి పాతివ్రత్యం గురించి వివరిస్తూ... "అరుంధతిని చూడడం ఎంత కష్టమో" అని చెప్పగానే, ఒక విద్యార్థిని లేచి నిలబడి "అదేంటి మేడం! అలా అంటారు. మీకంత కష్టంగా ఉంటే చెప్పండి, నేను మీకు ఈ రోజే 'అరుంధతి'ని చూపిస్తాను. నేను ఇప్పటికి నాలుగుసార్లు చూశాను" అని అంది.

ఆ అమ్మాయి మాటలు విని మనకు నవ్వొచ్చినట్లు, ఆ ఉపాధ్యాయినికి చాలా కోపం వచ్చి ఉంటుంది. ఇప్పుడు అసలు విషయానికి వద్దాం. మన జీవిత ఆశయాన్ని చేరుకోవడానికి అరుంధతీ న్యాయ ప్రాధాన్యం ఏమిటో తెలుసుకుందాం:

ఉన్నతి పొందాలనుకునే ఏ వ్యక్తి అయినా మొదట ఆదర్శాన్ని ఎంచుకోవాలి. కానీ ఉన్నత ఆదర్శాలు అంత త్వరగా కంటికి కనపడవు. కనపడ్డా అంత సులభంగా తలకెక్కవు. మనం రెండు రకాల ప్రపంచాలలో జీవిస్తున్నాం. ఒకటి కంటికి కనిపించే బాహ్యప్రపంచం, అది స్థూలం. మరొకటి కంటికి కనపడని అంతర ప్రపంచం, అది సూక్ష్మం. అంతర ప్రపంచాన్ని చేరుకోవడానికి అన్వేషణ మొదట బాహ్య ప్రపంచం నుండే మొదలవుతుంది. మన సుఖ సంతోషాలకు ఈ బాహ్య ప్రపంచమే ఆధారమనిపిస్తుంది.

'మనిషి' అంటే 'మని+షి' (కాంచనం-కామం) అని భావించి, జీవితాంతం విషయ సుఖాలలో మునిగితేలే వారు చార్వాకుల సంతతికి చెందుతారు. అప్పుచేసి పప్పుకూడు తింటూ, మన పబ్బం గడిస్తేచాలు అనుకునే 'చార్వాకులు' సూర్యచంద్రులు ఉన్నంత వరకు మహాభేషుగ్గా కాలం గడిపేస్తారు.

కానీ ఎలాంటి చార్వాకుల సంతతికి చెందినవాడైనా ఎప్పుడో ఒకప్పుడు తనలో అంతర్నిహితంగా ఉన్న దివ్యాత్మను దర్శించడానికి ప్రయత్నిస్తాడు. పూజ, జపధ్యానాలను అనుష్ఠిస్తూ పరమాత్మను దర్శించడానికి అన్వేషణ ప్రారంభిస్తాడు. అప్పుడు ఈ బాహ్య ప్రపంచం ఒక అడ్డంకిగా అనిపించదు. అది ఒక సమస్యగా కాక స్పందనగా మారుతుంది. ఈ జగత్తులో దేనిని చూసినా ఆ పరమాత్ముడే గుర్తుకు వస్తాడు. అనంత చైతన్యమే గోచరిస్తుంది. శ్రీరామకృష్ణులు చెప్పినట్లు వకీలు కనిపించగానే న్యాయస్థానం తలపుకు వచ్చినట్లు, గుళ్ళు గోపురాలు భగవంతుణ్ణి గుర్తుకు తెస్తాయి. శ్రీరామకృష్ణులకు కలకత్తా జంతుప్రదర్శనశాలలో సింహాన్ని చూసినప్పుడు దుర్గమ్మ జ్ఞాపకం వచ్చింది. చెట్టుకి ఆనుకుని త్రిభంగిమలో నిలబడివున్న బాలుణ్ణి చూసినప్పుడు శ్రీకృష్ణుడు తలపుకు వచ్చాడు.

బాహ్య ప్రపంచంలోని గుర్తుల ఆధారంతో ఆకాశంలో ప్రకాశిస్తున్న అరుంధతీ నక్షత్రాన్ని గుర్తించినట్లు, స్థూల ప్రపంచం ఆధారంతో మన అంతరంగంలో ప్రకాశిస్తున్న దివ్యాత్మను దర్శించాలన్న సత్యాన్ని బోధిస్తోంది 'అరుంధతీ న్యాయం'. ❖



# పరమవీరచక్ర రూపకల్పనలో
# పరమహంస భక్తురాలు



పరాయిదేశంలో పుట్టినా పరమహంస భక్తురాలిగా పావనజీవనాన్ని గడిపి ఈ పుడమిపైనే తనువు చాలించిన ధన్యురాలు – ఈవావాన్ మాడే డే మారోస్. భారతీయతను అణువణువునా పుణికిపుచ్చుకున్న ఆమె తన పేరును సావిత్రీ బాయిగా మార్చుకున్నారు. ఆ నారీమణి భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఆధ్యాత్మిక పథానికి ఆకర్షితురాలై, మన ధార్మిక సారస్వతాన్ని ఆపోశన పట్టారు. భారత సైనిక వీరుల అసమాన శౌర్యానికీ, సాహసానికీ సగర్వంగా ప్రదానం చేసే ప్రతిష్ఠాత్మకమైన 'పరమవీర చక్ర' పురస్కారానికి రూపకల్పన గావించి, తన జీవన సార్థకతకు కారణభూతమైన ఈ నేల రుణం తీర్చుకున్న చారిత్రక వనిత ఆమె!



**పుట్టిన గడ్డను విడచి పుణ్యభూమికి..:** స్విట్జర్లాండ్‌లో 1913లో జన్మించిన ఈవావాన్‌కు చిన్నప్పుడే తల్లి కన్నుమూసింది. తండ్రి లైబ్రేరియన్‌గా వృత్తిలో అలుపెరగకుండా కష్టపడుతూ ఉండేవాడు. అలా లేప్రాయం నుంచే ఆమెకు ఒంటరితనంతో మైత్రి కుదిరింది. ఈవావాన్ 1929లో బ్రిటన్‌లో యాదృచ్ఛికంగా పరిచయమైన భారతసైనికాధికారి విక్రమ్ ఖానోల్కర్‌ను వివాహం చేసుకుంది.

1932లో జెనీవా వదలి భారతదేశానికి వచ్చి లక్నోలో స్థిరపడ్డారు. అక్కడే ఈవా తన పేరును సావిత్రీబాయి ఖానోల్కర్‌గా మార్చుకున్నారు. ఈ పుణ్యభూమిలో అడుగుపెట్టాక ఆమె పూర్తిగా పదహారణాల భారతీయ వనిత కట్టుబొట్టును అలవరచుకున్నారు. అప్పుడే పాట్నా విశ్వవిద్యాలయంలో హిందీ, సంస్కృత భాషలను అభ్యసించారు. అంతేకాకుండా మరాఠీ భాషలో కూడా మంచి ప్రావీణ్యం సాధించారు. మన పురాణాలనూ, శాస్త్రాలనూ అధ్యయనం చేయడమే కాదు, ఏకంగా 'సెయింట్స్ ఆఫ్ మహారాష్ట్ర' అనే పుస్తకం కూడా రాశారు. భారతీయ విద్యాభవన్ ప్రచురించిన ఈ పుస్తకం బహుళ ప్రజాదరణ పొంది, వేల ప్రతులు అమ్ముడైంది.

**పరమహంస భక్తురాలిగా...:** వేదాంత సాహిత్యాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించారు. ఈ సమయంలోనే సావిత్రీబాయి శ్రీరామకృష్ణ మఠానికి సన్నిహితు రాలయ్యారు. 1952లో భర్త పరమపదించిన తరువాత సావిత్రీబాయి పూర్తిగా శ్రీరామకృష్ణ మఠ సేవాకార్యక్రమాలకే అంకితమయ్యారు. దేశ విభజన సమయంలో మహిళా శరణార్థుల కోసం పలు శిబిరాలను కూడా నిర్వహించారు.

**'పరమవీరచక్ర'కు రూపమిచ్చిన తీరు :** 1948లో భారత సైనికుల సర్వోన్నత పోరాట పటిమకు ప్రతీకగా ఒక పురస్కారాన్ని రూపకల్పన చేయాలని ప్రభుత్వం భావించింది. ఆ బాధ్యతను మేజర్ హీరాలాల్ అటల్‌కు అప్పజెప్పింది. అతను సావిత్రీబాయి భర్త అయిన మేజర్ జనరల్ విక్రమ్ ఖానోల్కర్‌కు మిత్రుడు. ఆ పురస్కార పతకం ఎలా ఉండాలన్న విషయంలో ఆ ఇద్దరు మిత్రుల మధ్య తర్జనభర్జనలు సాగుతూ ఉండేవి. భారతీయ ధార్మికతకూ, చారిత్రక వైభవానికీ ప్రతీకగా ఆ పతకం రూపొందాలని దీక్షగా శ్రమిస్తూ, ఒకానొక సమయంలో సావిత్రీబాయిని సంప్రతించారు. ఆమె వారికి మన పురాణాల్లోని దధీచిమహర్షి కథను గుర్తుచేశారు. వృత్రాసురుని వధించేందుకు దధీచి తన వెన్నెముకను ఆయుధంగా చేసు కొమ్మని దేవతలకు సూచిస్తూ, తన దేహాన్నే త్యాగం చేశాడు. ఆ త్యాగమూర్తి వెన్నెముకే వజ్రాయుధమైంది. ఆ వజ్రాయుధం అనుపమాన త్యాగానికీ, అసమాన పౌరుషానికీ ప్రతీక. అదే విషయాన్ని హీరాలాల్‌కి చెప్పడమే కాకుండా, టిబెటన్ సాహిత్యంలో లభించే వజ్రాయుధం నమూనాని కూడా చూపించారు. అదే విధంగా అమ్మవారి ప్రసాదంగా ఛత్రపతి శివాజీకి లభించిన పవిత్రమైన భవానీ ఖడ్గం హైందవ రాజ్యస్థాపనకు దోహదం చేసిందని గుర్తుచేశారు. ఇలా సావిత్రీబాయి ఇచ్చిన సూచనలతో నాలుగు వజ్రాయుధాలు, ఇరువైపులా భవానీ ఖడ్గాలు, మధ్యలో అశోకధర్మచక్రం ఉండేలా 'పరమవీర చక్ర'ను రూపొందించారు. ఇలా ఆ స్త్రీమూర్తి రూపొందించిన 'పరమవీరచక్ర'ను అందుకున్న ప్రథమ సాహససేనాని – ఆమె మేనల్లుడు మేజర్ సోమనాథశర్మ కావడం విశేషం. యావత్ భారతజాతికి ఆదర్శంగా నిలిచిన సావిత్రీబాయి జీవిత చరమాంకం వరకూ శ్రీరామకృష్ణుల సారస్వత పఠన, ధ్యానాదులతో గడిపి, 1990లో ఆయన దివ్యలోకానికి చేరుకున్నారు. ❖

సేకరణ : ఎమ్. రాంబాబు

**భగవంతుని నామరూపాలు అనంతం. వీటిలో దేని మూలంగానైనా భగవంతుణ్ణి దర్శించవచ్చు. ఏ నామంతో, ఏ రూపంలో ఆరాధించినా సరే ఆయన సాక్షాత్కారం లభిస్తుంది.** - *శ్రీరామకృష్ణులు*







మహాభారతంలో దుర్యోధనుడు స్వయంగా ఏమీ రాజ్యాన్ని సంపాదించుకోలేదు. కానీ కాలానుగుణంగా, వారసత్వంగా అధికారం సంప్రాప్తించింది; ఆ ఆధిపత్యం ఆయనలో అంతకు పదింతల అహంకారాన్ని తెచ్చిపెట్టింది. ఒక్కసారిగా ఆ గాంధారీ తనయుడి చుట్టూ, శకుని తదితర దుష్టసాంగత్య జనసమూహమంతా చేరింది. యువరాజుగా యౌవనంలో ఉన్న ఆ కౌరవనందనుడికి గర్వం కళ్ళను తలపైకెక్కించింది. ఇక నన్ను ఎదిరించేవారు ఎవరుంటారన్న అహంభావానికి మనస్సులో బీజం పడింది. అప్పటి వరకూ సోదరసమానులైన పాండవులతో అతను సఖ్యంగానే ఉన్నప్పటికీ ఆయనలోని అధికారమదం వారిపై విషభావనలను ఎగజిమ్మింది. ఫలితంగా పెద్దల మాటలను పెడచెవిని పెట్టాడు. సాక్షాత్తూ కాలస్వరూపుడైన భగవంతుడు ప్రత్యర్థిగా ఉన్నాడని తెలుసుకోలేనంత గర్వాంధకారుడయ్యాడు. తన బలగం, బలం అతి స్వల్పమైనా, దానినే దుర్యోధనుడు అత్యధికమైందిగా అహంకరిస్తూ, పాండవులను హేళన చేశాడు. ఒక్క యాదవుడిని, అదీ యుద్ధం చేయకుండా సారథిగా రథం తోలుతానన్న వాడిని నమ్ముకొని కురుక్షేత్ర రణరంగంలోకి కాలుమోపుతున్నారని అవమానపరిచాడు. 'తాత్కాలిక సంపదలను, వైభవాలను చూసుకొని పొగరుతో ఎదుటివారిని చులకన చేసే వారి సంపదలు చెదిరిపోవటమే కాకుండా, వారికి పూర్వుల నుంచి సంక్రమించిన వారసత్వ వైభవాలు కూడా సమూలంగా నాశనమవుతాయి' అని విదురుడు లాంటి మాననీయులు హితవు పలుకుతారు. అయినా దుర్యోధనుడు తలబిరుసుతో దాయాదులతో సమరానికే సిద్ధపడ్డాడు; ఫలితంగా రణభూమిలో అసువులుబాసాడు. తాత్కాలికమైన పేరు ప్రతిష్ఠలనూ, ధన, యౌవన, పరివారాలనూ చూసుకొని విర్రవీగే అవివేకులను హెచ్చరిస్తూ, కాలమహిమను అభివర్ణిస్తూ శంకర భగవత్పాదులు ఇలా అన్నారు....

**మా కురు ధనజన యౌవన గర్వం**
**హరతి నిమేషాత్కాల స్సర్వమ్ ।**
**మాయామయ మిద మఖిలం హిత్వా**
**బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥**

ధనం, పరివారం, యౌవనం ఉన్నాయని గర్వించకు. క్షణంలో కాలం వాటన్నింటినీ హరించివేస్తుంది. ఇదంతా మాయామయమనీ, మిథ్య అనీ, అశాశ్వతమనీ గ్రహించి, జ్ఞానివై పరబ్రహ్మాన్ని పొందమంటున్నారు. కాలవశాన సంప్రాప్తించినవి కాలంతోనే

# కాలంతో వచ్చేవి

సమసిపోతాయని తెలుసుకోలేక, మనలో చాలామంది అహంకారంతో కన్నూమిన్నూ కానకుండా ప్రవర్తిస్తూ ఉంటారు.

**కాలమే కారణం...:** నిజానికి ఈ ప్రపంచంలో మనం సాధించామనుకుంటున్నవన్నీ మధ్యలో వచ్చి, మధ్యలోనే వెళ్ళిపోతాయి; అందం కావచ్చు, అందలం కావచ్చు – ఏదైనా శాశ్వతంగా మనతోనే ఉండిపోదు. అలాంటి తాత్కాలికమైన తళుకుబెళుకులను చూసుకొని అహంకరిస్తే, అంతకు మించిన అమాయకత్వం మరొకటి లేదు. మహా మహా సామ్రాజ్యాలే కాలగర్భంలో కలిసిపోయాయి; మగధీరులనిపించుకున్న మహారాజులే నేడు మౌనంగా సమాధుల్లో సేద తీరుతున్నారు. కాలమే మనందరితో భిన్నమైన పాత్రల్ని పోషింపజేస్తుందని తెలుసుకోలేక ఆ యా స్థానాలతో విపరీతంగా తాదాత్మ్యం చెందుతున్నాం. వాటినే మన నిజ స్వరూపాలుగా నిర్వచించుకుంటున్నాం. తీరా అవి చేజారిపోయాక, విలపిస్తూ ఉన్నాం. అందుకే బలిచక్రవర్తి



**కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే? వారేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే? భూమిపై పేరైనం గలదే?...** అంటాడు గురువు శుక్రాచార్యుడితో!

పూర్వం ఎందరో రాజులు ఉన్నారు! వారికి ఎన్నో రాజ్యాలూ ఉన్నాయి! వారు ఎంతో అహంకారంతో విర్రవీగారు. కానీ వారెవరూ ఈ సంపదను మూటకట్టుకొని పోలేదు కదా! ప్రపంచంలో వారి పేరు కూడా మిగల్లేదు కదా!

**అహంకరిస్తే అధోగతే!** : భగవంతుడు మనల్ని పరీక్షించడానికే ఈ సంపదల్నీ, పాండిత్యాన్నీ, పొగడ్తలతో ముంచెత్తే పరివారజనాన్నీ ప్రసాదించి ప్రలోభపెడతాడు. వాటిని చూసుకొని తనను మరచిపోయేలా మాయతెరలను వేస్తాడు. కానీ వాటన్నింటినీ చూస్తూ కూడా, వాటి వెనక ఉన్న అసలైన వ్యక్తినీ, శక్తినీ మరచిపోలేనప్పుడే మనం విజ్ఞులమనిపించుకుంటాం! అయితే నడమంత్రపు సిరికీ, నిలకడ లేని సొగసులకూ, మిడిమిడి జ్ఞానానికీ మిడిసిపడుతూ మనంతటివారు లేరనుకుంటూ ఎవరినీ లెక్క చేయం. ఆ క్షణం నుంచి మన పతనం ప్రారంభమవుతుంది. అన్నీ ఉన్నప్పుడే, అందరి కన్నా అణిగిమణిగి నడుచుకోవాలి. లేనట్లయితే పూలు అమ్ముకున్న దగ్గరే కట్టెలు అమ్ముకోవాల్సి వస్తుంది.

# కాలంతోనే పోతాయి!

– స్వామి జ్ఞానదానంద

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు – "సంపన్నుడననే గర్వం పనికిరాదు. 'నేను ధనవంతుడను' అని నువ్వు భావిస్తే, నీకంటే ధనవంతుడు మరొకడు ఉంటాడు. చీకటి పడగానే మిణుగురు పురుగు బయటకు వస్తుంది. ఈ ప్రపంచానికి తానే వెలుగునిస్తున్నానని భావిస్తుంది. అయితే కాసేపటిలో నక్షత్రాలు ఉదయించగానే మిణుగురు పురుగు అహంకారం అణిగిపోతుంది. మేమే ఈ ప్రపంచానికి వెలుగును ప్రసాదిస్తున్నామని నక్షత్రాలూ అహంకరిస్తాయి. ఇంతలో చంద్రుడు వచ్చేస్తాడు. అప్పుడు నక్షత్రాలు సిగ్గుతో కుంచించుకుపోతాయి. తరువాత చంద్రుడు 'నా వెలుగు వల్లే ఈ ప్రపంచం ప్రకాశిస్తుంది. నేనే ఈ లోకానికి వెలుగును ప్రసాదించేవాడను' అని తలపోస్తాడు. ఇలా మిడిసిపడుతూ ఉండగానే అరుణోదయమవుతుంది. చంద్రుడు వెలవెలబోతాడు. కాసేపటికి చంద్రుడిని చూదను కూడా చూడలేము. ఏ విషయంలోనైనా తమ ఉన్నతికి తాము గర్వపడేవారు వీటన్నింటినీ చూసి అహంకారాన్ని వదులుకోవాలి. ఎంత పెద్ద స్థాయిలో ఉన్నా, అన్నీ మూన్నాళ్ళ ముచ్చటే. కాబట్టి గర్వం, అహంకారం వదలివేయాలి."

**వివేకంతోనే విజ్ఞత:** ఈ ధనాన్నీ, జనాన్నీ, యౌవనాన్నీ నిరసిస్తూ, నిరాశగా కాలం గడపమని ఆదిగురువులైన శంకరులు అభిప్రాయపడడం లేదు. వాటిని అపురూపంగా భావించుకుంటూ అవి మనల్ని ఆవరించినప్పుడు అహంకారంతో అల్లకల్లోల పడకుండా జాగ్రత్తపడమంటున్నారు. వీటితో మనకు ఎలాంటి శాశ్వత సంబంధమూ లేదనీ, 'నీవు' అంటే ఇవేవీ కాదనీ, ఆనందస్వరూపమనీ తెలుసుకోమంటున్నారు. పూలు అమ్ముకుంటున్నప్పుడు అణకువగా అందరితో ఆత్మీయంగా మసలుకుంటే, కట్టెలమ్ముకునే పరిస్థితిలో కూడా వారు అదే ఆప్యాయతతో మన పక్కనుంటారు. అలా కాకుండా అన్నీ ఉన్నప్పుడు ఎవరైతే మనకేంటని విర్రవీగితే, అన్నీ పోయాక, వాళ్ళూ మనల్ని అంతే దూరంలో పెడతారు. అందుకే మన సనాతన ధర్మం ఇలా అంటోంది – "యౌవనం, ధనసంపద, అధికారం, అవివేకం అనే నాలుగింటిలో ఏ ఒక్కటి ఉన్నా చాలు సర్వ అనర్థాలకూ కారణమవుతుంది. ఇక ఈ నాలుగూ ఒకచోట చేరితే చెప్పవలసినదేముంది!"

**పరమాత్ముడే పరమావధి:** ఈ లోకంలో స్థిరమైనవాడు, శాశ్వతమైనవాడు ఆ భగవంతుడు ఒక్కడే! మైనపు బొమ్మల్లా కనిపించి, కాలాగ్నికి కరిగిపోయే ఈ వైభోగాలన్నీ మాయ అని తెలుసుకున్నవాడే జ్ఞాని అని శంకరాచార్యులు స్పష్టం చేస్తున్నారు. పరబ్రహ్మ పాదాలను పొందడమే పరమజ్ఞానమని ప్రబోధిస్తున్నారు. అలాంటి భక్తి తత్పరతను అలవరచుకుంటే, పరమాత్మ పాదాలను ఆశ్రయిస్తే, అహంకారాది దుర్గుణాలతో పాటు సమస్త దుఃఖాలు కూడా దూరమవుతాయి. అదే భావంతో శ్రీమద్భాగవతంలో...

**అనుపమ భక్తినెవ్వని పదాంబుజ మూలము మందిరంబుగా**
**ననయము బొందువాడు నిహతాఖిల భూరి మనోమలుండు స**
**ద్వినుత విరక్తి బోధ ధృతి వీర్య విశేష సమన్వితుండు దా**
**ననదగి భూరి సంసృతి మహత్తర దుఃఖము నెంద డెన్నడున్**

అని పృథు చక్రవర్తి అంటాడు.

భక్తితో భగవంతుడైన నారాయణుని పాదపద్మాలను అనవరతం ఆశ్రయించుకున్న వానికి సమస్త మనోదోషాలూ తొలగిపోతాయి. గొప్ప వైరాగ్యం ప్రాప్తిస్తుంది. విజ్ఞానం, ధైర్యం, శక్తి లభిస్తాయి. అలాంటి వాడు ఏనాడూ దుఃఖాన్ని పొందడు. ❖

పాము నోటిలో ఉన్న కప్ప ఈగలకై ఆరాటపడినట్లు, కాలమనే పాము నోటిలో ఉన్న మానవులు అజ్ఞానంతో క్షణికములయిన ఇంద్రియభోగాల వెంట పరుగిడుతున్నారు. - *హితోపదేశం*



# ఆయనకే ఆత్మసమర్పణ

– స్వామి యతీశ్వరానంద

ఆదిశంకరాచార్య విరచిత శివమానసపూజలో "యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్" అని ఉంది. అంటే, "ఓ శంభో! నేను ఏ పని చేస్తున్నా అదంతా నీ ఆరాధనయే" అని అర్థం. మనం అలాంటి దృక్పథాన్ని అలవరచుకోవాలి. మనం చేసే పని మీద మనకు ప్రేమ ఉన్నప్పుడు ఇలాంటి దృక్పథం సులభంగా ఏర్పడుతుంది. అయితే మనం చేయాల్సిన పని మీద మనకు అనిష్టం ఉంటే, ఆ పని కాక మరేదైనా పనిని ఇమ్మని భగవంతుణ్ణి కోరవచ్చు. దానివల్ల మనకు మేలు కలిగేటట్లయితే ఆయన తప్పక ఇస్తాడు. అలా జరగలేదంటే ఆ పనిలో కొనసాగడమే మనకు మంచిదని తెలుసుకోవాలి.

మనం చేసిన కర్మకు ఫలితాలే మనకు కలిగే కష్టాలు, అవమానాలు. కాబట్టి ఆ దైవాన్ని నిందించే బదులు మన అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకోవడానికి ప్రయత్నించాలి. అవి ఎంత చేదుగా అయినా ఉండవచ్చు గాక. వాటి ద్వారా మనం మరింత వైరాగ్యం పెంపొందించుకుని, ఆ భగవంతుడి మీదనే మరింతగా ఆధార పడడం నేర్చుకోవాలి. మనం ఎదుర్కొంటున్న పరీక్షలన్నింటినీ ఆయన చూస్తూనే ఉన్నాడు. అంతేకాదు. వాటిలో నుంచి మనం బయటపడేందుకు సహాయం చెయ్యడానికి ఆయన కాచుకుని కూర్చుని ఉన్నాడు కూడా! భగవంతుని దివ్యప్రేమ ప్రవాహంతో అవిచ్ఛిన్న సంబంధాన్ని ఏర్పరచుకుంటే మనకు ప్రశాంతత చేకూరుతుంది. భగవంతుడు మనతోనే ఉన్నాడన్న అనుభూతి కలుగుతుంది.



పని, ఆరాధన చేదోడువాదోడుగా సాగాలి. ప్రార్థన, ధ్యానాల ద్వారా భక్తితో చేసే ఆరాధనను దేవుడు ఎంతగా మెచ్చుకుంటాడో, సరైన స్ఫూర్తితో చేసే కర్మ కూడా ఆయనకు అంతే అంగీకార యోగ్యమవుతుంది.

స్వామి బ్రహ్మానందజీ మహరాజ్ ఇలా బోధించారు: "పని మొదలుపెట్టబోయే ముందు భగవంతుడికి నమస్కరించి మొదలుపెట్టండి. పనిచేస్తున్నప్పుడు కూడా మధ్య మధ్యలో నమస్కరించండి. పని పూర్తయిన తర్వాత కూడా నమస్కరించండి!"

దైవకృప భౌతికమైన మన కష్టాలనూ, బాధలనూ పూర్తిగా తొలగించకపోవచ్చు. అయితే దాని ప్రభావం వల్ల జీవితమనే అగ్నిపరీక్షలో మనం విజయవంతంగా నెగ్గుకు రాగలుగుతాం. మనలోని మలినాలన్నింటినీ వదిలించుకొని పవిత్రతను సాధించడమే కాక, భగవదిచ్ఛకు ఆధీనమై ఉండడం అలవరచుకుంటాం. ఆ విధంగా మన కష్టాలు మనకు మరింత స్పష్టమైన జ్ఞానాన్నీ, అచంచలమైన భక్తినీ తెచ్చిపెట్టగలిగితే వాటినే దీవెనలుగా భావించవచ్చు కదా!

భగవంతుని నామాన్ని స్మరించండి! మీలోని అంతరాత్మను గురించి యోచించండి! ఆయన సన్నిధిని అనుభూతి పొందండి! మీ ఇష్టానిష్టాలను ఆయనకే సమర్పించి, ప్రశాంతంగా ఉండండి! మీ మనస్సులోకీ, హృదయంలోకీ కొత్తవెలుగునూ, శక్తినీ నింపాల్సిందిగా ఆయనను వేడుకోండి!

పరిస్థితులకు తగినట్టుగా నడుచుకొంటూ, శక్తిమేరకు చక్కగా పనిచెయ్యడం కన్నా మీరు చేయగలిగేదేముంది? మీకు తెలిసినా, తెలియకపోయినా, అర్థమైనా కాకపోయినా మీ భూత భవిష్య ద్వర్తమానాలు భగవంతుడి అధీనంలోనే ఉన్నాయి. నిమిత్తమాత్రులమై మన పాత్రపోషణ చక్కగా చేసి, సాధ్యమైనంతవరకూ సర్వాన్నీ భగవంతుడికే సమర్పించి జీవించడం కన్నా చేయగలిగేదేమీ లేదు.

మన జీవితాలలో ఎన్నో సందిగ్ధ పరిస్థితులు, సమస్యలు ఎదుర్కోక తప్పదు. అలాంటి సమయాల్లో మనలో నిరాశ, నిస్పృహలు, అశాంతి కలుగుతాయి. అప్పుడు భగవంతుడి నామాన్ని స్మరించడం మరిచిపోకూడదు. ఆయననే ధ్యానిస్తూ సర్వం ఆయనకే ఆత్మసమర్పణ చేసుకోవాలి. ఈ పద్ధతులను అనుసరించడం వల్ల మనలో భక్తివిశ్వాసాలు, చిత్తశాంతి చేకూరుతాయి. ❖ **తెలుగుసేత : ఎమ్. శివరామకృష్ణ**




**- స్వామి మేధానంద పురి**

– యం.కె.మూర్తి, సూర్యాపేట

**? : వైరాగ్య పథం అసిధారావ్రతం లాంటిది అంటారు. అసిధార అంటే ఏమిటో తెలియజేయగలరు.**

✍: మూర్ఛావస్థ, సమాధి అవస్థ, సుషుప్త్యవస్థ, స్వప్నావస్థ అనే నాలుగు అవస్థలలో కనిపించని ప్రపంచం ఒక జాగ్రదవస్థలోనే కనిపిస్తుంది. పూర్వ జన్మల వాసనలు, అభిమానం, అహంకారం, విషయవాంఛల వల్ల మనోవాక్కులకు అతీత మైన ఆత్మచైతన్యాన్ని అనుభవించడం చాలా కష్టం. బుద్ధిశుద్ధమై, ఏకాగ్రమైతేగాని మనలో ఉన్న ఆత్మను అనుభవించలేం. ఆకాశం కన్నా సూక్ష్మమైన ఆ ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవ డానికి వివేకం, తీవ్రమైన వైరాగ్యం కావాలి. నిరంతర శాస్త్ర శ్రవణం ద్వారా, గురువుల ఉపదేశం ద్వారా ఆత్మ నేను అని తెలుసుకోవచ్చు. నిష్కామ కర్మల ద్వారా మనస్సును శుద్ధి చేసుకొని, శాస్త్ర శ్రవణం ద్వారా సూక్ష్మబుద్ధిని పొందవచ్చు. ఎలాంటి సూక్ష్మబుద్ధి అంటే అసిధార లాంటి బుద్ధి. అసిధార అంటే పదునైన కత్తి అంచు. ఆధ్యాత్మిక మార్గంలో పయనించడం ఎంత కష్టతరమో హెచ్చరిస్తూ కఠోపనిషత్తు ఇలా చెబుతోంది:

**"క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి...**
ఆధ్యాత్మిక మార్గంలో నడవడం పదునైన కత్తి అంచుమీద నడవడం అంతటి కఠినమైనదని ప్రాజ్ఞులు చెబుతారు".

– సిహెచ్. ప్రతిమ, హైదరాబాదు

**? : మనం ఆధ్యాత్మికంగా ముందుకు సాగుతున్నామో లేదో ఎలా తెలుసుకోవాలి?**

✍: కామ, క్రోధాదులైన అరిషడ్వర్గాలు తగ్గుతున్నా, మనస్సులోని కోరికలు తగ్గుతున్నా, మనస్సు అంతర్ముఖం అవుతున్నా, మనసా వాచా కర్మణా సత్యాన్ని వీడకున్నా, సాధనలో రుచి పెరుగుతున్నా మనం ఆధ్యాత్మికంగా ముందుకు సాగుతున్నట్లే! అనేక జన్మల నుండి వచ్చే వాసనలు అజాగృత మనస్సులో ఉంటాయి. వాటిని కూడా తొలగించుకోవాలి. కోరికలు, బహిర్ముఖత్వం ఎంత తగ్గితే, సాధనలో అంత ఎదుగుతున్నట్లు లెక్క. శరీరాభిమానం, అహంకారం పోయినట్లయితే సాధనలో చాలా భాగం ముందుకు సాగినట్లే అనుకోవాలి.

– ఎస్.ఎన్.బాలాజీ, నానగానహళ్ళి

**? : శారీరక బలం పొందడానికి ఏయే ఆధ్యాత్మిక పద్ధతులను అనుసరించాలి?**

✍: శారీరకంగా బలంగానూ, ఆరోగ్యంగానూ ఉండాలంటే ప్రతిరోజూ మూడుసార్లు ఆదిత్య హృదయం అర్థం తెలుసుకుంటూ చదవాలి. చదివేటప్పుడు ఆ సూర్యదేవుని ఆధిభౌతిక స్వరూపం, ఆధిదైవిక స్వరూపాలను కూడా ధ్యానించాలి. ఆధిదైవికంగా వానిలో ఉన్న గుణాలు, లీలలు చింతన చేస్తూ ఆ దేవుడు మనలోనే ఉన్నాడని భావన చేయాలి.

**ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేద్ శ్రియమిచ్ఛేద్ హుతాశనాత్ ।**
**ఐశ్వర్య మీశ్వరాదిచ్ఛేద్ మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్ ॥**

సూర్యుని నుండి ఆరోగ్యం, అగ్ని ద్వారా లక్ష్మి, ఈశ్వరుని నుండి ఐశ్వర్యం, జనార్దనుడి నుండి మోక్షం పొందవచ్చు.

'బల బుద్ధి విద్యా దేహు మోహి' – బలం, బుద్ధి, విద్య హనుమంతుని నుండి కూడా లభిస్తాయి. నామ, స్వరూప, లీలలు; సన్నిధిని ధ్యానం చేస్తూ హనుమాన్ చాలీసా రోజుకు 11 సార్లు చదివితే, ఆరోగ్యం చేకూరి రోగాలన్నీ తొలగిపోతాయి. ❖

## పండుగలు-పర్వదినాలు

**జూన్ - 2012**

| | | | |
|---|---|---|---|
| 15 | శుక్రవారం | : | ఏకాదశి |
| 21 | గురువారం | : | పూరీ జగన్నాథ రథోత్సవం |
| 30 | శనివారం | : | ఏకాదశి |

**జూలై - 2012**

| | | | |
|---|---|---|---|
| 03 | మంగళవారం | : | గురుపూర్ణిమ |
| 14 | శనివారం | : | ఏకాదశి |
| 17 | మంగళవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |
| 29 | ఆదివారం | : | ఏకాదశి |

**సాధకులు విషయాసక్తులైనవారి సహచర్యమును విడిచిపెట్టవలెను. ఇంద్రియాలను నిగ్రహించి, భగవంతుని యందు మనస్సును లగ్నం చేసి ఏకాంతంలో సాధన చేయవలెను.** *- భాగవతం*

# ఆస్తికత్వం... ఓ అంతరయాగం

- హేమంత్ కుమార్

సృష్టికర్త సంకల్పంతో రూపుదిద్దుకున్న అద్భుత కళాచిత్రం ఈ సృష్టి. ఈ క్రమ పరిణామాన్నీ, ఆ సృష్టికర్తనూ అంగీకరించడం, ఆయనతో అనుసంధానాన్ని కలిగి ఉండడమే ఆస్తికత్వం. సర్వోన్నతుడైన ఆయన ఉత్తమోత్తమ, ఉన్నతోన్నత పాలనకు తలొగ్గి దాని ప్రకారం నడచుకోవడమే ఆస్తికత్వం. అణువంత అన్యాయానికైనా తావులేని ఆ సర్వోత్తముడి ఛత్రం కింద సేదదీరే అవకాశం రావడమే ఒక గొప్ప అదృష్టం. దాన్ని అంగీకరించడమనేది మన గొప్పతనమేమీ కాదు. కానీ మనిషి చాలాసార్లు మూఢుడు అవుతాడు. అహంకారాన్ని అలంకారంగా ధరిస్తాడు - అమ్మ స్నానం చేయించి మంచి దుస్తులు వేసి పంపిస్తే బిడ్డ బురద పులుముకున్నట్లు!

భగవంతుడు మనిషిని సృష్టించి లోకంలోకి పంపింది ఒంటెద్దు పోకడ పొమ్మని కాదు. ఒంటి కాకిలా బ్రతకమనీ కాదు. జన్మకు ఉన్న ఉద్దేశాన్ని అనుక్షణం స్పృహలో ఉంచుకుంటూ జీవన గమ్యం వైపు సాగమని! తన చుట్టూ సాగుతున్నవారి పథ గమనంలో తనవంతు తోడ్పాటునందించమని! వారి త్వరిత గమనానికి దోహదం చేయమని!! భగవంతుడి అస్తిత్వం పట్ల విశ్వాసం ఉన్నవాడికి మాత్రమే ఈ లోకం పట్ల, సృష్టి క్రమంలో తన వంతు పాత్ర పట్ల, నిర్వహించవలసిన బాధ్యత పట్ల అవగాహన ఉంటుంది. అంతేతప్ప, నాస్తికుడికి ఉండదు.



అమ్మ పట్ల అనురాగం ఉన్నవాడికి తోటి తమ్ముళ్ళ పట్ల ఆప్యాయత సహజంగానే జనిస్తుంది. మనిషి తను ముందుకు సాగాలన్నా, పక్కవారి ప్రయాణంలో తాను ఆటంకం కాకూడదనుకున్నా, అందుకు సౌహార్దం ఉండాలి. అది భగవంతుణ్ణి నమ్మినవాడికి ఉంటుంది. అతడు ఏ రంగానికి చెందినవాడైనా సరే ఈ లోకానికి నిస్వార్థంగా తన సేవలందించినవాడు తప్పనిసరిగా ఆస్తికుడై ఉంటాడు. భగవంతుని సార్వభౌమత్వాన్నీ, ఆయన అనన్య అహేతుక ప్రేమనూ నమ్మినవాడై ఉంటాడు.

మనిషి సర్వోత్తముడు కావాలంటే, దైవీగుణాలు సొంతం చేసుకోవాలంటే సుగుణాకరుడైన పరంధాముని పదాలను ఆశ్రయించి తీరాలి. దోపిడీ దొంగ అయిన రత్నాకరుడు రామాయణ సృష్టికర్త అయిన వాల్మీకి మహర్షిగా రూపాంతరం చెందాడన్నా, మతిలేనివాడు మాన్యతనంది మహాకవి కాళిదాసుగా మారాడన్నా, బాల్య చాపల్యంతో బాధపడిన ధ్రువుడు అంబరాన ధ్రువతారగా వెలుగొందుతున్నాడన్నా, రాక్షస కుల సంజాతుడైన ప్రహ్లాదుడు పరమ భాగవతోత్తముడై నరసింహావతారానికే కారకుడయ్యాడన్నా, శృంగార రసాస్వాదకుడు అన్నమయ్య పదకవితా పితామహుడై తరించాడన్నా, సామాన్య యువకుడైన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించి దేశానికి స్వాతంత్ర్యాన్ని సముపార్జించి పెట్టి, మహాత్మా గాంధీగా వినుతులు పొందాడన్నా, మరెవరు మరే గొప్ప పరిణతి చెందారన్నా, ఉత్తమగతి పొందారన్నా అదంతా పరమాత్మ పదాశ్రయ ఫలితమే! పూలను అల్లిన దారం పరిమళాన్ని పొందినట్లు భగవదనుసంధానంతో మనమూ జీవన సాఫల్య సౌరభాన్ని సొంతం చేసుకోగలం.

చివరి క్షణాలను కూడా భక్తుల ఆధ్యాత్మిక ఉన్నతికై కేటాయించిన అవతార వరిష్ఠులైన శ్రీరామకృష్ణుల అనుంగు బిడ్డలం మనం. ఇతరులకు ముక్తి సాధనలో చేయూత నందించే క్రమంలో తన సొంత ముక్తినే వాయిదా వేసుకోగల ఘనుడి వారసులం మనం. మనం కాకపోతే మరెవరు లోక సేవకు అంకితం అవుతారు! సర్వభూత ప్రీతికై సమయం కేటాయిస్తారు! అయితే ఈ బృహత్తర కార్యాచరణకు అంకితం కావాలంటే ముందు ఆస్తికత్వం అలవడాలి. దానితో అంతరయాగాన్ని ప్రారంభించాలి. ❖

ధీరవాణి

– స్వామి వివేకానంద

# సత్కర్మలే గమ్యానికి సోపానాలు

లోకంలో అనేక వర్గాల మానవులు మీకు కనిపిస్తారు. మొట్టమొదట దివ్యావతారమూర్తులున్నారు. వారి ఆత్మత్యాగం సమగ్రం. వారు తమ ప్రాణాలనైనా పరిత్యజించి ఇతరులకు మేలు చేస్తారు. మానవులలో వీరే మహోన్నతులు. ఏ దేశంలోనైనా ఇలాంటి మహనీయులు ఒక వందమంది ఉంటే ఆ దేశానికి ఎన్నడూ భయం ఉండదు. కానీ దురదృష్టవశాత్తూ వీరు అత్యల్ప సంఖ్యాకులై ఉన్నారు. పరహిత మొనర్చే సజ్జనులు రెండో తరగతివారు. ఇక స్వప్రయోజనాల కోసం పరులకు హాని చేసే జనులు మూడో తరగతివారు. పరులకు హింస కలిగించడమే ప్రయోజనంగా భావించే నాల్గవ తరగతి ఒకటి ఉందనీ, వీరిని ఏమని పేర్కొనాలో తెలియదన్నాడు – సంస్కృత కవి భర్తృహరి. లోకంలో కేవలం అవ్యాజంగా పరహితమొనర్చే మహోన్నత సజ్జనులు ఒక పరాకాష్ఠ. కేవలం అకారణంగా పరహింస చేసేవారు మరొక పరాకాష్ఠ. దాని వలన వారికి లేశమైనా లాభం లేకున్నా దుష్కార్యాలు చేయడమే వారి స్వభావం.

ఇవిగో రెండు సంస్కృత పదాలు: ఒకటి 'ప్రవృత్తి' అంటే మెలగడం. రెండోది 'నివృత్తి' అంటే తొలగడం. సంసారం, మమతాహంకారాలే 'ప్రవృత్తి'. ధనం వల్ల, సంపద వల్ల, శక్తి వల్ల, పేరుప్రఖ్యాతుల వల్ల 'నాకు' వృద్ధిని చేకూరుస్తూ, గట్టిగా పట్టుకొనే స్వభావం కలిగి, సమస్తమూ 'నేను' అనే కేంద్రం వద్ద పోగు పరచేవన్నీ 'ప్రవృత్తి'లో చేరతాయి. సమస్త ప్రాంతాల నుండి సమస్త వస్తువులను తనకు ప్రియతమమైన 'నేను' అనే స్థానంలో కూడబెట్టుకొనే మానవ సహజ లక్షణమే ఈ ప్రవృత్తి. ఈ ప్రవృత్తి ఆగి, నివృత్తి కలిగితే – అదే నీతికీ, పారమార్థికతకూ నాంది.

ప్రవృత్తి, నివృత్తి– రెండూ కర్మస్వరూపానికి సంబంధించినవి. దుష్కర్మే – ప్రవృత్తి. సత్కర్మే – నివృత్తి. సమస్త నీతికీ, పారమార్థికత అంతటికీ నివృత్తే మూలాధారం. అహంకారం పూర్తిగా నశించడమే, ఇతరుల కోసం మనస్సునూ, శరీరాన్నీ, సర్వస్వాన్నీ త్యజించడానికి సంసిద్ధుడవడమే నివృత్తి ధర్మపరిపూర్తి. ఈ స్థితి ప్రాప్తించిన మానవుడు పరమావధిని పొందినవాడు. ఇది సత్కర్మల మహోన్నత పరిపాకం.

ఒక్క తత్త్వశాస్త్రాన్ని అయినా చదవకపోయినా, దేవుడిపై నమ్మకం లేకపోయినా, జన్మలో ఒక్క మారైనా భగవంతుణ్ణి ప్రార్థించకపోయినా మానవుడు కేవలం సత్కర్మల ప్రభావం వల్లనే భక్తుడు ప్రార్థనలతో, వేదాంతి జ్ఞానంతో చేరుకొనే చోటికే చేరుకొంటాడన్నమాట. కాబట్టి వేదాంతి, భక్తుడు, కర్మయోగి ఒకే గమ్యం వద్ద కలుసుకొంటారని మీరు గుర్తించవచ్చు.

ఇతరులకై తన సర్వస్వాన్నీ త్యజింప సంసిద్ధుడైన అతణ్ణి చూసి సమస్త మానవకోటీ పూజిస్తుంది. అబ్బురపడుతుంది. ఇక్కడ మతప్రసక్తి, వేదాంత ప్రసక్తి లేదు. ఇలాంటి సంపూర్ణ స్వార్థ త్యాగ సంజనిత కార్యాన్ని చూడగానే దానికి అంజలి ఘటించాలని పారమార్థిక ఆశయాలన్నిటికీ తీవ్ర విముఖులైన వారికి సైతం తోస్తుంది. ❖

# లోభికి శ్రీరామ కృపాలబ్ధి

భారతీయ సత్పురుషులు, మహాత్ముల గురించి అనేక గాథలు ప్రచారంలో ఉన్నాయి. అలాంటి కథల్లో సంత్ తులసీదాసు చెప్పిన కథ ఇది.

తులసీదాసు కాశీలో నివసిస్తున్నారు. ప్రతి ఇంటా ఆయనకూ, ఆయనతో ప్రణీతమైన రామాయణ గ్రంథానికి సన్మాన సత్కారాలు లభించేవి. ఎవరి రచనను రామభ్రమరం ఆస్వాదిస్తోందో, ఆయన తులసి మొక్క లాగా పరమ పవిత్రమూర్తి. అలాంటి పరమ భక్తుడైన తులసీదాసు భక్తుల సందేహాలను తీర్చేవాడు.

ఒకనాడు ధనపాలుడనే ధనికుడు, తులసీదాసు వద్దకు వచ్చాడు. అతడు పరమలోభి. అతడు ఒక ఆశ్చర్యకరమైన ప్రతిపాదన చేశాడు. ఇంటింటా శ్రీరామచంద్రుడు అనేక ఉపచారాలతో అర్చింపబడుతున్నాడని ఆయన ఎరుగును. 'మహాత్మా! నాకు కూడా శ్రీరామచంద్రుణ్ణి సకలోపచారాలతో



అర్చించాలని ఉంది' అన్నాడు. 'అలాగే చేయి. నిన్ను అడ్డుకొన్నదెవరు?' అన్నాడు తులసీదాసు. 'అది కాదు స్వామీ! అర్చనకు పూలు, పళ్ళు, ధూప, దీపాదులు అవసరం కదా? వీటికి దమ్మిడీ వ్యయం చేయకుండా అర్చన జరిగే ఉపాయం చెప్పండి' అన్నాడు ధనపాలుడు.

అమితాశ్చర్యంతో ఆ లోభిని ఆపాదమస్తకం తిలకించాడు తులసీదాసు. అతడి పిసినారితనం చూసి, ఆయనకు జాలి కలిగింది. చాలాసేపు మౌనంగా ఉన్నాడు. చివరకు, 'మానసపూజ తప్పించి నాకు అన్యమార్గం కనిపించడం లేదు. మానసపూజ అంటే, అన్ని ఉపచారాలూ కాల్పనికాలు. నీవు అన్నీ చేస్తున్నట్లు మనస్సులో ఊహించాలి. నీవు కావలసినన్ని ఉపచారాలతో ఆ విధంగా చేయవచ్చు. చిల్లిగవ్వ ఖర్చుకాద'న్నాడు తులసీదాసు.

ధనపాలుని ఆనందానికి అవధులు లేవు. ఇంతకాలం ఇలాంటి ప్రణాళిక కోసమే తాను ఎదురుచూశాడు. అయితే కాల్పనికమైనా ఎక్కువ పదార్థాలు నివేదింపదలచలేదు. అందువల్ల, 'ఏ విధంగా మానసపూజ చేయాలో సవివరంగా చెప్పండి' అని తులసీదాసును అడిగాడు ధనపాలుడు.

శ్రీరామచంద్రుణ్ణి ఒక్క నిమిషం ధ్యానం చేసి, 'ఆయన ప్రతిమను బంగారు సింహాసనంపై ప్రతిష్ఠించు. రకరకాల పుష్పాలతో అలంకరించు. ఆపైన వేడి చేసిన ఆవు పాలల్లో కాస్తంత పంచదార కలిపి నివేదన చేయి. పంచదార కలపడం మాత్రం మరువకు సుమా! నా రాముడు పంచదార లేని పాలు త్రాగలేడు. అనుదినం ఈ విధంగా మానసపూజ చేయి, దమ్మిడీ వ్యయం కాదు' అన్నాడు తులసీదాసు.

ధనపాలుని లోభగుణం అటుంచి, అతడికి నిష్ఠ మెండు. తులసీదాసునే గురువుగా ఎంచి ధనవ్యయం లేని మానసపూజ మొదలుపెట్టాడు. పంచదార ఎక్కువ వాడకం జరుగరాదని, ఒక చిన్న డబ్బా, ఒక చెమ్చా కొన్నాడు. (అంతా ఊహలోనే, నిజంగా అవిలేవు). ఈ విధంగా కొన్ని ఏళ్ళు గడిచాయి. ఒకనాడు పాలు నివేదన వేళకు మనస్సులో చెమ్చా కనపడలేదు. చేసేది లేక, డబ్బా నుండి పంచదారను పాలల్లోకి ఒంపాడు. పంచదార ఎక్కువ పడింది. వెంటనే మనస్సులో ఉన్న పాలగిన్నెలో చేయి పెట్టి, కరగని పంచదార తీసివేయ సాగాడు.

పదిహేను సంవత్సరాలుగా ఈ లోభి మానసిక పూజను స్వీకరిస్తున్నాడు శ్రీరామచంద్రుడు. అయినా, అతడి పిసినారితనం కించిత్తయినా తగ్గలేదు. ప్రభువుకు అమితమైన అనుకంపన కలిగింది. భక్తుని చేయి గట్టిగా పట్టుకుని 'ధనపాలా! పాలూ కాల్పనికమే, పంచదారా కాల్పనికమే. కాల్పనిక పంచదార కొంచెం ఎక్కువగా పడితే ఏమిటయ్యా! ఉండనీయరాదూ!' అన్నాడు.

శ్రీరామచంద్రుని కరస్పర్శ మూలంగా ధనపాలునిలో పరమ వైరాగ్యం కలిగింది. వెంటనే అతడు నిజమైన భక్తి ప్రపత్తులతో శ్రీరాముణ్ణి ధ్యానించి తరించాలని ఇల్లు వదలి తపోభూమికి వెళ్ళిపోయాడు. ❖

తెలుగుసేత: డాక్టర్ కమల జయరావు

(శారదా మఠం ప్రచురిస్తున్న 'నిబోధత' బెంగాలీ మాసపత్రిక నుంచి)



# ఎక్కడి మానుషజన్మం!

– శ్రీమతి బి.కృష్ణకుమారి

**అన్నమయ్య పదామృతం**

ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నే నమ్మితి నీ చిత్తంబికను॥

మరువను ఆహారంబును మరువను సంసారసుఖము
మరువను ఇంద్రియభోగము మాధవ నీమాయ
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వ రహస్యము
మరచెద గురువును దైవము మాధవ నీమాయ॥

విడువను పాపముపుణ్యము విడువను నాదుర్గుణములు
విడువను మిక్కిలి యాసలు విష్ణుడ నీమాయ
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును
విడిచెద నాచారంబును విష్ణుడ నీమాయ॥

తగిలెద బహులంపటముల తగిలెద బహుబంధంబుల
తగులను మోక్షపు మార్గము తలపున ఎంతైనా
అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై
నగినగి నను నీవేలితి నాకా యీ మాయ॥

మాధవుడే లక్ష్యంగా ముందుకు సాగాల్సిన మానవ జన్మకు మామూలు సుఖాల మధ్యే ముగింపు పలుకుతున్నాం. పశువులతో సమంగా ఈ పాంచభౌతిక శరీరాన్ని కేవలం ఇల్లు, పిల్లలు, ఇంద్రియ భోగాలకే పరిమితం చేస్తున్నాం. ఇలాంటి నిరర్థకమైన జీవనయానంలో పడి ఆ విశ్వేశ్వరుణ్ణే విస్మరిస్తున్నాం. అలా ఆ మధుసూదనుడి మాయాజాలంతో ఏమేం మరచిపోతున్నామో, మధుర సంకీర్తనాచార్యుడు అన్నమయ్య ఇక్కడ మననం చేస్తున్నాడు. **'ఎక్కడి మానుష జన్మం... ఎత్తిన ఫలమేమున్నది'** అని ప్రశ్నిస్తున్నారు. మోక్షమార్గం నుంచి దారి తప్పిస్తున్న ఈ మోహపు తెరలను తలచుకొని పలవరిస్తున్నాడు. అన్ని జీవరాశుల కన్నా శారీరకంగా, బౌద్ధికంగా అత్యంత ఉత్కృష్టస్థాయిలో పరిణతిని సాధించిన మనిషి పశువు కన్నా నీచంగా ప్రవర్తిస్తున్నాడు. కన్ను మూసేవరకు కూడా అసలు ఈ లోకానికి తను ఎందుకు వచ్చాడో తెలుసుకోవడం లేదు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అంటారు – "దుర్లభమైన మానవజన్మ పొంది, ఈ జన్మలోనే భగవంతుణ్ణి తెలుసుకోవడానికి ప్రయత్నించని వ్యక్తి జీవితం నిరర్థకం". కానీ జీవితంలో దెబ్బల మీద దెబ్బలు పడుతున్నా, 'దేవుడా! ఇక ఈ బ్రతుకు చాలు, నీ దగ్గరకు తీసుకువెళ్ళు!' అని ఒక్కళ్ళం కూడా విసుగు చెందడం లేదు. నోట్లో నుంచి రక్తం కారుతున్నా సరే, మాంసం రుచి కోసం ఎండిన బొమికను నోట్లో పెట్టుకొని చప్పరించే శునకంలా మనిషి ఇంకా ఈ ప్రపంచంలో ఏదో అనుభవించేద్దామని ఆవురావురుమంటున్నాడు. అలాంటి మానవజాతికి ప్రతినిధిగా, ఈ పదకవితా పితామహుడు ఆ పంకజనాభుడి ముందు తనకు తాను పశ్చాత్తాపపడుతూ పాడుకుంటున్నాడు.

### పుట్టి ఫలమేమున్నది?

పశువుగా, పురుగుగా, పక్షిగా – ఇలా ఎన్నో జన్మల పరంపరలో చివరకు పుణ్యఫలంతో మనిషిగా ఈ లోకంలోకి వచ్చాం. కానీ ఏం లాభం? రూపానికైతే మానవులమే కానీ స్వభావాలు మాత్రం ఇంకా పాతవే! అందుకే చాలా సందర్భాల్లో మనలో ఆ పూర్వ ప్రవర్తన పునరావృతమవుతోంది. అదే భావనతో ఈ భాగవతోత్తముడు...

**ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమేమున్నది**

**నిక్కము నిన్నే నమ్మితి నీ చిత్తంబికను...** అంటున్నాడు. 'నిక్కము'గా అంటే పరమ సత్యంగా మనస్సులో నిన్నే నమ్ముకుంటున్నానని ఆ వేంకటేశ్వరుడికి విన్నవించుకుంటున్నాడు. నిజానికి మాయలో నుంచి బయటపడవేసే శక్తి ఆ భగవంతుడికి ఒక్కడికే ఉంది. ఆయనను ఆశ్రయిస్తే తప్ప, ఈ చక్రభ్రమణంలో నుంచి విడుదల కాలేం.

### మాధవా! నీ మాయ!

ఒక్కసారి ఈ వస్తుప్రపంచంలో వాస్తవమెంత ఉందో తెలిస్తే, వెర్రిగా వాటి వెంట పరుగులు తీయం. కానీ ఆ జగన్నాటక సూత్రధారి మనల్ని తన మాయలో బందీలుగా చేసి పరుగులు పెట్టిస్తున్నాడు; నాకు ఇవేమీ వద్దు, నీవే కావాలనుకొని శరణాగతిని పొందిన వారిని మాత్రం తన మాయానాటకం నుంచి తప్పిస్తున్నాడు. ఆ రహస్యం తెలుసుకున్న అన్నమయ్య 'మాధవా! నీ మాయతో నేను ఆహారాన్నీ, సంసార సుఖాన్నీ,

(మిగతా 32వ పేజీలో...)

ఈ మానవ జన్మనంతా ఐహికభోగాల యందు వ్యర్థం చేసితిని కదా. హా! హతవిధీ! నేను గాజు ముక్కల కోసం చింతామణిని విక్రయించిన పరమమూఢుడను ప్రభూ! – హితోపదేశం

# దాన ధర్మాలు... ఎందుకు? ఎలా?



– కె.వి. ప్రసాదవర్మ

దాన ధర్మాలను మించిన ధర్మం మరొకటి మానవులకు లేదు. ఎట్టి ప్రతిఫలం ఆశించకుండా చేసే వితరణ దానమనబడుతుంది. అతి ప్రాచీన సంస్కృత భాషలో తాళం, తాళం చెవి అన్న మాటలు లేవు అంటారు. ఆనాడు ఆ వస్తువుల అవసరం లేకపోయిందన్న మాట. పరులకు దాన ధర్మాలు చెయ్యడమే గాని పరాయి సొమ్ము మీద ఎవరికీ ఆశ ఉండేది కాదు. అటువంటి సంస్కృతి మనది. ఈ రోజున తాళం, తాళంచెవి అన్న పదాలు వ్యవహారంలో ఉన్నాయి.

'ఉపార్జితానాం విత్తం త్యాగ ఏవ హి రక్షణం – సంపాదించిన ధనానికి త్యాగమొక్కటే రక్షణ'. మనది కర్మభూమి. మానవసేవే మాధవసేవ అని భావించే మహత్తర భావన కలిగిన ధర్మభూమి. ఈ మహత్తర కార్యం ఆచరిస్తే మనం ఆశించకపోయినా పుణ్యఫలం కలుగుతుంది. ధ్యానంతో దైవాన్నీ, దానంతో విప్రుణ్ణీ, ప్రేమతో పతినీ వశం చేసుకోవచ్చని పురాణ వచనం. కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో జ్ఞానం, ద్వాపరయుగంలో యజ్ఞం ఏ విధంగా శ్రేష్ఠమైనవో అలాగే కలియుగంలో దానానికి మించిన సత్కర్మ లేదని శాస్త్రవచనం.

**దానమెందుకు చెయ్యాలి?:** 'అదాన దోషేన భవేద్దరిద్రః దరిద్ర దోషేన కరోతి పాపం, పాపవశ్యం నరకం ప్రయాతి, పునఃదరిద్రః పునరేవ పాపీ.' దానం చేయకపోవడం అనే దోషం వల్ల దారిద్ర్యం సిద్ధిస్తుంది. దరిద్రతా దోషం వల్ల పాపం చేస్తాం. పాపం చెయ్యడం వల్ల నరక ప్రాప్తి. దాని వల్ల మళ్ళీ దారిద్ర్యం, మళ్ళీ పాపిగా మారడం – ఈ శృంఖలం ఆవృతమవుతూ ఉంటుంది. ప్రపంచంలో ధన వినియోగానికి దానం–భోగం–నాశం అని మూడు మార్గాలు మాత్రమే ఉన్నాయి. అందులో దానం చెయ్యడం ఉత్తమ పద్ధతి. తానే అనుభవించడం మధ్యమం. ఈ రెండూ చేయలేనట్లయితే, మూడవదైన నాశం తప్పదు. 'యో న దదాతి న భుంక్తే – తస్య తృతీయా గతిర్భవతి.' ఇక్కడ ధర్మసూక్ష్మమేమంటే తాను అనుభవించగా మిగిలింది దానం చేయడం కాదు. దానం చేయగా మిగిలింది అనుభవించాలి అన్నది ఋషి వాక్కు.

'అహం నశ్యతి జ్ఞానేన, మమతా దానేన నశ్యతి.' ధన కనక వస్తు వాహనాది భౌతిక సంపదలపై వ్యామోహ, మమకారాలను విడనాడి విరక్తుడై, అనాసక్తుడై ఉండాలి. ఈ స్థితి పొందడానికి దానమొక్కటే తరుణోపాయం. దానం చేయడం వల్ల, 'నాది నాది' అనుకోవడం తగ్గి వాటిపై మమకారం నశిస్తుంది. మనం దానం ఇచ్చిన తరువాత గ్రహీతకు నమస్కరిస్తాం. ఎందుకంటే, మన వ్యామోహాన్ని నశింపజేయడంలో గ్రహీత పాత్ర ఉంది కనుక!

ఏ దానమైనా ఎంత మందికి ఎంత ఎక్కువగా ఇచ్చామన్నది గాక, ఏ భావనతో ఎలాంటి వారికి ఇచ్చామన్నది ప్రధానం. వినియోగం బట్టి దాన సాఫల్యం ఉంటుంది. విచక్షణ రహిత దానాన్ని వేదశాస్త్రాదులు చెప్పలేదు. దానమనేది – 'నిత్యం, నైమిత్తికం, కామ్యం' అని మూడు రకాలు. 'విమలం' అని నాలుగోది కూడా ఉంది. ఇది అన్ని దానాలలోకీ ఉత్తమమైనది. మనకు ఎలాంటి ఉపకారం చేయని వానికి ఏ ఫలాపేక్షా లేకుండా చేసే దానం – 'నిత్యం'. మనకు సంక్రమించిన పాపం నశించాలనే కోరికతో ఇచ్చే దానం – 'నైమిత్తికం'. సంపదలు, సంతానం, ఏదేని కార్యమందు విజయం, స్వర్గాది ఫలప్రాప్తి ఆశించి చేసే దానం – 'కామ్యం'. ఈశ్వరప్రీతి కోసం బ్రహ్మజ్ఞానులు మున్నగు వారికి ధర్మబద్ధమైన మనస్సుతో అర్పించేది – 'విమలం'.

**దాన సమయం:** ఉత్తరాయణ, దక్షిణాయన పుణ్య కాలాలలో, గ్రహణ సమయాల్లో, మేష, తులా సంక్రమణాలలో చేసిన దానం అక్షయ ఫలప్రదమని చెబుతారు. "శతం విహాయ భోక్తవ్యం, సహస్రం స్నానమాచరేత్, లక్షం

విహాయ దాతవ్యం, కోటిం త్యక్త్వా హరిం భజేత్" అన్నారు పెద్దలు. అంటే – వంద పనులున్నా సమయానికి భోజనం, వేయి పనులున్నా స్నానం, లక్ష పనులున్నా దానం, కోటి పనులున్నా దైవ స్మరణ చెయ్యాలి. దీనిని బట్టి మానవ జీవితంలో దాన ప్రాముఖ్యం ఏమిటో అవగతమవుతోంది.

**పాత్రత:** దానమంటే ధనం ఇవ్వడమేకాదు. శ్రమదానం, జ్ఞానదానం, విద్యాదానం, వస్త్రదానం, అన్నదానం; శాస్త్రజ్ఞానం అభివృద్ధి చెందిన ఆధునిక కాలంలో రక్తదానం, నేత్రదానం, మూత్రపిండాల దానం – ఇలా పలురకాల దానాలున్నాయి. వాటిని పాత్రత నెరిగి దానం చెయ్యాలి. సత్పాత్రుడైన వ్యక్తి లభించడం బహు అరుదు. అట్టి వ్యక్తి లభించినప్పుడు యథాశక్తి దానధర్మాలు చెయ్యాలి. ఎవరికి ఏ వస్తువు ఎప్పుడు అవసరమవుతుందో, ఆ సమయంలో ఆ వస్తువు దానంగా పొందడానికి అతడు పాత్రుడు. ఆకలిగొన్న వానికి అన్నం, విద్యాహీనుడికి విద్య, రోగార్తునికి ఔషధం... ఇవి కాక వరదలు, కరువు కాటకాలు, అతివృష్టి అనావృష్టులు ఇత్యాది అవాంతర పరిస్థితులకు గురి అయిన వారందరు పాత్రులు. వారి జీవికకు అవసరమైన వస్తువులన్నీ దానం చెయ్యదగ్గవే. నేటి కాలంలో పాత్రాపాత్ర విచక్షణ చాలా సంక్లిష్టమై పోయింది. పరులను నిందించేవాడు, కపటి, అతి వినయం ప్రదర్శించేవాడు, అవినీతిపరుడు, సదాచారుని లాగా నటించేవాడు, జూదరి మొదలైనవారు అపాత్రులు. అలాంటి వారికిచ్చే దానం వ్యర్థమవడమే కాక పాపహేతువని కూడా చెబుతారు.

భిక్షకూ, దానానికీ ఉన్న భేదం గమనార్హం. భిక్ష వేరు, దానం వేరు. దాత తన దోషం పోగొట్టుకోవడానికి చేసే వితరణ– దానం. మన బాధలు, కష్టాలు, గ్రహబాధలు తొలగించుకోవడానికి ఇచ్చేది – దానం. 'మమోపాత్త సమస్త దురితక్షయార్థం...' అంటూ దానమిస్తాం. అవతలి వారు అవసరం కొద్దీ అడిగితే ఇచ్చేదీ, వారి ఆర్తిని తీర్చేదీ – భిక్ష! దాన విషయంలో దాత ఘనత ఏమీ లేదు. ప్రతిగ్రహీతదే ఘనత. ఎందుకనగా మనమిచ్చే దానంతో పాటు మన దోషాలు, పాపాలు వారు గ్రహిస్తారు.



దానాలు 'సాత్త్విక, రాజస, తామసికా'లని భగవద్గీతలో దానం గురించి విపులంగా చర్చ కనిపిస్తుంది. కేవలం కర్తవ్య బుద్ధితో, 'అది నా ధర్మం' అనుకొని పాత్రోచితంగా నిస్వార్థంగా చేసే దానం 'సాత్త్వికం'. ఇహపర లోకాలలో ఫలం ఏ మాత్రం ఆశించక చేసే దానాన్ని 'పూర్ణ సాత్త్విక'మని అంటారు. ప్రత్యుపకార దృష్టితో, అంటే దానం స్వీకరించిన వ్యక్తి వల్ల ముమ్ముందు ఏదైనా ఉపయోగం ఉంటుందనీ, అలాంటి ప్రత్యుపకారం పొందడానికి ఈ దానం ఒక అడ్వాన్స్‌లా ఉపయోగపడగలదనీ, సంఘంలో కీర్తి ప్రతిష్ఠలు వస్తాయనీ, తాను దాత అని కీర్తించబడాలనీ – ఇలాంటి స్వార్థచింతనతో చేసే దానం 'రాజసికం'. అయోగ్యులకూ, అపాత్రులకూ, అకాలంలో దానం, దానం తీసుకొనే వారి పట్ల గౌరవ మర్యాదలు లేకుండా అనిష్టంగా, తూష్ణీభావంతో ఇచ్చేది 'తామసిక' దానం. ఈ తామసిక దానం వల్ల పుణ్య సంపాదన సంగతి అటుంచి, అనర్థాలు కలిగే అవకాశం ఉంది.

**అర్థశౌచం:** అర్థశౌచమే అసలైన శౌచం అంటోంది మనుస్మృతి. శుచిగా, శుభ్రంగా ఉండడాన్ని 'శౌచం' అంటాం కదా! పూజా ప్రదేశం, పూజాద్రవ్యాలు, పూజ చేసే వ్యక్తి – అన్నీ శుభ్రంగా, శుచిగా ఉండాలని తాపత్రయపడతాం కదా! అలాగే సంపాదనలో శుద్ధత అంటే – నిజాయతీ, ధర్మబద్ధతతో చేసిన ఆర్జన. ఆ ధర్మార్జన నుంచే దైవారాధన, దైవకైంకర్యం యజ్ఞయాగాదులకు సమర్పించాలి. అన్యాయార్జితాన్ని, అంటే అక్రమంగా సంపాదించిన ధనాన్ని దానం చేస్తే ఫలితం శూన్యమనే చెప్పాలి. కొండంత దేవునికి గోరంత దీపంలా ధర్మార్జితాన్ని స్వల్పంగా దానమిచ్చినా ఫలితం ఉంటుంది. శ్రీకృష్ణ భగవానునికి కుచేలుడిచ్చినది గుప్పెడు అటుకులే కదా!

*గౌరవం ప్రాప్యతే దానాత్ నతు*
*విత్తస్య సంచయాత్ ।*
*స్థితిరుచ్చైః పయోదానాం*
*పయోధినా మధఃస్థితిః ॥*

దానం చెయ్యడం వల్లే గౌరవం కలుగుతుంది. కానీ కూడబెట్టడం వల్ల కాదు. మేఘాలు నీటిని దానం చేస్తున్నాయి కనుక వాటి స్థానం పైన ఉంది. సముద్రం నీటిని కూడబెడుతోంది కనుక దాని స్థానం క్రిందనే ఉంది. ❖

**దానం ఇవ్వని ధనం, శత్రువులను జయించడానికి ఉపయోగపడని బలం, మనస్సును నిగ్రహించుకోవడానికీ, ధర్మాన్ని అనుష్ఠించడానికీ ఉపయోగపడని విద్య నిష్ప్రయోజనాలు.** *- హితోపదేశం*

- డాక్టర్ రెంటాల జయదేవ

(...గత సంచిక తరువాయి)

# ఓంకార మాహాత్మ్యం

ఓంకారం మహత్తరమైన మంత్రమే కాదు, అది ఏకాక్షర బ్రహ్మ స్వరూపమని భగవద్గీతలో అభివర్ణించారు. **'భగవద్గీత'** (8వ అధ్యాయం/ 13వ శ్లోకం)లో శ్రీకృష్ణ పరమాత్మ సైతం ఇలా అన్నాడు:

***ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।***
***యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥***

*'ఇంద్రియాలన్నిటినీ నిగ్రహించి, మనస్సును హృదయంలో నిలిపి, భ్రూమధ్యంలో ప్రాణాన్ని స్థాపించి, ఆత్మయోగంలో ఉంటూ, బ్రహ్మకు ప్రతీక, ఏకాక్షరమూ అయిన ఓంకారాన్ని ఉచ్చరిస్తూ, నా గురించే (పరమాత్మ గురించే) స్మరిస్తూ, ఎవరైతే శరీరాన్ని వదలిపెడతాడో, ఆ వ్యక్తి శ్రేష్ఠమైన గతిని పొందుతాడు'* అని శ్రీకృష్ణ ఉవాచ.

అలాగే, 'భగవద్గీత'లోనే మరోచోట (17వ అధ్యాయం/ 24వ శ్లోకం) "వేదవాదులు ముందుగా బ్రహ్మవాచకమైన ఓంకారాన్ని ఉచ్చరించి, ఆ తరువాతే శాస్త్రోక్తమైన యజ్ఞ, దాన, తపః క్రియలను అనుష్ఠిస్తున్నారు" అని శ్రీకృష్ణ పరమాత్మ ఓంకార మాహాత్మ్యాన్ని పేర్కొన్నాడు.

ఇటు హిందూ మతంలోనూ, అటు బౌద్ధ మతంలోనూ మంత్రాల్లో మొట్టమొదటి భాగంగా 'ఓమ్' ఎంతో ముఖ్యమైనది. ఉదాహరణకు, మనం 'ఓమ్ నమశ్శివాయ' అంటాం. బౌద్ధంలో 'ఓమ్ మణిపద్మేహం' అంటారు. రెంటిలోనూ ముందుగా కలిపిన 'ఓమ్' అనే శబ్దం ఎంతో కీలకం.

అలాగే, ఓంకారాన్ని ముందుగా చేర్చకుండా, ఏ మంత్రాన్ని ఉచ్చరించినప్పటికీ ఆ మంత్రం ఫలించదని 'గోపథ బ్రాహ్మణం' పేర్కొంటోంది. మంత్రానికి ముందు ప్రణవాన్ని చేర్చడం వల్ల ఆ మంత్ర శక్తి ఇనుమడిస్తుంది. మంత్రాల సంగతికొస్తే, 'ఓమ్' అనేది శివుడికి ప్రతీక. మంత్రమేమో శక్తికి ప్రతీక. రెంటినీ కలిపి ఉచ్చరించడం వల్ల ప్రయోజనం సిద్ధిస్తుంది. ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలు, గాయత్రీ మంత్రం, యజ్ఞం చేస్తున్నప్పుడు ఉపయోగించే మంత్రాలు, దేవీ దేవతల నామావళులు 'ఓమ్'తోనే మొదలవుతాయి.

### ప్రణవోచ్చారణ ఫలితం ఏమిటి?

నిత్యం ఉదయం అయిదు నిమిషాల పాటు ఓంకార జపం చేస్తే చాలు. ఆత్మకూ, శరీరానికీ శాశ్వతమైన ప్రశాంతత లభిస్తుంది. ఓంకారాన్ని ఎంతో భక్తిగా, పెద్ద స్వరంతో, సుదీర్ఘంగా ఉచ్చరించాలి. అలా ఓంకారోచ్చారణ వల్ల మనలో తెలియని స్పందన కలుగుతుంది. అంతర్గత శక్తి పెంపొందుతుంది. శరీరంలోని ప్రతి భాగంపై అది ప్రభావం చూపుతుంది. ఓంకార నాదం అంతస్స్రావి గ్రంథులను ఉత్తేజపరుస్తుంది. అలాగే, సాధారణ స్పందనల ద్వారా మెదడు తనంతట తానే చైతన్యం పొందేందుకు తోడ్పడుతుంది.

అలాగే, శరీరంలోని అత్యంత ప్రధానమైన ఏకైక నాడిగా శాస్త్రజ్ఞులు పరిగణించే వ్యాగస్ నాడిని కూడా ఓంకారోచ్చారణ ఉద్దీప్తం చేస్తుంది. స్వరపేటిక, కంఠబలం, ఊపిరితిత్తులు, హృదయం, ఆహారనాళాలకు ఈ నాడి విస్తరించి ఉంటుంది.

మనస్సు ఏకాగ్రతనూ, దృఢత్వాన్నీ సంతరించుకుంటుంది. గొంతు మృదువుగా మారుతుంది. మనస్సులోని ప్రతికూల ఆలోచనలను ధ్వంసం చేస్తుంది. శరీరం తేలికగా మారుతుంది.

ప్రణవోచ్చారణ వల్ల లౌకికమైన ఆలోచనలు తగ్గుతాయి. నిద్రాణంగా ఉన్న అంతర్గత శక్తి మేల్కొంటుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ప్రాణశక్తి పైకి కదులుతుంది. అందువల్ల 'ఓం'కారాన్ని 7 సార్లు, 11 సార్లు, 21 సార్లు, 51 సార్ల వంతున ఉచ్చరించడం వల్ల దుఃఖం, నైరాశ్యం దూరమవుతాయి. ఆత్మసంతృప్తి పెరుగుతుంది. ఇక, సామూహికంగా ప్రణవాన్ని ఉచ్చరించడం వల్ల మరింత ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది. శారీరకంగా, మానసికంగా ఆరోగ్యం సంతరించుకోవాలంటే, ప్రతి ఒక్కరూ రోజూ కొంతసేపు ప్రశాంత చిత్తంతో ఓంకార ధ్యానం చేయాలి.

ఓంకారాన్ని ఉచ్చరించిన తరువాతే భగవంతుడు సృష్టిని ప్రారంభించినట్లు చెబుతారు. దాంతో, ఏ కార్యక్రమం ప్రారంభిస్తున్నా, ఓంకారంతో శ్రీకారం చుట్టడం శుభప్రదమని భావిస్తారు. మనం గుడి గంట మోగిస్తే, దాని ప్రతిధ్వని సైతం ఓంకారాన్నే తలపిస్తుంది. ఓంకార ధ్యానం వల్ల మనస్సుకు ప్రశాంతత కలుగుతుంది. ఏకాగ్రత సిద్ధిస్తుంది. ఓంకారం మీద, దాని అర్థం మీద ధ్యానం సాగిస్తూ, ఆత్మజ్ఞాన సాధన చేసేవారు ఎంతోమంది ఉన్నారు. ❖

(వచ్చే సంచికలో 'ఓంకారం దేనికి సంకేతం?')




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

# సిరిపురంలో 'హరి'జనప్రియుడు!

"సామాన్యుల అభ్యుదయంతోనే ఆధునిక భారతావని అభివృద్ధి సాధ్యం" అన్న స్వామి వివేకానంద సందేశం ఆయనను ప్రజల మనిషిని చేసింది. కమ్యూనిస్టు ఉద్యమానికి పురిటిగడ్డ అయిన ఖమ్మం జిల్లా ప్రజల గుండెల్లో ఆధ్యాత్మిక పరిమళాలు వికసింపజేసిన శ్రీవేమిరెడ్డి ప్రతాపరెడ్డి 1917వ సంవత్సరంలో ఖమ్మం జిల్లా మధిర తాలూకాలోని సిరిపురం అనే గ్రామంలో జన్మించారు. తల్లితండ్రులు పెట్టిన పేరు 'పాపిరెడ్డి'. కానీ స్వామి వివేకానంద ధైర్యవచనాలు ఆయనను స్వాతంత్ర్య పోరాట యోధునిగా మార్చి, ఆయన అసలు పేరు స్థానంలో 'ప్రతాపరెడ్డి' అనే సార్థక నామాన్ని తెచ్చి పెట్టాయి.


శ్రీ వేమిరెడ్డి ప్రతాపరెడ్డి

స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో కాంగ్రెస్ కార్యకర్తగా పనిచేస్తున్న ప్రతాపరెడ్డి, స్వామీజీ సందేశాలకు ఆకర్షితులై సామాన్య జనుల సేవకు తన జీవితాన్ని అంకితం చేశారు. విద్యతో వారి హృదయ వికాసానికి నడుం బిగించారు. గ్రామీణ ప్రాంతాల్లో వయోజన విద్యాకేంద్రాలను నెలకొల్పడం, హిందీ భాషాప్రచారం, హరిజన వసతిగృహ నిర్వహణ తదితర సేవా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. 1938లో మొగ్గగా మొలకెత్తిన హరిజన వసతిగృహం 'బాపూజీ హరిజన వసతిగృహం'గా 1950లో మధిరపట్టణానికి మారి, ఎంతోమంది నిమ్నకుల విద్యార్థులను ఈనాటికీ అక్కున చేర్చుకుంటోంది.

ఈ వసతిగృహం ప్రారంభంలో ప్రతాపరెడ్డి ఇంటింటికీ భిక్షాపాత్రలు పట్టుకుని వెళ్ళి బియ్యం సేకరించేవారు. ఆ బియ్యంతో విద్యార్థులకు భోజనం వండిపెట్టేవారు. తదనంతరం 'సిరిపురం' గ్రామాన్ని కేంద్రంగా చేసుకుని ఆయన చేపట్టిన సేవా కార్యక్రమాలు అన్నీ ఇన్నీ కావు. ఆ గ్రామస్థుల కృషి, స్వచ్ఛంద శ్రమదానంతో 1952లో ఆయన ప్రారంభించిన ప్రాథమిక పాఠశాల 1971 నాటికి కళాశాలగా రూపుదిద్దుకుంది. ఈ కళాశాల భవన నిర్మాణానికి తన సొంత ధనాన్ని వెచ్చించిన ఉదారస్వభావి ప్రతాపరెడ్డి. ఈ విద్యా సంస్థల్లో చేరే విద్యార్థులలో భక్తి, ప్రేమ, సేవ లాంటి ఉన్నత భావాలకు బీజం వేసేవారు. తుపాను తాకిడికి గురైన హరిజన వాడను మెట్టప్రాంతానికి తరలించి, రోడ్లు సైతం వేయించారు.

ఆధ్యాత్మిక భావప్రచారానికి శ్రీకారం చుడుతూ, శ్రీరామకృష్ణ భక్తులైన శ్రీ జంగా నర్సయ్య ప్రోత్సాహంతో 1979లో శ్రీరామకృష్ణ వివేకానంద సేవా సంఘాన్ని సిరిపురంలో స్థాపించారు. ఈ విధంగా ఖమ్మం జిల్లాలో మూర్తిత్రయ భావప్రచారానికి ఆద్యులయ్యారు. ఈ సంఘానికి సొంత భవనాన్ని సైతం సమకూర్చారు. ప్రతాపరెడ్డిగారి ఆధ్వర్యంలోనే మధిరలో సైతం శ్రీరామకృష్ణ సేవాసమితి ఏర్పాటైంది. 'ఒక చేతితో పని చేస్తూ, మరో చేతితో భగవంతుని పాదాలు పట్టుకో' అన్న రామకృష్ణులవారి ఉపదేశం ఈయనకు వేదవాక్కయింది. టీ త్రాగేటప్పుడు స్వామి సుబోధానందజీనీ, తోటపని చేసేటప్పుడు స్వామి బ్రహ్మానందజీనీ ఆయన గుర్తుచేసుకునేవారు. మూర్తిత్రయ ప్రచారానికి ఏ చిన్న అవాంతరం వచ్చినా శ్రీరామకృష్ణుల చిత్రపటం ముందు కన్నీరు మున్నీరయ్యేవారు.

1993లో పూజ్య స్వామి నందానందజీ మహరాజ్ ఆధ్వర్యంలో దాదాపు 108 గ్రామాల్లో పర్యటించి, మూర్తిత్రయ భావప్రచారం చేశారు. అలా ఆయన తన జీవిత చరమాంకంలో బృహత్తర ఆధ్యాత్మిక కార్యక్రమం నిర్వహించారు. పూజ్య స్వామి నందానందజీ మహరాజ్‌ను పూర్ణాహుతితో ఆహ్వానించి తన భక్తిని చాటుకున్నారు. మూత్రపిండాల వ్యాధితో బాధపడుతున్నప్పుడు శ్రీరామకృష్ణులను 'గురుదేవా! ఈ బాధలను భరించే శక్తినివ్వు లేదా నన్ను త్వరగా నీ లోకానికి తీసుకువెళ్ళు' అని ప్రార్థించేవారు. ఆయన తన జీవిత చరమాంకం వరకూ శ్రీరామకృష్ణుల నామాన్ని స్మరిస్తూ 27-6-1993న (76వ ఏట) ఆ అవతారమూర్తి లోకానికి చేరుకున్నారు. లౌకిక గృహస్థుల లాగా కాకుండా తన వారికంటూ ఏమీ ప్రత్యేకంగా ఆర్జించక ప్రజల మనిషిగా జీవించారు. పాపిరెడ్డిగా జన్మించి, ప్రతాపరెడ్డిగా అందరి హృదయాలలో నిలిచిన ధన్యజీవి వారు. ❖ సేకరణ: డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి, కె.సత్యప్రసాద్‌రాయ్

అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

ఎవరైతే ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా వ్యాజరహితంగా పరులకు ఉపకారములనే చేస్తూ ఉంటారో వారే యోగులు, వారే పుణ్యమూర్తులు, అలాంటి వారి జన్మలు ధన్యం. - హితోపదేశం



# దుష్ట సంస్కరణకు రామకృష్ణావతారం

- ఎం.వి. నాగప్రసాద్

శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరంలో సాధనలు చేస్తున్న కాలంలో, బాహ్యపరిస్థితులు పూర్తి వ్యతిరేకదిశలో ఉన్నాయి. ఎక్కువమంది యువకులు మధువుకూ, మగువకూ దాసులై, బానిసలై భారతీయ సంస్కృతీ, సంప్రదాయాలనూ, సామాజిక కట్టుబాట్లనూ అతిక్రమించి విచ్చలవిడిగా సంచరిస్తున్నారు. "నేను తాగిన సీసాలను ఒకదాని మీద ఒకటి పేరిస్తే, అవి హిమాలయాల కన్నా ఎత్తుగా ఉంటాయ"ని గిరీశ్ చంద్రఘోష్ అన్నాడంటే, వారి విషయవాంఛా పరాయణత్వం ఎంత ఉద్ధృతంగా ఉందో ఊహించవచ్చు. అలాగే కాళీపదఘోష్, సురేంద్రనాథ్‌మిత్రా, పహిల్వాన్ మన్మథ్‌ల ప్రారంభ జీవితాలనూ, శ్రీరామకృష్ణుల దివ్యచరణాలు ఆశ్రయించిన తరువాత వారిలో వచ్చిన మార్పునూ పరిశీలిస్తే, శ్రీరామకృష్ణులు తమ అవ్యాజమైన కరుణతో మనుష్యులనూ, వారి మనస్సులనూ మార్చే అద్భుత మానసిక వైద్యులని అర్థమవుతుంది.

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం... అంటోంది భగవద్గీత. ఈ వాక్యాన్ని ఈ కలియుగానికి అన్వయించడం కష్టమవుతుంది. కృత, త్రేత, ద్వాపర యుగాలలో వీరు దుర్మార్గులు, వీరు మంచివారని మనుషుల మధ్య కచ్చితమైన విభజనరేఖ గీయడానికి అవకాశం ఉండేది. ద్వాపర యుగాంతం "చెడ్డవారితో స్నేహం చేస్తే ఎలాంటి దుష్పరిణామాలు ఎదురవుతాయో కురుక్షేత్ర యుద్ధం నిరూపించింది." అయినా మనిషిలో మార్పు రాలేదు. విచ్చలవిడితనం, జవాబుదారీ లేనితనం విశృంఖలమవుతోంది. ఈనాడు మనం గొంగట్లో అన్నం తింటూ అసహనంతో, నిస్సహాయులమై చూస్తూ, అన్నీ భరిస్తూ ఉన్నాం. మంచిని వెతుక్కునే స్థితిలో ఉన్నాం. ఇలాంటి విపరీత, విపత్కర పరిస్థితుల మధ్య దుష్టులనూ, దుర్మార్గులనూ వధిస్తూ పోతే, భూమి మీద మానవుని ఉనికికే ముప్పు వచ్చే పరిస్థితి.

వధించాలా? ధర్మగ్లానిని భరించాలా? అనే సందేహం మనసుకు తోచినప్పుడు శ్రీరామకృష్ణుల నుండి వినిపించే సమాధానం.... హృదయ సంస్కరణ, ఆలోచనల సంస్కరణ, బాహ్యాభ్యంతర సంస్కార సంస్కరణ. ఈ యుగధర్మం వధించడం కాదు, సంస్కరించడం! వధ భౌతికమైంది. సంస్కరణ మానసికమైంది. వధించడం వల్ల భౌతికరూపం నశిస్తుందే గానీ, అతని భావజాలం నశించదు. మన పురాణాలలో దేవతలు తండ్రిని వధిస్తే, ప్రతీకారేచ్ఛతో తనయుడు అమరావతి మీదనో, ఇతర దేవతల మీదనో దండెత్తడం చదువుతున్నాం. కనుక మనస్సు లోతుల్లో పాతుకుపోయిన చెడును అవ్యాజమైన ప్రేమ, అపారమైన కరుణ, సానుభూతులతో సంస్కరిస్తే, పుటంలో పెట్టిన స్వచ్ఛమైన బంగారం లాంటి మహనీయుడు ఆవిష్కృతమవుతాడు.

మన సంఘ, మతసంస్కర్తలు, జాతీయ, రాజకీయ నాయకులు భౌతిక పరిణామమే నిజమైన మార్పంటూ నేల విడిచి సాము చేస్తున్న సమయంలో, శ్రీరామకృష్ణులు మనో ధర్మసంస్కరణకు పూనుకున్నారు. చట్టాలు, శాసనాలు, ఆయుధాలతో గాక, ఆత్మబలంతో, అవ్యాజమైన ప్రేమతో మనస్సును జయించవచ్చని నిరూపించారు శ్రీరామకృష్ణులు.

చెడును అసహ్యించుకోవడం, అకారణంగా, అసందర్భంగా విమర్శించడం, ఎగతాళి చేయడం, హేళన చేయడం మనిషిలోని దుర్మార్గమైన ప్రవృత్తి. ఎదుటివారి వైపు వేలు చూపే సందర్భంలో తానొక గురివిందగింజనని మనిషి మర్చిపోతాడు. శ్రీరామకృష్ణుల వద్దకు సురేంద్రనాథ్ మిత్రా, గిరీశ్ చంద్రఘోష్, కాళీపదఘోష్ మొదటిసారిగా వచ్చినప్పుడు ఇలాంటి నిరసనస్వరాలే వినిపించాయి. వారి రాకను సనాతనులు, సంప్రదాయవాదులు భరించలేకపోయారు. కానీ క్షణమాత్రంలోనే ఎదుటి వ్యక్తి వ్యక్తిత్వాన్నీ, జన్మపరంపరలనూ తెలుసుకొనగల శ్రీరామకృష్ణులు గిరీశ్‌లోని ప్రగాఢ విశ్వాసాన్నీ, వీరభావాన్నీ గ్రహించారు గనుకనే తమ పాదాల చెంత ఆశ్రయమిచ్చారు. "ఈ పాపి గతి ఏమిటి"ని గిరీశ్ ఆర్తితో ప్రశ్నించినప్పుడు "నీ ముక్త్యారునామా నాకు ఇవ్వు. సర్వం నేనే చూసుకుంటా"నని అభయమిచ్చిన కరుణా సింధువు శ్రీరామకృష్ణులు.

సురేంద్రనాథ్ మిత్రా అనుభవం ఎంతో ఆశ్చర్యకరమైంది. శ్రీరామకృష్ణుల ముఖ్యశిష్యులలో ఒకడైన సురేంద్రుడు తాగుబోతుగా ఉండడం రామచంద్రదత్తాకు రుచించలేదు. ఈ విషయం బయటకు తెలిస్తే గురుదేవులకు అపకీర్తి ఏర్పడుతుందని భయపడుతుండేవాడు. ఈ విషయం తెలుసుకున్న సురేంద్ర, "దాని గురించి ఎందుకింత

సతాయింపు? నాకది చెరుపు చేసే పక్షంలో గురుదేవులు తప్పకుండా నన్ను హెచ్చరించేవారు. ఆయనకంతా తెలుసు. గురుదేవులే స్వయంగా దీని గురించి ప్రస్తావించి, నన్ను మానుకోమంటే తప్పకుండా మానుకుంటానని వాగ్దానం చేస్తున్నా"నన్నాడు రామ్‌తో.

ఇద్దరూ దక్షిణేశ్వరం వెళ్ళారు. ఆనందపారవశ్యంలో ఉన్న గురుదేవులకు నమస్కరించగా, "సురేశ్! నువ్వు మద్యం సేవిస్తున్నప్పుడు, ముందుగా కాళీమాతకు అర్పించి, ఆమె ప్రసాదంగా పుచ్చుకో. మొదట్లో మామూలుగా నీకు కలిగే ఉత్తేజాన్ని మాత్రమే పొందుతావు. కానీ అది సత్వరమే ఆధ్యాత్మిక ఆనందానికి దారితీస్తుంది" అన్నారాయన. ఈ ఉపదేశం విని వారు నిరుత్తరులయ్యారు.

ఈ సందర్భంలో మనం గమనించవలసిన ప్రధానాంశ మేమంటే, సురేశ్ ఆశించినట్లుగా శ్రీరామకృష్ణులే స్వయంగా ప్రస్తావించారు. నిర్ద్వంద్వంగా, సూటిగా మానుకోమని హెచ్చరించలేదు కానీ, మానుకోమని సురేంద్రుని పరోక్షంగా ఆదేశించారని భావించాలి. గురుదేవులు ఈ విషయం ప్రస్తావిస్తే మానుకుంటానన్నది సురేంద్రుని వాగ్దానం కదా! ఆనాటి నుండి సురేంద్రుడు మద్యం ముట్టలేదు. ఈ సంఘటన ద్వారా శ్రీరామకృష్ణులు భక్తుల హృదయాలనూ, ఆలోచనలనూ చదివి, వారి వారి మనస్తత్త్వాలకు తగిన విధంగా తమ అపారమైన దివ్యకరుణతో, అనురాగంతో, సమస్యలకు సమాధానాలు చెబుతూ అక్కున చేర్చుకొని ఆదరించి, పాత వాసనలు మళ్ళీ వారి దరిచేరని విధంగా, సున్నితంగా సంస్కరించే భవరోగ నిపుణులని తెలుస్తోంది.

కాళీపదఘోష్ వైనం మరీ విచిత్రమైంది. నేరుగా వచ్చి, శ్రీరామకృష్ణులనే "కొంచెం మద్యం ఉంటే ఇస్తారా?" అని అడిగాడు. ఒకానొక సమయంలో శ్రీరామకృష్ణులను కఠినమైన మాటలతో నిందించాడు. అయినా గురుదేవులు అతణ్ణి క్షమించి, తన ఆంతరంగిక భక్తునిగా స్వీకరించారు. 1885 డిసెంబరు 23న గురుదేవులు, కాళీపదఘోష్ ఛాతీని స్పృశించి, "నీలో చైతన్యం జాగృతం చెందుగాక!" అని దీవించారు.



బహిష్కృతులుగా భావించే నాటి జనులలో రంగస్థలంపై నటించే స్త్రీలది ప్రథమస్థానం. అలాంటివారిలో నటి వినోదిని ఒకరు. గిరీశ్ చంద్రఘోష్ రచించి, ప్రదర్శించే నాటకాలలో ఆమె వేషాలు వేస్తూ ఉండేది. 1884 సెప్టెంబరు 21న స్టార్ థియేటర్‌లో 'చైతన్యలీల' నాటకాన్ని చూడడానికి వెళ్ళిన గురుదేవులు, ఆ నాటకంలో చైతన్యుని పాత్ర ధరించిన వినోదిని శిరస్సును తాకి, "తరించు తల్లీ!" అని దీవించారు. అదేవిధంగా మథురనాథుని ఇంటిలోని సేవిక భగవతిదాసి. ఈమె యౌవనంలో కొంతకాలం అనాలోచితంగా, తప్పుగా ప్రవర్తించినా శ్రీరామకృష్ణుల అనుగ్రహదృక్కులు ఆమె మీద ప్రసరించి ధన్యురాలిని చేశాయి. ఆమె హృదయ వేదనను తగ్గించడానికై గురుదేవులే స్వయంగా పాట పాడారంటే ఆమె అదృష్టాన్ని ఏమని వర్ణించగలం?

శ్రీరామకృష్ణుల గృహస్థభక్తులలో అగ్రగణ్యురాలు, శ్రీశారదామాతకు ఆంతరంగిక మిత్రురాలు యోగిన్ మా. అవి యోగిన్ మా శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చే ప్రారంభ రోజులు. ఆమె, గురుదేవుని వద్దకు రావడం ఆమె సోదరుడు హీరాలాల్‌కు సుతరామూ ఇష్టం లేదు. ఒకసారి గురుదేవులు, యోగిన్‌మా ఇంటికి వస్తున్నారని హీరాలాల్‌కు తెలిసింది. మన్మథ్ అనే రౌడీ మల్లయోధుడిని పిలిచి శ్రీరామకృష్ణులను బెదిరించి భయపెట్టమని పురమాయించాడు. ఎంతో ఆవేశంతో, ఉగ్రుడై వచ్చిన మన్మథ్, శ్రీరామకృష్ణులను చూసిన మరుక్షణమే తాను ఎందుకు వచ్చాడో మర్చిపోయాడు. శ్రీరామకృష్ణులు పలికిన ప్రతి పలుకూ అమృతబిందువై అతని హృదయాన్ని తాకి, ఎన్నో ఏండ్లుగా అతనిలో పేరుకుపోయిన కరుడుగట్టిన రాక్షసత్వాన్నీ, రౌడీయిజాన్నీ కరిగించి, దోషప్రక్షాళన చేసింది. మనస్సు పొరల నుండి ఉబికివస్తున్న ఉద్వేగాన్ని ఆపుకోలేక కన్నీళ్ళతో వెళ్ళి, గురుదేవుని పాదాల మీద పడి, "ప్రభూ! ఈ దోషిని క్షమించండి" అని అన్నాడు. దయాపరిపూర్ణులైన శ్రీరామకృష్ణులు, "సరే! రేపు దక్షిణేశ్వరానికి రా!" అని ఆదేశించారు. శ్రీరామకృష్ణులు ఏ వ్యక్తినైనా "మళ్ళీ రా!" అని ఆదేశించారంటే, ఆ వ్యక్తి శ్రీరామకృష్ణుల సంపూర్ణ అనుగ్రహానికి అర్హత

(మిగతా 35వ పేజీలో...)

**ముక్తపురుషుడు తన దగ్గర ఉన్నవారికి మాత్రమే మోక్షజలాన్ని ఇవ్వగలడు. కానీ అవతార పురుషుడు హృదయంలో భక్తి అనే జలం లేక శుష్కమై ఉన్న వారిని సైతం తరింపజేస్తాడు.** - శ్రీరామకృష్ణులు

# ఈ పరిష్కారాన్ని ఆలోచిద్దాం !

- స్వామి శితికంఠానంద

ఒకప్పుడు మహావైభవంతో వెలిగిన ఆర్యావర్తం కలియుగ ప్రభావం వలన ఆ వెలుగును కోల్పోయి సమస్యల సుడిగుండంలో చిక్కుకుపోవడం, శాంతి తెరువును కానక ఉన్న జనులతో నిండి ఉండడం, నిర్జరులను విస్మయ భ్రాంతికి గురిచేసింది. తమ ధ్యాన తత్పరతతో, భగదభినివేశంతో అనంత సత్యాన్ని అనుభవమొనర్చుకొని 'బ్రహ్మాండం గోష్పదాయతే' ఈ మహావిశ్వాన్ని ఒక గోష్పదిలా (ఆవుగిట్ట పరిమాణంగల నీటిగుంటగా)భావించిన ఆ ఋషుల సంతతి పిల్ల చేష్టలను తెలుసుకోవడం దేవతలకు వేడుకైంది. అదేసమయంలో తమ వైభవమేమిటో తమకే తెలియని అజ్ఞానంలో చిక్కుకున్న ఆర్యసంతతిని తలపోస్తూ దేవతలు ఖేదానికి గురి అయ్యారు. వైదికుల వేదనాభరిత జీవితాన్ని చింతిస్తూ వేల్పులు విషణ్ణులయ్యారు కూడా. మహామాయ విజృంభణను తిలకిస్తూ మహాశ్చర్య చకితులయ్యారు.

అందరూ ఆసీనులై ఉండటం చూసి నిలింపాధీశుడు సభాకార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు.

**ఇంద్రుడు:** మనుషులందరూ మోక్షేచ్ఛతో 'నేను' అంటే దేహం అన్న అభిమానాన్ని తొలగించుకొని కైవల్య ప్రాప్తికి ప్రయత్నించి ఎక్కడ మనలను అధిగమిస్తారో అని వారిని మాయలో ఉంచటానికి అష్టకష్టాలు పడేవారం వేదకాలంలో. అలాంటిది ఇప్పుడు వారి దుఃఖాన్ని చూడలేక మనమే వారికి ఆనంద మార్గాన్ని చూపించటానికి ప్రయత్నిస్తున్నాం. ఏమి విచిత్రం?

**ప్రత్యూషుడు:** సభా కార్యక్రమాన్ని ప్రసారం చేస్తున్నాం దేవా. ఈ యుగంలో అందుకనే భగవంతుడు కూడా అవతరించటానికి సాహసించడు. వివేకానందుడి లాంటి కరుణాపూరిత హృదయాలు ఈ దుఃఖాన్ని తట్టుకొని నిలబడలేవు. ఐనా ఆ కారణజన్ముడు పదిహేనువందల సంవత్సరాలకు సరిపడే సందేశాన్ని అందించానన్నాడు. మళ్ళీ అవతరించవలసిన అవసరమేముంది కనుక? బోధను స్వీకరించి ఆచరించటమే మానవులు చేయవలసింది.

**అశ్వినీదేవతలు:** అవును. అవును. మానసిక, శారీరక అనారోగ్యం వలన మనుజులలో ఏర్పడుతున్న అభద్రతాభావం, కలుగుతున్న దుఃఖం వర్ణనాతీతం. రెండింటికీ ఆధారమైన భగవంతుడిని, ఆత్మచైతన్యాన్ని సదా స్మరిస్తూ మనోశరీరాలనుంచి విడివడితే అదే కైవల్యం, పరమానందం. అలాంటిది 'నేను' అంటే ఈ స్థూలదేహమే అనుకొని, సదా ఇంద్రియలోలుడై కర్మలను చేస్తూ, వాటి కర్మలను అనుభవించటానికి శరీరాలను ధరిస్తూజనన, మరణ సంసారంలో కొట్టుకుపోతున్నవాడే కలియుగంలోని మానవుడు.

ఈ భూలోక వైద్యుడిని చూచిన తర్వాత వారిని ప్రశ్నలడగాలని మాకు మహా ఉత్సాహంగా ఉంది దేవా.

**ఇంద్రుడు:** దానిదేముంది. అడగండి. వారిని ప్రశ్నలడగటానికి మీరే సమర్థులు.

**అశ్వినీదేవతలు:** 'వైద్యో నారాయణ హరిః' ...వైద్యుడు అంటే నారాయణుడే అని కదా ఆర్యోక్తి. సుఖదుఃఖాలనేవి మనస్సుకు సంబంధించినవి కదా. అలాంటప్పుడు మనస్సు గురించి తెలుసుకోకుండా మీరు ఏ విధంగా ఉత్తమ వైద్యం చేశారు?

**వైద్యుడు:** మేము ఏమి చేసేది? మేము ప్రస్తుతం నేర్చుకొనే వైద్యవిద్యలో ఎక్కడకూడా మనస్సుకు సంబంధించిన విషయాలు ఉండవు. మేము మెదడును మాత్రం చదువుతాం. మెదడుకు, మనస్సుకు ఉన్న సంబంధం మాకు అర్థం కాదు. కాబట్టి రోగంలో మనస్సుకున్న ప్రమేయాన్ని మేము అంచనా వేయటానికి అవకాశం లేదు. బాహ్య లక్షణాలను చూస్తూ రోగనిర్థారణ చేసి ఔషధాలను ఇవ్వడం జరుగుతుంది. ఏ భాగానికి రోగం వచ్చినా మందు రక్తంలోకి వెళ్ళాల్సిందే. ఆ మందు ఆరోగ్యంగా ఉన్న భాగాలకు మంచి చేస్తుందా? చెడు చేస్తుందా? అని ఆలోచించటానికి అవకాశం లేదు. అభివృద్ధి చెందిన దేశాలలో వారు చేస్తున్న వైద్యమే ఇప్పుడు ప్రపంచం అంతా అవలంబిస్తుంది.

**అశ్వినీదేవతలు:** అభివృద్ధి చెందిన దేశాలా? వారే భారతీయ వైద్య విధానాలైన యోగ, ఆయుర్వేదం మొదలైనవాటిని ఆశ్రయిస్తున్నారు కదా. మనిషి అంటే శరీరమే అనుకొని అభివృద్ధి చేసిన వారి వైద్యవిధానం పరిపూర్ణమైనది ఎలా అవుతుంది?అది గ్రహించే వారు భారతదేశ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని స్వీకరిస్తున్నారు కదా!

**వైద్యుడు:** అవును. ఆ దేశాలు అభివృద్ధి చెందిన దేశాలు అని భావించటం వలన మనకున్న వైద్య జ్ఞానాన్ని పూర్తిగా విస్మరించి అన్నింటిలో వారినే అనుకరించటం జరుగుతుంది. దేశంలో ఇప్పుడు అత్యధిక వైద్యకళాశాలలు పాశ్చాత్యుల వైద్యాన్నే బోధిస్తున్నాయి. ప్రజలు అదే ఉత్తమమైనదని అనుకుంటున్నారు. ప్రతిభకల విద్యార్థులందరూ ఆ వైద్యవిద్యనే అభ్యసించటంతో భారతీయ వైద్యం, ఋషులు తెలియజేసిన ఆరోగ్య సూత్రాలు సెకండ్ రేట్‌వి అనుకుంటున్నారు. ప్రభుత్వాలూ పూర్తిగా నిరాదరించటంతో పరిశోధనకూ అవకాశం లేకుండా పోయింది. సంస్కృతంలో ఉన్న గ్రంథాలకు అనువాదాలు కూడా లభ్యం కావడం లేదు. ఇక భారతీయతకు ఆస్కారం ఎక్కడ? అన్ని చికిత్సా విధానాలను సమన్వయ పరిచి ఒక సమగ్ర వైద్య విధానాన్ని అభివృద్ధి చేసుకుంటే బాగుండేది. అలాంటి ప్రయత్నమేదీ జరగకపోయేసరికి ఆధునిక వైద్యం అందని ద్రాక్షపండు అయింది. అంతా వ్యాపార ధోరణి ప్రబలి ఉండటంతో మా ప్రమేయం లేకుండానే రోగులను బాధకు గురిచేయవలసి వస్తుంది.

**అశ్వినీదేవతలు:** రోగం కన్నా ముందు, దేహాభిమానం వలన కలిగిన భయం, విచ్చలవిడిగా మందులు స్వీకరించటం – ఇవే మనిషిని చంపేస్తున్నాయేమో! నిజానికి సమస్య పరిష్కారం అంటే ఈ రోజుల్లో ఒక అనర్థం నుంచి ఇంకో అనర్థానికి వెళ్లటమే. ఆధ్యాత్మిక విలువలు క్షీణించటం, స్వార్థం పెరగటమే అన్ని సమస్యలకు మూలం. త్యాగం ద్వారా అమృతత్వాన్ని ప్రాప్తించుకోవడమే జీవిత లక్ష్యమని చెప్పటం ద్వారానే మనిషిని దుఃఖం నుంచి తప్పించవచ్చును. అదే సర్వసమస్య నివారిణి అవుతుంది. మనిషి ఈ పరిష్కారాన్ని ఆలోచించాలి.

**ఇంద్రుడు:** విదుషా! నీవేదో అడగాలనుకుంటున్నావు!

**విదుషుడు:** అవును దేవా! ఈ ప్రజానాయకుడిని కొన్ని ప్రశ్నలడగాలని ఉంది. ఈ నాయకగణం, వారితో పనిచేసే అధికార గణం సరియైన విధాన నిర్ణయాలు తీసుకుంటే ప్రజలు ఎన్నో కష్టాల నుంచి తప్పించుకుంటారు.

**ప్రజా ప్రతినిధి :** ఎప్పుడూ ప్రజల కష్టాలు, ప్రజల కష్టాలు అంటారు. మా కష్టాలు ఎవరు పట్టించుకుంటారు?

కలియుగంలో అన్నింటా ఎంత పోటీ ఉంటుంది? అందులోనూ కాస్త అధికారానికి అవకాశం ఉన్న రాజకీయాలలో మామూలు పోటీయా? పార్టీలో టికెట్ దొరకడమంటే అంత తేలికా? దానికి ఎంత డబ్బు అవసరం? ఎన్ని కష్టాలు పడితే అంత ధనం వస్తుంది. తీరా టిక్కెట్టు వచ్చిన తర్వాత గెలుస్తామంటే అదీ గ్యారంటీ లేదు. గెలవాలంటే ఎంతమందిని బుజ్జగించాలి? ఎంతమందిని సంతృప్తి పరచాలి? గెలిచిన తర్వాత మళ్ళీ వాళ్ళకు పనులు చేసి పెట్టాలి. ఎంతకాలం పదవిలో ఉంటామో తెలియదు. అంత కష్టపడినా అది ఐదు సంవత్సరాల భాగ్యమే. మా బాధలు ఎవరికి తెలుస్తాయి. నాయకులను నిందించటం ఫ్యాషన్ అయిపోయింది. ఏదో కాస్త పదవిని అనుభవిద్దామంటే ఇంత కష్టపడాలి. మా మనస్సులో మనస్సు పెట్టి చూస్తే విషయాలు అర్థమవుతాయి. నన్ను యమలోకానికి ఎందుకు తీసుకువచ్చారో అర్థంకావడం లేదు. ఎప్పుడో కృతయుగానికి సంబంధించిన ధర్మాధర్మ చట్టాలను కలియుగంలో అమలు చేస్తున్నాడు యమరాజు. కొద్దోగొప్పో కాలానికి అనుగుణంగా మారక్కర్లేదూ. బూజుపట్టిన చట్టాలను ప్రక్కన పడేసి ఆయన, ఆయన కుడిభుజం చిత్రగుప్తుడు కొంచెం ఆధునికతను అలవరచుకోవాలి!

**దేవలుడు**(తనలో తాను): ఔరా! నాయకవర్గానికి ఇన్ని తెలివితేటలుంటాయని మేము ఎప్పుడూ ఊహించలేదు!

**ప్రజా ప్రతినిధి** (దేవలుడి మనస్సును చదివిన వాడిలా) : జీవితం నేర్పే పాఠాలు, అనుభవాలు మావి. ఎంత లౌక్యంతో వ్యవహరిస్తే నెగ్గుకు రాగలమో మా పరిస్థితిలో ఉంటే కానీ అర్థంకాదు. ఆ...!

**ప్రత్యూషుడు:** అవును దేవరా ! మరి ఆ ప్రక్కన కలం పట్టుకొని కూర్చున్న వ్యక్తిని గత సభలో నారద మునీంద్రుల సంతతి అన్నారెందుకో అర్థం కావడం లేదు.

**సురుచి:** నేను తెలియజేసెదను ప్రభూ. వీరు ప్రసార మాధ్యమ ప్రతినిధి. అంటే వార్తలను సేకరించి వివిధ మాధ్యమాల ద్వారా ప్రజలకు చేరవేసే వృత్తి. పూర్వం పురాణ కాలంలో నారద మునీంద్రుడు నిరంతరం నారాయణ నామ స్మరణ చేస్తూ ముల్లోకాలు సంచరిస్తూ ఇక్కడి వార్తలు అక్కడికి, అక్కడి వార్తలు ఇక్కడికి చేరవేస్తూండే వారు. అందుకని వీరిని నారద మునీంద్ర సంతతి అన్నాం. ఐతే ఆ మునీంద్రుడికి, వీరికి చాలా తేడా ఉంది. వీరినుంచి కలలోనైనా, పొరపాటున కూడా నారాయణ నామ స్మరణ వెలువడదు. అలా చేస్తే ఎక్కడ పవిత్రత వచ్చేసి చేసేపని సరిగ్గా చేయలేమో అని భయపడతారు కూడా. ఇక నారద మునీంద్రుణ్ణి కలహప్రియుడు అనేవారు కదా. ఆయన వార్తలను సేకరించి కొంత తన వ్యాఖ్యానాన్ని కలిపి వారికీ,




వీరికీ మధ్యలో గొడవలు పెట్టేవారు. వీరు ఆ మహర్షికి ఏమీ తీసిపోరు. కాకపోతే ఆయన పెట్టిన కలహాలన్నీ చివరకి లోకకల్యాణానికి దారితీసేవి. వీరు పెట్టే గొడవలు లోకక్షయానికి ఉపకరిస్తుంటాయి. అంతే తేడా.

**ప్రసారమాధ్యమ ప్రతినిధి:** అభియోగాలు మోపటం తేలికే. మేము అందించే వార్తలు సమాజానికి మంచి చేస్తున్నాయా? చెడు చేస్తున్నాయా? అని ఆలోచించే సమయం మాకెక్కడిది? వార్తలను ప్రజలకు చేరవేయటమే మా వృత్తి. వాటికి ఎలా ప్రతిస్పందించాలో వారే నిర్ణయించుకోవాలి. అంతేకాని వాటికి మమ్మల్ని బాధ్యులను చేయడం ధర్మవిరుద్ధం.

**ఇంద్రుడు:** వీరి వాదనలో కూడా కొంత సత్యమున్నది. ఔరా! కలియుగంలో ధర్మాచరణ కాదు, ధర్మనిర్ణయమే కష్టంగా మారిందే? అసలు భూలోకమే ఒక నరకంగా మారింది కాబట్టి ఈ యమపురి ఇక అనవసరమేమో! ఈనాటికి సభను చాలిద్దాం. శుభం భూయాత్! ❖

**వార్ధక్యం రూపాన్నీ, ఆశ ధైర్యాన్నీ, మృత్యువు ప్రాణాల్నీ, అసూయ ధర్మప్రవృత్తినీ, కామం లజ్జనూ, దుష్టుల సహచర్యం సత్త్వవర్తన్నీ, కోపం ఐశ్వర్యాన్నీ, గర్వం సర్వాన్నీ హరించివేస్తాయి.** - హితోపదేశం




# పల్లెలకూ సేవల విస్తరణ...

సమాజంలో తమతో పోటీపడుతున్న వారిని అధిగమించి విజేతలుగా నిలిచిన ఎంతోమంది విజేతల గురించి చదువుకున్నాం. కానీ నిజమైన నాయకత్వ లక్షణమేంటో రామకృష్ణ మఠంలో జరిగిన 'యువసంఘర్ష్' పోటీలో పాలుపంచుకున్న తరువాత నాకు(ఆదిత్య కిరణ్) తెలిసింది. తనతో పాటు తన సహచరులను కూడా వెలుగులోకి తెచ్చేవాడు, వాళ్ళ ఉనికినీ నలుగురికి చాటే వాడే నిజమైన నాయకుడని అర్థమైంది; అదే విజేతల గొప్పతనమని తెలిసింది. అలాంటి నాయకుడే తనను అనుసరించేవారికి అసలైన స్ఫూర్తినివ్వగలడు. ప్రపంచంలో అలాంటి అరుదైన నాయకుడు స్వామి వివేకానంద అనటంలో అతిశయోక్తి లేదు. స్వామీజీ సమర్థులే(efficient) కాదు; ప్రభావశీలురు(effective) కూడా! ఒక్కమాటలో చెప్పాలంటే స్వామీజీ calm as a forest, but arisen as a fire. కేవలం స్వామీజీని ఆరాధించటం వల్ల లాభం లేదు; వారి మాటల్ని జీవితానికి అన్వయించుకోవాలి. ఇన్ని రోజుల పాటు ఈ కార్యక్రమంలో పాల్గొని నాయకత్వ లక్షణాలతో పాటు స్వామీజీకి సంబంధించి నేర్చుకున్న పరిజ్ఞానాన్ని కేవలం మెదడులో పదిలపరచుకుంటే సరిపోదని, మనస్సులోకి పంపి, నిత్యజీవితంలో పాటించటమే నిజమైన శిక్షణగా భావిస్తున్నాను. ఇప్పటి వరకు ఏదైనా దేశభక్తి సినిమా చూసినా, మంచి ఉత్తేజకరమైన ప్రసంగం విన్నా ఒక్కసారి ఉద్వేగంతో 'దేశం కోసం ప్రాణాలర్పించాలి' అనుకునేవాణ్ణి; కానీ స్వామీజీని చదువుతూ ఉంటే 'నేను నా దేశం కోసమే జీవించాలి' అని అనిపిస్తూ ఉంటుంది. ఆవేశాన్ని పెంచేదిలా కాకుండా, ఆలోచింపచేసే స్ఫూర్తి స్వామి వివేకానందది!

**సార్థకత లేని శరీరమెందుకు? :** సక్రమంగా సమాజం కోసం వినియోగపడని మన శరీరం, తెలివితేటలు ఉండి లాభం లేదని స్వామీజీ పదేపదే బోధించేవారు. అలా వారి ఒక్కొక్కమాట చదువుతూ ఉంటే ఈ సమాజంలో నా వంతు బాధ్యత ఏమిటో, మనలో ఎంత దివ్యత్వముందో అవగతమైంది. అలా ప్రత్యక్షంగా రామకృష్ణ మఠం ద్వారా జీవితం పట్ల అవగాహన, విశ్వాసం పెరిగాయి. నిజమైన నాయకుడిగా ఎదిగే మార్గాలేమిటో కళ్ళముందు కనిపించాయి. మానవత్వాన్ని నలుదిశలా వ్యాపింపచేసే ఒక దివ్యమైన కార్యమేదైనా చేయాలన్న తపన పెరిగింది. కేవలం నా వ్యక్తిగత జీవితానికి ఉపయోగపడే లౌకికమైన జ్ఞానమే కాదు; అంతకు మించి సమాజహితం కోసం పాటుపడే పరిజ్ఞానమూ కొంత తెలిసింది. నాకున్న అనుభవంతో ఈ వయస్సు నుంచే ఒక స్పష్టమైన ప్రణాళికను రచించుకోవాలని తెలిసింది.

**'SMART'గా సేవాకార్యక్రమాల నిర్వహణ... :** ఎప్పుడో ఏదో చేయాలన్న ఊహలతో, కలలతో ఆవేశంగా కాకుండా ఏ మంచిపనైనా ప్రణాళికాబద్ధంగా , దీర్ఘకాల ప్రయోజనంగా ప్రారంభించాలన్న స్వామి వివేకానంద మాటలను ఆచరణలో పెడుతూ, ఒక 'విద్యార్థి సేవాసంక్షేమ సంఘాన్ని' ప్రారంభించాం. పదిహేనేళ్ళ నుంచి ఇరవయ్యేళ్ళ మధ్య యువతీయువకులతో నడుస్తున్న ఈ సంస్థను మేము 'SMART' అన్న పేరుతో నడుపుతూ ఉన్నాం. అంటే Specific, Measurable, Achievable, Realistic, Timebound. ప్రణాళికాబద్ధంగా, పరిమితమైన, సుసాధ్యమైన సేవలను, వాస్తవపరిస్థితులతో బేరీజు వేసుకుంటూ, సమయపాలనతో సాగించే ప్రయత్నం చేస్తూ ఉన్నాం. విద్య, పర్యావరణం, దారిద్ర్య నిర్మూలన అంశాలపై కృషి సలుపుతూ ఉన్నాం. విద్యార్థులకు కేవలం అకడమిక్ విషయాల్లోనే కాకుండా స్వామి వివేకానంద సాహిత్యంతో పాటు, విశ్వసంబంధ విజ్ఞానం (cosmic science), శారీరక దారుఢ్యానికి ఉపయోగపడే సమరోచిత విద్యల్లో(martial arts) ఉచితంగా శిక్షణనిస్తున్నాను; భవిష్యత్తులోనూ ఇది కొనసాగిస్తాను. స్వామీజీ దృఢమైన శరీరమే బలమైన మానసిక శక్తికి ఆధారమవుతుందన్న మాటల్ని గుర్తుపెట్టుకొని, నాకు మార్షల్‌ఆర్ట్స్‌లో పట్టా ఉండటం వల్ల నాతోటి యువతకు ఉచితంగా అటువంటి శిక్షణనిస్తున్నాను. అయితే చాలా సంస్థలు నగరాలకే పరిమితమవుతున్నాయి. మా సంస్థ ద్వారా నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాలను హైదరాబాదుకే పరిమితం చేయకుండా, స్వామీజీ ఆశీస్సులతో 2013 నాటికి రాష్ట్రంలోని వివిధ గ్రామాలకు కూడా విస్తరింపచేయాలనుకుంటున్నాం. ❖ **బి. ఆదిత్య కిరణ్, 12వ తరగతి**

('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుది పోటీ (ఫైనల్స్)కి అర్హత సాధించిన డి.ఏ.వి. పబ్లిక్‌స్కూల్, హైదరాబాదు) విద్యార్థి.

# నవతరం ప్రవృత్తి

## తీరని కోరికలు... తీరక కోపాలు!

- స్వామి బోధమయానంద



శాంతి సమాజ సౌధానికి పునాదిరాళ్ళు నేటి యువతీ యువకులే! అలాంటి యువతరం నేడు మానసిక ఉద్రేకాలకు లోనై హింసా ప్రవృత్తి మార్గాన్ని అనుసరించడం బాధాకరం! ఈ రోజు సమాజంలో పాశ్చాత్య పోకడలు, భౌతిక ఆకర్షణలతో పాటు మరెన్నో పరిస్థితులు యువతను దారుణాలకు ఉసిగొల్పు తున్నాయి. ఇదే భావనతో కురుక్షేత్ర సమరంలో అర్జునుడు...

**అథ కేన ప్రయుక్తో౽యం పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥**

'పరమాత్మా! మానవుడు పాపమాచరించేందుకు అసలు హేతువేమిటి? ఇష్టం లేకున్నా కూడా మనుష్యులు ఎవరో బలవంతంగా ప్రోత్సహించినట్లు పాపం ఎందుకు చేస్తున్నారు? పాపాచరణకు కారణం బాహ్యమా? ఆంతరంగికమా? అని శ్రీకృష్ణభగవానుడిని ప్రశ్నిస్తాడు.

దీనికి సార్వకాలికమైన, సార్వజనికమైన విశ్లేషణతో ఆ జగదేకనాయకుడు అద్భుతమైన వివరణనిస్తాడు. రజోగుణం నుంచి పుట్టిన కోరిక, అది తీరనప్పుడు కలిగే క్రోధమే పాపం చేయటానికి ప్రధాన కారణాలని స్పష్టం చేస్తాడు భగవానుడు. ఈ రోజు కూడా మనం పరిశీలిస్తే 'తీరని కోరికలు; తీరకపోతే కలిగే కోపాలే' యువతను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఈ రెండింటి వలన కలిగే పరిణామాలు, మనిషిని రాక్షసుడిగా మార్చే స్తున్నాయి. అందుకే మన సనాతన ధర్మం మనిషిలోనే ఉండి, మనిషికి శత్రువుగా మారి అతనిని నేరప్రవృత్తి వైపునకు మరలించే ఆరుగుణాలను 'షడ్-రిపు'గా అభివర్ణించాయి. అవి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు! ఇవన్నీ మానవుడు పుట్టినప్పటి నుంచీ మనస్సును ఆవరించి అల్లకల్లోల పరుస్తున్నా, వాటి నుంచి బయటపడే మార్గాన్ని కూడా మన సనాతన ధర్మంలో విపులంగా సూచించారు. మనిషి తలచుకుంటే ఈ కామక్రోధాలను తన అదుపులో పెట్టుకోగలడు. ఇతర జీవజాతులకు ఆ అవకాశమే లేదు.

**కొరవడుతున్న మానసిక సమతౌల్యం...:** దురదృష్టవశాత్తూ ఆధునిక నాగరకతలో యువతీయువకులు మనస్సుకు ఈ రకమైన శిక్షణనివ్వటంలో ఘోరంగా విఫలమవుతూ ఉన్నారు. ముఖ్యంగా ఈ కింది నాలుగు అంశాల్లో తమ మానసిక సమతౌల్యాన్ని కోల్పోవటం వల్లే యథేచ్ఛగా ప్రవర్తిస్తూ ఉన్నారు. ఎంతటి నేరాలకైనా ఒడిగడుతున్నారు. అవి...

1.మానసిక ఉద్వేగం (emotionality)
2. క్రియాశీలత (activity)
3.ప్రచోదనం (impulsivity)
4. సాంఘికంగా సర్దుబాటు (sociability)

ఒక కోరికవైపు మనస్సు మొగ్గుచూపగానే వెంటనే అది 'ఎమోషనల్' అయిపోతోంది. దానిని ఎలాగైనా తీర్చుకోవాలన్న తపన పెరుగుతోంది. ఈ సమయంలోనే ఆ కోరిక సక్రమ మైందా? కాదా? అని ఒకటికి పదిసార్లు ప్రశ్నించుకోవాలి. తరువాతే మన క్రియాశీల, ప్రచోదక శక్తులను వినియోగించు కోవాలి. అప్పుడే మనస్సు సరైన దిశలో పయనించటం అలవరచు కుంటుంది. లేనట్లయితే, కనిపించిన ప్రతి కోరికనూ మనస్సు తీర్చుకోమంటుంది; ప్రలోభాలతో ప్రమాదంలోకి పడవేస్తుంది. ముఖ్యంగా మన నడవడిక, కామ, క్రోధాలు సమాజంపై ఏ విధమైన ప్రభావాన్ని చూపుతాయో ఆలోచించుకోవాలి. పొడచూపే ప్రతి కోరికను తీర్చుకుంటూ దాన్ని సంతృప్తిపరచాలని ప్రయత్నించటాన్ని మించిన అమాయకత్వం మరోటి లేదు. అవి ఎంత తీర్చితే, అంతకు వందరెట్లు ఆవురావురుమంటూ వెంట పడతాయి. చివరకు మన పతనానికే కారణమవుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే విశృంఖల ఇంద్రియవాంఛలే (unrestrained sensual desires) సభ్యసమాజంలో నేరధోరణికి ప్రధాన కారణం. అందుకే ఎక్కడో ఒక దగ్గర వాటికి భరతవాక్యం పలకాలి. అందుకే భగవద్గీతలాంటి ధార్మిక సారస్వతం 'వాంఛలను అణచుకోమని' చెప్పటం లేదు; వాటిని అధిగమించి ఉన్నతమైన అంశాలపైకి మనస్సును తీసుకువెళ్ళ మంటోంది. స్వామి వివేకానంద చెప్పినట్లు 'మన ఆధ్యాత్మికతను మరచిపోయి, పాశ్చాత్యుల భౌతికసుఖాలనే ఆలంబన చేసుకొని నాగరకతను నిర్మించుకుంటే, భవిష్యత్ తరాలన్నీ ఆ ఘోరపాపానికి ఫలితాన్ని అనుభవించాల్సి వస్తుంది. అది మన సంస్కృతికి గొడ్డలిపెట్టులా మారుతుంది'. నేరాలను అదుపు చేయటానికి చట్టాలు, రాజ్యాంగ సవరణలు, పోలీసు బలగాల కన్నా వ్యక్తిగత క్రమశిక్షణ, విచక్షణే ప్రధానం! ❖

**మాట తొందరనీ, మనస్సులోని కోప తీవ్రతనీ, జిహ్వాచాపల్యాన్నీ, కామపిశాచాన్నీ, చిత్తచాంచల్యాన్నీ అరికట్టినవాడే నిత్యం ప్రశాంతతను పొందగలడు. అతడే ముని.** - *హితోపదేశం*

భగవాన్ రమణమహర్షి వద్దకు ఓ వ్యక్తి ఏదో సంశయాన్ని నివృత్తి చేయాలంటూ చాలా వినయంగా, విధేయంగా వచ్చి ముందర నిలబడతాడు. ఆయన ప్రభుత్వశాఖలో ఓ అధికారి. 'భగవాన్! మిమ్మల్ని మించిన మహానుభావులు లేరు! మీ దర్శనం కోసం, నా సందేహాల నివృత్తి కోసం ఎన్నో ప్రయాసలకోర్చి ఇక్కడికి వచ్చాను' అని స్తుతిస్తూ 'అసలు ఈ లోకంలో మాయ అంటే ఏంటి? మనిషి ఎందుకు అందులో పడి కొట్టుకుపోతాడు? లేనిపోని నటనలతో ఎందుకు జీవిస్తాడు?' అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తాడు. రమణ మహర్షులు ఏమీ సమాధానం ఇవ్వకుండా మౌనంగా తమ సహజస్థితిలో అలా చూస్తూ కూర్చుంటారు. ఇంతలో ఆశ్రమం ముందు హడావిడి వినిపిస్తుంది. ఎవరో ప్రముఖ వ్యక్తి, జాతీయస్థాయి నాయకుడు అయిన ఓ పెద్దమనిషి భగవాన్ సందర్శనకు వచ్చారన్న సమాచారంతో భక్తులు అటువైపు ఆసక్తిగా గమనిస్తూ ఉంటారు. సందేహాల పరిష్కారానికి వచ్చిన సదరు అధికారికి, వచ్చిన వ్యక్తి చాలా ప్రముఖమైన, తనకు ఉపయుక్తమైన స్థాయిలో ఉన్నాడని అర్థమవుతుంది. వెంటనే అతను మహర్షి విషయం కూడా మరచి పోయి, పరుగుపరుగున ఆయన వద్దకు వెళతాడు.



# పొగడ్తలు...!

– బి. సైదులు

'నమస్కారం సార్! రండి, రండి! మీరు వస్తారని తెలిసే, నేను ముందే వచ్చి ఏర్పాట్లు చూస్తున్నాను. మీలాంటి వ్యక్తి ఇక్కడికి రావటం చాలా అరుదైన విషయం' అంటూ లేనిపోని పొగడ్తలతో ముంచెత్తుతాడు. తనే స్వయంగా ఆయనను భగవానుల వద్దకు తీసుకువచ్చి మర్యాదలు చేస్తాడు. ఆ ప్రముఖ వ్యక్తి రావటం, రమణ మహర్షిని దర్శించుకోవటం, వెళ్ళిపోవటం క్షణాల్లో జరిగిపోయాయి. హడావిడంతా సద్దుమణిగాక, ఆ అధికారి మళ్ళీ వినయంగా వచ్చి మహర్షి వద్ద కూర్చుంటాడు. అప్పుడు చిరునవ్వుతో భగవాన్ రమణులు 'నాయనా! ఇదే 'మాయ' అంటే! నువ్వు ఇక్కడికి వచ్చింది ఎందుకు? వచ్చి నువ్వు చేసింది ఏమిటి? చివరకు నన్ను కూడా మరచిపోయి, ఆ 'వ్యక్తిపూజ'లో పడిపోయావు. ఇదే నటనలతో కూడిన జీవితమంటే!' అంటూ లోనికి వెళ్ళిపోతారు. మనలో కూడా చాలామంది ఇలా స్వల్పప్రయోజనాల కోసం ముఖస్తుతులతో, పొగడ్తలతో పబ్బం గడుపుకుంటూ ఆత్మాభిమానాన్నే కోల్పోతున్నారు.

**మెచ్చుకోలు...ముఖస్తుతి :** ఎదుటి వ్యక్తిని అభినందించటం వేరు; పొగడ్తలతో అందలం ఎక్కించటం వేరు! మెచ్చుకోలు మనస్సు నుంచి వస్తుంది; ముఖస్తుతి(flattery) నోటి నుంచి వస్తుంది. కానీ నేడు మనసారా అభినందించటం (appreciation) అరుదైపోయి; అవసరార్థం మునగచెట్టు ఎక్కించేవారే ఎక్కువైపోయారు. మనమేమో ఆ మునగచెట్టునే మర్రివృక్షంలా భావించుకొని ఎంచక్కా పైపైకి ఎక్కేస్తాం. ఆనక వారు వెళ్ళి పోయాక, అసలు విషయం తెలిశాక, కాళ్ళువిరిగేలా కిందపడి పోతాం. అందుకే అలాంటి ప్రమాదాల గురించి హెచ్చరిస్తూ భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస "ముఖస్తుతి చేసేవారి మాటలతో మైమరచిపోకు. పశువు చచ్చిపడి ఉంటే రాబందులు గుమిగూడేట్లు, వాళ్ళు విషయాసక్తులను చుట్టుకొంటారు. ముఖస్తుతిపరులు వీళ్ళ వద్దకు వచ్చి, 'మీరు అంతటివారు, ఇంతటివారు' అంటూ పొగిడేస్తూ ఉంటారు. అవి వట్టి మాటలు కావు, బాణాలు! ముఖస్తుతిపరుల నుంచి జాగ్రత్తగా ఉండాలి. వారు తమ స్వార్థం కోసం ఎంతకైనా దిగజారుతారు" అనేవారు. ఇలాంటి 'భజనపరుల'తో జాగ్రత్తగా ఉండకపోతే, వారి ప్రతి పొగడ్తకూ మనం పొంగిపోతే, అది నిజమేనేమో అని భ్రమపడితే మనకు మించిన అవివేకి మరొకరు ఉండరు. క్షణంలో మనను ఆకాశానికెత్తేస్తున్నారంటే, తరువాత ఎప్పుడైనా తను అనుకున్నట్లు మనం ప్రవర్తించకపోతే వారే మరుక్షణం మనపై ఎంతటి దుష్ప్రచారం చేయటానికి కూడా వెనకాడరని గుర్తించాలి. ఎవరు అభినందిస్తున్నారో, ఎవరు అందలం ఎక్కిస్తున్నారో పసిగట్టే స్థాయికి పరిపక్వతను సాధించాలి. సమాజంలో అన్ని రంగాల్లో అత్యున్నత స్థాయికి చేరుకున్నవారంతా, ఇలాంటి విషయాల్లో చాలా జాగ్రత్తగా ఉంటారు. తమ ముందు ఎవరికీ ఇలాంటి టక్కుటమారి విద్యలు ప్రదర్శించే అవకాశమివ్వరు.

**ముఖప్రీతి...హీనస్థితి :** స్వలాభం కోసం ఎదుటివ్యక్తిని 'ఇంద్రుడవంటూ, చంద్రుడవంటూ' పొగిడి పనులు కానిచ్చు కుంటున్నామంటే అంతకన్నా దైన్యం మరోటి లేదు. అది మన వ్యక్తిత్వాన్నీ, ఆత్మాభిమానాన్నీ పణంగా పెట్టి, పొద్దుపుచ్చు

కుంటున్నామన్న మాటే! అంత దిగజారితే మనకు ఏమొస్తుందో ఒక్కసారి ఆలోచించుకోవాలి. ముఖాన లేనిపోని నవ్వులు పులుముకొని, ఓ వ్యక్తిని భట్రాజుల్లా 'అంతటివాడివి, ఇంతటి వాడివి' అంటే ఏదో ఆ పొద్దుగడవచ్చు. కానీ మన వ్యక్తిత్వంపై నలుగురిలో ఎలాంటి ముద్రపడుతుందో ఊహించుకోవాలి. ఇలాంటి 'వ్యక్తి ఆరాధన'తో మనిషి ఎంతటి హీనస్థితికి చేరుకుంటాడో ఆరువందల సంవత్సరాల క్రితమే అంచనావేశారు అన్నమాచార్యులు. అందుకే ఓ కీర్తనలో ఆయన ఇలా అంటారు:

**'మనుజుడై పుట్టి మనుజుని సేవించి, అనుదినమును దుఃఖమందనేలా; జుట్టెడు కడుపుకై చొరరానిచోట్ల చొచ్చి, పట్టెడు కూటికై బతిమాలి'** 'సేవించి' అంటే మరో వ్యక్తిని ఆరాధించి అని అర్థం. మనిషై పుట్టి, మరో మనిషి దగ్గర మన ఆత్మాభిమానాన్ని బలిపెట్టి, బాధలు పడాల్సిన అవసరం లేదు. ఏదో జుట్టెడు కడుపునింపుకోవటం కోసం పోరానిచోట్ల కల్లా పోయి, ఆత్మన్యూనతతో ప్రవర్తించాల్సిన అగత్యం పట్టలేదని అన్నమయ్య హితవు పలుకుతున్నాడు. వెన్నెముక ఉన్నది మనం నిటారుగా నిలబడటానికే కానీ, వంచి వేరొకరి ముందు తలవంచటానికి కాదు! అలాగని ప్రతిచోటా తలబిరుసుతో అహంకారంగా ప్రవర్తించమని కాదు; కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ మన ఆత్మగౌరవానికి భంగం వాటిల్లకుండా వినమ్రంగా మసలుకోవాలి. ప్రతివారినీ గౌరవించటం వేరు; పనికట్టుకొని కొందరికే పల్లకీమోయటం వేరు!

**పొగడ్త ప్రమాదం... :** ఒకరి మెప్పుకోసం ఎదురుచూస్తున్నామంటే, మనం వారు వెలిబుచ్చే అభిప్రాయాలకు, అందించే అభినందనలకు బానిసలమవుతున్నామన్న మాటే! అది అలవాటుగా మారితే మన ప్రగతికి అదే ప్రతిబంధకంగా మారుతుంది. మెచ్చుకుంటే మనస్సు మురిసిపోతుంది; లేదంటే ముడుచుకుపోతుంది. ముఖ్యంగా సృజనాత్మకరంగంలో ఉన్నవారిని ఈ 'పొగడ్తల జాడ్యం' మరింత అలజడికి గురి చేస్తుంది. అభినందనలకే అలవాటు పడి మనం చాలా సందర్భాల్లో చిన్న సద్విమర్శను, సవరింపులను కూడా తట్టుకోలేము. చివరకు అలా నిష్పక్షపాతంగా మనను విశ్లేషించేవారిని శత్రువులని భావిస్తాం కూడా; అనవసరంగా చెట్టెక్కించేవారినే చిరకాల మిత్రులనే భ్రాంతిలో పడిపోతాం. ఇది చాలా ప్రమాదకరం! అందుకే వ్యక్తిత్వ వికాసంపై అనేక పుస్తకాలు రాసిన డేల్ కార్నీ అంటారు "Flattery is like friendship in show, but not in fruit". అవును! అలాంటి వారి స్నేహం ఫలవంతమైన ఫలితాలనివ్వదు. ముఖ్యంగా ఆయా రంగాల్లో అప్పుడప్పుడే అడుగిడి ఎదుగుతున్న ప్రతిభావంతులు, ఈ ముఖస్తుతుల విషయంలో చాలా అప్రమత్తంగా ఉండాలి. వీలయినంత వరకు అలాంటి వ్యక్తులకు దూరంగా ఉంటూ, సద్విమర్శకులనే ప్రోత్సహించాలి. నైపుణ్యం ఉండి కూడా, ప్రాథమికంగానే ఈ పొగడ్తల మత్తుకు అలవాటు పడి, ఆయా రంగాల నుంచి తొలిదశలోనే నిష్క్రమించినవారు ఎందరో ఉన్నారు.

**ఆత్మాభిమానమే ఆభరణం...:** భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఆత్మాభిమానానికి ఉదాహరణగా చాతకపక్షిని తరచూ ఉటంకించేవారు. ఆ పక్షి పూర్తిగా ఆకాశం నుంచి రాలిపడే వాననీటిపైనే ఆధారపడి జీవించేదని, ఎట్టి పరిస్థితుల్లోనూ అది రాజీపడి నేలపైని నీటిని తాగకపోయేదని గుర్తుచేసేవారు. మనిషి కూడా అలా తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలనీ, ఎవరి ముందూ తలవంచి హీనపడకూడదనీ సూచించేవారు. అందుకే మన సనాతన ధర్మం కూడా...

**ఏక ఏవ ఖగో మానీ, చిరం జీవతు చాతకః।**
**మ్రియతే వా పిపాసాయాం, యాచతే నా పురందరమ్॥**

అంటుంది. పక్షులలో ఆత్మాభిమానం గల ఒకే ఒక పక్షి చాతక పక్షే! అది చిరకాలం జీవించనీ! దాని ఆత్మాభిమానం ఎటువంటిదంటే, దప్పికతో చావనన్నా చస్తుంది గానీ, ఇంద్రుణ్ణి తప్ప మరెవరినీ నీళ్ళిమ్మని అడగదు. ప్రతివారి జీవితానికి కూడా ఇలాంటి ఆత్మాభిమానమే ఆభరణంగా శోభిల్లుతుంది. కానీ మనం చాలా సందర్భాల్లో పరిస్థితులకు ఎదురొడ్డి నిలబడలేక, బలహీనులమై పోయి వెంటనే రాజీపడిపోతాం. మన స్వాభిమానాన్ని పణంగా పెట్టి ఎదుటివారికి దాసోహమైపోతాం. ఇది మన వ్యక్తిగత ప్రతిష్ఠకు మాయనిమచ్చలా మిగిలిపోతుంది.

**భట్రాజులకు బహుదూరం... :** పూర్వకాలంలో మహారాజులు తమ ఆస్థానాల్లో కేవలం పొగిడించుకునేందుకు కొంతమంది ఉద్యోగులను నియమించుకునేవారు. 'భట్రాజులు'గా వారి పని కేవలం మహారాజులను స్తుతించటమే! నేటి సమాజంలో కూడా ఎలాంటి నియామకాలు లేకుండానే తమ ప్రయోజనాలను నెరవేర్చుకునేందుకు ఆధునిక భట్రాజులు పుట్టుకొస్తున్నారు. వారి విషయంలో జాగరూకతతో ఉండకపోతే, మనల్ని ఎక్కడో ముంచేసి వారు ముందుకు వెళ్ళిపోతూ ఉంటారు. వాళ్ళు మన వాపును కూడా బలం అని భ్రమింపచేస్తారు; తీరా అది మనం నిజమని నమ్మి బరిలోకి దిగి తుక్కుతుక్కుగా ఓడిపోయిన తరువాత, తీరా వారే మన అమాయకత్వాన్ని చూసి నవ్వుకుంటారు. మన మహర్షులు చెప్పినట్లు వారు...

**కి మకారి న కార్పణ్యం, కస్యాలంఘన దేహలీ**
**అస్య పాపోదరస్యార్థే, కి మనాటి న నాటకమ్!**

ఈ పొట్టకోసం చూపని నీచత్వం ఏదీ? తొక్కని గడప ఏదీ? ఆడని నాటకం ఏదీ? అందుకే అలాంటి పొగడ్తలరాయుళ్ళకు బహుదూరంగా ఉంటేనే మన వాస్తవశక్తిసామర్థ్యాలకు అనుగుణంగా ఎదగగలం. ❖

**పొగడ్తలతో ముంచెత్తేవారిని పట్టించుకోవద్దు. ఈ రోజు నిన్ను పొగిడిన నాలుకే, రేపు నిన్ను తెగడుతుంది. భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకుంటే అరణ్యంలో ఉన్నా ప్రచారం లభిస్తుంది.** - శ్రీరామకృష్ణులు

# ఆనందానికి అర్థం చెప్పిన భిక్షగాడు

– శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

మనలో చాలామంది జీవితంలో ఎన్ని ఉన్నా, ఇంకా ఏదో వెలితిని వెతుక్కుంటూ విచారపడుతూనే ఉంటారు. ఆనందించాల్సిన ప్రతి క్షణాన్నీ, లేనిపోని ఆలోచనలతో నిరర్థకం చేసుకుంటూ ఉంటారు. అలాంటి కోవకు చెందిన వ్యక్తే – నా మిత్రురాలు మీనా! ఆమెది పెద్ద ఉద్యోగం, మంచి జీతం. కానీ ఎప్పుడూ ఏదో కోల్పోయిన దానిలా విచారంగా ఉంటుంది. ఆమెను కలిసినప్పుడల్లా ఆమె ఉదాసీనత, నిరాశ, నిర్వేదాలు మనకూ వ్యాపిస్తాయి. పైగా మీనా ఏ ఒక్కరి గురించీ నాలుగు మంచిమాటలు మాట్లాడదు. వ్యక్తులతో సత్సంబంధాలనే కాదు, చివరకు మంచి వాతావరణాన్ని కూడా ఆహ్లాదంగా అనుభూతి చెందలేదు. ప్రతి దానికీ మీనాలో అసహనం, అసంతృప్తి! ఆమెను పలకరించాలంటేనే మాకు ఓ రకమైన నిరాసక్తత. అలాంటి మీనాకు ఉద్యోగరీత్యా బెంగుళూరు నుంచి ముంబయికి బదిలీ అయింది. దాంతో చాలా ఏళ్ళుగా ఆమెను కలవడమే కుదరలేదు.



ఇటీవల ఏదో పని మీద నేను ముంబయి వెళ్ళాల్సి వచ్చింది. తీరా అక్కడికి వెళ్ళగానే కుండపోత వర్షం! వెంట గొడుగు కూడా లేదు. వీధి పక్కన నిలబడ్డాను. హఠాత్తుగా అక్కడ మీనా కనిపించింది. వర్షంలో అయినా సరే, ముందక్కడి నుంచి పారిపోవాలనిపించింది. అయితే తప్పించుకునే వీలు లేకుండా పోయింది. మీనా అప్పటికే నన్ను చూసేసింది. గబగబా వచ్చి ఎంతో ఆప్యాయంగా, హుషారుగా నా చేయి పట్టుకుంది. పాత స్నేహాన్ని గుర్తుచేసింది. పాతమిత్రులం, జ్ఞాపకాలు అమూల్యం, అపురూపం అంటూ ఇంటికి రమ్మని బలవంతపెట్టింది. నమ్మలేకపోయాను! నిజంగా నిరంతరం ఉదాసీనంగా కనిపించే మీనాయేనా! అని నన్ను నేనే నమ్మలేకపోయాను.

మీనాలో ఇలాంటి ఆనందాన్ని ఎప్పుడూ చూడలేదు. పైగా వర్షంలో తడిపించుకుంటూ, వానలో పరిమళించే మట్టివాసనను ఆస్వాదించుకుంటూ, సమీపంలో ఉన్న ఓ రెస్టారెంట్‌కి తీసు కెళ్ళింది. తీరిగ్గా టీ తాగుతూ, నా మనస్సులోని సందేహాన్ని అడిగేశాను. 'మీనా! ఏంటి నీలో ఇంత మార్పు? నువ్వు ఆనాటి మీనావేనా? ఏంటి ఇంత మార్పు? నిన్ను మార్చిన ఆ మాంత్రికుడెవరు?' అంటూ ప్రశ్నల మీద ప్రశ్నలు వేసేశాను. 'మాంత్రికుడు లేడు, మహిమలు లేవు సుధా! ఒక భిక్షగాడు, నా బ్రతుకును మార్చేశాడు' అంటూ నవ్వింది. నేను తెల్లబోయి చూసేసరికి, "అవును యాచకుడే! అతనో ముసలతను. అయిదేళ్ళ మనవరాలితో మా ఇంటి ముందే ఉండేవాడు. నేను నిరంతరం నిరాశావాదినని నీకు తెలుసు కదా! ఎవర్నీ నమ్మేదాన్ని కాదు. అందుకే ఎప్పుడూ ఏ సహాయమూ చేయకపోయేదాన్ని. కానీ రోజూ మిగిలిపోయిన అన్నం ఉంటే ఇచ్చేదాన్ని. ఎప్పుడూ పలకరించలేదు.

అలా ఉండగా ఒకరోజు భోరున వర్షం. నా పడకగది కిటికీలో నుంచి చూస్తూ, వర్షం నా నెత్తిన పడకపోయినా దానిని అకారణంగా తిట్టుకోసాగాను. ఆ భిక్షగాడికి, మనవరాలికి రోజూ పెట్టే అన్నం కూడా పెట్టలేకపోయాను. వాళ్ళు ఆకలితో అలమటిస్తూ ఉంటారనుకున్నాను. అయితే కిటికీలోంచి కనిపించిన దృశ్యం నన్ను ఆశ్చర్యపరిచింది. బిచ్చగాడు, అతని మనవరాలు ఎగిరెగిరి ఆడుకుంటున్నారు. వాళ్ళు తామేదో స్వర్గంలో ఉన్నామనుకుంటున్నట్లు తుళ్ళింతలతో గడుపు తున్నారు. ఆకలిని మరచిపోయి, ఆ వానని ఆస్వాదిస్తూ పరమా నందంలో మునిగిపోయారు. జీవితం పట్ల వారి అనురక్తిని చూసి నాకు ఈర్ష్య కలిగింది, ఆలోచింపచేసింది. నాకు అనేక సౌకర్యాలున్నాయి. వారికొక్కటీ లేదు. అయితే అన్నిటి కన్నా ముఖ్యమైనది నాకు లేనిది వారికుంది. ఏది ఉన్నా లేకపోయినా సంతోషంగా జీవించడమెలాగో వారికి తెలుసు. నిజంగా సిగ్గుపడ్డాను.

నాకు ఉన్నవాటి, లేనివాటి జాబితా రాయడం ప్రారంభించాను. చాలామంది ఊహించను కూడా లేని సౌకర్యాలు నాకున్నాయని గ్రహించాను. ఆ యాచకుణ్ణి ఆదర్శంగా తీసుకొని జీవితం పట్ల నా దృక్పథాన్ని మార్చుకోవాలని ఆ రోజే నిర్ణయించుకున్నాను" అంది మీనా ఆర్ద్రతతో!

చాలా సేపు నేను అలా సంభ్రమంతో కూర్చుండిపోయాను. మీనా జ్ఞానోదయానికి ఓ భిక్షగాడు కారణమయ్యాడని తెలిసి ముచ్చటపడిపోయాను. ఆ అనుభవమయ్యాక రెండేళ్ళలో ఆమె పూర్తిగా మారిపోయిందట. ఇప్పుడు తను దేనికీ బాధపడడం లేదు. అసంతృప్తి అన్న మాటే లేదు. ప్రతి చిన్న విషయంలో, ప్రతి పరిస్థితిలో, ప్రతి వ్యక్తిలో మీనా సంతోషాన్నే చూస్తోంది. 'మరి మీ గురువుకు ఏదైనా గురుదక్షిణ ఇచ్చావా?' అని అడిగాను. 'లేదు! దురదృష్టవశాత్తూ, నేను పూర్తిగా మారేసరికి అతను చనిపోయాడు. అయితే అతనిపై గౌరవసూచకంగా అతని మనవరాలిని బోర్డింగ్ స్కూలులో చేర్పించి చదివిస్తున్నా' అంది మీనా చెమ్మగిల్లిన కళ్ళతో! ❖ సేకరణ : జి. సతీష్



మైసూరు శ్రీరామకృష్ణ ఆశ్రమంలో నేను విద్యార్థుల వసతి గృహాన్ని నిర్వహిస్తూ ఉన్నప్పుడు చిన్నారులను గమనిస్తూ ఉండేవాణ్ణి. ఏదైనా అనారోగ్యం చేసినప్పుడు వారిని వైద్యుడి దగ్గరకు తీసుకువెళ్ళాల్సి వచ్చేది. వైద్యంలో భాగంగా ఇంజక్షన్ ఇవ్వాల్సి వస్తే, కొందరు విద్యార్థులు ఎలాంటి భయం లేకుండా నొప్పిని భరిస్తూ ఇంజక్షన్ చేయించుకొని వెళ్ళిపోయేవారు. మరికొంత మంది విద్యార్థులు ఇంజక్షన్‌ను చూడగానే భయంతో మూర్ఛపోయేవారు. అదే విధంగా పదవ తరగతి పరీక్షల సమయంలో కూడా ఫలితాలు ప్రకటించిన రోజున మైసూరు సమీపంలోని



# కష్టాలకు కదిలిపోకూడదు

– స్వామి రంగనాథానంద

కుకనహళ్ళి చెరువు దగ్గర విద్యార్థులు ఎక్కడ ఆత్మహత్య చేసుకుంటారోనన్న ఆందోళనతో ముందు జాగ్రత్తగా కాపలాగా స్థానిక అధికారులు జవాన్లను నియమించాల్సి వచ్చేది. అంటే చిన్న కష్టాన్ని కూడా భరించలేని బేల హృదయాలు వాళ్ళవి!

ఇలా జీవితంలో చిన్న అలజడికి కూడా తట్టుకోలేనంత బలహీనంగా ఉండే మనుష్యులు ఏమీ సాధించలేరు. ఎంతటి కష్టాన్నైనా ధైర్యంగా ఎదుర్కోగలిగేలా బలంగా తయారవ్వాలి. మన సనాతన ధర్మం బలానికీ, నిర్భయానికీ అత్యంత ప్రాధాన్యాన్నిచ్చింది. నిజానికి బలం, నిర్భయమే మన వేదాంత సారమంతా! నిత్యజీవితంలో ఎన్నో పరిస్థితులు మనల్ని దాసోహపరుచుకునే ప్రయత్నం చేస్తాయి. కానీ వాటికి వేటికీ చలించని మన సహజ స్థితితో వాటికి ఎదురొడ్డి పోరాడాలి. నిరంతరం మన వాస్తవ స్వరూపాన్ని గుర్తు చేసుకుంటూ వాటిని మించి మనం ఎదిగే ప్రయత్నం చేసినప్పుడే నిజమైన విజేతలమని అనిపించుకుంటాం.

'గుణైర్యో న విచాల్యతే' అంటోంది మన ప్రాచీన ధార్మిక సారస్వతం. అంటే త్రిగుణాల ప్రభావానికి చలించకూడదు. ఈ ప్రపంచంలో ఏ పరిస్థితులైనా సత్త్వ, రజో, తమో గుణాలకు లోబడే ఉంటాయి. ఆ యా గుణాలు వాటి పని అవి చేసుకుంటూ పోతున్నాయి. దానికి నేనెందుకు బాధపడాలి? 'యో వతిష్ఠతి' – ఇలా సమాలోచించుకుంటూ స్థిమితంగా ఉండగలిగేవారు, 'నేన్గతి' – దేనికీ చలించరు; కలవరపడరు. జీవితంలో ఇది అత్యున్నతమైన, అత్యవసరమైన సాధనాస్థితి. ఇదే నిజమైన వ్యక్తిత్వనిర్మాణం. ఒక్కమాటలో చెప్పాలంటే తోటలో పెంచుకునే అత్తిపత్తి (టచ్‌మీనాట్) మొక్కలా మనం ఉండకూడదు. ఆ మొక్క చిరుగాలికే ముకుళించుకొని పోయి వడలిపోతుంది. గాలి తీవ్రత తగ్గగానే మళ్ళీ పూర్వస్థితికి వస్తుంది. మనం కూడా చిన్న కష్టానికే కదలిపోయి, అలా అత్తిపత్తి మొక్కలా ముడుచుకుపోకూడదు. ఎన్ని సవాళ్ళనైనా ఎదుర్కొనే అద్భుతమైన బలం మనలోనే ఉందని తెలుసుకోవాలి.

ఇలా బాహ్యపరిస్థితులకు చలించకుండా, స్థైర్యంగా నిలబడేలా చిన్నారులకు తల్లితండ్రులు శిక్షణనివ్వాలి. ఈత వచ్చిన వ్యక్తి ఎంత పెద్ద సాగరాన్ని చూసినా భయపడడు. పైగా ఉత్సాహంగా అందులోకి దూకుతాడు. అలలతో ఆటలాడుకుంటాడు. అదేవిధంగా సమస్యల నుంచి కష్టాల నుంచి తప్పించుకోవాలనే ధోరణి కన్నా, వాటిని సమర్థంగా ఎలా ఎదుర్కోవాలో అలవాటు చేసుకోవాలి. ఉదాహరణకు ఒకటో తరగతి విద్యార్థికి కష్టమైన లెక్కను, రెండో తరగతి విద్యార్థి చాలా సులువుగా చేస్తాడు. కారణం అతడు బౌద్ధికంగా ఎదిగాడు కాబట్టి! అదే విధంగా మీరు ఎదుగుతున్న కొద్దీ, సమస్య చిన్నదైపోతుంది.

ఆధునిక సమాజం మీకు ఎన్నో సవాళ్ళతో స్వాగతం పలుకుతుంది. మీరు పరిష్కరించుకోవాల్సిన సమస్యలు నానాటికీ పెరుగుతూ ఉండవచ్చు. ఇలాంటి స్థితిలో ఎవరికి వారే ఆంతరంగికంగా శక్తిమంతులు కావాలి. ఒకరి సమస్య మరొకరు తీర్చే తీరిక ఎవరికీ లేదు. అందుకే శారీరక శక్తితో పాటు బౌద్ధిక, ఆధ్యాత్మిక శక్తులు కూడా అత్యవసరమని గుర్తించాలి. అలజడికి గురిచేసే ఆధునిక నాగరకతను తట్టుకొని ఈ తరం యువతీ యువకులు నిబ్బరంగా నిలబడాలంటే ఆధ్యాత్మిక శక్తి చాలా అవసరం. ఇలాంటి శక్తి లోపించడం వల్లనే ఈ తరంలో చాలామంది అస్వాభావిక మానసిక రుగ్మతల(complexes)తో బాధపడుతున్నారు. అందువల్లే వారి ముఖాల్లో ఉదాసీనత తాండవిస్తోంది. ఈ నేపథ్యంలో మన సనాతన ధర్మం బోధించిన రీతిలో బాహు బలం, బుద్ధిబలంతో పాటు ఆత్మబలాన్ని పెంచుకోవాలి. అప్పుడే విద్యాభ్యాసంలో కానీ, విధినిర్వహణల్లో కానీ ఎదురయ్యే ఒత్తిళ్ళను సునాయాసంగా అధిగమించగలం. ❖

సేకరణ : ఆర్. కృష్ణ

**ఎవ్వరూ ఈ లోకంలో ఎల్లప్పుడూ కష్టాలు అనుభవించరు. కష్టాలు వచ్చినప్పుడు అంతా దుఃఖమయంగా తోస్తుంది. అవి వంతెన క్రింద ప్రవహించే నీటిలా వచ్చిపోతూ ఉంటాయి.** - *శ్రీశారదాదేవి*



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచీ
1–10–55

ప్రియమైన వివేక్!*

"నేను మీకు ఇబ్బంది కలిగిస్తున్నాను. మీరు కొద్ది సమయం నాకొరకై వినియోగించగల్గితే నాకు ఎంతో సహాయపడినవారవుతారు" అని ఈ విధంగా నీవు నా కెందుకు వ్రాస్తున్నావు? నీవేదో కొత్తవాడినని భావించుకోవడం, ముభావంగా ఉండడం నాకు చాలా బాధ కలిగిస్తోంది.

ఈ ప్రపంచపు రహస్యాల గురించి చెప్పాలని చాలాకాలంగా ఎదురు చూస్తున్నాను. కానీ అవకాశం రాలేదు. ఇప్పుడు క్లుప్తంగా కొన్ని విషయాలు వ్రాస్తున్నాను.

**మొదటిది:** భారతదేశం కొన్ని వందల సంవత్సరాలు నిద్రావస్థలో ఉంది. స్వామీజీ పిలుపుతో అది జాగృతమైంది. కానీ దాని మేధస్సు ఇంకా మేల్కొనలేదు. దేశమంతా ఒక విధమైన బాల్యచేష్టలతో నిండి ఉంది. నిజమైన కార్యరంగంలోకి ప్రవేశించడానికి ఇంకా చాలా సంవత్సరాలు పడుతుంది. రామకృష్ణ మిషన్ స్వర్గం నుండి ఏమీ ఊడిపడలేదు. మనం ఈ కలుషిత వాతావరణంలోనే పుట్టి ఈ అసమగ్ర విద్యావిధానం, అబద్ధపు ఆశయాలు, కపటత్వాల మధ్యనే పెరిగి విద్యనభ్యసించాం. ఈ కలుషిత ఆహారంతోనే మన శరీరాలు పెరిగి పరిపుష్టం అయ్యాయి. స్వామీజీ ఆశయాలను ఒక్కసారిగా ఆవిష్కరించడం సాధ్యం కాని విషయమే. అందుకు చాలా కాలం పడుతుంది వివేక్! ఆ భావాలను కొద్దిగానైనా అర్థం చేసుకున్నవారి కర్తవ్యం ఏమిటంటే "తాము నీతిమంతులుగా ఉండడానికి కృషి చేస్తూ, ఇతరులకు బోధించడమే". నేను కోరేది ఏమిటంటే "ఇతరుల తప్పిదాలనూ, అవినీతినీ చూసి అనవసరంగా బాధపడకు". అది భరించడం నీకు కష్టమేనని నాకు తెలుసు. కానీ నేను మరీ మరీ చెప్పేది ఏమంటే నీవు నిరాశకు గురి అయినకొద్దీ అది నీకే హానికరం.

**రెండోది:** స్వామి వివేకానంద పని మాత్రమే చెయ్యమని చెప్పలేదు. తామసిక వ్యక్తులు మాత్రం తమ కోరికల ప్రకారం "నచ్చింది చేస్తున్నారు" అర్థమైందా?

**మూడోది:** ఈ శరీరం, మనస్సు, వ్యక్తిత్వం, సంపదలు ఇవే నేననుకొని భావించి విచారాన్ని కొనితెచ్చుకుంటున్నావు. ఫలితంగా వినాశనాన్ని ఆహ్వానిస్తున్నావు. ఇక్కడ ఒక బ్రహ్మచారి ఉన్నాడు. అతనికి పని అనేది ఒక పిచ్చిగా పరిణమించింది. ఫలితంగా అతణ్ణి వేరే చోటుకు తరలించాల్సి వచ్చింది. పని అంటే అదా? భగవద్గీత రెండో అధ్యాయంలోని 50వ శ్లోకంలో చెప్పలేదా? 'యోగః కర్మసు కౌశలం... – నేర్పరితనంతో చేసే పనే యోగం' అవుతుంది.

**నాలుగోది:** మంత్రదీక్షను గురించి నీకు చాలా విషయాలు చెప్పవలసి ఉంది. ఈ దీక్ష ఒక అసాధారణ రహస్యం. ఈ విషయాల గురించి తగినంత స్పష్టంగా వ్రాయడం ఇప్పుడు సాధ్యం కాదు. మనం ముఖాముఖి చర్చించుకుంటే ఇలాంటి క్లిష్టమైన సమస్యలు పరిష్కారమవుతాయి. నా భావాలను అర్థం చేసుకుంటావని భావిస్తున్నాను.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(*వివేక్ కాలాంతరంలో స్వామి ప్రభానందగా ప్రసిద్ధులు.)



పురుష ప్రయత్నము, సాధుజన సాంగత్యము, సద్గ్రంథ పఠనం, సత్పురుషుల సేవ - వీటి ద్వారా వివేకం సమకూరుతుంది. ఈ వివేకమే కార్యసాఫల్యమును చేకూరుస్తుంది. - యోగవాసిష్ఠం

(...15వ పేజీ తరువాయి.)

ఇంద్రియభోగాలనూ వదలకుండా, సుజ్ఞానాన్నీ, తత్త్వ రహస్యాన్నీ, నీ ప్రతిరూపంగా కళ్ళ ముందుండే గురువునే కాదు, చివరకు నిన్ను కూడా మరచిపోతున్నానయ్యా!' అని ఆవేదన పడుతూ...

**మరువను ఆహారంబును మరువను సంసారసుఖము**
**మరువను ఇంద్రియభోగము మాధవ నీ మాయ**
**మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వ రహస్యము**
**మరచెద గురువును దైవము మాధవ నీమాయ...**

అంటున్నాడు. మనం ఈ శరీరానికి సంబంధించిన సుఖసౌకర్యాల కోసమే ఆలోచిస్తూ ఉంటాం. నిజానికి ఒక రామకృష్ణ పరమహంస, ఒక రమణమహర్షి, ఒక షిర్డీ సాయిబాబా ఇలా మహానుభావులంతా ఏం ఆడంబరంగా జీవించి, ఏం సుఖాలు అనుభవించారని మనం వారిని పూజిస్తూ ఉన్నాం! భక్తులమని చెప్పుకుంటూ వారిని ఆరాధిస్తామే కానీ జీవనశైలిలో అనుసరించం. ఇక మనం భక్తులమై ఏం లాభం? శ్రీమద్భాగవతంలో బ్రహ్మదేవుడు... **జీవుండు భవదీయ మాయా పరిభ్రామ్యమాణుండై ఆత్మ వేరని ఎప్పుడు తెలియునంత కాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబు తరియించ జాలకుండు...!**



'జీవుడు ఆయన కల్పించిన మాయా భ్రమలలో కీలుబొమ్మయై దేహం కంటే ఆత్మ వేరని ఎప్పటి వరకు తెలుసుకోడో, అంతవరకు సారం లేని సంసార సాగరాన్ని దాటలేడు' అంటాడు.

### విడిచెద వైరాగ్యము...

ఒకసారి ఒక మార్వాడీ భక్తుడు భగవాన్ శ్రీరామకృష్ణుల్ని 'స్వామీ! విషయవస్తువుల పట్ల వైరాగ్యం ఎందుకు కలగద'ని ప్రశ్నిస్తాడు. అప్పుడు వారు 'మాయ అంటే అదే! ఈ మాయ కారణంగా సత్యం – అసత్యం గాను, అసత్యం – సత్యం గాను కనిపిస్తుంది. ఎవరు శాశ్వతమో ఆయనే సత్. అంటే పరబ్రహ్మం. అసత్యం అంటే అశాశ్వతమైన సంసారజీవితం. ఈ మాయ అనే భవనంలో ఉన్నంత వరకు, మాయామేఘం ఆవరించి ఉన్నంత వరకు జ్ఞానభాస్కరుడు ప్రకాశించడు. ఆ భవనాన్ని వీడి బయటకు వచ్చేస్తే, అంటే కామినీకాంచనాలను వదిలివేస్తే జ్ఞానభాస్కరుడు అజ్ఞానాన్ని దగ్ధం చేస్తాడు' అంటారు. కానీ ఈ పాపపుణ్యాలు, దుర్గుణాలు, ఆశాపాశాలు మనల్ని వదలడం లేదు; మంచి పనుల వైపు మనస్సును మరల్చడం లేదు. అందుకే ఆ పురాణపురుషుడి పరమభక్తుడు...

**విడువను పాపము పుణ్యము విడువను నా దుర్గుణములు**
**విడువను మిక్కిలి యాసలు విష్ణుడ నీ మాయ**
**విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును**
**విడిచెద నాచారంబును విష్ణుడ నీ మాయ...** అంటున్నాడు.

సమాజ హితానికీ, వ్యక్తిగత వికాసానికీ ఉపయోగపడే 'షట్కర్మలు'. అవి: యజనం– యజ్ఞములు చేయడం; యాజనం– యజ్ఞములు చేయించడం; అధ్యయనం– వేదశాస్త్రములు చదవడం; దానం – దానం చేయడం; ప్రతిగ్రహణం– దానం స్వీకరించడం; అధ్యాపనం– వేదాలను ఇతరులకు నేర్పడం. ఇంద్రియలౌల్యంలో పడి ఇలాంటి సత్కర్మల్నీ, సదాచారాన్నీ విడిచిపెడుతున్నామనీ, తుదకు వైరాగ్యమార్గాన్ని కూడా వదలి వేస్తున్నామనీ అన్నమయ్య ఆందోళన పడుతున్నాడు. కాల క్రమంలో విడువవలసిన వాటిని తుది వరకూ పట్టుకొని వేళ్ళాడుతున్నాం. జీవితాంతం వదలకుండా ఉండాల్సిన వాటిని అసలు పట్టుకోనైనా పట్టుకోవడం లేదు. అలాంటి అవివేక, అసంపూర్ణ దశతోనే ఈ ఆయుష్షును అర్పించి వేస్తున్నాం.

### తగిలెద బహు లంపటములు...

కాలమనే వేటగాడు విసిరిన వలలో చిక్కుకున్న అమాయకపు పావురాళ్ళం మనం! బంధాలు, లంపటాలనే తాళ్ళకు తగులుకొని కూడా స్వేచ్ఛగా ఉన్నామని భ్రమపడుతూ ఉన్నాం. ముందు మనం ప్రమాదంలో ఉన్నామని తెలిస్తే, తప్పించుకునే మార్గం కూడా కనిపిస్తుంది. కర్మ బంధనాలను ఒక్కొక్కటిగా తుంచివేసుకునే ప్రక్రియలో భాగంగా ముందు ఆ భగవంతుడి పాదాల వద్ద శరణాగతులం కావాలి. అందుకే మహాకవి ధూర్జటి...

**దంతంబుల్ పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే**
**కాంతా సంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు కానప్పుడే**
**వింతల్ మేన జనింపనప్పుడె కురుల్ వెల్వెల్ల కానప్పుడే**
**చింతింప వలె నీ పదాంబుజముల శ్రీకాళహస్తీశ్వరా!** అంటారు.

నిజమే! దంతాలు ఊడిపోకముందే, శరీర పటుత్వం సన్నగిల్లక ముందే, స్త్రీలు అసహ్యించుకోక మునుపే, ముసలితనం శరీరాన్ని ఆక్రమించక ముందే, రోగాల వల్ల చెడిపోక ముందే, జుట్టు బాగా తెల్లబడక మునుపే పరమాత్ముడి పాదాలను ఆశ్రయించాలి.

అలా ఈ భాగవత ప్రియుడైన అన్నమాచార్యులు కూడా బహులంపటాల్లో, బహుబంధాల్లో తగులుకొని బాధపడవద్దని హితవు పలుకుతూ చివరకు తలపున ఆ వేంకటేశ్వరుడిని ఆహ్వానించుకున్నాడు. మోక్షమార్గంలో పయనమయ్యాడు. 'అంతర్యామివై నన్ను నీవు ఏలుకుంటున్నావు! ఇక నాపై నీ మాయ ప్రభావం ఎలా ఉంటుందయ్యా!' అన్న విశ్వాసంతో...

**తగిలెద బహులంపటముల తగిలెద బహుబంధంబుల**
**తగులును మోక్షపు మార్గము తలపున ఎంతైనా**
**అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై**
**నగినగి నను నీవేలితి నాకా యీ మాయ...** అంటున్నాడు. ❖



# విద్యకు అసలైన అర్థం

– ప్రయాగ రామకృష్ణ

'విద్యకు అసలైన అర్థం ఏమిటి? మొత్తం మీద విద్యలు ఎన్ని రకాలు? అవి ఏవి?' అని ధర్మరాజు, భీష్ముణ్ణి అడిగాడు.

"హృదయ వికాసం కలిగించేది, ద్వంద్వాలు, మానసిక వికారాలు తొలగించి, వివేకాన్ని ఇచ్చేది అసలైన విద్య. స్థూలంగా చెప్పాలంటే విద్యలు రెండే రెండు రకాలు. ఒకటి పరావిద్య, రెండోది అపరావిద్య. పరావిద్య వలన జన్మ రాహిత్యం కలుగుతుంది. ఈ పరావిద్యనే ఆధ్యాత్మిక విద్య అని కూడా అంటారు. 'సర్వేషాం విద్యానాం హృదయమేకాయనం – సకల విద్యలకు మనస్సే స్థావరం'. అంతరంగాన్ని శుద్ధిచేసి అందులోని ఆత్మను దర్శింపజేసేదే అసలైన చదువు.

అపరావిద్య అంటే లౌకికవిద్య – ఉదర పోషణార్థం నేర్చేది. చదువు వేరు, సంస్కారం వేరు. చదువుకున్నవారంతా సంస్కారవంతులై ఉండరు. అలాగే సంస్కారవంతులందరూ చదువు నేర్చి కూడా ఉండకపోవచ్చు. కానీ, చదువు, సంస్కారం – రెండూ ఒకే మనిషిలో ఉంటే ఇంక చెప్పేదేముంది? బంగారానికి తావి అబ్బినట్టే!

పరావిద్య వల్ల సత్సంస్కారం కూడా కలుగుతుందంటారు, వినయసంపన్నమైన విద్య అలంకారాలకే అలంకారం. అలాంటి విద్య నేర్చిన వారి భౌతిక శరీరం నశించినప్పటికీ, వాళ్ల యశస్సు మాత్రం అజరామరం. ఇంతెందుకు ఒక్క మాట చెప్పనా? ఏ చదువు చదివినా, ఏ విద్య నేర్చినా అది మనలో ఆత్మస్థైర్యాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ, నైతిక విలువలనూ, ఉన్నత వ్యక్తిత్వాన్నీ పెంపొందించేదిగా ఉండాలి. అది మన బుద్ధిబలాన్నీ, ఆత్మ బలాన్నీ పెంచాలి" అని చెప్పాడు భీష్ముడు.

చదువుల పరమార్థం బోధపడింది ధర్మరాజుకు. కృతజ్ఞతగా చేతులు జోడించాడు. ఇది భారతం!

మరి నేటి చదువుల భారతమో?! తలుచుకుంటే విషాదం.

**దివా పశ్యతి నోలూకః కాకో నక్తం న పశ్యతి।**
**విద్యావిహీనో మూఢస్తు దివా నక్తం న పశ్యతి॥**

'గుడ్లగూబ పగలు చూడలేదు; కాకి రాత్రివేళల్లో చూడలేదు; చదువులేని వాడు రేయింబవళ్ళూ చూడలేడు'. కానీ ఇప్పుడు చదువుకున్నవాళ్ళు, చదువుకోనివాళ్ళు అందరిదీ ఒకటే స్థితి. పగలైనా రేయయినా ఒకటే! ఎప్పుడూ ఎవరికీ ఏమీ కనిపించవు. ఎవరూ జీవితంలోకి పూర్తిగా తొంగిచూడరు. చూడాలంటే భయం. భీష్ముడు చెప్పిన ఆత్మబలాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ ఇప్పటి చదువులు ఇవ్వలేకపోతున్నాయి. ఇప్పుడసలు పరావిద్య లేదు. ఉన్నదంతా అపరావిద్యే.

మూడో ఏటి నుంచే కాన్వెంటు చదువులు, బ్రిడ్జి కోర్సులు, ఇంటెన్సివ్ కోచింగ్‌లు, ఇన్‌స్టెంట్ పరీక్షలు. 'రాజవత్పంచ వర్షాణి'– ఐదేళ్ళ వయసొచ్చేవరకూ పిల్లల్ని ప్రభువుల్లా చూడాలిట. వాళ్ళు అడిగినవన్నీ ఇస్తూ, వాళ్ళ కోరికలు తీరుస్తూ, వాళ్ళడిగే ధర్మ సందేహాలన్నిటికీ సమాధానాలు చెబుతూ వాళ్ళను సంతోష పెట్టాలిట. ఇది శాస్త్రం. అందుకనే పూర్వం అయిదో ఏడు వస్తే కానీ అక్షరాలు దిద్దబెట్టేవారు కాదు. ఆ తరువాత అక్షరాలతో పాటు కొన్నాళ్ళు ఆటపాటలతో కూడిన మౌఖిక విద్య, అటు పిమ్మట ద్విత్వాక్షరాలు, సంయుక్తాక్షరాలు, తేలిక పాటి గణితం – అలా చదువులో ఒక్కో మెట్టూ పైకి ఎక్కిస్తూ పిల్లల్లో క్రమ పరిణామ వికాసం కలిగించేవారు.

ఇప్పుడదేం లేదు. ఎల్.కె.జి.లో ఎన్విరాన్‌మెంటల్ సైన్సు గురించి చెబుతారు. యు.కె.జి.లో బోటనీ, జువాలజీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ, అర్థమెటిక్స్ బోధిస్తారు. కంప్యూటర్ సరేసరి! అది తప్పనిసరి. ఈడుకు మించిన చదువులతో, మోత బరువులతో పిల్లలంతా పిచ్చివాళ్ళవుతున్నారు. అయినా, మన చదువులు డాక్టర్లనూ, ఇంజనీర్లనూ, అధికారులనూ తయారుచేస్తున్నాయి కానీ – శీలవంతులనూ, గుణవంతులనూ, మహనీయులనూ తయారు చేయలేక పోతున్నాయి. పిల్లల్లో త్యాగం, సేవ లాంటి విలువల్ని ప్రోది చెయ్యలేకపోతున్నాయి.

అందుకే స్వామి వివేకానంద ఇలా చెప్పారు:

We want that education by which character is formed, strength of mind is increased, intellect is expanded and by which one can stand on one's own feet. - శక్తిమంతమైన సౌశీల్యాన్నీ, లోకోపకారం చేసే బుద్ధినీ, సింహసదృశమైన ధైర్యాన్నీ నింపేదే విద్య. తమ కాళ్ళ మీద తాము నిలబడగలిగేట్లు చేసేదే నిజమైన విద్య.

భీష్ముడు ఇలా చెప్పాడు: మనిషిలో సౌజన్యాన్ని పెంచేది, సుగుణాలను ప్రోగుచేసేది, అసమాన నీతివర్తనాన్ని, వినయ విధేయతలనూ నేర్పేది చదువు. మనుషుల్ని ఋషులుగా, ఋషుల్ని దేవతలుగా మలిచేది చదువు. ❖

**మానవులు తెలుసుకోవలసినవి: భూతదయే ధర్మం, ఆరోగ్యంగా ఉండటమే సౌఖ్యం, సద్భావన కలిగి ఉండటమే స్నేహం, బ్రహ్మానుభూతిని పొందడానికి ఉపయోగపడేదే నిజమైన విద్య.** - హితోపదేశం

బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

# పరిశుద్ధమైన మనస్సే పరమ సద్గుణం

(...గత సంచిక తరువాయి)

జీవితంలోని సమస్యలను ఎదుర్కోవడం గురించి యోగ తెలియజేస్తుంది. అంతేకాదు మానసిక ప్రశాంతతనూ, సమత్వాన్నీ ఎలా పొందాలో ప్రబోధిస్తూ మనకు మార్గదర్శకత్వం చేస్తుంది. అన్ని పరిస్థితులలోనూ మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవాలి. నిజంగా చూస్తే ఏ పరిస్థితీ దానంతట అది చెడుదీ కాదు, మంచిదీ కాదు! అదంతా ఆ సందర్భాన్ని బట్టీ, దాన్ని చూసే మన దృష్టిని బట్టీ ఉంటుంది. అయ్యో! నాకే ఈ బాధలు రావాలా? అని చింతించకుండా మనకు ఎదురయ్యే క్లిష్టపరిస్థితులు మనల్ని పరిపూర్ణులుగా, వివేకం గలవారిగా తీర్చిదిద్దే మంచి అవకాశాలని భావించాలి.



కష్టాలు, బాధలు అనుభవించడం ద్వారా మన మనస్సు స్వభావాన్నీ, ఈ ప్రపంచపు నైజాన్నీ అర్థం చేసుకోగలుగుతాం. మనలోని ఆలోచనాశక్తి మరింత పెరిగి, బాధ్యత గలవారిగా తయారవుతాం. వీటి వల్ల మానసిక పరిశుద్ధత (చిత్తప్రసాదనం) కలుగుతుంది.

కర్మఫలాలను అంగీకరించి, వాటిని అనుభవించడానికి సిద్ధంగా ఉండాలి. మనకు ఎదురయ్యే ప్రతి పరిస్థితినీ సానుకూలంగా మార్చుకునే శక్తి అంతర్గతంగా, సహజంగా మనకుంది. బాహ్యంగా జరిగే విషయాలు చెడువే అయినా, వాటి పట్ల మన దృక్పథాన్ని మార్చుకోవచ్చు. కష్టమైన పరిస్థితి ఎదురైనా, దాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. దృఢంగా, వినయంగా, సరళంగా, ఋజుమార్గంలో, మంచిగా ఉండమని మన మనస్సుకు మనం సూచించాలి. అప్పుడు జీవితం గురించి సానుకూల దృక్పథం అలవడుతుంది. ఆనందంగా ఉండడమా, లేదంటే విచారంగా ఉండడమా అన్నది మన చేతుల్లోనే ఉంది. మనపైనే ఆధారపడి ఉంది.

వ్యతిరేక భావాలు మనలో కలిగినప్పుడు, సానుకూల భావాలను ప్రేరేపించాలి. క్రోధం, ఇంద్రియ చాపల్యం, దురాశ లాంటి శత్రువులు మనలో తలెత్తినప్పుడు, వాటికి ప్రతికూలమైన భావాలను రేకెత్తించాలి. ఉదాహరణకు మన మనస్సులో దురాశ గానీ, ఒక వస్తువు కావాలన్న కోరిక గానీ కలిగితే, మన మనస్సునే ఈ విధంగా అడగాలి. "నేనెందుకని దీని పట్ల వ్యామోహ పడుతున్నాను? అది నిజంగా నాకు సంతోషాన్ని కలుగజేస్తుందా? ఈ విధంగా ప్రశ్నించుకుంటూ పోతే క్రమక్రమంగా ఆనందానికి మూలం మన లోపలే ఉన్నదని కనుక్కోగలుగుతాం. మనస్సును విశదంగా పరిశీలించి, మనం కోరుకునే తాత్కాలిక సుఖాల ఫలితాలను తెలుసుకోగలగాలి. ఆ విధంగా చేస్తే మనస్సు నెమ్మది నెమ్మదిగా అన్ని బంధాల నుండీ విముక్తమై, పరిశుద్ధమైపోతుంది.

ఒక కథతో ఈ అంశాన్ని ముగిద్దాం. ఒక రాజుగారు తన రాజ్యానికి వారసుణ్ణి ఎన్నుకుందామనుకున్నాడు. తన వారసుడు ఎలాంటి పక్షపాత బుద్ధీ లేకుండా రాజ్యపాలన చేయగలగాలని ఆయన అభిప్రాయం. ఆ వారసుడు అన్ని ప్రలోభాలకూ దూరంగా ఉండాలని ఆయన ఆకాంక్ష. సరియైన వారసుణ్ణి ఎన్నుకునే ఉద్దేశంతో రాజు ఒక పథకం వేశాడు. వారసులు కాదలచుకున్నవారంతా రాజభవనం వద్దకు

ఫలానా సమయానికి చేరుకోవాలని ప్రకటించాడు. ఈ లోపల, రాజప్రాసాదంలో అనేక వస్తువులతో కూడిన అసంఖ్యాకమైన అంగళ్ళు, శోభాయమానమైన దృశ్యాలతో ఒక తాత్కాలికమైన సంతను ఏర్పాటుచేయాల్సిందిగా సేవకులను ఆదేశించాడు.

ఆ సంతలో ప్రలోభానికి గురి చేసే ఆకర్షణీయమైన వస్తువులు ప్రదర్శితమైనాయి. ఎవరికి ఏ వస్తువు కావాలన్నా సరే, ఏ విధమైన పైకమూ చెల్లించకుండా, ఉచితంగా తీసుకోవచ్చు. రాజభవనానికి చేరాలంటే ప్రతి ఒక్కరూ ఈ ప్రదేశం ద్వారానే వెళ్ళాలి. ఒక నిర్ణీత సమయానికి రాజభవనం వద్దకు చేరుకోవాలని అభ్యర్థులందరికీ చెప్పారు. చాలామంది ఆ ప్రదేశంలోకి ప్రవేశించి, అక్కడి అద్భుతమైన వస్తువులను చూస్తూ, మధుర సంగీత, నృత్యాలను ఆస్వాదిస్తూ సంతోషంతో తమను తాము మరచిపోయారు. ఒక్క వ్యక్తి మాత్రం ఆ ప్రలోభాలకు లొంగక, దృఢసంకల్పంతో నిర్ణీత సమయానికి రాజభవనం చేరుకున్నాడు. అతణ్ణి చూసి ఆ రాజు తాను సరియైన వ్యక్తిని తన వారసునిగా పొందగలిగానని చాలా సంతోషించాడు.

పవిత్రమైన, ప్రశాంతమైన, ఆదర్శవంతమైన మనస్సును పొందడం కూడా అలాంటిదే! అంతర్గత శాంతి, పరిశుద్ధత అనే రాజును కలుసుకోవాలంటే దారిలో ఎదురయ్యే ప్రలోభాలతో కూడిన సంతలో సమయాన్ని వృథా చేసుకోకూడదు. మన జీవితానికొక లక్ష్యం ఉంది. ఆధ్యాత్మిక చైతన్యంతో, బంధవిముక్తులం కావాలన్నది మన ఆకాంక్ష. అందువల్ల మనకు జీవన పథంలో ఎదురయ్యే ప్రలోభాలన్నిటినీ వదిలివేయగలగాలి. లేనట్లయితే మనం గమ్యం చేరుకోలేం. కాబట్టి మనస్సును పరిశుద్ధంగా, పవిత్రంగా ఉంచుకోవడమే జీవితంలో గొప్ప సద్గుణం. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచిక నుండి - 'స్థైర్యం- స్థిరత్వం')

(...21వ పేజీ తరువాయి.)

## దుష్ట సంస్కరణకు రామకృష్ణావతారం

సంపాదించినట్లే! వారికి భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు కరతలామలకమవుతాయి. మన్మథ్ చేసుకున్న పూర్వజన్మ సుకృతమేమో, శ్రీరామకృష్ణులే స్వయంగా అతనికి మంత్రోపదేశం చేసి, హృదయాన్ని స్పృశించి, "ఆత్మచైతన్యం కలుగుగాక!" అని ఆశీర్వదించారు.

కలకత్తాలో ఒక దుష్టుడు (కాలాంతరంలో భక్తునిగా మారి 'శ్రీరామకృష్ణ పుంథీ' రాసిన అక్షయకుమార్‌సేన్) ఉండేవాడు. అతడు శ్రీరామకృష్ణులను నిందించని క్షణం ఉండేది కాదు. అతని కుమారునికి జబ్బు చేసింది. ఆనాడు కలకత్తాలో ఉన్న వైద్యులందరికీ చూపించాడు. ప్రయోజనం కలగలేదు. ఇంట్లో అందరూ ఆశలు వదులుకున్నారు. డాక్టర్ మహేంద్రనాథ్ సర్కార్ చూస్తే పిల్లవాడికి నయంకావచ్చని ఎవరో చెప్పారు. ఆ రోజుల్లో డాక్టర్ సర్కార్, శ్రీరామకృష్ణులకు వైద్యం చేస్తూ ఇతర రోగులను తన దగ్గరకు రానిచ్చేవాడు కాదు. ఆశ సిగ్గునూ, అహంకారాన్నీ చంపేస్తుంది. ఆ వ్యక్తి కాశీపూర్‌లో శ్రీరామకృష్ణులు చికిత్స పొందుతున్న భవనంలోకి వచ్చి, సర్కార్‌తో తన బిడ్డ ఆరోగ్యస్థితిని విన్నవించుకుందామని ఎదురు చూస్తున్నాడు. అతణ్ణి గమనించిన గురుదేవులు లోపలికి పిలిచి, విషయం తెలుసుకొని, భయపడవద్దని ధైర్యం చెప్పి, ఓదార్చి, డాక్టర్ సర్కార్‌తో "నాకు వయస్సు పైబడింది. నా గొంతులో నొప్పి సామాన్యమైనదే అయినా, నేనింత బాధ అనుభవిస్తున్నానే, ఇక ఆ పసిప్రాణం ఎంత బాధపడుతోందో!" అని కరిగి, కన్నీరై "వెంటనే వెళ్ళి ఆ పిల్లవాడికి వైద్యం చేయమని" చెప్పారు. శ్రీరామకృష్ణుల కరుణ ఆ వ్యక్తిలోని అహంకారాన్ని తొలగించి, మానవత్వాన్ని మేల్కొల్పింది. ప్రపంచాన్ని జయించడానికి ప్రేమను మించిన ఆయుధం మరొకటి లేదని ఈ విధంగా నిరూపించారు శ్రీరామకృష్ణులు.

సంస్కరణ దృక్పథంతో వారు, వీరనే తేడా లేకుండా, పాపులనూ, పుణ్యులనూ, మహనీయులనూ, స్త్రీ, పురుషభేదం లేకుండా, జాతి, కుల, మత విచక్షణ లేకుండా అందరినీ ఉద్ధరించడానికై అవతరించిన శ్రీరామకృష్ణులు. తమను చూపుతూ "ఇక్కడకు వచ్చినవారికి మరుజన్మ ఉండదు. భక్తుల ఆఖరిక్షణాలలో వారి ముందు నేను సాక్షాత్కరిస్తాను. లేకపోతే వారికి ముక్తి ఎలా లభిస్తుంది?" అంటూ అభయమివ్వడం శ్రీరామకృష్ణులకు తప్ప మరొకరికి సాధ్యమా? 'ప్రతి జీవీ ఉద్ధరింపబడే వరకు వేయిజన్మలైనా ఎత్తడానికి నేను సిద్ధమ'ని బహిష్కృతులకూ, దుర్జనులకూ దైన్యాన్ని పోగొట్టి, ధైర్యాన్ని ప్రసాదించిన దివ్యవాణి "మళ్ళీ, మళ్ళీ రండంటూ" పిలుస్తోంది. ఆ మహనీయుని పాదపద్మాలను ఆశ్రయించి "అమృతపుత్రులమవుదాం", జన్మ ధన్యం చేసుకుందాం! ❖

వాయువు వల్ల వచ్చిన మేఘాలు, మరల ఆ వాయువు వలనే తొలగిపోయినట్లు, మనస్సుచే ఏర్పడిన బంధాలు మరల మనస్సుతో యత్నించడం వలనే తొలగిపోతాయి. - వివేకచూడామణి



# ధ్రువతారగా భాసిస్తున్న ధ్రువుడు

కథ: టి.ఎమ్. సుందరరామన్ చిత్రాలు : పద్మవాసన్ అనుసృజన : స్వామి జ్ఞానదానంద

1 స్వాయంభువ మనువు కుమారుడు ఉత్తానపాదుడు. ఆయనకు సునీతి, సురుచి అని ఇద్దరు భార్యలు. సునీతి కుమారుడు ధ్రువుడు. సురుచి కుమారుడు ఉత్తముడు. రాజు మొదటి భార్య సునీతి పట్ల ఉదాసీనంగా ఉండేవాడు. రెండవ భార్య సురుచి అంటే వల్లమాలిన ప్రేమాభిమానాలు.



2 ఒక రోజు ధ్రువుడు పరుగున వచ్చి తండ్రి ఒడిలో కూర్చోబోతుండగా, అతణ్ణి పట్టుకుని త్రోసివేసింది సురుచి.




విలపిస్తూ ధ్రువుడు తన తల్లి వద్దకు వెళ్ళి, జరిగింది చెప్పాడు.

3




4 తల్లి ఉపదేశం మేరకు ఐదేళ్ళ ధ్రువుడు అడవిలోకి వెళ్ళాడు. అక్కడ అతడికి నారదమహర్షి దర్శనం కలిగింది.




5
స్వామీ! ధన్యుడనయ్యాను. ఎక్కడికి వెళ్ళి తపస్సు చేయాలి?
బాలకా! యమునానదీ తీరంలో ఉన్న మధువనానికి వెళ్ళి తపమాచరించు. నీకు శ్రీమన్నారాయణుని పరిపూర్ణ అనుగ్రహం లభిస్తుంది.


6
ధ్రువుడు ఒక చెట్టు కింద కూర్చుని, ఏకాగ్రతతో 'ఓం నమో నారాయణాయ' అనే మంత్రాన్ని జపిస్తూ, కఠోర తపస్సులో లయించిపోయాడు.
'ఓం నమో నారాయణాయ...'


7
కొన్ని రోజులు గడిచిన తరువాత రాజైన ఉత్తానపాదుడు, తను చేసిన తప్పును గ్రహించి దుఃఖించాడు.
అయ్యో! ఎంత మూర్ఖంగా ప్రవర్తించాను. ఆతురతతో వచ్చిన నా కుమారుణ్ణి ఆప్యాయంగా దరిచేర్చుకోకుండా, భార్యకు భయపడి ఒక పిరికిపందనయ్యానే! బాలుడి మనస్సు ఎంత వ్యధ చెందివుంటుందో కదా!
అప్పుడు ఆయన ముందు నారదుడు ప్రత్యక్షమయ్యాడు.


8
నారద మునీంద్రా! ప్రణామాలు.
రాజా! నీ కుమారుడు ధ్రువుడు మధువనంలో దేవతలు సైతం విస్తుపోయే రీతిలో కఠోరమైన తపస్సు ఆచరిస్తున్నాడు.
ఏమిటి! ఐదేళ్ళ బాలుడా? వనంలో ఒంటరిగా తపస్సు చేస్తున్నాడా? ఏం వైపరీత్యం! నేను ఇప్పుడే వెళ్ళి వాణ్ణి తీసుకుని వస్తాను.


9
రాజా! దిగులు పడకు. ధ్రువుడు నీ ఒడి కన్నా సర్వోత్కృష్టమైన స్థానాన్ని పొందుతాడు. భగవంతుడే అతణ్ణి రక్షిస్తుండడం వల్ల నువ్వు ఆందోళన చెందనవసరం లేదు.
అయినప్పటికీ ముక్కుపచ్చలారని బాలుడు అంతటి కఠోర తపశ్చర్యకు తట్టుకోగలడా?
తప్పకుండా తట్టుకోగలడు రాజా! అతడు నిష్ఠాగరిష్ఠుడై తపస్సు చేస్తున్నాడు.

10

ధ్రువుడు ఒక నెల పండ్లను మాత్రమే తిన్నాడు. తరువాత ఒక నెల కందమూలాలు స్వీకరించాడు. తదనంతరం ఆకులను మాత్రమే భుజించాడు. చివరికి గాలిని మాత్రమే పీలుస్తూ, కనీవినీ ఎరుగని రీతిలో కఠోరమైన తపస్సు చేస్తున్నాడు.



11




12

ప్రగాఢమైన తపస్సులో లీనమైన ధ్రువుని ఎదుట మహా విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. ధ్రువుడు బాలుడవడం వల్ల భగవంతుణ్ణి స్తుతించాలని కూడా అతడికి తెలియలేదు. కనుక విష్ణువే తన పాంచజన్యం అనే శంఖంతో అతడి చెక్కిలిని స్పృశించాడు. అంతే! ధ్రువుడు జ్ఞానం పొంది భగవంతుణ్ణి స్తుతించసాగాడు.



13



బాలకా! రాజ్యాన్ని కోరి తపస్సు ఆచరించావు. కాబట్టి సుదీర్ఘకాలం సకల సౌభాగ్యాలతో రాజ్యాన్ని పాలించు. ఆ తరువాత సర్వోత్కృష్టమైన, శాశ్వతమైన స్థానాన్ని పొంది 'ధ్రువ నక్షత్రంగా' ఎప్పటికీ ప్రకాశిస్తూ, విరాజిల్లుతావు.

దేవా! మీ అనుగ్రహం నాకు లభించింది. నా తల్లితండ్రులకూ మోక్షం అనుగ్రహించండి.

మహావిష్ణువు అలాగే అనుగ్రహించాడు. ధ్రువుడు తన రాజ్యానికి వెనుతిరిగాడు.

14

రాజైన ఉత్తానపాదుడు సముచిత సమయంలో ధ్రువుని రాజ్యాభిషిక్తుణ్ణి చేసి, వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. అడవిలోకి వేటకు వెళ్ళిన ధ్రువుని తమ్ముడు ఉత్తముడు ఒక యక్షుని చేతిలో హతుడయ్యాడు. అతణ్ణి వెతుకుతూ వెళ్ళిన అతడి తల్లి సురుచి కార్చిచ్చులో చిక్కుకుని మరణించింది.



15

ఈ విషయం తెలుసుకున్న ధ్రువుడు యక్షుల మీద దండయాత్ర చేశాడు. తాత అయిన మనువు నచ్చజెప్పడంతో, యుద్ధ విరమణ చేశాడు ధ్రువుడు. అప్పుడు కుబేరుడు...



ధ్రువా! నీకు ఏం వరం కావాలో కోరుకో! నీవు కోరిన వరాన్ని ప్రసాదిస్తాను.

యక్ష నాయకా! మహావిష్ణువు పట్ల అచంచలమైన భక్తి నిలకడగా ఉండేలా వరం ఇవ్వండి.

నీ కోరిక తప్పక ఫలించుగాక!

16

ధ్రువుడు 36 వేల ఏళ్ళు రాజ్యాన్ని పరిపాలించాడు. తరువాత, భగవంతునికి అత్యంత ఆప్తులైన సునంద, నందులు దివ్యవిమానంలో ధ్రువుణ్ణి వైకుంఠానికి తోడ్కొని పోవడానికి వచ్చారు.



మహారాజా! కాస్త విమానాన్ని పరికించండి. మీ తల్లి ఇంతకు మునుపే దాన్లో ఆసీనులయ్యారు. ఆ నారాయణునికి మీ మనోగతం తెలియదా?

మహాత్ములారా! నా తల్లిని కూడా నాతో తోడ్కొని రావడానికి అనుమతిని ప్రసాదించండి.

ఆహా! మేము ఎంత ధన్యులం!

ధ్రువుడు అంబరంలో ధ్రువతారగా భాసిస్తున్నాడు.

# గ్రంథ పరిచయం

## ఏష ధర్మః సనాతనః


వెల: రూ. 150/-
పుటలు : 596

సనాతన ధర్మం ఒక మహోదధి. అంబుధి తన గర్భంలో ఇముడ్చుకున్న రత్నాలలాగా ఎన్నో జ్ఞానరత్నాలను తనలో కలిగి ఉన్న మహోదధి ఆర్ష ధర్మం. ఆ మహోదధిని అన్వేషిస్తూ అందలి రత్నాలను వెలికితీసి అందరికీ పంచుతున్న అవిశ్రాంత ఈతగాడు శ్రీ సామవేదం షణ్ముఖశర్మ. వివిధ పత్రికలలో వారు వ్రాసిన వ్యాసాల సంకలనమే ఈ గ్రంథం. అన్నింటినీ ఒకచోట పొందుపరచి పుస్తకరూపంలో ఇవ్వటం ముదావహం. వైదిక ధర్మంపై ఒక చక్కటి అవగాహన కావాలనుకునే వారు ఈ గ్రంథాన్ని చదవవచ్చును. మహా మహోపాధ్యాయ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారి ఆశీర్వాద శ్రీముఖం ఈ పుస్తకానికి మరింత శోభనిచ్చింది. ❖

రచన : శ్రీ సామవేదం షణ్ముఖశర్మ
ప్రతులకు : ఋషిపీఠం
ప్లాట్ నెం.1, 1-8-105
10వ వీధి, చిక్కడపల్లి
హైదరాబాదు - 20
ఫోన్ : 040-27655859

## శ్రీ రుద్రనమక వైభవమ్


వెల : రూ. 200/-
పుటలు : 270

వేదమంత్రరాశిలో శ్రీరుద్రానికి విశిష్ట స్థానమున్నది. బ్రహ్మ వస్తువు యొక్క శబ్ద స్వరూపమే శ్రీరుద్రం. కాబట్టి మహామహిమాన్వితమైనది. ఈ శబ్దస్వరూప పరబ్రహ్మాన్ని ఉపాసించటానికి అర్థం అవసరం లేదు. భక్తి శ్రద్ధలు ఉంటే చాలు. కానీ ఆ భక్తి శ్రద్ధలు అలవరచుకోవాలంటే అర్థం తెలియాలి. ఆ అర్థం తెలియజెప్పే ప్రయత్నమే ఈ పుస్తకం. సామవేదం షణ్ముఖశర్మగారు శ్రీరుద్రంపై చేసిన ప్రవచనాన్ని గ్రంథస్థం చేశారు. ప్రవచనం గ్రంథ రూపాన్ని సంతరించుకోవటం వలన సులభ పఠనానికి అనుకూలంగా ఉంది. అనభిజ్ఞులునూ అలవోకగా చదివి ఆస్వాదించవచ్చును. శివభక్తులకు 'షణ్ముఖుడి' కానుక ఇది. ❖ – ఆనంద

## జ్ఞానామృతమ్



సంకలనం : తాడేపల్లి శివరామకృష్ణారావు
వెల : రూ. 60/-, పుటలు : 77
ప్రతులకు : ఇంప్రెషన్స్ (ది ఆర్ట్ ప్రమోటర్స్)
జి-1, శారదా టవర్స్, లబ్బీపేట,
ఎం.జి.రోడ్, విజయవాడ - 520 010
ఫోన్ : 0866- 2484228

## శ్రీ వేంకటాచల మాహాత్మ్యము



రచయిత : గోపావఝుల గోపాలకృష్ణమూర్తి
వెల : రూ. 150/-, పుటలు : 208
ప్రతులకు : గోపావఝుల గోపాలకృష్ణమూర్తి
ఆచంట, పశ్చిమ గోదావరి జిల్లా- 534 123
సెల్ : 99597 73207

## వేదాంత విజ్ఞాన వీచికలు



రచయిత : అమ్ము అన్నాజీరావు
వెల : రూ. 40/-, పుటలు : 153
ప్రతులకు: అమ్ము అన్నాజీరావు
ఇం.నెం. 5-4-1302/3, శారదానగర్
3వ ఫేజ్, వనస్థలిపురం,హైదరాబాదు-70
సెల్: 97033 13715

## నలుదిక్కులా నాలుగు క్షేత్రాలు

(పూరి, రామేశ్వరం, ద్వారక, బదరి)



రచన-సంకలనం : డాక్టర్(మేజర్)చల్లా సత్యవాణి
వెల : రూ. 60/-, పుటలు : 68
ప్రతులకు : డాక్టర్ చల్లా సరస్వతి
46-18-11, దానవాయిపేట
రాజమండ్రి - 533 103.
సెల్ : 98491 74685

## శ్రీకాళహస్తీశ్వర సాంబశివ శతకము



వ్యాఖ్యాన రచయిత : ఇ.వి. శేషావతారము
వెల : రూ. 35/-, పుటలు : 128
ప్రతులకు: ఎస్.ఎమ్.కె.ఎ. గురుకుల్
4-730, కార్ స్ట్రీట్,
శ్రీకాళహస్తి-517 644, చిత్తూరు జిల్లా.

## ముత్యాల కవితా స్రవంతి ముత్యాల సరాలు



రచయిత : ముత్యాల బలరామయ్య
వెల : అమూల్యం, పుటలు : 170
ప్రతులకు : ముత్యాల బలరామయ్య
అక్కురాడ, ఎలమంచిలి పోస్ట్
బుడితి - 532 427, శ్రీకాకుళం జిల్లా
సెల్ : 94405 58420, 94918 09596

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-7, Sri Ramakrishna Prabha (Telugu Monthly) July 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

ధనార్జనకు కావలసిన బలం కన్నా, ఆ ధనాన్ని త్యాగం చేయడానికి ఎక్కువ బలం కావాలి. అలాగే ధనత్యాగానికి అవసరమైన బలం కన్నా, సచ్ఛీలాన్ని పెంచుకోవడానికి మరింత ఎక్కువ బలం కావాలి. వీటన్నిటి కన్నా 'నేను' అనే అహాన్ని భగవంతుడి దివ్యచరణాల వద్ద సమర్పించడానికి సర్వోన్నతమైన శక్తి అవసరం. అదే అత్యున్నతమైన బలం. *- స్వామి రంగనాథానంద*



# సుబోధ

**భక్తుడు :** స్వామీ! మేము ఎందుకు బద్ధులమై ఉన్నాం? భగవంతుడు మాకెందుకు కనిపించడం లేదు?

**శ్రీరామకృష్ణులు :** సచ్చిదానందమే జీవునిగా రూపుదాలుస్తుంది. కానీ మాయ వల్ల జీవుడు తన నిజస్వరూపాన్ని మరచిపోతున్నాడు. జీవుడికి అనేక ఉపాధుల్ని (తొడుగులను) ఈ మాయ సృష్టిస్తుంది. దానిలో డబ్బు ఒక ఉపాధి. ఒక కథ చెబుతా విను!

"ఒక కప్పకు ఒక రూపాయి నాణెం దొరికింది. దాన్ని అది తన కన్నంలో దాచుకుంది. ఒకరోజు ఒక ఏనుగు ఆ కన్నం మీదుగా నడవడం సంభవించింది. ఆ కప్ప పట్టలేని కోపంతో బయటకు వచ్చి, ఆ ఏనుగును తన్నడానికి తన ఎడమకాలు ఎత్తి, 'నా కన్నం మీద నుండి నడవడానికి నీకెంత ధైర్యం?' అని గద్దించింది. ధనం మనిషిలో అటువంటి అహంకారాన్ని కలిగిస్తుంది."

ఈ మాయ అంటే ఏమిటో కాదు, జీవుని అహంకారమే. యథార్థమైన గురువు లభిస్తే జీవుని అహంకారం సులభంగా నశిస్తుంది. కానీ అశక్తుడైన గురువు చేతిలో పడితే వాడికి ముక్తి లభించదు.



"ఒకసారి నేను సరుగుడు తోపు మీదుగా బహిర్భూమికి వెళ్ళి వస్తున్నాను. వెళ్ళేటప్పుడు ఒక కప్ప అరుపు వినిపించింది. బహుశా ఆ కప్ప, పాము నోటిలో పడి ఉండవచ్చు అనుకున్నాను. కానీ కొంతసేపైన తరువాత మళ్ళీ నేను తిరిగి వచ్చేటప్పుడు కూడా ఆ కప్ప బాధతో అరుస్తూనే ఉంది. ఏమిటా చూద్దామని దగ్గరకు వెళ్ళాను. అక్కడ ఒక పెద్ద కప్ప, నీటిపాము నోటిలో చిక్కుకొని ఉంది. పాము కప్పను లోపలికి మ్రింగలేకపోతోంది, బయటకు కక్కలేకపోతోంది. అందువల్ల ఇటు పాము, అటు కప్ప విపరీతమైన బాధను అనుభవిస్తున్నాయి. అదే కప్ప కనుక ఒక పెద్ద త్రాచుపాము నోటిలో పడినట్లయితే మూడు అరుపులతో చచ్చి ఊరుకునేది. కానీ అది నీటిపాము అవడం వల్ల రెంటికీ బాధ తప్పలేదు. అందువల్ల యథార్థమైన గురువు చేతిలో చిక్కిన వారి అహంకారం (అన్ని ఉపాధులూ) మూడు అరుపులతో అంతరిస్తుంది" ❖

(శ్రీరామకృష్ణ కథామృతం నుండి)



**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# స్వామి వివేకానంద రథయాత్ర

**11 సెప్టెంబర్ 2012 నుంచి 12 జనవరి 2014 వరకు**


రథం నమూనా

**భా**రతావని ఆధ్యాత్మిక వైభవాన్ని విశ్వవ్యాప్తం గావించిన యుగపురుషుడు స్వామి వివేకానంద. 1893 సెప్టెంబర్ 11వ తేదీన చికాగోలో చారిత్రాత్మక ప్రసంగంతో ప్రారంభమైన స్వామీజీ జైత్రయాత్ర ఖండఖండాంతరాల్లో జగజ్జేయమానంగా విజయఢంకా మోగించింది. మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని నేల నాలుగుచెరగులా చాటిన ఆ కారణజన్ముడి 150వ (2013- 2014) జన్మదిన వార్షికోత్సవాలను దేశవ్యాప్తంగా రామకృష్ణ సంఘం వైభవోపేతంగా నిర్వహించదలచింది.

ఈ మహోత్సవాలను పురస్కరించుకొని హైదరాబాదు రామకృష్ణ మఠం స్వామి వివేకానంద సందేశాన్ని తెలుగునాట నలుదిశలా పరివ్యాప్తం చేయాలన్న సత్సంకల్పంతో 'స్వామి వివేకానంద రథయాత్ర'ను నిర్వహించనుంది. ఈ రథయాత్ర - సర్వాలంకార భూషితమైన స్వామి వివేకానంద రథం, స్వామీజీ జీవిత విశేషాలతో కూడిన సంచార ప్రదర్శనశాల, స్వామి వివేకానంద సాహిత్య సంచార విక్రయశాలలతో కొనసాగుతుంది. ఆంధ్రరాష్ట్రమంతటా (2012 సెప్టెంబర్ 11 నుంచి 2014 జనవరి 12 వరకు) సాగే ఈ రథయాత్ర - విజయవాడ, రామకృష్ణ మిషన్; రాజమండ్రి, రామకృష్ణ మఠం; కడప, రామకృష్ణ మిషన్ కేంద్రాల సహకారంతో అత్యంత వైభవంగా నిర్వహించేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. స్వామి వివేకానంద రథాన్ని తమ ప్రాంతాలకు ఆహ్వానించదలచుకునే శ్రీరామకృష్ణ సేవాసమితులు, విద్యాసంస్థలు, ఇతర స్వచ్ఛంద సంస్థలవారు పూర్తి వివరాల కోసం ఈ మఠ కేంద్రాలను సంప్రతించండి:

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, విజయవాడ.**

**రథం పర్యటన తేదీలు : 11-09-2012 నుండి 20-10-2012 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** కృష్ణా, గుంటూరు జిల్లాలు.

*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్ :* రామకృష్ణమిషన్, గాంధీనగరం, విజయవాడ - 520 003.

*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, సీతానగరం, తాడేపల్లి (పోస్ట్),గుంటూరు జిల్లా - 522 501. ఫోన్: 0866-2570799, 9985539422.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, రాజమండ్రి.**

**రథం పర్యటన తేదీలు : 24-10-2012 నుండి 30-04-2013 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు.

*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, రామకృష్ణ-వివేకానంద నగర్, రాజమండ్రి - 533 105. సెల్ : 9396673111.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, కడప.**

**రథం పర్యటన తేదీలు : 01-06-2013 నుండి 30-09-2013 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** కడప, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, ప్రకాశం జిల్లాలు.

*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్* - రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప - 516 005.

*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి వద్ద, కడప - 516 002. సెల్ : 9248545012.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, హైదరాబాదు.**

**రథం పర్యటన తేదీలు : 01-10-2013 నుండి 12-01-2014 వరకు**

**రథం పర్యటన ప్రాంతాలు :** హైదరాబాదు, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, వరంగల్, మెదక్, ఖమ్మం, నల్గొండ జిల్లాలు.

*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, దోమల్‌గూడ, హైదరాబాదు- 500 029. సెల్ : 8498011535.

ఈ రథోత్సవంలో రాష్ట్రప్రజలు, యువతీయువకులు, విద్యార్థినీ విద్యార్థులు, రామకృష్ణ-వివేకానంద భావప్రచార పరిషత్ సభ్యులు, కార్యకర్తలు, భక్తులు, శ్రేయోభిలాషులు సమధికోత్సాహంతో పాల్గొని, సేవలందించాలని కోరుతున్నాం. ఈ బృహత్ కార్యక్రమాన్ని దిగ్విజయం చేయడానికి మనమందరం కృషి చేద్దాం. స్వామి వివేకానంద సందేశామృతంతో తెలుగు ప్రజల హృదయాలను నింపుదాం.

భగవత్సేవలో...

స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు
రామకృష్ణ మఠం, హైదరాబాదు.

**రామకృష్ణ మఠం**, దోమల్‌గూడ, హైదరాబాదు-29
సెల్ : 8498011535
email : sv150aprathayatra@rkmath.org

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 7 జూలై 2012

**అనేకజన్మ సంప్రాప్త కర్మేంధన విదాహినే ।**
**ఆత్మజ్ఞానాగ్నిదానేన తస్మై శ్రీగురవే నమః ॥**
**న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।**
**తత్త్వజ్ఞానాత్పరం నాస్తి తస్మై శ్రీగురవే నమః ॥**

అసంఖ్యాక జన్మల నుండి ప్రాప్తించిన సంచిత, ఆగామి కర్మలనే కట్టెలను, ఆత్మజ్ఞానాగ్ని ద్వారా భస్మం చేసే ఓ గురుదేవా! నీకు నమస్కారం. గురువు కంటే ఉత్కృష్టమైన తత్త్వం గానీ, తపస్సుగానీ లేదు. తత్త్వజ్ఞానం కంటే అధికమైనది మరొకటి లేదు. ఓ గురుదేవా! నీకు నమస్కారం.

– విశ్వసారతంత్రం

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | శ్రీమతి బి.ఎస్. దేవి & శ్రీ బి.జె. రావు, గొల్లపాలెం, డాబా గార్డెన్స్, విశాఖపట్నం | 20,000 |
| మహారాజ పోషకులు | శ్రీమతి ఓరుగంటి పేరిందేవి, బిలాస్‌పూర్, ఛత్తీస్‌గఢ్ - 495 004 | 10,000 |
| మహారాజ పోషకులు | డాక్టర్ చక్రవర్తి, బంజారాహిల్స్, హైదరాబాదు - 500 034 | 10,000 |
| పోషకులు | శ్రీ బి. బాలాజీ సుకుమార్, అశోక్‌నగర్, హైదరాబాదు - 500 0 20 | 1,500 |
| పోషకులు | శ్రీమతి బి. గాయత్రి, అశోక్‌నగర్, హైదరాబాదు - 500 0 20 | 1,500 |
| పోషకులు | శ్రీ పి. సుబ్బరామిరెడ్డి, మునిరెడ్డినగర్, తిరుపతి (కీ.శే. మునిరెడ్డి & ఎల్లమ్మల జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | శ్రీ పూస సాయిలు, తుమ్మలగూడెం, రామన్నపేట, నల్లగొండ జిల్లా - 508 112 | 1,000 |
| పోషకులు | శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |
| పోషకులు | శ్రీ సి.హెచ్. నరసింహారావు, ఆర్.కె. పురం, సికింద్రాబాదు (సి.ఆర్.కె. ఫౌండేషన్-2011 చేర్పులు) | 1,000 |
| పోషకులు | ఎస్.బి.ఎస్. ఉన్నత పాఠశాల, గాంధీనగర్, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్‌చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్




# ప్రపంచమే ప్రత్యక్ష గురువు

మనం ఏ రంగంలోనైనా ప్రావీణ్యం సంపాదించాలన్నా, అనుకున్నది సాధించాలన్నా, ఉన్నతంగా రాణించాలన్నా అనుభవజ్ఞులైనవారి మార్గదర్శకత్వంలో శిక్షణ అత్యంత అవసరం. మనల్ని ఒడుదుడుకుల నుండి తప్పించి, ఆందోళనల నుండి ఆదుకొని, బలహీనతలను అధిగమించే మానసిక శక్తిని ప్రసాదించి, నిత్యానిత్యాలను గ్రహించేందుకు వివేకజ్యోతిని వెలిగించి ప్రగతి పథంలో నడిపించేవాడు 'గురువు'. గురువు లేకుండా ఏ విద్యా రాణించదని శాస్త్రవచనం. అందుకే గురువు సహాయం లేకుండా విద్యనార్జించడం బ్రహ్మకైనా సాధ్యం కాదని గురువు ప్రాధాన్యాన్ని ఇలా తెలియజేస్తున్నాడు యోగివేమన:

**గురుని శిక్షణలేక గురుతెట్లు కలుగునో? అజునికైన, వాని అబ్బకైన, తాళపుచెవి లేక తలుపెట్లు లూడునో? విశ్వదాభిరామ వినురవేమ**

ఈ విశాల విశ్వంలో మనకు ప్రతీ అంశం ప్రతి నిత్యమూ అనేక రూపాల్లో, అనేక విధాలుగా బోధిస్తూనే ఉంది. అలాంటి గురువులలో ముఖ్యంగా ముగ్గురి గురించి తెలుసుకుందాం:

1. ఆశ్రయంలో శిక్షణనిచ్చే గురువు – మానవ గురువు.
2. అనుభవంతో శిక్షణనిచ్చే గురువు – మానసిక గురువు.
3. పరిశీలన నుండి పాఠాలు నేర్పే గురువు– ప్రకృతి గురువు.

**మానవ గురువు :** ఒక గొర్రెలకాపరి తన గొర్రెల మందలోని ఒక గొర్రెపిల్ల కనిపించలేదని ఆందోళనతో ఆ దారినపోయే ప్రతి ఒక్కరినీ 'అయ్యా! నా గొర్రెపిల్ల కనిపించడం లేదు. మీరెవరైనా చూశారా?' అని అడుగుతూ పరుగులు తీయసాగాడు. అలా అలజడితో సాగిపోతున్న ఆ గొర్రెలకాపరిని చూసిన ఓ వ్యక్తి 'ఏమయ్యా! గొర్రెపిల్లను నీ చంకలోనే ఉంచుకొని, ఊరంతా వెతుకుతున్నావేంటి?' అని గుర్తుచేశాడు.

మనం కూడా ఆ గొర్రెలకాపరిలాగే మనలోనే ఉన్న ఆనందాన్ని మరచి, బాహ్యప్రపంచమనే వీథుల్లో వెతుకుతూ ప్రాపంచిక చింతలతో అలజడి చెందుతున్నాం. అలాంటి అయోమయ స్థితిలో ఉన్న మనకు ఆనందం మన అంతరాత్మలోనే ఉందని గుర్తుచేసే మహాత్ముడే – 'మానవ గురువు'.

**మానసిక గురువు:** ఆనందం కోసం అన్నిచోట్లా వెతుకుతుంటే, చివరకు అసలైన ఆనందం తనలోనే ఉందని మనిషికి స్వీయ అనుభవమే నేర్పుతుందంటూ శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు. "సముద్రంలో పయనిస్తున్న ఒక పడవ తెరచాప కొయ్య మీద కూర్చున్న ఓ పక్షి, భూభాగం కోసం నాలుగు దిక్కులూ వెతికింది. కానీ ఏ దిక్కుగా ఎగిరినా, ఎంత దూరం ఎగిరినా అనంత సాగరమే కనిపించింది. అలా అన్ని దిక్కులూ ఎగిరి అలసిపోయిన ఆ పక్షి, చివరకు పడవ తెరచాప కొయ్య మీదే వ్రాలి ప్రశాంతంగా సేద తీరింది."

భవసాగరంలో పయనిస్తున్న మనం కూడా ప్రశాంతత కోసం ప్రపంచం నలుమూలలా వెతుకుతున్నాం. ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొన్న తరువాత నిజమైన ఆనందం అంతరాత్మలోనే ఉందని మన మనస్సే మనకు బోధిస్తుంది. అనుభవంతో సత్యాన్ని తెలియజేసే మనస్సే – 'మానసిక గురువు'.

**ప్రకృతి గురువు:** ఈ విశాల ప్రపంచాన్ని పరిశీలించి చూస్తే ఎన్నో విషయాలను తెలుసుకోవచ్చు. అరణ్యాలలో ప్రశాంతంగా సంచరిస్తున్న దత్తాత్రేయుణ్ణి దర్శించిన ఒక మహారాజు"స్వామీ! మీకు ఈ ఆనందం ఎలా ప్రాప్తించింది? మీ గురువు ఎవరు?" అని ప్రశ్నించాడు. అందుకు దత్తాత్రేయుడు "రాజా! నేను ఈ ప్రపంచాన్ని పరిశీలించిన తరువాత నాకు 24 మంది గురువులు లభించారు. ఒక్కొక్కరి నుండీ ఆత్మానందాన్ని పొందేందుకు కావలసిన లక్షణాలను అవగతం చేసుకున్నాను. పంచభూతాల నుండి సహనాన్నీ, పరోపకారబుద్ధినీ, నిస్సంగత్వాన్నీ, విశాలత్వాన్నీ నేర్చుకున్నాను. సూర్యుడి నుండి సమదృష్టినీ;

చంద్రుడి నుండి వృద్ధిక్షయాలకు చలించని మనస్తత్త్వాన్నీ; సముద్రం నుండి నిశ్చలత్వాన్నీ; పశుపక్ష్యాదులు, జంతువులు, క్రిమికీటకాల నుండి నిర్మోహత్వాన్నీ, ఇంద్రియ నిగ్రహాన్నీ, సంకల్ప త్యాగాన్నీ అలవరచుకున్నాను" అని బదులిచ్చాడు.

దత్తాత్రేయునికి ఉన్న 24 మంది గురువుల్లో 12 మంది గురువులు-పావురం, కొంగ, కొండచిలువ, ఏనుగు, హరిణం, మత్స్యం, సర్పం, శలభం, తుమ్మెద, తేనెటీగ, కందిరీగ, సాలీడు లాంటి పక్షులు, జంతువులు, కీటకాలే కావడం గమనార్హం.

ప్రాపంచిక వ్యవహారాల్లో గానీ, ఆధ్యాత్మిక విషయాల్లో గానీ సఫలం కావాలంటే శ్రద్ధ, ఏకాగ్రత, వాంఛారాహిత్యం, అహంకార రాహిత్యం మొదలైన లక్షణాలను పెంపొందించుకోవాలి. ఈ లక్షణాలను అలవరచుకోవడానికి శ్రీరామకృష్ణులు కూడా పశు పక్ష్యాదులను ఆదర్శంగా చూపిస్తూ ఎన్నో కథలు చెప్పారు.

**శ్రద్ధ:** ఏ కార్యసాధనకైనా శ్రద్ధ అత్యంత ఆవశ్యకం. పనిలో శ్రద్ధ లోపిస్తే సఫలం కావడం సాధ్యం కాదు. అందుకే శ్రద్ధ అంటే ఎలా ఉండాలో కాకిని ఆదర్శంగా చూపిస్తూ శ్రీరామ కృష్ణులు ఇలా వివరించారు: "ఒకసారి శ్రీరామలక్ష్మణులు పంపానదీ తీరాన వెళుతున్నారు. అప్పుడు ఒక కాకి మాటిమాటికీ నది దగ్గరకు వెళ్ళి, నీళ్ళు త్రాగకుండా తిరిగిరావడం లక్ష్మణుడు చూశాడు. లక్ష్మణుడు తనకు కలిగిన సందేహాన్ని శ్రీరాముడికి తెలిపాడు. అప్పుడు శ్రీరాముడు 'లక్ష్మణా! ఆ కాకి రేయింబవళ్ళు రామ నామాన్ని జపిస్తుంది. నీళ్ళు త్రాగే సమయంలో రామనామ జపం ఆగిపోతుందేమోనని దాని భయం' అని విశదపరిచాడు".

మనం చాలా పనుల్ని ఎంతో ఉత్సాహంతో ప్రారంభిస్తాం. కానీ ఆ ఉత్సాహం కొంతకాలానికి సన్నగిల్లిపోతుంది. ముఖ్యంగా ఆధ్యాత్మిక మార్గంలో నిరుత్సాహం కలగడానికి కారణం - మనలో శ్రద్ధ లోపించడమే. కాబట్టి కాకికి ఉన్న భక్తి శ్రద్ధల్లో కొంతైనా మనలో ఉంటే ఉత్సాహంతో జపధ్యానాదులను క్రమం తప్పకుండా అనుష్ఠించడం సాధ్యమవుతుంది.

**ఏకాగ్రత:** ఎప్పుడైతే మనం చేసే పని మీద శ్రద్ధ కనబరుస్తామో అప్పుడు మనస్సును సులభంగా ఏకాగ్రం చేయగలుగుతాం. ఏకాగ్రత అంటే ఎలా ఉండాలో కొంగను చూసి నేర్చుకోవచ్చని శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు: "ఒక కొంగ, చేపను పట్టాలని నిశ్చలంగా పొంచివుంది. ఆ కొంగను చంపాలని ఒక వేటగాడు బాణం ఎక్కుపెట్టి కొట్టడానికి సిద్ధంగా ఉన్నాడు. వేటగాడి చేతిలో తనకు అపాయం పొంచి ఉన్నప్పటికీ ఆ విషయాన్ని పట్టించుకునే ధ్యాస కొంగకు లేదు. దాని మనస్సంతా చేపను పట్టుకోవడంలోనే నిమగ్నమై ఉంది".

జపధ్యానాలు చేసేటప్పుడు మన మనస్సు దైవచింతన కన్నా పరచింతన ఎక్కువ చేస్తూ ఉంటుంది. కాబట్టి పరిపరి విధాలుగా పరుగులు పెడుతున్న మనస్సును అరికట్టి, భగవంతునిపై నిలప డానికి కొంగ ప్రదర్శించిన ఏకాగ్రతను మనం అభ్యసించాలి.

**వాంఛారాహిత్యం:** మనస్సులో విషయవాంఛలు వేధిస్తున్నంత వరకూ ప్రశాంతత చేకూరడం అసాధ్యం. ఈ సందర్భంగా చేపను ముక్కున కరుచుకొని ఎగురుతున్న గ్రద్ద అవస్థ ఎలాంటిదో వివరిస్తున్నారు శ్రీరామకృష్ణులు.

"చేపను ముక్కున కరుచుకొని ఎగిరిపోతున్న ఓ గ్రద్దను కాకుల గుంపు వెంటపడి తరుముతోంది. ఆ కాకుల గుంపు బారి నుండి తప్పించుకునే ప్రయత్నంలో గ్రద్ద ఆ చేపను జార విడిచింది. వెంటనే ఆ కాకులు గ్రద్దను తరమడం మానేశాయి. అప్పుడు ఆ గ్రద్ద ప్రశాంతంగా ఒక చెట్టు కొమ్మ మీద కూర్చుని ఈ చేపే ఇన్ని అనర్థాలకూ కారణమని గ్రహించింది."

మనస్సులో ప్రాపంచిక వాంఛలు ఉన్నంత వరకూ మనం ఎన్ని గుళ్ళూ గోపురాల చుట్టూ తిరిగినా, ఎన్ని ధ్యాన కేంద్రాలను దర్శించినా, ఎన్ని ప్రవచనాలు విన్నా శాంతిని పొందడం దుర్లభం. కాబట్టి మనలో కోరికలు పోయిన మరుక్షణమే నిశ్చల స్థితి సిద్ధిస్తుందన్న గుణపాఠాన్ని గ్రద్ద మనకు నేర్పుతోంది.

**అహంకార రాహిత్యం:** మన పురోగతికి ముఖ్యమైన అవరోధం అహంకారం. మనకున్న సిరిసంపదలు, పేరు ప్రతిష్ఠలు, విద్యార్హతలను చూసి మిడిసిపడుతుంటాం. మనకున్న అల్పశక్తిని చూసుకొని మనల్ని మించినవారు లేరని ఎలా గర్వపడు తుంటామో తెలుపుతూ, శ్రీరామకృష్ణులు ఒక మిణుగురు పురుగును ఉదాహరణగా చెబుతున్నారు.

"సూర్యుడు అస్తమించిన వెంటనే ప్రపంచం అంతటికీ తానే వెలుగును ఇస్తున్నానని మిణుగురు పురుగు భ్రమిస్తుంది. ఇంతలో ఆకాశంలో నక్షత్రాలు భాసిస్తాయి. తమ కాంతితో భూమండలానికి వెలుగును ప్రసాదిస్తున్నామని అవి భావిస్తాయి. మరికొంత సేపటికి చంద్రుడు ఉదయించి ఈ పుడమిని తన కాంతితోనే నింపుతున్నానని తలపోస్తాడు. ఇంతలో సూర్యోదయం కాగానే చంద్రుడు కనుమరుగవుతాడు. ఇలా ఒకరిని మించినవారు మరొకరు ఉంటారని తెలియక మిడిమిడి జ్ఞానంతో మిడిసిపడుతుంటాం."

భగవంతుని ఈ అనంత సృష్టిలో మన స్థానమేమిటో, మన శక్తి ఏమిటో, మన సిరిసంపదలు, విజ్ఞాన వివేకాలు ఎంతటివో తెలుసుకొని ప్రవర్తించాలి. మనల్ని మించిన వారు మరొకరు ఎప్పుడూ ఉంటారన్న సత్యాన్ని గ్రహిస్తే మనలో అహంకారం అదృశ్యమై, వినయం ఉదయిస్తుంది.

'ఈశా వాస్యమిదం సర్వం' - పరమాత్మమయమైన ఈ ప్రపంచాన్ని పరిశీలిస్తే ఆయన సృష్టించిన ప్రతీ జీవి నుండి అనంత జ్ఞానాన్ని పొందవచ్చు. మనలోని దానవత్వాన్ని పారద్రోలి, మానవత్వాన్ని వికసింపజేసి, దైవత్వాన్ని పరిమళింపజేసే జ్ఞానాన్ని ప్రసాదించాల్సిందిగా ప్రత్యక్ష గురువైన ఈ విశాల విశ్వం ముంగిట ప్రణమిల్లుదాం. ❖

గురుభక్తి కలవాడికి సమస్తమూ భగవత్స్వరూపంగా గోచరిస్తుంది. భగవంతుడే తల్లీ, తండ్రీ, గురువై ఉన్నాడు. అంతెందుకు, సమస్త సృష్టిజాతమంతా ఆ భగవంతుడే నిండివున్నాడు. - శ్రీరామకృష్ణులు

# కమ్యూనికేషన్ స్కిల్
## (భాషాకౌశలం)

కొంత మందిని, అదేమిటోగాని వాళ్ళ మాటలు ఎంత తియ్యగా ఉన్నా వినడం మాట అటుంచి మొత్త బుద్ధవుతుంది. ఏ విధమైన భాషాకౌశలం లేకపోయినప్పటికీ మరికొందరి మాటలు వింటుంటే గుండెకు హత్తుకునేలా ఉంటాయి. ఎలాంటి వారినైనా, ఎటువంటి పరిస్థితులలోనైనా ఈ రెండో కోవకు చెందినవారు చిటికలో ఆకట్టుకుంటారు. వారు అనుకున్నది సాధిస్తారు.

ఒక పెద్ద(మెగా) ఆధ్యాత్మిక సాధనా శిబిరంలో పాల్గొనడానికి చాలా మంది తమ పేర్లను నమోదు చేసుకున్నారు. సాధనా కార్యక్రమం మొదటి రోజునే




కొంతమందికి పిచ్చెక్కినట్లయింది. కారణం వారు పొగ త్రాగువారు. వెంటనే వాళ్ళల్లో ఒక 'ముదురు' శిబిర నిర్వాహకుల వద్దకు వెళ్ళి వారి సమస్యను విన్నవించు కున్నాడు. "ఇలాంటి విషయాలలో గురువుగారిని సంప్రతించవలసి ఉంటుంది. ఒకవేళ వారు గనక సిగరెట్టు తాగడానికి అనుమతించినట్లయితే మాకు కూడా ఒక 'ప్యాకెట్' ఇద్దురు" అని సెలవిచ్చారు నిర్వాహకులు.

'ముదురు' నేరుగా గురువుగారి దగ్గరకు వెళ్ళి ఇలా అన్నాడు: "అయ్యా! భగవంతుణ్ణి ప్రార్థించేటప్పుడు సిగరెట్టు తాగొచ్చా?" ఇంకేముంది, గురువుగారి ముఖం ఎర్రబడింది. బ్రహ్మర్షి విశ్వామిత్రను గుర్తుకు తెచ్చే క్రోధావేశంతో "ఛీ! సిగ్గులేదు. సాధనా శిబిరానికి వచ్చి పొగత్రాగుతారా!" అని చీవాట్లు పెట్టాడు. అంతే, అక్కడ నుండి 'ముదురు' మాయం. బిక్కు బిక్కు మంటూ అనుమతి కోసం ఎదురుచూస్తున్న వారి ఆశలు ఆడియాశలేనా? ఊహూ!

'ముదురు'కు ఒక ప్రాణ స్నేహితుడున్నాడు. పేరు ధూమకేతు. ఎప్పుడూ నోరు పొగలు కక్కుతుంటుంది. అతడు గురువుగారిని ఒప్పించే బాధ్యతను తన భుజస్కంధాలపై వేసుకున్నాడు. వెంటనే గురువుగారి దగ్గరకు వెళ్ళి చేతులు జోడించి "గురువుగారూ! 'పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ, లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్...' నీళ్ళు త్రాగు తున్నప్పుడూ, మాట్లాడేటప్పుడూ, భోజనం చేసేటప్పుడూ, ఆటలాడేటప్పుడూ, నడుస్తున్నప్పుడూ, నవ్వుతున్నప్పుడూ, చివరకు నిద్రలో కూడా ప్రహ్లాదుడు ఆ శ్రీహరిని స్మరించేవాడని విన్నాం. కాబట్టి సిగరెట్టు తాగుతున్నప్పుడు కూడా భగవంతుణ్ణి ప్రార్థించవచ్చా?" అని వినయంగా అడిగాడు.

ధూమకేతుని మృదు మధురమైన మాటలకు సంతసించిన గురువు "సర్వకాల సర్వావస్థలందూ భగవంతుణ్ణి ప్రార్థించ వచ్చు. మనం భగవంతుని బిడ్డలం. కాబట్టి నాయనా! సిగరెట్టు తాగుతూ కూడా భగవంతుణ్ణి ప్రార్థించడం చాలా గొప్ప విషయం. ఇది అందరికీ సాధ్యం కాదు. నీవు ఏ సంకోచం లేకుండా నీ ప్రార్థనలను కానివ్వు" అని అన్నాడు.

ఇప్పుడు అసలు విషయానికి వద్దాం! ధూమకేతు 'వాక్చాతుర్యం' యొక్క పర్యవసానం ఏమిటి? మన తెలివితేటలు ఎదుటి వాడిని బోల్తాకొట్టించడంతో సరా? గురువుకే పంగనామాలు పెట్టే శిష్యరికం వలన కలిగే ప్రయోజనం ఏమిటి? దేవుడిని మెప్పించలేని మన 'కమ్యూనికేషన్ స్కిల్' ఆధ్యాత్మిక పతనానికి 'కమ్యూనికేషన్ కిల్' అవకూడదు. ఇది ఎలా సాధ్యం? మనమే ఆలోచించాలి. అప్పుడే మనకు నిజమైన సాధకుల యొక్క 'మౌనం' బలహీనతగా కాక ఒక 'ప్రతిభ'గా గోచరిస్తుంది. ❖

# దాస్యభావంలో తరించిన ధన్యజీవి

– స్వామి పరిజ్ఞేయానంద



శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యుల జీవితాలను పరిశీలిస్తే ఒక్కొక్కరి జీవితంలో ఒక్కొక్క విశిష్ట లక్షణాన్ని మనం గమనించవచ్చు. శ్రీశారదామాత శిష్యులు స్వామి ప్రేమేశానందజీ మహరాజ్ శ్రీరామకృష్ణుల పదహారుమంది సన్న్యాస శిష్యుల విశిష్ట లక్షణాలను ఒక గేయంలో పొందుపరచారు. స్వామి రామకృష్ణానందజీ (శశి మహరాజ్)లో గల విశిష్టతను వివరిస్తూ ***'జయ శశి గురుపదే గత తనుమన్...'*** 'గురుదేవులైన శ్రీరామకృష్ణుల పాదసేవకే తనువునూ, మనస్సునూ అర్పించిన శశి మహరాజ్‌కు జయం' అని శశి మహరాజ్ గురుసేవా తత్పరతను కొనియాడారు.

'ఆధ్యాత్మిక అనుభూతులు కలిగితే నువ్వు నా సేవ చేయలేవు' అని శ్రీరామకృష్ణులు అన్నప్పుడు అందుకు సమాధానంగా 'మీ సేవకు అంతరాయం కలిగించే ఆ దివ్యానుభూతులు నాకు అక్కర్లేదు' అని శశిమహరాజ్ నిస్సంకోచంగా సమాధానం ఇచ్చారు. ఉత్తమ శిష్యుడంటే ఎలా ఉండాలనడానికి గురుసేవకే ప్రాధాన్యమిచ్చిన శశి మహరాజ్ జీవితం మనకొక ఆదర్శం.

త్రేతాయుగంలో దాస్య భావంతో శ్రీరామచంద్రుని సేవకు అంకితమైనది ఆంజనేయస్వామి అయితే, ఈ కలియుగంలో శ్రీరామకృష్ణుల సేవకే తనను తాను అర్పించుకొన్నది రామకృష్ణానంద స్వామి (శశి మహరాజ్). శ్రీరామకృష్ణులు భౌతిక శరీరంతో ఉన్నప్పుడు ఆయనకు ఎంత భక్తి శ్రద్ధలతో సేవ చేశారో, అంతే భక్తి శ్రద్ధలతో శ్రీరామకృష్ణుల మహాసమాధి తరువాత కూడా సేవలు చేయడం శశి మహరాజ్‌లో ఉన్న విశిష్టత. గురుదేవుల ఛాయాచిత్రంలో సాక్షాత్తూ సజీవమూర్తిని దర్శిస్తూ సేవలు చేసి, అత్యున్నత ఆధ్యాత్మిక అనుభూతులు పొందిన శశి మహరాజ్ దాస్య భావంలో ఆంజనేయుణ్ణే మరపించారనిపిస్తుంది.

మద్రాసులో శశి మహరాజ్ నివసిస్తూ ఉండే భవనం శిథిలావస్థలో ఉండేది. భవనం పైకప్పు బీటలు వారడం వల్ల వర్షం వస్తే కారుతుండేది. ఒక రోజు రాత్రి పెద్ద వర్షం కురవడం వల్ల పూజగదిలో సరిగ్గా శ్రీరామకృష్ణుల చిత్రపటం పై నుంచి నీళ్ళు కారడం మొదలైంది. గురుదేవుల చిత్రపటం పక్కకు కదిపితే గురుదేవులకు నిద్రాభంగం అవుతుందని భావించిన శశి మహరాజ్ ఆ రాత్రంతా శ్రీరామకృష్ణుల చిత్రపటం పైన గొడుగు తెరచి పట్టుకొన్నారు. రాత్రంతా తాను జాగరణ చేస్తూ గురుదేవులకు నిద్రాభంగం కలగకుండా చూశారు.

అవి వేసవి రోజులు. బాగా ఉక్క పోస్తోంది. నిద్రపోతున్న శశి మహరాజ్ రాత్రి పదకొండుగంటలకు హఠాత్తుగా లేచారు. శ్రీరామకృష్ణుల శయనగదికి వెళ్ళి, మంచం మీద ఉన్న గురుదేవుల చిత్రపటానికి విసరడం మొదలుపెట్టారు. వాతావరణం వేడిగా ఉండడం వల్ల గురుదేవులకు నిద్రాభంగం కలుగుతుందని భావించిన శశి మహరాజ్ రాత్రంతా గురుదేవుల చిత్రపటానికి విసురుతూ కూర్చున్నారు.

పూర్వం ఋషులు, మునులు అరణ్యాలలో కఠోర తపస్సు చేసి ఎలాంటి బ్రహ్మానుభూతిని పొందారో అలాంటి అనుభూతిని గురుదేవుల సేవ ద్వారానే శశి మహరాజ్ పొందగలిగారు. ఒకసారి శశి మహరాజ్ ఒక బ్రహ్మచారితో, 'ఇప్పటికిప్పుడు సమాధి స్థితి కావాలను కుంటే వెంటనే పొందగలను' అన్నారు. గురుసేవ ద్వారా అత్యున్నత ఆధ్యాత్మిక అనుభూతులను పొందవచ్చనడానికి శశి మహరాజ్ జీవితం ఒక నిదర్శనం.

***ఇహము నందు గురున కీ దేహమిచ్చిన***
***పరము జూపి గురుతు బట్టి యిచ్చు***
***స్థిరముగాను బుద్ధి చెదనీక చూడరా***
***విశ్వదాభిరామ వినురవేమ...***

'జీవితంలో ఎన్ని కష్టాలు ఎదురైనా స్థిరబుద్ధితో గురుశుశ్రూష చేసిన శిష్యుడికి ఆ గురువే ఆత్మానుభూతి కలిగేలా చేస్తాడ'ని వేమన యోగి చెప్పిన దానికి శశి మహరాజ్ జీవితం చక్కని తార్కాణం.

శ్రీరామకృష్ణుల మహాసమాధి తరువాత తన సోదర సన్న్యాస శిష్యులందరూ నిద్రాహారాలు మరచి జప ధ్యానాలలో నిమగ్నమై ఉండేవారు. శశి మహరాజ్ వారందరినీ ధ్యానంలో నుంచి బయటకు రప్పించి, కన్నతల్లిలా తన చేతులతో అన్నం తినిపించేవారు. అందుకే శశి మహరాజ్ సేవలకు స్పందించిన స్వామి వివేకానంద, 'మఠానికి శశి మూలస్తంభం లాంటి వాడు' అని కొనియాడారు.

మద్రాసుకు వచ్చిన తొలిరోజుల్లో ఎదురైన కష్టాలన్నిటినీ శశి మహరాజ్ ఓర్పుతో ఎదుర్కొని దక్షిణ భారతదేశంలో శ్రీరామకృష్ణ కల్పతరువు ఆవిర్భావానికి కారకులయ్యారు. నేడు వేలాది మంది భక్తులు ఈ కల్పతరువును ఆశ్రయించి సేద తీర్చుకొంటున్నారంటే అది శశి మహరాజ్ సేవ, త్యాగాల ఫలమే! ❖

**(తిథి ప్రకారం జూలై 17వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులైన స్వామి రామకృష్ణానంద 150వ జయంతి సందర్భంగా)**

**శశి మాకు కన్నతల్లిలాంటివాడు. ధ్యాననిమగ్నులమై ఉన్న మమ్మల్ని ధ్యానంలోంచి బయటకు రప్పించి మాకు స్వయంగా అతడే అన్నం తినిపించేవాడు. శశి మఠానికి మూలస్తంభం. - స్వామి వివేకానంద**







# ఆశకు అంతం లేదా?

– స్వామి జ్ఞానదానంద

ఒక అభాగ్య బ్రాహ్మణుడు కడు పేదరికంతో బాధపడుతూ తమ గ్రామానికి వచ్చిన ఓ సాధుపుంగవుణ్ణి సందర్శించుకొని తన గోడును వెళ్ళబోసుకున్నాడు. ఎన్నో మహిమలున్న ఆ స్వామీజీ ఆ దీనార్తుడి కష్టానికి కరిగిపోయి ఎలాగైనా సహాయం చేయాలనుకుంటాడు. కళ్ళు మూసుకొని తన దివ్యదృష్టితో ఆ రాజ్యంలోని ఓ అటవీప్రాంతంలో నాణాల రాశులున్నాయని తెలుసుకుంటాడు. వెంటనే ఆ పేద బ్రాహ్మణుణ్ణి అక్కడకు వెళ్ళి, తనకు కావలసినంత సొమ్ము తెచ్చుకొని హాయిగా జీవించమని ఉపదేశించాడు. ఆ సాధువు మాట ప్రకారమే బ్రాహ్మణుడు ఆ చోటుకు వెళ్ళి, తన కుటుంబానికి కావలసినన్ని నాణాలు తెచ్చుకొని తృప్తిగా జీవించసాగాడు.

ఈ విషయం బ్రాహ్మణుడి ఇంటిపక్క నున్న ఓ నూనె వ్యాపారికి తెలిసింది. శ్రీమంతుడే అయినప్పటికీ అతనికి దురాశ పుట్టుకొచ్చింది. నిరుపేదగా వేషం వేసుకొని, సాధువు వద్ద దీనంగా ధనం కోసం అర్థించాడు. సాధువుకు అతని దుర్బుద్ధి తెలిసినప్పటికీ, అతనికి గుణపాఠం నేర్పాలని వందల మైళ్ళ దూరంలో ఉన్న నాణాల నిధుల జాడ చెప్పాడు. ఒకానొక రోజు ఇంట్లోవాళ్ళకు కూడా చెప్పకుండా, నిధులున్న చోటికి ఆ వ్యాపారి వెళ్ళిపోయాడు. ఎంతో శ్రమకోర్చి అక్కడికి చేరుకొని, అక్కడ రాజముద్రికలున్న నాణాల రాశులను చూసి మంత్రముగ్ధ దయ్యాడు. వాటిని సంచుల్లో నింపుకొని, మూట కట్టుకోవడం మొదలుపెట్టాడు. ఎన్ని మూటలు కట్టుకున్నా ఆశ తీరడం లేదు. ఇలా రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడచిపోయాయి. యుక్తవయస్సులో ఆ ప్రాంతంలో అడుగుపెట్టిన వ్యాపారి, వృద్ధాప్యానికి చేరుకున్నాడు. చివరకు తన శక్తిని మించిన నాణాల బస్తాలను తీసుకొని గ్రామానికి వచ్చాడు. అప్పటికే అతని కొడుకులు, కూతుళ్ళు కన్నుమూశారు. మనుమలేమో ఈ లోభిని అసలు గుర్తేపట్టలేదు. రాజ్యాలు మారిపోయి దురదృష్ట వశాత్తూ ఆ నాణాలు కూడా చెల్లుబాటు కాకుండా పోయాయి. ఈ మాత్రం దానికి ఇన్నేళ్ళు శ్రమించానా అనుకుంటూ, ఆ లోభి గుండె ఆగి చనిపోయాడు.

ఈ రోజుల్లో కూడా ఇలాంటివారు లెక్కకు మించి ఉన్నారు. ఆయువు తగ్గుతున్నా, ఆశ మాత్రం ఎనిమిది చేతుల ఆక్టోపస్‌లా అల్లుకుపోతోంది. ఇలాంటి ప్రమాదాన్ని ముందే ఊహించి, జగద్గురువులు శంకరాచార్యులు తన 'భజగోవింద స్తోత్రం'లో...

**దిన యామిన్యౌ సాయం ప్రాతః**
**శిశిర వసన్తౌ పునరాయాతః ।**
**కాలః క్రీడతి గచ్ఛత్యాయుః**
**తదపి న ముంచ త్యాశా వాయుః...** అన్నారు.

పగలు, రాత్రి, ఉదయం, సాయంత్రం, శిశిరం, వసంతం వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. కాలం ఆడే ఆటలో ఆయువు తరిగిపోతూ ఉంటుంది. అయినా మానవుడు ఆశను మాత్రం వదిలిపెట్టడని ఆవేదన వ్యక్తం చేశారు. ఆధునిక ప్రపంచంలో అంతం లేని ఆశలతో మనిషి పెడుతున్న పరుగులు విపరీత పరిణామాలకు దారి తీస్తున్నాయి. ఓ వైపు కాలం నిశ్శబ్దంగా తన ప్రతాపాన్ని చూపిస్తూ, పాఠాలు నేర్పుతున్నా మనకు కాదులే అన్నట్లు ప్రవర్తిస్తూ ఉన్నాం.

**పగటి వెంటే రాత్రి... ప్రాభవం వెనకే పతనం! :** కోటి సూర్యప్రభలతో అరుణోదయమైనా, అది మాపటికి మౌనంగా అస్తమించాల్సిందే! వసంతం ఎన్ని పూలవానలు కురిపించి, మురిపించినా, శిశిరం రాగానే కొమ్మలు మోడు వారాల్సిందే! మనుషులకైనా, మానులకైనా ఇదే కాలనియమం. మానవుడు తప్ప, సృష్టిలోని అన్ని ప్రాణులూ ఈ శాశ్వత సత్యాన్ని



మరచిపోకుండా, కాలానికి కైమోడ్చి మసలుకుంటున్నాయి. మనిషి మాత్రం, ఆ కాలభ్రమణానికి విరుద్ధంగా, తానొక చిరకాల జీవిననుకుంటూ వెఱ్ఱి ఆశలతో జీవిస్తున్నాడు. అందుకే శ్రీమద్భాగవతంలో భీష్మాచార్యులు...

**వాయువశంబులై ఎగసి వారిధరంబులు మింట కూడుచుం**
**బాయుచు నుండు కైవడి ప్రపంచము సర్వము కాలతంత్రమై**
**పాయుచు కూడుచుండు నొకభంగిచరింపదు కాలమన్నియుం**
**చేయుచు నుండు కాలము విచిత్రము దుస్తరమెట్టివారికిన్...**

అంటారు. ఆకాశంలోని మేఘాలు గాలికి ఎగిరి పరస్పరం కలుసుకుంటూ విడిపోతూ ఉన్నట్లు, ఈ ప్రపంచంలోని ప్రాణికోటి సమస్తమూ కాలచక్రం వల్ల కూడుతూ, వీడుతూ ఉంటుంది. స్వేచ్ఛ అనేది లేదు. కాలమే అన్నిటికీ మూలం. కాలం చాలా విచిత్రమైంది. ఎంతటివారైనా ఈ కాలప్రవాహాన్ని దాటలేరని స్పష్టం చేస్తారు.

కానీ, మనం అవివేకంతో సమస్తాన్నీ మన అధీనంలోకి తెచ్చుకోవాలని వృథాగా ప్రయాసపడుతూ ఉంటాం. కాలం పెట్టే పరీక్షలో ఓడిపోతూ ఉంటాం. సమాజంలో కాని, కుటుంబంలో కాని నిరంతరం మనం నిమిత్తమాత్రుల్లా వ్యవహరిస్తూ ఉండాలి. జీవితప్రయాణంలో హఠాత్తుగా ఎదురొచ్చే ఏ మలుపునకైనా సిద్ధంగా ఉండాలి. కాలప్రవాహంలో ఏ పరిణామాన్నైనా హుందాగా స్వీకరించాలి. అది ప్రాభవం కావచ్చు; పతనం కావచ్చు. ఏదైనా మన ప్రారబ్ధం అనుకొని స్థైర్యంగా నిలబడాలి.

**ఆశతోనే అశాంతి :** ఈ రోజు మనలో అశాంతికి ప్రధాన కారణం – ఆశ. జీవితానికి సంబంధించి, మనం ఓ ఆశల పల్లకీని నిర్మించుకుంటాం. రంగురంగుల పూలతో అలంకరించు కుంటూ ఉంటాం. అలాగే పల్లకీ సాగిపోవాలని కలలు కంటూ ఉంటాం. కానీ చాలా సందర్భాల్లో ఆ కలలు నెరవేరనప్పుడు మనం అశాంతిపాలవుతాం. అందువల్ల శంకరాచార్యులు 'ఆశించేస్థాయి'లోనే మనస్సును అప్రమత్తంగా ఉండ మంటున్నారు. మన ఆయువెంత? దాంట్లో మనం అనుభవించేదెంత? అని ఎవరికి వారే ప్రశ్నించుకోవాలి. కళ్ళు చల్లగా ఉండాలంటే అద్దాలు కళ్ళకే పెట్టుకుంటాం; ప్రపంచాన్ని అంతా చల్లబరచలేం కదా! అలాగే లోకంలో కనిపించేవన్నీ అనుభవించాలన్న ఆశ కన్నా, వాటిని కోరుకునే మనస్సునే కట్టడి చేయాలన్న ఇంగితజ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. అందుకే చాణక్యుడు తన నీతిసూత్రాల్లో...

**శాన్తి తుల్యం తపోనాస్తి న సంతోషాత్పరం సుఖమ్ ।**
**న తృష్ణాయాః పరో వ్యాధిర్నిచ ధర్మో దయాపరః ॥** అంటాడు.

శాంతితో సమానమైన తపస్సు మరొకటి లేదనీ, సంతోషాన్ని మించిన శ్రేష్ఠమైన సుఖం మరొకటి ఉండదనీ, ఆశకు మించిన వ్యాధి మరొకటి లేదనీ, దయను మించిన ధర్మం లేదనీ వివరిస్తాడు. కానీ ఈ రోజుల్లో చాలామందికి నిజంగా శాంతి, సంతోషం ఎక్కడ లభిస్తాయో తెలియదు. భగవాన్ శ్రీరామకృష్ణులు చెప్పినట్లు, వెలుగుతున్న లాంతరును మన చేతిలోనే పట్టుకొని, పక్కింట్లో నిప్పు కోసం అర్థించే అమాయకుల్లా మారిపోతున్నాం. చేతిలో దీపం ఉన్నా కూడా అవివేకి, ఆ స్పృహలేక చుట్ట కాల్చుకోవటానికి నిప్పు కోసం పక్కవారిపై ఆధారపడ్డాడు. మనం కూడా ఆనందం మన మనస్సులో ఉంటే, దాని కోసం కార్లలో, బ్యాంకు ఖాతాల్లో, రాజభవనాల్లో, ఖరీదైన వస్త్రాల్లో వెతుక్కుంటున్నాం. అలాగని వాటిని వేటినీ సముపార్జించు కోవద్దన్నది ఆది గురువుల అభిప్రాయం కాదు. కానీ అవి ఉంటేనే సంతోషంగా ఉంటామనుకోవడం అవివేకం.

**మాటు వేసిన మృత్యువు :** మనం మరచిపోయే మరో ముఖ్యమైన అంశం – మృత్యువు. అది రోజురోజుకూ మనకు దగ్గరవుతుందని గుర్తించం. పోయినవాళ్ళను చూసి పోతున్నవాళ్ళు ఏడ్చినట్లు, చనిపోయిన వారి ముందు నాలుగు కన్నీటి చుక్కలు కారుస్తాం. కానీ, మనం కూడా పోయే రోజు తప్పక వస్తుందనీ, ఆ లోపు మన కోసం మనమే బ్రతకడం కాకుండా, కొంతైనా ఇతరుల కోసం బ్రతుకుదామని ఆలోచించం. 'అందరూ వెళ్ళిపోతారు. నేను, నా పిల్లలు, నా మనుమళ్ళు, మనుమరాళ్ళు మాత్రమే శాశ్వతంగా ఉండి, ఈ ప్రపంచాన్ని అనుభవించేస్తాం' అన్నంత ధీమాతో మనలో చాలామంది స్వార్థపూరితులుగా జీవిస్తూ ఉంటారు. అందుకే ఓ మారు శ్రీరామచంద్రుడు విశ్వామిత్రుడితో "పిల్లి ఎలుకను ప్రియంగా చూస్తున్నట్లు ఒక పక్క మృత్యువు ప్రాణిని మింగివేయడానికి మహాభిలాషతో నిరంతరం చూస్తూ ఉంది. అయినా ఓ మహాశయా! ముసలి నర్తకి ఏ మాత్రం తనకు ఆనందం లేకపోయినా నృత్యం మానలేకపోయినట్లు, ఈ 'ఆశ' అనేది పొందే తృప్తి ఏదీ లేకపోయినా, ఈ సంసారారణ్యంలో తన చపల సంచలనం మాత్రం మానలేకపోతోంది. సంసారంలోని దోషాలన్నింటిలో ఇది అతి తుచ్ఛమైనది. ఇది ఉన్నంతవరకు మాకు మోహపూరితమైన పాట్లు తప్పవు" అంటాడు. ఆది శంకరులు చెప్పినా, శ్రీరామచంద్రుడు చెప్పినా ఒక్కటే – ఆశలపాశాన్ని ఎంత తుంచివేస్తే, మనిషికి అంత మనశ్శాంతి! గద్ద నోట్లో చేప ఉన్నంత కాలం కాకులు దాన్ని వెంబడిస్తూనే ఉంటాయి; చేపను జారవిడిచి కొమ్మపై కూర్చున్న మరుక్షణమే దానికి విశ్రాంతి; ప్రశాంతి! అలాగే మనిషికి ఆశలున్నంత కాలం ఈ అలుపెరుగని పరుగులూ తప్పవు; పడిపోవడాలూ తప్పవు. ఒక వయస్సు వరకు సంసారాన్ని ఓ చేతితో, భగవంతుడిని మరో చేతితో పట్టుకోవాలి; అయినవారంతా ఓ స్థాయికి వచ్చాక, రెండు చేతులతో ఆ పరమాత్ముడి పాదాలనే పట్టుకోవాలి. అప్పుడే ప్రశాంతం... పరమానందం! ❖

శాంతికి మించిన మహా తపస్సు, సంతోషానికి మించిన శ్రేష్ఠమైన సుఖం, దయకు మించిన ఉత్తమ ధర్మం, సహనానికి మించిన ఆభరణం, ఆశకు మించిన వ్యాధి మరొకటి లేదు. - చాణక్య నీతిసూత్రం

# రామకృష్ణ మిషన్, కడప





(రామకృష్ణమిషన్ అనుబంధ శాఖ, బేలూరుమఠం పోస్టు, హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్ 711202)

పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప – 516002, ఫోన్: 200120, 200633

నగర కేంద్రం: రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప – 516001, ఫోన్: 241633

Email: kadapamath@yahoo.com Web site: www.rkm-kadapa.org

## భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ సంప్రోక్షణ మహోత్సవం

### విజ్ఞప్తి

మూర్తిత్రయం యొక్క అపారమైన కృపాకటాక్షాలతో భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ నిర్మాణం దాదాపు పూర్తి కావస్తున్నది (రూ. 140 లక్షల అంచనా వ్యయంతో ప్రారంభమైన ఈ ఆలయ నిర్మాణ పనులు పూర్తి కావడానికి ఇంకా సుమారు రూ. 20 లక్షలు కావలసివున్నది).



దేవాలయ నమూనా

భగవాన్ శ్రీరామకృష్ణుల నూతన దేవాలయ సంప్రోక్షణోత్సవాలను **2012 నవంబర్ 20వ తేదీ నుండి 23వ తేదీ వరకు** నిర్వహించదలచాం. 2012 నవంబర్ 22వ తేదీ, జగద్ధాత్రి పూజ పవిత్ర దినాన భగవాన్ శ్రీరామకృష్ణుల పాలరాతి విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమం జరుపబడును. నాలుగు రోజుల పాటు జరిగే ఈ మహోత్సవాల్లో పాల్గొనడానికి భక్తులకు, శ్రేయోభిలాషులకు ఇదే మా సాదర ఆహ్వానం.

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ వారిచే ఆలయ సంప్రోక్షణ కార్యక్రమం నిర్వహించబడును. ఈ మహోత్సవాల్లో భాగంగా వాస్తుహోమ, ప్రత్యేకపూజ, శోభాయాత్ర, ప్రవచనాలు, భజనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడును. ఈ కార్యక్రమాల్లో వివిధ మత కేంద్రాల నుండి సుమారు 250 మంది స్వామీజీలు, వివిధ ప్రాంతాల నుండి సుమారు 5,000 మంది భక్తులు పాల్గొంటారని అంచనా.

నాలుగు రోజుల పాటు జరిగే ఈ ఉత్సవాలకు సుమారు రూ. 45 లక్షలు వ్యయం అవుతుందని అంచనా. ఈ మహోత్సవాలను విజయవంతంగా నిర్వహించడానికి ఉదార హృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ శక్తికొలది విరాళాలను ఇచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

విరాళాల్ని Ramakrishna Mission, Cuddapah (కడప పేరును బ్యాంకుల్లో Cuddapah గానే సంబోధిస్తున్నారు) పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa - 516 002 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలోని మా అకౌంట్‌కు 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా కూడా మీరు విరాళాల్ని పంపవచ్చు. SBI, RIMS Branch, Ramakrishna Mission, A/c No: 30186936408, బ్యాంక్ కోడ్ : SBIN 0010107. 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా పంపిన విరాళాల వివరాలను మాకు వెంటనే తెలియపరచగలరు.

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.



నిర్మాణంలో ఉన్న దేవాలయం

***గమనిక :*** ఈ ఉత్సవాల్లో పాల్గొనదలచిన భక్తులు, కార్యక్రమ పూర్తి వివరాలను పోస్ట్‌లో పొందాలనుకునేవారు పూర్తి చిరునామాను, ఫోన్ నెంబర్‌తో సహా మా సెల్ నెంబర్: 9248545012 కు SMS ద్వారా తెలియజేయవలసిందిగా మనవి. పూర్తి వివరాలను మా Web site: www.rkm-kadapa.org ద్వారా కూడా పొందవచ్చు. దరఖాస్తు పత్రాన్ని మా వెబ్‌సైట్ నుండి డౌన్‌లోడ్ చేసుకొని ప్రతినిధి వివరాలను నింపి, సభ్యత్వ రుసుము డి.డి.ని జతపరిచి **2012 జూలై 31**వ తేదీలోగా మాకు చేరేలా పంపవలెను.

భగవత్సేవలో

**స్వామి ఆత్మవిదానంద**

కార్యదర్శి

Advt.,



# ఇష్టదేవతారాధనతో ఆధ్యాత్మిక పురోగతి

– స్వామి యతీశ్వరానంద

సాంఘిక జీవితం కోసం మనం ఎంత సమయాన్ని వృథా చేస్తామో! ఇతరుల గురించి ఆలోచిస్తూ ఎంత సమయాన్ని వృథా చేస్తామో! నిజానికి దాన్ని కూడా ధ్యానంలానే చేస్తాం. ధ్యానం ఎంత గాఢంగా ఉంటుందో, ఈ ఆలోచనలు కూడా అంత తీవ్రంగా ఉంటాయి. అయితే ఈ ఏకాగ్రతలో మిథ్యారూపాల మీద, భావాల మీద మనస్సును ఏకాగ్రం చేస్తాం. ఆధ్యాత్మిక జీవితంలో పురోగమించడానికి ఇది సరైన మార్గం కాదు. ఈ తోలుబొమ్మలాట స్థాయి నుండి మనం పైకెదిగి, ఆ బొమ్మల దారాల్ని పట్టుకుని, వాటి చేత నృత్యం చేయించే ఆ ఈశ్వరుణ్ణి చేరుకోవాలి. మన వ్యామోహాలను వదిలించుకుని, నిష్పాక్షికంగా మన అంతరంగం లోలోతుల్ని పరిశీలిస్తే చిత్రవిచిత్రమైన విషయాలు మనలో ఎన్ని జరుగుతున్నాయో గ్రహిస్తాం. తోటివారితో తిరిగి హడావిడి చేసే బదులు, మన ఇష్టదేవత కోసం ఆ కాలాన్ని వెచ్చిస్తే ఎంత అద్భుతమైన ప్రగతిని సాధించేవాళ్ళమో! ఆ తోలుబొమ్మ దారాలను పట్టుకుని ఆడించే భగవంతుడే లేనప్పుడు ఇక ఆ తోలుబొమ్మ ఏపాటిది? వట్టి తోలుబొమ్మలో ఏముంది? మన భావోద్రేకాలన్నింటినీ ఇష్టదైవం మీద కేంద్రీకరించకుండా, ఈ రాగద్వేషాలు, ఇష్టానిష్టాలు ఎందుకు?



మన ఇష్టదేవత ఎప్పుడూ మనలోనే ఉన్నాడు. ఆయన మనల్ని ఎప్పుడూ ఉపేక్షించడు. ఎప్పటికీ హతాశుల్ని చెయ్యడు. మనల్ని దుఃఖంలో పడవేసి, అసంతృప్తికి గురిచేయడు. అయితే అతణ్ణి మనవాడిగా ఎలా చేసుకోవాలో, నిరంతరం ఆయన సముఖంలో ఎలా జీవించాలో మనం నేర్చుకోవాలి. దురదృష్టవశాత్తూ మన ఇష్టదేవత మీద మనకు చాలినంత భక్తి, ప్రేమలు లేక మనం ఎప్పుడూ మనుష్యుల గురించే ఆలోచిస్తూ, ఆ తోలుబొమ్మలకే దాసులుగా ఉంటాం. మనం భగవంతుణ్ణి భక్తి శ్రద్ధలతో ఆరాధిస్తే ఈ వందలాది తోలుబొమ్మల్ని మన 'ఇష్టదేవతలు'గా భావించి మోసపోనక్కర లేదు. ఈ మనుష్యరూపంలోని ఇష్టదేవతలు అందరూ మనల్ని ఈ భౌతికమైన ప్రపంచానికి కట్టిపడవేసి, మన ఆధ్యాత్మిక పురోగతికి అడ్డుపడుతూ ఉంటారు. వీళ్ళందరినీ వదిలించుకుని మనం ఉన్నతంగా ఎదిగినప్పుడే మనకు నిజమైన ప్రేమ అంటే ఏమిటో, ముక్తి అంటే ఏమిటో అర్థం అవుతుంది.

మన ఆలోచనలను గమనిస్తూ ఉన్నట్లయితే మన ఇష్టదేవతకు బదులు ఎన్ని 'ఇష్టాలు' మన భావాలలో, ఆలోచనలలో నిండి ఉన్నాయో మనకే తెలుస్తుంది. మనం మన నిజమైన ఇష్టదేవతనే అంటిపెట్టుకుని, మిగిలిన ఈ మోసపూరితమైన ఇష్టాలన్నింటినీ మన నిజమైన ఇష్టదేవతలో లీనం చెయ్యాలి. ఇది ప్రారంభంలో ఉన్న సాధకులకు ఎంతో బాధాకరంగా తోచవచ్చు. కానీ ఇది తప్ప మరొక పరిష్కారం లేదు.

మన మనస్సులో మన ఇష్టదేవతను ఒక అంతఃప్రవాహంగా నిరంతరం ప్రవహించనివ్వాలి. మనల్ని ఆకర్షించే, వికర్షించే ఇతర అన్ని రూపాల స్థానంలోనూ మన ఇష్టదేవతను నెలకొల్పాలి. అప్పుడు మన జీవితం నిజంగా సంతోషభరితమై, అన్ని మమతానుబంధాలనూ వదిలించుకుని, సార్థకమవుతుంది. ఆశాభంగాలకు ఇకపై ఏ మాత్రం తావుండదు.

కొంతమంది మనుష్యుల్ని తలుచుకొన్నప్పుడు మనం అదిరిపడతాం. కొన్నిసార్లు ద్వేషంతో రగిలిపోతాం. అలాంటి ఆలోచనలు మనలో కలగగానే, వాటి స్థానంలో మన ఇష్టదేవత గురించి ఆలోచనను నింపివేయాలి. మన మనస్సులో కనిపించే వారి రూపాల స్థానంలో వెలుగులీనుతున్న మన ఇష్టదైవం యొక్క రూపాన్ని ప్రతిష్ఠించాలి. ఈ విధంగా చేసినప్పుడు మన శక్తిని వృథా కాకుండా ఆపగలుగుతాం. అంతేకాక ఈ ఇష్టదేవత ఆరాధన మన ఆధ్యాత్మిక పురోగతికి గొప్పగా తోడ్పడుతుంది. ❖ **తెలుగుసేత : ఎమ్. శివరామకృష్ణ**

ఇతరులకు సంబంధించిన విషయాల గురించి తెలుసుకోవడంలో నీ మనస్సును నిమగ్నం చేయకు. ఆధ్యాత్మిక పురోగతిని సాధించాలంటే ఇష్టదేవతను సదా ప్రార్థిస్తూ ఉండు. - *శ్రీశారదాదేవి*



# సమాజ శ్రేయస్సు కోరిన సద్గురువు

– బొప్పన అరుణాదేవి

**వ్యాసుని అవతారం:** మహర్షి శ్రీ మలయాళ స్వాములవారు శ్రీవ్యాసభగవానుని అంశతో జన్మించారు. జన్మతః ధ్యానసిద్ధులు. సంస్కృతభాష పట్ల ఆయనకు మక్కువ. గురుకులంలో వేదవేదాంగాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. తిరుమల గోగర్భ క్షేత్రంలో 12 సంవత్సరాలు కఠిన తపమాచరించి నిరతిశయానంద ప్రాప్తి పొందిన తర్వాత చిత్తూరు జిల్లా ఏర్పేడులో శ్రీవ్యాసభగవానుని పేరుతో ఆశ్రమం నిర్మించి, ధర్మప్రచారం చేశారు.

**అపర శంకరాచార్యులు:** పదునైదేండ్ల కౌమారంలోనే తీవ్రవైరాగ్యంతో ఇల్లు వదిలి భారతదేశమంతా కాలినడకన తీర్థయాత్రలు చేసి దేశ కాలమాన పరిస్థితులను ఆకళింపు చేసుకొన్నారు. అనేక మంది మహాత్ములను దర్శించి, వారి నుండి అనేక ధర్మరహస్యాలను గ్రహించారు. పండితులతో సంస్కృతంలో వేదాంత చర్చలు జరిపారు. తపస్సిద్ధి కలిగిన తర్వాత ఆశ్రమం నెలకొల్పి అనేక గ్రంథాలను రచించారు. ప్రసిద్ధ పండితులతో సంస్కృత గ్రంథాలను తెలుగులోకి అనువదింపజేశారు. సంస్కృత పాఠశాలను స్థాపించి, బ్రహ్మవిద్యను నేర్పించి, ఎందరో బ్రహ్మనిష్ఠులను తయారుచేశారు.

**ఆధునిక బుద్ధదేవుడు:** గాంధీ మహాత్ముని కన్నా ముందుగానే అస్పృశ్యతను నివారించడానికీ, జంతుబలిని అరికట్టడానికీ, మద్యపానాన్ని నిషేధించడానికీ, కులమత విద్వేషాలను అంతమొందించడానికీ, సమత్వాన్ని నెలకొల్పడానికీ కేరళ రాష్ట్రంలో ఉద్యమించిన మహాతపస్వి, సంఘసంస్కర్త, బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడు అయిన శ్రీనారాయణ గురువు పరంపరకు చెందిన మహర్షి తమ పరమ గురువు స్ఫూర్తితో ఆంధ్రదేశాన్ని కార్యరంగంగా చేసుకొన్నారు. సాధకులకు బుద్ధునిలాగా పంచశీలాలను బోధించారు. జాతి, మత, వర్ణ, లింగ భేదం పాటించకుండా అందరికీ వేదాంత విద్యను అందుబాటులోకి తెచ్చారు. ఓంకారాన్ని ఉచ్చరించడానికీ, వినడానికీ అర్హత లేదని భావించబడే నిమ్నజాతుల వారికి సంస్కృతం, సంస్కారం నేర్పించారు. వారు కూడా ఋషి బిడ్డలేనని చాటిచెప్పారు. బ్రహ్మచారులకు క్రమశిక్షణనూ, గృహస్థులకు పవిత్ర జీవనాన్నీ, సాధువులకు ధర్మాచరణనూ నేర్పారు. అహింసా వ్రతాన్ని అందరితో పాటింపజేశారు.

**స్త్రీజనోద్ధారకులు:** స్త్రీల ధర్మాచరణే సమాజానికి శ్రీరామరక్ష అనీ, మహిళలు కూడా ఆధ్యాత్మికంగా పురోగతి సాధించిననాడు జాతి పురోగమిస్తుందనీ నమ్మారు. గృహస్థ ధర్మమంతా ఇల్లాలిపై ఆధారపడి ఉంటుంది కనుక కుటుంబంలో ధర్మసంకటాలు ఏర్పడినప్పుడు వారికి ధర్మశాస్త్రాలు తెలిసి ఉంటే సంసారాన్ని దుఃఖసాగరం కాకుండా కాపాడుకొంటారని భావించారు. తల్లి జ్ఞానవంతురాలైతే సంతానం సద్గుణాలతో, సంస్కారంతో తేజస్సు, యశస్సు పొందుతారని స్వామి అభిప్రాయం. అందుకే కన్యాగురుకులం స్థాపించి స్త్రీలను వేదకాలం నాటి గార్గి, చూడాల, సులభ, మైత్రేయి లాగా విదుషీమణులను చేసి, స్త్రీ జనోద్ధారకులయ్యారు.

**గీతా ప్రచారకులు:** ఆంధ్రదేశంలోని మారుమూల పల్లెలకు కూడా తిరిగి ధర్మప్రచారం చేసి చదువురాని వారికి కూడా భగవద్గీతను చదవడం నేర్పించారు. జ్ఞాన సభలలో సామూహికంగా భగవద్గీతా పారాయణం చేయించారు. ఊరూరా గీతామందిరాలు ఏర్పాటు చేసి, భగవద్గీతను ప్రచారం చేశారు. 'గీతా మకరందం'ను రచించి, గీతాప్రవచనాలు చేసి భగవద్గీతకు అనన్య ప్రచారం చేసిన శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వామి వీరి శిష్యులే. "శ్రీమలయాళస్వామి వారి జీవితమే భగవద్గీతకు భాష్యం" అని స్వామి శివానందులవారు మహర్షిని కీర్తించారు.

**స్వామి వివేకానంద స్ఫూర్తి:** ఆంధ్రదేశంలో శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద భావజాలాన్ని ప్రచారం చేసినవారు శ్రీమలయాళస్వామి. స్వీయముక్తిని కాంక్షించడం కూడా స్వార్థమే అన్న స్వామి వివేకానందుని సిద్ధాంతాన్ని విశ్వసించారు సద్గురువు. అందుకే మోక్షం కోరుకోకుండా ధర్మప్రచారం చేయడానికి అనువైన పునర్జన్మను ప్రసాదించాల్సిందిగా ఈశ్వరుని కోరుకున్నారు. మతాల పట్ల ప్రజలకున్న విపరీత జ్ఞానం వల్లనే ప్రపంచంలో మతకలహాలు జరుగుతున్నాయనీ, అజ్ఞానం కన్నా అదే ఎక్కువ ప్రమాదమని అభిప్రాయపడ్డారు మహర్షి.

ధర్మప్రచారంతో పాటు సంఘసంస్కరణలు చేసి జాతిని జాగృతం చేసిన ఆ మహనీయుని సందేశాలను ఆచరించి, వారి ఋణం తీర్చుకోవాలి. ❖

## పూజ్యశ్రీ శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములవారి శత జయన్తి విశేష సంచిక

పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి శత జయంతి ఉత్సవాలు 2013 ఏప్రిల్ నెలలో జరుగనున్నవి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని పూజ్యశ్రీ స్వాముల వారిని గురించి ఒక విశేష సంచికను ప్రచురించదలచాము. ఈ విశేష సంచికలో ప్రచురించడానికి వ్యాసాలను స్వాగతిస్తున్నాము. వ్యాసాలు 2012 ఆగష్టు 31వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపవలసిందిగా కోరుతున్నాము. వ్యాసాలు ఏ ఏ అంశాలపై వ్రాయాలో, పూర్తి వివరాల కోసం ఈ క్రింది చిరునామాను సంప్రతించండి:

కార్యదర్శి

*శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా–517 640. ఫోన్ : 08578–222239*

**శతజయన్త్యుత్సవ సంఘం**

ధీరవాణి

– స్వామి వివేకానంద

# ఆత్మదర్శనాన్ని ఆకాంక్షించాలి!

మన దృష్టి ఎంత సంకుచితమైంది! ఎంత క్షుద్రమైంది! ఎంత పశుప్రాయమైంది! ఈ దేహాన్ని మించిన కోర్కెను ఎవరూ కోరడం లేదు. అగ్నిలో దూకే మిడతల లాంటి వారం మనం. కోరికలు మనల్ని దహిస్తాయని తెలిసినప్పటికీ ప్రలోభమనే అగ్నిగుండంలో పడిపోతున్నాం. కోరికలెన్నడూ అనుభవించడం వల్ల తీరవు. నెయ్యి అగ్నిని మరింతగా జ్వలింపచేసేటట్లు భోగం కోర్కెను అధికరిస్తుంది.

ఈ సంగతి తెలిసీ జనులు ఇంతకాలం దానిలో పడుతూనే ఉన్నారు. విషయవాంఛలను తీర్చుకోవడానికి ఆ వివిధ వస్తువుల వెంట పరుగెత్తుతున్నారు. ఫలితంగా దుఃఖం పొలవుతున్నారు. అయినా కోర్కెలను విడిచిపెట్టలేక పోతున్నారు. భయంకరమైన ఈ కోర్కెల పీడ నుండి విముక్తి కలిగించే మతాన్ని కూడా వారు కోర్కెలను తీర్చుకోవడానికే సాధనంగా చేసుకొన్నారు. దేహబంధం నుండి, ఇంద్రియాల బంధం నుండి, కోర్కెల ఆధిపత్యం నుండి ఉద్ధరించాల్సిందిగా ఆ సర్వేశ్వరుణ్ణి కోరరు. ఆరోగ్యం కోసం, ఐశ్వర్యం కోసం, దీర్ఘాయువు కోసం ప్రార్థిస్తారు.

మన మనస్తత్త్వం ఇదే. ఆకలిబాధనూ, కామవాంఛనూ తీర్చుకోవడానికి నిరంతరం మనస్సు అనేక ఉపాయాలను వెతుకుతోంది. అనాదిగా జరుగుతోంది ఇదే. దీనిలో ఏనాటికీ అంతం లేని దుఃఖమూ ఉంది; ఈ శారీరక వాంఛలు క్షణికమైన సుఖాన్నీ, దురంత సంతాపాన్నీ తెచ్చిపెడతాయి. పైపొర అమృతమయమై, దిగువన విషం ఉన్న పాత్ర లాంటిది ఇది! అయినా మనం వీటి కోసం ఆరాటపడుతున్నాం.

కర్తవ్యం ఏమిటి? ఈ దారుణ దుఃస్థితిని బాపుకోవడానికి ఇంద్రియాలనూ, కోర్కెలనూ త్యజించడం ఒక్కటే మార్గం. మీరు ఆత్మోన్నతిని కోరే పక్షంలో వైరాగ్యం అనివార్యం. ఇదే సరైన పరీక్ష. ఈ లోకాన్ని, ఇంద్రియాల అసంగత ప్రేరణలను త్యజించండి. ఇక భౌతిక జీవితం వద్దు; అహంకారం వద్దు. నేను ఆత్మను దర్శించాలనే ఈ ఆకాంక్ష బలపడాలి; తీవ్రరూపం దాల్చాలి. ఒకణ్ణి కాళ్ళుచేతులు గట్టిగా కట్టేసి, తర్వాత అతడి నెత్తి మీద కణకణలాడే నిప్పుకణిక పెట్టారనుకోండి. అతడు తన యావచ్ఛక్తితో దాన్ని తొలగించడానికి ఎంతగా గిలగిల లాడతాడో! దహించివేస్తున్న ఈ ప్రపంచాన్ని త్రోసివెయ్యడానికి అలాంటి తపనపడ్డప్పుడు, అంతటి ఆవేదనతో గిలగిలలాడినప్పుడు దివ్యాత్మ దర్శనం తప్పక లభిస్తుంది. ❖






- స్వామి మేధానంద పురి

- ఆరుద్ర శ్రీకాంత్, ముత్తలపల్లి, వరంగల్ జిల్లా.

**? : వేదాంతం ఘోషించే దైవతత్త్వం సాకారమా? లేక నిరాకారమా? శాస్త్రాల ఆధారంతో వివరించగలరు.**

✍: 'ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన' - *(అధ్యాత్మోపనిషత్ 6.3.)*

'నేహ నానాస్తి కించన' - *(కఠోపనిషత్ 4.11); (బృహదారణ్యకోపనిషత్ 4.4.19)*

బ్రహ్మ నిరాకారం, ఏకరసం. అదే ఆత్మరూపంతో ఒకటిగా ఉంది. ఆ నిరాకార నిర్గుణ తత్త్వమొక్కటే ఉంది. నానాత్వము లేదు. అవిద్య వల్ల కనిపించే నానాత్వం అజ్ఞానం తొలగగానే నశిస్తుంది. ఈ తత్త్వం అన్ని బ్రహ్మాండాల్లో వ్యాపించి ఉంది. కానీ శాస్త్ర జ్ఞానం లేనిచో ఆ తత్త్వాన్ని ధ్యానించడం కష్టం.

'దేహధ్యాస ఉన్నవారికి నిరాకార ధ్యానం కష్టమ'ని శ్రీకృష్ణపరమాత్మ చెప్పారు. అందువల్ల దేహధ్యాస ఉన్నవారు అంతటా ఉన్న బ్రహ్మ ఆత్మరూపంతో ఒక్కటైననూ, తన కన్నా భిన్నమైనదిగా ధ్యానిస్తారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥

*(భగవద్గీత 10-10)*

'ఎల్లప్పుడూ ప్రీతిపూర్వకంగా ప్రవర్తిస్తూ, ప్రేమపూర్వకంగా నన్ను సేవిస్తున్న వాళ్ళకు సమ్యక్ దర్శనమనే నా తత్త్వాన్ని పొందడానికి బుద్ధి యోగాన్ని ప్రసాదిస్తాను'.

శ్రీరామకృష్ణ పరమహంస, కాళీమాతను దర్శించిన తరువాత వారికి తోతాపురి నిర్గుణబ్రహ్మ సమాధిని బోధించారు. వెంటనే శ్రీరామకృష్ణులు మూడు రోజులు సమాధిలో ఉన్నారు. వేదాంతపరంగా బ్రహ్మం నిరాకారమే. దాన్ని పొందడానికి ముందు సాకారాన్ని సహాయంగా పొందడం తప్పు కాదు. అందుకే 'భక్తి అనే చల్లదనం వల్ల పరమాత్మ (నిరాకారం) మంచులా గడ్డ కడుతుంది. జ్ఞానమనే తాపం వల్ల మంచు కరిగి నీరవుతుందనీ, సాకార, నిరాకార బ్రహ్మలు ఒక్కటేన'నీ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు. ముక్తి నిరాకార జ్ఞానానుభవం వల్లనే అనేది వేదాంత సిద్ధాంతం.

- ఎం.కె. మూర్తి, సూర్యాపేట.

**? : వివాహం పవిత్రమైనదని అంటారు. ఇటీవల చాలా వివాహాలు విచ్ఛిన్నం అవుతున్నాయి. దానికి కారణాలను తెలియజేయగలరు?**

✍: మనిషి జీవనం ఆత్మానుభవానికే గానీ, విషయవాంఛలు అనుభవించడానికి కాదు. ఒకరిద్దరు సంతానం కలిగిన తరువాత భార్యాభర్తలు అన్నా చెల్లెళ్ళ లాగా జీవిస్తూ సాధనామయ జీవితం గడపాలని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు. ఇటీవల చాలా మంది ధనసంపాదన, విషయభోగాలు, స్వార్థం, అహంకారం, లోభం మొదలైన ప్రాపంచిక విషయాలలోనే జీవిస్తున్నారు. మనిషిలో ఎంతో కొంత దైవభక్తి, పాపభీతి ఉండాలి. అవి లేని రోజున ఎవరు ఎంత చెప్పినా మంచి సలహా బుర్రకెక్కదు. తల్లితండ్రులు సక్రమమైన మార్గంలో దైవభక్తితో జీవిస్తూ, బిడ్డలకు ఆ సంస్కారాలు నేర్పాలి. అంతేగాక చిన్నతనం నుండే పాఠశాలలో ఎంతో కొంత ధర్మాచరణ, నైతికత నేర్పాలి. మనిషి గొప్పతనం విషయభోగాల్లో కాదనీ, ఆధ్యాత్మిక జీవితంలోనే అనీ అందరూ గ్రహించాలి. మన శాసనాధికారుల మీద ఆధారపడకుండా స్వయంగా లోకకల్యాణం చేయ దలచిన వారు ముందుకువచ్చి పిల్లలకు సంస్కృతం, ధర్మ గ్రంథాలు, నైతికత, జీవన విలువలు, మహాపురుషుల జీవన చరిత్రలు నూరిపోయాలి. ఇలా రెండు మూడు తరాలు అంతటా వ్యాపిస్తే, సమాజంలో మార్పు వస్తుంది.

- చామర్తి కనక సుందరం, తాడేపల్లి గూడెం.

**? : బ్రాహ్మణులు సక్రమంగా పితృకార్యాలకు రాలేనట్లయితే, ఏం చేయాలి?**

✍: "శ్రద్ధయా దేయమితి శ్రాద్ధం" - శ్రద్ధతో పితరులకు అర్పించేది శ్రాద్ధం. పితృకార్యాలను నిర్వహించడానికి బ్రాహ్మణుడు సకాలంలో రానట్లయితే, మీ దగ్గరలో ఉన్న బ్రాహ్మణులను పిలిచి, వారికి తృప్తిగా భోజనం పెట్టి దక్షిణలు ఇవ్వాలి. వివరాలకు 'ధర్మసింధు' గ్రంథాన్ని చూడగలరు. ❖



# సకల బలంబులు నీవే!

– శ్రీమతి బి.కృష్ణకుమారి

**అన్నమయ్య పదామృతం**

**సకల బలంబులు నీవే సర్వేశ్వర నాకు**
**అకలంకంబగు సుఖమే అన్నిట నిదే నాకు ॥**

**పొందుగ చక్రాంకితమే భుజబలమిదె నాకు**
**అందిన హరి నీ చింతే ఆత్మబలము నాకు**
**సందడి పేరు బలము కేశవనామము నాకు**
**యిందును నందును భవభయమికలేదిదే నాకు ॥**

**అంగపు తిరుమణులివి పంచాంగ బలము నాకు**
**సంగతి నీపై పాటలె స్వరబలిమిదే నాకు**
**రంగుగ నీ గుణరాసులే రాసి బలము నాకు**
**యింగితముగ నిహపరముల కెదురే దిదే నాకు ॥**

**కనుగొను నీ విగ్రహమే గ్రహబలమిదె నాకు**
**విను నీ దాసుల సేవే వెనుబలి మిదె నాకు**
**తనరిన శ్రీవేంకటపతి దైవబలము నాకు**
**ఘనమే చెప్పగ నింతట కలిగెబో యిదే నాకు ॥**

భగవంతుణ్ణి మించిన బలం, బలగం మనకు మరొకటి లేదు. దినకరతేజుడు, ధరణీనాయకుడైన ఆ దేవాధిదేవుడే దారి చూపే దిక్కు మనకు. విశ్వమంతా ఆ విరాణ్మూర్తికి విసనకర్ర లాంటిది. గ్రహాల గతినే మార్చగల గరుడ వాహనుడు, భక్తుడి కోసం భూమండలాన్నే తలకిందులు చేయగలడు! 'అన్యధా శరణం నాస్తి' అని ఆయననే నమ్ముకుంటే, అంగరక్షకుడై అండగా నిలబడగలడు. ఇలా గ్రహాలు ఆగ్రహించినా, తిథి,వార, నక్షత్రాలు అననుకూలంగా ఉన్నా, పరమాత్ముడు తన పంచన చేరిన వారిని పరిరక్షించుకుంటాడు. అదే భావనతో పదకవితా పితామహుడు అన్నమయ్య **'సకల బలంబులు నీవే సర్వేశ్వరా!'** అంటూ నిర్భయంగా నీరాజనాలర్పిస్తున్నాడు.

ఆ భగవంతుడికి సంబంధించిన ఆలోచనే కావచ్చు; ఆలాపనే కావచ్చు; ఆకారమే కావచ్చు; ఆశ్రయమే కావచ్చు – ఏదైనా మనకు అనంతమైన అభయాన్ని ప్రసాదిస్తుంది. కానీ మనం చాలా సందర్భాల్లో ఆ పరంధాముణ్ణి పూర్తిగా విశ్వసించం. వాస్తు మీదో, వారఫలాల మీదో ఉన్న నమ్మకం మనకు విశ్వేశ్వరుడిపై ఉండదు. పురోహితుడిపైనో, పంచాంగంపైనో ఉన్న గురి పరమేశ్వరుడిపై ఉండదు. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొనే – దైవబలాన్ని మించిన బలం మరేదీ లేదనీ; భుజబలమైనా, ఆత్మబలమైనా, పేరుబలమైనా, పంచాంగ బలమైనా, రాశి బలమైనా, గ్రహబలమైనా – సర్వబలాలకూ ఆయనే ఆలవాలమనీ అన్నమయ్య మరోసారి అభయమిస్తున్నాడు.

## బలాలకే బలం

'ముల్లోకాలలో నేను బలశాలిని. సైన్యం లేకుండా నేను ఒక్కడినే ఏకైక వీరుడనై గొప్ప గొప్ప బలవంతులను జయించాను. నీవు ఎవరి బలం చూసుకొని నన్ను ఎదిరిస్తున్నావు? ఎవరి అండ చూసుకొని నాతో విరోధం పెట్టుకున్నావ'ంటూ ఓ మారు కుమారుడు ప్రహ్లాదుడిపై హూంకరిస్తాడు హిరణ్యకశిపుడు. అప్పుడు ఆ బాలభక్తుడు ఎంతో విశ్వాసంతో...

**బలయుతులకు దుర్బలులకు;**
**బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్**
**బలమెవ్వడు ప్రాణులకును**
**బలమెవ్వండట్టి విభుడు బల మసురేంద్రా!...** అంటాడు.

లోకంలో బలవంతులకూ, బలహీనులకూ ఎవరు బలమో; నీకూ, నాకూ, బ్రహ్మాది దేవతలకూ ఎవరు బలమో; సమస్త ప్రాణికోటికీ ఎవరు బలమో – ఆ పరాత్పరుడే నాకూ బలమంటూ తండ్రికి భగవంతుడి బలాన్ని తేటతెల్లం చేస్తాడు. ఇక్కడ శ్రీనివాసుడి సేవాగ్రగణ్యుడైన అన్నమయ్య కూడా **'సకల బలంబులు నీవే సర్వేశ్వర నాకు; అకలంకంబగు సుఖమే అన్నిటనిదే నాకు'** అంటూ సంకీర్తిస్తున్నాడు. ఆ శేషశాయి ఇచ్చే సుఖంలో ఎలాంటి కలంకం ఉండదని స్పష్టం చేస్తున్నాడు. నిజానికి బాహ్యంగా మనం చూసే బలాలన్నీ స్థిరమైనవి కావు; శాశ్వతమైనవి కావు. ఈ లౌకికమైన సహాయ సహకారాలు, బలాబలాలు క్షణక్షణానికీ మారుతూ ఉంటాయి. శాశ్వతమైన బలాఢ్యుడు ఆ భగవంతుడు ఒక్కడే! ఒక్కసారి ఆయనను ఆశ్రయిస్తే అన్నమయ్య చెప్పినట్లు సకలశక్తులూ ఆయనే ప్రసాదిస్తాడు.

## హరి చింతే ఆత్మబలం

శంఖు, చక్రధారియైన ఆ శ్రీహరికి సర్వసమర్పణ భావంతో అంకితమైతే భక్తుడి భారాన్నంతా తనే మోస్తాడు. శరణాగతిలో ఉన్న గొప్పతనమది. అందుకే శ్రీమద్భగవద్గీతలో...

(మిగతా 32వ పేజీలో...)

**శ్రీకాళహస్తీశ్వరుడి శుభకరమైన నామాన్ని ఎల్లవేళలా తలచే మహాత్ములను గ్రహదోషాలు, చెడు శకునాలు బాధపెట్టగలవా? ఎక్కడైనా మిడతల గుంపు అగ్నిని కప్పివేయగలదా? – మహాకవి ధూర్జటి**



# భాగ్యోదయ దేశం మన భారతదేశం

– హేమంత్ కుమార్

మనది సనాతన ధర్మం. సనాతన సంస్కృతి. రెండూ ఎలా సనాతనం అవుతాయి? మనది మతం కాదు. ధర్మం అన్నారు. సరే. మరి సంస్కృతి? ఈ దేశపు ప్రత్యేకత అది. మన సంస్కృతి, ధర్మానికి అతీతంగా లేదు. ధర్మం పరిధిలోనే ధర్మంతోనే మమేకమై, తల్లీనమై తాదాత్మ్యమై ఉంది. మన సంస్కృతికీ, సదాచారానికీ సంబంధించిన ప్రతి సూక్ష్మాంశం కూడా ధర్మంతో, ఆధ్యాత్మిక భావ సమ్మిళిత కార్యాచరణతో, తత్ సంబంధ వాసనలతో మిళితమై ఉంటుంది. పుట్టింది మొదలు మరణించే వరకు కాదు... పుట్టక ముందు మొదలై మరణించిన చాలా కాలం వరకూ, బహుశా మరణించిన వ్యక్తి యొక్క కుమారుడి జన్మాంతం వరకూ, వ్యక్తికి ఈ ఆధ్యాత్మిక పూరిత సంస్కార సరళి సాగుతూనే ఉంటుంది. గర్భాధానం, పుట్టుక, అక్షరాభ్యాసం, ఉపనయనం, విద్యాభ్యాసం, గురుశుశ్రూష, ఆరోగ్యం, ఆధ్యాత్మిక కార్యక్రమాలు, పండుగలు, పెళ్ళి చివరకు మరణం –ఇలా ప్రతి సంస్కారం, సంస్కృతీ సంప్రదాయ విభాగం ధర్మానికీ, ఆధ్యాత్మికతకూ సంబంధించినవే! వాటి సమ్మేళనంతోనే సుసంపన్నమై ఉంటాయి. అదేదో తెచ్చిపెట్టుకున్న ఆచారమో, కావాలని కలుపుకున్న వ్యవహారమో కాదు. సహజ శాస్త్రీయ దృక్పథంతో, శాస్త్రీయ ఆధారాలతో, శాస్త్రీయ నిర్ధారణలతో, శాస్త్ర సమ్మతంగా సాగుతున్న రథయాత్ర. ఈ దేహం, ఈ జీవితం భగవంతుడు రథసారథిగా, ఆధ్యాత్మిక సంస్కృతీ సంప్రదాయాలు రథచక్రాలుగా నడుస్తున్న రథయాత్ర. ఇందులో భగవంతుడే హృదయం. ఆయనే హృదయగతుడు. హృదయ స్థితుడు.

'భౌతికమైన భోగలాలసల మధ్య అనుభవ ప్రధానంగా బ్రతికే దేశాలను చూశాక పవిత్ర భారతదేశం పట్ల గౌరవం, పూజ్యభావం మరింత పెరిగాయ'ని స్వామి వివేకానంద అన్నారు.

ఈ దేశం నాకేమిచ్చింది? దేశానికి సంబంధించినంత వరకూ ఇంతకంటే అమాయకమైన ప్రశ్న మరొకటి లేదు. భారతీయుడికి ఈ దేశం 'నేను' అనే ఒక ఉనికినీ, స్థిరమైన స్థానాన్నీ ఇచ్చింది. ఒక ఆభిజాత్యాన్నీ, ఒక అభివ్యక్తినీ ఇచ్చింది.

మనుషులకున్నట్లే ఈ దేశంలోని పశు వృక్షాలకూ, పక్షి పర్వతాలకూ, నదీనదాలకూ ఒక సంస్కృతి, సదాచారం ఉన్నాయి. జటాయువు, గరుత్మంతుడు, హంస లాంటి పక్షులు మరే దేశంలోనూ లేవు. కృష్ణ పాదాలను శిరస్సున ధరించిన సర్పాలు మరే దేశానికీ పూజనీయం కాలేదు. భగవంతునికే పూజా పీఠమై పావనమైపోయిన పర్వతాలు, తామే సాలిగ్రామ విగ్రహాలై పూజలందుకునే గిరులు మరో దేశంలో లేవు. మన వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు కేవలం భగవంతుణ్ణి స్తుతించడంతోనే ఆగిపోలేదు. ఆయన సృష్టి జాతమైన ప్రతి అణువు గురించిన పరిజ్ఞానాన్ని మనకు అందించాయి. సృష్టి క్రమానికి వాటి ఉనికి, వ్యవస్థ, ప్రయోజనం, ప్రమాణం, పరిణామం ఎంత సహకరిస్తాయో, ఎంత సౌందర్యాన్ని కూరుస్తాయో మనకు కరతలామలకం చేశాయి.

మనం సహజ సంజాతులం. సంస్కృతీపూరక బీజాలం. త్యాగయోగ పరిపోషిత హోమాలం. శరీరానికి పునఃనిర్మాణశక్తి ఉన్నట్లే మనస్సుకూ సహజ చికిత్సా విధానం ఉంది. ఈ అద్భుత రసపోషణ గర్భస్థ శిశువుకు ముందే భారతీయ ఆధ్యాత్మిక వారసత్వాన్ని అందించింది. పూర్ణయోగి అంటే సంసారాన్ని త్యజించి సన్న్యాసం పుచ్చుకోగలవాడనా? కాదు. కేవలం కాషాయ వస్త్రధారణ వ్యక్తిని సన్న్యాసినో, యోగినో చేయవు. మానవీయ లక్షణాలు, విశ్వ శ్రేయోకామన, వివేకపూర్ణ వైరాగ్యం...! జీవితాన్ని ఒక యాగంలా, యోగంలా భావించి నిర్వహించగలవాడు యోగి. అతడు గృహస్థు కావచ్చు. సన్న్యాసి కావచ్చు. మరేమైనా కావచ్చు. అష్ట భార్యలకు భర్త, పదహారు వేల గోపికలకు ఆత్మభర్త అయిన శ్రీకృష్ణుడు యోగీశ్వరేశ్వరుడు మరి!

మనది భౌతిక ప్రధాన దేశం కాదు. మన సంస్కృతి ఎంత లోతుగా ఉందో, ఎంత ఎత్తుగా ఉందో, అంత విశాలమైనది. నిజానికి లోతు, ఎత్తుల కన్నా విశాలత్వం గొప్పది. ఎందుకంటే విశాలత్వం హృదయగతమైనది. మార్దవంతో, మాధుర్యంతో, ఆర్ద్రతతో, రసంతో కూడుకున్నది. అదృష్టవశాత్తూ భారతీయతకు ఎత్తూ, లోతూ, విశాలత్వమూ – మూడూ అమరి ఉన్నాయి. ఈ అదృష్టం భారతీయుల సొంతం. ఈ వారసత్వానికి కులమతాలతో పని లేదు. లింగ భేదంతో పని లేదు. అమృతపానానికి అందరూ అర్హులే. దాని ఉనికి గ్రహించాలంతే! దాని ఔన్నత్యాన్ని గ్రహించాలంతే. అందుకోవాలంతే! ప్రపంచంలో మరే దేశీయునికీ లేని అమృతతుల్యమైన ఆభిజాత్యాన్ని ప్రసాదించిన ఈ దేశానికి మనం సదా శిరస్సు వంచి నమస్కరించాలి. ❖

సంసారంలో నిస్సంగత్వంతో ఎలా జీవించాలో గురువు బోధిస్తాడు. మనల్ని సంసారబంధాల నుండి విముక్తుల్ని చేయడానికి తోడ్పడతాడు. కానీ అనేక జన్మల సంస్కారాల వల్ల మనలో సంసారాసక్తి సన్నగిల్లకపోవడంతో గురుబోధ అవగాహన చేసుకొనే మనోపరిపక్వత కలగదు. ఒకరైతు తనకు చేసిన సేవలకు ప్రీతి చెందిన గురువు అతడికి స్వర్గ ప్రాప్తిని కలగజేయాలని అనుకుంటాడు. కానీ సంసారాసక్తి వల్ల ఆ రైతు ఆ అవకాశాన్ని వాయిదా వేసుకుంటూ వస్తాడు. చివరికి గురుకృప వల్ల ఆ రైతు స్వర్గ ప్రాప్తిని ఎలా పొందాడో ఈ కథ తెలియజేస్తుంది.

"ఒక మహాపురుషుడు ప్రయాణం చేస్తూ, డస్సిపోయాడు. గొంతు ఎండిపోయింది. దారిలో ఒక రైతు కనపడితే నీళ్ళు అర్థించాడు. ఆ రైతు మహాత్మునికి సకల ఉపచారాలూ చేశాడు.

# సంసారం నుంచి ఉద్ధరించే సద్గురువు

– స్వామి విశుద్ధానంద

చిరిగిపోయిన ఆయన ఉత్తరీయాన్ని రైతు జాగ్రత్తగా కుట్టి, బాగుచేశాడు. రైతు పరిచర్యలకు సంతసించిన ఆ మహాత్ముడు శాంతి, ఆనందాలకు నిలయమైన స్వర్గానికి తనతోపాటు రమ్మని అంటాడు. అందుకు ఆ రైతు 'గురువుగారూ! మీరు నా మీద చూపిన దయకు కృతజ్ఞుణ్ణి. కానీ నా పిల్లలు ఇంకా చిన్నవాళ్ళు. ఓ ఏడేళ్ళ వ్యవధి ఇవ్వండి' అని అడుగుతాడు. అందుకు గురువు అంగీకరించాడు.

సరిగ్గా ఏడేళ్ళ తర్వాత గురువు రైతును స్వర్గానికి తీసుకువెళ్ళడానికి వచ్చాడు. అప్పుడు రైతు 'అయ్యా! కడపటి కొడుకు కష్టాలకు అంతు లేదు. అన్ని జంఝాటాలనూ ఒక్కడే సంబాళించుకోలేకపోతున్నాడు. కాబట్టి మరో ఏడేళ్ళు గడువు ఇవ్వండి' అని గురువుని అడిగాడు. మరో ఏడేళ్ళ తరువాత గురువు వచ్చాడు. కానీ రైతు చనిపోయాడని తెలిసింది. చనిపోయిన ఆ రైతు ఎద్దుగా పుట్టాడని ఆ గురువు తన దివ్య దృష్టితో తెలుసుకున్నాడు. ఎద్దుగా పుట్టిన ఆ రైతు తన కొడుకు పొలాన్నే దున్నుతున్నాడు. అప్పుడు గురువు ఆ ఎద్దుపై మంత్ర జలం చిలకరించగానే ఎద్దు జన్మనెత్తిన రైతు 'నా కొడుకు పరిస్థితి మరి కాస్త మెరుగు పడనీయండి స్వామీ! మరో ఏడేళ్ళు గడువు ఇవ్వండి' అని అన్నాడు. ఇక చేసేది లేక వెనుదిరిగాడు గురువు.

మరలా ఏడేళ్ళ తర్వాత వచ్చిన గురువుకు ఎద్దు చనిపోయిందని తెలిసింది. అది కుక్కగా పుట్టి కొడుకు ఇంటినీ, ఆస్తినీ కాపలా కాస్తోందని తన దివ్యదృష్టి ద్వారా తెలుసుకున్నాడు గురువు. కుక్కగా పుట్టిన ఆ రైతు 'స్వామీ! నేను ఎంత దౌర్భాగ్యుణ్ణి. మీరు ఇంత దయ చూపుతున్నప్పటికీ మీతో స్వర్గయానం చేయలేకున్నాను. వీడికి ఆస్తిని కాపాడుకొనే దక్షత ఇంకా రాలేదు. కాబట్టి దయ చేసి మరో ఏడేళ్ళు వ్యవధి ఇవ్వండి' అని వేడుకున్నాడు.

గురువు ఏడేళ్ళ తరువాత మళ్ళీ వచ్చేసరికి కుక్క మరణించింది. అది త్రాచుపాముగా జన్మనెత్తి, ఇప్పుడు కొడుకు భూమిలో ఉన్న లంకెబిందెలకు పడగెత్తి కాపలా కాస్తోంది. గుప్త ధనం ఇక్కడ ఉందని కొడుకుకి ఎలా తెలియజేయాలా అని



పాము ఆలోచిస్తున్నప్పుడు, గురువు ఆ రైతుకొడుకును పిలుచుకు వచ్చి లంకె బిందెలు ఉన్న చోట తవ్వమన్నాడు. లంకె బిందెలు బయటపడ్డాయి. ఆ పైన ఆ పామును చంపమన్నాడు. అనంతరం శిష్యుణ్ణి తీసుకొని స్వర్గారోహణం చేశాడు గురువు.

సంసారంలోని ఈతి బాధల నుండి శిష్యుణ్ణి ఉద్ధరిస్తాడు సద్గురువు. నిజానికి సంసారబంధనాలు వదలించుకోవడం అత్యంత కఠినం. నానాటికీ అవి గట్టిపడతాయి కానీ సడలవు.

**గతాగతేన శ్రాంతోఽస్మి దీర్ఘ సంసార బంధనాత్ ।**
**గర్భవాసే మహాదుఃఖం త్రాహి మాం మధుసూదన ॥**

'సుదీర్ఘ సంస్కార బంధనాల మూలంగా ఈ సంసారంలో ప్రవేశిస్తున్నాను, నిష్క్రమిస్తున్నాను. జన్మ అన్నది ఎంతో బాధాకరమైనది. నేను అలసిపోయాను. మధుసూదనా! నన్ను ఉద్ధరించు ప్రభూ!' అని దుర్భరయాతనలు కలిగినప్పుడు మాత్రం రక్షించమని విలపిస్తూ భగవంతుణ్ణి ప్రార్థిస్తాం.

కానీ మనకు సంసారం పట్ల ఎంత ఆసక్తి అంటే, అనుభవించిన కష్టాలను మరచిపోతాం. సంసారానికి మూలం ఆసక్తి. దాన్ని తొలగించుకోవాలి. ప్రహ్లాదుని లాగా అనన్య భక్తితో భగవంతుణ్ణి ప్రార్థించినప్పుడు భక్తుల కొరకు ఆయనే స్వయంగా వచ్చి, ఆపదల నుండి మనల్ని రక్షిస్తాడు. ❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

శిష్యుడు కోరే వరాలన్నింటినీ గురువు ప్రసాదిస్తాడు. ఎన్ని వ్యయప్రయాసలనైనా సహించి శిష్యుణ్ణి బ్రహ్మమార్గంలో నడిపించడానికి వెనుకాడని గురువు 'ఉత్తమ గురువు'. - శ్రీరామకృష్ణ పరమహంస



*(...గత సంచిక తరువాయి)*

# ఓంకారం దేనికి సంకేతం?

ఓంకారాన్ని వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా రాస్తూ ఉంటారు. అయితే, సర్వసాధారణంగా ఎక్కువ మంది గణేశుడి ఆకారానికి ప్రతీకైన 'ఓమ్' **(ॐ)** అని రాయడం చూస్తుంటాం. ఆ చిహ్నంలో పై వక్రరేఖ గణేశుడి శిరోభాగానికీ, కింద పెద్దదిగా ఉండే రేఖ గణేశుడి ఉదరానికీ, పక్కన ఉండేది వినాయకుడి తొండానికీ, పైన చుక్కతో ఉండే అర్ధ చంద్రాకారం వినాయకుడి చేతిలోని ఉండ్రాళ్ళకూ ప్రతీకలు.

మరింత లోతుగా చెప్పాలంటే, దిగువన ఉండే పెద్ద వంపు జాగృత స్థితి. ఆ స్థితిలో ఇంద్రియాలన్నీ చక్కగా పనిచేస్తాయి. ఈ పెద్ద వంపు సర్వసాధారణమైనది. ఇది మనిషి చైతన్య స్థితిని తెలియజేస్తుంది.

ఇక, పైన ఉండే వంపు సుషుప్తి (గాఢ నిద్ర) అవస్థను, మరోమాటలో చెప్పాలంటే అచేతన స్థితిని తెలియజేస్తుంది. ఆ స్థితిలో వ్యక్తి కోర్కెలను అధిగమించి ఉంటాడు.

మధ్యలో ఉండే మూడో వంపు - స్వప్న స్థితి. ఆ స్థితిలో వ్యక్తి ఆత్మ అంతర్ముఖంగా ఉంటుంది. అతను తన రెప్పల వెనుక నుంచే ఈ ప్రపంచాన్ని వీక్షిస్తాడు.

కాగా, అందులోని బిందువు వ్యక్తి చేతనలోని నాలుగో స్థితిని తెలియజేస్తుంది. సంస్కృతంలో దీన్ని తురీయ (సమాధి) స్థితి అంటారు. ఈ స్థితిలో అటు అంతర్ముఖంగా కానీ, ఇటు బాహ్య ముఖంగా కానీ, లేదంటే ఆ రెండూ కలిసిన స్థితిలో కానీ చేతన ఉండదు. అన్ని ఇంద్రియాలూ విశ్రాంతి పొందుతుంటాయి. ఆధ్యాత్మిక స్థితి అంతిమ లక్ష్యంగా, పూర్తి ప్రశాంతంగా, ఆనందంగా మనస్సు ఉంటుంది. పూర్తిగా ఈ ప్రపంచంతో సంబంధం లేకుండా ఉంటుంది.

ఇక, ఓంకార చిహ్నంలో కనిపించే అర్ధ వృత్తాకారమనేది మాయకు ప్రతీక. ఈ అర్ధవృత్తం పైనే ఉన్నప్పటికీ, బిందువుతో సంబంధం లేకుండా ఉంటుంది. మిగిలిన మూడు వంపుల నుంచి బిందువును అది వేరు చేస్తుంటుంది. అత్యున్నతమైన ఆత్మానందం పొందడానికి వీలు లేకుండా ఈ మాయ అనేది మనల్ని ఆటంకపరుస్తూ ఉంటుంది.

ఆ రకంగా, ఓంకారం జీవిత గమనానికీ, లక్ష్యానికీ, దాని వెనుక ఉన్న సత్యానికీ, భౌతిక ప్రపంచానికీ, అన్ని రకాల రూపాలకూ, రూపరాహిత్యానికీ సంకేతం. విశ్వమంతటికీ వ్యాపించిన ఈ ఓంకార చిహ్నం ఆధ్యాత్మిక వాస్తవికతకు మూలం. భగవంతుడు ముందుగా శబ్దాన్ని సృష్టించాడనీ, దాని నుంచి వెలువడే తరంగాలన్నీ ఈ ప్రపంచమంతటా వ్యాపించాయనీ భారతీయ ఆధ్యాత్మికవేత్తలు చెబుతారు. 'ఓం' అనే శబ్దం నుంచే పదార్థం జనించిందంటారు. శబ్ద రూపంలో ఉన్న భగవంతుడే 'ఓం' అని ఉపనిషత్తులు తెలియజేస్తున్నాయి.

ఓంకారాన్ని ఉచ్చరించడం వల్ల ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని చివరకు శాస్త్రవేత్తలు సైతం అంగీకరించారు. కేవలం యోగాసనాలు వేయడం వల్ల, వ్యాయామం చేయడం వల్ల మన బుద్ధి పనిచేసే తీరు పూర్తిగా ప్రభావితం కాదు. ఓంకారాన్ని ఉచ్చరించడం వల్ల మనస్సులో పేరుకుపోయిన వాసనలన్నీ తొలగిపోతాయి. సంపూర్ణ ఆరోగ్యం కలుగుతుంది. అందుకే, ప్రతి ఒక్కరూ ప్రణవాన్ని ఉచ్చరించాలి, ధ్యానించాలి. ఆవిధంగా మానసిక, ఆధ్యాత్మిక ఆనందాన్ని పొందవచ్చును. ❖

(వచ్చే సంచిక నుండి 'శిఖ పెట్టుకోవాలా? ఎందుకు?')

## పండుగలు - పర్వదినాలు

**జూలై - 2012**

| | | |
|---|---|---|
| 03 | మంగళవారం | : గురుపూర్ణిమ |
| 14 | శనివారం | : ఏకాదశి |
| 17 | మంగళవారం | : స్వామి రామకృష్ణానంద జయంతి |
| 29 | ఆదివారం | : ఏకాదశి |

**ఆగస్టు - 2012**

| | | |
|---|---|---|
| 02 | గురువారం | : స్వామి నిరంజనానంద జయంతి |
| 09 | గురువారం | : శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 13 | సోమవారం | : ఏకాదశి |
| 16 | గురువారం | : స్వామి అద్వైతానంద జయంతి |
| 27 | సోమవారం | : ఏకాదశి |




# గుప్తయోగి

శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

ఈ ముసలోడు ఎప్పుడు పోతాడా ఉన్నదంతా పంచేసుకుందామని ఆ కుటుంబ సభ్యులు ఆరాటపడలేదు. దేహ పరిత్యాగం చేసిన ఆ మహనీయుడు పదిలంగా దాచుకున్న డైరీని చదవాలని ఆరాటపడ్డారు. ఆ డైరీని చదివి వారి కళ్ళు ఆనందాశ్రువులు రాల్చాయి. ఆ డైరీ నిండా ఆయన పొందిన భగవంతుని దర్శనాలు, కలలు, అనుభూతుల వర్ణన. సీస, కంద ఛందస్సులలో రచించిన వేదాంత భావాల పద్యాలతో నిండిన ఆధ్యాత్మిక జ్ఞాన సంపద అది. అందుకే వారి కళ్ళు ధారలు కట్టాయి. పగలంతా తమ కోసం రెక్కలు ముక్కలు చేసుకున్న ఈయన రాత్రి సమయాన్ని భగవంతుని కోసం వెచ్చించాడా అని వారు ఆశ్చర్యపోయారు. అందుకే ఆయనతో అనుబంధం పెంచుకున్న ఆ కుటుంబ సభ్యులు, ఆయనను అనుసరించినవారు సైతం సన్మార్గంలో పయనిస్తారనడానికి ఎలాంటి సందేహం లేదు. వివరాలలోకి వెళితే – ఆయన పేరు మలపాక శ్రీరామమూర్తి. భీమవరం పట్టణంలో 1907లో జన్మించారు. ఆయుర్వేద వైద్యాన్ని అభ్యసించిన ఆయన 1931లో ఒక స్వప్నదర్శనంలో తణుకు వెళ్ళి స్థిరపడమన్న దివ్యాదేశంతో తణుకులో స్థిరపడ్డారు.


డాక్టర్ మలపాక శ్రీరామమూర్తి

సంసారంలో ఉండే సాత్త్విక గృహస్థ భక్తుల గురించి శ్రీరామకృష్ణులు ఇలా చెప్పేవారు: "అతను బాహ్యంగా ఎవరికీ తాను భక్తుడననే విషయం తెలియనివ్వడు. అతి గోప్యంగా జప, ధ్యాన సాధనలు చేస్తాడు" అని అన్నారు. అలాంటి శ్రీరామకృష్ణ భక్త బృందంలో శ్రీరామమూర్తిగారు కూడా ఒకరు.

ఆయుర్వేద వైద్యంలో శ్రీరామమూర్తిగారు సిద్ధహస్తులు. ధనవంతుల వద్ద ధనం స్వీకరించినా, స్వామి వివేకానంద భావాలను పుణికి పుచ్చుకున్న ఆయన పేదలకు ఉచితంగా వైద్యం చేసేవారు. మంచి వైద్యునిగా పేరుప్రతిష్ఠలు అపారంగా వచ్చినా, అహంకారం, దర్పం మచ్చుకైనా కనిపించేవికావు. ఒకసారి తాలూకా ఆఫీసులో మునసబుకు బాగా అనారోగ్యం చేస్తే, శ్రీరామమూర్తిగారి వైద్యంతో త్వరగా నయమైంది. కృతజ్ఞతాపూర్వకంగా ఆయన వెండి నాణేలతో నిండిన వెండిపళ్ళాన్ని సమర్పించారు. ఆ ధనమంతా సేవాకార్యక్రమాలకు వెచ్చించిన భక్తుడు శ్రీరామమూర్తిగారు. విశాఖలోని రామకృష్ణ ఆశ్రమానికి వచ్చే పూజ్య స్వామి నిశ్శ్రేయసానందజీ మహరాజ్ సాంగత్యంతో మూర్తిత్రయం పట్ల భక్తిప్రపత్తులు పెంపొందించుకున్నారు.

తణుకులో శ్రీరామకృష్ణ సేవాసమితిని ప్రారంభించడమే కాకుండా సమితి కార్యదర్శిగా దాదాపు నలభై ఏళ్ళు ఆ బాధ్యతను సమర్థంగా, దీక్షతో నిర్వహించారు. 1940–42 ప్రాంతంలో రెండో ప్రపంచ యుద్ధ కారణంగా విశాఖపట్నంలోని శ్రీరామకృష్ణ ఆశ్రమాన్ని తాత్కాలికంగా తణుకుకు తరలించారు. ఆ ఆశ్రమ కార్యదర్శిగా స్వామి నిశ్శ్రేయసానందజీ తణుకులోనే ఉంటూ శ్రీరామమూర్తిగారి సహకారంతో భావప్రచార కార్యక్రమాలు నిర్వహించారు. మళ్ళీ సాధారణ పరిస్థితులు ఏర్పడ్డాక శ్రీరామకృష్ణ ఆశ్రమాన్ని విశాఖపట్నానికి మార్చారు.

తణుకులో శ్రీరామకృష్ణ ఆశ్రమం ఉన్నప్పుడు 100 మంది పిల్లలతో వసతిగృహాన్ని ఏర్పాటు చేసి, సమర్థంగా నిర్వహించారు. ఆ విద్యార్థులందరికీ శ్రీరామమూర్తిగారు ఉచిత వైద్యం చేసేవారు. పరమపూజ్య స్వామి విరజానందజీ మహరాజ్ వారి వద్ద మంత్రదీక్ష స్వీకరించడం, స్వామి నిశ్శ్రేయసానందజీ సాంగత్యం ఆయన ఆధ్యాత్మిక జాగృతికి తోడ్పడ్డాయి. కుటుంబ సభ్యులకు పంచి ఇచ్చిన ఆధ్యాత్మిక జ్ఞానసంపద వల్లనేమో ఆయన మనుమరాళ్ళు ఇద్దరూ సన్న్యాసాశ్రమం స్వీకరించి, శారదామఠంలో మాతాజీలుగా తమ జీవితాన్ని ధన్యం చేసుకుంటున్నారు.

అలాగే ఇద్దరు కుమార్తెలలో పెద్ద కుమార్తె పన్నెండేళ్ళ వయస్సులో తండ్రి శ్రీరామమూర్తి రామనామాన్ని స్మరిస్తుంటే వింటూ, తాను రామనామాన్ని ఉచ్చరిస్తూ చిరునవ్వుతో ప్రాణం విడిచింది. కన్నకూతురి మరణం కూడా ఈ భక్తుని వదనంలోని ప్రశాంతతను చెదరనీయలేదు. ఆయన స్థితప్రజ్ఞతకు ఇదొక నిదర్శనం.

శ్రీరామమూర్తిగారు భౌతిక శరీరాన్ని వదిలేరోజు 'నేను ఈ రోజు సూర్యాస్తమయ సమయానికి అస్తమిస్తాను' అని కుటుంబ సభ్యులతో చెప్పారు. శ్రీరామమూర్తి మరణ సమయం ఆసన్నమవుతున్నప్పుడు ఆయన తన కోడలిని పిలిచి 'శారదా మాతను మరువవద్దు' అని చెప్పారు. అలాగే దక్షిణాఫ్రికాలో ఉన్న స్వామి నిశ్శ్రేయసానందజీకి కనిపించి 'స్వామీజీ! నేనిక శెలవు పుచ్చుకుంటున్నాన'ని కూడా చెప్పారు. ఆయన చెప్పినట్లే తన 76వ ఏట 1983 జనవరిలో శ్రీరామమూర్తి శ్రీరామకృష్ణైక్యం చెందారు. ❖

సేకరణ: డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి
అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

పరుసవేది స్పర్శతో బంగారంగా మారిన ఇనుమును నేలలో పాతిపెట్టినా, దాని స్థితి మారదు. అలాగే భగవంతుణ్ణి స్పృశించిన భక్తుడు ప్రపంచంలో ఉన్నా ఏ కళంకమూ అతణ్ణి అంటదు. - శ్రీరామకృష్ణులు



**పరోపకృతి కైవల్యే**
**తులయిత్వా జగద్గురుః ।**
**గుర్వీం చో పకృతిం మత్వా**
**అవతారాన్ దశాగ్రహీత్ ॥**

వైకుంఠ నిలయుడూ, జగద్గురుడూ అయిన శ్రీమన్నారాయణునికి ఒకనాడు ఒక సందేహం కలిగిందట! వైకుంఠంలో లక్ష్మీదేవి తనను సేవిస్తూ ఉండగా అలా హాయిగా కాలం గడపడం మంచిదా? లేక సృష్టిలో బాధపడే జీవుల బాధలను పోగొట్టి వారికి ఉపకారం చేయడానికి పూనుకోవడం మంచిదా? ఈ రెండు అభిప్రాయాలనూ ఒక త్రాసులో వేసి తూచగా పరోపకారం వైపే త్రాసు మొగ్గు చూపిందట! అందువల్ల లోకోపకారం చేయాలని నిశ్చయించుకొని పది అవతారాలు దాల్చి దుష్టులను శిక్షించాడు. శిష్టులను రక్షించాడు. ధర్మాన్ని నెలకొల్పాడు అని పై శ్లోకం నుండి తెలుస్తోంది.

అవతారం అంటే దిగుట, రేవు, కోనేరు ఇత్యాదిగా పలు అర్థాలు ఉన్నాయి. విశ్వవ్యాపి అయిన భగవంతుడు భక్తులను అనుగ్రహించడానికై సగుణ సాకార రూపంతో లోకానికి దిగి రావడాన్ని మనం 'అవతార'మని భావిస్తున్నాం.

మత్స్యం, కూర్మం, వరాహం, నరసింహుడు, వామనుడు, పరశురాముడు, రాముడు, బలరాముడు లేదా కృష్ణుడు, బుద్ధుడు, కల్కి అనేవి పురాణ ప్రసిద్ధాలైన దశావతారాలు. వీటికి సంబంధించిన కథలు ఆ యా పురాణాలలో విపులంగా ఉన్నాయి. పై అవతారాలే కాక సుయజ్ఞుడు, కపిలుడు, దత్తాత్రేయుడు, సనకాదులు, నరనారాయణులు, ధ్రువుడు, పృథువు, వృషభుడు, హయగ్రీవుడు, హంస, మనువు, ధన్వంతరి, వ్యాసుడు ఇత్యాదిగా మరికొన్ని అవతారాల ప్రస్తావన భాగవతంలో కనిపిస్తుంది.

దశావతారాలు, చతుర్వింశతి అవతారాలే కాక లీలావతారాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయని భాగవతంలో ఒకచోట చెప్పడమైంది.

విష్ణువు దాల్చిన అవతారాలనే పురాణాలలో ప్రశస్తంగా పేర్కొన్నారు. శివునికి అవతారాలు లేవా? అని కొందరు ప్రశ్నిస్తారు. శివావతారాలు కూడా కొన్ని శివపురాణాదులైన గ్రంథాలలో వర్ణితమై ఉన్నాయి. కానీ లయ కర్త అయిన శివుని కంటే పోషణకర్త అయిన విష్ణువునకు జగద్రక్షణ బాధ్యత ఎక్కువ కాబట్టి ఆ దేవుని అవతారాలే పురాణ ప్రసిద్ధాలయ్యాయని భావించవచ్చు.

## శ్రీరామకృష్ణ అవతారం

భగవద్గీతను అనుసరించి చూస్తే ధర్మానికి హాని కలిగినప్పుడు భగవంతుడు అవతరిస్తాడని తెలుస్తోంది. అందుకే అన్నమయ్య తనదైన చమత్కార ధోరణిలో

**అదరి ధర్మమునెడి అధర్మమైనా మేలు**
**వెడగు మునులు - విన్నవింతురు నీకు**
**తడవి ధర్మము నిల్ప - ధరణి బుట్టుదు నీవు**
**బడి నిన్ను సేవించి బ్రతుకుదు మపుడే**

అని ఆధ్యాత్మిక సంకీర్తనలలో పాడాడు.

అవతారాలలో పలు భేదాలున్నాయి. అంశావతారాలు, పూర్ణావతారాలు, కళావతారాలు, లీలావతారాలు, దివ్యావతారాలు, భౌమావతారాలు, అర్చావతారాలు, అంతర్యామ్యవతారాలు, విభవావతారాలు, కల్యాణగుణావతారాలు - ఇత్యాదులు.

ఐశ్వర్యం, ధర్మం, కీర్తి, సౌందర్యం, జ్ఞానం, వైరాగ్యం ఇత్యాది గుణాలను పై అవతారాలు సువ్యక్తంగా ప్రదర్శిస్తాయి.

కృతయుగంలో మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామనావతారాలు ఐదు ఆవిర్భవించాయి. త్రేతాయుగంలో పరశురామ, శ్రీరామావతారాలు వచ్చాయి. ద్వాపరంలో బలరామ -కృష్ణావతారాలు సంభవించాయి. కలిలో బుద్ధ, కల్క్యవతారాలలో ఒకటి ఆవిష్కృతం కాగా మరొకటి రానున్నదని పురాణ వాఙ్మయం తెలుపుతోంది.

'ధర్మం నాలుగు పాదాలపై నడిచే కృతయుగంలో ఐదుసార్లు భగవంతుడు అవతరించవలసిన అవసరం ఎందుకు వచ్చింది?' అని ప్రశ్నించే వారున్నారు. బహుశః ఆ యుగంలో ధర్మానికి ఏ

మాత్రం క్షతి లేకుండా జాగరూకత వహించాలి కాబట్టి అన్నిసార్లు అవతరించవలసి వచ్చిందేమో!

బుద్ధావతారం విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. పురాణాలలో వర్ణించబడిన బుద్ధుడే అవతారమని కొందరు, చారిత్రక బుద్ధుడే అని మరికొందరు అభిప్రాయపడుతున్నారు.

పైన పేర్కొన్న వివిధ అవతారాల స్థితిగతులు ఇలా ఉండగా, స్వామి వివేకానందులు....

**స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మ స్వరూపిణే ।**
**అవతారవరిష్ఠాయ రామకృష్ణాయతే నమః ॥** అని శ్రీరామకృష్ణుల వారిని 'అవతార వరిష్ఠుని'గా వర్ణించారు. అంటే అవతారాలలో శ్రేష్ఠమైన అవతారమని అర్థం.

శ్రీరామకృష్ణావతార విశిష్టత మాటలకు అందనిది. అయినా మన ఊహకు అందినంత వరకూ దాన్ని గురించి భావించడం తప్పు కాదనుకుంటాను.

# తత్త్వం... అవలోకనం

– డా॥ సముద్రాల లక్ష్మణయ్య

లోకం అర్చావతారాదులైన బాహ్యమూర్తులను అర్చించడానికి అలవాటు పడింది. అందువల్ల ప్రతి జీవిలోనూ నిగూఢంగా ఉన్న అంతర్యామి స్వరూపాన్ని ఆరాధించడంలో అశ్రద్ధ వహించింది. ఈ విషయాన్ని భాగవతం కూడా ఇలా నిర్దేశించింది.

**అహం సర్వేషు భూతేషు భూతాత్మావస్థితస్సదా ।**
**తమవజ్ఞాయ మాం మర్త్యః కురుతేఽర్చావిడంబనమ్ ॥**

*(భాగవతం – 3.29.21)*

అంతర్యామి స్వరూపాన్ని కాదని అర్చారూపాలకు ప్రాముఖ్యం ఇవ్వడం వల్ల సమాజంలో అస్తవ్యస్త పరిస్థితులు సంభవించాయి. ప్రతివ్యక్తిలోనూ ఉన్న పరమాత్మను గుర్తింపజేయడానికై శ్రీరామకృష్ణావతారం అవసరమైంది. అందువల్లనే 'దరిద్ర నారాయణోభవ' – 'దరిద్రుణ్ణి కూడా నారాయణ స్వరూపంగా భావించు' అని రామకృష్ణ మతం ఎలుగెత్తి చాటింది. శ్రీరామకృష్ణుల ప్రేమప్రవాహం ఆచండాలం అప్రతిహతమై ప్రసరిస్తుంది.

'సమబుద్ధే అందరికీ సర్వవేదసారము' అని అన్నమయ్య పాట. కానీ సమబుద్ధిని పాటించిన వారెంతమంది? విషమ బుద్ధులు వికటాట్టహాసం చేసే రోజుల్లో 'సమబుద్ధిని' ఆచరణలోకి తేవడానికి శ్రీరామకృష్ణుల దివ్యావతారం లోకానికి ఆవశ్యకమైంది. సమాజంలో కొన్ని వర్గాలకే పరిమితమై ఉన్న వేదవిజ్ఞానాన్ని ఆ అవతారం అందరికీ అందుబాటులోకి తెచ్చింది.

మరొక ముఖ్యాంశం – సర్వమత సమన్వయం. భగవద్గీతలో 'యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ – నన్ను ఎవరు ఏవిధంగా సేవిస్తారో వారిని నేను ఆవిధంగానే అనుగ్రహిస్తాను' అని భగవంతుడు ఉద్ఘోషించాడు. కానీ మన మతాచార్యులు 'నా' మతం గొప్ప, నీ మతం తక్కువ అనే ధోరణిలో పరస్పర నిందారోపణలు చేసుకున్నారు. ద్వైతాద్వైత, విశిష్టాద్వైతాలే కాక జైన బౌద్ధాది మతాలలో సైతం సమన్వయదృష్టి లోపించింది.

శ్రీరామకృష్ణుల దివ్యావతారంతో ఈ సమన్వయదృష్టి మళ్ళీ ప్రతిష్ఠితమైంది. చికాగోలో జరిగిన విశ్వమత మహాసభలో స్వామి వివేకానంద ఎలుగెత్తిచాటిన సర్వమత సమన్వయదృష్టి శ్రీరామకృష్ణుల దివ్యప్రసాదమే.

శ్రీరామకృష్ణుల మతమెట్టిదో వివరిస్తూ ఒకచోట సద్గురు శ్రీ మలయాళస్వామి ఇలా వ్రాశారు:

"శ్రీరామకృష్ణులు వేద మాత యగు పరాశక్తి కృపచేత దివ్యజ్ఞానము గలవారై, ఆత్మవిద్యాప్రభావము చేతనే మతాన్ని ఉపదేశించారు. ఇదే తక్కిన మతాచార్యుల కన్న ఈ మహానుభావునికి గల్గియుండు మహిమ విశేషము. శ్రీరామకృష్ణుల మతము కేవలము జ్ఞానమతము. వీరు భక్తి చేతనైనను, జ్ఞానము చేతనైనను, రాజయోగము చేతనైనను, కర్మయోగము చేతనైనను ఈశ్వరుని పొందవచ్చునని ఉపదేశించినారు" *(ధర్మసేతువు)*

ధర్మగ్లాని అవతారానికి కారణమవుతుంది. పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం వల్ల సనాతన ధర్మానికి హాని కలుగనున్న సమయంలో శ్రీరామకృష్ణులు అవతరించారు. 'స్వీయ మోక్షానికి మాత్రమే పాటుపడటం తగదు. జగద్ధితానికి కూడా శక్తివంచన లేకుండా ప్రయత్నించాలి' అన్న లోకోత్తర ధర్మాన్ని బోధించడానికి శ్రీరామకృష్ణులు అవతరించవలసి వచ్చింది. వారి అవతారంతో వసుధైక కుటుంబ భావన అంకురించి, పల్లవించి, కుసుమించి ఫలించింది.

శ్రీశారదా రామకృష్ణులు దివ్య దంపతులు. శ్రీశారదామాత భారతనారీమణులలోనే కాక విశ్వమంతటా గల మహిళాలోకంలో ఆధ్యాత్మిక స్ఫూర్తి కలిగించింది, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింప జేసింది. లౌకిక సుఖానుభవకాంక్ష లేశమైనా లేని దివ్యదాంపత్యం వారిది.

**మునుపు మహేశ్వరుండు తపమున్ బొనరింపుచు శైలకన్యకన్**
**గని మది నిగ్రహమ్మొసెడి కామవికారమునొందె నట్టుగా**
**కనుపమ నిష్ఠబూని తన యంగన శారదనంటకుండె నే**
**యనఘ చరిత్రుడట్టి మహితాత్ము దలంచెద రామకృష్ణునిన్** *(స్వీయం)*

అన్నట్లు లోకాతీతమైన దివ్యత్వం వారి జీవితాలలో నిండి నిబిడీకృతమైంది.

*(మిగతా 35వ పేజీలో...)*

శ్రీరామకృష్ణులు పరిపూర్ణులు. సర్వదేవదేవీ స్వరూపాలలో వ్యక్తమయ్యేది గురుదేవుల దివ్యతేజమే. సర్వమంత్రముల సారమూ, సకల జీవరాసుల యందు వసించునదీ గురుదేవులే. – *శ్రీశారదాదేవి*

మాయాబజార్

# భరతఖండంలో భక్తి వెల్లువ!

– స్వామి శితికంఠానంద

సురలు పేరోలగం తీరి ఉన్నారు. అమరేంద్రుడు ఆర్యసంతతి అనాలోచిత జీవన విధానం వలన కలిగిన అనర్థాన్ని తలపోస్తూ అన్యమనస్కంగా సింహాసనాధిష్ఠితుడై ఉంటాడు. పునర్జన్మనే నమ్మని వారికి జన్మాంతర శిక్షలని చూపించి ధార్మిక మార్గాన్ని అనుసరింపజేయటం అసాధ్యమని గ్రహిస్తాడు. ప్రజలలో పాపభీతిని కల్గించి భగవద్భక్తిని పెంపొందించడం కూడా అంత సులువేమీ కాదని సురపతికి విదితమవుతుంది. దేవగురువు బృహస్పతి వైపు తిరిగి తన సంశయాన్ని నివృత్తి చేయమని ఇలా అడుగుతాడు.

**ఇంద్రుడు:** గురువర్యా! ఏ విధంగా ఈ కలియుగంలో భరతసంతతి నిజమైన ఆధ్యాత్మిక మార్గాన్ని అవలంబించేటట్లు చేయగలమో సెలవివ్వండి.

**బృహస్పతి:** అమరాధీశా! జంబూద్వీపవాసులు సత్యాన్వేషణ తత్పరులుగా లేరని మనం అనుకోవలసిన అవసరం లేదు. కలియుగం కాబట్టి మిగతా యుగాలలోలాగా పెద్ద సంఖ్యలో ఉండక పోయినా భరతభూమిలో జిజ్ఞాసువులు లేని కాలమే లేదు. మనం ఈ విషయాన్ని ఇంతకు ముందు కూడా చర్చించాము.

**దేవలుడు:** ఇప్పుడు భూలోకం సందర్శించి వస్తే ఒక విషయం మనకు బోధపడుతుంది. అన్ని పుణ్యక్షేత్రాలు భక్తులతో క్రిక్కిరిసి పోయి ఉంటున్నాయి. ఎన్ని బస్సులు, రైళ్ళు వేసినా కూడా సరిపోవటం లేదు. ప్రాపంచికతతో విసిగిపోయి అందరూ భగవదన్వేషణలో నిమగ్న మవుతున్నారని అనిపిస్తుంది.

**సురుచి:** అలా అని ఎందుకనుకోవాలి? కోరికలు తీరకపోవటం వలన మనశ్శాంతి లేక మ్రొక్కులు తీర్చుకోవడానికి పుణ్యక్షేత్రాలను సందర్శిస్తున్నారనుకోవచ్చు కదా.

**విదుషుడు:** దేవలుడి కన్నా ముందు నేను భూలోకంలోని పరిస్థితులను ప్రత్యక్షంగా చూసి వచ్చాను. సురుచి అభిప్రాయమే సరియైనదని నా భావన. విద్యలో సత్యాన్ని బోధించకపోవడం వలన జనులలో పాపభీతి కొరవడింది. ఈ కాలంలో భూలోకంలో విద్య అంటే వస్తు ప్రపంచ జ్ఞానమే. స్వభావరీత్యా బహిర్ముఖి ఐన మనస్సు ఈ చదువులతో ఇంకా తీవ్రంగా బహిఃప్రవృత్తిని పెంపొందించుకుంటున్నది. ధార్మికతను చదువుల ద్వారా వ్యక్తులలో పాదుకొలపక పోవటం వలన సమాజంలో విలువలు పతనమవుతున్నాయి. పరిపాలన వ్యవస్థ బహుసంక్లిష్టం అవు తున్నది. ప్రభుత్వాలు చెడుకు ఆవాసాలు అవుతున్నాయి. ఈ సంక్లిష్టపు వ్యవస్థలో తన హక్కులను వినియోగించుకోవడానికి కానీ, సేవలను పొందటానికి కానీ, వ్యక్తి చాలా ప్రయాసను పొందుతాడు. పరిపాలన ఇంత క్లిష్ట మవటానికి కారణం ధర్మాచరణపై, శాశ్వత నియమాలపై, భగవంతుడి చట్టాలపై విశ్వాసాన్ని కలిగించలేక పోవటమే. నీతినియమాలను ఉల్లంఘించటం వలన కలిగే దుష్ఫలితాలనుంచి తప్పించుకోవడం అసాధ్యమని, ఏదో విధంగా మనిషి తాను చేసిన చెడు కర్మలకు ఫలితాలను అనుభవించకుండా తప్పించుకునేందుకు వేరే మార్గంలేదని తెలియజేసి, అందరినీ సత్యసంధులను చేయాలి. అప్పుడే అందరికీ శాంతి సౌఖ్యాలు కలుగుతాయి. మానవ చట్టాలు మనిషిని మనీషిగా చేయలేవు.

**తార:** ఔనౌను. కలియుగంలో దౌర్భాగ్యమేమంటే చెడువర్తనను పెంచుకున్నవాడు ఎలాగూ ఇందులో మునిగి పోయాను కదా అని అడ్డూ అదుపూ లేకుండా పాపకర్మలను చేస్తూంటాడు. 'నిండా మునిగిన వానికి చలి ఏమిటి?' అన్న తీరున. చివరికి ఎంత దిగజారిపోతాడంటే కనీసం ధర్మగ్రంథాలను చదవటానికి కాదు గదా, వినటానికి కూడా ఇష్టపడడు. వింటే మళ్ళీ అంతః సంఘర్షణ మొదలవుతుందని భయం. 'ఇకనైనా మారదాం..ఇప్పటికైనా మించిపోయింది లేదు. కొద్దోగొప్పో పరోపకారం చేసి పుణ్యాన్ని సముపార్జించుకుందామని భావించడు.' అలా అవిశ్రాంతంగా నీతిబాహ్యమైన కార్యాలు చేస్తూ భూమికి భారమవుతున్నాడు. చేసిన దుష్కర్మలవలన మలినమైన అంతఃసాక్షి ప్రశాంతంగా కూర్చో నివ్వదు. పాపప్రక్షాళనకు దీక్షలు, తీర్థసందర్శనాలు విపరీతంగా పెరుగుతాయి. అందువలన గుడులు, గోపురాలు జనులతో కిటకిటలాడుతున్నప్పటికీ భక్తి వెల్లువలాగా పొంగి పొరలుతున్నదని భావించనవసరం లేదు. అంతా ఆ అధర్మ భయంనుంచి ఉద్భవించిన బాహ్యాడంబరమే కానీ హృదయాలలో కించిత్ భక్తికానీ, నిస్వార్థ పరాయణత్వం కానీ కనపడదు. పేరుకు మాత్రమే ప్రస్తుతం భారతీయులు ఋషిసంతతి. ఋషిమత్వాన్ని సాధిద్దామన్న తపన మాత్రం కనపడదు.

**పృథ:** తామంతా ఋషిసంతతి అని భారతీయులు ఇంతకు ముందెప్పుడైనా గర్వపడ్డారేమోగానీ ఇప్పుడు మాత్రం పాశ్చాత్యులను అనుకరించటంలోనే ఆనందాన్ని పొందుతూ తమ సంస్కృతిని మరచిపోవటానికే ఇంకా కుతూహలాన్ని చూపిస్తున్నట్లున్నది. మనస్సును నిగ్రహించే పరిజ్ఞానాన్ని అభివృద్ధి పరిచినవారు ఋషులు, మునులు. వాళ్ళు శాస్త్రజ్ఞులే. మనోశాస్త్రనిపుణులు. మానవవికాస శాస్త్రాన్ని ప్రబోధించినవారు. అంతఃప్రపంచాన్ని పరిశోధించినవారు. ఇంద్రియనిగ్రహాన్ని పెంపొందించుకొని మనస్సును నిగ్రహించటమే నిజమైన జీవితం; లేకపోతే జంతుతుల్యమే. **ఆహారా నిద్రా భయ మైథునాని, సామాన్య మేతత్ పశుభిర్నరాణామ్, జ్ఞానం హి తేషామధికో జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః ...** 'ఆహారం, నిద్ర, భయమైథునాలు నరులకీ, జంతువులకీ సమానమే. వివేక విచక్షణాలతో కూడుకున్న బుద్ధి

మాత్రమే మనిషిని విలక్షణంగా నిలబెడుతున్నది. అది లేకుంటే మనిషి పశువుతో సమానమే'. అందుకని ఈ జంతుస్థాయి విషయాలతో ఆగిపోయేవారు, అర్థరహిత జీవితాన్ని గడుపుతున్న వారే. మానవజన్మను వ్యర్థం చేసుకుంటున్న వారే.

**తార:** పాశ్చాత్యులది పూర్తిగా ఇంద్రియమయ జీవితం. ఆర్యులు వారిని అనుకరించటమా ? శివ..శివా..

**సురుచి:** అర్థవంతమైన జీవితాన్ని ఎవరు కోరుకుంటు న్నారు? అంతా అర్థాన్ని కోరుకుంటున్నారు? ఎవరు చూసినా కోట్ల పెట్టుబడులు, కోట్ల టర్నోవర్, కోట్ల ఆస్తులు, కోట్ల కుంభకోణాలు..గురించే మాట్లాడుతున్నారు. ఇప్పుడు భూలోకంలో ఎవరి నోట ఏమి విన్నా అన్నింటికీ ముందు 'కోటి' అనే పదం ఉంటుంది. లేకపోతే పదానికి విలువవుండదు. ఏమి పృథా! కోటి అనగానే నీకేమన్నా గుర్తుకువస్తుందా?

**పృథ:** వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ... అని మహాగణపతిని స్తుతిస్తాం కదా. సర్వాంతర్యామి యైన వాసుదేవుడి తేజస్సును వర్ణిస్తూ మనం కోటి భాను సమాన ప్రభామాన అంటాం కూడా.

**సురుచి:** అదీ ఆధ్యాత్మిక సంస్కారం అంటే. అదే కరువైపోయింది ఇప్పుడు మర్త్యలోకంలో. అంతా విదేశీ అభివృద్ధి నమూనాను ఆదర్శంగా తీసుకొని తమను తాము ఒక అభివృద్ధి చెందుతున్న దేశంగా పరిగణించుకుంటూ, వైభవోపేతమైన తమ ఆధ్యాత్మిక జ్ఞానానికి తిలోదకాలిచ్చి జీవితాన్ని ఒక ప్రత్యక్ష నరకంగా చేసుకుంటున్నారు భారతీయులు.

**ఇంద్రుడు:** అవును. సురుచి చక్కగా చెప్పింది. అదే మర్త్యలోకం పూర్తిగా మాయాధీనంలోకి వెళ్లటానికి కారణమైంది.

'అభివృద్ధి' అనే పదాన్ని నిర్వచించుకోకుండానే విద్యలో భారతదేశం ఒక అభివృద్ధి చెందుతున్న దేశంగా చదవటం నేర్చుకుంటున్నారు. ఒక వ్యక్తి తలసరి ఆదాయం, విద్యుత్తు వినియోగం, ఇంధన వినియోగం, నీటి వినియోగం, ఉపకరణాల వినియోగం, రోగాలు వస్తే సందర్శించే వైద్యశాల స్థాయి, ఆహార వినియోగాన్ని బట్టి ఒక దేశం అభివృద్ధి చెందినదా, చెందుతున్నదా అని నిర్ణయించటం ఎంత హాస్యాస్పదం! ఒక దేశం యొక్క ఆదర్శాల్ని బట్టి, ఎంచుకున్న విలువలను బట్టి, నిస్వార్థ సేవా పరాయణుల సంఖ్యను బట్టి, త్యాగధనుల శాతాన్ని బట్టి, మానధనుల శాతాన్ని బట్టి ఆ దేశం అభివృద్ధిని నిర్ణయించాలి కానీ ఇదేమి చోద్యమో మనిషి ఎంత ఎక్కువగా ఇంద్రియలోలుడైతే, ఎంత ఎక్కువగా విషయసుఖాలకై పాటుపడితే అంత గొప్ప అని నిర్ధారించటం భారతీయుల పాశ్చాత్య అనుకరణ జబ్బు తీవ్రతకు నిదర్శనం. ధీర వివేకానంద చెప్పిన జాతీయ విద్యావిధానాన్ని అమలు చేసుకోలేకపోవటం వలన దేశం ఒక సంక్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటోంది. భగవంతుడు, సత్యం మాత్రమే నేను నమ్మే రాజకీయాలన్న ఆ ప్రవక్తను అర్థంచేసుకోవటంలో జాతి విఫలమైంది. ప్రతీదీ రాజకీయ రొంపిలో చిక్కుకుపోయి ఉంది. ఆధ్యాత్మికతకు బదులు రాజకీయాలను జాతి జీవనస్రవంతిలోకి ప్రవేశపెట్టటానికి ప్రసార మాధ్యమాలు మహామాయకు తమవంతు సహాయాన్ని అందిస్తున్నాయి.

**దేవలుడు:** దేవరా! నేను గ్రహించినదేమంటే, 'పట్టణీకరణ, పారిశ్రామికీకరణ, సాంకేతిక అభివృద్ధి.. ఇవన్నీ కలిపి మనిషిని కోరికలకు పూర్తిగా బానిసను చేస్తున్నాయి. గ్రామాలలో ఉన్నప్పుడు కోరికలు, ఆశలు తక్కువగా ఉండేవి. మనిషి తనను తాను ఇతరులతో పోల్చుకోకుండా ప్రశాంత జీవితాన్ని గడిపేవాడు. శారీరక, మానసిక ఆరోగ్యాలు చక్కగా ఉండేవి. బుల్లితెర లాంటి మాధ్యమాల విస్తరణ వలన వ్యాపార ప్రకటనలు, వ్యాపారం పెరిగి సంతుష్టి అనేది జీవితంలో మృగ్యమైంది. కృత్రిమ కోరికలు పెరిగాయి. అంటే మనిషి కోరుకునే వాటిలో చాలా కోర్కెలు నిజానికి అతనికి అవసరంలేదు. ఇతరులతో పోల్చుకొని వారితో సమానమైన స్థాయిలో జీవించాలని కోరుకోవడంతో అనవసరాలు అవసరాలుగా మారుతున్నాయి. ఈ కోరికలు




తీర్చుకునే ప్రయత్నంలో అవకాశం ఉంటే అవినీతి, అక్రమాలతో వాటిని సాధించుకుంటున్నాడు. ఆత్మను తాకట్టుపెడుతున్నాడు. ఇదీ 'నాగరిక' సమాజ పరిస్థితి; దుస్థితి. అంతా అనవసర ప్రయాస, తాపత్రయమే. ఈ తాపత్రయంతో కూడుకున్న జీవితంలో మేథోపరమైన వికాసానికి, ఆత్మవికాసానికి అవకాశం లేకుండా పోతున్నది. 'నాగరికత అంటే పట్టణాలలో, నగరాలలో గుమిగూడి ఇంద్రియలోలత్వంతో జీవించడం కాదు' అన్న వేదాంత కిశోరం స్వామి వివేకానంద వాక్కు ఇంకా ఇలావర్తనుల చెవిలో పడలేదు.

**ఇంద్రుడు:** హా! కలియుగంలో ఎన్ని క్లేశాలతో కూడుకున్నది మానవుడి జీవితం? 'భారతీయులు తమ ఆధ్యాత్మిక సంస్కృతిని పరిరక్షించుకుంటూ, అద్వైత మతాన్ని అనుష్ఠిస్తూ, సర్వసమభావాన్ని పెంపొందించుకోవాలి. సమష్టి అభివృద్ధిని కాంక్షించాలి. ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయం చేస్తూ యువత పల్లెలో ఉండి ప్రకృతితో సహజీవనం చేయాలి. నిరాడంబర జీవితానికి సాహసించాలి. వ్యక్తి తనను తాను జయించాలి. ఇదే ఆదర్శ జీవితం,' అని నా భావన. ఈ నాటికి సభ ముగిసింది. స్వస్తి. ❖

ఆర్య సంతతి నేడు పశుప్రాయమైపోయిందనీ, అజ్ఞానమనే మబ్బు ఈ మాతృభూమిని కప్పివేసిందనీ కలతచెందుతున్నారా? నిజమైన దేశభక్తికి ఈ హృదయ స్పందనే మొదటి మెట్టు. - స్వామి వివేకానంద




'భౌతికంగా నేను ఈ లోకం నుంచి నిష్క్రమించినా, నా ఆత్మ మీ వెంటే ఉండి నడిపిస్తుంది' అన్న స్వామి వివేకానంద ధీరవచనాల్ని నాకు (వాదీంద్ర) పరిచయం చేసిన రామకృష్ణమఠం నాలో నాయకత్వ లక్షణాలకు కూడా బీజం వేసింది. 'యువ సంఘర్ష్' పోటీల నేపథ్యంగా రామకృష్ణసంఘంలోని భగవాన్ శ్రీరామకృష్ణ శిష్య పరంపరలో అజ్ఞాతంగా దాగి ఉన్న నాయకత్వ పటిమను కొంత అర్థం చేసుకోగలిగాను. ఇతరులకు సేవ చేయటానికి మించిన, ఉన్నతమైన ఆదర్శమేదీ లేదని మా ఇంట్లో చిన్నప్పటి నుంచే చెప్పేవారు. అదే విధంగా మా పెద్దవారు, పాఠశాలలో ఉపాధ్యాయులు చెప్పిన ఎన్నో నీతికథలు నా మనస్సులో ముద్రపడిపోయాయి. అదే ఆసక్తితో ఉత్సాహంగా 'యువసంఘర్ష్' పోటీలో పాల్గొన్నాను. ఆ అనుభవాలతో ఇప్పటికే మా పాఠశాల తరఫున స్నేహితులతో కలసి ఎన్నో స్వచ్ఛంద సేవా కార్యక్రమాల్లో పాల్గొంటున్నాను. అదే విధంగా ఖాళీ సమయాల్లో అనాథ శరణాలయాలు, వృద్ధాశ్రమాలు, ఆసుపత్రులు సందర్శిస్తూ నాకు తోచినంతగా సేవలందిస్తూ ఉన్నాను. నాకు సకల సౌకర్యాలు కల్పిస్తూ, నన్ను చదివిస్తున్న తల్లితండ్రులు, నా నుంచి ఎంతో ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని ఆశిస్తున్నారు. కేవలం వారికి ఉపయోగపడుతూ, వాళ్ళను చక్కగా చూసుకొనే కుమారుడిని కాకుండా, సమాజంలో ఎంతో మందికి ఆనందాన్ని పంచే ఉత్తమమైన పౌరుడిని నాలో చూసుకోవాలనుకుంటున్నారు.

# స్వామీజీ ఆశయసాధన కోసం కృషిచేస్తా...

**ఇదే సరైన సమయం... :** మనిషి వ్యక్తిత్వానికి సరైన దశను, దిశను నిర్దేశించే వయస్సు యౌవనమేనని అందరికీ తెలిసిందే! ఈ స్థితిలో నాకు స్వామి వివేకానంద CALL TO THE NATION, FRIEND OF ALL, CHANNELLING YOUTH POWER, SELF MASTERY ...తదితర పుస్తకాలు ఎంతో ఉత్తేజాన్నిచ్చాయి. నేనేంటో తెలుసుకోవటానికి, నన్ను నేను తీర్చిదిద్దుకోవటానికి అవకాశాన్ని కల్పించాయి. అదే విధంగా మన దృక్పథమే మన భవిష్యత్తును నిర్ధారిస్తుందని అర్థం చేసుకున్నాను. స్వామీజీ సందేశాలతో కూడిన ఇలాంటి సాహిత్యం వజ్రవైఢూర్యాల కన్నా విలువైనది. ముఖ్యంగా నాయకత్వ లక్షణాలను పుణికిపుచ్చుకోవాల్సిన యుక్తవయస్సులో ఇవి దారిదీపాల్లా ఉపయోగపడతాయి. 'నేను మీకు సరిపడేటంత సందేశాన్నిచ్చాను; దానిలో కొంతైనా మీరు ఆచరణలో పెట్టినప్పుడే, ప్రపంచం మిమ్మల్ని విజేతలుగా గుర్తిస్తుంది' అన్నారు స్వామి వివేకానంద. నేను ఆ మహనీయుని మాటల్ని అనుసరిస్తూ, అంచెలంచెలుగా ఎదిగే ప్రయత్నం చేస్తున్నాను. 'తనేంటో' తెలుసుకొని ముందుకు సాగిపోయేవాడే నిజమైన నాయకుడని గ్రహించి ఆ దిశలో ప్రణాళికలు సిద్ధం చేసుకున్నాను.

**ఉన్నతోద్యోగంతో ప్రజాసేవ... :** సమాజానికి విస్తృత స్థాయిలో సేవ చేయటానికి సివిల్ సర్వీసెస్ అనువైన మార్గమని భావిస్తూ, ఆ దిశలో కృషి చేయాలనుకుంటున్నాను. అట్టడుగు స్థాయి ప్రజల కష్టనష్టాలను అవగతం చేసుకుంటూ, కొంతైనా నా వంతు సహాయం చేయాలని నిశ్చయించుకున్నాను. స్వామి వివేకానంద ఆశయసాధనకు ఇది ఋజుమార్గమను కుంటున్నాను. 'యువ సంఘర్ష్' కార్యక్రమంలో



నేర్చుకున్న ఎన్నో అంశాలు నా ప్రణాళికకు ఉపకరిస్తున్నాయి. అయితే ప్రస్తుతం ఆ లక్ష్యం వైపు కృషి చేస్తూనే, ప్రాథమికంగా వివిధ అంశాల్లో సామాజిక చైతన్యకార్యక్రమాలను మిత్రులు, ఆత్మీయుల సహకారంతో ప్రారంభించాను. స్వామి వివేకానంద సందేశాన్ని ప్రచారం చేయటం, యువతరాన్ని సామాజిక అంశాల్లో జాగృతం చేయటం, కేజీ నుంచి పీజీ వరకు పాఠ్యపుస్తకాల్లో విలువలకు సంబంధించిన పాఠాలను చేర్చటంపై ప్రభుత్వాధికారులకు లేఖలు రాయటం, ప్రసార, ప్రచారసాధనాల్లో స్ఫూర్తిమంతమైన కార్యక్రమాలు పొందుపరిచేలా ప్రయత్నించటం, వీలయినంత వరకు అన్ని విద్యాసంస్థల్లో స్వామి వివేకానంద ప్రసంగాలను పవర్‌పాయింట్ ప్రజంటేషన్, మల్టీమీడియా ప్రజంటేషన్‌ల ద్వారా ప్రచారం చేస్తున్నాను. వైద్యనేపథ్యం ఉన్న మా అమ్మ, ఇతర వైద్యులతో కలసి నిరుపేదలకు ఉచితంగా మందులను పంపిణీ చేస్తున్నాను. ఇలా ముందుకు సాగుతూ, చివరకు స్వామి వివేకానంద ఆశీస్సులతో నా పరమలక్ష్యమైన ఐఏఎస్‌ను సాధించి, ఆయన ఆశయాలను సఫలం చేయటంలో నా వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాలనుకుంటున్నాను. ❖

**వాదీంద్ర, 12వ తరగతి**

('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుది పోటీలకి అర్హత సాధించిన భారతీయ విద్యాభవన్, జూబ్లీహిల్స్, హైదరాబాదు విద్యార్థి.)

# మనల్ని మనమే మరచిపోతున్నాం!

**– స్వామి బోధమయానంద**

మాకు తెలిసిన ఓ వ్యక్తి ఓ పెద్ద బహుళజాతి సంస్థలో సి.ఇ.ఒ.గా పని చేస్తున్నాడు. కార్యాలయంలో తమ పని ఒత్తిళ్ళ గురించి ఇటీవల ఆసక్తికరమైన అంశాల్ని, అనుభవాల్ని నాతో చర్చించాడు. కొన్నాళ్ళ క్రితం తాను ఓ కొత్త కంపెనీలోకి మారాడు. నాలుగు రోజుల తరువాత తన టేబుల్‌పై ఉన్న తన నామఫలకాన్ని (నేమ్‌ప్లేట్)ని, విచిత్రంగా తనవైపునకు తిప్పుకున్నాడట! వెంటనే అతని వ్యక్తిగత కార్యదర్శి(పి.ఎ.) ఆశ్చర్యంగా 'సార్! నేమ్‌ప్లేట్ వేరే వాళ్ళు మీ గురించి తెలుసుకోవటానికి కదా! అదేంటి మీరు మీ వైపుకు తిప్పుకున్నారు' అని ప్రశ్నించాడట. అప్పుడు మా మిత్రుడు 'నాకు తెలుసు, ఇలా ఆ ఫలకాన్ని నావైపుకు తిప్పుకోవటం తప్పేనని! నేనేంటో అందరికీ తెలుస్తుంది; నిజమే, కానీ రోజంతా ఈ పనులన్నీ చేశాక, అసలు నేనేంటో నేనే మరచిపోతున్నాను. ఇలా కనీసం నా పేరును నేను ఒకసారి చూసుకోవటం వల్లనైనా నాకు నా ఇతర బాధ్యతలు, బాంధవ్యాలు, వ్యక్తిగత ప్రపంచం గుర్తొస్తాయి' అన్నారట! అలా ఆ సందర్భాన్ని గుర్తుచేసుకొని అధికారిగా తన వృత్తిజీవితానికి, వ్యక్తిగా తన ఆంతరంగిక ప్రపంచానికి మధ్య సమన్వయాన్ని కుదుర్చుకోలేక పోవటం వల్ల తన భార్య, పిల్లలు, అన్నదమ్ములు, తల్లితండ్రులు... ఇలా ఎందరో మానసికంగా తనకు దూరమవుతున్నారని ఆవేదన వ్యక్తం చేశాడు. ఇలా సామాజిక హోదాకు, కుటుంబ జీవితానికి మధ్య పొంతనను కుదుర్చుకోలేక నేటి సమాజంలో చాలామంది మానసిక సంఘర్షణతో కుమిలిపోతున్నారు.



**వృత్తే వ్యక్తి కాదు... :** మనను మనం నిర్వచించుకోవటానికి చేసే 'వృత్తి'నే ప్రామాణికంగా తీసుకోవటం సముచితం కాదు. ఆ హోదా మన జీవితంలో ఒక భాగమే కాని, అదే జీవితం కాదు. కానీ మనలో చాలామంది ఈ విషయం తెలియక 'పనే' ప్రపంచమనుకొని, వ్యక్తిగత జీవితంలో ఘోరంగా విఫలమవుతున్నారు. ముఖ్యంగా ఈతరం యువతీయువకులు తమకంటూ ఓ ఆంతరంగిక పరిధిని నిర్మించుకోలేక, గాలివాటంగా గడిపేస్తున్నారు. ఉద్యోగబాధ్యతలు నిర్వర్తిస్తూ, భవిష్యత్తులో ఉత్తమనాయకులుగా ఎదిగే నవతరం 'self image' ని పెంచుకోవాలి. ఎవరికి వారే ఈ స్వయంశోభతో నడచుకోవాలి. అందుకే ఎమర్సన్ ఇలా అంటారు:

'It is not what is before you, what is behind you or what is around you that is important. What is inside you is important. నిజమే. బయటకు నీవు ఎలా కనిపిస్తున్నావు? ఎలా ఉన్నావు? అన్నది ప్రధానం కాదు; అసలు నీలో నీవు ఎలా ఉన్నావన్నది ముఖ్యం. అందుకే ఎప్పటికప్పుడు ఈ ఉద్యోగ జీవితాన్ని, వ్యక్తిగత జీవితాన్ని బేరీజు వేసుకుంటూ ఉండాలి. ఒకదాని స్థానాన్ని, పరిధిని ఇంకొకటి కబళించివేయకుండా జాగ్రత్తలు తీసుకోవాలి.

**పలాయనం పరిష్కారం కాదు... :** వృత్తిపరమైన ఒత్తిళ్ళ నుంచి బయటపడటానికి పరిష్కారాన్ని వ్యక్తిగతమైన సత్సంబంధాలు, ఆరోగ్యకరమైన అభిరుచుల్లో అన్వేషించాలి. కానీ ఈరోజు చాలామంది యువతీయువకులు ఆ ఆనందాన్ని, మనోసాంత్వనను అనారోగ్యకరమైన వ్యసనాల్లో వెతుక్కుంటున్నారు. ఇవన్నీ కూడా పలాయన (ఎస్కేపిజం) మార్గాలు. సాఫ్ట్‌వేర్ పరిశ్రమ అనగానే భారతదేశంలో గుర్తుకువచ్చే ప్రసిద్ధ బెంగుళూరు నగరంలో తాజా సర్వేప్రకారం ఇరవై నాలుగు శాతం మంది యువత మాదకద్రవ్యాలకు అలవాటు పడ్డవారేనట! వాళ్ళంతా నిరక్షరాస్యులు కాదు; అమాయకులు అంతకన్నా కాదు. వారంతా సామాజిక పరంగా, వృత్తివిద్యాపరంగా ఉన్నతమైన హోదాల్లో ఉన్నవారే! ఇలా తమను తాము వంచించుకుంటూ బెంగుళూరులో ఎందరో అమ్మాయిలు, అబ్బాయిలు కలసి బార్లకు, పబ్‌లకు వెళ్ళటం నా కంటబడింది. వీటన్నింటికీ కారణం వృత్తిపరమైన కార్యకలాపాలను అతి తక్కువ ఒత్తిళ్ళతో నిర్వహించే సమర్థత మనలో లోపించటమే! పైగా పనిచేసే చోట మేనేజర్‌గా అత్యంత నైపుణ్యాన్ని ప్రదర్శించే వ్యక్తి, మామూలు మనిషిగా ఇంట్లో వాళ్ళతో గాని, తోటి మనుష్యులతో గాని సఖ్యతగా మసలుకోకపోతే అతడు పరిపూర్ణమైన విజయాన్ని సాధించినట్లు కాదు. ఆఫీసులో అయిదంకెల జీతం కోసమే మనం అంత అంకితభావంతో పనిచేస్తుంటే, అన్నీ మనమే అనుకొని బతికే అయినవాళ్ళ కోసం ఇంకెంత బాధ్యతగా వ్యవహరించాలి?! ❖

మంచి అభ్యాసాలతో దుష్టసంస్కారాలను అణచివేయవచ్చు. మనం మార్పు చెందితే ఇతరుల్లో కూడా మార్పు వస్తుంది. మనం పరిశుద్ధులమైతే ఈ ప్రపంచం కూడా పరిశుద్ధమవుతుంది. - స్వామి వివేకానంద

# సర్దుకుపోదాం...!

– బి. సైదులు

చిన్నప్పుడు మా ఇంటి దగ్గర ఓ ఆంటీ ఉండేవారు. కష్టాలన్నింటికీ చిరునామా వాళ్ళ ఇల్లంటే అతిశయోక్తి కాదు. మాకు ఊహ తెలిసినప్పటి నుంచి ఆమె నిశ్చింతగా మూడుపూటలా అన్నం తిన్న రోజు లేదు. మద్యానికి బానిసైన భర్త, జులాయిగా మారిన కుమారుడు, ఎదిగొచ్చిన ఆడపిల్లలు, అత్తగారి పోరు... ఇలా కష్టాలతోనే ఆమె కాపురం కొనసాగింది. ఎంతో శ్రమకోర్చి కట్టుకున్న ఇల్లు కూడా అమ్మి, కూతురు పెళ్ళి నిశ్చయిస్తే, ముహూర్త సమయానికి వివాహం బెడిసికొట్టింది. ఉన్న ఒక్కగానొక్క కొడుకును పాతకక్షలతో కొందరు మద్యంలో విషం కలిపి చంపేశారు. భర్తకు పక్షవాతం వచ్చింది. చిన్నప్పుడు వెండి పళ్ళాల్లో భోజనం చేసిన కుటుంబం ఆమెది! అయినా పెళ్ళయ్యాక పడరాని కష్టాలు పడ్డారు.

మరొకరైతే ఇల్లు వదిలి పారిపోయేవారు. కానీ, ఆ స్త్రీమూర్తి ఎంతో ఓర్పుతో ఆ కుటుంబాన్ని పోషించు కున్నారు. ఇద్దరు కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేశారు. భర్త తుది శ్వాస విడిచే వరకు తనే మిషన్ కుట్టుకుంటూ, చిన్నచిన్న పనులు చేసుకుంటూ ఆయననూ, బిడ్డల్నీ పోషించుకున్నారు. ఎన్ని కన్నీళ్ళనైనా కనురెప్పలమాటునే దాచుకుంటూ, పైకి మాత్రం ఎంతో నిర్మలంగా, నిశ్చలంగా కనిపించేవారు. పరిస్థితుల గురించి పరాయి వారి ముందు ఒక్కమాటైనా ప్రస్తావించేవారు కాదు. కటిక దరిద్రంలోనూ రోజూ ఉదయం దేవుడికి పూజ చేసేవారు.

మేము ఆ రోజుల్లో ఎంతో ఉద్విగ్నతతో 'ఆంటీ! ఇన్ని బాధలు పెడుతున్నా, ఇంకా ఆ దేవుడికి ఎందుకు పూజ చేస్తున్నారు' అనేవాళ్ళం. ఆమె అదే నిబ్బరంతో 'వీటన్నింటినీ ఓర్చుకునే శక్తి నిస్తున్నాడయ్యా! అది చాలు. అందుకైనా ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి' అని ప్రశాంతంగా చిరునవ్వు నవ్వేవారు. ఇప్పటికీ ఆ తల్లిని చూసినప్పుడల్లా కాళ్ళకు దణ్ణం పెట్టాలనిపిస్తుంది. జీవితంలో ఎదురైన పరిస్థితులతో సహనంతో ఎలా సర్దుకుపోవాలో ఆవిడను చూసి నేర్చుకోవాలనిపిస్తుంది. అలాంటి వారి సమస్యల ముందు మనలో చాలామందివి అసలు సమస్యలే కావు. ఇలా జీవితంలో ప్రతి మలుపులో, మనకు పరిస్థితులు ప్రతికూలంగానే ఉంటూ ఉంటాయి. కానీ సర్దుకుపోతూ ముందుకు సాగిపోయేవారే మాననీయులుగా మిగిలిపోగలరు.



**సర్దుబాటు...దిద్దుబాటు :** ఈ రోజుల్లో కుటుంబ సంబంధాల విషయం నుంచి కార్యాలయ వ్యవహారాల వరకు ప్రతిచోటా మనకు ఇతరులతో పొంతన కుదరకపోవడానికి ప్రధాన కారణం ఈ 'సర్దుబాటు తత్త్వం' లోపించడమే! ఆఫీసే కావచ్చు లేదా ఆశ్రమమే కావచ్చు, ఎక్కడైనా పరిసరాలు, పరిస్థితులు ముందు మనకు అనుకూలంగా కనిపించవు. అంతమాత్రం చేత నిరాశపడి ఆయా అననుకూలతలను భూతద్దంలో పెట్టిచూస్తూ బాధపడకూడదు. కానీ, ఆధునిక యువతీయువకులు తమ జీవనప్రయాణంలో ఎదుటివారిని అర్థం చేసుకోవడం మానేసి, కొద్దిపాటి సర్దుబాటుకు కూడా ససేమిరా అంటున్నారు. ఆవేశంతో పరిధులను అతిక్రమించి ప్రతిస్పందిస్తున్నారు. కానీ...

**ప్రలయే భిన్న మర్యాదా భవంతి కిల సాగరాః ।**

**సాగరా భేద మిచ్ఛంతి ప్రలయే పి న సాధనః ॥** అంటాడు చాణక్యుడు తన నీతిశాస్త్రంలో! అవును. ప్రళయ కాలంలో సముద్రాలు చెలియలికట్టను దాటి అల్లకల్లోలం సృష్టిస్తాయి. కానీ ఉన్నత వ్యక్తులు ప్రతికూల సమయం లోనూ కలత చెందకుండా, మర్యాదను అతిక్రమించకుండా నడవడికకు భంగం కలగకుండా ప్రవర్తిస్తారు. అన్నీ మనకు సానుకూలంగా ఉన్నప్పుడు, మనతో పనిచేసేవారు అందరూ సమర్థులే అయినప్పుడు సత్ఫలితాలు రావటంలో మన ఘనత ఏముంటుంది? ఎన్ని ఇబ్బందులున్నా, అరకొర సమర్థత కలిగిన సహచరుల నుంచి కూడా ఉత్తమ ఫలితాలు రాబట్టగలిగినప్పుడే నిజమైన నాయకులమనిపించుకుంటాం!

**అంచనాలతో ఆశాభంగం :** 'Today, none of our relationships are healthy, as they are all framed by expectations' అంటూ ఓ ఆంగ్ల మేధావి ఆవేదన వ్యక్తం చేశాడు. నిజమే! విపరీతమైన అంచనాల నడుమ బిగుసుకు పోవడం వల్లనే మన మానవ సంబంధాలన్నీ అనారోగ్యకరంగా పరిణమిస్తున్నాయి. మనం చాలా సందర్భాల్లో నిరాశకు గురికావడానికి ముఖ్యకారణం మనకు తారసపడే వ్యక్తులపై, చేయబోయే వృత్తిపై, అక్కడి వాతావరణంపై అంచనాలను పెంచేసుకోవడమే! జీవిత భాగస్వామే కావచ్చు, జీతమిచ్చే యజమానే కావచ్చు – అచ్చం మనం అనుకున్నట్లే ఎందుకు ఉండాలి? మనస్సులో ఏర్పరచుకున్న రూపకల్పనలకు వాళ్ళు

ఏ మాత్రం భిన్నంగా మసలుకున్నా, మనం ముాన్పడి పోతాం. అది ఆ యా వ్యక్తుల, వాతావరణాల దోషం కాదు! కేవలం మనదే ఆ లోపం. అలా మనం అంచనా వేసుకున్నట్లు, ఆశించినట్లు వారు నడుచుకోకపోతే నీరు గారిపోతాం. కానీ అంచనాలు ఎంత తారుమారైనా, ఆశాభంగానికి గురికాని వారే ధీరులు. 'నేనలా అవుతుందనుకోలేదు! వారు అలా ప్రవర్తిస్తారని అనుకోలేదు!' అంటూ ఎన్నో సందర్భాల్లో మనస్సును చిన్నబుచ్చు కుంటాం. అలా ఎవరు అనుకోమన్నారు? ఎదుటివారు అలాగే నడచుకోవాలనే హక్కు, పరిస్థితులు అలాగే ఉండాలనే శక్తి మనకెక్కడున్నాయి? ఎవరు ఎలా నడచుకున్నా, జరగ కూడనివి ఎన్ని జరిగినా కలవరపడకుండా నిలబడగలగాలి. అదే సాహసవంతుల లక్షణం. అందుకే స్వామి వివేకానంద ఇలా అంటారు –"తమకు నచ్చినచోట, తమకు అనువైనవారి మధ్య ఉత్సాహంగా పనిచేయడంలో గొప్పతనమేమీ లేదు; అది ఎవరైనా చేయగలరు. అన్నీ ప్రతికూలంగా ఉన్నప్పుడు, ఎందరు, ఎంత నిరుత్సాహపరచినా విజయవంతమైన ఫలితాలు తీసుకువచ్చిన వారే విజేతలు. నిజమైన నాయకుడు వేయిరకాల మనస్తత్త్వాల నైనా జీర్ణించుకోగలిగి ఉండాలి."

**ఓరిమి... కూరిమి :** ఓరిమితో ఎన్నో బాధల్ని సహిస్తూ, కూరిమిగా బతికేవారు ఎక్కడైనా రాణించగలరు. ప్రతి చిన్న అసౌకర్యానికీ అసహనంతో ఊగిపోయేవారు ఎక్కడా ఇమడలేరు. కుటుంబస్థాయి నుంచే ఈ సర్దుబాటు తత్త్వాన్ని అలవరచు కోవాలి. దాన్ని తల్లితండ్రులు ఆచరించి చూపాలి. చారు బాగా పెట్టలేదని తండ్రి, చీర మంచిది తేలేదని తల్లి నిరంతరం ఏదో ఒక నెపంతో ఒకరి మీద మరొకరు ఆరోపణలు చేసుకుంటూ, రాద్ధాంతాలు చేస్తుంటే ఇంట్లో కూరిమి ఎలా సాధ్యపడుతుంది? పిల్లలకు సామరస్య లక్షణం ఎలా అలవడుతుంది? కిందివారి మధ్య ఎన్ని విభేదాలు, పొరపొచ్చాలు ఉన్నా, పెద్దగా కుటుంబంలో, పై అధికారిగా కార్యాలయంలో ఉన్న వ్యక్తి సర్దుబాటుతో ఒక్కతాటిపై నడిపించగలగాలి. అలాంటివారి సమక్షంలో ఏ ఇద్దరూ తగవులాడుకోరు. అందుకే పతంజలి తన యోగ సూత్రాల్లో **'అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః'** అంటారు. నిజమే; అహింసాభ్యాసం చేసే యోగి లాంటి వ్యక్తి సాన్నిధ్యంలో స్వాభావికంగా వైరం ఉన్న గోవ్యాఘ్రాలు, గజసింహాలు తదితరమైనవి కూడా వైరాన్ని విడిచి ప్రవర్తిస్తాయి. ఇలా అందరి మధ్య కూరిమిని తీసుకురాగలిగితే, ఇల్లయినా, ఆఫీసైనా ఆహ్లాదంగా మారిపోతాయి.

**భరిస్తేనే బంధాలు దృఢం... :** మనలో చాలామంది నలుగురి మధ్య ఇమడలేక, ప్రతివారిలో ఏదో ఒక లోపాన్ని చూస్తూ, ఎవరితోనూ సఖ్యతగా ఉండలేరు. ముఖ్యంగా నేటి ఉద్యోగ బాధ్యతల్లో సహచరులతో కలిసి పనిచేస్తూ, చేయిస్తూ ఉత్తమ ఫలితాలను తీసుకురావలసిన 'టీమ్ లీడర్' లాంటి వ్యక్తులకు ఉండాల్సిన ప్రధాన లక్షణం ఈ 'సర్దుబాటు'! నిరంతరం మన కింద పనిచేసేవారిని విమర్శిస్తూ, తప్పులుపడుతూ సత్ఫలితాలను రాబట్టలేం! నిజానికి మనలోనే మనకు నచ్చని అంశాలు ఎన్నో ఉంటాయి. అంతమాత్రాన మనల్ని మనం తూలనాడుకోవడం లేదు కదా! వాటికి తక్కువ ప్రాధాన్యమిస్తూ, మనలో ఉన్న మంచి లక్షణాలను ప్రకాశింపజేసుకుంటూ, పరిణతిని సాధిస్తూ ఉన్నాం. అలాగే ఎంతటి వారినైనా సహనంతో తమ వైపుకు తిప్పుకో గలిగినవారే కార్యసాధకులు. శ్రీరామచంద్రుడు బృహత్తరమైన వారధిని నిర్మించాలని అనుకున్నప్పుడు, ఆయన కళ్ళ ముందు కనిపించిన సైన్యం ఎవరు? క్షణం కూడా కుదురుగా కూర్చోలేని కపివరులు! అయినా ఆ జగదేకనాయకుడు అదే అల్లరిమూకతో అద్భుతమైన చరిత్రను సృష్టించాడు. అదీ విజేతల లక్షణం! సాధారణమైన వ్యక్తులను శిలలుగా చేతికిస్తే, ఉత్సాహమనే ఉలితో నిపుణులనే శిల్పాలుగా తీర్చిదిద్దేటువంటి ఉత్తమశిల్పి నాయకుడు!

**మానవత... ఆధ్యాత్మికత :** ఓసారి రైలులో వెళుతున్నప్పటి అనుభవమిది! ఓ ముసలాయన రాత్రి సమయంలో పై బెర్తు ఎక్కలేక, పాపం కింద పడక సీట్లోనే నడుము వాల్చాడు. ఇంతలో ఆ బెర్తుపై పడుకోవలసిన అసలు వ్యక్తి వచ్చాడు. నలభై అయిదేళ్ళ వయస్సుంటుంది. రైలులో సహ ప్రయాణికులకు ఆధ్యాత్మిక విషయాలను బోధిస్తూ వస్తున్నాడు. తీరా సీటు దగ్గరకు వచ్చేసరికి తను పడుకోవలసిన చోట ఆ వృద్ధుణ్ణి చూసేసరికి, ఆవేశం కట్టలు తెంచుకొని, ఆయనపై విరుచుకుపడ్డాడు. నానా దుర్భాష లాడాడు. ఎంత నచ్చజెప్పినా వినలేదు. ఆ ముసలాయ నను దిగేవరకు వదలలేదు. చేసేదేమీ లేక ఆ డెబ్భై ఏళ్ళ వృద్ధుడు దీనంగా పై బెర్తు ఎక్కాల్సి వచ్చింది. మామూలు ప్రయాణంలోనే మానవత్వంతో ఆ మాత్రం సర్దుకోలేకపోతే, ఆధ్యాత్మిక ప్రయాణంలో ముందుకు ఎలా సాగుతాం? ❖

### అలిగి సాధించేదేమీ లేదు!



**పరిస్థితులకు సర్దుకొనిపోతే తమను తాము తగ్గించుకున్నట్లే నన్న అపోహ చాలామందిలో ఉంటుంది. అనవసరమైన 'అలకలకు' పోతే చివరకు నష్టపోయేది మనమే! ఏటిలో తోటిజీవులతో పడటం లేదని, చేప అలిగి ఒడ్డుపైకెళితే ఒరిగేదేముంటుంది? పైగా ప్రాణానికే ముప్పు వాటిల్లుతుంది. ఓపికతో మన వంతు వచ్చే వరకు వేచిచూసి, మన ఉనికిని చాటుకోవటం వేరు; ఒకింత అసహనంతో ఏటికి ఎదురీది మొదటికే మోసం కొనితెచ్చుకోవటం వేరు. జీవితం రంగులరాట్నం లాంటిది; ఒకసారి ఒక కుర్చీపైనుంటే, మరోసారి మరోకుర్చీ పైనుంటుంది. స్థానమేదైనా సర్దుకుపోతేనే జీవనచక్రం సాఫీగా సాగిపోతుంది.** ❖

వివరణ : 2012 జూన్ సంచికలో **'పొగడ్తలు...!'** అనే వ్యాసంలో 'భట్రాజు' – 'పొగిడేవాడు' అనే అర్థంతో ఉపయోగించడమైనది. కానీ దాని భావం భట్రాజువర్గం వారిని అగౌరవపరిచే విధంగా ఉన్నదని భట్రాజు సంఘంవారు మా దృష్టికి తీసుకొచ్చారు. ఈ విషయం తెలిసి విచారిస్తున్నాం. వారు అన్యథాభావించవలదని కోరుతున్నాం. ఇది ఏ ఒక్క వర్గాన్ని ఉద్దేశించి వ్రాసినది కాదని తెలియజేస్తున్నాం. **– రచయిత**



# వాళ్ళూ మనుష్యులే!

- శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

ఒకసారి మాకు తెలిసినవారి అబ్బాయి పుట్టినరోజు పండుగకు వెళ్ళాను. ఏడాది బాలుడి పుట్టినరోజది! ఐదునక్షత్రాల హోటల్‌లో అత్యంత వైభవంగా ఏర్పాటుచేశారు. ఇలాంటి వేడుకల్లో కానుకల బహూకరణ సర్వసాధారణమైపోయింది. సంపద పెరిగేకొద్దీ మానవసంబంధాల్లో కృత్రిమత్వం వచ్చి చేరుతోంది. కానుకల్లో కూడా మన హోదా ప్రతిబింబించాలన్న ధోరణి పెరిగింది. అలా ఆ రోజు ఏడాది బాలుడి పుట్టినరోజుకి ఖరీదైన బంగారు గొలుసులు, నగదు, ల్యాప్‌టాప్‌లు, కంప్యూటర్‌లు, ఎలక్ట్రానిక్ సామగ్రి ఇలా ఎవరికి తోచినట్లు వారు సమర్పించుకున్నారు. ఆ చిన్నారి ల్యాప్‌టాప్‌ను ఏం చేసుకుంటాడో! ఆలోచించను కూడా ఆలోచించరు. అందులో నూరోవంతైనా ఒక సాధారణ కుటుంబానికి ఏదో ఒక సందర్భంలో బహూకరిస్తే ఎంత ఆనందిస్తారో నాకు అర్థమైంది.

ఓసారి అహ్మదాబాద్‌లో సరదాగా అక్కడి 'లాగార్డెన్ రోడ్డు' అన్న వ్యాపార ప్రాంతానికి స్నేహితులతో వ్యాహ్యాళికి వెళ్ళాను. అక్కడ దుకాణాలు చిన్నవైనా చాలా ఆకర్షణీయంగా ఉంటాయి. వాటిలో గుజరాత్ గ్రామీణనిరుపేద కళాకారులు చేతిపనితో తయారుచేసిన వస్తువులు, కళాఖండాలు విక్రయిస్తారు. అలా ఆ వీధుల్లో దుకాణాలు చూస్తూ, నడుస్తుంటే చిన్నచిన్న అద్దాలతో కుట్టిన అందమైన పర్సు ఒకటి నన్ను ఆకర్షించింది. దాన్ని ఇష్టపడి ధర అడిగాను. ఆ దుకాణాన్ని ఓ యువదంపతులు నడుపుతున్నారు. వారు చాలా ఉల్లాసంగా ఉన్నారు. ఆ అమ్మాయి సాదాసీదా దుస్తులతో, చిరునవ్వులతో ఆనందంగా ఉంది. అహ్మదాబాద్‌కు చెందిన నా స్నేహితురాలు బేరం చేయటం మొదలుపెట్టింది. ఇంతలో నా దృష్టి దుకాణం ప్రక్కనే చిన్న ఉయ్యాలలో కర్రబొమ్మతో ఆడుకుంటున్న పసిపిల్లాడిపై పడింది; ఏడాది వయస్సుంటుందేమో ఆ కుర్రాడికి! కేరింతలతో ఉయ్యాలలో ఆడుకుంటూ ఉన్నాడు. 'ఆ బాబు ఎవర'ని ఆ అమ్మాయిని అడిగాను. 'మా బాబే'అని మురిసిపోతూ చెప్పింది. 'బిడ్డను మార్కెట్‌కు ఎందుకు తెచ్చావు? ఇంట్లో ఎవరికైనా అప్పగించి రావచ్చు కదా!' అన్నాను. 'ఇంట్లో ఇంకెవరూ లేరు! ఇరుగుపొరుగు వాళ్ళది కూడా ఇదే వ్యాపారం. ఎవరి దుకాణానికి వారు వెళ్ళిపోతారు' అంది. 'బిడ్డను చూసుకుంటూ మరి పనెలా చేస్తావు?' అన్నాను. 'ఉదయం తెలవారకముందే లేచి ఎంబ్రాయిడరీ పని, ఇంటిపని అన్నీ పూర్తిచేస్తాను. బాబును మా ఆయన చూసుకుంటాడు. మధ్యాహ్నం ఆయన ఎంబ్రాయిడరీ చేస్తే నేను బిడ్డను చూసుకుంటాను. సాయంకాలం దుకాణాన్ని, బిడ్డను ఇద్దరం చూసుకుంటాం!' అంది. 'మీ బాబు వయస్సెంత?' అని అడిగాను. 'ఏడాది; ఈ రోజే పుట్టినరోజు. ఇంక పిల్లలు వద్దనుకున్నాం. మేం చదువుకోకపోయినా, వీడినన్నా చదివిస్తాం. కష్టపడి పనిచేస్తాం' అంటూ ఊయల ఊపసాగింది. మరోసారి బిడ్డను చూశాను, ఆరోగ్యంగా ఉన్నాడు. ఈ రోజు ఆ బాబు పుట్టినరోజు. హఠాత్తుగా ఆ ఐదునక్షత్రాల హోటల్‌లో పుట్టినరోజు పండుగ గుర్తొచ్చింది. ఎలాంటి వేడుక ఊసులేని చిన్నారిని చూస్తే మనస్సు కలుక్కుమంది. వెంటనే ఓ వంద రూపాయల నోటు తీసి వాడి చేతిలో పెట్టి, ముందుకు కదిలాను.

వెంటనే ఆ బాబు తల్లి నా వెనుకే పరుగెత్తుకొని వచ్చింది. 'దయచేసి మీ డబ్బు మీరు తీసుకోండి. మేము ఎవరి నుండీ ఏదీ ఆశించేవాళ్ళం కాదమ్మా!' అంది మనస్సు చిన్నబుచ్చు కుంటూ.! 'నన్ను తప్పుగా అర్థం చేసుకున్నావు. అది మీ కోసం కాదు. ఈ రోజు బాబు పుట్టినరోజు. మొదటి ఏడాది పుట్టినరోజు చేసుకున్న బిడ్డకు ఏదైనా బహుమతి ఇవ్వటం మా సంప్రదాయం. నా ఆశీస్సులుగా ఇస్తున్నాను. అంతే!' అన్నాను. ఆమె ముఖంలో వెలుగొచ్చింది. నేను వెనుతిరిగి వస్తుండగా, వెంటనే ఆమె నా కుడిచేయి పట్టుకొని పర్సు చేతిలో పెట్టింది. 'అమ్మా! మీరు డబ్బులిచ్చినందుకు బదులుగా ఇది ఇవ్వటం లేదు. ఎంతో మంది మా దగ్గరకు వస్తూంటారు. కానీ అందరూ మా దగ్గర వస్తువులే కొనుక్కొని వెళుతుంటారు. కానీ ఒక్కసారి కూడా ఎవరూ ఇలా మా గురించి అడగలేదు. మమ్మల్ని వ్యాపారులుగా చూసేవారే కానీ, మనుష్యులుగా చూసేవారు ఉండరు. మాతో ఏ సంబంధమూ లేని ఓ వ్యక్తి నా బిడ్డను ఇలా ఆశీర్వదిస్తున్నందుకు సంతోషంతో దీనిని ఇస్తున్నాను. ఈ ఖాళీపర్సును నింపేంత సొమ్ము నాకు దేవుడు ఇవ్వలేదు; కానీ ఇలాంటి పర్సులు నిండేంత ధనాన్ని భగవంతుడు మీకు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను' అంది. ఆమె కృతజ్ఞతకు నా కళ్ళు వర్షించాయి. ❖

సేకరణ : జి.సతీష్



# ప్రతి ఒక్కరూ కర్మయోగే!

**– స్వామి రంగనాథానంద**

ఈ ప్రపంచంలో ఎవరూ తాము చేసే పనిని, ఉద్యోగాన్ని అల్పమైందిగా భావించుకోకూడదు. అధికారి వృత్తి ఎంత విలువైందో, గుమాస్తా పని కూడా అంతే విలువైంది! కానీ, మనం చేసే పనిని ఎలా భావించుకుంటున్నాం, ఎలా నిర్వర్తిస్తున్నామన్న వాటి మీదే దాని ప్రాధాన్యం ఆధారపడి ఉంటుంది. నిజానికి మనలో పని చేసే ప్రతి ఒక్కరూ కర్మయోగే! అయితే, మనలో చాలామంది ఆఫీసర్ ఉద్యోగాన్ని కూడా గుమాస్తా మనస్తత్వంతో చేస్తూ ఉంటారు. అంటే చాలా నిరాసక్తంగా, తప్పదన్నట్లుగా ఆ బాధ్యతలను నెరవేరుస్తూ ఉంటారు. 'ఆ నాదేముంది! నా ఉద్యోగం చాలా చిన్నది; నాకు ఎక్కడా ప్రాముఖ్యం లేదు! నా గురించి చెప్పుకోవడానికి ఏమీ లేదు' వంటి ఆత్మన్యూనతను వెల్లడి చేసే మాటలు పనికిరావు.

మిమ్మల్ని మీరు తక్కువ చేసుకోవద్దు. సర్వసంగ పరిత్యాగులై మోక్షసాధనలో నిమగ్నులయ్యే సాధుపుంగవులకు ఎంత ప్రాధాన్యముందో, సమాజ హితానికి శ్రమపడుతున్న బాధ్యతాయుతమైన గృహస్థులకూ, ఉద్యోగులకూ కూడా అంతే ప్రాధాన్యముంది. కానీ దురదృష్టవశాత్తూ మనలో చాలా మందిలో తమను తాము న్యూనత పరచుకునే (degradation) అలవాటు పెరిగిపోయింది. ఇది వ్యక్తిగత జీవితంలో చాలా దుష్పరిణామాలకు దారితీస్తుంది. మీపై మీరు విశ్వాసాన్ని పెంచుకోండి. సన్న్యాసులు, సంఘసేవకులే సామాజిక కార్యకర్తలు కాదు. సాధారణ ఉద్యోగి నుంచి సామాన్య గృహిణి వరకు ప్రతిఒక్కరూ సమాజంలో ప్రభావశీలురే. ఉపనిషత్తులు, భగవద్గీత వంటి మన సనాతన ధార్మిక సాహిత్యగ్రంథాలన్నీ సమాజంలోని ప్రతి వ్యక్తినీ సాంఘిక కార్యకర్తగానే అభివర్ణించాయి. మీరు కళాశాల అధ్యాపకులే కావచ్చు, కార్యాలయ నిర్వాహకులే కావచ్చు, లేదంటే ఒక పరిశ్రమలో కార్మికులే కావచ్చు, వీధులను చిమ్మే అతి చిన్న పనివారే కావచ్చు – ఇలా పని స్థాయిలో మార్పు ఉండవచ్చు. కానీ చేసే సామర్థ్యంలో తేడా ఉండకూడదు. అందరూ ఈ సమాజమనే నందనవనాన్ని పెంచి పోషించే తోటమాలులరే!

**శ్రమంటే శారీరక ధ్యానం:** పని పూజ్యనీయమే కాదు; అదీ ధ్యానంతో సమానమే. ఒక స్పానిష్ క్యాథలిక్ మార్మికుడు అంటాడు 'Work is meditation through the body– దేహమే మాధ్యమంగా జరిగే పనే ధ్యానం' అనడం ఎంత అద్భుతమైన భావనో ఆలోచించండి! చేసే ప్రతి పనినీ ఆ భగవంతుడి కార్యంగా తలచి నిర్వహించినప్పుడు దానికి సార్థకత కలుగుతుంది. ఇలా పని కూడా ధ్యానమే అన్న దృక్పథం నిరంతరం మన మనస్సులో మెదులుతూ ఉండాలి. చిన్న పనైనా, పెద్ద పనైనా; నగరంలో కానీ, మారుమూల పల్లెలో కానీ ఎక్కడైనా ఈ భావంతో కర్తవ్యాన్ని నెరవేర్చగలగాలి. అప్పుడు ప్రత్యక్షంగా మనకూ, పరోక్షంగా సమాజానికీ ఆ పని వల్ల ఎన్నో సత్ఫలితాలు ఒనగూరుతాయి. వేలాది యువతీ యువకులు ఇలా అంకితభావంతో తమ, తమ బాధ్యతలను నిర్వర్తిస్తే అదొక సామూహిక శక్తిగా మన దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తును ప్రసాదిస్తుంది. చేసే పని మీద ఆరాధనను పెంచుకొని, జాగరూకతతో పూర్తి చేసే యువతరం గురించే స్వామి వివేకానంద కలలు కన్నారు.

**సామాజిక దక్షత... ఆధ్యాత్మిక దక్షత:** కర్తవ్యనిర్వహణలో పరిపూర్ణంగా విజయం సాధించాలంటే రెండు విషయాల్లో మనం సుశిక్షితులం కావాలి. ఒకటి బాహ్యంగా సమాజానికి కనిపించే 'సామాజిక దక్షత' (social efficiency), రెండు ఆంతరంగికమైన 'ఆధ్యాత్మిక దక్షత' (spiritual efficiency). సంఘంలో ఒక బాధ్యతాయుతమైన పౌరుడిగా, కార్యకర్తగా సంపూర్ణమైన 'సామాజిక దక్షత'తో స్పష్టమైన ఫలితాలు తీసుకురావచ్చు. సమర్థుడిగా పేరు తెచ్చుకోవచ్చు. కానీ ఇదొక్కటే మన కార్యదక్షతకు ప్రమాణం కాదు. పనిచేసే వ్యక్తి ఆంతరంగిక స్థితి, మానసిక సామర్థ్యమే అత్యంత ప్రధానమైంది. నేడు ప్రపంచంలో ఎంతో మంది పైకి చూడడానికి నైపుణ్యంగా పని చేస్తున్నట్లే కనిపిస్తున్నారు; కానీ ఆంతరంగికంగా వారు సుశిక్షితులు కాకపోవడంతో మానసికంగా అలజడికి గురవుతున్నారు. మానసిక అనారోగ్యం శరీరాన్ని కూడా శుష్కింపజేసినట్లు, ఇలాంటి మానసికస్థితి, చివరకు బాహ్యమైన సమర్థతను కూడా దెబ్బతీస్తుంది. యంత్రానికి కేవలం సాంకేతికపరమైన నైపుణ్యం ఉంటే సరిపోతుంది; కానీ మనిషికి అలా కాదు; అంతర్గతంగా ఉత్సాహపూరితమైన సామర్థ్యమే నిజమైన నైపుణ్యం. కాబట్టి మనం చేసే పనికి సామాజిక దక్షతతో పాటూ ఆధ్యాత్మిక దక్షత తోడైనప్పుడే నిజమైన కర్మయోగులం అవుతాం. ❖ **సేకరణ : ఆర్. కృష్ణ**

మనం చేస్తున్న పని ఎంత చిన్నదైనా, దాన్ని చక్కగా నిర్వర్తిస్తే మనం సంఘంలోనూ, జీవితంలోనూ అత్యధిక గౌరవప్రదమైన, మహత్తరమైన విధులను నిర్వహించే స్థితికి చేరుకుంటాం. -స్వామి వివేకానంద



## శ్రీరామకృష్ణుల నీతికథామార్గంలో

# వ్యక్తిత్వ వికాసం

- ఎమ్. రాంబాబు

మనలో చాలామంది ఏ పనినైనా ముందు ఉత్సాహంగానే ప్రారంభిస్తారు. కానీ అదే ఉత్సాహాన్ని చివరి వరకు కొనసాగించరు. పుట్టినరోజు, నూతన సంవత్సరాది... ఇలా ప్రతి పర్వదినంలో గొప్ప గొప్ప లక్ష్యాలను నిర్దేశించుకుంటారు. కానీ తరువాత ఏదో ఒక సాకు చూపి, కాలక్రమంలో వాటికి స్వస్తి పలుకుతుంటారు. ఇలా మనలో చాలామంది 'ఆరంభశూరులు'గానే మిగిలిపోతారు. ఇలాంటి తాత్కాలిక, ఉద్రేకపూరిత నిర్ణయాల వల్ల మనం జీవితంలో ఏ ఘనకార్యాలనూ సాధించలేం. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

# పట్టుదల ఉంటే పట్టిందల్లా బంగారం!

ఇలాంటి మందబుద్ధినీ, ఆరంభశూరత్వాన్నీ ఓ చక్కని నీతికథలో సునిశితంగా ఎండగట్టారు. దృఢదీక్షతో కడదాకా కష్టపడిన కర్షకుడికీ, కుంటిసాకుతో పని తప్పించుకొని నిష్ప్రయోజకుడిగా ఉండిపోయిన మరో రైతుకూ ఉన్న భేదాన్ని తేటపరుస్తూ కర్మవ్యాకులత ప్రాధాన్యాన్ని వివరించారు.

ఓ గ్రామంలో ఒకప్పుడు తీవ్రమైన అనావృష్టి సంభవించింది. చాలా దూరంలోని ఏటి నుంచి తన పొలంలోకి నీరు పారడానికి కాలువను తవ్వాలని ఒక రైతు మాత్రం దృఢనిశ్చయుడై ఉన్నాడు. పొలంలోకి ఏటినీరు పారేటంత వరకు, తాను కాలువను తవ్వడం ఆపనంటూ ప్రతిన పూనాడు. కాలువ తవ్వడానికి ఒకానొక రోజు శ్రీకారం చుట్టాడు. పని ప్రారంభించిన కొన్ని గంటల తరువాత, అతడు స్నానం చేసే వేళ అవడంతో అతడి భార్య, కుమార్తెతో నూనె పంపించింది. 'నాన్నా! ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. ఒంటికి నూనె పట్టించుకొని స్నానం చేయి' అంది కుమార్తె. 'ముందు నువ్వు ఇక్కడ నుంచి వెళ్ళిపో! ఇంకా ఎంతో పని చేయాల్సి ఉంది' అంటూ గద్దించాడు ఆ రైతు.

మధ్యాహ్నం వేళ దాటిపోయినా రైతు ఇంకా పొలంలోనే ఉండిపోయాడు. అప్పుడు అతడి భార్య పొలానికి వచ్చి 'నువ్వు స్నానం కూడా చేయలేదు? అన్నం చల్లారిపోతోంది. అన్నీ నువ్వు అతిగా చేస్తావు. మిగిలిన పని రేపు చేసుకోవచ్చులే! పోనీ కనీసం భోజనం అయ్యాకైనా చేసుకో' అంది. ఆ రైతు ఆవేశంతో ఆమెను తిట్టి, పలుగు పార పుచ్చుకొని ఆమెను తరుముతూ 'ఏమిటీ? నీకు ఏమైనా బుద్ధుందా? వర్షాలు బొత్తిగా లేవు. పంటలు ఎండిపోతున్నాయి. పిల్లలు ఏం తింటారు? మీరంతా పస్తుండి చావాల్సి వస్తుంది. ఈ రోజు పొలంలోకి నీరు తీసుకురాకుండా నేను స్నానం, భోజనం గురించి ఆలోచించనని శపథం చేశాను' అంటూ ఆమెపై విరుచుకుపడ్డాడు. ఆయన పట్టుదల చూసి భార్య అక్కడ నుంచి పరుగెత్తిపోయింది.

రైతు పగలంతా నిర్విరామంగా శ్రమించి, ఎట్టకేలకు సాయం కాలానికి తాను తవ్విన కాలువను ఏటితో కలుపగలిగాడు. తరువాత, ఆ రైతు తాపీగా కూర్చుని మర్మరధ్వనితో నీరు తన పొలంలోకి పారడం సంతృప్తిగా చూడసాగాడు. అతడి మనస్సు శాంత్యానందాలతో నిండిపోయింది. అతడు అప్పుడు ఇంటికి వెళ్ళి భార్యను పిలిచి, 'ఇప్పుడు ఆ నూనె పట్రా! స్నానానికి నీళ్ళు సిద్ధం చేయి' అన్నాడు. తరువాత ప్రశాంతంగా అతడు స్నానం చేసి, తృప్తిగా భోజనం చేసి, హాయిగా నిద్రపోయాడు.



ఈ రైతు కనబరచిన దృఢసంకల్పం ప్రతి తీవ్ర కర్మపరాయణత్వానికి ప్రతీక.

అదే గ్రామంలో మరో రైతు ఉన్నాడు. అతడు తన పొలంలోకి నీరు పారడానికి ఒక కాలువ తవ్వుతున్నాడు. అతడి భార్య కూడా పొలానికి వచ్చి ఇలా అంది – 'ఇప్పటికే ఆలస్యం అయింది. ఇంటికి రా! అతిగా పనిచేయాల్సిన అగత్యం ఏమీ లేదు'. ఆమె మాటలకు అతడు ఏ మాత్రం అడ్డుచెప్పకుండా పలుగు, పార పక్కన పెట్టి భార్యతో 'సరే, నువ్వు అంతగా అంటున్నావు కాబట్టి ఇంటికి వస్తున్నాను' అంటూ ఆమెను వెంబడించాడు. ఆ రైతుకు తన పొలానికి నీరు పారించుకోవడం ఎన్నటికీ సాధ్యం కాలేదు. ఇదే సోమరితనానికీ, ఆరంభశూరత్వానికీ నిదర్శనం.

శ్రీరామకృష్ణులు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని ఉద్దేశించి బోధించిన ఈ కథను మనం లౌకికజీవనానికి కూడా అన్వయించుకొని ముందుకు సాగిపోవచ్చు. తీవ్రవ్యాకులత లేకుండా మనిషి ప్రాపంచికంగా కూడా ఏ ఘనవిజయాన్నీ సాధించలేడు. ముఖ్యంగా నేటి తరం పట్టుదలతో అనుకున్న లక్ష్యాన్ని చేరుకోవడానికి సంసిద్ధమై ఉండాలి. పట్టుదల ఉంటే పట్టిందల్లా బంగారమవుతుందని నిరూపించాలి. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో !

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,
6-6-1948

**ప్రియమైన సి.ఆర్. దాస్!***

ఈ ప్రపంచయానం అడుగడుగూ కంటకప్రాయమే. ఈ కంటకావృతమైన అరణ్యంలో నడుస్తూ నడుస్తూనే మన జీవితాలు గడచిపోతున్నాయి. నువ్వు క్రొత్త యాత్రికుడివి కదా! మరింత బాధననుభవిస్తావు. నేను ఎంతోకాలంగా ఈ బాటలో నడుస్తున్నాను. అందువల్ల నాకు ఈ బాధ అలవాటైపోయింది.

ప్రారంభ దశలో నేను కూడా నీ లాగానే స్థిమితం లేకుండా ఉండేవాణ్ణి. నీ కన్నా ఎక్కువగా ఆలోచించేవాణ్ణి. నేను 'మ' (మహేంద్రనాథ్ గుప్తా) గారి వద్దకు వెళ్ళినప్పుడు ఆయన నన్ను దివ్యజనని శారదామాత వద్దకూ, స్వామి బ్రహ్మానందజీ వద్దకూ పంపేవారు. దాని వల్ల నా బాధేమీ మటుమాయం కాలేదు. కానీ, బాధలు భరించేందుకు కావాల్సిన శక్తి సమకూరేది. మనం అంతులేని విశ్వాసంతో వందలాది అడ్డంకులనైనా అధిగమించి ముందుకు సాగుతాం.

నా ప్రియమైన చిత్తా! బాధపడకు. ఈ బాధల్ని భరించడం అలవాటు చేసుకో. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ ఇలా అంటాడు:

**మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽ నిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥** *(భగవద్గీత - 2.14)*

'ఓ అర్జునా! ఇంద్రియాల వలన చలీ, వేడీ, సుఖమూ, దుఃఖమూ మొదలైనవి కలుగుతూంటాయి. అవి వస్తూ పోతూ ఉంటాయి, అనిత్యమైనవి. వాటిని సహించాలి'.

గురుమహరాజ్ మన దారిలోనున్న ముళ్ళపొదలన్నిటినీ అణగద్రొక్కి, మనకు మార్గం సుగమం చెయ్యడానికి అవతరించారు. ఆ పాదముద్రలను అనుసరిస్తే కష్టాలను భరించే శక్తి కలుగుతుంది, మన ప్రయాణం సుఖవంతమవుతుంది.

నీవు యువకుడివి. కొన్ని వందల జన్మల తాలూకు అనుభవాల జ్ఞాపకాలు నీలో మేల్కొని ఘోషపెడుతున్నాయి. అందుచేతనే నీ మనస్సు, శరీరాలు అప్పుడప్పుడూ అలజడికి గురవుతున్నాయి. ఇవేవీ చివరి వరకూ మిగలవు.

'నేను ఈ శరీరాన్ని కాను, ఈ మనస్సును కాను, ఈ బుద్ధిని కాను. ప్రతిరోజూ గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఈ శరీరం, మనస్సు, బుద్ధి వీటికి ఆవల నేను ఉంటున్నాను. ఆ సమయంలో ఆకలిదప్పులు లేవు. అంతా ప్రశాంతత, నిశ్చలత' అనే ఈ విషయాన్ని సదా గుర్తుంచుకో.

నా తల్లికి సేవ చేయాలనే కాంక్ష నాలో బలీయంగా ఉండేది. నేను ఆమెను దేవతలా భావించేవాణ్ణి. నీవు కూడా నీ తల్లికి సేవ చేయి. నీ తల్లిని సాక్షాత్తూ శారదామాతగా భావించు.

ఈ ప్రపంచం అశాశ్వతమనే భావన యౌవనంలో కలగడం చాలా కష్టం. దరీ, అంతూ లేని ఈ సంసార మహాసాగరంలో అనేక వందల వేల సార్లు పడి కొట్టుకుంటూ చేదు గుటకలు వేస్తూనే ఉంటాం. తృణమాత్రమైనా ఒడ్డుకు చేర్చే ఆధారం కోసం ప్రాకులాడతాం. నువ్వు చిన్నవాడివి. అధైర్యపడకూడదు. అధైర్యపడ్డావో అడుగంటా లాగబడతావు.

మనకు ఇప్పుడు ఒక్కటే మంత్రం – 'స, స, స' – సహనం, సహనం, సహనం. మనం గురుమహరాజ్, స్వామీజీల జీవితాలను ఆదర్శంగా చేసుకొని జీవించగలిగినప్పుడు ఈ చిన్న చిన్న సంతోషాలు, దుఃఖాలు మన మనోనిశ్చలతలను భంగపరచలేవు.

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**

(*చిత్తరంజన్‌దాస్ కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో స్వామి ముముక్షానందగా ప్రసిద్ధులు)

**ఎలాంటి పరిస్థితులనైనా ఎదిరించు. గ్రహతారలు గతులు తప్పినా, లోకమంతా నిన్ను ప్రతి ఘటించినా భయపడకు. భయపడటం వలన నీవు ఏ ఆపద నుండీ తప్పించుకోలేవు. - స్వామి వివేకానంద**

(...15వ పేజీ తరువాయి.)

**అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

'ఎవరైతే అనన్యమనస్సుతో నన్నే సదా స్మరిస్తారో, ఉపాసిస్తారో అలాంటి యోగనిష్ఠులైన వారి యోగక్షేమాలను నేనే భరిస్తాన'ని హామీ ఇచ్చాడు శ్రీకృష్ణపరమాత్మ.

'నేను' అన్న అహంకారం దూరమైతేనే, మాధవుడి పాదాలే శరణ్యమనే వినయం, విధేయత అలవడుతాయి. లేనట్లయితే మన ప్రజ్ఞాపాటవాలకూ, విద్వత్ వైభవాలకూ మనమే కారణ మనుకునే అహంభావం, దురభి మానం పుట్టుకొస్తాయి. ఇలాంటి భేషజాలేవి లేని ఈ భాగవతోత్తముడు తన భుజబలం ఆ భక్తరక్షకుడి చక్రాంకితమే అని కొనసాగిస్తూ...



**పొందుగ చక్రాంకితమే భుజబలమిదె నాకు**
**అందిన హరి నీ చింతే ఆత్మబలము నాకు**
**సందడి పేరుబలము కేశవనామము నాకు**
**యిందును నందును భవభయ మికలేదిదే నాకు...** అంటున్నాడు. 'చక్రాంకితం' అంటే వైష్ణవభక్తులు చేతి దండ మీద విష్ణువు యొక్క చక్రాకృతిగా కాల్చుకున్న గుర్తు. అదే తనకు భుజబలమనీ, ఇక ఆ శ్రీమన్నారాయణుణ్ణి చింతించడమే ఆత్మబలమనీ, కేశవనామాన్ని మించిన పేరుబలం వేరేదీ లేదనీ, తుదకు ఎక్కడైనా, ఈ 'భవభయం' అంటే సంసార భయమిక లేదనీ నిశ్చింతగా పాడుకుంటున్నాడు. 'సందడి' అంటే సంధానించు, కలుపు అని అర్థం. ఆ ప్రసన్నమూర్తి పేరు పిలిచినంతనే బలం వస్తుందని పరోక్షంగా మనకు ప్రస్ఫుటం చేస్తున్నాడు.

### నీ గుణరాసులే రాసిబలం...

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస అహేతుకమైన భక్తి ఎంతో గొప్పదనేవారు. కేవలం భగవంతుడే ఆధారంగా జీవించమని బోధించేవారు. అందుకు ఉదాహరణగా హనుమంతుణ్ణి గుర్తుచేస్తూ, 'తిథి, వార, నక్షత్రాలు ఏవీ ఎరుగను. కేవలం నేను రామచింతన మాత్రం చేస్తానన్న ఆ ఆంజనేయుడి లాంటి భక్తి ప్రతి ఒక్కరిలో పెంపొందాలని' అనేవారు. అలా ఆరాధించడమే నిజమైన ఆరాధన! అలా సర్వబలాలూ శ్రితపరిపాలకుడేనంటూ...

**అంగపు తిరుమణులివి పంచాంగ బలము నాకు**
**సంగతి నీపై పాటలె స్వరబలిమిదె నాకు**
**రంగుగ నీ గుణరాసులే రాసి బలము నాకు**
**యింగితముగ నిహపరముల కెదురే దిదేనాకు...** ఈలోకంలో కానీ, పరలోకంలో కానీ తనలాంటి భక్తులకు ఎదురేమీ ఉండదంటున్నాడు అన్నమయ్య. 'తిరుమణి' అంటే నుదుట దిద్దుకునే నామం. 'రంగుగ' అంటే సొంపుగా అని భావం. ఆ నీరజనాభుడి నామాన్ని నుదుటన దిద్దుకొని, ఆ పద్మనాభహరి సుగుణరాసుల్ని తలచుకుంటూ, పాటలుగా పాడుకుంటూ పులకించిపోతే అదే పంచాంగబలం, స్వరబలం, మీన మేషాది రాశిబలాలతో పాటు సర్వబలం! అలాంటి భక్తజనానికి లౌకిక, పారలౌకిక ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి. 'రాశి'కి రూపాంతరమే 'రాసి'. మూలవిరాట్టయిన ఆ మంగళాకారుణ్ణి వదలి... గ్రహాలు, రాశులు, పంచాంగాలు, పేరు బలాలు... అనుకుంటూ ఎంత తిరిగినా లాభం లేదు. అసలైన వ్యక్తిని ప్రసన్నం చేసుకుంటే మిగతావన్నీ వాటంతట అవే అనుకూలమవు తాయన్నదే వాస్తవం.

### నీ విగ్రహమే గ్రహబలం...

గ్రహ, వాస్తు తదితర దోషాలేవీ నిజమైన భక్తుడిపై ప్రభావం చూపవు. మహాకవి ధూర్జటి కూడా ఇదే ధీమాతో ఓ శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను అర్చిస్తూ, శుభకరమైన నీ నామాన్ని ఎల్లవేళలా తలచే మహాత్ములను గ్రహదోషాలు, చెడుశకునాలు బాధపెట్టగలవా! ఎక్కడైనా మిడతల గుంపు అగ్నిని కప్పివేయ లేదుకదా! ఈ విషయం తెలిసికూడా మానవులు నిన్ను సేవించి, తమ కష్టాలను తొలగించుకోలేకపోతున్నారని ఆవేదన పడుతూ...

**గ్రహదోషంబు దుర్నిమిత్తములు నీ కల్యాణనామంబు ప్ర**
**త్యహమున్ బేర్కొనునుత్తముల బాధంబెట్టగానోపునే**
**దహనుంగప్పగ జాలునే శలభ సంతానంబు? నీ సేవచే**
**సి హతక్లేశులుగాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా!...** అంటాడు. ఇలా ఆపద్బాంధవుణ్ణి ప్రత్యక్షం చేసుకొని తరించిన భక్తశిఖామణులంతా ఒకే అనుభూతిని పొందారు. ఆ అనాథరక్షకుడి నిరాకారంలోనే కాదు, సాకారంలో కూడా ఎంతో శక్తి ఉంటుందని వెల్లడి చేశారు. అందుకే

**కనుగొను నీ విగ్రహమే గ్రహబలమిదె నాకు**
**విను నీ దాసుల సేవే వెనుబలి మిదెనాకు**
**తనరిన శ్రీవేంకటపతి దైవబలము నాకు**
**ఘనమే చెప్పగ నింతట కలిగెబో యిదే నాకు...** అంటూ కలియుగ వైకుంఠమైన తిరుమలలో వెలసిన ఆ వేంకటేశుడి విగ్రహమే గ్రహబలమనీ, చివరకు భగవంతుడి భక్తులకు సేవచేయడమూ వెనుబలమేననీ, ఇన్నిమాట లెందుకయ్యా, 'తనరిన' అంటే అతిశయించిన ఆ వేంకటపతే తనకు దైవబలమని చెప్పుకోవడమే ఘనమనీ పొంగిపోతున్నాడు ఈ పావనచరితుడు అన్నమయ్య. ❖

# ధైర్యమే శ్రేయస్సుకు ఆధారం

– ప్రయాగ రామకృష్ణ

దుర్దశలలో ధైర్యంగా ఉండటమే కర్తవ్యమనీ, ధైర్యం వల్లే సర్వం సానుకూలమవుతుందనీ, సుఖమైనా సరే – దుఃఖమైనా సరే, అనుభవించడం కంటే గతిలేదనీ భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు.

మహాసంపదతో వెలుగుతూండే బలి చక్రవర్తి విధివశంవల్ల ఒకసారి గాడిద అయ్యాడు. ఆ సంగతి బ్రహ్మవల్ల తెలుసుకున్నాడు ఇంద్రుడు. ఖర రూపంలో ఉన్న బలిని చంపనని బ్రహ్మకు మాట ఇచ్చి, ఆ గార్దభం ఆచూకీ తెలుసుకుని వెళ్ళాడు. 'అయ్యో పాపం! ఎన్నో ఏనుగులు చుట్టిరాగా భద్రగజం మీద ఊరేగేవాడివి. అప్పుడు మమ్మల్ని కాసుకుకూడా లక్ష్య పెట్టేవాడవు కావు. ఇప్పుడిలా గాడిదవయ్యావా? బంగారు యూపస్తంభం నాటించి యజ్ఞం చేసేవాడివి. ఇప్పుడీ ఖర్మ పట్టిందా? నిన్ను చూస్తుంటే బాధగా ఉంది నాకు' అన్నాడు.

అందుకు బలి నవ్వుతూ 'నువ్విప్పుడు అధికుడవు. అల్పుల దగ్గర బీరాలు పలకడం తగదు. ప్రాణులన్నీ కాలాన్ననుసరించి సుఖదుఃఖాలు పొందుతూంటాయి. ఆ సంగతి తెలుసుకో. గర్వపడకు' అని ఇంద్రుడితో అన్నాడు. ఇంతలో బలి శరీరం నుండి ఒక అందమైన స్త్రీ బయటకు వచ్చింది. ఇంద్రుడు ఆశ్చర్యపోతూ, 'ఎవరీమె?!!' అని అడిగాడు. 'ఆమెనే అడుగు' అన్నాడు బలి. ఇంద్రుడు అడిగాడు.

'శ్రీ, భూతి, లక్ష్మి అని మూడు పేర్లు నాకు. నువ్వే కాదు, ఏ యుగాల్లోనూ ఎవరూ నన్ను ఎరుగరు' అందామె.

'ఇప్పుడు ఇతగాణ్ణి ఎందుకు విడిచిపెట్టేస్తున్నావ్?'

'సత్యం, ధర్మం, దానం, దమం, పరాక్రమం, వచన మాధుర్యం ఉన్నచోటే ఉంటాను నేను. ఇన్నాళ్ళూ సచ్చరితంగానే ఉన్నాడు. ఈమధ్యనే ఈర్ష్యాద్వేషాలు, అసూయ పొడసూపాయి ఇతనిలో. అందుకని ఇతన్ని విడిచిపెడుతున్నాను నేను' అంది.

అది విని బలి ఏం దిగులు చెందలేదు. అంతా విధివిధానం అనుకుని శాంతిపొందాడు.

నిజమే! కాలంవల్లే జనులకు కర్మ పరిపాకం కలుగుతోంది. లేకపోతే ఒకరికి ఒక సమయంలో హీనస్థితి కలుగుతూంటే మరొకరికి అదే విక్రమకాలం ఎలా అవుతోంది? అంతా కాలమహిమ. చెడుకాలం దాపురించేసరికి చేయ కూడని పనులు చేయవలసినవిగా కనిపిస్తాయి. బుద్ధి వక్రమార్గాన పడుతుంది. పక్కవాడి సొమ్ము పరమాన్నంలా, పరదార పంచదారలా అనిపిస్తుంది.

లేకపోతే శుక్రాచార్యుడి నీతిశాస్త్రాన్ని ఔపోసన పట్టిన రావణబ్రహ్మ సీతను అపహరించుకు పోవడమేమిటి? నిండు పేరోలగంలో దుశ్శాసనుడు ద్రౌపదిని వివస్త్రను చేయడమేమిటి? అందుకు దుర్యోధనుడు, కర్ణుడూ మొదలైన వాళ్ళంతా పగలబడి నవ్వడమేమిటి? వినాశకాలం వచ్చినవాళ్ళకు అన్నీ విపరీత బుద్ధులు పుడతాయి.

అన్ని పరిస్థితుల్లోను ధైర్యంగా ఉండాలంటూ భీష్ముడు ధర్మరాజుతో ఇలా చెప్పాడు :

**పుత్ర దారైః సుఖైశ్చైవ విముక్తస్య ధనేన ।**
**మగ్నస్య వ్యసనే కృచ్ఛ్రే ధృతిః శ్రేయస్కరీ నృప ॥**

'కట్టుకున్న భార్య, కన్నబిడ్డలూ దూరమైనా, చేతిలో చిల్లిగవ్వ లేకపోయినా, కష్టాలన్నీ ఒకేసారి కూడబలుక్కుని దండెత్తివచ్చినా, ధైర్యం విడువకుండా ఉంటే శ్రేయస్సు దానంతటదే కలుగుతుంది'.

ఇంతకూ భీష్మపితామహుడు చెప్పిందేమిటంటే, 'ఎంతటివారైనా కాలానికీ, ఏటికీ ఎదురీదలేరు. కాలమే అన్నిటికీ కారణం. కాలం కారణంగానే మనుష్యులు నిన్న ఉన్నట్లు ఈరోజు లేరు. ఈరోజు ఉన్నట్లు రేపు ఉండరు. కాలమే ఎవర్ని ఏ దశకు తీసుకువెళ్ళినా, ఎవర్ని ఏ స్థితికి చేర్చినా! కాలగమనంలో సుఖదుఃఖాలు, ఉత్థానపతనాలు సహజమని తెలుసుకొని ధైర్యంగా ఉండగలిగేవాడు శాంతివంతుడై జీవిస్తాడు'. ❖

కట్టుకున్న భార్య, కన్నబిడ్డలూ దూరమైనా, చేతిలో చిల్లిగవ్వ లేకపోయినా, కష్టాలన్నీ ఒకేసారి దండెత్తివచ్చినా, ధైర్యం విడువకుండా ఉంటే శ్రేయస్సు దానంతటదే కలుగుతుంది. – భీష్మపితామహుడు

- స్వామి విశారదానంద

బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.

# సంకల్పబలంతో సాఫల్యం!

చేసే ప్రతి పని యందు పట్టుదల, దృఢ సంకల్పం కలిగి ఉండటమే 'స్థైర్యం' అనబడుతుంది. క్షణానికొకవిధంగా ఉండటం వల్ల నిజమైన పని ఎన్నడూ సాధింపబడదనే విషయం జగమెరిగిన సత్యమే! దృఢంగా, స్థిరంగా ఉంటేనే లక్ష్యాన్ని చేరుకోవచ్చు. ఒక క్రమపద్ధతిలో పనులు చేయాలంటే ఎవరికైనా దాని (స్థిరంగా పనిచేయడం) ప్రాధాన్యం గురించి, దాని అవసరం గురించి నమ్మకం కలగాలి. ఆ విశ్వాసం కలగాలంటే సరియైన సాంగత్యం ఉండాలి. దృఢంగా, స్థిరంగా ఆధ్యాత్మిక జీవితం గడపదలచుకున్నవారు- భగవత్సాక్షాత్కారమే తమ జీవిత లక్ష్యమని దృఢంగా విశ్వసించినవారితో కలిసి జీవించాలి.

స్థిరంగా ఉండటమనేది మానసిక స్థిరత్వాన్ని సూచిస్తుంది. భగవద్గీతలో అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి మాటిమాటికీ జీవితంలో శ్రేష్ఠమైన కర్మ ఏదని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా శ్రీకృష్ణ పరమాత్మ మోక్షమే అన్నిటి కన్నా ముఖ్యంగా పొందదగినదనీ, దానికి సన్న్యాసమే మార్గమనీ తెలిపారు. కానీ 'సన్న్యాసం' అనేది తగిన యోగ్యత, అర్హత కలవారికే శ్రేష్ఠమైన మార్గం. ఆ అర్హత లేనట్లయితే, సరియైన విధంగా 'కర్మ'ను ఆచరించడమే మంచిది. జీవిత పరమలక్ష్యం మోక్షమనీ, దాన్ని పొందడానికి సన్న్యాసమే శ్రేష్ఠమైన మార్గమనీ తెలుసుకున్న అర్జునుడు, తాను అందుకు తగిన అర్హత లేనివాడినని గుర్తించాడు. ఆ విషయం శ్రీకృష్ణునికి కూడా తెలుసు. అందుకనే శ్రీకృష్ణుడు 'జీవితపోరాటం' చేయాల్సిందిగా అర్జునుడికి చెబుతాడు. అంటే సంప్రదాయబద్ధంగా సన్న్యాసం తీసుకునే బదులు అర్జునుడు కర్మను ఆచరిస్తూ, 'కర్మయోగి' అవ్వాలనేది శ్రీకృష్ణుని ఆకాంక్ష.

క్షత్రియకులంలో జన్మించిన అర్జునుని శరీరనిర్మాణం, మానసిక స్థితి పూర్తి రాజసిక ప్రవృత్తితో నిండి ఉంది. కాబట్టి, అతను ఆధ్యాత్మిక జ్ఞానం కావాలని అనుకున్నా, 'కర్మ' చేయడమే అతనికి అన్ని విధాలా అనువైన, శ్రేష్ఠమైన మార్గం. నిజానికి ఆత్మ జ్ఞానం, కర్మమార్గం ఒకదానికొకటి వ్యతిరేకం కాదు. అవి ఒకే హారంలోని రెండు పూసలు. సరియైన విధంగా ఆచరించిన కర్మ ఆత్మజ్ఞానం పొందడానికి అత్యావశ్యకమైన మానసిక పరిశుద్ధతకు తోడ్పడుతుంది.



అర్జునుడు ఈ జీవితపు ప్రణాళికను స్పష్టంగా అర్థం చేసుకున్నాడు. ఆ ప్రణాళిక ఏమంటే 'నీ ధర్మాన్ని నీవు నిర్వర్తించు (స్వధర్మము), అది మనస్సును పవిత్రం చేస్తుంది. చివరకు బాహ్యకర్మను వదిలి, వేదాంత సత్యాలపై మనస్సు నిలిపి తీవ్రంగా ధ్యానించాలి. సాధన గురించి బాగా తెలిసిన వారు తెలిపే మూడు సోపానాలున్నాయి. మొదట సత్యం గురించి వినాలి (శ్రవణం). దాని గురించి తీవ్రంగా ఆలోచించాలి (మననం). మనస్సులోని మాలిన్యాలనూ, సందేహాలనూ ఆ విధంగా తీర్చుకున్న తరువాత తాను తెలుసుకున్న సత్యాలపై ధ్యానం (నిధి ధ్యాసనం) చేయాలి. ఈ పద్ధతిని అనుసరించడం ద్వారా సత్యంలో సుప్రతిష్ఠమై, చివరకు ఆత్మజ్ఞానం పొందడానికి అర్హులవుతారు.

ఈ ప్రణాళికను స్పష్టంగా అవగాహన చేసుకున్నవ్యక్తి తానీ ప్రణాళికలో ఏ దశలో ఉన్నాడో తెలుసుకోవాలి. కొన్ని మహానగరాలలో గానీ, పెద్ద ప్రాంగణాలున్న చోట గానీ మొత్తం ఆ ప్రదేశం యొక్క చిత్రపటం (మ్యాపు) చూపించి 'మీరిక్కడున్నారు' అని మనమున్న ప్రదేశాన్ని గుర్తించేలా చేస్తారు. ఎక్కడున్నామో తెలుసుకొని, అక్కడ నుంచి మనం వెళ్ళవలసిన ప్రదేశానికి సరియైన మార్గాన్ని ఎన్నుకుంటాం. అదేవిధంగా ఈ 'సంసారచక్రం'లో ఎక్కడున్నామో తెలుసుకోవాలి. అంటే మానసిక స్థితినీ, మన పరిపక్వతనూ, మన మానసికబలాన్నీ, ప్రాపంచిక ధోరణులనూ, మన మనస్సునూ, ఇంకా అనేక ఇతర విషయాలన్నిటినీ ఆత్మపరిశీలన చేసుకోవాలి. మనం ఎక్కడున్నామో తెలుసుకొని, ఆ జీవితదశకు అనుకూలమైన శ్రేష్ఠమార్గాన్ని ఎంచుకొని, అవలంబించాలని శాస్త్రాలు తెలియజేస్తున్నాయి. ఈ అంతర్గత దశలను తప్పక అనుసరించాలి. ఇది చేయాలంటే మనకు 'ఇప్పుడు' ఏది అవసరమో గుర్తించి, దాని యందు 'నిశ్చయాత్మక బుద్ధి' (పురుషార్థ నిశ్చయం) తో ఉండాలి.

జీవితం స్వల్పకాలికమైనదీ, అనేక దోషాలు, ప్రలోభాలతో కూడినదీ కాబట్టి మనకేమి కావాలనేది అతి త్వరగా నిశ్చయించుకోవాలి. బాహ్యమైన విషయాలతో పోరాటం చేస్తూ జీవితాన్ని గడిపేద్దామా? 'ఇతరులను సరిచేయడమా' లేక మనల్ని మనం సరిచేసుకోవడమా? ఇతరులను మార్చే ముందర మనల్ని మనం మార్చుకోవలసిన అవసరం ఉందని భావిస్తే, మన అంతరంగంలోకి మనం మరలాలి.

దృఢమైన బలశాలి కావాలంటే, వ్యాయామంతో శరీరాన్ని దృఢంగా చేసుకోవాలి. వ్యక్తి ఇతరులను నిందించడమో, లేదా తాను వ్యాయామం చేస్తున్న ప్రదేశంలోని ఎత్తుపల్లాలను సరి చేయడమో చేయగూడదు. అదే విధంగా, ఆధ్యాత్మిక సాధకుడు జీవితంలో తానెదుర్కొనే పరిస్థితులకు ఎలా సర్దుకు పోవాలో తన మనస్సుకు మాటిమాటికీ బోధిస్తూవుండాలి. 'లక్ష్యం' స్పష్టంగా ఉంటే 'మార్గం' కూడా స్పష్టం అవుతుంది. లక్ష్యమే స్పష్టంగా లేకపోతే, ఏమీ నేర్చుకోలేము. నీటి కోసం బావిని అనేక ప్రదేశాలలో తవ్వుతుంటే, ఎక్కడా నీరు పడదు. అందుకు బదులు ఒకే చోట తవ్వుతుంటే తప్పక నీరు లభ్యమవుతుంది. అందుకనే ప్రతి ఒక్కరూ తమ ప్రయత్నాలలో స్థిరంగా ఉండాలి.

జీవితంలో ఒక పద్ధతికి అంకితం అవ్వాలన్నా, లేక స్థిరంగా ఉండాలన్నా అవగాహన చాలా స్పష్టంగా ఉండాలి. అలాంటి స్పష్టత తీవ్రమైన పరిశీలన, ఆలోచన లేకుండా రాదు. ఒక సంస్కృత శ్లోకంలో ఈ విధంగా చెప్పబడింది.

**కాష్ఠాదగ్నిర్జాయతే మధ్యమానాత్**
**భూమిస్తోయం ఖన్యమానాత్ దదాతి ।**
**సోత్సాహానాం నాస్తి అసాధ్యం**
**కించిత్ మార్గారబ్ధాః సర్వేయత్నాఃఫలన్తి ॥**

'రెండు ఎండు కట్టెలను రుద్దితే అగ్ని జనిస్తుంది. భూమిని త్రవ్వితే నీటినిస్తుంది. ఉత్సాహం ఉంటే అసాధ్యమైనదేదీ లేదు. అందుచేత సరియైన మార్గాన్ని ఎంచుకొని, ఆ మార్గంలో నడిస్తే, లక్ష్యాన్ని సాధించగలుగుతావు'. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో – 'స్థైర్యం' రెండవ భాగం ')

(...21వ పేజీ తరువాయి.)

## శ్రీరామకృష్ణ అవతారతత్త్వం... అవలోకనం

రామకృష్ణమఠం ఆవిర్భవించక ముందు సనాతన మఠాలు సమాజానికి సంబంధించిన బాగోగులను గూర్చి పట్టించుకొనేవి కావు. ఆ మఠం నెలకొల్పబడిన పిమ్మట విద్యాలయాలు, వైద్యశాలల నిర్వహణ, దైవికమైన విపత్తులు సంభవించినప్పుడు సహాయక, సేవా కార్యక్రమాలు చేపట్టడం, ఆధ్యాత్మిక మార్గంలో ఉండేవారికి అవశ్యం అనుష్ఠించదగిన కార్యక్రమాలన్న సంప్రదాయం స్థిరపడింది. ఇది శ్రీరామకృష్ణుల అవతారం వల్ల కలిగిన మహోదయమే.



వేద శాస్త్రాలలో పలు సిద్ధాంతాలు ప్రతిపాదితమై ఉంటాయి. ఆ సిద్ధాంతాలకు ప్రత్యక్ష నిదర్శనంగా భాసించింది శ్రీరామకృష్ణుల దివ్య జీవితమని ఎందరో అభిజ్ఞులు వేనోళ్ళ శ్లాఘించి ఉన్నారు.

శ్రీరామకృష్ణులు ఆధునిక పరిపూర్ణావతారం. జ్ఞానం, భక్తి, వైరాగ్యం, సేవ, త్యాగం – ఇత్యాది గుణాలన్నీ రూపుదాల్చిన మూర్తి శ్రీరామకృష్ణులు.

సదాచారానికి భ్రంశం కలిగినప్పుడు, మూఢాచారాలు ప్రబలినప్పుడు కుల, మత వైషమ్యాలు గూడుకట్టుకొన్నప్పుడు – మానవ జాతికి వాటిల్లిన ప్రమాదాలను నివారించి, జడత్వాన్ని రూపుమాపి, చైతన్యాన్ని నింపడానికి అవతరించిన శ్రీరామకృష్ణావతారానికి జయమగు గాక!

**లోకోత్తరస్య ధర్మస్య స్థాపనార్థం సమాగతమ్ ।**
**అవతార వరిష్ఠం తం రామకృష్ణం భజామ్యహమ్ ॥** ❖

మార్పు వలన సంకల్పం బలపడదు. అది బలహీనమై మార్పులకు బానిసవుతుంది. కాబట్టి మనం మార్పుల్ని ఎప్పుడూ జీర్ణించుకోవాలి. అప్పుడు సంకల్పం మరింత బలపడుతుంది. – స్వామి వివేకానంద

# బుసకొట్టు! కాటువేయకు!

కథమూలము : భగవాన్ శ్రీరామకృష్ణులు
తెలుగుసేత : తాడిమేటి సత్యనారాయణ
బొమ్మలు : దాకోజు శివప్రసాద్

1 ఒక అందమైన గ్రామం. బాలురు చెడుగుడు ఆడే స్థలం. ఒక అబ్బాయి మామిడిచెట్టు ఎక్కి పండ్లను కోసి క్రింద పడేశాడు. మిగిలిన అబ్బాయిలు పడిన పండ్లను ఏరుకొన్నారు. కొన్ని పండ్లు కొంచెం దూరంలో పడ్డాయి.




2 మొదటి బాలుడు పండ్లను ఏరుకొంటున్నాడు. అప్పుడు ప్రక్కనున్న పుట్ట నుండి ఒక పాము తల బయట పెట్టింది.




అక్కడ పామును చూడగానే బాలురు ఆ ప్రక్కకు రాకుండా భయపడి పరుగెత్తారు.

3 ఒకనాడు యువ బ్రహ్మచారి ఒకడు మామిడి తోటలో ప్రవేశించాడు. చెడుగుడు ఆడుకొంటున్న బాలురు పరుగున వచ్చి....




4 బాలురు చూస్తుండగానే బ్రహ్మచారి తోటలో ప్రవేశించి... పాము పుట్ట దగ్గరకు వెళ్ళాడు. అది బుసకొడుతూ పుట్ట నుండి బయటకు వచ్చి బ్రహ్మచారి వైపు దూసుకొచ్చింది.






ఎవరూ అంతవరకు ఆ పాముతో అలా ప్రేమగా మాట్లాడ లేదు. బ్రహ్మచారి చూపిన ప్రేమకు చలించిన పాము తన దుర్గుణాన్ని వదిలేసింది.


5
స్వామీ! నా తప్పును మన్నించండి. ఇంతవరకు నా తప్పును ఎవరూ సరిదిద్దలేదు.
నువ్వు ఎవ్వరికీ కష్టం కలిగించకు. అందరి పట్లా ప్రేమతో వ్యవహరించు. నీకు ఈ దివ్య మంత్రాన్ని ఉపదేశిస్తున్నాను. సదా జపిస్తూండు.
'ఇక నేను ఎవరినీ హింసించను. వీరే నా గురువు. వీరి లాగా నేను కూడా శాంతంగా ఉంటాను' అని సంకల్పించుకుంది పాము. బ్రహ్మచారి ఉపదేశించిన మంత్రాన్ని నిత్యం జపిస్తూండేది.


6
అప్పటి నుండీ ఆ పాము ఎవరినీ హింసించేది కాదు. ఇలా కొన్నాళ్ళు గడిచాయి....
ఒరేయ్! తోటలో ఆడుకుందాం రండిరా!
అక్కడ పాము ఉందిరా!
ఆ పాము కనిపించడం లేదురా. బయటకు వెళ్ళిపోయిందో ఏమో!


7
తోటలో ఆడుకొంటున్న బాలురు పుట్ట దగ్గరకు వెళ్ళి చూశారు.
ఏయ్! ఇదిగో చూడరా! పాము ఎంత ప్రశాంతంగా ఉందో! బుసకొట్టటం లేదురా!


8
ఇద్దరు బాలురు పుట్టలోని పామును కర్రతో బయటకు తీసేశారు. దాని తోక పట్టుకొని గిరగిర త్రిప్పాడు ఒకడు. మరొకడు దాన్ని కర్రతో కొట్టాడు, పాము తల తిరిగి పడి పోయింది. కానీ ఆ పాము ఎవ్వరినీ కాటు వేయకుండా పుట్టలోనికి దూరిపోయింది.
కర్రతో పామును పొడిచి చూడరా! అది ప్రాణంతో ఉందో లేదో తెలుస్తుంది.


9
కొన్ని వారాలు గడిచాయి. బాగా గాయపడిన పాము ఆహారం కోసం బయటకు కూడా రాలేక పోయింది. బాలుర గొంతు వింటే చాలు భయపడేది. వణికిపోయేది.
పాపం! ఈ బాలురు తెలియక తప్పు చేస్తున్నారు. నేను వారిని మన్నించాలి.


10
కొన్ని వారాల తర్వాత తిరిగి బ్రహ్మచారి ఆ గ్రామానికి వచ్చాడు. అక్కడ ఆడుకొంటున్న బాలురను చూశాడు.
స్వామీ! మమ్ము భయపెట్టిన పాము చనిపోయింది.
తమ్ముళ్ళూ! ఆ పాము చనిపోయి ఉండదు. నేను దానికి మంత్రోపదేశం చేశాను. తప్పక ప్రాణాలతో ఉంటుంది.


11
బ్రహ్మచారి, చకచకా పుట్ట ఉన్న చెట్టు దగ్గరకు వెళ్ళాడు. పాము పుట్ట దగ్గరకు వెళ్ళి...
నాగరాజా! ఎక్కడున్నావు? బయటకురా!


12
పాము మెల్లగా పుట్ట నుండి బయటకు వచ్చింది. దాని శరీరమంతా రక్తపు మరకలు. దాన్ని చూడగానే బ్రహ్మచారి చాలా బాధతో...
బిడ్డా! ఏమైంది నీకు? నిన్ను ఈ విధంగా హింసించిందెవరు?

13

గురువర్యా! మీరు చెప్పినట్లు నేను ఎవరినీ హింసించక సాత్త్వికంగా బ్రతుకుతున్నాను. ఏమీ ఎరుగని ఈ బాలురు నన్ను కొట్టి హింసించారు. మీ మాట ప్రకారం నేను ఎంతో సహించాను. అందువల్లే ఇలా జరిగింది స్వామీ!

14

ఓరి పిచ్చివాడా! ఎవరినీ అనవసరంగా హింసించవద్దని చెప్పాను. కానీ ఎవరైనా నిన్ను హింసిస్తే వారిని భయపెట్టవద్దని చెప్పలేదు కదా!

మీరే కదా స్వామీ కాటు వేయవద్దన్నారు!

15

అమాయకుడా! కాటువేయవద్దు అన్నాను. కానీ వారిని భయపెట్టడానికి బుసకొట్టవద్దని చెప్పలేదు కదా! భక్తుడిగా ఉండు. అంతేగాని మూర్ఖుడిగా ఉండకు. మనుషులు నిన్ను తొక్కడానికి వస్తే నీవు బుసకొట్టే తీరాలి.

అప్పటి నుండి పాము ఎక్కడ అణకువగా ఉండాలో, ఎక్కడ ధైర్యంగా ఉండాలో తెలుసుకొని మెలగసాగింది.



**గృహస్థులు దుష్టుల విషయంలో బుసకొట్టడం చాలా అవసరం. అలా భయపెట్టకపోతే ఆ దుష్టులు అపకారం చేస్తారు. కానీ ఆ దుష్టులే తమకేదో అపకారం చేస్తారన్న లేనిపోని ఊహలతో తామే ముందుగా వాళ్ళకు హాని తలపెట్టకూడదు.** *- భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస*

వార్తావాహిని

# 'సంస్కార్' వేసవి శిక్షణా శిబిరం






హైదరాబాదు, రామకృష్ణ మఠం – **వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్ విభాగం** బాల బాలికలకు నెల రోజుల పాటు 'సంస్కార్' వేసవి శిక్షణా శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరంలో పాల్గొన్న 850 మంది విద్యార్థినీ విద్యార్థులు స్తోత్రాలు, గీతాశ్లోకాల పారాయణం, భక్తిగీతాలు, యోగాసనాల్లో శిక్షణ పొందారు. ఈ శిబిరాన్ని రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మదన్ బి. లోకూర్ 2012 ఏప్రిల్ 29న ప్రారంభించారు. 'జీవితంలో క్రమశిక్షణ పాటించిన వారే ఆశించిన ఫలితాలను పొందుతారు. అందుకు బాల్యం నుండే క్రమశిక్షణను అలవరచుకోవాలి' అని ఆయన తెలియజేశారు. హైదరాబాదు రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మాట్లాడుతూ 'సెల్‌ఫోన్, నెట్‌చాటింగ్‌లకు బానిసలు కావద్దు' అని బాలలను హెచ్చరించారు. మే 27న జరిగిన ముగింపు కార్యక్రమానికి హైదరాబాదు జిల్లా కలెక్టర్ శ్రీ నటరాజన్ గుల్జార్, ముఖ్య అతిథిగా విచ్చేశారు. ముగింపు సభలో ఆయన మాట్లాడుతూ 'విద్యార్థుల్లో బాల్యం నుండే నైతిక విలువలు పెంపొందేలా తల్లితండ్రులు, ఉపాధ్యాయులు శ్రద్ధ వహించాలి' అని సూచించారు. హ్యూమన్ ఎక్సలెన్స్ సంచాలకులు స్వామి బోధమయానందజీ 'కంప్యూటర్‌కు వైరస్ సోకకుండా ఎలా జాగ్రత్తలు తీసుకుంటున్నామో అలాగే పిల్లల్లో చెడు భావాలు కలగకుండా తల్లితండ్రులు శ్రద్ధ వహించాలి' అని సూచించారు. ఈ కార్యక్రమంలో విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు అందరినీ అలరించాయి. ❖ నివేదిక: డి. సంజీవ

## గ్రంథ పరిచయం



### సాధనరహస్యము

**రచన: శ్రీఅనుభవానంద స్వామి**
**వెల: రూ. 100/- పుటలు: 282**
**ప్రతులకు: శ్రీరామకృష్ణ భక్త సమాజము, శ్రీఅనుభవానంద గ్రంథమాల, 11-1-13, యం.జి.రోడ్డు, బాపట్ల – 522 101. గుంటూరు జిల్లా.**

ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన అమూల్య సాధనా మార్గాలను పరిచయం చేసే గ్రంథమే ఈ 'సాధనరహస్యము'. స్వామి అనుభవానంద తమ శిష్యురాలైన మాతాజీ త్యాగీశానంద విద్యార్థినిగా ఉన్నప్పుడు దాదాపు అరవై ఏళ్ళ క్రితం, ఆధ్యాత్మిక మార్గంలోని సంశయాలకు నివృత్తి మార్గాలను నిర్దేశిస్తూ ఉత్తరాల రూపంలో ఆమెకు సల్పిన బోధనల సమాహారమే ఈ పుస్తకం. సమున్నతమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సరళమైన వ్యావహారికంలో స్వామీజీ ప్రత్యక్షంగా మాతాజీకీ, పరోక్షంగా జిజ్ఞాసువులకూ ఈ లేఖల రూపంలో వివరించారు. కర్మ, భక్తి, రాజ, జ్ఞాన యోగాల నుంచి సాధన చతుష్టయం వరకు అనేక అంశాలను అనుభవానంద స్వామి ప్రాథమిక విద్యార్థులకు విడమరచి చెప్పినంత సులువుగా బోధించారు. పదకొండు ముద్రణలను పూర్తి చేసుకొని వేలాదిమంది ఆధ్యాత్మిక సాధకుల నుంచి విశేష ఆదరణను చూరగొన్న ఈ 'సాధనరహస్యము' పన్నెండో ముద్రణతో మరోసారి పాఠకుల ముందుకు రావడం అభినందనీయం. ఆధ్యాత్మిక మార్గాన్వేషకులు అవశ్యంగా పఠించాల్సిన గ్రంథరాజమిది. ❖ – బి. సైదులు



### శ్రీరామకర్ణామృతము

**సంపాదకులు:డా॥ పి.పి.వి.డి. నాగ త్రిశూలపాణి**
**అనువాదకులు: శ్రీ పి.ఎన్. రామచంద్రరావు**
**వెల: రూ. 100/- పుటలు: 193**
**ప్రతులకు: శ్రీ పి.ఎన్. రామచంద్రరావు, ప్లాట్ నెం. 40, డోర్.నెం. 12/3/939, మూడవ క్రాస్, విద్యుత్‌నగర్, అనంతపురం. ఫోన్ నెం: 08554-242847**

శ్రీరామకర్ణామృతం నిజంగా కర్ణామృతమే. ప్రజలందరూ పాడుకునే విధంగా శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని వాల్మీకి మహర్షి రచించి, శ్రీరాముని సమక్షంలో లవకుశులతో పాడించారని ప్రతీతి. అలాంటి రామాయణ కథాసారాన్ని హృద్యంగా మళ్ళీ, మళ్ళీ పాడుకుని ఆనందించే విధంగా ముక్తకాల లాగా చదువుకొని, పాడుకొని తరించే విధంగా వ్రాయబడిన కావ్యం ఇది. రామాయణం ఎంత ప్రసిద్ధమో, తెలుగుదేశంలో శ్రీరామకర్ణామృతం కూడా అంతే ప్రసిద్ధం. 'జానక్యాః కమలాంజలి పుటే...' అనే శ్లోకం వేయకుండా తెలుగువారు వివాహ శుభలేఖకు శ్రీకారం చుట్టరన్నది అందరికీ తెలిసిన విషయమే. ఎక్కడ సీతారాముల కల్యాణం జరిగినా అక్కడ శ్రీరామకర్ణామృతంలోని కొన్ని శ్లోకాలైనా గానం చేయకుంటే, ఆ వివాహవేదికకు నిండుతనం ఉండదు. 24వేల శ్లోకాలు కలిగిన బృహత్ గ్రంథమైన రామాయణాన్ని చదవడం సామాన్యులకు కష్టం కనుక సూక్ష్మోపాయంగా శ్రీరామభక్తులు ప్రతి నిత్యమూ పారాయణ చేసుకోవడానికి అనువైన గ్రంథం శ్రీరామకర్ణామృతము. అలాంటి గ్రంథానికి సరళ సుందరమైన తెలుగువ్యాఖ్యను సమకూర్చిన రామచంద్రరావుగారికి అభినందనలు. ❖ – ఎం.వి. నాగప్రసాద్

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-7, Sri Ramakrishna Prabha (Telugu Monthly) July 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? ఆంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. *- స్వామి రంగనాథానంద*





సర్వధర్మస్థాపకస్త్వం సర్వధర్మస్వరూపకః ।
ఆచార్యాణాం మహాచార్యో రామకృష్ణాయ తే నమః ॥



# సుబోధ

మాస్టర్ మహాశయ్ సందేహాన్ని తీరుస్తూ శ్రీరామకృష్ణులు, "అనురాగం ఏర్పడినప్పుడు భగవల్లాభం సిద్ధిస్తుంది. తీవ్ర వ్యాకులత కలిగినట్లయితే, మనస్సంతా భగవంతుని మీదే లగ్నమవుతుంది. అప్పుడు భగవంతుడు తప్పక పలుకుతాడు. మనకు దర్శనమిస్తాడు" అని అన్నారు.

"ఒక వ్యక్తి కుమార్తె పిన్న వయస్సులోనే వితంతువు అయింది. భర్త ముఖం ఎన్నడూ చూడనైనా లేదు. తన తోటి బాలికల భర్తలు రావడం చూసి ఒకనాడు తన తండ్రిని 'నాన్నా! నా భర్త ఎక్కడ ఉన్నాడు?' అని అడిగింది. అందుకు ఆమె తండ్రి 'అమ్మా! నీ భర్త గోవిందుడు. ఆయనను పిలిస్తే, నీ వద్దకు వస్తాడు' అని బదులిచ్చాడు. తండ్రి మాట విని ఆ బాలిక గదిలోకి వెళ్ళి తలుపులన్నీ మూసుకుని విలపిస్తూ గోవిందుణ్ణి ఇలా పిలువసాగింది: 'గోవిందా! నువ్వు నాకు ఎందుకు కనిపించవు? నువ్వు నాకు ఎలాగైనా దర్శనం ఇవ్వు.' ఆ అమ్మాయి వ్యాకులతకు భగవంతుడు కరుణించి ఆమెకు దర్శనం అనుగ్రహించాడు.

"జటిలుడనే చిన్న పిల్లవాడి కథ ఒకటి ఉంది. అతడు పాఠశాలకు కొంతదూరం అడవి మార్గం గుండా వెళ్ళవలసి వచ్చేది. అలా వెళుతున్నప్పుడు అతడికి భయం వేసేది. అతడు తన భయం గురించి తల్లికి చెప్పాడు. అందుకు ఆమె, 'నువ్వు ఎందుకు భయపడుతున్నావు? మధుసూదనుణ్ణి పిలువు' అన్నది. అందుకు ఆ పిల్లవాడు, 'అమ్మా! ఆ మధుసూదనుడెవరు?' అని అడిగాడు. 'అతడు నీ అన్న' అని తల్లి బదులు చెప్పింది. మరునాడు అడవి మార్గంలో వెళుతుండగా జటిలుడికి భయం వేసింది. అప్పుడు వెంటనే 'అన్నా! మధుసూదనా! నువ్వెక్కడ ఉన్నావు? ఇక్కడకు రా! నాకు భయం వేస్తోంది' అని పిలువసాగాడు. ఆర్తితో జటిలుడు పిలిచిన పిలుపుకి మధుసూదనుడు రాకుండా ఉండలేకపోయాడు. 'ఇదుగో! నే నిక్కడే ఉన్నాను తమ్ముడూ! నీకు భయమెందుకు?' అంటూ మాట్లాడుతూ వెళ్ళి పాఠశాల వద్ద వదలిపెట్టాడు. 'తమ్ముడూ! నువ్వు నన్ను ఎప్పుడు పిలిస్తే అప్పుడు వచ్చేస్తాను, భయపడవద్దు' అని ధైర్యం చెప్పి మధుసూదనుడు వెళ్ళిపోయాడు. విశ్వాసం, వ్యాకులత ఉంటే భగవంతుడు తప్పక అనుగ్రహిస్తాడు. ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుండి)




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# స్వామి వివేకానంద రథయాత్ర

**11 సెప్టెంబర్ 2012 నుంచి**
**12 జనవరి 2014 వరకు**



రథం నమూనా

**భా**రతావని ఆధ్యాత్మిక వైభవాన్ని విశ్వవ్యాప్తం గావించిన యుగపురుషుడు స్వామి వివేకానంద. 1893 సెప్టెంబర్ 11వ తేదీన చికాగోలో చారిత్రాత్మక ప్రసంగంతో ప్రారంభమైన స్వామీజీ జైత్రయాత్ర ఖండఖండాంతరాల్లో జగజ్జేయమానంగా విజయఢంకా మోగించింది. మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని నేల నాలుగుచెరగులా చాటిన ఆ కారణజన్ముడి 150వ (2013- 2014) జన్మదిన వార్షికోత్సవాలను దేశవ్యాప్తంగా రామకృష్ణ సంఘం వైభవోపేతంగా నిర్వహించదలచింది.

ఈ మహోత్సవాలను పురస్కరించుకొని హైదరాబాదు రామకృష్ణ మఠం స్వామి వివేకానంద సందేశాన్ని తెలుగునాట నలుదిశలా పరివ్యాప్తం చేయాలన్న సత్సంకల్పంతో 'స్వామి వివేకానంద రథయాత్ర'ను నిర్వహించనుంది. ఈ రథయాత్ర - సర్వాలంకార భూషితమైన స్వామి వివేకానంద రథం, స్వామీజీ జీవిత విశేషాలతో కూడిన సంచార ప్రదర్శనశాల, స్వామి వివేకానంద సాహిత్య సంచార విక్రయశాలలతో కొనసాగుతుంది. ఆంధ్రరాష్ట్రమంతటా (2012 సెప్టెంబర్ 11 నుంచి 2014 జనవరి 12 వరకు) సాగే ఈ రథయాత్ర - విజయవాడ, రామకృష్ణ మిషన్; రాజమండ్రి, రామకృష్ణ మఠం; కడప, రామకృష్ణ మిషన్ కేంద్రాల సహకారంతో అత్యంత వైభవంగా నిర్వహించేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. స్వామి వివేకానంద రథాన్ని తమ ప్రాంతాలకు ఆహ్వానించదలచుకునే శ్రీరామకృష్ణ సేవాసమితులు, విద్యాసంస్థలు, ఇతర స్వచ్ఛంద సంస్థలవారు పూర్తి వివరాల కోసం ఈ మఠ కేంద్రాలను సంప్రతించండి:

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, విజయవాడ.**
**రథం పర్యటన తేదీలు : 11-09-2012 నుండి 20-10-2012 వరకు**
**రథం పర్యటన ప్రాంతాలు :** కృష్ణా, గుంటూరు జిల్లాలు.
*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్ :* రామకృష్ణమిషన్, గాంధీనగరం, విజయవాడ - 520 003.
*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, సీతానగరం, తాడేపల్లి (పోస్ట్),గుంటూరు జిల్లా - 522 501. ఫోన్: 0866-2570799, 9985539422.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, రాజమండ్రి.**
**రథం పర్యటన తేదీలు : 24-10-2012 నుండి 30-04-2013 వరకు**
**రథం పర్యటన ప్రాంతాలు :** పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు.
*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, రామకృష్ణ-వివేకానంద నగర్, రాజమండ్రి - 533 105. సెల్ : 9396673111.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మిషన్, కడప.**
**రథం పర్యటన తేదీలు : 01-06-2013 నుండి 30-09-2013 వరకు**
**రథం పర్యటన ప్రాంతాలు :** కడప, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, ప్రకాశం జిల్లాలు.
*పూర్తి వివరాలకు : సిటీ సెంటర్* - రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప - 516 005.
*ఆశ్రమం:* రామకృష్ణమిషన్, పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి వద్ద, కడప - 516 002. సెల్ : 9248545012.

**రథయాత్ర పర్యవేక్షణ : రామకృష్ణ మఠం, హైదరాబాదు.**
**రథం పర్యటన తేదీలు : 01-10-2013 నుండి 12-01-2014 వరకు**
**రథం పర్యటన ప్రాంతాలు :** హైదరాబాదు, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, వరంగల్, మెదక్, ఖమ్మం, నల్గొండ జిల్లాలు.
*పూర్తి వివరాలకు :* రామకృష్ణమఠం, దోమల్‌గూడ, హైదరాబాదు- 500 029. సెల్ : 8498011535.

ఈ రథోత్సవంలో రాష్ట్రప్రజలు, యువతీయువకులు, విద్యార్థినీ విద్యార్థులు, రామకృష్ణ-వివేకానంద భావప్రచార పరిషత్ సభ్యులు, కార్యకర్తలు, భక్తులు, శ్రేయోభిలాషులు సమధికోత్సాహంతో పాల్గొని, సేవలందించాలని కోరుతున్నాం. ఈ బృహత్ కార్యక్రమాన్ని దిగ్విజయం చేయడానికి మనమందరం కృషి చేద్దాం. స్వామి వివేకానంద సందేశామృతంతో తెలుగు ప్రజల హృదయాలను నింపుదాం.

భగవత్సేవలో...
**స్వామి జ్ఞానదానంద,** అధ్యక్షులు
రామకృష్ణ మఠం, హైదరాబాదు.

**రామకృష్ణ మఠం**, దోమల్‌గూడ, హైదరాబాదు-29
సెల్ : 8498011535
email : sv150aprathayatra@rkmath.org




ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 8 ఆగస్టు 2012


**స్మిత లలిత కపోలం స్నిగ్ధ సంగీత లోలం**
**లలిత చికుర జాలం చౌర్య చాతుర్య లీలమ్।**
**శతమఖ రిపు కాలం శాతకుమ్భాభ చేలం**
**కువలయ దళ నీలం నౌమి గోపాలబాలమ్ ॥**

చిరునవ్వులతో సుందరమైన చెక్కిళ్ళు కలవాడు, హాయి గొలుపు మురళీగానము చేయుటలో ఆసక్తి కలవాడు, సుకుమారమైన ముంగురులు దట్టముగా కలవాడు, వెన్నను దొంగిలించే లీలల్లో నేర్పరైనవాడు, నారాయణుడుగా ఇంద్రుని శత్రువులైన రాక్షసులకు యముడిలాంటివాడు, నల్లకలువ పూరేకులలాంటి నీలవర్ణం కలవాడు అయిన గోపాల బాలకృష్ణునికి నమస్కరించుచున్నాను. *- శ్రీకృష్ణకర్ణామృతము-2.88*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'కి ధన దానం చేసి ప్రోత్సహించాల్సిందిగా కోరుతున్నాం. దాతల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | శ్రీ ఐ. రాజేష్ వెంకట్, మలక్‌పేట్, హైదరాబాదు - 500 036 | 15,000 |
| రాజ పోషకులు | శ్రీ ఎమ్. జనార్దనరావు, చంద్రమౌళి నగర్, గుంటూరు - 522 007 | 5,000 |
| రాజ పోషకులు | శ్రీ వి. వేంకట రామారావు, రాజాపురం, చంద్రుగొండ, ఖమ్మంజిల్లా (కీ॥శే॥ కుమారి రజని జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | శ్రీ బి. శివ, ఖైరతాబాదు, హైదరాబాదు-500 004 (కీ॥శే॥ బి. పర్వతలక్ష్మి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | శ్రీ బి. శ్రీనివాసులు, మియాపూర్, హైదరాబాదు - 500 049 | 1,016 |
| పోషకులు | శ్రీ డి. నాగేశ్వరరావు & లక్ష్మి సరోజ, మలక్‌పేట్, హైదరాబాదు - 500 036 | 1,001 |
| పోషకులు | పి. వసంత కుమారి, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా - 534 201 | 1,000 |
| పోషకులు | గీతా ఎంటర్‌ప్రైజెస్, నారాయణగూడ, హైదరాబాదు - 500 029 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1,500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్






# పరమాత్మకు ప్రీతి... ప్రతిఫలాపేక్షలేని భక్తి

'నారు పోసేవాడు నీరు పోయడా?' అన్న నానుడి మనందరికీ తెలిసిందే. అలాగని మనల్ని సృష్టించిన ఆ భగవంతుడే మన బాధ్యతను వహిస్తాడనీ, మన అవసరాలను తీరుస్తాడనీ, మన యోగక్షేమాలను చూస్తాడనీ నిశ్చింతగా, నిర్భయంగా ఉండగలమా? అలా ఉండగలగాలంటే మనకు భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసం, సంపూర్ణ శరణాగతి అవసరం.

ఒకసారి శివాజీ మహారాజులో 'నేను ఎంతో మందికి జీవన భృతిని కల్పిస్తున్నాను' అన్న అహంకారం కలిగింది. ఆ అహంకారాన్ని పోగొట్టడానికి గురువు సమర్థ రామదాసు ఒక రాతిబండను చూపి దాన్ని పగలగొట్టమన్నాడు. రాతిబండను పగలగొట్టగానే లోపల ఓ కప్ప ఉంది. సజీవంగా ఉన్న కప్పను చూసి 'సర్వజీవులను సంరక్షిస్తున్నది ఆ సర్వేశ్వరుడే' అన్న గురువు మాటలను విశ్వసించాడు శివాజీ. అలాగే ప్రహ్లాదుణ్ణి పర్వతాలపై నుండి పడవేసినా, సముద్రంలో విసిరేసినా, విషసర్పాలతో కాటువేయించినా, మదగజాలతో తొక్కించినా ఆ శ్రీహరియే రక్షకుడనే సంపూర్ణ శరణాగతిభావం ప్రహ్లాదుడిలో ఉండడం వలన అతడికి ఎలాంటి ప్రమాదమూ సంభవించలేదు.

**భగవంతునిదే బాధ్యత:** భగవంతుని పట్ల సంపూర్ణ భక్తివిశ్వాసాలు మనలో కలగాలంటే ఏం చేయాలో భగవాన్ శ్రీరామకృష్ణులు ఇలా సూచించారు: "తండ్రి తన బిడ్డలకు అన్నవస్త్రాలు ఇచ్చి వారి ఆలనా పాలనా చూసుకోవడంలో ఆశ్చర్యమేముంది? అది అతడి బాధ్యత కదా! అలాగే మన అవసరాలను తెలుసుకొని వాటిని తీర్చే బాధ్యత ఆ భగవంతునిదే! భగవంతుడు పరాయివాడు కాదు, మన సొంతవాడన్న భావనను అలవరచుకోవాలి. అప్పుడు భగవంతుణ్ణి సులభంగా ప్రసన్నం చేసుకోవచ్చు". కాబట్టి ముందుగా భగవంతుడు మన సొంతవాడు అనే భావనను అలవరచుకుంటే, మన అవసరాలను అతడే తప్పక తీరుస్తాడన్న విశ్వాసం మనలో ఉదయిస్తుంది.

**భూమానందం... అల్పానందం:** భగవంతుడు మన సొంతవాడే కదా అని మనకు కావలసినవన్నీ కోరడం అవివేకం అవుతుంది. 'సర్వజగద్రక్షకుడైన ఆ సర్వేశ్వరుణ్ణి భోగభాగ్యాలను ప్రసాదించమనడం, మహారాజు దగ్గరకు వెళ్ళి గుమ్మడికాయను కోరడం లాంటిది' అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు.

అందువల్ల మనం భగవంతుణ్ణి అల్పానందాన్ని ఇచ్చే విషయ వస్తువులను కోరడం కన్నా, అనంతమైన ఆనందాన్నిచ్చే ఆయన సాన్నిధ్యం కోసం ప్రార్థించడం అత్యున్నతమైనది. ఇందుకు నరేంద్రుని (స్వామి వివేకానంద) జీవితంలో జరిగిన ఈ సంఘటన మనందరికీ కనువిప్పు:

తండ్రి విశ్వనాథ్ దత్తా హఠాన్మరణం నరేంద్రుని కుటుంబాన్ని దారిద్ర్యంలో పడేసింది. కుటుంబమంతా ఆకలితో అలమటించాల్సిన పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ క్లిష్ట పరిస్థితుల వల్ల మనోవేదనకు గురైన నరేంద్రుడు శ్రీరామకృష్ణుల సహాయాన్ని కోరడానికి దక్షిణేశ్వరం వెళ్ళాడు. కుటుంబ దారిద్ర్యావస్థను తొలగించడానికి జగన్మాతను ప్రార్థించమని శ్రీరామకృష్ణులను ప్రాథేయపడ్డాడు. 'ఆలయంలో ఉన్న జగన్మాతను నువ్వే స్వయంగా ప్రార్థించు. నువ్వు ఏమి కోరితే అది అమ్మ తప్పక అనుగ్రహిస్తుంది' అని శ్రీరామకృష్ణులు చెప్పారు. కాళీమాత ఆలయంలోకి నరేంద్రుడు ప్రవేశించగానే అక్కడ సజీవ చైతన్యమూర్తి అయిన జగన్మాత దర్శనమిచ్చింది. అమ్మ దివ్యరూపాన్ని దర్శించగానే నరేంద్రుడు తాను అడగాలనుకున్నది మరచిపోయి భక్తిపారవశ్యంతో, 'అమ్మా! నాకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను ప్రసాదించు' అని ప్రార్థించాడు.

ఆలయం నుండి బయటకు వచ్చిన నరేంద్రుణ్ణి 'మీ దారిద్ర్యాన్ని పోగొట్టమని అమ్మను ప్రార్థించావా?' అని శ్రీరామకృష్ణులు అడిగారు. అందుకు నరేంద్రుడు 'లేదు, నేను అడగాలనుకున్నది మరచిపోయాను' అని దిగ్భ్రాంతిని వ్యక్తం చేశాడు. 'ఆలయానికి మరలా వెళ్ళి అమ్మకు నీ కోరికను విన్నవించు' అని శ్రీరామకృష్ణులు, నరేంద్రుణ్ణి పంపించారు. ఈసారి కూడా భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను ప్రసాదించమనే అమ్మను నరేంద్రుడు వేడుకున్నాడు. మూడోసారి వెళ్ళినప్పుడు తన కుటుంబ పరిస్థితి జ్ఞాపకం ఉన్నప్పటికీ 'మహారాజు దగ్గరకు వెళ్ళి గుమ్మడికాయ ఇమ్మని అడగడం అవివేకం' అని చెప్పిన శ్రీరామకృష్ణుల మాటలు గుర్తుకు వచ్చి భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను ప్రసాదించమనే అమ్మను ప్రార్థించాడు. అంతేకానీ తన కుటుంబ ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచాల్సిందిగా మాత్రం కోరలేదు.

జగన్మాత పట్ల నరేంద్రునికున్న భక్తికి సంతసించిన శ్రీరామకృష్ణులు, 'ఇక మీదట మీ కుటుంబానికి కనీస అవసరాలైన అన్నవస్త్రాల విషయంలో ఎలాంటి లోటూ ఉండదు' అని దీవించారు.

'పరమాత్మ తప్ప అన్యమేదీ తెలియనిదే భూమానందం, అందుకు విరుద్ధమైనదంతా అల్పానందం. భూమానందం శాశ్వతమైనది, అల్పానందం నశించిపోయేది' అని ఛాందోగ్యోపనిషత్తు *(7-24-1)* వివరిస్తోంది.

ఆ జగన్మాత అఖండ దివ్యచైతన్య రూపాన్ని దర్శించిన నరేంద్రుని మదిలో అమ్మ తప్ప అన్యచింతన కలగలేదు. ఆ పరమానందంలో మునిగిన అతడు అల్పానందాన్నిచ్చే ప్రాపంచిక విషయాలు తుచ్ఛమని తలచాడు.

**భక్తిఫలాలతో ప్రసన్నుడైన పరమాత్ముడు:** భగవంతునిలో తప్ప అన్యమైన దేనిలోనూ ఆనందం పొందని పరమభక్తుల యోగక్షేమాల బాధ్యత భగవంతుడే వహిస్తాడనీ, ప్రతిఫలం ఆశించని భక్తితో ప్రార్థిస్తే భగవంతుడు సులభంగా ప్రసన్నమవుతాడనీ ఎంతోమంది భక్తులు నిరూపించారు. అలాంటి వారిలో ఓ గోపిక ఆ భువన మోహనుడైన గోపాలునికి ప్రేమతో ఫలాలనిచ్చి ప్రసన్నం చేసుకొన్న ఉదంతం శ్రీకృష్ణుని బాల్యలీలల్లో ఒకటి.



వీథిలో పండ్లను అమ్ముతున్న ఓ గోపికాస్త్రీ వద్దకు బాలగోపాలుడు పండ్లు కొనడానికి తన చిట్టిచేతుల్లో ధాన్యం నింపుకొని వెళ్ళాడు.

**ఫలవిక్రయిణీ తస్య చ్యుతధాన్యం కరద్వయమ్ ।**
**ఫలైరపూరయద్ రత్నైః ఫలభాండమపూరి చ ॥**

*(శ్రీమద్భాగవతం: దశమస్కంధం, 11వ అధ్యాయం, 11శ్లో.)*

'చిన్నికృష్ణుడు తన చిట్టి చేతుల్లో ధాన్యపు గింజలు తీసుకు వస్తుండగా పిడికిట ఉన్న గింజలన్నీ జారిపోయాయి. బాలకృష్ణుని ముగ్ధమనోహర రూపాన్ని తిలకిస్తూ ఆమె చిన్నికృష్ణుని చేతిలో పండ్లను పెట్టగానే, పండ్లగంప రత్నాలతో నిండిపోయింది'.

భక్తిపారవశ్యంలో ఆమె పండ్లగంపను నెత్తిన పెట్టుకొని ఇంటికి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళి చూసేసరికి విలువైన మణి రత్నాలతో గంప నిండి ఉండడం గమనించింది. ప్రేమతో ఇచ్చిన పండ్లకు సర్వఫలప్రదాత ప్రసాదించినవి గంపెడు మణిరత్నాలు.

గోకులంలో గోపికాస్త్రీ ప్రేమతో పండ్లు సమర్పించినందుకు అమూల్యమైన రత్నాలను శ్రీకృష్ణుడు ప్రసాదిస్తే, దక్షిణేశ్వరంలో భక్తితో ఓ కొబ్బరి ఉండ ఇచ్చిన అఘోరమణీదేవి (గోపాలేర్-మా)కి అత్యున్నతమైన ఆధ్యాత్మిక (సంపద) అనుభూతులను ప్రసాదించారు శ్రీరామకృష్ణులు. ఇంతకీ ఆ అఘోరమణీదేవి మరెవరోకాదు. 'ద్వాపరయుగంలో బాలకృష్ణునికి పండ్లను ఇచ్చిన ఆ గోపికా స్త్రీయే ఈ అఘోరమణీదేవి' అని శ్రీరామకృష్ణులే స్వయంగా చెప్పారు.

శ్రీరామకృష్ణులను దర్శించినప్పటి నుండీ అఘోరమణీదేవి హృదయం భక్తిపారవశ్యంతో నిండిపోయింది. ఒకరోజు తెల్లవారుజామున జపం చేస్తుండగా తన ప్రక్కనే శ్రీరామకృష్ణులు కూర్చోవడం ఆమె చూసింది. ఆయన చేతిని పట్టుకొన్న మరుక్షణమే శ్రీరామకృష్ణులు బాలగోపాలునిగా దర్శనమిచ్చారు. అప్పటి నుండీ ఆ శ్రీకృష్ణుడే ఈ శ్రీరామకృష్ణులనే ప్రగాఢమైన విశ్వాసం ఆమెకు కలిగింది. బాలకృష్ణుడు ఆమెతో ఆడుకోవడం, మాట్లాడడం, తినడం, నిద్రపోవడం - వంటివి చేయసాగాడు. అలా నిరంతరం గోపాలుని సన్నిధిలోనే ఆమె జీవించసాగింది. ఆ పరమాత్ముని దర్శనం ఒక్క క్షణం పాటు లభిస్తే చాలని యోగులు ఏళ్ళ తరబడి తపిస్తుంటే, నిరంతరం ఆ దివ్యసాన్నిధ్యాన్ని అనుభవించే అదృష్టం అఘోరమణికి లభించింది.

ఏ ప్రతిఫలాన్నీ ఆశించకుండా ప్రేమతో పండ్లను అర్పించిన గోపికాస్త్రీకి మణిరత్నాలనిచ్చి ఆమె దారిద్ర్యాన్ని పోగొట్టాడు శ్రీకృష్ణుడు. ఒక చిన్న కొబ్బరి ఉండను భక్తితో నివేదించినందుకు తన ఇష్టదైవ దర్శనం కోసం తపిస్తున్న అఘోరమణీదేవికి అనంత ఆధ్యాత్మిక సంపదను ప్రసాదించారు శ్రీరామకృష్ణులు. అంటే ప్రతిఫలాపేక్షలేని భక్తితో ప్రార్థిస్తే ఎవరికి ఏది అవసరమో దాన్ని భగవంతుడు సమకూరుస్తాడని విశదమవుతోంది.

కాబట్టి మన యోగక్షేమాలను చూసే భగవంతుడే మనకు అవసరమైనవి తప్పక సమకూరుస్తాడన్న సంపూర్ణ భక్తివిశ్వాసాలు మనలో పెంపొందేలా అనుగ్రహించాల్సిందిగా ఆ పరమాత్ముణ్ణి ప్రార్థిద్దాం. ❖

**సంసార జీవనానికి ధనం ఆవశ్యకమనేమాట నిజమే! అలాగని సిరిసంపదల్నీ, ఐహిక సుఖాల్నీ ఇవ్వమని అదేపనిగా భగవంతుణ్ణి యాచించకు. ఉన్నదానితో తృప్తిపడడం ఉత్తమం.** - శ్రీరామకృష్ణులు

# శ్రమజీవుల సేవే శ్రీహరి పాదసేవ

"ప్రపంచంలో చెడ్డవాళ్ళ కంటే మంచివాళ్ళు తమ మంచితనాన్ని ఉపయోగించక పోవడమే అనేక దుష్పరిణామాలకు కారణం" అంటాడు చాణక్యుడు. మహాత్మా గాంధీ తన మంచితనం ద్వారా మన దేశానికి స్వాతంత్ర్యం



తెచ్చాడు. మరి మన మంచితనం సంగతేమిటి? ఆనాటి 'తెల్ల దొర'ల నిరంకుశత్వాన్ని వారసత్వంగా తెచ్చుకొన్న 'నల్ల దొర'లు నేటి సమాజంలోనూ ఉన్నారు. మనం వారసత్వానికిచ్చే ప్రాధాన్యాన్ని పౌరసత్వానికి ఎందుకు ఇవ్వలేకపోతున్నాం? మనం పౌరసత్వపు బాధ్యతలను విస్మరిస్తే దేశ ప్రగతి ఎలా సాధ్యమవుతుంది? ఈ సమస్యలకు ఆధ్యాత్మిక పరిష్కారం ఏమైనా ఉన్నదా?

ప్రతి వ్యక్తి పురోగతికి, ప్రతి దేశాభివృద్ధికి ముఖ్యంగా మూడు విషయాలు అవసరమని స్వామి వివేకానంద అన్నారు:

1. మంచితనానికి గల శక్తిపై సంపూర్ణ విశ్వాసం ఉండడం.
2. అసూయ, అనుమానాలు విడనాడడం.
3. మంచిగా ఉంటూ, మంచి పనులు చేసేవారికి తోడ్పడడం.

మంచి పౌరులుగా రూపొందడానికి ఈ మూడు విషయాల్ని గుర్తుంచుకొని వాటిని పాటించడానికి ప్రయత్నిస్తే చాలు.

'మా తాతలు నేతులు తాగారు, మా మూతుల వాసన చూడండి' అని గొప్పగా వారసత్వపు ఆధిపత్యం చలాయించే వారు మన వారసత్వపు ఆధ్యాత్మిక నిధులను గురించి తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. శ్రమజీవుల పట్ల మన నిర్లక్ష్య వైఖరి మారినప్పుడే పౌరసత్వానికి ప్రాధాన్యాన్ని ఇచ్చినవాళ్ళం అవుతాం.

భారతదేశాభ్యున్నతి శ్రమజీవులపై ఆధారపడి ఉందనీ, వారిని ఎన్నడూ నిర్లక్ష్యం చేయరాదనీ స్వామి వివేకానంద హెచ్చరిస్తూ ఇలా అన్నారు: 'నవీన భారతదేశం, హలాన్ని చేతబూనిన కర్షకుని ఇంటి నుండి, బెస్తవాని పూరి గుడిసె నుండి, చెప్పులు కుట్టువాని నుండి, పాకీవాని శ్రమ నుండి, కార్మికుల కృషి నుండి నూతన కాంతులతో విరాజిల్లాలి'.

శ్రీమద్భాగవతంలో మహా భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు చెప్పిన తొమ్మిది రకాల భక్తి మార్గాలు: శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం.

ఈ నవవిధ భక్తి మార్గాలలో 'పాదసేవనం' గురించే ఇప్పుడు మన ఆలోచన! 'పద్భ్యాగ్ం శూద్రో అజాయత... – 'ఆ విరాట్‌పురుషుని పాదాల నుండి చాతుర్వర్ణాలలోని శూద్రుడు ఆవిర్భవించాడు' అని వేదాలు ఘోషిస్తున్నాయి. ఈ సత్యాన్ని తెలుసుకొన్ననాడు శ్రామికుల పట్ల నిర్దయ, నిరంకుశత్వం నశించి ప్రేమ, సేవ వంటి విశాలభావాలు అంకురిస్తాయి.

శ్రామికుని శ్రమను గుర్తించలేని కళ్ళు, శ్రీహరి కాళ్ళను కూడా గుర్తించలేవు. కాబట్టి శ్రామికుల సేవ, శ్రీహరి పాదసేవతో సమానం అన్న నిజాన్ని తెలుసుకొని మన ప్రియతమ నేత స్వామి వివేకానంద కలల్ని సాకారం చేయడానికి మనమందరం కలిసి కృషిచేద్దాం. ❖

# శ్రీకృష్ణతత్త్వంలో భక్తితత్త్వం

- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి



కన్నయ్య ఎప్పుడూ అమ్మ యశోద దగ్గర చేరి "చుంచు దువ్వి పింఛం పెట్టవే! ఓ యమ్మ! నన్ను గోపాల కృష్ణుడనవే!" అని అడుగుతూ ఉండేవాడట. అప్పుడు యశోదమ్మ "కన్నా! నీవు చక్కగా పాలు త్రాగితే నీ కురులు ఒత్తుగా ఎదుగుతాయి. అప్పుడు నీకు చక్కగా చుంచు దువ్వి, పింఛం పెడతాను. చక్కగా పాలు త్రాగు" అంటూ బుజ్జగించేదట! అలా అమ్మ కరస్పర్శామృతంతో ఒత్తుగా పెరిగి, మెడ మీద దోబూచులాడే కన్నయ్య కురులు చుంచు దువ్వి నెమలి పింఛం పెట్టేలా ఎదిగాయి.

శిరస్సున నెమలి పింఛంతో, నుదుట కస్తూరి తిలకంతో, ధగధగాయమాన మణిహారాలతో, కనకాంబరధారియై, ఒక చేత గోవులను కాచే కర్రతో, నడుమున చిరుగాలికి కదిలే ఎరుపు కుచ్చుల పిల్లన గ్రోవితో ఆ పురుషోత్తముడు మూర్తి దాల్చిన గోపాలుడై గోగణాన్ని రక్షిస్తున్నాడు. జన్మాంతర పుణ్యం పండిన ఆ గోపాలురు తమ సర్వస్వాన్నీ కృష్ణ సాన్నిధ్యంలో అర్పణ చేసుకున్నారు. అక్కడ 'అహం' లేదు. అంతా పరమాత్మ భావనే.

యమునా నదీ సైకతాల్లో ఆడి, పాడి, అలసిసొలసి చెట్ల క్రింద అంతా చేరగిలపడితే, పొన్నమాను కొమ్మ మధ్యన కూర్చుని, కన్నయ్య పిల్లనగ్రోవిని ఊదడం మొదలు పెట్టేవాడు. ఆ మురళీ గానంలో జగత్తు రసమయం అయిపోయేది. గోపబాలకులు కొందరు ఆ కృష్ణ పాదాల దగ్గర జారగిలపడి, కొందరు పాదాలు పట్టుకుని, కొందరు తన్మయంతో, ఆర్తితో చేతులు చాచి ఆ రసమయ జగత్తులో ఓలలాడుతూ ధన్యులు అవుతున్నారు. గోవులు మోరలు ఎత్తి, అరమోడ్పు కన్నులతో గోవిందుని చూస్తూ, మురళీ గాన రసాస్వాదనలో దేహాలు పులకించి, ఆపలేని చేపుతో, పాలధారలతో పృథివికి అభిషేకం చేస్తున్నాయి. లేగదూడలు గోమాతలు స్రవించే పాలను త్రాగాలన్న తలపే లేక, చెవులు రిక్కించి, నాదోపాసకుల్లా తోకలు ఎత్తి కన్నయ్య ముఖంలోకి తన్మయత్వంగా చూస్తున్నాయి. ఆ మాధవుని ముఖతః జాలువారే ఆ నాదరస వాహిని ప్రాణికోటి జన్మాంతర కర్మల భవబంధాలను పటాపంచలు చేస్తున్నది. అంతా తేజోమయం, రసమయం.

కొంతసేపటికి సృష్టికే రసపుష్టి కలిగించే వేణుగాన లహరి ఆగింది. అందరికీ బాహ్య స్మృతి కలిగింది. ఆకలి దప్పులు తెలిశాయి. అప్పటి వరకు పరమాత్మతో రమించిన ఆ మనుస్సులకు మరల మాయా మోహం క్రమ్మింది – "కృష్ణయ్యా! ఆకలి వేస్తున్నది చల్ది తిందాం రావా!" అని ఆహ్వానించారు. అష్టవిధ క్రియలతో భువనాండాన్నీ లక్షణాంగములుగా పుట్టించే ఆ బ్రహ్మాండ భాండోదరుడు, భక్త జన మందారుడు జన్మ జన్మల పుణ్యరాశులైన ఆ గోపాలురు ఆర్తితో సమర్పించిన నివేదనకు పరమానందం చెందాడు. సమర్పణ తప్ప వేరెరుగని ఆ గోప బాలుర ఆకులలోని చల్దినీ, చల్ల మిరపకాయలనూ నానారస సమన్వితంగా స్వీకరించాడు. గోవిందుని సాహచర్యంలో గోకులం, గోగణం కూడా దినమొక క్షణంగా వెళ్ళదీస్తున్నాయి.

గోధూళి వేళ అయిన దగ్గర నుండి కన్నయ్య కోసం యశోద ఎదురు చూస్తున్నది. కనుచీకటి పడుతున్నది. అడవిన తిరిగి, ఎండలో ఆడి, యమునలో నాని, అలసి సొలసి వసివాడి వచ్చే తన బిడ్డను జాలితో, ప్రేమతో అక్కున చేర్చుకొని బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకున్నది. లోనికి తీసుకొని వెళ్ళి మందోష్ణజలంతో స్నానం చేయించింది. చందన లేపనం పూసింది. ఆ మేటి తండ్రి అలకల తడిని సాంబ్రాణి ధూపంతో అల్లార్చింది. జున్నుతో, వెన్నతో, పరమాన్నాలతో, పనస తొనలతో పసిడి గిన్నెలో పుష్టిగా, తుష్టిగా భోజనం పెట్టింది. జిడ్డు మూతిని కొంగుతో తుడిచింది.

ఊయల మంచం మీద మెత్తని పానుపు వేసి కన్నయ్యను మురిపెంగా పడుకోపెట్టింది. కన్నయ్య తలను నెమ్మదిగా నిమురుతూ, ఎన్ని జన్మల పుణ్యమో తన కొంగు బంగారం అయిందని మురిసిపోతూ ఊయలను ఊపసాగింది. రాజీవ లోచనుడు కనులను నెమ్మదిగా అరమూతలు వేశాడు. బిడ్డ నిద్రించాడనుకున్నది అమ్మ యశోద. కానీ సృష్టిలో తనను తాను బందీ చేసుకున్న ఆ బాలపరమాత్మకు నిద్ర ఎక్కడిది? అయినా ఎందరో తల్లులు, ఎందరో భక్తులు ప్రతి నిత్యం ఆ పరమాత్మకు సమర్పణ చేసే భక్తి ఉపచారాలు ఇవే. ఆ తల్లి యశోదలా, ఆ గోపబాలకుల్లా, పరమాత్మను నిత్యం లాలించి పాలించే ఇంట్లో దీపకళికల్లాంటి పసివాళ్ళు, అనంత రూపుడైన పరమాత్మకు ప్రతిరూపాల్లా నట్టింట నడయాడతారనేది తరతరాల భారతీయ సంప్రదాయపు భక్తి ఒరవడి. అదే అందరికీ అవశ్యం ఆచరణీయం. ఇహపరాలకు ప్రథమ సోపానం. ❖

**(ఆగష్టు 9వ తేదీ, గురువారం - 'శ్రీకృష్ణ జన్మాష్టమి')**

**కృష్ణా! నువ్వు మాకు కనబడకుండా అడవులకు వెళ్ళినప్పుడు క్షణం ఒక యుగంగా ఉండేది. నీ మనోహరమైన శ్రీముఖమును చూసే కన్నులకు, రెప్పలు సృష్టించిన బ్రహ్మ ఓ మందమతి.** - *గోపీ గీతము*




కా తే కాన్తా ధనగతచిన్తా
వాతుల కిం తవ నాస్తి నియంతా ।
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా ॥

# చితి వరకూ చింతలేనా?

– స్వామి జ్ఞానదానంద

ఓ వ్యాపారికి దాదాపు తొంభై ఏళ్ళ వయస్సుంటుంది. ఎప్పుడో అరవై ఏళ్ళ క్రితం చిన్న కిరాణా దుకాణంతో ప్రారంభించిన వ్యాపారం నేడు మూడుపూవులు, ఆరుకాయలుగా విస్తరించింది. ఆర్థికంగా నిలదొక్కుకుంటే తిరుపతి వస్తానని, తలనీలాలు ఇస్తాననీ మొక్కుకున్నాడట. ఆయన కోరుకున్నట్లే, ఆర్థికంగా నిలదొక్కుకున్నాడు. పాతుకు పోయాడు కూడా! కొడుకు స్థిరపడ్డాడు; ఆడపిల్లల పెళ్ళిళ్ళు కూడా చేసేశాడు. ఆ కోరిక తీరితే వెళదాం! ఈ కోరిక తీరితే వెళదాం! అనుకుంటూ అరవై ఏళ్ళ నుంచి ఏడుకొండలవాడి మొక్కు వాయిదాలు వేస్తూనే ఉన్నాడు. వేచిచూసి, వేచిచూసి చివరకు ఆ వేంకటేశ్వర స్వామికి కూడా విసుగొచ్చేసి ఉంటుంది. ఆ వ్యాపారిపై ఆయన కూడా ఆశలు వదిలేసుకున్నాడు. ఈ వయస్సులో కూడా అతడు, కొడుకు ప్రారంభించిన సూపర్ మార్కెట్‌లో బోణీ కానిదే మంచినీళ్ళు కూడా ముట్టుకోడు! దురదృష్టవశాత్తూ పక్షవాతం వచ్చింది; అయినా కాళ్ళీడ్చుకుంటూ దుకాణంలో సరుకులు అమ్మి, గల్లాలో డబ్బులు వేయకపోతే పొద్దు పోదు. కోట్లు వచ్చి చేరుతున్నా, బిడ్డలకు ఇంకో కోటి వస్తే బావుండునన్న చింత అతడికి. ప్రతి ఏడాదీ లక్ష్మీపూజ సందర్భంగా భార్యకూ, బిడ్డలకూ తనే బంగారం కొని ఆభరణాలు చేయించడం ఆనవాయితీగా పెట్టుకున్నాడు! ఈ చీకూచింతల యావలో పడి ఆ శ్రీనివాసుణ్ణి కూడా మరచిపోయాడు. ఇలా చితి వరకూ సంసార చింతలతోనే గడిపే అలాంటి అత్యాశా పరులను హెచ్చరిస్తూ, శంకర భగవత్పాదుల శిష్యవరేణ్యుడు పద్మపాదుడు గురువుగారి 'భజగోవిందం... భజగోవిందం' పరంపరలో తనూ ఓ శ్లోకాన్ని జోడిస్తూ...



**కా తే కాన్తా ధనగత చిన్తా**
**వాతుల కిం తవ నాస్తి నియంతా ।**
**త్రిజగతి సజ్జన సంగతి రేకా**
**భవతి భవార్ణవ తరణే నౌకా ॥....** అంటాడు. 'పిచ్చివాడా! భార్యను గురించి, డబ్బును గురించి ఎందుకు చింతిస్తావు? నిన్ను నడిపించే ఆ భగవంతుణ్ణి తెలుసుకోలేవా? ఈ భవసాగరాన్ని దాటడానికి ముల్లోకాల్లోనూ సజ్జన సాంగత్యమే ఏకైక నౌక కదా!' అంటూ నాలుగు మంచిమాటలు చెబుతున్నాడు. పద్మపాదుడు ఇక్కడ వ్యామోహాల్లో పడ్డ సంసారులనుద్దేశించి 'వాతుల' అని సంబోధిస్తూ ఉన్నారు. 'వాతుల' అంటే గమ్యానికి దూరంగా ఎగురగొట్టబడినవాడు అని కూడా అర్థం.

### కళత్రమెక్కడా?...కాసులెక్కడా?

సంసారజీవితంలో చాలామంది ఎంత అమాయకంగా పడికొట్టుకు పోతున్నారో చూస్తే ఆశ్చర్యమేస్తోంది. పైగా అంతా తమ ప్రమేయంతోనే నడుస్తుందన్న అహంకారం మరోవైపు! కేవలం మనం కుటుంబజీవితాన్ని గడపడానికీ, మన వారసత్వాన్ని ఈ ప్రపంచంలో మిగిల్చి వెళ్ళడానికీ ఈ లోకంలోకి రాలేదు. అది అటు, ఇటుగా ఏ జీవరాశులైనా చేస్తూ ఉంటాయి. మనకే కాదు, మామూలు జంతుజాతులకు కూడా కుటుంబాలుంటాయి; వారసులూ ఉంటారు. కానీ మనం అంతకు మించిన భగవత్ చింతన కోసం ఈ లోకంలోకి వచ్చామని ఎవరికి వారు తెలుసుకోవాలి. పాతికేళ్ళ వయస్సులో మాదిరి, ముప్పాతిక వయస్సులో కూడా ఇల్లేమైపోతుందో; భార్యేమైపోతుందో, బిడ్డలేమైపోతారో అని చింతిస్తూ కూర్చుంటే, అంతకు మించిన అవివేకం మరోటి లేదు. మనకు మనమే కాకుండా పోయే రోజులు దగ్గర పడుతూ ఉంటే, ఇంకెవరో, ఏదో అయిపోతారని ఆందోళన పడుతున్నామంటే అవివేకమే! అందుకే గౌతమ బుద్ధుడు ఇలా అంటాడు:

**పుత్రా మే సంతి ధనం మే అస్తి ఇతి బాలో విహన్యతే ।**
**ఆత్మా హి ఆత్మనో నాస్తి కుతః పుత్రః కుతో ధనమ్ ॥**

'నాకు కొడుకులున్నారు; ధనం ఉంది' అని ఆసక్తచిత్తులైన అజ్ఞానులు కష్టాలతో బాధపడుతూ ఉన్నారు. తనకు తానే లేనప్పుడు ఇక కొడుకులు, ధనం తనదెట్లా అవుతుందంటూ ప్రశ్నించాడు. కళకళలాడుతూ కళ్ళముందు తిరిగే కళత్రం (అంటే భార్య); సకలభోగాలలో ఓలలాడించిన కాసులు కూడా మిమ్మల్ని విడిచిపెట్టే రోజొస్తుందనీ, సమస్త కాలచక్రాన్ని తన కనుసన్నలతో తిప్పే కారుణ్యమూర్తి ఒకరున్నారనీ మరచి పోకూడదు. అలాగని అయినవారిని వదిలించుకోమని కాదు; వారి గురించే రేయీ పగలూ చింతించవద్దు.

**ప్రకృతి, పరమాత్మలపై అవిశ్వాసం...:** సృష్టిలో మనిషి తప్ప, ఏ ఒక్క జీవి కూడా తరతరాలకు సరిపడా పోగు చేసుకోవాలని తాపత్రయపడదు. కారణం వాటికి ప్రకృతిపై, పరమాత్మపై పూర్తి విశ్వాసం. మనిషి పేరుకు పరిణతి చెందిన జీవిగా చెప్పుకుంటూ, మరోవైపు ప్రకృతి నియమాలకు విరుద్ధంగా, పరమాత్మ ప్రణాళికకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ ఉంటాడు. పులి కూడా ఆకలైనప్పుడే వేటాడుతుంది. గుహ నిండా జింక మాంసాన్ని నింపుకొని సంవత్సరాల తరబడి తింటూ కూర్చోదు. పిల్లలను ఓ మూలన భద్రంగా కూర్చుండమని, తనే ఒళ్ళుగుల్ల చేసుకొని మాంసపు ముక్కలు తెచ్చి తినిపించదు. కానీ మనం మాత్రం మన మునిమనుమడు కూడా ఏ చీకూ చింత లేకుండా తింటూ కూర్చోవాలనీ, ఇప్పటి మన ఆయువునంతా కరిగిస్తూ, క్షణం తీరిక లేకుండా చింతిస్తూ కాసులు కూడబెడుతూంటాం. ఇలాంటి సమయంలో ఎవరైనా మన పుణ్యం కొద్దీ వచ్చి, 'కాస్త గుడికెళదామా, ఏదైనా సంఘసేవ చేద్దామా' అని అంటే నాకు తీరికెక్కడిదని తప్పించుకుంటాం. ఇలాంటి మన దుఃస్థితిని ముందే ఊహించి ప్రహ్లాదుడు...

**అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచు పుట్టుచున్ మరల చర్వితచర్వణులైన వారికిం**
**జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిన నైన కానలకు నేగిననైన హరిప్రబోధముల్?**

'కొందరు గాఢమైన కారుచీకటి లాంటి ఈ మాయలో పడి కోరికలు చంపుకోకుండా సంసారం సాగిస్తూ ఉంటారు. అటువంటి మూర్ఖులకు శ్రీహరిపై భక్తి తానంతట అది పుట్టదు. ఒకవేళ ఇతరులు బోధించినా కలుగదు. ఏమైనా ఇచ్చి ఆశ చూపించినా వారికి దేవుని మీద భక్తి ఏర్పడదు. ఆఖరికి అడవుల్లోకి తీసుకెళ్ళినా ఫలితం ఉండదు. భగవంతుడి మీదకు అంత త్వరగా మనస్సు పోతుందా!' అంటూ ఆవేదనపడతాడు.

**దేవుడొక్కడే దిక్కు! :** భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినట్లు మనిషికి ఇన్ని కష్టాలు రావడానికి కారణం, భగవంతుడిపై నమ్మకం లేకపోవడమే! వారి మాటల్లోనే చెప్పాలంటే "భగవచ్చింతన ఎంత అధికంగా చేస్తే ఆ మేరకు సామాన్య భోగవస్తువుల పట్ల అనురక్తి ఉడిగిపోతుంది. ఆయన పాదపద్మాలపై భక్తి ఎంతగా వృద్ధి చెందితే అంతగా విషయవాసనలు సన్నగిల్లుతాయి. పశుభావాలు తొలగి పోతాయి; దైవీభావాలు ఉత్పన్నమవుతాయి. అటువంటి వ్యక్తి సంసారం పట్ల పూర్తి అనాసక్తుడవుతాడు; అందులో ఉన్నప్పటికీ జీవన్ముక్తుడై చరిస్తాడు". కానీ భక్తి అంటే మనలో పలాయన వాదమని చాలామంది భ్రమపడుతూ ఉంటారు. లౌకికంగా కూడా ప్రపంచంలో గొప్ప గొప్ప విజయాలు సాధించిన వారంతా ఎంతో వినయంతో విశ్వాధారమైన శక్తికి తలవంచిన వారే! అలాంటి ఆ భగవంతుడి శక్తిని తెలుసుకొనే ప్రయత్నం చేయమంటున్నారు ఆదిశంకరులు, వారి శిష్యపరమాణువులు. ఆ భగవంతుడి ఆలంబన మనకు అమితమైన శక్తినీ, ధైర్యాన్నీ, స్థైర్యాన్నీ ప్రసాదిస్తుంది. అప్పుడు ఈ సంసారంలోని సమస్యలు, ఈ సమాజంలోని సవాళ్ళు స్వల్పాతిస్వల్పంగా తోస్తాయి; పరిష్కారాలూ లభిస్తాయి.

**సజ్జనులే సహాయం :** భవబంధాల బాధల నుంచి తప్పిస్తూ, భగవంతుడి వైపునకు నడిపించడంలో సత్పురుషుల సహకారమే మనకు తరుణోపాయం. అందుకే సంసారసాగరాన్ని దాటించే ఏకైక నావ సజ్జన సాంగత్యమేనంటోంది ఈ 'భజగోవిందం'. మంచివారి రూపంలో ఆ దేవాధిదేవుడు మనకు దగ్గరవుతాడు. అయితే దురదృష్టవశాత్తూ దుష్టుల సాహచర్యంలో ఉన్నంత ఆకర్షణ, ఆసక్తి మనకు సత్సాంగత్యంలో ఉండదు. అలవాటు ప్రకారం మంచి కన్నా, చెడు వైపే మనస్సు ముందుగా మొగ్గుచూపుతుంది. కానీ బలవంతంగానైనా దాన్ని అనురక్తి మార్గానికి మరలించాలి. భక్తి, మానవసేవ వంటి ఉన్నత విషయాల పైకి మనస్సును తీసుకువెళ్ళాలి. సత్పురుషుల సహవాసంతో భగవంతుడిపై భారాన్ని వేసి, సాటి మనుష్యుల్లో ఆయననే దర్శించుకుంటూ సేవచేసుకుంటే, మన వ్యక్తిగత జీవిత బాధ్యతను ఆయనే చూసుకుంటాడు. సమస్త లోకాన్నీ పాలించే పరమాత్ముడు, మన చిన్న కుటుంబానికి లోటు చేస్తాడా? కానీ ఓపిక లేకున్నా మనలోని స్వార్థం, అహంకారం, తాపత్రయం, అత్యాశ మనను అలుపెరుగకుండా పరుగులు తీయిస్తాయి. భగవంతుడిని, భగవన్మార్గాన్ని చూపే మహానుభావుల నుంచి దూరం చేస్తాయి. అలాంటి పరుగు పందెం నుంచి ఇకనైనా కాస్త పక్కకు తప్పుకోవాలి. సన్మార్గులను ఆశ్రయించాలి. అప్పుడు శ్రీమద్భాగవతంలో రుద్రుడు అన్నట్లు 'సత్పురుష స్నేహం వల్ల సంప్రాప్తమైన భక్తియోగం చేత పరిశుద్ధుడైన వాని మనస్సు అస్థిరాలైన బాహ్యవిషయాలలో చిక్కుకోదు. తమోరూపమైన సంసారపు గుహలో వినాశం పొందదు, అది స్వస్వరూపాన్ని చక్కగా తెలుసుకోగలదు'. ❖

**సంపదల్నీ, అధికారాన్నీ, పేరుప్రతిష్ఠల్నీ చెప్పుకొని గర్వించేవారు ఉంటారు. చివరకు ఇవన్నీ మూన్నాళ్ళ ముచ్చటలే కదా! మరణానంతరం వీటిలో వెంటవచ్చేది ఏదీ లేదు.** - శ్రీరామకృష్ణ పరమహంస



# ప్రతి క్షణం అదే చివరి క్షణంలా...

- హేమంత్ కుమార్

జీవితం చాలా చిన్నది. ఎప్పుడు మొదలయ్యిందో, ఎప్పుడు ముగిసిపోతుందో కూడా గ్రహించలేనంత మాయాజాలంలో చిక్కుకుపోతాడు మనిషి... కానీ మనం వచ్చిన పని అయిందా? ఈ విషయం మాత్రం ఎప్పుడూ ఆలోచించం. మనం ఒక ప్రయాణం పెట్టుకున్నామంటే తప్పకుండా దానికో ప్రయోజనం ఉంటుంది. లేదా ఒక పని ఉంటుంది. ఒక కారణం ఉంటుంది. ప్రయాణించి ఒక చోటికి వెళతాం. వచ్చిన పని మీదే ఉంటాం. పూర్తి అయిందా లేదా అన్నది వేరే విషయం. ప్రయత్నం మాత్రం చేస్తాం. దానికై మనం కేటాయించుకున్న సమయం పూర్తి అయిన తర్వాత తిరిగి ప్రయాణమై వెళ్ళిపోతాం. మన జీవితమూ ఒక ప్రయాణమే. ఒక కార్య నిమిత్తమే. మనం మనమే. మన జీవితమూ మనదే. కానీ దాని ప్రదాత, నిర్ణేత భగవంతుడు. ఈ జీవితమనే ప్రయాణం పెట్టుకుని, ఆయన పంపగా వచ్చిన మనం మళ్ళీ ఆయన వెనక్కు పిలిచినప్పుడు వెళ్ళిపోవాలి. జీవితం మనదే కానీ దాని కాలపరిమితి మనది కాదు. జీవన ప్రమాణం పెంచుకునే అవకాశం ఇచ్చాడు కానీ పరిమాణం కాదు. దాన్ని ఉపయోగించుకునే అవకాశం మాత్రం మనకు ఉంది. అందుకే మనకు అనివార్యమైన జన్మోద్దేశాన్ని నెరవేర్చుకునే దిశగా మనం ప్రయత్నం చేయాలి. కేవలం ఆ దారిలోనే మనం ప్రయాణించాలి. దేవుడు మనకు ఒక కర్తవ్యాన్నయితే నిర్దేశించాడు కానీ నిర్దిష్ట సమయాన్ని ఇవ్వలేదు. కనీసం తెలియజేయలేదు. ఆ సమయ పరిమాణం తెలిస్తే ప్రణాళిక ప్రకారం సమయాన్ని సర్దుబాటు చేసుకోవచ్చు. సద్వినియోగ పరచుకోవచ్చు. పరీక్ష రాసే విద్యార్థి ప్రశ్నపత్రం అందుకున్నది మొదలు దిక్కులు చూడకుండా, మరోదాని గురించి ఆలోచించకుండా సమాధానాలు వ్రాయడంలో మాత్రమే నిమగ్నమైపోవాలి. ప్రతి క్షణం అదే చివరి క్షణం అన్నంత అపురూపంగా వినియోగం చేసుకోవాలి.

జీవితం మృష్టాన్న భోజనం అనుకున్నప్పుడే దాని విలువ పెరుగుతుంది. ఇష్టం పెరుగుతుంది. రుచి పెరుగుతుంది. అయితే అదృష్టమో, దురదృష్టమో తెలియదు... మన ముందు ఉంచిన ఈ నిండు విస్తరిని ఎప్పుడు లాగివేస్తారో తెలియదు. పదార్థాలు రుచి చూశామా? భోజనం ముగిసిందా? కడుపు నిండిందా? తృప్తి పడ్డామా? ఈ విషయాలతో సంబంధం లేదు. విస్తరి ఎత్తేస్తారంతే! మొదటి ముద్దకే కావచ్చు. భోజనం పూర్తయిన ఎప్పటికో కావచ్చు. మన జీవిత పరిమాణమూ అంతే. పరిమితీ అంతే. జాగ్రత్తగా, తొందరగా, ఉత్తమంగా దాని ప్రమాణం పెంచుకునే ప్రయత్నం మాత్రమే మనం చేయగలం. చేయాలి... అన్ని దిశలా, అన్ని రకాలా, అన్ని విధాలా, సూది మొనలా ఒక పువ్వు పొటమరించింది మొదలు పుష్పించే దాకా పూర్ణదిశగా పరిణమిస్తుంది. తొడిమా? రేకులా? రక్షకదళాలా? రంగా? పుప్పొడా? పరిమళమా? కాదు. అన్ని భాగాలూ. అన్ని విధాలూ. మన జీవితాన్నీ, జీవన శైలినీ, జీవన విధానాన్నీ కూడా మనం ఇదీ అదీ అని లేకుండా, కాకుండా అన్ని కోణాల నుండీ ఒక ఉత్తమ, ఉదాత్త ప్రమాణాలతో వికసింప జేసుకోవాలి. ప్రమాణాలే కాదు. ప్రపంచానికి పరిమళాన్నీ పంచాలి.

ఈ విషయం చెప్పడం సులువే. రాయడమూ సులువే. ఆచరణే కష్టం. 'ఉత్తమ ఆచరణ' పక్కనే 'చాలా కష్టం' అనే పదాన్ని జంట పదంగా చేర్చడం మనకు అలవాటైపోయి విడదీయ రానంతగా మన మనస్సులో దృఢపడిపోయింది. ఉత్తమం ఎప్పుడూ ఉత్తమమే. ఫలితమే కాదు. చేసే పనిలోని కష్టం కూడా. మంచైనా, చెడైనా పని ఎప్పుడూ అంతో ఇంతో కష్టమే. అయితే ఫలిత వైఖరిని బట్టి పని ఇచ్చే ఆనందమో, ఆవేదనో కూడా ఆధారపడి ఉంటుంది. అయితే ఫలితం ఆశించి పని చేసేవారు ఆ ఫలితం ఆనందమిచ్చేదిగానే ఎంచి చేపడుతూ ఉంటారు. చెడైనా అది వారి దృష్టికోణంలో మంచే అనిపించవచ్చు. దానికి వారి కారణాలు వారికి ఉండొచ్చు. కానీ ఆ ఎంపిక సమయమే కీలకం. సంస్కారంతో ఆలోచించాలి. సదాశయంతో ఆలోచించాలి. సమాజ శ్రేయస్సు దృష్ట్యా ఆలోచించాలి. పగ, స్వార్థం లాంటివి మనకు ఆత్మతృప్తి నిచ్చేవేనా? ఉత్తమ గతులిచ్చేవేనా? కనీసం సమాజంలో గౌరవాన్ని పెంచేవేనా? ఆలోచిద్దాం.

మనకిచ్చిన స్వల్ప జీవిత సమయాన్ని జీవితోద్ధరణకే వినియోగిద్దాం. చెట్టు తాను కాలుష్య వాయువులు పీలుస్తూ మనకు ప్రాణవాయువు నందిస్తోంది. దాని మొదలుకు పాదు చేసి మన కన్నీళ్ళతో దాని పాదాలు (వేళ్ళు) కడుగుదాం. అప్పుడైనా తాను పచ్చగా ఎదుగుతూ పదిమందికి ప్రాణాన్ని పంచే బుద్ధి మనలో వికసిస్తుందేమో! ధియో యోనః ప్రచోదయాత్. ❖

మృత్యువు ఏ క్షణాన కబళిస్తుందో తెలియదు. కనుక సత్సంకల్పం కలగగానే అవకాశం చూసుకొని దాన్ని ఆచరణలో పెట్టాలి; అంతేగాని ఒక నిర్ణీత సమయం కోసం వేచివుండరాదు. - *శ్రీశారదాదేవి*



# శిక్షణతో సర్వం సాధ్యం

– స్వామి యతీశ్వరానంద

ఆధ్యాత్మిక పథంలో పయనించడానికి చాలామంది భయపడతారు. కానీ మనకు సరైన శిక్షణ ఉంటే ఏ మాత్రం భయపడవలసిన పని లేదు. ఒక మోటారుకారును నడపడం కేవలం పిల్లలాడే ఆటగా అనుకోవచ్చునా? శిక్షణ ఏ మాత్రం లేని మనిషి విమానాన్ని నడపగలడా? స్కేటింగ్ చెయ్యగలడా? మంచు మీద జారగలడా? కుదరదు. కానీ సరైన విధానంలో శిక్షణ లభిస్తే ఎవరైనా ఈ పనులను మంచి నియంత్రణతోనూ, నైపుణ్యంతోనూ చేయ గలుగుతారు. అలాగే నియమ బద్ధమైన పారమార్థిక జీవితం గడపాలంటే ఆధ్యాత్మిక సాధన ఎంతో అవసరం.



1882వ సంవత్సరంలో శ్రీరామకృష్ణులు, రాఖాల్ (స్వామి బ్రహ్మానంద)మహరాజ్, మరికొందరు భక్తులు కలకత్తా నగరంలో సర్కస్ చూడడానికి వెళ్ళారు. అక్కడ కౌశలాన్నీ, సాహసాన్నీ చూపే రకరకాల కృత్యాలు ప్రదర్శితమయ్యాయి. వాటిలో ఒకటి గురుదేవులకు చాలా నచ్చింది. ఆ కృత్యంలో ఒక వృత్తాకార మార్గంలో కొన్ని పెద్ద పెద్ద ఇనుప రింగులను పై నుంచి వ్రేలాడదీశారు. ఒక ఆంగ్ల వనిత గుర్రం ఎక్కి ఆ మార్గంలో ఒంటికాలి మీద స్వారీ చేస్తూ ఇనుప రింగు ఎదురైన ప్రతిసారీ ఆ రింగులో నుంచి దూకుతూ, దూకిన ప్రతిసారీ తిరిగి ఒంటికాలి మీద ఆ గుర్రంపైనే నిలబడసాగింది. గుర్రం ఆ వృత్తాకార మార్గంలో చాలాసార్లు పరుగెత్తింది. కానీ ఆ వనిత ఒక్కసారి కూడా గుర్రం మీద నుంచి పట్టుతప్పి పడిపోలేదు. ఇలాంటి అద్భుత కార్యం చేయడానికి ఎన్నో సంవత్సరాల సాధన అవసరం కదా! గురుదేవులు దాన్ని చూసి ఎంతో సంతోషించారు. ఆధ్యాత్మిక జీవనంలో ఎలా మసలుకోవాలన్న విషయాన్ని ఈ కృత్యం ఆయనకు జ్ఞాపకం చేసింది.

జీవితంలోని అన్ని రంగాలలో ప్రమాదాలు, అడ్డంకులు పొంచివున్నట్లే ఆధ్యాత్మిక జీవనంలో కూడా ఉంటాయి. అన్నిటి కంటే పెద్ద అడ్డంకి ఏమిటో మీకు తెలుసా? ఆధ్యాత్మిక జీవనాన్ని 'సొగసుగా' (అంటే ఒక ఫ్యాషన్‌లాగా) గడపడం. ఆధ్యాత్మిక తృష్ణ లేనంతకాలం ఇలా జరగవచ్చు. కానీ ఒకసారి ఈ తృష్ణ మన అంతరాత్మలో జనిస్తే, సాక్షాత్కారం కోసం మనం పరితపిస్తాం. సోమరితనంతో కూర్చోలేం. పరమ గమ్యాన్ని చేర్చే మార్గంలో పయనించడానికి ప్రయత్నిస్తుంటాం. మానవజన్మ పూర్వజన్మ సుకృతఫలం అని మహనీయులు చెబుతుంటారు. మానవునిగా పుట్టి జంతువులా బ్రతుకు ఈడ్చడం దయనీయం కాదా!

ఒకరు ఎన్ని పుస్తకాలైనా చదవవచ్చు, ఎన్ని ఉపన్యాసాలైనా వినవచ్చు, కానీ ఆధ్యాత్మిక ఆదర్శం వైపు మనస్సు మరలకపోతే అదంతా వృథా. అందువల్లే భారతదేశంలోని మహర్షులు 'ముందు మన మనస్సు కృపను పొందాలి!' అని చెబుతుంటారు. భగవత్కృప, గురుకృప ఉంటే సరిపోదు. ఆధ్యాత్మిక బోధనలను మనం ఎన్నో వినివుండవచ్చు. కానీ మన మనస్సు మనల్ని కరుణించి ఆ సత్యాలను అర్థం చేసుకోకపోతే ప్రయోజనం లేదు. మన మనస్సు ఆ సత్యాలను గ్రహించాలన్నా, ఆధ్యాత్మిక ఆదర్శాన్ని మనం ప్రేమించాలన్నా శిక్షణ అవసరం. ప్రాపంచిక విషయాలలో అయినా మంచి శిక్షణ అవసరమే కదా! సరైన అవగాహన, సాధన లేకుండా మనం ఏ పనీ చేయలేం. అలాగే ఆధ్యాత్మిక జీవనంలో కూడా!

ఒక సన్నని కరెంటు తీగలో ఎక్కువ కరెంటు ప్రవహించినప్పుడు ఏమవుతుందో మనకు తెలుసు. ఆ తీగ కాలి, తెగిపోతుంది. కాబట్టి సరైన శిక్షణ లేకుండా విశ్వాత్మతో అనుసంధానాన్ని పెట్టుకోవాలని ప్రయత్నిస్తే, మన శరీరం, నాడులు, మనస్సు తట్టుకోలేనంత ఒత్తిడికి గురి అవుతాయి. ఇది నిజం. ఆధ్యాత్మిక పథాన్ని అధిరోహించడానికి బలమైన శరీరం, దృఢమైన మనస్సు, కుశాగ్ర బుద్ధి, చురుకైన ఇంద్రియాలు అవసరం. లేకపోతే మన శ్రమ అంతా వృథా అవుతుంది. ❖ **తెలుగుసేత : ఎమ్. శివరామకృష్ణ**

ధీరవాణి

– స్వామి వివేకానంద

# ఎవరినీ జయించకున్నా మన గొప్పేమిటంటే...



భారతదేశం చేసేది మత దానం! తత్త్వశాస్త్ర దానం! పారమార్థిక దానం! యుద్ధభటులు తన ముందు నడుస్తూ తన మార్గాన్ని నిరాటంకం చేయవలసిన ఆవశ్యకత మతానికి లేదు. జ్ఞానం, వేదాంతాలు రక్తప్రవాహాలపై తేలుతూపోయే అవసరం లేదు. జ్ఞానం, వేదాంతం నెత్తురోడుస్తున్న నర శరీరాలపై ఇనుప పాదాలతో నడచేవి కావు. దౌర్జన్యంతో అవి గమనాన్ని సాగించవు! శాంతి ప్రేమలనే రెక్కలపై మెల్లగా, చల్లగా, తేలియాడుతూ వస్తాయవి. ఎప్పుడూ అలాగే జరుగుతూ వచ్చింది. కాబట్టి ఇప్పుడు మనం వాటిని మళ్ళీ ప్రపంచానికి ఇవ్వవలసి ఉంది.

“హిందువులైన మీరు చేసిందేముంది? ఒక్క జాతినైనా ఎన్నడూ జయించింది లేదే?” అని లండన్ నగరంలో ఒక తరుణీమణి నన్నడిగింది. శూరుడు, వీరుడు, క్షత్రియుడు అయిన ఆంగ్లేయుని దృక్పథం నుండి చూస్తే ఆ మాట నిజమే! ఒక నరుడు ఇంకొకని మీద సాధించిన విజయం మహా ఘనకార్యమే! వాని దృష్టిలో అది సత్యమే! కానీ మన దృష్టికి అది అందుకు వ్యతిరేకంగా కనిపిస్తుంది. హిందూదేశం గొప్పతనానికి కారణమేంటి? అని నన్ను నేను ప్రశ్నించుకొన్నప్పుడు, మనమెన్నడూ ఇతరులపై దండెత్తకపోవడమే అని నాకు తోస్తుంది. అదే మన ఘనత!

మన మతం ఇతర మతాలను ఎన్నడూ లోబరచుకొనలేదని ‘వివేకవంతులు’ సైతం మన మతాన్ని నిరసిస్తూ ఉండడం మీరు రోజూ వింటూ ఉంటారు. కానీ, ఇతర మతాల కన్నా మన మతమే శ్రేష్ఠతరమైనదని అనడానికి ఇదే కారణమని నా మనస్సుకు తోస్తోంది. మన మతం ఇతర మతాలను జయించాలనుకోదు. అది రక్తపాతం చేయదు! అందరికీ దీవెనలనూ, శాంతినీ, ప్రేమనూ, రసానుభూతినీ తెలియజేసే వాక్కులే దాని ముఖం నుండి సదా వెలువడుతూ ఉంటాయి.

ఇక్కడ మాత్రమే అద్భుత పరమత సహన ఆదర్శం మొట్టమొదటగా బోధితమైంది. ఇక్కడ... ఇక్కడ మాత్రమే – సహనం, సానుభూతి అనే మహాధర్మాలు ఆచరణ రూపం దాల్చాయి. ఇతర దేశాలలో అవి సిద్ధాంత రూపంలో మాత్రమే ఆగిపోయాయి. ఈ దేశంలోనే, ఈ ఒక్క దేశంలోనే, హిందువులు మహమ్మదీయుల కోసం మసీదులనూ, క్రైస్తవుల కోసం చర్చిలనూ నిర్మించి ఇచ్చారు. కాబట్టి మన సందేశం ఎన్నోసార్లు ప్రపంచానికి తెలియజెప్పామని మీరు తెలుసుకోగలరు. కానీ ఇది నెమ్మదిగా, నిశ్శబ్దంగా, నిరాడంబరంగా జరిగింది. మన స్వభావానికీ, యోగ్యతకూ తగినట్లే ఈ ధర్మప్రచారం కూడా సాగింది. మన ప్రత్యేక లక్షణం శాంతం, మౌనం. వీటి వెనుక మహాద్భుతమైన శక్తి ఉంది. ❖

# పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

- టి.వి.ఆర్.శర్మ, భద్రాచలం

**? : మరణోపాసన గురించి తెలియజేయండి.**

✍: పుట్టిన ప్రతి ఒక్కరూ మరణించక తప్పదు. మనిషి చనిపోయేటప్పుడు ఇంద్రియాలు వాటి స్థానాలను వదిలి, హృదయదేశం చేరేటప్పుడు చాలా కష్టం కలుగుతుంది. వృద్ధాప్యంలో శరీర చింతన జరిగినంతగా భగవత్ చింతన జరుగదు. కాబట్టి, మనస్సులో మరణాన్ని గుర్తుంచుకొని, అన్ని సమయాలలో దైవచింతన చేయాలి. ఆది శంకరాచార్యులు జగత్తు మిథ్య అని చెప్పారు. జగత్తులో గల ఈ శరీరం కూడా అనిత్యమే. అంటే మరణం తప్పదు. ఏ క్షణంలో మరణం ఆసన్నమవుతుందో తెలియదు కనుక ఎల్లప్పుడూ దైవచింతన చేయడమే మరణోపాసన. భరతుడు ఒక లేడి పిల్లపై అనురాగం పెంచుకొని మరణ సమయంలో కూడా ఆ లేడిపిల్ల గురించే ఆలోచిస్తూ మరణించడం వల్ల తరువాతి జన్మలో లేడిగా పుట్టాడు. శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ 'యం యం వాపి స్మరన్ భావం' అన్నాడు. మరణసమయంలో దేని గురించి చింతిస్తే దానినే పొందుతారు. కాబట్టి, మరణం గురించి ఆలోచిస్తూ, ఒక్క క్షణం కూడా వ్యవధానమివ్వకుండా దైవ చింతన చేయడమే మరణోపాసన.



- శ్రీమునిరెడ్డి, అమ్మపాళెం

**? : భగవద్భక్తులు భగవంతుణ్ణి దర్శించడానికి వెళుతున్నప్పుడు గానీ, వెళ్ళి వస్తున్నప్పుడు గానీ ప్రమాదాలకు గురి అవుతున్నారు. దానికి గల కారణం చెప్పగలరు.**

✍: యాత్రలోనే కాదు, మన జీవితంలో కూడా ఎలాంటి ప్రమాదాలు, కష్టాలు సంభవించినా అది మన పూర్వజన్మకర్మ వల్లనే. ఈ విషయాన్ని వివరించే ఓ కథ ప్రాచుర్యంలో ఉంది: ఒక దైవ భక్తుడు పూరీ జగన్నాథ యాత్రకు బయలుదేరాడు. దారిలో ఒక రాత్రి ఓ ఇంటి అరుగుపైన విశ్రమించాడు. ఆ ఇంటి యజమానురాలు బయటకు వచ్చి అతణ్ణి కామవాంఛతో ప్రలోభపెట్టింది. అప్పుడు ఆ భక్తుడు, 'పరపురుషునితో అధర్మ కార్యాలను చేయడం పాపం' అని తిరస్కరించాడు. అప్పుడు ఆమె ఇంటిలోకి వెళ్ళి, నిద్రిస్తున్న భర్త తల నరికి, బయటకు వచ్చి మళ్ళీ అతనికి తన కోరికను తెలిపింది. అప్పుడు కూడా అతడు నిరాకరించాడు. దాంతో ఆమె కోపగించి, 'నా భర్తను చంపి నన్ను బలాత్కరించబోతున్నాడ'ని గట్టిగా అరచింది. అందరూ వచ్చి చూసి, ఆ భక్తుని చేతులు ఖండించారు. అయినా అతడు యాత్ర సాగించి పూరీ క్షేత్రం చేరుకున్నాడు. శ్రీకృష్ణుడు అక్కడి పూజారులకు కలలో కనిపించి, 'నా భక్తుడు వస్తున్నాడు. అతణ్ణి ఘనంగా సత్కరించాల'ని ఆదేశించాడు. పూజారులు అతనికి ఘనస్వాగతం పలికారు. తరువాత ఆ భక్తుడు, ఆలయంలో దేవుణ్ణి దర్శించగానే అతనికి మళ్ళీ చేతులు యథాతథంగా వచ్చాయి. ఈ విపత్కర పరిస్థితులకు కారణమేమిటని ఆ భక్తుడు, భగవంతుణ్ణి ప్రశ్నించగా "నిన్ను కష్టపెట్టిన స్త్రీ క్రిందటి జన్మలో ఓ ఆవు. నీవు ఆ ఆవును నీ చేతులతో కసాయివాడికి అప్పగించావు. వాడు ఆ ఆవు తల నరికాడు. ఆ కసాయే ఈ జన్మలో ఆమె భర్త. అందుకే ఆమె వాని తల నరికింది. నీవు కసాయివానికి పట్టి ఇచ్చినందుకు, నీ చేతులు ఖండించబడ్డాయి. ఇంత కష్టంలోనూ నాపై నీకు విశ్వాసం సడలనందున నీ చేతులను నీకు ప్రసాదించాను" అని వివరించాడు. కాబట్టి, మన ప్రారబ్ధకర్మ వల్ల కష్టాలు కలుగుతాయి. కానీ, భక్తి వల్ల కష్టాల తీవ్రత తగ్గిపోతుంది. ఏం జరిగినా సరే భగవంతుని పట్ల భక్తిని విడువరాదు. ❖

## పండుగలు - పర్వదినాలు

**ఆగష్టు - 2012**

| | | | |
|---|---|---|---|
| 02 | గురువారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 09 | గురువారం | : | శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 13 | సోమవారం | : | ఏకాదశి |
| 16 | గురువారం | : | స్వామి అద్వైతానంద జయంతి |
| 27 | సోమవారం | : | ఏకాదశి |

**సెప్టెంబర్ - 2012**

| | | | |
|---|---|---|---|
| 12 | బుధవారం | : | ఏకాదశి |
| 19 | బుధవారం | : | వినాయక చవితి |
| 26 | బుధవారం | : | ఏకాదశి |

అన్నమయ్య పదామృతం

చేరి యశోదకు శిశువితడు
ధారుణి బ్రహ్మకు తండ్రియు నితడు ॥
సొలసి చూచినను సూర్యచంద్రులను
లలివెద చల్లెడు లక్షణుడు
నిలిచిన నిలువున నిఖిలదేవతల
కలిగించు సురలగనివో యితడు ॥
మాటలాడినను మరి యజాండములు
కోటులు వొడమేటి గుణరాశి
నీటగు నూర్పుల నిఖిలవేదములు
చాటున నూరేటి సముద్రమితడు ॥
ముంగిట పొలసిన మోహన మాత్మల
పొంగించే ఘనపురుషుడు
సంగతి మావంటి శరణాగతులకు
నంగము శ్రీవేంకటాధిపుడితడు ॥

# చేరి యశోదకు శిశువితడు...

–శ్రీమతి బి.కృష్ణకుమారి

అండపిండ బ్రహ్మాండాలకు ఆధారభూతుడైన ఆ ఆపద్బాంధవుడు అద్దాల బాలుడిగా అవతరించి ఆ నందవ్రజాన్ని ఆనందధామంగా మార్చేశాడు. నాభికమలం నుంచి చతుర్ముఖ బ్రహ్మనే ఉద్భవింపచేసి, సృష్టికర్తకే తండ్రియైన ఆ శ్రీహరి, ఇక్కడ చేరి యశోదకు బిడ్డడయ్యాడు! అసాధ్యమన్నదే ఎరుగని ఆ ఆర్తత్రాణ పరాయణుడి లీలలు అనంతం! అనూహ్యం! అలా ద్వాపరయుగంలో ధర్మసంస్థాపనార్థం దిగివచ్చిన ధరణీ నాయకుడు శ్రీకృష్ణుడిగా సమస్తలోకాన్నీ తరింపచేశాడు. సూర్యచంద్రులకే ప్రకాశాన్ని ప్రసాదించే ఆ పరమాత్ముడు, రేపల్లె వీథుల్లో పసిబిడ్డడై పారాడాడు. అవతరించినది మొదలు అంతర్ధానం వరకు ఆ ఆశ్రితపక్ష పాలకుడు అనన్యసామాన్యమైన మహిమల్ని ప్రదర్శింపజేశాడు. అంతటి ఆ మధుసూదనుడి మాయల్ని తన మంజుల పద మంజీరాలతో రవళింపచేస్తున్నాడు అన్నమయ్య. **'చేరి యశోదకు శిశువితడు... ధారుణి బ్రహ్మకు తండ్రియు నితడు!'** అంటూ చెప్పనలవి కాని ఆ దేవదేవుడి చమత్కారాలను తన పదాలలో పల్లవింపజేస్తున్నాడు శ్రీవేంకటేశుడి భక్తాగ్రేసరుడు.

### బ్రహ్మకే జన్మనిచ్చిన పరబ్రహ్మ...

శేషతల్పమున పవళించి, స్వల్ప సంకల్పం చేతనే ఆ శ్రీమహావిష్ణువు తన నాభి నుంచి సృష్టికర్తను సృజింపచేశాడు. అంతటి ఆ తేజోమూర్తి తనంతట తానుగా ఓ తల్లి గర్భంలో బిడ్డగా ఒదిగిపోయాడు. దేవకి కడుపుపంటగా పుట్టి, యశోద కనులపంటగా పెరిగి, ఇద్దరు తల్లుల ముద్దుల తనయుడిగా వారి జన్మలను సార్థకం చేశాడు. పూర్ణపురుషుడైన ఆ పావనమూర్తి కన్నవారికే కాదు, కాంచినవారికి కూడా కైవల్యాన్ని ప్రసాదించాడు. అందుకే లీలాశుకుడు ఆ రూపాన్ని సాక్షాత్కరింపచేసుకొని పులకించిపోతూ...

**కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్**
**సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళీం**
**గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః॥** *(శ్రీకృష్ణ కర్ణామృతం – 2.109)* అంటాడు. ఎంతటి రమణీయమైన రూపమది! అందుకే ఆ మాధవుడి మాటలకే కాదు మురళీనాదానికి కూడా గోలోకం తన్మయమైపోయింది. కేవలం భక్తులను ఉద్ధరించడానికే ఆ జగన్మోహనాకారుడు ఈ భువిపై అవతరించాడు. అలా పరమానందభరితుడై ఈ పదకవితాపితామహుడు **'చేరి యశోదకు శిశువితడు... ధారుణి బ్రహ్మకు తండ్రియు నితడు'** అంటూ పరవశించి తన పదామృతాన్ని చిలకరిస్తూ ఉన్నాడు.

### సురలగని ఇతడు...

'బృందావనంలోని గోప గోపికలు, ఆల కాపరులు శ్రీకృష్ణుని కోసం దుఃఖించారు. ఆయన మధురా నగరానికి వెళ్ళిపోయి నప్పుడు గోపకులు ఆయన ఎడబాటుకు విలపిస్తూ సంచరించారు. అలా భగవంతుణ్ణి ప్రేమించడమే మానవ జీవిత ఉద్దేశం' అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. అలాంటి ఆ కృష్ణపరమాత్ముణ్ణి అన్నమయ్య ఇక్కడ 'సురల గని'గా కీర్తిస్తున్నాడు. సూర్యచంద్రులకు సైతం ప్రకాశాన్ని వెదజల్లే ప్రకాశకుడని, నిఖిల దేవతలనూ ఆయనలోనే చూపగల 'సురలగని' అని కొనియాడుతూ... *(మిగతా 32వ పేజీలో...)*

ఈ సమస్త విశ్వం ఎవరి వశమైవున్నదో అట్టి పరమాత్మ, తల్లి యశోద ప్రేమకు లొంగి ఆమె చేతిలో బంధితుడయ్యాడు. యశోదకు కలిగిన భాగ్యం బ్రహ్మరుద్రాదులకు కూడా కలగలేదు. - శ్రీమద్భాగవతం

అరిషడ్వర్గాలలో రెండోదైన క్రోధం అతి భయంకరమైనది. దానిని ఆశ్రయించిన మానవుడికి పతనం తప్ప, ప్రగతి లేదు. కోపం లేని మనిషి అంటూ ఉండడు. కానీ అది స్థాయి మించితే మాత్రం నష్టమే. ఎంతవారైనా దీని నుండి విముక్తి కాలేరు. తల్లితండ్రులు పిల్లలపై, గురువులు విద్యార్థులపై, అధికారులు క్రింది ఉద్యోగులపై చూపే ప్రదర్శిత కోపం (అంటే మనస్సులో లేకుండా పైకి మాత్రం మంచి ఫలితాన్ని ఆశించి చూపే



# క్రోధము

– కె. కౌండిన్య తిలక్



ధర్మాగ్రహం) శ్రుతి మించితే అసలుకే మోసం వచ్చే ప్రమాదం ఉంది. అసలీ కోపమనేది మనిషికి ఎందుకు కలుగుతుంది? దీనికి సమాధానం శ్రీకృష్ణుడు ఇలా వివరించాడు:

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥** *(గీత. 3-37)*

రజోగుణం వల్ల కామం పుడుతుంది. ఎంత అనుభవించినా దీనికి తృప్తి లేదు. ఇదే అవరోధానికి గురై, కోపంగా మారి, ఘోర పాపాలను చేయిస్తుంది.

కోరికలు తీరకపోవడం వల్ల, అనుకున్నది జరగకపోవడం వల్ల, అహం దెబ్బతినడం వల్ల, చెప్పుడు మాటలు వినడం వల్ల, తృప్తి లేకపోవడం వల్ల, నిరాశా నిస్పృహల వల్ల కలిగేది కోపం. అనునిత్యం కోపగించుకునే మనిషికి కుటుంబంలో, సమాజంలో విలువ ఉండదు. చేసే ప్రతి పనీ ఫలితాన్ని ఇవ్వదు సరి కదా, దుష్ఫలితాన్నిస్తుంది. కోపం, క్రోధం, ఆగ్రహం – ఇలా పేరు ఏదైనా మనిషి ప్రగతికి అవి అడ్డంకులే. క్రోధంలో మునిగినవాడు ప్రాణఘాతుకమైన హింసాచరణకు కూడా వెనుదీయడు. రాపిడి వల్ల చెట్టులో ఉద్భవించిన అగ్ని ఆ చెట్టునే దహించి వేస్తున్నట్లు దేహోత్పన్నమైన క్రోధం ఆ దేహాన్నే దహించి వేస్తుంది.

మహాభారతంలోని ఉద్యోగపర్వంలో ధృతరాష్ట్రుడితో విదురుడు ఇలా అంటాడు. **"...కోపము, నుబ్బును, గర్వము నాపోవక యునికియును, దురభిమానము, నిర్వ్యాపారత్వము ననునవి కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా!"**

మహాభారతంలో జనమేజయుడికి పరీక్షిత్ వృత్తాంతం తెలిపే సందర్భంలో శమీకుడు, శృంగితో అన్న మాటలు – **క్రోధము తపముం జెరుచును. క్రోధమ యణిమాదులై గుణముల బాపుం గ్రోధ మధర్మ క్రియలకు బాధ యగుం, గ్రోధి గా దపస్వికి జన్నే?**

క్రోధమనేది తపస్సును చెడగొడుతుంది. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశత్వమనే గుణాలను క్రోధం పారద్రోలుతుంది. ధర్మకార్యాలకు క్రోధం అవరోధం కలిగిస్తుంది.

ఆదిపర్వంలో దేవయానికి శర్మిష్ఠతో గొడవ జరిగిన సందర్భంలో శుక్రుడు, దేవయానితో ఇలా చెబుతాడు: "సాటిలేని నియమములు కలవారై భూరిదక్షిణలచే వేల యజ్ఞములు చేసిన వారి కంటే క్రోధము లేనివాడు ఉత్తముడు. ఇతరులు తనపై కోపించినను తాను కోపించక, తనను నిందించిననూ తిరిగి నిందించక, అవమానము పొందినను దానిని మనస్సున స్మరింపక ఉన్నవాడు నిజమైన ధార్మికుడు."

అరణ్యపర్వంలో 'నిత్యసహనం మంచిది కాదు. కౌరవులను కాస్త కోపించుము' అని ద్రౌపది, ధర్మరాజుతో అన్న సందర్భంలో ధర్మరాజు, ద్రౌపదితో ఇలా అంటాడు: 'క్రోధం పాపం. క్రోధం వల్ల ధర్మార్థ కామాలకు హాని కలుగుతుంది. క్రోధం కలవాడికి కర్తవ్యం గోచరించదు. అవధ్యులనైనా వధిస్తాడు. గురువులను కూడా నిందిస్తాడు. ఒకప్పుడు ఆత్మఘాతానికి పూనుకొంటాడు. మహాత్ముడు జ్ఞానమనే జలంతో క్రోధమనే అగ్నిని చల్లారుస్తాడు. క్రోధం లేనివాడు దేశ కాల స్వభావం తెలుసుకొని తేజాన్ని దాలుస్తాడు'.

**ఉత్తమే క్షణకోప స్యాత్ మధ్యమే ఘటికాద్వయమ్ ।**
**అధమే స్యా దహోరాత్రం పాపిష్ఠే మరణాంతకమ్ ॥**

'ఉత్తముల్లో కోపం క్షణకాలం పాటు ఉంటుంది. మధ్యముల్లో రెండు ఘడియలు ఉంటుంది. అధముల్లో కోపం ఒకరోజంతా ఉంటుంది. చనిపోయేవరకూ కోపంతో ఉన్నవాడు పాపాత్ముడు'.

కాబట్టి మనం జీవితమంతా ప్రశాంతంగా ఉండాలంటే యోగం, ధ్యానం, జపం, మౌనం మొదలైన పద్ధతులను ఆచరించి మనలో ఉన్న ఈ అంతఃశత్రువును పారద్రోలడానికి ప్రయత్నించాలి. ❖

# కష్టాలలో... సుఖాలలో...

- కె.వి.ఎస్. మూర్తి

మానవ జీవితంలో కష్టాలు, సుఖాలు – రెండూ అనివార్యం. కష్టసుఖాలు కావడి కుండలు అని అనడం కద్దు. ఈ రెండింటినీ తమ జీవిత కాలంలో అనుభవించని వారు ఎవరూ లేరు. ఏ మహాత్ముని జీవితం తరచి చూసినా, ఏ మహానాయకుని జీవన గమనాన్ని పరిశీలించినా కథ ఇంతే. జరుగుతున్న ప్రతి సంఘటనా ఆ సర్వేశ్వరుని సంకల్పమే అనీ, ఈ రోజు ఉన్న పరిస్థితి శాశ్వతం కాదనీ, కాలం గడిచే కొద్దీ పరిస్థితులు మారుతూనే ఉంటాయనీ శాస్త్రాలు వివరిస్తూనే ఉన్నాయి. అయితే మహామహులు కూడా తడబడ్డ సంఘటనలు తెలుస్తూనే ఉన్నాయి. సర్వకాల సర్వావస్థలయందూ భగవంతుని సాన్నిహిత్యాన్నీ, స్మృతినీ విడువని వ్యక్తి జీవితం ధన్యమైనది.

మన శ్రేయోభిలాషులు ఎవరు? స్నేహితులు ఎవరు? హాని కలిగించేవారు ఎవరు? ఎవరితో ఎలా మెలగాలి? అన్న విషయాలపై మనకు అవగాహన కలిగించే కాలం కష్టాల కాలం. ప్రతి అణువులోనూ దివ్యత్వాన్ని దర్శించేందుకు అనువైన కాలం. అనునిత్యం దైవాన్ని స్మరించేందుకు అనుకూలమైన కాలం. ఆ భగవంతుని సాంగత్యాన్నీ, ప్రేమపూర్వకమైన ఓదార్పునూ అనుభవిస్తూ కన్నీటి వెల్లువలో సాంత్వన పొందే అమృత సదృశమైన సమయం. మనం పరివర్తన చెంది, పరిశుద్ధ జీవనం కొనసాగించడానికి అద్భుతమైన కాలం – 'కష్టాల కాలం'. అందుకే కష్టాలకు మనం సర్వదా కృతజ్ఞులమై ఉండాలి. అవి మనల్ని దైవానికి దగ్గరగా తోడ్కొని వెళతాయి.

ఇక మనం భయపడవలసిన కాలం – 'సుఖాల కాలం'. అనుకోకుండా అన్నీ కలిసి వస్తుంటాయి. తిరిగి రావనుకున్న బకాయిలను ఇంటికి వచ్చి చెల్లిస్తారు. పిల్లలు, బంధువులు, స్నేహితులతో జీవితం సంబరంగా గడుస్తుంటుంది. హాయి... హాయిగా మన గురించి మనం ఆలోచించే సమయం లేకుండా చేస్తుంది ఈ కలిసొచ్చే కాలం. పెద్దలు, అనుభవజ్ఞులు, శ్రేయోభిలాషుల మాటలు వినేందుకు అసలు సమయమే ఉండదు. ఇక దైవం సంగతి దేవునికే ఎరుక. ఆ భగవంతుని అవసరం అంతగా లేని కాలం అది. సుఖసంతోషాలతో పాటు ఆర్భాటాలూ, హైరానాలూ ఎక్కువ అవుతాయి. మానసిక, శారీరక అలసటతో జీవితాన్ని ఆదమరచి అనుభవిస్తాం. పూజలు, యాగాలు యాంత్రికంగా మారతాయి. ఏకాంతమే ఉండదు. ఇక భగవంతుణ్ణి స్మరించేందుకు సమయం ఎక్కడ?

కష్టాల్లోనూ, సుఖాల్లోనూ భగవంతుణ్ణి సదా స్మరిస్తూ జీవితం గడిపే ఓ రామభక్తుని కథను శ్రీరామకృష్ణులు చెప్పారు:

ఒక ఊరిలో ఓ రామభక్తుడు ఉండేవాడు. అతడు వస్త్రాలు నేసి, బజారులో అమ్ముతుండేవాడు. వస్త్రాలను నేస్తున్నప్పుడూ, అమ్ముతున్నప్పుడూ అంతా 'రామేచ్ఛ' వల్ల జరుగుతుందని శ్రీరాముణ్ణి తలచుకుంటూ ఉండేవాడు. రోజంతా పనిచేసి రాత్రి ఇంటికి వచ్చిన తరువాత కూడా స్నానపానాదులను ముగించుకొని భగవన్నామ సంకీర్తన చేస్తూ ఉండేవాడు. ఇలా భగవచ్చింతనలో రోజులు ఆనందంగా గడుస్తున్నాయి. ఎప్పటిలాగే ఒక రోజు రాత్రి ఇంటి బయట కూర్చొని భగవన్నామ స్మరణ చేస్తున్నాడు. హఠాత్తుగా కొంత మంది దొంగలు వచ్చి తాము దొంగిలించిన ధనాన్ని మోయడానికి ఆ భక్తుణ్ణి తమతో లాక్కుపోయారు. అలా దొంగసొమ్ము మూటలు అతని నెత్తి మీద పెట్టి వెళుతుండగా రక్షకభటులు వెంబడించారు. వెంటనే ఆ దొంగలు తప్పించుకొని పారిపోయారు. కానీ భక్తుని వద్ద సొమ్ముల మూట ఉండడం వల్ల రక్షకభటులు అతణ్ణి నిర్బంధించారు. మరుసటిరోజు అతణ్ణి న్యాయస్థానానికి తీసుకు వెళ్ళారు. అతడు న్యాయాధిపతితో "నేను 'రామేచ్ఛ' వల్ల రాత్రి ఇంటి బయట కూర్చొని, భగవన్నామస్మరణ చేస్తున్నాను. 'రామేచ్ఛ' వల్ల దొంగలు వచ్చి, సొమ్ముల మూటను మోయమంటూ నన్ను లాక్కుపోయారు. 'రామేచ్ఛ' వల్ల రక్షకభటులను చూసి దొంగలు పారిపోయారు. ఇంతలో 'రామేచ్ఛ' వల్ల రక్షకభటులు వచ్చి నన్ను నిర్బంధించారు. నేనిప్పుడు 'రామేచ్ఛ' వల్ల మీ ముందు నిలబడ్డాను" అని చెప్పాడు. ఈ రామభక్తుడు చెప్పినదంతా విన్న న్యాయాధిపతి అతడు నిర్దోషి అని నిర్ధారణ చేసి, విడుదల చేయించాడు. ఆ రామభక్తుడి లాగే మనం కూడా సుఖాల్లోనూ, కష్టాల్లోనూ ఆ సర్వేశ్వరుణ్ణి సదా స్మరిస్తూ, ఆయన పట్ల శరణాగతి భావంతో ఉండగలిగితే మన జన్మ నిజంగా ధన్యమైనట్లే! ❖

వ్యక్తిత్వ నిర్మాణంలో సుఖదుఃఖాలు రెండూ సమానపాత్ర పోషిస్తాయి. మహాత్ముల జీవితాలను చూస్తే వారిని ఉన్నతంగా మలచింది సుఖం కంటే దుఃఖమే అని గ్రహించవచ్చు. - స్వామి వివేకానంద



# శిఖ పెట్టుకోవాలా?

మనదేశంలో వైదిక కర్మాచరణ సాగిస్తూ, నియమబద్ధంగా జీవితం సాగిస్తున్న వారందరూ జుట్టును వెనకాల ముడి వేసుకొని, శిఖ పెట్టుకోవడం చూస్తుంటాం. ఇది ఎంతోకాలంగా వస్తున్న సంప్రదాయం.

సంప్రదాయాన్ని అనుసరించేవారు శిఖ పెట్టుకొని తీరాలన్నది వేద శాసనం. '*యత్ర బాణాస్సంపతంతి కుమారా విశిఖాసః*' అని యజుర్వేద మంత్రాల్లో ఉంది. 'విశిఖాసః' అంటే, ఆవు గిట్టంత జుట్టు శిఖగా ఉండాలని పెద్దల భాష్యం. అలాగే, '*యశసే శ్రియై శిఖా*' – అని యజుర్వేదం చెబుతోంది. కీర్తికీ, సిరిసంపదలకూ శిఖను పెట్టుకోవాలని యజుర్వేద తీర్మానం. '*దీర్ఘాయు త్వాయ బలాయ వర్చసే శిఖాయై వషట్*' – దీర్ఘాయుస్సు, బలం, వర్చస్సు కోసం శిఖను స్పృశిస్తున్నామని వేదం పేర్కొంటోంది.

### కర్తవ్యాన్ని గుర్తు చేసే శిఖ

జుట్టు చివరలో ముడి వేసుకోవడమనే శిఖా సంప్రదాయాన్ని ఇవాళ ఆధునికులు పాటించడం లేదు. అయితే, సంప్రదాయ వాదులు మాత్రం ఈ ఆచారంపై పట్టుబడుతున్నారు. అసలింతకీ, పిలక పెట్టుకోవడంలోని అంతరార్థమేమిటి? నిజానికి, ఎవరికి వారు తమ ఆదర్శాలనూ, లక్ష్యాలనూ విస్మరించకుండా ఉండేందుకూ, ఎప్పటికప్పుడు గుర్తు చేసుకొనేందుకూ శిఖ ఓ ప్రతీక. సద్బుద్ధి కలిగేందుకూ, మనస్సులో మంచి ఆలోచనలు వచ్చేందుకూ శిఖ తోడ్పడుతుంది.

'*సర్వాంగానాం శిరః ప్రధానమ్*' – శరీరంలోని అన్ని అవయవాల కన్నా శిరస్సు ప్రధానమైనదని పెద్దల మాట. శిరస్సులోనే మన మెదడు, మన శరీరాన్నే కాక, ఆలోచనలనూ, భావోద్వేగాలనూ నియంత్రించే పిట్యూటరీ గ్రంథి సైతం ఉంటాయి. శిఖగా ముడి వేసుకున్న జుట్టు మూలాలు మన మెదడులోని నియంత్రణ కేంద్రాల దాకా ఉంటాయని భావిస్తుంటారు. ఆ రకంగా మనం శిఖ పెట్టుకొనే శిరస్సు వెనుక భాగం జ్ఞానానికీ, ఆలోచనలకూ స్థానం. ఆ స్థానానికి ఒక రకంగా శిఖే ఓ గుర్తు.

### శిఖపై శాస్త్రాల ఉవాచ

సంధ్యావందన, జప, తప, అనుష్ఠానాదులు చేసేటప్పుడు భగవత్కృప శిఖ ద్వారా మనలో చేరుతుంది. పూర్తిగా గుండుతో కానీ, జుట్టు ముడి వేయకుండా కానీ చేసే కర్మ అంతా వ్యర్థమవుతుందని శాస్త్ర వచనం.

***సదోపవీతినా భావ్యమ్ సదా బద్ధ శిఖేన చ ।***
***విశిఖో వ్యపవీతశ్చ యత్కరోతి న తత్కృతమ్ ॥***

'*శిఖ లేకుండా యజ్ఞం చేసినా, దానం చేసినా, తపస్సు చేసినా, ఉపవాసం చేసినా, మరి ఏ ఇతర ధార్మిక కార్యాలు ఒనరించినా అవన్నీ నిష్ఫలమే*' అని 'కాత్యాయన స్మృతి' (1/4) చెబుతోంది.

అలాగే, '*శిఖ లేకుండా ఏ సత్క్రియ చేసినప్పటికీ, అది రాక్షస క్రియగానే పరిణమిస్తుందం*'టూ వేదవ్యాసుడు సైతం 'వ్యాస స్మృతి'లో ఇలా చెప్పాడు:

***వినా యచ్ఛిఖయా కర్మ వినా యజ్ఞోపవీతకమ్ ।***
***రాక్షసమ్ తద్ధి విజ్ఞేయమ్ సమస్త్యా నిష్ఫలా క్రియాః ॥***

అలాగే, స్నాన, దాన, జప, హోమాలు చేసేటప్పుడూ, దేవ, పితృ కర్మలు చేసేటప్పుడూ జుట్టు ముడి వేసి తీరాలని ధర్మశాస్త్రాలు, 'మనుస్మృతి' చెబుతున్నాయి. వైదిక ధర్మం ప్రకారం శిఖ పెట్టుకోవడం ఎంత ముఖ్యమో 'మనుస్మృతి' వివరించింది.

***స్నానే దానే జపే హోమే సన్ధ్యాయామ్ దేవతార్చనే ।***
***శిఖాగ్రన్థిమ్ సదా కుర్యా దిత్యేతతన్మను రబ్రవీత్ ॥***

'*స్నానం చేస్తున్నప్పుడూ, దానం చేస్తున్నప్పుడూ, జపాదికాలు నిర్వహిస్తున్నప్పుడూ, హోమం చేస్తున్నప్పుడూ, సంధ్యావందనం ఆచరిస్తున్నప్పుడూ, దేవతార్చన సమయంలోనూ, దేవతలను ప్రార్థిస్తున్నప్పుడూ శిఖను ముడి వేసుకోవాలి*' అన్నది 'మనుస్మృతి' మాట. ❖

(వచ్చే సంచికలో 'శిఖ ఎందుకు?')




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

# శ్రీరామకృష్ణ భక్తమాలా'రత్నం'

"మహాత్ముల, అవతారపురుషుల జీవిత చరిత్రలు, బోధనలు మన జీవనయానంలో, ఆధ్యాత్మిక సాధనా మార్గంలో అద్భుతమైన అడుగుజాడలు" అనే సత్యం శ్రీకొత్తూరు మునిరత్నం శెట్టి జీవితంలో అడుగడుగునా దర్శనమిస్తోంది. బంధువుల ఇంట్లో లభించిన "శ్రీరామకృష్ణుల జీవిత చరిత్ర" అనే చిన్న పుస్తకం ఆయన జీవిత గమనాన్నే మార్చివేసింది. చిత్తూరు జిల్లాలోని పుదిపట్ల(తిరుపతికి 5 కిలోమీటర్ల దూరం) గ్రామంలో 1925వ సంవత్సరంలో జన్మించిన ఆయన కుటుంబ ఆర్థిక వనరుల లేమి వలన 5వ తరగతితోనే తన విద్యాభ్యాసాన్ని నిలిపివేశారు. అనారోగ్యంతో ఉన్న తండ్రినీ, ఇతర కుటుంబ సభ్యులను పోషించే బాధ్యత తన మీద పడడం వల్ల 11వ ఏట నుంచే రోజువారీ చేనేత మగ్గం కూలీగా జీవితాన్ని ఆరంభించారు.


కొత్తూరు మునిరత్నం శెట్టి

చేతికి వచ్చే కొద్దిపాటి కూలీ డబ్బులతోనే నిరాడంబరంగా జీవిస్తూ, ఆధ్యాత్మిక చింతన చేస్తూ రోజులు గడిపారు.

భగవంతుణ్ణి నమ్మినవారి భారాన్ని ఆయనే స్వీకరిస్తాడు కదా! క్రమంగా మునిరత్నం ఆ భగవంతుని అండదండలతో రోజువారీ కూలీ నుండి చేనేత వ్యాపారం చేసే స్థాయికి చేరుకున్నారు. వ్యాపారం నిమిత్తం మద్రాసు వెళ్ళినప్పుడు తన బంధువైన ఓ రామకృష్ణ భక్తుని ఇంటికి తరచూ వెళ్ళేవారు. ఆ భక్తుని ఇంట్లోనే 'శ్రీరామకృష్ణుల జీవిత చరిత్ర' పుస్తకం చదివారు. ఆ పుస్తకం ఆయనలో ఆధ్యాత్మికతను జాగృతం చేసింది. అప్పటి నుండీ పుదిపట్ల గ్రామస్థులతో కలిసి సత్సంగ కార్యక్రమాలను నిర్వహించేవారు. కొంతకాలానికి భక్తులంతా కలిసి సత్సంగం నిర్వహించడానికి ఒక సేవాసమితిని ఏర్పాటు చేయాలని సంకల్పించారు. దాని ఫలితంగా 1954వ సంవత్సరంలో పుదిపట్ల గ్రామంలో 'శ్రీరామకృష్ణ సేవా సమాజం' ఏర్పాటైంది.

ఆ విధంగా చిత్తూరు జిల్లాలో శ్రీరామకృష్ణ ఉద్యమానికి ప్రథమ బీజం పుదిపట్లలో పడింది. శ్రీ మునిరత్నం ఈ సమాజం ద్వారా చుట్టు ప్రక్కల గ్రామాలలో కూడా ఆధ్యాత్మిక ప్రవచనాలు, సంకీర్తనలు నిర్వహించి, శ్రీరామకృష్ణ భావవ్యాప్తికి ఎంతగానో కృషిచేశారు.

స్వామి నందానందజీ మహరాజ్ మునిరత్నంగారి నిరాడంబర జీవితాన్ని చూసి ఎంతో ముగ్ధులయ్యారు. పూజ్య స్వామీజీ ప్రతీ సంవత్సరం మూడు రోజుల పాటు జరిగే 'శ్రీరామకృష్ణ సేవా సమాజం' వార్షికోత్సవాలకు విచ్చేసి, తమ ప్రసంగాలతో భక్తులను ఉత్తేజపరిచి, ఆశీర్వదించేవారు.

భక్తుల సంఖ్య పెరగడంతో 1962లో తిరుపతి – చంద్రగిరి ప్రధాన రహదారిలో 'శ్రీరామకృష్ణ పూజా ధ్యాన మందిరా'న్ని నిర్మించారు. ఆ మందిరంలో క్రమం తప్పకుండా మూర్తిత్రయ జయంత్యుత్సవాలు, విశేష పూజలు, వార్షికోత్సవాలు, నారాయణ సేవా కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఆయన స్ఫూర్తితోనే తిరుపతి, మదనపల్లి, పాకాలల్లో శ్రీరామకృష్ణ సేవా సమితులు ఆవిర్భవించాయి. పిల్లలకు భక్తిపాటలు, భజనలు, గీతా పారాయణం, ధ్యానం వంటి వాటిల్లో శిక్షణ ఇవ్వడంలో మునిరత్నంగారు ప్రత్యేక శ్రద్ధ కనబరచేవారు. ఈ కార్యక్రమాన్ని తన జీవితాంతం వరకూ ఆయనే స్వయంగా నిర్వహించేవారు. మునిరత్నంగారి స్ఫూర్తితో ప్రారంభమైన పుదిపట్ల శ్రీరామకృష్ణ సేవా సమాజం 1979లో రజతోత్సవాలనూ, 2004లో స్వర్ణోత్సవాలనూ జరుపుకుంది. ఈనాటికీ పుదిపట్ల చుట్టుప్రక్కల గల పదిహేను గ్రామాల నుండి భక్తులు ఇక్కడ జరిగే కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు.

పని సమయంలో ఒక చేత్తోనూ, తీరిక సమయంలో రెండు చేతులతోనూ శ్రీరామకృష్ణ పాదారవింద సేవలను చేసే ఈ భక్త వత్సలుడు తన 66వ ఏట, 1991 నవంబరు 8న భౌతిక దేహాన్ని వదిలారు. ఆదర్శప్రాయమైన వారి సరళ జీవితం, పటాటోపం ఏ మాత్రం లేని నడవడిక భక్తులందరికీ ఆదర్శప్రాయం. ❖

సేకరణ: కె.రామకృష్ణ, డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి
అనుసృజన: శ్రీమతి టి.ఆశాలత

రాగద్వేషాలున్నవాడు తపోవనానికి వెళ్ళినా గృహంలో ఉన్నట్లే. ఇంద్రియనిగ్రహం కలిగి, రాగద్వేషాలకు అతీతమై సత్కర్మలందే వర్తించు మహాత్ములకు ఇల్లే ఓ తపోవనం. - హితోపదేశం



# రామకృష్ణ సంఘంలో

– స్వామి ప్రభానంద*

భారతీయ సన్న్యాసాశ్రమంలో తపస్సు ఒక ముఖ్యభాగం. సన్న్యాసులు తపస్సు, జ్ఞానార్జనలను తమ జీవితాలలో సదా, సర్వదా సజీవంగా ఉంచాలనీ, భావప్రచారానికై యాత్రలు చేపట్టాలనీ ఆదిశంకరులు ఆదేశించారు. శ్రీరామకృష్ణుల బోధనలతో ఇవి నూతన ఉత్తేజాన్నీ, నవీన దృక్పథాన్నీ సంతరించుకున్నాయి. పూర్వం సన్న్యాసులు స్వేచ్ఛాయుతమైన ఏకాంత వాసాన్ని ఎంచుకొనేవారు. రామకృష్ణ సంఘం నవీన దృక్పథంలో సన్న్యాసులు సంఘంగా ఏర్పడి, కలసి జీవించవలసి ఉంది. ఇది ఆధ్యాత్మిక జీవితంలో ఒక గొప్ప క్రమశిక్షణ భావాన్ని పెంపొందిస్తుంది.

పుష్పం చుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగుతున్న భ్రమరం లాంటిది తపస్సు. ధ్యానమగ్నమైన మనస్సు పువ్వుపై కూర్చొని నిశ్శబ్దంగా మకరందాన్ని గ్రోలుతున్న తుమ్మెద లాంటిది. 'నేను సన్న్యాసి సంఘంలో విప్లవాత్మక మార్పులు తేనున్నాను' అన్నారు స్వామి వివేకానంద. పూర్వం సన్న్యాసులు తమ మోక్షం కొరకు తపస్సు చేసేవారు. దీనికి లోకకల్యాణాన్ని జత చేసి, 'ఆత్మనో మోక్షార్థం, జగద్ధితాయ చ' అనే నవీన సిద్ధాంతాన్ని రూపొందించారు స్వామీజీ. యువ సన్న్యాసులకు ఇది ఆహ్వానించదగిన మార్పు కాగా, వరిష్ఠ సాధువుల్లో కొంత అలజడి, ఆందోళనలను కలిగించాయి. రామకృష్ణ సంఘం భవిష్యత్తు ఏమవుతుందో అని వారు భీతిల్లారు.

స్వామీజీ తనదైన శైలిలో అన్ని వ్యతిరేకతలనూ తోసిరాజన్నారు. ఇది నిజంగానే విప్లవాత్మకమైన మార్పు. కానీ సాంప్రదాయికతను విడవకుండానే, నవీకరణ జరిగిందన్నది చారిత్రక సత్యం. ఈ విధంగా స్వామీజీ క్రియాశీలక దృక్పథం మూలంగా సేవే సాధన అనే భావానికి ఒక ప్రముఖస్థానం దక్కింది. అంతేకాక, సంఘంపై రాజకీయ, సామాజిక శక్తుల ప్రభావం కూడా గమనార్హం.

దేశస్వాతంత్ర్యానికి పూర్వం ఉదయించిన జాతీయతా భావ ప్రభావం రామకృష్ణ సంఘంపై పడింది. వాస్తవానికి జాతీయత అనే భావాన్ని తట్టిలేపింది స్వామి వివేకానందులే. కొందరు సమరయోధులు మఠంలో చేరారు. ఇది సహజంగానే బ్రిటీషు ప్రభుత్వానికి ఆగ్రహం కలిగించింది. దేశద్రోహులకు మఠం ఆశ్రయం ఇస్తున్నదని ఆరోపించారు. ఇటు ప్రజానీకం మఠ సన్న్యాసులు స్వాతంత్రోద్యమంలో పాల్గొనడం లేదని అసంతృప్తి వ్యక్తం చేశారు.

స్వామి వివేకానంద నిర్దేశక సూత్రాలను అనుసరిస్తూ మఠం, స్వాతంత్ర్యానంతరం జాతి పునర్నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నది. ఇటీవల కాలంలో దేశంలో మారుతున్న సామాజిక, ఆర్థిక పరిస్థితుల మూలంగా మఠాలకు ఆర్థిక బలం సమృద్ధిగానే ఉంది. మరొక ప్రక్క శాస్త్ర సాంకేతిక రంగాలలోని మార్పులు, నిర్వహణ నైపుణ్యం (మేనేజ్‌మెంట్ స్కిల్స్) మూలంగా సన్న్యాసుల దృక్పథం కొంచెం మారుతోంది. మిషన్ కార్యక్రమాలు నానాటికీ విస్తరిస్తున్న కారణంగా, సన్న్యాసులు సేవా కార్యక్రమాలకు



స్వామి శాంతానంద
(1884–1974)



స్వామి ప్రేమేశానంద
(1884–1967)

మారుగా పాలక, పర్యవేక్షక పాత్రలలో నిమగ్నమవుతున్నారు. ప్రపంచీకరణ, సమాచార సాధనాల విస్తరణ మూలంగా సన్న్యాసుల జీవనశైలి చాలా మారిపోతోంది.

పైన పేర్కొన్న కారణాల వల్ల రామకృష్ణ సంఘంలో సాంప్రదాయికతను వీడకుండానే, విలువలు, ఆచారాలలో నవీకరణ జరుగుతోంది. ఊహించని ఈ సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రభావాలను అటుంచి, తపస్సాధనకు ఎల్లవేళలా ప్రమాద సంకేతాలైన కామ కాంచనాలు ఉండనే ఉన్నాయి. కామం కన్నా కాంచన ప్రభావం అధికంగా కనపడుతుంది. అనాది నుండి కామకాంచనాలు తపోభంగాలకు కారణం అవుతూనే ఉన్నాయి. పేరు ప్రతిష్ఠలకై ప్రయత్నాలు ఎక్కువ అవుతున్నాయి. ఆధునిక సమాజంలో నెలకొన్న నియంత్రణ లేని భౌతికవాదం మూలంగా సన్న్యాసుల పరిస్థితి జటిలమవుతోంది. ఇన్ని పరిపాలనా బాధ్యతలు, సామాజిక కార్యక్రమాల ఒత్తిడి ఉన్నా, రామకృష్ణ సంఘ సన్న్యాసులు అనేకులు తమ ఆధ్యాత్మిక జీవితాన్ని ఉజ్జ్వలంగా ఉంచగలుగుతున్నారు. ఇది గమనార్హం.

# తపోమయ జీవనం

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రెండు దశాబ్దాల పిదప రామకృష్ణ మఠం, మిషను వారు విద్య, వైద్య రంగాలలో అనేక కార్యక్రమాలు చేపట్టారు. అగ్రగణ్యులు, పథనిర్దేశకులు మాకై వదిలివెళ్ళిన గొప్ప ఆధ్యాత్మిక వారసత్వానికి భంగం వాటిల్లనున్నదా అని చాలామంది సన్న్యాసులు ఆందోళన చెందారు. ఆ కాలంలో నేను కలకత్తాలోని సేవాప్రతిష్ఠాన్‌లో సహాయ కార్యదర్శిగా నియమితుణ్ణయ్యాను. ఈ సంస్థ రామకృష్ణ మిషన్‌లో అతి పెద్ద ఆసుపత్రి కావడం చేత దేశంలోని వివిధ శాఖల నుండి అనేక మంది సన్న్యాసులు వైద్యనిమిత్తం ఇక్కడకు వస్తూవుండేవారు.

కొంతమంది వరిష్ఠ సన్న్యాసులతో సుమారు నాలుగు సంవత్సరాల పాటు గడిపే అదృష్టం నాకు దక్కింది. చివరి క్షణాలలో నేను వారి దగ్గర ఉండడం జరిగింది. మరణం


స్వామి అతులానంద
(1870-1966)


స్వామి వీరేశ్వరానంద
(1892-1985)

ఆసన్నమైన వ్యక్తి తన నిజస్వభావాన్ని మరుగుపరచలేడు. ఈ సన్న్యాసులు చివరి క్షణాలలో ప్రదర్శించిన హుందాతనం, ప్రసన్నత నన్ను పులకింపజేశాయి. వారి ముఖాలలో భీతి, ఆందోళన, నిరాశ మచ్చుకైనా కానరాలేదు. ఏనాడు, ఏ ఘడియలో తమ ప్రాణాలు పోతాయో కొందరు కచ్చితంగా చెప్పగలిగారు. దగ్గర ఉన్నవారందరికీ కొందరు ఆశీస్సులు పలికారు. అప్పుడు రామకృష్ణ సన్న్యాస సంఘంలో ఆధ్యాత్మికత పటిష్ఠంగా ఉన్నదనే నమ్మకం నాకు కలిగింది.

అంతేకాక, గొప్ప తపోనిష్ఠులైన రామకృష్ణమఠ సన్న్యాసుల సాన్నిధ్యం లభించడం నా అదృష్టం. 1959లో ఒక యువ బ్రహ్మచారిగా రాంచీ రామకృష్ణ మిషన్‌కు వెళ్ళాను. సన్న్యాసుల వసతి గృహ ప్రాంగణంలో ఒక వరిష్ఠ సాధువు కూర్చొని ఉన్నారు. నేను ఆయనకు ప్రణామం చేసి నిలబడగానే, 'అనాహత శబ్దం వినవస్తున్నదా?' అని అడిగారు. నేను ఉలిక్కిపడి 'ఏమన్నారు?' అని అడిగాను. 'నీకు ఓంకారం వినపడడం లేదా? నాకు నిరంతరాయంగా వినపడుతూనే ఉంది' అన్నారు. వెంటనే వీపు నిటారుగా పెట్టారు. ఉన్ని శాలువా జారిపోయి, గుండీలు సరిగ్గా పెట్టని చొక్కా ద్వారా ఆయన ఛాతీ కనపడింది. నేను నిర్ఘాంతపోయి చూస్తుండగా, ముఖంపై నున్న అరుణిమ ఛాతీకి పాకింది. ముఖంపై ఒక అలౌకిక మందహాసం. నాలుగైదు నిమిషాల తర్వాత కళ్ళు తెరచి, 'వెన్ను నిటారుగా పెడితే ఆ శబ్దం విస్పష్టంగా వినపడుతుంది. ఇది 1911లో తొలిసారిగా వినపడింది. అప్పటి నుండి నిరంతరాయంగా వినపడుతూనే ఉంది. వెలుపల నుండి కాదు సుమా! హృదయాంతరాళం నుండి వచ్చి మరల అందులోనే లయం అవుతుంది. 'జపాత్ సిద్ధిః' – జపసాధన మూలంగా సిద్ధిస్తుంది' అన్నారు. ఆ మహాత్ముడే మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి శాంతానంద మహరాజ్. ఆయన క్రమం తప్పకుండా జపం చేయమని నన్ను ఎప్పుడూ ప్రోత్సహిస్తూ ఉండేవారు. నేను హిమాలయాలకు తపస్సుకు వెళుతుంటే, ప్రత్యేకంగా పిలిచి మరీ గుర్తుచేశారు.

స్వామి ప్రేమేశానంద మహరాజ్ కూడా శారదామాత శిష్యులే. నేను వారిని మొట్టమొదటిసారిగా 1948, 1949 ప్రాంతంలో సార్‌గాచీ ఆశ్రమంలో దర్శించాను. కమనీయ రూపం. ప్రతిదినం స్నానానంతరం మందిరంలో అరగంటసేపు ధ్యానం చేసేవారు. కూర్చున్నదే తడవు, ఆశ్చర్యజనకమైన మార్పు. ముఖం ఒక వింత వర్చస్సుతో నిండి మెల్లగా ఛాతికి పాకేది. ఆ తర్వాత కొంచెం తడబడుతూ 'మేడ మెట్లు దిగేవారు'. మధ్యాహ్న భోజనం వరకు స్పష్టంగా మాట్లాడలేకపోయేవారు. ధ్యానం చేసినప్పుడు కలిగిన భావం త్వరగా పోయేది కాదన్న మాట. ఇది ఏదో ఒక్కనాటి విషయం కాదు, ప్రతి నిత్యం జరిగేది.

1964లో శారదామాత పాశ్చాత్య శిష్యులైన స్వామి అతులానంద మహరాజ్‌తో నేను ఓ పక్షం దినాలు గడిపే అదృష్టానికి నోచుకున్నాను. వారు బార్లోగంజ్‌లోని శ్రీశారదా కుటీరంలో ఉండేవారు. వారు గొప్ప తపోనిష్ఠులు. వారు ధ్యానంలో ఉన్నప్పుడు ముఖం దివ్యకాంతితో ప్రకాశించేది. మేము వెలిబుచ్చిన సందేహాలకు వారు ఇచ్చిన సమాధానాల ద్వారా వారి ఆధ్యాత్మిక అనుభూతుల వైభవం ద్యోతకమయ్యేది. స్వామి అతులానందజీ 1966వ సంవత్సరంలో 97వ ఏట మహాసమాధి చెందారు. మహాసమాధికి ముందు నాలుగు దినాల నుండి 'జై మా, జై మా' అని శారదామాతను నిత్యమూ స్మరిస్తూవుండేవారు. ఆఖరి రోజున 'ఓం మా, హరి ఓం' అంటూ శరీరాన్ని విడిచారు.

1963 మే నెలలో నేను ప్రధాన కార్యదర్శికి ఒక లేఖ అందజేయాలని బస్సులో బేలూరు మఠానికి వెళ్ళాను. అప్పుడు మధ్యాహ్నం 1.30 గంటలైంది. వేసవి కాలం కావడం వల్ల బాగా చెమటలు కక్కుతూ, అలసిపోయి కార్యాలయానికి వెళ్ళాను.

(మిగతా 35వ పేజీలో...)

ఐహికభోగభాగ్యాలు అశాశ్వతాలని గ్రహించడం వల్ల కలిగే వైరాగ్యం ఉత్తమమైనది. ఇలాంటి వైరాగ్యం ఉన్న వ్యక్తికి ఎన్ని భోగభాగ్యాలు అందుబాటులో ఉన్నా అతడు చలించడు. - శ్రీరామకృష్ణులు

మాయా బజార్

# స్వేచ్ఛా భారతంలో నిర్బంధ జీవితాలు

– స్వామి శితికంఠానంద

దివిజుల సభ ప్రారంభమైంది. 'నారాయణ... నారాయణ..' అంటూ దేవర్షి నారదుడు సభలో ప్రవేశించాడు. ఇంద్రుడు, మిగతా వేల్పులు అందరూ లేచి నిలబడి, ఆ భాగవతోత్తముడికి స్వాగతం పలికారు.

**దేవేంద్రుడు:** మీ రాకతో మా ఈ సభ పావనమైంది మునీంద్రా! దయచేసి మీ రాక వెనుక గల ఆంతర్యం తెలియజేసి మమ్ములను సంతుష్టులను చేయ ప్రార్థన.

**నారదుడు:** దేవేంద్రా! ముల్లోకాలలో సంచరిస్తూ భూలోక పరిస్థితులు తెలుసుకుందామని వెళ్ళాను. అంతా అస్తవ్యస్తంగా ఉన్నట్లు అనిపించింది. ఈ పరిస్థితులకు కారణ మేమిటో తెలుసుకుందామని వైకుంఠానికి బయలు దేరాను.

**దేవేంద్రుడు:** మేమూ ఈ సభలో ఆ భూలోకంలో నెలకొన్న పరిస్థితులను గురించే చర్చిస్తున్నాం. దేవదేవుడిని కలిసిన తర్వాత ఆ సమాధానాలు మాకు కూడా తెలియజేయవలసింది.

**నారదుడు:** అవశ్యం తెలియజేసెదను. సెలవు.

*(వైకుంఠంలో...)*

**నారాయణుడు:** నారదా! బహుకాల దర్శనం. నీ లోక సంచారం సరిగ్గా సాగుతోందా? లోకాలన్నీ సుఖంగా ఉన్నాయనుకుంటాను.

**నారదుడు:** లోకాలన్నీ క్షేమంగానే ఉన్నాయి స్వామీ! భూలోకం తప్ప! భూలోక విషయాలు మీకు విన్నవించి, ఆ పరిస్థితులకు గల కారణాలు తెలుసుకుందామని వచ్చాను.

**నారాయణుడు:** భూలోకం సరే. భరతఖండం సుభిక్షంగా ఉంది కదా. జంబూద్వీప వాసులచే ధర్మం సదా ఆచరింప బడుతోంది కదా?

**నారదుడు:** మీకు తెలియనిది ఏముంటుంది స్వామీ! వెయ్యి సంవత్సరాలు రాజకీయ బానిసత్వాన్ని అనుభవించారు. కులతత్త్వాన్ని పాటించి సమాజంలో ఐకమత్యం లేకుండా చేసుకుని పరాయి పాలనకు పరోక్షంగా స్వాగతం పలికారు. ఇప్పుడు కొత్త బానిసత్వాన్ని కొని తెచ్చుకుంటున్నారు.

**నారాయణుడు:** కొత్త బానిసత్వమా. అదేమిటి?

**నారదుడు:** ఏముంది దేవా? మనస్సుకు బందీలు అయ్యారు. ఇంద్రియాలకు చిక్కి స్వేచ్ఛను కోల్పోయారు. రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం నిజమైన స్వాతంత్ర్యాలు కావని తెలుసుకో లేకుండా ఉన్నారు. ఉపకరణాలకు దాసులవుతున్నారు. అవి లేకుండా జీవించలేమని అనుకుంటున్నారు. ప్రతి చిన్న విషయం లోనూ ఒకరితో మరొకరు పోల్చుకొని మాత్సర్య భావనకు లోనవుతు న్నారు. చిత్త రాక్షసుడికి చిక్కి, స్వేచ్ఛను కోల్పోయి బానిస జీవితాలు గడుపుతున్నారు. స్వేచ్ఛ లేకుండా శాంతి సౌఖ్యాలు ఎక్కడివి స్వామి?

**నారాయణుడు:** ఇది కొత్త బానిసత్వం కాదే. మనిషి పుట్టినప్పటి నుండీ ఉన్నదే. మనస్సుకు బానిసలుగా చిక్కామని గ్రహిస్తే నా మాయ అర్థమైనట్లే నారదా! విముక్తికై ప్రయత్నించిన వారు శీఘ్రమే నన్ను చేరుకుంటారు. ఈ దాస్యాన్ని అర్థం చేసుకోవడంలోనే అంతా ఉంది. ఐనా కాలమహిమ. కలియుగం కదా! పరిస్థితులు అలానే ఉంటాయి. కాలాన్ని ఎవరూ అతిక్రమించలేరు.

**నారదుడు:** కాలం మీ స్వరూపమే కదా స్వామీ! పరిస్థితులను మీరు చక్కబరచవచ్చును కదా దేవా! మీరు మళ్ళీ అవతరించి సనాతన ధర్మాన్ని పునరుద్ధరించాలి ప్రభూ!

**నారాయణుడు:** మళ్ళీ అవతరించడమా. మొన్ననే కదా భూమిపై గదాధరుడి (శ్రీరామకృష్ణుడి)గా అవతరించి, ధర్మాన్ని పునః ప్రతిష్ఠాపించడానికి ఉపక్రమించాను.

**నారదుడు:** పదిచేతులతో మాయను విస్తరింపజేస్తూ ఒక గదాధరుడిగా అవతరించటం వల్ల ఎంతవరకు ధర్మం నిలబడుతుంది స్వామీ?

**నారాయణుడు:** నారదా! మాయను విస్తరింప జేస్తున్నానని నీవంటున్నావు. భూలోకంలోని మానవులలో ఎందరు మాయలో ఉన్నామని అనుకుంటున్నారో ఒకసారి తెలుసుకొని రా! అజ్ఞానాంధకారంలో ఉన్నామని తెలుసుకున్న తర్వాత నన్ను చేరుకోవడం పెద్ద పని కాదు కదా! ఐనా గదాధరుడిగా అవతరించి పామరుడికి కూడా అవిద్యాస్వరూపం అర్థమయ్యేరీతిలో దృష్టాంతాల ద్వారా, కథల ద్వారా, నిత్య జీవితంలోని సంఘటనల ద్వారా వివరించాను. కలియుగంలో మానవులు 'కష్టాలు, కష్టాలు' అని ఆక్రోశిస్తున్నారు కానీ వాటి నుంచి శాశ్వతంగా బయటపడే మార్గం కోసం ప్రయత్నించడం లేదు. ప్రయత్నిస్తే నేను గుర్తొస్తాను. నన్ను స్మరిస్తున్న వ్యక్తి పరమపదాన్ని చేరుకుంటాడు.

**నారదుడు:** శాశ్వత మార్గం ఉందని తెలిస్తేగదా ప్రభూ ప్రయత్నించేది. మీరు జనులకు ఆ అవకాశాన్ని కలిగించవచ్చుకదా.

**నారాయణుడు:** వివేకాన్ని ఉపయోగించి లౌకిక ప్రపంచంలో నిజమైన ఆనందం లేదని తెలుసుకోవాలి. ఆనందం లేకపోయినా చేసిందే మళ్ళీ చేస్తున్నారు కానీ నా వైపునకు ఒక్క అడుగు కూడా వేయడం లేదు. 'ఎక్కడి నుంచి వచ్చాం? ఎక్కడున్నాం? ఎందుకున్నాం? మరణం తర్వాత ఎక్కడకు వెళతాం?' ఇలాంటి ప్రశ్నలు వేసుకొంటే జీవిత మంటే ఏమిటో అర్థమవుతుంది. సరియైన అవగాహనతో జీవించడం నేర్చుకోవచ్చు.

**నారదుడు:** ఎంతోమంది మేధావులు, బుద్ధికుశలురు ఉన్న భూలోకంలో మరి జిజ్ఞాసువుల సంఖ్య అంత తక్కువగా ఉండడానికి కారణమేమిటో బోధపడడం లేదు దేవా!

**నారాయణుడు:** నేను పూర్వం భగవద్గీతలో తెలిపాను.. గుహ్యాద్గుహ్యతరం..అది పరమ సూక్ష్మమైన జ్ఞానమని! ఇంద్రియ లోలురుగా జీవించి మనస్సంతా మాయ స్వరూపమైన భౌతిక జగత్తుపై నిలిపినవారు ఈ జ్ఞానాన్ని గ్రహించలేరు. కాబట్టి నన్ను

తిరస్కరిస్తారు. జగత్తు అంతా కామకాంచనాలపై ఆధారపడి ఉన్నదని భావిస్తూ పాపపంకిలంలో తగులుకు పోతారు. అక్రమార్జితమైన ధనంతో అధికారాన్నీ, అధికార దుర్వినియోగంతో ధనాన్నీ ప్రోగుచేసుకుంటూ కన్ను మిన్ను కానక చరిస్తారు. కొద్దిమంది జనులు వీరిచుట్టూ అనుయాయుల రూపంలో కూడుతారు. 'నీవు ఇంద్రుడివి, చంద్రుడివి' అంటూ స్తుతిస్తారు. సభలలో ఒకరికొకరు పోటీ పడి పొగుడుతారు. దానితో ఆ వ్యక్తి 'ఓ ఇంతమంది ఇంతగా పొగుడుతున్నారంటే నేను అసామాన్యుడను' అని భావిస్తూ అసుర ప్రవృత్తిని అడ్డూ అదుపూ లేకుండా పెంచుకుంటాడు. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు చివరకు తన పతనాన్ని తానే కొనితెచ్చుకుంటాడు.

**నారదుడు:** మరి మానవులను సన్మార్గంలో ఎలా నడిపించాలి?

**నారాయణుడు:** నన్ను ఉపాసించాలంటే, నా మాయ నుంచి తరించాలంటే వ్యక్తి స్థితిమంతుడేకానక్కరలేదు. అలాంటి వ్యక్తులెవరూ పేరు ప్రఖ్యాతులకు గానీ, సిరి సంపదలకు గానీ దాసోహమనరు. పూర్వం కుచేలుడనే భక్తుడుండేవాడు. నీకు గుర్తుండే ఉంటుంది. పేరుకే పేదవాడు. కానీ దేవతలకు కూడా దుర్లభమైన భక్తిని పెంపొందించుకొని, నా అనుగ్రహం పొంది ఇహపరాలలో సర్వసౌఖ్యాలూ అనుభవించాడు. అలా జీవితం అశాశ్వతమని గ్రహించి నిరంతరం నా నామస్మరణ చేస్తూ, నాకు అర్పితంగా కర్మలు నిర్వహిస్తూ, సదా నేనే ఆలంబనగా జీవిస్తూ, కేవలం శరీరాన్ని మాత్రమే మాయారూప, నామరూప జగత్తులో ఉంచి, మనస్సును పూర్తిగా నా పైనే నిలిపిన వాడు చివరకు నన్నే చేరుకుంటాడు.

**నారదుడు:** అలాంటి భక్తులు భూలోకంలో ఇప్పుడు ఎంతమంది ఉన్నారు స్వామీ?

**నారాయణుడు:** మందబుద్ధులతో, అల్పాయుష్కులతో, ఉగ్రరోగ సంకలితులతో నిండి ఉన్న ప్రస్తుత పరిస్థితులలో కూడా నన్నే సదా స్మరిస్తున్నవారు, నన్ను చేరుకోవడమే పరమ లక్ష్యంగా జీవిస్తున్నవారు అనేకులు ఉన్నారు. వాళ్ళు జన బాహుళ్యానికి కనపడరు. కానీ వారి హృదయాలు నాకు తెలుసు. వాళ్ళను నేను మాత్రమే గుర్తించగలను. మర్త్య ప్రపంచంలో పూర్తి అనామకులుగా జీవించడానికే వారు ఇష్టపడతారు. ఎలాంటి ఆడంబరాల జోలికీ వెళ్ళరు. నిరంతరం అప్రమత్తంగా ఉంటారు. ధర్మ అతిక్రమణకు భయపడ్డట్లు దేనికీ భయపడరు. అలాంటి భక్తులు సర్వదా నా రక్షణలో ఉంటారు.

**నారదుడు:** స్వామీ! నాదొక సందేహం. నీ మాయ అర్థమై కూడా అందులో నుంచి బయటపడడానికి ప్రయత్నిస్తున్నవారిలో చాలామంది తమ శక్తి చాలక మళ్ళీ కొద్ది కాలానికి మాయకు దాసోహమంటున్నారు. మరి నీ కృపా వీక్షణం వారిపై అనునిత్యం ప్రసరింపజేయవచ్చు కదా!

**నారాయణుడు:** నారదా! నేను మనిషికి ఒక చిన్న పరీక్షను పెడుతున్నానయ్యా. 'ప్రపంచం కావాలా (భోగం)? నేను కావాలా (యోగం)'?అని. రెండింటినీ ఒకేసారి ఇవ్వలేను. ఏదో ఒకటే కోరు కోవడానికి అవకాశం ఉంది. మనిషి రెండింటినీ కోరుకుంటున్నాడు. అది సాధ్యపడదు. అనుభవాలను పూర్తి చేసుకున్న తర్వాత నా దగ్గరకు వస్తారు. ఒక జన్మలో కాకపోతే ఇంకొక జన్మలో! మనిషి నన్ను చేరుకోవాలని తాను తొందర పడాలి కానీ, నన్ను తొందరగా చేరుకోవాలని వ్యక్తిని నేను ప్రేరేపించ లేను.

**నారదుడు:** కనీసం శాశ్వతానందం ఎక్కడ ఉంటుందో తెలుసుకునే విచక్షణను మనుజులకు ప్రసాదించవచ్చు కదా స్వామీ!

**నారాయణుడు:** ఆ విచక్షణను అందరికీ ఇచ్చాం. మనిషి ఉపయోగించుకోవడం లేదంతే. ఐనా నా ఈ దివ్యలీల అనంతంగా సాగుతుంటుంది నారదా! నేను కాలాతీతుడను, కాలస్వరూపుడను. నా మాయా స్వరూపమైన ఈ మాయ కూడా అనంతకాలం పాటు సాగాలంటే, జీవితమనే వైకుంఠపాళిలో నిచ్చెన లెక్కడంతో పాటు




సర్పాలకు చిక్కి క్రిందకు కూడా రావలసి ఉంటుంది. అందుకనే మనిషిని సదా జాగరూకతతో వ్యవహరించమంటూ అనేక చోట్ల శాస్త్రాల ద్వారా తెలియజేశాను. మనిషి గ్రహించడం లేదు. ఎవరి కర్మకు వారే బాధ్యులు. అన్యులెవరినీ బాధ్యులను చేయడం తగదు.

**నారదుడు:** మాయా వితతిని తగ్గించి అధిక సంఖ్యాకులు నీ మాయను తరించేటట్లు అనుగ్రహించు దేవా!

**నారాయణుడు:** నీ లాంటి పరమ భక్తులు మానవాళి దుఃఖోపశమనం కోసం పరితపించడం సహజమే. తథాస్తు! మనిషిని అహంకారం తగ్గించుకొని, నన్ను శరణు వేడమను!

**నారదుడు:** శరణు వేడడానికి బాధలు, కష్టాలు అవసరమా స్వామీ?

**నారాయణుడు:** నా వైపునకు త్రిప్పుకోవడానికే నేను మనిషికి కష్టాలు కలిగిస్తుంటాను. నాకు ఎవరి మీదా ద్వేషం లేదు. ప్రేమ లేదు. అందరూ నాకు సమానులే. అధికంగా దుఃఖాన్నిస్తున్నానంటే నా అనుగ్రహాన్ని ఆ విధంగా ప్రసరింప జేస్తున్నానన్న మాట. కైవల్య పథాన్ని సూచిస్తున్నాను. మనిషి దీన్ని అర్థం చేసుకొని, నిరాశ, దైన్యం పొందకుండా ఆధ్యాత్మిక మార్గంలో అడుగు పెట్టి, నన్ను శరణుజొచ్చితే భవసాగరం నుంచి తరింపజేస్తాను.

**నారదుడు:** ధన్యోస్మి! మీ అద్భుతలీలలను ఎవరు అర్థం చేసుకోగలరు స్వామీ! మీ పాదపద్మాలకు ఈ భక్తుడి పునః పునః ప్రణామాలు. ❖

మనల్ని బలహీనుల్ని చేసే వాటిని గత వేయి సంవత్సరాలుగా కూడగట్టుకున్నాం. ఇప్పుడు మనకు కావలసింది బలం. బలహీనతలకు బానిసలం కాకుండా ఉండడమే స్వాతంత్ర్యం. - స్వామి వివేకానంద




# స్వామీజీ పథంలో నా ప్రణాళిక

భవిష్యత్తులో ఎన్నో బాధ్యతలను నిర్వహించాల్సిన మా లాంటి యువతీయువకులకు నాయకత్వ లక్షణాలను నూరి పోయడానికి రామకృష్ణ మఠం ఏర్పాటు చేసిన 'యువ సంఘర్ష్' పోటీలు మమ్మల్ని మేము సమీక్షించుకోవడానికి ఎంతో అవకాశాన్ని కల్పించాయి. ముఖ్యంగా నాకు (అనీశ్ దేశ్‌పాండే) విద్యార్థిగా సమాజానికి సంబంధించి, చదువు సంధ్యల గురించి ఎన్నో సంశయాలు ఉండేవి. కానీ పోటీల రూపంలో రామకృష్ణ మఠంలోని 'హ్యూమన్ ఎక్సలెన్స్'లోకి అడుగుపెట్టాక, ఆ సందేహాలన్నీ తీరిపోవడమే కాకుండా,



## సందేశవ్యాప్తి... ఉద్యోగ కల్పన !

నాలో నేను ఓ కొత్త పార్శ్వాన్ని చూసుకోగలిగాను. సానుకూల ఆలోచనలతో, స్ఫూర్తిమంతమైన భావనలతో తిరిగి వెళ్ళగలిగాను. ఈ వయస్సులో, ఇలాంటి తేజోవంతమైన వాతావరణం మనల్ని ఎంత ఉత్తేజితుల్ని చేస్తుందో అనుభవంతో అర్థం చేసుకున్నాను. ఇక్కడ స్వామీజీల ప్రసంగాలు, వాతావరణం, సహచర మిత్రులతో సంభాషణలు, పుస్తకాలు – ఇలా సమస్తమూ యువతరానికి ఒక నిర్దిష్టమైన మార్గాన్ని చూపుతాయి. ముందు మనిషిగా మనం ఏం సాధించాలో ఇక్కడకు వచ్చాక తెలిసి వచ్చింది. 'Neither money pays nor name, nor fame, nor learning; it is CHARACTER that can cleave through adamantine walls of difficulties' అన్న సూక్తి నన్ను ఆలోచింపచేసింది. మా తరం నేర్చుకోవలసిన ప్రధానమైన పాఠమిది అనిపించింది.

**ఎక్కడైనా యువతరమే!:** అసలు యువతరం ఏమి చేయగలదు? అని మా పోటీల్లో పెద్దవారు, ఉపాధ్యాయులు ప్రశ్నించారు. అప్పుడు అసలు యువతరం ఏం చేయలేదని నాకు నేను ప్రశ్నించుకున్నాను. సమాజంలో విధ్వంసం సృష్టించడంలోనూ యువతరమే ముందుంటోంది. ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు సేవ చేయడంలో కూడా ఆ యువతే ముందుంటోంది. అయితే స్వామి వివేకానంద చెప్పినట్లు యువశక్తిని ఎటువైపు మరలిస్తున్నామన్నదానిపైనే పతనమైనా, ప్రగతి అయినా ఆధారపడి ఉంటాయి. దాదాపు 150 సంవత్సరాల క్రితం స్వామీజీ ఇచ్చిన ఇలాంటి ఎన్నో మహత్తరమైన సందేశాలు మా లాంటి యువతీయువకులకు కరదీపికలుగా దారి చూపిస్తాయనడంలో సందేహం లేదు. ముఖ్యంగా 'విద్య'కు సంబంధించి స్వామి వివేకానంద ఇచ్చిన ప్రసంగాలు చదువుపై మన దృక్పథాన్నే మార్చేస్తాయి. ఆయన మానవీయత, దేశభక్తి, దార్శనికత, యువశక్తిపై ఉన్న నమ్మకం మనలో ఆత్మవిశ్వాసం నింపుతాయి. స్వామీజీ ఒక్కొక్కమాట మనలోని నిరాశా నిస్పృహలను కూకటివేళ్ళతో పెకిలించి వేస్తుంది. నాకు తెలిసి నేడు సమాజంలో చాలా మంది యువకులు తక్కువ కష్టంతో, ఎక్కువ ఫలితాన్ని ఆశిస్తున్నారు. అడ్డదారులు తొక్కుతున్నారు. ఇది ప్రమాదకర ధోరణి. ఇలాంటి ఎన్నో బలహీనతల నుంచి బయటపడడానికి స్వామీజీ సాహిత్యం ఉపయోగపడుతుంది.

**అటు సందేశవ్యాప్తి! ఇటు ఉద్యోగ కల్పన! :** రామకృష్ణ మఠంలో సందేశాలతో కూడిన ప్రభావ పూర్వక సాహిత్యాన్ని నా లాంటి యువతీ యువకులకు వీలైనంతగా పరిచయం చేయాలని సంకల్పించి, సోషల్ వెబ్‌సైట్‌లలో వాటి గురించి చర్చలు ఇప్పటికే ప్రారంభించాను. 'వందేమాతరం' లాంటి స్వచ్ఛంద సేవాసంస్థల కార్యక్రమాల్లో పాల్గొని గ్రామాల్లోని చిన్నారు లనూ, యువతరాన్నీ జాగృతం చేయాలని నిర్ణయించుకున్నాను. ముఖ్యంగా ఉద్యోగావకాశాలపై చాలామంది యువతీ యువకులకు అవగాహన లేదు. నాకు తోచినంతగా అటువైపు వారిని చైతన్యపరుస్తూ, భవిష్యత్తులో ఉద్యోగావకాశాలు కల్పించే దిశగా కృషి చేద్దామనుకుంటున్నాను. మన కాళ్ళపై మనం నిలబడడమే కాక, నలుగురినీ నిలబెట్టే వృత్తిజీవితంలోకి అడుగుపెడదామనుకుంటున్నాను. స్వామి వివేకానంద స్ఫూర్తితో నా ప్రణాళికను విజయవంతంగా పూర్తిచేయగలనని ఆశిస్తున్నాను. ❖

**అనీశ్ దేశ్‌పాండే, 12వ తరగతి**

('స్వామి వివేకానంద యూత్ లీడర్‌షిప్ అవార్డ్' తుది పోటీలకు అర్హత సాధించిన హైదరాబాదులోని మెరిడియన్ పాఠశాల విద్యార్థి.)



# విజ్ఞానమే కాదు, వివేకమూ కావాలి !

- స్వామి బోధమయానంద

ప్రముఖ రచయిత బెర్ట్రండ్ రస్సెల్ ఆధునిక శాస్త్రవిజ్ఞానం, మానవీయ విలువలకు సంబంధించి రచించిన ఆసక్తికరమైన 'Impact of Science on Society' అనే ఓ పుస్తకాన్ని కొన్నాళ్ళ క్రితం చదివాను. సమాజంలో శాస్త్రవిజ్ఞాన ప్రభావాన్ని చర్చిస్తూ, ఆ పుస్తకంలో రచయిత, ఆధునిక మానవుడు తాను పరిశోధించి, ఆవిష్కరించిన సాంకేతిక ప్రపంచంలో తానే బందీ అయిపోతున్నాడని ఆవేదన వ్యక్తం చేశాడు. మనమందరం అంతర్మథనం చేసుకోవలసిన ఎన్నో అంశాలను ఆయన ఆ పుస్తకంలో ప్రస్తావించారు. నిజమే! బాహ్య ప్రపంచంలోని వస్తుసముదాయానికి బానిసగా మారిపోతూ, మనిషి ఆ యాంత్రిక జగత్తు నియంత్రణలోకి వెళ్ళిపోతున్నాడు. 'మనిషి'గా తన ఉనికిని కోల్పోతున్నాడు. సంపూర్ణంగా మానవ జీవితాన్ని యాంత్రిక లోకం తన అధీనంలోకి తీసుకుంటోంది.

బెర్ట్రండ్ రస్సెల్ ఆ పుస్తకంలో ఓ చోట 'Unless there is increase in wisdom as much as in knowledge, increase of knowledge will lead to increase of sorrow' - జ్ఞానానికి సమాంతరంగా వివేకం కూడా అభివృద్ధి చెందకపోతే, సాధించిన పరిజ్ఞానమంతా పరితాపానికే దారితీస్తుందని హెచ్చరించారు. ఆధునిక విద్యార్థి లోకం కూడా ఈ హితవును పరిగణనలోకి తీసుకొని సమాలోచించుకోవలసిన అవసరముంది. ఈ రోజు సమాజంలోని మానసిక, మానవీయ సమస్యలకన్నింటికీ కారణం ఈ వివేక రాహిత్యమే! Knowledge is more, but the wisdom is less. ఇక ఏం లాభం!

**అంతరంగమే అద్దం:** ఎన్నో వింటున్నాం, ఎన్నో మాట్లాడుతూ ఉన్నాం, ఏవేవో సాధించేస్తున్నామను కుంటున్నాం. కానీ మనం ఏమిటన్న ఆలోచనతో మన మనస్సులోకి మనం ఒక్కసారి కూడా తొంగి చూసుకోవడం లేదు. రోజులో సగటున మనిషి తనను తాను దాదాపు పదిహేను సార్లు అద్దంలో చూసుకుంటాడని మానసిక వైద్యనిపుణుల పరిశోధనలో తేలింది. అద్దంలో మన ముఖాన్ని మనం చూసుకోకపోతే పిచ్చెక్కినట్లుంటుంది. కేవలం పరిమితమైన బాహ్య సౌందర్యం గురించే మనం ఇంతగా ఆలోచిస్తే, మన ప్రవర్తనను నిర్ధారించే అంతరంగం గురించి ఎంతగా ఆలోచించాలి? మన మనస్సులోకి మనం ఎన్ని సార్లు తొంగిచూసుకోవాలి? మన గురించి మనం చెప్పుకోవాలంటే కేవలం మన పేరు, శారీరక రూపురేఖలు కాదు. మన మానసిక స్థితి, ప్రవర్తన, ఆలోచనావిధానమే ప్రధానం!

ఈ ఆధునిక శాస్త్ర పరిజ్ఞానం, నాగరక ప్రపంచం మన మానసిక స్థితిగతులపై ఎలాంటి ప్రభావం చూపుతున్నాయో ఆత్మావలోకనం చేసుకోవాలి. నేడు ప్రతి ఒక్కరి జీవితం ఓ పందెంలా మారిపోయింది. విద్యార్థిగా, ఉద్యోగిగా, కుటుంబ సభ్యుడిగా, సామాజిక పౌరుడిగా మీరు ప్రతిచోటా సమర్థంగా మీ మీ బాధ్యతలను నిర్వర్తించాల్సి ఉంటుంది. ఎప్పటికప్పుడు మిమ్మల్ని మీరు సమీక్షించుకుంటూ, బాహ్యప్రపంచ ప్రభావానికి లోను కాకుండా నిశ్చలంగా ఉండగలిగితేనే అన్ని చోట్లా న్యాయం చేయగలరు. కానీ మనలో ఎంతమంది ఈ ప్రక్రియలో విజయం సాధిస్తున్నారో ఎవరికి వారే ప్రశ్నించుకోవాలి. మన భారతదేశం ప్రపంచానికి విసిరిన పెనుసవాలు ఇది! బాహ్య ప్రపంచం వైపునకు పరుగులెత్తించే భౌతిక ప్రపంచ పరిజ్ఞానం కన్నా, ఆంతరంగిక పరిణతికి దోహదపడే ఆధ్యాత్మిక పరిజ్ఞానమే నిజమైన జ్ఞానమూ, విజ్ఞానమూ అని మన దేశం ఖండ ఖండాంతరాలకు చాటింది.

**ముందే చెప్పిన మహర్షులు :** సౌకర్యాల కోసం ఆవిష్కరించుకున్న సాంకేతిక సౌలభ్యాల చట్రంలో మనిషి తనకు తెలియకుండా తానే ఇరుక్కుపోతాడని మన మహర్షులు ముందే ఊహించారు. అందుకే మనకు ఇప్పుడు Intelligent Quotient, Emotional Quotientతో పాటు Spiritual Quotient కూడా అవసరం. అలా ఆధ్యాత్మికత మనలోని జ్ఞానానికి వివేకాన్నీ, వివేచననూ జోడిస్తుంది. అందుకే మన సనాతన ధర్మం మనిషి అంతర్ముఖుడై, అంతరంగాన్ని ప్రక్షాళన చేసుకోవడమే నిజమైన విజయంగా వ్యాఖ్యానించింది. ❖

**యంత్రాలు, విజ్ఞానశాస్త్ర పరికరాల ద్వారా అభివ్యక్తీకరింపబడిన బుద్ధిశక్తి గొప్పదే. కానీ ప్రపంచంపై ఆత్మశక్తి చూపే ప్రభావం కన్నా, కండబలం, శాస్త్రవిజ్ఞానం శక్తిమంతమైనవి కావు.** - స్వామి వివేకానంద

# ఏ మట్టిలో... ఏ మాణిక్యమో!

– బి. సైదులు

ప్రఖ్యాత హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చదివే స్టాన్‌ఫోర్డ్ అనే యువకుడు ప్రమాదవశాత్తూ కన్నుమూశాడు. ఉన్న ఒక్కగానొక్క కొడుకును పోగొట్టుకొని పుట్టెడు దుఃఖంలో మునిగిపోయారు ఆ కుర్రాడి కన్నవారు! అంత విషాదంలోనూ వారు, తన కొడుకు చదువుకున్న ఆ విద్యాలయంలో అతని జ్ఞాపకార్థం ఏదైనా స్తూపం కానీ, సభామండపం కానీ నిర్మించాలనుకున్నారు. ఒకానొక రోజు హార్వర్డ్ విశ్వవిద్యాలయ అధ్యక్షుణ్ణి సంప్రతించడానికి అక్కడికి వెళ్ళారు. సాదాసీదా దుస్తులతో, ఎంతో వినమ్రంగా ఆయన కోసం బయట అమాయకంగా వేచి చూస్తూ కూర్చున్నారు. ఏదో పని కోసం వచ్చిన వారనుకొని ఎవరూ పట్టించుకోలేదు. చివరకు ఎప్పుడో సాయంత్రానికి వారికి అధ్యక్షుణ్ణి కలుసుకునే అవకాశం లభించింది. తన దగ్గరకు వచ్చిన ఆ వృద్ధదంపతులు ఆ విద్యార్థి తల్లితండ్రులనీ, కుమారుడి స్మారకార్థం ఏదైనా నిర్మించమని అర్థించడానికి వచ్చారనీ విశ్వవిద్యాలయం అధ్యక్షుడికి అర్థమైంది. వారి వేషభాషల్ని చూసి ఆయన కొంత అహంకారంగా, అసహనంగా 'మీరు ఇక్కడ ఒక గది నిర్మించాలన్నా చాలా ఖర్చవుతుంది. మీరు చూస్తే నిరుపేదల్లా ఉన్నారు. పెద్ద పెద్ద ఆశలేమీ పెట్టుకోకండి' అన్నాడు.

ఆ వృద్ధదంపతులు అమాయకంగా, 'సార్! ఈ విశ్వవిద్యాలయం కట్టడానికి ఎంత ఖర్చయి ఉంటుంది?' అని అడిగారు. ఆయన ఎంతో గర్వంగా 'మీరు ఊహించలేరు కూడా! దాదాపు 10 మిలియన్ డాలర్లు' అన్నాడు. అప్పుడా దంపతులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. కళ్ళతోనే ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు. నెమ్మదిగా యువకుడి తండ్రి 'అయితే, మా కొడుకు పేరు మీద ఒక విశ్వవిద్యాలయం కట్టిస్తే బాగుంటుందను కుంటున్నాం సార్' అంటూ 26 మిలియన్ డాలర్ల చెక్కు రాసిచ్చారు. ఆ విశ్వవిద్యాలయం అధ్యక్షుడు ఆశ్చర్యపోయాడు. మనం కూడా ఆ విశ్వవిద్యాలయం అధ్యక్షుడి లాగా బయటి పటాటోపాలనూ, డాంబికాలనూ చూసి వ్యక్తులను అంచనా వేస్తూ ఉంటాం. ఏ మట్టిలో ఏ మాణిక్యం ఉందో! అన్న ఆలోచన కూడా మనలో పొడసూపదు.

**చులకన...చతురత :** మనం చాలా సందర్భాల్లో మనిషి రూపురేఖల్ని చూడగానే ఒక అభిప్రాయానికి వచ్చేస్తాం! వారి స్థితిగతుల్ని మన చౌకబారు చతురతతో అంచనా వేసేస్తాం. వారు మన కళ్ళకు ఆనకపోతే చులకన చేసి మాట్లాడేస్తూ ఉంటాం. కానీ చివరకు అది మన అవివేకాన్నే బయటపెడుతుంది. సంపెంగ ఏమీ సొగసుగా ఉండదు. కానీ, అది దాని సువాసనలతో సమీరానికే పరిమళాలద్దుతుంది. కాగితపు పూలు చెట్టంతా ఆకర్షణీయంగా విరబూస్తాయి. ఏం లాభం! గుడికి కాదు కదా, జడకు కూడా ఉపయోగపడవు. ఇలా పై పై మెరుగులు చూసి భ్రమపడితే అభాసుపాలయ్యేది మనమే!

అందుకే 'ఎవరినీ హీనంగా చూడకు, మాట్లాడకు. ఒక పురుగు గురించి కూడా చులకనగా వ్యాఖ్యానించవద్దు' అని హితవు పలికారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. అయితే ఆధునిక ప్రపంచంలో మనం సరకు నాణ్యతను వదిలేసి పై పై నగిషీలకు విలువ ఇస్తున్నాం. వ్యక్తిని, వ్యక్తిగా గౌరవించడం వదిలేసి, వారి వేషభాషల్ని చూసి బోల్తాపడిపోతున్నాం. మహాత్మాగాంధీ నుంచి మదర్ థెరెసా వరకు ఎవరూ భౌతికంగా ఆకర్షణీయులు ఏమీ కారు. కానీ వారిలోని ఆంతరంగిక సౌందర్యం ముందు తాత్కాలికమైన బాహ్య శోభలన్నీ వెలవెలపోతాయి. అలా ముందు అంతర్గత అందచందాల ప్రాధాన్యం తెలుసుకోవాలి.

**కంచు... కనకం :** ఎంత మోత మోగినా కంచు, కంచే! మోతలేమీ లేకున్నా కనకం కనకమే! కానీ నేటి సమాజపు మోతల మాయలో పడి మనం కంచుకే ఆకర్షితులమవుతున్నాం. నిరాడంబరంగా, నిశ్చలంగా ఉండే బంగారం లాంటి మనుష్యుల విలువను గుర్తించక, చిన్నచూపు చూస్తూ ఉంటాం. విద్యారంగంలోనే తీసుకుంటే సాధారణ పదోతరగతి నుంచి సివిల్స్ వరకు అత్యున్నత స్థాయిలో నిలిచిన యువతీ యువకులందరూ ఎంతో సాదాసీదాగా, మట్టిలో పుట్టిన మాణిక్యాల్లా వెలిగిపోతూ ఉంటారు. ఏ రంగంలోనైనా తమకంటూ ఒక ముద్రను వేసుకున్న విజేతలంతా దాదాపు సరళమైన జీవనశైలిని అవలంబించేవారే! అలాంటి వారు మన మధ్యే ఎంతోమంది ఉండవచ్చు. ఎందరో మేధావులు, మహానుభావులు మన పరిసరాల్లోనే సాధారణమైన మనుష్యుల్లాగానే మసలుతూ ఉండవచ్చు. మనం అలాంటి వారిని

గుర్తించే ప్రయత్నమైనా చేయం! ప్రసార సాధనాల్లో కనిపిస్తూనో, మందీమార్బలంతో హడావిడి చేస్తూనో ఉంటే వారినే మనం గొప్పవాళ్ళనుకుంటాం. ఎంచుకున్న రంగంలో అవిశ్రాంతంగా, మౌనంగా కృషి చేస్తున్నవాళ్ళు ఎందరో ఉన్నారు. వారు ఎలాంటి ఆర్భాటం లేకుండా అంతర్ముఖులుగా జీవిస్తుంటారు. అందుకే ఎదుటివారి స్థితిగతులను చూసి కాకుండా, సహజంగానే వ్యక్తులకు కనీస గౌరవం ఇవ్వడం అలవరచుకోవాలి. ఉదాహరణకు స్వామి రంగనాథానందజీ ప్రధానమంత్రికి ఎంత విలువ ఇచ్చేవారో, గుమాస్తాకు కూడా అంతే విలువనిచ్చేవారని ఆ తరం భక్తులు, ప్రత్యక్ష సాక్షులు ఇప్పటికీ గుర్తు చేసుకుంటూ ఉంటారు. అదీ మహనీయుల లక్షణం!

**వేషభాషలే వ్యక్తులా? :** నేడు సమాజంలో పైకి ఖరీదైన దుస్తులు ధరిస్తూ, నాగరకంగా కనిపిస్తూ, ప్రవర్తనకు వచ్చేసరికి హీనంగా వ్యవహరించే వారు కోకొల్లలు. సంస్కారం వేషాన్ని బట్టి రాదు, వారి వ్యక్తిత్వాన్ని బట్టి వస్తుంది. ముఖ్యంగా నగరాల్లో నేటి యువతీయువకులు ఆధునిక వస్తువుల వినియోగంలో, వేష భాషల్లో మారుమూల ప్రాంతాల కన్నా ఎంతో ముందుంటారు. కానీ, చాలా వరకు గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లోని యువతరంలో ఉన్న వినయం, విచక్షణ, శ్రద్ధ, వ్యక్తిత్వం వీరిలో కొరవడుతున్నాయి. నాలుగు ఆంగ్ల అక్షరం ముక్కలు రాగానే, డిగ్రీలు చదవగానే సామాన్యులను చీమల్లా చూడడం అలవాటుగా మారింది. 'నేలమీద పాకే చీమ కన్నా నన్ను నేను గొప్పవాడిగా పరిగణించు కుంటే, నేను ముమ్మాటికీ అజ్ఞానినే' అనేవారు స్వామి వివేకానంద. పైగా ఇంట్లో పెద్దలు కూడా తమ బంధు వర్గంలో, స్నేహసమూహంలో ఉన్నత హోదాలో ఉన్నవారితోనే రాకపోకలు సాగిస్తూ, వారితోనే సఖ్యతగా ఉంటూ, సాధారణ కుటుంబాలను దూరంగా ఉంచుతుంటే పిల్లలకు తప్పుడు సంకేతాలు వెళతాయి. అట్టహాసంగా ఉన్నవారినే గౌరవించాలనీ, తమకు తగనివారిని దూరంగా పెట్టాలనే చెడుభావనలు పెంపొందుతాయి. మనం తేలికగా తీసుకుంటూ అంతగా పట్టించుకోనివారే, అవసరమైన సమయంలో ఆదుకోవడం ప్రతి ఒక్కరి జీవితంలో ఏదో ఒక సందర్భంలో అనుభవమయ్యే ఉంటుంది. అందుకే 'కాకిని కూడా చీదరించుకొని చులకనగా చూడకు; నీవు పోయాక పిండం పెడితే ముందు ముట్టుకోవాల్సింది ఆ కాకే!' అంటారు ఓ అజ్ఞాతకవి.

**ఎవరిలో ఏ ప్రతిభో! :** ముఖ్యంగా నలుగురిని ముందుకు నడిపే నాయకుడి లాంటి వ్యక్తి తన సహచరుల్లో ఎవరినీ తక్కువగా అంచనా వేయకూడదు. ప్రతిఒక్కరిలోనూ ఏదో ఒక ప్రతిభ నిగూఢంగా ఉంటుంది; అలాంటి ప్రతిభను ఓపికతో వెలికితీసేవారే నిజమైన విజేతలు! ఎవరూ 'Useless' కాదు 'Used-less' అంతే! పనికిరానివారంటూ ఎవరూ ఉండరు; మనం సరిగ్గా పనికి ఉపయోగించుకోవడం లేదంతే! మన పిల్లలే కావచ్చు; మన తోటి ఉద్యోగస్థులే కావచ్చు, ఎవరైనా ఒకేలా ఉండరు. చేతి వేళ్ళు ఒకేలా లేకపోయినా, ఏ వేలి ప్రాధాన్యం దానిదే అయినట్లు; ఎవరి ప్రత్యేకత వారిదే. అందుకే ఆంగ్లమేధావి గిల్బర్ట్ చెస్టర్‌టన్ అంటారు – 'సాధారణంగా తమ కింద పనిచేసే వ్యక్తులందరూ తమను తాము అల్పులుగా భావించుకునేలా చేసే నాయకులు చాలామందే ఉన్నారు. అయితే మామూలు మనుషులు కూడా తమ సమక్షంలో తమతో సమానమని భావించుకునేలా ప్రవర్తించగలిగిన గొప్ప నాయకులు చాలా అరుదు'. ఉదాహరణకు భగవాన్ శ్రీరామకృష్ణులు తమను నమ్ముకొని వచ్చిన స్వామి వివేకానంద లాంటి మేధావులైన యువకులనే కాదు, అక్షరాభ్యాసం లేని అద్భుతానంద లాంటి వారిని కూడా బ్రహ్మజ్ఞానులుగా తీర్చిదిద్దారు. అందుకే ఓ మారు స్వామి వివేకానంద 'మా గురుదేవులు తలచుకుంటే, మట్టిలో నుంచి నాలాంటి వివేకానందలను వేలాదిమందిని తయారుచేయగలరు' అంటారు. అనామకంగా ఎక్కడో మట్టిలో పడి ఉండి; ఆనక ఎవరో కొలిమిలో పెట్టి కాల్చాక, ఎన్నోసార్లు సానబట్టాక మాణిక్యమై వెలుగులు విరజిమ్ముతున్నప్పుడు అబ్బురపడి ఆ రాయికి విలువనివ్వడంలో మన గొప్పతనం లేదు. మట్టికుప్పల మాటున పడి ఉండి, ఎవరూ పట్టించుకోనప్పుడే గుర్తించి, దానిని వెలికితీసి ప్రకాశింపజేసినప్పుడే మన దార్శనికత బయటపడుతుంది. ❖

### ఎప్పుడు... ఎవరితో... ఏ అవసరమో!

ఓ పాత్రికేయ మిత్రునికి తన కిందస్థాయిలో పనిచేసే ఓ సహచర ఉద్యోగి అంటే అసలు గిట్టకపోయేది. ఆయన మాటంటేనే ఈయనకు చెప్పలేనంత అసహనంగా ఉండేది; ఎప్పుడు ఆయన గురించి ప్రస్తావించినా చిర్రుబుర్రు లాడేవాడు; మాటలతో చిన్నబుచ్చేవాడు. కాలగమనంలో ఆ ఉద్యోగి పదోన్నతిపై మేనేజర్‌గా వేరే జిల్లాకు వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళకు ఈ మిత్రుడికి కూడా కాలవశాత్తూ అక్కడికే బదిలీ అయింది. మాట్లాడాలంటేనే విసుక్కునే వ్యక్తి కిందే ఈయన పనిచేయాల్సి వచ్చింది. అదే మనోవేదనతో ఆ రాత్రి ఇంటికి వెళ్ళి పడుకున్నాడు. అర్ధరాత్రి గుండె నొప్పి వచ్చింది. వెంటనే మేనేజర్‌కు ఫోన్ చేశాడు. హుటాహుటిన వచ్చి ఆసుపత్రికి తరలిస్తూ ఉండగా, ఆయన చేతిలోనే ప్రాణాలు వదిలాడు. ఎవరి ఊసంటేనే పడకపోయేదో, చివరకు ఆయన చేతిలోనే ఊపిరి వదలాల్సి వచ్చింది. కాబట్టి ఎవరినీ చిన్నబుచ్చ కూడదనే సత్యాన్ని తెలుసుకొని మెలగాలి. ❖

**అల్పజీవినైనా, అల్పవస్తువునైనా తృణీకార భావంతో చూడరాదు. ఒకరిపట్ల నువ్వు గౌరవం చూపితే వారు నీ పట్ల గౌరవం చూపుతారు. ఒక మూగజీవినైనా పాదాలతో తాకరాదు.** - *శ్రీశారదాదేవి*

# అజ్ఞాతదాత ఔదార్యం

- శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్



ఈ రోజుల్లో సమాజంలో ఏదైనా స్వచ్ఛంద సేవాసంస్థకో, ఆశ్రమాలకో విరాళాలు ఇవ్వడం ఆనవాయితీగా మారుతోంది; ఇది మంచి సంప్రదాయమే! అయితే గోరంత సాయం చేసి కొండంత చెప్పుకునే వారే చాలా మంది. ఓ స్వచ్ఛంద సంస్థను నడుపుతున్న నేను విరాళాలకు సంబంధించిన రెండు విభిన్నమైన ఉదంతాలను జీవితాంతం మరచిపోలేను. నా స్నేహితురాలు మైథిలి ఓ ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థ (ఎన్.జి.ఒ.)లో పనిచేస్తోంది. ప్రజాసేవా కార్యక్రమాల కోసం ఆమె నిధులు సేకరిస్తూ ఉంటుంది. మంచి మాటకారి, చురుకైంది. ఒకరోజు మైథిలితో కలసి బెంగుళూరులోనే అత్యంత ధనవంతురాలిగా పేరున్న ఓ వ్యక్తిని కలవడానికి వెళ్ళాం. మైథిలి ఆమెను చాలా కాలంగా, తరచూ కలుస్తూ ఎంతో కొంత విరాళం ఇవ్వాలని కోరుతూనే ఉంది. అయితే నలభై కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆమె ఉద్యానగృహానికి (ఫామ్‌హౌస్) వస్తే, ఆలోచిస్తానంది. మైథిలి నన్ను కూడా తోడుగా రమ్మంది. రాజప్రాసాదం లాంటి ఆ సంపన్నురాలి ఇంటికి వెళ్ళాం. ఇరవై అయిదెకరాల పెద్ద తోట మధ్యలో విలాసవంతమైన భవనమది.

ఎక్కడ చూసినా సంపదే! ఇంటామె తళతళలాడుతున్న గొలుసులకు వేలాడదీసిన ఉయ్యాలలో కూర్చొని ఉంది. ఆమె వయస్సు యాభై, అరవై ఏళ్ళ మధ్య ఉంటుంది. అన్నీ ఉన్నా ఆమె ముఖంలో సహజమైన చిరునవ్వు, ఆదరణే లోపించాయి. అందుకే అన్ని అలంకరణలు కూడా వెలవెలబోయాయి. ఆతిథేయులు పెట్టే ఆహారం, వాళ్ళ ఆభరణాలు, ఇంటి అందచందాలు ఏవీ అతిథుల్ని ఆనందింపచేయలేవు; వారి హృదయపూర్వకమైన చిరునవ్వే హాయి గొల్పుతుంది. కానీ అవే అక్కడ కరవయ్యాయి. నా స్నేహితురాలు తమ సంస్థ గురించి ఎంతో వివరించింది. కానీ ఆ శ్రీమంతురాలు కొంచెం కూడా స్పందించలేదు. చాలాసేపటి తరువాత 'మీ విజ్ఞాపన పత్రం, ఇతర పత్రాలు నా కార్యదర్శికి ఇచ్చి వెళ్ళండి. వాటిని చూసి తర్వాత మీకు తెలియజేస్తాను' అని ముక్తసరిగా మాట్లాడి పంపించింది. మా ఉత్సాహం నీరుగారిపోయింది. తరువాత నెల రోజులు వెంటపడితే ఆఖరుకు పదివేలు ఇవ్వడానికి అంగీకరించిందట; అదీ ఓ స్కూలు ప్రారంభోత్సవానికి ముఖ్య అతిథిగా ఆహ్వానించి, ఆమె ఫోటో పత్రికల్లో వేయించి, ఆమె గొప్పతనాన్ని చాటుతూ ఓ పత్రికా ప్రకటన విడుదల చేయాలన్న షరతులతో! అంతటి కోటీశ్వరురాలికి పదివేలు పదిపైసల కన్నా తక్కువే! అయినా ఆమెచేత ఆ కొంత విదిల్చేలా చేయడానికి కూడా ఎన్నో ప్రయాసలు పడాల్సి వచ్చింది.

కొన్నాళ్ళకు మా సంస్థ కార్యాలయానికి వారం రోజుల సెలవు తరువాత వెళ్ళాను. ఉత్తరాలు సర్దుతుంటే నా కార్యదర్శి ఓ చిన్న కవరు నా చేతిలో పెట్టింది. అందులో ఓ చిన్న లేఖ 'అమ్మా! నేనెవరో మీకు తెలియదు. కానీ మీరు చేస్తున్న మంచి పనుల గురించి వార్తాపత్రికల్లో చదివాను. మీ రచనలతో కూడా పరిచయముంది; జీవితాన్ని కాచి వడపోసిన ఎన్నో విషయాలు అందులో ఉన్నాయి. మీ అనుభవాల గురించి చదివి మీరెలాంటి కృషి చేస్తున్నారో, ఎంత ఉత్సాహంతో పనిచేస్తున్నారో...' అంటూ సాగిపోతున్న ఉత్తరాన్ని బిజీగా ఉండి చదవలేక, 'అతిగా పొగుడుతూ రాస్తుంటారు కొంతమంది. అలాంటి ఉత్తరమే ఇది. ఫైల్ చేస్తే చాలు. ఇలాంటివన్నీ నాకు చూపించాల్సిన అవసరం లేదులే' అంటూ వేరే పనుల్లో మునిగిపోబోయాను.

'మేడమ్! మీరు పూర్తిగా చదవలేదు. ఇది అలాంటి ఉత్తరం కాదు' అంటూ మరోసారి ఆ అమ్మాయి నాకిచ్చింది. సరే చూద్దామని చదివాను. '...నేను పెద్దవాడిని. మీలాగా ప్రయాణం చేయలేను. నేను నా ఆదాయంలో నుంచి కొంత, కొంత పొదుపు చేశాను. దాన్ని ఏదైనా మంచిపనికి వినియోగిద్దామని భావించాను. ఇంతలో మీరు గుర్తొచ్చారు. మీకు చాలా సంపద ఉండొచ్చు. కానీ నేను కూడా ఎంతో కొంత సాయపడాలని, మీరు చేస్తున్న మంచిపనుల కోసం ఇస్తున్నాను. దీన్ని మీరు ఎవరికిస్తారు, ఎలా ఖర్చుపెడతారని అడగను. మీ మీద నాకు నమ్మకముంది' అంటూ డి.డి. జతచేసి పంపారాయన.

ఆ డి.డి. చూసి ఆశ్చర్యపోయాను. అక్షరాలా నాలుగు లక్షల రూపాయల బ్యాంకు డ్రాఫ్టు అది. అజ్ఞాతంగా అంత పెద్ద మొత్తాన్ని అందుకోవడం అదే మొదటిసారి. ప్రత్యుపకారమేదీ ఆయన కోరలేదు. తన గురించి ఒక్కముక్క కూడా రాసుకోలేదు. చిరునామా కూడా లేదు. ఆ అజ్ఞాతదాత ఔదార్యానికి నా కళ్ళు చెమ్మగిల్లాయి. తెలియకుండానే రెండు హస్తాలు ఒక్కచోటికి చేరి నమస్కరించాయి. పదివేల కోసం పదిసార్లు తిప్పించుకున్న కోటీశ్వరురాలు మనస్సులో స్ఫురించింది. ఎవరు నిజమైన ధనవంతులో, పెద్దమనుషులో తెలిసివచ్చింది. ❖

సేకరణ : జి.సతీష్



# పనిలోనే విశ్రాంతి!

**- స్వామి రంగనాథానంద**

నేను మనదేశంలో చూసిన పెద్ద లోపం కష్టించి పనిచేయక పోవడమే! పైగా చేసే పనిని ప్రేమించకపోవడం మరో బలహీనత. ప్రతి చోటా ఈ సోమరితనం, పనిని తప్పించుకునే తత్త్వం మన ఎదుగుదలకు తీవ్ర విఘాతం కలిగిస్తున్నాయి. స్వాతంత్ర్యం సంపాదించి ఇన్నేళ్ళయినా మనం అనుకున్నంత ప్రగతిని సాధించలేకపోవడానికి ప్రధాన కారణం 'ఎక్కడా శ్రద్ధగా, బాధ్యతగా పనిచేయకపోవడమే'! పైగా మనం మాటల్లో కోటలు దాటేస్తాం. కానీ, చేతల్లో ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేకపోతున్నాం. ముఖ్యంగా ప్రభుత్వ కార్యాలయాల్లో నెలల తరబడి దస్త్రాలు ముందుకు కదలడం లేదంటే, ఉద్యోగులు మనస్సు పెట్టి పనిచేయడం లేదని అర్థం. పైగా ఆధునిక తరానికి అలవాటైన కొత్త పదం 'పని ఒత్తిడి (work pressure)'. అది ఎక్కువైందని చెప్పి వారాంతంలో విరామం (relaxation). ఎంచుకున్న ఉద్యోగాన్ని ఉత్సాహంగా చేయకుండా, వెట్టిచాకిరీలా ముగించుకొని, మళ్ళీ ఆనందం కోసం బయట ప్రపంచంలో వెంపర్లాడడం హానికరమైన లక్షణం. ఇలాంటి మనఃస్థితి నుంచి బయటపడాలి. పనిలోనే ఆనందాన్ని అన్వేషించుకోవాలి. అయితే లేనిపోని అపోహలతో, అహంకారంతో ఉద్యోగాల్ని నిర్వర్తించడం వల్లనే, పనిలో ఉదాసీనత పుట్టుకొస్తుంది. అందుకే భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు 'కర్మ'ను నిస్సంగత్వం (detachment)తో చేసినప్పుడు ఎలాంటి అలజడీ ఉండదని ఉద్ఘాటించాడు.

**మనస్సుకు శిక్షణ:** సరైన శిక్షణ లేకపోవడం వల్లనే మనస్సు నిరంతరం పని నుంచి తప్పించుకోవాలనీ, విరామంలో సేదతీరాలనీ తపిస్తూ ఉంటుంది. మనస్సును ఒక క్రమపద్ధతిలో తీర్చిదిద్దుకుంటే 'పనిభారం' అన్న ప్రసక్తే ఉండదు. ఉదాహరణకు మనం అమితంగా ఇష్టపడేవారి కోసం ఎంతగా శ్రమించినా కష్టంగా అనిపించదు; దానికి కారణం అక్కడ మనం పడుతున్న కష్టం వెనుక 'ప్రేమ' ఉంది. అలాంటి ప్రేమ లేని దగ్గర కొద్దిగా కష్టపడ్డా, ఎంతో భారంగా అనిపిస్తుంది. అంటే మనస్సు కల్పించుకునే భావాన్ని బట్టి 'పనిభారం' ఆధారపడి ఉంటుంది. అనారోగ్యంగా ఉన్న బిడ్డ కోసం తల్లి రాత్రంతా మేల్కొన్నా, ఆ మాతృమూర్తికి ఇబ్బందిగా అనిపించదు. జీతానికి పనిచేసే ఆయాలో అంతటి సహజప్రేమ కనిపించదు. అందువల్లే మొక్కుబడిగా మంచం పక్కన కూర్చుంటుంది. అయితే ఆధునిక సాంకేతిక వృత్తిప్రపంచం 'పని' అంటే వెట్టిచాకిరి అన్న భావనను మనిషికి కలిగిస్తూ ఉంది. వృత్తినీ, విరామాన్నీ వేరుగా చూడడం వల్లనే పనివేళల్లో మనం తీవ్రమైన అలజడికి గురవుతూ ఉన్నాం. పైగా వారాంతాల కోసం ఎదురుచూసే విదేశీ సంస్కృతి కూడా మనకు వచ్చి పడింది. శని, ఆదివారాలంటే వెట్టిచాకిరీ నుంచి విముక్తి కలిగించే రోజులనే దృక్పథం మనలో వచ్చిందంటే, మన వృత్తివ్యవస్థలో ఎక్కడో లోపముందన్నమాటే! కర్మయోగంలో శ్రీకృష్ణుడు ఇలాంటి మానసిక భావనను తీవ్రంగా వ్యతిరేకిస్తాడు.

**ఉల్లాసం నుంచి ఉల్లాసానికి... :** మన వేదాంతంలో వృత్తిధర్మం గురించి అద్భుతంగా వివరించారు. **'నివృత్తి మూఢస్య ప్రవృత్తి ఉపజాయతే'** అంటోంది మన సనాతన ధర్మం. 'నివృత్తి' అంటే కర్మ నుంచి పరాఙ్ముఖం కావడం; 'ప్రవృత్తి' అంటే కార్యోన్ముఖులు కావడం. అయితే అవివేకంగా ప్రవర్తించే వ్యక్తి నివృత్తిలో కూడా తీవ్ర కర్మపరాయణుడిగానే ప్రవర్తిస్తూ, అలసిపోతూ ఉంటాడు. జ్ఞాని, వివేకి అయిన వ్యక్తి 'ప్రవృత్తి'



స్థితిలో కూడా పూర్తి స్వేచ్ఛగా, ఎలాంటి మానసిక కల్లోలానికీ గురి కాకుండా ఉంటాడు. చైనీయుల వృత్తి జీవన సరళిలో కూడా ఈ వివేక దృక్పథమే కనిపిస్తుంది. నిత్యజీవితంలో మనమందరం కూడా ఎంత పనినైనా, నిర్బంధంగా కాకుండా ఆసక్తితో, అమితోత్సాహంతో ఆచరించాలి. ఒక గృహిణి రోజంతా తన వారి కోసం కష్టపడుతూ కూడా సాయంత్రానికి అదే ఉత్సాహంతో కనిపిస్తుంది. కానీ ఎనిమిది గంటలు ఉద్యోగం చేసి భర్త మాత్రం ఆపసోపాలతో, వాడిన ముఖంతో ఇంటికి వస్తాడు. అంటే వృత్తిధర్మంలో ఎక్కడో అతడికి ఉల్లాసం లోపిస్తూ ఉందన్నమాట! పైగా కొందరు కార్యక్షేత్రంలో ఎప్పుడూ సణుగుడు, అసంతృప్తి, ఆరోపణలతో పొద్దుపుచ్చుతూ ఉంటారు. ఏదో గానుగెద్దు నసుగుతూ బండిని లాగుతున్నట్టు! ఇలాంటి జీవనం వల్ల ఉపయోగం ఏమిటి? ఎవరో మనకు సంతృప్తినీ, సంతోషాన్నీ ఇవ్వాల్సిన అవసరం లేదు. పనిలోనే ఉల్లాసం నుంచి ఉల్లాసానికి అనేలా సాగిపోతూ, అందులోనే విరామాన్ని వెతుక్కోవాలి. ❖

సేకరణ : ఆర్. కృష్ణ

శ్రద్ధాభావంతో ఏమి చేసినా మేలే చేకూరుతుంది. ఎంత చిన్న పనినైనా, సవ్యంగా చేస్తే మహాద్భుత ఫలితాన్ని ఇస్తుంది. కాబట్టి ప్రతి వ్యక్తి ఎంత చిన్న కార్యాన్నైనా శ్రద్ధతో నిర్వహించాలి. - స్వామి వివేకానంద



(1884 – 1967)

# ముందుకు సాగిపో !

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాఛీ,
30-4-1940

ప్రియమైన విపత్ భంజన్!*

ఒంటరిగా జీవించడం చాలా కష్టం. పైగా అలా చెయ్యవలసిన అవసరం ఏమిటి? మన శాస్త్రాలు ఒంటరిగా జీవించడానికి అవకాశాన్ని సూచించాయి. అయితే అది చాలా అభివృద్ధి సాధించాకనే సుమా! మానవజీవితం చాలా చిత్రమైంది. మనం రాత్రింబవళ్ళు ఖాళీ లేకుండా జీవితం గడుపుతూ ఉంటాం. కానీ దాని రహస్యమేమిటో తెలుసుకోం. మనల్ని మనం తెలుసుకోలేకపోవడం వల్లనే చాలా బాధలు మనల్ని వెన్నాడుతున్నాయి. మొట్టమొదటగా మానవుడు అర్థం చేసుకోవలసింది ఇదే. ఈ రహస్యాన్ని విశదపరచడానికి ఛాందసులు అవలంబించిన అన్ని మార్గాలూ నిజానికి మానవజాతికి మేలు కన్నా కీడే చేశాయి. మతవాదులు ఆత్మోన్నతికి వివిధ మార్గాలు సూచించారు. జనులు తరతరాలుగా వాటిని అమలుపరుస్తూనే వచ్చారు. పర్యవసానంగా భయంకరమైన మూఢనమ్మకాలు చోటు చేసుకున్నాయి. వారిని వారి భ్రమల నుండి విముక్తులను చెయ్యగలిగింది ఒక్క రాజయోగం మాత్రమే.

పరిపూర్ణమైన వ్యక్తిగా తయారవ్వాలంటే అన్ని సంస్కారాల నుండి విముక్తుడవ్వాలి. అందుకు రాజయోగం అభ్యసించడానికి ప్రయత్నించాలి. మనస్సును శరీరంలోకి లయం చెయ్యాలి. అందుకు మొట్టమొదటి సాధన మౌనంగా కూర్చోవడం (ఆసనం), రెండో సాధన లయబద్ధంగా ఊపిరి పీల్చడం (ప్రాణాయామం). మూడోసాధన ఊపిరితిత్తులను కదిలిస్తున్న శక్తిని గమనించడం (ప్రత్యాహారం). ఈ విషయాలను స్పష్టంగా అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించాలి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానాలను అభ్యసిస్తే క్రమేణ సమాధి స్థితి సిద్ధిస్తుంది.

ఈ సాధనలో అప్రయత్నంగానే జ్ఞాన, కర్మ, భక్తి యోగాలు ఇమిడిపోతాయి. నువ్వు ఇతర పుస్తకాలన్నిటి కన్నా 'రాజయోగం' పుస్తకాన్ని శ్రద్ధగా చదువు; తగిన అవకాశం వచ్చినప్పుడు నీతో ఈ విషయాలను ముఖాముఖి చర్చించాలని అనుకుంటున్నాను. ఈ రాజయోగాన్ని కనుక అవలంబిస్తే మనం చేపట్టిన ఏ పనులైనా, ఎంతటి బృహత్తర కార్యక్రమాలైనా సులభతరం అవుతాయి. పాఠశాలల్లో, కళాశాలల్లో విద్యాభ్యాసం చేసేందుకు ఎంతో శ్రమ పడుతున్న వారు ఈ యోగాన్ని కొద్దిగానైనా సాధన చేస్తే ఏకాగ్రత సిద్ధిస్తుంది. మనస్సు ఏకాగ్రతతో ఉన్నప్పుడు చాలా కొద్ది సమయంలోనే అనేక విషయాలను నేర్చుకోవడం సాధ్యపడుతుంది. ఈ ఆనందాన్నీ, నిశ్చలతనూ, ఆరోగ్యస్థితినీ యోగా ద్వారా నువ్వు శాశ్వతం చేసుకోగలిగితే, అన్ని ప్రయత్నాల్లోనూ నువ్వు సఫలీకృతుడవు అవుతావు.

మానవదేహంలో కావలసినంత అందం, ఆనందం నిండి ఉన్నాయి. దీన్ని తెలుసుకోగలిగితే బాధ అతి తేలిగ్గా నివారణ అవుతుంది. ఆ భగవంతుడు శ్రీరామకృష్ణుల రూపంలో మానవ దేహాన్ని ధరించి మానవదేహానికే వన్నె తెచ్చారు. నువ్వు కూడా ప్రయత్నిస్తే ఈ యోగశక్తిని సాధించి ఒక కొత్త యుగాన్నే స్థాపించాలనుకొన్న స్వామి వివేకానంద కలలను సాకారం చేసే సాధనంగా మారవచ్చు. నిద్రలో నడిచే వ్యాధి లాంటి ఈ చావు పుట్టుకల పరంపరను ఛేదించుకొని స్వేచ్ఛను పొందు. చావు పుట్టుకలు కేవలం స్వప్నాలే సుమా!

ప్రేమాశీస్సులతో
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(*విపత్ భంజన్ కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో స్వామి స్వాహానందగా సుప్రసిద్ధులు.)

ఒక సామాన్య వ్యక్తి ఆలోచనా శక్తి, నూటికి తొంభైవంతులు నష్టమైపోతూ ఉంటుంది. అందువల్ల అతను ఎప్పుడూ తప్పులు చేస్తూనే ఉంటాడు. సుశిక్షితుడు ఎప్పుడూ తప్పు చేయడు.- స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి.)

**సొలసి చూచినను సూర్యచంద్రులను**
**లలివెద చల్లెడు లక్షణుడు**
**నిలిచిన నిలువున నిఖిల దేవతల**
**కలిగించు సురల గనివో యితడు...**

అంటున్నాడు. 'సొలసి' అంటే 'గమనించి' అనీ, 'లలి' అంటే ప్రకాశం, వికాసం అనీ అర్థాలు! భగవదవతారాలలో శ్రీకృష్ణ పరమాత్మకున్న ప్రత్యేకత వేరు. ఆనందాది శ్రేయస్సును ప్రసాదించి భక్తులను తన వైపునకు ఆకర్షించుకొనువాడు శ్రీకృష్ణుడు. ఆయన నిత్యానంద స్వరూపుడై అందరినీ తన వైపునకు ఆకట్టుకోగలవాడు. సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు కూడా! అందుకే పది అశ్వమేధాల అంతంలో అవబృథ స్నానమాచరించిన వారైనా తిరిగి తమ పుణ్యఫలాన్ని అనుభవించేందుకు జన్మించాల్సిందే! కానీ ఒక్క మారైనా దేహాభిమానం వీడి శ్రీకృష్ణభగవానుడికి వందనం ఆచరిస్తే వారికి పునర్జన్మ ఉండదంటారు మన మహర్షులు.



### మహాసముద్రమితడు...

ఆ నందనందనుడి గుణగానం, పదధ్యానం మన జీవితానికి పరమపద సోపానం. అందుకే శ్రీమద్భాగవతంలో శుకమహర్షితో పరీక్షిత్తు...

**...ఎవ్వండేని శ్రద్ధాభక్తి యుక్తుండై కృష్ణ గుణ కీర్తనంబులు వినుచుం పలుకుచు నుండు అట్టివాని హృదయ పద్మంబు నందు కర్ణ రంధ్ర మార్గంబులు ప్రవేశించి కృష్ణుండు విశ్రమించి సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున ఆత్మగతంబైన మాలిన్యంబు నపకర్షించు...**

'ఎవరు శ్రద్ధాభక్తులు కలిగి కృష్ణుని గుణగణాలను ఇతరులు కీర్తిస్తుంటే వింటాడో, తానూ స్వయంగా కీర్తిస్తాడో; అలాంటి వాని హృదయ కమలంలోకి శ్రవణ కుహరాల ద్వారా కృష్ణుడు ప్రవేశిస్తాడు. అక్కడ విశ్రమిస్తాడు. నీటిలోని మాలిన్యాన్ని శరదృతువు తొలగించినట్లు మనస్సులోని మాలిన్యాన్ని తొలగిస్తా'డని తేటపరుస్తాడు.

ఆ పరంపరలో అన్నమాచార్యులు కూడా బాలకృష్ణుడి చిలిపిచేష్టల్ని మననం చేసుకుంటూ మురిసిపోతున్నాడు. 'మన్ను తిన్నావెందుకని' మందలించినందుకు, అమ్మకు అఖిలాండ కోటి బ్రహ్మాండాన్ని చూపిన గుణరాశి అతడంటూ, కేవలం తన ఊపిరితోనే వేదాలను వెలువరించిన విశ్వంభరుడని వేవేల వినుతిస్తూ...

**మాటలాడినను మరి యజాండములు**
**కోటులు వొడమేటి గుణరాశి**
**నీటగు నూర్పుల నిఖిల వేదములు**
**చాటున నూరేటి సముద్రమితడు...**

అంటున్నాడు. 'అజాండము' అంటే బ్రహ్మాండము, 'ఒడమేటి' అంటే ఉద్భవించి, 'నీటగు' అంటే చక్కని, 'ఊర్పులు' అంటే ఊపిరి అని, 'చాటున' అంటే ప్రకటితం అని అర్థం. ఈ పరమాత్ముని మాట అయిన వేదం నుంచే ఈ అఖిల భువనాలు ప్రభవించాయి. లయబద్ధమైన ఈ దేవుని ఊర్పుల నుంచి సమస్త వేదరాశి ఉద్భవించింది. ఇన్నింటిని వరాలుగా ఊరించే మహాసముద్రంగా మాధవుణ్ణి స్తుతిస్తున్నాడు శ్రీనివాసుడి సేవాగ్రగణ్యుడు. వేదాంతరీత్యా కూడా భగవంతుడి శ్వాసయే వేదమని... **'అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేత దృగ్వేదో యజుర్వేదః'** అంటూ ఋగ్, యజుర్వేదాలు భగవానుని నిశ్వాస రూపాలని వ్యాఖ్యానించాయి.

### గతి శ్రీవేంకటాధిపుడు...

ద్వారకావాసులు రేపల్లె నుంచి వచ్చిన ఆ మోహనాకారుణ్ణి చూసి ముగ్ధులై...

**నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసార సం తాపధ్వంసినియౌ గదా, సకల భద్రశ్రేణులం బ్రీతితో నాపాదింతు గదా, ప్రపన్నులకు కాలాధీశ కాలంబు ని ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్...**

'స్వామీ! నీ పదకమలాలు బ్రహ్మ పూజ్యాలు. నీ చరణసేవ సంతాప సమమైన సంసార సముద్రాన్ని దాటించే నావ. నీవు ఆపన్నులకు అన్ని సౌభాగ్యాలనూ సంతోషంగా ప్రసాదించే కరుణామూర్తివి. నీవు కాలస్వరూపుడవు. కాలానికి అధీశ్వరుడవు. బ్రహ్మాది దేవతలు కూడా నిన్ను ప్రశంసించలేర'ని పొంగిపోతారు.

ఆ దేవదేవుడి సమక్షం సమున్నత మోక్షమార్గం. ఈ జనన మరణ జరా వ్యాధి క్లేశాలతో కూడిన సంసార చక్రాన్ని సమర్థంగా పరిభ్రమింప జేయువాడు ఆ శ్రీమహావిష్ణువు.

**ముంగిట పొలసిన మోహన మాత్మల**
**పొంగించే ఘనపురుషుడు**
**సంగతి మా వంటి శరణాగతులకు**
**నంగము శ్రీవేంకటాధిపుడితడు...**

అతడు తన ముంగిట 'పొలసిన' అంటే చరించిన ఆత్మలను తరింపజేయగల ఘన పురుషుడనీ; తన లాంటి శరణాగతులకు ఆ దేవకీ నందనుడి 'సంగతి' అంటే సాంగత్యమే దిక్కనీ, అదే మాహాత్మ్యంతో తిరుమల ఆనంద నిలయంలో కొలువు తీరిన వేంకటాధిపుడే తనకు 'అంగము' అంటే గతి అనీ... పాడుకుంటూ భాగవతోత్తముడు అన్నమయ్య పులకరించి పోతున్నాడు. ❖




– స్వామి పరిజ్ఞేయానంద

If the mother is pleased, and the father, God is pleased with the man. That child is really a good child who never speaks harsh words to his parents. *- Swami Vivekananda*

సాయితేజ, హైదరాబాద్

**ప్రశ్న : నేను 12వ తరగతి చదువుతున్నాను. సమయాన్ని వృథా చేయకుండా శ్రద్ధగా చదవాలంటూ ఇంట్లో తల్లితండ్రులు, పాఠశాలలో ఉపాధ్యాయులు అదేపనిగా నన్ను వేధిస్తున్నారు. వారి మాటలు నాకు చాలా విసుగు పుట్టిస్తున్నాయి. ఇల్లు వదిలి ఎక్కడికైనా వెళ్ళిపోవాలనిపిస్తోంది. నా సమస్యకు పరిష్కారం తెలపండి.**



# చదువులా? సరదాలా?

**జవాబు:** ఈ పోటీపరీక్షల ప్రపంచంలో విద్యార్థుల కన్నా తల్లితండ్రులే ఎక్కువ ఒత్తిళ్ళకూ, ఆందోళనలకూ గురవుతున్నారు. ఎందుకంటే వారి ఆశాసౌధాలు పిల్లల భవిష్యత్తుపైనే ఆధారపడి ఉన్నాయి కాబట్టి. రోజులోని ఇరవై నాలుగు గంటలూ చదివినా పోటీపరీక్షలకు సమయం సరిపోని ఈ రోజుల్లో, ఇక ఆటపాటలకూ, కబుర్లకూ, షికార్లకూ సమయమెక్కడిది? అందుకే ప్రతీ క్షణం, పుస్తక వీక్షణంలోనే వినియోగించాలన్నది తల్లితండ్రుల అభిమతం. దీన్ని సమర్థిస్తోంది ఈ సుభాషితం :

**క్షణశః కణశశ్చైవ విద్యా మర్థం చ సాధయేత్।**
**క్షణ త్యాగే కుతో విద్యా కణ త్యాగే కుతో ధనమ్ ॥**

'క్షణం క్షణం వినియోగించి విద్యను ఆర్జించాలి. కణం కణం కూడబెట్టి ధనాన్ని సంపాదించాలి. ఒక్క క్షణమైనా వృథా చేసేవాడికి విద్యార్జన ఎలా సాధ్యం? ఒక్క కణాన్నైనా వృథా చేసేవాడికి ధనార్జన ఎలా సాధ్యం?'

అయితే, జీవితంలో చదువు తప్ప వేరే సరదాలూ, సంతోషాలూ అక్కరలేదా? అన్నది విద్యార్థుల అభిప్రాయం. కానీ దేనికి ఎప్పుడు, ఎంత సమయం కేటాయించాలో తెలుసుకోవడం కీలకమైన అంశం. విద్యార్థి దశలో విద్యార్జనే ప్రథమ కర్తవ్యం. కాబట్టి అధిక సమయాన్ని చదువుకే కేటాయించడం సమంజసం.

***సుఖార్థీ చేత్ త్యజేత్ విద్యాం, విద్యార్థీ చేత్ త్యజేత్ సుఖమ్*** – 'సుఖాలను కోరుకునే వాడు విద్యను వదులుకోవాలి. విద్యను కోరుకునేవాడు సుఖాన్ని వదులుకోవాలి' అని సుభాషితం చెబుతోంది. మన భవిష్యత్తు గురించి తపనపడే తల్లితండ్రుల పట్ల గౌరవభావంతో మసలుకోవాలి. అందుకే...

'తల్లితండ్రులు ప్రీతి చెందితే భగవంతుడు కూడా ప్రీతి చెందుతాడు. తల్లితండ్రులపట్ల పరుషంగా మాట్లాడని పిల్లవాడే నిజమైన సత్ప్రవర్తనగలవాడు' అని అన్నారు స్వామి వివేకానంద.

అలాగే చాలామంది విద్యార్థులు ఉపాధ్యాయుల హితోక్తులను కూడా అపార్థం చేసుకుంటారు. ఓ ఉపాధ్యాయునిపై మొదట అనిష్టాన్ని పెంచుకొని, తరువాత అతడి నిజాయతీ, నిబద్ధతలను గమనించి తన ఆలోచనా దృక్పథాన్నే మార్చుకొన్న ఓ విద్యార్థి కథ ఇది:

ఒక బోర్డింగ్ పాఠశాలలో చదువుతున్న విద్యార్థుల్ని ప్రతీరోజు తెల్లవారుజామున 4 గంటలకు నిద్రలేపి, చదివించే బాధ్యత ఓ ఉపాధ్యాయుడిది. అతడి ఇల్లు పాఠశాలకు రెండు కిలోమీటర్ల దూరంలో ఉంది. ప్రతీరోజు విద్యార్థుల్ని ఉదయం 4 గంటలకు మేల్కొలపడానికి అతడు ఉదయం మూడు గంటలకే ఇంటి నుండి బయలుదేరేవాడు. ఇలా రోజూ క్రమం తప్పకుండా ఆ ఉపాధ్యాయుడు తన బాధ్యతను నిబద్ధతతో చేసేవాడు. ఒకరోజు తెల్లవారుజామున జోరున వర్షం కురుస్తుంది. ఆ రోజు ఉపాధ్యాయుడు రారని అందరూ అనుకున్నారు. కానీ అతడు వర్షంలో తడుసుకుంటూ రోజూలాగే సరిగ్గా నాలుగు గంటలకు వచ్చి విద్యార్థుల్ని నిద్రలేపాడు. ఉపాధ్యాయుని నిబద్ధతను చూసిన ఓ విద్యార్థి కేవలం నిద్ర నుండే కాదు, జీవితపు నిద్ర నుండీ మేల్కొన్నాడు. సంకల్పబలంతో శ్రద్ధగా చదువుకొని, జీవితంలో ఎన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించాడు. ఆ విద్యార్థి మరెవరో కాదు – ప్రస్తుత భారత రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ దువ్వూరి సుబ్బారావు.

కాబట్టి మన శ్రేయస్సు కోరే తల్లితండ్రుల, ఉపాధ్యాయుల మాటలను వేధింపులుగా భావించకుండా, వారి మనోభావాలను అర్థం చేసుకొని ప్రవర్తించిన నాడు మనకు అన్నివిధాలా శుభమే చేకూరుతుంది. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు – 500 029**

**మానవులకు విద్యయే సౌందర్యం, అదియే తరగని ధనం. విద్య వల్లనే కీర్తి, సుఖం లభిస్తాయి. సర్వత్రా గౌరవాన్నిచ్చేది విద్యయేగాని ధనం కాదు. ఇంతటి శ్రేష్ఠమైన విద్య లేని వ్యక్తి వింత పశువు.** - భర్తృహరి



# భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

## లక్ష్యం దిశగా అడుగులు...

*(...గత సంచిక తరువాయి)*

మన విశ్వాసాలను మాటిమాటికీ మారుస్తూ మన ప్రయత్నాలనూ, ప్రయాసలనూ వృథా చేసుకోగూడదు. మానవ జీవితం అత్యంత విలువైనది. కానీ మనకు కేటాయించిన సమయం అతి స్వల్పం. వివిధ ప్రదేశాలలో ప్రయత్నాలు కొనసాగించడమో, లేక అప్పుడప్పుడు సాధనలు చేయడమో, అస్థిరంగా ఉండడమో చేస్తూ మన సమయాన్ని వృథా చేసుకోగూడదు. మనుష్యులు పనులు ప్రారంభించి సగంలో ఎలా వదిలేస్తారన్న విషయం అధ్యయనానికి గొప్ప అంశం అవుతుంది.

ఒక కార్యక్రమాన్ని ఉత్సాహంగా ప్రారంభిస్తే సరిపోదు. దాని యందు 'శ్రద్ధ' ఉండాలి. మన మనోభావాలు బుద్ధితో ఏకమైనప్పుడే శ్రద్ధ కలుగుతుంది. బుద్ధితో కూడిన ఆత్మ బుద్ధిపరమైన నిర్ణయమే చేసి, అది మంచి పనే అని తెలియజేస్తుంది. కానీ దానిని ఆచరణలో పెట్టాలంటే మన మానసిక (భావోద్రేక) ఆత్మ కూడా దానిని అంగీకరించాలి. బుద్ధిపరమైన ఆత్మను తండ్రితోనూ, మానసిక పరమైన ఆత్మను తల్లితోనూ పోల్చవచ్చు. కాబట్టి మన లోపలే తల్లీ, తండ్రీ - ఇద్దరూ ఉన్నారు. బుద్ధిపరమైనఆత్మ తీసుకున్న నిర్ణయాలను మానసికమైనఆత్మ అమలుపరుస్తుంది. కాబట్టి, మానసిక ఆత్మ కూడా నిర్ణయాలు తీసుకుంటే మంచిది.

అయితే, మానసిక ఆత్మ నిర్ణయాలు తీసుకునేలా చేయడం ఎలా! ఇది చేయాలంటే తీవ్రమైన ఆలోచన, పరిశీలన చేయాలి. ఆ విధంగా చేయడం 'నేను ఇది మాత్రమే చేయాలి, నా సమయాన్ని ఇతర విషయాలపై ఇక మీదట వృథా చేయకూడదు' అనే దృఢమైన అభిప్రాయానికి దారి తీస్తుంది. ఈ విధంగానే జీవితంలో స్థిరత్వం వస్తుంది. ఒకసారి నిశ్చలంగా ఉండగలిగితే, అప్పుడిక బాహ్యమైన ప్రేరణ గానీ, సహాయం గానీ అవసరం ఉండదు.

స్పష్టమైన మనస్సే స్థిరత్వానికి మూలం. ఈ జీవితంలో ఏం కావాలో స్పష్టంగా తెలుసుకుంటే, దానిపై శ్రద్ధ ఏర్పడుతుంది. ధనం, పదవి, పేరు ప్రతిష్ఠల కోసం ఈ లోకంలో ఎంతోమంది ఎంతగా పాకులాడతారో కదా! వాటి గురించి ఆలోచిస్తూ, ఆఖరికి నిద్ర కూడా పోరు. ఇవన్నీ తమకు కావాలని దృఢంగా



విశ్వసించిన ఆ వ్యక్తులు తమ మనస్సు చేసే ఒత్తిడికి లొంగి, రాత్రింబవళ్ళూ వాటి కోసమే కృషి చేస్తుంటారు. అదే విధంగా మోక్షం, లేక ఆధ్యాత్మిక పరివర్తన కావాలని దృఢంగా విశ్వసించే వ్యక్తి సహజంగానే ఆ లక్ష్యసాధనకు చాలా కృషి చేస్తాడు.

మన మనస్సును ఆధ్యాత్మిక లక్ష్యం మీద దృఢంగా నిలిపినప్పుడు మాత్రమే దాన్ని చేరుకునేందుకు నిజంగా కృషి చేయగలం. మనం ఏ పరిస్థితులలో ఉన్నా, లక్ష్యసాధనకు మన పోరాటాన్ని ఆపకూడదు.

**రత్నైర్మహార్ధనం తుతూషుర్దేవాః న భేజిరే భీమ విషేణ భీతిమ్**
**సుధాం వినా న ప్రయయుర్విరామమ్ న నిశ్చితార్థాత్ విరమన్తి ధీరాః**

దేవతలు మహా సముద్ర మథనం చేసినప్పుడు అనేక వస్తువులు సముద్రం నుంచి ఉద్భవించాయి. అసంఖ్యాకమైన ఆకర్షణీయ వస్తువులతో పాటు, భయంకరమైన విషం కూడా ఆవిర్భవించింది. ఆ విషం దేవతలను భయపెట్టలేకపోయింది. విలువైన రత్నాలు వారిని ప్రలోభపరచలేక పోయాయి. వారి ప్రయత్నాలను వారు మానుకోలేదు. 'అమృతం' వెలువడే దాకా వారు సముద్ర మథనాన్ని ఆపలేదు.

స్థిరమైన కృషి చేయాలంటే, ఇలాంటి భావమే ఉండాలి. ఒకసారి ఒక లక్ష్యాన్ని ఎంచుకున్న తరువాత, ఎన్ని కష్టాలు ఎదురైనా సరే మనం కోరుకున్న గమ్యాన్ని చేరేవరకూ కృషి చేస్తూనే ఉండాలి. అది సాధించే లోపలే మన ప్రయత్నాలను నిలిపివేస్తే, మరల మొదటి నుంచి ప్రారంభించాల్సి ఉంటుంది. ఎంతటి ఫలితాన్నైనా ప్రగాఢదీక్ష, పట్టుదల, స్థిరత్వం లేకుండా సాధించలేమన్న విషయం మనం తెలుసుకోవాలి.

సారాంశమేమంటే మనం ఏ పరిస్థితిలో ఉన్నామో తెలుసుకుంటేనే, మనమేమి చేయాలో, మన కర్తవ్యమేమిటో తెలుస్తుంది. ధనం సంపాదించడంలో, కోరికలు తీర్చుకోవడంలో మన 'ప్రారబ్ధకర్మ' ఒక నిశ్చయాత్మక పాత్రను పోషిస్తుంది. తన కర్తవ్యాన్ని తాను నెరవేర్చడానికీ, మోక్షం కోసం పాటుపడడానికీ స్వయంకృషి (పురుషార్థం) ఎల్లప్పుడూ ఉండాలి. కానీ మనం విషయాలన్నిటినీ వేరే విధంగా చూస్తుంటాం. ధన సంపాదనకూ, కోరికలు తీర్చుకోవడానికీ ఎంతో కష్టపడి పనిచేస్తాం. కానీ మన బాధ్యతలను మనం నెరవేర్చడం, పవిత్రమైన కార్యాలు చేయడం, మోక్షం సాధించడం మాత్రం మన పూర్వజన్మ కర్మల వల్లో, భగవంతుని వల్లో జరగాలని అనుకుంటాం.

స్వీయ పురోభివృద్ధికి స్వయంకృషి కావాలి. అందుకు మన భావాలు, మాటలు, చేతలు ఒకే రకంగా, స్థిరంగా, నిశ్చలంగా ఉంటే లక్ష్యం దిశగా ముందుకు సాగిపోగలం. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో – 'ఆత్మవినిగ్రహం' )

---

(...21వ పేజీ తరువాయి.)

# రామకృష్ణ సంఘంలో తపోమయజీవనం

ఆ సమయంలో స్వామి వీరేశ్వరానంద మహరాజ్ కూర్చొని టపా చూస్తున్నారు. నన్ను కుర్చీలో కూర్చోమని చెప్పి ఆయన నెమ్మదిగా షర్బత్తు తయారుచేస్తున్నారు. షర్బత్తు తన కొరకే చేసుకుంటున్నారేమోనని నేను అనుకున్నాను. ఇంతలో ఆయన ఒక పిల్లవాణ్ణి పిలిచి బేలూరు బజారుకు వెళ్ళి ఐసు తెమ్మన్నారు. ఆ అబ్బాయి తీసుకువచ్చిన ఐసు గడ్డల్ని షర్బత్తు గ్లాసులో వేసి నాకు అందించారు. రామకృష్ణ సంఘానికి ప్రధాన కార్యదర్శి అయిన స్వామీజీ నాకోసం షర్బత్తు స్వయంగా తయారుచేసి ఇవ్వడం నా మనస్సును కదిలించింది. ఆయన ప్రేమాభిమానాలకు నేను కన్నీటిపర్యంతమయ్యాను.

రామకృష్ణ సంఘంలో ఆధ్యాత్మిక అనుభూతులను బహిర్గతం చేయరు. అలాంటి ప్రదర్శన, ఒక ప్రత్యేక గుర్తింపు కోసం తపనే కదా! ఇది ఆధ్యాత్మిక పురోగతికి అంతరాయం కలిగిస్తుంది. కానీ కొందరు మహాత్ములు ఆధ్యాత్మిక భావావేశాన్ని అదుపులో పెట్టుకొనలేకపోయేవారు. అలాంటి కొద్దిమందిలో ఒకరు – స్వామి శివానంద మహరాజ్ శిష్యులైన స్వామి గదాధరానంద. నిజమైన ఆధ్యాత్మిక అనుభూతులు ఆయనలో పూర్తిగా గోచరమయ్యేవి.

ఇప్పటివరకు చెప్పినవి అరుదుగా జరిగినవి. మరికొన్ని సామాన్యంగా కనపడేవి. స్వామి బ్రహ్మానంద మహరాజ్ శిష్యులైన స్వామి పూర్ణాత్మానందతో నేను కొన్ని నెలలు ఉన్నాను. అప్పుడు ఆయన అల్మోరా మఠాధ్యక్షులుగా ఉండేవారు. ఎన్నో బాధ్యతలను నిర్వహిస్తున్నప్పటికీ ఎప్పుడు ఏ కొంచెం తీరిక దొరికినా జపం చేస్తుండేవారు. ఆ సమయంలో ఆయన ముఖం ఒక దివ్య తేజస్సుతో నిండిపోయేది. 'ఒక సాధువు సర్వోత్తమ స్థితిని చూడాలంటే, ధ్యానం చేస్తున్నప్పుడు చూడాలి' అన్నారు మాస్టరు మహాశయ్. స్వామి పూర్ణాత్మానంద మహరాజ్‌ని చూసినప్పుడు నాకు ఆ వాక్యం గుర్తుకు వచ్చేది.

స్వామి శాశ్వతానంద మహరాజ్ (1894–1963) గొప్ప వేదాంతి. ఆయన నాకూ, మరొక యువ సన్న్యాసికీ మాండూక్య కారిక బోధించారు. ఆయన బోధలు ఎంత దృఢంగా, శక్తిమంతంగా ఉండేవంటే, అవి మా మనస్సులో గట్టిగా నాటుకుపోయేవి.

నేను, స్వామి వివేకానంద శిష్యులైన స్వామి సదాశివానంద మహరాజ్‌ను 1958లో దర్శించాను. ఆయన వారణాసి సేవాశ్రమంలో ఉండేవారు. నేను ప్రణామం చేయగానే ఎంతో ప్రేమతో ఆలింగనం చేసుకున్నారు. స్వామీజీ మూర్తీభవించిన ప్రేమస్వరూపులు.

ఇలాంటి సంఘటనలు ఎన్నో నా హృదయాన్ని స్పృశించాయి. ఇవి ఆధ్యాత్మిక వికాసం పొందిన మహాత్ములకు మాత్రమే సాధ్యమని తెలుసుకున్నాను. ❖ అనువాదం: డాక్టర్ కమల జయరావు

(*స్వామి ప్రభానందజీ మహరాజ్ రామకృష్ణ మఠం, మిషన్‌ల ఉపాధ్యక్షుల్లో ఒకరు.)

ధైర్యంతో ముందుకు సాగిపో! ఎప్పుడూ అత్యున్నతమైన ఆదర్శాన్ని కలిగి ఉండు. స్థైర్యంగా ఉండు. ఈర్ష్యను, స్వార్థాన్ని విడిచిపెట్టు. అప్పుడు నీవు ప్రపంచాన్నే కదిలించివేయగలవు. - స్వామి వివేకానంద



# పాండురంగని పరమ భక్తుడు

చిత్ర కథ: టి.ఎమ్. సుందరరామన్ చిత్రాలు: సదాశివం అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 పండరీపురంలో రాకా అనే భక్తుడు ఉండేవాడు. పాండురంగని పరమ భక్తుడైన ఆయన కుండలు తయారుచేస్తూ, జీవనం సాగిస్తూ ఉండేవాడు.




2 మర్నాడు ఒక తల్లి పిల్లి ఆవం చుట్టూ తిరుగుతూ 'మ్యావ్ మ్యావ్' అంటూ దీనంగా రోదించసాగింది.




3 రెండు రోజులు రాకా ప్రార్థనలోనే గడిపాడు. మూడో రోజు ఆవంలోని నిప్పు ఆరిపోయింది. కుండలను ఒక్కొక్కటిగా తీసి చూస్తున్నప్పుడు ఒక కుండలో సురక్షితంగా ఉన్న పిల్లికూనలు కనిపించాయి.



4 ఆహా! బంకా! పాండురంగ ప్రభువు మనల్ని ఘోరపాపం నుండి రక్షించాడు. ఇక మనం ఆ పండరీనాథుని కోసమే జీవించాలి.




రాకా తనకు ఉన్నదంతా దానం చేసి, కుటుంబంతో ఒక కుగ్రామంలో నివసించసాగాడు.

5 రాకా ధరించిన ఒకే వస్త్రం మాసి, పీలికలైపోయింది. ఒక రోజు వీధిలో పడివున్న ఒక జీర్ణవస్త్రాన్ని రాకా తీసుకున్నాడు. అప్పుడు ఒక నిరుపేద పరుగున వచ్చి...




రాకా ఆకులతో తన శరీరాన్ని కప్పుకొన్నాడు.

6 చంద్రభాగా నదీతీరంలో రాకా కుమార్తె, నామదేవుని కుమార్తె బట్టలు ఉతుక్కుంటున్నారు.







8
పాండురంగ విఠలుని మీద నామదేవుడు అనేక అభంగాలు వ్రాసి గానం చేయడం వల్ల పాండురంగడు ప్రీతి చెంది అతడితో ప్రత్యక్షంగా మాట్లాడేవాడు.
రాకాకు సమానుడైన భక్తుడు ఎవరూ లేరు.
అలా అయితే నాకు ఆ విషయాన్ని నిదర్శనపూర్వకంగా తెలియజేయండి.
రాకా దగ్గరకు నేను, రుక్మిణి వెళుతున్నాం. నువ్వు కూడా అక్కడకు రా!



9
అడవిలో రాకా ఎండుపుల్లలు సేకరించుకొంటున్నాడు. అప్పుడు కూడా అతడు 'విఠలా, విఠలా' అంటూ నామజపం విడవక చేస్తూనే ఉన్నాడు.
నామదేవా! మన ఉనికిని సైతం గుర్తించక రాకా ఎంత ప్రగాఢ భక్తితో నామజపం చేస్తున్నాడో చూశావా!
నామదేవా! స్వామి పావన నామ స్మరణలో సమస్తాన్నీ మరచిన, రాకా భక్తిప్రపత్తులను ఇంకా పరికించు.
విఠలా! విఠలా! విఠలా! విఠలా!



10
రుక్మిణీ దేవి అమూల్యమైన రత్నాలు పొదిగిన తన చేతిగాజును ఒక ఎండుపుల్ల కింద ఉంచింది. తరువాత ముగ్గురూ ఒక చెట్టు మరుగున నిలబడి రాకాను గమనించసాగారు.



11
రాకా ఆ ఎండుపుల్లను తీశాడు. దాని కింద ఉన్న గాజును మామూలు వస్తువును చూసినట్లుగా చూశాడు.
ఇదిగో! ఒక మాణిక్య కంకణం. నీకు ఇది కావాలా?
వద్దు స్వామీ! పాండురంగడు మనల్ని పరీక్షిస్తున్నాడు. ఇక మనం ఇక్కడ ఉండవద్దు.







14 రుక్మిణీదేవి సహితంగా పాండురంగడు భక్తుడైన రాకా ముందు ప్రత్యక్షమయ్యాడు. రాకా, ఆయన భార్య, వారి కుమార్తె ఆ దృశ్యం చూసి పులకించిపోయారు.









ఇతరులెవ్వరూ తనను చూడలేని ఏకాంత ప్రదేశంలో ఉన్నా పరాత్పరుడు మాత్రం చూస్తున్నాడని గ్రహించి, పాపకార్యాలను చేయనివాడే నిజమైన భక్తుడు. నిర్జన ప్రదేశంలో కాసుల సంచి కనబడినా ధనాశకు లోనుకాకుండా ఉండేవాడే నిజమైన పారమార్థికుడు. *- భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస*

## వార్తావాహిని










# స్వామి వివేకానంద గ్రంథావిష్కరణ ఉత్సవం



స్వామి వివేకానంద 150 వ జయంత్యుత్సవాల సందర్భంగా 'స్వామి వివేకానంద సాహిత్య' ప్రచురణకు కేంద్ర సాంస్కృతిక మంత్రిత్వశాఖ, కోల్‌కతా రామకృష్ణ మఠం, మిషన్‌లకు ఆర్థిక సహాయాన్ని అందించింది. వివిధ భారతీయ భాషల్లో పుస్తకాల ముద్రణా బాధ్యతలను కోల్‌కతా రామకృష్ణ మఠం, హైదరాబాదు రామకృష్ణ మఠానికి అప్పగించింది.


స్వామి సుహితానందజీ జవహర్ సర్కార్

హైదరాబాదు రామకృష్ణ మఠం 2012 జూన్ 20న నిర్వహించిన కార్యక్రమంలో దక్షిణాది భాషల్లో ప్రచురితమైన 'స్వామి వివేకానంద జీవితం-సందేశం' పుస్తకాలను ప్రసార భారతి -ప్రధాన నిర్వహణాధికారి(సి.ఇ.ఓ.) శ్రీ జవహర్ సర్కార్ ఆవిష్కరించారు. ఈ సందర్భంగా హైదరాబాదు రామకృష్ణ మఠం ప్రత్యేకంగా ప్రచురించిన **జాగృత భారతం, స్వామి వివేకానంద స్ఫూర్తి..రోజుకో సూక్తి, స్వామి వివేకానంద జీవితంలో..'** అనే మూడు పుస్తకాలను రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శి - స్వామి సుహితానందజీ ఆవిష్కరించారు. 'స్వామి వివేకానంద రథయాత్ర'కు సంబంధించిన కరపత్రాన్ని స్వామి వివేకానంద 150వ జయంత్యుత్సవ కమిటీ సమన్వయకర్త - స్వామి విశ్వాత్మానందజీ ఆవిష్కరించారు. ప్రచురణ విభాగ సంచాలకులు -స్వామి జ్ఞానదానందజీ స్వాగత వచనాలు పలికారు.

ఈ కార్యక్రమంలో భక్తులు, వివేకానంద వాణీ సంస్థ విద్యార్థులు దాదాపు 1500 మంది పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని దూరదర్శన్ (సప్తగిరి ఛానల్), ఆకాశవాణి కేంద్రాలు ప్రత్యక్ష ప్రసారం చేశాయి. ❖ నివేదిక : స్వామి రఘునాయకానంద

## గ్రంథ పరిచయం




### శ్రీగణేశ పురాణము

**క్రీడాఖండము**

**తెలుగుసేత: శ్రీపూడిపెద్ది లక్ష్మణమూర్తి**
**వెల: రూ.180/- పుటలు: 480**
**ప్రతులకు: శ్రీపూడిపెద్ది శ్రీనివాస్, ఎం.ఐ.జి. 1/173, గుల్లలపాలెం కాలనీ, శ్రీహరిపురం, విశాఖపట్టణం - 530 011**
**ఫోన్: 98662 43891**

విద్యారంభే, వివాహే చ... అంటూ ఏ శుభకార్యాన్ని ప్రారంభించినా, ఓం గణానాం త్వా... అంటూ గణపతికి తొలి పూజ చేసిన తరువాతనే మరే పూజైనా చేయడం భారతీయుల సంప్రదాయం. ఆధునిక భారతీయ జీవనంలో మమైక్యం చెందిన వేల్పు గణపతే. అటువంటి మహాగణపతి గురించి అనుశ్రుతంగా వినవచ్చే వినాయకవ్రతకల్పంలోని కథ తప్ప, ఆయన గురించి మరేవివరాలూ సామాన్యులకు అంతగా తెలియవు. అటువంటి వివరాలు వ్యాస ప్రోక్త 'గణేశపురాణం'లో ఉన్నాయి. ప్రథమభాగం ఉపాసనాఖండం. ఇది క్రీడాఖండం. గణేశుని లీలలు, దివోదాసుడు తిరిగి తనకు వారణాసిని అప్పగించినందుకు పరమేశ్వరుడు చేసిన దుంఠిగణపస్తవం, మందారపుష్పాలతో, శమీపత్రాలతో, దూర్వతో గణపతిని పూజించే ఆచారం ఎలా ఏర్పడింది... మొదలైన మరెన్నో విశేషాలు, గణనాథుని మహిమలు ఈ గ్రంథంలో నిక్షిప్తమై ఉన్నాయి. గాణపత్యులు, మహాగణపతి ఉపాసకులు, ఔత్సాహికులైన భక్తులందరూ తప్పక చదువవలసిన గ్రంథమిది. ఇంత గొప్ప గ్రంథాన్ని సరళభాషలో అనువదించి భక్తులకు అందించిన లక్ష్మణమూర్తి గారి జన్మ ధన్యం. ❖ - ఎం.వి.నాగప్రసాద్

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-8, Sri Ramakrishna Prabha (Telugu Monthly) August 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? ఆంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. - స్వామి రంగనాథానంద





ఒకరోజు నేను వేకువజామున జపం చేస్తుండగా శ్రీరామకృష్ణులు నా ప్రక్కన కూర్చొని ఉండడం చూశాను. ఆయన చేతిని పట్టుకొన్న మరుక్షణమే శ్రీరామకృష్ణులు బాలగోపాలునిగా దర్శనమిచ్చారు. గోపాలుడు నావైపే చూస్తూ 'అమ్మా! వెన్న తినిపించు' అని మారాం చేశాడు. 'నాయనా! నేను నిరుపేదను. నీకు వెన్న ఎక్కడి నుండి తీసుకురాగలను?' అని బాధపడుతూ ఓ కొబ్బరి ఉండను తినిపించాను. – అఘోరమణీదేవి (గోపాలేర్-మా)



# సుబోధ

**భక్తుడు :** మహాశయా! తల్లితండ్రులు అపరాధం చేస్తే ఏం చేయాలి?

**శ్రీరామకృష్ణులు:** తల్లితండ్రులను ఎట్టి పరిస్థితుల్లోనూ త్యజించరాదు. తల్లితండ్రులంటే సామాన్యులనుకొన్నావా? వారు ప్రసన్నులు కాకపోతే జీవితంలో ఏదీ ఫలవంతం కాదు. నీ తల్లితండ్రులు నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేశారు. ఇప్పుడు నీకూ పిల్లలున్నారు. ఈ స్థితిలో భార్యను తోడ్కొని బయటకు వచ్చేశావు! తల్లితండ్రులను మోసం చేసి, భార్యా పిల్లలను పిలుచుకొని వచ్చి, ఏదో గొప్ప మహాత్ముడిలా భావిస్తున్నావు.

మనకు ఎన్నో ఋణాలున్నాయి – దేవ ఋణం, ఋషి ఋణం, మాతృ ఋణం, పితృ ఋణం, దారా ఋణం. తల్లితండ్రుల ఋణం తీర్చకుంటే ఏ పనీ నెరవేరదు. 'యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా' అని చండీస్తోత్రంలో ఉంది. కాబట్టి తల్లిలో జగన్మాతను దర్శించాలి.

స్త్రీలందరూ దేవీ స్వరూపిణులే. అందుచేతనే నేను బృంద (పరిచారిక)ను కూడా చీవాట్లు పెట్టలేను. కొందరు శ్లోకాలను వల్లిస్తారు, పెద్ద పెద్ద మాటలు మాట్లాడతారు, కానీ ప్రవర్తన తద్విరుద్ధం. రామప్రసన్నుడు ఆ హఠ యోగికి నల్లమందు, పాలు ఏర్పాటు చేయడానికి చెడ తిరుగుతున్నాడు. సాధు సేవ చేయాలని మనుధర్మశాస్త్రం చెబుతోందని అంటాడు. ఇటు చూస్తే వృద్ధురాలైన అతడి తల్లికి తినడానికి తిండి లేదు. తల్లి సేవను విస్మరించి, సాధుసేవ చేస్తున్న అతణ్ణి చూసినప్పుడు నాకు ఎంత కోపం వస్తుందో తెలుసా?

కానీ మరో విషయం గమనించాలి. "భగవత్ ప్రేమోన్మాదం కలిగితే, ఇక తల్లి ఎవరు? తండ్రి ఎవరు? భార్య ఎవరు? అది ఎంతటి ప్రేమ అంటే ఆ ప్రేమలో అతడు పిచ్చివాడే అయిపోతాడు. అతడికి ఏ కర్తవ్యమూ ఉండదు. అతడు ఋణాలన్నిటి నుండి విముక్తుడవుతాడు. ప్రేమోన్మాదం ఎలాంటిదో తెలుసా? ఆ స్థితి ఏర్పడితే ప్రపంచాన్నే మరచిపోతాడు. అతి ప్రియమైన ఈ దేహాన్ని మరచిపోతాడు. చైతన్యులకు ఈ స్థితి కలిగింది. సముద్రమనే ఎరుక లేకుండా దానిలో దూకేశాడు, ఇసుకలో పదే పదే పొర్లాడాడు. ఆకలి లేదు, దప్పిక లేదు, నిద్ర లేదు, శరీర స్పృహే లేదు." ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు–500 029

ఫోన్: 040–2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద        సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# స్వామి వివేకానంద రథయాత్ర

**11 సెప్టెంబర్ 2012 నుంచి**
**12 జనవరి 2014 వరకు**

పర్యటనకు సిద్ధమైన 'స్వామి వివేకానంద రథం'

**భా**రతావని ఆధ్యాత్మిక వైభవాన్ని విశ్వవ్యాప్తం గావించిన యుగపురుషుడు స్వామి వివేకానంద. 1893 సెప్టెంబర్ 11వ తేదీన చికాగోలో చారిత్రాత్మక ప్రసంగంతో ప్రారంభమైన స్వామీజీ జైత్రయాత్ర ఖండఖండాంతరాల్లో జగజ్జేయమానంగా విజయఢంకా మోగించింది. మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని నేల నాలుగుచెరగులా చాటిన ఆ కారణజన్ముడి 150వ (2013- 2014) జయంతి వార్షికోత్సవాలను దేశవ్యాప్తంగా రామకృష్ణ సంఘం వైభవోపేతంగా నిర్వహించదలచింది.

ఈ మహోత్సవాలను పురస్కరించుకొని హైదరాబాదు రామకృష్ణ మఠం స్వామి వివేకానంద సందేశాన్ని తెలుగునాట నలుదిశలా పరివ్యాప్తం చేయాలన్న సత్సంకల్పంతో 'స్వామి వివేకానంద రథయాత్ర'ను నిర్వహించనుంది. ఈ రథయాత్ర - సర్వాలంకార భూషితమైన స్వామి వివేకానంద రథం, స్వామీజీ జీవిత విశేషాలతో కూడిన సంచార ప్రదర్శనశాల, స్వామి వివేకానంద సాహిత్య సంచార విక్రయశాలలతో కొనసాగుతుంది. ఆంధ్రరాష్ట్రమంతటా (2012 సెప్టెంబర్ 11 నుంచి 2014 జనవరి 12 వరకు) సాగే ఈ రథయాత్ర - విజయవాడ, రామకృష్ణ మిషన్; రాజమండ్రి, రామకృష్ణ మఠం; కడప, రామకృష్ణ మిషన్ కేంద్రాల సహకారంతో నిర్వహించబడును.

స్వామి వివేకానంద రథాన్ని ఆహ్వానించదలచుకునే కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని శ్రీరామకృష్ణ సేవాసమితులు, విద్యాసంస్థలు, ఇతర స్వచ్ఛంద సంస్థలవారు పూర్తి వివరాల కోసం రామకృష్ణ మిషన్, విజయవాడ (ఫోన్: 0866-2570799, 9985539422) కేంద్రాన్నీ; పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలవారు రామకృష్ణ మఠం, రాజమండ్రి (సెల్ : 9396673111)కేంద్రాన్నీ; కడప, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, ప్రకాశం జిల్లాలవారు రామకృష్ణ మిషన్, కడప (సెల్ : 9248545012) కేంద్రాన్నీ; హైదరాబాద్, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, వరంగల్, మెదక్, ఖమ్మం, నల్గొండ జిల్లాలవారు రామకృష్ణ మఠం, హైదరాబాదు (సెల్ : 8498011535) కేంద్రాన్నీ సంప్రతించవలెను.

ఈ రథోత్సవంలో రాష్ట్రప్రజలు, యువతీయువకులు, విద్యార్థినీ విద్యార్థులు, రామకృష్ణ-వివేకానంద భావప్రచార పరిషత్ సభ్యులు, కార్యకర్తలు, భక్తులు, శ్రేయోభిలాషులు సమధికోత్సాహంతో పాల్గొని, సేవలందించాలని కోరుతున్నాం. ఈ బృహత్ కార్యక్రమాన్ని దిగ్విజయం చేయడానికి మనమందరం కృషి చేద్దాం. స్వామి వివేకానంద సందేశామృతంతో తెలుగు ప్రజల హృదయాలను నింపుదాం.




**రామకృష్ణ మఠం**, దోమల్‌గూడ, హైదరాబాదు-29
సెల్ : 8498011535,
E-mail: sv150aprathayatra@rkmath.org



భగవత్సేవలో...
స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు
రామకృష్ణ మఠం, హైదరాబాదు.

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 9 సెప్టెంబర్ 2012

**ముదా కరాత్తమోదకం సదావిముక్తి సాధకం।**
**కలాధరావతంసకం విలాసి లోకరక్షకం॥**
**అనాయకైక నాయకం వినాశితే భదైత్యకం।**
**నతాశుభాశునాశకం నమామి తం వినాయకమ్॥**

ఆనందంతో భక్తులు సమర్పించిన మోదకములను స్వీకరించి, భక్తులకు మోక్షమును ప్రసాదించి, చంద్రుణ్ణి శిరోభూషణంగా ధరించి, లోకాలను సదా రక్షిస్తూ, నాయకుడు లేనివారికి నాయకుడై, రాక్షసులను సంహరించి, భక్తుల అశుభములను నాశనమొనరించే వినాయకుడికి సదా నమస్కరించుచున్నాను.

– *శ్రీగణేశపంచరత్నము*



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'కి ధన దానం చేసి ప్రోత్సహించాల్సిందిగా కోరుతున్నాం. దాతల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : | శ్రీ బుర్రా రాజశేఖర్, బి.టి.ఎమ్. 4వ స్టేజ్, బెంగుళూరు (కీ॥శే॥ బుర్రా మాధవరావుగారి జ్ఞాపకార్థం) | 10,116 |
| రాజ పోషకులు | : | శ్రీమతి కె. పద్మావతమ్మ, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్ (కీ॥శే॥ కె. మస్తానయ్యగారి జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | : | శ్రీ అల్లాడ రామకృష్ణ ఫౌండేషన్, నల్లజర్ల, ప.గో.జిల్లా (కీ॥శే॥ అల్లాడ గోపాలరావుగారి జ్ఞాపకార్థం) | 1,155 |
| పోషకులు | : | శ్రీ సి.హెచ్. నరసింహారావు, ఆర్.కె. పురం, సికింద్రాబాదు (సి.ఆర్.కె. ఫౌండేషన్-2011 చేబ్రోలు) | 1,000 |
| పోషకులు | : | శ్రీ పి. ప్రతాప్, వి.టి. కాలనీ, నల్లగొండ - 508 001 | 1,000 |
| పోషకులు | : | శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |
| పోషకులు | : | శ్రీమతి జి. రామకృష్ణమ్మ, మదనపల్లి, చిత్తూరు జిల్లా - 517 325 | 1,000 |
| పోషకులు | : | శ్రీ గూడ విశ్వేశ్వరరావు, లక్ష్మీనగర్, విజయవాడ - 520 011 | 1,000 |
| పోషకులు | : | శ్రీమతి బత్తుల అనిత కోటి రెడ్డి, మూలపేట, నెల్లూరు (కీ॥శే॥ బి. రామిరెడ్డి, పుల్లమ్మగార్ల జ్ఞాపకార్థం) | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1,500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ./డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** సూర్యకిరణ కాంతితో ప్రకాశిస్తూ, ధ్యానమగ్నుడై నాలుగు చేతుల్లో జపమాల, యోగదండం, పాశం, చెరుకుగడ ధరించి ఉన్న 'యోగ గణపతి'.

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math,
Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. - సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

# కోరిన విద్యల నొసగే దైవం...

ఏ కార్యాన్నైనా ప్రారంభించే ముందు ప్రథమంగా వినాయకుణ్ణి పూజించడం మన సంప్రదాయం. విఘ్నాలను తొలగించమని మానవులే కాదు దేవతలు సైతం విఘ్నేశ్వరుణ్ణి పూజిస్తారని పురాణాలు పేర్కొన్నాయి. వినాయకుణ్ణి పూజించడం వల్ల **'మహా విఘ్నాత్ ప్రముచ్యతే మహా దోషాత్ ప్రముచ్యతే...'** – 'మహా విఘ్నాలన్నీ తొలగిపోతాయి, మహా దోషాలన్నీ అంతమైపోతాయి' అని 'గణపతి అథర్వశీర్షోపనిషత్తు' వివరిస్తోంది.

మదిలో తలచిన వెంటనే విఘ్నాలను తొలగించే దేవుడు వినాయకుడు. అందువల్ల *'తలచితినే గణనాథుని తలచితినే విఘ్నపతిని, తలచిన పనిగా దలచితినే హేరంబుని, తలచితి నా విఘ్నముల దొలగుట కొఱకున్'* అంటూ వినాయకుణ్ణి ప్రార్థిస్తాం. ఎవరు ఏది కావాలని కోరుకుంటారో వారికి దాన్ని ప్రసాదించే సులభ ప్రసన్నుడు వినాయకుడు. సకల ఐశ్వర్యాలను కోరుకునేవారికి 'లక్ష్మీగణపతి'గా, సిద్ధులను కోరుకునేవారికి 'సిద్ధగణపతి'గా, విద్యలను కోరుకునే వారికి 'అక్షర గణపతి'గా... ఇలా గణపతిని ఏయే రూపాల్లో ఉపాసిస్తే ఆ యా ఫలితాలు సిద్ధిస్తాయని శాస్త్రాలు చెబుతున్నాయి.



**విద్యార్థులకు ప్రియతముడు:** జ్ఞానానికి అధిష్ఠాన దేవత అయిన వినాయకుణ్ణి **'ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే, కవిం కవీనా ముపమశ్ర వస్తమమ్...'** మేధావుల్లోకెల్లా మేటి మేధావి అయిన గణాధిపా! నీకు నమస్కారములు' అని యజుర్వేదం స్తుతిస్తోంది. అందుకే జ్ఞానప్రదాత అయిన వినాయకుడు విద్యార్థులకు అత్యంత ప్రియతముడయ్యాడు.

విద్యార్థులు వినాయక చవితి రోజున వినాయకుని ప్రతిమ ముందు పుస్తకాలను ఉంచి, తమకు విద్యాబుద్ధులను ఒసంగమని *'కోరిన విద్యలకెల్ల నొజ్జయై యుండెడి, పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్'* అంటూ భక్తి శ్రద్ధలతో గణనాథుణ్ణి ప్రార్థిస్తారు. అయితే మనకు కావలసిన జ్ఞానాన్ని ప్రసాదించమని అక్షర గణపతిని ప్రార్థిస్తే తప్పక అనుగ్రహిస్తాడు. కానీ ఆ జ్ఞాననిధిని వృద్ధి చేయడానికి మన వంతు కృషి చేయాలి.

శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులైన స్వామి బ్రహ్మానంద మహరాజ్ రోజూ క్రమం తప్పకుండా జపధ్యానాలు చేసేవారు. అది చూసిన ఒక శిష్యుడు 'స్వామీ! మీకు శ్రీరామకృష్ణులు ఆధ్యాత్మిక శక్తిని ధారపోశారు. మీరెన్నో దివ్యానుభూతులను పొందుతున్నారు. ఇంత ఆధ్యాత్మికశక్తి ఉన్న మీరు కూడా ఇంకా జపధ్యానాలు ఎందుకు చేస్తున్నారు?' అని ప్రశ్నించాడు. అందుకు స్వామి బ్రహ్మానంద మహరాజ్ 'తండ్రి నుండి వారసత్వంగా వచ్చిన సంపదను వినియోగిస్తే అది కొంత కాలానికి తరిగిపోతుంది. కానీ కుమారుడు తండ్రి ఇచ్చిన సంపదను అనుభవించడమే కాకుండా, తన కృషితో మరికొంత సంపదను ఆర్జిస్తే ఆ సంపద మరింత వృద్ధి చెందుతుంది కదా! అలాగే గురుదేవులు ఇచ్చిన ఆధ్యాత్మిక సంపద తరిగిపోకుండా మన వంతు సాధనలు చేస్తే ఆ సంపద మరింత వృద్ధి చెందుతుంది' అని సమాధానమిచ్చారు.

విద్యల రాజు వినాయకుడు ప్రసాదించిన జ్ఞాననిధిని వృద్ధి చేసుకోవాలంటే జ్ఞానార్జనకు అవసరమైన ఏకాగ్రత, ప్రశాంతత, పరిశుద్ధతలను అలవరచుకోవాలి. జ్ఞానదేవతగా విరాజిల్లుతున్న వినాయకుడిలో ఈ మూడు లక్షణాలు సంపూర్ణంగా ఉన్నాయని ఆయన జీవితాన్ని పరిశీలిస్తే అవగతమవుతుంది.

**ఏకాగ్ర చిత్తం:** ఈ ప్రపంచంలో మనం ఎన్నో విషయాలకు సంబంధించిన పరిజ్ఞానాన్ని సంపాదించడానికి ప్రయత్నిస్తాం. కానీ ఆ జ్ఞానాన్ని శీఘ్రంగా పొందాలంటే ఏకాగ్ర చిత్తంతో అధ్యయనం చేయాలి. ఏకాగ్రత లేని మనస్సుతో ఎన్ని గంటలు శ్రమించినా, ఎన్ని రోజులు కృషి చేసినా అది వేడి పెనం మీద పడిన నీటి చుక్కలా వెంటనే ఆవిరైపోతుందే కానీ ఎంతోకాలం నిలవదు. అందుకే స్వామి వివేకానంద 'జ్ఞాన సముపార్జనకు అత్యంత ముఖ్యమైనది ఏకాగ్రత. ఏకాగ్రత లేనిదే దేనినీ సాధించలేం' అని ఏకాగ్రత ప్రాధాన్యాన్ని నొక్కి వక్కాణించారు.

మనస్సును ఒక విషయంపై ఒక్క క్షణమైనా ఏకాగ్రం చేయలేకపోతున్నవారు ఏకాగ్రత అంటే ఎలా ఉండాలో వినాయకుని జీవితంలోని ఓ సంఘటన ద్వారా తెలుసుకోవచ్చు.

మహాభారత కథను ప్రపంచానికి అందించాలన్న ఆలోచన వ్యాసుడికి కలిగింది. 'నేను చెబుతుంటే ఈ మహాగ్రంథాన్ని వ్రాయగల సమర్థులెవరైనా ఉన్నారా?' అని బ్రహ్మను అడిగాడు. 'నీ సంకల్పాన్ని నెరవేర్చగల సమర్థుడు వినాయకుడు ఒక్కడే' అని బ్రహ్మ సలహా ఇచ్చాడు. వెంటనే వ్యాసుడు వినాయకుణ్ణి ప్రత్యక్షం చేసుకొని తన విన్నపాన్ని తెలిపాడు. అందుకు వినాయకుడు అంగీకరించాడు. కానీ వ్యాసుడు, 'గణనాథా! నేను భారత కథను చెబుతూ ఉంటాను. మీరు ఆగకుండా వ్రాస్తూ ఉండాలి' అని షరతు పెట్టాడు. అందుకు వినాయకుడు కూడా

'నేను ఒకసారి వ్రాయడం మొదలు పెడితే నా ఘంటం ఆగదు. కాబట్టి అలా ఆగకుండా కథను చెప్పాలి' అని షరతు పెట్టాడు. అందుకు వ్యాసుడు, 'నేను చెప్పినదాన్ని అర్థం చేసుకుంటూ వ్రాయాలి' అని వినాయకునికి మరో షరతు పెట్టాడు. ఒకరి షరతులకు మరొకరు అంగీకరించిన తరువాత వ్యాసుడు మహాభారత కథను చెబుతూ ఉంటే వినాయకుడు వ్రాశాడు. ఆ విధంగా 'పంచమ వేదం'గా ప్రఖ్యాతి గాంచిన మహాభారతం మనకు లభించింది. వ్యాసుడు నిర్విరామంగా చెప్పిన భారత కథను అర్థం చేసుకుంటూ, నిరాటంకంగా వ్రాసిన వినాయకుని ఏకాగ్రతాశక్తి అనితర సాధ్యమైనది.

ఏ కార్యాన్నైనా సాధించడానికి ఏకాగ్రత అత్యంత ముఖ్యమని చెబుతూ స్వామి వివేకానంద, 'ధనార్జనకుగానీ, దైవారాధనకుగానీ, ఇంకే పని చేసినాగానీ ఏకాగ్రత ఎంత అధికంగా ఉంటే అంత నైపుణ్యంతో ఆ పనిని నెరవేర్చగలుగుతాం' అని అన్నారు.

**ప్రశాంత చిత్తం:** జ్ఞాన సముపార్జనకు ఏకాగ్రచిత్తం చాలా అవసరం అని తెలుసుకున్నాం. అయితే మన మనస్సును ఏ విషయంపైన అయినా ఏకాగ్రం చేయాలంటే ప్రశాంతత అవసరం. అలజడితో అల్లకల్లోలమైన చిత్తాన్ని ఏ విషయం పైనా నిమగ్నం చేయలేం. చంచలమైన మనస్సుతో సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనలేం.

దేవగణాలకు అధిపతిని నియమించాలని పార్వతీ పరమేశ్వరులు సంకల్పించారు. అందుకు వినాయకుడు, కుమారస్వామి – వీరిద్దరిలో ఎవరు సమర్థులో తెలుసుకోవాలని 'ముల్లోకాలలోని పుణ్యతీర్థాలను సందర్శించి, ఎవరు ముందుగా వస్తారో వారిని గణాధిపతిగా నియమిస్తాను' అని శివుడు ఓ పోటీ పెట్టాడు. ఈ విషయాన్ని విన్న వెంటనే కుమారస్వామి నెమలి వాహనంపై పయనమయ్యాడు. కానీ మూషిక వాహనంపై ముల్లోకాలను సందర్శించి రావడం వినాయకునికి అసాధ్యం. వినాయకుడు తన అసహాయతకు అలజడి చెందకుండా, మనోనిశ్చలతను కోల్పోకుండా ప్రశాంతంగా పరిష్కారాన్ని ఆలోచించాడు. 'తల్లితండ్రులకు ప్రదక్షిణ చేస్తే ముల్లోకాల్లోని పుణ్యతీర్థాలను సందర్శించిన ఫలితం లభిస్తుంది' అన్న ధర్మసూక్ష్మాన్ని గ్రహించిన వినాయకుడు వెంటనే పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షిణ చేశాడు. ఆదిదంపతులు వినాయకుని బుద్ధి కుశలతకు సంతసించి, గణాధిపతిగా నియమించారు.

'మనస్సు ప్రశాంతతతో ఉన్నప్పుడే మన శక్తి అంతా కార్యసాధనలో వినియోగపడుతుంది. ఈ ప్రపంచంలో మహోన్నతులుగా ప్రభవించిన వారంతా ప్రశాంత చిత్తం గలవారే' అని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు. కాబట్టి ఒక విషయంపై మనస్సును ఏకాగ్రం చేయాలన్నా, సమస్యలను పరిష్కరించాలన్నా ప్రశాంతచిత్తం తప్పనిసరన్నది ఈ కథ సారాంశం.

**పరిశుద్ధ చిత్తం:** మనస్సు ఏకాగ్రతను సాధించాలంటే ప్రశాంతచిత్తం అవసరమని తెలుసుకున్నాం. మరి ప్రశాంతతను సాధించాలంటే పరిశుద్ధచిత్తం అవసరం. అందుకు మనస్సులో ఎలాంటి వికారభావాలూ కలగకుండా జాగ్రత్త వహించాలి. అది బ్రహ్మచర్యాన్ని అభ్యసించడం వల్లనే సాధ్యమవుతుంది.

ఒకసారి వినాయకుడు చిన్నప్పుడు ఆడుకుంటూ పిల్లిని కొట్టాడు. పిల్లికి ముఖంపై గాయమైంది. ఆట ముగించుకొని వినాయకుడు తన తల్లి పార్వతి దగ్గరకి వెళ్ళాడు. ఆమె ముఖంపై గాయాన్ని చూసి ఆశ్చర్యంతో 'అమ్మా! నీ ముఖంపై ఈ గాయం ఎలా అయ్యింది?' అని అడిగాడు. అందుకు పార్వతీదేవి, 'నాయనా! సర్వజీవుల్లో ఉన్నది నేనే. నువ్వు పిల్లి ముఖాన్ని గాయపరచడం వల్ల నా ముఖానికి కూడా గాయమైంది' అని చెప్పింది. సర్వజీవుల్లోనూ తల్లి పరమేశ్వరి కొలువై ఉందని తెలుసుకొన్నాడు వినాయకుడు. అలా సర్వజీవుల్లోనూ తల్లినే దర్శించిన వినాయకుని మనస్సులో ఎలాంటి అపవిత్ర భావాలూ కలిగేందుకు తావే లేదు.



శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులైన స్వామి శివానంద మహరాజ్‌ను ఒక శిష్యుడు బ్రహ్మచర్యపాలన చాలా కఠినంగా ఉందనీ, అందుకు పరిష్కారం చూపమనీ ప్రాధేయపడ్డాడు. అప్పుడు 'ప్రతి స్త్రీని మన సొంత తల్లి, సోదరి అనే భావంతో చూడగలిగినప్పుడు మనస్సులో ఎలాంటి చెడు తలంపులూ తలెత్తవు' అని సూచించారు.

స్వామి వివేకానంద సైతం 'బ్రహ్మచర్యాన్ని పాటిస్తే అతి తక్కువ సమయంలో సకల విద్యల్నీ సునాయాసంగా ఆపోశన పట్టవచ్చు. బ్రహ్మచర్యాన్ని పాటించకపోవడం వల్లనే మన దేశం పతనావస్థకు చేరువైంది' అని మన ప్రస్తుత పరిస్థితిని గుర్తుచేస్తూ, మన అభివృద్ధికి బ్రహ్మచర్యపాలన అనివార్యమంటూ దిశానిర్దేశం చేశారు.

జ్ఞానసముపార్జనకు ముఖ్య సాధనాలైన ఏకాగ్ర చిత్తం, ప్రశాంత చిత్తం, పరిశుద్ధ చిత్తాలను ప్రసాదించమని కోరిన విద్యలకెల్ల నొజ్జయై ఉన్న పార్వతీ తనయుణ్ణి ప్రార్థిద్దాం. ❖

**ఎవరైనా పన్నెండేళ్ళు బ్రహ్మచర్యాన్ని పాటిస్తే వారిలో మేధానాడి వికసిస్తుంది. అత్యంత సూక్ష్మ విషయాలను సైతం అవలీలగా గ్రహించేటంత శక్తి సంపన్నులవుతారు.** - *శ్రీరామకృష్ణ పరమహంస*

యుగపురుషుడు, ఈశ్వరప్రేరిత మహాప్రవక్త స్వామి వివేకానంద భారతీయులకే కాదు, సమస్త మానవాళికీ ఆశాజ్యోతి. ఆ దివ్యపురుషుని 150వ జయంత్యుత్సవాలను (2013-2014) యావత్ ప్రపంచం జరుపుకోనుంది. ఈ నేపథ్యంలో తెలుగునాట స్వామీజీ ఘనతను చాటుతూ, వారి బోధనలను పరివ్యాప్తం చేసే సదాశయంతో 11 సెప్టెంబరు 2012 నుంచి 12 జనవరి 2014 వరకు రథయాత్ర సాగిపోనుంది. తెలుగునేల నాలుగు చెరగులా పర్యటించనున్న ఈ రథయాత్రకు స్వామీజీ అభిమానులందరూ సారథులే! ఆయన ఆదర్శాలకు విశేష వారధులే!

చికాగో మహాసభలో విశ్వవిజేతగా నిలిచి భారతావనిలో అడుగిడిన స్వామీజీకి ఆనాడు సామాన్యుల నుంచి మహారాజుల వరకు బ్రహ్మరథం పట్టారు, నీరాజనాలర్పించారు. 1893 సెప్టెంబరు 11న చికాగోలో ఆరంభమైన స్వామి వివేకానంద జైత్రయాత్ర ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈనాటికీ కొనసాగుతోందంటే అతిశయోక్తి కాదు. స్వామీజీ ప్రపంచ సర్వమత మహాసభల్లో మహాప్రవక్తగా పేరుగాంచి 1897 జనవరిలో కొలంబో మీదుగా భారతావనికి పయనమయ్యారు. కొలంబోలో ఆయనకు కనీవినీ ఎరుగని రీతిలో ఘనస్వాగతం లభించింది. మతాలకు అతీతంగా హిందువులు, బౌద్ధులు, మహమ్మదీయులు, క్రైస్తవులు దాదాపు పదిహేనువేల మంది స్వామీజీని ఊరేగింపుగా తమ వీథులగుండా పర్యటింపచేసి, పులకించిపోయారు.

# మహనీయుని మనోరథానికి మనమే సారథులం!



స్వామీజీ 1897 జనవరి 26న భారత భూభాగంలోకి అడుగుపెట్టారు. ఆ క్షణంలో ఆ మహనీయుడిని స్వాగతించే అదృష్టం తమిళనాడులోని రామనాథపురం మహారాజు భాస్కరసేతుపతికి దక్కింది. స్వామీజీకి పాదరక్షలను తొడుగుతూ 'అమూల్యమైన వజ్రాన్ని శిరస్సున ధరించటం కన్నా, మీ పాదస్పర్శే మహద్భాగ్యంగా పరిగణిస్తున్నాను' అని భాస్కరసేతుపతి తన భక్తి శ్రద్ధలను వెల్లడించారు. స్వామి వివేకానంద ఆసీనులై ఉన్న రథాన్ని భాస్కరసేతుపతి స్వయంగా లాక్కుంటూ వెళ్ళారు.

మద్రాసులో జరిగిన ఊరేగింపులో అసంఖ్యాకమైన అభిమానులు స్వామీజీని కలుసుకున్నారు. వీరిలో విద్యార్థులే అధికసంఖ్యాకులు. వీరంతా స్వామీజీ ఎంతచెప్పినా వినకుండా రథం గుర్రాలు విప్పి, స్వయంగా తామే స్వామీజీ రథాన్ని లాక్కుంటూ వెళ్ళారు. ఇలా భారతావని యావత్తూ ఆనాటి నుంచి స్వామి వివేకానందను విశ్వవిజేతగా, వివేక భాస్కరునిగా కీర్తించింది.

అలాంటి ఆ విశ్వనాయకుడిని విరాట్‌రూపంగా దర్శించుకొని, స్మరించుకొని, ఆ అడుగుజాడల్లో నడిచే అవకాశం, అదృష్టం మనకు ఇప్పుడు లభించింది. రథయాత్ర అనగానే స్వామీజీకి ఎంతో ఇష్టమైన కఠోపనిషత్తు గుర్తొస్తుంది.

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ॥**

'శరీరాన్ని రథంతో పోలుస్తూ, ఆత్మే అందులో ప్రతిష్ఠితమైన మూర్తి అనీ, బుద్ధే ఆ రథానికి సారథి అనీ, ఇంద్రియాలనే గుర్రాలను మనస్సనే కళ్ళెం నియంత్రిస్తుంద'ని కఠోపనిషత్తు వర్ణిస్తుంది. ఇలా మన జీవనరథం పరమగమ్యానికి చేరుకోవటానికి స్వామి వివేకానందను మనలో ప్రతిష్ఠించుకోవాలి. స్వామీజీ ధీరవచనాలే దారిదీపాలై మనకు తోవచూపుతాయి.

స్వామి వివేకానంద రథయాత్రను ఒక వేడుకలా కాకుండా, మన జీవితాలకు వికాసాన్నిచ్చే వెలుగురేఖల్లా ఉపయోగించుకుందాం! రథయాత్రను విజయవంతం చేయడమంటే, స్వామీజీ ఆశయాలను ఆచరణలో పెట్టడమే! స్వామీజీ రథాన్ని వీక్షించినప్పుడు ఒక్కసారి ఆయన వాగ్వైభవాన్ని, విశ్వతేజస్సును మననం చేసుకుందాం! విశేషంగా స్వాగతం పలుకుదాం! వారి బాటలో నడుస్తూ మన సమస్త నైరాశ్యాన్ని నిర్మూలనం చేసుకొని, ఆశాజ్యోతులను వెలిగించుకుందాం! స్వామీజీ సాహిత్యాన్ని చదివి సర్వశక్తిమంతులుగా మారినప్పుడే స్వామి వివేకానంద రథయాత్ర దిగ్విజయం... జయప్రదం. ❖

# జీవన పాఠాలు నేర్పిన పరమహంస

– మహేంద్రనాథ్ గుప్త*

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఆధ్యాత్మిక జీవితంలోనే కాదు నిత్యజీవన వ్యవహారాలలో కూడా పురోగతిని సాధించే ఎన్నో అంశాలను మాకు బోధించారు. పూజగదిలో ఎంత పవిత్రంగా, ధర్మబద్ధంగా ప్రవర్తిస్తామో, బాహ్య ప్రపంచంలోనూ అదే తీరులో నడుచుకోవాలని సూచించేవారు. ఆహారం తీసుకోవడం దగ్గర నుంచి ఆహార్యం వరకు ఎన్నో అంశాలలో, ఆయన నేటి ఆధునిక మానసిక శాస్త్రవేత్తలను మించిన విశ్లేషణ గావించారు. రోజువారీ పనుల్లో అప్రమత్తంగా ఉండని వ్యక్తిలో, శ్రద్ధతో ఆ యా పనులను నిర్వర్తించని వ్యక్తిలో ఆధ్యాత్మిక పరిణతి సాధ్యపడదు అనేవారు గురుదేవులు.

పరిశుభ్రత, పొదుపు, ఆహార నియమాలు తదితర సాధారణ విషయాల్లో కూడా వారు ప్రత్యక్ష శిష్యులకు ఎన్నో మార్గదర్శక సూత్రాలను గుర్తుచేస్తూ ఉండేవారు. వివేకంతో, విచక్షణతో మసలుకోవాలనీ, సాత్త్వికంగా ఉండాలే కాని, మూర్ఖంగా మారిపోకూడదనీ, ఇతరులకు మనల్ని మోసగించే అవకాశం ఇవ్వకూడదని ఎప్పటికప్పుడు మాలాంటి శిష్యబృందానికి ఏదో ఒక రూపంలో పాఠాలు చెబుతూనే ఉండేవారు.

**శుచి...శుభ్రత :** బాహ్య పరిసరాలతో పాటు వ్యక్తిగతంగా, ఆంతరంగికంగా శుచిగా ఉండాలంటూ తనూ నిరంతరం అదే స్థితిలో కనిపించేవారు శ్రీరామకృష్ణులు. అపరిశుభ్రంగా ఉండడం, నిర్లక్ష్యంగా వ్యవహరించడం తమోగుణ లక్షణాలని స్పష్టంగా చెప్పేవారు. పైగా భగవంతుడి గురించి ఆలోచిస్తూ, శరీరస్పృహ లేకుండా ఉంటామనే వాదనలను ఆయన తోసిపుచ్చేవారు. పరిశుద్ధంగా ఉండని వ్యక్తి మనస్సులో దేవుడు కొలువుండడని తేల్చిచెప్పేవారు. మానసిక, శారీరక పవిత్రత ఎంతో అవసరమని ఉద్ఘాటించేవారు. అదే విధంగా ఆహారపదార్థాలను, రోజువారీగా ఉపయోగించే ఇతర పదార్థాలను ఎవరైనా వృథా చేయడాన్ని శ్రీరామకృష్ణులు సహించలేక పోయేవారు.

ఒకసారి కాశీపూర్‌లో ఒక భక్తుడు నిమ్మకాయను ఎక్కువ ముక్కలు కోసి అనవసరంగా పడేయడంతో, 'భక్తులు తమ కష్టార్జితంతో మనకు ఇచ్చిన డబ్బుల్ని ఇలా వృథా చేయకూడదు. దుబారా చేయడం కన్నా పిసినారిగా ఉండడం మంచిది' అని శ్రీరామకృష్ణులు అనేవారు. అలాగే ఎవరైనా చిరిగిన, మురికిపట్టిన దుస్తులను ధరిస్తే 'అతుకులు కుట్టిన, మురికిపట్టిన వస్త్రధారణ చేసేవారి నుంచి సౌభాగ్యం దూరమవుతుంది' అనేవారు.

**క్రమశిక్షణ... కట్టుబాటు:** శ్రీరామకృష్ణులు క్రమశిక్షణకూ, క్రమపద్ధతికీ అత్యంత ప్రాధాన్యమిచ్చేవారు. ఎవరైనా వాటిని అతిక్రమిస్తే నిర్మొహమాటంగా సరిదిద్దేవారు. ఉదాహరణకు వారు ఉపయోగించే గదిలో ఏ వస్తువైనా ఎక్కడుండాలో అక్కడే ఉండాలనీ, ఆ వస్తువులను ఉపయోగించిన తరువాత యథాస్థానంలో ఉంచాలనీ ఆకాంక్షించేవారు. ఇలాంటివన్నీ వ్యక్తి జాగరూకతనూ, అప్రమత్తతనూ సూచిస్తాయని చెప్పకనే చెప్పేవారు. ఎవరైనా తాము ఇచ్చిన మాటను నిలబెట్టుకోక పోయినా శ్రీరామకృష్ణులు దానిని తీవ్రంగా పరిగణించేవారు. అలాంటి మనస్తత్వం ఆ వ్యక్తి గౌరవానికి మచ్చగా మారిపోతుందనేవారు.

అదే విధంగా ఏ విషయంలోనూ ఎవరిపైనా ఆధారపడడం మంచిది కాదనేవారు; అసలు ఆధారపడే స్వభావాన్ని విడనాడమనే వారు. ప్రతి చిన్నపనికీ పరాధీనతే అయితే మనం బలహీనమైపోతామనీ, అందుకే భోజనం విషయంలో కూడా వేరెవరినో ఆశ్రయించే అవసరం లేకుండా స్వయంపాకాన్ని అలవాటు చేసుకోవాలనీ సూచించేవారు. ఒకరి అధీనంలో ఉంటూ స్వాతంత్ర్యాన్ని కోల్పోతే లౌకికంగానే కాక, ఆధ్యాత్మికంగా కూడా పురోభివృద్ధిని సాధించలేరని హితవు పలికేవారు.

నిత్యజీవన ప్రయాణంలో చిన్న చిన్న విషయాల్లోనే తప్పటడుగులు వేస్తూ, ఒక క్రమపద్ధతిలో నడుచుకోలేని వ్యక్తులు ఉన్నతమైన ఆదర్శాలను నెరవేర్చుకోలేరని స్పష్టం చేసేవారు. ఈ మనస్సు ద్వారానే ఆ భగవంతుడిని చేరుకోగలమనీ, మరి అలాంటి మనస్సుకు మంచి శిక్షణ ఇచ్చుకోలేకపోతే అది వికాసం పొందే అవకాశమే లేదనీ భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఉద్ఘాటించారు. ❖

(*శ్రీరామకృష్ణ కథామృత రచయిత – మాస్టర్ మహాశయుడు 'మ'గా ప్రసిద్ధులు)

**మలినపడిన, చిరిగిన వస్త్రాలను ధరించడం; అతిగా భుజించడం; తినే పదార్థాలను వృథా చేయడం; సంధ్యా సమయాల్లో నిద్రించడం లాంటి అలవాట్లు ఉన్నవారిని లక్ష్మీదేవి విడిచిపెడుతుంది.** - చాణక్య నీతి




జటిలో ముణ్డీ లుంచిత కేశః
కాషాయాంబర బహుకృత వేషః ।
పశ్యన్నపి చ న పశ్యతి మూఢః
ఉదర నిమిత్తం బహుకృత వేషః ॥

# సన్న్యాసం సమున్నతం

– స్వామి జ్ఞానదానంద

భారతీయ ధార్మికతలో, ఇతిహాస పాత్రచిత్రణలో ఆదర్శప్రాయమైన ఘట్టాలున్నాయి. పరమ కిరాతకులు కూడా పారమార్థిక ప్రస్థానంలో తరించిన ఉదంతాలున్నాయి. సమాజం చిన్నచూపు చూసే వృత్తిలో ఉన్నా, ఆచరించే తీరులో మాత్రం ఎలాంటి హీనభావం కానీ, కాపట్యం కానీ చూపలేదు. ఉదాహరణకు రత్నాకరుడు దారిదోపిడీలు చేసే దాష్టికుడు. అయినా నారదుడి ఒకే ఒక్క ఉపదేశంతో మధురమైన కావ్యకర్తగా, వాల్మీకి కవిగా పరివర్తన చెందాడు; పరమపావనమైన రామాయణాన్ని రచించాడు. మాంసాన్ని విక్రయించే వృత్తిని ఎంచుకున్న ధర్మవ్యాధుడనే ఓ సామాన్య వ్యక్తి కేవలం ధార్మికమైన తన పనితీరుతో, తల్లితండ్రుల సేవతో బ్రహ్మజ్ఞానిగా మారిపోయాడు. సాక్షాత్తూ కౌశికుడి లాంటి మహర్షికే ఆదర్శమయ్యాడు. ఇలా ఈ పావన భారతావనిలో వృత్తి ఏదైనా ధార్మికతే అంతస్సూత్రం.

కానీ మరోవైపు దురదృష్టవశాత్తూ సర్వోత్కృష్టమైన ఆధ్యాత్మికత అన్వేషణలో కపట వేషధారులు పుట్టుకొస్తున్నారు. ఇలా ఏ కొందరి నిర్వాకం వల్లనో పూర్తిగా సన్న్యాస ఆశ్రమానికే అపకీర్తి దాపురిస్తోంది. ఆధ్యాత్మికత పేరుతో, ధార్మిక జీవనం పేరుతో ఎన్నో వేషాలు వేసుకొని లోకాన్ని మోసగించే నాటకాలరాయుళ్ళు సమాజాన్ని తప్పుదోవ పట్టిస్తూ ఉంటారు. అసలు తత్త్వాన్ని మరచి తమ స్వలాభం కోసం మూలాన్నే మార్చేసి ప్రబోధించేవారు అన్ని మతాల్లోనూ ఉన్నారు. పొట్టకూటి కోసం భక్తులను పలువిధాల ప్రలోభపెట్టి, పక్కదారి పట్టించే స్వార్థపరులను శ్రీఆదిశంకరాచార్యుల ప్రముఖ శిష్యులు తోటకాచార్యులు 'భజగోవిందం'లో ఆనాడే ఎండగట్టారు.



జడలు కట్టిన తలవెంట్రుకలతో ఒకడు, నున్నగా గుండు గీసుకున్నవాడు మరొకడు, కాషాయ వస్త్రాలు కట్టినవాడు ఇంకొకడు– ఇవన్నీ కేవలం లోకం కోసం చేసే వాళ్ళు కళ్ళుండీ చూడని మూర్ఖులు. ఇవన్నీ పొట్టకూటి కోసం వేసే పరిపరి విధాలైన వేషాలంటూ...

**జటిలో ముణ్డీ లుంచిత కేశః**
**కాషాయాంబర బహుకృత వేషః**
**పశ్యన్నపి చ న పశ్యతి మూఢః**
**ఉదర నిమిత్తం బహుకృత వేషః** అని చురకలు వేశారు. అతి పవిత్రమైన ఆధ్యాత్మిక తులసివనంలో, గంజాయి మొక్కల్లా పుట్టుకొస్తున్న వ్యక్తులతో అప్రమత్తంగా ఉండాలి.

**భక్తి పేరుతో బూటకం :** సామాన్యుల బలహీనతల్ని ఆసరాగా చేసుకొని వారి జీవితాలతో ఆటలాడుకునే కపట ధార్మికులు నేటి సమాజంలో పెరిగిపోయారు. భక్తులు కూడా భక్తికీ, భగవంతుణ్ణి చేరుకోవడానికీ ఎలాంటి శ్రమ, సాధన అవసరం లేని అడ్డదారుల కోసం వెంపర్లాడుతున్నారు. ఆధ్యాత్మిక పయనంలో మధ్యవర్తులను వెతుక్కుంటున్నారు. మోసాల మాయలో చిక్కుపడిపోతున్నారు. ఎందరో నకిలీ స్వామీజీలు పుట్టుకురావడానికి అవకాశం కల్పిస్తున్నారు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస 'భగవన్మార్గంలో బూటకం ఎన్నటికీ మంచిది కాదు. బూటకపు వేషధారణ సరికాదు. మనస్సు వేషానికి తగ్గట్లు లేనట్లయితే, అది క్రమేణా పతనం చెందుతుంది. అదే విధంగా విషయానురక్తి కలిగి ఉన్నవాడు సన్న్యాసం స్వీకరించినా ఒరిగేది ఏమీ లేదు. సన్న్యాసి విషయానురక్తుడవడం ఉమ్మివేసి మరలా ఆ ఉమ్మినే మింగడం లాంటిది' అన్నారు.

నలుగురు చూస్తున్నారని బాహ్యంగా ధార్మికవేత్తల్లా వేషాలు ధరిస్తూ, అంతరంగంలో మాత్రం అనైతికమైన ఆలోచనల్ని నింపుకొనేవారు నశించిపోతారు. అందుకే భక్తి పేరుతో బహు వేషాలు వేసేవారిని మూర్ఖులుగా నిర్వచిస్తున్నారు ఈ 'భజగోవిందం'లో తోటకాచార్యులు. నిజానికి ఆధ్యాత్మికతలో, సన్న్యాస ఆశ్రమంలో ఎలాంటి

రహస్యాలూ ఉండవు. అవన్నీ స్వచ్ఛమైన స్ఫటికంలా పారదర్శకమైనవి. ఏ మత నియమమైనా మనసా, వాచా, కర్మణా ఒకేలా ధర్మబద్ధంగా ఉండడం!

**సన్న్యాస ఆశ్రమం సమున్నత ఆదర్శం :** గృహస్థులనూ, భక్తులనూ సన్మార్గంలో నడిపి, వారి జీవననావకు చుక్కానిగా నిలిచే వ్యక్తే నిజమైన 'సన్న్యాసి'. సర్వసంగ పరిత్యాగిగా సంపూర్ణంగా భగవంతునిపై ఆధారపడి జీవించే అలాంటి మహానుభావుడి సన్నిధిలో పారలౌకిక ప్రపంచాన్ని పరిచయం చేసుకోవాలని జిజ్ఞాసువులు తపిస్తూ ఉంటారు. కానీ ఇంతటి మహోన్నతమైన సన్న్యాస ఆశ్రమాన్ని స్వీకరించి కూడా, మళ్ళీ కామినీ కాంచనాల వైపో, పేరు ప్రఖ్యాతుల వైపో మనస్సు మరలి రాగద్వేషాలకు లోనైతే సమాజం హర్షించదు. అందుకే భగవద్గీతలో (5.3) శ్రీకృష్ణ భగవానుడు...

**జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే॥**

'ఎవరు రాగద్వేషాలకు వశుడు కాడో అతడు సదా సన్న్యాసి అని తెలుసుకోమనీ, ద్వంద్వాతీతుడైనవాడు సులభంగా కర్మబంధాల నుంచి విముక్తుడవుతాడ'నీ స్పష్టం చేస్తాడు. అయితే ఆధునిక ప్రపంచంలో స్వామీజీలుగా, వేదాంతవేత్తలుగా ప్రచారంలో ఉన్న కొంతమంది వ్యక్తులు ఈ మౌలిక సూత్రాన్ని మరచిపోతున్నారు. వివేక వైరాగ్యాలకు బదులు విషయలౌల్యంలో పడి తమ ప్రాథమిక ఆదర్శాన్నీ, కర్తవ్యాన్నీ విస్మరిస్తున్నారు. వర్తమాన వ్యవహారాల పరంగా గృహస్థులతో కొంత కలివిడిగా ఉంటూ, వారి సంశయాలను తీరుస్తూ, వారి ఆధ్యాత్మిక పురోగతికి సాయపడడంలో తప్పు లేదు. కానీ అది మొదటికే మోసం తెచ్చి, తమ సన్న్యాస ఆశ్రమ ధర్మానికి కూడా విఘాతం కలిగించే స్థాయిలో పరిధి దాటకుండా జాగ్రత్తపడాలి.

**ఆధ్యాత్మికత... ఆడంబరాలు :** స్వామీజీలనూ, ఆధ్యాత్మిక గురువులనూ భగవంతుడికి ప్రతినిధులుగా పూజించుకోవడం భారతీయ సనాతన సంప్రదాయం. అయితే పూజలందుకునే ఆ స్థాయికి తాము అర్హులమా? కాదా? అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. ఆ స్థానానికి సముచితమైన రీతిలో తమ జీవితాన్ని మలచుకోవాలి. భౌతికమైన ఆడంబరాలకూ, ఆర్భాటాలకూ దూరంగా ఉంటూ గృహస్థులకు దారిదీపాల్లా నిలవగలగాలి. కానీ, నేడు కొంతమంది స్వామీజీలు ప్రాపంచికులు కూడా అచ్చెరువొందే సౌకర్యాలను అనుభవిస్తున్నారు. అందుకే 'శ్రీకాళహస్తీశ్వర శతకం'లో ధూర్జటి ఆవేదన పడుతూ...

**అయవారై చరియింపవచ్చు, తమ పాదాంభోజ తీర్థంబులన్ దయతో గొమ్మనవచ్చు, సేవకుని అర్థప్రాణ దేహాదుల న్నియు మా సొమ్మనవచ్చు గాని, సిరుల న్నిందింప, నిన్నాత్మని ష్క్రియతన్ కానగరాదు, పండితులకున్ శ్రీకాళహస్తీశ్వరా!**

'ఓ పరమశివా! కొందరు గురువులమని చెప్పుకొంటూ తిరగవచ్చు. పాదపూజలు చేయించుకొని తనను సేవించు కొమ్మని, శిష్యులకు తమ కాళ్ళు కడిగిన నీటిని తీర్థంగా ఇవ్వవచ్చు. శిష్యుల ధన, శరీర, ప్రాణాదులు తమ ఆస్తులని భావించి పుచ్చుకొనవచ్చు. ఇలా గురువులనుకునే ఆ పండితులు కూడా సంపదలను ఆశించకుండా తిరస్కరించడం లేదు; కర్మలను విడిచినవారై తమ మనస్సులందు నిన్ను దర్శించుకునే ప్రయత్నం చేయడం లేదు' అని అంటారు.

రామకృష్ణ సంఘానికి సర్వోన్నత అధ్యక్షులుగా వ్యవహరించిన స్వామి రంగనాథానంద ప్రపంచదేశాలన్నీ పర్యటించి ప్రసంగాలతో ప్రఖ్యాతి గాంచినా, వారు ఏ ఒక్కరోజూ విలాసవంతమైన జీవితాన్ని గడపలేదు. పరిమితమైన సాధారణ వస్తువులతోనే జీవించేవారు. మనం ఆచరించేదే ఇతరులకు బోధించాలన్న భావంతో భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన 'అపనీ ఆచరీ ధర్మ జీవేరే సిఖావ్' అన్న మాటను గుర్తుచేసేవారు. నిరాడంబరంగా జీవించమని భక్తులకు చెబుతూ, మనం ఆర్భాటంగా జీవిస్తే అర్థం లేదని వివరించేవారు.

**పారమార్థిక తృష్ణ పలాయనవాదం కాదు! :** లౌకిక ప్రపంచంలో బతకలేనివారు ఆధ్యాత్మికత వైపు మొగ్గు చూపుతారని చాలామంది పొరపాటు పడతారు. కానీ పారమార్థికత అనేది పలాయనవాదం కాదు. సర్వోన్నతమైన త్యాగానికి ప్రతీకగా కాషాయాన్ని ధరించి, పారమార్థికతను అన్వేషించే ధన్యాత్మక సాధుపుంగవులు ఎందరో ఉన్నారు. అలాంటి వారికి తలవంపులు తెచ్చేలా కొందరు ఆ ఆహార్యాన్ని ధరించి అపరాధాలు చేస్తే పాపాన్ని మూట గట్టుకున్న వారవుతారు. శ్రీశంకర భగవత్పాదుల శిష్యవరేణ్యులు చెప్పినట్లు కళ్ళుండీ చూడలేని మూర్ఖులుగా ముద్రపడిపోతారు. ఇలాంటి వారిని ఉద్దేశిస్తూ యోగి వేమన కూడా...

**అంతరంగమందు అపరాధములు చేసి**
**మంచివాని వలెనె మనుజుడుండు**
**ఇతరు లెరుగకున్న నీశ్వరుడెరుగడా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!** అంటాడు.

నిజమే! మనిషి తన మనస్సులో ఎన్నో దురాలోచనల్ని నింపుకొని, పైకి మాత్రం మంచివాడిగా కనిపిస్తే ఫలితం ఉండదు. అలా నటనతో తోటి మనుష్యుల్ని మోసగించవచ్చు, కానీ సర్వాంతర్యామి అయిన భగవంతుడికి మాత్రం ఇవన్నీ తెలియకుండా ఉంటాయా? ❖

**ధనసంపాదన కోసం, అన్నవస్త్రాదుల కోసం, కీర్తిప్రతిష్ఠల కోసం సన్న్యసించేవాడు ముక్తికి అర్హుడు కాదు. అలాంటివాడు ఇహపరాల రెండింటికీ చెడినవాడవుతాడు.** - పరమహంస పరివ్రాజకోపనిషత్తు



# ధైర్యమే ఆయుధం

– హేమంత్ కుమార్

ధైర్యానికి బలం అవసరం లేదు. ధైర్యం శారీరక బలం మీద ఆధారపడి లేదు. అది మనస్సుకు సంబంధించినది. ధైర్యానికి ఆలంబన శారీరక బలమే అయితే పులి, సింహం, ఏనుగు లాంటి అడవి జంతువులు ఈ ప్రపంచాన్ని ఏలి ఉండేవి. కానీ వాటి ముందు సోదిలోకి కూడా రాని మనిషి చిన్న కర్రపుల్లతో వాటిని ఆడిస్తున్నాడంటే బలం అనేది శారీరక పరిమాణంలోగానీ, దేహ దారుఢ్యంలోగానీ లేదని అర్థమవుతోంది. పిరికితనాన్ని దరి చేరనివ్వకపోవడమే ధైర్యం. నిస్సహాయ స్థితిలో కూడా నీరుగారిపోకుండా ఉండడమే ధైర్యం. ధనవంతుడు ధైర్యవంతుడు కాదు. ధైర్యవంతుడే ధనవంతుడు.

ధైర్యవంతులంటే క్రూరమృగాలను చంపినవారో, ఖూనీలు చేసినవారో కాదు. ఒక మంచిపని కోసం ముందు నిలిచిన వారు. పరిస్థితులు ఏవైనప్పటికీ, సహకరించేవారూ, అనుసరించే వారూ లేకపోయినప్పటికీ అనుకున్న కార్యం కోసం కార్యరంగం లోకి దూకినవారు. ఉత్తమ లక్ష్య సముపార్జనలో పూర్వాపర విపరిణామాలను లక్షింపనివారు. కొల్లాయి ధరించిన గాంధీజీ ధనికుడు కాదు. బలాఢ్యుడసలే కాదు. భవిష్యత్తులో ఇంతమంది తనను అనుసరిస్తారనే భరోసా కూడా లేదు. ఆయన ధ్యేయం స్వాతంత్ర్య సముపార్జన. అంతే! మదర్ థెరెసా ఓ సామాన్య స్త్రీ. భారతదేశంలోని నిరుపేదలకూ, నిర్భాగ్యులకూ సేవ చేయాలనే ఆమె అంకితభావం ముందు ఏ అననుకూల పరిస్థితీ నిలబడలేదు. స్వామి వివేకానంద ఘన చరిత్ర జగమెరిగినదే. విజయాలన్నిటా ఆయన ఆయుధం ధైర్యమే. ఆయన ప్రపంచానికిచ్చిన సందేశం కూడా అదే!

మన దేశంలోని స్త్రీలు ఎంతో ధైర్యవంతులు. శారీరక దుర్బలత్వం వారి దృష్టిలోకే రాదు. బిడ్డలను పెంచే అత్యంత సుకుమారమైన లాలనల నుండి దేశాన్నేలే కఠినతరమైన కార్యాల వరకూ నిర్వహించే సామర్థ్యమున్న ధీశాలురు. కష్టనష్టాల కారణంగా కుటుంబం మొత్తం క్రుంగిపోయి ఉన్న సమయాలలో ఆ ఇంటి ఇల్లాలే ధైర్యంగా నిలబడి కుటుంబానికి ధైర్యం నూరిపోస్తుంది. ఆ సంకట స్థితిని ఎదుర్కొనే స్ఫూర్తి కలిగిస్తుంది. కొత్త ఊపిరిలూదుతుంది. బిడ్డను కబళించడానికి వచ్చిన పులిని అచ్చు ఆడపులి లాగే ఎదుర్కొంటుంది స్త్రీ. నిజమైన పురుషత్వం ధైర్యమే! ధీరత్వమే! రాణీ రుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీబాయి లాంటి స్త్రీ రత్నాలు శత్రువులకు సింహస్వప్నం అయ్యారంటే దానికి కారణం – వారి కత్తులకున్న పదును కాదు, గుండెల్లోని ధైర్యం!

అన్ని రకాలుగా, అన్ని కోణాల్లో ఈ సమాజానికి మన మెంతో సేవ చేయవలసి ఉంది. ఈ బాధ్యత మనం కొత్తగా తెచ్చిపెట్టుకోవలసినది కాదు. బరువుగా నెత్తి కెత్తుకోవలసినది కాదు. జన్మతః వచ్చిన వారసత్వం. గౌరవంగా స్వీకరించ వలసిన కర్తవ్యం. ఈ దేశం మన మాతృమూర్తి. ఆమెకు సేవ చేయడమన్నది బాధ్యతా, కర్తవ్యమూ కూడా కాదు – ధర్మం! ఇంకా చెప్పాలంటే మన అవసరం, అనివార్యం. ఈ పుణ్య కార్యానికి, ఈ పునీత సేవకు మనం పురుషులమా, స్త్రీలమా అనేది ప్రశ్నే కాదు. ధనికులమా, పేదలమా? బలాఢ్యులమా, బలహీనులమా? అన్న ప్రసక్తే లేదు. మనం మనుషులం, ఈ దేశ పౌరులం. అంతే! ఈ దేశం మన కుటుంబం. మన కుటుంబానికి శ్రేయస్సు కూర్చే అవసరం ఉన్నప్పుడు మనం మన శక్తియుక్తుల గురించి ఆలోచించం. వెనుకంజ వేయం. కార్యరంగంలోకి దూకడమే మన ముందుండే కర్తవ్యం. దానికి కావలసింది వనరులు కాదు. ధైర్యం.

స్వామి వివేకానంద వనరుల గురించి ఆలోచించి ఉంటే ఈ రోజు ప్రపంచ చరిత్రలో ఆధ్యాత్మిక రంగంలో భారతదేశం మకుటాయమానంగా నిలిచి ఉండేది కాదు. డెబ్భయ్యేళ్ళ పైచిలుకు వయస్సులో ఎవరో ఇచ్చిన ఛార్జీలతో ఒంటరిగా అమెరికా వెళ్ళిన ప్రభుపాదస్వామి అక్కడ 'హరేరామ హరేకృష్ణ' ఉద్యమాన్ని ఇంత ఉద్ధృతంగా, ఇంత ఉన్నత స్థాయిలో స్థాపన చేసి ఉండేవారు కాదు. దివ్యజనని శారదామాత అంతర్గత, అంతర్లీన ధైర్యమే ఈనాడు రామకృష్ణ మఠం, మిషన్ల స్థాపనకు, సర్వతోముఖాభివృద్ధికి కారణం అన్న సత్యం ఎవరూ కాదనలేనిది.

ఒక సత్సంకల్పం మర్రి విత్తనం లాంటిది. మన గుండె పాదులో నాటుకోవాలి. ధైర్యమనే జలంతో పెంచుకోవాలి. ఏ వాతావరణ పరిస్థితులూ దాని ఎదుగుదలను ఆపలేవు. పూలు పూచి, కాయలు కాచి, ఊడలు దిగిపోతుంది. దాని విస్తారమైన శాఖల్లో, శీతల ఛాయల్లో ఎందరు సేద దీరుతారని! ఎన్ని పక్షులు, జంతువులు తల్లి సమక్షంలో లాగా ఊరట పొందుతాయని! సత్సంకల్పాలు అందరికీ ఉండవచ్చు. కానీ, కార్యరూపంలోకి రావాలంటే కావలసింది అంగబలం, అర్థబలం లాంటి హంగులు కాదు. ఏది ఎదురైనా నిర్వహిస్తాననే ధైర్యం. విజయం సాధించాలనే దీక్ష. సాధిస్తాననే ధీమా. ❖



# మనస్సును గమనించు! మంచి ఆలోచనలు పెంచు!!

- స్వామి యతీశ్వరానంద

సర్వకాల సర్వావస్థలలోనూ సావధానంగా, అంటే మేలుకున్న మనస్సుతో మసలుకోవాలి. మీరు చేసే ప్రతి పని వెనుకా ఉండే నిజమైన ఉద్దేశాలను మీరే ఒక కంట కనిపెట్టండి. మిమ్మల్ని మీరు తీవ్రంగా విమర్శించుకోండి. కానీ ఆశావహ దృక్పథాన్ని వదిలిపెట్టవద్దు. నిర్మాణాత్మకమైన విమర్శలు మీ ఆధ్యాత్మిక పరిణతినీ, తపననూ పెంచుతాయి. నేను 'పాపి'ని అన్న భావన మిమ్మల్ని 'శాశ్వతమైన పాపులు'గా చేస్తుంది. వినాశకరమైన భావనల వల్ల ఆధ్యాత్మిక జీవితం కొండెక్కుతుంది.

పనులను పదే పదే చేయడం ద్వారా అలవాటు ఏర్పడుతుంది. కాబట్టి మనం చేసే పనులను మార్చడం ద్వారా అలవాట్లను మార్చుకోవచ్చు. కానీ అలవాటు మన ప్రాథమిక స్వభావం కాదు. మన ప్రాథమిక స్వభావం దివ్యత్వమే. ఇంతకీ విషయం ఏమిటంటే, ఎంత చెడ్డ అలవాటునైనా మానుకొని మంచి మనుష్యులుగా మారవచ్చు. కానీ అలవాటు ఎంత పాతదైతే, దాన్ని మానడం అంత కష్టమవుతుంది. ఎంత ప్రయత్నం చేస్తూ ఉన్నా సరే, ఏదైనా దురలవాటు మిమ్మల్ని వీడకపోతే, నిరాశ పడవద్దు. మన ఉప చేతనావస్థలోని మనస్సును జాగరూకతతో గమనిస్తూ, క్రమశిక్షణను చక్కగా పాటిస్తూ, ముందుకు సాగుతూ ఉంటే, అన్ని రకాల దురలవాట్లూ బలహీనపడి, చివరకు మాయమవుతాయి. కానీ ప్రయత్నలోపం ఉండకూడదు. ఓర్పు, పట్టుదల అవసరం. సంకల్పం ఉన్న చోట మార్గం ఉంటుంది.

ఒక గొలుసు బలం ఆ గొలుసులోని అత్యంత బలహీనమైన కొక్కెం బలం మీద ఆధారపడి ఉంటుంది కదా! అలాగే బలహీనమైన క్షణాలలో మన ప్రవర్తన, చెడ్డవారి సాంగత్యాన్ని ఏ మాత్రం తట్టుకోగలమో నిర్ణయిస్తుంది. కాబట్టి మనం జాగ్రత్త తీసుకుంటూ, వీలైనంత వరకూ చెడ్డవారి ప్రభావం నుంచి బయటపడాలి. మనలో ఉండే బలహీనతలను సరైన ఆలోచనాసరళితోనూ, సద్వర్తనతోనూ, స్వయం విశ్లేషణతోనూ, ప్రార్థనాదులతోనూ దూరం చేసుకోవాలి.

మనం సావధానంగా ఉంటూ, నిజాయతీగా ఆధ్యాత్మికతను కోరుకుంటే మన మనస్సులో వచ్చే ప్రతి చిన్న స్పందననూ, ఆలోచననూ గమనించగలుగుతాం. కానీ సాధారణంగా మనం మందకొడిగా జీవిస్తూ, తీసుకోవలసిన జాగ్రత్తలను తీసుకోకుండా, రోజులు గడిపేస్తూ ఉంటాం. మనస్సు అనే రథం మనల్ని గోతిలోకి దించినప్పుడే, మేలుకుంటాం. ఆ గోతికి దారి తీస్తున్న ప్రయాణాన్ని మనం గమనించం. ఎందుకంటే మనకు నిర్లక్ష్యం ఎక్కువ. ఆధ్యాత్మికత కోసం మనం చేసే ప్రయత్నాలు ఎప్పుడూ అరకొరగానే ఉంటాయి.

కాబట్టి పగ్గాలను గట్టిగా పట్టుకోండి. ఈ ఆధ్యాత్మిక ప్రయాణంలో జరిగే ప్రమాదాలన్నీ మన అజాగ్రత్త వల్లే జరుగుతాయి. కాబట్టి సురక్షితంగా పయనం సాగేందుకు కావలసిన అన్ని జాగ్రత్తలూ తీసుకోండి. మీ మనస్సును ఒక్క నిమిషం కూడా మీ పహరాలో నుంచి తప్పుకోనివ్వకండి. ఏ మార్గాన్ని అనుసరించే సాధకులకైనా ఈ నియమావళి వర్తిస్తుంది.

మన చుట్టూ ఉన్న వాతావరణం పట్ల అసంతృప్తి చెంది, విచారిస్తూ కూర్చోవడం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. ఈ ప్రపంచం మీ కోసం మారదు. మీ ఆధ్యాత్మిక పురోగతి కోసం మీరే మారాలి. మీ వ్యక్తిగత స్వభావాన్ని పరమసత్యంతో అనుసంధానం చేసి, సామరస్యాన్ని సాధించాలి. మన సాధనలో భాగంగా భగవంతుణ్ణి గురించి, ఆయనతో మనకున్న సంబంధాన్ని గురించి ఎక్కువగా ఆలోచించాలి. తక్కిన విషయాలను గురించి ఎక్కువగా ఆలోచించి దిగులు పడకుండా, వాటిని మరచిపోవడానికి ప్రయత్నించాలి. మనం, మనలోని దివ్యత్వం – వీటి గురించిన ఆలోచనలే మన మనస్సులో నిండిపోవాలి. ఇదే అత్యున్నతమైన ఆధ్యాత్మికస్థాయి అని చెప్పుకోలేం గానీ, అత్యున్నతమైన గమ్యానికి చేరే సోపానంలో మనం చేరుకోవలసిన ఒక మెట్టు అని చెప్పుకోవచ్చు. అంతిమంగా, మనతోపాటు ఇతరులలోని దివ్యత్వాన్ని గుర్తించి, భగవంతుని కోసం, భగవంతుని ద్వారా, భగవంతుని వలన అందరినీ ప్రేమిస్తూ, ఇతరులకు కూడా మార్గదర్శకులం కావాలి. ❖ తెలుగుసేత: ఎమ్. శివరామకృష్ణ

నేను భగవంతుణ్ణి ధ్యానించడానికి ముందు మనస్సులోని చెడు ఆలోచనల్ని శుభ్రంగా కడిగి వేస్తున్నట్లూ, ఆ తరువాత దైవాన్ని అందులో ప్రతిష్ఠించుకొన్నట్లూ భావించేవాణ్ణి. - శ్రీరామకృష్ణులు

# ధీరవాణి

- స్వామి వివేకానంద

# అన్నిటికీ వివరణ నీలోనే...

లోకాన్ని గురించి రెండు విధాలైన అభిప్రాయాలున్న వ్యక్తులు సాధారణంగా కనిపిస్తారు. కొంత మంది నిరాశావాదులై 'ప్రపంచం ఎంత ఘోరం! ఎంత దుష్టం!' అంటుంటారు. మరికొంతమంది ఆశావాదులై 'ప్రపంచం ఎంత చక్కనిది! ఆశ్చర్యకరమైనది!' అంటుంటారు. మనోనిగ్రహాన్ని సాధించని వారికి ప్రపంచం చెడ్డదిగా తోస్తుంది. లేదా మంచి చెడుల సమ్మిశ్రమంగానైనా అనిపిస్తుంది. మనోనిగ్రహ సంపన్నులమైతే మనకు ఈ ప్రపంచమే ఆశాజనకమై కనబడుతుంది. అప్పుడు మనకు ప్రపంచంలో ఏదీ మంచిగా కానీ, చెడుగా కానీ కనిపించదు. మొదట్లో ప్రపంచం నరకమని చెప్పే కొంతమంది మనోనిగ్రహాన్ని సాధించగానే ప్రపంచం స్వర్గమని చెబుతారు. మనల్ని మనం సుశిక్షితులం చేసుకున్నట్లయితే, ఈ ప్రపంచం ఆనందపూర్ణమైన స్వర్గంలా కనిపిస్తుంది.

ఏ యోగమైనా సరే మనల్ని ఒకే గమ్యానికి చేర్చి పరిపూర్ణుల్ని చేస్తుంది. కీలకమంతా సాధనలోనే ఉంది. ముందుగా వినాలి, తరువాత మననం చెయ్యాలి. పిమ్మట అభ్యసించాలి. ఏ యోగాన్ని గురించి అయినా మొదట విని, దాన్ని గ్రహించాలి; దురవగాహంగా ఉండే అనేక విషయాలు నిరంతర శ్రవణ మననాల వల్ల చక్కగా బోధపడతాయి. ప్రతి విషయాన్నీ వెంటనే గ్రహించడం కష్టం. అన్నిటికీ వివరణ నీలోనే ఉంది. నిజంగా ఇతరులతో నేర్పబడేవాడు లేడు. మనకు మనమే నేర్చుకోవాలి. వెలుపల బోధించేవాడు కేవలం మార్గసూచకుడు. అతడి సూచన మన ఆంతరంగిక బోధకుణ్ణి మేల్కొలుపుతుంది. అప్పుడు మన భావనాశక్తి వల్ల, గ్రహణశక్తి వల్ల విషయం మనకు స్పష్టమవుతుంది. దాని అనుభవం మనకు అప్పుడు మనలోనే కలుగుతుంది; ఇలాంటి అనుభూతే ప్రగాఢ సంకల్ప శక్తిగా పరిణమిస్తుంది.

మొట్టమొదటిది అనుభూతి. తరువాత అదే సంకల్పంగా పరిణమిస్తుంది. అప్పుడు దాని నుండి అద్భుతమైన క్రియాశక్తి ఉదయిస్తుంది. ఆ తరువాత మన శరీరం యావత్తూ కర్మయోగ సాధనంగా మారేవరకూ, అహంకారం లయమై, అఖండ నిస్వార్థత ప్రాప్తించే వరకూ ఆ క్రియాశక్తి మన ప్రతి నాళంలోకీ, ప్రతి నరంలోకీ, ప్రతి కండరంలోకీ చొచ్చుకుపోతుంది.

ఈ సిద్ధికి ఏ వాదం మీదా, ఏ సిద్ధాంతం మీదా, ఏ విశ్వాసం మీదా ఆధారపడాల్సిన అవసరం లేదు. ఒక వ్యక్తి క్రైస్తవుడా, యూదుడా, హిందువా అనేది ఆలోచించాల్సిన విషయం కాదు. నువ్వు స్వార్థరహితుడవా? కాదా? అన్నదే ఆలోచించాల్సిన విషయం. స్వార్థరహితుడవైతే ఒక్క పారమార్థిక గ్రంథాన్నైనా చదవకుండానే, ఒక్క ప్రార్థనాలయానికైనా పోకుండానే, ఒక్క దేవాలయాన్నైనా దర్శించకుండానే పరిపూర్ణుడవు అవుతావు. సమస్త యోగాలకూ గమ్యస్థానం ఒకటే! కర్మ, జ్ఞాన, భక్తి, యోగ మార్గాలలో ఏదైనా మానవుణ్ణి ముక్తుణ్ణి చేయగలదు. 'సాఙ్ఖ్య యోగౌ పృథ గ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః' – 'జ్ఞానయోగ, కర్మయోగాలు భిన్నాలని చెప్పేవారు బాలురే! పండితులు అలా చెప్పరు.' పైకి వేరు వేరుగా ఉన్నట్లు కనిపించినా, ఈ రెండూ మానవుణ్ణి ఒక్క పరమావధికే చేరుస్తాయి. ❖



# పరిప్రశ్న

**- స్వామి పరిజ్ఞేయానంద**



**- బొజ్జా శ్రీశైలం, కాకినాడ**

**? : శ్రీమద్భాగవతంలో తొమ్మిది భక్తిమార్గాలను వివరించారు. ఈ మార్గాలను ఆశ్రయించి భగవంతుణ్ణి సేవించిన భాగవతోత్తములను తెలపండి?**

✍: భగవత్సాక్షాత్కారానికి ప్రహ్లాదుడు శ్రీమద్భాగవతంలో నవవిధ భక్తి మార్గాలను వివరించాడు.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ ॥**

భగవత్కథా శ్రవణం, భగవల్లీలా సంకీర్తనం, భగవన్నామ స్మరణం, విష్ణుపాదసేవనం, భగవదార్చనం, వందనం, దాస్యం, సఖ్యం (స్నేహం), ఆత్మనివేదనం - ఈ తొమ్మిదీ భగవంతుణ్ణి చేర్చే భక్తి సోపానాలు.

ఈ తొమ్మిది మార్గాలనూ అనుసరించి భగవంతుణ్ణి చేరిన ఆదర్శ భాగవతోత్తములను మన పురాణాలు పేర్కొన్నాయి.

1. శ్రవణం - పరీక్షిత్తు మహారాజు
2. కీర్తనం - నారదమహర్షి
3. స్మరణం - ప్రహ్లాదుడు
4. పాదసేవనం - లక్ష్మీదేవి
5. అర్చనం - పృథు చక్రవర్తి
6. వందనం - అక్రూరుడు
7. దాస్యం - ఆంజనేయస్వామి
8. స్నేహం - అర్జునుడు
9. ఆత్మ నివేదనం - బలిచక్రవర్తి

ఈ నవవిధ భక్తి మార్గాలను అనుసరించి ఎంతో మంది భక్తులు భగవంతుణ్ణి చేరుకొని మనకు ఆదర్శంగా నిలిచారు. ఆ మహాత్ములు అనుసరించిన భక్తి మార్గంపై విశ్వాసం ఉంచి, శ్రద్ధానిష్ఠలతో ఆధ్యాత్మిక సాధన కొనసాగిస్తే మనం కూడా తప్పక భగవంతుణ్ణి చేరగలం.

**- యస్.టి.వి.రావు, హైదరాబాదు**

**? : చిత్తశుద్ధి లేకుండా మోక్షం సాధ్యమా? చిత్తశుద్ధి లేకపోయినా సంచిత కర్మను భస్మం చేసుకొని మోక్షం పొందవచ్చా?**

✍: ఎలాగైతే మేఘావృతమైన సూర్యుణ్ణి చూడలేమో, అలాగే మలినావృతమైన మనస్సుతో భగవత్సాక్షాత్కారాన్ని పొందలేం. దివ్యజనని శారదాదేవి మనస్సు ప్రాధాన్యాన్ని తెలుపుతూ, 'ప్రతీది మనస్సు మీద ఆధారపడి ఉంటుంది. చిత్తశుద్ధి లేకుండా దేనినీ సాధించలేం. గురువు, భాగవతుల, భగవంతుని అనుగ్రహం ఉన్నప్పటికీ మనస్సు అనుగ్రహించక పోతే అంతా దుఃఖమయమే అవుతుంది' అని అంటారు.

బంధ మోక్షాలకు కారణం మనస్సే అని 'అమృతబిందూపనిషత్తు' ఇలా వివరిస్తుంది:

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః ।**
**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥**

'మనస్సే బంధ మోక్షాలు రెంటికీ కారణం. విషయాసక్తమైన మనస్సు బంధాలకూ, నిర్విషయమైన మనస్సు ముక్తికీ కారణం అవుతుంది'. కాబట్టి ముక్తిని పొందడానికి చిత్తశుద్ధే ప్రథమ అర్హత అని గ్రహించాలి.

**బ్రహ్మాత్మైక్యమవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా ।**
**స్తేషాం తత్త్రితయం న హి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్ ॥**

*(వివేక చూడామణి - 454)*

బ్రహ్మైక్యానుభూతిలో తన్మయమయ్యే యోగిని సంచిత, ప్రారబ్ధ, ఆగామి - ఈ మూడు కర్మలూ స్పృశించవు.

**'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతేఽర్జున'** అన్నది శ్రీభగవానువాచ. ఈ మూడు కర్మలూ నశించాలంటే తత్త్వజ్ఞానం అవసరం. ఈ జ్ఞానసముపార్జనకు కూడా శుద్ధమైన మనస్సే సాధనం. కాబట్టి సంచిత కర్మలను భస్మం చేసి, ముక్తి పొందాలనుకున్నా చిత్తశుద్ధి ముఖ్యమన్నమాట. ❖



# తెలిస్తే మోక్షం... తెలియకుంటే బంధం!

– శ్రీమతి బి.కృష్ణకుమారి

అన్నమయ్య పదామృతం

తెలిసితే మోక్షము తెలియకున్న బంధము
కలవంటిది బతుకు ఘనునికిని ॥

అనయము సుఖమేడ దవల దుఃఖమేడది
తనువుపై నాసలేని తత్త్వమతికి
పొనిగితే పాపమేది పుణ్యమేది కర్మమందు
వొనరగ ఫలమొల్లని యోగికిని ॥

తగినయమృతమేది తలపగ విషమేది
తెగి నిరాహారియైన ధీరునికిని
పగవారనగ వేరి బంధులనగ వేరే
వెగటు ప్రపంచమెల్ల విడిచే వివేకికి ॥

వేవేలు విధులందు వెలిపేది మలిపేది
దైవమును నమ్మినయట్టి ధన్యునికిని
శ్రీవేంకటేశ్వరుడు చిత్తములో నున్నవాడు
యీవలేది యావలేది యితనిదాసునికి ॥

మనిషి బంధాలలో, బాధలలో పడి కొట్టుకుపోవడానికి ప్రధాన కారణం అజ్ఞానమే! తెలుసుకోవలసిన విషయాన్ని తెలుసుకోకుండా, అనవసరమైన పరిజ్ఞానాన్నీ, పరివారాన్నీ పోగేసుకుంటున్నాం; పొగిలి పొగిలి విలపిస్తున్నాం. ఈ దృశ్య ప్రపంచాన్ని, ఓ సాక్షీభూతంగా వీక్షించే విజ్ఞత లోపించడం వల్లనే మన మనస్సు అనుక్షణం అలజడికి లోనవుతుంది. సుఖానికి పరవశిస్తుంది. దుఃఖానికి విలపిస్తుంది. నిజానికి మన అనుభవాలు, అనుభూతులన్నింటినీ ఏకాంతంగా ఉండి సింహావలోకనం చేసుకుంటే ఏదీ శాశ్వతమైన ఆనందాన్ని కానీ, ఏదీ శాశ్వతమైన విషాదాన్ని కానీ ఇవ్వలేదు. అన్నీ ఒక కలలా వచ్చాయి; కలలా వెళ్ళిపోయాయి. అయితే మనం మాత్రం వాటిని అనుభవించే క్షణాల్లో తీవ్ర ఉద్విగ్నతలకు, ఉద్రిక్తతలకు గురవుతూ ఉంటాం. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినట్లు మనం అష్టపాశాల ద్వారా బంధింపబడి ఉన్నాం. దయ, జుగుప్స, మోహం, భయం, సంశయం, కులం, బలం, శీలం మొదలైనవన్నీ బంధనాలే! వీటిలో నుంచి బయటపడినప్పుడే మనం సర్వస్వతంత్రుల మవుతాం. ఈ పరమసత్యాన్ని తెలుసుకున్న వ్యక్తే ఘనుడు, తత్త్వమతి, యోగి, ధీరుడు, వివేకి, ధన్యుడు అంటూ **'తెలిసితే మోక్షము తెలియకున్న బంధము...'** కీర్తనలో ప్రస్తావిస్తున్నాడు పదకవితా పితామహుడు. అలా సుఖదుఃఖాలు, పాపపుణ్యాలనే ద్వంద్వాలకు అతీతంగా స్థితప్రజ్ఞుడిగా, ఆ గరుడవాహనుడి గతప్రాణుడిగా తరించమంటున్నాడు.

### కల వంటిది బతుకు!

కనిపించే ఈ ప్రపంచంలో ఏదీ స్థిరం కాదు; కాల భ్రమణంలో ఓ భ్రమలా ఇలా వచ్చి అలా వెళ్ళిపోతుంది. ఈ కఠోరవాస్తవాన్ని తెలుసుకుంటే అదే మోక్షమనీ, తెలియకుంటే ఈ బాహ్యప్రపంచమే బంధమై అల్లుకుంటుందనీ బోధపరుస్తూ...

**తెలిసితే మోక్షము తెలియకున్న బంధము**
**కల వంటిది బతుకు ఘనునికిని...** అంటున్నాడు అన్నమయ్య. ఇలా ఘనమైన బుద్ధి కలిగిన వ్యక్తి ఈ బతుకును ఓ కలలా భావిస్తాడు. సాక్షిగా సావధానంతో అవలోకిస్తాడు. కానీ చాలా సందర్భాల్లో మన కళ్ళు, మన మనస్సే మనల్ని మోసం చేస్తూ ఉంటాయి. మాయతెరలు కమ్మేస్తూ ఉంటాయి. మహానగరాలే మొండిగోడల్లా మిగిలిపోతున్నాయి. మహామహుల కీర్తిప్రభలే కాలగర్భంలో కర్పూరంలా కరిగిపోతున్నాయి. అందుకే ముందు ఈ అస్థిరత్వాన్ని గుర్తెరిగి శాశ్వతమైన దాని కోసం తపించమంటున్నాడు తాళ్ళపాక అన్నమాచార్య. శ్రీరామచంద్రుడు కూడా ఒకసారి తీవ్ర వైరాగ్య భావనతో...

**యచ్ఛేదం దృశ్యతే కించిజ్జగత్ స్థావర జంగమమ్ ।**
**తత్సర్వమస్థిరం, బ్రహ్మన్! స్వప్న సంగమ సన్నిభమ్ ॥**

'కనబడే స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తంతా కూడా స్వప్న సంగమంలా అస్థిరమైనదే కదా!' అని గురువర్యులు వశిష్ఠ మహర్షితో అంటాడు.

### సుఖమేది? దుఃఖమేది?

ఈ శరీరంపై అపేక్ష ఉన్నంత వరకే సుఖదుఃఖాల స్పృహ మనల్ని కలవరపెడుతుంది. కానీ దేహంపై ఆశ లేని తత్త్వమతి

(మిగతా 32వ పేజీలో...)

**మనస్సే జీవుడు, మనస్సే జగత్తు, మనస్సే భగవంతుడు, మనస్సు వల్లనే మాయాజాలం క్రమ్ముచున్నది, మనస్సు వల్లనే బంధం ఏర్పడుచున్నది. మనస్సు నశించడం వల్ల ముక్తి లభిస్తుంది.** -మహావాక్య దర్పణం

# భక్త హాఫిజ్ ఏకనిష్ఠ

– స్వామి అఖండానంద*

హాఫిజ్ అతి దరిద్రుడైన ఒక ఫకీరు. భిక్షాహారంతో కాలం వెళ్ళదీసేవాడు. ఒకనాడు ఒక వారాంగన ఇంటికి భిక్షకు వెళ్ళాడు. ఆమె అతి రూపవతి. ఆమె రూపలావణ్యాలను చూసి, హాఫిజ్ మోహితుడయ్యాడు. 'నేనా నిరుపేద బిచ్చగాణ్ణి. ఆమె డబ్బు కోరే వేశ్య. ఆమెను నేను ఎలా పొందగలను?' అని బాధపడ్డాడు. కానీ అతడిది తీవ్రమైన కాంక్ష. అందువల్ల ఎలాగైనా సరే డబ్బు కూడబెట్టి తన మనోవాంఛ తీర్చుకోవాలని తీర్మానించుకున్నాడు.

మర్నాటి నుండి హాఫిజ్ అర్ధాకలితో ఉండి, మిగిలిన తిండి గింజలను అమ్ముకొనేవాడు. పిడకలు చేసి అమ్మేవాడు. అంతేకాదు! మరో వినోదకరమైన పని కూడా చేసేవాడు.



ప్రతి దినం ఎవ్వరూ మేల్కొనక మునుపే వేశ్య ఇంటికి పోయి ఇల్లూవాకిలి ఊడ్చి, అంట్ల గిన్నెలు తోమి, నీటి కుండలు నింపి వచ్చేవాడు. ఇంటి దాసీలు లేచి వచ్చి, ఈ పనులన్నీ ఎవరు ముగించారా అని ఆశ్చర్యపోయేవారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాయి. 'వస్తున్నవాడు దొంగ కాదు, మరి వీడి ఉద్దేశం ఏమిటో కనిపెట్టాలి' అని తలచింది యజమానురాలు. 'ఈ రాత్రి మీరంతా నిద్రిస్తున్నట్లు నటించండి. వాడు ఇంటి పని సమస్తం ముగించిన తరువాత వాణ్ణి పట్టుకొని నన్ను పిలవండి. కానీ హెచ్చరిక! వాడి పట్ల కఠినంగా వ్యవహరించకండి' అని పరిచారికలను ఆదేశించింది.

ఆ 'తమాషా దొంగ' యథాప్రకారం వచ్చి గృహకృత్యాలు ముగించిపోబోతున్న సమయానికి, ఎవరి కోసమైతే తాను అర్ధాకలితో డబ్బుకూడబెడుతున్నాడో, ఆ వాంఛిత స్త్రీ కళ్ళెదుట ప్రత్యక్షమైంది. ఆమెను చూసి హాఫిజ్ కొయ్యబారిపోయాడు. తైలసంస్కారం లేని చింపిరి జుట్టు, చినిగి మలినమైన దుస్తులతో ఉన్న హాఫిజ్‌ను చూసి ఆమె మనస్సు దయార్ద్రమైంది. 'ఈయనకు నలుగుపెట్టి స్నానం చేయించి, మంచి వేషభూషలు ధరింపజేయండి' అని పరిచారికలను ఆదేశించింది. వారు ఆ విధంగా చేసి, పంచభక్ష్య పరమాన్నాలతో సుష్టుగా భోజనం పెట్టి, ఆయన ప్రణయిని గదిలో పట్టుపానుపుపై ఆసీనుణ్ణి చేశారు. వేశ్య ప్రవేశించింది. 'నీవు దొంగచాటుగా నా గృహకృత్యాలన్నీ ఎందుకు చేస్తున్నావో, నీవు ఎవరివో రాత్రికి వచ్చి తెలుసుకొంటాను. హాయిగా విశ్రమించు' అని నిష్క్రమించింది.

హాఫిజ్‌కు క్షణమొక యుగంగా గడుస్తోంది. ఎప్పుడెప్పుడు పడమటి దిక్కు ఎర్రబారుతుందా, ఎప్పుడు సూర్యుడు అస్తమిస్తాడా అని మాటిమాటికీ ఎదురు చూస్తున్నాడు. ఎట్టకేలకు లోకచక్షువు అస్తాద్రి వెనుకకు పోయాడు. ఒక పరిచారిక వచ్చి గదిలో దీపం పెట్టి వెళ్ళింది. అది చూచి 'అయ్యో! దర్గాలో దీపం పెట్టే వేళ అయింది కదా' అని తలచాడు హాఫిజ్. ఆయన ఎన్నో ఏళ్ళుగా ప్రతిరోజూ సంధ్యా సమయంలో దర్గాలో దీపం వెలిగించడం పరిపాటి. ఈనాడు తన నిష్ఠకు భంగం కలుగనుందా? వీల్లేదు. ఏకనిష్ఠ, శ్రద్ధ గల హాఫిజ్ తన చిరకాల వాంఛిత భోగ్య వస్తువైన ప్రణయిని ఇంటి నుండి ఒకటే పరుగు!

దర్గాకు పోయి యథాప్రకారం సంధ్యాదీపం వెలిగించాడు. ఆ వెలుతురులో ఇద్దరు ఫకీర్లు మద్యం సేవించడం కనపడింది. వారు ఈయనకు కూడా ఒక గాజు పాత్రను అందించారు. "సిగ్గులేని మదాంధులారా! నేను ముసల్మానును. నేను మద్యపానం చేస్తానా?" అని ఛీత్కరించాడు. వారు వదలలేదు. అప్పుడు హాఫిజ్ ఆ గాజు పాత్రను నేలకు విసిరికొట్టాడు. గాజు పాత్ర ముక్కలు అయింది. కానీ నేలపై ద్రవమేదీ కానరాలేదు. ఏదో అవ్యక్తభావం ఆయన మదిలో మెదిలింది. వారిని మద్యం ఇమ్మని వేడుకున్నాడు. వారు 'మా వద్ద ఇక లేదు. ఆ నేలనే నాకు' అన్నారు. హాఫిజ్ ఒక్కసారి నేలను నాకాడు. వెంటనే అతడిలోని భోగవాసనలన్నీ తుడిచి పెట్టుకుపోయాయి. భగవత్ ప్రేమోన్మత్తుడైనాడు.

వారాంగన వచ్చి ఇంట్లో చూసేసరికి హాఫిజ్ కనపడలేదు. ఆమె ఇంటి నుండి బయలుదేరి, వారినీ వీరినీ అడుగుతూ దర్గాకు వెళ్ళింది. భిక్షువు నేత్రాల నుండి ఆనందాశ్రువులు

*(మిగతా 35వ పేజీలో...)*

# అపురూపమైన అమ్మస్పర్శ

- శ్రీమతి టి. ఆశాలత

సూర్యుని లేలేత కిరణాలు చీకటిని పారద్రోలి జగత్తుకు ఎలా వెలుగును ప్రసాదిస్తాయో, అలా అమ్మ శారదాదేవి స్పర్శ వల్ల వ్యక్తి అజ్ఞానం మటుమాయమైపోతుంది. రాముడి పాదం తాకగానే రాయి అహల్య అయినట్లు - అమ్మ మన చుబుకాన్ని స్పృశించి దీవిస్తే, బిడ్డలమైన మనకు జ్ఞానోదయమైనట్లే. అప్పుడే తల్లి గర్భం నుండి వచ్చిన లేగదూడను ఆవు తన నాలుకతో ఎలా శుభ్రం చేస్తుందో, శారదాదేవి తన చల్లని చేతితో స్పృశించి దీవించిన భక్తుడి అంతరంగంలో అజ్ఞానం మటుమాయమై ఆనంద ప్రవాహం కట్టలు తెంచుకుంటుంది. ఆమె పాదపద్మాలకు ప్రణమిల్లి దీవెనలు తీసుకున్న భక్తులు తలెత్తి శారదామాత మోమును చూస్తే, సాక్షాత్తూ తమ కన్నతల్లే ఆమెలో సాక్షాత్కారమై దర్శనమిచ్చిన సంఘటనలు ఎన్నో!

శ్రీపంచానన్‌ఘోష్ ఒక రోజు మాతృదేవి ఆశీస్సుల కోసం వచ్చి ఆమె పాదాలను కళ్ళకు అద్దుకుంటాడు. లేచి నిలబడి ఒక్కసారిగా విద్యుదాఘాతం తగిలినట్లు రెండడుగులు వెనక్కివేస్తాడు. అక్కడ శారదాదేవి స్థానంలో తన కన్నతల్లి సజీవంగా నిలబడినట్లు కనబడేసరికి అతని శరీరం కంపించిపోయింది. మాతృదేవి స్పర్శ అలాంటి అనుభూతిని కలిగించేది. అలాగే స్వామి మహాదేవానంద ఒక రోజు జయరాంబాటికి వచ్చి అమ్మ ఎదురుగా కూర్చున్నారు. ఆ సమయంలో ఆయన తన తల్లిని తలచుకున్నారు. మరుక్షణం ఆయన కన్నతల్లి మాతృదేవిలో కనిపించారు. స్వామి ప్రశాంతానందకు కూడా ఇలాంటి అనుభవమే ఎదురైంది. ఆయన మొట్టమొదటిసారి మాతృదేవి ఫోటోను చూసి ఆశ్చర్యపోయారు. అచ్చు తన తల్లి స్వరూపమే అందులో కనిపించడం దిగ్భ్రాంతికి గురిచేసింది. అమ్మ స్పర్శే కాదు, ఆమె సాన్నిహిత్యంలో కూడా అంతటి మాహాత్మ్యం దాగి ఉంది.

స్వామి శారదానంద, స్వామి యోగానంద, సరళ (ప్రవ్రాజిక భారతీప్రాణా మాతాజీ, శారదామఠం ప్రప్రథమ అధ్యక్షురాలు) ఇలా ఎంతో మంది అమ్మ లాలనలో సేదతీరినవారే! దాదాపు ఇరవై ఏళ్ళ పాటు మాతృదేవి బాధ్యతలను చూసిన స్వామి శారదానందను అంతిమ దినాల్లో కరుణించి స్వయంగా సేవ చేసే భాగ్యాన్ని కలిగించారు. లేవలేని స్థితిలో ఉన్నప్పుడు స్వామి శారదానందను దగ్గరకు పిలిచి, పక్కన కూర్చోబెట్టుకుని ఆయన చుబుకాన్ని



ఆప్యాయంగా స్పృశించి, ముద్దుపెట్టుకుని, ఆయన రెండు చేతులనూ తన చేతులలో పెట్టుకుని తనను తినమని ఇబ్బంది పెడుతున్న సరళపై చిన్నపిల్లలా ఫిర్యాదు చేస్తారు. ఆయన చేతుల మీదుగా పాలు తాగి, ఎన్నాళ్ళుగానో ఆయన మనస్సులో దాగిన చిరు కోరికను తీరుస్తారు.

సరళ అయితే మాతృదేవి సమక్షంలో చిన్నపిల్లే అయిపోయేవారు. అంతిమ దినాల్లో ఆమెను కూడా దగ్గరకు రమ్మని పిలిచి, 'నువ్వు భవిష్యత్తులో ఎన్నో పనులు చేయా'లంటూ ఆమె తలను తమ హృదయానికి హత్తుకొని, ప్రేమతో తల నిమిరి దీవించారు. ఆ అనురాగమూర్తి చూపిన అవ్యాజ ప్రేమను చూసి ఎవరైనా ఆ క్షణంలో భోరున ఏడ్చేసేవారు.

"నా నరేన్" అంటూ ఆప్యాయంగా పిలవబడే స్వామి వివేకానంద అమ్మ పాదాలను తాకాలంటే భయపడేవారు. ఎందుకంటే అనురాగంతో ఎదుటివారి పాపాలను స్వీకరించి, శారీరక బాధలు అనుభవిస్తారని స్వామీజీ సాష్టాంగ ప్రణామాలర్పించి, ఆశీస్సులు మాత్రమే తీసుకునేవారు. కానీ అందరూ స్వామీజీలా ఆలోచించరు కదా! మంత్రదీక్ష తీసుకున్న వారు తమ తల మీద అమ్మ చేయి ఉంచి దీవిస్తే బావుణ్ణు అని తలచేవారు. వారి మనస్సులో ఆలోచన రావడమే తరువాయి గుమ్మం దాటి పోతున్నవారిని సైతం వెనక్కి పిలిచి, వారి తల మీద చేయి ఉంచి, 'ఇప్పుడు తృప్తిగా ఉందా?' అని అనేవారు. ఆ కరస్పర్శ వారి మనస్సులను దూదిపింజల్లా చేసేది.

అడిగినవారికి అడిగినట్లు కాదనకుండా వారి మనస్సెరిగి మంత్రదీక్ష నిచ్చే ఈ గురుదేవి, శిష్యుల పాపాలను సైతం స్వీకరించి పడ్డ నరకయాతన అంతా ఇంతా కాదు. పాదాలు ఒక్కొక్కసారి వేడి సెగలు పుట్టేవి. గంగాజలంతో చల్లబరుచుకునేవారు. శ్రీరామకృష్ణులు సైతం తనకు తైలమర్దన చేసి, కాళ్ళు వత్తి, సేవ చేసిన శారదామాతకు రెండు చేతులు ఎత్తి నమస్కరించేవారంటే ఆ ఆదర్శ దాంపత్యం ఎంతటి అద్భుతమైందో అవగతమవుతోంది. భౌతికంగా ఆ తల్లి స్పర్శ మనకు లభించకపోయినా, దివ్యదర్శనాలతో ఆ అనురాగమూర్తి ఆత్మీయతను అందుకున్న, అందుకుంటున్న బిడ్డలు కోకొల్లలు. ❖

ఎవరెవరి బరువు బాధ్యతలను నేను స్వీకరించానో వారందరినీ బంధవిముక్తులను చేసిన తరువాత గానీ నాకు ముక్తి లేదు. నిరంతరం నన్ను ఆశ్రయించిన వారిని ఎన్నటికీ విడువజాలను. - శ్రీశారదాదేవి



(...గత సంచిక తరువాయి)

# శిఖ ఎందుకు?

ప్రార్థన సమయాల్లో పిలకను ముడి వేసుకోవడం వల్ల మనస్సులో ఉత్పన్నమైన శక్తి వృథా కాకుండా, బుద్ధిని ప్రచోదితం చేస్తుంది. ఆ శక్తి వల్ల మన మానసిక బుద్ధి వికాసాలు, జ్ఞానం, ఆలోచనలు మెరుగ్గా తయారవుతాయి. అలాగే, అది కోరికలను అదుపులో పెడుతుంది. ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపజేస్తుంది. శారీరక సామర్థ్యాన్ని పెంచుతుంది. అలాగే, మన మీద దుష్ప్రభావాలు పడకుండా చూస్తుంది. సోమరితనాన్ని పోగొడుతుంది. కంటిచూపును మెరుగుపరుస్తుంది. విజయపథంలో నడిపిస్తుంది.

చేసిన తప్పులకు తీవ్రంగా దండించాల్సి వస్తే, ఒకప్పుడు తల గొరిగించే పద్ధతి ప్రాచుర్యంలో ఉండేది. ఇలా శిరస్సు మీద జుట్టు మొత్తం తొలగించి, గుండు కొట్టించడాన్ని అవమానకరం అనుకొనేవారు. ఇంకా చెప్పాలంటే, తల గొరగడాన్ని మరణశిక్షగా భావించేవారు. తల గొరగడమంటే, తల తీయడమే అన్న మాట! అలా జుట్టు గొరిగివేతకు గురైన వారిని అందరూ చిన్నచూపు చూసేవారు. కాబట్టి, ఎవరూ ఎప్పుడూ ఎలాంటి తప్పు చేయడానికీ సిద్ధపడేవారు కాదు.

శిఖను వదిలి, మిగిలిన వెంట్రుకలను క్షవరం చేయడం వల్ల శరీర తాపం తగ్గుతుంది. తలపైన ఉండే పుండ్లు, చుండ్రు మొదలైనవన్నీ పోతాయి. క్షురకర్మ వల్ల శరీరం పుష్టిగా తయారవుతుంది. ఆయువు ఇనుమడిస్తుంది. పవిత్రత చేకూరుతుంది. అందం ఎక్కువ అవుతుందని 'చరక సంహిత' పేర్కొంటోంది. అంతేకాకుండా, మస్తిష్క మజ్జా తంతువులు చల్లబడి శక్తిమంతమవుతాయి. బుద్ధి వికసిస్తుంది. శీతలమైన శిరస్సు ఆరోగ్యానికి చిహ్నం.

## వైజ్ఞానిక విశ్లేషణ

శిఖ ఉండే చోటును ఆధునిక వైజ్ఞానిక పరిశోధనలో పీనియల్ గ్లాండ్ అంటారు. దాని కింది భాగంలో పిట్యూటరీ అనే ముఖ్యమైన గ్రంథి ఉంటుంది. పిట్యూటరీ గ్రంథి నుంచి వచ్చే ద్రవం, శరీరాన్ని శక్తిమంతం చేస్తుంది. అందువల్ల మానవుడు ఆరోగ్యంగా ఉంటాడు. దానితో పాటు జ్ఞానశక్తి సంపన్నుడవుతాడు. ఒకవేళ శిఖ స్థానంలోని వెంట్రుకలను కత్తిరించి వేసినట్లయితే, గ్రంథిలోని మార్పుల దుష్ప్రభావం శరీరం మీద పడుతుంది. శిఖ ఈ గ్రంథిని రక్షిస్తుంటుంది. పిట్యూటరీ గ్రంథి సరైన రీతిలో పనిచేయడానికి వీలు కల్పిస్తుంటుంది.

శిఖస్థానానికి కింది భాగంలో మస్తిష్కా నాభి మర్మస్థలం ఉంటుందని చెబుతారు. ఈ కేంద్రం వల్లే మానసిక శక్తికి వికాసం కలుగుతుంది. ఆ కేంద్రాన్ని జాగ్రత్తగా రక్షిస్తే, మేధాశక్తితో పనులు చేయగలుగుతాం. శిఖామూలంలోనే నిగ్రహం, వివేకం, దృఢత్వం, దూరదర్శిత్వం, ప్రేమ ఉంటాయి. ఆ కేంద్రాన్ని కాపాడకపోతే, శక్తి వికాసం నిరోధమవుతుంది. కాబట్టి, అన్ని రకాలైన శీత, తాపాదుల నుంచి దాన్ని కాపాడాలి. ❖

(వచ్చే సంచికలో 'ఆధ్యాత్మిక వివరణ')

## పండుగలు - పర్వదినాలు

### సెప్టెంబర్ - 2012

| | | | |
|---|---|---|---|
| 12 | బుధవారం | : | ఏకాదశి |
| 19 | బుధవారం | : | వినాయక చవితి |
| 26 | బుధవారం | : | ఏకాదశి |

### అక్టోబర్ - 2012

| | | | |
|---|---|---|---|
| 09 | మంగళవారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 11 | గురువారం | : | ఏకాదశి |
| 15 | సోమవారం | : | స్వామి అఖండానంద జయంతి |
| 24 | బుధవారం | : | విజయదశమి |
| 25 | గురువారం | : | ఏకాదశి |
| 29 | సోమవారం | : | లక్ష్మీపూజ |




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

# పరుల సేవలో పరమాత్మ దర్శనం

ముక్కుపచ్చలారని వయస్సులో వివాహం, యౌవనంలోకి అడుగుపెట్టే సరికి వైధవ్యం - ఇవేమీ ఆమె ఆత్మవిశ్వాసాన్ని ఇసుమంతైనా సడలించలేదు. కారణం కన్నవారి నుండి వారసత్వంగా సంక్రమించిన దైవచింతన. ఆ పరమాత్మునిపై ఉన్న అచంచల విశ్వాసమే ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొనే ధైర్యాన్నీ, శక్తినీ ప్రసాదించింది. పేరుకు తగ్గట్టుగానే ఆమె ఆర్తులకు అన్నపూర్ణ. కన్నబిడ్డలిద్దరినీ వృద్ధిలోకి తీసుకురావడమే కాకుండా, పరుల కోసం తన జీవిత చరమాంకం వరకు పాటుపడిన శ్రీమతి పులవర్తి జయలక్ష్మి అన్నపూర్ణ 1-10-1932 తేదీన మచిలీపట్నంలో జన్మించారు.


పులవర్తి జయలక్ష్మి అన్నపూర్ణ

పుట్టింది సామాన్య కుటుంబంలోనైనా, ప్రతికూల పరిస్థితులు ఎదురైనా దైవాన్నే నమ్ముకొని వాటిని ఎదుర్కోవడం వల్ల ఆ భగవంతుడు ఆమెకు సంపదను ప్రసాదించాడు. బంగారానికి తావి అద్దినట్లు రామకృష్ణ మఠ స్వామీజీల సాంగత్యం ఆమెలోని దయా గుణానికి కార్యరూపం ధరింపజేసింది. "సంపన్నులైనవారు తమ ధనంతో జనులను సేవించాలి" అన్న శారదాదేవి బోధనలు సేవాపథం వైపు నడిపించాయి. 1982లో పది మంది పేద వృద్ధ మహిళలతో 'బాలాజీ హోమ్' స్థాపించారు.

విజయవాడలోని భవానీపురంలో స్థాపించిన ఈ బాలాజీ హోమ్‌లో ఈ పదిమంది పేద వృద్ధ మహిళలకు స్వయంగా వండి వడ్డిస్తూ, లేవలేనివారి మలమూత్రాలు సైతం శుభ్రం చేస్తూ వారికి గీతాపఠనం, శ్రీరామకృష్ణ బోధనలు, లలితా సహస్రనామ పారాయణం, ఆరాత్రిక గానాలు వినిపించేవారు. రామకృష్ణమఠ స్వామీజీలను, శారదా మఠ మాతాజీలను ఈ హోమ్‌కు ఆహ్వానించి వారి ఆశీస్సులు, బోధనలు ఆ పేద వృద్ధ మహిళలకు అందింపజేసేవారు. మహిళల కోసం కుట్టుశిక్షణా కేంద్రాన్ని ఏర్పాటు చేసి ఎంతో మందికి ఉపాధి కల్పించారు. పేదలకు విద్య, వివాహం, ఉపాధి అవసరాలకు ధనసహాయం చేసేవారు. కొండపల్లిలో నిర్వహించే అనాథాశ్రమ బాలురకు కావాల్సిన సౌకర్యాలను సమకూర్చేవారు. భజన పుస్తకాలు ప్రచురించి ఉచితంగా అందజేసేవారు. విజయవాడలో ప్రభుత్వ వైద్యులు డాక్టర్ గోవిందరావు, డాక్టర్ శివరామకృష్ణయ్య మరికొందరు ఉదార వైద్యుల సహకారంతో 'శ్రీరామకృష్ణ వైద్య సేవా సమితి'ని స్థాపించి ఆ సంస్థ ద్వారా వందల మందికి ఉచిత వైద్య సేవలు, నేత్ర చికిత్స చేయించారు.

ఏ సేవ చేసినా ఆమె ఎవరి వద్దా ఆర్థిక సహకారం ఆశించకుండా కష్టార్జితాన్ని వినియోగించడం విశేషం. పూజ్య స్వామి భూతేశానందజీ మహరాజ్ వద్ద మంత్రదీక్ష స్వీకరించిన శ్రీమతి అన్నపూర్ణ విజయవాడలోని రామకృష్ణ మిషన్‌కీ, గుంటూరులోని శారదామఠానికీ భూరి విరాళాలను అందజేశారు. విరాళాల వివరాలను గోప్యంగా ఉంచేవారు.

ఒకనాడు శ్రీమతి అన్నపూర్ణ హైదరాబాద్ వచ్చి స్వామి రంగనాథానందజీ మహరాజ్‌ను కలసి తన సేవా కార్యక్రమాలు తెలియజేస్తూ ఆశీస్సులు అభ్యర్థించారు. ఒక మహిళ తన శక్తియుక్తులన్నీ వినియోగించి, పరుల కోసం జీవిస్తున్న విషయాన్ని ఆసక్తితో విన్న స్వామి రంగనాథానందజీ మహరాజ్ ఎంతో సంతోషించి, ప్రోత్సాహకరంగా ఆమెను అభినందించడమే కాక తమకు ఆ సమయంలో దక్షిణ (ప్రణామి)గా వచ్చిన పైకాన్ని అందజేసి ఆశీర్వదించారు. ఎవరి నుండీ ఆర్థిక సహాయాన్ని ఆశించని ఆమె స్వయంగా ఆ రామకృష్ణులే స్వామీజీ ద్వారా ఇస్తున్నట్లు భావించి, పైకాన్ని ఆనందంగా స్వీకరించారు.

ఈ పవిత్ర, ధీరవనిత చేసిన సేవలు పలువురికి స్ఫూర్తి దాయకంగా నిలుస్తాయనడంలో సందేహంలేదు. ప్రారబ్ధాను సారం జీవితంలో సంభవించిన కష్టాలను అనుభవిస్తూ, మూర్తిత్రయ సందేశాలను ఆచరణలో పెట్టిన ఈ త్యాగమయి 19-5-2011 తేదీన తన 79వ ఏట రామకృష్ణుల చరణామృతాన్ని స్వీకరించి, వారిని స్మరిస్తూ తుది శ్వాస విడిచారు. ❖

సేకరణ: ఎం. దాదారావు, డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి
అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

సదా దాతవై వర్ధిల్లు, సేవ చేయి. ఈ అశాశ్వతమైన ప్రపంచంలో తుప్పపట్టి నశించిపోవడం కన్నా ఈషణ్మాత్రమైనా పరులకు మేలు చేయడంలో అరిగిపోవడమే ఉత్తమం. - స్వామి వివేకానంద



# వినాయకుని విశిష్టత

– డాక్టర్ సముద్రాల లక్ష్మణయ్య

మనం నివసించే నేలను 'కర్మభూమి' అంటారు. మన జన్మలన్నీ కర్మలతో ముడిపడి ఉన్నాయి. 'కర్మ' అంటే క్రియ, లేక పని అని అర్థం. మానవాళికి కర్మలు జన్మహేతువులే కాక జీవనోపాయాలుగా కూడా ఉంటున్నాయి.

కర్మలు సత్కర్మలనీ, దుష్కర్మలనీ రెండు రకాలు. **'యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని'** అన్న వేదవచనాన్ని అనుసరించి సత్కర్మలే చేయాలి.

**'అత్రాహారార్థం కర్మ కుర్యాదనింద్యం'** – ఆహారం కోసం నింద్యం కాని కర్మ చేయాలని 'యోగవాసిష్ఠం' బోధిస్తుంది.

కర్మలు చేసేటప్పుడు ఎన్నో అంతరాయాలు ఏర్పడు తుంటాయి. 'విఘ్నాలకు భయపడి కొందరు కర్మలకు పూనుకోరనీ, మరికొందరు ప్రారంభించిన కర్మలకు విఘ్నాలు వస్తే విరమించుకొంటారనీ, ఉత్తములు ఎన్ని ఆటంకాలు ఎదురైనా ప్రారంభించిన పనిని పూర్తిచేసే వరకూ వదలర'నీ భర్తృహరి చెప్పాడు.

ఎంత పట్టుదలతో కార్యనిర్వహణకు పూనుకొన్నప్పటికీ తీవ్రాతితీవ్రమైన విఘ్నాలు ఏర్పడితే ఏం చేయాలి? ప్రయత్నం నుండి విరమించకతప్పని పరిస్థితి తప్పదు కదా! ఆస్తికులైన భారతీయులు తాము చేపట్టిన పనులకు విఘ్నాలు కలగకుండా ఉండాలని విఘ్నాలకు ప్రభువైన ఒక దేవుణ్ణి పూజిస్తారు. ఆ దేవుడే వినాయకుడు, గణపతి, విఘ్నేశ్వరుడు, గణనాయకుడు, గజాననుడు ఇత్యాదిగా పలుపేర్లతో వ్యవహరింపబడుతున్నాడు.

ఒక్క మానవులే కాదు, బ్రహ్మ మున్నగు దేవతలు కూడా తమ తమ కార్యాలు ప్రారంభించే వేళ గజవదనుణ్ణి భజించి కృతకృత్యులవుతారని ఈ క్రింది శ్లోకం చెబుతోంది.

**వాగీశాద్యా స్సుమనసః సర్వార్థానా ముపక్రమే ।**
**యః నత్వా కృతకృత్యాః స్యుస్తం నమామి గజాననమ్ ॥**

తలపెట్టిన పనులకు కలిగే విఘ్నాలను నివారించే దేవుడన్న విశ్వాసంతోనే జనులు పెళ్ళిళ్ళు, గృహ నిర్మాణాలు, విద్యాభ్యాసాలు, సంస్థల ప్రారంభాలు ఇత్యాది కార్యక్రమాలలో 'అవిఘ్నమస్తు' అంటూ తొలుత విఘ్నేశ్వరుణ్ణి పూజించడమనే సంప్రదాయం వేద కాలం నుండీ ఏర్పడింది. ఈ సందర్భాలు ఏర్పడితే సంవత్సరంలో ఎప్పుడైనా కార్యారంభంలో వినాయక పూజలు నిర్వర్తిస్తారు.

కానీ 'వినాయక చవితి' కాలంలో ఈ దేవునికి గణేశోత్సవాలు అన్న పేరుతో విశేష పూజలు జరుగుతాయి. తొమ్మిది దినాలకు విస్తరించిన ఈ ఉత్సవాలు మొదట మహారాష్ట్రలో ప్రారంభమై, క్రమక్రమంగా దేశంలోని ఇతర ప్రాంతాలకు ప్రాకాయి. గణపతిని ఉద్దేశించి చేసే నవరాత్రి ఉత్సవాలను ప్రజలు సమధిక ఉత్సాహంతో జరుపుకుంటున్నారు. భిన్న భిన్న వర్గాలకు చెందిన ప్రజలు ఒక్కటిగా చేరి వినాయకుణ్ణి ఆరాధించడం ద్వారా జాతీయ సమైక్యత కూడా వృద్ధి చెందుతుంది.

భాద్రపదమాసంలోని శుక్లపక్షంలో చతుర్థి (చవితి)ని 'వినాయక చవితి' పర్వదినంగా మనం జరుపుకొంటున్నాం. ఈ చవితి నాడే గణపతి ఆవిర్భవించాడు. ఈనాడు చేసే పూజలు, ఉపాసనలు అధికఫలాలను ప్రసాదిస్తాయని పురాణాలు ఘోషిస్తున్నాయి. భాద్రపద శుద్ధ చతుర్థినాడే శివుడు వినాయకునికి విఘ్నాలపై ఆధిపత్యమిచ్చాడు.

వినాయకుని జననం గురించి పలు కథలు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఒక ప్రసిద్ధ కథను ఇక్కడ సంగ్రహంగా ప్రస్తావించుకొందాం:

పార్వతీదేవి నల్గుపిండితో ఒక బాలుని బొమ్మను చేసి దానికి ప్రాణం పోసింది. ఆ బాలుణ్ణి కైలాసగిరికి కాపలాగా పెట్టింది. ఆ బాలుడు శివుణ్ణే లోనికి రానీకుండా అడ్డుకున్నాడు. ఆగ్రహించిన శివుడు అతని శిరస్సు ఖండించాడు. తదుపరి పార్వతి ప్రార్థన మేరకు మళ్ళీ ఏనుగు శిరస్సును అతికించి ఆ బాలుణ్ణి పునర్జీవితుణ్ణి కావించాడు.

విఘ్నేశ్వరుడు చవితినాడు భక్తులు సమర్పించిన భక్ష్యాలను మితిమీరి భుజించాడు. భుక్తాయాసంతో తల్లితండ్రులకు సాష్టాంగ

నమస్కారం చేయజాలక శ్రమ పడ్డాడు. అది చూసి శివుని శిరోభూషణమైన చంద్రుడు పరిహసించాడు. పార్వతికి కోపం వచ్చింది. చంద్రుణ్ణి చూసిన వారికి నీలాపనిందలు కలుగుతాయని శపించింది. పిదప దేవతల ప్రార్థనలు విని శాంతించి, శాపాన్ని భాద్రపద శుద్ధ చతుర్థీ కాలానికే పరిమితం చేసింది. గజాననుణ్ణి భక్తితో ప్రార్థిస్తే ఆ దినం కూడా శాపప్రభావం ఉండదని పార్వతీదేవి అనుగ్రహించిందని పురాణగాథ.

'గణపతి' పేరుతో ఏర్పడిన ఒక మతానికి 'గాణాపత్యం' అని పేరు. షణ్మతాలలో ఇదొకటి. గాణాపత్య సంప్రదాయంలో 'మహా గణపతి, హరిద్రా గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, నవనీత గణపతి, స్వర్ణ గణపతి, సంతాన గణపతి' అని షడ్విధ గణపతులు ప్రశస్తి పొందారు.

"బాల గణపతి, తరుణ గణపతి, భక్త గణపతి, వీర గణపతి, శక్తి గణపతి, ద్విజ గణపతి, సిద్ధి గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, విఘ్న గణపతి, క్షిప్ర గణపతి, హేరంబ గణపతి, లక్ష్మీ గణపతి, మహా గణపతి, విజయ గణపతి, నృత్త గణపతి, ఊర్ధ్వ గణపతి, ఏకాక్షర గణపతి, వర గణపతి, త్ర్యక్షర గణపతి, క్షిప్రప్రసాద గణపతి, హరిద్రా గణపతి, ఏకదంత గణపతి, సృష్టి గణపతి, ఉద్దండ గణపతి, ఋణవిమోచక గణపతి, ఢుంఢి గణపతి, ద్విముఖ గణపతి, త్రిముఖ గణపతి, సింహ గణపతి, యోగ గణపతి, దుర్గా గణపతి, సంకటహర గణపతి, వల్లభ గణపతి, సిద్ధిబుద్ధి గణపతి" అని ముప్ఫై నాలుగు విధాల గణపతులు భిన్న భిన్న రూపాలు గలవారై, భక్తుల సేవలను అందుకుంటున్నారు.

గణేశునికి 21 అనే సంఖ్య ప్రీతికరమైనదట! వినాయకచవితి నాడు విశేషించి ఏక వింశతి (21) పత్రాలతో వినాయకుణ్ణి అర్చిస్తారు. ఆ పత్రాలు ఓషధి జాతులకు చెందినవి కావడం గమనార్హం.

ఉత్తరేణి, జిల్లేడు, మద్ది, రావి, గన్నేరు, అడవిమొల్ల, మామిడి, జాజిమల్లె, తులసి, ఉమ్మెత్త, దానిమ్మ, గరిక, దేవదారు, రేగు, మారేడు, వాకుడు, మరువం, మాచీపత్రి, విష్ణుక్రాంతి, జమ్మి, వావిలి. ఈ 21 పత్రాల ప్రభావం గణేశతత్త్వాన్ని వివరించే గ్రంథాలలో విస్తృతంగా వర్ణితమైంది.

వినాయకుని లీలావిలాసాలు బ్రహ్మ–బ్రహ్మాండ–స్కంద–మౌద్గల పురాణాలలో కీర్తితమయ్యాయి. ఈ దేవుణ్ణి స్తుతించే స్తోత్రాలు కూడా అత్యధికంగా ఉన్నాయి. గణేశగీత, గణేశ సహస్రనామ స్తోత్రం ఇత్యాది గ్రంథాలు వినాయకుని ప్రశస్తిని వివిధ రీతులలో ప్రతిపాదిస్తున్నాయి.

గణేశ్వరుని శరీరంలోని అవయవాలు చూసేవారికి వింతగా కనిపిస్తాయి. ఉదాహరణకు ఆయన చెవులు చేటల వంటివి. చేట అనవసర పదార్థాన్ని, అవసరమైన పదార్థం నుంచి తొలగించడంలో సాయపడుతుంది. అలాగే, వినాయక దేవుడు భక్తుల మనోమాలిన్యం దూరం చేసి, వారిని నిర్మలచిత్తులను చేస్తాడు. ఈ రీతిగా తత్త్వజ్ఞులు వినాయకుని రూపాన్ని ఆధ్యాత్మికంగా సమన్వయం చేసి చెబుతారు.

వేదవ్యాసుడు లక్షశ్లోకాలు గల మహాభారతాన్ని రచించే సమయంలో వినాయకుణ్ణి వ్రాయసకాడుగా వినియోగించు కొన్నాడు. అప్పుడు భారతాన్ని వ్రాయడానికి లేఖినిగా తన రెండు దంతాలలో ఒక దంతాన్ని ఊడబెరికి ఉపయోగించాడనీ, అందువల్ల వినాయకుడు 'ఏకదంతుడ' య్యాడనీ అంటారు.

ఇలా విఘ్నేశ్వరుని విషయంలో అనేక విశేషాలు ప్రాచీన సారస్వతం నుండి తెలుస్తున్నాయి.

గణేశోత్సవాలలో వివిధరూపాలతో తయారు చేసిన విగ్రహాలను పూజించి చివరిదినాన ఊరేగిస్తారు. ఆపై ఆ విగ్రహాలను జలాశయాలలో కలిపివేస్తారు. మన శరీరాలు చివరికి పంచభూతాలలో కలిసిపోయేవే అన్న సత్యాన్ని చాటే ప్రక్రియ ఇది. అయితే హానికారకమైన రసాయనాలతో తయారు చేసిన విగ్రహాలను జలాశయాలలో కలపడం భావ్యం కాదు. ఈ విషయంలో అటు ప్రభుత్వమూ, ఇటు ప్రజలూ జాగరూకత వహించాలి.

**తుండము నేకదంతమును, తోరపుబొజ్జయు వామహస్తమున్** – ఇత్యాదిగా గణపతి ఆకారం చూసే వారికి హాస్యం కలిగించే ధోరణిలో ఉంటుంది. దీనికి తోడు ఈ దినాలలో ఆ దేవుణ్ణి నానావిధాల హాస్యాస్పదమైన రీతిలో విగ్రహాలుగా రూపొందించడం, చిత్రించడం చూస్తున్నాం.

ప్రాచీన సారస్వతంలో కూడా గణపతి ప్రస్తావన వచ్చినప్పుడు హాస్యస్ఫోరకంగా కవులు గణేశుని వర్ణించారు. ఉదాహరణకు మనుచరిత్రలోని **'అంకము జేరి శైల తనయా స్తన దుగ్ధములానువేళ...'** అన్న గణనాయిక ప్రార్థనలో వినాయకునికి కలిగిన భ్రాంతి వర్ణన పాఠకులలో హాస్యం కలిగేరీతిగా ఉంది. కానీ ఈ కాలంలో మరీ ఎబ్బెట్టుగా గణపతి రూపాన్ని చిత్రిస్తున్నారు. గణపతి దైవమైనప్పుడు అందుకు తగినట్లు ఆయనను రూపొందించడం సముచితమని గుర్తించాలి.

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే ॥**

అన్న శ్లోకం గణపతి ప్రార్థనగా సుప్రసిద్ధం. ఆబాల గోపాలానికి ఈ శ్లోకం పరిచితమే.

ఇందులో చెప్పినట్లు మనం ఆచరించే సత్కార్యాలలో సకల విఘ్నాలూ తొలగిపోవడానికి ఆ గణపతిని ధ్యానించి కృతార్థులమవుదాం. ఆధ్యాత్మిక–సామాజిక–అభివృద్ధికరమైన కార్యాలలో విజయం సాధిద్దాం.

గణేశోత్సవాలలో ప్రార్థనలతో పాటు దీనజనులపై కనికరం కలిగి దానధర్మాలు కూడా ఆచరించి మన జన్మల్ని సార్థకం చేసుకొందాం. ❖

**దస్తూరీని మెరుగుపరుచుకోవడానికి, వంకర టింకరగా పెద్దపెద్ద అక్షరాలను వ్రాయడం అభ్యసించినట్లు, ఏకాగ్రతను వృద్ధి చేసుకోవడం కోసం మొదట్లో విగ్రహారాధన ఉపకరిస్తుంది.** - శ్రీరామకృష్ణులు

మాయాబజార్

# ఓ మనిషీ! నిన్ను నువ్వు శోధించు

– స్వామి శితికంఠానంద

నారద మహర్షి వైకుంఠం నుండి సరాసరి సురలోకంలో ప్రత్యక్షమయ్యాడు. నిలింపులు భూలోకంలో మాయా విజృంభణ గురించి విష్ణుదేవుడు ఏమని తెలియజేశాడో తెలుసుకుందామని మహా కుతూహలంతో ఉన్నారు. మునీంద్రుడు తనకూ, శేషశయనుడికీ మధ్య జరిగిన సంవాదాన్ని యథాతథంగా వివరించాడు.

**నారద మహర్షి:** దేవేంద్రా! సర్వేశ్వరుడికి తన బిడ్డలైన మర్త్యులపై అహేతుక ప్రేమ. ఐతే ఆ ప్రేమ దుఃఖం రూపంలో, క్లేశాల రూపంలో ప్రసరిస్తుంది. 'తన నుంచి దూరమవుతూ మాయకు మనుషులు దగ్గరవుతున్నప్పుడల్లా అధికంగా ఇడుములను అనుభవించాల్సి ఉంటుంది' అని విష్ణుమూర్తి తెలియజేశాడు.

**దేవేంద్రుడు:** బాధల బరువుతో, క్లేశాలతో మనిషి క్రుంగిపోతాడు కానీ, భగవంతుడిపై ఎలా దృష్టిని ప్రసరింపజేయ గలడు?

**నారద మహర్షి:** వేదకాలంలో ఇంత సాంకేతిక పరిజ్ఞానం కానీ, ఇన్ని అనవసర వస్తువులు కానీ లేవు. ప్రపంచం ఇంత గోలగా లేదు. ప్రశాంతమైన వనాలలో సెలయేళ్ళ ధ్వని తప్ప వేరే శబ్దాలు లేని నిర్మల భౌతిక ప్రపంచంలో, కేవలం అడవులలో సహజంగా దొరికే కందమూలాలను ఆహారంగా గ్రహించి మునులు సృష్టి రహస్యాన్ని తెలుసుకోవడానికి ఉపక్రమించారు. తమ పూర్తి శక్తులను దానికై వెచ్చించారు. ఎన్నో ఏళ్ళ కొద్దీ ధ్యానం చేయగలిగారు. నారాయణుడి అనుగ్రహాన్ని పొందారు. విశ్వ రహస్యాన్ని తెలుసుకోగలిగారు.

**దేవేంద్రుడు:** ఈ మధ్య భూలోకంలో దైవకణాన్ని కనుక్కున్నామని భౌతిక శాస్త్రజ్ఞులు ప్రకటించారట! మరి ఇప్పటి శాస్త్రజ్ఞులు అభివృద్ధి చేసినట్లు ఆనాడు పరిశోధనశాలలు లేవుగా! మరి అప్పటివాళ్ళు సృష్టి రహస్యాన్ని ఎలా కనుక్కున్నారో!

**నారద మహర్షి:** దైవ 'కణమా'? దైవ మేమిటీ? కణ మేమిటీ? బాహ్య ప్రపంచాన్ని శోధించడం వలన కనబడేది దైవ 'కణం' కాదు; మాయా కణం. సృష్టికర్త తనను తాను సృష్టికి పైన నిలబెట్టుకున్నాడు. మనిషి తాను సృష్టికర్తను కానని సృష్టిలో భాగమని అర్థం చేసుకోవడం లేదు. తన అల్ప మేధస్సుకు అన్నీ అవగతం కావని తెలియకున్నాడు. ఈ ప్రయోగశాలలు, పరిశోధనలు పరమాత్మణ్ణి చేరుకోవడానికి నిష్ప్రయోజనాలు.

**దేవేంద్రుడు:** మరి సృష్టిరచనా శిల్పిని మనిషి ఎలా తెలుసుకోవాలి?

**నారద మహర్షి:** వేదకాలం నాటి మునులది నిజమైన తత్త్వ చింతన, జిజ్ఞాస. వాళ్ళు నిజమైన శాస్త్రవేత్తలు. వాళ్ళ మనస్సులు నోబెల్ పురస్కారాలపైన, ఇతర గుర్తింపులపైనా లేవు. బాహ్య ప్రపంచాన్ని శోధించడం వల్ల ప్రయోజనం లేదనీ, ఆ ప్రపంచాన్ని శోధించడానికి తమకు ఉపయోగించే మనస్సును శోధించడమే నిజమైన శోధన అనీ వారికి అర్థమైంది. అందుకని వారికి బాహ్య పరిశోధనా శాలలు అవసరం కాలేదు. దేశకాలాలకూ, కార్య కారణ సంబంధానికీ అతీతుడైన భగవంతుణ్ణి తమ బుద్ధితో అవగతం చేసుకోవడం అసాధ్యమని వారు గుర్తెరిగారు. తమను తాము తెలుసుకుంటే ప్రపంచాన్ని తెలుసుకున్నట్లవుతుందని గ్రహించారు. అందువల్ల ఆధ్యాత్మిక అనుష్ఠానానికి ఉపక్రమించారు. ధ్యానంతో, ప్రార్థనతో ఆలోచనలను నిగ్రహించారు. వ్యక్తిలోనే నిగూఢంగావున్న ఆనందధామాన్ని కనుక్కున్నారు.

**దేవేంద్రుడు:** వాళ్ళు అన్ని సంవత్సరాలు తమను తాము శోధించగలిగారు. ప్రస్తుత భూలోకవాసులు కొద్ది సమయం కూడా తమతో తాము, తమలో తాము ఉండలేకపోతున్నారు. మరి వాళ్ళ పరిశోధనా రహస్యాలను ఎలా అభినందించగలరు? ఆస్వాదించగలరు?

**నారద మహర్షి:** అవును దేవేంద్రా! ప్రస్తుత భూలోకవాసులు వారు కనుక్కొన్న జ్ఞానాన్ని ఆస్వాదించడానికి కూడా ఇబ్బంది పడుతున్నారు. కలియుగంలో మనిషి అన్నగత ప్రాణి కావున ముందు జీవనోపాధికై అన్వేషణ, తరువాత గురుతరమైన కుటుంబ బాధ్యత – వీటికే శారీరక మానసిక శక్తులను పూర్తిగా నియోగించాల్సి వస్తుంది. అందుకని వేదకాలం నాటి ఋషిసత్తములను ఇప్పుడు కానలేము. ఐనా ఈ యుగంలో నా లాగా సదా నారాయణుడి నామాన్ని స్మరిస్తే చాలు. వారు పొందిన ఫలాన్ని పొందవచ్చు. ఐతే దానికి విశ్వాసం అవసరమవుతుంది.

**దేవేంద్రుడు:** ఆ విశ్వాసాన్ని ఎలా పెంపొందించుకోవాలి?

**నారద మహర్షి:** ఆ విశ్వాసాన్ని పెంపొందించడానికే నేను సదా ముల్లోకాలు తిరుగుతూ భగవన్నామ మాహాత్మ్యాన్ని తెలియజేస్తున్నాను. పూర్వం శౌనకుడు అనే ముని పుత్రుడు బాలుడిగా ఉన్నప్పుడే తన తండ్రి దగ్గరకు వెళ్ళి, ఎంత తెలివైన ప్రశ్నను వేశాడు? ఆ ప్రశ్న ఈ రోజుల్లో పెద్ద వాళ్ళకు కూడా రావడం లేదు.

**దేవేంద్రుడు:** ఏమా ప్రశ్న? మా స్మృతి పథంలో స్ఫురించుట లేదు. అదేదో సెలవివ్వండి మహర్షీ!

**నారద మహర్షి:** వేదకాలంలో శౌనకుడు అనే గృహస్థుడు అంగీరస మునిని సమీపించి **"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి'**––ఓ సర్వజ్ఞా! దేనిని తెలుసుకుంటే అన్నింటినీ తెలుసుకున్నట్లవుతుందో తెలియజేయవలసింది' అని అడుగుతాడు. ఆనాటి ఋషులు మనిషి తన స్వల్ప జీవిత కాలంలో అన్నింటినీ తెలుసుకోలేడని గ్రహించి అన్నింటికీ మూలమైన తత్త్వాన్ని కనుక్కోవడానికి ఉపక్రమించారు, కనుక్కున్నారు. ఆ మహానుభూతితో సమస్త సందేహాలూ తీరిపోగా,

ఆ ఋషులు బ్రహ్మతేజస్సుతో వెలుగుతూ, స్వీయ ఔన్నత్య రహస్యానికి ఆశ్చర్యచకితులయ్యారు. తరువాత తరం వారిని కూడా ఆ ప్రయత్నంలో నిమగ్నమై జన్మను ధన్యం చేసుకోమని ఉద్బోధించారు.

**దేవేంద్రుడు:**'ఏది తెలుసుకుంటే అన్నీతెలుసుకున్నట్లవుతుంది?'

**నారద మహర్షి:** హా.. ఎంత వివేకంతో కూడుకున్న ప్రశ్న! మనిషికి ప్రపంచం ఒక ప్రబల ఆకర్షణగా ఉంటోంది. భగవానుడి సృష్టి రచనే అలా ఉంది. కఠోపనిషత్తులో మహర్షులు బోధించినట్లుగా, **'పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాణ్ పశ్యతి న అంతరాత్మన్'**.. స్వయంభువు ఐన పరాత్పరుడు మనిషి అంతరాత్మను దర్శించకుండా ఉండాలని అన్ని ఇంద్రియాలనూ బయట వస్తువుల వైపు పరుగిడేటట్లు చేశాడు.




ఈ మాయ చాలదన్నట్లు మనిషి తన బుద్ధిని ఉపయోగించి, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంతో వస్తు సముదాయాలను ఇబ్బడిముబ్బడిగా పెంచుకున్నాడు. తాను సృష్టించుకున్నవాటికే తాను బందీగా చిక్కాడు. మరణాన్ని దాటి అమృతత్వాన్ని సాధించుకోవడానికి అవకాశమున్న ఒకే ఒక్క జీవితం మానవ జీవితం అని తెలుసుకోలేకున్నాడు.

**దేవేంద్రుడు:** భరత ఖండవాసులకు ఆధ్యాత్మిక మార్గం తప్ప వేరే మార్గం లేదు అని మా భావన మునీంద్రా! తరతరాల ఆధ్యాత్మిక జ్ఞాన ప్రవాహం వాళ్ళను వేరే మార్గంలో వెళ్ళాలన్నా వెళ్ళనివ్వదు. ఈ మహాప్రవాహానికి ఎవరూ ఎదురీదలేరు. భారతీయుడు అంటేనే అలౌకికుడు. పారమార్థికవాది. కైవల్యాభిలాషి. ఈ మూడురోజుల ఇంద్రియ నిర్మిత శరీరాన్ని చూసి మురిసిపోయి దేహ తాదాత్మ్యంతో జీవించే వారు ఆర్యులు కానేరరు. ఒకవేళ అలా వస్తుప్రపంచమే, ధనమే సర్వమనుకొని జీవించాలనుకున్నా ఒక వెలితి ఇలావర్తనంలోని మనిషిని సదా పీడిస్తుంది.

**నారద మహర్షి:** అలా వెలితిని అనుభవిస్తూ కొంచెం పరావిద్యను రుచి చూసిన వ్యక్తులు కూడా నిర్వాణసౌఖ్యం దుర్లభ మనుకొని శక్తికొద్దీ ప్రయత్నం చేయలేకపోతున్నారు. కలియుగం దోషభూయిష్ఠ మైనప్పటికీ మిగతా యుగాల కన్నా ఈ యుగంలో పుట్టడం మహాభాగ్యమని జనులకు బోధపడడం లేదు.

**దేవేంద్రుడు:** మహాభాగ్యమా! ఇదేదో ఆశ్చర్యంగా ఉంది మహర్షీ! కలియుగంలో ధర్మం ఒక్క పాదం మీద నడుస్తుందనీ, మోక్షధర్మం కుంటుపడుతుందనీ విన్నాం ఇప్పటివరకు. మీరేమో ఈ యుగంలో పుట్టడం అదృష్టమని బోధిస్తున్నారు. మా సందేహం నివృత్తి చేసి మమ్మానందింపజేయ ప్రార్థన.

**నారద మహర్షి:** సురాధీశా! భాగవత మహాపురాణంలో శుక మహర్షి, పరీక్షిత్తు మహారాజుకు ఈ విధంగా తెలియజేస్తాడు:

**కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః ।**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసంగః పరం వ్రజేత్ ॥**

'కలియుగం దోషనిధి ఐనప్పటికీ ఒక మహాగుణాన్ని కలిగి ఉంది. కేవలం భగవానుణ్ణి కీర్తించడం ద్వారానే ముక్తిని పొందవచ్చు'.

**దేవేంద్రుడు:** భూలోకంలో కూడా మానవులు పిల్లలకు చిన్నప్పటి నుంచీ భగవన్నామ మాహాత్మ్యాన్ని అలవాటు చేసి ఆధ్యాత్మిక పథంలో ప్రవేశపెడితే వారు కూడా ధ్రువుడు, మార్కండేయుడు, ప్రహ్లాదుడు లాగా జ్ఞానవంతులు అవుతారు.

**నారద మహర్షి:** ప్రహ్లాదుడికి గురువులు బోధించే టప్పుడు వాళ్ళు బోధించేవన్నీ పనికిరానివని తెలిసింది. ఆధ్యాత్మిక జ్ఞానమే పరమజ్ఞానమనీ అర్థమైంది. ప్రహ్లాదుడికి చండామార్కులు చెప్పినట్లుగా ప్రాపంచిక విషయాలు చెప్పే గురువులు తప్ప జగత్తుకు ఆధారభూతమైన భగవత్తత్త్వాన్ని తెలిపే గురువులేరీ? భగవంతుడి గుణకథనాలను చిన్నప్పటి నుంచి చెప్పగలిగే ఆధ్యాత్మిక సంస్కారం ఉన్న తల్లులేరీ? నా ఆశ్రమవాసం ప్రాప్తించింది కాబట్టి నేను హిరణ్యకశిపుడి సతి లీలావతికి భాగవత గాథలు వినిపించాను. ఆమె గర్భంలో శిశువుగా ఉన్న ప్రహ్లాదుడు ఆ జ్ఞానాన్ని గ్రహించి పరమ భాగవతోత్తముడు అయ్యాడు.

**దేవేంద్రుడు:** ఆ సంస్కారాన్ని అలవరచుకోవడమే విద్య యొక్క పరమ ప్రయోజనమని ఇలావర్తనులు గ్రహించెదరు గాక! సదా దైవనామాన్ని గ్రోలుతూ ముల్లోకాలు సంచరించే మీరు భూలోక సంచారంతో సేకరించిన వార్తలు మాతో పంచుకోవాల్సిందిగా సురలోకవాసుల తరపున దేవర్షుల వారికి మా అభ్యర్థన.

**నారద మహర్షి:** అంతా సర్వేశ్వరేచ్ఛ! 'నారాయణ... నారాయణ...' (నారద మునీంద్రుడు దేవసభ నుంచి నిష్క్రమిస్తారు). ❖

**బాహ్యప్రకృతి అధ్యయనం మనల్ని శక్తిమంతుల్ని చేయదు. మనలోని అంతశ్శక్తి బాహ్యప్రకృతి ధర్మాలన్నింటినీ అధిగమిస్తుంది. ఈ అంతఃప్రవృత్తే మన నిజస్వరూపాన్ని తెలుపుతుంది.** - *స్వామి వివేకానంద*

# జీవితమే ఓ పరీక్ష

- శ్రీమతి సుధామూర్తి, చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్



జీవితంలో ఎదురయ్యే విషమ పరిస్థితులకూ, అది పెట్టే పరీక్షలకూ ఒక్కొక్కరు ఒక్కోలా ప్రతిస్పందిస్తారు. సాధారణ సమయాల్లో ఎంతో విజ్ఞతగా, వివేకంగా మసలుకునే వ్యక్తులు కూడా ప్రతికూల సమయాల్లో చాలా అనాలోచితంగా ప్రవర్తిస్తూ ఉంటారు. జీవితం పెట్టే పరీక్షల్లో ఘోరంగా విఫలమవుతూ ఉంటారు. ఈ విషయానికి సంబంధించి మిత్రులు సుమిత్ర, సురేశ్‌ల ఉదంతం నన్ను ఎంతగానో ఆలోచింపజేసింది. మేము ముగ్గురం బాల్యస్నేహితులం. చాలా ఏళ్ళపాటు కలిసే చదువుకున్నాం. సుమిత్ర చదువులో ఎంతో తెలివిగా, చురుగ్గా ఉండేది. ఏ పనైనా ఉత్సాహంగా తనే ముందుండి చేసేది. సుమిత్రలా చురుగ్గా ఉండకపోయినా, సురేశ్ చాలా మంచివాడు. నెమ్మదస్థుడు. ఒకరినొకరు ఇష్టపడి పెళ్ళిచేసుకున్నారు. తరువాత సురేశ్ కష్టపడి వ్యాపారం చేసి బాగా సంపాదించాడు. సుమిత్ర కూడా అతనికి ఎంతో సహకరించింది. అప్పుడప్పుడూ నేను వాళ్ళను కలుస్తూ ఉండేదాన్ని. వాళ్ళ తోటలో కూర్చొని, చిన్ననాటి కబుర్లను నెమరువేసుకుంటూ ఉండేవాళ్ళం.

సుమిత్ర, సురేశ్‌లు పైకి సంతోషంగా ఉన్నా, వాళ్ళ మనస్సులో కాస్త విచారఛాయలు కనిపించేవి. వాళ్ళకు సంతానం లేదు. ఏ కారణం చేతనో పిల్లల దత్తతకు కూడా వాళ్ళు అంతగా సుముఖత చూపలేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఒకరోజు సుమిత్ర నాకు ఫోన్ చేసి, 'సాయంకాలం భోజనానికి రాగలవా?' అని ఆహ్వానించింది. ఎప్పుడూ పిలిచినట్లే, ఈసారి కూడా భోజనానికి పిలిచారనుకున్నాను. కానీ నేను వాళ్ళింట్లో అడుగుపెట్టిన తరువాత తెలిసింది, అక్కడేదో విషాదం అలముకుందని!

నన్ను చూసేసరికి సుమిత్రలో దుఃఖం కట్టలు తెంచుకుంది. అలా ఏడుస్తూనే అసలు విషయం చెప్పింది 'ఈ రోజు మెడికల్ చెకప్‌కి వెళ్ళాను. ఎప్పటిలాగే అంతా బాగుందనే రిపోర్ట్ ఇస్తారనుకున్నాను. కానీ నా మూత్రపిండాలు దెబ్బతిన్నాయని డాక్టర్లు చెప్పారు' అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది. పాపం! కిందటి ఏడాదే, సురేశ్‌కు కూడా గుండెపోటు వచ్చింది. ఒకరికొకరుగా బతుకుతున్నారు. గుండెలు పగిలే ఇలాంటి వార్తలు వాళ్ళకు బాధ కలిగించడంలో ఆశ్చర్యమేమీ లేదు. అయితే ఎంత బాధలో ఉన్నా సురేశ్ ఆచరణాత్మక దృక్పథంతో ఆలోచిస్తాడు. అందుకే 'మనమిప్పుడు మిగిలిన కాలంలో డబ్బు ఎలా ఖర్చుపెట్టాలో ఆలోచించాలి. మనకు వారసులు కూడా లేరు. సమాజంలో ఎందరో అనాథ పిల్లలున్నారు. వారందరినీ మన పిల్లలే అనుకుందాం. మన సంపదతో వారిలో కొందరికైనా అండగా నిలబడదాం' అన్నాడు సురేశ్. కానీ సుమిత్ర భర్తతో విభేదించింది. అసహనంతో ఊగిపోయింది. 'నేనెప్పుడూ నా సొంతానికి ఖర్చుపెట్టుకోలేదు. ఇక ఎంతకాలం బతుకుతానో తెలియదు. అందుకే నా ఇష్టమైన రీతిలో జీవితాన్ని అనుభవిస్తాను. ఉల్లాసంగా గడిపేయాలనుకుంటున్నాను' అంది సుమిత్ర. నేనేం మాట్లాడలేకపోయాను.

రోజులు గడిచిపోతూ ఉన్నాయి. సురేశ్ కన్నా సుమిత్రనే ఎక్కువసార్లు కలిశాను. ఆమె పూర్తిగా తన జీవనశైలినే మార్చేసుకుంది. ఫ్యాషన్ దుస్తులు, వజ్రాల నగలు ధరించడం, ఖరీదైన జీవితాన్ని గడపడం అలవాటు చేసుకుంది. మనస్సులోని విషాదాన్ని మరచిపోయేందుకు, బాహ్యప్రపంచంలోని ఆకర్షణల చుట్టూ పరుగెత్తింది. శ్రీమంతుల సహవాసంలో ఆడంబరాలకు అలవాటు పడింది. సురేశ్ మాత్రం ఎంతో నిబ్బరంగా, ఎప్పటిలానే జీవిస్తూ ఉన్నాడు. అప్పుడప్పుడూ మా సేవాకార్యక్రమాల గురించి వివరాలు అడిగేవాడు.

ఒకరోజు సురేశ్ నాకు ఫోన్ చేసి ఒకసారి ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. వెళ్ళాక ఆయన రాసిన వీలునామా చూసి విస్తుపోయాను. ఆర్థికస్థోమత లేని అనాథ పిల్లలకు ఉపకార వేతనాలు ఇచ్చే ఏర్పాటు చేయాలనీ, విద్యాసంస్థలకు, గ్రంథాలయాలకు విరాళాలివ్వాలనీ నిర్ణయించుకున్నాడు. ఎక్కడా తన పేరు ప్రస్తావించవద్దనీ, అన్ని విరాళాలనూ తన భార్య పేరు మీదే ఇవ్వాలనీ వీలునామా రాశాడు. అతనికేసి ఆశ్చర్యంగా చూశాను. 'అవును. మా అభిప్రాయాలు వేరుగా ఉండవచ్చు. కానీ ఆమె సహాయం లేకపోతే నేను వ్యాపారంలో ఇంత అభివృద్ధి సాధించలేకపోయేవాణ్ణి. ఎంతోమంది అభాగ్యులైన చిన్నారులు చల్లని తల్లిగా సుమిత్రను తలచుకుంటే చాలు' అన్నాడు. వారం రోజుల తరువాత సుమిత్ర ఆరోగ్యం క్షీణించింది. నేను ఆసుపత్రికి చేరుకునేసరికే ప్రాణం పోయింది. ఆమె బ్యాంకు ఖాతాల్లో రూపాయి కూడా మిగల్లేదని తెలిసింది. తోడు లేరన్న దిగులుతో ఏడాదికి సురేశ్ కూడా నిద్రలోనే కన్నుమూశాడు. సుమిత్ర పేర పిల్లలకు సాయం అందిస్తున్నప్పుడల్లా ఇద్దరూ గుర్తొస్తారు. తాము ఎక్కువ కాలం బతకమని ఇద్దరికీ తెలుసు. కానీ వాస్తవాన్ని ఎదుర్కోవడంలో ఇద్దరూ వేర్వేరు మార్గాలను ఎంచుకున్నారు. ❖

సేకరణ : జి. సతీష్

# అంతశ్చేతనే మనకు ఆలంబన

– స్వామి బోధమయానంద

విదేశంలోని ఒక వ్యాపారవేత్త అనుకోని పరిస్థితుల్లో ఘోరంగా దివాళా తీశాడు. ఫలితంగా అప్పుల్లో కూరుకుపోయాడు. మరోవైపు ఆయనకు డబ్బులు ఇవ్వాల్సిన వ్యక్తులు కూడా ముఖం చాటేస్తూ ఉన్నారు. ఈ విషయం తెలిసిన అప్పుల వాళ్ళు తీవ్రంగా ఒత్తిడి తెస్తూ ఉన్నారు. పరిస్థితి అగమ్యగోచరమైపోయింది.

ఎంతో ఆందోళనతో ఆ వ్యాపారి ఒక రోజు తన ఇంటికి సమీపంలోని ఓ ఉద్యానంలోకి వెళ్ళి, తలపై చేతులు పెట్టుకొని విషాదంగా కూర్చున్నాడు. ఇంతలో హుందాగా వస్త్రధారణ చేసుకున్న ఓ అరవై ఏళ్ళ వృద్ధుడు ఆయన వద్దకు వచ్చాడు. "ఏదో కోల్పోయిన వాడిలా ఉన్నావు. జీవితంలో ఏమైనా నష్టం వాటిల్లిందా?" అని అడిగాడు. ఎంతో ఆత్మీయంగా పలకరించే సరికి, కదలిపోయిన ఆ వ్యాపారి తన కష్టనష్టాల్ని ఆ పెద్దాయనకు వివరించాడు. వెంటనే ఆ వృద్ధుడు స్పందించి "నేను నీకు ఏదైనా సహాయం చేద్దామనుకుంటున్నాను" అంటూ, "నీ పేరేంట"ని అడిగాడు. ఆ వ్యాపారి తన పేరు చెప్పగానే వెంటనే తన చెక్‌బుక్‌ను జేబులో నుంచి తీసి, ఆ పేరుతో చెక్ రాసి, సంతకం చేసి వ్యాపారి చేతిలో పెట్టాడు. "ఈ చెక్కు తీసుకో. నేను దీన్ని నీకు అప్పుగా ఇస్తున్నాను. సరిగ్గా సంవత్సరం తరువాత నేను నిన్ను ఇక్కడే కలుస్తాను. అప్పుడు నా అప్పు తీర్చేయ్" అన్నాడు. అయిదు లక్షల డాలర్ల చెక్కు అది. పైగా ఇచ్చిన వ్యక్తి ఎవరో కాదు – ప్రపంచంలోనే అత్యంత శ్రీమంతుల్లో ఒకరైన రాక్‌ఫెల్లర్ అని తెలిసి వ్యాపారికి నోట మాట రాలేదు.

ఆ చెక్కు తీసుకొని ఇంటికి చేరుకున్నాడు ఆ వ్యాపారి. కానీ దాన్ని నగదుగా మార్చుకొని అప్పులు తీర్చుకోలేదు. దాన్ని బీరువా అరలో పెట్టుకొని, అది ఉందన్న నమ్మకంతో ముందు తన వ్యాపారాన్ని చక్కదిద్దుకోవడం మొదలుపెట్టాడు. ఆ అయిదు లక్షల డాలర్లు తన వెనుక ఉన్నాయన్న విశ్వాసంతో ధైర్యంగా ముందడుగు వేశాడు. అప్పుల వాళ్ళ వద్దకు వెళ్ళి, కొద్దిరోజులు గడువు ఇవ్వమని అడిగాడు. తనకు రావలసిన మొత్తాన్ని చాకచక్యంతో రాబట్టుకున్నాడు. తిరిగి కొంత పెట్టుబడితో కొత్త వ్యాపారం ప్రారంభించాడు. కొన్నాళ్ళకు మళ్ళీ తన పూర్వవైభవానికి చేరుకున్నాడు. సరిగ్గా సంవత్సరం తరువాత అదే చెక్కు తీసుకొని, కృతజ్ఞతలు చెప్పుకొని ఇచ్చేసేందుకు అదే ఉద్యానానికి వెళ్ళాడు. సాయంత్రానికి ఆ వృద్ధుడు మళ్ళీ అక్కడకు వచ్చాడు. ఎంతో ఆనందంతో ఈ వ్యాపారి ఆయన వద్దకు వెళ్ళబోతుండగా, దూరంగా ఉన్న ఓ సంచార వాహనం (మొబైల్ వ్యాన్) నుంచి నర్సు దిగి పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆ వృద్ధుడిని పట్టుకొని "హమ్మయ్య! ఇప్పటికి దొరికాడు. పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి వచ్చి, కనిపించిన వారికల్లా, 'నేను రాక్‌ఫెల్లర్‌ని' అంటూ చెక్కులు రాసి ఇచ్చేస్తున్నాడు" అంటూ డ్రైవర్ సహాయంతో ఆ వాహనంలోకి అతణ్ణి ఎక్కించుకొని తీసుకువెళ్ళిపోయింది. వ్యాపారి ఆనందాశ్చర్యాలకు గురయ్యాడు. ఇన్నాళ్ళూ తన దగ్గర ఉన్నది ఓ చెల్లని చెక్కనీ, దానిపై భరోసా పెట్టుకొని ఇంత సాధించానా అనీ ఆత్మశోధన చేసుకొని పులకరించిపోయాడు.

నిజానికి ఆ వ్యాపారికి బయట నుంచి ఏ సహాయమూ అందలేదు. కానీ తనలో అచేతనంగా ఉన్న ఆత్మవిశ్వాసాన్ని తట్టి లేపేందుకు ఆ చెల్లనిచెక్కు ఉపయోగపడింది అంతే! అదే విధంగా చాలాసార్లు మనం బయట నుంచి ఏదో ఒక ఆలంబన కావాలని తపించిపోతూ ఉంటాం. కానీ అది కొంత వరకే మనకు సహకరిస్తుంది. ఎప్పుడైనా మనకు వాటిల్లిన ఉపద్రవం నుంచి బయటపడడానికి పూర్తిగా బాధ్యత వహించాల్సింది మనమే! అందుకే స్వామి వివేకానంద 'బాహ్యప్రపంచం నుంచి ఎవరికీ, ఎప్పుడూ ఏ సహాయమూ అందదు. ఎవరికి వారే ఆలంబనగా నిలిచి, నిలదొక్కుకోవాలి. అలాంటివారే గొప్ప విజయాలను సాధించగలరు' అనేవారు.

ప్రాథమికంగా బాహ్యప్రపంచం నుంచి కొంత స్ఫూర్తి పొందడంలో తప్పు లేదు. కానీ అది మనలోని ఆత్మపరిశీలనకూ, ఆత్మవిశ్వాసానికీ సోపానం కావాలి. మనలోని అంతః చేతన (subconscious)ను తట్టిలేపాలి. అందుకే ప్రముఖ ఆంగ్ల రచయిత డాక్టర్ జోసెఫ్ మర్ఫీ 'Your subconscious speaks to you in intuitions, impulses, hunches, intimations, urges and ideas and it is always telling you to rise, transcend, grow, advance, adventure and move forward to greater heights' అంటారు. ఇలా అంతశ్చేతన మనలోని సహజజ్ఞానాన్నీ, సత్యస్ఫురణనూ, ఉదాత్తభావాలనూ, ఆశయాలనూ, సానుకూల అంశాలనూ జాగృతపరచినప్పుడు ఉన్నతస్థితికి చేరుకోగలం. ❖

నీకు కావలసిన సహాయం అంతా నీలోనే ఉంది. నీ భవితవ్యాన్ని నీవే నిర్మించుకోవాలి. నిన్ను నువ్వే ఉద్ధరించుకోవాలి. నీకు నువ్వే ప్రబల శత్రువువి, నీకు నువ్వే ప్రగాఢ మిత్రుడవు. - స్వామి వివేకానంద

# మనకోసమే

ఒకసారి మా స్నేహితుడితో అనుకోకుండా, ఓ పరిచయస్థుడి ఇంటికి వెళ్ళాల్సి వచ్చింది. ఉదయమే కావడంతో వాళ్ళంతా పిల్లల్ని బడికి పంపే హడావిడిలో ఉన్నారు. బ్యాగులు సర్దడం, బాక్సులు కట్టడంలో మునిగిపోయారు. ఇంతలో ఎనిమిదేళ్ళ వాళ్ళ బాబుకు టిఫిన్ బాక్సు కడుతూ తల్లి ఎన్నో జాగ్రత్తలు చెబుతూ 'చిన్నా! చపాతీలు పెట్టాను! అన్నీ తిను, పారవేయకు. ఎవరికీ పెట్టకు, నువ్వొక్కడివే తిను. ఇదిగో కొత్త పెన్సిల్ పెట్టాను. కుదురుగా రాసుకో. మీ ఫ్రెండ్స్ ఎవరు అడిగినా ఇవ్వకు' అంటూ పుస్తకాల బ్యాగులో టిఫిన్ డబ్బా, అవీ సర్దిపెట్టింది.

ఆమె ఏదో యాదృచ్ఛికంగా అలా అని ఉండవచ్చు. కానీ ఇలా చిన్నప్పటి నుంచే 'నువ్వొక్కడివే తిను; ఎవరికీ పెట్టకు' అని మనం చెవిలో జోరీగలా పోరుతూ ఉంటే, చివరకు పెద్దయ్యాక మనకు కూడా అన్నం పెట్టడు; మనం ఏదడిగినా ఇవ్వను పొమ్మంటాడు. తనొక్కడే ఉంచుకోవడం కాదు; నలుగురితో పంచుకోవాలన్న ప్రాథమిక సుగుణాన్ని చిన్నప్పటి నుంచే అలవాటు చేయాలి. మనమొక్కరమే సుఖంగా ఉండడం కాదనీ, పక్కవారికి కూడా ఆ సుఖం దక్కాలనీ ప్రతి ఒక్కరం అనుకోవాలి. కానీ దురదృష్టవశాత్తూ మనలో ఈ విశాల హృదయం కరవవుతోంది. ప్రతిదీ తనకే కావాలనీ, మన ఒక్కరి జీవితాలే సుభిక్షంగా ఉండాలనీ కాంక్షించడం ఎక్కువైపోయింది. స్వార్థపూరితమైన ఇలాంటి ఆలోచనల వల్ల మనం ఎంత ఆర్జించినా సంతృప్తి కనిపించడం లేదు. ఇలా ఆధునిక సమాజంలో చాలామందిలో ఈ పంచుకునే గుణం కుంచించుకు పోతోంది. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస – "ఈ జనం పిల్లల పెళ్ళికని వేలకు వేల రూపాయలు ఖర్చుపెడతారు. కానీ పక్కింటివాడు తిండిలేక మాడుతూ ఉంటే అతడికి పట్టెడన్నం పెట్టడానికి ఎంతగానో బాధపడతారు! ఒకపక్క జనులు 'అన్నమో రామచంద్ర!' అని అల్లాడుతూ ఉంటే 'నేనేం చేయగలను? నాకు కావలసిందల్లా నేనూ, నా కుటుంబం హాయిగా ఉండటమే!" అంటారు.

**పంచుకుంటే పరమానందం! :** పూర్వం మన పెద్దలకు ఇళ్ళలో ఎలాంటి ఆధునిక సామగ్రి లేకపోయినా, ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉన్నా తాము తాగే కలో, గంజో నలుగురితో పంచుకొని ఆనందపడే స్వభావం ఉండేది. కానీ ఇప్పుడు మన ఇళ్ళన్నీ లక్షల ఖరీదు చేసే వస్తువులతో నిండి ఉంటున్నా, మనస్సు మాత్రం మన ముత్తాతల చర్మం కన్నా మరింత ఎక్కువగా ముడుచుకు పోతోంది. చాలామంది ఇళ్ళలో తమ వంటగదుల్ని ఆధునికమైన సొబగులతో తీర్చిదిద్దుకుంటూ ఉంటారు. కానీ, ఇంటికి ఓ వ్యక్తి వస్తే కాస్త అన్నం వండిపెట్టడానికి అనిష్టం వ్యక్తం చేస్తారు. అపసోపాలు పడుతూ ఉంటారు. పెట్టాలన్న మంచి మనస్సు లేనప్పుడు, క్షణాల్లో వంట సిద్ధం చేయగలిగిన సౌకర్యాలు ఇంట్లో ఎన్ని ఉండి ఏం లాభం? అందుకే శ్రీమద్భాగవతంలో కశ్యప ప్రజాపతి, తన భార్య అదితితో...

**అన్నమైన దక్రమైన తోయంబైన**
**శాకమైన తనకు జరుగు కొలది**
**నతిథి జనులకడ్డమాడక యిడరేని**
**లేమ! వారు కలిగి లేనివారు...**

'అన్నమైనా, మజ్జిగైనా చివరకు కూరగాయలైనా తమకు ఉన్నంతలో అతిథులకూ, ఇతరులకూ లేదనకుండా పెట్టాలి. అలా పెట్టకపోతే ధనవంతులైనా వారు దరిద్రులే' అంటాడు. కానీ మనలో కొంతమంది మధ్యాహ్న భోజనవేళ వచ్చిన అతిథికి కూడా కాసిన్ని టీ నీళ్ళిచ్చి సాగనంపుతూ ఉంటారు.

**మన చిన్నిపొట్టకే శ్రీరామరక్షా? :** మన సంతోషాలు, మన సుఖాలే ముఖ్యమనుకునే సంకుచిత భావాల నుంచి బయట పడాలి. కలలో కూడా ఊహించలేని సుఖాల్ని, మనం ఒక్కరమే కలకాలం అనుభవించాలని తాపత్రయపడుతూ వాటిలో ఓలలాడడం పాపంతో సమానం. ఎదుటివారికి కష్టాలు రావడం వారి కర్మ కావచ్చు. కానీ వాటిలో మనమూ పాలుపంచుకొని సాయపడడం మన 'సుకర్మ' అనుకోవాలి. వందల మందికి ఉండాల్సిన సంపద భగవంతుడు మనకొక్కరికే ప్రసాదించాడంటే, దాని అర్థం మనం, మన పిల్లలే అనుభవించమని కాదు! ఆ వందలాది జనాలకు పంచకపోయినా, కనీసం జీవితకాలంలో పదిమందికైనా మంచి చేస్తామేమోనని దేవుడు నిరీక్షిస్తూ ఉంటాడు. మన జీవితకాలంలో చివరకు ఒక్కరికి కూడా మన సంపదను పంచకపోతే, పది జన్మల పాటు మనల్ని కటిక

దరిద్రులను చేస్తాడు. 'నా చిన్నిపొట్టకు శ్రీరామరక్ష' అనుకోకుండా, ఎదుటివారి పొట్ట గురించి కూడా కాసేపు ఆలోచిస్తేనే ఆ రాముడు కూడా మన పొట్టల్ని రక్షిస్తాడు. దానానికే మారుపేరైన రంతిదేవుడు ఓ మారు భగవంతుణ్ణి ప్రార్థిస్తూ 'గొప్పవాడినో, నీలా దేవదేవుడినో కావాలని నాకు లేదు. నాకు అష్టవిధాలైన శక్తులూ వద్దు; మోక్షం కూడా వద్దు. కానీ నా తోటివారి బాధల్ని నాపైకి తీసుకొని, వారి మనస్సులో ప్రవేశించి, వారి బాధల్ని భరించే శక్తి నాకు కావాలి' అంటాడు. అంతటి స్నిగ్ధ హృదయాలకే దేవుడు కూడా తన అమృతతుల్యమైన ఆశీస్సులను అందిస్తాడు.

**వారి చిరునవ్వులే మంచికి చిరాయువు! :** అన్నీ సానుకూలంగా అమరిన భద్రమైన జీవితాలు చాలామందికి అసాధ్యం. అలాంటి వారి సమస్యల్లో ఏ ఒక్కటైనా మనం తీర్చే ప్రయత్నం చేసినప్పుడే మనకు అసలైన ఆత్మసంతృప్తి లభిస్తుంది. కళాశాలలో చదువుకునే రోజుల్లో, తన తోటి విద్యార్థులకు ఫీజు డబ్బులు లేనప్పుడు స్వామి వివేకానంద తనే ముందుండి ఆ సమస్యను తీర్చేవారు. ఎదుటివారి ఏ చిన్న కష్టాన్నైనా తనదిగానే భావించి తపించిపోయేవారు. మరొకరి కాలికి ముల్లు గుచ్చుకుంటే, తన కంటిలో గుచ్చుకున్నంత విలవిల్లాడిపోయేవారు. అందుకే ఆయన మహానుభావులయ్యారు. ఇప్పటికీ కొంతమంది యువతీ యువకులు తమ జీతంలో కొంత మిగుల్చుకొని, అనాథలకు, అభాగ్యులకు సహాయపడుతూ ఉంటారు. తమ సరదాలను కొన్నింటిని త్యాగం చేసుకొని, అవసరమైన చిన్నారులకు, ఆర్తులకు పంచుతూ ఉంటారు. వారు నిజంగా అభినందనీయులు, ధన్యులు! ఇలాంటి పునాదిరాళ్ళయిన యువతరంపైనే నవసమాజం నిర్మాణమవుతుంది. ఆధారం లేక అలమటించే వారికి ఏ కొంత చేయూతనిచ్చి, వారి ముఖాన చిరునవ్వులు చిందింపజేసినా అది మంచి మనస్సులకు చిరాయువు నిస్తుంది. అందుకే రాల్ఫ్ వాడో ఎమర్సన్ 'Make yourself necessary to somebody' అంటారు. మనకున్నదాన్ని ఒకరితో పంచుకోవడానికి, మనస్సు ముందు కాస్త గింజుకుంటుంది. అయినా ఇవ్వడంలోని ఆనందాన్ని మనస్సుకు అలవాటు చేయాలి. ఆనక అది పొందే ఉల్లాసాన్ని అనుభూతి చెందమనాలి.

# కాదు...

– బి. సైదులు

**పంచకపోతే ప్రమాదమే! :** 'ఊపిరున్నప్పుడే ఇచ్చుగా నీవు ఇవ్వగలిగినంతా ఇచ్చేయ్. ఇవ్వలేనని పిడికిట్లో దాచుకొని కూర్చుంటే, మృత్యువు బలవంతంగా నీ మణికట్టు పట్టుకొని పిడికిలి విడిపించి మరీ ఇప్పించేస్తుంది' అంటోంది దివ్య ఖురాన్. ఇలా బాధగా ఇవ్వడం కన్నా ఇష్టంతో ముందే నలుగురికి పంచి ఇవ్వడంలో ఎంతో ఆనందం దాగి ఉంటుంది. ఒకరి నుంచి మనం ఏదైనా స్వీకరిస్తున్నప్పటి కన్నా, ఒకరికి మనం ఇస్తున్నప్పుడే ఎక్కువ ఆత్మవిశ్వాసం, ఆనందం కలుగుతాయని ఆధునిక మానసిక శాస్త్రవేత్తలు కూడా తమ పరిశోధనలో స్పష్టం చేశారు. అదేవిధంగా ఒకరికి ఇవ్వకుండా, తామొక్కరే దాచుకొని తినే అలవాటు భవిష్యత్తులో ఒక రకమైన మానసిక వ్యాధికి కూడా దారితీస్తుందని వైద్యులు తమ పరిశీలనలో తేల్చారు.

మన మనుగడలో విలువైన, చెప్పుకోదగ్గ సందర్భాలు, గుర్తుచేసుకొని గర్వపడే సంఘటనలు ఏవైనా ఉన్నాయంటే, అవి కేవలం ఇతరులకు మనం సహాయపడ్డ క్షణాలే! భగవంతుడు కూడా పరిగణనలోకి తీసుకునేది ఆ మంచి పనుల్నే! అయితే మితిమీరుతున్న మన ఆశలు దేనినీ వదులుకోనీయడం లేదు. కాస్త కూర మిగిలినా ఫ్రిజ్‌లో పెట్టుకొని రేపు తిందామనీ, పాతబట్టలుంటే స్టీల్ సామగ్రికి మార్చుకుందామనేంత కక్కుర్తికి దారితీస్తున్నాయి. ఇలాంటి ధోరణి మనల్నే కాదు, ఇంట్లో మనల్ని గమనిస్తున్న చిన్నారులను కూడా సంకుచిత స్వభావులుగా మార్చేస్తుంది. మనకు సరిపడ్డాకనైనా ఇతరులకు ఇద్దామన్న దయాగుణం, పరోపకార తత్త్వం మనకు లేకపోతే మనల్ని చూసి మూగజీవాలు కూడా తలదించుకుంటాయి. మన సనాతన ధర్మం పరోపకారానికి ప్రముఖమైన స్థానాన్ని కల్పిస్తూ... **పరోపకారః కర్తవ్యః ప్రాణై రపి ధనై రపి। పరోపకారం పుణ్యం న స్యా త్క్రతు శతై రపి ॥** 'కష్టపడి సంపాదించిన ధనమిచ్చి అయినా, చివరకు ప్రాణమిచ్చి అయినా పరోపకారం చేయాలి. నూరుయజ్ఞాల వల్ల కలిగే పుణ్యం కూడా పరోపకారంతో సమానం కాదు'అని హితవు పలుకుతోంది. ❖

## పరోపకార పరంపర...

శ్రీశారదాదేవి పదకొండేళ్ళ వయస్సులో ఉన్నప్పుడు, ఒకసారి వాళ్ళ ఊరు జయరాంబాటీలో భయంకరమైన కరవుకాటకాలు సంభవించాయి. గ్రామస్థుల ఆకలిబాధలను చూసి చలించిన శారదాదేవి తండ్రి అన్నార్తులకు భోజనఏర్పాట్లు చేశారు.

శారదాదేవి తల్లితండ్రులు అన్నార్తులకు వేడివేడిగా పులగం వండి వడ్డిస్తూ ఉన్నారు. అయితే వాళ్ళందరూ ఆకలితో నకనకలాడుతూ ఉండడం వల్ల, విస్తరాకులలో వడ్డించిన వెంటనే గబగబా తినడం ఆరంభించారు. కానీ భోజనం వేడిగా ఉండడంతో వారు తినడానికి ఇబ్బంది పడుతున్నారు. వాళ్ళ పరిస్థితిని గమనించిన చిన్నారి శారద విసనకర్ర పట్టుకొని ప్రతిఒక్కరి దగ్గరికి వెళ్ళి, విసరసాగింది.

ఆ విధంగా తల్లితండ్రుల దయాగుణాన్నీ, సేవాతత్పరతనూ పరంపరగా కొనసాగించిన శారదాదేవి తదనంతర కాలంలో సాక్షాత్తూ అన్నపూర్ణాదేవియై వేలాదిమందిని అక్కున చేర్చుకున్నారు. ❖

మనుష్యులై ఉండి సాటి మానవునిపై సానుభూతి లేనివారిని మానవులు అనవచ్చునా? కేవలం మన గురించి మనం ఆలోచించుకోవడం కన్నా స్వార్థపరత, మహాపాపం వేరొకటి లేదు. - స్వామి వివేకానంద



# ...ఆ ఉపాధ్యాయుడే నా ఉత్సాహానికి ఊపిరి

**-'భారతరత్న' అబ్దుల్ కలామ్**

నా జీవితాన్ని తీర్చిదిద్దడంలో ఉపాధ్యాయులు ప్రముఖపాత్ర పోషించారు. నన్ను ప్రభావితం చేసి, నాకు దిశానిర్దేశం చేసిన ఎందరో ఉపాధ్యాయులను జీవిత చరమాంకం వరకూ మరచి పోలేను. ముఖ్యంగా పాఠశాలలో ప్రాథమిక పాఠాలు నేర్పిన శ్రీశివసుబ్రహ్మణ్య అయ్యర్ నా ఆశయానికి శ్రీకారం చుట్టారు. ఉపాధ్యాయుడు తన విద్యార్థులకు జ్ఞానాన్నివ్వడమే కాక, వారిలో ఉదాత్తమైన ఆశయాల్నీ, ఆత్మవిశ్వాసాన్నీ పెంచి పోషిస్తాడనీ అర్థం చేసుకున్నాను.

**ఆశయానికి బీజం వేసిన బడిపంతులు... :** రామేశ్వరం పాఠశాలలో నేను అయిదో తరగతి చదువుతున్నప్పుడు మాకు శ్రీశివసుబ్రహ్మణ్య అయ్యర్ ఉపాధ్యాయుడిగా పాఠాలు చెప్పేవారు. తన దగ్గర చదువుకునే విద్యార్థులను అమితంగా ప్రేమించే ఉపాధ్యాయుల్లో ఆయన ఒకరు. ఆయన ఒక రోజు పక్షులు ఎలా ఎగురుతాయో పాఠం చెప్పారు. నల్లబల్ల మీద ఒక పక్షి బొమ్మ గీసి దాని తల, తోక, రెక్కలు, శరీర నిర్మాణాన్ని వివరంగా చిత్రించారు. పక్షులు తమ రెక్కల్ని అల్లార్చడం ద్వారా ఎలా ఎగరగలుగుతాయో, ఆ ప్రయత్నంలో తమ తోక ద్వారా ఎలా దిశలు మార్చుకోగలుగుతాయో చూపించారు. దాదాపు అరగంట పాటు విహంగాల విహారం గురించి చక్కగా వివరించారు. పాఠం ముగించాక అర్థమైందా? అని అందరినీ అడిగారు. నేను ఎలాంటి సంకోచం లేకుండా నాకు అర్థం కాలేదని చెప్పాను. ఆ మాటే చాలామంది విద్యార్థులు చెప్పారు. మా సమాధానానికి మా మాస్టారు ఏమీ నిరుత్సాహపడలేదు, సహనాన్ని కోల్పోలేదు.

ఆ సాయంకాలం మమ్మల్నందరినీ సముద్రతీరానికి తీసుకువెళ్ళారు. అప్పుడు అయ్యర్‌గారు ఆకాశంలో గుంపులు, గుంపులుగా ఎగురుతున్న పక్షుల్ని చూపించారు. ఆ అద్భుతమైన పక్షి సమూహాలను చూసి మేం విభ్రాంతులమయ్యాం. వారు ఆ పక్షుల్ని చూపిస్తూ, అవి అలా ఎగురుతున్నప్పుడు తమ రెక్కల్ని ఎలా అల్లారుస్తున్నాయో గమనించమన్నారు. అవి తాము కోరుకున్న దిశకు తిరగడానికి తమ తోకల్ని ఎలా వాడుకుంటున్నాయో పరిశీలించమన్నారు.

అప్పుడాయన మమ్మల్ని 'పక్షిని నడిపిస్తున్న ఆ యంత్రం ఎక్కడుంది? దానికి ఆ శక్తి ఎక్కడి నుంచి వస్తుంది?' అని అడిగారు. చివరకు జవాబు కూడా ఆయనే చెప్పారు. పక్షిని నడిపిస్తున్న శక్తి దాని ప్రాణశక్తేనని, దాని ఇచ్ఛాశక్తే దాని చోదకశక్తి అని వివరించారు. అంత గహనమైన భావనల్ని ఆయన మా కళ్ళెదుట కనపడుతున్న దృష్టాంతంలో సులభంగా, సరళంగా బోధపరిచారు.

నా వరకూ నేను ఆ రోజు తెలుసుకున్నది కేవలం ఒక పక్షి ఎలా ఎగురుతున్నదన్న అంశంతో ఆగిపోలేదు. ఆ రోజు వారు చెప్పిన ఆ పాఠం నాలో విశిష్ట అనుభూతిని జాగృతం చేసింది. నేను భవిష్యత్తులో చదువుకోబోయే చదువు ఆకాశయాన వ్యవస్థలకు సంబంధించి ఉండాలని తీర్మానించుకున్నాను. ఒక సాయంకాలం పాఠశాల ముగిసిన తరువాత నా మనస్సులోని మాటను మా మాస్టారు ముందుంచాను. అప్పుడాయన చాలా ఓపిగ్గా నా భవిష్య ప్రణాళిక ఎలా ఉండాలో చెప్పుకొచ్చారు. మొదట నేను హైస్కూలు, కళాశాల చదువులు పూర్తిచేయాల్సి ఉంటుందనీ, ఆ తరువాత ఇంజనీరింగ్‌లో ఆకాశయాన వ్యవస్థల గురించి చదువు కొనసాగించాలనీ చెప్పారు. ఆ మొత్తం క్రమంలో నేను కష్టపడి చదువుకోగలిగితే భవిష్యత్తులో ఆకాశయాన విజ్ఞానానికి సంబంధించి నేనెంతో కొంత సాధించగలుగుతానని కూడా చెప్పారు.

నా ఉపాధ్యాయుడి సలహా ప్రకారం నేను కళాశాలకు వెళ్ళినపుడు భౌతికశాస్త్రాన్ని ఎంచుకున్నాను. అలాగే మద్రాసు ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో చేరినపుడు ఏరోనాటికల్ ఇంజనీరింగ్‌ను ఎంచుకున్నాను. నా ఉపాధ్యాయుడు పక్షులు ఎలా ఎగురుతాయో వివరించడానికి చూపిన దృష్టాంతం, నా చదువు కోసం ఆయన చేసిన సూచనలు నా జీవితానికి ఒక గమ్యాన్నీ, లక్ష్యాన్నీ ప్రసాదించాయి. నా జీవితంలో అదొక గొప్ప మలుపు. కాలగమనంలో నేనొక రాకెట్ ఇంజనీరుగా, అంతరిక్ష శాస్త్రవేత్తగా, సాంకేతిక నిపుణుడిగా రూపుదిద్దుకోవడానికి ఆ సంఘటనే నాంది పలికింది. ❖ సేకరణ : ఎమ్.రాంబాబు

**(సెప్టెంబరు 5న 'ఉపాధ్యాయ దినోత్సవం')**



# సద్వర్తనలేని సాధనలెందుకు?

– స్వామి రంగనాథానంద

నేను రామకృష్ణ సంఘంలో చేరి, సన్న్యాసి అయిన కొన్నాళ్ళకు కొంతమంది భక్తులు నా దగ్గరకు ఓ వ్యక్తిని తీసుకువచ్చారు. అతను పుణేనగర వాతావరణ కార్యాలయంలో పనిచేసే ఉన్నతోద్యోగి. అతను రోజూ ప్రాణాయామం, యోగ సాధనలన్నీ నియమబద్ధంగా చేస్తూ ఉంటాడట! పూజాదికాలు కూడా నిర్వర్తిస్తూ ఉంటాడట! కానీ రోజూ భార్యను కొడుతూ ఉంటాడట! అతని స్నేహితులు 'ఇంకేం లాభం ప్రాణాయామం మానేయవచ్చుగా' అంటే 'లేదు, లేదు! ప్రాణాయామాన్ని మటుకు మానేది లేదు. అది ఆరోగ్యానికి ఎంతో మంచిది' అంటాడట. వాళ్ళందరూ ఆ విషయాన్ని ప్రస్తావిస్తూ, ఆయనను నా దగ్గరకు తీసుకువచ్చారు. 'కట్టుకున్న భార్యను గౌరవించకుండా, ఆమెను ప్రేమించకుండా నీవు ఎన్ని ప్రాణాయామాలు చేసినా ఏం లాభం? అవన్నీ నీ విషయంలో యాంత్రికంగా మారిపోయాయి. ముందు ఆ ప్రాణాయామాన్ని ఆపి, నీ భార్యను ప్రేమించడం నేర్చుకో' అని సలహా ఇచ్చాను.

సమాజంలో ఇలా చాలామంది తమ సాధనలన్నింటినీ యాంత్రికంగా మార్చేస్తున్నారు. సాధనలు, పూజాదికాలు, ఆచారాలు – వీటన్నింటి వెనుక ఉన్న జ్ఞానాన్నీ, తత్త్వాన్నీ అర్థం చేసుకోకుండా, నిత్యజీవన ప్రవర్తనతో అన్వయించు కోకుండా మొక్కుబడిగా చేస్తూ పోతే ఏ మాత్రం ఉపయోగ పడవు. మనిషి ఎదుగుదలకు తోడ్పడవు. 'Love of God, Knowledge of God – ఈ రెండింటిలో కూడా మనిషి వ్యక్తిత్వాన్ని పురోగమింపచేసే మహత్తరమైన శక్తి దాగి ఉంది. కాబట్టి మనస్సులో దయ, కరుణ, ప్రేమ పెంచుకోకుండా, జ్ఞానాన్ని సముపార్జించుకోకుండా భౌతికంగా ఆచరించే సాధనల వల్ల ఎలాంటి ఫలితమూ ఉండదు. పైగా అలాంటి సాధనలు మనలో గర్వాన్నీ, అహంకారాన్నీ తెచ్చిపెడతాయి.

మనలో చాలామంది మతం అంటే ఏదో అర్థం కాని, సంక్లిష్టమైన బ్రహ్మపదార్థంలా వివరిస్తే సంతృప్తి పడతారు. సులువుగా, సరళమైన వివరణలతో మతంలోని అంశాలను వివరిస్తూ, మీ ప్రవర్తనను ముందు చక్కదిద్దుకోమని హితవు పలికితే, బోధించే వ్యక్తిలో సారం లేదనుకుంటారు. ఏదైనా సూటిగా, సరళంగా చెబితే మనకు నచ్చదు. పెద్ద పెద్ద శ్లోకాలతో, సమాసాలతో, గ్రంథాలను ఉట్టంకిస్తూ వివరణలిస్తే వాళ్ళు గొప్ప బోధకులని భ్రమపడతాం. అమాయక గ్రామీణులు జబ్బు వచ్చి వైద్యుడి దగ్గరకు వెళితే, చిన్న మందుబిళ్ళ ఇచ్చి రోగం నయం అవుతుందని చెబితే సంతృప్తి పడరు. 'సూదిమందు ఇవ్వండి డాక్టర్ గారూ!' అంటారు. అదే విధంగా మతానికీ, సాధనలకు సంబంధించి కూడా సులభమైన మార్గాలపై మనకు నమ్మకం ఉండదు. భారతదేశంలో ఇలాంటి వారి బలహీనతల వల్లే ఎన్నో నిరర్థకమైన మతశిక్షణలు, ప్రక్రియలు పుట్టుకొచ్చాయి. వీటి వల్ల వ్యక్తిగతంగా ఎలాంటి ప్రయోజనం, ఆధ్యాత్మిక అభివృద్ధి కలగదు. ఉదాహరణకు రోజూ ఎన్నోసార్లు ప్రాణాయామం చేస్తూ ఉంటాం. మనందరికీ తెలిసిందే – పూరక, కుంభక, రేచక మార్గాల ద్వారా గాలిని పీల్చడం, వదలడం చేస్తూ ఉంటాం. కానీ వాటి వెనుక ఉన్న జ్ఞానాన్ని తెలుసుకునే ప్రయత్నం చేయం. ఉన్నత వ్యక్తిత్వాన్ని నిర్మించుకోకుండా ఇలాంటి శారీరక సాధన ప్రక్రియలన్నీ నిష్ఫలమే అవుతాయి.

ఆధునిక జీవితం లెక్కకు మించిన సమస్యలనూ, సవాళ్ళనూ మనిషి ముందుంచుతుంది. ఈ నేపథ్యంలో కేవలం ఆలయాలకు వెళ్ళి, మొక్కులు తీర్చుకొని, ఏవో కొన్ని సాధనలు నిర్వహించినంత మాత్రాన క్లిష్టపరిస్థితుల నుంచి బయటపడే అవకాశం లేదు. అందుకే సంప్రదాయ ఆచార వ్యవహారాల నుంచి మరింత లోతుకు వెళ్ళాల్సిన అవసరం ఉంది. అయితే దురదృష్టవశాత్తూ భారతదేశంలో ఇంకా చాలామంది ధార్మిక విషయాలకు సంబంధించిన ప్రాథమికమైన అవగాహనలోనే ఉన్నారు. పెద్ద పెద్ద మేధావులు, పండితులు కూడా మతాన్ని చిన్న చిన్న ఆచారాలకే పరిమితం చేస్తూ ఉన్నారు. ఉదాహరణకు హరిద్వార్ వంటి ప్రాంతాల్లో పూజారులు 'గోవు తోక పట్టుకొని కళ్ళకు అద్దుకొని, పూజారికి అయిదు రూపాయలు ఇవ్వండి చాలు, స్వర్గానికి వెళ్ళిపోతారు' అంటారు. భక్తులూ అదే చేస్తూ ఉంటారు. ఇలాంటి ప్రాథమిక అంశాల వద్దే మతాన్ని పరిమితం చేసేస్తే, మనం ఉన్నతంగా ఆలోచించలేం. అందుకే మతానికీ, సాధనలకూ సంబంధించి 'We need something deeper, something strengthening, something heroic!❖

సేకరణ : ఆర్. కృష్ణ

**పురాణ శ్రవణం చేస్తున్నంతసేపూ లౌకికులలో ధర్మబుద్ధి నెలకొని ఉంటుంది. కానీ నిత్యకృత్యాలలో ప్రవేశించగానే ఆ ధార్మిక చింతన, ఉత్తమాశయాలను మరచిపోతారు.** - శ్రీరామకృష్ణ పరమహంస



# విజయం విచక్షణ

– స్వామి అమర్త్యానంద

ఒకసారి నా దగ్గరకు మానసిక రోగ చికిత్సకుడు (సైకియాట్రిస్ట్) ఒకరు వచ్చారు. తన గోడు నాతో వెళ్ళబోసుకుంటూ 'స్వామీజీ! నేను ఎంతో మంది మానసిక వ్యాధులను నయం చేయగలిగాను. చాలామందికి వాళ్ళ, వాళ్ళ మానసిక స్థితిని అర్థం చేసుకొని చికిత్స చేయ గలుగుతున్నాను. కానీ ఇంట్లో నా వాళ్ళ మానసిక పరిస్థితి ఏంటో నాకు అర్థం కావడం లేదు. వాళ్ళను ఎలా మార్చుకోవాలో నాకు అంతుబట్టడం లేదు' అంటూ ఆవేదన వ్యక్తం చేశాడు. అదే విధంగా నాకు తెలిసిన ఓ సైనికదళ నాయకుడు (బ్రిగేడియర్) కూడా మాటల్లో మాటగా 'స్వామీజీ! నా సైనికదళం మొత్తాన్ని నేను శాసించి, నా కనుసన్నల్లో పెట్టుకో గలుగుతున్నాను. కానీ నా ఇంట్లో నా భార్యనూ, నా పిల్లల్నీ నా మాట వినేలా చేసుకోలేకపోతున్నాను' అంటూ ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. మేమేదో విజయం సాధించామని లోకమంతా అనుకుంటుంది కానీ, ఎక్కడో మా జీవితాల్లో అసంతృప్తి, వెలితి వెంటాడుతూనే ఉన్నాయని వాళ్ళిద్దరూ ఆందోళన వ్యక్తం చేశారు.

ఇలా మనలో చాలామంది విజయానికి స్పష్టమైన నిర్వచనాన్ని తెలుసుకోలేకపోతున్నారు. ఇంట గెలిస్తే రచ్చ గెలవలేకపోతున్నారు; రచ్చ గెలిస్తే ఇంట గెలవలేకపోతున్నారు. నిజానికి 'విజయం' అన్న దానికి అర్థం ఎంతో విస్తారమైనది. బాహ్యంగా నలుగురితో సమర్థంగా పని చేయించి, సత్ఫలితాలను రాబట్టినంత మాత్రాన సంపూర్ణంగా విజయం సాధించినట్లు కాదు; అలాగని సాయంత్రం కాగానే ఇంట్లో వాలిపోయి ఎలాంటి ఎదుగుదలా లేకుండా ఇల్లాలూ, పిల్లలతో అరకొర జీవితాన్ని గడిపినా గెలుపు సాధించినట్లు కాదు.

ముఖ్యంగా భౌతికపరమైన సౌకర్యాలు సముపార్జించడమే 'విజయం' అనుకుంటే అది మరీ అవివేకం. ఉదాహరణకు సమాజంలో అడ్డదారులు తొక్కి శ్రీమంతులుగా కోట్లకు పడగలెత్తిన వాళ్ళను మనం విజేతల జాబితాలో చేర్చడాన్ని అంగీకరించం. వారి పట్ల ఆరాధనపూర్వకమైన గౌరవాన్ని కనబరచం. స్వాతంత్ర్య సమరయోధులు, సామాజిక ఉద్యమకారులు వంటివారు తమకంటూ ఏమీ మిగుల్చుకోలేక పోయినా, వారిని విజేతలుగా కొనియాడతాం. హంతకులు, అవినీతిపరులు బాహ్యప్రపంచంలో అట్టహాసంగా కనిపించ వచ్చు; కానీ అంతరంగంలో తీవ్ర సంఘర్షణకు, భయానికి లోనవుతూ ఉంటారు. అదే నిజాయతీగా ఉద్యోగం చేసుకునే వ్యక్తి సరళంగా, ఎలాంటి ఆర్భాటం లేకుండా అతి సాధారణంగా జీవిస్తూ ఉండవచ్చు. అలాంటి వారి అంతరంగంలో అపరిమితమైన ఆనందం తొణికిసలాడుతూ ఉంటుంది. ఇదే అసలైన విజయం. మన ఆంతరంగిక మానసిక స్థితే నిజమైన విజయానికి ప్రమాణం.

ఆధునిక ప్రపంచంలో ఈ 'విజయం' అన్న పదాన్ని ఓ మంత్రంలా జపిస్తూనే ఉన్నాం; కానీ ఆ గెలుపుమార్గాన్ని వెతుక్కోవడంలో విఫలమవుతున్నాం.

దురదృష్టవశాత్తూ నేడు ఎన్నో సంస్థలకూ, వ్యక్తులకూ 'విజయం' అన్న పదం ఓ వ్యాపారసూత్రమై పోయింది. Management, Communication... తదితర వ్యక్తిత్వవికాస తరగతుల్లో ఉపన్యాసాలన్నీ యువతీయువకుల్ని ఊహల్లో తేల్చేస్తూ ఉంటాయి. అయితే ఈ స్ఫూర్తిదాయక ప్రసంగాలన్నీ చాలావరకు విజయానికి ఒక పార్శ్వాన్నే స్పృశిస్తూ సాగిపోతాయి. ఇక్కడే చాలామంది పొరపాటు పడుతూ ఉంటారు. అదే విధంగా మనం జీవితాన్ని చాలా చిన్న చిన్న అరలుగా విభజించుకుంటూ, వాటిలోనే అల్పమైన సంతోషాలను వెతుక్కుంటూ వాటినే విజయమని మురిసిపోతూ ఉన్నాం.

మనం సాధించినదాని వల్ల వ్యక్తిగతంగా మనకే కాకుండా, సమాజానికి కూడా ఎంతో కొంత మేలు జరిగినప్పుడే అది పరిపూర్ణమైన విజయంగా భాసిస్తుంది. మనకు తెలియని తేజస్సును ప్రసాదిస్తుంది. కానీ మన గెలుపు ఈ సమాజంపై ఎంతో కొంత సానుకూల ప్రభావాన్ని చూపకపోతే, అది నిజమైన విజయమనిపించుకోదు. ఒక్కమాటలో చెప్పాలంటే, Success must bring enhancement of personality, purification of mind, joy, and happiness of life. That success truly makes us strong and powerful.

మనస్సును పవిత్రపరచి, మన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్ది జీవితంలో ఉల్లాసాన్నీ, ఆనందాన్నీ, సంతృప్తినీ ఇచ్చేదే నిజమైన విజయం. మనం ఏదైనా సాధించామనీ, జయించామనీ అనుకునే ప్రతి క్షణం పై అంశాలను అవి మన జీవితంలో ప్రతిఫలిస్తున్నాయా లేదా అన్న విచక్షణతో ఎవరికి వారే పరిశీలించుకోవాలి. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో !

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,
27-8-1937

**ప్రియమైన నరేశ్!***

ప్రతి మనిషి మౌలిక లక్ష్యం ఆనందం పొందాలనేదే! అదే లేనినాడు జీవితం ఆరిపోయిన దీపంలాంటిది. నేను చెప్పే నిర్వచనం నీకిప్పుడు చాలా కటువుగా అనిపించవచ్చు. కానీ నాకు ఈ నగ్న సత్యం తెలుసుకోవడానికి నలభై ఏళ్ళు పట్టింది. ఇంద్రియాలకు అతీతమైన స్వభావం ఆత్మది. శరీరం సుఖించడానికి ఒక సాధనం. భౌతిక సుఖాల మీద వెగటు పుట్టగానే, "బృందావనంలోని పచ్చిక బయళ్ళలో గోవులను మేపుకుంటూ బ్రతకడం ఉత్తమం" అనిపిస్తుంది. అంటే ఇంతకు ముందు కన్నా ఉత్తమమైన సుఖాన్ని పొందగోరుతున్నామన్నమాట. స్వర్గానికి పోవాలనే ఆకాంక్ష కూడా మరింత గొప్ప సుఖాన్ని పొందగోరే ఆశతోనే కదా! కాదంటావా?

సుఖం తప్ప వేరే దేనినీ మనిషి కోరడు. ఒక పేదవాడు చినిగిన పాత అతుకుల బొంతతోనే ఆనందం పొందితే, ధనవంతుడు పట్టుపరుపులతో సుఖం పొందుతాడు. గ్రామీణ ప్రజలు గ్రామీణ ఆనందాలతోనే తృప్తి చెందితే, ఒక భూస్వామి కలకత్తా లాంటి నగరాల్లోనూ, ఒక చక్రవర్తి లండన్, ప్యారిస్ లాంటి విదేశ మహానగరాల్లోనూ సుఖాస్వాదన చేస్తారు. ఒక సుఖపిపాసి పెద్ద నాసాభరణం ధరించిన తన భార్య అడుగులకు మడుగులొత్తుతాడు. మరో భూకామందు ఒక సుందరాంగి ప్రేమలోపడి ఆనందిస్తాడు.

సుష్మాదేవి, నిత్యానందుడు మొదలైన భక్తులు తమ హృదయాలను శ్రీరాధారాణి పాదాల చెంత పారబోసుకున్నారు. సారాంశం ఏమిటంటే, మహాత్ములంతా అల్పసుఖాలను ప్రక్కకు త్రోసి, శాశ్వత సుఖాలను పట్టుకుంటున్నారన్నమాట. తెలివితక్కువ వారు చిన్న చిన్న విషయాలతోనే తృప్తి పడుతున్నారు. పసివారైతే ప్రపంచంలో మెరిసేవన్నీ బంగారమని భ్రమతో మోసపోతున్నారు. అనుభవజ్ఞులు పదికాలాలు మన్నిక గల వాటినే కొనుక్కొంటారు. వారికి సులభంగా విరిగిపోయేవి అవసరం లేదు. కానీ వారికి ఏదో ఒకటి కావాలన్నది మాత్రం సత్యం. అది చిన్నది కానీ పెద్దది కానీ ! "నాకేమీ అక్కరలేదు" అనే స్త్రీ పురుషులను ఎవరినైనా చూపెట్టు? ప్రతి ఒక్కరికీ 'విషయసుఖం' కావాలి. ఏమంటావ్?

'నాకు ఏ కోరికలూ లేవు' అనే వాళ్ళు ఈ ప్రపంచంలో చాలా అరుదు. ప్రాపంచిక సుఖాలను అనుభవించిన తరువాత అవి చేదనిపించాక కూడా "నాకేమీ అక్కరలేదు" అని అనగలిగినవాడు నిజంగా గుహల్లో ఉండే వాళ్ళతో సమానం సుమా!

రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు కలిసే యోగసాధన చేశారు. వారు మనో నిగ్రహం సాధించగలిగారు. రావణ, కుంభకర్ణులు వారి మనస్సులను తాత్కాలికంగా అదుపు చేయగలిగినప్పటికీ, "నేను సుఖించాలి, నేను సుఖించాలి" అనే భావం వారిలో అంతర్గతంగా ఉంది. అందుకే వారి ఇష్టదైవం సాక్షాత్కరించి వరం కోరుకోమంటే "ఈ దేహం శాశ్వతంగా ఉండాలి" అని కోరారు. ఎంత వింతో చూడు!

మానవుని మనస్సు మర్మం కేవలం కొన్ని కఠిన ఆధ్యాత్మిక సాధనల వల్లో, గుహల్లో నివసించినంత మాత్రానో, బాహ్యవస్తువులను త్యాగం చేసినందువల్లో అర్థం కాదు. తన మనస్సులోని మర్మాలను విధేయతతో వెల్లడించేందుకు ఎవడూ ఇష్టపడడు. కొందరు తెలివైన వ్యక్తులు వారి హృదయపు భావోద్వేగాలను మరుగుపరచి చక్కగా పనిచేస్తుంటారు. ఈ రోజుల్లో అలాంటి వారిని "సంస్కారవంతులు" అని అంటాం. కొంత మంది వ్యక్తులు జంతువుల్లా ప్రవర్తిస్తుంటారు, కానీ బయట సంస్కారవంతులుగా చలామణి అవుతారు. కానీ భగవంతుడు మనిషి హృదయాన్ని చూడగలడు. ఆయనను వెర్రివాణ్ణి చేయడం సాధ్యం కాదు. ఆయన దృష్టిలో ఎవరు సంస్కారవంతుడో, ఎవరు సంస్కారహీనుడో ఆయనకే తెలుసు.

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(* నరేశ్ చంద్రపాల్ స్వామి ప్రేమేశానంద మహరాజ్‌కు విద్యార్థి దశ నుండీ సన్నిహితుడు.)

**ఇంద్రియాలు వశంలోలేని కారణంగా అర్థం నుండి అనర్థమును, అనర్థము నుండి అర్థమును చూసే వాడు అజ్ఞాని. అలాంటి వ్యక్తి అధిక దుఃఖాన్ని అనుభవిస్తూ కూడా సుఖంగానే భావిస్తాడు. - విదురనీతి**

(...15వ పేజీ తరువాయి.)
కష్టాన్నైనా, సుఖాన్నైనా ఒకేలా స్వీకరిస్తాడు. ఏది సంభవించినా, కట్టెలో కాలిపోయే ఈ కాయానికే కానీ తనకు కాదనుకుంటాడు. ఇది ఎంతో ఉన్నతమైన మానసిక స్థితి! అందుకే వేంకటేశుడి వినమ్రభక్తుడు ఇక్కడ....

**అనయము సుఖమేడ దవల దుఃఖమేడది**
**తనువుపై నాసలేని తత్త్వమతికి**
**పొనిగితే పాపమేది పుణ్యమేది కర్మమందు**
**వొనరగ ఫలమొల్లని యోగికిని...** అంటున్నాడు. ఆ పరంపరలో ఫలంపై ఆసక్తి లేకుండా కర్మలు నిర్వర్తించే యోగికి పుణ్యమైనా, పాపమైనా ఒక్కటేనని తేటపరుస్తున్నాడు. 'అనయము' అంటే నిరంతరం అని, పొనిగితే అంటే ప్రయత్నించి చూస్తే అని అర్థం! జ్ఞానయోగాన్నీ, కర్మయోగాన్నీ ఈ భక్తాగ్రేసరుడు రెండు పాదాల్లో తేల్చిచెప్పేశాడు. ఈ లోకంలో దేనికీ మనం చలించకుండా నిలబడగలగాలంటే అరణ్యాలకో, ఆశ్రమాలకో పారిపోనక్కరలేదు. జీవన వ్యవహారాలలో ఉంటూనే మానసికంగా అలాంటి వైరాగ్యభావనతో జీవించాలంటున్నాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఏదైనా 'నాది అనుకుంటే దుఃఖం... కాదు అనుకుంటే సుఖం'. అందుకే శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత(6.7) ఆత్మసంయమ యోగంలో...

**జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు తథా మానాపమానయోః ॥**

'మనస్సును నిగ్రహించి శాంతుడై, పరమాత్మలో స్థిరనిష్ఠుడైన యోగి శీతోష్ణాలనూ, సుఖదుఃఖాలనూ, మానావమానాలనూ అతిక్రమిస్తాడ'ని స్పష్టం చేశాడు.

### పగవారెవరు? బంధువులెవరు?

హిరణ్యాక్షుడు అసువులు బాయగానే తల్లి, భార్యాపుత్రులు, బంధువులు కంటికి మింటికి ఏడవసాగారు. అప్పుడు అతని అన్న హిరణ్యకశిపుడు మృత్యువు పోకడను వివరిస్తూ, తల్లినీ, ఆత్మీయులనూ ఓదారుస్తూ...

**పరులెవ్వరు? తామెవ్వరు?**
**పరికింపగ నేకమగుట భావింపరు త**
**త్పర మజ్ఞానము లేమిని**
**ఒరులును నేమనుచు తోచు ప్రాణులకెల్లన్!**

'ప్రాణులకు పరతత్త్వ చింతన లేకపోవడం వల్ల మనవాళ్ళనీ, పరాయివారనీ తేడాగా భావిస్తారు. ఎవరు పరులు? ఎవరు తనవారు? వారు, మేము అని అజ్ఞానులు మాత్రమే అనుకుంటారు. ఆలోచిస్తే అందరూ ఒక్కటే' అని అంటాడు.

ఇక్కడ భాగవతప్రియుడి భక్తశిఖామణి కూడా ప్రపంచాన్ని విడిచిన వివేకికి అయినవారు, పరాయివారు అంటూ భేదమేమీ ఉండదని వివరిస్తూ...

**తగిన యమృతమేది తలపగ విషమేది**
**తెగి నిరాహారియైన ధీరునికిని**
**పగవారనగ వేరి బంధులనగ వేరే**
**వెగటు ప్రపంచమెల్ల విడిచే వివేకికి** అంటున్నాడు. నిరాహార వ్రతాన్ని చేపట్టిన ధీరుని ముందు అమృతమున్నా, విషమున్నా తేడా ఏముంటుందని ప్రశ్నిస్తున్నాడు. బాహ్య ప్రపంచంపై ఏ వాంఛా లేని వివేకికి ఎవరి పైనా మమకారం ఉండదు; ఎవరిని చూసినా వికారం కలగదు. ఆశలే లేని వ్యక్తికి తీరాలన్న ఆకాంక్ష కానీ, తీరకపోతే నిరాశ కానీ పొడచూపే ప్రసక్తే లేదు. ఇక్కడ ఆశలే ఆహారం లాంటివి! ఈ విషయంలో మనిషి నిరాహార దీక్ష పూనితే ఆశ నిరాశల ఆటుపోట్లే ఉండవని పదామృతకర్త హితవు పలుకుతున్నాడు.

### దైవాన్ని నమ్మితే వెలిపేది, మలిపేది!

శ్రీఆదిశంకరాచార్యులు 'వివేక చూడామణి'లో 'మనిషికి భౌతిక జీవిత బంధాల నుంచి, జన్మ జరా దుఃఖాల నుంచి శాశ్వతమైన విడుదలను ప్రసాదించడమే 'మోక్షం' అంటారు. ఇలాంటి మోక్షాన్ని సాధించే సామగ్రులలో 'భక్తి'యే సర్వ శ్రేష్ఠమైనది. జీవుడు తన స్వస్వరూపాన్ని తాను చక్కగా తెలుసుకోవడమే 'భక్తి' అన్న వివరణతో...

**మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసి**
**స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే...** అంటారు. కలికాలంలో కైవల్యప్రాప్తికి భక్తిని మించిన పరమ సాధనం మరొకటి లేదు. స్వయంగా భగవానుడు మనకు ఈ బంధాల నుంచి విముక్తిని ప్రసాదిస్తే తప్ప, మనం విడుదల కాలేం. దీనికి ప్రధానమార్గం భగవంతుణ్ణి ప్రార్థించి, కీర్తించడమే! అలా ఆ దేవదేవుణ్ణి నమ్ముకుంటే ఎన్ని పనుల మధ్య సతమతమవుతున్నా వెరపు, మరపు అన్న మాటే ఉండదు. జీవన ప్రస్థానంలో తడబడవలసిన అవసరమే రాదు. అదే అభయహస్తంతో అన్నమాచార్యులు...

**వేవేలు విధులందు వెలిపేది మలిపేది**
**దైవమును నమ్మినయట్టి ధన్యునికిని**
**శ్రీవేంకటేశ్వరుడు చిత్తములో నున్నవాడు**
**యీవలేది యావలేది యితని దాసునికి...** అంటున్నాడు. సదా ఆ శ్రీనివాసుడినే మదిలో నిలుపుకున్న భగవద్దాసుడికి చావు పుట్టుకలతో కూడిన ముందు వెనుకలు ఉండవని ఉద్బోధిస్తూ ఉన్నాడు. ❖




- స్వామి పరిజ్ఞేయానంద

బి.కళ్యాణ్, అమలాపురం

**ప్రశ్న : నేను డిగ్రీపూర్తిచేసి ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాను. జీవితమంటే పుట్టడం, పెరగడం, చదవడం, సంపాదించడం, కుటుంబ జీవితం గడపడం, చనిపోవడం ఇంతేనా?... ఇలాంటి ప్రశ్నలు నన్ను వేధిస్తున్నందువల్ల జీవితం పట్ల నిరాసక్తి కలుగుతుంది. ఈ జీవితం వల్ల ప్రయోజనం ఏమిటి? అర్థవంతమైన జీవితాన్ని ఎలా గడపాలి?**

**జవాబు:** 'పుట్టుట గిట్టుట కొరకే' - మహాయోగైనా, భోగైనా; మహారాజైనా, నిరుపేదైనా; మహాపండితుడైనా, పామరుడైనా... పుట్టిన ప్రతి ఒక్కరూ అనంత కాలగర్భంలో కలిసిపోవలసిందే! ఈ ప్రకృతి నియమానికి ఎవ్వరూ అతీతులుకారన్నది మనకు తెలిసిన విషయమే! అయితే మనిషి పుట్టినప్పటి నుండీ చనిపోయేవరకూ ఎలా జీవించాడన్నదే ముఖ్యం గానీ, ఎలాగూ చనిపోతాం కదా అని జీవించినంతకాలం నిరాశతో క్రుంగి కృశించిపోవడానికి మాత్రం కాదు.

# అర్థవంతమైన జీవితం

జీవితమంటే ఏమిటో, ఎలా జీవించాలో, ఈ జీవితానికి ఎలా ముగింపు పలకాలో నదీమతల్లి మనకు నేర్పుతుంది. ఎక్కడో పుట్టిన నది కొండకోనల్ని దాటుకుంటూ, పంట పొలాల్ని పరిపుష్టి గావిస్తూ, జనజీవనానికి ఆధారంగా నిలుస్తూ, ఉత్సాహంగా పరవళ్ళుతొక్కుతూ, ఆఖరికి ఆనందంగా అనంత సాగరంలో కలిసిపోతుంది. నదీమతల్లిలా మనం కూడా కష్టనష్టాలనే కొండకోనల్ని దాటుకుంటూ, మన జీవితాలను ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దుకుంటూ, మన చుట్టూ ఉన్నవారికి సహాయపడుతూ, చివరి వరకూ ఆనందంగా జీవనయానం సాగించి, చిరునవ్వుతో కాలగర్భంలో కలిసిపోగలగాలి.

సమాజంలో జీవిస్తున్న మనుష్యులను నాలుగు రకాలుగా విభజిస్తూ భర్తృహరి 'పరహితానికి పాటుపడేవారిని ఉత్తములనీ; తమ హితాన్ని కోరుకుంటూ పరులకు తోడ్పడేవారిని మధ్యములనీ; తమ ప్రయోజనాల కోసం పరులను ఉపయోగించుకునేవారిని అధములనీ; ఎప్పుడూ పరులకు కీడు తలపెట్టేవారిని మాత్రం ఏమని పిలవాలో తెలియద'నీ అన్నాడు.

తాను తరిగిపోతూ సువాసనలు వెదజల్లే చందన వృక్షంలా, తాను కరిగిపోతూ వెలుగును ప్రసాదించే కొవ్వొత్తిలా కేవలం పరహితం కోసమే జీవించగలిగిననాడు ఈ భువియే దివిగా మారుతుంది. ఈ భూతలమంతా భగవాన్ బుద్ధుడు, స్వామి వివేకానందలాంటి మహాత్ములతో నిండిపోతుంది. అయినా పరుల కోసమే జీవించడం అందరికీ సాధ్యంకాదు. కాబట్టి మన హితాన్ని కోరుకుంటూ, పరులకు సహాయపడేలాగైనా జీవించగలగాలి. అప్పుడు మానవలోకం దానవలోకంగా మారకుండా ఉండేందుకు తోడ్పడే వారమవుతాం. ప్రస్తుత సమాజానికి మనమందరం చేయగల మహోన్నత ఉపకారం ఇదే!

జీవితంలో నిరాశా నిస్పృహలకు తావివ్వకుండా ఆసక్తికరమైన జీవితాన్ని గడపాలంటే 'ప్రతిరోజునీ మొదటి రోజులా భావించిననాడు ఉత్సాహంగా జీవించగలం, కష్టపడి పనిచేస్తున్నకొద్దీ జీవితాన్ని మరింతగా ఆస్వాదించగలం' అన్న బెర్నార్డ్ షా సూచనల్ని మననం చేసుకోవాలి.

మన జీవితాన్ని అర్థవంతంగా గడపాలంటే...

If in this hell of a world, one can bring a little joy and peace even for a day into the heart of a single person, that much alone is true...

*- Swami Vivekananda*

'నరకతుల్యమైన ఈ ప్రపంచంలో కనీసం ఒక్కరోజైనా, ఏ ఒక్కరి హృదయాన్నైనా శాంతి, ఆనందాలతో నింపగలిగిన నాడు అదే నిజమైన జీవితం' అన్న స్వామి వివేకానందుని మాటల్ని ఆచరణాత్మకం చేయాలి. అప్పుడే ఈ కాల ప్రవాహంలో సాగే మన జీవన నౌకాయానానికి ఓ అర్థం, పరమార్థం చేకూరుతుంది. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాదు - 500 029**

**ఏ వ్యక్తి అయితే యోగ్యమైన పనిచేస్తూ సంపాదిస్తాడో, తల్లితండ్రులకు సేవ చేస్తాడో, తన శక్తికొలది దానధర్మాలు చేస్తాడో, ఎవడైతే దైవభక్తి కలిగి ఉంటాడో అలాంటివాడి జన్మ సార్థకం.** - చాణక్యనీతి





- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# ఆత్మ వినిగ్రహము

'ఆత్మ' అనే పదానికి చాలా అర్థాలున్నాయి. సాధారణంగా గోచరించే అర్థమేమంటే మన అంతరంగంలో ఉన్న శక్తి. ఆత్మ అనే పదాన్ని శరీరం, మనస్సు, ఇంద్రియాలు లేక ప్రత్యగాత్మ అనే అర్థంతో కూడా వాడవచ్చు.



ప్రస్తుత సందర్భంలో 'ఆత్మ' అంటే 'ఉపాధులు'. అవి మనలో గల దివ్యత్వం నుండి మనల్ని వేరుపరచే పరిమితమైన లక్షణాలు. 'ఆత్మ నియంత్రణ' అంటే వివిధ ఉపాధులను వశంలో ఉంచుకోగలగడమే! మనలో ఉన్న దివ్యత్వపు సారం, మనలో ఉన్న ఆత్మ స్వతంత్రమైనవి. కానీ ఉపాధులు వాటిని పరిమితంగా, అపవిత్రంగా చేస్తాయి. తమ నిజస్థితిని పొందటానికి ప్రతి ఒక్కరూ ఉపాధులను పూర్తిగా వదిలేయాలి. లేదంటే, కనీసం వాటిని అణిచివేయాలి. అణిచేయడమంటే శరీరాన్ని కష్టపెట్టడం కాదు. మన దివ్యత్వాన్ని గుర్తించే మార్గంలో అది సహకరించేలా చేయాలి.

'ఉపాధి' అనే పదాన్ని వ్యాఖ్యానిస్తూ శంకరాచార్యుల వారు 'మోక్ష ప్రతికూలస్థితి' అని నిర్వచించారు. ఇంద్రియాలు, మనస్సు క్రమశిక్షణతో, విధేయంగా ఉన్నప్పుడే, 'ఆత్మజ్ఞానం' ('అహం బ్రహ్మాస్మి' అనే జ్ఞానం) పొందగలం. ఇంద్రియాలు, మనస్సు అధీనంలో ఉండకపోవడమనేది వాటి సహజ స్వభావం. అంతేగాక, అవి శాశ్వత, పరిశుద్ధ ఆత్మ అనే భావాలకు వ్యతిరేకంగా వ్యవహరించడానికి ప్రయత్నిస్తాయి. మనం 'ఆత్మస్వరూపులంకాము' అని ఇంద్రియాలు మనకు నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తాయి. మన శరీరం, మనస్సు కూడా అదే ప్రయత్నం చేస్తాయి. నిజంగా మనం 'బ్రహ్మమే' అయినట్లయితే ఎదురుగా ఉన్న పర్వతాన్ని ఎత్తమని మన మనస్సు నిలదీస్తుంది. పర్వతం కాకపోతే, కనీసం పెద్ద రాయినైనా ఎత్తమంటుంది. ఒక రాయినే ఎత్తలేకపోతే, అనంత శక్తిమంతమైన ఆత్మ మనం ఎలా అవుతామని మన మనస్సు మనల్ని నిలదీస్తుంది.

అలాంటి వాదనలన్నిటికీ సరైన సమాధానమివ్వాలి. ఈ శరీరమే అన్ని విధాలా శక్తిమంతమైనదని శాస్త్రాలు చెప్పవు. ఆత్మయే సర్వశక్తిమంతమైనదని అవి చెబుతాయి. మనమేమో సర్వశక్తి మంతత్వాన్ని ఈ శరీరం ద్వారా పరీక్షిద్దామని అనుకుంటాము. శరీరాన్ని మనం దృఢంగా చేసుకోగలం కానీ సర్వశక్తిమంతంగా తయారుచేయలేం. అది ప్రకృతి సిద్ధాంతాలకు వ్యతిరేకం. కానీ ఇంకా శరీరపు సర్వశక్తిమంతత్వాన్ని గురించి వాదిస్తూ ఉంటే, మనకు నిరాశే ఎదురవుతుంది. అప్పుడిక శాస్త్రాలే అసత్యాలని అంటాం.

మన ఉపాధులు మనల్ని చాలా పరిమితమైనవారిగా, బలహీనులుగా తయారుచేస్తాయి. ఈ భావానికి వ్యతిరేకంగా పోరాటం సలపాలంటే, ఉపాధులకు సరైన శిక్షణనివ్వాలి. దాన్ని ఏ విధంగా చేయాలంటే, మన ఇంద్రియాలు, శరీరం, మనస్సు మనతో స్నేహితుల లాగా మెలిగి మన నిజతత్వాన్ని గుర్తించేలా సహకరించాలి.

ఉపనిషత్తులు తెలిపే మన నిజతత్వాన్ని నిరాకరించకుండా ఉంటేనే మనం అసలు సత్యాన్ని గ్రహించగలం. ఐతే ఉపనిషత్ సత్యాలను ఎందుకు నిరాకరిస్తాం? దానికి స్పష్టమైన కారణం ఏమంటే - మనం మన శరీరానికీ, ఉపాధులకూ బద్ధులమై

ఉన్నాం. ఉపాధులే సత్యమైనవనీ, ఉపనిషత్ బోధలు అసత్యాలనీ భావిస్తాం.

అదెలా ఉంటుందంటే, ఇంటి యజమానిని వదిలేసి, పరాయివారిని బలపరుస్తూ మాట్లాడడం లాంటిది. ఆత్మయే నిజమైన సొంతదారు, ఉపాధులనేవి పరాయివారు. మరోమాటలో చెప్పాలంటే, అతిథులు. అందుచేత మనల్ని మనం సవరించుకొని, మన నిజతత్త్వాన్ని కనుగొనగలగాలి.

యోగశాస్త్రాలు ఈ ఉపాధుల్ని మనకు సహకరించేటట్లు చేస్తాయి. ఆసనాలు వేయడం వల్ల శరీరం సహకరిస్తుంది. ప్రాణాయామం (క్రమబద్ధంగా శ్వాస తీసుకోవడం) మనస్సును సహకరించేలా చేస్తుంది. అదే విధంగా యోగా బోధించే ఇతర దశలు ప్రత్యాహారం (భావాలను సమీకరించడం), ధారణ (ఒకే వస్తువుపై ఏకాగ్రంగా ఆలోచించడం), ధ్యానం (ఒకే భావంలో మునిగి ఉండడం) మన మనస్సు సహకరించడానికి దోహదం చేస్తాయి. యోగంలోని ఈ దశలన్నీ మనలో ఉన్న పలు రకాలైన అంతర్గత, బాహ్య పరికరాలను సమన్వయపరచడం ద్వారా ఆత్మ వ్యక్తీకరణను కలుగజేస్తాయి. శరీరం, మనస్సు ప్రశాంతత చెందినప్పుడు ఏది ఆత్మో, ఏది అనాత్మో విచక్షణతో నిర్ణయించ గల శక్తి పొందడం సాధ్యమవుతుంది. అప్పుడు మాత్రమే ఆత్మ శాశ్వతమైనదనీ, స్వతంత్రమైనదనీ (బంధం లేనిదనీ) అర్థం చేసుకోగలుగుతాం.

మన శరీరం, మనస్సుల పట్ల తగినంత శ్రద్ధ వహించి, మనలో ఉన్న ఉన్నత భావాలను అవి విధేయతతో అనుసరించేలా చేయడమే 'ఆత్మ వినిగ్రహం'. ఈ సహకారం దానంతట అదే రాదు. దాని కోసం కృషి చేయాలి. అవి ఏం చేస్తున్నాయో జాగ్రత్తగా గమనిస్తుండాలి. అలా చేయకపోతే అవి వశం తప్పిపోతాయి. యౌవనంలో ఉండి, మంచి శక్తి ఉన్నప్పుడు స్థిరంగా, నిశ్చలంగా, ప్రశాంతంగా ఐదు నిమిషాలు కూర్చోలేకపోతే, ఇక వృద్ధాప్యంలో ఎలా ఆ పని చేయగలం? వయస్సు పెరుగుతున్నకొద్దీ మన మనస్సు చుట్టూ ఒక సరిహద్దు గీత గీసుకోవాలని శ్రీరామానుజాచార్యులు అంటారు. అప్పుడే అది ఆధ్యాత్మిక క్రమశిక్షణను పాటించగలుగుతుంది. మనస్సు ఈ పరిధి గీతను ఎన్నడూ దాటకూడదు. అందుచేతనే మనం ఆత్మపరిశీలన చేసుకొని, మనస్సు కదలికలను నియంత్రించాలి. అంటే మనస్సుకు నచ్చినవీ, నచ్చనివీ జాగ్రత్తగా గమనించి, అదుపులో ఉంచి, దాన్ని ఒకే విషయంపై ఏకాగ్రం చేసి, ధ్యానం చేయడం నేర్చుకోవాలి. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో – 'ఇంద్రియార్థేషు వైరాగ్యం' )

---

(...16వ పేజీ తరువాయి.)

# భక్త హాఫిజ్ ఏకనిష్ఠ

జారుతున్నాయి. భావవిహ్వలుడైన హాఫిజ్ ఆమెను కూడా ఆ నేలను నాకమని సైగల ద్వారా తెలిపాడు. ఆమె కూడా నేలను నాకగానే దైవప్రేమోన్మత్తురాలు అయింది. అప్పటి నుండీ ఆమె జీవితం మలుపు తిరిగింది. ఒక్క క్షణకాలం పాటు సాధుసాంగత్యం లభించడం వల్ల ఆమెకు నవజీవనం లభ్యమై, భగవదారాధనలో మునిగిపోయింది.

భగవదానుభూతి కలిగినప్పటి నుండీ భక్త హాఫిజ్ తన గుడిసెలోనే అల్లా నామజపం చేస్తూ, దర్గాలో సంధ్యాదీపం వెలిగించేవాడు. దారిలో కనపడిన మట్టిపెంకులు ఏరి తెచ్చేవాడు. ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడిచాయి. కొన్ని దినాలుగా హాఫిజ్ భిక్షకు వెళ్ళడం ఇరుగుపొరుగు వారి కంటబడలేదు. హాఫిజ్ బయటకు ఎందుకు రావడంలేదా అని సందేహించిన కొంతమంది అతడి గుడిసెకు వెళ్ళి చూశారు. అప్పుడు ఆయన ఇహలోకాన్ని విడిచిపెట్టిపోయాడని తెలిసింది.

ఆ గుడిసెలో ఏమున్నాయి? ఆయన మృత కళేబరం, ఒక చినిగిన చాప, నీటి కుండ, విరిగిన మట్టిమూకుడు, ఆ పైన ఏడు పెద్ద పెద్ద మట్టి కడవలు. ఆ ఏడింట్లోను నిండుగా, ఆయన ఏరి తెచ్చిన మట్టిపెంకులు. ప్రతి దినం హాఫిజ్ మదిలో ఏయే భావాలు కలిగేవో, అవన్నీ ఆ పెంకులపై వ్రాశాడు. పండితులు హాఫిజ్ వ్రాసుకొన్న ఆధ్యాత్మిక అనుభూతులను, సందేశాలను ఒక పుస్తక రూపంలో ప్రచురించారు.

హాఫిజ్ ఏకనిష్ఠ ఆయనను ఎంతటి మహా విపత్తు నుండి కాపాడిందో చూడండి! స్త్రీ వ్యామోహం మహా ప్రమాదకరమైనది. దానిని మించిన విపత్తు, దానిని మించిన బంధనం మరొకటి ఉంటుందా! హాఫిజ్ ప్రతిరోజూ క్రమం తప్పకుండా దర్గాలో దీపం వెలిగించే వాడు కాబట్టి ఆ నిష్ఠే ఆయన్ని కాపాడింది. అందుకే ఆధ్యాత్మిక సాధకులు పూజ, జప, ధ్యానాలను క్రమం తప్పకుండా నిష్ఠతో అనుష్ఠించడం ఎంతో ఆవశ్యకం. ❖ అనువాదం: డాక్టర్ కమల జయరావు

(* స్వామి అఖండానంద – శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు)

జపతపాలను సదా ఆచరిస్తూ ఉండాలి. సంధ్యా సమయంలో భగవద్భావన మనస్సును ఆవరిస్తుంది. కాబట్టి ప్రతిరోజూ ఆ సమయంలో ఏకనిష్ఠతో భగవంతుణ్ణి ధ్యానించాలి. - శ్రీరామకృష్ణ పరమహంస

# ముళ్ళ చెట్టుకు కూడా ముక్తి

మూలకథ: డి.ఎమ్. సుందరరామన్ చిత్రాలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 చిదంబరంలో పంచముడిగా జన్మించిన సాంబన్ మహాశివభక్తుడు.
అతడి ప్రగాఢ భక్తికి మెచ్చి పరమశివుడు అతడికి తన దర్శన భాగ్యం కలిగించాడు.




2 అందుకు 'ఉమాపతి శివం' అనే నా భక్తుడు నీకు తోడ్పడతాడు.
సాంబా! నేను ఇచ్చే ఈ తాళపత్రాన్ని అతడికి అందించు.



3 పరమేశ్వరుడి నుండి తాళపత్రాన్ని అందుకొన్నప్పటికీ,
శివం అనే పెద్ద మఠాధిపతిని కలుసుకోవడం సాంబన్‌కు
సాధ్యపడలేదు. అప్పుడు సాంబన్, భగవంతుణ్ణి ఇలా ప్రార్థించాడు....

4 'హే భగవాన్! మీ భక్తుడు ఎంతో గొప్పవాడు. ఆయన దర్శనానికై ఎంత ప్రయత్నించినప్పటికీ సాధ్యం కాలేదే! మీ ఆలయానికి నిత్యం వంటచెరకు తెచ్చి ఇస్తున్నట్లు, ఇకపై ఆయన మఠానికి కూడా వంటచెరకు ఇస్తూ వస్తాను. ఓ దేవా! ఇక తక్కింది నీ అనుగ్రహంతోనే జరగాలి'.

5 ఒకరోజు ఎప్పటిలాగే సాంబన్ చిదంబర ఆలయం బయటకు వంట చెరకుతో వచ్చాడు. తూర్పు గోపుర ముఖద్వారం వద్దకు రాగానే అక్కడ రెండు బంగారు కాసులు పడి ఉండడం చూశాడు.




6 అప్పుడు అశరీరవాణి ఇలా వినిపించింది.




7 కొన్ని రోజులు గడిచాయి. ఉమాపతి శివం మఠానికి వంటచెరకు ఇవ్వడం కొనసాగిస్తూనే వచ్చాడు సాంబన్. భక్తుల నిద్దరినీ పరస్పరం కలపాలని పరమేశ్వరుడు సంకల్పించాడు. ఒకరోజు కుంభవృష్టి కురిపించాడు.




8 శిష్యులారా! నేడు మఠంలో ఎందుకింత ఆందోళన కానవస్తోంది!

స్వామీ! నిత్యమూ ఒక వ్యక్తి మన మఠంలో ఒక మోపు వంట చెరకు ఇచ్చి వెళతాడు. ఈ రోజు వాన కారణంగా అతడు వంటచెరకు తీసుకురాలేదు. వంటచెరకు లేనందున వంట బాగా ఆలస్యం అవుతుంది.

అలాగా! ఆ భక్తుణ్ణి నేను తప్పక చూడాలి!

9 వాన తెరపి ఇవ్వగానే సాంబన్ వంట చెరకు తెచ్చాడు. శిష్యులు అతణ్ణి ఉమాపతి శివాచార్యుల వద్దకు తోడ్కొని వెళ్ళారు. సాంబన్ ఆయన పాదాలకు మొక్కాడు.









11 ఉమాపతి శివం తాళపత్రాన్ని చదివాడు. తరువాత తీవ్రవైరాగ్యంతో తేజరిల్లుతున్న సాంబన్‌కు విదేహ ముక్తి ప్రసాదించాడు. అంతే, భక్తికి ప్రతిరూపంగా విరాజిల్లుతున్న సాంబన్ మరుక్షణమే శివజ్యోతిలో లీనమైపోయాడు.



12 సాంబన్ ఇంటికి తిరిగి రాకపోవడంతో అతడి భార్య రాజుగారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేసింది. రాజు, ఉమాపతి శివం మఠానికి వెళ్ళి విచారణ చేయించాడు.

13




14

ఉమాపతి శివంకు సాంబన్‌లాంటి పరమ భక్తుడు మరొకరెవరూ అక్కడ కనిపించలేదు. అందువల్ల నిత్యం తన ఆత్మలింగానికి చేసే అభిషేక జలంతో పెరిగిన ఒక ముళ్ళ చెట్టు మీద తన దృష్టిని సారించాడు ఉమాపతి శివం. పుణ్యఫలం సంతరించుకొన్న ఆ ముళ్ళచెట్టు వెంటనే దేదీప్యమానప్రకాశం సంతరించుకొని శివజ్యోతిలో లీనమైపోయింది.

ఇదంతా చూసిన రాజు నిర్ఘాంతపోయి ఆలయంలో కొలువైవున్న నటరాజ స్వామి సన్నిధికి పరుగున వెళ్ళాడు.

15

నటరాజస్వామికి కర్పూర హారతి పట్టినప్పుడు ఆయనకు రెండు వైపుల శివజ్యోతిలో లీనమైన సాంబన్, ముళ్ళచెట్టూ ఉండడం చూశాడు. భక్తులు అందరూ చిదంబర నటరాజస్వామికి సాష్టాంగ ప్రణామాలు చేసి పులకితులయ్యారు.




**సార్వభౌముని దర్శించాలనుకొనేవాడు ముందుగా ద్వార పాలకులనూ, గద్దె వద్ద వుండే అంగరక్షకులనూ అనుకూలురుగా చేసుకోవాలి. ముందుగా వారి దయను సంపాదించాలి. అలాగే రాజరాజేశ్వరుడి సన్నిధిని చేరి అతడి అనుగ్రహాన్ని పొందాలనుకొన్నవాడు ఎన్నో భక్తిసాధనలను చేయాలి. ఎందరో భక్తులను సేవించాలి. చిరకాలం సత్సాంగత్యం చేయాలి.** – భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస



## వార్తావాహిని

# స్వామి రామకృష్ణానంద 150వ జయంత్యుత్సవం





స్వామి రామకృష్ణానంద 150వ జయంత్యుత్సవాలను చెన్నై, శ్రీరామకృష్ణ మఠం 2012 జూలై 15 నుండి 17 వరకు నిర్వహించింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని మఠ ప్రాంగణంలో నిర్మించిన 'స్వామి రామకృష్ణానంద మండపం'ను రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శి శ్రీమత్ స్వామి సుహితానందజీ మహరాజ్ ప్రారంభించారు.



మూడు రోజుల పాటు జరిగిన ఈ కార్యక్రమాల్లో స్వామీజీల భజనలు, ప్రసంగాలు, సాంస్కృతిక కార్యక్రమాలు, ఉపాధ్యాయుల, ఆటో డ్రైవర్ల సదస్సులు జరిగాయి. ఈ ఉత్సవాల్లో సుమారు యాభై మంది స్వామీజీలు, నాలుగు వేల మంది భక్తులు పాల్గొన్నారు. ❖

# భక్తులకు మంత్రదీక్ష



రామకృష్ణ సంఘ ధర్మకర్త, పాలకవర్గ సభ్యులు మరియు చెన్నై, శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు **శ్రీమత్ స్వామి గౌతమానందజీ మహరాజ్,** రాజమండ్రి, రామకృష్ణ మఠంలో 2012 అక్టోబర్ 10 నుండి 13 వరకు; విజయవాడ, రామకృష్ణ మిషన్‌లో 2012 అక్టోబర్ 13 నుండి 16 వరకు బస చేసెదరు.

**రాజమండ్రి, రామకృష్ణ మఠంలో** పూజ్య స్వామీజీ అక్టోబర్ 11,12,13 తేదీల్లో భక్తులకు మంత్రదీక్షను ప్రసాదించెదరు.

పూర్తి వివరాలకు సంప్రతించండి: రామకృష్ణ మఠం, రామకృష్ణ-వివేకానంద నగర్, రాజమండ్రి-533105, ఫోన్:0883-2473112.

**విజయవాడ, రామకృష్ణ మిషన్ (సీతానగరం ఆశ్రమం)**లో పూజ్య స్వామీజీ స్థానిక భక్తులకు అక్టోబర్ 15వ తేదీన, బయటి ఊళ్ళ నుండి వచ్చిన భక్తులకు అక్టోబర్ 16వ తేదీన మంత్రదీక్షను ప్రసాదించెదరు.

పూర్తి వివరాలకు సంప్రతించండి : రామకృష్ణ మిషన్, సీతానగరం, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా-522 501, ఫోన్ : 08645-272248/9247348003, E-mail: rkmvijay@gmail.com

రామకృష్ణ మిషన్, సీతానగరం పాఠశాల ప్రాంగణంలో నూతనంగా నిర్మించిన 'ఉపాధ్యాయ గృహ సముదాయ భవనం'ను 2012 అక్టోబర్ 16న **శ్రీమత్ స్వామి గౌతమానందజీ మహరాజ్** ప్రారంభించెదరు. ❖

## గ్రంథ పరిచయం




# పండుగ - పర్వం

(ఆచారాలు - సంప్రదాయాలు)

**రచన, సంకలనం : శ్రీ డి.వి.ఆర్. భాస్కర్**
**వెల : రూ. 150/-, పుటలు : 206**
**ప్రతులకు : డి.వరలక్ష్మి, ఫ్లాట్ నెం : 103, వివేకానంద ఎన్‌క్లేవ్, శాంతినగర్ కాలనీ, బాగ్ అమీర్, కూకట్‌పల్లి, హైదరాబాదు - 500 072, సెల్ : 99121 99394**

హైందవ ధర్మంలోని పూజలు, పర్వదినాలు, ఆచార వ్యవహారాలకు సంబంధించిన తార్కిక, ధార్మిక వివరణలతో కూడిన వ్యాసాల సంపుటే ఈ 'పండుగ-పర్వం' పుస్తకం. భక్తి ప్రాధాన్యం, ఆలయాల ప్రాశస్త్యం, వార్షిక పండుగల నేపథ్యం తదితర అంశాలతో పాటు ఆధ్యాత్మికపరమైన ఎన్నో సత్యాలను రచయిత డి.వి.ఆర్.భాస్కర్ ఈ రచనలో స్పృశించారు.

నోములు, వ్రతాలు, దీక్షలు మొక్కుబడిగా కాకుండా, వాటి వెనుక ఉన్న అంతరార్థాన్ని గుర్తెరిగి ఆచరిస్తే 'అధికస్య అధికః' ఫలం! పండుగ రోజు పరమాత్ముడికి నివేదించే పదార్థాల్ని కూడా సిద్ధాహారంలా (ఫాస్ట్‌ఫుడ్) దుకాణం నుంచి కొనుక్కొచ్చి పెట్టేసేంత యాంత్రికంగా మారిన ఆధునిక ప్రపంచంలో ఇలాంటి రచనలు మనకు కనువిప్పు కలిగిస్తాయి. అదేవిధంగా హిందూధర్మ అనుష్ఠానంలో సాధారణంగా భక్తులకు తలెత్తే సందేహాలకు ఈ 'పండుగ-పర్వం' పుస్తకంలో పురాణోక్తంగా, శాస్త్రోక్తంగా పరిష్కారాలు సూచించారు. భక్తజనులు, ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు తప్పకుండా చదవాల్సిన పుస్తకమిది. ❖ - బి. సైదులు

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-9, Sri Ramakrishna Prabha (Telugu Monthly) September 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? అంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. *- స్వామి రంగనాథానంద*





ఆంధ్రప్రదేశ్, చిత్తూరు జిల్లాలోని 'కాణిపాకం'లో వినాయకుడు స్వయంభువుగా వెలసి ఉన్న ప్రసిద్ధ 'శ్రీవరసిద్ధి వినాయక క్షేత్రం'.





# సుబోధ

**శ్రీరామకృష్ణ పరమహంస (భక్తులతో) :** నేను మల్లిక్ వంశీయుల ఇంట్లో సింహవాహినీదేవిని దర్శించడానికి వెళ్ళాను. వారు నివసిస్తున్న గృహం శిథిలావస్థలో ఉంది. వారు పేదరికంలో మ్రగ్గుతున్నారు. ఆ శిథిల గృహంలో ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తున్న సింహవాహినీదేవి ముఖారవిందాన్ని తిలకించాను.

ఒకసారి నేను విష్ణుపూర్ వెళ్ళాను. ఆ ఊరిలో చాలా దేవాలయాలు ఉన్నవి. ఒక దేవాలయంలో జగన్మాత వెలసి ఉంది. పేరు మృణ్మయి. ఈ ఆలయం సమీపంలో లాల్‌బంధ్, కృష్ణబంధ్ మొదలైన పేర్లతో పలు కోనేరులున్నవి. ఒక కోనేటి నీటిలో స్త్రీలు తమ శిరోజాలకు ఉపయోగించే నూనె వాసన గుబాళించింది. భక్తురాండ్రు ఆ ఆలయంలోని మృణ్మయి దేవిని దర్శించే సమయంలో వాసన నూనెను సమర్పిస్తారని అప్పుడు నాకు తెలిసింది. దేవాలయంలోని దేవీ మూర్తిని దర్శించక మునుపే, ఆ కోనేటి వద్ద నాకు భావసమాధి కలిగింది. ఆ స్థితిలో కోనేటి నీటి నుండి పైకి వచ్చిన మృణ్మయిదేవి దివ్యరూపాన్ని దర్శించాను.

ఏది బ్రహ్మమో అదే శక్తి, శక్తిని ఆరాధిస్తే అది బ్రహ్మాన్ని ఆరాధించడమే అవుతుంది. బ్రహ్మమూ, శక్తీ అభేదాలు. పాలను గురించి యోచించినప్పుడు వాటి రంగు తెలుపుదనం గుర్తుకు వస్తుంది; అలాగే తెలుపు రంగు గురించి ఆలోచించినప్పుడు, పాలు గుర్తుకువస్తాయి.

లంక నుండి తిరిగి వచ్చాక హనుమంతుడు రాముణ్ణి ప్రశంసిస్తూ ఇలా అన్నాడు : 'ఓ రామా! నువ్వే పరబ్రహ్మానివి, సీత నీ శక్తి. నువ్వూ, సీతా అభేదమూర్తులు'.

మహామాయ బ్రహ్మాన్ని ఆవరించి ఉన్నంతవరకు 'సోఽహం' – నేను ఆ పరబ్రహ్మాన్నే అన్నమాట సరిపడదు. యజమాని తన సేవకుణ్ణి ప్రేమించినప్పుడు, అతడితో 'రా, ఇలా వచ్చి నా ప్రక్కన కూర్చో; మన ఇద్దరి మధ్య తారతమ్యం లేదు!' అనవచ్చు. కానీ సేవకుడు తనంతట తానే యజమాని ప్రక్కన కూర్చోవడానికి ముందుకువస్తే, యజమానికి కోపం రాదా?

మహామాయ ఆవరించి ఉన్నంతవరకు భగవంతుణ్ణి 'అమ్మా, అమ్మా' అంటూ పిలవడం మంచిది. భగవంతుణ్ణి ఉద్దేశిస్తూ భక్తుడు ఇలా పలకాలి: 'నువ్వే తల్లివి, నేను నీ బిడ్డను. నువ్వు ప్రభువువి, నేను నీ దాసుడను.' సేవ్యసేవక భావమే మంచిది. ఈ దాస్య భావం నుండే తక్కిన భావాలన్నీ – శాంతభావం, సఖ్యభావం మొదలైనవి ఉద్భవిస్తాయి. ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 10 అక్టోబర్ 2012

**తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం**
**వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్ ।**
**దుర్గాం దేవీగ్ం శరణమహం**
**ప్రపద్యే సుతరసి తరసే నమః ॥**

అగ్నివర్ణము గలదియు, తపశ్శక్తిలో జ్వలించునదియు,
ధర్మార్థ కామ మోక్షములనే చతుర్విధ పురుషార్థ ఫలప్రాప్తికి
హేతువగునదియు అయిన దుర్గాదేవిని శరణు వేడుచున్నాను.
సంసార సాగరము నుండి మమ్ములను తరింపజేసే
ఓ దేవీ! నీకు ప్రణమిల్లుతున్నాను. - దుర్గాసూక్తమ్



## లోపలి పేజీల్లో...





# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి

ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'కి ధన దానం చేసి ప్రోత్సహించాల్సిందిగా కోరుతున్నాం. దాతల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : | శ్రీ కానాల బాలవేంకట రెడ్డి, నంద్యాల, కర్నూలు జిల్లా - 518 501 | 10,116 |
| మహారాజ పోషకులు | : | శ్రీ ఎమ్. రామస్వామి, ఎమ్. అగ్రహారం, చిత్తూరు జిల్లా - 517 217 | 10,000 |
| మహారాజ పోషకులు | : | శ్రీ వి. మురళి & శ్రీమతి వి. నరసమ్మ, అంబర్‌నగర్ బ్రిడ్జ్, రాంనగర్, హైదరాబాదు-44 | 10,000 |
| మహారాజ పోషకులు | : | శ్రీమతి రత్నకుమారి, ఏ.ఎస్.రావ్ నగర్, హైదరాబాదు-500 062 | 10,000 |
| రాజ పోషకులు | : | శ్రీ బి.వి. రమణ, రామవరప్పాడు, కృష్ణా జిల్లా - 521 108 | 5,000 |
| రాజ పోషకులు | : | శ్రీమతి ఎమ్.పి.ఎస్. మాధవి, మదీనాగూడ, హైదరాబాదు - 500 050 | 5,000 |
| రాజ పోషకులు | : | శ్రీమతి కాదా పద్మావతమ్మ, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్ (కీ॥శే॥ కుంకుమపూడి కృష్ణవేణమ్మగారి జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | : | శ్రీ పసుమర్తి రాధాకృష్ణ, ఖమ్మం (కీ॥శే॥ నారాయణ, తిరుపతమ్మ, రాజగోపాలం, రంగయ్యగార్ల జ్ఞాపకార్థం) | 4,464 |
| పోషకులు | : | శ్రీ పి.ఎ. నాగరాజు, హిందూపూర్, అనంతపురం జిల్లా - 515 201 | 1,500 |
| పోషకులు | : | శ్రీ వాలా శేషగిరిరావు & శ్రీమతి మణి, మౌలాలి, హైదరాబాదు (కీ॥శే॥ వి.సోమయ్య, అచ్చమ్మగార్ల జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : | శ్రీ పి. జనార్దనరావు & సన్స్, జి.టి.రోడ్, శ్రీకాకుళం | 1,006 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్‌చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1,500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

**ముఖచిత్రం :** మహిషాసురుణ్ణి వధించడానికి 'శివుని తేజస్సుతో ముఖం, యముని తేజస్సుతో కేశపాశం, విష్ణు తేజస్సుతో బాహువులు, చంద్రుని తేజస్సుతో కుచద్వయము, ఇంద్రుని తేజస్సుతో నడుము, భూమి తేజస్సుతో పిరుదులు, బ్రహ్మ తేజస్సుతో పాదాలు' ఇలా సర్వదేవతాంశలతో దేవి ఆవిర్భవించింది. - దేవీ మాహాత్మ్యం

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

పంపవలసిన చిరునామా :

Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*– సర్క్యులేషన్ మేనేజర్*



### దసరా శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు, శ్రేయోభిలాషులకు మా హృదయపూర్వక దసరా శుభాకాంక్షలు. *- సంపాదకులు*

సంపాదకీయం

# మాతృభక్తి... మోక్షసిద్ధి

శరత్కాలం నిర్మలత్వానికీ, శరచ్చంద్రుడు ప్రశాంతతకూ ప్రతీకలు. నిర్మలమైన ప్రేమ, కరుణను కురిపించే చల్లని మనస్సు మాతృమూర్తి సహజ లక్షణాలు. అందుకే నిర్మల, ప్రశాంత తరంగాలతో నిండిన శరత్కాలమంటే జగన్మాతకు అత్యంత ప్రీతి. శరత్కాలంలో విశేషంగా ఆ విశ్వేశ్వరిని తొమ్మిది రోజుల పాటు ఆరాధించి నవరాత్రి ఉత్సవాలను జరుపుకోవడం మన సంప్రదాయం. 'నవ' సంఖ్య పరిపూర్ణతకు సంకేతం. 'దేవీ కవచం'లో వర్ణించిన

**ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ ।**
**తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్ ॥**
**పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీ తథా ।**
**సప్తమం కాలరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టమమ్ ॥**
**నవమం సిద్ధిదాత్రీ చ నవదుర్గాః ప్రకీర్తితాః ।**
**ఉక్తాన్యేతాని నామాని బ్రహ్మణైవ మహాత్మనా ॥**

'శైలపుత్రి, బ్రహ్మచారిణి, చంద్రఘంట, కూష్మాండ, స్కందమాత, కాత్యాయని, కాళరాత్రి, మహాగౌరి, సిద్ధిదాత్రి' – ఈ నవదుర్గలను అర్చించి జీవితంలో పరిపూర్ణత్వాన్ని సాధించుకోవాలన్నది నవరాత్రి ఉత్సవాల విశిష్టత.



**పరిపూర్ణతకు పరమేశ్వరి అనుగ్రహం:** దుర్లభమైన మానవజన్మను సార్థకం చేసుకోవాలంటే అశాశ్వతమైన ఈ దేహంలో అంతర్గతంగా ఉన్న శాశ్వతమైన ఆత్మశక్తిని గ్రహించాలి. జనన మరణాతీత స్థితిని చేరుకోవాలి. అప్పుడే మానవజన్మకు పరిపూర్ణత్వం సిద్ధించినట్లు! అయితే పరిపూర్ణతను సాధించడానికి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులు అవసరం. **'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా'** – సర్వజీవుల్లో శక్తిగా నెలకొని ఉన్న ఆ సర్వేశ్వరిని ఆరాధిస్తే మానవ జన్మ పరిపూర్ణత్వానికి కావలసిన సర్వశక్తులూ సమకూరుతాయి. అమ్మ ప్రేమామృత ధారలతో అమరత్వం సిద్ధిస్తుంది. మోక్షం ప్రాప్తిస్తుంది.

**భువిలో వెలసిన దివ్యమూర్తి:** మోక్షప్రాప్తికి సాధనం ఈ మానవ దేహం. అనిత్యం, అశాశ్వతమైన ఈ సాధనంతోనే నిత్యం, శాశ్వతమైన బ్రహ్మపథాన్ని పొందడం సాధ్యమవుతుంది. అలాంటి అత్యున్నతమైన, అత్యంత దుర్లభమైన ఈ మానవ దేహాన్ని ప్రసాదించిన 'మాతృమూర్తి'యే ఇలలో వెలసిన ఆ జగన్మాత ప్రతిరూపం. **'యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా'** అని దుర్గాసప్తశతి విశదపరుస్తోంది. ఈ సృష్టిలో తల్లే ప్రత్యక్ష దైవం – 'మాతృదేవో భవ' అని వేదం తల్లికి అగ్రస్థానాన్నిచ్చింది.

జగన్మాత విశిష్ట లక్షణాలైన నిర్మలమైన ప్రేమ, చల్లని మనస్సు మాతృమూర్తిలో సహజగుణాలై ఒప్పారుతుంటాయి. దేహంలో ఏ అంగానికి ఆపద వాటిల్లినా మొట్టమొదట కనురెప్ప చలిస్తుంది. అలాగే పసిబిడ్డకు ఏ కష్టం కలిగినా ముందుగా తల్లడిల్లేది మాతృహృదయమే! బిడ్డ యోగక్షేమాల్నే సదా కాంక్షించే 'కరుణమూర్తి'; బిడ్డ సంరక్షణ కోసం తన ప్రాణాలు సైతం త్యజించేందుకు వెనుకాడని 'త్యాగమూర్తి'; తన కష్టాలను భరిస్తూ బిడ్డకు సుఖాన్ని పంచే 'ప్రేమమూర్తి'; మోక్షసాధనకు ఈ దేహాన్ని ప్రసాదించిన 'దివ్యమూర్తి' – ఈ దైవీగుణాలతో ఇలలో వెలసిన దైవం 'మాతృమూర్తి'.

మనమెంత భక్తిప్రపత్తులతో నవదుర్గలను ఆరాధించినప్పటికీ, నవమాసాలూ భరించిన మాతృమూర్తిని నిరాదరిస్తే ఆ జగన్మాత కృపకు పాత్రులం కాలేం. ఆదిపరాశక్తి అనంత ప్రేమను పొందాలంటే కన్నతల్లిని ఆనందింపజేయగలగాలి. తల్లి ఆశీర్వాదమనే తాళపు చెవి లేనిదే ఆ జగన్మాత కూడా మోక్షద్వారాలను తెరవదు. కాబట్టి మానవజన్మ పరిపూర్ణతకు మాతృమూర్తి దీవెనలు అత్యంత ముఖ్యం.

**తీర్చలేనిది తల్లి ఋణం:** మహారాజుకైనా, మహాయోగికైనా కన్నతల్లి ఆశీర్వాద బలమే ముఖ్యమని నిరూపించిన ఎందరో మహాత్ముల జీవితాలు మనకు ఆదర్శం కావాలి. మహారాజైన ఛత్రపతి శివాజీ 'నాలో ధైర్యసాహసాలనూ, ఆత్మవిశ్వాసాన్నీ నూరిపోసిన నా మాతృమూర్తికి నేను సదా ఋణపడి ఉంటాను' అన్నాడు. అమెరికా దేశాధినేత అయిన అబ్రహం లింకన్ 'నేను ఈ స్థితిలో ఉండడానికీ, నా విజయాలకూ కారణం దైవసమానురాలైన నా మాతృమూర్తి ఆశీర్వాదబలమే' అని పేర్కొన్నాడు. మహాప్రవక్త అయిన స్వామి వివేకానంద 'ఈ ప్రపంచంలో నేను ఆరాధించిన వారెవరైనా ఉన్నారంటే అది నా మాతృమూర్తే. నా జ్ఞానాభివృద్ధికి తోడ్పడిన నా తల్లి ఋణం ఎన్నటికీ తీర్చలేనిది' అని చెప్పారు. ఈ మహానుభావులంతా తల్లుల పట్ల తమకున్న కృతజ్ఞతాభావాన్ని చాటారు.

**మాతృమూర్తి ఆరాధనలో ముక్తపురుషులు:** బ్రహ్మానుభూతిని పొందిన ఎందరో ఆచార్యులు, మహర్షులు, యోగులు సైతం తల్లికి అగ్రస్థానమిచ్చి సాక్షాత్తూ దైవ సమానురాలుగా ఆరాధించారు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అని అద్వైత వేదాంతాన్ని

ప్రబోధించిన ఆది శంకరాచార్యులు తమ తల్లి ఆర్యాంబ కిచ్చిన మాట ప్రకారం ఆమె అవసానదశలో వచ్చి సేవించారు. ఆమె మరణానంతరం అంత్యక్రియలు జరిపారు. 'నేను' అంటే నిత్యం, సత్యం, శాశ్వతమైన ఆత్మ అనీ, సదా ఆత్మానందంలో ఓలలాడిన భగవాన్ రమణమహర్షి తమ తల్లి అళఘమ్మను తమతోపాటే ఆశ్రమంలో ఉంచుకొని ఆమెకు పరిచర్యలు చేశారు. తల్లి పరమపదించిన తరువాత ఆమె దేహాన్ని సమాధి చేసి, ఆ సమాధి మీద స్వయంగా భగవానులే శివలింగాన్ని ప్రతిష్ఠించారు.

సర్వసంగ పరిత్యాగీ, ఈశ్వరాంశ సంభూతుడూ అయిన స్వామి వివేకానంద తమ తల్లి భువనేశ్వరీదేవి కటిక దారిద్ర్యంతో అష్టకష్టాలను అనుభవిస్తుంటే ఎనలేని ఆవేదనకు గురయ్యారు. తల్లికి ఆర్థిక సహాయాన్ని అందించి ఆదుకొన్న ఖేత్రీ మహారాజు దయార్ద్రహృదయాన్ని వేనోళ్ళ కొనియాడారు. తల్లిని తనతో పాటు తీసుకెళ్ళి, పుణ్యతీర్థాలను దర్శింపజేసి, ఆమెను సంతృప్తిపరిచారు. పాశ్చాత్య దేశాల్లో పర్యటిస్తున్నప్పుడు తల్లిని తలవకుండా ఒక్క క్షణం కూడా ఉండలేకపోయానని స్వయంగా స్వామీజీయే తెలిపారు. జీవితంలో తాను సాధించిన ఘనకార్యాలన్నింటికీ కారణం తన తల్లే అని వినమ్రంగా చెప్పుకున్నారు. అంతేకాదు, స్వామీజీ ప్రతిరోజూ తల్లి పాదాలను కడిగి ఆ చరణామృతాన్ని స్వీకరించేవారంటే తల్లి భువనేశ్వరీదేవినే సాక్షాత్తూ త్రిభువనమాతగా భావించారన్నది ప్రస్ఫుటమవుతుంది.

ఇకపోతే, కాళికాలయంలో జగన్మాతతో సంభాషించడం, తినిపించడం, సందేహాలను తీర్చుకోవడం, ఏది చేయాలన్నా ఆమె అనుమతిని కోరడం, ఎవరైనా తనను నిందిస్తే ఆలయంలో అమ్మతో మొరపెట్టుకోవడం – ఇలా సర్వవేళలా ఆ సర్వేశ్వరియే సర్వస్వంగా భావించి, అమ్మ సన్నిధిలో భక్తిపారవశ్యంతో పాడుతూ తన్మయులై, సదా సమాధిమగ్నులై జీవించారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస. ఆయన కూడా వృద్ధురాలైన తన తల్లి చంద్రమణీదేవి యోగక్షేమాల పట్ల అశ్రద్ధ చూపలేదు. ప్రతిరోజూ తల్లిని దర్శించి, క్షేమ సమాచారాలను అడిగేవారు. ఆమెకు శుశ్రూషలు చేసేవారు.

అంతేకాదు, శ్రీరామకృష్ణులు బృందావనం వెళ్ళినప్పుడు అక్కడ పరమ భక్తురాలైన గంగామాయిని దర్శించారు. ఆ మహాసాధ్వి సాంగత్యంలో ఆయన పరమానందాన్ని అనుభవించేవారు. అలా కొన్ని రోజులు గడిచాక ఒకరోజు హఠాత్తుగా తల్లి జ్ఞాపకం వచ్చింది. వృద్ధాప్యంలో ఆమె ఎంత కష్టపడుతుందోన్న తలంపు మనస్సులో మెదలగానే కలకత్తాకు పయనమయ్యారు. తల్లి కోసం తన ఆధ్యాత్మికానందాన్ని కూడా వదులుకోవడానికి వెనుకాడలేదు. తల్లి పట్ల శ్రీరామకృష్ణులకు ఉన్న ప్రేమానురాగాలు వర్ణనాతీతమనడానికి ఈ ఉదంతమే చక్కని తార్కాణం. ఈ బ్రహ్మజ్ఞానులైన మహాత్ములంతా మాతృమూర్తులను సేవించడంలో తమ బాధ్యతను విస్మరించలేదు.

**మహర్షుల మార్గమే మార్గదర్శకం:** పరమహంసలు, పరమయోగులు జన్మించిన ధన్యభూమి మన భారతదేశం. అలాంటి పుణ్యభూమిలో జన్మించిన దివ్యాత్ములకు వారసులం మనం. కానీ నేడు మనం మాతృమూర్తి పట్ల ఎలాంటి గౌరవభావంతో ప్రవర్తిస్తున్నామో, ఎంత భక్తిశ్రద్ధలను ప్రదర్శిస్తున్నామో, ఎంత ప్రేమానురాగాలను కనబరుస్తున్నామో తెలుసుకోవడానికి దేవీ ఆలయాల కన్నా పెరుగుతున్న వృద్ధాశ్రమాలే నిదర్శనం. కాబట్టి నేటి ఈ పరిస్థితిని పునరాలోచించుకోవలసిన తరుణం ఆసన్నమైంది.

వృద్ధాప్యంలో ఉన్న మాతృమూర్తులను వృద్ధాశ్రమాల పాలుచేయడం శోచనీయం. భౌతిక వనరులు ఉన్నా మానవీయ విలువల సంక్షోభం వల్ల తల్లులను అనాథల్ని చేయడం దయనీయం. వృద్ధాప్యంలో ఏ తల్లి అయినా ఆశించేది కాస్త ఆప్యాయతతో కూడిన ఆదరణ, ప్రేమతో కూడిన పలకరింపు మాత్రమే!

మనకు మాటలు రాని పసివయస్సులో, మాటలు నేర్పడానికి తపించిన ఆ సహనమూర్తితో, కొంతసేపు ఆప్యాయంగా మాట్లాడాలన్న ఆలోచనే మనలో లోపిస్తోంది. పడి లేస్తున్న తరుణంలో చేయూతనిచ్చి మనకు నడక నేర్పిన ఆ కరుణ మూర్తికి, కాస్త చేయూతనిచ్చే సహృదయం మనలో కరవైపోతోంది. గోరుముద్దలు తినిపించి, మనల్ని పోషించిన ఆ అన్నపూర్ణ సంరక్షణ గురించి ఆలోచించే సుగుణం మనలో అరుదైపోతోంది. మన మనోవికాసానికి విద్యాబుద్ధులను నేర్పిన ఆ జ్ఞానమూర్తికి మానసిక ఉల్లాసాన్ని అందించే మనస్సే మనలో సంకుచితమైపోతోంది.

బాహ్య ప్రపంచంపై ధ్యాస లేని బ్రహ్మజ్ఞానులు సైతం మాతృమూర్తి యోగక్షేమాల పట్ల శ్రద్ధ వహించారు. కాబట్టి మనం అలాంటి మహాత్ములకు నిజమైన వారసులం కావాలంటే 'తల్లిని ఆరాధించని వ్యక్తి ఏ రంగంలోనూ ఉన్నతిని సాధించలేడు' అన్న స్వామి వివేకానంద వచనాలను మదిలో నిలుపుకొందాం. తల్లిని ప్రేమ, ఆప్యాయతలతో ఆదరిద్దాం. మాతృమూర్తి దీవెనలతో, జగన్మాత అనుగ్రహాన్ని పొంది మోక్షప్రాప్తికి అర్హతను సాధిద్దాం. ❖



> తల్లితండ్రులు పూజార్హులు. వారు జీవించి ఉన్నంత కాలం వారిని సేవించాలి. ఆ విధంగా వారి ఋణాన్ని తీర్చుకున్నవారమవుతాం. వారు సంతుష్టులు కానిదే ఏ కార్యం ఫలించదు. - శ్రీరామకృష్ణులు

# గోరుముద్ద - స్వామి సుప్రియానంద



## కుడి ఎడమయితే...

అదొక పెద్ద అంతర్జాతీయ కంపెనీ. ఆ కంపెనీలో బట్టలు ఉతికే సబ్బుపౌడర్(డిటర్జెంట్) తయారు చేస్తారు. వారు సబ్బుపొడికి 'అంతర్జాతీయ మార్కెట్' కైవశం చేసుకోవడానికి ఎలాంటి ప్రకటనలు(ఎడ్వర్టైజ్మెంట్) చేస్తే వినియోగదారులు పెరుగుతారో బాగా ఆలోచించి, వారి ప్రకటనలలో బొమ్మలకు ప్రాధాన్యతనిచ్చి, అతి తక్కువ పదాలను ఉపయోగించాలని నిర్ణయం తీసుకున్నారు. వ్యాపార ప్రకటనలో మూడు బొమ్మల క్రింద వరుసగా ఇలా వ్రాయించారు :

*మురికి బట్టలు *సబ్బునీళ్ళలో బట్టలు *శుభ్రమైన బట్టలు.

ఇంకేముంది! కంపెనీకి విపరీతమైన లాభాలు. కొన్నాళ్ళ తరువాత వారి 'సర్వే'లో ఒక కొత్త విషయం బయట పడింది. కొన్ని దేశాలలో వారి సబ్బుపొడికి 'మార్కెట్' లేకపోవడమే కాకుండా, ప్రజలలో ఆ సబ్బుపొడి మీద ఒక విధమైన ద్వేషం ఏర్పడింది. అందుకు కారణాలను తెలుసుకోవడానికి, ఆ దేశాలకు కంపెనీవారు 'మేధావి' బృందాన్ని పంపించారు. చివరికి 'సర్వే'లో తేలిన విషయం ఏమిటంటే, ఆ దేశ ప్రజలు కంపెనీ వారి ప్రకటనలను 'కుడి నుండి ఎడమ' వైపుకు చదవడమే!

ఇదండీ మన సమస్య - మంచీ, చెడులు నాణానికి ఇరువైపులున్న బొమ్మ, బొరుసుల్లాంటివి. ఇరు ప్రక్కలలో ఎటువైపు మనం చూస్తామో, దానిపైనే వస్తువు యొక్క మంచి-చెడు ఆధారపడి ఉంటుంది. కుడి ఎడమయినా, ఎడమ కుడి అయినా పొరపాటే!

మనం ద్వంద్వాలలో జీవిస్తున్నాం. ఈ ద్వంద్వ బుద్ధితో భగవంతుణ్ణి కొలుస్తున్నాం. మనకు చెడు సంభవిస్తే సహించం. ఎందుకీ చెడుని సృష్టించావని భగవంతుణ్ణి ప్రశ్నిస్తాం, రోదిస్తాం. కానీ భగవంతుడు మంచి,చెడులనే ద్వంద్వాలకు అతీతుడన్న విషయం మరచిపోతున్నాం.

జీవితమనే నాణానికి మంచి-చెడులు ఇరుప్రక్కలా ఉన్న బొమ్మా-బొరుసుల్లాంటివి అన్న భావన కలిగినప్పుడు, మనలో మరొక సమస్య తలెత్తుతుంది. అదే 'విచ్చలవిడితనం'. మంచి-చెడులనే ద్వంద్వాలు జీవితంలో సహజమనే మెట్ట వేదాంత ధోరణి విపరీత పరిణామాలకు దారితీస్తుంది. ఆధ్యాత్మిక సాధనలో పరిణతి లేనప్పుడు ఇలాంటి మెట్ట వేదాంతం వలన ఎటువంటి ప్రయోజనమూ ఉండదు. పైగా ప్రమాదం కూడా!

కాబట్టి సాధకుడు మంచీ, చెడుల మధ్య తారతమ్యం తెలుసుకొని 'చెడు'ని వదలిపెట్టి, 'మంచి'ని పెంచుకొనే ప్రయత్నం చేయాలి. స్వామి వివేకానంద మాటల్లో: "నాకు మేలైనది నీకు కీడు కావచ్చు. అన్ని విషయాల మాదిరే మంచి చెడ్డలకు కూడా క్రమవికాసం వుందనేదే దీని పర్యవసానం. అది క్రమవికాసం చెందుతూన్నప్పుడు ఒక దశలో మంచి అని, మరొక దశలో చెడు అని అంటుంటాం. నా మిత్రుడి ప్రాణం తీసిన తుపాను చెడ్డదని నేనంటాను. కానీ ఆ తుపాను గాలిలోని సూక్ష్మ విషక్రిములను నాశనం చేసి అసంఖ్యాక జనాన్ని కాపాడి ఉండవచ్చును. దాన్ని గుర్తించినవారు మంచిదంటారు; నేను చెడ్డదంటాను. కాబట్టి మంచి చెడ్డలు సాపేక్ష ప్రపంచానికి (relative world) సంబంధించినవే. మేం ప్రతిపాదించే నిర్గుణదేవుడు (impersonal God) సాపేక్షదేవుడు (relative God) కాడు. కాబట్టి అతడు మంచివాడని గాని, చెడ్డవాడని గాని నిర్వచించలేం. అతడు మంచి చెడులకు అతీతుడు. అతడు మంచివాడూ కాదు, చెడ్డవాడూ కాదు. కానీ, చెడుకంటే మంచే తనకు ఎక్కువ సన్నిహితమనే మాట నిజం." ('లేవండి, మేల్కొనండి!' సంపుటం-2, పుటలు- 195,196) ❖

# అవతార వరిష్ఠులకు అమ్మ దర్శనాలు !



– మహేంద్రనాథ్ గుప్తా*

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస కేవలం శాస్త్రాలనూ, గ్రంథాలనూ ఆధారంగా చేసుకొని ఎప్పుడూ ఏ బోధనా చేయలేదు. ఆ యా సత్యాలను వారు తమ జీవితంలో అనుభవించిన తరువాతనే శిష్యగణానికి బోధించేవారు. ఆత్మసాక్షాత్కారం నుంచి సమాధి స్థితుల వరకు ఆ గురుదేవులు స్వయంగా భక్తుల ముందు అనుభవించి చూపారు. వాటికి ఒక ప్రామాణికతను కల్పించారు. ఉపనిషత్తులు, భగవద్గీత తదితర సనాతన ధార్మిక సారస్వతానికి సంబంధించిన సత్యాలకు శ్రీరామకృష్ణ పరమహంస జీవితం సజీవ దృష్టాంతం; కర్మ, జ్ఞాన, భక్తి, రాజ యోగాల సమ్మేళనం.



'భగవంతుడు సాకారుడా? నిరాకారుడా?' అని ఒకమారు కొందరు, గురుదేవులను ప్రశ్నించారు. వెంటనే శ్రీరామకృష్ణులు 'నేను కాళీమాతను రెండు విధాలుగానూ దర్శించుకున్నాను. అమ్మ నిరాకారమైన అవిభాజ్య సచ్చిదానంద స్వరూపిణి; కానీ భక్తుల కోసం వివిధ రూపాలను ధరించే దయామయి కూడా! దక్షిణ కలకత్తాలోని కాళీఘాట్ వద్ద అమ్మ కొంతమంది పిల్లలతో ఆడుకుంటూ, సీతాకోకచిలుకను పట్టుకోవడానికి పరుగెడుతూ ఉండడాన్ని నేను కళ్ళారా చూశాను. మరోసారి అమ్మ గంగాతీరంలో నడుచుకుంటూ వెళ్ళడం నా కంటపడింది' అని తమ అనుభవాన్ని కళ్ళకు కట్టినట్లు వివరించారు.

మరో సందర్భంలో గురుదేవులు అమ్మ దర్శనానికి సంబంధించిన ఉదంతాన్ని చెబుతూ 'దక్షిణేశ్వరంలోని నా గదిలో ఒకసారి కేశవ్‌సేన్, మరికొంత మంది భక్తులు కూర్చొని ఉన్నారు. అప్పుడు అమ్మ హఠాత్తుగా వచ్చింది. కొంగున తాళం చెవుల గుత్తి కట్టి ఉన్న ఎర్ర అంచు చీర కట్టుకొని ఆ రోజు ప్రత్యక్షమైంది' అని అన్నారు.

జనమంతా భగవాన్ శ్రీరామకృష్ణుల మాటల్ని వింటూ ఉంటారు; కానీ ఆ మహానుభావుడు మాత్రం కాళీమాత మాటల్ని వింటూ ఉండేవారు. మరోరోజు మాటల్లో మాటగా గురుదేవులు, తల్లి దర్శనాన్ని మననం చేసుకుంటూ 'అమ్మ నిన్న ఆలయం మెట్లు ఎక్కుతూ, దిగుతూ కనిపించింది. జుట్టంతా విరబోసుకొని ఆమె వెళుతూ ఉంటే, కాలి అందెలు ఘల్లుఘల్లుమని సవ్వడి చేస్తున్నాయి' అన్నారు. మరోసారి కాశీపూర్‌లో 'అమ్మ ఈ రోజు ఎంచక్కా వీణ వాయిస్తూ నాకు దర్శనమిచ్చింది' అని సంబరంగా గురుదేవులు మాకు చెప్పారు.

ఒకసారి నేను దక్షిణేశ్వరం వెళ్ళినప్పుడు గురుదేవులు తమ గదికి ఉత్తరం వైపున ఉన్న తోటమార్గాన్ని ఊడుస్తూ కనిపించారు. నన్ను చూడగానే 'అమ్మ ఇదే మార్గంలో నడుచుకుంటూ వస్తుంది. అందుకే శుభ్రం చేస్తున్నాను' అన్నారు.

మరోసారి కూడా నా లాంటి కొంతమంది భక్తుల ముందే భగవానులు అమ్మతో ఏవో సంప్రతింపులు జరిపారు. మాకు ఎవ్వరికీ అమ్మ కనిపించలేదు. కానీ వారు మాత్రం స్పష్టంగా వీక్షించారు. వారు మాతో మాట్లాడుతూనే హఠాత్తుగా 'ఓ అమ్మ వచ్చింది' అంటూ అటువైపు తిరిగి మాట్లాడసాగారు. 'అమ్మా! నేను ఎవరి మాట వినాలి? ఒకతను ఒకలా చెబుతున్నాడు, మరోవ్యక్తి మరోలా చెబుతున్నాడు. నా పరిస్థితి ఏంటి?' అని ప్రశ్నించారు. వెంటనే అమ్మ, గురుదేవులతో ఏదో మాట్లాడింది. అప్పుడు శ్రీరామకృష్ణులు సమాధానపడ్డ మనస్సుతో 'అమ్మా! నాకు అర్థమైంది. సరే! నేను ఇక నీ మాటే వింటాను; ఎవరి మాటా వినను' అన్నారు. ❖

(*శ్రీరామకృష్ణ కథామృత రచయిత– మాస్టర్ మహాశయుడు 'మ'గా ప్రసిద్ధులు)



పిల్లి తన కూనలను నోటితో కరిచిపట్టుకున్నప్పుడు వాటికి ఏ అపాయం వాటిల్లదు. అలాగే మహామాయ ఆవరించినప్పటికీ, దానివల్ల భక్తులకు ఎలాంటి ప్రమాదం ఉండదు.- శ్రీరామకృష్ణులు



భజ గోవిందమ్
భజ గోవిందమ్

అంగం గలితం పలితం ముణ్డం
దశనవిహీనం జాతం తుణ్డమ్ ।
వృద్ధో యాతి గృహీత్వా దణ్డం
తదపి న ముంచతి ఆశాపిణ్డమ్ ॥

# వాలే వయసులోనూ వీడని వాంఛలు!

**– స్వామి జ్ఞానదానంద**

కురుక్షేత్ర సంగ్రామం ముగిసింది. కౌరవులు నూరుగురూ కన్నుమూశారు. రణరంగ విశేషాలను క్షణక్షణం శాబ్దిక ప్రత్యక్ష ప్రసారం ద్వారా తెలుసుకున్న ధృతరాష్ట్రుడు తుదిఫలితం విని కుమిలిపోయాడు. చివరకు పుట్టెడు పుత్రశోకంతో ధర్మరాజు పంచన చేరారు ధృతరాష్ట్ర దంపతులు. అంత వార్ధక్యం, విషాదంలోనూ రాజమందిరాల్లోని హంసతూలికా తల్పాలపై సేద తీరుతున్నారు. అప్పుడు ఆ రాజగృహంలోకి ప్రవేశించాడు విదురుడు. పాండవుల నీడలో రాజభోగాలు అనుభవిస్తున్న పెద్దన్నను చూసి, విదురుడు విస్తుపోయాడు. ఆ వయస్సుకు కావలసిన వైరాగ్యాన్ని విపరీత వ్యాఖ్యలతో గుర్తుచేశాడు. 'అన్నా! ఇంకా నీకు ఈ శరీర సుఖాలపై విరక్తి కలగలేదా? ఈ వయస్సులో, ఇంత విషాదంలో కూడా నీవు ఏమి అనుభవిద్దామని ఈ మహాసౌధాల్లో తిష్ఠ వేసి కూర్చున్నావు? ఇంకా ఈ భోగభాగ్యాలపై అసహ్యం కలగడం లేదా? ఈ జీవితంపై సిగ్గువేయడం లేదా?' అని కటువుగా ప్రశ్నిస్తాడు. అప్పుడు ఆ వృద్ధదంపతులకు కనువిప్పు కలుగుతుంది. అనంతరం అర్ధరాత్రి ఎవరికీ తెలియకుండా విదురుడితో కలసి గాంధారి, ధృతరాష్ట్రులు భగవచ్చింతనకై అడవులకు వెళ్ళిపోయి అక్కడే తుదిశ్వాస విడుస్తారు.



ఈనాటికీ కళ్ళుండీ ధృతరాష్ట్రుడిలా వెర్రివాంఛలతో, వ్యామోహాలతో ఈ శరీరమే శాశ్వతమనుకునేవారు మనలో చాలామందే ఉన్నారు. తల ముగ్గుబుట్టలా మారినా, తనువు ఎండుకట్టెలా వంగినా ఇంకా శరీరంతో ఏదో అనుభవిద్దామని తహతహలాడుతున్నారు. వార్ధక్యంలోనూ యౌవనాన్ని ఊహించుకొని, కోరికల కాసారాల్లా మారిపోతున్న ఇలాంటి వారిని ఉద్దేశిస్తూ, ఆదిశంకరాచార్యుల ప్రియశిష్యులు హస్తామలకుడు 'భజగోవిందం' శ్లోకపరంపరలో...

**అంగం గలితం పలితం ముణ్డం, దశనవిహీనం జాతం తుణ్డమ్**
**వృద్ధో యాతి గృహీత్వా దణ్డం, తదపి న ముంచతి ఆశాపిణ్డమ్...**

అంటున్నారు. శరీరం ముసలిదైపోయింది. జుత్తు పండిపోయింది. నోట్లో పళ్ళు ఊడిపోయాయి. ముసలివాడై కర్ర పట్టుకొని నడుస్తూ ఉంటాడు. అయినా మానవుడు కోరికల్ని మాత్రం వదలిపెట్టడం లేదని ఆవేదన పడుతున్నారు. నేటి సమాజాన్ని చూస్తూ ఉంటే, ఆ హస్తామలకుడి ఉవాచ నూటికి నూరుపాళ్ళు నిజమనిపిస్తూ ఉంది.

**మసకబారుతున్న మలిసంధ్య... :** ఈ రోజుల్లో అరవై ఏళ్ళు దాటిన చాలా మంది వృద్ధుల జీవనశైలిని చూస్తూ ఉంటే ఆశ్చర్యమనిపిస్తూ ఉంది. వాళ్ళ అభిరుచులు, అలవాట్లు, ఆహార్యం, ఆడంబరాలు అసహజంగా పరిణమిస్తున్నాయి. నేటి తరంలా, ఆనాటి తరమూ చౌకబారు వ్యవహారాలతో కాలాన్ని గడిపేస్తూ ఉండడం బాధాకరం. పూర్ణత్వం వైపు ప్రయాణించాలన్న తాపత్రయం లేకపోవడం వలన, విషయానందాన్ని మించిన బ్రహ్మానందం ఒకటి ఉందని తెలుసుకోకపోవడం వలన పళ్ళు ఊడిపోయే వయస్సులో కూడా పాతికేళ్ళ వ్యక్తుల్లా ప్రవర్తిస్తున్నారు. శరీరం సహకరించక మొరాయిస్తున్నా, సుఖాల కోసమే వెంపర్లాడుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఇక ఆ భగవంతుడు తప్ప, ఎవరూ ఇలాంటి మనుష్యుల్ని గట్టెక్కించలేరు. అందుకే శ్రీకాళహస్తీశ్వర శతకంలో మహాకవి ధూర్జటి...

**రోసీ రోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్**
**పాసీ పాయదు పుత్రమిత్ర ధన సంపద్భ్రాంతి, వాంఛాలతల్**
**కోసీ కోయదు నామనం బకట! నీకున్ ప్రీతిగా సత్క్రియల్**
**చేసీ చేయదు దీని త్రుళ్ళణచవే శ్రీకాళహస్తీశ్వరా!**

'ఓ పరమేశ్వరా! నా మనస్సు స్త్రీల యౌవన సుఖాల పట్ల విరక్తి చెంది కూడా, మరలా రక్తిని చెందుతున్నది. నా పుత్రులు,

నా స్నేహితులు, నా ధనం, నా సంపదలనే భ్రాంతిని విడిచినప్పటికీ మరలా వెంటపడుతున్నది. ఈ కోర్కెలనే తీగలను తెగకోసినప్పటికీ అవి నాశనం కాకుండా, వాటి వెంట మనస్సు పరుగులెత్తుచున్నది. శంకరా! నీకు ఇష్టమగునట్లుగా మంచి పనులను చేయడం ప్రారంభించినా కూడా విడవడం లేదు. ఈ విధమైన నా మనస్సులోని పొగరును నీవే అణగదొక్క వలసింద'ని వేడుకుంటున్నాడు.

**వార్ధక్యం వెంటే వ్యాధులు... :** యౌవనంలో ఆరోగ్యంగా ఉన్నట్లే వృద్ధాప్యంలోనూ, అంతే ఆరోగ్యంగా, చలాకీగా ఉండాలని చాలామంది తాపత్రయపడుతూ ఉంటారు. అదెలా సాధ్యం? ఎంత పచ్చగా ఎదిగిన మానైనా ఒకానొక నాటికి వడలిపోవలసిందే! ఎంత దృఢంగా పెంచిన శరీరమైనా కాలానుగుణంగా సడలి పోవలసిందే! కానీ మనలో చాలామంది పెద్దవారు శరీరానికి ఏ కాస్త అనారోగ్యం కలిగినా, తనకు ఏదో జరగకూడనిది జరిగిపోయిందని దిగులుపడుతూ ఉంటారు. యౌవనంలో కండరాలు బిగువుగా ఉండి కుస్తీపోటీల్లో బంగారు పతకం సాధించిన కండల వీరుడు కూడా, ముసలితనంలో ఓ మూల కూర్చోవలసిందే! వేలమందికి వ్యాధులు తగ్గించిన వైద్యుడైనా, వార్ధక్యంలో ఆ వ్యాధుల బారిన పడి మరో వైద్యుడితో చికిత్స చేయించుకోవలసిందే! కాటికి కాళ్ళు చాచే వయస్సులో, కీళ్ళనొప్పులు రావడం సహజమే కదా! ఇది ప్రకృతి సహజం. అందుకే శరీరానికి సంబంధించిన ప్రతి చిన్న అనారోగ్యానికీ, అసౌకర్యానికీ చింతించాల్సిన అవసరం లేదు. శరీరం కుశలంగా ఉండాలని ఎప్పుడూ కోరుకోనూ కూడదు. భక్త కబీర్ ఓ చోట...

**కుసల, కుసల సబ్ పూఛతే, కుసల కిసీ కా హోయ్**
**జరా ము ఈ నా భయ్ ము అ, కుసల కాహే కో హోయ్!**

'ప్రపంచంలో అందరూ కుశలమా?క్షేమమా? బాగున్నారా? కులాసాయేనా? అని అడుగుతూ ఉంటారు. నిజానికి కుశలం ఎక్కడుంది? ఎవరికుంది? ముసలితనమూ పోలేదు; మృత్యుభయమూ పోలేదు; అవి ఎలాగూ వస్తాయి. ఇక కుశలమెక్కడిది?' అని ప్రశ్నిస్తాడు.

**కాటు వేసేవి కోరికలే!:** ముఖ్యంగా వార్ధక్యస్థితిని జీర్ణించుకోవడానికి మనస్సు ఇష్టపడదు. అందుకే బలవంతంగా శరీరం పూర్వస్థితిలోనే ఉందనే భ్రమను కల్పిస్తుంది. కోర్కెలను కట్టడి చేయకుండా, వాటి వైపు పరుగెత్తిస్తుంది. మట్టిలో కలసిపోయే ఈ మేనికి లేనిపోని మరమ్మతులు చేయించమంటూ, కొత్తదే అనిపించేంత మెరుగులు దిద్దించమంటూ ఉంటుంది. కానీ ఎన్ని చికిత్సలు చేయించుకున్నా ఎప్పుడో ఒకప్పుడు ముఖం ముడతలు పడాల్సిందే! ఎన్ని విదేశీ పేస్టులు వాడి, రోజుకు పదిసార్లు తోముకున్నా దంతాలు ఎప్పటికైనా ఊడిపోవలసిందే! శరీర భాగాలను కలకాలం అదే పటుత్వంతో ఉంచాలను కోవడం మన అవివేకం. అందుకే వాటి వాడకానికి పరిమితులు విధించాలి. కళ్ళ దగ్గర నుంచి కాళ్ళ వరకు అన్ని భాగాల వినియోగాన్నీ రానురానూ తగ్గించుకుంటూ ఉండాలి. ఇది కేవలం మానసిక, శారీరక కోర్కెలను నియంత్రించినప్పుడే సాధ్యపడుతుంది. లేనట్లయితే ముసలి ఎద్దుకు కావడి కట్టి, మండుటెండలో పొలం దున్నించినట్లు అవుతుంది. ఆహారం నుంచి ఆహార్యం వరకు అన్ని విషయాల్లోనూ పూర్తిగా వైరాగ్యాన్ని అలవరచుకోవాలి. అనుభవించింది చాలు! ఇవి నాకిక సరిపడవని మనస్సుకు నచ్చజెప్పుకోవాలి. దేహంపై నుంచి దృష్టిని మరల్చి, వాంఛల వడిని తగ్గించుకోమనాలి. ధారావాహికలు వీక్షించడం, దారినపోయే ప్రతి ఒక్కరి విషయాలను తెలుసు కోవాలనే ఉత్సుకతను మానుకోమనాలి. అందుకే 'కోరికలు, కామ కాంచనాల ఆసక్తి ఉన్నంత వరకు దేహబుద్ధి నశించదు. విషయాసక్తత తగ్గినప్పుడు ఆత్మజ్ఞానం వైపు పురోగమించవచ్చు. దేహబుద్ధి తగ్గుతుంది. చివరకు విషయాసక్తి అడుగంటా నశిస్తేనే ఆత్మజ్ఞానం కలుగుతుంది. భగవంతుని వైపు మనస్సు మరలుతుంది' అంటారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస.

**భగవంతుడు... భాగవతమే దిక్కు! :** కోరికల వలలో పడితే ముదిమిలోనూ మనస్సు భగవంతుడికి దగ్గర కాదు. పైగా వాంఛలు తీర్చుకోవడానికి వాటాకు వస్తున్నాడని ఈ తరం వారు ఈసడించుకుంటూ ఉంటారు. పోయే కాలంలోనూ ఈ పోకడ లేంటని ముక్కున వేలేసుకుంటారు. అందుకే ఇలాంటి దౌర్భాగ్యస్థితి రానివ్వకూడదని ఆ భగవంతుణ్ణి ప్రార్థించాలి. వయస్సుకు తగ్గ హుందాతనాన్ని ప్రసాదించాల్సిందిగా వేడుకోవాలి. వీలైనంత వరకు తమకంటూ ఓ కొత్త వాతావరణాన్ని సృష్టించుకోవాలి. ఆ ఏకాంతంలో భగవంతుడికి దగ్గరయ్యే ప్రయత్నం చేయాలి. మన జీవితాలను గట్టెక్కించే శ్రీమద్భాగవతం, శ్రీరామకృష్ణ కథామృతం లాంటి ఎన్నో పవిత్ర గ్రంథాలను ఆశ్రయించాలి. సాక్షాత్తూ భగవంతుడి నోటి నుంచి వెలువడిన పవిత్ర బోధనలవి. మనం దిగాల్సిన స్టేషన్ రాబోతుందని తెలిసి, అప్పటి వరకూ మనతో కలసి ప్రయాణించిన వారికి వీడ్కోలు పలికి, ఎలాగైతే సామగ్రి సర్దుకొని, దిగిపోవడానికి సిద్ధమవుతామో, అలాగే జీవన యానంలో నుంచి నిష్క్రమించేందుకు కూడా సంసిద్ధులం కావాలి. అలా కాకుండా ఇంకా కోరికల వెంటే పడ్డవారికి రాకూడని కష్టాలు వస్తాయంటూ శ్రీమద్భాగవతంలో ఋషభదేవుడు...

**.....ధరలోన పుట్టిన, పురుషులకును శునకములకు లేని**
**కష్టములు తెచ్చు కాన, కామంబుల వలన బుద్ధి సేయవలదు!**

'ఈ గడ్డ మీద పుట్టిన మనుష్యులు కామానికి లొంగిపోతే కుక్కలకు కూడా రాని కష్టాలు ఎదురవుతాయి. అందువల్ల కోరికలకు దూరంగా ఉండాల'ని హితవు పలుకుతాడు. ❖

మానవదేహం మాంసం, మజ్జ, ఎముకలు, రక్తం మొదలైన అసహ్యమైన పదార్థాలతో నిర్మితమైంది. శరీరం గురించి ఈ విధమైన ఎరుక కలిగివుంటే శరీరాభిమానం తొలగిపోతుంది. - శ్రీరామకృష్ణులు

# రామకృష్ణ మిషన్, కడప





(రామకృష్ణమిషన్ అనుబంధ శాఖ, బేలూరుమఠం పోస్టు, హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్ 711202)
పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516002, ఫోన్: 200120, 200633
నగర కేంద్రం: రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప - 516001, ఫోన్: 241633
Email: kadapamath@yahoo.com Web site: www.rkm-kadapa.org

## భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ సంప్రోక్షణ మహోత్సవం

**విజ్ఞప్తి**

మూర్తిత్రయం యొక్క అపారమైన కృపాకటాక్షాలతో భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ నిర్మాణం దాదాపు పూర్తి కావస్తున్నది (రూ. 140 లక్షల అంచనా వ్యయంతో ప్రారంభమైన ఈ ఆలయ నిర్మాణ పనులు పూర్తి కావడానికి ఇంకా సుమారు రూ. 20 లక్షలు కావలసివున్నది).



దేవాలయ నమూనా

భగవాన్ శ్రీరామకృష్ణుల నూతన దేవాలయ సంప్రోక్షణోత్స వాలను **2012 నవంబర్ 20వ తేదీ నుండి 23వ తేదీ వరకు** నిర్వహించదలచాం. 2012 నవంబర్ 22వ తేదీ, జగద్ధాత్రి పూజ పవిత్ర దినాన భగవాన్ శ్రీరామకృష్ణుల పాలరాతి విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమం జరుపబడును. నాలుగు రోజుల పాటు జరిగే ఈ మహోత్సవాల్లో పాల్గొనడానికి భక్తులకు, శ్రేయోభిలాషులకు ఇదే మా సాదర ఆహ్వానం.

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ వారిచే ఆలయ సంప్రోక్షణ కార్యక్రమం నిర్వహించబడును. ఈ మహోత్సవాల్లో భాగంగా వాస్తుహోమ, ప్రత్యేకపూజ, శోభాయాత్ర, ప్రవచనాలు, భజనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడును. ఈ కార్యక్రమాల్లో వివిధ మత కేంద్రాల నుండి సుమారు 250 మంది స్వామీజీలు, వివిధ ప్రాంతాల నుండి సుమారు 5,000 మంది భక్తులు పాల్గొంటారని అంచనా.

నాలుగు రోజుల పాటు జరిగే ఈ ఉత్సవాలకు సుమారు రూ. 45 లక్షలు వ్యయం అవుతుందని అంచనా. ఈ మహోత్సవాలను విజయవంతంగా నిర్వహించడానికి ఉదార హృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ శక్తికొలది విరాళాలను ఇచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

విరాళాల్ని Ramakrishna Mission, Cuddapah (కడప పేరును బ్యాంకుల్లో Cuddapah గానే సంబోధిస్తున్నారు) పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa - 516 002 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.



నిర్మాణంలో ఉన్న దేవాలయం

అదే విధంగా స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలోని మా అకౌంట్‌కు 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా కూడా మీరు విరాళాల్ని పంపవచ్చు. SBI, RIMS Branch, Ramakrishna Mission, A/c No: 30186936408, బ్యాంక్ కోడ్ : SBIN 0010107. 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా పంపిన విరాళాల వివరాలను మాకు వెంటనే తెలియపరచగలరు.

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

భగవత్సేవలో
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి

Advt.,



ఎప్పుడైనా ఉంటుంది. వృత్తుల్నీ, ప్రవృత్తుల్నీ మార్చుకునే అవకాశమూ ఉంటుంది. భౌతికమైన లాభనష్టాల బేరీజులు తాత్కాలిక ఫలాలనే ఇస్తాయి. కానీ ఆధ్యాత్మిక ఫలాలే శాశ్వత ఫలితాన్నిచ్చేవి. జన్మ రాహిత్యాన్ని కలిగించేవి. ఎన్నుకున్న మార్గం మరో మార్పునకు అవకాశం లేనిది. ప్రతి క్షణం అప్రమత్తతతో, ప్రతి అడుగు అత్యంత జాగరూకతతో వేయవలసి ఉంది. దీనికి కాలం మనకు సహకరిస్తుంది. ఆశీర్వదిస్తుంది. అర్చనకు ఉపయోగించే పుష్పాల్లా ప్రతి క్షణాన్నీ ఆయన సన్నిధికి చేరే ప్రక్రియలో వినియోగించాలి.

# కాలాయ నమః

– హేమంత్ కుమార్

కాలం దైవ స్వరూపం. అందుకే మనం కాలాన్ని దైవంలా ఆరాధించాలి. అంత అపురూపమైన కాలాన్ని మనం ఎలా సద్వినియోగం చేసుకోవాలి? ఎలాంటి జీవితాన్ని, జీవన విధానాన్ని ఎన్నుకుంటే మనకివ్వబడిన కాలానికి సాఫల్యం సిద్ధిస్తుంది? నిజమే! అజ్ఞాన దశలో మనం కాలాన్ని ఎంతో దుర్వ్యయం చేశాం. ఆ విషయాన్ని గ్రహించాక కేవలం పశ్చాత్తాపం చెందితే ఉపయోగం లేదు. ఆలస్యం చేయకుండా మన జీవన పథాన్ని మార్చుకోవలసి ఉంది. జీవన శైలినీ మలచుకోవలసి ఉంది. పారమార్థిక జీవితం ఉత్తమం అనుకుంటే ప్రాపంచిక జీవితం దాని నుంచి విడిగా ఏమీ లేదు. కాయ, పండు వేరు వేరు కాదు. కాయ పక్వం చెందితే పండుగా మారుతుంది అంతే. ప్రాపంచిక జీవన వినిమయాన్ని ఆస్తిక, సాత్విక దృక్పథంతో సానబెడితే పారమార్థికంగా రూపాంతరం చెందుతుంది. ఏ మనిషైనా భౌతిక దృక్పథంతోనే జన్మిస్తాడు. ఏ శుకుడు, శంకరులు, మార్కండేయుడు, ప్రహ్లాదుడు లాంటి వాళ్ళే తప్ప! భౌతికతను వివేకంతో, సత్సాంగత్యంతో ఆధ్యాత్మికంగా మలచుకోవాలి.

మరి మనం ఆధ్యాత్మిక జీవితాన్ని అభిలషిస్తున్నప్పుడు కాలాన్ని చాలా జాగ్రత్తగా, ప్రణాళికాబద్ధంగా మలచుకోవలసిన అవసరం ఉంది. ఇదివరకులా సమయాన్ని ఆషామాషీగా వ్యయం చేయరాదు. ప్రతి క్షణాన్నీ అమూల్యంగా, అమృత సమంగా వినియోగించుకోవాలి. ఉన్న సమయాన్ని పదింతల ఫలాలనిచ్చే మార్గాలను అన్వేషిస్తూ లోభిలా ప్రతి క్షణాన్నీ ఆధ్యాత్మిక కార్యకలాపాల కోసం భద్రపరచుకోవాలి. ప్రాపంచిక జీవనంలో మనం ఎన్నుకునే వ్యవహారాలు మెరుగుపరచుకునే వీలు

ఆధ్యాత్మిక జీవితం మనిషిని ధర్మబద్ధుణ్ణి చేస్తుంది. నిరాడంబరతనూ, నిబద్ధతనూ అలవరుస్తుంది. కాలం విషయంలో ప్రాపంచిక జీవనంలో ఉండే వెసులుబాట్లు పారమార్థిక జీవనంలో ఉండవు. ఎప్పటికప్పుడు ఏక లక్ష్యంతో, నిర్ధారిత మార్గం నుండి కించిత్తు వైదొలగకుండా ముందుకు సాగవలసి ఉంది. ఏం?... ఎప్పుడో లభించే, అసలు లభిస్తుందో లేదో తెలియని మోక్షం కోసం ఇప్పటి నుంచే ప్రతి క్షణాన్నీ ఆ ప్రయత్నంలో వ్యయం చేయాలా? ప్రాపంచిక సౌకర్యాలనూ, సౌఖ్యాలనూ ఆస్వాదించవద్దా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఆస్వాదించవచ్చు. ఆధ్యాత్మిక స్పర్శతో ఆ ఆస్వాదనం రసాస్వాదనం అవుతుంది. ధర్మబద్ధం అవుతుంది. నిష్కామం, కర్మఫల రహితం అవుతుంది. ప్రాపంచిక జీవనంలో 'సంతోషం' కలిగించిన పని, అదే పని, పారమార్థిక స్పర్శతో 'ఆనందం' అయిపోతుంది. సంతోషం క్రింది స్థాయి అనుభవం. ఆనందం పై స్థాయి అనుభూతి. సంతోషం అనుభవ ప్రధానం. ఆనందం భావ ప్రధానం. భావం అనుభూతిని కలిగిస్తుంది. తీవ్రమైతే అమనస్కం చేస్తుంది.

శ్రీరామకృష్ణులు వారి చివరి రోజుల్లో తమ దివ్య జ్ఞానాన్ని శిష్యులకు ధారపోసే మహత్కార్యంలో నిమగ్నులయ్యారు. వైద్యులు ఎక్కువ మాట్లాడవద్దనీ, విశ్రాంతి తీసుకొమ్మనీ విజ్ఞప్తి చేసినా వినలేదు. ఎందుకంటే జ్ఞానులు కాలాన్ని ఉన్నతమైన రీతిలో వినియోగించుకోవడమే కాదు, కాలానికే వన్నె తెస్తారు. మహాత్ములు కాలాన్ని లోక కల్యాణార్థం వినియోగించే కార్యక్రమాలతో శోభాయమానం చేస్తారు. స్వామి వివేకానంద లాంటివారు చిన్నవయస్సులోనే శివసాయుజ్యం పొందారు. ఆ విషయం గ్రహించే వారు కర్తవ్యదీక్షలోనే విశ్రాంతి పొందారు. కాలం విలువ తెలిసిన వారు, ఆ స్వల్ప వ్యవధిలోనే వారి నిర్దేశిత కర్తవ్యాన్ని పూర్తి చేయవలసి ఉన్నవారు విశ్రమించరు. విరామం తీసుకోరు. కాబట్టి ఉన్న కాస్త కాలాన్నీ వ్యర్థ జీవనంతో వృథా చేసుకోకుండా వచ్చిన పని కోసం, పరమాత్మ మెచ్చిన పని కోసం వినియోగించుకోవాలి. ❖

ఈ ప్రపంచంలో సర్వభక్షమైన కాలానికి ఎరకానిది ఏదీ లేదు. కాలం అన్నింటినీ కబళించి వేస్తుంది. మహాత్ములు స్వల్పకాలికమైన ఈ జీవితాన్ని పరమపదాన్ని పొందడానికై వినియోగిస్తారు. - శ్రీరాముడు



# అమ్మరూపంలోనూ ఆ దేవుడే!

– స్వామి యతీశ్వరానంద

భగవంతుణ్ణి తల్లిగా భావిస్తూ పూజించవచ్చా? భారతదేశంలో ఈ ప్రశ్నను అడిగేవారే ఉండరు! పరబ్రహ్మాన్ని రకరకాల భావనలతో భజించవచ్చని భారతదేశంలో అందరికీ తెలుసు.

భగవంతుణ్ణి తల్లిగా భావించడంలో ఏ తప్పూ లేదు. అది ఏ మాత్రం అసహజం కాదు. ఒక తల్లి తన పిల్లలను ఎలా లాలించి, పాలించి, పెంచి పెద్ద చేస్తుందో అదే విధంగా భగవంతుడనే మాతృమూర్తి విశ్వం మొత్తాన్నీ సృజించి, జీవజాలాన్ని పరిపుష్టం చేస్తున్నాడు. అందువల్ల భగవంతుణ్ణి తల్లిగా భావించడం ఎంతో సహజమైన భక్తివిధానం. ఇది ఎంతో ఉన్నతమైనది. భగవంతుడు అనే తల్లితో భక్తుడు ఎంతో సహజంగా, స్వేచ్ఛగా సంబంధాన్ని పెంచుకోగలడు.

శ్రీరామకృష్ణులు, "పిల్లవాడు తల్లి దగ్గర తన చిన్న చిన్న అక్కరల కోసం ఎలా మారాం చేస్తాడో, అదే విధంగా భక్తుడు భగవంతుణ్ణి బలవంతపెట్టి కోరవచ్చు. ఆటవస్తువులతో పిల్లవాడు ఆడుకుంటున్నంత సేపూ తల్లి, వాణ్ణి పట్టించుకోకుండా తన పనులు చేసుకుంటూ ఉంటుంది. కానీ ఎప్పుడైతే పిల్లవాడు ఆట వస్తువులను పారవేసి, అమ్మే కావాలని ఏడవడం మొదలుపెడతాడో, అప్పుడు తల్లి పరుగున వస్తుంది" అని ఉదహరించేవారు. ఈ మనోహరమైన పోలిక భగవంతునికీ, భక్తునికీ మధ్య దృఢమైన బంధం ఉందని సూచిస్తోంది.

భగవంతుణ్ణి తల్లిగా భావించలేమన్న పాశ్చాత్యులను చూసి నేను దిగ్భ్రమ చెందాను. 'నేను ఒక తల్లిని. నా తల్లి ఇంకా జీవించే ఉంది. మా బలాలు, బలహీనతలపై నాకు పూర్తి అవగాహన ఉంది. మాతృత్వంలో ఏమి పవిత్రత దాగుందో నాకు ఏమీ కనిపించడం లేదు!' అని ఒక పాశ్చాత్య స్త్రీ నాతో అంది. ఇది ఆమె చేసుకున్న దురదృష్టమని నాకు అనిపించింది.

శ్రీరామకృష్ణులు మాతృపూజను పునరుజ్జీవితం చేశారు. కాళీమాత ద్వారా శ్రీరామకృష్ణులు ఏమి చెప్పదలుచుకున్నారు? ఈ విశ్వం యొక్క సృష్టిశక్తిని ఆయన కాళీమాతగా దర్శించారు. పరబ్రహ్మం, కాళి ఒక్కటేననీ, విడదీయరానివనీ కూడా ఆయన బోధించారు. మార్పు చెందని పరమసత్యం బ్రహ్మమైతే, ఈ విశ్వంగా వ్యక్తీకరించబడినపుడు అదే కాళీమాత. ఆకాశం యొక్క నీలిరంగు విశాలత్వాన్ని ఎలా సూచిస్తుందో, నల్లని కాళీమాత రంగు అనంతత్వాన్ని సూచిస్తుంది. కాళీమాత విగ్రహారాధనను అనంతమైన పరబ్రహ్మం యొక్క ఆరాధనగా మలచి, శ్రీరామకృష్ణులు దానికి ఔన్నత్యం కలిగించారు.

మాతృపూజలో, అంటే శక్త్యారాధనలో ఎన్నో రూపాలు, చిహ్నాలు ఉన్నాయి. జ్ఞానానికీ, సంపదకూ ఆమె అధిదేవత. మృత్యువుకు ప్రతీకగా కాళీరూపంలో కరాళనృత్యం చేసేదీ ఆమే. సృష్టి, స్థితి, లయలను చేసే శక్తిస్వరూపిణిగానూ, ప్రళయం తర్వాత జీవులు చేరుకునే పరమగమ్యంగానూ ఆమెను పరిగణిస్తారు. పరబ్రహ్మానికి ప్రతీక అయిన శివుడు నేల మీద పడివున్నట్లూ, ఆమె ఆ శరీరం మీద నిలుచుని ఉన్నట్లూ చిత్రిస్తారు. విశ్వం మొత్తానికి సర్వాతీతమైన పరబ్రహ్మమే లేదా పరమసత్యమే ఆధారమని ఈ చిత్రణ సూచిస్తుంది. జననం, మరణం – ఈ రెంటికీ ఆ పరమసత్యం అతీతమైనది. అందువల్ల భక్తుడు జీవితం పట్ల రాగం పెంచుకొని, మృత్యువును ద్వేషించడం చేయకూడదు. మనోహరం, ఘోరం– ఈ రెండు స్థాయిలనూ అధిగమించి, "అమ్మా! మృత్యువు నీడయినా, అమరత్వమయినా నీ కృపలోని భాగాలే కదా!" అని అనగలగాలి. ఆమెను మహాకాళ సంహిత...

*న తే నామ గోత్రే న తే జన్మమృత్యూ*
*న తే ధామచేష్టే న తే దుఃఖసౌఖ్యే ।*
*న తే మిత్రశత్రు న తే బంధమోక్షౌ*
*స్త్వమేకా పరబ్రహ్మరూపేణ సిద్ధా ॥*

"*అమ్మా!* నీకు నామగోత్రాలు లేవు. జనన మరణాలు లేవు. బంధమోక్షాలు లేవు. అద్వితీయ పరబ్రహ్మానివి *నీవే!*" అని కీర్తిస్తోంది.

మన దేశంలో మాతృపూజ అనే సంప్రదాయం వేదకాలం నుంచీ కొనసాగుతూనే ఉంది. దేవిని ప్రార్థించే ఎన్నో స్తోత్రాలు వేదాలలో ఉన్నాయి. కేనోపనిషత్తులో జ్ఞానానికి ప్రతీకగా మాతృదేవత కనిపిస్తుంది. తరువాతి కాలాలలో మాతృపూజకు అంకితమైన ఎన్నో గ్రంథాలను వ్రాశారు. అవి తంత్ర సాధనలుగా పేరొందాయి. హిందూ మతంలో మాతృమూర్తి స్థానం అంత ఉత్కృష్టమైనది. ❖

తెలుగుసేత: ఎమ్. శివరామకృష్ణ

# ధన్యభూమి మన దేశం

నేను చేసిన ఈ అల్పకార్యం నాలో స్వతస్సిద్ధంగా ఉన్న శక్తి వల్ల జరిగింది కాదు. ప్రియతమమూ, పరమ పవిత్రమూ అయిన మాతృభూమి నుండి వెడలి, పాశ్చాత్యదేశాల్లో నన్ను సదా అనుసరిస్తూ వచ్చిన ప్రోత్సాహ, అభిమాన, ఆశీస్సుల కారణంగా జరిగిందే!

భారతదేశం కర్మక్షేత్రం, పుణ్యభూమి అని యథార్థమైన దృఢవిశ్వాసంతో చాటుతున్నాను. పుణ్యభూమి అని పిలవడానికి అర్హత ఉన్న దేశమేదైనా భూలోకంలో ఉంటే; ఆ పరమపదాన్ని చేరవలసిన స్థలం భూమిపై ఎక్కడైనా ఉంటే; మానవ సంఘం సాధుశీలాన్ని, ఔదార్యాన్ని, పవిత్రతను, శాంతి జీవనాన్ని అలవరచుకోవడంలో పరమోన్నత మార్గాన్ని అందుకోజాలిన దివ్యక్షేత్రం ఎక్కడైనా ఉంటే; హృదయ పరిశీలనాన్ని పురిగొల్పి, సమున్నత ఆధ్యాత్మిక పీఠంపై చేర్చే మేలైన సీమ ఎక్కడైనా ఉంటే – అది మన భారతదేశమే!

అంతేకాదు, అన్నిటి కంటే దివ్యదృష్టినీ, ఆధ్యాత్మిక సిద్ధినీ ప్రసాదించే పుణ్యతీర్థం ఈ భారతదేశమే అని అనక తప్పదు. ఇక్కడ పురాణకాలం నుండి మహా మతకర్తలు బయలు దేరారు. ఎన్నోసార్లు, వారు ఈ భూలోకాన్నంతా, వినిర్మలం, శాశ్వతమైన ఆధ్యాత్మిక ధర్మప్రవాహ జలాలతో నింపి పవిత్రీకరించారు. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం – ప్రపంచం మొత్తాన్ని ముంచేసిన వేదాంత సాగర తరంగరాశి ఈ దేశం నుండే వెలువడింది. భౌతికం, భగవద్విముఖం అయిన నేటి ప్రాపంచిక నాగరకతను, మళ్ళీ ఈశ్వరోన్ముఖం కావించనున్న ఆధ్యాత్మిక మహాప్రవాహం ఇక్కడి నుండే ఉద్భవించాల్సి ఉంది. ఇతర దేశాల్లో, వేలకొద్దీ మానవ హృదయాలను కాల్చి నాశనం చేస్తున్న జడవాద భీకర జ్వాలలను చల్లార్చవలసిన జీవ సముద్రం ఇక్కడే ఉంది. మిత్రులారా! నా మాట నమ్మండి! ఇది జరిగి తీరుతుంది.

ప్రియమిత్రులారా! నా మాటలు గుర్తుపెట్టుకోండి! ఈ ప్రపంచమంతా యుద్ధభేరుల ఘోషతోనూ, యుద్ధభట వ్యూహాల అట్టహాసాలతోనూ సాగింది. ప్రతి ధర్మభావం, నెత్తుటి వెల్లువలో మునిగినదే! ప్రతి దివ్యసంకల్పమూ లక్షలకొద్దీ సోదరుల రక్తప్రవాహాలపై తేలియాడుతూ నడచింది. ప్రతి మహావాక్కూ కోట్ల కొలదీ ప్రజల ఆర్తనాదాలు, పసిబిడ్డల ఏడ్పులు, వితంతువుల కన్నీటి వెల్లువలను వెల్లడించింది. దాదాపుగా ఇతర జాతుల ధర్మ ప్రచారమంతా ఇలాగే జరిగింది. కానీ భారతభూమే యుగ యుగాల నుండి శాంతిమయ జీవనాన్ని సాగిస్తోంది.

గ్రీకుదేశం తల ఎత్తడానికి ముందే, రోమ్ నగరం ఊహాక్షేత్రంలో పాదసూపడానికి ముందే, నేటి యూరప్ జాతుల పూర్వపురుషులు, శరీరమంతా పచ్చలు పొడిపించుకొని అడవులలో తిరుగుతున్న కాలంలోనే – ఈ భారతదేశం నుండి ధర్మప్రచారాలు సాగాయి. అంతకు పూర్వం నుండి, అంటే, చారిత్రక గ్రంథ యోచనే లేని కాలం నుండి, దురవగాహమైన ప్రాచీనాంధకారంలోనికి పురాణగాథలు తొంగిచూడడానికి సాహసించలేని కాలం నుండి నేటి వరకు దివ్యభావ పరంపరలెన్నో ఈ దేశం నుండి ప్రచారమై వెడలినాయి. కానీ ఆ ప్రతి పలుకుకూ ముందు శాంతి, వెనుక దీవెన సహచరులుగా ప్రవర్తిల్లాయి. ప్రపంచంలోని అన్ని జాతులలోనూ మనం మాత్రం ఎప్పుడూ పరుల మీద దాడి చేసి ఎరుగం! అలాంటి మహాభాగ్యం ఉండడం వల్లే మనం సజీవులమై ఉన్నాం. ❖

# పరిప్రశ్న

**- స్వామి పరిజ్ఞేయానంద**

– కె. గురుమూర్తి, శ్రీకాకుళం

**? : నేను ప్రతిరోజూ భగవంతునికి పూజలు చేస్తాను. అయితే నేను మాంసాహారిని. పూజలు చేస్తూ కూడా మాంసాహారిగా ఉండడం తప్పని చాలామంది అంటున్నారు. కన్నప్ప కూడా మాంసాహారి. అతడు అర్పించిన మాంసాన్ని పరమశివుడు స్వీకరించాడు. అంటే భగవంతుడు భక్తికి ప్రాధాన్యం ఇస్తాడు కానీ మన ఆహారపుటలవాట్లకు కాదన్నది నా అభిమతం. నా అభిప్రాయం సరైనదా? కాదా? తెలపండి.**

✍: కన్నప్ప శివుడికి మాంసాన్ని అర్పించాడనీ, శబరి రాముడికి ఎంగిలి పండ్లను తినిపించిందనీ వారి భక్తితో మన భక్తిని పోల్చుకునే ముందు, భక్తుడిగా ప్రస్తుతం మనం ఏ స్థాయిలో ఉన్నామో తెలుసుకోవడం అవసరం. శ్రీరామకృష్ణులు భగవంతుని పట్ల భక్తునికి ఉన్న ప్రేమ మూడు విధాలు అని వివరించారు:





**1. సమర్థ ప్రేమ:** భక్తుడు కేవలం భగవంతుడి ప్రీతిని మాత్రమే కాంక్షించే స్థితి.

**2. సమంజస ప్రేమ:** భగవంతునికి ప్రీతికరమైనది చేస్తూ, భక్తుడు తన సుఖాన్ని కూడా కాంక్షించే స్థితి.

**3. సాధారణ ప్రేమ:** భక్తుడు కేవలం తన సుఖాన్ని మాత్రమే కాంక్షించే స్థితి.

కన్నప్ప పరమశివుడికి మాంసాన్ని అర్పించాడు. నిజమే! కానీ శివుడి కంటి నుండి రక్తం కారుతూండడం చూసిన కన్నప్ప, తన ఇష్టదైవం బాధను చూసి తన కన్ను పెకిలించి ఇచ్చాడన్న సంగతి కూడా మనం మరచిపోకూడదు. భగవంతుని ప్రీత్యర్థం దేనినైనా అర్పించగల 'సమర్థ ప్రేమ' కన్నప్పది. అలాంటి ఉత్తమ కోవకు చెందిన భక్తుల ఆహార వ్యవహారాలను సామాన్య భక్తులు అనుసరించడం సముచితం కాదు. మనం కూడా ఆ స్థితికి చేరుకోవాలంటే ముందు మన మనస్సులోని విషయ వాంఛలను పారద్రోలి, మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి. భగవంతుడే తప్ప అన్యమేదీ అవసరం లేదన్న స్థితికి చేరుకోవాలి.

జన్మతః అలవడే ఆహారపుటలవాట్లను హఠాత్తుగా మార్చుకోవడం అంత సులభం కాదు. అందుకే మనం భుజించే ఆహారాన్ని ముందుగా భగవంతునికి అర్పించి, స్వీకరించాలన్నది మన సనాతన ధర్మం. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస దగ్గరకు సురేంద్రనాథ్ మిత్రా అనే ఒక భక్తుడు వస్తూండేవాడు. అతడికి మద్యం త్రాగే అలవాటు ఉండేది. ఆ అలవాటు నుండి బయటపడే మార్గాన్ని సూచించాల్సిందిగా శ్రీరామకృష్ణులను అర్థించాడు. 'నువ్వు మద్యం తీసుకునే ముందు, దాన్ని కాళీమాతకు నైవేద్యంగా అర్పించి పుచ్చుకో' అని శ్రీరామకృష్ణులు సలహా ఇచ్చారు. అప్పటి నుండి సురేంద్రనాథ్ మద్యాన్ని కాళీమాతకు అర్పించిన తరువాతే త్రాగేవాడు. మద్యాన్ని ప్రసాదంగా తీసుకోవడం వల్ల మనస్సు పరిశుద్ధమై అతనిలో భక్తిభావం అధికమైంది. భగవంతుణ్ణి పూజిస్తున్నప్పుడు కన్నీళ్ళు కారుస్తూ భావపరవశుడయ్యేవాడు. కొంత కాలానికి మద్యం తాగే అలవాటు అప్రయత్నంగానే పోయింది.

భగవంతునికి అర్పించిన నైవేద్యం పవిత్రమవుతుంది. అలా పవిత్రమైన ప్రసాదాన్ని స్వీకరించడం వల్ల విషయ వాంఛలు పోయి, మనస్సు పరిశుద్ధమవుతుంది. అప్పుడు మనలో క్రమేణా భగవంతుని పట్ల 'సమర్థ ప్రేమ' అలవడుతుంది.

సాధనకు సత్త్వగుణ ప్రధానమైన మనస్సు అవసరం. అందుకు శ్రీకృష్ణ పరమాత్మ *(భగవద్గీత - 17.8)* **ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః...** 'ఆయుర్దాయాన్నీ, చిత్తస్థైర్యాన్నీ, బలాన్నీ, ఆరోగ్యాన్నీ, మనస్సుకు ఆహ్లాదాన్నీ ఇచ్చే ఆహారాన్ని తీసుకోవాల'ని సూచించాడు.

కేవలం ఆహారపుటలవాట్లకే ప్రాధాన్యమిస్తూ, మనస్సు మాత్రం విషయచింతలపై ఉంటే అలాంటి ఆహారపు నియమాల వల్ల ఎలాంటి ప్రయోజనమూ చేకూరదు. అందుకే శ్రీరామకృష్ణులు 'హవిష్యాన్నం మాత్రమే తింటూ విషయ చింతనలను చేసేవాడి కన్నా, మాంసం తింటున్నప్పటికీ భగవచ్చింతన చేసేవాడు ధన్యుడు' అని తెలిపారు.

మనం శారీరక పుష్టికి ఎంత ప్రాధాన్యమిస్తామో అంతకంటే ఎక్కువ ప్రాధాన్యాన్ని మానసిక పుష్టికి ఇవ్వాలి. కాబట్టి శరీరానికి ఆకులు, కాయలు ఆహారంగా ఇస్తూ, మనస్సుకు మాత్రం చెడు భావాల్ని పెంచే సాహిత్యాన్నీ, సహవాసాల్నీ అందిస్తే ఆధ్యాత్మికంగా ఎలాంటి ఉన్నతినీ సాధించలేం.

మనం చేస్తున్న పూజా పునస్కారాలూ, స్తోత్ర పారాయణాలు, జపధ్యానాల వల్ల మనలో విషయాసక్తి తగ్గి, భగవంతుని పట్ల అనురక్తి పెరుగుతుందా? కష్టనష్టాల్లో భగవంతుడే సంరక్షకుడనే భావం స్థిరంగా ఉందా? మనస్సు ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉంటుందా? అన్నది మనం గమనించాల్సిన ముఖ్యాంశం. మనలో ఇలాంటి పరివర్తన కలిగిననాడు సాధన మార్గంలో అభివృద్ధి చెందుతున్నామని అర్థం. ❖

అన్నమయ్య పదామృతం

కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు
కొండలంత వరములు గుప్పెడువాడు ॥

కుమ్మరదాసుడైన కురువరతినంబి
ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి నమ్మినవాడు ॥

అచ్చపువేడుక తోడ అనంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొలక తిరుమలనంబి తోడుత
నిచ్చనిచ్చ మాటలాడి నొచ్చినవాడు ॥

కంచిలోన నుండ తిరుకచ్చినంబి మీద కరు
ణించి తన యెడకు రప్పించినవాడు
యెంచ నెక్కుడైన వేంకటేశుడు మనలకు
మంచివాడై కరుణ పాలించినవాడు ॥

# కొండలలో కోనేటిరాయడు

– శ్రీమతి బి.కృష్ణకుమారి

ఆ పరంధాముడు పరమదయాళువు... ఆ పరాత్పరుడు అహేతుక ప్రేమైకసింధువు. కోరింది ఇవ్వడమే తప్ప, కోరుకోవడం తెలియని కరుణాంతరంగుడు; గడ్డిపూలతో అర్చించినా ఘనమైన వరాలు గుప్పించే ఘనాఘన సుందరుడు! అవతారం ఏదైనా ఆయన అపార కృపావాహినికి అవాంతరం ఉండదు. శ్రీరామచంద్రుడై శబరిని కటాక్షించిన, శ్రీకృష్ణ పరమాత్ముడై కుచేలుణ్ణీ కరుణించిన ఆ కాంచనాంబరధరుడు కలియుగంలో కోనేటి రాయడుగా దిగివచ్చాడు; కొండలపై నుంచే కోట్లాది భక్త పరమాణువుల్ని తరింపజేస్తున్నాడు. కోటీశ్వరులు పెట్టే కిరీటాల కన్నా కటికపేదలు కట్టే ముడుపులకే ఆ మురహరి మురిసిపోతాడు. కృపావృష్టితో ముంచెత్తుతాడు. అలాంటి కస్తూరి తిలకుడు, తిరుమల కనుమలలో కొలువుదీరి కోరిన వరాలన్నీ గుప్పిస్తున్నాడని తాళ్ళపాక అన్నమయ్య గానం చేస్తున్నాడు. **'కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు...** అంటూ కీర్తిస్తున్నాడు. చక్రవర్తి తొండమాన్‌ను ఎలా ఆదరించాడో, చక్రం తిప్పుకుంటూ మట్టికుండలు చేసుకునే కుమ్మరిదాసుడిని కూడా తిరుమలవాసుడు అలాగే అభిమానించాడు. ఇలా ఆ వేంకటాచలమూర్తి విశేష మహిమల్ని మననం చేసుకొని మైమరచిపోతున్నాడు అన్నమాచార్య.

### వరాలు గుప్పెడువాడు...

వైకుంఠంలో తను జలకాలాడే కోనేటిని ఆ కొండల రాయడు కోరికోరి తిరుమలకు వెంటతెచ్చుకున్నాడు; కోనేటి రాయడయ్యాడు. ఆ కమలదళాక్షుడు కలియుగంలో తన భక్తకోటికి దిక్కై, దారిచూపేందుకే దిగివచ్చాడు. ఒక్కమారు దర్శించుకున్నా చాలు, ఓపిక లేదని స్మరించుకున్నా చాలు – ఆ ఆపద్బాంధవుడు ఆదుకుంటాడు. అందుకే అన్నమయ్య **'కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు... కొండలంత వరములు గుప్పెడువాడు'** అంటూ స్వానుభవంతో పలుకుతున్నాడు. స్వామివారు చూడటానికి అలా అలంకార ప్రియుడిగా, ఆడంబరమూర్తిగా కనిపిస్తారు. కానీ నిజానికి ఆయన సులభప్రసన్నుడు! భక్తి పొదగని వజ్రవైఢూర్యాల కన్నా, పట్టుపీతాంబరాల కన్నా, భక్తిలో తడిపి సమర్పించిన తులసీదళానికే పొంగిపోతాడు; వరాలు వెల్లువలా గుప్పిస్తాడు. అలా నాడు ప్రత్యక్షంగా, నేడు పరోక్షంగా ఏడుకొండలవాడు ఎందరో భక్తులకు ఆత్మబంధువై అక్కున చేర్చుకున్న వైనాన్ని అన్నమాచార్యులు తన వాగ్వైభవంతో ఇక్కడ వర్ణిస్తూ ఉన్నాడు.

### రమ్మన్న చోటికి వచ్చినవాడు...

భగవంతుడు భక్తపరాధీనుడని శ్రీవేంకటాచలపతి ఎన్నోమార్లు ఋజువు చేశాడు. కురువరతి నంబి అనే కుమ్మరదాసుడి ప్రేమకు స్వామి పొంగిపోయాడు. అందుకే తొండమాన్ చక్రవర్తి రోజూ బంగారుపూలతో పూజిస్తున్నా, కాదని ఎక్కడో కుగ్రామంలో కొయ్యతో తన బొమ్మ చేసి బంకమట్టి పూలతో అర్చిస్తున్న ఆ కుమ్మరదాసుడి కైంకర్యానికి కదిలిపోయాడు. ఆ మట్టిపూలను తిరుమలలోని తన నిజస్వరూపం ముందుకు రప్పించుకున్నాడు. స్వయానా కురువరతి నంబి ఇంటికి సతీసమేతంగా వెళ్ళి వరాల వాన కురిపించాడు. అదీ ఆ భాగవతప్రియుడి ప్రీతి! అలాంటి మధురక్షణాలను మననం చేసుకుంటూ....

**కుమ్మరదాసుడైన కురువరతి నంబి**
**ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు**
**దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి**
**రమ్మన్న చోటికి వచ్చి నమ్మినవాడు...** అంటున్నాడు

(మిగతా 32వ పేజీలో...)

చెరువులో చేపలు ఎరను చూడగానే ఆకర్షితమవుతాయి. అలాగే భగవంతుడు, భక్తుని హృదయంలో సంపూర్ణ భక్తిశ్రద్ధలనే ఎరను చూడగానే భక్తునికి అతిశీఘ్రంగా దర్శనమిస్తాడు. - శ్రీరామకృష్ణ పరమహంస

ధ్యాన లక్ష్యం భక్తిని పెంపొందించుకోవడం. మనం ఏదైనా వస్తువు గురించి కానీ, వ్యక్తి గురించి కానీ చింతించిన కొద్దీ దానిపై ఆసక్తి మరింత పెరుగుతుంది కదా! అంటే, ముందస్తుగా చింతన అవసరం. బిడ్డ తనదే అని తల్లి భావించినట్లు, దేనినైనా మనది అని తలస్తే, ఆ భావనకు ప్రేమ జోడించబడుతుంది. ధ్యానంలో ఇలాంటి భావన ఉంటే, భగవంతునిపై ఆసక్తి పెరిగి, భక్తి వృద్ధి చెందుతుంది. ధ్యానం యొక్క మరొక లక్ష్యం – ఏకాగ్రతను వృద్ధి చేసుకోవడం. ఏకాగ్రచిత్తంతో భగవంతునిపై గురి అధికమవుతుంది. ఒక గంటలో చేసే పనిని, ఏకాగ్ర చిత్తంతో పావుగంటలోనే పూర్తి చేయవచ్చు.

ధ్యానం అనగా ఏమి? మనస్సును ఇంద్రియగ్రాహ్యమైన భౌతిక ప్రపంచం నుండి వెనక్కు లాగి, ఒకే ఒక వస్తువుపై నిలపడం. కనుక, మన ఆలోచనలను తగ్గించే మార్గం వెదకాలి. భగవంతుడు ధ్యేయ వస్తువు అయినప్పుడే, అధికాంశం మనస్సు అంతర్ముఖం అవుతుంది. ఇది అప్రయత్న పూర్వకంగా జరుగగలదు. కానీ మన ప్రయత్నం కూడా చాలా అవసరం. లక్షా యాభై విషయాలను చింతించే బదులు, ఒక్క విషయంపైనే మనస్సు పెడితే, అది ఐదారు విషయాలే చింతించవచ్చు! అప్పుడు ఈ సంఖ్యను కూడా తగ్గించే ప్రయత్నం చేయాలి. మరే విషయమూ చింతింపక, దైవాన్ని మాత్రమే చింతించడం సాధ్యం కాకపోవచ్చు. కానీ ఆ విధంగా చేయగలిగితే, మీరు మహాత్ములే!

భగవత్సాక్షాత్కారమే పరమప్రాప్తి. ఈ ప్రయత్నంలో మీరు ఎంతగా కృతకృత్యులు అవగలరన్నది ఎన్నో అంశాలపై ఆధారపడి ఉంటుంది.

ఇది తెలుసుకోవడానికి, నిత్యవ్యవహారంలో కొన్ని కొండగుర్తులు ఉంటాయి – ఎంత నిగ్రహం అలవరచుకొన్నారు, అన్యుల పట్ల మీ ప్రేమ ఎలాంటిది, మీ కోరికలు ఎంత తగ్గాయి, మీ కోపాన్ని ఎంతవరకు అదుపులో పెట్టగలుగుతున్నారు, మీ స్వార్థబుద్ధి, అనురక్తి (attachment) ఎంత తగ్గాయి మొదలైనవి. మీ ఆధ్యాత్మిక పురోగతికి ఇవి కొలమానాలు. అంతేకానీ, 'నేను సర్వం సాధించాను' అని పలకడమో, 'భక్తి అశ్రువులు కారుతాయ'ని చెప్పడమో కాదు. మీ శీలంలో, నడవడిలో గణనీయమైన మార్పు ఉంటేనే మిమ్మల్ని ఒక ఆధ్యాత్మిక వ్యక్తిగా పరిగణింపవచ్చు.

ఏకాగ్రచిత్తం మాత్రం సరిపోదు. మీరు ధ్యానం ఎందుకు చేస్తున్నారు? ఆరోగ్యం కోసమా? సరే. కానీ ఇది ఆధ్యాత్మికత కాదు. మీ శారీరక ఆరోగ్యాన్ని పెంపొందించుకొనేందుకు ధ్యానం చేస్తే, కోరిన ఫలితం నిశ్చయంగా లభిస్తుంది. ఆరోగ్యాన్ని కాపాడుకోండి, అప్పుడే భగవచ్చింతన కుదురుతుందని యోగశాస్త్రంలో ఉంది. 'యోగాసనాలు మొదలైనవి ఎక్కువగా చేయకండి. మీ మనస్సు శరీరంపైనే నిలిచిపోతుంది' అన్నారు శ్రీరామకృష్ణులు. పోతే, భగవత్సాక్షాత్కారానికి చేరువైన సాధకులకు మాత్రమే ఆయన ఈ విషయం చెప్పారని మరువకండి. వారిది




ఉచ్చదశ. మన సంగతి వేరు. ఆధ్యాత్మిక జీవితంలో ఎంతగా ఎదగాలన్న విషయం ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. 'నేను ఆధ్యాత్మిక వ్యక్తిని' అని పలికినంత మాత్రాన సరిపోదు. మీ ప్రవర్తన, శీలంలో వచ్చిన పరివర్తనే గీటురాయి.

**ధ్యానానికి సన్నాహం :** మనం సాధారణంగా పూజ గదిలోకి స్నానం చేసి, ఉతికిన బట్టలు ధరించి వెళతాం. పూజ గది లేకపోతే, మీ గదిలోనే ఒక భాగం ప్రత్యేకంగా కేటాయించాలి. మూడు నెలల కాలంలో కొన్ని ఆధ్యాత్మిక తరంగాలు ఉత్పాదితమై, మీరు అక్కడకు వెళ్ళిన ప్రతిసారి ఒక ఉత్తుంగ భావం జనిస్తుంది. మీరు ఆ గదిలో ఏమి చేసినా సరే, చివరకు నవ్వినా, విలపించినా, ఆ పనిని భగవంతునితో అనుసంధానం చేసేందుకు యత్నించండి. ఆ విధంగా, మీరు ఆ గదిలో ప్రవేశించినప్పుడు, మీకు తెలియకుండానే ఏదో స్ఫూర్తి పొందుతారు.

స్నానం చేస్తే ఒక పవిత్రభావం జనిస్తుంది. వీలు కాకపోతే ఫరవాలేదు. శారీరక శుభ్రత ఎలాగున్నా, భగవంతుణ్ణి స్మరించేటంత పవిత్ర భావం కలిగి ఉండాలి. ఎంతో కొంత శారీరక శుభ్రత మాత్రం ఆవశ్యకం. ఉదయం లేవగానే భగవంతుని స్తోత్రాలు, నామాలు ఉచ్చరించండి. నిద్ర లేచిన వెంటనే సమయం ఇంకా మీ అధీనంలోనే ఉంటుంది. సంధ్యాకాలం కొంచెం కష్టం. ఎందుకంటే, ఆఫీసులో రాత్రి వరకు పని చేయవలసి రావచ్చు. లేదంటే, ఇంటికి బంధుమిత్రులు, అతిథులు రావచ్చు. కనుక సాయంత్రం ఎప్పుడు ధ్యానం చేయగలమన్నది కొంచెం అనిశ్చితం. ఏది ఏమైనా, కనీసం ఇరవై నిమిషాలు ఇందుకు వినియోగించాలి సుమా! ఉదయం, సాయంత్రం ధ్యానం హడావిడిగా కాక ప్రశాంతంగా చేయాలి.

ధ్యాన సమయంలో మనస్సు అతి చంచలంగా ఉంటే, జపం చేయండి. మంత్రం కనీసం 108 సార్లు జపించాలి. లేకపోతే చాంచల్యం అధికమవుతుంది. జపం, ధ్యానం చేయాలని ఉన్నా, లేకపోయినా చేయవలసినదే.

ధ్యానం కన్నా జపం సులభం. ఒక అరగంట ధ్యానం చేసినా, చాంచల్యం తగ్గకపోతే ఏదైనా పవిత్ర గ్రంథం చదవండి.

# నియంత్రణ

– స్వామి స్వాహానంద*

మనస్సును మరీ నిర్బంధించకండి. దాన్ని బుజ్జగించండి. అనునయించండి. క్రమం తప్పకుండా ధ్యానం చేస్తే, మనస్సు త్వరగా ఏకాగ్రమవుతుంది. మీకు భోజనానికి ఒక వేళ ఉంటుంది. ఆ సమయానికల్లా మనస్సు 'తిందాం' అంటుంది కదా! ఆ విధంగానే ప్రతి దినం ఒకే సమయానికి ధ్యానానికి ఉపక్రమిస్తే, మీ దేహం, మనస్సు చక్కగా సహకరిస్తాయి.

**ఏకాగ్రతశక్తిలో భేదాలు :** వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య ధ్యానశక్తిలో భేదాలుంటాయి. ఇవి మనస్సును ఏకాగ్ర పరచడం (ధారణాశక్తి)లోని తారతమ్యాలపై ఆధారపడి ఉంటాయి. ధ్యాన ప్రక్రియ మొదలు పెట్టడానికి పూర్వమే ఆ వ్యక్తికి మనస్సును ఏకాగ్రపరచే అభ్యాసం కానీ, శిక్షణ కానీ ఉందా? లేదా? అనే దానిపై ఇది ఆధారపడి ఉంటుంది. ధ్యానాన్ని అభ్యసించడం అవసరం. అందరికీ ధారణశక్తి సమానంగా ఉండదు.

మీ ఆలోచనలనూ, చింతలనూ, కోరికల పుట్టనూ తగ్గించుకోనట్లయితే మనస్సు ప్రశాంతంగా, స్థిరంగా ఉండే అవకాశం లేదు. భారతదేశానికి మాజీ అమెరికా దౌత్యాధికారి, గాల్‌బ్రేత్ తన రచనా వ్యాసాంగానికి స్విట్జర్లాండు దేశాన్ని ఎన్నుకొన్నారు. కానీ మొదటి మూడు దినాలు తాను పని చేస్తున్న విశ్వవిద్యాలయం, తన కుటుంబం, మిత్రులు ఈ ఆలోచనల మూలంగా రచన ప్రారంభించలేకపోయానని ఆయన స్వయంగా చెప్పారు. ఆ తర్వాత మనస్సు చల్లబడి, నిరాటంకంగా రచించగలిగారు.

మానసిక స్థితిని బట్టి ఏకాగ్రతలో మార్పులు కనపడతాయి. మనస్సులో కోరికలు ముమ్మరంగా ఉంటే, మనస్సులో అలజడి ఉంటుంది. చాలా మంది వ్యక్తులతో కలసినా, వ్యవహారాలు పెట్టుకొన్నా కూడా అలజడి వస్తుంది. 'నేను ఇది చేయాలి', 'ఇది మానివేయాలి' అని తలచినప్పుడు గట్టి సంకల్పబలం ఉండాలి. ఆత్మనిగ్రహ సామర్థ్యంలో వ్యక్తుల నడుమ భేదాలు ఉంటాయి.

మేము గాఢంగా ధ్యానం చేస్తామంటారు కొందరు. వీరిలో ఏకాగ్రత ఉన్నదని వారి జీవనసరళిలో వ్యక్తమవ్వాలి. తన మనస్సు ఎల్లప్పుడూ ఏకాగ్రంగా ఉండదని శ్రీశారదాదేవి స్వయంగా చెప్పుకొన్నారు. మనస్సు ప్రశాంతంగా ఉండి, విషయ వస్తువుల నుండి ఉపసంహరింపబడడం యోగి లక్షణాలు. దుఃఖం, వ్యాధి ఎంతటి వారినైనా బాధిస్తాయి. కానీ మీరు ఎంత త్వరగా ఆ బాధ నుండి బయట పడగలరన్నది ముఖ్యం. ఈ విషయంలో మనల్ని మనమే పరిశీలించుకోవాలి.

**అనుభూతులు :** మొట్టమొదటి అనుభూతి ప్రశాంతత. ఎంత ప్రశాంతంగా ఉంటే, ఏకాగ్రత అంతగా కుదురుతుంది. ఇది మూడు, నాలుగు నెలలలో స్పష్టమవుతుంది. పూర్వం మీకు చిటికెలో కోపం వచ్చేదేమో! ఇప్పుడు మీరు సహనం బాగా అలవరచుకొన్నారు కనుక కోపం అంత త్వరగా రాదు.

కొందరికి ఆధ్యాత్మికానుభూతులు సులభంగా కలుగుతాయి. 'ఒక ఘటన నిజంగా జరిగింది' అన్నంత స్పష్టంగా స్వప్నం వస్తే, ఆ అనుభూతిని 'దర్శనం' అంటారు. అది మీ జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. భగవదనుగ్రహం మూలంగా అద్భుతాలు జరగవచ్చు. మీ కుమారుడు మీకు లేఖ వ్రాసి ఐదారేళ్ళు అయిందేమో! మీరు భగవంతుణ్ణి ప్రార్థిస్తే, వెంటనే లేఖ వస్తుంది. మీ ప్రార్థన ఫలితంగా ఆ యువకుడి మనస్సు మారి ఉండవచ్చు. ఆధ్యాత్మిక అనుభూతులనూ, దర్శనాలనూ కర్మచక్షువులతో చూడలేం. అవి ప్రేమనేత్రాల (భక్తినేత్రాల)కు గోచరమవుతాయి. దానినే 'దివ్య చక్షువు' అంటారు. ❖

అనువాదం: డాక్టర్ కమల జయరావు

(*స్వామి విజ్ఞానానంద శిష్యులైన స్వామి స్వాహానందజీ దక్షిణ కాలిఫోర్నియా, రామకృష్ణ వేదాంత సొసైటీ అధిపతి.)

నిత్యం జపధ్యానాలను అనుష్ఠించాలి. ఏ పనీ చేయకుండా కూర్చుంటే మనస్సులోకి నానావిధాల ఆలోచనలు వస్తాయి. పనిచేయడం వలన మనస్సులో వ్యర్థ ఆలోచనలు మెదలవు. - శ్రీశారదాదేవి

(...గత సంచిక తరువాయి)

# శిఖలో ఆధ్యాత్మిక అంతరార్థం



శిఖా మూలంలోనే మజ్జా తంతు నిర్మితమైన బుద్ధి చక్రం, దానికి దగ్గరలోనే బ్రహ్మరంధ్రం, ఆ రెండింటి పై భాగంలోనే సహస్ర కమలంలో పరమాత్మ ఉండే చోటు ఉన్నాయి. దీన్ని దృష్టిలో పెట్టుకొని, శిఖ ముడి వేయమనడానికి కారణాన్ని కూడా పెద్దలు కొందరు వివరించారు.

శాస్త్రవిధానంలో ఆ పరమాత్మను ధ్యానిస్తున్నప్పుడూ, వేదాధ్యయనం చేస్తున్నప్పుడూ జనించిన అమృతత్వం అక్కడ చేరి, తన కేంద్ర స్వరూపమైన సూర్యుడిలో లీనం కావడానికీ, శిరస్సు నుండి బయటకు వెడలడానికీ ప్రయత్నిస్తూ ఉంటుంది. ఈ విద్యుత్ ప్రవాహాన్నే వివేకవంతుడు శిఖాస్థానంలో నిరోధిస్తాడు. అది శిఖాగ్రంథితో ఢీ కొట్టి, వెనక్కి వచ్చి సహస్రదళ కర్ణికలో చేరుతుంది. అందుకే, జుట్టు గనక ముడి వేయకపోతే, ఆ అమృత రసం ఆ ద్వారం గుండా బయటకు వచ్చి, అమితమైన వేగంతో అంతరిక్షంలో చేరిపోతుంది.

జుట్టు ముడివేయడం వల్ల అధిష్ఠానంలో సేకరించిన శక్తి, మస్తిష్క కేంద్రం నుంచి బయటకు రావడానికి వీలుండదు. అంతేకాక, తన కేంద్రంలో సురక్షితంగా ఉంటుంది. స్నానం చేసేటప్పుడూ, దానధర్మాలు ఆచరిస్తున్నప్పుడూ, తపస్సు, దేవతారాధన, హోమాలు చేసేటప్పుడూ జుట్టును ముడి వేసి తీరాలని మనుస్మృతి మొదలైన ధర్మశాస్త్రాలు పేర్కొన్నది అందుకే! ఆ అమృతత్వాన్నే మనవాళ్ళు ఓజశ్శక్తి అన్నారు.

శిఖను ముడి వేయకుండా మంత్రానుష్ఠానాదులు చేస్తే, వాటి ప్రభావం రోమాల గుండా బయటకు పోతుంటుంది. అది బయటకు పోతుంటే, మన శరీరంలోని శక్తి క్రమంగా క్షీణిస్తుంది. అది తరిగిపోకుండా కాపాడుకోవాలి. దాన్ని గనక కాపాడుకుంటే, అప్పుడు మనం ప్రకృతి మండలం నుంచి ఇతర శక్తిని సులభంగా ఆకర్షించ గలుగుతాం.

### మనకూ, దేవుడికీ మధ్య వాహిక

ఆకాశంలో వ్యాపించే ధ్వని తరంగాలను ఆకర్షించడానికి ఏరియల్, యాంటెనాలను పెట్టినట్లే, భగవత్ సంబంధమైన సందేశాలను మస్తిష్కంలో ఉండే బ్రహ్మరంధ్రమనే యంత్రంలోకి గ్రహించడానికి శిఖా స్తంభాన్ని ఏర్పాటు చేశారని ఓ విశ్లేషణ. శుభసందేశాలను గ్రహించి, మస్తిష్కంలోకి చేరుస్తుంది - శిఖ.

అలాగే, ఆకాశంలోని అదృశ్య శక్తుల నుంచి, అరిష్ట ప్రభావాల నుంచి శిఖ రక్షిస్తుంది. ఆకాశం నుంచి పడే పిడుగుల నుండి రక్షణ కోసం ఇంటి పైభాగంలో ఇనుప కడ్డీని పాతినట్లే, శరీరమనే ఇంటి పైభాగంలో గ్రహ నక్షత్రాల నుంచి రక్షించడానికి ఒక ఆధ్యాత్మిక శక్తిగా శిఖ పనిచేస్తుంది. మరో ముఖ్యమైన విషయం ఉంది. మన శరీరంలోని పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాల సంచాలనమంతా మస్తిష్క, బ్రహ్మరంధ్రాల ఆరోగ్యం మీదే ఆధారపడి ఉంటుంది. కాబట్టి, ఆ రెండు శక్తి కేంద్రాలనూ పుష్టివంతం చేయడానికీ, బాహ్య శక్తుల నుండి కాపాడడానికీ శిఖను ఏర్పాటు చేశారు.

ఆధునికత పెరిగిన తరువాత మన ప్రాచీన సంప్రదాయాల్లోని విలువలను అర్థం చేసుకోకుండా, అవహేళన చేస్తున్నాం. కానీ, ఆలోచిస్తే శిఖను పెట్టుకోవడంతో సహా మన ఆచారాల్లో వైజ్ఞానిక దృష్టి ఉన్నట్లు అర్థమవుతోంది. ❖

## పండుగలు - పర్వదినాలు

### అక్టోబర్ - 2012

| | | |
|---|---|---|
| 09 | మంగళవారం : | స్వామి అభేదానంద జయంతి |
| 11 | గురువారం : | ఏకాదశి |
| 15 | సోమవారం : | స్వామి అఖండానంద జయంతి |
| 24 | బుధవారం : | విజయదశమి |
| 25 | గురువారం : | ఏకాదశి |
| 29 | సోమవారం : | లక్ష్మీపూజ |

### నవంబర్ - 2012

| | | |
|---|---|---|
| 10 | శనివారం : | ఏకాదశి |
| 13 | మంగళవారం : | దీపావళి - కాళీపూజ |
| 24 | శనివారం : | ఏకాదశి |
| 25 | ఆదివారం : | స్వామి సుబోధానంద జయంతి |
| 27 | మంగళవారం : | స్వామి విజ్ఞానానంద జయంతి |




శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.

# సేవాతత్పరతలో దీక్షితుల దక్షత

శ్రీరామకృష్ణ పరమహంసను సేవించి తరించిన నాగమహాశయుడు, మహేంద్రలాల్ సర్కార్ వంటి హోమియో వైద్యుల గురించి విన్నాం. నేడు శ్రీరామకృష్ణ మఠ స్వామీజీలను, భక్తులను, పేదలను సేవించి తరించిన హోమియో వైద్యులు డాక్టర్ పిలకా దీక్షితులు గారు. రాజమండ్రి సబ్ కలెక్టర్ కార్యాలయంలో ఆయనొక అటెండర్. కార్యాలయానికి వచ్చే వారిని పీడించి, నాలుగురాళ్ళు వెనకేసుకోవచ్చు. కానీ అలాంటి మార్గంలో ఆయన పయనించలేదు. ఎందుకంటే అది రామకృష్ణుల వారిని జపించే మనస్సు. అందుకే సన్మార్గం వైపు వెళ్ళింది. అదేమిటి అటెండర్ వైద్యుడు ఎలా అయ్యాడా అని ఆశ్చర్యపోతున్నారా?


డాక్టర్ పిలకా దీక్షితులు

దీక్షితులుగారిలోని సేవాదృక్పథం వారిని వైద్యుడిగా తీర్చిదిద్దింది. పశ్చిమగోదావరి జిల్లా పోడూరులో 1904లో జన్మించిన పిలకా దీక్షితులు హైస్కూల్ విద్య మాత్రమే అభ్యసించి, సబ్ కలెక్టర్ కార్యాలయంలో అటెండర్‌గా చేరారు. కానీ తన ప్రక్కనే దయనీయంగా బతికే పేదలకు ఏ రూపంలోనైనా సేవ చేయాలనే తపన ఆయనలో బయలుదేరింది. ఆ రోజులలో హోమియో వైద్య విధానం ఎక్కువ ప్రాచుర్యంలో ఉండేది. ఈ వైద్య విధానాన్ని అధ్యయనం చేసి పేదలకు సేవ చేయాలని భావించారు. కానీ బోధించేవారు లేరు. అయినా నిరుత్సాహపడకుండా హోమియో గ్రంథాలు సేకరించి, స్వయంకృషితో దీక్షగా అధ్యయనం చేసి, పేదలకు వైద్యం చేస్తూ ఆ వైద్య విధానంలో ప్రావీణ్యం సంపాదించారు. తదనంతరం గుర్తింపు డిగ్రీ కోసం ప్రభుత్వం నిర్వహించే పరీక్షలలో ఉత్తీర్ణులై మానసిక సంతృప్తిని ఇచ్చే వైద్యవృత్తినే ఎంచుకుని ప్రభుత్వోద్యోగానికి రాజీనామా చేశారు. జీవిత చరమాంకం వరకూ పేదలకు ఇతోధికంగా సేవలందించారు.

ఈ హోమియో వైద్య విధానాన్ని బోధించి చాలామందిని హోమియో వైద్యులుగా తీర్చిదిద్దారు. వీరిలో అంతర్జాతీయంగా ఖ్యాతి పొంది, అనేక హోమియో గ్రంథాలను రాసిన డాక్టర్ పిలకా కృష్ణమూర్తి ఒకరు. డాక్టర్ దీక్షితులు గారి కుమారుడు ధనుంజయ కూడా ప్రస్తుతం రాజమండ్రిలో హోమియో వైద్య సేవలందిస్తున్నారు. వృత్తి వైద్యం అయినా ప్రవృత్తి మాత్రం సేవాదృక్పథం.

ప్రస్తుతం రాజమండ్రిలో ఆధ్యాత్మిక సేవా నిలయంగా విరాజిల్లుతున్న రామకృష్ణ మఠం స్థాపన వెనుక దీక్షితులుగారి కృషి ఎంతో ఉంది. రాజమండ్రిలో రామకృష్ణ మఠం స్థాపించేందుకు తమ ఆస్తులను ఇవ్వడానికి ముందుకు వచ్చిన దువ్వూరి రామకృష్ణగారి ప్రతిపాదనను బేలూరు మఠం వారు అంగీకరించకపోతే, డాక్టర్ దీక్షితులుగారే బేలూరు మఠం వారిని అభ్యర్థించి, ఆ అవతార మూర్తిని ప్రతిష్ఠించారు. అంతేకాకుండా పవిత్ర గోదావరీ నదీ తీరాన, నగరం నడిబొడ్డున ఉన్న టౌన్ సెంటర్ స్థలాన్ని విజయనగరం మహారాజా గారి చేత లీజుకు ఇప్పించారు. ప్రస్తుతం ఇక్కడ రామకృష్ణ మఠం ఓ చికిత్సాలయాన్ని ఏర్పాటు చేసి పేదలకు సేవలందిస్తోంది.

దీక్షితులు గారు స్థానిక రామకృష్ణ మఠ స్వామీజీలతో సన్నిహితంగా ఉంటూ, వారు చేసే సేవా కార్యక్రమాల్లో పాల్గొనేవారు. పరమపూజ్య స్వామి శంకరానందజీ మహరాజ్ వద్ద మంత్రదీక్ష స్వీకరించిన ఆయన వరిష్ఠ స్వామీజీలలో పలువురికి తమ వైద్య సేవలందించారు. రాజమండ్రి మఠానికి వచ్చే స్వామీజీలను తమ ఇంటికి ఆహ్వానించి, భిక్ష ఏర్పాటు చేసేవారు. ఒకానొక సందర్భంలో పూజ్య స్వామి యతీశ్వరానందజీ మహరాజ్ సైతం దీక్షితులు గారి ఇంటికి వచ్చారు. అప్పుడు దీక్షితులు గారి అభ్యర్థన మేరకు వారి సతీమణి శ్రీమతి రామలక్ష్మమ్మకు వారింట్లోనే స్వామీజీ మంత్రోపదేశం చేశారంటే, ఆ కుటుంబం రామకృష్ణుల పట్ల ఎంతటి భక్తి ప్రపత్తులు కలిగి ఉన్నదో అర్థమవుతోంది.

దీక్షితులుగారి మనుమలలో ఒకరు స్వామీజీగా బేలూరు మఠంలోనూ, మరొకరు బ్రహ్మచారిగా ఆస్ట్రేలియాలోని రామకృష్ణ మఠ కేంద్రంలోనూ సేవలందిస్తున్నారు. డాక్టర్ దీక్షితులు గారు తన సేవా కార్యక్రమాలను రాజమండ్రికి మాత్రమే పరిమితం చేయకుండా, అవసరమైనప్పుడు ఇతర ప్రాంతాలలో కూడా సేవా కార్యక్రమాలలో పాల్గొనేవారు. రాయలసీమలో క్షామం ఏర్పడినప్పుడు స్వామి నిత్యబోధానంద మహరాజ్‌గారి ఆధ్వర్యంలో సేవలందించారు. ఈ విధంగా జీవితాన్ని రామకృష్ణుల సేవకే అంకితం చేసిన దీక్షితులు గారు 1989 మార్చిలో తమ 86వ ఏట శ్రీరామకృష్ణైక్యం చెందారు. ❖

సేకరణ: డాక్టర్ పి. ధనుంజయ, డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి
అనుసృజన: శ్రీమతి టి.ఆశాలత



నిష్కామ కర్మాచరణ వల్ల భగవల్లాభం చేకూరుతుంది. నిష్కామ కర్మాచరణ అంటే ఇహపరాలలో ఎలాంటి ఫలాలను ఆశించకుండా కర్మలను నిర్వర్తించడం. ఇదే మోక్షసాధనం. - శ్రీరామకృష్ణ పరమహంస



# దేవీ నవరాత్రుల ప్రాశస్త్యం

- డాక్టర్ సముద్రాల లక్ష్మణయ్య

'నవ' శబ్దానికి క్రొత్తది, తొమ్మిది అనే ప్రసిద్ధార్థాలున్నాయి. 'నవరాత్రులు' అన్నప్పుడు తొమ్మిది రాత్రులు అన్న అర్థం గ్రహించాలి. శరదృతువులో వచ్చే నవరాత్రులు కాబట్టి ఇవి 'శరన్నవరాత్రులు'గా వ్యవహారం. వేరే ఋతువులలో వచ్చే నవరాత్రులు కూడా ఉండడం వల్ల వీటిని ప్రత్యేకించి 'శరన్నవరాత్రులు'గా పేర్కొంటున్నాం.

ఒక సంవత్సర కాలంలో మూడు రకాల నవరాత్రులను పాటించడం మన సంప్రదాయం. చైత్రశుద్ధ పాడ్యమి నుండి నవమి దాకా జరిపే ఉత్సవాలను 'వసంత నవరాత్ర'లంటాం. 'శ్రీరామ నవరాత్రుల'ని కూడా వ్యవహరించడం కద్దు. భాద్రపదంలో వచ్చేవి 'వినాయక నవరాత్రులు'.

ఆశ్వయుజ మాసం శుక్లపక్షంలోని పాడ్యమి నుండి నవమి వరకూ గల తొమ్మిది దినాలు 'శరన్నవరాత్రులు'. ఈ ఉత్సవాలలో పూజలందుకొనే దేవత 'దేవి' కాబట్టి, వీటిని 'దేవీ నవరాత్రులు' అని కూడా వ్యవహరిస్తారు. ఈ ఉత్సవాలను 'దసరా పండుగలు' అని కూడా పేర్కొంటున్నాం. విజయదశమితో కలుపుకొంటే ఈ ఉత్సవాలు పది దినాలకు విస్తరిస్తాయి. అందువల్ల 'దశరాత్ర'లు, 'దసరా'గా మారింది. 'దశ పాప హరా = దశవిధ దోషాలను హరించేది' అన్న అర్థంలో కూడా ఇది ప్రయోగంలో ఉంది. దుర్దశలను తొలగించి శుభం చేకూర్చేది అని భావం.

**ఆశ్వినస్య సితే పక్షే ప్రతిపత్సుశుభే దినే ।**
**శుద్ధే తిథే ప్రకర్తవ్యం ప్రతి పచ్చోర్ధ్వగామినీ ॥**

అన్న ప్రమాణాన్ని బట్టి ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి నవరాత్రి దేవీ పూజ నిర్వహించాలి.

**పవంచ వింధ్య వాసిన్యాం నవరాత్రోపవాసతః ।**
**ఏక భుక్తేన నక్తేన తథైవాయాచితేన చ ॥**
**పూజనీయా జనైర్దేవీ స్థానే స్థానే పురే పురే ।**
**గృహే గృహే శక్తి పరైర్గ్రామే గ్రామే వనే వనే ॥**

ఈ వ్రతం అయాచితమైన ద్రవ్యంతో నగరంలో గానీ, గ్రామంలో గానీ, గృహంలోగానీ ప్రతిచోట వర్ణ వర్గ కులాది భేదాలు పాటించకుండా అనుష్ఠించాలి. ఒకరోజులో రాత్రి గానీ, పగలు గానీ - ఒక్కపూట మాత్రమే భుజించి దేవిని పూజించాలి.

నేలపై శయనించాలనీ, వస్త్రాలంకారాలు దానం చేసి ప్రతి దినమూ కన్యలను పూజించాలనీ కూడా పూజా విధానం చెబుతోంది. కుమారీ పూజలో మొదటి దినాన ఒకరూ, రెండవ రోజు ఇద్దరూ - అనే క్రమంలో తొమ్మిదవ రోజున తొమ్మిది మంది కన్యలను పూజించాలి. రెండేళ్ళ నుండి పదేళ్ళ వయస్సు గలవారినే పూజకు ఎన్నుకోవాలని స్కాందం విధించింది.

నవరాత్రులూ చేసే శక్తి లేనివారు సప్తమి నుండి మూడు రాత్రులు కూడా చేయవచ్చునని హేమాద్రిలో నిర్దేశించడమైంది.

నవరాత్రి ఉత్సవాలలో దుర్గాపూజ ప్రశస్తమైనది. 'దుర్గముడు' అనే రాక్షసుణ్ణి సంహరించడం వల్ల దేవిని 'దుర్గ' అంటారు. ఆమె మహాశక్తి యుక్త అయిన దేవత. **యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా...** ఆ దేవిని మించినదేదీ లేదు. కాబట్టి ఆమెను 'దుర్గ' అన్నారు. '**ఓం దుర్గే దుర్గే రక్షిణి స్వాహా**' అనే నవాక్షర మంత్రంతో దుర్గాపూజను నిర్వహిస్తారు. సనాతన ధర్మంలో శక్తి ఉపాసనకు మిక్కిలి ప్రాధాన్యముంది. శివుడు శక్తితో కూడి ఉన్నప్పుడే ఏమైనా చేయగలడనీ, లేకుంటే ఏమీ చేయజాలడనీ, త్రిమూర్తులు సైతం శక్తిని ఆరాధిస్తారనీ 'సౌందర్య లహరి'లోని మొట్టమొదటి శ్లోకంలో శంకర భగవత్పాదులు చెప్పారు.

ఈ ఉత్సవాలలో కలశ స్థాపనాది కార్యక్రమాలు ఆగమోక్త పద్ధతిలో నిర్వహించి, శక్తిని పూజించడం ఉత్తమ పక్షం. అది వీలు కానప్పుడు దేవి పటాన్ని గానీ, విగ్రహాన్ని గానీ, పుస్తకాలను గానీ పూజిస్తూ స్తోత్రనామాదులు పఠించవచ్చు. దేవీ ప్రతిమను దక్షిణాభిముఖంగా ఉంచితే శుభం. తూర్పు ముఖమైతే జయం. పశ్చిమ ముఖంగా కూడా ఉంచవచ్చు. కానీ ఉత్తరాభిముఖంగా ఉంచరాదు. బ్రహ్మాండ పురాణంలో లలితా దేవీ మాహాత్మ్యం విస్తృతంగా వర్ణితమైంది. దేవిని రాజరాజేశ్వరి, త్రిపురేశ్వరి, త్రిపుర సుందరి, కామేశ్వరి - ఇత్యాది నామాలతో వ్యవహరిస్తారు. ఇక్కడ నామభేదమే కానీ నామి భేదం లేదని గుర్తించాలి.

దుర్గాదేవిని నవ దుర్గలుగా భావించి రోజుకొక రూపంతో ఆరాధించే సంప్రదాయం కూడా ఉంది. 1.శైలపుత్రి 2.బ్రహ్మచారిణి 3.చంద్రఘంట 4.కూష్మాండ, 5. స్కందమాత 6.కాత్యాయని 7.కాళరాత్రి 8.మహాగౌరి 9.సిద్ధిదాత్రి - అని నవదుర్గల పేర్లు. తొమ్మిది రోజులు దేవిని తొమ్మిది రూపాలతో అర్చించిన భక్తులకు సంవత్సర కాలం అర్చించిన ఫలం కలుగుతుందని ఆస్తికులు విశ్వసిస్తారు.

ధర్మం, అర్థం, కామం - అనే త్రివర్గాలను ప్రసాదించే దేవి సత్త్వరజస్తమః స్వరూపిణి. ఆమె మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి అనే ముగురమ్మలకు మూలమైన అమ్మ. 'అమ్మల గన్నయమ్మ' అన్న పద్యంలో పోతన ఈ యమ్మనే స్తుతించాడు.

దేవి యొక్క ముఖ్యకర్తవ్యం ఆసురీ శక్తులను నిర్మూలించి, దైవీశక్తులను నెలకొల్పడమే. దేవీ భాగవతాది గ్రంథాలలో దేవి రక్కసులను ఎలా హతమార్చిందో వివరంగా చెప్పారు. మధుకైటభులు, చండముండులు, మహిషాసురుడు మొదలైన రాక్షసులు దేవి యొక్క ఆగ్రహాగ్నిలో మాడి మసి అయిపోయారు.

దేవతలు హోమం చేస్తూండగా అగ్నిగుండం నుండి లలితాదేవి ఆవిర్భవించింది. అందుకే ఆమెను 'చిదగ్ని కుండ సంభూత' అంటారు. నవరాత్రులలోనే కాక ఇతర సమయాలలో కూడా నేడు లలితా సహస్రనామ పారాయణం ముమ్మరంగా అలవాటులోకి రావడం ముదావహం.

పాండవులకు దేవీ స్తోత్రపఠనం విజయహేతువయిందనీ, శ్రీరాముడు దేవీపూజ చేసి రావణాసురుణ్ణి సంహరించాడనీ కథలు ప్రచారంలో ఉన్నాయి. సరస్వతీ రూపంలో అమ్మవారిని పూజించడం విద్యాభ్యాసం చేసే వారికి అవశ్య కర్తవ్యం.

ఒక వైపు దేశమంతటా నవరాత్రి ఉత్సవాలు జరుగుతుండగా, అదే కాలంలో కలియుగ వైకుంఠమైన తిరుమలలో శ్రీవేంకటేశ్వర స్వామికి బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. బ్రహ్మదేవుడు ప్రారంభించిన ఉత్సవాలు కాబట్టి ఈ ఉత్సవాలను ఆయన పేరుతోనే వ్యవహరిస్తున్నారు. "ఉత్సవం కురుమే బ్రహ్మన్ సర్వలోక పితామహ" అని మహావిష్ణువే శ్రీవేంకటేశ్వరుడుగా వెలసినప్పుడు బ్రహ్మను ఉత్సవాలు నిర్వహించమని చెప్పినట్లు పురాణాలు తెలుపుతున్నాయి.

నవరాత్రి అనంతరం వచ్చే దశమి విజయదశమిగా ప్రసిద్ధమైంది. ఇది చాలా ముఖ్యమైన పర్వదినం. జీవితంలో ఏ రంగంలోనైనా విజయం కాంక్షించే వారు విజయదశమి నాడు తమ ప్రయత్నం ప్రారంభిస్తారు. 'విజయదశమి' అంటే విజయాన్ని చేకూర్చే 'దశమి' అని అర్థం. ఈ పదాన్ని 'విజయద-శమి' అని విడగొట్టి, 'విజయమునిచ్చే శమీవృక్షం' అని కూడా అర్థం చెప్పవచ్చు. ఈ దశమి నాడు జమ్మిచెట్టును భగవంతునితో కలిపి పూజిస్తారు. విడిగా చెట్టును మాత్రమే పూజించే పద్ధతి కూడా ఉంది. జమ్మి చెట్టు విశిష్టతను ఇలా చెప్పారు.

**శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ ।**
**ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ ॥**

**కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖంమయా ।**
**తత్ర నిర్విఘ్నకర్త్రీ త్వం భవ శ్రీరామ పూజితే ॥**

"జమ్మి పాపాన్ని శమింపజేస్తుంది, శత్రువులను నశింపజేస్తుంది. అజ్ఞాతవాస కాలంలో అర్జునుడి ఆయుధాలను ఈ జమ్మిచెట్టు వహించింది. విజయ యాత్రలో వచ్చే విఘ్నాలను తొలగిస్తుంది. రావణునిపై విజయానికి కారణమై శ్రీరామునికి ప్రియం చేకూర్చింది". దీన్నిబట్టి శమీపూజ ఎంత ప్రభావవంతమైనదో గ్రహించవచ్చు. వ్రతాంగంగా చేయవలసిన పారణ దశమి నాడే చేయాలి.

పూజాదులన్నీ నిత్యమూ విధి విహితంగా భక్తి శ్రద్ధలతో పూర్తి చేసిన తరువాత దశమి నాడు దేవీ ప్రతిమను జలనిమజ్జనం కావించడం ద్వారా విసర్జించాలి. ఈ ప్రక్రియ వినాయక నవరాత్రులలో కూడా ఉంది. దేవిని పంపివేసేటప్పుడు గీత వాద్య ధ్వనులు వినిపించాలి. ఈ క్రింది శ్లోకం చదవాలి :

**దుర్గే! దేవి జగన్మాతః స్వస్థానం గచ్ఛ పూజితే ।**
**సంవత్సరే వ్యతీతేతు పునరాగమనాయ వై ॥**

"తల్లీ! దుర్గాదేవీ! జగన్మాతా! నీవిక నీ స్వస్థానం చేరుకో. సంవత్సరకాలం గడచిన తరువాత మళ్ళీ తిరిగివచ్చి మా పూజలందుకో!".



శ్రీరామకృష్ణులు దేవీపూజా తత్పరులన్న సంగతి లోకవిదితం. పూజలో వారు దేవిని తమలోకి ఆవాహనం చేసుకొనేవారు. బాహ్యస్మృతి కూడా కోల్పోయేవారు. శ్రీరామకృష్ణుల జీవిత కాలంలో జరిగిన ఒక సంఘటన ఇక్కడ ప్రస్తావించదగి ఉన్నది. అది నవరాత్రి ఉత్సవాల కాలం. దశమి వచ్చింది. ఆ దినం దేవిని నిమజ్జనం చేయాలి. దానికి తగిన ఏర్పాట్లు జరుగుతున్నాయి.

పరమహంస వారికి సన్నిహితుడైన మధురబాబు నిమజ్జనం జరుగనున్నదని తెలిసి ఎంతో దుఃఖించాడు. "జగన్మాత నన్ను పరమానందపరవశుణ్ణి చేసింది. ఆమె నెలా నిమజ్జనం చేసేది?

*(మిగతా 36వ పేజీలో...)*

శాస్త్రవిధులను ఎరుగక నిరుపాయుడను, అలసుడను అయిన నేను యథాయోగ్యంగా వర్తింపనైతిని. ఓ దేవీ! నా అనంత అపరాధాలను క్షమించి, దయతో నన్ను ఉద్ధరించు. - *ఆదిశంకరాచార్యులు*

మాయాబజార్

# తపస్సే జీవితం

– స్వామి శితికంఠానంద

నారద మునీంద్రుడు తన భూలోక సందర్శనంలో విన్న విషయాలను సురలతో పంచుకోవాలని మళ్ళీ దేవలోకాన్ని సందర్శిస్తాడు. సురలందరూ లేచి నిలబడి దేవర్షిని ఆహ్వానిస్తారు.

**దేవేంద్రుడు:** మునీంద్రా! మీ రాకతో మా దేవలోకం పావనమైంది. ఇంత తక్కువ సమయంలో మళ్ళీ మా పై మీ అనుగ్రహం కలిగినందుకు సంతోషిస్తున్నాం. మీ వంటి పరమ భక్తుల సందర్శనం, సాంగత్యం మహాఫలాన్ని సిద్ధింప జేయగలదు. శ్రీమన్నారాయణుడి లీలా క్షేత్రమైన భూలోకం గురించి చాలా విషయాలను ఈ సభలో చర్చించాం. మాయాధీశుడి మహాభివ్యక్తీకరణలు, జీవులలో కెల్లా ఉత్తమోత్తమమైన జీవులుగా పరిగణింపబడుతున్న మానవులకు సంబంధించిన విషయాలను ఎంత తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవాలన్న కుతూహలం మమ్మల్ని వీడుటలేదు. దయచేసి మీరు గ్రహించిన కొన్ని విషయాలను మాకు తెలియజేసి మమ్మానందింప జేయప్రార్థన.

**నారద మహర్షి:** ఏమి చెప్పమంటావు సురపతీ? అమృతాన్ని తమలోనే ఉంచుకొని విషాన్ని గ్రహిస్తున్న మనుజులను చూస్తుంటే గుండె తరుక్కుపోతుంది. అన్ని వయస్సులలోని వారు కూడా మానసిక ఒత్తిడి, ఆందోళనలతో సతమతమవుతున్నారు. ఎవరి స్థాయిలో వారికి కష్టాలు ఉంటున్నాయి. ముఖ్యంగా యుక్తవయస్సులోని వారు కూడా ఇంతకుముందు ఎన్నడూ లేని విధంగా అభద్రతా భావం, దైన్యానికి లోనవుతున్నారు. జీవితం ఒక పోరాటంగా మారింది. ఆ పోరాటంతో అలసి పోతున్నారు.

**దేవేంద్రుడు:** పోరాటమా? ద్వాపర యుగంలోలాగా కురుక్షేత్ర యుద్ధాలు ఏమీ రాలేదుగా మునీంద్రా. మరి పోరాటం దేనికి?

**నారద మహర్షి:** ప్రతి మనిషి పరిస్థితులతో పోరాడుతున్నాడు దేవేంద్ర. వ్యక్తిగత జీవితమే ఒక కురుక్షేత్రంగా మారింది. పోరాటంలో శాంతి ఉండదని, ఈ పోరాటం శాశ్వతంగా ఉపశమించాలంటే మానవ జీవిత పరమార్థం, చరమ లక్ష్యమేమిటో తెలుసుకోవాలని గ్రహించ లేకపోతున్నారు. పోరాటం యొక్క అర్థమేమిటో అవగతమైతే సగం బాధలు తగ్గిపోతాయి. ఆ అవగాహన మృగ్యమైంది కాబట్టి దుఃఖం అధికరిస్తున్నది.

**దేవేంద్రుడు:** దేవర్షులు వారు క్షమించాలి. అర్థం బోధపడకుండా ఉన్నది.

**నారద మహర్షి:** మనిషి సహజంగా అమృత స్వరూపుడు కదా. ఆ అమృతతత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకోవటమే జీవిత పరమావధి అని గ్రహించి తన శారీరక మానసిక శక్తులను అటు కేంద్రీకరించినట్లైతే జీవితం అర్థవంతమవుతుంది. అప్పుడు జీవనయానం ఇంత ఇబ్బందిగా పరిణమించదు. పోటీలు, పోరాటాలు ఉండవు. అంతటా సంతృప్తి, శాంతి, ఆనందం వెల్లివిరుస్తాయి.

**దేవేంద్రుడు:** ఇంకాస్త విడమర్చి చెప్పండి మునీంద్ర.

**నారద మహర్షి:** ఆనందం కోసం తాను బయట వెతికి ప్రయోజనంలేదని ప్రతివ్యక్తి గ్రహించినప్పుడు జీవన వేగం తగ్గుతుంది. అంటే మనిషి ఆలోచనా పరుడవుతాడు. అంతర్నిహితంగా ఉన్న మహా ఆధ్యాత్మిక శక్తిని జాగృత పరచుకో గలుగుతాడు. నీకు తెలియనుగదా దేవేంద్రా! ఈ సృష్టిని సృజించక ముందు బ్రహ్మ తన పుట్టుక మూలాన్ని తెలుసుకోవాలని బాహ్యప్రపంచంలో వెతికి వెతికి చివరకు తపస్సుకు ఉపక్రమించి తన ఉనికి మూలాన్ని తెలుసుకొన్నాడు. తన జీవన పరమార్థాన్ని గ్రహించి శ్రీమన్నారాయణుడి ఆజ్ఞ మేరకు ఈ సృష్టి రచనకు ఉపక్రమించాడు.

**దేవేంద్రుడు:** జీవన గమన వేగం తగ్గటంవలన మనిషి సాధించే దేముంటుంది? తపన, ఆరాటం లేకుండా మనిషి ఏమీ సాధించలేడు కదా!

**నారద మహర్షి:** తపన ఉండటం సబబే కానీ, ఆ తపనను శాశ్వతానంద ప్రదాతయైన భగవంతుడిని చేరుకోవడానికి ఉపయోగిస్తే జన్మ ధన్యమవుతుంది. సార్థక మవుతుంది. అలా కాకుండా పూర్తి మనస్సును సార రహితమైన, జవసత్వాలను హరించే వస్తుప్రపంచంపైననే నిలిపితే మనస్సు క్షోభకు గురవుతుంది. శాంతికి దూరమవుతుంది. పూర్వం ఋషులు, మునులందరూ నిరంతరం మహాతపస్సు చేస్తూ, కేవలం దేహాన్ని నిలపటానికి కావలసిన కనీస అవసరాలతో సంతృప్తి చెంది పట్టణాలలో, నగరాలలో ఉండటానికి ఇష్టపడకుండా, ఈ పుడమిని పవిత్రం చేయగలిగారు. వారు కదా మానవ జీవిత ప్రయోజనాన్నీ, పరమార్థాన్నీ అర్థం చేసుకున్నవారు! ఇప్పటికీ కూడా ఆ మహోద్ఘోష నిరంతరం వినపడుతూనే ఉన్నది కదా!

**దేవేంద్రుడు:** ఏ ఉద్ఘోష మహర్షీ?

**నారద మహర్షి:** 'ఓ మానవా! తపస్సుతోనే అన్నీ సాధించ గలవు. తపస్సుతోనే సర్వం సమకూరుతాయి' అన్న ప్రాచీన వాక్కు.

**దేవేంద్రుడు:** తపస్సు అంటే నిరంతరం కళ్ళు మూసుకొని ధ్యానం చేయడమేనా? అది సమాజంలో ఉన్నవారికి ఎలా సాధ్యపడుతుంది?

**నారద మహర్షి:** తపస్సు అంటే అంతఃప్రయాణం. ఆ ప్రయాణంలో ధ్యానం ఒక ముఖ్య భాగం. ఈ అంతఃప్రయాణం

కలియుగంలోని మనిషికి అర్థం కాకపోవటంతో తాపత్రయాగ్నిలో దహింపబడుతున్నా అందుకు ఉద్యుక్తుడవటం లేదు. ధ్యానంతో పాటుగా మనిషి నిస్సంగ బుద్ధితో కర్మలను చేయటం, ఓంకార జపం, జీవులయందు దయ, మైత్రీభావం – ఇవన్నీ కూడా మనిషి పరిపూర్ణుడుగా ఎదగటానికి దోహదపడేవే. ఐనా ప్రస్తుతం ఆర్యావర్తంలోని వారికి కందమూలాలు తింటూ వల్కలాలను ధరించి, అరణ్యాలలో ఉంటూ, నిరంతరం తపస్సే జీవితంగా గడిపి, సూర్యసమతేజస్సుతో ధరణిపైన దైవతాలుగా వెలిగిన మునులు తమ పూర్వీకులని గుర్తుకు రావటంలేదు. ఆ ఆదర్శం కనీసం వారి దృష్టిపథంలో కూడా లేదు.

**దేవేంద్రుడు:** అందరూ అలా భవబంధాల్ని త్రెంచుకొని జనారణ్యాలకు దూరంగా ఉండలేరు కదా మునీంద్ర. ఆచరణీయమైన ఆదర్శాన్ని జనులముందు నిలపాలి కానీ అంత కఠినమైన ఆదర్శాన్ని...

**నారద మహర్షి:** అందరూ అలా జనావాసాలకు దూరంగా ఉండి తపస్సుచేసిన వారు కాదు దేవేంద్ర. ఎంత మంది రాజర్షులు అవిశ్రాంతంగా పరిపాలనా బాధ్యతలను నిస్సంగ బుద్ధితో నిర్వహిస్తూ కూడా బ్రహ్మజ్ఞానాన్ని పొందలేదు?. నేను చెప్పదలచుకున్నదేమంటే మనుజులు తపస్సు, ఆ తపస్సుద్వారా సిద్ధిని పొందటమే మానవజీవిత లక్ష్యమని తెలుసుకోవాలని. వాళ్ళు జనారణ్యంలో ఉంటూనే గీతలో కృష్ణ భగవానుడు సెలవిచ్చినట్లుగా సంగరహితంగా కార్యాలను నిర్వహిస్తూ సిద్ధిని పొందటానికి ప్రయత్నించాలి. సంతృప్తిని మించిన సంపద లేదని గుర్తెరిగి శాంతిని పెంపొందించుకోవాలి. మహాభారతంలో శాంతిపర్వంలో భీష్మపితామహుడు ఈ విషయాన్నే ఇలా చెపుతాడు, **'అంతోనాస్తి పిపాసాయాః తుష్టిస్తు పరమం సుఖమ్ ! తస్మాత్ సంతోషమేవేహ ధనం పశ్యన్తి పండితాః !!** కోరికలకు అంతు ఉండదు కాబట్టి సంతృప్తియే పరమ సుఖకారిణి. అందువలన విజ్ఞులైనవారు సంతృప్తి ద్వారా కలిగే సంతోషాన్నే సంపదగా గ్రహిస్తారు.




**దేవేంద్రుడు:** ఫలాలను ఆశించకుండా నిస్సంగ బుద్ధితో కార్యాన్ని చేయటం సాధారణ మానవులకు సాధ్యమవుతుందా మహర్షీ?

**నారద మహర్షి:** ఫలాలను ఆశించవద్దంటే సంప్రాప్తించిన ఫలాన్ని అనుభవించకుండా త్యజించమని కాదు కదా. కర్మ ఫలం తమకు అనుకూలంగా ఉన్నా, ప్రతికూలంగా ఉన్నా చలించని మనస్సుతో స్వీకరించమని భగవానుడి బోధ. దీనిని వేరే విధంగా అర్థంచేసుకుంటున్నారు. మనిషి ఏ కోరికలూ లేకుండా ఉండాలని, అది సామాన్య మానవులకు దుర్లభమని అనుకుంటున్నారు. ఐనా ఇహపరాలలో మనిషి దేనిని కోరుకున్నా, ఏది సాధించాలన్నా తన ప్రయత్నానికి దైవసంకల్పం తోడవ్వాల్సిందే. ఆ దైవ సంకల్పం తనకు అనుగుణంగా ఉండాలంటే ఆయన్ను నిరంతరం ప్రార్థించాలి. భాగవతంలో కృష్ణ భగవానుడిని స్మరిస్తూ కుచేలుడు **'స్వర్గాపవర్గయో పుంసాం రసాయాం భువిసంపదమ్! సర్వాసామపి సిద్ధీనాం మూలం తచ్చారణార్చనమ్ !!** –స్వర్గభోగాలు, కైవల్యం లేదా భువిపై గ్రామ్యసుఖాలు... మనిషి వేటిని కోరుకున్నా భగవానుడి పాదాలను అర్చించి అనుగ్రహానికి పాత్రుడవటం తప్ప వేరే మార్గం లేదు' అంటాడు. తనకు ఏది సంక్రమించినా అంతా దైవేచ్ఛ అని భావిస్తూ, తనకు ఏది మేలు చేకూరుస్తుందో దానినే ప్రసాదించమని సదా సర్వేశ్వరుడిని స్మరిస్తూ జీవించే వారు ఉత్తమోత్తములు. లౌకిక జీవితంలో వ్యక్తికి కావలసిన కనీసావసరాలను భగవానుడు అడగకుండానే ప్రసాదిస్తాడు. కాబట్టి వాటికై తాపత్రయం అనవసరం. అధిక సిరిసంపదలను ప్రోగుచేసుకున్నవారిని చూసి అవన్నీ బంధ కారణాలని గ్రహించి, వారిని చూసి జాలిపడాలి; అంతేకానీ వారికున్నంత నాకు లేదని మాత్సర్య భావాన్ని పెంపొందించుకోకూడదు. జీవితం అశాశ్వతమనీ, నీటిబుడగ లాంటిదనీ ఎరిగి, దైవమే ఆలంబనగా జీవిస్తున్న వారు ధన్యులు.

**దేవేంద్రుడు:** అవును మునీంద్రా. ఇదే ఈ యుగంలో శ్రీరామకృష్ణులుగా అవతరించిన శ్రీమన్నారాయణుడు బోధించిన భాగవత ధర్మము కూడా. మనుజులకు జీవితాన్ని సుసంపన్నం చేసుకోవటానికి ఇంతకు మించిన ఉత్తమోత్తమమైన మార్గం లేదు. ఇది తెలుసుకోకుండా అధిక సంఖ్యాకులు అవలంబిస్తున్న అజ్ఞాన జనిత, ప్రాపంచిక భోగైకలక్ష్య జీవన విధానాన్ని అనుకరించినట్లైతే దుస్సహమైన దుఃఖాగ్ని మనిషిని దహించక మానదు.

దేవర్షులవారికి దేవలోకం నీరాజనాలు. ఇవ్వాల్టికి ఈ సభను చాలిద్దాం. ❖

క్షణికమైన విషయసుఖాల్లో అవివేకులకు ఎలాంటి ప్రీతి ఉంటుందో, శాశ్వత ఆనందాన్నిచ్చే నీ పద ధ్యానం చేస్తున్నప్పుడు అలాంటి ప్రగాఢ ప్రీతి నా హృదయంలో నిరంతరం ఉండుగాక! - భక్త ప్రహ్లాదుడు

# చల్లనితల్లి

- శ్రీమతి సుధామూర్తి, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

అంబా భవాని అన్న పేరు వినగానే ఒక్కసారిగా నా మనస్సు మా నాయనమ్మ ఒడిలోకి వాలిపోతుంది. ఊళ్ళో అందరూ ఆమెను 'అంబక్క' అని ఆత్మీయంగా పిలుచుకునేవారు. ఆవిడ అచ్చమైన గ్రామీణ స్త్రీ. పల్లెలో పుట్టింది; పల్లెలో పెరిగింది; పల్లెలోనే కన్నుమూసింది. బాల్యంలోనే వివాహమైంది. వైధవ్యం ప్రాప్తించాక, నైష్ఠిక బ్రాహ్మణ సంప్రదాయాన్ని అనుసరించి తల వెంట్రుకలు తీయించారు. ఆపై నున్నటి తల మీద ఎర్ర చీర పైట చెరగు కప్పుకునేది. అప్పటి నుంచి దాదాపు 90 సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో, ఆమెకు తెలిసిన ప్రపంచమంతా తన పదిమంది బిడ్డలు, మనుమళ్ళు, మనుమరాళ్ళు, పొలాలు, ఇళ్ళు, పశువులు. మా నాయనమ్మకు ఉండే ముఖ్యమైన వ్యాపకాల్లో మొదటిది వ్యవసాయం, రెండోది కాన్పు సమయంలో స్త్రీలకు సహాయపడడం. వ్యవసాయానికి సంబంధించి తన అనుభవంతో ఆ ఊరి జనానికి ఆమె ఎన్నో సలహాలిచ్చేది. అదే విధంగా ఎలాంటి వైద్యసదుపాయమూ లేని ఆ కుగ్రామంలో ప్రసవ సమయంలో కులమతాల పట్టింపులు, హోదాలతో సంబంధం లేకుండా గర్భిణులకు సహాయపడేది. నెయ్యి, అన్నం, కూరలు పంపేది.



నాకు పది, పన్నెండేళ్ళ వయస్సులో ఓ సారి మా నాయనమ్మ ఊరు వెళ్ళాను. అది డిసెంబరు నెల. అమావాస్య రాత్రి. చాలా చలిగా ఉంది. ఆ రోజుల్లో వీధి దీపాలు ఉండేవి కావు. నేను నాయనమ్మ పక్కనే పడుకున్నాను. ఇంతలో తలుపు తట్టిన శబ్దమైంది. నాయనమ్మ గభాల్న లేచింది. 'ద్యామప్పా! వచ్చింది హుస్సేన్ ఏమో చూడు!' అంది. ద్యామప్ప మా ఇంట్లో పని చేసే వ్యక్తి. హుస్సేన్ మా ఇంటి దగ్గరలోని ముస్లిమ్. అతని భార్య పీరాంబీకి నవమాసాలు నిండాయని అంతకు ముందే నాయనమ్మ గుర్తుచేసుకుంది.

నాయనమ్మ అంచనాయే నిజమైంది. వచ్చింది హుస్సేనే! వెంటనే నాయనమ్మ పూజ గదిలోకి వెళ్ళింది. మా ఇలవేల్పు అయిన వేంకటేశ్వర స్వామిని ప్రార్థించుకొని, బయటకు వచ్చింది. ఎంత వారించినా వినకుండా నేనూ నాయనమ్మ వెనుకే బయలుదేరాను. చిమ్మచీకట్లో లాంతరు పట్టుకొని నడుస్తూ హుస్సేన్ ఇంటిని సమీపించాం. పీరాంబీ నొప్పులతో బాధపడుతూ ఉంది. వాళ్ళ పక్క ఇంటి ముసలావిడ, నాయనమ్మను చూసి 'ఇంకేం భయం లేదు. అంబక్క వచ్చిందిగా' అంది ఆనందంగా! లోనికి వెళ్ళిన నాయనమ్మ ఒక వైద్యురాలిగా మారిపోయింది. లోపల భార్య పురిటి నొప్పులు. బయట హుస్సేన్‌కు ఆందోళన. కొద్ది గంటల తరువాత ప్రాతఃకాలం, నాయనమ్మ తలుపు తెరచి 'హుస్సేన్! మగపిల్లాడు పుట్టాడురా!' అంది. ఒక్కసారిగా హుస్సేన్ వంగి నాయనమ్మ పాదాల మీద పడ్డాడు. అతని గొంతు బొంగురుపోయింది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. 'అమ్మా! మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీదు. మేము పేదవాళ్ళం. మీకేమీ ఇచ్చుకోలేం. కానీ మీకు జీవితాంతం ఋణపడి ఉంటాం. మీరు వందల మందికి చల్లనితల్లి. మీరు నా బిడ్డను ఆశీర్వదించారు. అది చాలు' అన్నాడు.

వెంటనే నాయనమ్మ తన సున్నితమైన అరచేతులను హుస్సేన్ భుజాల మీద పెట్టి, పైకి లేవదీసింది. ఆమె చిన్ని నేత్రాలలో రాలుతున్న ఆనందబాష్పాల్ని తుడుచుకుంటూ 'హుస్సేన్! కష్టాల్లో ఉన్న తోటి మానవుల్ని ఆదుకోమని భగవంతుడు చెప్పాడు. నేనంతకు మించి ఏమీ చెయ్యలేదు. నాకు పీరాంబీ మనుమరాలితో సమానం' అంది.

ఆ సంభాషణ విన్న తరువాత దారిలో కుతూహలంగా 'నాయనమ్మా! నువ్వు కన్నది పదిమంది పిల్లల్నే కదా! మరి హుస్సేన్ నువ్వు వందలమందికి చల్లని తల్లివని ఎందుకన్నాడు' అని అడిగాను. నాయనమ్మ నవ్వి 'నాకు పదిమంది పిల్లలే. కానీ ఈ చేతులతో పురుడుపోసి, వందలమంది పిల్లలకు జన్మనిచ్చాను. పాపా! నిజజీవితంలో నువ్వు ఎందరు పిల్లలను కంటావన్నది ప్రధానం కాదు; కానీ నువ్వు మాత్రం వందలమంది పిల్లలకు చల్లని తల్లివి కావాలి; అది ముఖ్యం' అంది ఆశీర్వదిస్తున్నట్లు నా తల నిమురుతూ! ❖

సేకరణ : జి. సతీష్

# ఉల్లాసం... ఉత్సాహం... విశ్వాసం

– స్వామి బోధమయానంద

పరిపూర్ణ వ్యక్తిత్వవికాసం అంటే ఏమిటో ఒక్క వాక్యంలో చెప్పాలంటే నిరంతరం ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉంటూ వ్యక్తిగతంగా తనపై, వ్యవస్థాగతంగా సమాజంపై విశ్వాసాన్ని కోల్పోకుండా మసలుకోవటమే! ఎట్టి పరిస్థితుల్లోనూ సంయమనాన్ని కోల్పోకుండా, సాహసోపేతంగా జీవిస్తూ ముఖంపై చిరునవ్వులు చెదరనీయకుండా ఉండగలుగుతున్నామంటే మన వ్యక్తిత్వం వికసించిందన్నమాటే! దృఢమైన వ్యక్తిత్వం కలిగినవాళ్ళు అప్రమత్తంగా ఉంటారు, అలా అని అతిజాగ్రత్తను ప్రదర్శించరు; కచ్చితంగా ఉంటారు, అలా అని మూర్ఖంగా ఆలోచించరు; పట్టుదలగా ఉంటారు, అలా అని మొండిపట్టుగా ఉండరు; సరదాగా ఉంటారు, అలా అని చౌకబారుగా ప్రవర్తించరు. ఏ స్థానంలో ఉన్నా ఇలాంటి కొన్ని మౌలికలక్షణాలను అలవరచుకుంటే మన నడవడిక నలుగురికి ఆదర్శంగా ఉంటుంది. మూడు మాటల్లో చెప్పాలంటే ఉల్లాసం... ఉత్సాహం... విశ్వాసం ముప్పేటలా అల్లుకున్నదే నిజమైన జీవనసూత్రం!



**ఉల్లాసం... :** నిరంతరం దీర్ఘాలోచనలతో, ముభావంగా ఉండేవారు జీవితంలో ఏమీ సాధించలేరు. ముఖ్యంగా యుక్తవయస్సులో భవిష్యత్తుకు ఒక ప్రణాళికను రచించుకునే కాలంలో శారీరకంగా, మానసికంగా ఉల్లాసం తొణికిసలాడాలి. నలుగురితో సరదాగా, కలివిడిగా కలసిపోవాలి. అందుకే 'ఆధ్యాత్మికంగా పరిణతిని సాధించిన వ్యక్తి ఎల్లప్పుడూ ఆహ్లాదంగా, ఆనందంగా కనిపిస్తాడు. ఎప్పుడూ ఏదో కోల్పోయినట్టు ఉండేవారు మానసిక వ్యాధితో బాధపడుతున్నట్లే!' అంటారు స్వామి వివేకానంద. నేడు సమాజంలో కూడా గొప్పగొప్ప విజయాలు సాధించినవారందరూ తమతో పాటు తమ పరిసరాల్ని కూడా ఆహ్లాదభరితంగా ఉంచుకుంటారు. అలాగని నలుగురిలో వెకిలిగా ప్రవర్తించడం సమంజసం కాదు. హుందాగా ఉంటూనే, చిరునవ్వును ఆభరణంగా ధరిస్తూ కనిపించాలి. ఫలితంగా ఎంతటి ఒత్తిళ్ళనైనా సునాయాసంగా అధిగమించవచ్చు; ఎదుటివారితో సామరస్యంగా పని చేయించుకోవచ్చు.

**ఉత్సాహం... :** విద్యార్థి దశలో కానీ, ఉద్యోగిగా బాధ్యత నిర్వహణలో కానీ, ఉత్సాహంగా ఉపక్రమించకపోతే ఉత్తమ ఫలితాలు రావు. ఉత్సాహంగా ఉండేవ్యక్తులే సమాజాన్ని ఆకర్షించగలరు. నలుగురితో సౌహార్ద్ర సంబంధాలను కొనసాగించగలరు. Sportive Attitude పెంపొందించుకోగలరు. అలాంటివారు ఎలాంటి పని ఒత్తిళ్ళకూ లోనుకారు. అందుకే ఆస్కార్ వైల్డ్ 'కొందరు ఎక్కడికి వెళితే అక్కడ ఆనందాన్ని కలిగిస్తారు, మరికొందరు అక్కడి నుండి ఎప్పుడు వెళితే అప్పుడు ఆనందం కలుగుతుంది' అంటారు. అందుకే ఉత్సాహంతో, సంతోషంతో మొదటి రకం వ్యక్తుల్లా ఉండేందుకు ప్రయత్నిద్దాం.

**విశ్వాసం... :** ఒక ఊరిలో ఓ ఏడాది తీవ్ర కరవుకాటకాలు సంభవించాయి. గ్రామస్థులంతా కలసి సమీప ఆలయంలో సాధనలు చేస్తున్న సాధువును ఆశ్రయించారు. తమ గ్రామాన్ని వరుణుడు కరుణించేట్లు ప్రార్థించమని ఊరి ప్రజలంతా ఆ సాధువుని వేడుకున్నారు. వారి వేడుకోలుకు స్పందించిన సాధువు 'మీ గ్రామం కోసం తప్పకుండా ప్రార్థనలు చేస్తాను; రేపు ఉదయం అందరూ ఈ ఆలయానికి రండి; ప్రార్థనలతో వర్షం కురిపిస్తాను' అన్నాడు. మరుసటి రోజు ఉదయం ఆ ఊరి జనమంతా తండోపతండాలుగా ఆలయ ప్రాంగణంలో ఆసీనులయ్యారు. అప్పుడు ఆ సాధువు మాట్లాడుతూ 'నేను చెప్పిన ప్రకారం మీరంతా ఇక్కడికి వచ్చారు; మంచిదే! కానీ మీలో ఎవరికీ నా మాటపై విశ్వాసం లేదు. ఒక్క బాలుడికి తప్ప!' అని అన్నాడు. 'ఎవరా బాలుడు? అతడిలో ప్రత్యేకత ఏమిటి?' అన్నట్లు అందరూ ఆశ్చర్యంగా ఆ సాధువు వైపు చూశారు. అప్పుడు ఆ సాధువు, గొడుగుపట్టుకొని గుంపులో ఉన్న ఓ ఏడేళ్ళ బాలుణ్ణి చూపించాడు. 'ఆ బాలునికి గల విశ్వాసంతో ఇప్పుడు వర్షం కురుస్తుంది' అంటూ దేవుణ్ణి ప్రార్థించి వాన కురిపించాడు. మనలో కూడా చాలామందిలో ఈ ప్రగాఢవిశ్వాసమే కొరవడుతోంది. మనపై మనకు విశ్వాసం, మన చుట్టూ ఉన్న సమాజంపై విశ్వాసం ఉన్నప్పుడే ఏదైనా సాధించగలం. ❖

బాల్యం నుండే ఆత్మవిశ్వాసం పెంచడానికి అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చి ఉంటే మనమిప్పుడు అనుభవించే అనర్థాలు, దుఃఖాలు చాలా వరకు సమసి పోయి ఉండేవని నా దృఢ విశ్వాసం. - స్వామి వివేకానంద

మహాత్మా గాంధీగా తీర్చిదిద్దాయి. పొరపాట్లు చేయనివారు కాదు, పొరపాట్ల నుంచి పాఠాలు నేర్చి పైకెదిగినవారే మాననీయులని ఋజువు చేశాయి.

**తప్పులు... తడబాట్లు :** ఎంతటి విజేతలకైనా వారి ప్రస్థానంలో తప్పులు, తడబాట్లు సహజాతిసహజమే! కానీ వారు ఆ పొరపాట్ల నుంచి పాఠాలు నేర్చుకున్నారు. వాటినే సోపానాలుగా చేసుకొని పై పైకి నడిచారు. అయితే మనలో చాలామంది తడబాట్లకు కుంగిపోతారు. ప్రపంచమంతా మనల్నే పట్టించుకుంటుందనీ, మన పొరపాట్ల గురించే

# పొరపాటైంది... మన్నించండి!

– బి. సైదులు

అతడు పదిహేనేళ్ళ కుర్రాడు. వ్యసనాలకు అలవాటు పడ్డాడు. అనుకోని పరిస్థితుల్లో ఓ రోజు అన్న చేతి బంగారు మురుగు నుంచి బంగారాన్ని దొంగిలించాడు. తన అవసరాలను తీర్చుకొని తిరిగి ఇంటికి వచ్చాడు. ఆ రాత్రి నుంచి అతని మనస్సు మనస్సులో లేదు. తప్పు చేశానన్న భావం అతణ్ణి నిలువునా తొలిచివేసింది. జీవితంలో ఎన్నడూ చేయకూడదనుకున్న పని చేశానన్న పశ్చాత్తాపభావం ఆ యువకుణ్ణి కుదురుగా ఉండనీయలేదు. ఇంకెప్పుడూ దొంగతనం చేయకూడదని నిర్ణయించుకున్నాడు.

అయినా మనస్సు శాంతించలేదు. చేసిన తప్పును తండ్రికి చెప్పాలనుకున్నాడు. కాళ్ళపై పడి క్షమించాల్సిందిగా కోరాలనుకున్నాడు. కానీ నోరువిప్పి చెప్పే సాహసం చేయలేకపోయాడు. జరిగిన తప్పంతా చివరకు ఒక చీటీపై రాశాడు. భవిష్యత్తులో ఇంకెప్పుడూ ఇలాంటి పాపాన్ని చేయనని మాట ఇస్తున్నాననీ, ఎంతటి శిక్షకైనా నేను సిద్ధంగా ఉన్నాననీ వణుకుతున్న అక్షరాలను ఆర్ద్రతతో పేర్చాడు. ఒకానొక సాయంత్రం ఆ ఉత్తరం పట్టుకొని, వ్యాధితో మంచాన పడ్డ తండ్రి వద్దకు వెళ్ళాడు. బాధపడుతూ తలదించుకొని తండ్రి చేతిలో ఆ కాగితం పెట్టాడు.

ఉత్తరమంతా చదివి ఆ కన్నతండ్రి కళ్ళు జలపాతాలయ్యాయి. నిమిషం పాటు కళ్ళు మూసుకొని ఏదో ఆలోచించాడు. కొడుకు చేసిన తప్పు కన్నా, దాన్ని స్వచ్ఛందంగా అంగీకరించి, పశ్చాత్తాపం పడుతున్న తీరు ఆ తండ్రి హృదయాన్ని కదిలించింది. తరువాత చీటీని చింపేసి, కొడుకును దగ్గరకు తీసుకొని గుండెలకు హత్తుకొని, ఆనందబాష్పాలు కార్చాడు. తండ్రి పెట్టిన ఆ కన్నీటి క్షమాభిక్షకు కొడుకు కంటికీ మింటికీ రోదించాడు. అలా ఆ కుమారుడి పశ్చాత్తాపం, ఆ తండ్రి పితృవాత్సల్యం భవిష్యత్తులో లోకానికి ఓ మహనీయుణ్ణి అందించాయి. మారిన ఆ యువకుణ్ణి

చర్చించుకుంటుందనీ అనవసరంగా ఆలోచిస్తూ ఆందోళనపడుతూ ఉంటారు.

జరిగిన తప్పిదాలను సరిదిద్దుకోవాలే కానీ, వాటినే మనస్సులో తలచుకుంటూ మథనపడకూడదు. నిజానికి ఈ ప్రపంచంలో ఎవరూ పూర్ణపురుషులు కారు! పొరపాటు చేయనివారంటూ ఉండరు. ఎవరో, ఏదో అనుకుంటారని జరిగిన తప్పిదానికి తలుపులు బిగించుకొని కూర్చోవలసిన అవసరం లేదు. మరో ప్రయత్నం చేయకుండా ఉండాల్సిన పని లేదు. అందుకే పరమ కిరాతకంగా జీవించిన అంగులీమాలుణ్ణి మంచివాడిగా మార్చి ఓదారుస్తూ...

**యస్య పాపం కృతం కర్మ కుశలేనపిధీయతే।**
**స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చంద్రమా॥**

'గతంలో చేసిన పాపాన్ని ఎవడైతే పుణ్యం ద్వారా అణగదొక్కుతాడో, అతడు ఆ లోకానికి సన్మార్గాన్ని చూపే జ్యోతి అవుతాడు. కారుమబ్బుల నుంచి బయటకు వచ్చిన పూర్ణచంద్రుని లాంటి వాడవుతాడ'ని బోధిస్తాడు గౌతమ బుద్ధుడు. ఇలా మారడానికి మనస్సు సిద్ధంగా ఉంటే, ఘోరమైన తప్పిదాల నుంచి కూడా కొత్త కొత్త పాఠాలు నేర్చుకుంటూ మన భవితకు మనమే శిల్పకారులం కాగలం.

**ప్రయత్నాలు... పొరపాట్లు :** పసిపిల్లవాడు నడక నేర్చుకునే తొలిరోజుల్లో ఎన్నోసార్లు తడబడతాడు. ఓపిక లేక కూలబడిపోతాడు. అయినా ప్రయత్నాన్ని మాత్రం మానడు. ఒక్క మాటలో చెప్పాలంటే పొరపాట్లు జరుగుతున్నాయంటే ప్రయత్నం చేస్తున్నామనీ, పనిలో రాటుదేలుతున్నామనీ అర్థం. సైకిల్‌ను చాకచక్యంగా నడపగలిగిన వారందరూ, చిన్నప్పుడు ఎప్పుడో ఒకప్పుడు దాని పైనుంచి పడ్డవారే! మోకాలి దెబ్బలు తిన్నవారే! కానీ వారు పొరపాటు ఎక్కడ జరిగిందో తెలుసుకొని, మోకాలి దెబ్బను కూడా మరచిపోయి, సైకిల్‌ను పైకిలేపి మరోసారి వడిగా నడిపి ధీరులు అనిపించుకున్నారు. పడ్డప్పుడు

నలుగురు చూసి నవ్వారని ఇంటికి పరుగెత్తేవారు, ఎప్పటికీ సైకిల్‌ను నడపలేరు. అదే విధంగా జరిగిన పొరపాటును వేరెవరో వేలెత్తి చూపారని, అవమానభారంతో ముదుచుకుపోతే జీవితంలో ఎప్పటికీ ముందుకు సాగలేరు. నిజానికి మనమొక్కరమే కాదు, అందరూ తప్పులు చేసినవారే! అందుకే స్వామి వివేకానంద 'Do not look back upon mistakes. Bless your mistakes. They have been angels unawares. In this battle field of ours, the dust of mistakes must be raised. Those who are so thin-skinned that they cannot bear the dust' అంటారు. 'వెనక్కి తిరిగి తప్పులను తలపోసుకుంటూ కుమిలిపోకండి. వాటిని మీకు ఆశీర్వచనాలుగా భావించుకోండి. తప్పిదాలు అదృశ్య దేవతలు. ఈ జీవనపోరాటంలో పొరపాట్లనే దుమ్ము రేగవలసిందే! కానీ బేలహృదయాలు మాత్రమే ఆ ధూళికి తాళలేక విలవిల లాడిపోతాయ'ని స్పష్టం చేస్తారు.

**నిందలు... నిరాశలు :** జరిగిపోయిన తప్పుల కన్నా, వాటి తాలూకు జ్ఞాపకాలే మనల్ని చాలా నిరాశకు గురిచేస్తాయి. నిస్సత్తువను ఆవహింపజేస్తాయి. ఎవరెవరు, ఏమేమనుకుంటున్నారో? అనే ఆలోచనలు ఆందోళనకు గురిచేస్తాయి. కానీ ప్రపంచానికి మన పొరపాట్లను పట్టించుకునే తీరిక ఉండదు. ఒకవేళ ఆ క్షణాలకు అది చర్చనీయాంశమైనా, మరుక్షణం లోకం మనల్నీ, మన తప్పులనూ మరచిపోతుంది. వారి నిందలతో మనం నిరాశకు గురి కావలసిన అవసరం లేదు. 'అవును! తప్పు జరిగిపోయింది; దాన్ని దిద్దుకునే అవకాశం కూడా నాకే ఉంది' అని మనకు మనమే ధైర్యం నూరిపోసుకోవాలి. నిందించే లోకం నీకు తోడుగా ఉండదు; నీకు నీవే తోడూనీడ! తప్పుకు తలదించుకోవలసిన పని లేదు. అలా అని తలబిరుసుగా, అహంకారంగా తప్పిదాన్ని సమర్థించుకోవడమూ సరి కాదు. కానీ తప్పు ఎందుకు జరిగిందో విశ్లేషించుకొని, సమీక్షించుకొని సవరించుకోవాలి. అలా కాకుండా బేలగా విలవిల లాడిపోతే మనల్ని ఎవరూ కాపాడలేరు. అందుకే ఆంగ్ల మేధావి మార్క్‌ట్వెయిన్ 'మనం తప్పిదాల అనుభవం నుంచి అది నేర్పిన విజ్ఞతను మాత్రమే స్వీకరించాలి. లేకపోతే మనం వేడిపొయ్యి మీద కూర్చోబోయిన పిల్లిలా అయిపోతాం. ఆ పిల్లి భవిష్యత్తులో వేడిపొయ్యి మీద కూర్చోవడం అటుంచి, భయంతో ఆరిన పొయ్యి మీద కూడా కూర్చోదు' అంటారు. పొరపాట్లు జరుగుతాయేమో, నిందలు పడాల్సి వస్తుందేమోనన్న అపోహలతో అసలు ప్రయత్నమే మానుకుంటే మనం ఎందుకూ కొరగాకుండా పోతాం!

**సవరణ... సహకారం:** మన సహచరుల్లో, సహోద్యోగుల్లో, మన కుటుంబసభ్యుల్లో కానీ ఎవరి వల్లనైనా పొరపాట్లు జరిగితే వాటిని భూతద్దంలో చూస్తూ రాద్ధాంతం చేయకూడదు. ఆ వ్యక్తి అపరాధభావంతో కుమిలిపోయేలా ప్రవర్తించకూడదు. ముద్దాయిలా బోను ఎక్కించి, నిందలు, ప్రశ్నలు గుప్పించకూడదు. ఆ వ్యక్తి స్థానంలో మనం ఉండి ఆలోచించాలి. సంయమనంతో పరిస్థితిని చక్కదిద్దే ప్రయత్నం చేయాలి. ముఖ్యంగా నాయకుడిగా నలుగురినీ ముందుకు నడిపించాల్సిన వ్యక్తి, తండ్రిగా తన వారికి మార్గదర్శకత్వం వహించి తను ముందు నడవాల్సిన వ్యక్తి తన వారి తప్పులను సహృదయంతో మన్నించగలగాలి. మాటతో కన్నా మౌనంతో వారి మనస్సును మార్చగలగాలి. తాము పొరపాట్లు చేస్తే శ్రీరాముడు ఒక మాట అంటాడని కాకుండా, అన్నయ్య తనే మనస్సులో బాధపడుతూ తమతో మాట్లాడకుండా ఉంటాడేమోనని ఆ తమ్ముళ్ళు ఆలోచించేవాళ్ళట.

## పశ్చాత్తాపం...ప్రాయశ్చిత్తం



...తప్పు చేసిన ఆ క్షణాల్ని నేనెన్నడూ మరచిపోలేను. మా నాన్న మమ్మల్ని ఎప్పుడూ కొట్టలేదు. కానీ మేము దారి తప్పామని తెలిస్తే మా నాన్న కుంగిపోతారనే భయం, బాధే మేము క్రమశిక్షణలో ఉండేట్లు చేసేవి. ఏది ఏమైనా దోషం అంగీకరిస్తేనే బుద్ధి కలుగుతుందని ఆనాడు విశ్వసించాను. నేను దొంగతనం ఇంకెప్పుడూ చేయనని నా పశ్చాత్తాప లేఖను నాన్న చేతికి ఇచ్చినప్పుడు, వారి వేదనను గ్రహించాను. వారి ప్రేమాశ్రువులు నా హృదయాన్ని కడిగివేశాయి. రామబాణం మహిమ ఆ బాణం తగిలిన వాడికే తెలుస్తుంది. ఆ ఘట్టమే నన్ను సమూలంగా మార్చివేసింది. పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తమై నన్ను పునీతుణ్ణి చేసింది. చేసిన తప్పులను నేను ధైర్యంగా అంగీకరించాను. జీవితంలో మరెప్పుడూ అవి పునరావృతం కాకుండా జాగ్రత్తపడ్డాను. **- మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ**

అంత విశాలహృదయం రఘురాముడిది. అలా తమ వెంట నడిచే వారి తప్పులను సహృదయంతో సరిదిద్దగలిగి ఉండాలి.

ఎదుటివ్యక్తి చేసిన పొరపాటును నలుగురి ముందూ ఎత్తి చూపి, విమర్శిస్తే అతని పరిస్థితి మరింత దిగజార్చినవాళ్ళమవుతాము. వారు తమ తప్పును సవరించుకోవడం వదిలేసి, ఆ అవమానంతో మరింత కుంగిపోతారు. ఇలా మనతో కలసి పనిచేసే వారి తప్పిదాలను పరుషవాక్యాలతో చెణకుతూ ఉత్తమ ఫలితాలను రాబట్టలేం. అందుకే "పొరపాట్లు చేయడం మానవ సహజం. తప్పు చేసినవారిని విమర్శించడం సరి కాదు. తప్పుపట్టేవారిలో ఎందరు వారిని సరిదిద్దగలరు?" అని ప్రశ్నిస్తారు శ్రీశారదామాత. ❖

**(అక్టోబర్ 2వ తేదీ, 'మహాత్మాగాంధీ జయంతి')**



పొరపాట్లను సరిదిద్దుకోకుండా, వాటి గురించే చింతించడం పతనానికి దారి తీస్తుంది.
- స్వామి వివేకానంద

# ఓడినా గెలిచినట్లే!

- స్వామి అమర్త్యానంద

రామాయణంలో రావణాసురుడు, సీతాదేవిని అపహరించుకొని పోతున్న దృశ్యం జటాయువు దృష్టిలో పడింది. అపర లక్ష్మీదేవి అపహరణకు గురవుతోందని ఆ పక్షిరాజుకు అర్థమైంది. వెంటనే ఆకాశానికి ఎగిరాడు. రావణుడితో తన బలం సరితూగదని తెలిసినప్పటికీ అతణ్ణి అడ్డుకునేందుకు విశ్వ ప్రయత్నం చేశాడు. లంకాధీశుడు తన రెక్కల్ని తెగ నరుకుతున్నా, రక్తం కారేటట్లు హింసిస్తున్నా, తుది కంటా సీతాదేవిని రక్షించేందుకు విఫలయత్నం చేశాడు. చివరకు కొన ఊపిరితో నేల కూలిపోయాడు. ఆ తరువాత శ్రీరామచంద్రుడికి రావణుడి ఘాతుకాన్ని చెప్పి, ఆ భగవానుడి ఒడిలోనే ప్రాణాలు వదిలాడు.



ఈ సంఘటనలో జటాయువు ఓడినా, లోకం ఈనాటికీ, ఏనాటికీ దానిని 'పరాజయం' అని నిర్వచించదు. పైగా జటాయువు ప్రయత్న బలాన్నీ, పట్టుదలనూ రావణాసురుడి ప్రతాపం కన్నా ఎక్కువగా కొనియాడుతుంది. అలాగే మన జీవితంలో కూడా గెలుపు ఓటములు ప్రధానం కాదు. మనం ఎంత చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నామన్నదే ప్రామాణికం. ఆధునిక వ్యక్తిత్వ వికాస పరిభాషలో చెప్పాలంటే Winning is not a true benchmark of success in life. కానీ మనలో చాలామంది వైఖరి దీనికి భిన్నంగా ఉంటుంది. 'ఏం చేసి అయినా సరే, నా చేయే పైన ఉండాలి, ఎప్పుడూ నాదే గెలుపు కావాల'నే మొండిపట్టుదల అంత అభిలషణీయం కాదు.

**ఓటమి శాశ్వతం కాదు :** ఆధునిక సమాజంలో ప్రతి విషయంలోనూ పోటీభావం పెరిగిపోయింది. గెలవకపోతే లోకం మనల్ని నిష్ప్రయోజకులు అనుకుంటుందని చాలా మంది కుంగిపోతూ ఉంటారు. నిజానికి ఇవన్నీ భ్రమలే! ఎవరికీ ఓటమే శాశ్వతం కాదు. ఉదాహరణకు కుస్తీ పోటీల్నీ, వీధిగొడవల్నీ తీసుకోండి; రెండింటికీ చాలా తేడా ఉంటుంది. పైకి చూడడానికి రెండింటిలోనూ ఇద్దరూ పోటీపడుతూ ఉన్నట్లే కనిపిస్తుంది. కానీ కుస్తీ పోటీలకు కొన్ని నియమాలు, పద్ధతులు ఉంటాయి. పైగా ఆ పోటీల్లో బరిలోకి దిగే ఇద్దరూ ఒకరినొకరు ప్రత్యర్థులు గానే భావించుకుంటారు. శత్రువుల్లా ఒకరినిచూస్తే మరొకరు పగతో రగిలిపోరు. పరాజితులు, విజేతలపై వైరభావం పెంచుకోరు. వీధి గొడవల్లో అలా కాదు. పగలు, ద్వేషాలు, శత్రుత్వభావనలు జ్వాలల్లా చెలరేగుతూ ఉంటాయి.

మనం కూడా జీవితాన్ని ఎప్పుడూ ఒక ఆటలా, స్ఫూర్తిగా తీసుకోవాలే కానీ, వీధి పోరాటంలా మనస్సును కల్లోల పరచుకుంటూ తీవ్రమైన ఒత్తిడికి గురి కాకూడదు. పరీక్షలో కానీ, ఉద్యోగ అన్వేషణలో కానీ, మరే ప్రయత్నంలో కానీ అనుకోని ఫలితం ఎదురైనప్పుడు ఆ అనుభవాన్ని తలచుకుంటూ మనస్తాపానికి గురి కాకూడదు. If our interaction with the object of experience is harmonious, we are happy, light-hearted, and radiate goodwill towards others.. ఇలా ఆ చేదు అనుభవాన్ని కూడా సామరస్యంగా తీసుకుంటే ప్రశాంతంగా, నిర్మలంగా ఉండగలుగుతాం. నలుగురికీ ఆ ప్రశాంతతను ప్రసరింపజేయగలుగుతాం. అప్పుడు మనకు ఎంత ప్రతికూల ఫలితాలు సంభవించినా పరిసరాలు, పరిస్థితులు, వ్యక్తుల ప్రవర్తన మనల్ని నిరాశకు గురిచేయవు; ఉద్రేకపరచవు. పైగా మరోసారి మనం ఉత్సాహంగా ముందడుగు వేసి, ప్రయత్నాలను కొనసాగించేందుకు అనుకూల వాతావరణాన్ని సృష్టిస్తాయి.

**చలిస్తే చింతలే! :** ప్రతి చిన్న ఓటమికీ చలించిపోవడం మన స్వభావమైపోయింది. దాని వల్ల మనలో ఆత్మవిశ్వాసం సన్నగిల్లడమే కాకుండా, బాహ్యపరిస్థితులు కూడా ప్రతికూలంగా మారిపోతాయి. ఎదురైన అనూహ్య ఫలితాలకు మనం సామరస్యంగా ప్రతిస్పందించకపోతే మనస్సులో అసహనం, కోపం, ఈర్ష్య మొదలైన అనారోగ్యకరమైన భావనలు పుట్టుకొస్తాయి. అవి మనకే కాదు, ఎదుటివారికి కూడా వినాశకరమైన ప్రకంపనలను ప్రసరింపజేస్తాయి. ఒక్క మాటలో చెప్పాలంటే, If our interaction is non-harmonious, feelings of enmity, conflict, anger, jealousy and unhealthy competition arise in mind causing misery to ourselves and others. ఇలాంటి దుఃస్థితిలో మన చుట్టూ ఓ యుద్ధ వాతావరణం అలముకుంటుంది. ఓ శ్మశాన నిశ్శబ్దం ఆవరిస్తుంది. నిరాశ కమ్ముకొని ప్రతి ఒక్కరూ మనల్ని కిందికి లాగడానికి ప్రయత్నిస్తున్నారనిపిస్తుంది. అందుకే ఏదైనా అనుకోని ఫలితం సంభవించినప్పుడు ముందు మనం నిర్మలంగా ఉండాలి; పరిస్థితి మరింత అల్లకల్లోలం కాకుండా చూసుకోవాలి. అప్పుడే మనలో మరో కొత్త ఆశ చిగురిస్తుంది. గెలుపు పూలను పూయిస్తుంది. ❖



# మంచితనం మిగిలే ఉంది!

**- స్వామి రంగనాథానంద**

నేను ఒకసారి ఒక సభలో ప్రసంగించేందుకు ఇంగ్లండ్ వెళ్ళాల్సి వచ్చింది. ఆ దేశంలో పర్యటిస్తూ, ఒకరోజు లండన్ రైల్వేస్టేషన్‌లో దిగాను. అక్కడ నుంచి సమీప నగరానికి ట్యాక్సీలో ప్రయాణించాల్సి ఉంటుంది. అందుకే స్టేషన్ బయట ఉన్న ఓ ట్యాక్సీని పిలిచి, వెళ్ళాల్సిన చిరునామా చెప్పాను. ఆ ట్యాక్సీ డ్రైవర్ నేరుగా అక్కడికి తీసుకువెళ్ళాడు. నేను దిగి, డబ్బు ఎంతయిందని అడిగాను. వెంటనే ఆ ట్యాక్సీడ్రైవర్ 'క్షమించండి. నేను మీ దగ్గర డబ్బులేమీ తీసుకోలేను. మీరు నిస్వార్థంగా ఎంతో సేవ చేస్తున్నారు. మీలాంటి వారి వద్ద ప్రయాణ ఖర్చులు తీసుకోవడానికి నా మనస్సు ఒప్పుకోవడం లేదు' అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను. దేశం కాని దేశం; పైగా ఆంగ్లేయుడు! నేను బలవంతపెడుతూ 'ఫరవాలేదు! ఈ డబ్బులు నేనివ్వడం లేదు, నన్ను ఇక్కడకు అతిథిగా ఆహ్వానించిన వ్యక్తే ఇచ్చార'ని ఎంతో నచ్చజెప్పి, జేబులో పెడితే తప్ప తీసుకోలేదు.

నాకు అతను ఎవరో పరిచయం లేదు. అతను నా ప్రసంగాలూ వినలేదు. అతని విశాలహృదయం చూసి మనస్సు కదిలిపోయింది. మనమంతా ఒక్కటే. మనల్ని అందరినీ కలిపే మానవీయ సూత్రమేదో ఒకటుందని గుర్తించాడతడు! అందుకే నా విషయంలో అలా స్పందించాడు. అదే విధంగా ఇటలీలో ఓ మారు పర్యాటక ప్రాంతానికి వెళ్ళాల్సి వచ్చింది. నేను అక్కడకు వెళ్ళేసరికి, ఎవరో నా కోసం హోటల్‌లో డబ్బులు కట్టి, గదిని కేటాయించి అట్టి పెట్టారు. నేను హోటల్‌కు వెళ్ళగానే మేనేజర్ నా దగ్గరకు వచ్చి 'స్వామీజీ! ఫలానా గది మీ కోసం కేటాయించాం. స్థానికంగా ఓ ప్రముఖమైన వ్యక్తి ఈ గది అద్దెను చెల్లించారు' అన్నాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ వ్యక్తికి నేనెవరో కూడా తెలియదు. అయినా ఎదుటి వ్యక్తి ఒక మంచిపని చేస్తూ ఉంటే, మన వంతు సహకారం అందించాలన్న, మనమంతా ఒక్కటేనన్న స్పృహ వారిలో కనిపించింది. ఇలా నాకు మన దేశంలోనే కాదు, ఇతర దేశాల్లో కూడా ఇలాంటి సౌజన్యమూర్తుల అనుభవాలు ఎన్నో ఉన్నాయి. అందుకే సమాజంపై, తోటి మానవులపై విశ్వాసాన్ని కోల్పోకూడదు.

**మనమంతా ఒక్కటే... :** అనాది నుంచి కూడా భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించడం భారతదేశంలో పరంపరగా వస్తున్న ఆనవాయితీ! మతపరంగా, సంస్కృతిపరంగా ఎవరు ఎంత వైవిధ్యంగా ఉన్నా మౌలికంగా అందరిలోని ఆత్మస్వరూపం ఒక్కటేనన్న భావనతో, భ్రాతృత్వదృష్టితో అందరికీ సహాయపడుతూ ఉండడం మన సనాతన ధర్మం. అందుకే నిరంతరం భిన్నత్వం వెనుకనున్న ఏకత్వాన్ని దర్శించడానికి ప్రయత్నం చేయాలి. సాటి మనిషిపై నమ్మకాన్ని పెంచుకోవడం అలవాటు చేసుకోవాలి. మన సాంస్కృతిక, సామాజిక విధానాలన్నీ కూడా ఒక ప్రాంతాన్నీ, దేశాన్నీ దాటుకొని, 'వసుధైక కుటుంబకం' అన్న విశాలత్వం వైపు విస్తరించాయి. మన మహర్షులు ఉపనిషత్తుల ద్వారా ఈ ఏకత్వాన్నే ప్రబోధించారు. మన వేదాంతం కూడా ఈ భిన్నత్వాలన్నిటి నడుమ, ఆ భగవంతుడు అంతర్యామియై అందరినీ ఒక సూత్రంలా అనుసంధానం చేస్తూ ఉన్నాడని స్పష్టం చేస్తోంది. ఆ సూత్రమే సౌజన్యం! భగవంతుడి లాగే మంచితనం, సౌజన్యం కూడా శాశ్వతం! నాస్తికులు, ఆస్తికులు, హిందువులు, ముస్లిమ్‌లు, క్రైస్తవులు - ఇలా ఎవరైనా కావచ్చు. కానీ అందరిలోని అంతరాత్మ, అంతర్యామి మాత్రం ఆ భగవంతుడే! అందుకే అందరిలోనూ ఎంతో కొంత ఆ మహత్వం ప్రతిఫలిస్తూనే ఉంటుంది.

**మరింత మారాలి.... :** శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు *'మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ'* అంటాడు. మణులను సూత్రం కట్టి ఉంచినట్లు నేను ఈ సృష్టి యావత్తునూ కట్టి ఉంచానని గుర్తుచేస్తాడు. ఈ ఆధ్యాత్మిక భావనతో మనం ముందుకు నడవాలి. అంతర్జాతీయ వ్యవహారాలలో మనం కొంత ఉదారతతో, విశాలత్వంతో మసలుకుంటూ ఉన్నాం. కానీ, స్వదేశంలో సాటి మనిషి విషయంలో కొన్నిసార్లు ఇంకా సంకుచితంగానే ప్రవర్తిస్తూ ఉన్నాం. పక్క వ్యక్తిని సోదరుడిలా భావించుకొని ఆదుకోవడం మరచిపోతున్నాం. ఈ పరిస్థితిలో మరింత మార్పు రావాలి. సమాజంలో ఏ ఒక్కరినీ వేరుగా చూడకూడదు. ..spiritually absolute unity is there. The same spiritual reality is in all of us. Therefore, let us live in peace with each other. Expand this 'I'. Expand it, feel one with all. That is the first stage of human development. And the last stage is, renounce that 'I' once for all. ఆధ్యాత్మికంగా మనందరమూ ఒక్కటే! ఈ ఒక్క పరమసత్యం తెలుసుకుంటే ఒకరికొకరం సామరస్యంగా జీవించగలం. అందులో భాగంగా ఈ 'నేను' అన్న భావాన్ని విస్తరింపజేసుకుంటే, అందులో అందరికీ చోటు లభిస్తుంది. ఇదే మానవాభివృద్ధికి తొలిమెట్టు. చివరకు అందరి సంక్షేమం కోసం పాటుపడే ప్రస్థానంలో అహంతో కూడిన 'నేను' కూడా అంతర్ధానమైపోతుంది. ❖ **సేకరణ : ఆర్.కృష్ణ**

అపజయాలను లక్ష్యపెట్టవద్దు; అధైర్య పడవద్దు. అవి జీవితానికి అలంకారాలు. అవి లేకుండా జీవిత మేమిటి? ఆ పోరాటాలే లేకుండా ఉంటే, ఈ జీవితానికి ప్రయోజనం శూన్యం. - *స్వామి వివేకానంద*



# శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమ

(ప్రధాన కార్యాలయం- రామకృష్ణమఠం & మిషన్, బేలూరు మఠం')

పోస్ట్- కాలడి, ఎర్నాకుళమ్-683 574, కేరళ. ఫోన్ 0484-2462345, మొబైల్ 09447051231,
Email: srkaadv@dataone.in

శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం అయిదు నుంచి పదోతరగతి వరకు చదువుతున్న నిరుపేద, అనాథ విద్యార్థుల కోసం 1936 నుంచి ఉచిత వసతి గృహాన్ని నిర్వహిస్తూ ఉంది. వీరికి వసతి, ఆహారం, దుస్తులతో పాటు పదోతరగతి వరకు ఉచితంగా విద్యను కూడా బోధించే బాధ్యతను ఆశ్రమమే తీసుకుంది. ఆశ్రమ ప్రాంగణంలోనే వారికి పాఠశాలను నిర్మించి, నిర్వహించడం జరుగుతోంది.

ఈ నేపథ్యంలో ప్రస్తుతం ఆశ్రమంలోని వసతి గృహ భవనాల మరమ్మతులకు, పునర్నిర్మాణానికి, నూరు మంది విద్యార్థులుగల వసతిగృహ నిర్వహణకు రెండు కోట్ల రూపాయలతో 'వసతిగృహ శాశ్వతనిధి' ఏర్పాటు చేయాల్సివుంది.

సహృదయులు ఈ విద్యాపథకం నిరాఘాటంగా కొనసాగేందుకు చేయూతనివ్వాల్సిందిగా కోరుతున్నాం.

ఆశ్రమ కార్యకలాపాల కోసం అందజేసే విరాళాలకు 80జి సెక్షన్ కింద ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

మీ విరాళాన్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady, పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా విరాళాలను నేరుగా మా బ్యాంకు అకౌంట్‌కు కూడా పంపే సౌలభ్యం ఉందని తెలియజేస్తున్నాం. మీరు విరాళాలను RTGS/ NEFT ద్వారా మా యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కాలడి, అకౌంట్ నెంబరు 338602010009164, (IFSC Code : UBIN 0533866)కు నేరుగా పంపవచ్చు.

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,




# SINDHOORI SURGICALS

(For Plastic Surgery & Stockings)

**H.O : Plot No : 272, Singareni Colony, Saidabad, Hyderabad - 500 079**
**Ph : 040- 24071580, Cell : 9848021180**

**Shop No : 15, Ground Floor, 6-3-666/B/6, Gokul Towers, Panjagutta, Hyderabad - 82. Ph : 040- 40121180, 23411180, Fax : 23401880**

Email : sindhoorisurgicals@gmail.com www.sindhoorisurgicals.org

**1. ELASTIC STOCKINGS :**

Used For Varicose Veins, DVT, Oedema, Lymphoedema & Filariasis, CVI.

CCL.1 - 18-21 mm of Hg
CCL.2 - 23-32 mm of Hg
CCL.3 - 34-46 mm of Hg

a. Graduated Compression.
b. Medical Stockings.
c. Customade Stockings
d. Sigvaris, Medi, Ted.

**2. HEALTH FOOT PRODUCTS :**

- MCP/MCR. Chappals,
- Sandals
- Shoes
- Silicon heel Cups
- Full Length Silicon Insoles

**3. HEALTH CARE PRODUCT :**

- LS Belt
- Back Rest
- Knee Cap
- Wrist Support
- Ankle Support
- Derma Colour

Advt.,



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గాచీ,

ప్రియమైన సనాతన్!*

13–9–1958

నీ లేఖ అందింది. చాలా ఆనందించాను. శ్రీరామకృష్ణులను గురించి మీ తల్లితండ్రులు ఏమనుకుంటున్నారో వ్రాసి ఉంటే మరింత ఆనందించేవాణ్ణి. ప్రాణం కన్నా మిన్నగా తాము చూసుకుంటున్న ఒక కుమారుణ్ణి భగవత్ సేవ నిమిత్తం ఇచ్చివేయవలసి వస్తే మీ తండ్రి ఆలోచన ఎలా ఉంటుందో తెలుసుకోవాలని ఉంది. అశోక చక్రవర్తి తన కుమారుణ్ణీ, కుమార్తెనూ కూడా బౌద్ధమతం స్వీకరించి సన్న్యసించేందుకు పంపాడు. మీ నాన్నగారు నిన్ను శ్రీరామకృష్ణుల పాదసేవకై పంపిస్తే భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుంది.

భగవంతుని మాటల్లో నీకు విశ్వాసం ఉందా? నీవు భగవత్ చింతనలో అనన్యంగా మునిగిపోయి ఉంటే 'యోగ క్షేమం వహామ్యహమ్' అన్న తన అభయ వచనాన్ని ఆ పరమాత్మ నిలుపుకోడంటావా? నీ తల్లితండ్రుల క్షేమం అనే చిన్న బాధ్యతను శ్రీరామకృష్ణులు నెరవేర్చరని నీ సందేహమా? నీ హృదయాంతరాళం నుండి వినిపిస్తున్న భగవద్వాణిని జాగ్రత్తగా ఆలకించు. నీ హృదయపులోతుల్లో హరినామం ప్రతిధ్వనిస్తూ అలజడి చేస్తుంటే నీ తల్లితండ్రులకు ఏదోలా నచ్చజెప్పి వచ్చేసెయ్! వైకుంఠధామం వైపుగా సాగే నీ ప్రయాణంలో ఏ అవరోధమూ నిన్ను అడ్డుకోలేదు. భగవంతుడే కావాలి అని దృఢచిత్తంతో కోరుకొనేవాడిని ఎవరడ్డుకోగలరో చెప్పు? విశ్వంలోని సమస్త శక్తులూ నీకు సహకరిస్తాయి. భౌతిక ప్రపంచం నుండి మనస్సును మరల్చి, ఆ పరమాత్మ యందే సంపూర్ణంగా లగ్నం చేసి, హృదయపూర్వకంగా ఆయనను ప్రార్థిస్తే అన్ని సమస్యలకూ పరిష్కారం లభిస్తుందని తెలుసుకో.

కొందరంటుంటారు – "రామకృష్ణ సంఘంలోని వారంతా పనిలోనే మునిగిపోతారు" అని! కానీ, వారలా మాట్లాడడానికి కారణం – ఈ సంఘం పట్ల వారికి పూర్తి అవగాహన లేకనే సుమా! ఇదేదో మరొక కొత్త ఆధ్యాత్మిక శాఖ కాదు. ఈ విశ్వం ఆవిర్భవించింది మొదలు సనక సనందనాది ఋషుల కాలం నుండీ శిష్యపరంపరగా మానవ జాతి ముక్తి కోసం పాటుపడుతూనే ఉన్నారు. ఈ సంఘంలోని ప్రతి సభ్యుడూ కేవలం కర్మయోగి మాత్రమే కాదు. అనంతర కాలంలో అది నీవు తెలుసుకుంటావు.

ఆధ్యాత్మిక మార్గాన్నే అనుసరించాలని నీవు కోరుకుంటూ ఉంటే కాలం వృథా చేయకు. కనీసం ఒక్క సంవత్సర కాలం నువ్వు ఇక్కడ పనిలోనూ, అధ్యయనంలోనూ, ధ్యానంలోనూ, భగవత్ చింతనలోనూ గడిపావంటే నీ హృదయరాగం మాధుర్యాన్ని సంతరించుకుంటుంది. నారబట్టలు ధరించో, చెట్టుబెరళ్ళు కట్టుకొనో నీవు ఓ పరివ్రాజకునిలా తిరగవలసిన పని లేదు. ప్రస్తుతం ఒక నియమిత దినచర్యను ఏర్పరచుకొని నీకు నీవే ఆత్మ పరిశోధనలో ఉండలేవా? ఇలా ఒకటి రెండేళ్ళు ఆచరించు. ఒక స్థిర నిర్ణయానికి వచ్చాక నీ విద్యార్థి దశను వదలి గృహస్థుని గానో, సన్న్యాసి గానో రూపొందవచ్చు. వేదాల్లో సనాతనంగా చెప్పిన మార్గం ఇదే. రామకృష్ణ సంఘం కూడా ఇదే మార్గదర్శకాలపై ఆధారపడి నడుస్తోంది.

ఇక్కడ నువ్వు నివసించడానికి అన్ని విధాలా సౌకర్యంగానే ఉంటుంది. నీ తల్లితండ్రులను ఎప్పుడైనా చూడాలనిపించినా, వారికి నిన్ను చూడాలనిపించినా వెళ్ళి చూసిరావచ్చు. ఈ విషయంలో నీకింకా ఏమైనా సందేహాలుంటే చెప్పు. నీ తల్లితండ్రుల్లా మేమూ నీ శ్రేయాభిలాషులం కామా? నిన్ను ఇక్కడకు రప్పించుకోవడానికి మేమేమన్నా పన్నాగం పన్నుతున్నామా? శాస్త్రవచనాన్ని మాత్రమే మేము అనుసరిస్తామని నీకు బాగా తెలుసు. సందేహాలను వదలి నీవు త్వరగా ఇక్కడకు వస్తే నీకూ, నీ స్నేహితులకూ కూడా ఎంతో మేలు.

ప్రేమాశీస్సులతో

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**స్వామి ప్రేమేశానంద**

(*స్వామి సుహితానందజీ మహరాజ్ ప్రస్తుతం రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శిగా సేవలందిస్తున్నారు. స్వామి ప్రేమేశానంద మహరాజ్‌కు పది సంవత్సరాల పాటు శుశ్రూషలు చేశారు.)



నిర్దుష్టమైన సంకల్పంతో నిన్ను నువ్వు అనుసంధానించుకొని, వికాసం కోసం ప్రయత్నించు. హృదయానికీ, మేధస్సుకూ వైరుధ్యం కలిగినప్పుడు హృదయాన్నే అనుసరించు. - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి.)



ఈ పదకవితా పితామహుడు. అదేవిధంగా 'నాకు వృద్ధాప్యం దాపురించింది; అప్పటిలా నిన్ను స్వయంగా వచ్చి దర్శించుకునే శక్తి లేదు స్వామీ!' అని తొండమాన్ చక్రవర్తి వేడుకొనగానే, నమ్మకంతో సాక్షాత్తూ తనే కదిలివెళ్ళాడు. పైగా ఒకమారు శత్రురాజులను ఓడించి మరీ తొండమాన్‌ను గెలిపించుకున్నాడు. ఇలా శ్రీనివాసుడైనా, శ్రీరాముడైనా ప్రేమకే లొంగిపోయారు. శబరిది ఏ కులమో, గుహుడిది ఏ జాతో రఘురాముడు చూడలేదు. వారి ఆత్మీయతకే ఆయన ప్రాధాన్యమిచ్చాడు. అందుకే భక్త రామదాసు...

**దాసిన చుట్టమా శబరి దాని దయామతి నేలినావు, నీ**
**దాసుని దాసుడా గుహుడు తావకదాస్య మొసంగినావు నే**
**చేసిన పాపమో! వినుతి చేసిన కావవు, కావుమయ్య నీ**
**దాసులలోన నేనొకడ దాశరథీ కరుణా పయోనిధీ!** (దాశరథి శతకం)

'ఓ రామయ్యా! నీకు శబరి దగ్గరి చుట్టమా? కాదే! మరి అలాంటి శబరి యెడ దయచూపి, ఆమె ఇచ్చిన ఎంగిలి పండ్లను తిని, ఆమెకు మోక్షాన్ని ఇచ్చావు. గుహుడు నీ దాసుడా? కాదే! మరి అలాంటి గుహునికి నీ సేవ చేసే అదృష్టాన్ని కలిగించావు. నేను ఏ పాపం చేశానో కానీ ఎంత ప్రార్థించినా నన్ను మాత్రం కాపాడకున్నావు. నేను కూడా నీ సేవకులలో ఒకడినే. నన్ను దయతో కాపాడమ'ని వేడుకుంటాడు.



### మన్ను మోసినవాడు...

అనంతాళ్వార్ అంటే అనంతాచార్యులు. అతడు కొండపై శ్రీవేంకటేశ్వరస్వామికి పూలతోట వేసిన భక్తుడు. ఆ పూలతోటలో నీళ్ళ కోసం ఓసారి ఆ పరమభక్తుడు బావి తవ్వుతున్నాడు. నిండుచూలాలైన అతని భార్య కూడా తవ్విన మట్టిని తట్టలో పెట్టుకొని కొంచెం దూరంలో పారేస్తూ, భర్తకు సహకరిస్తోంది. స్వామి ఆమె కష్టాన్ని చూసి కరిగిపోయాడు. తనూ ఓ చిన్న బాలుడిలా మారాడు. ఆవిడ చేతిలో నుంచి తన చిట్టిచేతులతో మట్టితట్టను మోస్తూ, పారవేస్తూ సహాయం చేశాడు. ఆ సన్నివేశాన్ని సాక్షాత్కరింపజేస్తూ అన్నమయ్య....

**అచ్చుపువేడుక తోడ అనంతాళువారికి**
**ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు**
**మచ్చిక దొలక తిరుమలనంబి తోడుత**
**నిచ్చనిచ్చ మాటలాడి నొచ్చినవాడు...** అంటున్నాడు. అలాగే, స్వామి సేవలోనే తరిస్తూ ఉండిన వృద్ధ భక్తుడు తిరుమలనంబి. అతను పాపనాశనం నుంచి నీళ్ళు తెచ్చి రోజూ శ్రీవారికి అభిషేకం చేస్తూ ఉండేవాడు. అతని శ్రమను ఎలాగైనా తగ్గించాలని శ్రీనివాసుడు సంకల్పించుకున్నాడు. ఒకానొక రోజు బాలుడి రూపంలో తిరుమలనంబికి ఎదురుపడి, నీళ్ళ కుండలు పగులగొట్టాడు. తనను పట్టుకోవడానికి వెంటబడిన తిరుమల నంబిని ఆకాశగంగ వరకు పరుగు తీయించాడు. తీరా అక్కడకురాగానే మాయమయ్యాడు. పాపనాశనం కంటే ఆకాశగంగ దగ్గరనీ, అక్కడి నుంచి అభిషేకానికి నీళ్ళు తెచ్చుకొమ్మనే సందేశాన్ని తిరుమలనంబికి బాలుడి రూపంలో స్వామి తెలియజెప్పాడు. ఆప్తమిత్రుడైన కుచేలుడి ముందు తన అంతరంగాన్ని ఆవిష్కరిస్తూ, ఓ మారు శ్రీకృష్ణభగవానుడు కూడా భక్తి ప్రాధాన్యం వివరిస్తూ...

**...నీచ వర్తనుండై మద్భక్తి తగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యంబైన పదార్థంబు నొసంగిన, అది నా మనంబునకు సమ్మతంబు గాదు.... దళమైన పుష్పమైనను, ఫలమైనను సలిలమైన బాయని భక్తింకొలిచిన జనులర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె నేను భుజింతున్'**

'నాపై భక్తి లేని నీచుడు మేరుపర్వతమంత పదార్థం ఇచ్చినా అది నాకు అంగీకారం కాదు. పత్రమైనా, పుష్పమైనా, జలమైనా, ఫలమైనా సరే నిశ్చలభక్తితో నాకు సమర్పిస్తే దాన్ని మధురాన్నంగా భావించి ఆరగిస్తాను' అని స్పష్టం చేస్తాడు.

### మంచివాడై పాలించేవాడు...

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఓ భక్తుడి ఆహ్వానం మేరకు ఆయన ఇంటికి వెళ్ళారు. కానీ అది చాలా సాధారణ గృహం. అతిథులకు ఎలా మర్యాద చేయాలో తెలియని కుటుంబం ఆ భక్తుడిది. అతిథులను ఇంట్లో ఓ మూలన కూర్చోపెట్టారు. చోటు కూడా శుభ్రంగా లేదు. అయినా శ్రీరామకృష్ణులు దయాసింధువు. భక్తుడైన ఆ ఇంటి యజమాని పిన్న వయస్కుడు. సముచిత మర్యాద చేయాలన్న సంగతి అతనికి తెలియదని గ్రహించి, కోపం తెచ్చుకోకుండా సర్దుకొని, భోజనం చేసి వాళ్ళను సంతృప్తిపరిచారు.

వేంకటేశుడి భక్తుడైన తిరుకచ్చినంబి తిరుమలకు దూరంగా కంచిలో ఉండేవాడు. అక్కడ అతడు కంచి వరదరాజ స్వామికి పూల కోసం తోటలోకి వెళ్ళాడు. కానీ తోటలో ఒక్క పూవు కూడా కనిపించలేదు. ఇంతలో ఒక గుఱ్ఱం మీద ఉన్న ఒక మహాపురుషుడు 'పూలు కావాలా?' అంటూ తిరుకచ్చినంబిని తిరుమల దాకా తీసుకుపోయాడు; మూలవిరాట్టులో కలసిపోయాడు. అలా కంచిస్వామి, తిరుమలవాసుడు ఒక్కడేనని తిరుకచ్చినంబి తెలుసుకొని అప్పటి నుంచి కొండపైనే ఉండిపోయాడట! ఆ ఘట్టాన్ని గుర్తుచేసు కుంటూ అన్నమాచార్య...

**కంచిలోన నుండ తిరుకచ్చినంబి మీద కరు**
**ణించి తనయెడకు రప్పించినవాడు**
**యెంచనెక్కుడైన వేంకటేశుడు మనలకు**
**మంచివాడై కరుణ పాలించినవాడు ॥** అంటున్నాడు.

అంతటి ఆ కొండదైవం మనసారా మనకు అండగా నిలిచి కరుణిస్తాడని స్వామి పక్షాన అభయమిస్తున్నాడు అన్నమయ్య. ❖

# యువవాణి

- స్వామి పరిజ్ఞేయానంద

**ఉంటుందనీ, సర్వసమస్యలకు పరిష్కారం విద్యయే' అనీ స్వామి వివేకానంద భారతీయుల్ని మేల్కొల్పారు. కానీ నేడు సమాజంలో పెరుగుతున్న అన్ని అరాచకాలకూ, అవినీతికీ అధికశాతం విద్యావంతులే కారణమన్నది అందరికీ తెలిసిన విషయమే! 'విద్య' సత్ఫలితాలను ఇవ్వకపోవడానికి కారణాలేమిటి? పరిష్కారాలేమిటి?**

**జవాబు:** 'దివా పశ్యతి నోలూకః కాకో నక్తం న పశ్యతి, విద్యా విహీనో మూఢస్తు దివా నక్తం న పశ్యతి-గుడ్లగూబ పగలు చూడలేదు, కాకి రాత్రి చూడలేదు. విద్యావిహీనులు రాత్రీపగలూ చూడలేరు' అన్నది ఒకనాటి సూక్తి. కానీ నేడు విద్యావంతులే రాత్రీపగలూ చూడలేకపోతున్నారనడానికి ప్రస్తుత సమాజ పరిస్థితి అద్దంపడుతోంది.

నేడు విద్యవల్ల ఆర్థికశక్తి పెరిగింది, కానీ అంతశ్శుద్ధి తగ్గింది; విజ్ఞాననిధి పెరిగింది, కానీ విలువల నిధి తరిగింది; మేధస్సు వికసించింది, కానీ మనస్సు కుంచించింది. స్వామి వివేకానంద ఆశించింది ఇలాంటి విద్య కాదు.

The education which does not bring out strength of character, a spirit of philanthropy, and the courage of a lion- is it worth the name? *- Swami Vivekananda*

'శీలసంపద లేని నిస్తేజుల్నీ, దాతృత్వం లేని స్వార్థపరుల్నీ, ధైర్యస్థైర్యాలు లేని నిర్వీర్యుల్నీ తయారు చేసే విద్య, విద్యయే కాద'ని స్వామీజీ విస్పష్టం చేశారు.

ఆనాడు భీష్ముడు 'ఆత్మస్థైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ, నైతిక విలువల్నీ పెంపొందించేదే నిజమైన విద్య' అని నిర్వచించాడు. ఈనాడు స్వామి వివేకానంద కూడా 'మానవత్వాన్ని పెంచేదీ, శీలసంపదను పెంచేదీ నిజమైన విద్య' అని పునరుద్ఘాటించారు.

ఆనాటికీ, ఈనాటికీ, ఏనాటికైనా విద్య అంటే 'మానసిక పరివర్తన, పరిశుద్ధతలను పెంపొందించేదే విద్య గానీ, కేవలం పట్టాలను, పతకాలను తెచ్చిపెట్టేది మాత్రం కాదు' అన్నది నిత్య సత్యం.

సమాజంలో పెరుగుతున్న అకృత్యాలకూ, అరాచకాలకూ, అన్యాయాలకూ కారణాలు ఏడు విధాలని మహాత్మాగాంధీ చెప్పారు: 1. కష్టార్జితంకాని సంపాదన 2. అంతరాత్మకు విరుద్ధంగా అనుభవించే సుఖాలు 3. శీలనిర్మాణానికి తోడ్పడని విద్య 4. నిజాయతీ లేని వ్యాపారాలు 5. మానవత్వం లోపించిన విజ్ఞానం 6. మమతల్ని పెంచని మతాలు 7. నియమ నిబంధనల్లేని రాజకీయాలు.

విద్య, వైద్య, వ్యాపార, వ్యవసాయ, పారిశ్రామిక, పాలక, రాజకీయ, ఆధ్యాత్మిక -ఇలా ఏ రంగాల్లోనైనా ఏర్పడే సమస్యలకు ప్రధాన కారణం 'స్వార్థం'. అందుకే స్వామి వివేకానంద 'స్వార్థమే అన్ని అనర్థాలకు మూలకారణం' అని అన్నారు.

ఈ స్వార్థభావం పోవాలంటే 'త్యాగం-సేవలే మన జాతి ...' అన్న స్వామి వివేకానంద ప్రబోధాన్ని ఆచరణాత్మకం ... త్యాగం-సేవ అనే ఈ రెండు తీరాల మధ్య 'విద్య' అనే ...హించాలి. అప్పుడే సమాజంలోని అరాచకాలన్నీ అంత... అందుకు మన సనాతన సారస్వతాన్ని అధ్యయనం ... మన సంస్కృతి సంప్రదాయాల ఔన్నత్యాన్ని తెలుసు... మన మహాత్ముల మహోన్నత జీవిత విశేషాలను చదవాలి. ...తం మన విద్యావిధానంలో పాశ్చాత్య సంస్కృతిని ...స్తూ, మన ప్రాచీన సంస్కృతిని విస్మరించడం వల్ల విద్యార్థుల్లో సనాతన సారస్వతంపట్ల అవగాహన కొరవడుతుంది. యముణ్ణి సైతం ఆశ్చర్యపరిచిన నచికేతునిలోని **శ్రద్ధ**; విష్ణువును సైతం మెప్పించిన ధ్రువుడిలోని **దృఢసంకల్పం**; ఒక మూగజీవి ప్రాణాలను కాపాడడానికి తన ప్రాణాలను సైతం అర్పించడానికి సిద్ధమైన బుద్ధుడిలోని **కరుణ**; యుద్ధభూమిలో వేలాది మంది మరణించిన సైనికులను చూసి, హృదయం ద్రవించిన అశోక చక్రవర్తిలో ఉదయించిన **అహింస**; తనకు అత్యంత అవసర




మైనప్పటికీ ప్రజలకు పంపిణీ చేయాల్సిన వస్తువులను స్వప్రయోజ నానికి ఉపయోగించుకోని చాణక్యునిలోని **నిజాయతి**; జీవితంలో ఎలాంటి పరిస్థితుల్లోనూ సత్యాన్ని వీడకు అన్న తల్లి భువనేశ్వరిదేవి మాటలను జీవితాంతం ఆచరించిన స్వామి వివేకానందలోనూ, సత్యవాక్పరిపాలనకై సర్వస్వాన్నీ కోల్పోయిన హరిశ్చంద్రుణ్ణి ఆదర్శంగా చేసుకొని జీవించిన మహాత్మాగాంధీలోనూగల **సత్యనిష్ఠ** - ఇలా ఎందరో మహాత్ములు ఆచరించిన నైతిక జీవన విధానాన్ని విద్యార్థులు అలవరచుకునే దిశగా మన విద్యావిధానం కొనసాగాలి. అందుకు తల్లితండ్రులు, ఉపాధ్యాయులు పిల్లలకు చిన్నప్పటి నుండే విలువల ప్రాధాన్యాన్ని తెలియజేయాలి.

నేడు తల్లితండ్రుల్లోనూ, ఉపాధ్యాయుల్లోనూ విద్య అంటే మానవత్వం వికసింపజేసేదిగా ఉండాలన్న దృక్పథం కలుగుతోంది. విలువలతో కూడిన వ్యక్తులుగా తీర్చిదిద్దాలన్న ఆకాంక్ష పెరుగుతోంది. ఈ నేపథ్యంలో నేడు విద్యాసంస్థలు, స్వచ్ఛంద సంస్థలు -తల్లితండ్రుల సదస్సులూ, ఉపాధ్యాయుల సదస్సులూ, విద్యార్థుల సదస్సులూ నిర్వహిస్తూ ఉండడం ఓ శుభ పరిణామం. ఆ దిశగా అందరూ కలిసికట్టుగా కృషిచేస్తే నైతికవర్తనుల సంఖ్య పెరిగి సమాజంలోని అనైతికత, అనర్థాలు, అరాచకాలు అంతరించి పోతాయి. ఆ శుభతరుణం మరెంతో దూరంలో లేదన్న ఆశావహ దృక్పథంతో ముందుకు సాగుదాం. ❖

ధనం వల్ల, పేరు ప్రతిష్ఠల వల్ల, విద్య వల్ల ఎటువంటి ప్రయోజనం లేదు. మంచిశీలం మాత్రమే దుస్సాధ్యమైన కష్టాల అడ్డుగోడల్ని పగులగొట్టుకొని, ముందుకు చొచ్చుకుపోతుంది. - స్వామి వివేకానంద





- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# వైరాగ్యమే మహాభాగ్యం

'ఇంద్రియార్థేషు వైరాగ్యం' - ఇంద్రియ విషయాల పట్ల విరాగం. మరోమాటలో చెప్పాలంటే, బంధం లేకుండడం! 'రాగము' అంటే బంధం. అన్ని రకాల మానసిక బంధాల నుండి విడివడి, స్వేచ్ఛగా ఉన్న వ్యక్తిని 'విరాగి' అంటారు. ఇంద్రియ విషయాల పట్ల ఎలాంటి బంధం కానీ, ఆకర్షణ కానీ లేకపోవడాన్ని 'వైరాగ్యం' అంటారు. విషయాలు ఆకర్షణీయంగా, ప్రేరేపించేవిగా, ఉద్రేకపరిచేవిగా, ఉద్వేగం కలగజేసేవిగా ఉండగా, వాటి ఆకర్షణ నుంచి ఎలా తప్పుకోగలం? అలా చేయగలమా? ఆ పని చేసే ముందు ఇంద్రియాలు గానీ, మనస్సు గానీ మన అనుమతినేమీ తీసుకోవు. అలాంటి గందరగోళ పరిస్థితులలో, ప్రలోభాల మధ్య ఉన్నప్పుడు వైరాగ్యం ఎలా వస్తుంది? కానీ దానికొక మార్గముంది.

'దోషదర్శనం' లేక 'ఇంద్రియ విషయాలలోని దోషాలను చూడడం' అనే ప్రత్యేకమైన భావన ద్వారా వైరాగ్యాన్ని పెంపొందించుకోవచ్చు. ఇంద్రియ విషయాలలో దోషాలను చూడడమంటే, అవి అందించే సుఖం, ఉద్వేగాలకు విలువ కట్టడమే! ఆ విలువలు ఎలాంటివో తెలిసిందే!

ఇంద్రియ సుఖాలను అనుభవించేటప్పుడు తాత్కాలికంగా మన కష్టాలు, దుఃఖాలు, నిరాశా నిస్పృహలు తొలగిపోయినట్లు అనిపిస్తుంది. ఒక విధమైన ఉద్వేగ భావనతో మన సమస్యలు ఏ మాత్రమూ పరిష్కృతం కాకపోయినా, వాటిని మరచిపోతాం. 'మత్తుపదార్థాలు' కూడా సరిగ్గా ఇదే పని చేస్తాయి. మత్తుపదార్థాలలో ఉన్న రసాయన పదార్థం ద్వారా మన నాడీ మండలం ఉద్రిక్తమై, మొద్దుబారుతుంది. స్పర్శజ్ఞానం కోల్పోతుంది. అప్పుడు అన్ని ఆలోచనలూ మన నుంచి అదృశ్యమవుతాయి. అదే విధంగా, ఇంద్రియ సుఖాల అనుభవంలో కూడా మత్తుమందు తీసుకున్నవారిలా అవి కలిగించే ఉద్రేకానికి బానిసలమై, జీవితంలోని ముఖ్యవిషయాలను వదిలివేస్తాం.

ఏదైనా ఒక విషయంలో ఆనందానుభూతి పొందుతున్నప్పుడు, అది అనుకూల, ప్రతికూల ఫలితాలను కలగజేస్తుంది. ఇంద్రియ విషయాలలో భోగిస్తున్నప్పుడు, అది మనకు ఆనందాన్నిచ్చి మన సమస్యలను మరిపింపజేసి, మంచి అనుభూతినిస్తుంది. అప్పుడు దాన్ని చాలా అనుకూలమైనదిగా భావించి, దాని పట్ల బంధం (రాగం) పెంచుకుంటాం. మనకు దుఃఖకరమైన అనుభూతి కలిగించే విషయాన్ని ప్రతికూలమైనదిగా భావించి, దాని పట్ల అనిష్టం (ద్వేషం) ఏర్పరచుకుంటాం.

అలాంటి విషయాలతో మళ్ళీ సంపర్కం కలిగినప్పుడల్లా అదే విధమైన రాగద్వేష భావాలు మనలో రేకెత్తుతాయి. మన పాత సంస్కారాలు వెలువడి మరల మరల కలిగే అనుభవాలు 'ఇష్టాలు, అనిష్టాలు' అనే స్మృతులనూ, మనోభావాలనూ కలగజేస్తాయి. ఆ వస్తువులు భౌతికంగా మన ఎదుట లేకపోయినా, వాటి గురించి ఆలోచనే మన మనస్సును ఉద్రేకపరుస్తుంది. మనుష్యులలో ఉన్న గాఢమైన ప్రీతి, అప్రీతికర భావాల వెనుక ఉన్న మనస్తత్త్వభావన ఇదే. రాగ, ద్వేషాలే అన్ని కష్టాలకూ, బాధలకూ కారణమవుతాయి.

ఇంద్రియ సుఖాల పట్ల అనిష్టం ఏర్పరచుకోవడమొక్కటే దీన్ని అధిగమించే మార్గం. ఇంద్రియ విషయాలు కలగజేసే దుఃఖాన్నీ, కష్టాన్నీ తలచుకొని వాటి పట్ల నిర్లక్ష్యవైఖరిని అవలంబించాలి. వాటికి కొన్ని దోష భావాలను ఆపాదించి, వాటిలోగల లోపాలను దర్శించాలి. ఒక విషయంలో లోపం చూడడమంటే దాని పరిమితిని కనుగొనడమే! ఇంద్రియ విషయాలన్నీ సర్వశక్తిమంతమైనవనీ, ఆకర్షణీయమైనవనీ తరచూ

అనుకుంటుంటాం. అది సరియైన భావం కాదని మాటిమాటికీ గుర్తుచేసుకోవాలి. అది చిన్నపిల్లలను బుజ్జగించడం లాంటిది. ఒక వస్తువుకూ, అది ఇచ్చే బాధాకరమైన ఫలితానికీ మధ్యగల సంబంధాన్ని చిన్నపిల్లవాడు చూడలేడు. చెడు పదార్థం తింటే ఆ తరువాత అది తనను అనారోగ్యం పాలు చేస్తుందని అతడు అర్థం చేసుకోలేడు. అందుకనే దాని వెంట పరుగెడుతుంటాడు.

శిక్షణ లేని మనస్సు యొక్క పద్ధతి కూడా అలాగే ఉంటుంది. చిన్నపిల్లవాడిలా అది ఇంద్రియ విషయాల గురించి అడుగుతూనే ఉంటుంది. ఈ పసిపిల్ల వాని మనస్తత్వం ప్రతివారిలోనూ ఉంటుంది. ఈ విషయంలో అది ఎలాంటి తర్కాన్నీ, వాదాన్నీ వినడానికి ఇష్టపడదు. ఆ సంబంధాన్ని (విషయ సుఖం, దాని ఫలితం) మన మనస్సు చూసేటట్లుగా తయారుచేయాలి. ఒక విషయం, లేక సంస్కారం, దాని ఫలితంగా కలిగే దుఃఖానికి గల సంబంధాన్ని చూడడమే 'దోషదర్శనం' అంటారు.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలకు వశమై జీవులు ఏ విధంగా తమ ప్రాణాలను కోల్పోతాయో వివరిస్తోంది ఆత్మపరిశోధనా గ్రంథమైన 'వివేకచూడామణి'.



1. జింకలు శబ్దానికి వశమవుతాయి. అందుచేత, వేటగాడు వేణువు మీద మృదుమధురమైన సంగీత శబ్దాలను పలికిస్తాడు. వాటికి పరవశం చెంది, వేటగాడి వశమైపోతాయి.

2. మిడుత 'మంట' యొక్క రూపాన్ని చూసి ఆకర్షితురాలై దాని వద్దకు వెళుతుంది. అగ్నికి కాల్చేతత్త్వ ముందని అది గ్రహించదు. అది ఆ మంటకు ఆకర్షితురాలై అందులోపడి చనిపోతుంది.

3. ఏనుగులకు 'స్పర్శ' పట్ల గొప్ప బలహీనత ఉంది. మగ ఏనుగు, ఆడ ఏనుగును చూస్తే చాలా ఉద్వేగానికి గురి అయి, వేగంగా దానివైపునకు దూసుకెళుతుంది. ఆ ఆవేశంలో తనకూ, ఆడ ఏనుగుకూ మధ్య ఆకులతో కప్పబడిన పెద్ద గోతిని చూడను కూడా చూడదు. ఆ ఆకులపై కాలు వేసి గోతిలో పడిపోయి, జీవితాంతం బద్ధురాలుగా ఉండిపోతుంది. ఏనుగు ఎంత బలమైన, దృఢమైన జంతువు అయినా అది తనకున్న స్పర్శ సుఖానికిలోనై జీవిత పర్యంతం స్వేచ్ఛను కోల్పోతుంది.

4. చేప రుచికి లోబడుతుంది. 'ఎర'కు ఆకర్షితమైన చేప, గేలం యొక్క ఇనుప కొక్కానికి గుచ్చబడిన ఎరను తనకు బాగా ఇష్టమైన 'ఆహారం'గా చూస్తుంది. దాన్ని పొందాలని వెళ్ళి జీవితాన్నే కోల్పోతుంది.

5. తేనెటీగ గంధానికి ఆకర్షితమవుతుంది. తామర పుష్పంలోని మకరందాన్ని ఆస్వాదిస్తూ తనను తాను మైమరచి, ఆ పుష్పంలోనే సూర్యాస్తమయం వరకు ఉండిపోతుంది. ఆ పుష్పదళాలు మూసుకుపోగానే దానిలో చిక్కుకుపోయి ప్రాణాలను కోల్పోతుంది.

ఈ జీవులలో ప్రతి ఒక్కటీ ఒక్కొక్క ఇంద్రియసుఖం కోసం అర్రులు చాచి, ఆ యా బలహీనతల వల్ల మరణాన్ని కొనితెచ్చు



కుంటాయి. అటువంటప్పుడు అన్ని పంచేంద్రియాలకూ లోబడివున్న మనుష్యుల సంగతి వేరే చెప్పేదేముంది!

ఈ సత్యాన్ని గ్రహించి, దానిపై తీవ్రంగా ధ్యానిస్తేనే ఇంద్రియ విషయాల పట్ల వైరాగ్యాన్ని పెంపొందించు కోగలం. ఒక వస్తువు ఎంత ఆకర్షణీయమైనదైనా, దానితో పాటు వచ్చే ప్రమాదాన్ని అర్థం చేసుకుంటే, దాని పట్ల ఆకర్షణ తొలగిపోతుంది. పాలలో ఒక్క చుక్క విషం పడితే, అవి ఇక తాగడానికి పనికిరావు అనే 'భయం', ఆకర్షణను దూరంగా తొలగిస్తుంది. కానీ అదే పూర్తి పరిష్కారం కాదు. అది తాత్కాలికమైన పరిష్కారం మాత్రమే! ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో–'ఇంద్రియాకర్షణలకు శాశ్వత పరిష్కారం')

సామాన్యుడి నుండి సార్వభౌముడి స్థితి వరకు ఉన్న సమస్త దశలను పరిశోధించి, ఇంద్రియ సుఖాలు క్షణికాలని మనస్సులో నిశ్చయమైన అభిప్రాయం కలిగితే గానీ ఎవరూ జ్ఞాని కాలేరు. - శ్రీరామకృష్ణులు

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాతపేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ కె.చిక్క వీరాచార్య, బెంగుళూరు (కీ॥శే॥ అక్కమాంబ, చంద్రశేఖరాచార్యుల జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కలువపల్లి, అనంతపురం జిల్లా |
| శ్రీ తండ రామస్వామి, భగత్‌నగర్, వరంగల్‌జిల్లా (కీ॥శే॥ తండ మల్లయ్య జ్ఞాపకార్థం) | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కుమ్మరికుంట్ల, వరంగల్ జిల్లా |
| స్వామి సుకృతానందజీ, ఆచార్య, ట్రైనింగ్ సెంటర్, బేలూరు మఠం | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బెల్లంపల్లి, ఆదిలాబాద్ జిల్లా |
| 〃 〃 〃 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కుమ్మరికుంట్ల, వరంగల్ జిల్లా |
| డాక్టర్ పెసల నాగేశ్వరరావు, నాటింగ్‌హామ్, యు.కె. | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, దేవరకొండ, నల్లగొండ జిల్లా |
| శ్రీ జి. వేంకటేశ్వరరావు, గరికపాడు, గుంటూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గరికపాడు, గుంటూరు జిల్లా |
| శ్రీ లక్ష్మీనారాయణ, గగన్‌మహల్, హైదరాబాదు | బీసెంట్ థియోసోఫికల్ కళాశాల, మదనపల్లి, చిత్తూరుజిల్లా |
| శ్రీ డి. అంజిరెడ్డి, జొన్నతలి, ప్రకాశం జిల్లా | ఎమ్.ఎస్.ఎన్ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మార్టూరు, ప్రకాశం జిల్లా |
| శ్రీ ఎన్. అనిల్ కుమార్, డాబాగార్డెన్స్, విశాఖపట్నం | సాయి విద్యామందిర్ ఉన్నత పాఠశాల, చౌటుప్పల్, నల్లగొండ జిల్లా |
| 〃 〃 〃 | గ్రామపంచాయతీ కార్యాలయం, జల్లారం, కరీంనగర్ జిల్లా |
| శ్రీ ఊటూరి ప్రభాకరరావు, అశోక్‌నగర్, హైదరాబాదు | ప్రియాంక ఉన్నత పాఠశాల, ఇబ్రహీంపట్నం, రంగారెడ్డి జిల్లా |
| శ్రీ టి.ఎస్.కె. స్రవంత్, తిరువణ్ణామలై, తమిళనాడు | ఆదర్శ పబ్లిక్ స్కూల్, దానవాయిపేట, రాజమండ్రి, తూ.గో.జిల్లా |
| శ్రీ చౌదరి శ్రీరామమూర్తి, జగన్నాథపేట, లయిదాం, శ్రీకాకుళం జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, సిరిపురం, శ్రీకాకుళం జిల్లా |
| శ్రీ ఎమ్. నవీన్, సత్రాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా | పత్రికను 15 విద్యాసంస్థలకు ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు. |
| కుమారి ఎ. మాధురి, బడీచౌడి, హైదరాబాదు | పత్రికను 15 విద్యాసంస్థలకు ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు. |
| శ్రీమతి ఎ. గిరిజ, అంబర్‌పేట్, హైదరాబాదు | ప్రభుత్వ ఎమ్.జి.హెచ్. పాఠశాల, గుంతకల్, అనంతపురం జిల్లా |
| శ్రీ ఆర్.వి. రమణరావు, పెద్దపల్లి, కరీంనగర్‌జిల్లా | టినీ టాట్స్ ప్లే స్కూల్, పెద్దపల్లి, కరీంనగర్ జిల్లా |
| శ్రీమతి ఎల్. అమృతమ్మ, శంకరంకాలనీ, నెల్లూరుజిల్లా | ఎ.ఆర్.ఎమ్. ఉన్నత పాఠశాల, బేగంబజార్, హైదరాబాదు |
| శ్రీ పలుస రాములుగౌడ్, మనిగిల్ల, మహబూబ్‌నగర్ జిల్లా | మండలపరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, మనిగిల్ల, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీమతి కంసాల ఊర్మిళ& శ్రీ రాధాకృష్ణ, న్యూ కృష్ణానగర్, కర్నూలు | మండలపరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల, రతన, కర్నూలు జిల్లా |
| ప్రొఫెసర్ బి. కృష్ణారెడ్డి, ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం, చిత్తూరు జిల్లా | అక్కమహాదేవి వనిత వసతిగృహం, కుప్పం, చిత్తూరు జిల్లా |
| 〃 〃 〃 | వైదునాథ బాలుర వసతిగృహం, కుప్పం, చిత్తూరు జిల్లా |
| డాక్టర్ యెలిశెట్టి రామమోహనరావు, యూసుఫ్‌గూడ, హైదరాబాదు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, శాంతినగర్, నల్లగొండ |
| శ్రీ కె. శంకరయ్య, మసాయిపేట్, మెదక్‌జిల్లా (కీ॥శే॥ ఎమ్.నారాయణ జ్ఞాపకార్థం) | కామారెడ్డి, ప్రసన్న వేంకటేశ్వర భజన మండలి 25 మంది సభ్యులకు |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ** ప్రభను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు

---

(...21 వ పేజీ తరువాయి.)

# దేవీ నవరాత్రుల ప్రాశస్త్యం

నిమజ్జనం చేసి దుఃఖాన్ని ఎందుకు కొని తెచ్చుకోవాలి? నేను నిమజ్జన కార్యాన్ని అంగీకరించను" అని కదలకుండా కూర్చుండిపోయాడు. ఆయనకు ఎవరూ నచ్చచెప్పలేకపోయారు.

అప్పుడు మథురబాబు ధర్మపత్ని శ్రీరామకృష్ణులవారి వద్దకు వెళ్ళి, ఈ విషయం తెలిపింది. వారు వెంటనే మథురబాబు చెంతకు వెళ్ళారు. "నిమజ్జనం జరగడానికి వీలు లేదు" అని బిగ్గరగా అరుస్తున్న మథురబాబుని, శ్రీరామకృష్ణులు "ఓస్! ఇంతేనా? అమ్మను విడిచి నిన్ను ఎవరు ఉండమన్నారు. నిమజ్జనం చేసినా ఆమె ఎక్కడికి పోతుంది? బిడ్డను వదలి తల్లి ఎక్కడైనా ఉండగలదా? ఈ మూడు రోజులూ నీ పూజ లందుకొన్న అమ్మ నీకు మరింత చేరువైంది కదా! ఇక నీ హృదయంలో ఆసీనురాలై నిరంతరం నీ పూజను స్వీకరిస్తుంది" అని సముదాయించారు. దీనితో మథురబాబు మనోభావం పూర్తిగా మారిపోయింది. అటు పిమ్మట ఆయన దేవీ నిమజ్జనం పూజకు అంగీకరించారు.

శ్రీరామకృష్ణులు, దేవితో ఎంతగా ఐక్యమయ్యారో దీని వల్ల స్పష్టమవుతోంది. నవరాత్రి ఉత్సవాల వంటి పండుగలు ప్రజలలో నవ నవోన్మేషమైన చైతన్యాన్ని కలిగించాలి. మనలో ఉన్న వర్గ–వర్ణ–కుల–లింగ భేదాల వల్ల కలిగిన కాలుష్యం తొలగిపోవడానికి అందరూ కలిసిమెలిసి చేసే ఇలాంటి పూజలు సహకరించాలి. దానధర్మాది కార్యాలు విరివిగా జరగాలి. దీనులనూ, అనాథలనూ ఆదరించాలి. బాహ్యమైన పూజలు పూజలుగానే మిగిలి పోకూడదు. శ్రీరామకృష్ణుల విషయంలో లాగా అవి 'ఆత్మపూజ'లో పర్యవసించాలి. అప్పుడే ఈ ఉత్సవాలూ, పూజలూ ఫలిస్తాయి. ❖

# ప్రగాఢ విశ్వాసమే పరిహారం

కథ మూలం: శ్రీరామకృష్ణ పరమహంస    చిత్రాలు: సదాశివం    అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1

వైకుంఠంలో మహావిష్ణువు పాదసేవలో లక్ష్మీదేవి నిమగ్నురాలై ఉంది. నారదుడు ఒనరించిన ఒక తప్పుకు విష్ణువు అతణ్ణి శిక్షింపదలచాడు.



2




3

అయినప్పటికీ స్వామీ! నారదుడు త్రిలోక సంచారి. 'నారాయణ' అనే మీ నామ స్మరణ చేస్తూ ముల్లోకాలూ సంచరిస్తుంటాడు గదా! అందువల్ల అతడి తప్పును స్వల్పమైన శిక్షతో సరిపెట్టండి.




4




5
నా తల్లి మహాలక్ష్మి కారుణ్యమే నన్ను సదా రక్షిస్తోంది.
నువ్వు అజాగ్రత్తగా ఉన్నందున, కొంత కాలం నరకవాసం అనుభవించే తీరాలి.


6
ఆ మాట విని నారదుడు కంగారు పడలేదు, కుంగిపోలేదు. అందుకు మారుగా మహావిష్ణువును స్తుతించసాగాడు.


7
భక్తుని స్తుతితో భగవంతుని కారుణ్యం పొంగి పొరలింది. తరువాత నారదుడు, మహావిష్ణువుతో...
మహానుభావా! మీరు విధించిన శిక్షను సంతోషంగా స్వీకరిస్తున్నాను. నేను వెళ్ళవలసిన నరకం ఎక్కడ ఉంది స్వామీ! అది ఎలా ఉంటుంది? దయచేసి వివరించ ప్రార్థన...


8
మహావిష్ణువు నారదుడికి స్వర్గ, నరక లోకాలను నేల మీద చిత్రించి చూపించాడు.
నారదా! ఇదిగో ఇదే స్వర్గలోకం.
ఓ...మనుష్యులు తక్కువగా ఉన్న ప్రదేశమేనా స్వర్గం!


9
మహావిష్ణువు నేల మీద మరో పెద్ద చిత్రం గీసి చూపాడు.
ఆ...ఇదేమిటి? అమిత భయానకంగానూ, హింసాత్మకంగానూ ఉన్నదే!
నారదా! ఇదే నువ్వు వెళ్ళవలసిన నరకం.












**ఎవడినైనా చూపించి 'అతడు నీ అన్న' అని తల్లి చెబితే, పిల్లవాడు అతణ్ణి తన అన్నగానే భావిస్తాడు. అలాంటి పసివాడికున్న విశ్వాసం ఎవరిలో ఉంటుందో వారిని భగవంతుడు కరుణిస్తాడు.** – భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

# వివేకానంద





వేదపారాయణం చేస్తున్న స్వామీజీలు



ప్రసంగిస్తున్న కేంద్రమంత్రి డి. పురంధేశ్వరి



ప్రసంగిస్తున్న హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పినాకీ చంద్రఘోష్

స్వామి వివేకానంద 150వ జయంతి ఉత్సవాలలో భాగంగా హైదరాబాదు రామకృష్ణ మఠం 'వివేకానంద రథయాత్ర'కు ఘనంగా శ్రీకారం చుట్టింది. 1893 సెప్టెంబర్ 11న స్వామీజీ భారతావని ఆధ్యాత్మిక, సాంస్కృతిక వైభవాన్ని చికాగోను వేదికగా చేసుకొని విశ్వవ్యాప్తం చేశారు. ఆ చారిత్రక ప్రసంగ ఘట్టాన్ని స్మరించుకుంటూ 2012 సెప్టెంబర్ 11న మఠ ప్రాంగణంలో వివేకానంద రథయాత్రను కేంద్రమంత్రి శ్రీమతి డి.పురంధేశ్వరి ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పినాకీ చంద్రఘోష్, పోలీసు ఉన్నతాధికారి సౌమ్యమిశ్రా అతిథులుగా హాజరయ్యారు. ఈ సందర్భంగా కేంద్రమంత్రి స్వామీజీ దార్శనికతను కొనియాడుతూ 'ఆ మహనీయుడు బోధించినట్లు నిరక్షరాస్యతను రూపుమాపడం, యువశక్తిని సన్మార్గంలో పయనింప చేయడం, మహిళాసాధికారతను సాధించడం ద్వారా మాత్రమే దేశం పురోభివృద్ధి సాధించగలద'ని స్పష్టంచేశారు. ప్రధాన న్యాయమూర్తి పి.సి.ఘోష్ మాట్లాడుతూ 'స్వామీజీ స్ఫూర్తివచనాలను ఆచరణలో పెట్టినప్పుడే సమాజం సంక్షేమ దిశలో పయనిస్తుంద'ని సూచించారు.

అనంతరం రథయాత్ర నగరవీధుల గుండా వేలాది మంది భక్తులు, విద్యార్థులు, యువతీయువకులతో సాగిపోతూ సికింద్రాబాదు మహబూబ్ కళాశాలకు చేరుకుంది. స్వామీజీ ప్రథమ బహిరంగ ప్రసంగానికి నోచుకున్న ఆ కళాశాల ప్రాంగణంలో జరిగిన సభలో హైదరాబాదు రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీతో పాటు ఇతర స్వామీజీలు, పురప్రముఖులు పాల్గొన్నారు. ఆ సభలో స్వామి జ్ఞానదానందజీ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగిస్తూ 'యువతరం స్వామి వివేకానంద జీవితాన్ని, బోధనలను ఆదర్శంగా తీసుకొని జీవితాన్ని తీర్చిదిద్దుకోవాల'ని హితవు పలికారు. అనంతరం వివేకానంద రథం రాష్ట్ర పర్యటనలో భాగంగా ఖమ్మం జిల్లాకు బయలుదేరింది. ❖



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# రథయాత్ర ప్రారంభోత్సవం







జెండా ఊపి రథయాత్రను ప్రారంభిస్తున్న పురంధేశ్వరి



రథాన్ని లాగుతున్న యువకులు














రథయాత్ర ఊరేగింపు, మహబూబ్ కళాశాల సభా కార్యక్రమ దృశ్యాలు



ట్యాంక్‌బండ్‌పై ఉన్న స్వామీజీ విగ్రహానికి ఆరతిస్తున్న దృశ్యం

Vol.69-10, Sri Ramakrishna Prabha (Telugu Monthly) October 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

నీవు ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నావా? ఇతరుల్ని ప్రేమించగలుగుతున్నావా? ఇతరులూ, నీవూ ఒకటేనని భావించగలుగుతున్నావా? నీలో నీవు ప్రశాంతంగా ఉన్నావా? ఆ ప్రశాంతతను అందరికీ పంచుతున్నావా? ఆంతరంగికంగా ధ్యానంతో, బాహ్యంగా నిస్వార్థసేవతో ప్రేరణ పొందడమే ఆధ్యాత్మిక ప్రగతి. *- స్వామి రంగనాథానంద*



రాష్ట్రంలో పర్యటిస్తున్న
'వివేకానంద రథం'

# మన ఊరిలో వివేకానంద రథయాత్ర

లేవండి...మేల్కొనండి...
గమ్యం చేరేవరకూ విశ్రమించకండి.




**వివేకానందుణ్ణి తెలుసుకోండి, భరతమాతపై ప్రేమను పెంచుకోండి.**

*With Best Compliments From*

**పక్యాల భాస్కర రావు**, మేనేజింగ్ డైరక్టర్ & **పక్యాల గిరిజ**, డైరక్టర్

SVISS LABSS
LIMITED

## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)



Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex, Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net Web Site : www.svisslabss.net

**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2,000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

నవంబర్ 2012 ₹10

# 100000

## ఆధ్యాత్మిక ఆకాశంలో లక్ష ప్రతుల 'ప్రభ'






**భక్తుడు:** మహాశయా! సంసారం మిథ్య అంటారు. అందులో మునిగివున్న మాకు ఏదైనా మార్గం చూపండి.

**శ్రీరామకృష్ణులు:** ఒక చేత్తో భగవంతుని పాదపద్మాలను పట్టుకో. రెండవ చేత్తో సంసార బాధ్యతలను నిర్వర్తించు.

**భక్తుడు:** మహాశయా! సంసారం అనిత్యమైనదే అయితే ఒక చేత్తో దాన్ని ఎందుకు పట్టుకోవాలి?

**శ్రీరామకృష్ణులు:** భగవంతుని తెలుసుకోనంత వరకు సంసారం మిథ్యయే. భగవంతుని తెలుసుకొన్న తరువాత సంసార జీవితం అనిత్యం కాబోదు. పిల్లవాడికి అన్నం పెట్టేటప్పుడు బాలగోపాలుడికి తినిపిస్తున్నట్లుగా భావించు. తల్లితండ్రులను పార్వతీ పరమేశ్వరులుగా కాంచి, వారిని సేవించు. భగవంతుణ్ణి పొందినప్పుడు సంసారం నిస్సారం అని తోచదు. భగవంతుణ్ణి తెలుసుకొన్న వ్యక్తి, ఆ భగవంతుడే జీవ జగత్తులుగా అయివున్నట్లు గాంచుతాడు. భగవంతుణ్ణి శరణు వేడు, సకలమూ సాధిస్తావు.

**భక్తుడు:** ఒక వైపు పిల్లలు చెప్పినమాట వినరు; ఇంకోవైపు ఎన్నో కష్టాలు. అలాంటి పరిస్థితుల్లో ఏం చేయాలి?

**శ్రీరామకృష్ణులు:** సంసారంలో ఉంటూ సాధన చేయటం చాలాకష్టం. అనేక ఆటంకాలు ఉన్నాయి. రోగం, శోకం, దారిద్ర్యం, అవిధేయులైన పిల్లలు – ఇవన్నీ నేను నీకు చెప్ప పనిలేదు. అయినప్పటికీ మార్గం ఉంది. అప్పుడప్పుడు ఏకాంతంలో భగవంతుణ్ణి ప్రార్థించు.

**భక్తుడు:** అంటే, ఇల్లు విడిచిపెట్టి వెళ్ళిపోవాలా?

**శ్రీరామకృష్ణులు:** ఇల్లువిడిచిపెట్టి పోవాల్సిన అవసరం లేదు. అవకాశం లభించినప్పుడు ఒక రోజో, రెండు రోజులో ఏకాంతవాసం చేయి. లౌకిక సంభాషణలను విడనాడి ఏకాంతంగా భగవంతుణ్ణి ప్రార్థించు. వీలైనప్పుడల్లా సాధుసాంగత్యం చేయి.

**భక్తుడు:** నిజమైన సాధువును తెలుసుకోవడం ఎలా?

**శ్రీరామకృష్ణులు:** ఎవడు సదా భగవంతునిపట్ల శరణాగతుడై ఉంటాడో అతడే సాధువు. ఎవడు కామ కాంచనాలను త్యజించాడో అతడే సాధువు. సాధువు స్త్రీలకు దూరంగా ఉంటాడు. వారి సమీపంలోకి వెళ్ళవలసివస్తే వారిని తల్లిగానే భావిస్తాడు, సాధువు ఎల్లప్పుడూ భగవచ్చింతనలోనే మునిగి ఉంటాడు. భగవంతుని గురించి తప్ప మరి దేన్ని గురించి మాట్లాడడు. సకల ప్రాణకోటిలో భగవంతుడు విరాజిల్లు తున్నాడని ఎరిగి వారికి సేవలు చేస్తాడు. ఇవే నిజమైన సాధువు లక్షణాలు. ❖ **('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు–500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**


స్వామి బోధమయానంద


స్వామి శితికంఠానంద


స్వామి రఘునాయకానంద


స్వామి శశికాంతానంద


స్వామి సేవ్యానంద


స్వామి సన్నివాసానంద





# వివేకానంద రథయాత్ర

(సెప్టెంబర్ 12 నుండి అక్టోబర్ 3 వరకు)

స్వామి వివేకానంద 150వ జయంతి ఉత్సవాల సందర్భంగా హైదరాబాదు రామకృష్ణ మఠం చేపట్టిన 'వివేకానంద రథయాత్ర' రాష్ట్ర పర్యటనలో భాగంగా ఖమ్మం జిల్లాలో సెప్టెంబర్ 12 నుండి 17 వరకు కొనసాగింది.

హైదరాబాదు రామకృష్ణ మఠం పర్యవేక్షణలో, ఖమ్మం జిల్లాలోని శ్రీరామకృష్ణ సేవాసమితుల సహకారంతో ఆ జిల్లాలోని 21 పట్టణాలు, గ్రామాలలో పర్యటించిన వివేకానంద రథాన్ని సుమారు రెండు లక్షల మంది ప్రజలు, విద్యార్థులు దర్శించారు. సుమారు లక్షాఎనభై వేల రూపాయల విలువ చేసే వివేకానంద సాహిత్యాన్ని కొనుగోలు చేశారు. ఈ రథయాత్రలో స్వామి బోధమయానందజీ, శితికంఠానందజీ,రఘునాయకానందజీ పాల్గొని బహిరంగ సభల్లోనూ, విద్యాసంస్థల్లోనూ ప్రసంగించారు.

విజయవాడ రామకృష్ణ మిషన్ పర్యవేక్షణలో సెప్టెంబర్ 18 నుండి కృష్ణ, గుంటూరు జిల్లాల్లో 'వివేకానంద రథయాత్ర' కొనసాగుతోంది. ఆ జిల్లాల్లోని శ్రీరామకృష్ణ సేవాసమితుల సహకారంతో అక్టోబర్ 3వ తేదీ వరకు 35 పట్టణాలు, గ్రామాల్లో పర్యటించిన వివేకానంద రథాన్ని సుమారు లక్ష మంది ప్రజలు, విద్యార్థులు దర్శించారు. సుమారు రెండు లక్షల రూపాయల విలువ చేసే వివేకానంద సాహిత్యాన్ని కొనుగోలు చేశారు. ఈ రథయాత్రలో స్వామి శశికాంతానందజీ, సేవ్యానందజీ, సన్నివాసానందజీ పాల్గొని బహిరంగ సభల్లోనూ, విద్యాసంస్థల్లోనూ ప్రసంగించారు. ❖

నివేదిక: బ్రహ్మచారి నియమచైతన్య





















ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 69 సంచిక: 11 నవంబర్ 2012

**గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**
**ఈశ్వరీగ్ంం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥**

సుగంధానికి ఆలవాలమైనదీ, జయింప నలవికానిదీ, సతతం పౌష్టికత నిచ్చునదీ, సకల సంపన్నురాలూ, సమస్త జీవులకు నాయకురాలైనదీ అయిన మహాలక్ష్మిని ఇక్కడ ఆవాహన చేస్తున్నాను. – శ్రీసూక్తమ్



# ఆధ్యాత్మిక ఆకాశంలో లక్ష ప్రతుల 'ప్రభ'




**మూ**ర్తిత్రయ భావప్రాభవానికి, మానవీయ విలువల వికాసానికి అక్షరవేదికగా వెలుగొందుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను ఆదరాభిమానాలతో లక్ష ప్రతుల పంపిణీ స్థాయికి తీసుకువెళ్ళిన పాఠకులకు కృతజ్ఞతలు తెలుపుతున్నాం.

ఆధ్యాత్మిక ఆలోచనామృతాన్ని చిలకరిస్తున్న మా ఈ చిరుకలశాన్ని మీ ముంగిళ్ళకు స్వాగతించడమే కాక ఆత్మీయులకు అపురూప కానుకగా అందిస్తున్న సౌజన్యమూర్తులకు ధన్యవాదాలు.

అనతికాలంలోనే లక్షలాది జిజ్ఞాసువుల ఆదరణను చూరగొన్న 'శ్రీరామకృష్ణ ప్రభ' నేల నాలుగు చెరగులా వెలుగులు వెదజల్లాలని ఆకాంక్షిస్తున్నాం. ప్రతుల సంఖ్యలోనే కాదు పఠనాసక్తిని పెంచడంలో కూడా 'లక్ష'ణంగా ముందుకు సాగాలని అభిలషిస్తున్నాం. ఇదే రీతిలో మీ ఆత్మీయులకు, అభిమానులకు 'శ్రీరామకృష్ణ ప్రభ'ను పరిచయం చేస్తూ, ఈ ఆధ్యాత్మిక 'ప్రభ'ంజనాన్ని మారుమోగించాలని అభ్యర్థిస్తున్నాం.

స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు
రామకృష్ణ మఠం, హైదరాబాదు



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'కి ధన దానం చేసి ప్రోత్సహించాల్సిందిగా కోరుతున్నాం. దాతల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు | : | శ్రీమతి వై. స్వరాజ్యలక్ష్మి, శ్రీనగర్‌కాలనీ, హైదరాబాదు -500 073 | 5,000 |
| పోషకులు | : | శ్రీ సిహెచ్. నరసింహారావు, ఆర్.కె.పురం, సికింద్రాబాదు (సి.ఆర్.కె. ఫౌండేషన్ - 2011 చేర్పులు) | 3,500 |
| పోషకులు | : | శ్రీ కె. ఉదయ భాస్కరరావు, కూకట్‌పల్లి, హైదరాబాదు - 500 085 | 1,500 |
| పోషకులు | : | గిడుతూరి మంగామణి, బాలయ్యశాస్త్రి లేఅవుట్, విశాఖపట్నం - 530 013 | 1,116 |
| పోషకులు | : | శ్రీ ఎం.ఎస్. ఉదయ కుమార్, బిట్స్ పిలాని, హైదరాబాదు క్యాంపస్, హైదరాబాదు | 1,001 |
| పోషకులు | : | శ్రీమతి ఎమ్. రమామణి, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా - 532 222 | 1,000 |
| పోషకులు | : | శ్రీమతి పి. సువర్ణ, వి.టి.కాలనీ, నల్గొండ - 508 001 | 1,000 |
| పోషకులు | : | శ్రీ ఎస్.సుభాష్, మెళియాపుట్టి, శ్రీకాకుళం జిల్లా - 532 215 | 1,000 |
| పోషకులు | : | శ్రీ పి. పురంధర్, ఎమ్.జి. కంద్రిగ, చిత్తూరు జిల్లా - 517 587 | 1,000 |
| పోషకులు | : | డాక్టర్ ఎ. ప్రభాకర్‌రావు, కాప్రా, ఇ.సి.ఐ.ఎల్, హైదరాబాదు - 500 062 | 1,000 |
| పోషకులు | : | శ్రీ మంచిరాజు శ్రీనివాస్, రాజమండ్రి బుక్‌సెంటర్, రాజమండ్రి | 1,000 |
| పోషకులు | : | పి. రజని, వి.టి. కాలనీ, నల్గొండ - 508 001 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1,500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి. రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను. (చెక్కులు స్వీకరించబడవు)

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | ₹ 10 | - |
| ఒక సంవత్సర చందా | : | ₹ 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | ₹ 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | ₹ 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | ₹ 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.

**పంపవలసిన చిరునామా :**
Sri Ramakrishna Prabha, Ramakrishna Math,
Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...





### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు మీద చిరునామాకు పైన మీ చందా నంబరు, కుడి వైపున మీ చందా గడువు ముగిసే నెల ఉంటాయి. మీ చందా గడువు పూర్తయ్యే నెలకు ముందుగానే సొమ్మును చెల్లించి చందాను పునరుద్ధరించుకోండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే (పోస్టల్ పిన్‌కోడ్‌తో సహా) వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- ప్రతీ నెల 26 లేదా 27వ తేదీల్లో పత్రిక పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపుగా చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్



### దీపావళి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు, శ్రేయోభిలాషులకు మా హృదయపూర్వక దీపావళి శుభాకాంక్షలు. - సంపాదకులు

# పసిమనస్సులు పరిమళించాలంటే...

అప్పుడు ఉదయం పది గంటలైంది. ఒక పెద్దమనిషి వచ్చి ఇంటి తలుపు తట్టాడు. పరుగెత్తుకుంటూ ఓ ఐదేళ్ళ అమ్మాయి వచ్చి తలుపు తెరిచింది. 'ఏమమ్మా! మీ నాన్నగారు ఉన్నారా?' అని అడిగాడు అతడు. 'లే..రు..' అని బదులిచ్చింది ఆ చిన్నారి. 'పని మీద వెళ్ళారా?' అని ప్రశ్నించాడు. 'లేదు, స్కూటర్ మీద వెళ్ళారు' అని అమాయకంగా చెప్పింది. ఆ పసిపాప నిష్కల్మష మైన సమాధానం విని మురిసిపోయాడు ఆ అతిథి. ఎలాంటి కల్మషం లేని ఆ అమాయకురాలు మరో ఐదేళ్ళ తరువాత నాన్న ఇంట్లో ఉన్నా ఆఫీసుకు వెళ్ళారనీ, అమ్మ వంటింట్లో ఉన్నా బజారుకు వెళ్ళిందనీ చెప్పే స్థితికి వస్తుంది. అందుకు కారణం ఇంట్లో ఉన్నా సరే ఫోన్ వస్తే లేరని చెప్పమన్న తండ్రి, పక్కింటి పిన్నిగారు వచ్చి అడిగితే బజారుకెళ్ళిందని చెప్పమన్న తల్లి ఇచ్చిన తర్ఫీదే! నిజానికి పిల్లలు ఉన్నది ఉన్నట్లు చెబితే సంతోషించడానికి బదులు 'వీడికి లౌక్యం తెలియదు. ఎలా బతుకుతాడో ఏమిటో!' అని వాపోయే తల్లితండ్రులను మనం తరచూ చూస్తుంటాం.

**పసి మనస్సులను మలచే బాధ్యత:** ప్రతి తల్లీ తండ్రీ తమ పిల్లలు మంచి వ్యక్తులుగా పరిణతి చెందాలని ఆశించడం సహజం. కానీ పిల్లలు నైతిక వర్తనులుగా మారాలంటే తల్లితండ్రులుగా తాము ఎలాంటి జాగ్రత్తలు తీసుకుంటున్నాం, వారు సన్మార్గంలో నడవడానికి ఎలాంటి శిక్షణ నిస్తున్నాం అనే మౌలిక అంశాలను పరిగణనలోకి తీసుకోవాలి. ఆ దిశగా పరిణతి చెందడానికి తగిన శ్రద్ధ వహించాలి.

ఒక యువకుడు దొంగతనం చేసి పట్టుబడడం వల్ల చెరసాల పాలయ్యాడు. తల్లి చెరసాలలో ఉన్న కొడుకు దుఃస్థితిని చూసి దుఃఖించింది. కన్నీరుమున్నీరవుతున్న తల్లిని చూసి 'అమ్మా! చిన్నప్పుడు నేను పక్కింటి మామిడి చెట్టు నుండి దొంగతనంగా కాయలు కోసి తెచ్చినప్పుడు నన్ను మందలించలేదు. నాటి ఆ అలవాటే నేడు నన్ను గజదొంగగా మార్చింది. నేను దొంగతనం చేసి మామిడి కాయలు తీసుకువచ్చినప్పుడే - అలా చేయడం తప్పని నన్ను మందలించి, మంచి మార్గంలో నడిపించి ఉంటే నేడు నాకీ దుఃస్థితి వచ్చేది కాదు' అని తల్లిని నిందించాడు.

నిర్మలమైన పసిహృదయాలు కలుషితం కాకుండా తల్లితండ్రులే జాగ్రత్తలు తీసుకోవాలి. పిల్లలు నిజం చెబితే సంతోషించాలి కానీ నిందించకూడదు. తప్పుడు పనులు చేస్తే వారించాలి కానీ ప్రోత్సహించకూడదు. 'పిల్లలే కదా! తెలియక అబద్ధం చెప్పారు, తెలియక తప్పు చేశారు' అని సమర్థించు కొంటూ, వారి ప్రవర్తనను సరిదిద్దకపోతే పిల్లల్ని శీలవంతులుగా మలచడం సాధ్యం కాదు.

**సుఖశాంతులకు అర్హత:** నీతి, నిజాయతీలకు కట్టుబడిన వారి జీవితాలు కన్నీళ్ళమయమే అనీ, సత్యాన్ని అంటిపెట్టు కునేవారు కష్టాల పాలవుతారనీ మనందరిలో సర్వసాధారణమైన ఓ అపోహ ఉంది. అందువల్ల, సచ్ఛీలం గలవారే చిరకీర్తికి వారసులన్న విషయం మరచిపోయి తాత్కాలిక ప్రయోజనాలను ఆశించి, నైతిక విలువలకు తిలోదకాలు ఇస్తున్నాం. సత్యాన్ని ఆశ్రయించినవారు ప్రారంభంలో కష్టాలను ఎదుర్కొన్నప్పటికీ, చివరకు విజయం వారినే వరిస్తుంది. 'సత్యమేవ జయతే నానృతం, సత్యేన పన్థా వితతో దేవయానః- సత్యమే జయిస్తుంది. అసత్యం కాదు. సత్యమే ఉత్తమ పథాన్ని చేర్చే మార్గం' అని 'ముండకోపనిషత్తు' ఉద్ఘాటిస్తోంది. అందుకు మన చరిత్ర పుటల్లో చిరస్థానాన్ని ఏర్పరుచుకున్న ఎందరో మహాత్ముల జీవితాలే ప్రత్యక్ష సాక్ష్యం. సచ్ఛీలం గలవారే శాశ్వతానందం పొందడానికి అర్హులని సుభాషితం తేటపరుస్తోంది.

**శీలం రక్షతు మేధావీ ప్రాప్తుమిచ్ఛుః సుఖత్రయమ్।**
**ప్రశంసాం విత్తలాభం చ ప్రేత్యస్వర్గే చ మోదనమ్॥**

'సచ్ఛీలురైన వారికే సుఖత్రయాలైన కీర్తిప్రతిష్ఠలు, భోగభాగ్యాలు, సుఖశాంతులు శాశ్వతంగా లభిస్తాయి.'

కాబట్టి సచ్ఛీలం గలవారే సకల సౌభాగ్యాలతో చిరకాలం వర్ధిల్లుతారన్న సత్యాన్ని తల్లితండ్రులు గ్రహించి, నైతిక జీవన



మార్గంలో పయనించేందుకు పిల్లలను ప్రోత్సహించాలి. సత్యం, పవిత్రత, నిస్వార్థంతో కూడిన జీవితాలను గడిపి చిరస్మరణీయులుగా నిలిచిన ఆదర్శమూర్తుల జీవితాలను పిల్లలకు బోధించాలి. వారిని సన్మార్గంలో నడిపేందుకు కృషి చేయాలి.

**కాంతి తరగని చంద్రుడు:** ఓ కళాశాల విద్యార్థి నడుచుకుంటూ వెళుతున్నాడు. రోడ్డు మీద నడిచి వెళుతున్న ఓ వ్యక్తిని హఠాత్తుగా ఒక కారు ఢీకొంది. ఆ వ్యక్తి తీవ్రంగా గాయపడ్డాడు. ఆ కారు నడుపుతున్న వ్యక్తి కళాశాల ప్రధాన అధ్యాపకుడు. ఈ సంఘటనంతా రోడ్డు మీద వెళుతున్న యువకుడు చూశాడు. ఆ యువకుడు తన విద్యార్థే అని తెలిసిన కళాశాల ప్రిన్సిపాల్ పోలీసులకు తప్పుడు సాక్ష్యం చెప్పి తనను ఈ కేసు నుండి తప్పించాల్సిందిగా అతణ్ణి కోరాడు.







అందుకు ఆ విద్యార్థి నిరాకరించడంతో 'నువ్వు నాకు అనుకూలంగా సాక్ష్యం చెప్పకపోతే నిన్ను పరీక్షల్లో ఫెయిల్ చేయిస్తాను. అందువల్ల నీకు ఓ సంవత్సరం వృథా అవుతుంది' అని ప్రిన్సిపాల్ బెదిరించాడు. 'నా జీవితకాలంలో ఒక్క సంవత్సరం వృథా అయినా ఫరవా లేదు. కానీ సత్యం చెప్పడం వల్ల ఒకరికి సహాయపడ్డానన్న సంతృప్తి నా జీవితాంతం ఉంటుంది' అని ధైర్యంగా బదులిచ్చాడు ఆ విద్యార్థి.

అతడు పోలీసులకు నిజం చెప్పి ప్రిన్సిపాల్ నుండి బాధితుడికి తగిన నష్టపరిహారం ఇప్పించాడు. ప్రిన్సిపాల్ తాను అన్నట్లుగానే ఆ విద్యార్థిని వార్షిక పరీక్షల్లో ఫెయిల్ చేయించాడు. ఆ విద్యార్థి అందుకు ఏ మాత్రం నిరుత్సాహపడకుండా మళ్ళీ పట్టుదలగా చదివి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ విద్యార్థే కాలాంతరంలో ప్రముఖ రాజకీయవేత్తగా, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగా ప్రసిద్ధిగాంచిన 'భారతరత్న' బిదాన్ చంద్ర రాయ్.

**తల్లి మాటను తలదాల్చిన తనయుడు:** పాఠశాల చదువు పూర్తిచేసిన ఓ విద్యార్థి ఉన్నత విద్యాభ్యాసానికి బంధువుల సలహా మేరకు ఇంగ్లండ్ వెళ్ళడానికి సన్నద్ధమయ్యాడు. ఇంట్లో అందరినీ ఒప్పించినా, తల్లి మాత్రం అందుకు అభ్యంతరం తెలిపింది. ఎంత మంది ఎన్ని విధాలుగా నచ్చజెప్పినా ప్రయోజనం లేకపోయింది. చివరకు ఆ విద్యార్థే స్వయంగా తల్లిని ఒప్పించడానికి ప్రయత్నించాడు. అప్పుడు తల్లి తన మనస్సులో ఉన్న బాధనూ, అనుమానాన్నీ అతడితో ఇలా వ్యక్తపరిచింది: 'ఇంగ్లండ్‌లో యువకులు చెడు వ్యసనాలకు లోనవుతారు. అక్కడ విద్యార్థులు మాంసం, మద్యం స్వీకరిస్తారు. స్త్రీ వ్యామోహాల్లోపడి చెడిపోతారు అని తెలిసింది. అక్కడకు వెళితే నువ్వు కూడా చెడు అలవాట్లకు లోనవుతావన్న భయం నన్ను పీడిస్తోంది.'

తల్లి మనోవ్యథను తెలుసుకొన్న ఆ విద్యార్థి 'మద్య మాంసాలకూ, స్త్రీ వ్యామోహాలకూ దూరంగా ఉంటాను, చెడు సహవాసాల బారిన పడకుండా జాగ్రత్తగా మెలగుతాను' అని తల్లికి వాగ్దానం చేశాడు. ఇంగ్లండ్ వెళ్ళిన తరువాత తల్లి చెప్పినట్లే ఎన్నో ప్రలోభాలు ఎదురయ్యాయి. అక్కడ తోటి విద్యార్థులు మద్యమాంసాలను తీసుకోమని ఎన్నో విధాల బలవంత పెట్టారు. చివరకు ఒక స్త్రీ స్నేహం వల్ల మనస్సు తప్పుదోవ పట్టే పరిస్థితి కూడా ఏర్పడింది. అలాంటి పరిస్థితుల్లో తాను తల్లికి ఇచ్చిన మాటను గుర్తు చేసుకుని మానసిక బలహీనతలన్నింటినీ ఆ విద్యార్థి ఎదుర్కోగలిగాడు. నైతిక మార్గంలో నడిచేందుకు తల్లి ఇచ్చిన శిక్షణ వల్ల కాలాంతరంలో 'జాతిపిత'గా ఖ్యాతి గాంచిన ఆ విద్యార్థే మన మహాత్మా గాంధీ.

**అమ్మ ఇచ్చిన అభయ మంత్రం:** ఒకరోజు సాయంత్రం వీధిలో నాటక ప్రదర్శన జరుగుతోంది. అందరూ ఎంతో ఆసక్తిగా నాటకం చూస్తున్నారు. ఆ సమయంలో హఠాత్తుగా ఒక పోలీసు అధికారి రంగస్థలం మీదకు వచ్చి ఒక నటునికి సంకెళ్ళు వేసి తీసుకువెళుతున్నాడు. అప్పుడు ప్రేక్షకుల మధ్య నుండి 'అతణ్ణి విడిచిపెట్టండి. నాటకం పూర్తయిన తరువాత తీసుకువెళ్ళండి. ప్రదర్శనకు అంతరాయం కలిగించడం అన్యాయం' అని ఓ బాలుని గొంతు వినిపించింది.

వెంటనే ఆ బాలుని మాటలకు ప్రేక్షకులంతా మద్దతు పలికారు. ప్రేక్షకుల నిరసన వెల్లువకు భయపడిన ఆ పోలీసు అధికారి, నటుణ్ణి విడిచిపెట్టాడు. నాటక ప్రదర్శన నిరాటంకంగా కొనసాగినందుకు ఆ బాలుణ్ణి అందరూ ప్రశంసించారు. ఆ బాలుడే నరేంద్రుడు. కాలాంతరంలో తన ధీర వచనాలతో భారతజాతిని జాగృతపరిచిన యుగ నాయకుడు వివేకానందుడు.

నాటక ప్రదర్శనకు అంతరాయం కలిగినప్పుడు వందల మంది చూస్తూ ఉండిపోయారు. కానీ పోలీసు అధికారిని ఎదిరించే సాహసం ఎవరూ చేయలేక పోయారు. నరేంద్రునికి మాత్రం అంతటి ధైర్యం ఎలా కలిగింది? 'న్యాయమార్గంలో పయనించినప్పుడు కష్టాలను ఎదుర్కోక తప్పదు. అయినప్పటికీ నువ్వు అన్యాయాన్ని ఎదుర్కోవడానికి ఎన్నడూ వెనుకాడవద్దు' అని తల్లి భువనేశ్వరీదేవి ఇచ్చిన అభయ మంత్రమే నరేంద్రుణ్ణి ధీర వివేకానందుడిగా మలచింది.

శాశ్వత కీర్తిని ఆర్జించి, చిరస్మరణీయులైన మహాత్ములంతా నైతిక విలువల ఆచరణలో కష్టాలను ఎదుర్కొన్నవారే అన్న సత్యాన్ని మరువకూడదు.

'సత్యం, పవిత్రత, నిస్వార్థం – ఈ సుగుణాలు ఉన్నవారిని అణగద్రొక్కగల సామర్థ్యం ముల్లోకాల్లో ఎవరికీ లేదు. ఈ సుగుణాలు ఉన్నవాడు ప్రపంచమంతా ఏకమై ఎదురుతిరిగినా ఒంటరిగా ప్రతిఘటించగలడు' అన్న స్వామి వివేకానంద ధీరవచనాలపై తల్లితండ్రులు సంపూర్ణ విశ్వాసం ఉంచి, పసి మనస్సుల్లో నైతిక విలువలు పరిమళించేలా శిక్షణనివ్వాలి. ❖

తల్లితండ్రులను బాధింపనివారూ, ధర్మాన్ని ఆచరించినవారూ, సత్ప్రవర్తన కలవారూ, ప్రశాంత చిత్తం కలవారూ, సత్యమార్గాన్ని విడిచిపెట్టనివారూ చిరకీర్తిని ఆర్జిస్తారు. - విదురనీతి

# గోరుముద్ద - స్వామి సుప్రియానంద



# అంతఃసౌందర్యమే ఆభరణం!

ఒక ప్రక్క 'ఎదగడానికి ఎందుకురా తొందరా...' అంటూనే, పిల్లలు అతిత్వరగా పెద్దవాళ్ళు అయిపోవాలని కోరుకుంటాం. వారి మానసిక పరిపక్వతను పరిగణించకుండా అనవసర విషయాలను వారి మీద బలవంతంగా రుద్దుతాం. అతి చిన్న వయస్సులోనే పెద్దవాళ్ళలా (అనుకరణ) చిన్నారులు పలికే చిలుక పలుకులు విన్నప్పుడు వారి తల్లితండ్రులు గర్వంగా తలలెగరేస్తారు. పిల్లలను సినిమా నటీనటులతో పోల్చుకొని, వారి కప్పగంతులు చూసి మురిసిపోయే తల్లితండ్రులు ఎందరో! ఈ పిల్లలే పదహారేళ్ళ ప్రాయానికి వావివరసలు కూడా లెక్కచేయకుండా విచ్చలవిడిగా తిరిగినప్పుడు సిగ్గుతో తలలు వంచుకునే తల్లితండ్రులు మరెందరో!

ఈ మధ్య అమెరికాలోని 'దక్షిణ కరొలినా'లో సంభవించిన ఉదంతం తల్లితండ్రులను, సామాజిక వేత్తలను కూడా ఆలోచింపచేసింది. అక్కడున్న ప్రాథమికపాఠశాల యాజమాన్యం వారు చిన్నారులకు 'అందాల పోటీ' (beauty contest) నిర్వహించదలచుకున్నారు. నియమ నిబంధనలను తెలియజేస్తూ మూడు పుటల కరపత్రాన్ని పిల్లలకు పంచి పెట్టారు. పోటీలలోని అంశాలు: 1. అత్యుత్తమ కళ్ళు 2. అత్యుత్తమ కేశాలు 3. అత్యుత్తమ నవ్వు 4. అత్యుత్తమ వస్త్రధారణ. ఈ అంశాలనన్నింటినీ పరిగణన లోకి తీసుకొని చిన్నారుల సౌందర్యానికి మార్కులు వేసి, విజేతలను ప్రకటిస్తారు. ఈ పోటీలలో నెగ్గిన వారు 'స్వీట్ హార్ట్' (అంటే పిల్లల్లో అత్యుత్తమ అందగత్తె/అందగాడు) పోటీలలో పాల్గొనడానికి అర్హత సంపాదిస్తారు. ఇంకా ఎలా నడవాలో (cat walk), న్యాయనిర్ణేతల ముందర ఏ భంగిమలో నిలబడాలో ఆ కరపత్రంలో చాలా వివరంగా తెలియజేశారు.

ఇప్పుడు అసలు సమస్య మొదలైంది. ఆ పాఠశాలలో చదువుతున్న ఒక విద్యార్థిని 'అందాల పోటీ' కరపత్రాన్ని చేత పట్టుకొని, ఇంటికెళ్ళి వాళ్ళ అమ్మతో అశ్రుపూరిత నేత్రాలతో, గద్గద స్వరంలో ఇలా అంది: "అమ్మా! ఈ నా ముఖంతో 'అందాల పోటీ'లో ఎలా పాల్గొనాలి? అందులో నెగ్గటం అటుంచి, పాల్గొంటే ఎంతమంది నన్ను గేలిచేస్తారు' అంటూ ఏడుపు ముఖం పెట్టింది. అది విని ఆ మాతృమూర్తికి ఆవేదనతో పాటు ఆవేశం తన్నుకు వచ్చింది. వెంటనే 'అందాల పోటీ'కి నిరసన తెలియపరుస్తూ, ఈ విషయాన్ని 'Facebook' లో పెట్టింది; ఆమెకు మద్దత్తునిస్తూ ఎంతోమంది పోటీని రద్దు చేయాలని పాఠశాలపై ఒత్తిడి తెచ్చారు. కొంతమంది తల్లులు మాత్రం, ఇలాంటి పోటీలు చాలా అవసరం, వీటి వలన పిల్లల్లో ఆత్మస్థైర్యం పెంపొందుతుందన్నారు. పోటీలో పాల్గొనలేని పిల్లల కోసం మిగతావారికి అన్యాయం జరగకూడదని వాదించారు. ఏది ఏమైనా చివరకు పాఠశాల వారు పోటీని రద్దు చేశారు.

జీవితంలో బాల్యం అతి ముఖ్యమైన ఘట్టం. ఈ తొలిప్రాయం లోనే చిన్నారుల మనస్సులో ఈ సౌందర్య స్పృహను కలిగిస్తే భవిష్యత్తులో అవాంఛనీయ పరిణామాలకు దారితీస్తుంది. వాళ్ళ ఏకాగ్రత, శ్రద్ధ అంతా శరీరానికే పరిమితమైపోతుంది. పైగా వాళ్ళలో వయస్సుకు మించిన ఆలోచనలు, ఆందోళనలు, పోటీ తత్త్వం పొడచూపే ప్రమాదం కూడా ఉంది. అంతే కాకుండా ఆ వయస్సు నుంచే సౌందర్య సంరక్షణపై మక్కువ చూపుతూ, మానసిక వికాసంపై దృష్టి సారించలేరు. ముఖ్యంగా శారీరకంగా అనాకారిగా ఉండే పిల్లలు, దానిని లోపంగా భావించుకుంటూ, ఆత్మన్యూనతకు లోనవుతారు. మనోక్షేత్రంలో ఉత్తమమైన సంస్కారాల బీజాలు పడే పసిప్రాయంలో, బాహ్యసౌందర్యానికి ప్రాధాన్యం ఇవ్వకుండా, అంతఃసౌందర్యమనే ఉత్తమ విలువలను పెంపొందించే ప్రయత్నం చేయాల్సింది పెద్దలే! కానీ దురదృష్టవశాత్తూ ఆధునికత పేరుతో ఇలాంటి పోటీలను తల్లితండ్రులే ప్రోత్సహించటం బాధాకరం. అమాయకత్వానికి, నిర్మలత్వానికి, ఆటపాటలకు చిరునామాల్లాంటి చిన్నారులను అలాగే ఎదగనిద్దాం! ❖ (నవంబర్ 14న 'బాలల దినోత్సవం')

# సహనం, సేవలతో సహవాసం

**- శ్రీమతి టి. ఆశాలత**



"భర్త తిట్టాడని పిల్లలతో సహా భార్య ఆత్మహత్య"-ఇది చదువుతుంటే ఇంత బలహీనమైన మనసా? చిన్నమాటంటే ఇంత ఉక్రోషమా? అనిపిస్తోంది కదూ! ఇంట్లో గదులు విశాలంగా ఉంటాయి. కానీ మనస్సులు మాత్రం సంకుచితం. ఆనందం కోసం, మనశ్శాంతి కోసం అంటూ పబ్బులు, క్లబ్బుల వెంట పరుగులు. నిత్యం పోలీస్ స్టేషన్‌లలో కౌన్సిలింగ్. ఇది ఆధునిక యువతి జీవన సరళి.

ఆ గదిలో అసలు వసతులే లేవు. కాళ్ళు చాపుకొని పడుకోవాలంటే చుట్టూ సామాను. పైకి లేస్తే తక్కున తగిలే ఉట్లు. బయటకు రావాలంటే సగం వంగి రావాల్సిందే. ఎవరైనా ఆ గదిలో నివసించే ఆమెను చూడాలంటే గది బయట నిలబడాల్సిందే. ఎందుకంటే వారి శరీరం ఆ గది తలుపుల మధ్య నుంచి రాలేదు. అయినా ఆమె మనస్సు విశాలమంటే చాలా చిన్న విశేషణమే. ఆమె సహనాన్ని వర్ణించడానికి మాటలు చాలవు అనే కన్నా సాహసం అనడం సరైనది. ఎందుకంటే ఆమె జగన్మాత శారదాదేవి కాబట్టి! రామకృష్ణుల వారి ఆధ్యాత్మిక సాధనకు ఆలంబనగా నిలిచి దాదాపు 13 ఏళ్ళ పాటు ఆ చిన్న గదిలో కాళ్ళు ముడుచుకొని గోనెపట్టా, ముతక చాప మీద నిద్రపోవడం - ఇవన్నీ శారదామాతకు శ్రమ అనిపించలేదు. ఏ అసౌకర్యం దరిచేరలేదు. ఆ చిన్ని గూడునే ఆమె ఆనందనిలయంగా మలచారు. అత్త, భర్త, భక్తుల కోసం పడిన కష్టాన్ని తనకు లభించిన సేవగా పరిగణించారు. శారదాదేవి ఆచరణాత్మక జీవితంలో సహనం, ఓరిమి, సేవ అనేవి అత్యంత విశిష్టమైన సుగుణాలుగా చెప్పవచ్చు. అందువల్లనే గురుదేవుల ఆధ్యాత్మిక జీవితం పరిపుష్టమైంది.

కన్నతల్లి కన్నా అపురూపమైన అమ్మ మా కోసం ఇక్కడ ఉందని భక్తులు ఆరాటపడేవారు. పవిత్ర గంగాతీరాన అత్తగారు చంద్రమణి ప్రశాంతంగా కన్నుమూయగలిగారు. "పిచ్చివాడు" అని లోకం ముద్ర వేసిన వ్యక్తిని చైతన్య స్వరూపుడైన అవతారమూర్తిగా ఈ లోకం గుర్తించేలా ఆయన సేవకురాలైంది. ఆ సేవలో పరిపూర్ణమైన భక్తే ఇమిడి ఉంది. సేవను సైతం ఆధ్యాత్మిక సాధనగా మలుచుకున్న గొప్ప నైపుణ్యం అమ్మలో దాగి ఉంది.

"నేను మిమ్మల్ని సంసార కూపంలోకి దించడానికి రాలేదు. మీ సాధనకు సహాయకారిగా వచ్చా"నంటూ ఆ అవతారమూర్తి ఆదర్శ జీవితానికి చుక్కానిలా భాసిల్లింది. "నన్ను ఆరాధించినట్లే నా తదనంతరం నిన్ను కూడా ఆరాధిస్తారు. అప్పటి వరకూ కామార్పుకూర్‌లో ఆకుకూరల లాంటి వాటిని ఆహారంగా తీసుకుంటూ జీవితాన్ని గడుపు" అని చెప్పిన గురుదేవుల మాటను శిరసావహించి, ఎవరి నుండీ ఏమీ ఆశించకుండా, ఏమీ దొరకని రోజు అన్నం, ఉప్పు మాత్రమే కలుపుకొని సమయం, సందర్భానికి అనుగుణంగా జీవించడం ఆధునిక యువతికి అమ్మ నేర్పిన ఓ పాఠం.

కొద్దిపాటి అసౌకర్యం కలిగినా తిట్టుకోవడం, కొట్టుకోవడం, విడాకులు, విడిపోవడాలు, ఆత్మహత్యలకు పాల్పడడం ఈ ఆధునిక జీవితంలో యువతీ యువకులకు సహజ లక్షణాలుగా మారాయి. సహనం అనే గుణం లేకపోవడమే అందుకు కారణం. అద్భుతమైన క్షమాగుణం అమ్మకు సహజ లక్షణం అయింది. భూమాత దేనినీ తనకు బరువని తలపోయదు. అంతటి సహనగుణం మాతృదేవిలో ఉండడం వల్లే అందరినీ తన సొంతం చేసుకొని జగన్మాత అయింది.

ఇంటికి పెద్దదిక్కుగా కుటుంబ బాధ్యతలను తన భుజ స్కంధాలపై వేసుకున్న శారదామాత ధనం కోసం పోట్లాడుకునే కుటుంబ పరిస్థితుల మధ్య ఆమె ఏనాడూ సహనాన్ని కోల్పోలేదు. సోదరుల స్వార్థం, వారు వెలిబుచ్చే అసూయ, సంప్రదాయాన్ని పాటించాలనే నళిని పట్టుదల, రాధూ వక్రబుద్ధి, ఆమె వెర్రిబాగుల తల్లి అంతా కలసి మాతృదేవికి దుర్భర వేదన కలిగించారు. ఇలాంటి భరించలేని పరిస్థితుల్లోనూ మాతృదేవి తాముగా స్వీకరించిన బాధ్యతలను సహనంతో నిర్వర్తించారు. ఏనాడూ కలత చెంద కుండా, వైరాగ్యంతో జీవించిన తీరుతెన్నులు అందరికీ ఆదర్శ ప్రాయమవుతాయి.

ఆస్తుల పంపకం కోసం సోదరుల మధ్య ఏర్పడ్డ తగాదాలు, గందరగోళం మధ్య కూడా మాతృదేవి కనబరచిన ప్రశాంతత స్వామి శారదానందను ఎంతగానో అబ్బురపరిచింది. ఆయన ఒక బ్రహ్మచారితో "చూడు! వీరందరి పోట్లాటలతో మనం సహనాన్ని కోల్పోతాం. మాతృదేవిని చూడు! సోదరులు ఎన్నెన్ని సమస్యలు సృష్టిస్తున్నారో! కానీ ఒకింతైనా ప్రశాంతతను కోల్పోయారా! ఎలాంటి సమతాస్థితి! ఎలాంటి ప్రశాంతత!" అని అంటారు. ఇలాంటి పరిస్థితుల్లోనూ ప్రశాంతమైన జీవితాన్ని గడపడం సాధ్యమని ఆచరణలో చూపించడమే కాక, తమను ఆశ్రయించిన భక్తులకు ప్రశాంతతనూ, ఆధ్యాత్మిక పరమానందాన్నీ ధారపోశారు.

*(మిగతా 35వ పేజీలో...)*

క్షమ అనే కత్తిని ధరించినవారు లోకంలో సాధించలేనిది ఏమీలేదు. సహనాన్ని ఓ దోషంగా భావించి లోకం వారిని అసమర్థులుగా ముద్రవేస్తుంది. కానీ సహనమే సమర్థులకు భూషణం. - విదురనీతి







# పరిత్యాగికీ ఆశలపోరు!

- స్వామి జ్ఞానదానంద

సర్వసంగపరిత్యాగియై అరణ్యంలో కుటీరం వేసుకొని జీవించే ఓ సాధువుకు రెండు కౌపీనాలు ఉండేవి. ఒకరోజు ఒక కౌపీనాన్ని ఎలుక కొరికివేసింది. వాటిని ఎలుకల నుంచి కాపాడుకునేందుకు సాధువు ఒక పిల్లిని పెంచుకోసాగాడు. ఆ పిల్లిని పోషించుకునే నిమిత్తం ఒక ఆవును కూడా కొనుక్కున్నాడు. ఆవును చూసుకోవటం కోసం ఒక పనివాణ్ణి నియమించాడు. క్రమక్రమంగా ఆవుల సంఖ్య పెరిగింది. అవి మేయటానికి పచ్చికబయళ్ళను కొనుగోలు చేశాడు. ఆ బయళ్ళను సాగు చేసేందుకు అనేకమంది నౌకర్లను నియమించాడు.



ఈ విధంగా మెల్లమెల్లగా ఆ సాధువు కాస్తా, భూస్వామిగా మారిపోయాడు. అటు నుంచి ఆశ కాస్తా ఆస్తుల నుంచి అతివ వైపునకు మరలింది. చివరకు ఓ శుభముహూర్తంలో ఓ ఇంటివాడయ్యాడు. కొంతకాలం తరువాత అతడి మిత్రుడైన మరో సాధువు ఆ దారి గుండా వెళ్ళటం తటస్థించి, ఈ సాధువు సంసారాన్ని చూసి విస్తుపోయాడు; కారణమేంటని అడిగాడు. అప్పుడు ఆ సాధువు 'ఇదంతా ఓ కౌపీనంపై పెంచుకున్న ఆశతో దాపురించిన లంపటం' అన్నాడు. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ఈ దృష్టాంతాన్ని చెప్పి ఆశలపాశం ఎక్కడిదాకా తీసుకువెళుతుందో హెచ్చరించేవారు. అంత సులువుగా మనస్సు వైరాగ్యానికి సుముఖత చూపదు. ఏ క్షణంలో ఏ వైపు నుంచి వచ్చి కాటేస్తుందో తెలియని కాలసర్పం లాంటిది కోరిక. అలాంటి ఆ 'ఆశ' ఎంతటి పరిత్యాగినైనా పట్టిపీడిస్తుందని ఆదిశంకరాచార్యుల ప్రియశిష్యుడు సుబోధుడు 'భజ గోవిందం... భజ గోవిందం'లో గుర్తుచేస్తూ...

**అగ్రే వహ్నిః పృష్ఠే భానూ, రాత్రౌ చుబుక సమర్పిత జానుః।**
**కరతలభిక్ష స్తరు తలవాసః, తదపి న ముంచత్యాశా పాశః ॥**

'అగ్ని ముందరుంటుంది. సూర్యుడు వెనుక ఉంటాడు. రాత్రి చలికి ముడుచుకొని మోకాలికి గడ్డం ఆన్చి కూర్చుంటాడు. భిక్షాటనం చేసి జీవిస్తాడు. చెట్టుకిందే ఉంటాడు. కానీ ఆశలపాశాల నుంచి మాత్రం తప్పుకోలేడ'ని స్పష్టం చేస్తున్నాడు.

**కోరికలే కోరలు... :** సన్న్యాస ఆశ్రమంలో ఉన్నా, గృహస్థ ఆశ్రమంలో ఉన్నా ఆశలవలయం మాత్రం మనిషిని ఆవరించి ఉక్కిరిబిక్కిరి చేస్తూనే ఉంటుంది. బాహ్యప్రపంచాన్ని త్యజించి ఎంత అడవుల్లో కెళ్ళి ముక్కుమూసుకొని తపస్సు చేయాలని ప్రయత్నించినా మనస్సు మాత్రం పరిపరివిధాల పరుగెడుతూనే ఉంటుంది; కోరికల కాటుకు బలవుతూనే ఉంటుంది. అందుకే ముందు మనస్సును నియంత్రించకుండా ఎన్ని ఆశ్రమాలు మారినా ప్రయోజనం ఉండదు. అదేవిధంగా సన్న్యాసం తీసుకున్నంత మాత్రాన ఆధ్యాత్మికోన్నతిని సాధించేస్తామను కోవటం కూడా సబబు కాదు. వైరాగ్య, వివేకాలతో కూడిన జ్ఞానాన్ని సంపాదించినప్పుడే పరిత్యాగానికి సార్థకత కలుగు తుంది. అదే భావనతో మన సనాతన ధర్మం...

**నాశ్రమం కారణం ముక్తేః, దర్శనాని న కారణమ్।**
**తదైవ సర్వకర్మాణి, జ్ఞానమేవహి కారణమ్॥**

'సన్న్యాసాశ్రమం మోక్షానికి కారణం కాదు; అదే విధంగా శాస్త్రపఠనం కూడా కాదు; బాహ్యకర్మలూ కారణాలు కావు; జ్ఞానమొక్కటే కారణమని గ్రహించాల'ని స్పష్టం చేస్తుంది. ఈ మౌలికమైన సూత్రం తెలియక చాలామంది సన్న్యాస దీక్షతో ఏదో ముక్తిని పొందేస్తామన్న భ్రమలో ఉంటారు; అది పొరపాటు! ఇష్టాయిష్టాలను, రాగద్వేషాలను, మమకారవికారాలను మనస్సనే జోలెలో పెట్టుకొని హిమాలయాలకు వెళ్ళినా, వణుకే తప్ప వైరాగ్యం రాదు!

**అహంకారమే అసలు శత్రువు... :** ఆధ్యాత్మిక జీవనానికి ప్రధాన వైరి అహంకారమే! నేను ఈ లౌకికుల కన్నా ప్రత్యేకమైన వ్యక్తిని, వారిని ఉద్ధరించే సాధుపుంగవుణ్ణి అన్న అహంభావం చాలామంది సన్న్యాసులను కన్నూమిన్నూ కానకుండా ప్రవర్తించేలా చేస్తుంది. తత్ఫలితంగానే నేడు సమాజంలో ఆధ్యాత్మికవేత్తలమని చెప్పుకునే కొందరు సామాన్యజనులను తృణీకారభావంతో చూస్తూ ఉంటారు; మరికొందరు గోప్యంగా కామినీకాంచనాలను అనుభవిస్తూ, ఇతరులను మాత్రం వాటిని త్యజించమని ఉపదేశిస్తూ ఉంటారు. ఇలాంటి వ్యక్తులు ఎదుటివారిని కాదు కదా, తమను తాము కూడా ఉద్ధరించు కోలేరు. ఇలాంటివారిని ఉద్దేశించి "ఆధ్యాత్మిక జీవనానికి అనర్హుడైన సామాన్యవ్యక్తి కాషాయం ధరిస్తే, అహంకారం జనిస్తుంది. ఎదుటివారు తన విషయంలో ఒకింత ఉదాసీనతను ప్రదర్శించినా అతడికి కోపం తన్నుకుంటూ వస్తుంది" అనేవారు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస.

ఇంటిని, ఇంటివాళ్ళను వదులుకొని విరాగిగా కనిపిస్తూ ఆశ్రమాలలో జీవించే చాలామంది, సంసారుల కన్నా ఎక్కువగా మమకారవికారాలను పొందటం చూస్తూనే ఉన్నాం. అలాంటి వారు గృహస్థుల కన్నా దయనీయస్థితిలో కొట్టుమిట్టాడుతూ ఉంటారు. అలాంటి వారు ఏకాంతంలో ఉన్నప్పుడు ఒక్కసారి వారి ఆలోచనల సరళి గురించి, ప్రవర్తన గురించి సమీక్షించుకోవాలి. 'నేను ఎటు వెళుతున్నాను? తల్లితండ్రులను, తోబుట్టువులను వదులుకొని నేను ఇక్కడికి ఎందుకు వచ్చాను? అని ఒకటికి పదిసార్లు ఆలోచించుకోవాలి. మనస్సులో ఆశలు మొలకెత్తినప్పుడు, అంకురదశలోనే అంతం చేసే ప్రయత్నం చేయాలి. అప్పుడు మనస్సుకు శాంతి; మనకూ శాంతి!

**పరమశాంతే పరిత్యాగం... :** సాధుజీవనంలో అశాంతికి తావే ఉండకూడదు. మనస్సులో అశాంతి అలముకుందంటే, ఆశకు ఎక్కడో భంగం వాటిల్లుతున్నట్లే! తమకంటూ ప్రత్యేకమైన ఓ బంధనమే లేనప్పుడు అశాంతికి గురి కావలసిన అవసరమేముంది? అయినా మనశ్శాంతి కొరవడుతోందంటే, మనం ఇంకా సన్న్యాస ధర్మానికి తగిన పరిణతిని సాధించలేదనే అనుకోవాలి. ప్రస్తుత సాధుసమాజంలో కొద్దిమంది సర్వసంగ పరిత్యాగులుగా కనిపిస్తూనే ఆశనిరాశలతో అలజడికి గురవు తున్నారు. భక్తులు చేసే పాదపూజల కోసం, పలకరింపుల కోసం పరితపిస్తున్నారు; పక్కసాధువుకు ఏ కాస్త పేరొచ్చినా అసూయతో రగిలిపోతున్నారు. తపస్సు కోసం అడవికి వచ్చిన జడభరతుడు, జింకపిల్లపై ప్రేమపెంచుకున్నట్లు కొందరు ఆధునిక సన్న్యాసులు అనవసరమైన వస్తువాహనాలపైనా, భక్తబృందాలపైనా మమకారాన్ని పెంచుకుంటున్నారు. పూర్వపు పేరు, ప్రేమలు కాదనుకొని వచ్చిన ఇలాంటి సాధువులు సంసారమాయలో పడి కొట్టుమిట్టాడే లౌకికుల్లా, సంకుచితంగా ప్రవర్తిస్తూ ఉంటారు; అసహనానికి గురవుతూ ఉంటారు. ఇది సన్న్యాసధర్మానికే కళంకాన్ని తెచ్చిపెడుతుంది. శ్రీమద్భాగవతంలో కపిల మహర్షి...

**తితిక్షవః కారుణికాః సుహృదః సర్వదేహినామ్।**
**అజాతశత్రవః శాన్తాః సాధవః సాధుభూషణాః॥**

'ఓర్పు కలిగినవారు, కరుణకలవారు, అన్ని ప్రాణులయందు దయగల హృదయం కలవారు, అజాతశత్రువులు, పరమ శాంతచిత్తులు అయినవారు సాధువులు' అంటూ నిర్వచిస్తారు. ఇలాంటి శాస్త్రపఠనంపై, జపధ్యానాది సాధనలపై దృష్టి సారించకపోవటం వల్లనే కొందరు ఆధ్యాత్మికవేత్తలు మానసికంగా బలహీనులవుతూ ఉన్నారు. అల్పమైన విషయాలకే పరిమితమవుతూ ఉన్నారు.

**బంధాలు పెంచుకుంటే బాధలే... :** శ్రీమద్భాగవతాన్ని పరీక్షిత్తు మహారాజుకు బోధించిన శుకమహర్షి ఏ ప్రాంతంలో కూడా ఆవుపాలు పితికినంత సేపుకన్నా ఎక్కువ సేపు ఉండేవారుకాదట! అంతకు మించి ఆ ప్రాంతంలో ఉంటే అక్కడి మనుష్యులతో, పరిస్థితులతో అనుబంధం ఏర్పడుతుందని కదిలి వెళ్ళిపోయేవారట! సాధువర్తన అంత బంధరాహిత్యంగా సాగిపోవాలి. ఆధునిక ప్రపంచంలో అంత కచ్చితంగా సన్న్యాసజీవనం సాధ్యం కాకపోవచ్చు. కానీ మానసికంగా మాత్రం ఎవరిపైనా అత్యంత ఆత్మీయతను పెంచుకోకుండా, కేవలం భగవంతుడితోనే బాంధవ్యాన్ని కొనసాగిస్తూ గడపవచ్చు. పూర్వయుగాల్లా కేవలం జపతపాదులతో సన్న్యాస జీవనాన్ని కొనసాగిస్తూ, మోక్షాన్ని ప్రాప్తించుకోవటం కలియుగంలో సాధ్యం కాకపోవచ్చు. అందుకే స్వామి వివేకానంద ప్రబోధించిన 'ఆత్మనో మోక్షార్థం జగత్ హితాయ చ' నినాదంతో సాధుపుంగవులు కూడా కొంత కర్మయోగాన్ని అవలంబిస్తూ ఆ భగవంతుడిని చేరుకోవచ్చు. కానీ చేసే ఆ కర్మలకు జ్ఞానం, వివేకం, నిస్సంగత్వం తోడవ్వాలి. అప్పుడే ఆ కర్మఫలాలు సన్న్యాసిని బంధాల్లో బందీని చేయవు; ఆశల వలయంలో చిక్కుకోనివ్వవు. ఇలా మనసా, వాచా, కర్మణా సాధువు అయిన వ్యక్తి స్వచ్ఛమైన సన్న్యాస ఆశ్రమ ధర్మాన్ని పాటిస్తే, ఆయన్ని అనుసరించే శిష్యులకే కాకుండా, గృహస్థులుగా ఉంటూ తరించాలనుకునే వారికి కూడా ఆదర్శంగా ఉండగలడు. అందుకే భగవద్గీతలో...

**శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।**
**ధ్యానా త్కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతి రనంతరమ్॥**

'వివేకరహితమైన సాధనలకంటే జ్ఞానము; జ్ఞానము కంటే చిత్త ఏకాగ్రతకు హేతువైన ధ్యానము; ధ్యానము కంటే కూడా సర్వకర్మ ఫలత్యాగమే ప్రశస్తమైనది. ఇలాంటి త్యాగం వలన లభించే మనశ్శాంతి త్యాగం కంటే గొప్పద'ని శ్రీకృష్ణభగవానుడు వివరిస్తాడు. ❖

ఎవడు మర్నాడు ఏం తింటానో, ఏం ధరిస్తానో, ఎక్కడ ఉంటానో అనే చింత కించిత్తూ లేక, లౌకిక విషయాలను పూర్తిగా విడిచిపెడతాడో, వాడే సన్న్యాసాన్ని స్వీకరించడానికి అర్హుడు. - శ్రీరామకృష్ణులు

# రామకృష్ణ మిషన్, కడప





(రామకృష్ణమిషన్ అనుబంధ శాఖ, బేలూరుమఠం పోస్టు, హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్ 711202)

పుట్లంపల్లి, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప – 516002, ఫోన్: 200120, 200633

నగర కేంద్రం: రామకృష్ణమఠం, ట్రంకురోడ్డు, కడప – 516001, ఫోన్: 241633

Email: kadapamath@yahoo.com    Web site: www.rkm-kadapa.org

## భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ సంప్రోక్షణ మహోత్సవం

### విజ్ఞప్తి

మూర్తిత్రయం యొక్క అపారమైన కృపా కటాక్షాలతో భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయ నిర్మాణం దాదాపు పూర్తి కావస్తున్నది (రూ. 140 లక్షల అంచనా వ్యయంతో ప్రారంభమైన ఈ ఆలయ నిర్మాణ పనులు పూర్తి కావడానికి ఇంకా సుమారు రూ.20 లక్షలు కావలసివున్నది).

భగవాన్ శ్రీరామకృష్ణుల నూతన దేవాలయ సంప్రోక్షణోత్స వాలను **2012 నవంబర్ 20వ తేదీ నుండి 23వ తేదీ వరకు** నిర్వహించదలచాం. 2012 నవంబర్ 22వ తేదీ, జగద్ధాత్రి పూజ పవిత్ర దినాన భగవాన్ శ్రీరామకృష్ణుల పాలరాతి విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమం జరుపబడును. నాలుగు రోజుల పాటు జరిగే ఈ మహోత్సవాల్లో పాల్గొనడానికి భక్తులకు, శ్రేయోభిలాషులకు ఇదే మా సాదర ఆహ్వానం.

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ వారిచే ఆలయ సంప్రోక్షణ జరుపబడును. ఈ మహోత్సవాల్లో భాగంగా వాస్తుహోమ, ప్రత్యేకపూజ, ప్రవచనాలు, భజనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడును. ఈ కార్యక్రమాల్లో వివిధ మఠ కేంద్రాల నుండి సుమారు 250 మంది స్వామీజీలు, వివిధ ప్రాంతాల నుండి సుమారు 5,000 మంది భక్తులు పాల్గొంటారని అంచనా.

నాలుగు రోజుల పాటు జరిగే ఈ ఉత్సవాలకు సుమారు రూ. 45 లక్షలు వ్యయం అవుతుందని అంచనా. ఈ మహోత్సవాలను నిర్వహించడానికి ఉదార హృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ శక్తికొలది విరాళాలను ఇచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

విరాళాల్ని Ramakrishna Mission, Cuddapah (కడప పేరును బ్యాంకుల్లో Cuddapah గానే సంబోధిస్తున్నారు) పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa - 516 002 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

అదే విధంగా స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలోని మా అకౌంట్‌కు 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా కూడా మీరు విరాళాల్ని పంపవచ్చు. SBI, RIMS Branch, Ramakrishna Mission, A/c No: 30186936408, బ్యాంక్ కోడ్ : SBIN 0010107. 'ఇ-ట్రాన్స్‌ఫర్' ద్వారా పంపిన విరాళాల వివరాలను మాకు వెంటనే తెలియపరచగలరు.

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

భగవత్సేవలో... **స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి





# మనస్సు స్వాధీనమవ్వాలంటే...

- స్వామి యతీశ్వరానంద

మనకు ధ్యానం కోసం కూర్చోవాలన్న తలపు రాగానే, రకరకాల ప్రతిబంధకాలు మనస్సులో వచ్చి చేరతాయి. ధ్యానానికి కూర్చోగానే ఎక్కడ లేని అశాంతి చుట్టుముడు తున్నట్లు అనిపించవచ్చు. అంతే కాదు. ఉన్మత్తమైన ఆలోచనల ప్రవాహాలు అంతు లేకుండా చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేయవచ్చు. జపధ్యానాలు అసంభవమైన ప్రయాసలుగా తోచవచ్చు. కానీ ఈ కష్టం అందరికీ ఎదురయ్యేదే. కాబట్టి బెంబేలు పడకూడదు.

అన్ని మతాలకు చెందిన యోగులూ ఆధ్యాత్మిక సాధనకు అవసరమైన పవిత్రతను గురించి చెప్పారు. శరీరం, ఇంద్రియాలు, మనస్సు, అహంకారం మొదలైనవాటిని పవిత్రీకరించుకోవాలని నొక్కి వక్కాణించారు. మన ఇంద్రియాలు ఎల్లప్పుడూ బయటకు పరుగులు తీస్తుంటాయి. అది వాటి సహజ ప్రవృత్తి. పూర్వ సంస్కారాల ముద్రల వల్ల మన మనస్సు ఎప్పుడూ ప్రభావితం అవుతూ ఉంటుంది. ఇంతేకాక ఒక్కోసారి, మన ఆలోచనా ప్రవాహం ఒక వైపు సాగుతుంటే, మరోవైపుగా మన అనుభూతులు సాగుతుంటాయి. సంకల్పశక్తి మూడోవైపు పరుగులు తీస్తుంటుంది. ఇదంతా ఇలా ఉంటే, అహంకారం విపరీతమైన పోకడలు పోతుంటుంది. మన అహంకారాన్ని ఒక నీటిబుడగతో పోల్చవచ్చు. ఆ అహంకారం తన గురించి చాలా ఎక్కువగా ఊహించుకుంటూ ఉంటుంది. తన పక్కన ఉన్న బుడగలనూ, తనకు ఆధారభూతమైన నీటిని కూడా మర్చిపోయి, వృద్ధి చెందాలని చూస్తుంది. మరి ఏమవుతుంది? బుడగ పగిలిపోతుంది.

మన ముందు కనిపిస్తున్న ఈ ప్రయాసలను చూసి భయపడవలసిన పని లేదు. భగవద్గీతలో అర్జునుడు, "ఓ కృష్ణా! నీవేమో మానసిక నియంత్రణ గురించీ, ఆత్మ సాక్షాత్కారం గురించీ చెబుతున్నావు. కానీ మనస్సేమో కల్లోలంగా ఉంది. దానిని ఏ మాత్రం నిగ్రహించ లేకుండా ఉన్నాను" అని మొరపెట్టుకుంటాడు. జగద్గురువు శ్రీకృష్ణుడు ఈ సమస్యను ఎంతో దయతోనూ, ప్రేమతోనూ అర్థం చేసుకుని, "నీవు చెప్పేది నిజమే! కానీ అభ్యాస, వైరాగ్యాల ద్వారా కల్లోలంగా ఉన్న మనస్సును సైతం స్వాధీనం చేసుకోవచ్చు" అని వివరిస్తాడు.

**పరిసరాలను ఆక్షేపించవద్దు :** మన ప్రయత్న లోపం వల్ల చుట్టూ ఉన్న పరిసరాలనూ, పరిస్థితులనూ అదేపనిగా ఆక్షేపించడం మన స్వభావమై పోయింది. మనం ఉన్న పరిసరాలనూ, చేస్తున్న ఉద్యోగాన్నీ మార్చినా, లేదంటే ఉన్న ఊరినే మార్చినా సరే, ఈ ఆక్షేపణలకు ఎప్పటికీ అంతు ఉండదు.

ధ్యాన సాధనకు 'ఆదర్శవంతమైన పరిస్థితులు' అంటూ ఎక్కడా, ఎవరికీ ఉండవని తెలుసుకోవాలి. "పరిస్థితులు సరిగ్గా లేనప్పుడు ధ్యానం ఎలా చేయగలం?" అన్న నెపం మీద మనం సాధనను వాయిదా వేస్తుంటాం. ఎంత కలతగా ఉన్నా, నిద్ర పోవడానికి మనం ప్రయత్నం చేస్తూనే ఉంటాం. అలాగే ధ్యానం కూడా! ఎలా? ఆ పరిసరాల నుంచి, లేదంటే స్థితిగతుల నుంచి మన మనస్సును వెనక్కు తీసుకోవాలి. ఇది అభ్యాసం ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. అలాగే అనారోగ్యంగా ఉన్నప్పుడు ధ్యానం చేయలేం. "స్వామీజీ! ధ్యానానికి కూర్చోగానే తలనొప్పి వస్తుంది" అని చాలామంది చెప్తారు. కొంతమందికి ధ్యానమే ఒక తలనొప్పి! మీరు చక్కటి వ్యాయామంతో ఆరోగ్యాన్ని సంరక్షించుకోవాలి. అందువల్లనే 'భగవద్గీత'లో *(6.17)...*

**యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।**
**యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥**

*"మితంగా భుజించేవారికీ; వినోదాన్ని పరిమితులలో ఉంచేవారికీ; పని, నిద్ర, మేలుకుని ఉండడం మొదలైన అన్ని విషయాలలో 'అతి'ని వర్జించినవారికీ యోగం సులభతర మవుతుంది. అంతేకాదు! వారి దుఃఖాలను దూరం చేస్తుంది" అని శ్రీకృష్ణుడు సూచించాడు.*

కాబట్టి 'మధ్యే మార్గం'లో ప్రయాణిస్తూ, విపరీతాలను వదిలిపెట్టాలి. దీనివల్ల ఆధ్యాత్మిక పథానికి కావలసిన సత్తువనూ, స్థైర్యాన్నీ కూడగట్టుకోవచ్చు. ❖

తెలుగుసేత: ఎమ్. శివరామకృష్ణ

మనస్సును దాని ఇష్టం వచ్చినట్లు కొంతసేపు తిరగనీ. అలా తిరుగుతున్న మనస్సును తీసుకువచ్చి ఒకే భావంలో నిలుపు. ఇలా కొంతకాలం అభ్యసిస్తే మనస్సు మన స్వాధీనమవుతుంది. - స్వామి వివేకానంద

# శక్తి సమన్విత...
# వనిత

– హేమంత్ కుమార్



పంకంలో పుట్టినా పవిత్రతనే పరిమళంగా వెదజల్లే సల్లక్షణం తామరలది. స్త్రీలు కూడా పుట్టిన ఆభిజాత్యంతో, పెరిగిన వాతావరణంతో సంబంధం లేని సులక్షణ సంజాతలు. అనాదిగా వారి వారి పరిస్థితులు ఏవైనా, పరిమితులు ఎన్ని ఉన్నా వారి వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని నిలుపుకొంటూ వస్తున్నారు. బాహ్య వనరుల బలం కన్నా అంతర్గత శీలసంపదే వారి శాశ్వత విజయాలకు కారణం. స్త్రీలలోని సద్గుణాలు తెచ్చిపెట్టుకున్న అలంకారాలు కావు. పువ్వుల్లోని వర్ణాల్లా, పరిమళాల్లా సహజంగా అమరినవి. నలిపినా, నాశనం చేసినా చెక్కు చెదరనివి.

'మాతృదేవోభవ' అంటూ తల్లి రూపంలోని స్త్రీని శిరోధార్యం చేసుకున్న దేశం మనది. కాలానుగుణంగా కొన్ని మార్పులు, చేర్పులు సహజం. అయితే ఈ మార్పులు, చేర్పులతో సంబంధం లేని శాశ్వత తేజోరాశి స్త్రీల సుగుణరాశి. వారి సహనం సహజ కవచ కుండలాల్లా వారిని అంటిపెట్టుకునే ఉంటుంది. భారతీయ స్త్రీలు సహనం, ఓరిమి, మాతృత్వపు మృదుత్వాలకు ప్రతీకలు. ఇందుకు సీత, ద్రౌపది, శారదాదేవి లాంటి ఎందరో స్త్రీ రత్నాలే ఉదాహరణ.

ధర్మనిరతి ముందు వ్యక్తిగత అభిమానాన్ని స్త్రీలు తృణప్రాయంగా ఎంచారు. భర్తలతో సమానమైన శక్తిపరులై నప్పటికీ, అవసరమైనప్పుడు తప్ప ఇతర సమయాల్లో తమను తాము మరుగుపరచుకోవడం స్త్రీలకున్న ఉత్కృష్టగుణం. సీత, సావిత్రి, అనసూయ, లోపాముద్ర, కుంతి, గార్గి, మైత్రేయి, శారదాదేవి – ఇలా ఎందరని!! వారెవరూ ఎన్నడూ తమ అహాన్నీ, ఆభిజాత్యాన్నీ ప్రదర్శించలేదు. ఎడమచేతితో శివుని విల్లును పక్కకు నెట్టిన సీత, గడ్డిపోచతో రావణుడంతటి వాణ్ణి నిలువరించిన సీత... భర్త కర్తవ్యాన్ని నెరవేర్చడంలో తన వంతు సహకారాన్ని అందించే క్రమంలోనే హనుమ వెంట రాముని చేరే అవకాశం వచ్చినా తోసిరాజంది.

మేలి ముసుగుల చాటున ముఖాన్ని దాచుకున్న స్త్రీలు రగిలే అగ్ని పర్వతాలు. ఎక్కుపెట్టిన శివధనువులు. దేవతలను కూడా లాలించగల లాలిత్య హృదయులు. శాసించగల శక్తి సంపన్నులు. లోకకల్యాణార్థం మింగిన గరళంతో దహించుకు పోతున్న శివుణ్ణి హిమసమం చేసింది గంగాదేవి. నరసింహావ తారంతో ఉగ్రుడై శాంతసఖ్యం కాని విష్ణువును శాంతి స్వరూపుణ్ణి చేసింది చెంచులక్ష్మి రూపం లోని లక్ష్మీదేవి. పురుషుడిలో రోషాన్ని రెచ్చగొట్టి కదనానికి కాలు దువ్వేలా చేసినా, ఒక్క కంటి చూపుతో శాంతి కాముకుణ్ణి చేసినా అది స్త్రీకే చెల్లు.

ఉత్తములెప్పుడూ సందర్భాన్ని బట్టి ఒదిగి ఉంటారేమో కానీ తమ ఉత్కృష్టత నుండి దిగజారరు. నవరసాలూ కలబోసి నింపిన ఓ అమృత కలశం స్త్రీ. ఆమెలోని ప్రధాన రసం మాతృత్వం.

శ్రీరాముడు పూర్తి ప్రేమ విశ్వాసాలతో స్వీకరించే తరుణం ఏతెంచినా సీతాదేవి భర్త దరి చేరేందుకు నిరాకరించింది. ఆమె తన వ్యక్తిత్వాన్నీ, ఆత్మగౌరవాన్నీ నిలబెట్టు కోవలసిన, వ్యక్తీకరించవలసిన సరైన సమయమది. భర్త సాన్నిధ్యానికీ, కుమారుల సమక్షానికీ, రాజైశ్వర్య అనుభవానికీ ప్రలోభపడకుండా తన కర్తవ్యపాలన పూర్తయిన మరుక్షణం తల్లి భూదేవి ఒడిలోకి చేరిపోయింది. స్త్రీ ఎవరయినా, ఎట్టి పరిస్థితుల్లో ఉన్నా సమయం వచ్చినప్పుడు ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకుంటుందని అనడానికి ఇంతకన్నా ఉదాహరణ మరొకటి అవసరం లేదు కదా! తనకు జరిగిన దారుణమైన అవమానానికై ఒక్క జుట్టుముడి విదిలింపుతో కురు సామ్రాజ్యాన్నే భీకర కురుక్షేత్రాన్ని చేసిన ద్రౌపది కన్నా అభిమానధనులు, రోషవంతులు ఎవరుంటారు? "ధర్మరాజు తన్నోడి నన్నోడెనా? నన్నోడి తన్నోడెనా?" అంటూ మేధాపూర్వక ప్రశ్నతో కురుసభనే ఉక్కిరిబిక్కిరి చేసిన ద్రౌపది స్త్రీ జాతికి ప్రతినిధే కదా! మహాపతివ్రతా శిరోమణి శారదాదేవి అవసరమైన సందర్భాల్లో గురుదేవుల మాటనే తోసిరాజన్న సందర్భాలెన్ని లేవు? కాలం ఏదైనా, సందర్భం ఏదైనా స్త్రీ తనలోని శిరీష కోమలత్వంతో పాటు వజ్రసదృశ వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తూనే ఉంది. ఇలాంటి సందర్భోచిత నిర్ణయాలు, స్వేచ్ఛాపూరిత ప్రవర్తన ఒకరి దయతోనో, ప్రోద్బలంతోనో వెలికి వచ్చేవి కావు. అదంతా స్త్రీలోని అంతర్లీన సహజ వ్యక్తిత్వ ప్రభ మాత్రమే.

వీళ్ళంతా పౌరాణిక స్త్రీలు అని కొట్టిపారేయడానికి లేదు. మద్యపాన నిషేధానికై తాగుబోతు పురుషులకూ, మద్యం వ్యాపారులకూ వ్యతిరేకంగా ఉద్యమం నడిపిన ఓ వృద్ధ మహిళ నేటి మహిళల మనోదారుఢ్యానికీ, ప్రలోభరాహిత్యానికీ ప్రతీక. గులాబీపువ్వు కోమలమే. దానికి ఇవ్వవలసిన గౌరవాన్ని దానికి ఇవ్వవలసే ఉంది. నలపాలని అనుకుంటే క్రింది నుంచి కంటకమై రక్తం కళ్ళ జూస్తుంది. ❖




– స్వామి వివేకానంద



# మన ధర్మమే మన జీవన విధానం

భారతదేశంలో ప్రజలకు రుచించే విషయం 'మతం' ఒక్కటే! ఒక జాతి అభిరుచి అంతా మతాదర్శాల్లో ఉండడం మంచిదా? లేక రాజకీయాదర్శాల్లో ఉండడం మంచిదా? అని నేనిప్పుడు తర్కించబోవడం లేదు. మంచికో, చెడుకో మన అభిరుచులు మతంలో లగ్నమై ఉన్నాయి. మీరు దాన్నిప్పుడు మార్చలేరు. దాన్ని నాశనం చేసి, దాని స్థానంలో ఇంకొకదాన్ని తెచ్చిపెట్టనూ లేరు. బాగా పెరిగిన ఒక పెద్ద చెట్టును ఒక చోటు నుండి తీసి వేరొక తావున నాటి వెంటనే వేరూనేలా చేయడం అసాధ్యం. మతధర్మ ప్రవాహం వేలాది సంవత్సరాల నుండి భారతదేశంలో ప్రవహిస్తోంది; మంచికో, చెడుకో భారత వాతావరణం అలాగే శతాబ్దాల నుండి మతాదర్శాలతో నిండి మెరుస్తూ ఉంది. మంచికో, చెడుకో మనం మతాదర్శాల్లో పుట్టి అందులోనే పెరిగాం. అది మన రక్తంలో జీర్ణించుకుపోయింది. ప్రతి నాళంలోని జీవకణాల్లోనూ అది చొరబడింది. అది మన శరీరంతో సారూప్యాన్ని పొందింది. అది మన ప్రాణాలకే ఆయువుపట్టయింది. తాను మలచుకొన్న మార్గం వెంబడి యుగయుగాలుగా ప్రవహిస్తున్న ఈ మతవాహినిని పూడ్చివేయడం సాధ్యమా? ఒకవేళ అలా పూడ్చినా దాని దుష్ఫలితాలను అనుభవించకుండా ఉంటారా? గంగాప్రవాహం వెనుకకు మరలి, హిమగిరి శిఖరాలను ఎగబ్రాకిపోయి కొత్త మార్గాన్ని అవలంబించాలని మీరు కోరుతున్నారా? అది సంభవమైనా ఈ భారతమాత తనకు సహజమైన ఆధ్యాత్మిక మార్గం నుండి తొలగి రాజకీయాది మరొక కొత్త మార్గాన్ని తొక్కడం మాత్రం అసంభవం. భారతదేశానికి ఆధ్యాత్మిక మార్గమే సుగమ మార్గంగా కనిపిస్తోంది. మత మార్గాన్ని అనుసరించి నడవడమే భారతదేశ జీవన విధానం.

మన మతం ఈ ప్రపంచ భోగాల కోసమై పాకులాడదు. 'మూడునాళ్ళ ముచ్చటైన ఈ క్షుద్ర భోగమయ ప్రపంచాన్ని మన సర్వస్వంగా భావించరాదు. అది జీవిత పరమగమ్యం కాదు' అని బోధిస్తోంది కాబట్టే మన ఈ మతాన్ని సత్యమంటున్నాం. నాలుగడుగుల వ్యాప్తి మాత్రమే ఉన్న ఈ చిన్ని వసుధాచక్రం మన మతదృష్టికి హద్దులు పెట్టజాలదు. మన గమ్యం చాలా దూరంగా ఉంది. ఇంద్రియాలను దాటి, ఆకాశాన్ని అతిక్రమించి, కాలానికి అతీతంగా పోయి చివరకు మన గమ్యాన్ని చేరినప్పుడు ఈ ప్రపంచం కొంచెం కూడా దృష్టి గోచరం కాదు. అక్కడ సర్వాతీతమై ఒప్పే ఆత్మ విభూతి మహాసముద్రంలో ఈ బ్రహ్మాండమే ఒక చిన్న చుక్కగా కనిపిస్తుంది! "బ్రహ్మ సత్యం, జగత్తు మిథ్య; మీ ఐశ్వర్యమంతా బుగ్గి; మీ బలమంతా క్షుద్రం; జీవితం దుఃఖమయం" అని మతం చెబుతుంది. కాబట్టే అది సత్యమైంది! వైరాగ్యాన్ని ఉపదేశించి యుగయుగాల నాటి దివ్యజ్ఞానాన్ని బోధిస్తుంది కాబట్టే మన మతాన్ని సత్యమనడం! మన ప్రాచీనులు సాధించిన ఆధ్యాత్మిక పరిణతికీ, ప్రజ్ఞారాశికీ వారసులమైన మనతో పోల్చిచూస్తే ఇతర జాతులు నిన్న మొన్నటి పసిబిడ్డలు! వాళ్ళను చూసి "ఓ బిడ్డలారా! మీరు ఇంద్రియ దాసులు. ఇంద్రియ భోగాలు అశాశ్వతాలు; ఆత్మ వినాశకాలు. వాటి మూడునాళ్ళ ముచ్చట చివరకు మిమ్మల్ని భ్రష్టులను చేస్తుంది. వాటిని వదలండి; ఇంద్రియలోలులు కాకండి!" అని హైందవ మతాదర్శం ఎలుగెత్తి చాటుతోంది. పరమార్థాన్ని చేరే త్రోవ – వైరాగ్యమే! అంతేతప్ప, భోగం కాజాలదు. కాబట్టి మనదొకటే నిజమైన మతం. ❖




- స్వామి మేధానంద పురి

- ఎమ్. నారాయణన్, చిత్తూరు

? : కనకధారా స్తోత్రం ఎవరి చేత, ఎచ్చోట, ఏ సందర్భంగా గానమైంది?

✍: ఆదిశంకరాచార్యులు భిక్షకు వెళ్ళినప్పుడు ఒక పేద స్త్రీ, బ్రహ్మచారికి ఏమీ ఇవ్వలేక పోతున్నానని కంటతడి పెట్టుకుని ఇల్లంతా వెతికి, ఒక ఎండిపోయిన ఉసిరికాయ శంకరుల జోలిలో వేసింది. ఆమె దీనావస్థను చూసి శంకరుల హృదయం ద్రవించి పోయింది. అప్పుడు వారు ఈ 'కనకధారా స్తవం' ఆశువుగా చెప్పి, మహాలక్ష్మీదేవిని ఆహ్వానించారు. ఆమె ప్రత్యక్షమై, 'ఎందుకు పిలిచావు నాయనా?' అని అడిగింది. 'ఈ



పేద స్త్రీకి సంపదను ప్రసాదించమ'ని శంకరులు కోరారు. దానికి లక్ష్మీదేవి, 'పూర్వ జన్మలలో ఈమె ఎవరికీ ఏ దానమూ చేయలేదు. ఎలా సంపదలివ్వగలన'ని ప్రశ్నించింది. దానికి శంకరులు, 'జ్ఞాని అయిన నాకు ఈమె ఉసిరికాయ ఇచ్చింది. దాని ప్రతిఫలాన్నే ప్రసాదించు' అని ప్రార్థించారు. శంకరులిచ్చిన సమాధానానికి లక్ష్మీదేవి ప్రీతి చెంది, ఆమె ఇంటి వాకిటి ముందు బంగారు ఉసిరికాయలు కురిపించింది. కనకమంటే బంగారం. బంగారు ఉసిరికల వర్షాన్ని కురిపించింది గనక ఈ స్తోత్రాన్ని 'కనకధారా స్తోత్రం', 'కనకధారా స్తవం' అంటారు.

- సిహెచ్. సద్గుణ, హైదరాబాదు

? : 'ఈ జన్మలో చేసిన పాపపుణ్యాలకు అనుగుణంగా వచ్చే జన్మలో ఫలితాలు ఉంటాయి' అని అంటారు. కానీ "భూలోకంలో చేసే పాప పుణ్యాలకు స్వర్గ నరకాలలో శిక్షలు, సుఖాలు ఉంటాయి" అంటారు. రెండింటిలో ఏది నిజం? మరణం అంటే శరీరాన్ని వదలడం కదా! శరీరాన్ని భూలోకంలో వదిలాక ఇక స్వర్గ, నరకాలలో సుఖాలు, శిక్షలు శరీరానికి ఎలా వేస్తారు? అది ఎలా సాధ్యం?

✍: ఈ జన్మలో చేసిన పాప పుణ్య ఫలితాలు తరువాత వచ్చే జన్మలలో అనుభవించి తీరాలి. మరణమంటే స్థూల, సూక్ష్మ శరీరాలు విడిపోవడం! సూక్ష్మ శరీరంలో పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ ప్రాణాలు, మనోబుద్ధి చిత్తాహం కారాలు ఉంటాయి. సూక్ష్మ భూతాలతో తయారైన ఈ శరీరం ముక్తి కలిగే వరకు జన్మలెత్తుతూనే ఉంటుంది. కానీ ఈ స్థూల దృష్టికి గోచరం కాదు. స్వర్గంలో సంపూర్ణ పుణ్యవంతులకు శరీరం సంకల్పం ద్వారా కలుగుతుంది. "దేవా న ఖాదంతి న పిబంతి దృష్ట్వా ఏవ తృప్యంతి" - దేవతలు తినరు, తాగరు, కేవలం దృష్టిపాతంతో సూక్ష్మాంశాన్ని గ్రహిస్తారు. వారిది అన్నగత శరీరం కాదు. వారి భోగ క్షయంలో చింత ద్వారా ఎండకు మంచుగడ్డ కరిగినట్లు వారి శరీరము సమసిపోతుంది. పాపాత్ములకు నరకయాతన శరీరం వల్ల లభిస్తుంది. ఆ శరీరాలను రంపాలతో కోసినా, నిప్పుతో కాల్చినా, నూనెలో వేయించినా ప్రాణం విడివడదు. పాప దుఃఖాన్ని అనుభవిస్తూనే ఉంటారు. అంతేగాక పుణ్యపాపాలను మూడు సంవత్సరములలో, మూడు నెలల్లో, మూడు పక్షాలలో, లేక మూడు రోజులలో ఈ పృథ్వీలోకంలోనే అనుభవిస్తారు. ఈ పైన చెప్పిన విషయాలకు శాస్త్రమే ప్రమాణము. అందుకే గీతాచార్యులు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యా వ్యవస్థితౌ" అని చెప్పారు. ❖

## పండుగలు-పర్వదినాలు

**నవంబర్ - 2012**

| | | | |
|---|---|---|---|
| 10 | శనివారం | : | ఏకాదశి |
| 13 | మంగళవారం | : | దీపావళి - కాళీపూజ |
| 24 | శనివారం | : | ఏకాదశి |
| 25 | ఆదివారం | : | స్వామి సుబోధానంద జయంతి |
| 27 | మంగళవారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |

**డిసెంబర్ - 2012**

| | | | |
|---|---|---|---|
| 09 | ఆదివారం | : | ఏకాదశి |
| 21 | శుక్రవారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 23 | ఆదివారం | : | వైకుంఠ ఏకాదశి |
| 24 | సోమవారం | : | క్రిస్టమస్ ఈవ్ |

అన్నమయ్య పదామృతం

పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు
ధర మమ్ము విచారించదగు నీకు నమ్మా ॥

కమలజ గన్న తల్లి కాముని కన్నతల్లి
అమరుల గన్న తల్లి ఆదిమలక్ష్మి
విమలపు నీపతికి విన్నపము సేసి మమ్ము
నెమకి యేలితి దయ నీకే తగునమ్మా ॥

కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ
దోమటి చల్లని చంద్రు తోబుట్టుగ
నీ మగని పంపునను నిజసిరులిచ్చితివి
నేమపు వితరణము నీకే తగునమ్మా ॥

పాలజలధి కన్యవు పద్మాసనివి నీవు
పాల పండే శ్రీవేంకటపతి దేవివి
యేలిన యితనిబంట్లకు ఇహపరాలిచ్చి మా
పాలగలిగితివి సంబంధము మేలమ్మా ॥

# పరమాత్ముడి పట్టపురాణివి...

– శ్రీమతి బి.కృష్ణకుమారి

ఆ ఆదిపురుషుడి అవతారాలు ఏవైనా... ఎన్నైనా, అర్ధాంగిగా అమ్మవారు సహవాసియై తోడు రానిదే లక్ష్యం సంపూర్ణం కాదు. అలా ఆ పరంధాముడి ప్రేమకు ప్రతిరూపంగా ఆ పరమపావని ఈ పుడమిపై పలుమార్లు పదం మోపి, భక్తుల్ని పునీతుల్ని చేసింది. ఆ మధుసూదనుడికి మహారాజ్ఞియై ఆయన మనఃసామ్రాజ్యాన్ని ఏలింది. అందుకే మాధవి లేని మాధవుడి లీలలు రక్తికట్టవు. ఆ పరంపరలో కలియుగంలో కైవల్యపథమైన వేంకటాచలంపై శ్రీనివాసుడుగా వెలసిన పుండరీకాక్షుడికి సతి స్థానంలో పద్మావతిగా అమ్మ వెంటవచ్చింది; వేంకటేశుడి వైభవానికే వన్నె తెచ్చింది. అలాంటి అమ్మవారిని **'పరమాత్ముడికి పట్టపురాణివి'** అంటూ అన్నమయ్య ఆరాధిస్తున్నాడు. అక్షరాల అక్షతలతో అర్చిస్తూ, ఆదుకోమని అర్థిస్తూ ఉన్నాడు. తండ్రి వద్దకు తల్లిని రాయబారం పంపి, కోరికలన్నీ తీర్చుకునే కొడుకుగా ఈ పదకవితా పితామహుడు పద్మావతీదేవి పంచన చేరి, ప్రసన్నం చేసుకుంటున్నాడు. ఏ కుమారుడికైనా తండ్రి కన్నా తల్లి దగ్గరే ఎక్కువ చనువు. ఆ చనువుతోనే ఇక్కడ ఈ భాగవతోత్తముడు అమ్మ ఘనతను గుర్తుచేస్తూ ఇహపరాలిచ్చి కాపాడమంటున్నాడు. అందుకే భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస కూడా "అమ్మా...అమ్మా... అంటూ ప్రార్థించడం చాలా మంచిది. తండ్రి కన్నా తల్లి బంధం దృఢమైనది. అమ్మ వద్ద మొండిపట్టు పట్టవచ్చు. తండ్రి వద్ద అది చెల్లదు" అనేవారు.

## హరి పట్టపురాణివి...

లక్ష్మీదేవికి 'విష్ణో రేషా నపాయినీ' అని పేరు. అంటే ఎల్లప్పుడూ శ్రీమహావిష్ణువును విడువకుండా ఉండే దేవి అని అర్థం. 'అనపాయినీ' అంటే విడిచి ఉండదు అని అర్థం! అలాంటి శ్రీమహాలక్ష్మి పరమాత్ముడికి పట్టపురాణియై ఈ భూమిపైకి ఏతెంచింది. అలా ఈ ధరపైకి వచ్చిన దేవదేవిని ఉద్దేశించి 'నీవు మమ్మల్ని జాగ్రత్తగా చూసుకోవమ్మా!' అన్న భావంతో...

**పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు**
**ధర మమ్ము విచారించదగు నీకు నమ్మా ॥** అని అన్నమయ్య వేడుకుంటూ ఉన్నాడు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో అమ్మవారి ద్వారా అయ్యవారిని ప్రార్థించడం, ప్రసన్నం చేసుకోవడం విశిష్టమైన అంశం. సౌమ్యమూర్తి, సహృదయి అయిన జగజ్జనని సులభంగా కరుణించి కటాక్షిస్తుంది. అందుకే ఆదిశంకరాచార్యుల నుంచి అన్నమాచార్యుల వరకు ఎవరైనా ముందు అమ్మ పాదాలనే ఆశ్రయించారు. ఋగ్వేదం కూడా ఆ దేవిని...

**ఓమ్ విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్।**
**విష్ణోః ప్రియసఖీం దేవీం నమా మ్యచ్యుత వల్లభామ్ ॥** అంటూ వందనాలర్పించింది.

## కమలజ కన్నతల్లివి...

పద్మధారిణి అయిన ఆ ఆదిలక్ష్మి భక్తులకే కాదు, సాక్షాత్తూ అమరులకు అంటే దేవతలకు కూడా మాతృమూర్తే. అదే భావనతో అన్నమయ్య ఆ దేవి దయాస్వరూపాన్ని స్మరించుకుంటూ ఉన్నాడు. కమలజునికి అంటే శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి పుట్టిన బ్రహ్మదేవునికే కాకుండా కాముని

(మిగతా 32వ పేజీలో...)

జగన్మాత పట్ల సాధకుడు వీరభావాన్నిగానీ, సఖీభావాన్నిగానీ, పుత్రభావాన్నిగానీ అవలంబించ వచ్చు. నాది పుత్రభావ సాధన. పుత్రభావ సాధనే శ్రేయస్కరమైన భావన. - శ్రీరామకృష్ణ పరమహంస

# దేవుడంటే...

- టి.ఆర్. శ్రీనివాస ప్రసాద్

'స్వామీ! దేవుడంటే ఏమిటి?'

ఏదో ఆలోచనల్లో నిమగ్నమై ఉన్న గురువుగారు శిష్యుడు ఆనందుడి ప్రశ్నకు తలతిప్పి అతడి వైపు చూశాడు. ఆనందుడు వినయంగా చేతులు కట్టుకుని ఆయన వైపు తదేకంగా చూస్తున్నాడు. దాదాపు ఎనిమిదేళ్ళుంటాయి వాడికి.

అతడు ఆశ్రమంలో చేరి పట్టుమని నెల రోజులు కూడా కాలేదు. వచ్చినప్పటి నుండీ ఆయనను ఇలాగే ఏవో ప్రశ్నలతో ఇబ్బంది పెడుతూనే ఉన్నాడు. అలాగని అతడి ప్రవర్తనలో అనుచిత ధోరణి గానీ, అహంభావం గానీ లేవు. సందేహాలను నివృత్తి చేసుకోవాలన్న తపన బలీయంగా ఉంది.

గురువు గారి నుండి సమాధానం రాకపోవడంతో ఆనందుడు మళ్ళీ రెట్టించాడు. 'చెప్పండి స్వామీ! దేవుడంటే ఏమిటి?'

గురువుగారు చిన్నగా నవ్వారు. 'దేవుడంటే రాముడు, కృష్ణుడు... ఇంకా...' ఆనందుడు కాదన్నట్లు తల అడ్డంగా ఊపాడు. 'నేనడిగింది భగవంతుని నామధేయాలు కాదు స్వామీ! దేవుడంటే ఏమిటి?... అని!'

గురువుగారు ఈసారి నిజంగానే ఆలోచనలో పడ్డారు. 'ఆ సంగతి సరే! ఎల్లుండి హోమం జరపాలి. దానికి సమిధలు సిద్ధం చేయమన్నాను... తీసుకొచ్చావా?' ఆనందుడు బిక్కమొహం వేశాడు. 'అదీ... అది ఇవాళ సాయంకాలం తీసుకువద్దామని...' అంతే! గురువుగారు ఆనందుని చెంప మీద లాగిపెట్టి కొట్టాడు. 'వెధవా! చెప్పిన పని చేయడం తెలియదు కానీ అధిక ప్రసంగం మాత్రం బాగా నేర్చావు. వెళ్ళు! ముందు నేను చెప్పిన పని చేసి తర్వాత కనిపించు...' అన్నారు గుమ్మం వైపు వేలు చూపుతూ.

ఆనందుడి కళ్ళ నుండి కన్నీరు కారింది. సందేహం తీరలేదు గానీ అవమానం మాత్రం మిగిలింది. ఆశ్రమం పరిసరాల్లో ఇతర శిష్యులు తమకు కేటాయించిన పనులు చేసుకుంటున్నారు. కొందరు ఆశ్రమ ప్రాంగణంలోని మొక్కలకు పాదులు చేస్తూ, పరిసరాలను శుభ్రం చేస్తూంటే, మరికొందరు క్రితం రోజు గురువుగారు నేర్పిన పాఠాలు వల్లె వేస్తున్నారు. ఆనందుడి మనస్సు మాత్రం వీటిని గమనించే స్థితిలో లేదు. ఆనందుడు నెమ్మదిగా నడుచుకుంటూ ఆశ్రమ పరిసరాలు దాటి అడవిని సమీపించాడు. అతడి దృష్టి అక్కడ పనిచేసుకుంటున్న దారుశిల్పి మీద పడింది. దేవతామూర్తి ప్రతిరూపాన్ని సజీవంగా మలచడానికి శిల్పి ప్రయత్నిస్తున్నాడు. కొయ్యపై శిల్పాన్ని చెక్కుతున్న అతని చేతులు, నేత్రాలు పూర్తిగా పని మీదనే నిమగ్నమై ఉన్నాయి.

ఆనందుడు అక్కడే కాసేపు నిలబడి మళ్ళీ కర్తవ్యం గుర్తుకురావడంతో అడవి వైపు నడిచాడు. అక్కడ హోమానికి కావలసిన సమిధలు సమకూర్చుకుని వెనుదిరుగుతుండగా ఓ లేగదూడ బలహీనంగా అరుస్తున్నట్టనిపించింది. ఆనందుడు క్షణం ఆగి ఆలోచించాడు. ఆ ప్రాంతంలో గోవులు ఉండడానికి అవకాశం లేదనుకుని వెనుదిరుగుతూండగా మళ్ళీ దూడ అరుపు స్పష్టంగా వినిపించింది. ఆనందుడు కాస్త ముందు కెళ్ళి పరికించి చూశాడు. అల్లంత దూరంలోని దిగుడుబావిలో ఓ దూడ పడిపోయి ఉంది. పైకి ఎలా రావాలో తెలీక మోర ఎత్తి దీనంగా అరుస్తూంది. అతనికి వెంటనే ఏం చేయాలో తోచలేదు. నిమిషం పాటు ఆలోచించి, సమిధల్ని అక్కడే పడేసి ఇదివరకు చూసిన దారుశిల్పి వైపు పరుగెత్తాడు.

'అయ్యా, అక్కడ బావిలో ఓ దూడ పడిపోయింది. రండి. వెళ్ళి దాన్ని కాపాడుదాం...' అన్నాడు.

దారుశిల్పి కదల్లేదు. కనీసం ఆనందుని రాకను సైతం గుర్తించనట్టు అతడి మనస్సు, ఇంద్రియాలు తాను చెక్కుతున్న శిల్పం మీదనే కేంద్రీకృతమై ఉన్నాయి.

ఆనందుడు ఇక లాభం లేదనుకుని గొడ్లను మేపుకుంటున్న పిల్లల వైపు పరుగెత్తాడు. విషయం తెలియగానే వారు పరుగున ఆనందుడు చెప్పిన ప్రాంతానికి చేరుకున్నారు. ఒకడు మెల్లగా బావిలోకి దిగి దూడను పైకి లాగడానికి అనువుగా దానికి తాడు బిగించాడు. తర్వాత పిల్లలందరూ ప్రయాసతో దూడను పైకి లాగారు.

'నిన్నగాక మొన్న సాయంకాలం ఆవుల మందలోంచి తప్పిపోయింది సామీ! ఏ పులివాతనో పడి ఉంటదనుకున్నాం... సమయానికి దేవుడిలా నువ్వు వచ్చి కాపాడినావు...' అన్నాడు వాళ్ళలో ఒకడు. ఆనందుడు చప్పున అడిగాడు 'అవునూ! దేవుడంటే ఏమిటి...?

ఈ సారి పిల్లలందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. 'బావుంది! సదువుకుంటున్నోడివి నీకే తెలవదంటే మాకెట్టా తెలుస్తుంది?' అంటూ దూడను తీసుకుని వెళ్ళిపోయారు.

ఆనందునికి మళ్ళీ కర్తవ్యం గుర్తుకొచ్చింది. ఇదివరకు సమిధల్ని పడేసిన ప్రదేశానికి వెళ్ళి సమిధలు పై వస్త్రంలో కట్టుకోబోతూ, తన మీద ఏదో నీడ పడినట్టు అనిపించడంతో తలెత్తాడు.

ఓ బాటసారి అక్కడ నిలబడి ఆనందుని వైపు తదేకంగా చూస్తున్నాడు. ఆనందుడు తనవైపు చూడడంతో 'నువ్వు ఆ ఆశ్రమవాసివే కద బాబూ!' అన్నాడు.

ఆనందుడు ఔనన్నట్టు తలూపగానే, 'చూడు బాబూ! ఎల్లుండి ఆశ్రమంలో జరుగనున్న క్రతువుకై ధన సహాయం అందజేయాలని వస్తున్నాను. కానీ మార్గమధ్యంలో మరో ముఖ్యమైన పని తగిలింది. ఆశ్రమం దాకా వచ్చి మళ్ళీ తిరిగి వెళ్ళేసరికి కాలాతీతమవుతుంది. ఎలాగూ నువ్వు ఆశ్రమానికి వెళుతున్నావు కాబట్టి ఆ డబ్బు నీకిస్తాను. నువ్వు జాగ్రత్తగా గురువుగారికి దీన్ని అందజేయి...' అన్నాడు ఓ డబ్బు సంచీని ఆనందుని చేతిలో ఉంచుతూ.

ఆనందుడు సందేహించాడు. గురువుగారి అనుమతి లేనిదే అతడు ఏ నిర్ణయమూ తీసుకోవడానికి వీలు లేదు. అతని మనోభావాలను గ్రహించిన వాడిలా బాటసారి నవ్వుతూ ఇలా అన్నాడు: 'ఆశ్రమం కట్టుబాట్లు నాకు తెలుసు నాయనా! నేను కూడా అక్కడి పూర్వ విద్యార్థినే! ఎల్లుండి ఆశ్రమంలో పూజా కార్యక్రమాలు ప్రారంభమయ్యేసరికి స్వయంగా నేను గురువుగారిని కలుసుకుని ఈ విషయం మాట్లాడతాను...'

ఆనందునికి ఇక ఆ డబ్బు తీసుకోక తప్పలేదు. ఆ డబ్బు సంచీని జాగ్రత్తగా తన వస్త్రాలలో భద్రపరుచుకున్నాడు. ఆ తర్వాత బాటసారి తన సంచీలో నుంచి ఓ పొట్లం తీశాడు.

'మార్గమధ్యంలో తినడానికని రొట్టె తెచ్చుకున్నాను. నీకు డబ్బు అందజేయడం ద్వారా నా పని పూర్తయింది. నువ్వు ఆశ్రమానికి వెళ్ళడానికి ఆలస్యమవుతుంది కాబట్టి ఈ ఆహారం అవసరం నీకే ఉంది. దారిలో వస్తూండగా ఆ కుడివైపున ఓ చిన్న కొలను చూశాను. నువ్వు అక్కడికెళ్ళి ఈ రొట్టె తిని, దాహం తీర్చుకుని ఆశ్రమానికి త్వరగా తిరిగి వెళ్ళు...' అని అతడు వచ్చిన దారినే వడివడిగా వెళ్ళిపోయాడు.

ఆనందునికి ఆశ్చర్యమనిపించింది. నిజం చెప్పాలంటే అతనికి చాలా ఆకలిగా ఉంది. పొద్దుటి నుంచి ఏమీ తినలేదు. నీరసంతో శోషించిపోయి ఉన్న తరుణంలో ఆ వెళ్ళిపోతున్న బాటసారి అతనికి దేవుడిలా కనిపించాడు. ఆ బాటసారి చెప్పినట్టే సమీపంలో ఓ కొలను ఉంది. ఆనందుడు గబగబా అక్కడకు వెళ్ళి, ఆహారం తిని కాళ్ళు, చేతులు కడుక్కోవడానికై నీళ్ళలో దిగాడు.

ఇదివరకు ఆకలితో ఉండడం వల్ల గమనించలేదు గానీ, అక్కడి ప్రకృతి రమణీయంగా ఉంది. ఎత్తయిన వటవృక్షాలు, ఆ వృక్షాలకు అల్లుకుని పైకి ఎగబాకిన లతలు, చెట్లపై పక్షుల కలరవాలు, కొలనులో విరబూసిన తామరపూలతో ఆ ప్రాంతం శోభాయమానంగా ఉంది. ఆనందుడు అక్కడి పరిసరాలను చూసి ముగ్ధుడైపోయినట్టు కాసేపు నిలబడిపోయి అనంతరం చేతులు కడుక్కుని పైకి రావడానికి ముందుకు కదిలాడు. వీలు కాలేదు.

అతని కాళ్ళు అడుసులోకి కూరుకుపోతున్నాయి. చేతులు చాచి గట్టును పట్టుకుందామంటే అది అందడం లేదు. భయంతో, ఆందోళనతో బయటకు రావడానికి ప్రయత్నం చేస్తూన్న కొద్దీ మరింత వేగంగా ఆ ఊబిలోకి కూరుకుపోతున్నాడు.

నిర్జనమైన ఆ ప్రాంతంలో ఏ ఒక్కరైనా రాకపోతారా అన్న ఆశతో, భయంతో కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతుండగా 'రక్షించండి!'అని బిగ్గరగా అరిచాడు. ఎవరి ఆచూకీ కనబడక పోవడంతో మళ్ళీ అరిచాడు. ఊబిలో భుజాల వరకూ దిగబడి పోయాడు. పక్షుల సవ్వడి తప్ప మనిషి జాడ కనిపించడం లేదు. కంఠం లోతుల దాకా దిగబడిపోయి నీళ్ళు నోట్లోకి వెళ్ళి గొంతుకకు అడ్డుపడుతూండగా చివరి ప్రయత్నంగా మరోసారి గట్టిగా అరిచాడు.

అప్పుడు వినిపించింది ఓ శబ్దం. కొలను సమీపంలో దభీమని ఓ బలమైన శరీరం ఎగిరి దూకినట్టు అనిపించింది. 'భయపడకు! చేతులు అలాగే పైకి ఎత్తి ఉంచు!' ఆదేశిస్తున్నట్టుగా ఓ స్వరం వినిపించింది. ఆనందుడు అప్రయత్నంగా చేతులు పైకెత్తుతూ ఆ శబ్దం వచ్చిన వైపు కళ్ళు తిప్పి చూశాడు. నల్లగా, దృఢంగా ఉన్న ఓ వ్యక్తి కొలను గట్టు మీద నిలబడి ఉన్నాడు. ఆనందుడు తనను చూడగానే అడవి తీగలను తాడులా కట్టి అతని వైపు ఒడుపుగా విసిరాడు.

'భయపడకు. ఈ తాడు పట్టుకో, నేను పైకి లాగుతాను...' అంటున్నాడా వ్యక్తి. ఆనందునికి అప్పటికే చెవుల దాకా నీరు వచ్చేసింది. స్పృహ తప్పుతున్నట్టనిపిస్తూండగా అతని మాట మాత్రం స్పష్టంగా వినిపించింది.

ఆనందునికి స్పృహ వచ్చేసరికి ఇదివరకు తనను ఊబిలో నుంచి పైకి లాగిన వ్యక్తి తాను మింగిన నీటిని కక్కించే ప్రయత్నం చేస్తున్నాడు.



'హమ్మయ్య... ఈ ఊబిలో నుంచి బ్రతికి బయట పడ్డావంటే నువ్వు గట్టి పిండానివే...' అన్నాడతడు గట్టిగా నవ్వుతూ. ఆనందుడు కూడా నీరసంగా నవ్వి మెల్లగా లేచి నిలబడ్డాడు. అప్పటికే సూర్యుడు పశ్చిమాద్రిని చేరుకున్నాడు. నీరెండ, చెట్ల నీడతో కలిసి చీకటి చిక్కబడుతూంది.

'అయ్యా! మీరెవరు..?' అన్నాడు ఆనందుడు ఆ వ్యక్తి వైపు కృతజ్ఞతతో చూస్తూ. కొద్దిసేపటి క్రితం తన పరిస్థితిని తలచుకుంటే భయంతో ఒళ్ళు గగుర్పొడిచిందతనికి. ఆ వ్యక్తి బదులివ్వకపోవడంతో ఆనందుడు ప్రశ్న రెట్టించాడు.

అతడు బిగ్గరగా నవ్వాడు. 'నేనెవరినా..? ఇప్పుడు నీ ప్రాణాలు కాపాడాను కదా! నేను దేవుణ్ణి' అన్నాడు నవ్వుతూ. ఆనందుడు ఠక్కున ఆగిపోయి అతని వైపు పరీక్షగా చూశాడు. కండలు తిరిగిన ఆరడుగుల నల్లటి విగ్రహం. కొనదేరిన ముక్కు, తీక్షణంగా చూస్తున్న కళ్ళు.

*(మిగతా 31వ పేజీలో...)*



మనోవాక్కాయములచే ఏ ప్రాణికీ హాని చేయకుండుట, అందరి పట్ల ప్రేమాదరములను కలిగి ఉండుట, తనకు కలిగిన దానిని ఎల్లరకూ దాన మిచ్చుట - ఇవే సనాతన ధర్మములు. - మహాభారతం

# అహాన్ని హరించిన అపరభగవానుడు

- మహేంద్రనాథ్ గుప్తా*



నేను (మ) రెండవసారి గురుదేవులను సందర్శించుకున్న మధురక్షణాలవి. అప్పుడు వారు నన్ను యథాలాపంగా 'నీవు భగవంతుడిని ఎలా విశ్వసిస్తావు? సాకారంగానా? నిరాకారంగానా?' అని ప్రశ్నించారు. అప్పట్లో నాకు మతానికి సంబంధించిన విషయాల్లో వాదోపవాదాలు చేయటంపై ఆసక్తి ఎక్కువ ఉండేది. 'నాకు భగవంతుడిని నిరాకారుడిగా విశ్వసించటమే ఇష్టం' అన్నాను. ఆ తరువాత నన్ను సమర్థించుకోవటానికి మాటల్ని పొడిగిస్తూ 'మట్టిబొమ్మను భగవంతుడిగా భావిస్తూ పూజించటం నిరర్థకం. అందుకే మట్టిప్రతిమలను అర్చించేవారికి 'ఇది భగవంతుడు కాదు' అని ఎవరైనా చెప్పాలి. పూజిస్తున్నప్పుడు వారి మనస్సులో భగవద్భావన ఉండాలి; మట్టిప్రతిమ కాదు. మట్టిని పూజించకూడదు' అన్నాను ఆవేశంగా! ఆ సమయంలో కలకత్తాలో ఈ అంశంపై చాలామంది ఇలాగే ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు.

తరువాత కొంతసేపటి వరకు గురుదేవులు నిశ్శబ్దంగా ఉన్నారు. తరువాత 'మీ కలకత్తా వాసులకు వాదించటం అలవాటైపోయింది. ప్రసంగాలతో ఇతరులను మేల్కొలపాలని ప్రయత్నిస్తూ ఉంటారు. ఇది భలే విచిత్రం! మీకే తెలిపేవాళ్ళు లేరు; మీరు వెళ్ళి ఇతరులకు బోధించటమా! అసలు ఇతరులకు ఉపదేశాలివ్వటానికి మీకు హక్కు ఎక్కడుంది?' అంటూ అలాగే భగవానులు తమ వాక్కులను కొనసాగించారు. 'ఆ పరమపురుషుడైన జగన్నాథుడే అందరికీ తెలియజేస్తాడు. ఎవరైతే ఈ జగత్తును సృష్టించాడో, సూర్యచంద్రులను, జీవజాలంను సృజించాడో, ఆ జీవులకు ఆహారం సంపాదించుకునే దారి కల్పించాడో, పుట్టిన బిడ్డలను పెద్దచేయటానికి తల్లితండ్రులలో వాత్సల్యం నింపాడో, ఆయనే బోధిస్తాడు. ఇన్ని ఏర్పాట్లు చేసినవాడు ఈ మాత్రం ఏర్పాటు చేయలేడా ఏమిటి? అవసరమైతే ఆయనే తెలియజేస్తాడు. ఆయన అంతర్యామి కదా! మట్టి ప్రతిమను పూజించటం పొరపాటైతే ఆ విషయం ఆయనకు తెలియదా? ఆ మట్టిరూపంలో తననే ఆరాధిస్తున్నారని ఎరుగడా? ఆ పూజతోనే ఆయన తృప్తి చెందుతాడు. ఆయన మన కోసం ఎన్నో సమకూర్చాడు. మతాన్నే తీసుకోండి. ఎన్ని దేవాలయాల్ని, ఎన్ని పవిత్రక్షేత్రాల్ని ఆయన సృష్టించాడు! శాస్త్రాల్ని, సాధుపుంగవులను ఆయనే సిద్ధం చేశాడు. ఆధ్యాత్మిక జీవితాన్ని గడపాలని తపించేవారందరి కోసమే ఆ భగవంతుడు ఇవన్నీ చేశాడు. ఆయన అందరి గురించీ ఆలోచిస్తాడు. మనమేమీ తలమునకలు కావలసిన అవసరం లేదు. అంతా ఆయనే చూసుకుంటాడు. ఆ తలనొప్పి మీకెందుకు? మీ సంగతి మీరు చూసుకోండి; ఏ రీతిలో భక్తి కలుగుతుందో, జ్ఞానం కలుగుతుందో, ఆ మార్గంలో మీరు ప్రయత్నించండి' అని వివరించారు.

గురుదేవుల ఆ బోధ వినగానే నా అహంకారం పటాపంచలైపోయింది. ఆ భగవంతుడు ఒక్కడే కర్త, మనమందరం ఆయన చేతిలోని పరికరాలమని నాకు గురుదేవుల సమక్షంలో అవగతమైంది. దీని గురించి తరువాత తీవ్రంగా ఆలోచించసాగాను. వారు చెప్పినట్లు ఇతరులకు బోధించటానికి నాకేమి అర్హత ఉంది?

మరోసందర్భంలో కూడా శ్రీరామకృష్ణులు అహంకారాన్ని గురించి అద్భుతంగా వివరించారు. అహంకారం అజ్ఞాన, తమోగుణ జనితమని చెబుతూ "తమస్సు నుంచి, అజ్ఞానం నుంచి పుట్టిన ఈ అహంకారం తెరగా ఉండటం వల్లనే మనం భగవంతుణ్ణి చూడలేకపోతున్నాం. ఈ 'నేను' మరణిస్తే అన్ని కష్టాలు తొలగిపోతాయి. మన ప్రజ్ఞాపాటవాలు, వాదోపవాదాలు ఏవీ శాశ్వతం కావు. ఒక తాగుబోతు దుర్గాపూజ సమయంలో దుర్గాదేవి ప్రతిమను దీర్ఘంగా పరిశీలిస్తూ ఉన్నాడు. ప్రతిమకు చేసిన అలంకారాలను చూసి అతడు, 'అమ్మా! నువ్వు ఎంతగా అలంకరించుకున్నా, రెండు మూడు రోజుల తరువాత నిన్ను లాక్కెళ్ళి గంగలో పారవేస్తారు' అన్నాడు. అందుకే అందరికీ చెబుతున్నాను; జడ్జిగా ఉన్నా సరే, మరెవరిగా ఉన్నా సరే, అన్నీ మూన్నాళ్ళ ముచ్చటే! కాబట్టి గర్వం, అహంభావం వదలిపెట్టాలి" అని హితవు పలికారు. 'నా వరకు నేను యంత్రంగానే భావించుకుంటాను. అంతా అమ్మే నడిపించేది. నేను ఇల్లు, ఆమె ఈ ఇంటి యజమానురాలు; నేను వాహనాన్ని, ఆమె చోదకురాలు; నేను రథాన్ని, ఆమె సారథి. ఆమె ఎలా నడిపిస్తే అలా నడుస్తాను, ఎలా చేయిస్తే అలా చేస్తాను' అని సాక్షాత్తూ అవతారపురుషులైన ఆ గురుదేవులే అన్నారంటే, ఇక మనమెంత? ❖

(*శ్రీరామకృష్ణ కథామృత రచయిత– మాస్టర్ మహాశయుడు 'మ'గా ప్రసిద్ధులు)




**శ్రీరామకృష్ణుల బోధనలతో ప్రభావితులై ఆదర్శ జీవితం గడుపుతున్న భక్తులెందరో! అలాంటివారిలో మూర్తిత్రయ భావపరివ్యాప్తికి కృషిచేసి భగవాన్ శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన ఆదర్శభక్తులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు పరిచయం చేయాలని సంకల్పించాం. ఈ పరంపరలో వారి స్ఫూర్తిదాయక జీవితవిశేషాలను 2012 ఫిబ్రవరి సంచిక నుండి ధారావాహికగా అందిస్తున్నాం.**

# విద్యాదానంలో వెలుగురేఖ

అది కృష్ణమ్మ నది చెంతనే ఉన్న ఓ మాదిరి గ్రామం తాడేపల్లి. జనాభా ఎక్కువగా ఉన్నా, ఓనమాలు దిద్దడానికి సరైన పాఠశాల లేని గ్రామం. దోపిడీలు, దొంగతనాలు చేసేవారి తోనూ, రాజకీయ పార్టీల కక్షలూ, కార్పణ్యాల మధ్య నిత్యం భయం భయంగా గడిపే ఆ ఊరి జనానికి ఒకే ఒక వెలుగురేఖ సీతానగరంలోని శ్రీరామకృష్ణ విద్యాలయం. సామాన్య, మధ్య తరగతి పిల్లల జీవన వికాసానికి ఈ ప్రాంగణమే ఆనాడు ఆధారం. 'భారతరత్న' డాక్టర్ అబ్దుల్ కలామ్ లాంటి వారి ప్రశంసలను అందుకున్న విద్యాలయం అది. పేదలు నివసించే ఇలాంటి ప్రాంతాలనే ఎంచుకొని విద్యాలయాల స్థాపనకు నడుం బిగించిన వాత్సల్యమూర్తి శ్రీపెనుమత్స బాపిరాజు. "సామాన్యులకు విద్యగరపడమే అత్యంత ప్రధానమైన సేవ" అన్న స్వామీజీ వచనాలు యువ ప్రాయంలో బాపిరాజుగారి మనస్సులో బలంగా నాటుకున్నాయి. అందుకే ఆయన ఈ విద్యాలయాల స్థాపనకు శ్రీకారంచుట్టారు.

మూర్తిత్రయ సేవకు అంకితమైన పెనుమత్స బాపిరాజుగారు తూర్పుగోదావరి జిల్లా రావులపాలెం మండలంలోని మారుమూల గ్రామమైన పొడగట్లపల్లి రామచంద్రాపురంలో 1925లో జన్మించారు. వృత్తిరీత్యా న్యాయవాది. పరమపూజ్య స్వామి రంగనాథానందజీ ఆశీస్సులతో, స్వామి వివేకానంద పథాన్ని అనుసరించే లక్ష్యంతో 1956లో విజయవాడలోని పున్నమ్మతోట ప్రాంతంలో ఓ పూరిపాకలో స్థాపించిన శ్రీరామకృష్ణ సమితి, నేడు నగరం నడిబొడ్డున సొంత భవనాలతో దిగ్విజయంగా సేవలందిస్తోంది. ఆ స్థాయికి రావడం వెనుక బాపిరాజుగారి అవిరళకృషి ఎంతో ఉంది. రామకృష్ణ మఠానికి చెందిన వరిష్ఠ సాధువులెందరో ఈ సమితిని సందర్శించి ఆశీస్సులు అందించారు. అందిస్తూనే ఉన్నారు. తదనంతరం ఆయన విద్యాదానానికి ఉపక్రమించారు. నిరుపేదలుండే ప్రాంతాలను ఎంపిక చేసుకొని, అక్కడ పేదలకు విద్యాలయాలను ఏర్పాటు చేశారు. విజయవాడలోని పాయకాపురం, అజిత్‌సింగ్ నగర్, గాంధీనగరం, సీతానగరం లాంటి చోట్ల వీటిని ఏర్పాటు చేశారు. అవి ఈనాటికీ సమర్థంగా నడుస్తున్నాయి.

పరమపూజ్య స్వామి యతీశ్వరానందజీ వద్ద తీసుకున్న మంత్రదీక్ష వారి ఆధ్యాత్మిక వికాసానికి ఒక సాధనంగా మారి, మూర్తిత్రయ భావప్రచారానికి మార్గదర్శకమైంది. విజయవాడ సమితిని కేంద్రంగా చేసుకుని ఆయన చేసిన కార్యక్రమాలు అన్నీ ఇన్నీ కావు. ఉప్పెనలు, తుపాన్లకు నిలయమైన కోస్తా ప్రాంతంలో సర్వం కోల్పోయి కట్టుబట్టలతో నిలిచిన నిస్సహాయులకు రామకృష్ణ సమితి అండగా నిలిచేది. చీరాల తుపాను బాధితులకూ, 1977లో దివిసీమ ఉప్పెన బాధితులకూ, గోదావరి, బుడమేరు వరద బాధితులకూ, నడికుదురు అగ్ని ప్రమాద బాధితులకూ సహాయ, పునరావాస కార్యక్రమాలలో రామకృష్ణ మిషన్ స్వామీజీలతో కలిసి బాపిరాజు చురుకైన పాత్ర పోషించారు. శక్తిమేరకు ఆర్థికసాయం అందించారు.


పెనుమత్స బాపిరాజు

1993లో స్వామి వివేకానంద చికాగో నగరోపన్యాసాల శతాబ్ది ఉత్సవం సందర్భంగా 275 విద్యాసంస్థల్లో సదస్సులు ఏర్పాటుచేసి, వివేకానంద వాణిని వినిపించారు. 1992లో వివేకానంద స్వామి పరివ్రాజక భారత యాత్ర శతవార్షిక ఉత్సవం సందర్భంగా 'భావ చైతన్య యజ్ఞం' పేరుతో 108 గ్రామాలలో భావప్రచారం చేశారు. భావప్రచారం, భక్తసమ్మేళనాలతో ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో ఎంతోమంది ఉత్తేజితులై రామకృష్ణ భక్త కుటుంబంలో చేరారు. విజయవాడలోని పాయకాపురంలో శ్రీశారదా విద్యాలయ ప్రాంగణంలో 'సిస్టర్ నివేదిత మిషన్'ను స్థాపించి, మహిళాభ్యుదయానికి కృషిచేశారు. అనేకచోట్ల ఆయన స్థాపించిన స్వామి వివేకానంద విగ్రహాలు, గ్రంథాలయాలు యువతరం మనస్సును జాగృతం చేస్తూనే ఉన్నాయి.

విజయవాడలో శ్రీరామకృష్ణ సమితి స్థాపించిన నాటి (1956) నుంచి ఆ సంస్థ వ్యవస్థాపక కార్యదర్శిగా అకుంఠిత దీక్షతో సమితి పురోభివృద్ధికి తోడ్పడ్డారు. గాంధీనగరంలోని సమితి భవనాన్నీ, సీతానగరంలోని శ్రీరామకృష్ణ విద్యాలయ ప్రాంగణాన్నీ 2001 ఫిబ్రవరి 6వ తేదీన బేలూరు మఠానికి అనుబంధం చేసి, అక్కడ రామకృష్ణ మిషన్ కేంద్రం ఏర్పడడానికి బాపిరాజు గారు చేసిన కృషి అనన్య సామాన్యం. 2009 జులై 31న తమ 84 వ ఏట ఆయన శ్రీరామకృష్ణైక్యం చెందారు. అంతులేని ఈ మానవ ప్రపంచంలోకి మనుషులు వస్తూ, పోతూ ఉంటారు. కొందరు మాత్రమే తమ జీవితాలను సార్థకం చేసుకుంటారు. అలా శ్రీరామకృష్ణుల సేవలో తమ జీవితాన్ని సార్థకం చేసుకున్న వారిలో బాపిరాజుగారు ఒకరు. ❖

సేకరణ: డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి
అనుసృజన: శ్రీమతి టి. ఆశాలత

ప్రజల్ని తమ కాళ్ళపై తాము నిలబడేటట్లు చేయకుండా, లోకంలోని సంపదనంతా వారి కోసం వెచ్చించినా ప్రయోజనం ఉండదు. సామాన్యప్రజలకు విద్యను అందించడమే కర్తవ్యం. - స్వామి వివేకానంద

# అనంతరూపిణి కాళి

- స్వామి తథాగతానంద

భగవంతుడు మాయాధీశుడు. మాయకు రెండు అంశాలు. మొదటిది - విశ్వజనీనం. అది జగన్మాత దుర్గమ, దుర్భేద్య (అర్థం చేసుకోలేని) శక్తి. రెండవది - వ్యావహారికం. దీనికి విద్యామాయ, అవిద్యామాయ అని రెండు అంశాలు. ఆధ్యాత్మికోన్నతిని కలిగించే సర్వం విద్యామాయ, పతనం కలిగించేది అవిద్యామాయ. రెండో దాని మూలంగా, లోకంలో పరివర్తనం చెందే, క్షణభంగురాలైన రూపాలన్నీ సత్యాలని నమ్ముతాడు మనిషి. మాయ అనే ఈ పొరను ఛేదించగలిగితేనే భగవంతుణ్ణి చేరగలుగుతాం. ఈ ఛేదింపు మాయ అనుగ్రహం మూలంగానే జరుగగలదు. ఎందుకంటే, ఆమె బంధన, మోక్షాల సృష్టికర్త్రి. కనుకనే చిరశాంతి కొరకు ఆమెను ప్రార్థించమన్నారు శ్రీరామకృష్ణులు. ఎంతో కోమల దేహం, సున్నితమైన మనస్సు గల శ్రీరామకృష్ణులు అంత భీకర కరాళ కాళికను ఎలా ఆరాధించారోనని కొందరు విస్మయం చెందుతారు. కానీ శ్రీరామకృష్ణుల దృష్టిలో ఆమె అపార కరుణామయి. అర్జునుడి అత్యంత ప్రియసఖుడైన శ్రీకృష్ణుడు ఆయనకు తన ఉగ్రవిశ్వరూపాన్ని కూడా చూపాడు కదా! మంచి- చెడు, సౌమ్యం-ఉగ్రం అనేవి వ్యావహారిక జగత్తుకు సంబంధించినవి. వ్యావహారిక జగత్తును ఛేదించిన వారికి భగవంతుడు ప్రేమఘనమూర్తి.

**కాళికా రూపం అర్థం:** జగత్తులోని బ్రహ్మాండశక్తికి ప్రతీక - కాళికా రూపం. వెల్లకిలా పడుకొన్న శివునిపై నిలబడినట్లు ఆమెను చిత్రీకరిస్తారు. ఏ మార్పూ చెందని బ్రహ్మానికి ప్రతీక శివుడు. ఆయన శాంతంగా, ఆత్మలీనుడై ఉంటాడు. తన వక్ష స్థలంపై జరుగుతున్న విలయతాండవం ఆయన ఎరుగడు. దేశకాల పరిధిలోనున్న విశ్వంలో చోటు చేసుకొంటున్న పరిణామం యావత్తుకూ శివుడే ఆధారం అని తెలియజేస్తుంది శివశక్తులు కలిసి ఉన్న ఈ ప్రతిమ.

కాళిక రంగు ముదురు నీలం, లేదా కృష్ణవర్ణం. అది రంగులన్నిటినీ తనలో ఇముడ్చుకొంటుంది. అంటే అన్నీ కాళికలోనే ఉన్నాయి. కనుక కాళికరంగు అనంతత్వానికి ప్రతీక. శ్రీరామకృష్ణులు ఇలా అంటారు: దూరం నుండి వీక్షిస్తే ఆకాశం, నీరు నీలంగా కనపడినా, దగ్గర నుండి చూస్తే ఏ రంగూ ఉండదు. ఆ విధంగానే దూరం నుండి చూస్తే, అనగా మనస్సు అశుద్ధంగా ఉంటే కాళిక కృష్ణవర్ణంలో కనపడుతుంది. కానీ ఉన్నత శ్రేణికి చెందిన సాధకులకు ఆమె వర్ణరహితం.

కాళిక అనంతరూపిణి. అనంతత్వాన్ని దేనితోను కప్పలేం కనుక, కాళిక దిగంబరి. దిక్కులే ఆమె అంబరాలు. ఆమె తన దీర్ఘశిరోజాలను విరబోసుకొని ఉంటుంది. కనుక ఆమెను 'ముక్తకేశి' అని పేర్కొన్నారు. ఒక్కొక్క శిరోజం ఒక జీవి. రక్తమోడుతూ, చంచలంగా ఉన్న నాలుక రజస్సును సూచిస్తుంది. ఆమె తెల్లని దంతాలు ఎర్రని నాలుకను నొక్కిపెట్టి ఉంచుతాయి. అంటే మనశ్చాంచల్యాన్ని సత్త్వగుణ సహాయంతో అదుపులో పెట్టాలి.

కాళిక వామహస్తంలో ఉన్న ఖడ్గం, తెగిన మానవ శిరస్సు సృష్టి నియమాలను ఉల్లంఘించే తన భ్రష్ట సంతానాన్ని ఆమె సంస్కరిస్తుందని తెలియజెప్పడానికి సంకేతం. రెండు దక్షిణ హస్తాలు వరదాభయాలను ఒసగుతాయి.

కాళిక ధరించే ముండమాలలో యాభై శిరస్సులు ఉంటాయి. సంస్కృత భాష కూడా ఏభై అక్షరాలతో కూడుకొని ఉంటుంది. ఈ అక్షరాలే శబ్దానికీ, భాషకూ పునాది. మన శ్రమను ఆమెకు అర్పిస్తే ఆమె సంతసిస్తుందని మానవ హస్తాల మేఖల సూచిస్తుంది.

కాళి త్రినయన. ఆమె మూడు కన్నులు త్రికాలజ్ఞతకు ప్రతీకలు. వదనారవిందంపై చిరునవ్వు. మెడలో ముండమాల. నడుము చుట్టూ తెగిన చేతులతో రచింపబడిన మేఖల. నోటి వెలుపలకు వచ్చి, ఆడుతున్న, నెత్తురు ఓడుతున్న నాలుక. క్రింది వామహస్తంలో నరకబడిన శిరస్సు, పై చేతిలో ఖడ్గం, కుడివైపు వరదాభయహస్తాలు. ఈ విధంగా, ఒక ప్రక్క భీషణం, మరొక ప్రక్క కారుణ్యం ప్రదర్శిస్తుంది.

ఈ లక్షణాలు ఒక ప్రక్క వైభవోపేతంగా, మరొక ప్రక్క భయోత్పాదకంగా ఉంటాయి. పోతే, వీటిని పరస్పర విరుద్ధాలుగా భావించకూడదు. జగన్మాతకు తన సంతానం పట్ల గల గాఢానురాగ ప్రేమలను ఇవి సూచిస్తాయి. ఆమె విద్య, అవిద్యల ద్వారా ఈ జగత్తులో వ్యవహరిస్తుంది. విద్యావిద్య, జీవన్మరణాలు, సుందర వికృతాలు, శుభాశుభాలు మొదలైనవి మన జీవితాలను ఉక్కిరిబిక్కిరి చేసే ద్వంద్వాలు. ఇవన్నీ పరాశక్తి ప్రకటనలే, ఆమె ఆవిర్భూతాలే. ఈ జగత్తులో ఏదీ ఆమె కన్నా భిన్నం కాదు - సమస్తానికి ఆదిమూలం ఆమే! కనుక ప్రకృతిలో కనిపించే పరస్పర వైరుద్ధ్యాలన్నిటిలో ఉపాసకుడు ఈ దివ్యశక్తినే వీక్షించాలి.

జగన్మాతే సమస్తానికీ, శుభానికీ అశుభానికీ మూలం అని జ్ఞానోదయమైన వారు గ్రహిస్తారు. శుభం లేదా మంచిలో తరుగుదలను అశుభం లేదా చెడు అంటాం. ఆధ్యాత్మిక జీవితపు ఉన్నత శిఖరాన్ని అందుకొన్న వారికి యావజ్జగత్తు జగన్మాత నివాసంగా తోస్తుంది. అంతరవలోకనం చేయలేని వారు కాళీరూపాన్ని చూసి భీతిల్లుతారు. అనుగ్రహాన్నీ, వరాలనూ

కురిపించి, దారితప్పిన తన సంతానాన్ని తల్లి శాసించే ప్రయత్నం చేస్తున్నదని భక్తుల భావన. ఆమె ప్రతిమలో రౌద్రం కన్నా కారుణ్యం ఎక్కువగా కనబడుతుంది.

పరమయోగులు అత్యున్నత ఆధ్యాత్మిక అనుభూతుల మూలంగా కనుగొన్న శక్తి కాళికరూపం. అది సకల దృశ్యాలకూ, దర్శనాలకూ ఆధారభూతం. పరాశక్తి ఉనికికి ప్రత్యక్ష ప్రమాణం శ్రీరామకృష్ణుల జీవితం. అలాంటి శక్తిసామర్థ్యాలు, యోగ్యత గల ఏ సాధకులైనా దీన్ని ధ్రువీకరించుకొనగలరు.

నానాత్వాలు కనపడుతున్న ఈ లోకంలో ఉన్నది జగన్మాత మాత్రమే అని జ్ఞాని తెలుసుకొంటాడు. ఈ లోకంలో కానవచ్చే



ద్వంద్వాలు నిర్మూలించలేం కానీ వాటిని దాటి పోగలం. అజ్ఞానం నుంచి విడుదల కావాలంటే – ఉన్నది ఒక్కటే, అనేకం కాదని తెలుసుకోవాలి. జగన్మాత ఈ నామరూప ప్రపంచంలో ఉంది, ఆమె అఖండంగా ఉంది, అంశరూపంలో కాదు. అంటే – దైవం; జగత్తు, మానవాళి అంతా ఒక్కటే. ముక్తి అంటే ప్రపంచాన్ని నిరాకరించడం కాదు (ప్రపంచం అనేది లేదని తలవడం కాదు), ఏకత్వాన్ని అర్థం చేసుకొని సాక్షాత్కరించుకోవడం. మన దృష్టికోణం పరిమితమైనది కాబట్టి, అన్నీ విభిన్నాలని తలుస్తాం. ద్వంద్వాలుగా తోచేవి రెండు విడి విడి అంశాలు కావు, ఒకే అఖండతత్త్వం. శక్తి నామరూపాలుగా మార్పు చెందినట్లు తోచినా అది ఏ మార్పూ చెందని నిత్యవస్తువు.

భౌతికవాదంపై ఆధారపడిన తత్త్వవేత్తలు ప్రపంచాన్ని నిమిత్తమాత్రమైన, స్వయంచాలక నిర్జీవ యంత్రంగా చూస్తారు. భౌతికవాదం మూలంగా మానవులు లక్ష్యం కానక, లక్ష్యం లేక భ్రష్టులవుతున్నారు. భౌతిక శక్తినే మిన్నగా తలస్తున్నందున మానవ మానసాలు శిథిలమవుతున్నాయి. చంచలత్వం, నిరంకుశత్వం, దౌర్జన్యం పెచ్చరిల్లుతున్నాయి. ఆధ్యాత్మిక అంధత్వం సామరస్యరాహిత్యానికీ, అలజడికీ, యుద్ధాలకూ బాట వేస్తోంది. ఆధ్యాత్మిక దృక్పథం ఉంటేనే మానవ జీవితాలలో, సమాజంలో శాంతిసామరస్యాలు నెలకొంటాయి. మనం ఒక యంత్రచాలితమైన ప్రపంచంలో లేము. ఈ ప్రపంచం చైతన్యమయం. ఇక్కడ బుద్ధి చైతన్యాలే ప్రధానశక్తులు. ఈ భావం ఆధ్యాత్మిక స్ఫూర్తిని ఇవ్వడమే బుద్ధికి సంతృప్తికరంగా ఉంటుంది. మనకు ఉత్సాహాన్నీ, విశ్వాసాన్నీ, ఆశనూ ఇస్తుంది. కనుక, సత్యాన్వేషణలో జీవితాన్ని గడపగలుగుతాం.

బలమైన శీలం, వ్యక్తిత్వం ఏర్పడడానికి బాధలు, సంతోషాలు ఆవశ్యకం. భగవంతునిపై మనకున్న మూఢభావాలను వదలుకోమన్నారు జగన్మాత వీరపుత్రుడైన స్వామి వివేకానంద. బలహీనులకూ, మానసిక పరిపక్వత లేని వారికీ భగవల్లాభం కలుగదు. దేహాత్మ బుద్ధే నానాత్వ దర్శనానికి మూలం. జ్ఞాని తాను ఆత్మ స్వరూపుడనని పదేపదే నిరూపించు కొంటూ వ్యావహారిక జగత్తును లక్ష్యపెట్టడు. ఇటు భక్తుడు సంపూర్ణ శరణాగతి ద్వారా భగవంతుణ్ణి చేరడానికి ప్రయత్నిస్తాడు. ఇద్దరూ కూడా హృదయాన్ని శ్మశానంగా భావించి, అహంకార మమకారాదులను భస్మీపటలం చేయాలి. స్వామీజీ ఇలా అంటారు – 'కాళీ, కాళీ, కాళీ! భయం వలదు. ప్రాధేయపడడం కాదు, ఆమెను దబాయించి మరీ అడగాలి. సర్వోత్కృష్టమైనది దబాయించి అడగండి! జగన్మాత యథార్థ భక్తులు వజ్రసదృశులై, సింహాల లాగా నిర్భయులై ఉండాలి. ఈ ప్రపంచం ఒక్క క్షణంలో చూర్ణమైపోయినా నువ్వు నా మాట విని తీరాలని పట్టుబట్టాలి. ఒక్క సంగతి గుర్తు పెట్టుకోండి! ఆమె సర్వశక్తిమంతురాలు, శిలలను సైతం వీరులుగా మార్చగలదు.'

స్వామి వివేకానంద తనను తాను కాళికకు సమర్పించు కొన్నారు. ఆమె అనుగ్రహపాత్రులవడానికి వీరోచిత ప్రవృత్తిని అవలంబించాల్సిందిగా మనస్సుకు ఉద్బోధించారు. మనం పూర్తిగా ఆమెకు సమర్పించుకొంటేనే ఆమె పరమ శ్రేయస్సును ప్రదానం చేస్తుంది. "మృత్యువు లేదా కాళిని ఆరాధించడానికి కొద్దిమంది సాహసించగలరా? అయితే రండి! మృత్యువును ఆరాధిద్దాం. ఆ కరాళరూపాన్ని సొంతం చేసుకొందాం. అది భీకరమైనది, కనుకనే సొంతం చేసుకోవాలి. క్లేశాలు అనుభవించడానికే క్లేశానికి స్వాగతం పలకాలి అన్నారు స్వామి వివేకానంద. ❖

అనువాదం : డాక్టర్ కమల జయరావు

కాళీమాత బిడ్డలమైన మనం సింహాలలాగ నిర్భయులమై ఉండాలి. ఆ కరాళ రూపాన్ని ఆరాధిద్దాం. సర్వశక్తిమంతురాలైన ఆమె పరమ శ్రేయస్సును ప్రదానం చేస్తుంది. - స్వామి వివేకానంద

మాయాబజార్

# ఈ ప్రపంచం ఇలా ఎందుకు ఉంది?

- స్వామి శితికంఠానంద

నారద ముని స్వర్గలోకం నుంచి వైకుంఠ వాసుడి దర్శనానికి బయలు దేరాడు. భూలోకంలోని పరిస్థితులను చూసిన తర్వాత ఆ దేవర్షి చిత్తం కూడా కొద్దిగా ఆందోళనకు గురైంది. తనకు అన్ని యుగధర్మాలు తెలిసినప్పటికీ ధరిత్రి అలా ఉండటానికి కారణం బోధపడలేదు. ప్రపంచం ఉండవలసిన తీరులో లేదనిపించింది. దేవేంద్రుడి సందేహాలను నివృత్తి చేయగలిగినప్పటికీ లేశమాత్రపు శంక తనను వీడకున్నదని గ్రహించాడు. దారిలో బ్రహ్మ మానస పుత్రులు, తనకు సోదర సమానులైన సనక సనందన సనాతన సనత్కుమారులను దర్శిస్తాడు. వారిని సందేహ నివృత్తికై ఈ విధంగా ప్రశ్నిస్తాడు.

**నారద మహర్షి:** బ్రహ్మవిద్వరేణ్యులకు నమస్సుమాంజలి. నాకు కలిగిన ఒక చిరు సంశయ నివారణకు మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను. ఈ ప్రపంచం ఉండవలసిన తీరులోనే ఉన్నదని మీ భావనా? మహాజ్ఞానులైన మీరు నా సంశయాన్ని తొలగించ వలసినదిగా మనవి.

**సనందనుడు:** అసలు లోకం ఎలా ఉండాలి అనుకుంటున్నావు నారదా? ప్రపంచం పరమేశ్వర సృష్టి. అది ఎప్పుడు ఎలా ఉండాలో ఆయనే నిర్ణయిస్తాడు. అది ఉండాల్సిన సమయంలో ఉండవలసిన రీతిలోనే ఉంది. మనం అర్థంచేసుకోవటంలోనే ఏదో లోపమున్నదని భావించాలి.

**సనాతనుడు:** ఎల్లప్పుడూ సుఖశాంతులతో ఉండాలనే ప్రతిమనిషి కోరుకుంటాడు. కానీ అన్ని సౌకర్యాలు సమకూడినా జరారోగమరణాలు ఉన్నంతకాలం ఏ మనిషి కూడా పూర్తి ఆనందాన్ని పొందజాలడు. అవి మానవజీవితపు మూలసమస్యలు. ప్రభుత్వాలు, ప్రజలు, సంస్థలు ఎన్నో ప్రణాళికలను వేసి మానవజీవన యానాన్ని సుఖవంతం చేయాలని నిరంతరం శ్రమిస్తున్నప్పటికీ రోజురోజుకీ జీవన పయనం కఠినమవుతున్నదే కానీ సుగమం అవటం లేదనేది ఆలోచించే వాళ్ళందరికీ అవగతమవుతున్న విషయం కదా.

**నారద మహర్షి:** మనిషికి కనీసం మరణించేవరకూ ఎలాంటి బాధలు, కష్టాలు కలుగకుండా ఉండే అవకాశం లేదా?.

**సనకుడు:** ముందు భగవానుడి ఆజ్ఞమేరకు సృష్టికర్తయైన మన పితృదేవులు ఈ ప్రపంచాన్ని అలానే సృజించారు. మరణం తప్పా ఎవరికీ ఏ కష్టం కలుగని జీవితాన్ని ప్రసాదించారు. వ్యాధులు, వార్ధక్యం లేనటువంటి జీవితాన్ని మానవుడికి అనుగ్రహించారు. మనిషి మరణం గురించి ఆలోచించి జీవితం అశాశ్వతం అని తెలుసుకొని మృత్యురహస్యాన్ని తెలుసుకోవటానికి పూనుకుంటారనుకున్నారు. మరణం శరీర ధర్మమని, మనోదేహాలను వర్తింపజేస్తున్న చైతన్యం తన నిజస్వరూపమని, తనకు భగవంతుడు అనుగ్రహించిన ధీశక్తిని మనిషి దానికి ఉపయోగిస్తాడని భావించారు. కానీ అలా జరుగలేదు. మానవుడు నూరు సంవత్సరాల జీవితం చాలా సుదీర్ఘమైన జీవితమని, ఎప్పుడో వచ్చే మరణం గురించి ఆలోచించడం అవివేకమని శరీరంలో శక్తి ఉన్నంతకాలం సుదీర్ఘంగా ఇంద్రియ సుఖాలను గ్రోలి, సంతృప్తి చెంది శరీరాన్ని శమనుడికి ఇవ్వటానికి సిద్ధపడవచ్చునని అనుకున్నాడు.

**నారద మహర్షి:** వివేకంతో కూడుకున్న ఆలోచనయే కదా అది!

**సనత్కుమారుడు:** మనుజులు అక్కడే అజ్ఞానానికి తావిచ్చారు. ఏ మనిషిలోనూ విషయ తృష్ణ అనుభవించడం ద్వారా ఉపశమించదు. అది ఇంకా పెరుగుతూనే ఉంటుంది. మహాభారతంలో యయాతి తన జీవితానుభవాన్ని రంగరించి ఒక గొప్ప సత్యాన్ని మానవాళికి తెలియజేస్తాడు. అదేమంటే, **న జాతుః కామః కామానాముపభోగేన శామ్యతి! హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే!!** భోగాలను అనుభవించడం ద్వారా నిగ్రహించలేరు. అలాంటి ప్రయత్నం నేయివేసి అగ్నిని ఆర్పివేయ ప్రయత్నించడం లాంటిది. లౌకిక ప్రపంచంలోని ప్రతిదీ నిజానికి సారరహితమైనదని వివేకవంతులైన వారంతా గ్రహిస్తారు. అలాకాకుండా పంచేంద్రియ ప్రపంచమే పరమలక్ష్యమైనవారికి మరణం ఆసన్న మవుతున్న కొద్దీ జీవితేచ్ఛ దృఢతరమవుతుంటుంది. దానితో సంఘర్షణ మొదలవుతుంది. విపరీతమైన దుఃఖానికి అది హేతువవుతుంది.

**నారద మహర్షి:** అంటే నిస్సారమైన వస్తు ప్రపంచం నుంచి, జడపదార్థమైన శరీరం నుంచి మనస్సును విడివడ జేసి శాశ్వతమైన అంతర్నిహిత చైతన్యాన్ని అనుభవమొనర్చుకొని అమృతత్వానుభవాన్ని పొంది అలౌకిక, అనంత, అవ్యక్తానందాన్ని పొందాలని దైవం మనిషిని సృష్టించాడు. అంతే గదా మీరు చెపుతున్నది జ్ఞానవరిష్ఠా?

**సనత్కుమారుడు:** అవును భక్తవరేణ్యా! ఐతే దానికి విరుద్ధంగా మనిషి తన బుద్బుదోపమైన జీవితాన్ని శాశ్వతమైనదిగా పరిగణిస్తూ చిరసుఖకారి ఐన దైవాన్ని విస్మరించాడు. దానితో విధాత వ్యాధిని, అకాల మృత్యువును, రకరకాల కష్టాలను మనుషులకు కలిగించాడు. అంటే మరణంతో జీవితం పరిసమాప్తి ఐనప్పుడు కలిగే బాధ మనిషిని ఆలోచింపజేసి మోక్ష మార్గంలో ప్రవేశ పెట్టలేకపోతున్నదని గ్రహించి రోగముదిమిల ద్వారా దుఃఖాన్ని ఇనుమడింపజేశాడు.

**నారద మహర్షి:** ఇంకా మనిషికి ఈ ప్రపంచంలో శోకకారణాలు శతకోటి ఉన్నాయి కదా! ఇవన్నీ ఎందుకు భగవానుడు కల్పించాడు?

**సనాతనుడు:** నిజమే. '**శోకస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ! దివసే దివసే మూఢమావిశన్తి న పండితమ్!!** 'ప్రపంచంలో మనిషికి శోకకారణాలు వేలకొలది, భయకారణాలు వందల కొలది ఉన్నాయి. అన్నీ అజ్ఞానంలో ఉన్నవారికే. జ్ఞానులను అవేవీ స్పృశించలేవు' అంటుంది మహాభారతం. జీవితం అధ్రువమని మనిషి భావించి, శాశ్వతమైన వస్తువు కోసం అన్వేషిస్తూ భగవంతుడిని ఉపాసిస్తే జ్ఞానం వృద్ధి చెందుతుంది. సర్వ దుఃఖాలకు అజ్ఞానమే కారణం గదా? జీవితంలో ఏ కారణం చేత భయం కలిగినా, దుఃఖం ఆవహించినా, దుఃఖహేతువును, భయకారణాన్ని అన్వేషిస్తూ దైవానికి చేరువై సదానందమయుడుగా తనను తాను తెలుసుకుంటాడని విరించి సంకల్పం. మొదట పేర్కొన్నట్లు ప్రతిమనిషికీ మహాచేదు అనుభవంగా పరిణమించే మరణానుభవాన్ని ఏర్పరిచి, ఆ అనుభవం నుంచి విముక్తిని కోరుకుంటూ మనిషి సత్యశోధనలో నిమగ్నమవుతాడని భావించిన పరమేష్ఠికి నిరాశ ఎదురైంది. దానితో బ్రహ్మదేవుడు మనిషికి దుఃఖహేతువులను పెంచివేశాడు. ప్రపంచాన్ని పూర్తిగా లోప భూయిష్ఠం, అసంపూర్ణం చేశాడు. ఆశ్చర్యకరమైన విషయమే మంటే ఇంతచేసినా, కొద్దిమందిని మినహాయిస్తే, జనులలో తత్త్వచింతన పెరుగుట లేదు.

**సనకుడు:** అవును. మనిషి ఒక అసహాయుడిలాగా కష్టాలను అనుభవిస్తున్నాడే కానీ పరమాత్మ వైపుకు దృష్టిని సారించలేక పోతున్నాడు. దేహభావనతో మొదలవుతున్న జీవితం దేహభావన తోనే ముగుస్తున్నది. దేహభావన ఉన్నంతకాలం దుస్సహమైన వ్యాధి, వార్ధక్యం, మరణానుభవం తప్పవు. విరామం లేకుండా మనిషికి ఆలోచన పెరుగదు. ఆలోచన లేకుండా తత్త్వ జిజ్ఞాస కలుగదు. తత్త్వ జిజ్ఞాస లేకుండా చైతన్యజ్యోతి ప్రజ్వలించదు. చుట్టూ ఉన్న సమాజం స్వయంగా అసత్యాన్నంటి పెట్టుకొని ఉంటూ ఎవరినీ సత్యాన్వేషణ తత్పరులుగా మారనీయదు. జనబాహుళ్యం అజ్ఞానంలో జీవిస్తూ అదే నిజమైన జీవితమని తమను తాము భ్రమింపజేసుకుంటూ ఉంటారు. కష్టాలు కలిగినప్పుడు ఆక్రోశిస్తూ, ఆక్రందిస్తూ, సుఖాలు కలిగినప్పుడు ఉబ్బితబ్బిబ్బవుతుంటారు. సుఖదుఃఖాలకు సమానంగా స్పందిస్తూ భగవానుడి చరణయుగాల దగ్గర తనను తాను సమర్పించుకుని జీవించటానికి ప్రయత్నించ టమే మానవజీవితపు చరమ లక్ష్యం. రెండూ అశాశ్వతాలని ఎరిగిన వ్యక్తి ద్వంద్వాతీతుడవుతాడు. ద్వంద్వనిర్ముక్తమైన మనస్సును జయిస్తాడు. మృత్యురహితుడవుతాడు.

**సనందనుడు:** మనిషి ఆ విధంగా స్వీయ ఔన్నత్యాన్ని గుర్తించా లంటే ప్రపంచంపై ఆసక్తి పోవాలి. ప్రపంచంపై ఆసక్తి పోవాలంటే అది కష్టకారిణిగా ఉండాలి. దుఃఖప్రదాయిని అవ్వాలి. పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉండాలి. అసలు ప్రజా పరిపాలన అంటూ ఒకటి ఉందా? లేదా? అనిపించాలి! భారతదేశంలో బాహ్య జీవితం సదా భయశోకప్రదాయినిగా, దైన్యాన్ని, ఆయాసాన్ని, అలసటను కలిగించేదిగానే ఉంటుంది. మనిషిని అంతర్ముఖ జీవితానికి నిత్యం ప్రేరేపించేవిగా పరిస్థితులు నెలకొని ఉంటాయి.

**నారద మహర్షి:** అంటే ప్రపంచం ఉండాల్సిన విధంగానే ఉంది. మనిషి ఎంత ప్రయత్నించినా వేదభూమిలో సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు అలానే ఉంటాయని చెపుతున్నారా బ్రహ్మవరిష్ఠా? ఎంత సాంకేతిక అభివృద్ధిని సాధించినా సామాజిక అభివృద్ధి జరుగుతుందన్న ఆశ, ఆర్థిక అసమానతలు తొలగుతాయన్న నమ్మిక ఏర్పడటం కష్టంగా ఉంటుందా?

**సనాతనుడు:** అవును మునీంద్రా! ఆర్థిక రాజకీయ సామాజిక అభివృద్ధి ఇవన్నీ అల్పమేధస్సుగలవారికి లక్ష్యాలుగా ఉంటాయి. మానసిక పరిపక్వతను సాధించినవారికి అవేవీ రుచించవు. ప్రపంచం సహజంగానే అపరిపూర్ణం. పరిపూర్ణ ప్రపంచం అసంబద్ధమైన విషయం. ఈ జగత్తు సత్యమైతే సత్యస్వరూపుడైన భగవంతుడు ఇక ఎవరికీ అవసరమవడు కదా?

**సనత్కుమారుడు:** అంతా మరణంతో అంతమవుతున్నది కాబట్టి శాశ్వతానందం, శాశ్వతమైన అభివృద్ధి అర్థరహితాలని మనిషి గ్రహించాలి. నిత్యానంద ప్రదాతయైన భగవంతుడిని సాక్షాత్కరించు




కోవటానికి ప్రయత్నించాలి. తాను ఈ ప్రపంచంలో ఏర్పరచుకుంటున్న లక్ష్యాలన్నీ సాపేక్షమైనవన్న భావనను సుస్థిర పరచుకోవాలి. మరణాన్ని అధిగమించటానికి ప్రయత్నం చేయాలి.

**సనందనుడు:** అంటే మనిషి ఈ ప్రపంచాన్ని కేవలం ఒక మజిలీగా భావించాలి. ఈ ప్రపంచం తన గమ్యం కాదన్న విషయం వ్యక్తికి సదా స్ఫురణలో ఉండాలి. అలా కాకుండా చిత్తాన్ని అశాశ్వత మైన బాంధవ్యాలపై, అనిత్య వస్తుప్రపంచంపై నిలిపితే మనిషికి నిరాశ, నిస్పృహ, నిర్వేదం, ఖేదం తప్పవు. కనీసం మనస్సులో ఒక పార్శ్వాన్నైనా పద్మనాభుడికి ఇవ్వని మనిషి జీవితం వృథా.

**నారద మహర్షి:** దేవభూమియైన ఆర్యావర్తంలో అందరూ మనుజజన్మ వైశిష్ట్యాన్ని గుర్తించి పరమాత్ముడి ప్రార్థన, పూజతో తరింతురు గాక! పూర్వజన్మ సుకృతఫలంగా ఈ మహా సత్సాంగత్యానికి నోచుకున్నాను. వైకుంఠప్రియుల దర్శనం నాకు సదా లభించుగాక! నారాయణ..నారాయణ.. ❖

ఎవడు భగవంతుణ్ణి భజిస్తూ ఉంటాడో వాడికి సిరిసంపదల పట్లా, భోగభాగ్యాల పట్లా, పేరు ప్రతిష్ఠల పట్లా, అధికారం పట్లా ఎన్నడూ అనురక్తి కలగదు. భగవద్భక్తితో కర్మ క్షీణిస్తుంది. - శ్రీరామకృష్ణులు



# కదిలించిన కృతజ్ఞత!

– శ్రీమతి సుధామూర్తి, ఇన్ఫోసిస్ ఫౌండేషన్

చాలాకాలం కిందట నేను ఓ విద్యార్థుల వసతిగృహంలో జరిగిన కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరయ్యాను. ఎవరో ఒక సౌజన్యమూర్తి నిర్మించిన ఆ వసతి గృహంలో ఎందరో పేద విద్యార్థులకు ఆవాసం కల్పిస్తున్నారు. భోజనం, బస ఉచితమే కానీ కళాశాల రుసుము, దుస్తుల లాంటి ఖర్చులు మాత్రం విద్యార్థులు ఎవరికి వారే భరించుకోవాలి. కొంతమంది విద్యార్థుల పరిస్థితి చూస్తుంటే చాలా బాధేస్తుంది; ఎంతో చదువుకోవాలని ఉంటుంది, కానీ ఆర్థిక పరిస్థితి అందుకు సహకరించదు. ఆ హాస్టల్లో కూడా అలాంటి అభాగ్యులు ఉన్నారనీ, ర్యాంకులు తెచ్చుకున్నా, కళాశాల ఫీజులు చెల్లించలేక ఇబ్బందులు పడుతున్నారనీ నిర్వాహకులు నా దృష్టికి తీసుకువచ్చారు. 'మేడమ్! ఈ ఏడాది వివిధ కోర్సుల్లో ముగ్గురు మంచి ర్యాంకులు సాధించారు. కానీ ఆ కోర్సులు పూర్తి చేయడానికి ఫీజులు కట్టే స్థోమత వాళ్ళకు లేదు. దాంతో వాళ్ళ భవిష్యత్తు అగమ్యగోచరంగా మారిపోయింది. ఒక విద్యార్థి మెడిసిన్, రెండో విద్యార్థి ఇంజినీరింగ్, మూడో విద్యార్థి కామర్స్‌లో పైచదువులు చదవాలనుకుంటున్నారు' అని ఆ వసతిగృహం కార్యదర్శి వివరించారు.

ప్రతిభాశాలురైన ఆ విద్యార్థులను కార్యక్రమం అనంతరం కలుసుకున్నాను. వాళ్ళు కాస్త బిడియంగా, బేలగా కనిపించారు. ముగ్గురిదీ ఒకటే కథ. తండ్రి ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ ఆర్థికంగా ఇబ్బంది పడుతున్నాడు. ఊళ్ళో కుటుంబం పెద్దది. భూమీపుట్రా లేదు. చదువులో రాణించాలనే దీక్షే వారిని అన్ని అవరోధాలనూ అధిగమించి ఇంతదూరం వచ్చేలా చేసింది. వారి దుఃస్థితి చూసి బాధేసింది. అనేకమంది పెద్దలు తమ పిల్లలకు లక్షలేసి ఫీజులు చెల్లించి, ట్యూషన్లు పెట్టించి, ఎన్నెన్నో పుస్తకాలు సమకూర్చి బాగా చదువుకోవాలని ఎంతో తాపత్రయపడతారు. అయినా చాలామంది విద్యార్థులు అత్తెసరు మార్కులు తెచ్చుకోవడానికే ఆపసోపాలు పడుతుంటారు. కానీ వీళ్ళకేమో మార్కులు బాగా వచ్చినా, పై చదువులు చదువుకునేందుకు డబ్బు లేదు. లక్ష్మీ కటాక్షం లేకపోయినా, చదువుల తల్లి సరస్వతి మాత్రం వీరిని కరుణించింది. 'వచ్చే నెలలో కలవండి. ఫీజు చెల్లించే ఏర్పాటు చేస్తాను' అని మాటిచ్చాను. వారు ఇలాంటిది ఊహించి ఉండరు. ఒక్కసారిగా వారి ముఖాల్లో సంతోషం వెల్లివిరిసింది. మాట ఇచ్చిన ప్రకారం వారి ఫీజు ఏర్పాట్లు చేశాను. తరువాత వారి విషయమే మరచిపోయాను.

కొన్నేళ్ళ తరువాత విదేశాలకు వెళుతూ అక్కడున్న మా స్నేహితురాలికి చీర కొనేందుకు విమానాశ్రయానికి దగ్గరలో ఓ చీరల దుకాణం దగ్గర ఆగాను. లోపలికి వెళ్ళి ప్రదర్శనలో ఉంచిన చీరల్లో నుంచి ఒకటి ఎంపిక చేసుకున్నాను. హఠాత్తుగా అప్పుడో యువకుడు వచ్చాడు. చిరునవ్వుతో నన్ను గౌరవపూర్వకంగా తన క్యాబిన్‌లోకి ఆహ్వానించాడు. ఎంత ప్రయత్నించినా అతనెవరో నాకు గుర్తురాలేదు. అతని క్యాబిన్ చాలా ఆధునిక సౌకర్యాలతో చక్కగా అలంకరించి ఉంది. చాలా పేరున్న దుకాణమది. నాతో ఏదో మాట్లాడాలనుకున్నాడు. కానీ 'నేను త్వరగా వెళ్ళాలి. అక్కడ విమానం బయలుదేరే వేళవుతుంది. అయినా మీరెవరో నాకు స్ఫురించడం లేదు' అంటూ పర్సులో నుంచి తీసి డబ్బులిచ్చాను. యువకుడు చిరునవ్వుతో లోపలికి వెళ్ళివచ్చి ప్యాకెట్ చేతికిచ్చి సాగనంపుతూ, 'మీరు కొన్నేళ్ళ క్రితం మా హాస్టల్లో జరిగిన కార్యక్రమానికి ముఖ్య అతిథిగా వచ్చారు. నాతో పాటు ముగ్గురికి ఫీజు సౌకర్యం కల్పించారు. నేను బి.కామ్. విద్యార్థిని. మీ దయ వల్ల చదువులు పూర్తి చేశాను. ఈ చీరల దుకాణానికి నేను మేనేజర్ని; భాగస్వామిని కూడా! ఇద్దరు తమ్ముళ్ళు నా దగ్గరే ఉండి చదువుకుంటున్నారు. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేశాను' అన్నాడు. కారు దాకా వచ్చి వీడ్కోలు పలికాడు.

విమానం పైకి లేవగానే, చీర బాగుందో లేదో చూద్దామని బ్యాగు తెరచి విస్తుపోయాను. ఒకటి కాదు రెండు చీరలున్నాయి. ఆ చీరలు మాత్రమే కాదు, నేనిచ్చిన డబ్బు కూడా బ్యాగులో ఉంది. దాంతో ఓ ఉత్తరం కూడా ఉంది.

అందులో 'మేడమ్! నేనెవరో తెలియకపోయినా మీరు నా ఫీజు చెల్లించడాన్ని జీవితంలో నేనెన్నడూ మరచిపోలేను. నేను మీ బంధువును కూడా కాదు. నా నుంచి మీరేమీ ఆశించలేదు. మీ ఋణం ఎలాగూ తీర్చుకోలేను. అందుకే మీ అంత కాకపోయినా, నాకు వీలైనంతగా నాతో బంధుత్వం లేనివారికి సహాయపడుతూ ఆ రూపంలో మీకు కృతజ్ఞతలు చెల్లించుకుంటున్నాను. మీ సాయం ఎన్నటికీ వృథా కాదని నిరూపించే ప్రయత్నంలో ఉన్నాను. నా ఈ చిరుకానుకను స్వీకరించండి. ఇది మీకో పెద్ద వస్తువు కాదు. కానీ, గౌరవంతో, కృతజ్ఞతతో మీకు ఇవ్వదలచాను. మీరు నా జీవితాన్నే మార్చేశారు' అని రాశాడు. అతని కృతజ్ఞత నన్ను కదిలించింది... కన్నీళ్ళు తెప్పించింది. ❖ సేకరణ : జి. సతీష్

# చిరునవ్వును చెరగనీయవద్దు!

– స్వామి రంగనాథానంద

ఒకసారి అప్పటి అమెరికన్ రాయబారి కెన్నెత్ గాల్‌బ్రెయిత్ ఢిల్లీలో జరిగిన ప్రణాళికా సంఘం సమావేశంలో మాట్లాడుతూ భారతీయసమాజ స్థితిగతులపై ఆసక్తికరమైన విషయాలను వెల్లడించారు. 'నేను ప్రపంచంలోని చాలా దేశాల్లో పేదరికాన్ని చూశాను. కానీ భారతదేశంలోని పేదరికం, పేదల జీవనశైలి ప్రపంచంలోని ఇతర దేశాల కన్నా భిన్నంగా కనిపిస్తుంది. కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూ కూడా ఇక్కడ పేదల కళ్ళలో తొణికిసలాడే ప్రకాశం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇతర దేశాల్లోని నిరుపేదల కళ్ళల్లో ఉట్టిపడే క్రౌర్యం, అసహనం, కార్పణ్యం భారతీయ పేదలలో మచ్చుకైనా కనిపించవు. ఇది మీ దేశం ప్రత్యేకత' అంటూ వ్యాఖ్యానించారు.

అదే విధంగా డొమినిక్ లిప్పైర్ అనే రచయిత కోల్‌కతా మురికివాడలపై 'The City of Joy' అన్న పేరుతో రాసిన పుస్తకాన్ని ఎవరో నాకు ఇచ్చారు. ప్రయాణంలో ఉన్నప్పుడు ఒకసారి ఆ పుస్తకాన్ని తిరగేశాను. మనకు తెలియని చాలా విషయాలనూ, మన నిరుపేదల మానసిక స్థితిగతులనూ అందులో ఆ రచయిత ఆసక్తికరంగా పొందుపరిచారు. ఏ విధంగా చూసినా కోల్‌కతా మురికివాడల్లోని ప్రజల దుఃస్థితి కడు దయనీయంగా ఉంటుంది. కానీ అక్కడి జనం ముఖాల్లో మాత్రం ఆనందం తాండవిస్తూనే ఉంటుంది. పరిసరాలన్నీ అపరిశుభ్రంగా, అసౌకర్యంగా ఉన్నా, వ్యక్తుల మనస్సుల్లో మాత్రం ఉల్లాసం పొంగిపొరలుతూ ఉంటుంది. చిన్నారులు కూడా ఎప్పుడూ ఆడుతూపాడుతూ కనిపిస్తూ ఉంటారు. ఆంగ్ల రచయిత ఆ పుస్తకంలో ఇలాంటి ఎన్నో ఆసక్తికరమైన విషయాల్ని చర్చించారు. కోల్‌కతాలో ఆ ప్రాంతాన్ని 'ఆనందనగర్' అని పిలుస్తూ ఉంటారు. నేను మౌలికంగా భారతీయుల మానసికస్థితిని వర్ణించడానికే ఈ ప్రస్తావనను తీసుకువస్తున్నాను. ఒక్కమాటలో చెప్పాలంటే మనదేశంలో ఏ పేదల సమూహాన్ని తీసుకున్నా ...Though their pocket is poor, their heart is rich! వాళ్ళ బ్రతుకులు పేదవే కావచ్చు; కానీ వాళ్ళ మనస్సులు మాత్రం గొప్పవి. వాళ్ళు ఒకరికొకరు సాయం చేసుకుంటూ ఉంటారు; ఆపదల్లో ఒకరినొకరు ఆదుకుంటూ ఉంటారు. ఒకరి కష్టంలో మరొకరు పాలుపంచుకుంటూ ఉంటారు. మన అట్టడుగు సమాజంలోని ఈ విశాలభావాలకు సంబంధించి ఆ విదేశీ రచయిత ఎన్నో ఉదాహరణలను ఉట్టంకించారు. కానీ నాగరకులైన శ్రీమంతులనూ, ఎగువతరగతికి చెందిన సమాజాన్నీ చూసినప్పుడు మాత్రం చాలా ఆవేదన కలుగుతుంది. ఎంత ఉన్నా, ఏదో అసంతృప్తి! ఇలాంటి ధనికవర్గాలవారు మురికివాడల్లోని ఆ వ్యక్తుల నుంచి ఎంతో నేర్చుకోవలసి ఉంది. ప్రపంచీకరణ పేరుతో సాంకేతికంగా ఎన్నో విజయాలు సాధిస్తున్న ఆధునిక తరం ఎందుకు ఇంత ఉదాసీనతలో కొట్టుమిట్టాడుతోంది?

## ఉల్లాసం కొరవడి ఉదాసీనత

నేను ఎవరిని పలకరించినా ముందుగా 'ఎలా ఉన్నారు?' అని ప్రశ్నిస్తాను. చాలామంది విద్యావంతులు, నాగరకులు చెప్పే సమాధానం 'ఏదో అలా నడచిపోతుంది!' అంటారు. ఎందుకు అంత అనాసక్తతో అర్థమే కాదు. ఇలాంటి వాళ్ళు ఇక జీవితంలో ఏం సాధించగలరు? ఇలా మాట్లాడేవాళ్ళు జీవచ్ఛవాలతో సమానం. ఎప్పుడూ జీవితంలో ఏదో కోల్పోయామనీ, ఇంకేదో దక్కాలనీ అసంతుష్టులుగా కనిపించేవాళ్ళ నుంచి గొప్ప గొప్ప విజయాలను ఏం ఆశించగలం! ఇలాంటి వారు, లేని లోటును వెతుక్కుంటూ కళ్ళ ముందరి సౌకర్యాలను కూడా అనుభవించలేరు. జీవితంపై సరైన దృక్పథం కొరవడిన వారే ఇలా నిరంతరం అసంతృప్తివాదులుగా మిగిలిపోతారు. పరిస్థితులు అనను కూలంగా ఉండవచ్చు. అనుకోని అవాంతరాలు ఎదురు కావచ్చు. కానీ నిరాశ, నిరాసక్తతలు మాత్రం దరిచేరకూడదు. ఎలా ఉన్నావని ప్రశ్నిస్తే 'ఏదో అలా నడచిపోతుంది' అనకుండా 'Yes, it is fine and we can make it finer still' అనగలగాలి. బావున్నాననీ, బావుండాలనీ మనస్సుకు చెప్పుకోవాలి; బయటకూ అలాగే ఉండాలి. ఇదే ధీరోదాత్త మనస్తత్వం. బాహ్యపరిస్థితులు ఏవీ మన అంతరంగాన్ని కలవరపరచకూడదు. మన ముఖంపై మందహాసాన్ని చెరిపేయకూడదు. ❖ సేకరణ : ఆర్. కృష్ణ

నిత్యం ప్రార్థనలు చేసేవాడి కంటే, అన్ని పరిస్థితుల్లోనూ సంతోషంగా, ప్రశాంతంగా, నిశ్చలంగా, దరహాస వదనంతో ఉన్నవాడే అవలీలగా భగవంతుణ్ణి పొందగలుగుతాడు. - స్వామి వివేకానంద

ఇటీవల ఓ మానసికశాస్త్రవేత్త మన మానవసంబంధాలను విశ్లేషిస్తూ ఆసక్తికరమైన ఎన్నో విషయాలను వివరించారు. ముఖ్యంగా చాలామంది భారతీయులు ఎదుటివారు చెప్పేది వినటం కన్నా, ఎదుటివారికి ఏదైనా చెప్పటంలోనే ఎక్కువ ఆసక్తి చూపుతారని వారి పరిశోధనలో తేలిందట. మానసికంగా నిలకడను కోల్పోతున్న ఆధునిక జీవనంలో అవసరాన్ని మించి మాట్లాడటం, వాక్ సంయమనాన్ని కోల్పోవటం సర్వసాధారణ మైపోయింది. మనలోనే కాదు, ఎదుటివారిలో కూడా ఉపయోగపడే భావనలు ఉంటాయని, వారు చెప్పేది వినటం కనీసధర్మమని కూడా మనం ఆలోచించటం లేదు. అందుకే తండ్రిమాట కొడుకు వినడు, కొడుకు మాట తండ్రి వినడు; తల్లి మాట కూతురు వినదు; కూతురు మాట తల్లి వినదు, భర్తమాట భార్య వినదు, భార్యమాట భర్త వినడు; పై అధికారి మాట కిందివారు వినరు, కింది వారి మాట పై అధికారి వినడు...ఇలా ఒకరి మాట మరొకరు వినే ప్రసక్తే లేకుండా పోయింది. ఫలితంగా అటు కుటుంబంలో కాని, ఇటు సమాజంలో కానీ మానవసంబంధాలు అస్తవ్యస్తంగా మారి పోతున్నాయి. 'నా మాటే చెల్లుబాటు కావాలి, నా మాటపైనే అందరూ నడుచుకోవాలి' అనే అహంకారం ఎదుటివారు చెప్పే మాటల్లోని మంచిని కూడా తృణీకారభావంతో తోసిపుచ్చేలా చేస్తుంది. ఇలాంటి మానసిక బలహీనత వ్యక్తిగతంగా మనకే నష్టాన్ని కలిగిస్తుంది. సంఘంలో ఉన్నతమైన విజయాలు సాధించినవారంతా తాము తక్కువ మాట్లాడుతూ, ఎదుటివారికే ఎక్కువ మాట్లాడే అవకాశమిస్తూ ఉంటారు; విన్న విషయాన్ని విశ్లేషించుకొని సరైన నిర్ణయాలు తీసుకొని పైకి ఎదుగుతూ ఉంటారు. అలా కాకుండా ఎప్పుడూ తన మాటే శాసనంగా అమలు కావాలని ఆశించేవారు, ఎప్పుడు ఓ శ్రోత దొరుకుతాడా, తన ప్రసంగాన్ని ప్రవహింపజేసుకుందామని ఎదురుచూసేవారు జీవితంలో ఎప్పటికీ పైకి రాలేరు.

**వాక్ సంయమనంతోనే వైభవం... :** 'యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః' అంటారు వివేక చూడామణిలో జగద్గురువులు శ్రీఆదిశంకరాచార్యులు. వీలైనంత వరకు తక్కువ మాట్లాడటానికే ప్రయత్నం చేస్తే అది యోగంతో సమానం. కానీ ఆధునిక ప్రసార, ప్రచార సాధనాలు ఎదుటివారిని మాట్లాడకుండా ఎంత కట్టడి చేస్తే అంత గొప్పవ్యక్తి అన్నట్లు భ్రమలు కల్పిస్తున్నాయి. తెలీకుండానే వారి చెవుల్లో సీసం పోసేసి, చెవులుండీ వినలేని వికలాంగుడిని చేసేస్తున్నాయి. ఇది ప్రమాదకరమైన పరిణామం. అందుకే బుల్లితెరపై జరిగే కొన్ని చర్చాకార్యక్రమాల్లో ఒకరిమాట మరొకరు వినకుండా ఏకకాలంలో యాంకర్‌తో సహా అతిథులందరూ మాట్లాడేస్తూ ఉంటారు; ఎవరికి తోచింది వారు చెప్పేస్తూ, హమ్మయ్యా! కార్యక్రమం అయిపోయింది! అనిపిస్తూ ఉంటారు. ఇలా సభామర్యాదను, సమావేశ సభ్యతను కూడా విస్మరిస్తూ జరిపే చర్చల వల్ల ఫలితం ఏముంటుంది! ఎదుటివారి ప్రతిస్పందన కూడా తెలుసుకోకుండా, అడ్డూఅదుపూలేకుండా మాట్లాడేయటం వలన వాక్‌శుద్ధి కొరవడుతుంది. మాట్లాడే టప్పుడు మనం న్యాయవాది స్థానంలో ఉన్నట్లు, వినేటప్పుడు న్యాయమూర్తి స్థానంలో ఉన్నట్లు! జీవనన్యాయస్థానంలో వాదోపవాదాలు వినిపిస్తూ నిరంతరం తీర్పుకోసం నిరీక్షించే న్యాయవాదిగా ఉండాలా? వాదనలన్నీ వింటూ తీర్పు చెప్పే న్యాయమూర్తిగా ఉండాలా? అన్నది ఎవరికి వారు తేల్చుకోవాలి.

**వినదగు నెవ్వరుచెప్పిన.... :** ఎదుటివారి స్థాయి, వయస్సు తదితర విషయాలేవీ పట్టించుకోకుండా ముందు వాళ్ళు చెప్పేది వినటం అలవాటు చేసుకోవాలి. ఆ తరువాత మన విచక్షణాజ్ఞానంతో బేరీజు వేసుకొని నిర్ణయం తీసుకోవాలి. ఎంత అనుభవం ఉన్నవారమైనా ఎప్పుడో ఒకప్పుడు పప్పులో కాలేస్తూనే ఉంటాం. అలాంటి ప్రమాదం జరగకుండా ఉండాలంటే, ఎంత చిన్నవారు చెప్పినా వినే ప్రయత్నం చేయాలి.




అందుకే 'సుమతీ శతకం'లో కవి భద్రభూపాలుడు...

**వినదగు నెవ్వరు చెప్పిన**
**వినినంతనె వేగపడక వివరింపదగున్**
**గని కల్ల నిజము తెలిసిన**
**మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ...**అంటాడు.

ఎవ్వరు చెప్పినా సావధానంగా వినాలి; దాని గురించి ఆలోచించాలి. వినగానే వేగిరపడకుండా నిజానిజాలను విచారించి తెలుసుకున్నవాడు భూమియందు నిజమైన నీతిపరుడని హితవు పలుకుతాడు. ఒకసారి ఛత్రపతి శివాజీ శత్రురాజుపై యుద్ధానికి వెళతాడు. కానీ ఆ రాజకోటలోకి ప్రవేశించటం ఆయన తరం కాదు. అప్పుడు సమీపగ్రామంలోని ఓ సామాన్యబిచ్చగత్తె శివాజీకి ఒక సలహా ఇస్తుంది. ఆమె సలహా మేరకు కొన్ని ఉపాయాలు పాటించి శత్రుదుర్భేద్యమైన ఆ కోటలోకి ప్రవేశించి విజయాన్ని సాధిస్తాడు. మనం కూడా నిత్యజీవన పోరాటంలో ఎదుటివారి మాటకు విలువ ఇవ్వటం నేర్చుకోవాలి. ఏ కాస్త అనుసరణీయమైన అంశమున్నా ఎలాంటి భేషజాలు లేకుండా స్వీకరించాలి. కానీ మనలో చాలామందికి

ఎదుటివారు చెప్పింది వినటానికి 'అహంకారం' అడ్డొస్తుంది. అలాంటి తలబిరుసుతోనే దుర్యోధనుడు దారితప్పాడు. 'దాసీపుత్రుడైన విదురుడు నాకు నీతి చెప్పేదేంటని' విర్రవీగాడు, చివరకు కురుక్షేత్రంలో విగతజీవుడయ్యాడు.

**మనమే మేధావులం కాదు... :** ఎప్పుడూ మనం చెప్పిందే ఎదుటివారు వినాలనే ఏకపక్ష పోకడ పనికిరాదు. అందరికీ అన్నీ తెలియాల్సిన అవసరం లేదు. ఒక రంగంలో అత్యున్నత స్థాయికి చేరిన వ్యక్తికి, మరోరంగంలో ఓనమాలు కూడా తెలియకపోవచ్చు. అలాంటప్పుడు ఆ విషయానికి సంబంధించిన నిష్ణాతుడైన వ్యక్తి వద్దకు వెళ్ళి అడిగి తెలుసుకోవటంలో తప్పులేదు. ఆ నిపుణులు చెబుతున్నప్పుడు శ్రద్ధగా విన్నంత మాత్రాన మనమేమీ తక్కువైపోము. సాఫ్ట్‌వేర్ సామ్రాజ్యాన్ని స్థాపించిన వ్యక్తయినా, సాహిత్యంలో కాస్త అభిరుచి పెంచుకోవాలనుకున్నప్పుడు సారస్వతవేత్త దగ్గరకు వెళ్ళి శిష్యుడిగా చేరవలసిందే! ఏకాగ్రతతో సాహితీప్రసంగాలు ఆలకించవలసిందే! మనమొక్కరమే మేధావులమనుకునే ధోరణి పనికిరాదు. అలా అనుకొని జ్ఞానగవాక్షాన్ని మూసివేసుకుంటే కొన్నాళ్ళకు మనం, కొత్త ప్రవాహాన్ని స్వాగతించలేని మురుగు కాసారాల్లా మారిపోతాం. అందుకే స్వామి వివేకానంద 'Learn everything that is good from others, but bring it in, and in your own way absorb it, do not become others' 'ఇతరుల్లోని మంచినంతటినీ గ్రహించండి. మీదైన పద్ధతిలో దాన్ని మీలో సంలీనం చేసుకోండి. కానీ ఎవరినీ గుడ్డిగా అనుకరించకండ'ని స్పష్టం చేస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే పక్కవారి అభిప్రాయాలకు ప్రాధాన్యాన్ని ఇవ్వటమంటే మన ఆలోచనా దృక్పథాన్ని బలోపేతం చేసుకుంటున్నామని, మన ఆలోచనాపరిధిని విస్తృతపరచుకుంటున్నామని అర్థం. పైగా ఎదుటివారి మాటను మనం పరిగణనలోకి తీసుకుంటున్నామంటే, వారిలో తెలీకుండానే ఆత్మవిశ్వాసాన్ని నింపినవారమవుతాం; వారితో మన ఆత్మీయతను పెంచుకున్నవారమవుతాం.




- బి. సైదులు

## మంథరమాట... మారుతిమాట!

చెప్పేవాడికి వినేవాడు లోకువ అయ్యే ప్రమాదం కూడా ఉంది. అందుకే విజ్ఞతతో అలాంటి ప్రమాదంలో చిక్కుకోకుండా జాగ్రత్త పడాలి. వినటంలోనూ వివేకాన్ని పాటించాలి. అలాంటి విచక్షణ లేకపోవటం చేతనే మంథర మాటలన్నింటినీ కైకేయి విని మనస్సులో విషబీజాలను అంకురింపజేసుకుంది; భర్తను కోరరాని వరాలు కోరుకుంది; కోదండరాముడిని కానలపాలు చేసి పాపం మూటకట్టుకుంది. మరోవైపు శ్రీరామచంద్రుడు మారుతి వానరుడైనా, అతని మాటకు విలువనిచ్చి, సలహాలు విని రామాయణాన్ని సుఖాంతం చేసుకున్నాడు. ఇలా పంచనచేరి మన గురించి చెబుతున్నవారు మంథరలాంటివారో, మారుతిలాంటివారో పసిగట్టగలగాలి. ముఖ్యంగా నాయకుడైన వ్యక్తి చెప్పుడు మాటలకి చెవులను రిక్కించకూడదు. ఒకవేళ విన్నా అనుభవంతో అంతరంగంలో నిజానిజాలను జల్లెడపట్టగలిగి ఉండాలి.

**వినటంతో విశాలత్వం... :** విజయవంతమైన జీవితాలకు సంబంధించి రచనలు చేసిన స్టీఫెన్ కోవే తన 'ది సెవెన్ హ్యాబిట్స్ ఆఫ్ హైలీ ఎఫెక్టివ్ పీపుల్'లో వినటం ఓ సుగుణమని, 'స్నేహితులతో కానీ, సహోదరులతో కానీ, జీవితభాగస్వామితో కానీ, సంతానంతో కానీ, సహోద్యోగులతో కానీ సత్సంబంధాలు నిలుపుకోవాలంటే ముందు మనం వాళ్ళు చెప్పేది వినటం నేర్చుకోవాలి. దీనికి మానసిక బలం ఉండాలి. వినటానికి సహనం, నిష్పాక్షికత, అర్థం చేసుకోవాలనే కోరిక ఉండాలి. ఇవన్నీ మన వ్యక్తిత్వ ఔన్నత్యానికి చిహ్నాలు' అంటారు.

ఎలాంటి పక్షపాతం లేకుండా ఎదుటివారి ఆలోచనలను, అభిప్రాయాలను లెక్కలోకి తీసుకుంటూ ముందుకు వెళుతున్నామంటే మన అస్త్రాలపొదిలో కొత్త, కొత్త ఆయుధాల్ని సమకూర్చుకుంటున్నట్లేనని గుర్తించాలి. పదిమాటలు మనం మాట్లాడితే కనీసం ఇతరులకు, ఒక్కమాటైనా మాట్లాడే అవకాశం ఇవ్వాలి. అలాగని నిరంతరం అవసరం ఉన్నా, లేకున్నా కనిపించిన వారినల్లా సలహాలు అడగటమూ సరికాదు. క్షణక్షణానికి నిర్ణయాల్ని మార్చుకోవటమూ సబబు కాదు. కొంత పరిధిని నిర్ణయించుకొని ఆ మేరకు ఇతరుల సూచనలను పరిగణనలోకి తీసుకొని, స్వీయవిజ్ఞతను పాటించాలి. అప్పుడు మన అస్తిత్వానికి భంగం వాటిల్లకుండా, అందరి ఆలోచనల భాగస్వామ్యంతో ముందుకు సాగిపోయినవాళ్ళమవుతాం. ❖

మనం ఎవరి పాదాల వద్ద అయినా కూర్చోడానికి సంసిద్ధంగా ఉండాలి. జ్ఞాని అయినవాడు నిమ్నకులస్థుడైనా, అతడి నుండి జ్ఞానాన్ని స్వీకరించడానికి వెనుకాడకూడదు. - మనుస్మృతి



# తొక్క కాదు పండు ప్రధానం !

– స్వామి అమర్త్యానంద

మన దేశానికి చెందిన ఓ వ్యక్తి ఉద్యోగ నిమిత్తం అమెరికాకు వెళ్ళాల్సి వచ్చింది. అతడికి అక్కడ ఓ అమెరికన్‌తో స్నేహం కుదిరింది. ఇద్దరూ మంచి మిత్రులయ్యారు. ఉద్యోగ బాధ్యతలన్నీ పూర్తయ్యాక మన దేశీయుడు స్వదేశానికి తిరిగివచ్చాడు. కొన్నాళ్ళకు అతని అమెరికన్ మిత్రుడు ఏదో పని మీద భారతదేశానికి వచ్చాడు. ఇక్కడ ముంబయి 'ఇలాచీ' రకం అరటిపండు రుచిలో అద్భుతంగా ఉందని, ఆ ప్రాంతానికి వెళ్ళినప్పుడు దాన్ని రుచి చూడాల్సిందిగా భారతీయ మిత్రుడు ఆ అమెరికన్‌కు చెప్పాడు. అతను చెప్పినట్టు ఆ విదేశీయుడు అరటిపండు కొనుక్కొని తిన్నాడు. కానీ, అది అతనికి అంతగా నచ్చలేదు. అదే విషయాన్ని తన స్నేహితుడికి నిర్మొహమాటంగా చెప్పాడు.

ఆశ్చర్యపోయిన అతని మిత్రుడు, ఆ అమెరికా యువకుడిని తన ఇంటికి తీసుకువెళ్ళాడు. ఇంట్లో కూతురిని పిలిచి 'అమ్మా! అంకుల్‌కి ఆ ఇలాచీ అరటిపండు ఒకటి తీసుకొచ్చి ఇవ్వు' అన్నాడు. ఆ అమ్మాయి తండ్రి చెప్పినట్లే అరటిపండు తెచ్చి ఇచ్చింది. వెంటనే ఆ అమెరికన్ దానిని తీసుకొని గబగబా తొక్క తీయకుండానే తినసాగాడు. వెంటనే అతని స్నేహితుడు 'అయ్యయ్యో! అలా తినకూడదు. దానిని తొక్క తీసి తినాలి' అని మరొక దానిని తొక్క తీసి తినమని ఇచ్చాడు. అప్పుడు ఆ ఇలాచీ అరటిపండు రుచి చూసి ఆ అమెరికన్ ఆనందపడిపోయాడు. ఇంతకుముందు తొక్కతో కలిపి పండును తినటం వల్లే ఆ పండు మాధుర్యాన్ని ఆస్వాదించలేక పోయానని తెలుసుకున్నాడు.

ఆ అమెరికన్ యువకుడి మనస్తత్వాన్ని మన నిత్యజీవితానికి కూడా అన్వయించుకొని ఒక్కసారి ఆలోచించుకునే ప్రయత్నం చేయాలి. మనం పనిలోని మాధుర్యాన్ని ఆస్వాదించలేక పోవడానికి కారణం, అరటితొక్క లాంటి బంధనమే! ఈ పై పై బంధనాలను (attachment and desire) తొలగించుకోకుండా జీవితంలో ప్రశాంతత కోసం పాకులాడుతున్నాం. వదిలి వేయాల్సిన వాటిని వదిలివేయకుండా పట్టుకొని వేలాడుతున్నాం.

**వదిలివేయాల్సినవెన్నో...:** మనం చాలా సందర్భాల్లో అనవసర విషయాలనూ, అనుభవాలనూ తలచుకుంటూ మనస్సును కలవరపరచుకుంటూ ఉంటాం. విలువైన అంశాలను వదిలేసి, వాటికి అనుబంధంగా ఉన్న నిరర్థక అంశాలపై దృష్టిపెట్టి, బుద్ధిని పాడు చేసుకుంటూ ఉంటాం. వ్యక్తిగతంగా మనలోనే కావచ్చు, మన పరిసరాల్లోనే కావచ్చు – మార్చలేని విషయాలు ఎన్నో ఉంటాయి. వాటివల్ల కొంత అసౌకర్యానికి గురవుతున్నప్పటికీ వాటి గురించి విచారించి లాభం లేదు. ఆ అననుకూలతకు సర్దుకుపోవలసిందే! అరటిపండు తినాలని ఉన్నప్పుడు, తొక్కను తీసి పడవేసే ఓపిక మనకు ఉండాలి. అలాగే జీవితంలో నుంచి ఆనందాన్ని పొందాలంటే ముందు వచ్చే కొన్ని చేదు అనుభవాలను ఎదుర్కోవలసిందే!

**మూడు ప్రతికూలతలు :** మనిషికి మూడు రకాల ప్రతికూలతలు ఎదురవుతాయి. అవి:

1.Conflicts between Man and Nature

2.Conflicts between Man and Man

3.Conflicts within Man

మొదటిది – ప్రాకృతికమైన ప్రతికూలతలు. రెండోది– ఇతర వ్యక్తుల నుంచి ఎదురయ్యే ప్రతిబంధకాలు. చివరిది – మనలో మనకు ఎదురయ్యే సంఘర్షణలు. ప్రకృతిపరంగా కష్టనష్టాలను నిబ్బరంతో భరించవలసిందే! వాటి నుంచి మనం ఎట్టి పరిస్థితుల్లోనూ తప్పించుకోలేం. కరవుకాటకాలు, వ్యాధులు, అకాలమరణాలు – ఇలాంటివన్నీ ప్రకృతి నియమాలను అనుసరించి సంభవించే ప్రతిబంధకాలు.

రెండోది – ఇతరులతో మనకు ఎదురయ్యే భేదాభిప్రాయాలు, విభేదాలు! వీటిని మనం సంయమనంతో, సామరస్యంతో పరిష్కరించుకోవచ్చు. ఇలాంటి సందర్భాల్లో మన పాత్ర ఎంతో ఉంటుంది. ఆ యా వ్యక్తులనూ, పరిస్థితులనూ ఎలా ఎదుర్కోగలమన్నదానిపైనే పర్యవసానం ఆధారపడి ఉంటుంది. చివరి అంశం చాలా ప్రధానమైంది. అది పూర్తిగా మన వ్యక్తిగత మానసిక విశ్లేషణ, నియంత్రణను అనుసరించే ఉంటుంది. మన భావోద్రేకాలు, మానవ సంబంధాలు, భయాభయాలు, ఈర్ష్యాద్వేషాలు, ఒత్తిళ్ళు – ఇలాంటివన్నీ మన విచక్షణకూ, విజ్ఞతకూ పరీక్షలు. ఇవి మనస్సులో పొడసూపినప్పుడు మనం వాటిని ఎలా అదుపులో పెట్టుకోగలుగుతున్నామన్న దానిపైనే మన ప్రశాంతత ఆధారపడి ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే జీవితంలో అప్రధానమైన అంశాలను విడిచి, అర్థవంతమైన సారాన్ని స్వీకరించినప్పుడే మన ప్రస్థానం ఫలవంతమవుతుంది. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

1955

ప్రియమైన అనిల్‌బాబు!*

ఉన్నతమైన ఆలోచనలు గలవారు ధన్యులు. నేడున్న సమస్యలు రేపుండవు. కానీ మనం మన విధులను సక్రమంగా నిర్వర్తించకపోతే ఆ జ్ఞాపకాలు మన మనస్సు మూలల్లో ఎక్కడో ఉండిపోయి మనల్ని బాధిస్తూ ఉంటాయి. మన విధుల్ని మనం చక్కగా పూర్తి చేసినప్పుడు మనస్సు తనంతట తానే ఉన్నత స్థాయిని చేరుకుంటుంది, భగవాన్ శ్రీరామకృష్ణులు నిన్ను గట్టిగా పట్టుకొన్నారు. నీకు ముక్తి కలిగేవరకు నిన్ను ఆయన విడువరు.

ఔషధాన్ని సేవించడం వల్ల కొంత మేరకు మాత్రమే ఫలితం ఉంటుంది. కానీ మంచి ఆరోగ్యమన్నది వ్యక్తి మానసిక స్థితిపై ఆధారపడి ఉంటుంది. అందువల్ల నువ్వు ఎంతగా గురుదేవుల గురించి ఆలోచిస్తే అంతగా నీ దేహారోగ్యం పుంజుకుంటుంది. మానవుడు తన పూర్వకర్మ ఫలాన్ని కొంతమేరకైనా అనుభవించి తీరాలి. కష్టాలన్నవే లేకపోతే ఆ పరమాత్మను గురించి తీక్షణమైన తలంపే మనకు ఉండదు. అందుకనే ఆయనే ఈ ఏర్పాటు చేశాడని భావించాలి.

కేవలం సన్న్యాసుల నివాసాలే ఆశ్రమాలని జనులు పొరపాటుగా భావిస్తుంటారు. గృహస్థుల ఇళ్ళు కూడా ఆశ్రమాలే సుమా! శ్రీరామకృష్ణులను తమ హృదయ ఫలకంపై నిలుపుకొన్న గృహస్థ భక్తుల ఇళ్ళన్నీ ఆశ్రమాలే. ఈ విషయంలో నేనెంతో ఆనందిస్తుంటాను. మీ ఇల్లూ ఒక ఆశ్రమమే. అది మీకు మాత్రమే కాదు. మీ చుట్టుపక్కల ఇళ్ళ వారికి కూడా!

ఈసారి సాక్షాత్తూ ఆ జగన్నాథుడే మానవ రూపం దాల్చి ఈ భువిపై అవతరించాడు. ఆయన గురించి చింతన చేసేవారు పొందే లాభం ఏమిటో ఏ కొద్దిమందికో అర్థమవుతుంది. అందుకే భగవద్గీతలో (9–11) శ్రీకృష్ణపరమాత్మ – అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్... 'మూర్ఖజనులు నన్ను కేవలం మానవునిగా తలచి సర్వజీవరాశికీ ఆధారభూతమైన నా దివ్య స్వభావాన్ని విస్మరిస్తారు' అని అంటాడు.

నువ్వు నిరంతరం శ్రీరామకృష్ణుల ఆలోచనల్లోనే ఉంటున్నావు. అదే జీవితానికి పరమలక్ష్యం. ఒక వ్యక్తి భగవదాలోచనల్లో సర్వదా మునిగి ఉంటే అతని వల్ల అందరికీ మేలు జరుగుతుంది. ఆ వ్యక్తి కుటుంబానికీ, బంధువులకీ, తుదకు ఇరుగుపొరుగు వారికి కూడా!

ప్రేమాశీస్సులతో

**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

(*అనిల్ కుమార్ ముఖోపాధ్యాయ ముర్షిదాబాద్ నివాసి అయిన గృహస్థ భక్తుడు. స్వామి ప్రేమేశానందజీకి అత్యంత సన్నిహితుడు. సార్‌గాచీ, బెర్హమ్‌పూర్ ఆశ్రమాల నిర్వహణకు ఎక్కువగా కృషి చేసిన భక్తుడు.)

**సూర్యుడు రాహువుచే మ్రింగబడిన సమయంలో కూడా పద్మములను వికసింపజేయు చున్నాడు. అలాగే మహాత్ములు ఆపదల్లో ఉన్నా కూడా ఇచ్చిన మాటను నెరవేరుస్తారు.** -సుభాషితం

## ‘శ్రీరామకృష్ణ ప్రభ’ కానుక పథకం

| దాతపేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ గొర్తి సత్యనారాయణమూర్తి, పాలంగి, ఉండ్రాజవరం, ప.గో.జిల్లా | న్యూ ఇండియా కాలేజ్ ఆఫ్ ఇంజినీరింగ్&టెక్నాలజీ, గొల్లపల్లి, రంగారెడ్డిజిల్లా |
| శ్రీ రుద్ర రాజేంద్రప్రసాద్, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా | శ్రీ శబరి మాతాజీ ఆశ్రమం, తాడ్వాయి, నిజామాబాద్ జిల్లా |
| శ్రీ బత్తుల కోటిరెడ్డి, బ్రాహ్మణవీధి, మూలపేట, నెల్లూరు జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, యర్రంవారిపాలెం, ప్రకాశం జిల్లా |
| శ్రీబత్తుల అంజిరెడ్డి, అమ్మలమ్మ, బ్రాహ్మణవీధి, మూలపేట, నెల్లూరు జిల్లా | బత్తుల సుబ్బమ్మ, వేంకటకృష్ణారెడ్డి మెమోరియల్ కళాశాల, ముత్తలపాడు, ప్రకాశంజిల్లా |
| శ్రీ సింగాని నితిన్ కుమార్, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా | శ్రీ వాణీ నికేతన్ ఉన్నత పాఠశాల, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా |
| శ్రీ బి. దామోదర్, విద్యానగర్, హైదరాబాదు | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, ఆత్మకూరు, వరంగల్ జిల్లా |
| శ్రీ రాజయ్య, హబ్సిగూడ, హైదరాబాదు (కీ॥శే॥ నిశ్తల శేషుగారి జ్ఞాపకార్థం) | విశాఖపట్నం జిల్లాలోని 15 పాఠశాలలకు ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు. |
| ఎస్ జయశ్రీ, సర్కులర్‌రోడ్, మండవెల్లి, చెన్నై | నవోదయ ఉన్నతపాఠశాల, గుర్రంపూడి, నల్లగొండ జిల్లా |
| శ్రీమతి సావిత్రి కృష్ణమూర్తి, కొత్తూరుపురం, చెన్నై | నల్లగొండ జిల్లాలోని 15 పాఠశాలలకు ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు. |
| శ్రీ పి.సూర్యనారాయణ, భవానీనగర్, తిరుపతి (కీ॥శే॥ఎన్.యశోదాదేవి జ్ఞాపకార్థం) | నవజ్యోతి ఉన్నత పాఠశాల, ఫరూక్ నగర్, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీమతి డి.వైజయంతిమాల, రంజోల్, మెదక్‌జిల్లా | ఎస్.ఎస్. ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాల, రంజోల్, మెదక్‌జిల్లా |
| శ్రీ మదునాల శ్రీనివాస్ | సెంట్రల్ ప్రైమరీ స్కూల్, కిచ్చన్నపేట్, నిజామాబాద్ జిల్లా |
| " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కిచ్చన్నపేట్, నిజామాబాద్ జిల్లా |
| శ్రీ ఎమ్. లక్ష్మీనారాయణ, అక్లూర్, నిజామాబాద్ జిల్లా | నాగార్జున ఉన్నత పాఠశాల, నిదమనూర్, నల్లగొండ జిల్లా |
| శ్రీ ఎమ్. పాపిరెడ్డి, కడప జిల్లా (కీ॥శే॥ ఎమ్. కన్నారెడ్డిగారి జ్ఞాపకార్థం) | ఎస్.కె.ఆర్. &ఎస్.వి.ఆర్. మహిళా డిగ్రీ కళాశాల, నాగరాజ్‌పేట్, కడప |
| శ్రీ ఎమ్.నాగభూషణరావు, ఎద్దుమైలారం,(కీ॥శే॥ ఎమ్.సత్యనారాయణమూర్తి జ్ఞాపకార్థం) | ఎస్.జె.ఆర్.పి. జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, ముక్తేశ్వరం, మెదక్‌జిల్లా |
| డాక్టర్ ఎ. చంద్రశేఖర్, అంబర్‌పేట్, హైదరాబాదు | ఎస్.జె.పి. ఉన్నత పాఠశాల, గుంతకల్లు, అనంతపురం జిల్లా |
| " " " | రైల్వే ఉన్నత పాఠశాల, గుంతకల్లు, అనంతపురం జిల్లా |
| డాక్టర్ ఎ. చంద్రశేఖర్ (కీ॥శే॥ అరికెరి బసప్ప & మల్లమ్మగార్ల జ్ఞాపకార్థం) | సరస్వతీ విద్యామందిర్ ఉన్నత పాఠశాల, గుంతకల్లు, అనంతపురం జిల్లా |
| డాక్టర్ ఎ. చంద్రశేఖర్ (కీ॥శే॥ అరికెరి దేవేంద్రప్ప & సన్నమ్మల జ్ఞాపకార్థం) | మున్సిపల్ బాలుర ఉన్నత పాఠశాల, గుంతకల్, అనంతపురం జిల్లా |
| " " " | కర్నూలు మెడికల్ కళాశాల, కర్నూలు |
| శ్రీ గనపనేని సాయి శ్రీలోకేష్, సత్తుపల్లి, ఖమ్మం జిల్లా | సాయిస్ఫూర్తి డే పబ్లిక్ స్కూల్, సత్తుపల్లి, ఖమ్మం జిల్లా |

**ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు**



## రామకృష్ణ కుటీర్

**బ్రైట్ ఎండ్ కార్నర్, అల్మోరా - 263 601, ఉత్తరాఖండ్, ఫోన్: 05962 -254417**

Email: rkutir@gmail.com; rkutir@yahoo.in

### విన్నపం

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యవరేణ్యులైన శ్రీమత్ స్వామి తురీయానంద మహరాజ్, స్వామి శివానంద మహరాజ్‌ల ఆధ్వర్యంలో ప్రారంభమైన పరమ పవిత్ర ఆశ్రమం అల్మోరా రామకృష్ణ కుటీర్.

2010 సెప్టెంబరులో కురిసిన ఉద్ధృతమైన వర్షపాతానికి అల్మోరా ఆశ్రమం భూభాగం కుంగి ఆలయం, ఇతర భవనాలు బీటలు వారాయి. నిపుణుల సూచన మేరకు, పూర్వ భవనాల స్థానంలో నూతన కట్టడాలు చేపట్టడం అనివార్యమైంది.

అల్మోరా ఆశ్రమం ముఖ్యంగా సాధువులకూ, భక్తులకూ ఆధ్యాత్మిక ఉపాసనా కేంద్రంగా విరాజిల్లుతోంది. ఇక స్వామి తురీయానంద మహరాజ్ తీవ్ర తపోశక్తి ఇక్కడ ఇప్పటికీ ఉద్దీపన కలిగిస్తోందనడంలో అతిశయోక్తి లేదు. అంతేకాకుండా స్థానిక గిరిజనులకు, విద్యార్థులకు వివిధ సంక్షేమ కార్యక్రమాలను ఆశ్రమం చేపడుతోంది.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపతో, ఉదారహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషుల సహకారంతో 2011 ఏప్రిల్ 8 నుండి భవనాల మరమ్మత్తుల పనులు ప్రారంభమయ్యాయి. ఈ మరమ్మత్తులను త్వరగా పూర్తిచేసి నూతన భవనాల నిర్మాణ పనులను ప్రారంభించడానికి ఇంకా సుమారు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతుందని నిపుణుల అంచనా. ఈ నిర్మాణ పనులకు అమృతహృదయులైన భక్తులు, శ్రేయోభిలాషులు తమ వంతు చేయూతను అందించాలని ఆకాంక్షిస్తున్నాం.

విరాళాల్ని Ramakrishna Kutir, Almora పేరున చెక్కు/ డి.డి తీసి Ramakrishna Kutir, Bright End Corner, Almora - 263 601, Uttarakhand చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

రూ. 2 లక్షలు, అంతకన్నా మించి విరాళం అందజేసే దాతల పేర్లు శిలాఫలకంపై చెక్కిస్తాం.

భగవత్సేవలో

**స్వామి సోమదేవానంద**

అధ్యక్షులు

Advt.,

(...17వ పేజీ తరువాయి.)

ఆనందుడు ఆగిపోయి ఏదో వెదుకుతూండడంతో అతను అడిగాడు – 'ఏమిటీ వెదుకుతున్నావు..?' 'ఎల్లుండి మా ఆశ్రమంలో హోమం జరుగనుంది. యజ్ఞయాగాది పుణ్యకార్యాల వల్ల దేవతలు ప్రసన్నులవుతారట. మా గురువుగారు తరచు ఈ విషయం చెబుతూంటారు. అంతేకాదు. కష్టాల్లో ఉన్నవారిని మానవావతారం ఎత్తి రక్షిస్తూంటారని కూడా ఆయన అన్నారు. ఇందాక మీరు నన్ను కాపాడారు. పైగా నేనే దేవుణ్ణని మీరే చెప్పారు. ఇదివరకు ఓ బాటసారి ఆశ్రమంలో పూజాద్రవ్యాల కోసమని కొంత డబ్బులిస్తే, ఆ సంచీ నా వస్త్రాల్లో దాచుకున్నాను. ఇప్పుడది మీకు ఇచ్చేద్దామనుకుంటే కనబడ్డం లేదు. బహుశా నీళ్ళలో పడిపోయి ఉంటుంది...' అన్నాడు.

విద్యుద్ఘాతం తగిలినట్లు ఆ వ్యక్తి రక్కున ఆగిపోయాడు. అతని పెదాలపై నవ్వు మాయమైంది. కళ్ళలో ఉబికిన బాష్పధార అతని చెక్కిళ్ళను తడిపేసింది. మొదలు నరికిన చెట్టులా అతను ఆనందుని ముందు కూలబడ్డాడు. 'నన్ను క్షమించు బాబూ! నువ్వనుకున్నట్టు నేను దేవుణ్ణి కాదు. నేనొక దొంగని. ఇందాక ఓ బాటసారి దారిలో కనిపిస్తే డబ్బు కోసం బెదిరించాను. అతడు తన దగ్గరున్న సొమ్ము ఆశ్రమానికి చెందిన ఓ కుర్రాడికిచ్చినట్టు చెప్పాడు. ఆ డబ్బు కోసమని నిన్ను వెతుకుతూ వస్తూండగా నువ్వు ఊబిలో కూరుకుపోతూ కనిపించావు. నిన్ను రక్షించి, నువ్వు స్పృహలో లేనప్పుడు నీ వద్ద నుండి ఆ డబ్బు నేనే దొంగిలించాను. ఇంతవరకు జనం నన్ను దొంగగానే చూశారు. కానీ నువ్వు నీ అమాయకత్వంతో నన్ను పునీతుణ్ణి చేశావు. ఇదిగో నీ డబ్బు సంచీ. ఇక నేను వెళతాను...' అని ఆనందుని ముందు డబ్బుసంచీ పెట్టి, పెద్దపెద్ద అంగలేసుకుంటూ చెట్ల నడుమ కనుమరుగయ్యాడు.



ఆనందుడు అడవి పొలిమేరలను దాటేసరికి పూర్తిగా చీకటి పడింది. ఇదిలా ఉండగా అక్కడ ఆశ్రమంలో పొద్దుననగా వెళ్ళిన ఆనందుడు ఆశ్రమానికి ఇంకా తిరిగిరాకపోవడంతో ఆశ్రమంలో కలవరం నెలకొంది. విచక్షణా రహితంగా ఆనందుణ్ణి శిక్షించడం వల్లే ఆనందుడు ఆశ్రమాన్ని వదలిపోయాడన్న అపరాధ భావంతో గురువుగారు కుంగిపోతున్నారు. నలుగురు శిష్యులు కలసి ఒక్కో గుంపుగా ఒక్కో ప్రాంతంలో వెతకాల్సిందిగా ఆయన తన శిష్యులను ఆదేశించాడు. అయినా ఆయన మనస్సు నిలవలేదు. తనే స్వయంగా చిన్న దీపాన్ని వెలిగించుకుని అడవి వైపు బయలుదేరాడు.

ఆనందుడు దారిలో ఎదురవగానే ఆయన ఆందోళన మాయమైంది. పోగొట్టుకున్న పెన్నిధి మళ్ళీ చేతికందినట్టు ఆనందుని చేతిని గట్టిగా పట్టుకున్నాడు. కానీ కొద్ది క్షణాల్లోనే ఆయన ఆనందం కాస్తా కోపంగా మారింది. ఇంతసేపటి దాకా తనకు కనబడకుండాపోయి మనశ్శాంతి లేకుండా చేశాడన్న కారణం వల్ల ఏర్పడ్డ కోపంతో 'ఒరేయ్ మూర్ఖుడా! దేవుడంటే ఏమిటో మహామహులకు, ఋషులకే గ్రాహ్యం కాలేదు. పదేళ్ళు కూడా నిండని నీకు దేవుడంటే ఏమిటో ఎలా తెలుస్తుంది... వేదాలను ఉపనిషత్తులను ఆపోశన పట్టిన పండితులే దేవుడంటే ఏమిటో తెలియదంటారు. చెప్పలేమంటారు. అయినా ఇప్పట్లో ఎవరైనా దేవుణ్ణి చూసి ఉంటే గదా నీకు చెప్పగలిగేది...' అన్నాడాయన ఆవేశంగా.

'నేను చూశాను స్వామీ...' అన్నాడు ఆనందుడు. గురువు గారికి క్షణకాలం తనేం వింటున్నాడో, అతనేం చెబుతున్నాడో అర్థం కాలేదు. 'నేను దేవుణ్ణి చూశాను స్వామీ...' నీరవ నిశీథిలో అతని మాటలు స్ఫుటంగా ప్రతిధ్వనించాయి.

'ఏమిటీ' అన్నాడు గురువుగారు. "అవును స్వామీ! నేను దేవుణ్ణి చూశాను. దేవుడంటే మనం సృష్టించుకున్న రూపం గానీ, సిద్ధాంతం గానీ కాదు. ఒక దూడను దాని తల్లి వద్దకు చేర్చడానికి గోపాలురు చేసిన ప్రయత్నం, ఓ శిల్పాన్ని చెక్కుతున్నప్పుడు ఆ పనిలో తాదాత్మ్యం చెందుతున్న దారుశిల్పి, తన కోసమని తెచ్చుకున్న ఆహారాన్ని నాకు ఇచ్చేసిన బాటసారి, వీరందరి కన్నా నా వద్ద దొంగిలించిన సొమ్మును పరివర్తన చెంది తిరిగి ఇచ్చేసిన దొంగ, చీకటి పడ్డా నేను తిరిగి రాలేదన్న బెంగతో వృద్ధాప్యాన్ని లెక్క చేయక ఆరాటపడుతూ నన్ను వెదుక్కుంటూ వచ్చిన మీరు స్వామీ! ప్రేమ, ధైర్యం, క్షమ, పట్టుదల ఉన్న చోట ఏ క్రతువూ నిర్వహించకపోయినా విశ్వేశ్వరుడు విరాజిల్లుతాడని తెలుసుకున్నాను. ఆలయంలో విగ్రహాల ముందు మోకరిల్లడం మాని, గుడి ముందున్న యాచకులలో దేవుణ్ణి కనుక్కోవడమే మోక్షపథమని నాకు అనిపించింది. నేటి ఉదయం నుంచీ నాలో ఏర్పడిన భావాల సంఘర్షణను మీకు తెలిపాను. ఎక్కువగా మాట్లాడినట్లయితే క్షమించండి" అన్నాడు ఆనందుడు.

మాటలు మరచిపోయినట్టు గురువుగారు నిశ్శబ్దంగా అతని మాటలు వింటున్నాడు. ఆనందుణ్ణి ప్రేమతో గట్టిగా ఆలింగనం చేసుకొని 'నిజమే నాయనా! ఇన్నాళ్ళుగా మంత్రాలు పఠిస్తూ, పూజలు చేస్తూ నాకే తెలుసునన్న అహంకారంతో భగవంతునికి నేను చేసిన పూజలు, హోమాలు వట్టి తంతు మాత్రమేనని తెలుసుకునేలా చేశావు. నువ్వన్నది నిజమే. చరాచర జగత్తులో నిబిడీకృతమై ఉన్న చేతనా స్వరూపమే పరమాత్మ. అది అర్థం కాని వాడికి ఆలయంలో భగవంతుడు కూడా కేవలం విగ్రహంలాగే గోచరిస్తాడు. మనిషి తన జీవితాన్ని చైతన్యంగా, ఆహ్లాదకరంగా మార్చుకోవడం అతడు తోటి వ్యక్తికి సాయపడడం వల్ల మాత్రమే వీలవుతుంది. ఇక పద వెళ్దాం. ఇప్పటికే చాలా ఆలస్యమైంది' అంటూ ఆనందుని చేయి పట్టుకుని ఆశ్రమం వైపు నడిచారు గురువుగారు. ❖



ఎవరి హృదయం దయకు నిలయమో, ఎవరి వాక్కులు అమృతతుల్యమో, ఎవరి కార్యములు పరోపకారార్థమో, ఎవరిని దర్శించగానే ప్రసన్నత కలుగునో - వారు సర్వదా వందనీయులు. - సుభాషితం

(...15వ పేజీ తరువాయి.)

అంటే మన్మథునికీ, అమరులైన దేవతలకు కూడా ఆ జగన్మాతే కన్నతల్లి అని కొనియాడుతూ...

**కమలజ గన్న తల్లి కాముని కన్నతల్లి**
**అమరుల గన్న తల్లి ఆదిమలక్ష్మి**
**విమలపు నీ పతికి విన్నపము సేసి మమ్ము**
**నెమకి యేలితి దయ నీకే తగునమ్మా...** అంటున్నాడు.

నిర్మల హృదయుడైన నీ పతిదేవుడికి విన్నవించి, మమ్మల్ని దయగా ఏలుకునే బాధ్యత నీదేనని గుర్తుచేస్తున్నాడు. 'నెమకి' అంటే వెతికి, అన్వేషించి అని అర్థం. వెతికి మరీ భక్తులను అమ్మ కాపాడుకుంటుందని అన్నమయ్య అభయమిస్తున్నాడు. శ్రీరామచంద్రుడి పరమభక్తుడైన భద్రాచల రామదాసు కూడా సీతాదేవినే ఆశ్రయించి, 'అమ్మా! రామచంద్రుడికి నా గురించి నువ్వైనా చెప్పమ్మా! ఆయన నాపై ఎందుకో అలిగాడు' అని బాధపడుతూ...

**రామచంద్రుడు నాపై చలము చేసినాడు సీతమ్మ చెప్పవమ్మ**
**కటకట వినడేమిసేయుదు కఠినచిత్తుని మనసు కరగదు...**

అంటాడు. ఇలా ఆ దేవి తప్ప ఆ దేవదేవుడి వద్ద మన గోడు ప్రస్తావించేదెవరు!

### నిజ సిరులిచ్చితివి...

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస ధర్మపత్నిగా ఈ భువిపై అవతరించిన జగజ్జనని శ్రీశారదామాత. చాలా సందర్భాల్లో భక్తుల అనుచిత ప్రవర్తనకు ఆ పరమహంస కాస్త ఆగ్రహించే వారు; కానీ కరుణాంతరంగ అయిన శ్రీశారదామాత మాత్రం ఎంతటి పతితులైనవారు వచ్చి కన్నీళ్ళు పెట్టుకున్నా కరిగిపోయేవారు. తన మాతృ హృదయంలో వారికి ఆశ్రయం కల్పించేవారు. అందుకే చాలా మందికి ఆ గురుదేవుల కన్నా ఆ మాతృమూర్తి దగ్గరే చనువు ఎక్కువ! అదేవిధంగా అన్నమయ్య కూడా భగవతి అయిన నారాయణిని స్తుతిస్తూ ఎంతటి వితరణ అయినా అంటే దయాదాక్షిణ్యమైనా నీకే తగునని బహుధా ప్రశంసిస్తూ...

**కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ**
**దోమటి చల్లని చంద్రు తోబుట్టుగ**
**నీ మగని పంపునను నిజ సిరులిచ్చితివి**
**నేమపు వితరణము నీకే తగునమ్మా ॥** అంటున్నాడు.

కామధేనువుకీ, కల్పవృక్షానికే కాదు చల్లని వెన్నెలను కురిపించే జాబిల్లికి కూడా నీవు తోబుట్టువని అమ్మ ప్రత్యేకతను ప్రస్తావిస్తూ ఉన్నాడు. ఇంతటి నీవు మాకు అండగా ఉండగా ఇక కొదవేంటని పొంగిపోతూ, నీ మగని పంపున అంటే ఆజ్ఞతో మాకు ఎన్నో సిరులిచ్చావు; అంతటి దయాగుణం నీకే సాధ్యమవుతుందమ్మా అంటున్నాడు ఈ భక్తాగ్రేసరుడు.

'నేమపు' అంటే నియమంగా అని అర్థం. ఇలా అమ్మ వైభవాన్ని ఎంత స్తుతించినా తక్కువే. అందుకే ఆమెను అష్టలక్ష్మిగా ఆరాధిస్తూ, ఆరంభంలో 'ఆదిలక్ష్మి'గా అభివర్ణిస్తూ...

**సుమనసవందిత సుందరిమాధవి,చంద్రసహోదరి హేమమయే ।**
**మునిగణ మండిత మోక్షప్రదాయిని, మంజులభాషిణి వేదనుతే ॥**
**పంకజవాసిని దేవ సుపూజిత, సద్గుణవర్షిణి శాంతియుతే ।**
**జయజయహే మధుసూదన కామిని, ఆదిలక్ష్మి సదా పాలయమామ్॥**

అని ఆలపిస్తూ, అర్చిస్తారు భక్తశిఖామణులు! అంతటి ఆ ఆదిలక్ష్మి అనవరతం మనల్ని కంటికి రెప్పలా కాపాడు కుంటుందనడంలో సందేహం లేదు.

### శ్రీవేంకటపతిదేవివి... :

శ్రీమద్రామాయణంలో ఓమారు హనుమంతుడు శ్రీరామ చంద్రుడిని వర్ణిస్తూ 'ఓ రామా! నువ్వే పరబ్రహ్మానివి, సీత నీ శక్తి. నువ్వూ, సీతా అభేదమూర్తులు' అంటాడు. అలాగే కలియుగంలోనూ వారు అభేదమూర్తులుగా తిరుమల కొండపైకి అరుదెంచారు. తపఃఫలంగా సాక్షాత్తూ ఆ శ్రీమహాలక్ష్మియే ఆకాశరాజుకు ఆనాడు పుత్రికగా ప్రాప్తించింది. పద్మావతీదేవిగా శ్రీవేంకటేశ్వరుడిని వరించింది. కడుపుపంట కోసం ఆకాశరాజు యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞస్థలమే నేడు తిరుపతి సమీపంలోని తిరుచానూరు. అనంతరం సాక్షాత్తూ లక్ష్మీదేవినే పుత్రికగా పొంది, కాంచనాంబర ధరుడికి కన్యాదానం చేసి ఆ ఆకాశరాజు కలియుగంలో ఆ శ్రీనివాసుడికే మామ అయ్యాడు. ఆ పద్మావతీదేవి, ఏడుకొండలవాడు ఏలుకునే నిమిత్తం పాలజలధి నుంచి దిగివచ్చిన పద్మాసని! అలాంటి మహిమాన్వితమైన వేంకటపతిదేవికి విన్నపాలు తెలియజేస్తూ...

**పాలజలధి కన్యవు పద్మాసనివి నీవు**
**పాల పండే శ్రీవేంకటపతి దేవివి**
**యేలిన యితనిబంట్లకు ఇహపరాలిచ్చి మా**
**పాలగలిగితివి సంబంధము మేలమ్మా ॥**

'అమ్మా! స్వామి బంటులము, దాసులము అయిన మాకు ఇహపర సౌఖ్యాలు అనుగ్రహించావు. ఈ అనుబంధం చాలా బాగున్నదమ్మా! మీరిద్దరూ మమ్మల్ని చక్కగా పాలిస్తున్నారు! మాకు చాలా ఆనందంగా ఉందమ్మా' అంటూ పరవశించి పోతున్నాడు ఈ పదకవితా పితామహుడు. ❖

**(నవంబరు 10 నుంచి 18 వరకు తిరుచానూరు శ్రీపద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవాలు)**

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

**శివకుమార్, విజయనగరం**

**ప్రశ్న : నేను ప్రథమశ్రేణి విద్యార్థిని. కానీ కళాశాలలో చెడు సహవాసాల కారణంగా డిగ్రీలో ఫెయిల్ అయ్యాను. మా చెల్లికి మెడిసిన్‌లో సీటు రాలేదు. దానికితోడు మా నాన్నగారు రోగగ్రస్థులయ్యారు. ఈ కారణాల వల్ల నేను తీవ్ర ఒత్తిడికి గురయ్యాను. అలాంటి పరిస్థితుల్లో ఒకసారి నేను, మా చెల్లి 'శ్రీరామకృష్ణ ప్రభ' 2009 జనవరి సంచికను చదివాము. ఆత్మవిశ్వాసాన్ని పెంచే స్వామి వివేకానంద బోధనలు మమ్మల్ని ఎంతగానో ప్రభావితం చేశాయి. పత్రికను అప్పటి నుండి ప్రతీ నెల చదువుతున్నాము. స్వామి వివేకానంద బోధనల ప్రభావం వల్ల నేను బాగా చదివి పి.జి. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను. మా చెల్లి కూడా మెడిసిన్‌లో సీటు సంపాదించింది. నేడు మాలాంటి యువతరానికి స్వామి వివేకానంద సందేశం ఎంతో అవసరం ఉంది. పరోక్షంగా పత్రిక ద్వారా ఎంతో మందిని ప్రభావితం చేస్తున్నారు. కానీ ప్రతి జిల్లాలో రామకృష్ణ మఠ కేంద్రాలను ప్రారంభించి, యువతరాన్ని ప్రత్యక్షంగా ప్రభావితం చేయవచ్చుకదా!**

**జవాబు:** స్వామి వివేకానంద ఓ ఆధ్యాత్మిక శక్తితరంగం. ఆ శక్తితరంగాన్ని స్పృశించిన వారిలో ఆత్మశక్తి జాగృతమవక తప్పదు. అందుకే అరవిందయోగి 'స్వామి వివేకానందుని దివ్యశక్తి ఇప్పటికీ అత్యున్నత స్థాయిలో అందరినీ ప్రభావితం చేస్తూనే ఉంది' అని అన్నారు.

ఫ్రెంచ్ సాహితీవేత్త రోమారోలా 'స్వామి వివేకానంద ప్రవచనాలను స్పృశిస్తేచాలు నా దేహం విద్యుద్ఘాతం తగిలినట్లుగా ప్రకంపిస్తుంది' అని తన అనుభూతిని వ్యక్తపరిచారు.

దీన్నిబట్టి స్వామీజీ బోధనల ప్రభావం ఎంతటిదో గ్రహించవచ్చు. నాటి నుండి నేటి వరకు ఎందరో తత్త్వవేత్తలు, రాజకీయవేత్తలు, సాహితీవేత్తలు, శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారవేత్తలు స్వామి వివేకానంద బోధనలతో ప్రభావితులైనవారే!

స్వామీజీ భౌతికంగా నేడు మన మధ్య లేకపోయినా ఆయన బోధనల ద్వారా ఎంతోమంది ప్రభావితం అవుతున్నారు. అందుకు కారణం 'నేను భౌతికంగా లేకపోయినా ప్రతీవ్యక్తి తాను దివ్యాత్మ స్వరూపుడనని తెలుసుకునే వరకు నా సందేశవాణి వారిని ప్రభావితం చేస్తూనే ఉంటుంది' అని స్వామీజీయే స్వయంగా ప్రకటించారు.

అయితే స్వామీజీ సందేశం ద్వారా ప్రభావితులై, ఎంతోమంది తమతమ రంగాల్లో ఉన్నతిని సాధిస్తున్నారు. అది హర్షదాయకమే! కానీ త్యాగం, సేవాభావాలు కలిగి పరహితానికై తమ జీవితాలను అంకితం చేయడానికి ఎంతమంది యువకులు సుముఖంగా ఉన్నారు?

What we want are some young men who will renounce everything and sacrifice their lives for their country's sake.... *- **Swami Vivekananda***

స్వామీజీ ఆశించినట్లు త్యాగం, సేవాభావాలు కలిగిన యువకులు కొంతమందైనా ముందుకువస్తే భారతదేశం నలుమూలలా రామకృష్ణ మఠ కేంద్రాలను స్థాపించి సమాజ శ్రేయస్సుకై కృషి చేయవచ్చు. స్వామీజీ భావాలతో యువతరాన్ని ప్రభావితం చేయవచ్చు.




గంగానదిలో స్నానం చేస్తే పునీతులమవుతామన్నది నిజమే. కానీ అందులో స్నానం చేయాలంటే నీళ్ళు ప్రవహించాలి కదా! అలాగే సమాజ శ్రేయస్సుకి అన్ని చోట్లా రామకృష్ణ మఠ కేంద్రాలు అవసరమే. కానీ ఐహిక సుఖాలను త్యజించి,

## సంకల్పశక్తికి స్వామీజీవాణి

సమాజ శ్రేయస్సు కోసం తమ జీవితాలను అంకితం చేయగలిగే యువకులు ఉండాలి కదా!

నేటి సమాజంలో యువ మనస్సుల్ని ప్రలోభపెట్టే పలురకాల ఆకర్షణలు రోజురోజుకి అధికమైపోతున్నాయి. యువతరంలో వైరాగ్యభావాన్ని పెంచేందుకు పరిస్థితులు అనుకూలంగా లేవు. కాబట్టి స్వామీజీ సందేశం ద్వారా స్ఫూర్తి పొందిన మీలాంటి యువకులు కొంత మంది కలసి మీ ప్రాంతంలో ఒక సేవా సంస్థను ఏర్పరచుకొని, స్వామీజీ భావాలను ప్రచారం చేయడానికి ప్రయత్నించండి. మీకు వీలైనంతలో సేవాకార్యక్రమాలను చేపట్టండి. ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం, రాజమండ్రి, విజయవాడ, హైదరాబాదు, కడప పట్టణాలలో రామకృష్ణ మఠ కేంద్రాలు ఉన్నాయి. మీకు దగ్గరలో ఉన్న విశాఖపట్నంలోని కేంద్రాన్ని సందర్శించి, అక్కడి స్వామీజీల మార్గదర్శకంలో కార్యక్రమాలను చేపట్టండి. ఎవరో వస్తారని వేచిచూడడం కన్నా స్వీయ సంకల్పబలంతో ముందుకు సాగడానికి ప్రయత్నిస్తే స్వామి వివేకానంద ఆశీస్సులు మీపై ఉంటాయి. మీ కలలు సాకారం అయ్యే రోజు తప్పక వస్తుంది. ❖

నీ శక్తి మేరకు ఎందుకు సేవ చేయకూడదు? నువ్వు కొన్ని మంచి మాటల్ని ఇతరుల చెవిన ఎందుకు వేయకూడదు? అలా చేయలేవా? దానికి కూడా ధనం అవసరమా? - స్వామి వివేకానంద



## భగవద్గీత - సద్గుణ సుధ

- స్వామి విశారదానంద

**బెంగుళూరులోని వివేకానంద యోగ అనుసంధాన మహా విద్యాపీఠానికి చెందిన స్వామి విశారదానంద భగవద్గీత పదమూడో అధ్యాయంలో 7-11 శ్లోకాల్లోని భగవానుడి బోధామృతాన్ని వివరిస్తూ 'భగవద్గీత - మానవీయ విలువలు' అనే శీర్షికతో ప్రసంగాలు ఇచ్చారు. చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠ ఆంగ్ల మాసపత్రిక 'వేదాంత కేసరి'లో ప్రచురితమైన ఆ ప్రసంగాల సారాన్ని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు 2011 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.**

# ఆనందం, అసంతృప్తి ఆలోచనల్లోనే !

*(...గత సంచిక తరువాయి)*

ఆత్మజ్ఞానాన్ని పెంపొందించుకునే గమ్యాన్ని చేరే మార్గాన్ని అవలంబించడం ఒక్కటే సరిపోదనీ, దానితో పాటు మనకు సాధనలో ఆనందం కలగాలనీ శాస్త్రాలు చెబుతున్నాయి. ఇంద్రియ సుఖాల నుండి కలిగే ఆనందం యొక్క అశాశ్వత తత్త్వాన్నీ, తాత్కాలిక స్వభావాన్నీ చూడడం నేర్చుకోవాలి. ఇంద్రియ సుఖాలలో మునిగితేలడం వల్ల ఏ విధంగా మన స్వేచ్ఛను కోల్పోతామో విచారించి, అదే విధంగా ఎన్నటికీ తృప్తి చెందని స్వభావమున్న ఈ సుఖాల గురించి ఆలోచించి, వాటి హానికరమైన ప్రభావాన్ని గుర్తిస్తే వైరాగ్యం అలవడుతుంది. మానసిక విశ్లేషణను మనం చేసే పుణ్యకర్మలతో బలోపేతం చేస్తే, తప్పనిసరిగా వైరాగ్యం కలుగుతుంది. నిజమైన వైరాగ్యం పుణ్యకార్యాల వల్లనే లభిస్తుంది.



భక్త తులసీదాసును అతని భార్య అన్న ఒక్క మాట ఆయన్ని ఆధ్యాత్మిక పథం వైపు నడిపించింది. శ్రీరామచంద్ర ప్రభువు పట్ల భక్తి, ప్రేమ వైపునకు మరలించింది. ఈ ప్రపంచం పట్ల వైరాగ్యం కలిగేలా చేసింది. జీవితంలో అంతకు ముందు చాలాసార్లు ఆయన అలాంటి మాటలను విని ఉంటారు గానీ, అవి ఆయనపై ఎలాంటి ప్రభావాన్నీ చూపలేదు. కానీ సరియైన సమయం వచ్చినప్పుడు (ఆయన చేసిన పుణ్యకార్యాల ఫలితం రావడం ప్రారంభం కాగానే), భార్య మాట్లాడిన సాధారణ, సరళమైన మాటలు ఆయన జీవితంలో అసాధారణమైన మార్పును తెచ్చి ఆయన ఒక మహాత్మునిగా పరివర్తన చెందడానికి కారణమయ్యాయి.

చాలామందికి జీవితంలో అలాంటి వైరాగ్యం ఒక్క చిన్న మాట వల్ల గానీ, ఒక్క సంఘటనతో గానీ వస్తుంది. వారు పూర్వం ఆచరించిన పుణ్యకర్మల ఫలితంగా అది జరుగుతుంది. కాబట్టి తీవ్రమైన విచారణ, లేక ఆలోచన చేసినంత మాత్రాన మనం ఆశించిన వైరాగ్యం మనకు కలగదు. ఒక ఇంద్రియానికి సంబంధించిన వస్తువుతో అనుబంధం ఏర్పడిన తరువాత ఆ వస్తువును దాని నుంచి వేరు చేస్తే (విడదీస్తే) ఏమి జరుగుతుందన్న విషయం గురించి విచారించాలి. అప్పుడు మనస్సు చాలా కలవరానికి గురి అవుతుంది. ఆ అంతరాయాన్ని తొలగించాలని ఆ వస్తువు కోసం మళ్ళీ అన్వేషిస్తాం. మళ్ళీ ఆ వస్తువు దొరికితే ఎంతో సంతోషిస్తాం. అది మనంతట మనం సృష్టించుకున్న సమస్యను మనమే పరిష్కరించడం లాంటిది. అందువల్ల ఆ వస్తువు మనకు సంతోషాన్నిస్తుందా? లేక ఆ వస్తువు సృష్టించిన మానసిక అలజడిని దూరం చేయడం వల్ల సంతోషం కలిగిందా? అని జాగ్రత్తగా పరిశీలించాలి. మన మనస్సు ప్రశాంతత చెందడం వల్లనే సంతోషం కలుగుతుందన్నదే అసలైన సత్యం. ఇంద్రియాలు ఒక వస్తువును ఆశించక ముందు మనస్సు ప్రశాంతంగానే ఉంది. వస్తువును ఆశించిన తరువాత అది లభించకపోతే ప్రశాంతతను కోల్పోతుంది. ఆ వస్తువును తిరిగి పొందిన తరువాత అది మళ్ళీ ప్రశాంతతను పొందుతుంది. అందువల్ల ఆ వస్తువు వల్లనే సంతోషం కలిగిందన్న అభిప్రాయం ఏర్పడుతుంది.

మంచి ఎండలో నడిచి వచ్చిన తరువాత చెట్టు నీడ కిందకు వచ్చిన వ్యక్తికి అది ఎంతో ఆహ్లాదాన్నీ, సంతోషాన్నీ కలగిస్తుందని ఒక సంస్కృత సామెత తెలియజేస్తుంది. అంతకు ముందే ఆ నీడలో కూర్చున్న వ్యక్తికి అది అంత ఆనందాన్ని కలిగించదు. ఇక్కడ ఆ నీడ వల్లనే ఆనందం కలుగుతున్నదనుకోవాలా? లేక ఎండలో నడిచి వచ్చినందువల్ల అది కలిగిందనుకోవాలా? అదేవిధంగా, మనస్సు దేనినైనా కోరి, దాని గురించి అలజడి చెందినప్పుడు ఆ అలజడికి కారణమైన దాన్ని తొలగిస్తే సంతోషం కలుగుతుంది.

ఏ వస్తువునైనా సరే మనకు అలజడి కలిగించడానికి ఎందుకు అనుమతించాలి? అసలు మనస్సు కలవరపడడానికే మనం అనుమతించకపోతే, అప్పుడు సహజంగానే ప్రశాంతతను పొంది స్వేచ్ఛగా ఉంటాం. మన సంతోషమంతా ఆ వస్తువుపైనే ఆధారపడి ఉందనుకోవడం వల్లనే మనకు అలజడి కలుగుతోంది. ఇంతకు ముందు చెప్పిన ఉదాహరణలలో జింక, ఏనుగు తమ ఇంద్రియ విషయాల వల్లనే ఎంత అవస్థకూ, బానిసత్వానికీ గురయ్యాయో తెలిసిందే కదా! కోరికలకు దూరంగా ఉండడమే సహజమైన సంతోషానికి మూల కారణం. అయితే మనందరిలో

ఇంతకు ముందే చాలా కోరికలున్నాయి కాబట్టి ఏ విధంగా, ఏ మార్గంలో వాటిని తొలగించుకోవాలి?

మొట్టమొదట చేయవలసింది, కొత్తగా ఏ చెడు వ్యసనాన్నీ అలవాటు చేసుకోకుండా ఉండాలి. పాత అలవాట్లను తీవ్రమైన పరిశీలన, విచారణల ద్వారా, వాటి పట్ల నిరాసక్త భావాన్ని పెంపొందించుకోవాలి. పాత అలవాట్లను పోగొట్టుకునే సమయంలో మొదట కొంత కాలం చాలా కష్టపడాల్సి వస్తుంది. అది చాలా అసౌకర్యంగా ఉంటుంది కానీ కొద్దికాలమైన తరువాత శరీరం, మనస్సు ఆ సంతోషానికి తమను తాము సర్దుబాటు చేసుకొని, సరిగ్గా ప్రవర్తించడం ప్రారంభిస్తాయి.

ఈ జీవితం చాలా స్వల్పకాలమే ఉంటుందన్న విషయం మనం మాటిమాటికీ గుర్తు చేసుకోవాలి. మన సమయాన్ని ఊరకనే వృథా చేయకూడదు. ఈ 'జీవితపు బుడగ' ఎప్పుడు పేలిపోతుందో ఎవరికీ తెలియదు. 'భోగాలు' మనస్సుపై హానికరమైన సంస్కారాలను కలుగజేస్తాయన్న విషయం అర్థం చేసుకుంటే వాటిని అనుభవించం. ఇంద్రియసుఖాలు చాలా ప్రలోభం కలిగించేవిగా ఉంటాయి గానీ, అవి నాగరకంగా, అందమైన దుస్తులు ధరించి బుద్ధిమంతునిలా కనిపించే వ్యక్తి రూపంలో ఉన్న దుర్మార్గుని లాంటివి. మన జాగ్రత్తలో మనం ఉండి, లోతైన ఆలోచనలతో వైరాగ్య భావాన్ని పెంపొందించుకోవాలి.

మనం చూడగలిగిన సుఖాలు (దృష్ట), చూడలేని (అదృష్ట) సుఖాలు – ఈ రెండింటి పట్ల వైరాగ్యభావం ఉండాలి. ఇంద్రియ సుఖాలు బంధాన్ని కలుగజేస్తాయి. అవి మన శరీరం, మనస్సులోని ప్రాణశక్తినంతా హరించి, మనల్ని ఆ సుఖాలకూ, భోగాలకూ బానిసల్ని చేస్తాయి. ఆ తరువాత అవి 'సంస్కారాలు'గా మారి, మన మనోద్వారాన్ని మాటిమాటికీ తట్టి మనల్ని నిస్సహాయులుగా చేసి, పరితాపాన్ని కలుగజేస్తాయి. 'ఆ విషయ వస్తువుల' కాటు మహావిషసర్పం కాటు కన్నా ఎక్కువ ప్రమాదకరమైనదని 'వివేక చూడామణి' చెబుతోంది.

ఒక వస్తువు నుండి సుఖం, ఆనందం పొందుదామన్న భావన కలుగగానే, దానికున్న విలువ గురించి ఆలోచించి చూడాలి. ఇంద్రియ సుఖాలు మనల్ని వలలో వేసుకొని మన స్వేచ్ఛనంతా ఎలా హరిస్తాయో అర్థం చేసుకోవాలి. జీవితంలో స్వేచ్ఛ, స్వతంత్రం లేకపోతే, ఇంకేం మిగులుతుంది? స్వతంత్రత, స్వేచ్ఛకు విలువ నిచ్చే వ్యక్తి తొందరగానే వైరాగ్యం పొందగలుగుతాడు. ❖

తెలుగుసేత: డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి

(వచ్చే సంచికలో– 'అనహంకారం')

---

(...7వ పేజీ తరువాయి.)

# సహనం, సేవలతో సహవాసం

రాధూ పిచ్చి చేష్టలతో శారీరక బాధలను సైతం అనుభవించారు. ఓ రోజు రాధూ మతిస్థిమితం కోల్పోయి గంపలో నుంచి ఒక పెద్ద వంకాయను తీసుకొని తన బలాన్ని అంతటిని ఉపయోగించి అమ్మ వీపుకు విసిరికొట్టింది. ఆ బాధను తట్టుకోలేక, మాతృదేవి బాధతో ముందుకు వంగిపోయింది. ఆ వంకాయ తగిలినచోట వీపు మీద ఎర్రగా వాచిపోయింది. అయితే అవేమీ లెక్కపెట్టకుండా మాతృదేవి మాత్రం తన చేతులు జోడించి శ్రీరామకృష్ణుల పటం వైపు తిరిగి "ఓ ప్రభూ! ఆమె మీద కోపం తెచ్చుకోకు. ఆమెకు ఏ పాపం తెలియదు" అంటూ ప్రార్థించారు. ఇలాంటి అసాధారణ పరిస్థితులలోనూ కుటుంబ పెద్దగా సహనంతో దుఃఖాలను భరించారు. భక్తులకూ, సన్న్యాసులకూ గురుదేవిగా అవతార కార్యాన్ని దాదాపు ఇరవై ఏళ్ళ పాటు నిర్వర్తించారు. ఈ సమయంలో మంచితనం మేళవించిన భక్తులు ఒక వైపు ఉండగా, కొందరు భక్తులనే పేరుతో ఆవేదననూ కలిగించారు. ఓ భక్తుడు తాను మాతృదేవికి ఎప్పుడూ గుర్తుండిపోవాలని బొటనవ్రేలు కొరికేశాడు. మరొక భక్తుడు తన తలను ఆమె పాదం బొటనవ్రేలుకు తగిలేటట్లు గట్టిగా నొక్కాడు. అప్పుడు ఆ బాధకు తాళలేక మాతృదేవి "హా" అని అరిచారు. మరికొంతమంది ఆమె పాదాలను తమ ఛాతీ మీద ఉంచుకొని ఆ స్పర్శతో తరించిపోయినట్లు ప్రవర్తించేవారు. ఇలాంటి భక్తుల మూర్ఖత్వపు చర్యలను ఓర్చుకొని వారిని కటాక్షించే వారు. 'సహనం' అనే అద్భుత సత్యానికి నిలువెత్తు నిదర్శనంగా భాసిల్లారు.

రామకృష్ణ సంఘం మొగ్గ తొడిగిన ప్రారంభదినాల్లో సన్న్యాసులు ఎన్నో అసౌకర్యాల మధ్య రోజులు గడిపారు. క్రమశిక్షణతో మెలగమనీ, ఓరిమితో వ్యవహరించమనీ ఆమె చెప్పేవారు. కోల్పారా ఆశ్రమంలో ఇతరులతో సర్దుబాటు కాలేక అవస్థ పడుతున్న ఓ బ్రహ్మచారితో ఇలా అన్నారు – "ఎప్పుడు ఏ సమయంలో ఎలా ఉండాలో ఆ సమయంలో అలానే ఉండాలి. ఎక్కడ ఏ విధంగా మసలుకోవాలో ఆ విధంగానే మసలుకోవాలి." అమ్మ చేసిన ఆ హితవు సన్న్యాసులకే కాదు సకల మానవకోటికి ఆచరణాత్మకం. ఒత్తిడి, ఆందోళనలతో నిత్యం ఘర్షణలు పడుతున్న ఈ ఆధునిక కాలంలో చిన్న చిన్న విషయాలకూ, కొద్దిపాటి అసౌకర్యాలకూ మనస్సులు కలవరపడుతున్నాయి. మరి అమ్మ ఏమీ దొరకని రోజున అన్నంలో ఉప్పు కలుపుకొని తింటూ బతికింది. కాళ్ళు ముడుచుకొని వాతం రోగం కమ్మినా కిమ్మనకుండా ఆనందంగా కాలం వెళ్ళదీసింది.

కొంతమంది సందేశాలు ఇస్తారు. ఆచరణలో చూపరు. కానీ అమ్మ చేదు నిజాన్ని పంచదార గుళికలా చెప్పడమే కాదు, స్వీకరించి చూపించారు. గందరగోళం, అయోమయంలో కొట్టుమిట్టాడుతున్న మానవాళికి దారి చూపుతున్న కాంతి ప్రసారం మాతృదేవి జీవితం అనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు. ❖

మేఘములు వర్షించి మానవుల శరీరతాపమును హరించినట్లు, మహాత్ములు పరుల దుఃఖములను ఉపశమింపజేయుట యందే నిమగ్నులై ఆత్మతృప్తిని పొందుతారు. - సుభాషితం

# తోడూ నీడ!

కథ : సంపత్ కుమార్

చిత్రాలు: చేపూరి రమేష్









3 మాధవ్ ఆ మామిడి మొక్కకు ప్రతిరోజూ నీళ్ళు పోస్తూ ఉండేవాడు. అలా ఆ మామిడి మొక్కతో అతడికి మంచి అనుబంధం ఏర్పడింది.



5 కొంత పెద్దయ్యాక మాధవ్‌కి చెట్లు ఎక్కాలన్న ఆశ కలిగింది. అతనికి పదేళ్ళు వచ్చేసరికి ఇంట్లోని మామిడి మొక్కే ఏపుగా అంది వచ్చింది. ఇక బడి నుంచి వచ్చింది మొదలు అమ్మ పిలిచే వరకు ఆ చెట్టుపైనే మిత్రులతో కలసి ఆటలాడుకునేవాడు. మాధవ్ ఒడుపుగా ఎగబాకుతూ ఉంటే, బిడ్డ వచ్చి ఒడిలో ఆడుకుంటూ అల్లరిచేస్తున్నట్లు ఆ మామిడి చెట్టు మురిసిపోయేది. మిత్రులంతా కలసి ఊయలలూగుతుంటే ఉప్పొంగిపోయేది.



6 పిల్లలు రాళ్ళు విసిరి ఎంతగా గాయపరిచినా భరించేది. పైగా కాయలు త్వరగా రాలిపడేలా సహకరించేది. వేసవి వచ్చిందంటే మాధవ్ మనస్సంతా మామిడిపళ్ళపైనే! అందుకే ప్రతి ఏటా వేసవిలో ఆ చెట్టు విరగకాసి, పండిన పళ్ళను మాధవ్ తన మిత్రులతో కలసి తింటూవుంటే, ఆ మాను ఆనందపడుతూ ఉండేది.

**7** వేసవిలోనే కాకుండా, ఏడాదంతా తన పచ్చడి రుచితో మాధవ్‌ని భోజనవేళలో సంతృప్తి పరుస్తూ ఉండేది. ఆ పచ్చడి కోసం ఎందరు వచ్చి ఎన్ని కాయలు కోసుకున్నా కొంచమైనా బాధపడేది కాదు. పైగా ఇబ్బడిముబ్బడిగా కాయలను ప్రసాదిస్తూ, పచ్చళ్ళు అమ్ముకొని మాధవ్ కుటుంబం ఆర్థికంగా నిలదొక్కుకునేందుకు కూడా సహాయపడేది.





**8** పై చదువుల కోసం మాధవ్ ఇల్లు వదిలి పోతున్నప్పుడు ఆ మామిడి చెట్టూ కన్నతల్లిలా పొగిలిపొగిలి ఏడ్చింది. అయినా బాగా చదువుకొని పైకి రావాలని మనస్సులోనే ఆశీర్వదించి, సంతృప్తి పడింది. మధురఫలాలనిచ్చి సాగనంపింది.



**9** జీవితంలో స్థిరపడ్డాక మాధవ్‌కి మనస్సుకు నచ్చిన మగువతో పెళ్ళి కుదిరింది. ఆ మూడుముళ్ళవేళ ఆ మామిడి పత్రాలే, మంగళతోరణాలై ఇంటి ద్వారాలన్నీ కళకళలాడాయి. ఆ తోరణాల రూపంలో దంపతులిద్దర్ని మనసారా ఆశీర్వదించి, ఆనందంతో పొంగిపోయింది.



10

మాధవ్ ఇల్లంతా
ఇప్పుడు పిల్లాపాపలతో
కోలాహలంగా
మారిపోయింది.
మాధవ్ చిన్నప్పుడు
ఆడుకున్నట్లే అతడి
పిల్లలు కూడా
ఆ మావిపైనే
ఆడిపాడుకుంటున్నారు.



11

మాధవ్ జీవనయాత్ర మలిసంధ్యలోకి చేరుకుంది. వయస్సుతోపాటు శరీరమూ వాలిపోయే స్థితికి చేరుకుంది. అప్పుడు కూడా ఆ తరువు ప్రేమ తరగిపోలేదు. మాధవ్ చేతిలో ఊతానికి ఓ కర్రనిచ్చింది. దృఢమైన తన చెక్కతో ఓ వాలుకుర్చీని సమకూర్చింది.





**మాధవ్ బహుదూరపు బాటసారిలా వృద్ధాప్యంలోనూ ఆ చెట్టునీడనే సేదతీరాడు. ఆ తరువు త్యాగాన్ని గుర్తుచేసుకుంటూ 'బాల్యంలో ఆటలాడుకుంటున్నప్పుడు ఎండదెబ్బ తగలకుండా చల్లని నీడనిచ్చి కంటిపాపలా కాపాడింది. రాళ్ళ దెబ్బలు తగిలినప్పటికీ పళ్ళనిచ్చి ఆకలి తీర్చింది. ఈ మలిసంధ్యలో నాకు చేతి కర్ర అయి ఊతగా నిలిచింది. ఈ వృద్ధాప్యంలో వాలు కుర్చీ అయి తన ఒడిలో చేర్చుకుంది. చివరికి కాలం చేశాక కూడా కాష్ఠంగా కాల్చేందుకు మానే కదా ముందుండేది' అని కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ప్రకృతిరూపంలో ఉన్న ఆ పరమాత్ముడిని తలచుకుంటూ 'వృక్షో రక్షతి రక్షితః' అని చేతులెత్తి నమస్కరించాడు.**



# ప్రపంచ శాంతి సదస్సు



**ఢిల్లీ రామకృష్ణ మిషన్** స్వామి వివేకానంద 150వ జయంతి ఉత్సవాల సందర్భంగా 2012 సెప్టెంబర్ 11,12 తేదీలలో 'ప్రపంచ శాంతి సదస్సు'ను నిర్వహించింది. ఈ సదస్సులో బౌద్ధమతాచార్యులు దలై లామా, డాక్టర్ ఏ.పి.జె. అబ్దుల్ కలాం, స్వామి వాగీశానందజీ, స్వామి గౌతమానందజీ, స్వామి సుహితానందజీ, డాక్టర్ కరణ్‌సింగ్, క్రికెట్‌జట్టు మాజీ క్రీడాకారులు కపిల్‌దేవ్, కృష్ణమాచారి శ్రీకాంత్‌తో సహా పలు దేశాల నుండి వచ్చిన వివిధ మతాల ప్రముఖ వక్తలు 30 మంది పాల్గొని ప్రసంగించారు. ఈ సందర్భంగా రామకృష్ణ మఠం,మిషన్‌ల ప్రధాన కార్యదర్శి స్వామి సుహితానందజీ 'స్వామి వివేకానంద 3డి యానిమేషన్ ఫిల్మ్'ను ఆవిష్కరించారు. ఈ సదస్సుకి 1300 మంది హాజరయ్యారు. ❖ నివేదిక: స్వామి శాంతాత్మానంద



## మూర్తిత్రయ భావవ్యాప్తిలో 'శ్రీరామకృష్ణ విజయం'

**చెన్నై శ్రీరామకృష్ణ మఠం** నుండి గత 92 సంవత్సరాలుగా నిరాటంకంగా వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ విజయం' తమిళ మాసపత్రిక 2012 సెప్టెంబర్ నాటికి 1,50,000 సర్క్యులేషన్‌కు చేరుకుంది. ఈ విజయోత్సవాన్ని పురస్కరించుకొని ఈరోడ్, రామకృష్ణ సేవాసమితి సెప్టెంబర్ 23వ తేదీన బహిరంగసభ నిర్వహించింది. ఈ కార్యక్రమంలో చెన్నై రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి గౌతమానందజీ, పత్రిక పూర్వ సంపాదకులు స్వామి కమలాత్మానందజీ, స్వామి అభిరామానందజీ, ప్రముఖ వక్తలు సుకీశివం, గుణశేఖరన్ పాల్గొని రామకృష్ణ-వివేకానంద సందేశ వ్యాప్తిలో పత్రిక చేస్తున్న విశేష కృషిని కొనియాడారు. ఈ కార్యక్రమంలో సుమారు 3500 మంది భక్తులు పాల్గొన్నారు. ❖ నివేదిక: స్వామి విమూర్తానంద





## భక్తులకు మంత్రోపదేశం

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2012 నవంబర్ 12 నుంచి 19వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేసెదరు. పూజ్య స్వామీజీ, ఆసక్తిగల భక్తులకు **నవంబర్ 14,15,17**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. పూర్తి వివరాల కోసం : **స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాదు-500 029** ను సంప్రతించవలెను.

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.69-11, Sri Ramakrishna Prabha (Telugu Monthly) November 2012, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.